# శ్రీ గణపతి సచ్చిదానంద

మొదటి భాగం

రచన
కుప్పా వేంకట కృష్ణమూర్తి

ప్రచురణ
శ్రీ గణపతి సచ్చిదానంద అవధూత దత్త పీఠము
మైసూరు

ప్రథమ ముద్రణ . 1991
(శ్రీ స్వామీజీ 49-వ జన్మదినోత్సవ సందర్భముగా
ఆవిష్కృతము)
ప్రతులు 2000

ద్వితీయ ముద్రణ 1993
(దత్త జయంతి సందర్భమున, 1993 ఆవిష్కృతము)
ప్రతులు : 1000



పుస్తకములు లభించు చోటు :
శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమం
నంజన్‌గూడ రోడ్
మైసూరు

ప్రచురణకర్త :
"స్వామిజీ కృప"

ముద్రణ :
వేణు ఎంటర్‌ప్రైజెస్
1-8-[illegible]/2, చిక్కడపల్లి,
[redacted]-500 020.
[redacted]



విజయవాడ ఆశ్రమంలో వెలుగు లీనుతున్న
క్షిప్ర గణపతి



శ్రీ చక్రాంతర్నిలయ
శ్రీ రాజ రాజేశ్వరీ దేవి



మైసూరు ఆశ్రమ మూల విరాట్టు
శ్రీ కాలాగ్ని శమన దత్త మూర్తి

# ద్వితీయ ముద్రణకు ప్రకాశకుల మనవి

శ్రీ సద్గురుదేవుల జీవిత చరిత్ర గ్రంథం ప్రథమ ముద్రణ 1991 జూన్‌లో వెలువడింది. వస్తుపరంగానూ, సాహిత్యపరంగానూ ఈ గ్రంథం సాధించిన ప్రశంసలకు సూచికగా 1992 జూన్‌లోనే దీని ద్వితీయ ముద్రణకు అవశ్యకత యేర్పడింది.

హైదరాబాదు భక్తులు శ్రీమతి & శ్రీ కంవేటి శ్రీనివాస్ సుబ్రమణ్యం, జ్యోతిల సేవానిరతి వల్ల ఇప్పుడీ ద్వితీయ ముద్రణ వెలువడి, వారిని భక్తుల కృతజ్ఞతకు, సద్గురుదేవుల అపారకృపకు పాత్రులను చేస్తోంది.

వస్తుపరంగా యీ ద్వితీయ ముద్రణలో చేయవలసిన సవరణలు కనిపించలేదు. అలాంటి సూచనలు గూడా అందలేదు. సంగ్రహాధ్యాయం మాత్రం గ్రంథం మొదటికి తీసుకురాబడింది. గ్రంథం రెండు భాగాలుగా మీ చేతులకు చేరబోతోంది. రెండవ భాగం చివరలో కొన్ని నూతన సంఘటనలతో ఒక క్రొత్త అనుబంధం చేర్చబడింది.

ఈ మార్పులతో ఈ రెండవ కూర్పు పాఠకలోకాన్ని మరింత సంతృప్తి పరచగలదని విశ్వసిస్తున్నాము. జయ గురుదత్త.

దత్త జయంతి
డిసెంబరు,
1992

ఇట్లు
శ్రీ గణపతి సచ్చిదానంద
అవధూత దత్త పీఠము

# సంగ్రహాధ్యాయము

*ఆదౌ శ్రీ జయలక్ష్మి గర్భ జననం శ్రీ విద్యయా శైశవే*
*యోగాప్తి ర్నిజమాతృతోఽథ భగినీ గార్హస్థ్య సంపాదనమ్ ,*
*విఘ్నేశానుమతి శ్శుభాశ్రమకృతి శ్శ్రీసచ్చిదానందతా*
*సిద్ధి శ్శిష్యధృతిశ్చ దత్త గురురాడ్బోధ శ్చరిత్రం గురోః ॥*

( మొదట శ్రీ జయలక్ష్మీమాత గర్భాన అవతరించటం, బాల్యంలోనే తల్లివల్ల శ్రీవిద్యతో పాటు యోగదీక్ష పొందటం, ఆపైన చెల్లెళ్లకు పెళ్ళిళ్లు చెయ్యటం, గణపతి అనుమతితో ఆశ్రమ స్థాపన చెయ్యటం, శ్రీ సచ్చిదానంద స్వామీజీ కావటం, శిష్యులను రక్షించటం, దత్తగురు తత్వ ప్రబోధం చెయ్యటం—ఇదే గురుచరిత్ర )

శ్రీమద్ భారద్వాజ సగోత్రంలో గండ్లూరు నరసింహశాస్త్రి గారనే మహనీయుడు ఇంచుమించు ఇరవయ్యవ శతాబ్దితో సమంగా యీ భూమి మీదికి ప్రవేశించాడు. ఆయనకు 1938 ప్రాంతాలలో భార్య గతించటంతో సన్యసించాలనే సంకల్పం పెల్లుబికింది. శాస్త్రిగారి అక్క వెంకమ్మగారు అప్పటికే ఆరూఢ స్థితికి చేరుకొన్న యోగినీమణి కావటంవల్ల తన హృదయంలో స్పందించిన ఈశ్వరాజ్ఞను గ్రహించి తీర్థయాత్రలు చెయ్యమని తమ్ముణ్ణి ప్రోత్సహించింది. అక్కాతమ్ముళ్ళిద్దరూ కలసి తీర్థయాత్రలు చేస్తూ దైవయోగంవల్ల కర్నాటక రాష్ట్రపు అడవులలో నిగూఢంగావున్న అర్కావతీ, గుప్తగామినీ, కావేరీనదుల త్రివేణీ సంగమ పుణ్యక్షేత్రానికి చేరుకొన్నారు. (అధ్యాయం. 3)

హరితస గోత్ర పవిత్రుడైన లింగణ్ణగారనే సత్పురుషుడా రోజుల్లో ఆ సంగమక్షేత్రంలో కాపురం వుంటూవుండేవాడు. ఆయనకు 1924 ప్రాంతాలలో జయలక్ష్మి అనే పుత్రిక కలిగింది. ఆ సంగమక్షేత్రంలో నిరంతర దత్తాత్రేయ సంచారాలు వుంటూ వుండటంవల్ల యోగులనేకులు అక్కడకు వచ్చి సాధనలు చేసుకొని వెళుతూ వుండేవారు. అట్టివారిలో ఫకీరుతాత అనే 120 యేళ్ళ వృద్ధయోగితోనూ, కరపాత్ర యతీంద్రులనే శతవృద్ధ యతితోనూ బాల జయలక్ష్మికి స్నేహమేర్పడి, క్రమంగా అది శిష్యరికంగా మారింది. ఫలితంగా అనతి కాలంలోనే యోగశిఖరాల నధిరోహించిన జయలక్ష్మి దత్తాత్రేయ సాక్షాత్కారం గూడా పొందగల్గింది. త్వరలోనే తానామె గర్భవాసాన అవతరించవలసి వుందనీ, అందువల్ల ఆమె వివాహం చేసికోవలసి ఉన్నదనీ అత్రిమూర్తి ఆమె నాదేశించారు. ఇది జరిగిన కొద్దికాలానికే తీర్థయాత్రలకు వచ్చిన వెంకమ్మ, నరసింహశాస్త్రులు దైవవశాన లింగణ్ణగారింట బస చేయ

వలసివచ్చింది. దీనివల్ల ఆ రెండు కుటుంబాలకు ఊహాతీతమైన రీతిలో స్నేహం కుదిరి, తన కుమార్తె జయలక్ష్మిని నరసింహశాస్త్రిగారి కిచ్చి వివాహం చేశాడు లింగణ్ణగారు. ఆ విధంగా జయలక్ష్మి నరసింహ ధర్మపత్ని అయి ఆంధ్రదేశంలోని అనంతపురం సమీపంలో గల బొమ్మెపర్తి గ్రామంలో మెట్టినింటికి చేరింది. (అధ్యా. 4)

బహిరంగంలో ఆదర్శ గృహిణిగా, అంతరంగంలో సిద్ధయోగినిగా జీవిస్తూవున్న జయలక్ష్మి చిత్రభాను సంవత్సర అధిక జ్యేష్ఠ శుద్ధ ఏకాదశీ మంగళవారంనాడు (26-5-1942) ఆదిగురుమూర్తి నవీనావతారానికి ద్వారభూత అయి జయలక్ష్మీమాత అయింది, జగన్మాత అయింది. సత్యనారాయణ అనే నామధేయంతో నూతనావతార జీవితం ప్రారంభించిన ఆ లీలా బాలుడికి పొత్తిళ్ళలోనే సంగీత జ్ఞాన మబ్బింది. (అధ్యా. 39) గోరుముద్దలతోనే సాధన రహస్యాలు వంటబట్టినై. (అధ్యా. 24) ఆటపాటలలోనే అద్భుత మహిమ లావిష్కారమైనై. (అధ్యా 24, 27) ఇంతలో 1953లో తన యోగవిద్య నంతనూ శక్తిపాత విధానంలో తన ముద్దుబిడ్డడికి ధారాదత్తం చేసి, భావిజీవితంలో అతడు నిర్వహించవలసిన కార్యక్రమ ప్రణాళికను నిరూపించి, అద్భుతావహమైన విరాడ్రూప దర్శనా లనుగ్రహించి, జయలక్ష్మీ మాత తన తనువు చాలించేసింది. (అధ్యా. 1) ఒకానొక శంకర జయన్తి మహాపర్వాన ఈ భూమి కవతరించిన ఆ మహాసాధ్వి మళ్ళీ మరో శంకర జయన్తినాడే తనువు చాలించింది. (అధ్యా. 5)

జీవితంలో రెండవసారి భార్యను పోగొట్టుకొన్న నరసింహశాస్త్రిగారిలో వైరాగ్యం జూలు విసరి విజృంభించింది. ఫలతంగా, బాల సత్యనారాయణ, అతని చెల్లెళ్ళు వరలక్ష్మి సరస్వతులు అప్పటికి మైసూరులో వుంటున్న తాతగారు లింగణ్ణగారి వెంట వెళ్ళగా, నెలల పసికందు కోదండ రాముడు, ఈ బంధువు లెవరూ నచ్చక తల్లి దగ్గరకే వెళ్ళిపోయాడు. (అధ్యా. 6) గడచీ గడవని బీదరికంలో వుంటున్న లింగణ్ణగారు ముగ్గురు పిల్లలను సాక లేక, పసిపిల్ల సరస్వతిని మైసూరులో వుంటున్న తన చివరి కూతురు పార్వతమ్మ పెంపకంలో వుంచి, సత్యనారాయణను, వరలక్ష్మిని బన్నీరుగట్టలో తన రెండవ కూతురు శారదమ్మ దగ్గర దింపాడు. బన్నీరుగట్ట బెంగుళూరు సమీపంలో ఒక చిన్న కుగ్రామ క్షేత్రం. అక్కడి చంపక దామేశ్వరి ఆలయంలో శారదమ్మగారి భర్త శేషగిరి శాస్త్రిగారు అర్చకుడుగా వుండేవాడు. ఆ ఆలయం లోనూ, వూరు నంటి వున్న చిట్టడవిలోనూ సత్యనారాయణ ఆధ్యాత్మిక సాధనలు నిరంత రాయంగా సాగిపోతూ వుండేవి (అధ్యా 14). తన అయిదవ యేటనే, అగస్త్య మహర్షి అనుగ్రహం వల్ల వైద్య విద్యను గుత్తగొన్న సత్యనారాయణకు (అధ్యా. 37) ఆ వూళ్లో గండ మాలలనే గొంతు వాపు వ్యాధి వచ్చింది. ఆ మొండి వ్యాధికి భయపడి లింగణ్ణగారు సత్యనారాయణను, వరలక్ష్మిని మైసూరు తీసుకువెళ్ళి వైద్యాలు చేయించాడు. కాని వ్యాధి అక్కడ గూడా తగ్గ లేదు. అందువల్ల వరలక్ష్మి సత్యనారాయణలు ఇద్దరూ తండ్రి దగ్గరకే

చేరవలసి వచ్చింది. అక్కడ వ్యాధి తగ్గింది. కాని వైరాగ్యం వల్ల ఇల్లు పట్టకుండా వున్న నరసింహశాస్త్రిగారికి పిల్లల పోషణ అసాధ్యమైంది. అందువల్ల భర్త గతించి, నిస్సంతువై, ప్రొద్దుటూరులోని ఉమామహేశ్వరాలయంలో సన్యాసి జీవితం గడుపుతున్న వెంకమ్మగారు పిల్లలద్దరినీ తాను తీసుకు వెళ్ళింది. ఆవిధంగా 1953లో ప్రొద్దుటూరులోని ప్రభుత్వప్రాథమిక పాఠశాలలో 4వ తరగతిలో చేరాడు సత్యనారాయణ. మధుకరి వృత్తితో కొన్నాళ్ళు, వారాల భోజనాలతో కొన్నాళ్ళు అక్కడ అతని జీవయాత్ర సాగింది. (అధ్యాయం 14)

తల్లి ఆజ్ఞవల్ల శ్రీవిద్యారాజయోగి మార్గంలో నిగూఢంగా సాధన సాగిస్తున్న సత్యనారాయణకు వెంకమ్మగారి సాన్నిధ్యం బాగా అనుకూలించింది. ఈ బాలుడిలోని అంతస్సారాన్ని గుర్తించిన ఆ యోగినిమణి తన హఠయోగ విద్యనంతా అతనికి ధారపోసింది. ఆ రోజుల్లో ప్రొద్దుటూర్లో నివసిస్తూ వుండిన శ్రీ అభేదానంద స్వామివారు, అప్పుడప్పుడు సంచారిగా వస్తూ వుండిన శ్రీ యోగీంద్ర భారతీస్వామివారు వంటి మహాత్ములు సత్యనారాయణలోని మహత్త్వాన్ని గుర్తించారు. (అధ్యాయం 14)

ఇంతలో 1955లో వెంకమ్మగారు తనువు చాలించగా, వరలక్ష్మి సత్యనారాయణలు అనంతపురం సమీపంలోని కందుకూరు గ్రామంలో ఉపాధ్యాయ వృత్తిలో వున్న సవతి అన్నగారు నంజుండయ్యగారి ఆశ్రయంలోకి వచ్చారు. ఆయన తమ్ముణ్ణి అనంతపురం హైస్కూల్లో 6వ తరగతిలో వేశాడు. వరలక్ష్మి కందుకూరులోనే వుండిపోయింది. అక్కడ నంజుండయ్యగారి అమ్మమ్మ అంబమ్మ గారికి (అంటే, వరలక్ష్మి సవతి అమ్మమ్మకు) వరలక్ష్మి పొడ గిట్టలేదు. అందువల్ల ఆ బాలిక జీవనం దుర్భరమై పోయింది. చెల్లెలికి బాధ నివారించేందుకై 1957లో సత్యనారాయణ వరలక్ష్మితో కలసి మైసూరులో తాత లింగణ్ణగారి దగ్గరకు చేరాడు. భాష మార్పువల్ల ఒక సంవత్సరం చదువు వ్యర్థం కాగా 1958లో మైసూర్లో 8వ తరగతిలో చేరాడు. పూర్వం బన్నూరుగట్టులో వుండిన శేషగిరిశాస్త్రిగారు మైసూరులోని చాముండీ వనంలో ఒక ఆలయంలో అర్చకుడుగా చేరాడు. సత్యనారాయణ కేసరి ఎక్స్‌టెన్సన్ కాలనీలో వుంటున్న తన పినతల్లి పార్వతమ్మ ఇంట్లో కొంతకాలము, పెదతల్లి శారదమ్మ (శేషగిరిశాస్త్రి) ఇంట్లో కొంతకాలము గడుపుతూ వుండేవాడు. చాముండీవనం సమీపంలోని సార్వజనిక హైస్కూల్లో చదువుతూ వుండేవాడు. అంతర్గతంగా నిరంతర అన్వేషణలు సాగుతూ వుండటంవల్ల అతడు బడి చదువులలో తగినంత చురుకుగా వుండేవాడుకాడు. అందువల్ల బంధువర్గాలలో అతని మర్యాద సన్నగిల్లింది. ఇది ఇలా వుండగా, 1959లో 9వ తరగతి చదువుతున్న సత్యనారాయణ తనే పట్టుబట్టి ఉపనయనం చేయించుకొన్నాడు. పెదతండ్రి శేషగిరిశాస్త్రిగారు బ్రహ్మోపదేశం చేశాడు. ఉపనయన సుముహూర్తం నుంచి సత్యనారాయణకు గణపతి దర్శనమిచ్చి విశేషోపదేశాలు చేయసాగాడు. (అధ్యా 16)

ఉపనయనం తరువాత సత్యనారాయణ ఆధ్యాత్మిక సాధనలు సన్నసన్నగా ఇంటి వారికి తెలియసాగాయి. అవి వారి కంతగా సంతోషం కలిగించలేదు. దానికి తగ్గట్టే 1961 మార్చి S S L C పరీక్షలలో సత్యనారాయణ తప్పాడు ( అధ్యా. 4 ) అతని పట్టుదల వల్లే ఆ సంవత్సరం మే నెలలో అతని పెద్ద చెల్లెలు వరలక్ష్మి వివాహం జరిగింది. ఈ అప్పులు తీర్చేందుకోసం సత్యనారాయణ చాలా శ్రమ చేసాడు. పాలమ్మాడు, ట్యూషన్లు చెప్పాడు, పౌరోహిత్యం చేశాడు. వీవింగ్ ఫాక్టరీలో పనికి దిగాడు. మళ్ళీ కట్టి, సెప్టెంబర్‌లో SSLC పాసయ్యాడు. ఎలిమెంటరీ టీచర్స్ ట్రైనింగ్ తీసుకొన్నాడు. పోస్టాఫీసులో తాత్కాలిక జవానుగా పని చేశాడు. ఇది ఒకపార్శ. రెండవ పార్శలో, అంతర్గతసాధన తీవ్రమై అది క్రమంగా బహిర్గతం కాసాగింది. అర్కగణపతి సాధన విశేషంగా సాగింది. కొన్ని మహిమలు అప్రయత్నంగా వెల్లడయినాయి. కానీ, ఇవన్నీ ఐహిక అభివృద్ధికి భంగకరాలు గనుక, బంధువర్గపు అనమ్మతికి గురి అయినాయి. (అధ్యా. 6) అంతరంగంలో సాధన సమస్యల పరిష్కారంకోసం ఆక్రోశించిన సత్యనారాయణ, ఈ ప్రాంతాలలో మానస సరోవర, గండకీ యాత్రలు రహస్యంగా చేసివచ్చాడు. [ అధ్యా. 23 ] అతను క్రమంగా తన మకామును కెనరే ఎలక్ట్రిసిటి కాలనీలోని ఒక మిత్రుడి ఇంటికి మార్చాడు. [అధ్యా॥ 6] ఆ ఇంటికి చేరటంతోటే తన దీక్షా స్వీకార సమయంలో తన మాతృమూర్తి అనుగ్రహించి యిచ్చిన ప్రశ్నగణపతి రత్నశిల మళ్ళీ ప్రత్యక్షమయింది. (అధ్యా. 1) ఆ రత్నశిలలోంచి గణపతి సందేశాలు సాక్షాత్తుగా అందసాగాయి. [అధ్యా. 2 ] ఒక పక్క పోస్టాఫీసు ఉద్యోగం కొనసాగుతుండగానే, మరోపక్క కెనరే కాలనీలో గణపతి హోమాలు, దివ్యనామసంకీర్తనలు, భక్తులకు వరదానాలు, మహిమావిష్కరణలు పెచ్చు పెరిగాయి. [ అధ్యా. 9 ]

ధర్మప్రచార కార్యక్రమాలకై తన మాతృమూర్తి నిర్దేశించిన సమయం ఆసన్నమైందని అర్కగణపతి, ప్రశ్నగణపతులు ప్రబోధించటంవల్ల [ అధ్యా 6, 2 ] సంపాదనతోసహా సంసారబంధాలు విసర్జించి ధర్మప్రచారదీక్షకు దిగిన సత్యనారాయణకు సత్యనారాయణస్వామి అన్న దీక్షానామం అప్రయత్నంగా సిద్ధించింది. [అధ్యా. 7 ] అది త్వరలోనే గణపతిస్వామిగా, సత్యానందస్వామిగా [అధ్యా. 12] గణపతి సచ్చిదానంద స్వామీజీగా మారిపోయింది. కేరళ, ఆంధ్ర, తమిళ రాష్ట్రాలలో భక్త వర్గమేర్పడ్డది. [అధ్యా 18, 22] కెనరే ఎలక్ట్రిసిటీ కాలనీలో గల పెద్ద మైదానం ఆదివారపు గణపతి హోమాలకై, దివ్యనామ సంకీర్తనలకై వచ్చే భక్తులకు ఇరుకుస్థలమై పోయింది. [అధ్యా. 17] ఫలితంగా 1966 లో నంజన్‌గూడ రోడ్డుమీద, చాముండీ పర్వతము వెనుక, నూతన సువిశాల ఆశ్రమమేర్పడ్డది. [అధ్యా 19] వెనువెంటనే అగ్ని ప్రవేశ హోమాలు, నృసింహ నవరాత్రి, దేవీనవరాత్రి, శివరాత్రి మహోత్సవాలూ ప్రారంభమైనై.

ఆశ్రమస్థాపన జరిగిన కొద్దిరోజులకు శ్రీశైలయాత్రచేశారు స్వామీజీ. శ్రీశైల పాతాళ గంగలో స్నానం చేస్తుండగా ఆయనకు అవధూత దీక్ష లభించింది. అప్పటినుంచీ స్వామీజీ

కాషాయవస్త్రధారి అయ్యారు [అధ్యా. 20] ఈ ప్రాన్తాలలోనే వారి తండ్రి నరసింహశాస్త్రి గారు వారిని అనేక కోణాలనుంచి పరీక్షించి, పరీక్షించి, తనే వారి శిష్యుడైపోయాడు. [అధ్యా. 24]

ఆశ్రమంలో యోగబోధన, ధర్మప్రచారం, సంకీర్తన విధానం, ముమ్మరమై మహిమా విస్తారాలు వర్షపాతాలు కాగా స్వామీజీ కీర్తి రాష్ట్రాంతరాలకు ఎగబాకింది. 1964 ప్రాంతాల నుంచి కేరళ వెళ్ళి వస్తున్న స్వామీజీకి [అధ్యా. 14] 1968 నుంచి తమిళ రాష్ట్రంలోను [అధ్యా. 25] 1970 ప్రాంతం నుంచి ఆంధ్రరాష్ట్రంలోనూ [అధ్యా. 30] పర్యటనలు ప్రారంభమైనాయి. 1968 లో రెండవ చెల్లెలు సరస్వతి వివాహం ఆశ్రమంలోనే జరిగింది. స్థాపన అయిన దగ్గరనుంచీ ఆశ్రమంలో నిత్యాన్నదానం వ్రతంగా సాగిపోతూనే వుంది. ఇందు నిమిత్తమై 1969 లో అన్నపూర్ణ మందిరమనే పేరుతో సువిశాలమైన రేకుల షెడ్డొకటి వెలసింది. ఇదే ఆశ్రమంలో చెప్పుకోదగ్గ మొదటి కట్టడం, [అధ్యా. 28] ఆ ప్రాన్తాల లోనే ఆశ్రమ ప్రధాన ద్వారం, హనుమద్ద్వారం నిర్మాణమయింది. [అధ్యా. 29]

అర్థంలేని అంతర్భేదాల విషవలయంలో చిక్కి వున్న భారతీయ భక్తకోటికి, ద్వేష భావ స్పర్శలేని దైవదృష్టి కలిగించాలన్న స్వామీజీ తపనకు ఫలితంగా అరుదైన త్రిమత సమ్మేళనం 1971లో ఆశ్రమంలో జరిగింది. ద్వైతాద్వైత విశిష్టాద్వైత పీఠాధిపతులు సమావేశమై స్వామీజీ భావనలకు తమ గళాలను గూడా శ్రుతి కలిపిన ఆ దివ్యసభకు స్మారక చిహ్నంగా "రామానుజ మధ్వ శంకర కుటీర" మనే పేర ఒక భవనానికి ఆ ఉత్సవాల లోనే శంకుస్థాపన జరిగింది. " రా. మ. శంకర కుటీర " మనే సంగ్రహ నామధేయంతో ఇప్పుడాశ్రమంలో అతిథులకు ఆశ్రయమిస్తున్న యీ భవనం 1976లో ఆవిష్కృతమైంది.

1972లో జ్ఞానబోధ సభలనే పేరుతో ఆశ్రమశాఖల ఆవిష్కరణకు ప్రారంభోత్సవం జరిగింది. మొదటిశాఖ భారత రాజధాని ఢిల్లీలోనే ప్రారంభం కావటం ఒక విశేషం. (అధ్యాయం 32). 1973లో స్వామీజీ సంకీర్తనల మొట్టమొదటి LP రికార్డు ఆవిర్భవించింది. (అధ్యాయం 36). 1975లో స్వామీజీ దత్తక్షేత్రాల యాత్రలు పెరిగాయి. శ్రీగణపతి సచ్చిదానంద ట్రస్టు ఆవిర్భవించింది. (అధ్యాయం 37). ఈ ప్రాంత్రాలలోనే తమ వైద్య విజ్ఞాన ఫలితాలు జన సామాన్యానికి సులభంగా అందే విధానాలపై పరిశోధనలను స్వామీజీ విస్తృత పరచారు. (అధ్యాయం 38). తమ కోసం అధిక సంఖ్యలో వస్తున్న విదేశీయుల కోసం స్వామీజీ స్వయంగా విదేశాలు పర్యటించటం 1976లో ప్రారంభమయింది. (అధ్యాయం 40) ఆ యేడే ఆశ్రమపత్రిక భక్తిమాల ప్రారంభమయింది. (అధ్యాయం 41) స్వామీజీ జనకులు నరసింహశాస్త్రిగారు శ్రీ శంకరానంద తీర్థుల దగ్గర దండ కమండల స్వీకారం చేసి శ్రీ నరహరి తీర్థ యతివరులైంది కూడా యీ యేడే. (అధ్యాయం 40)

స్వామీజీ అవతారానికి ముఖ్య ప్రయోజనాలలో ఒకటయిన శ్రీదత్తాత్రేయ ప్రచారానికి స్థిరమైన పునాది 1978లో ఏర్పడ్డది. 1978 జూన్ 9న ఆశ్రమంలో స్వామీజీ స్వహస్తాలతో కాలాగ్ని శమన దత్తాత్రేయ ప్రతిష్ఠ జరపటంతో స్వామీజీ అవతార చరిత్ర లో నే .క నూతన ఘట్టానికి ప్రారంభోత్సవం జరిగింది. (అధ్యాయం 41) అప్పటినుంచి దత్త ప్రభంజనం యావత్ప్రపంచాన్నీ ఆక్రమిస్తూనే ఉన్నది. (అధ్యాయం 42)

మొదటినుంచీ పెద్ద రెల్లుచావడిగా వుండిన ఆశ్రమంలోని విశ్వప్రార్థనా మందిరం 1984లో సుస్థిర భవనంగా మారింది. 1982లో శ్రీ దేవీమాంగళ్య మండపం వెలసింది. (అధ్యాయం 42) 1985లో స్వామీజీ స్వర్ణకిరీటధారి అయ్యారు. (అధ్యా-45) స్వామీజీ నిత్యాన్నదాన దీక్ష ఆచంద్ర తారార్కంగా కొనసాగించటం ప్రథమ లక్ష్యంగా ఏర్పరచుకొన్న శ్రీ జయలక్ష్మీమాతా నిత్యాన్నదాన ట్రస్టు 1986లో ఆవిర్భవించింది. పర్వత శిఖరాగ్రాన, పెనుచరియల గుండెలను చీల్చుకొని పెల్లుబికిన సెలయేటి బుగ్గలాగా 1966లో పీఠపూజా పాదుకా నిర్మాణ సమయానికే శ్రీ స్వామీజీ హృదయంలో మొలకెత్తి, (అధ్యా. 18)1978లో కాలాగ్ని శమనదత్త ప్రతిష్ఠతో పెనుజలపాతమై దూకిన శ్రీ అవధూత దత్తపీఠ మహానది, 1988లో శ్రీ గణపతి సచ్చిదానంద అవధూత దత్తపీఠ ట్రస్టు ఆవిర్భావంతో వ్యావహారిక రూపాన్ని సంతరించుకున్నది ఆ యేడే దీనిలోనుంచి శ్రీ గణపతి సచ్చిదానంద విద్యా సంస్థ అనే పాయ చీలి విద్యాక్షేత్రానికి కొత్త పంటల నందిస్తోంది. (అధ్యా-42)

1990లో అన్నపూర్ణ మందిరం సువిశాల సుస్థిర భవనంగా మారింది. 1991లో ఆశ్రమ, దత్తపీఠాల రజతోత్సవాలు జరిగాయి. ఈ ఉత్సవాలలో రజత సింహాసనాధిరోహణం చేసి ఆధ్యాత్మిక జగచ్చక్రవర్తి అయ్యారు స్వామీజీ. (అనుబంధం) 1992లో స్వామీజీ అవతార స్వర్ణోత్సవాలు జరుగబోతున్నాయి. (అధ్యా-43) 1985లో స్వామీజీ ధరించిన స్వర్ణ కిరీటం తురాయి ఆకారవుది కాగా తిరుపతి వెంకటేశ్వరుని మహాకిరీటంతో తులతూగగల మరొక సువర్ణ రత్న కిరీటం 1990లో స్వామీజీ పాదాల దగ్గరకు చేరింది. దానిని 1992లో జరుగగల అవతార స్వర్ణోత్సవాలలో శిరసున ధరించగలమని స్వామీజీ చెప్పారు. (అనుబంధం) 1978లో మొదటిసారిగా దత్త దేవాలయ నిర్మాణ కార్యక్రమం చేపట్టిన స్వామీజీ 1991 జూన్ నాటికి భారతదేశంలో 18 ఆలయాలను నిర్మించారు. వీటిలో పదహారింటిని దత్తావతార క్షేత్రాలుగా నిర్ణయించారు. స్వామీజీ జన్మస్థల క్షేత్రం మేకేదాటును దత్తకాశిగా, తూర్పు సముద్ర తీర క్షేత్రం మంగినపూడి దత్తరామేశ్వరంగా నిర్ణయింపబడ్డాయి. ఇవిగాక ఎ.. 9 దత్తక్షేత్రాలు దత్తశిష్య క్షేత్రాలుగా (నవనాథ క్షేత్రాలుగా) ఆవిర్భవించటానికి అంకురార్పణలు జరిగాయి. (అధ్యా-42)

1976 లో మొదటిసారిగా విదేశ పర్యటనలు ప్రారంభించిన స్వామీజీ 1991 జూన్ నాటికి 2.. సార్లు విదేశ పర్యటనలు చేసి అనేక దేశాలలో ప్రతిష్ఠ్యాపురస్కారాలతోపాటు

అనన్య సాధ్యాలయిన ఘన సత్కారా లనేకం పొందారు. సప్తఖండాలలోనూ పర్యటించి అనేక నదీ సరస్తీర్థాలతోపాటు సప్త సముద్రాలలోనూ స్నానాలు చేశారు. 1981 నుంచి వేల కొలది సాధకులకు క్రియాయోగ బోధలు చేశారు. రెండు దత్తాత్రేయ దేవాలయాలు నిర్మించారు. ఎనిమిది ఆశ్రమ శాఖలు స్థాపించారు. (అధ్యా 40, 43 అనుబంధం) 1964 నుంచీ సాగివస్తున్న సంకీర్తన రాగపద్ధతులు 1982 నుంచీ రోలెండ్ సింథసైజర్‌పై వినూత్న ప్రక్రియా రూపాలను ధరించి 1990 నాటికి రాగరాగిణీ విద్యను తమలో రంగరించుకొని, ఆధ్యాత్మిక నాద కచేరీలుగా విస్తరించి శ్రోతలకు శారీరక, మానసిక ఆరోగ్యాలను ప్రసాదిస్తూ భక్తి భావలతికలను మూడు పూవు లారు కాయలుగా స్వదేశ, విదేశాలలో కొనసాగుతున్నాయి. (అనుబంధం)

ఇన్ని విభిన్న శాఖలలో, ప్రపంచ స్థాయిలో మానవోద్ధరణ కార్యక్రమాలను నిర్వహించటం స్వామీజీ అవతారానికి మాత్రమే చెల్లిన అపూర్వ విశేషం. ఈ చరిత్రను మహనీయులైన మహర్షు లెందరో తమ అంతర్దృష్టులతో దర్శించి, కీర్తించి ధన్యు లయ్యారు. (అధ్యా. 14, 16, 23, 33, 34) చిత్రదుర్గ వృద్ధ యోగీంద్రులు, ఆళ్ళగడ్డ సజీవ సమాధి యోగీశ్వరులు మొదలైన తపస్వులు స్వామీజీ సాక్షాద్దత్తాత్రేయ అవతారమని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. (అధ్యా. 39, 42) ఈ దత్తావతారమూర్తికి సమకాలీనులమై జన్మించ గలగటం మన భాగ్యం. ఈ బ్రహ్మర్షి చరిత్ర తెలుసుకో గలగటం మహత్తర భాగ్యం. అపార కరుణా సాగరు లయిన శ్రీ సద్గురు సార్వభౌములు ఐహికాముష్మిక సకల సంపదలు వర్షించుగాక. జయగురుదత్త.



# ఆమోదము

జయ గురు దత్త

శ్రద్ధాసక్తులు గల భక్తుడు ఇల్లిల్లు తిరిగి పూలు పోగేసి మాలికలల్లుతాడు. సాహసము, సంపద గల భక్తుడు సముద్రాలలో దూకి మాణిక్యాలేరుకు వచ్చి రత్న హారాలర్పిస్తాడు. సాధన సంపత్తి గల భక్తుడు ఆకాశాని కెగిరి చుక్కలనే తుంచుకు వచ్చి, గుత్తులు కట్టి సమర్పించవచ్చు. మీ చేతిలో ఉన్న బృహద్గ్రంథంలో ఈ సమర్పణలన్నీ వున్నాయి. ఇవి అనుభవార్పణలు.

ఒక సంతోషం హేతువుగా ఈ సమర్పణ జరుగుతుంది. ఈ సమర్పణ మరొక సంతోషానికి హేతువవుతుంది. అందుకే మీ యీ అనుభవ సంతోషాన్ని చూసి, స్వామీజీ గూడా సంతోషిస్తున్నారు. అందువల్ల కుప్పా కృష్ణమూర్తి ఈ మహా గ్రంథం కోసం ఎంతగా విసిగించినా, మీ అనుభవ భక్తిని మెచ్చుకొని, కొన్ని జీవిత రహస్యాలందించారు స్వామీజీ. ఇది మీ అర్చనకు, అనుభవానికి, ఆధ్యాత్మికోన్నతికి సహాయ పడుతుందనేదే స్వామీజీ ఉద్దేశ్యం. అందుకే ఇది స్వామీజీకి ప్రియమైన గ్రంథం.

శ్రీ రాముడు లవకుశుల చేత తన కథే పాడించుకొని విన్నాడు. కృష్ణుడు నారదుడి చేత తన కథ పాడించుకొన్నాడు. ఈ అవతారంలో భక్తులందరూ చేరి అవతారలీలలను గానం చేసిన గ్రంథమే యీ మహత్తర గ్రంథం. దీనికి మీరందరూ రచయితలే. నిజానికి భగవంతుణ్ణి పొగడటం మనకు సాధ్యమయ్యే పని గాదు. ధ్రువుడికి శ్రీహరి ప్రత్యక్ష మయినప్పుడు అతను మూగబోయాడు. అపుడు శ్రీహరి ధ్రువుడి నాలుకలో కూర్చుని తనను తనే స్తుతి చేసికొన్నాడు. ఈ చరిత్ర గ్రంథ రచన గూడా అలాంటిదే. అందువల్లే ఇది ఒక నవీన పురాణ మనండి. ఇది ఒక కలియుగ ఉపనిషత్తనుకోండి. మీతో కలిసి స్వామీజీ కూడా యీ గ్రంథాన్ని పఠిస్తున్నారనే భావనతో పారాయణ చెయ్యండి. ఇది మీకెంతో శ్రేయస్సు.

ఈ గ్రంథంలో కొంతమందికి జ్ఞానం దొరుకుతుంది. మరి కొందరికి ఉత్తమమైన భక్తికి ద్వారాలు తెరుచు కొంటాయి. ఇంకా కొందరికి స్వామీజీని

అర్థం చేసుకొనే క్రొత్త దారులు పట్టుబడతాయి. ఈ పారాయణమే ఒక మహత్తర మైన సాధన. ఇందులో కొన్ని సంఘటనలు మీరు విన్నవే కావచ్చు. కానీ అక్షర రూపంలోకి వచ్చేసరికి వాటి స్వరూపం వేరే విధంగా వుంటుందనేది మీరు గమనించాలి. ఈ గ్రంథంలోని అనుభవాలను భావాలను చూసి, అవధూత దత్తపీఠపు ఆమోద ముద్రను అందిస్తూ, దీని కోసం ప్రత్యక్షంగా, పరోక్షంగా, అక్షర రూపంగా, ధనరూపంగా, కృషి చేసిన వారందరికీ శ్రేయస్సు కలిగిస్తూ, దీని రెండవ భాగాన్ని తయారు చెయ్యటానికి గూడా అనుమతిస్తున్నారు స్వామీజీ.

తను స్వామీజీ చేతిలో కలాన్నని చెప్పుకొన్నాడు కృష్ణమూర్తి. కాని, అతని కలంలో సిరాగా మారి, ఇదిగో నేను మీ చేతిలో ఉన్నానిపుడు! ...... కనబడుతున్నాను గదా! కనబడుతున్నాను!!!

జయగురుదత్త

మైసూరు
శివరాత్రి
12-2-1991

మీ
—శ్రీ స్వామీజీ

# మనవి

శ్రీగురు సత్కృప నాపై
వాగై ప్రవహింపదేని బాలిశుడను నా
కీగతి నీకృతి యేగతి
సాగును కరుణా సనాథ జయగణనాథా ॥

అని 1978లో వేరొక రచనా సందర్భంలో నేను చెప్పుకొన్నాను. ఆ మాట యిప్పుడు మరింత సమధికంగా సమన్వయిస్తోంది.

నిజంగానే యీ సద్గురు చరిత్ర వ్రాద్దామని సంకల్పించిన వారిలోగాని, దానికై కృషి చేసిన వారిలో గాని నేను మొదటివాణ్ణి కాదు. లౌకికంగా చూసుకొంటే, ఈ రచనకై స్వామిజీ ఎన్నుకున్న వారిలో మొదటివాణ్ణి గూడా కాదు. అయినా ఈ మహా భాగ్యం నాకే దక్కింది. అది శ్రీ గురుకృప.

నాకు తెలిసినంతలో యీ చరిత్ర రచనకు ఉపక్రమించిన మొదటి వ్యక్తి 1970 ప్రాంతాలలో ఆశ్రమవాసి అయిన శ్రీ శివరామ్‌గారు. బహు సంవత్సరాలు కృషిచేసి, స్వామీజీ అమ్మమ్మతో, తాతతో, తండ్రితో మాట్లాడి ప్రతి చిన్న విషయం రాసి పెట్టుకొని, వేల పేజీల నోట్సు తయారు చేసుకొన్న యీ సద్భక్తుడి శ్రమంతా వరుణదేవుడికి నైవేద్యమయి పోయిన విషాదోదంతం రాబోయే పుటలలో మీరు చదువుతారు. ఈ కథ వింటుంటే, వ్రాసిన మహత్తర గ్రంథాలన్నీ అగ్గిపాలయిన వేలూరి శివరామశాస్త్రిగారి కథ గుర్తు వస్తోంది. నామసాదృశ్యం గూడా బొర్రా అనిపిస్తోంది.

ఆ పరిశ్రమ అప్పుడు ఫలించి వుంటే, యిప్పటికి పదిహేనేళ్ళ క్రిందటే, ఇంతకన్నా విస్తృతమైన గురుచరిత్ర మనకు దక్కి వుండేది.

ఆ తరువాత మద్రాసులోని డా॥ ఎ. నిత్యానంద్‌గారు మరో ప్రయత్నం చేశారని విన్నానుగాని, అది అంతగా ముందుకు సాగలేదనుకుంటాను. ఇలాగే మరి కొందరు ప్రయత్నాలు చేశారు.

స్వల్ప స్థాయిలోనే అయినా విజయం సాధించిన మొదటి ప్రయత్నం శ్రీ గిడుతూరి సూర్యంగారిది. ఆయన రాసిన అమృతమూర్తి గ్రంథం స్వామీజీ భక్తులలో విస్తారమైన ప్రశస్తిని సంపాదించింది. కాని, అందులో చరిత్ర భాగం ఇంచుమించు 20 పేజీలు మాత్రమే! అప్పటికి యీ కృషికి స్వామీజీ సహకారం లేకపోవటంవల్ల అనాటి చరిత్ర రచనలలో అనేక లోటుపాట్లు గూడా చోటు చేసుకున్నాయి.

చివరకు యీ రచనా భాగ్యం నాకు పట్టిన విచిత్ర సన్నివేశ పరంపరలను ముందు పుటలలో మీరు చదువుతారు. ఏదియేమయినా, ఈ గ్రంథ రచనకు ఉపక్రమించేసరికి నా హృదయాన్ని ఆవరించి వున్నది భక్తిభావంకాదని చెపితే భక్తుల ఆగ్రహానికి గురికావలసి వస్తానేమోగాని, సత్యం మాత్రం అంతే! సత్యాన్వేషణాగ్రహం నాలోని భక్తి భావాన్ని కమ్మివేసిందని అంగీకరించకతప్పదు.

ఎందుకింత చెపుతున్నానంటే, ఈ గ్రంథ రచన చేసేటప్పుడు, నా హృదయంలో వున్నది స్వామీజీ అనే వ్యక్తికి కీర్తి పతాక ఎగురవేద్దామనే చాపల్యంకాదు! నాకు, నాపిల్లలకు, నా అన్నదమ్ముల పిల్లలకు, అంటే పైతరాలన్నింటికీ, మన సనాతన భారతీయ తాత్విక సాధనలోని లోతులు సోదాహరణంగా గుండెలకు హత్తుకోవాలనేదే నా తపన!

1985 లో ఈ రచనకు నన్ను నియమించి, తన సాధన రహస్యాలనేకం నాకు స్వయంగా వివరించి చెప్పారు స్వామీజీ.

ఆ సంభాషణ టేపులు మళ్ళీ వింటున్నప్పుడు సాక్షాత్తు స్వామీజీని ఇంత కటువుగా, మోటుగా ఎలా ప్రశ్నించగలిగానా అని నాకే ఆశ్చర్యం అయింది. సాధనా రహస్యాలను రాబట్టాలనీ; తర్కసహజమైన విషయాలను గ్రహించాలనీ వున్న తాపత్రయంవల్ల కలిగిన యీ మొరకుతనాన్ని స్వామీజీ క్షమించారని ఆశిస్తున్నాను.

భక్తులమని చెప్పుకొనేవారిలో 50 శాతం మంది మోసకారులనీ, నిజంగా భక్తులమే అని తమకు తాము విశ్వసించుకొనేవారిలో 70 శాతం మంది అభాంధరాయిలనీ అనుమానించే నేను, ఇంటర్వ్యూ చేసిన ప్రతి భక్తుణ్ణి గోకి గోకి ప్రశ్నలు వేశాను. కొందరు నా ప్రశ్నలకు విసుక్కుంటే, నేనంతకన్నా విసుక్కున్నాను. అలా సుమారుగా రెండువందలమందిని ఇంటర్వ్యూ చేశాము. అందులో 70, 80 మంది సంభాషణలను కేసెట్లుగా టేప్‌చేసి వుంచాను. ఇతరుల సంభాషణలను వ్రాసిపెట్టుకొన్నాను. మరో వందమందిపైగా తమ అనుభవాలను వ్రాసియిచ్చారు. మరోవందమందిని నా మిత్రులు ఇంటర్వ్యూ చేశారు.

విపులమైన యీ గ్రంథంలో ఇలాంటి వారి సాక్ష్యాలను మాత్రమే గ్రహించాను. ఒకరి అనుభవాలను గురించి మరొకరు చెపితే, దాన్ని పూర్తిగా పరిత్యజించాను.*

అయితే 1985 లో నేనీ కృషి ప్రారంభించేనాటికి స్వామీజీ తాతగారు, అమ్మమ్మగారు గతించారు. తండ్రిగారు వృద్ధులై మతిపాటవం తప్పి వున్నారు. అనేకమంది పాత భక్తులు గూడా ఆ స్థితిలోనే వున్నారు. మరి నాకు స్వామీజీ బాల్యకథలు విపులంగా తెలిసేదెలా?

* దీనికి ఒకే ఒక మినహాయింపు వుంది. యోగిని భాయమ్మగారి అనుభవాలను శ్రీమతి వసుంధరమ్మ గారు చెప్పగా స్వీకరించాను. అందుకు కారణాలు గ్రంథంలోనే వివరించాను.

శ్రీ శివరాంగారి సహృదయం భక్తులందరికీ భిక్షపెట్టింది. నా ప్రయత్నం మాట విని, తన హృదయభారాన్ని పక్కకు నెట్టుకొని, వెనుకటి విషయాలన్నీ మనస్సులో తిరగదవ్వుకొని, సుమారు ఎనభై కథలు నా కందించాడా మహనీయుడు. ఎవరికి వుంటుందీ హృదయవైశాల్యం ?

ఇంతవరకు ప్రకటింపబడిన సావనీర్లలో వున్న భక్తుల అనుభవాలను, భక్తి మాలలోని వార్తలను కూడా ప్రమాణంగా స్వీకరించాను. ఆ విశేషాలు మాత్రం చాలా స్వల్పమనే చెప్పవచ్చు.

ఇంత పరిశోధన చేయగా భక్తులకు భక్తుడుగా, యోగులకు యోగిగా, కర్మఠులకు కర్మపరాయణుడుగా, తత్వరతులకు తాత్వికుడుగా, సంఘసేవా సక్తులకు జగద్ధిత మతిగా, సనాతనులకు సనాతనుడుగా, నవీనులకు నవీనుడుగా గోచరించి, సమన్వయించి, ఆచరించి చూపించే ఏకైక నాయకుడు నా జీవితంలో నాకు దొరకటం నా జన్మజన్మల పుణ్యాలపంట! నా నాయకుడి చరిత్రను నా చేతులతో నేను వ్రాసికోగలగటం నా జన్మకొక సాఫల్యం!

నేను "ఒకడి" చేతిలో కలాన్నై యీ రచన చేశాననే విషయం నాకు స్పష్టంగా, అనేక స్వానుభవాల మూలంగా తెలిసినా సరే, ఇది నా జన్మకు సాఫల్య హేతు వనటంలో నాకేమీ సందేహం లేదు.

నిజానికిది నా ఒక్కడివల్లా జరిగిన పనిగాదు. అనేకమంది కన్నడ భక్తుల సంభాషణలను రికార్డుచేసి నా కందించారు శ్రీ టి. ఆర్. కృష్ణప్పగారు. ఆశ్రమవాసి చిరంజీవి రమణకుమార్ అనేక రాష్ట్రాలు తిరిగి భక్తుల అనుభవాలను పోగేసుకు వచ్చి అందించాడు. అలాగే ఆశ్రమవాసులు చిరంజీవి ప్రసాద్, చిరంజీవి రాధాకృష్ణ అనేక ఆంతరంగిక విషయాలందించారు. విశేషించి విదేశీ భక్తుల అనుభవాలు ప్రోగు బడటంలో కృషి చేశారు. మరికొందరు పాత భక్తిమాల ప్రతులు వగైరా లందించారు. ఇంకా ఎందరెందరో సహకరించారు. పేరు చెపితే కోపగించేవారు కొందరున్నారు.

ఇది మా అందరి సొంత పని అనుకొని కలసికట్టుగా చేసుకొన్నాం. కృతజ్ఞతలు చెప్పి ఇందులో ఎవరిని పరాయివారిని చేసుకోనేది ?

మేమింతమందిమి కృషి చేసినా, ఈ రచన విషయంలో స్వీయత్వాన్ని గానీ, సంపూర్ణత్వాన్ని గానీ, నిర్దుష్టత్వాన్ని గానీ ప్రకటించుకునే గుండె దిటవు నాకు లేదు. స్వామీజీ జీవన చక్రంలో 48 శరత్తులనే (1990) ఈ రచనకు ప్రస్తుతం అవధిగా పెట్టుకొన్నాను. అధ్యాయ సంఖ్య దానికి అనుగుణంగానే యేర్పడ్డది.

ఇది తరగని కథ. ఎన్ని కథలు తీసుకొన్నా, ఇంకా ఎన్నో కథలు వదిలివేయ వలసి వచ్చింది. మా దృష్టికి రాకుండా పోయినవి కొన్ని వందల కథలున్నాయని మాకు

తెలుసు. దృష్టికి వచ్చిన మహత్తరమైన కథల్లో గూడా కొన్ని చెప్పే వీలులేదు. ఒక అనుమానపు మొగుణ్ణి, ఒక జులాయి చెల్లెల్ని, ఒక దుబారా తమ్ముణ్ణి సరిచేసిన కథలను ఎలా చెప్పమంటారు? పేర్లు లేకుండా కథలు చెపితే మీరు నమ్ముతారా? అలాగే గురుద్రోహం చేసి ఫలితం అనుభవిస్తున్న వారి కథలున్నాయి. వాటి స్మరణకన్నా గురుసేవ చేసి అనుగ్రహం సంపాదించుకొన్న వారి కథలే యెక్కువ ప్రయోజనకారులు గదా!

ఒకే నమూనా మహత్తులు అనేకం జరగటం సహజం. కాని, అవన్నీ రాసిపోస్తే, అది గ్రంథం కావటం దుర్ఘటం. అలాగే పుస్తకం నిండా భక్తుల పేర్లు కుప్పలుపోసి గురు చరిత్రను టెలిఫోను డైరక్టరీగా తయారు చేయటం గూడా భావ్యం కాదు! నేను వెంటబడి ఇంటర్వ్యూ తీసుకొన్నప్పటికీ, వారి కథలలో మంచి ఘట్టాలు ఉన్నప్పటికీ, తమ పేర్లు యీ గ్రంథంలో రాని భక్తులు, పై అంశాలను గమనించి నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. మరి ఇలాంటి అనుభవాలను భక్తిమాల పత్రికలో క్రమంగా ప్రచురించ టానికి ప్రయత్నిస్తున్నాను.

పేర్లు గ్రంథంలో వచ్చినా రాకపోయినా, విషయం అందించి సహకరించిన భక్తు లందరికీ కృతజ్ఞతాంజలు లర్పిస్తున్నాను.

రచనా విధానంలోగాని, విషయ గ్రహణంలోగాని, ఉన్న లోపాలను తెలియజేస్తే ఉత్తరోత్తరా సరిదిద్దుకుంటానని మనవి చేస్తున్నాను.

ఈ గ్రంథానికి అసలైన విలువ ఆధ్యాత్మిక సాధనలలోని సిహారలేశాల వివరణలో వుంది. శ్రీ స్వామీజీ స్వయంగా అందించి వుండకపోతే ఆ వివరాలు బయటకు వచ్చి వుండేవే కావు. తల మునిగి తాటి ప్రమాణాన సాగిపోతున్న పనుల సందడిలో వుండ గూడా, దొరికినప్పుడల్లా వెంటబడి విసిగించిన నాతో గంటల తరబడి కాలక్షేపం చేసింది చాలక, నాలో కూర్చుని ఇంత గ్రంథం వ్రాసిన స్వామీజీకి కృతజ్ఞతలు చెప్పుకుంటే సరిపోతుందా? వందనాలు చేస్తే సరిపోతుందా? పదిసార్లు పొగిడితే సరిపోతుందా?

కాదు! ఆ దివ్యమూర్తి నడచిన దారిలో ఒక్క-కనీసం ఒక్కటయినా సరే-అడుగు నేను వెయ్యాలి. మీరూ వెయ్యాలి! అప్పటికి సరిపోతుంది. ఆ శక్తి ఆయనే ఇవ్వాలి.

అహో పవిత్రం గురురాట్చరిత్రం
అణోరణీయం మహతో మహచ్చ।
నతద్వి భూతే రవసాన మస్తి
నచోపమా నాపి సమగ్రవేత్తా॥

జయ గురుదత్త

—రచయిత

# సౌభాగ్యం

ఒక మహాత్ముడు పుట్టిన కాలంలో సమకాలికులుగా పుట్టటమే అదృష్టం. అలాంటప్పుడు ఆ మహాత్ముని సన్నిధి, సేవాభాగ్యం లభించటం ఏమవుతుంది? ఇది ఒక భాగ్యం, సౌభాగ్యం. అదే నాకు లభించింది. శ్రీ స్వామీజీ సేవాభాగ్యం లభించటం ఎన్నో జన్మల అదృష్టంగా నేను భావిస్తున్నాను.

శ్రీ స్వామీజీతో నాకు కలిగిన మొదటి పరిచయ భాగ్యం గురించి వివరిస్తాను.

అప్పట్లో నేను విశాఖపట్నంలో ఉండేవాడిని. మా ప్రెస్సు పనిమీద మద్రాసు వెళ్ళటం జరిగింది. మద్రాసులో నేను మకాం చేసిన ఇంటాయన శ్రీ రాజారాం నాయుడుగారికి స్నేహితుడు కావటం కేవలం స్వామీజీ సంకల్పమే! అప్పటికే వారిద్దరూ ఒక వ్యాపార సంబంధమైన పనిపై మైసూరులో శ్రీ స్వామీజీని కలిసి సంప్రదించాలని అనుకొంటున్నారు. నన్ను చూడగానే వారి వ్యవహారానికి నేనూ ఉపయోగపడతానని వారికి అనిపించి నన్ను కూడా మైసూర్ రమ్మన్నారు, శ్రీ స్వామీజీకి నన్ను చూపించటానికి. వ్యవహారం, వ్యాపారం సంగతి ఎలా ఉన్నా మైసూర్ చూడొచ్చు, స్వామీజీని కూడా చూడొచ్చు అనే భావంతో మైసూర్ బయలుదేరి వెళ్ళాను.

1975 శివరాత్రి ఉత్సవం. ఆ ముందు రోజు ఆశ్రమంలో శ్రీ స్వామీజీయే నన్ను పలకరించారు, "ఎక్కడి నుండి వచ్చారని." "మా గురువుగారు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య గారని, నేను "జగద్గురు పీఠం" లో సభ్యుడినని, నాయుడుగారు తీసుకు వస్తే వచ్చానని చెప్పాను. "అయితే రెండు రోజులు ఉండి వెళ్ళండి" అని చెప్పారు స్వామీజీ. సరే అన్నాను నేను.

శివరాత్రనాడు శ్రీ స్వామీజీ అగ్ని ప్రవేశం చేయటం, ఏవో సృష్టించి అందరికీ పంచిపెట్టడం మొత్తం దృశ్యమంతా ఆశ్చర్యంగా చూసాను నేను ఆనాడు. శివరాత్రి మరునాడు శ్రీ స్వామీజీతో యింటర్వ్యూ లభించింది. అదే నా జీవితంలో ఓ నూతన అధ్యాయానికి నాంది పలికింది. ఆనాటి మా సంభాషణ యథాతథంగా వ్రాస్తాను.

స్వామీజీ : మీ సంస్థ కార్యక్రమా లేమిటి? ఎలా నడుపుతుంటారు?

నేను : ఉదయం ప్రేయరు. తరువాత అందరికీ ఉచితంగా హోమియో మందులు, సాయంత్రం వరకు 'జనకులం' స్కూలు! సాయంత్రం మా గురువుగారి ఉపన్యాసం, మా గురువుగారి రచనల ముద్రణ కోసమై కొన్ని ప్రెస్సులు, అక్కడే మా ఉద్యోగాలు___

ఇలా మొత్తం మా సంస్థ కార్యక్రమాల గురించి అంతా చెప్పాను.

స్వామీజీ : అయితే మీకు ఫండ్ ఎలా వస్తుంది ?

నేను : చేయదలచుకొన్న మంచి పని చేసుకుంటూ పోతుంటే రావలసిన ఆర్థిక సహాయం అదే వస్తుంది అని మా గురువుగారు చెప్తుంటారు. మరి మాకు అలానే గడిచిపోతుంది.

(ఆశ్రమంలో పూజలకు ఫీజు వసూలు చేసే విషయంలో నాకు అప్పట్లో సదవగాహన ఉండేదికాదు. బహుశా స్వామీజీ ఈ భావం నాలో నుండి తొలగించటానికే అనుకుంటాను యిలా అన్నారు:

స్వామీజీ : బాగుంది. అయితే ఏవో పదిమందికి పనికి వచ్చే మంచి పనులు చేద్దామని సంస్థలు పెట్టాం. ఎంతోమంది ఎన్నో రకాలుగా సహాయం పొందుతుంటారు. వారికి కావలసిన సహాయం అందగానే వారి దారిన వారు పోతారు. మరి ఈ ఆశ్రమం,ఆశ్రమం పనులు, వచ్చిపోయేవారు, వారికి కావలసిన వసతి ఏర్పాట్లు, నిత్య అన్నదానం, ఆశ్రమ ప్రచురణలు, ఇతరులకి జరగవలసిన సహాయం—ఇవన్నీ మరి వారికి పట్టవు గదా ! ఆశ్రమం గాని, సంస్థ గాని యిలా ఉంటేనే గదా ఎవరికైనా మనం సహాయం చేయగలిగేది ? అందుకే స్వామీజీ యీ ఫీజులు అవీ పెట్టారు. మీకు ఎందుకు చెప్తున్నానంటే మీరూ ఒక సంస్థలో ముఖ్యులుగా ఉంటున్నారు కాబట్టి. మీరు అర్థం చేసుకోండి మీ గురువుగారు వ్రాసిన పుస్తకాలు ఒక సెట్టు పంపించండి. మా 'భక్తిమాల' పత్రికకు మీరు వ్యాసాలు వ్రాసి పంపుతుండండి. అసలు మీరు వచ్చిన పని వేరు. మనం కలిసి పనిచేసే టైము వస్తుంది. దానికి చాల సంవత్సరాలు పడుతుంది. గుర్తుంచుకోండి."

అలా స్వామీజీ అనుగ్రహం నాకు లభించింది. తరువాత స్వామీజీ పంపించిన ఒక చిన్న ఇంగ్లీషు పుస్తకం నేను తెలుగులోకి అనువదించటం, అది భక్తిమాలలో సీరియల్‌గా ప్రచురణ కావటం జరిగింది. అది నేడు నేను శ్రీ స్వామీజీ జీవిత చరిత్ర; దాదాపు 1400 పేజీల మహద్గ్రంథం ముద్రణ చేయటానికి నాంది అయింది. ఇది నిజంగా నా సౌభాగ్యం కదా !

అయితే 1976 తరువాత శ్రీ స్వామీజీతో నాకు ఒక బ్రేక్ వచ్చింది. మరి ఆయన 'గణపతి' కదా ! ఆరంభంలో విఘ్నం సహజమే ! 1980లో నేను విశాఖపట్నం నుండి మచిలీపట్నం రావటం జరిగింది.

1984 సంవత్సరం ఫిబ్రవరి మొదటివారంలో మాస్టరుగారు (మా గురువుగారు మాస్టర్ ఇ. కె.) మచిలీపట్నంలో మా యింటికి వచ్చారు. ఆరోజు రాత్రి విచిత్రంగా డైనింగ్ టేబులువద్ద దాదాపు రెండు గంటలు కూర్చుండి పోయారు. రాత్రి 11 గంటలు దాటుతుండగా, సడన్‌గా 'ఏరా! మీ గడ్డాల స్వాములవారు ఏమంటున్నారు ?' అన్నారు. స్వామీజీ ప్రస్తావన మాస్టరుగారి నోటి వెంట రావటం నిజంగా నాకు ఆశ్చర్యం వేసింది. "ఈ మధ్య ఆయన టచ్‌లో లేను మాస్టారూ!" అన్నాను. "నువ్వు ఆయన కాంటాక్ట్‌లో ఉండు" అన్నారు మాస్టరుగారు. "ఆయనకీ మనకీ కుదరదు. ఆ సిస్టమ్ వేరు, మన సిస్టమ్ వేరు" అన్నాను నేను. "ఆయన సిస్టమ్ గురించి మనకెందుకుగాని, ఆయనవల్ల నీకు ఉపయోగం జరుగుతుంది" అన్నారు మాస్టరుగారు.

ఆ సంభాషణ అక్కడితో ఆగిపోయింది. కాలస్వరూపం విచిత్రం కదా! తరువాత ఒక నెల రోజులుకి మా గురుదేవులు శరీరత్యాగం చేశారు. ఆ లోటు తీరనిది, తీర్చలేనిది. ఈ పరిస్థితుల్లో శ్రీ స్వామీజీ బందరులో సమంగా, మా ప్రెస్సుకి మూడు ఇళ్ళ అవతల ఆశ్రమం స్థాపించటం, శ్రీ కుప్పా సహకారంతో నేను శ్రీ స్వామీజీని కలవటం, పూర్వపరిచయాన్ని గుర్తు చేయటం, స్వామీజీ 'సమయం వచ్చింది' అనటం అంతా ఫాస్ట్‌ఫార్‌వర్డ్ లాగా జరిగిపోయింది.

అప్పటినుండీ శ్రీ స్వామీజీ గ్రంథ ముద్రణ విభాగంలో నాకు ఒక పాత్ర కల్పించబడింది. అదీ నేటికీ సాగుతోంది. శ్రీ స్వామీజీ జీవితచరిత్ర అయిన ఈ గ్రంథం ముద్రణలో నాకూ భాగం లభించటం, ముద్రణ సమయంలో అనేకానేక అనుభవాలు నాకు కలగటం, అంతా స్వామీజీ కృపగా నేను భావిస్తున్నాను.

నా గురువు నిర్దేశం ప్రకారం నేను మరల స్వామీజీని కలిసాను అయన ప్రేమమూర్తిగా సాదరంగా నన్ను తన పనిలో నియమించుకున్నారు. నాకు నేడు నా గురువుకి, శ్రీ స్వామీజీకి భేదం కన్పించటంలేదు. "గురువులు అని ఉండరు. ఇందరిలో ఉండేది ఒకే వెలుగు. అదే జగద్గురువు" అన్న మా గురువుగారి ఉపదేశం నాకు శ్రీ స్వామీజీ విషయంలో మరోమారు ఋజువయింది.

1920 సంవత్సరంలో మా గురువుగారు బందరు వచ్చినప్పుడు, మంగినపూడి నగరేశ్వరస్వామి దేవస్థాన ధర్మకర్తలలో ఒకరైన శ్రీ .ఎం. .వి. శాస్త్రిగారు, మా అందరినీ మంగినపూడి తీసుకువెళ్ళి, దేవాలయాన్ని చూపించి, ఆ బాధ్యత మా సంస్థను స్వీకరించమని అడిగారు.

విశాలమైన ప్రాంగణం, సముద్రతీరం, స్వామి ఆలయం‌ ఇంతకన్నా కావలసింది ఏముంది? గురువుగారు సరే అంటే బాగుండునని నేను ఖలే సరదా పడ్డాను. కానీ మా

గురువుగారు ఏమీ మాట్లాడలేదు. తారిలో నాతో అన్నారు, "ఏ పనులు ఎవరు చేయాలో వాళ్ళే చేయాలి. అన్ని పనులూ అందరూ చేయకూడదు. ఈ ఆలయ బాధ్యత ఒక పీఠాధిపతి స్వీకరించవలసి ఉంది. ఇది మన పని కాదు " అని.

విచిత్రం కదా మరి! ఆ తరవాత ఎప్పుడో శ్రీ స్వామీజీ రావటం, ఆలయం చూడటం, ఆ బాధ్యతలు స్వీకరించటం, అది నేటికి దత్తరామేశ్వరంగా రూపుదిద్దుకొని, త్వరలో అంతర్జాతీయ యోగకేంద్రంగా కావాలని స్వామీజీ సంకల్పించటం జరిగింది. మరి మహాత్ముల శరీరాలు వేరైనా, బాటలు వేరైనా, సంప్రదాయాలు వేరైనా, లోక కళ్యాణ మహాయజ్ఞంలో వారంతా ఒకటే అనటానికి యింతకన్నా నిదర్శనం ఏముంది?

మొదటిగా శ్రీ స్వామీజీచేత నాకు అప్పగించబడ్డ పని 'దత్తదర్శనం' ద్వితీయ ముద్రణ. ముద్రణ పూర్తిఅయినాక నేను ఆ పుస్తకాలు తీసుకొని మైసూరు వెళ్తుండగా, మాండ్య దగ్గర నేను వెళ్తున్న బస్సు యాక్సిడెంట్ అయింది. నేను డ్రైవరు సీటు వెనక కూర్చున్నాను. బస్, లారీడ్రైవర్ల పరిస్థితి ప్రమాదకరం అయింది. మరి నేను స్వల్పగాయాలతో బయటపడ్డాను. శ్రీ స్వామీజీ నన్ను అనుక్షణం కాపాడుతూ ఉన్నారని, ఆయన కరుణాకటాక్ష వీక్షణం నాపై ప్రసరించిందని దీనికి నిదర్శనం కదా!

ఈ కొన్ని సంవత్సరాలలో శ్రీ స్వామీజీవల్ల, ఆయన ఆశీస్సులతో నేను ఎన్నో ప్రయోజనాలు పొందాను. ఆయన సేవాభాగ్యం లభించటం అన్నింటికీ మించిన భాగ్యంగా, నా సౌభాగ్యంగా నేను భావిస్తున్నాను.

శ్రీ స్వామీజీ సాక్షాత్ జగద్గురువు. త్రిమూర్తి రూపమైన దత్తాత్రేయ స్వరూపం. ఆయనలో అందరు దేవతలూ దర్శనమిస్తారు. అన్ని సిద్ధులు ఆయనను ఆశ్రయించుకొని ఉన్నాయి. అన్ని విభూతులు ఆయన నుండి పరిమళాలుగా గుబాళిస్తున్నాయి. ఆయన వీక్షణాలలో సూర్యచంద్రుల గమనాన్ని, ఆయన చిరుదరహాసంలో తారకల కాంతుల్ని, ఆయన గానమాధుర్యంలో గోపాలబాలుని మురళీరవాన్ని, ఆయన ప్రసంగాలలో బ్రహ్మర్షి వశిష్ఠుల వారి జ్ఞానామృతాన్ని, ఆయన శాసనంలో శ్రీరామచంద్రుని అమ్ముల పొదిలోని రామబాణాన్ని, ఆయన సాన్నిధ్యంలో సమస్త శుభాలను, పరమ ప్రశాంతిని మనం పొందగలం.

ఇక ఈ గ్రంథ రచన ప్రక్రియ గురించి రెండు విషయాలు.

ఇది కేవలం సాహిత్యపరంగానే గాక, యోగపరంగా కూడా ఒక అపూర్వమైన పద్ధతిలో సమన్వయింపబడి వ్రాయబడింది. ఇది ఒక రచయిత వ్రాశారు అనే దానికంటే, ఆ రచయిత ద్వారా వ్రాయబడింది అంటే చాలా బాగుంటుంది. ఒక దివ్యశక్తి ప్రేరణ తన ద్వారా ఒక మహత్కార్యానికి శ్రీకారం చుట్టింది అంటే మరి ఆ రచయిత ధన్యుడే!

ఈ గ్రంథం ముఖ్యంగా నాలుగు పాదాలుగా విభజించబడింది. 1. సాధనపాదం 2. సమాధి పాదం 3. కైవల్య పాదం 4. విభూతి పాదం. అయితే పతంజలి మహర్షి తన అష్టాంగ యోగంలో ఈ విభాగం మరోలా చేశారు.

ఈ గ్రంథం సాధన పాదంతో ప్రారంభించబడింది. స్వామీజీ తన మాతృమూర్తి అయిన జయలక్ష్మీమాతచే శక్తిపాత విధానంలో సమస్త సిద్ధులు తన చిన్నతనంలోనే పొందినప్పటికీ, అవి ఎక్కడా ఆయన అప్పట్లో బహిర్గతం చేయలేదు. యోగసాధనలో మొదటగా సాధకుడికి కొన్ని మహిమలు సంక్రమిస్తాయని, వాటిని చూసి మోనపో వద్దని పతంజలి మహర్షి హెచ్చరించడం జరిగింది. స్వామీజీ జీవిత చరిత్ర మనం చదివితే ఆయనను ఆశ్రయించే ఈ మహిమలు ఉన్నాయి కానీ, ఆయన తన చిన్నతనంలో కూడా ఈ మహిమల వెంట పడలేదని తెలుస్తుంది. ఈ సాధన పాదం అయ్యాక, శ్రీ స్వామీజీ యొక్క సమాధి స్థితి. ఈ స్థితిలో ఆయన అర్చనలు, ధ్యానాలు వివరంగా అందించబడ్డాయి. ఈ సమాధి పాదం అయ్యాక కైవల్య పాదం. పాదుకాదీక్ష మొదలైన అంశాలన్నీ ఈ పాదంలో వివరించబడ్డాయి. ఇక చివరిగా విభూతి పాదం. ఈ పాదంలో శ్రీ స్వామీజీ విశ్వరూపం మనం చూడగలం. సమస్త మానవాళి ఆయన అనుగ్రహంతో ఎలా తరిస్తుంది ? శ్రీ స్వామీజీ తన నాదంతో, తన యోగంతో, తన మహిమలతో, తన సాన్నిధ్యంతో ఎలా మానవజాతికి ఓ నూతన ఉత్తేజాన్ని, ఆరోగ్యాన్ని కలిగిస్తున్నారు ? వారి శారీరక, మానసిక రోగాలకు ఎలా స్వస్థత చేకూరుస్తున్నారు ? అవధూతగా భూమండల మంతా ప్రదక్షిణం చేస్తూ దత్త నాదాన్ని ఎలా వ్యాపింప చేస్తున్నారు అన్నది ఈ పాదంలో పాఠకులకు అందియ్యబడింది.

ఈ రచనా శైలి ఒక అపురూపమైన, అపూర్వమైన శైలి. అసలు ఒక మహాత్ముని జీవిత చరిత్ర దాదాపు 1400 పేజీల గ్రంథంగా రావటమే అపూర్వం. ఒక అధ్యాయం పూర్తికాగానే రెండో అధ్యాయంలో ఏముందో చదవాలి అనే తహతహ పాఠకుడిలో కలిగేలా 48 అధ్యాయాలు 1400 పేజీలలో వ్రాయటం, అదే పంథా చివరివరకూ సాగటం అంటే అది కేవలం శ్రీ స్వామీజీ అనుగ్రహమే ! ఇక చదివి తరించండి.

శ్రీ స్వామీజీ పాదారవిందాలకు ప్రణమిల్లుతూ
సి హెచ్. ఎస్. ఎన్. రాజు

# విషయ సూచిక



## సాధన పాదము

# సమాధి పాదము

# కైవల్య పాదము



# విభూతి పాదము

## నివాళి

శ్రీ గురు పద సంలబ్ధ్యా
భాగవతోదార హృదయ సువ్యక్తాః।
ఆగమ సారా అస్మ
ద్బుద్ధౌ దీవ్యన్తు సచ్చిదానందాః॥

అక్లుప్త మాల్యాని సుమాని సృష్ట్వా
విచిత్ర మాల్య గ్రథనోపపన్నం।
సౌదామికత్వం స్వపద ద్వయే మే
యచ్ఛన్త ముద్య త్కరుణం త మీడే॥

వేదాభిధానం శుభమందికావ్య
సృష్ట్యర్థ సారం స్వయ ముచ్ఛ్వసిత్వా।
అహోఽన్య కావ్య శ్రవణాను రక్తాం
దేవస్య బాలోక్తి రతిం సమీడే॥

ఏతావతీం సృష్టి ముదీర్య చిత్రాం
దత్త్వేంద్రియాళిం సుఖ జుష్టయే నః।
అథాంతరంగస్య సమాధి సిద్ధ్యై
గురుత్వ భాజం విభు మేక మీడే॥

అంతర్దృష్టి బలస్య యస్య కలనాత్ నేత్రద్వయం మామకం
శోభాం ప్రత్యణు సంగతాం మధురఝరీం పుష్పౌఘసక్తా మివ।
పాయంపాయ మధూ ద్విరేఫ మథ మాం చక్రే చ శోభాఽ ద్వయం
తన్మే యచ్ఛ విభో పరార్థ సుషమం త్వాం దేవ మీడే సదా॥

## నివాళి

శ్రీగురు పద లక్ష్యములై
భాగవతుల యెడద లందు వ్యక్తార్థములై
ధీగతి మాకున్ వెలుగుత
నాగమ సారములు సచ్చిదానందములై ॥

రకరకమ్ముల పూల మాలికలు గాక
వికిసి పూలను సృష్టి గావించి, మాకు
నెలమి మాలలు గ్రుచ్చి యర్పించుకొనెడు
భాగ్య మొసగిన నీకు నివాళి దేవ ॥

వేదమను నాది కావ్యమ్ము వెలయఁజేసి
సృష్టి సర్వార్థ మందు గుప్పించికూడ
ఇతర కావ్యాల విన నిచ్చగించు నీదు
బాలకాలాపరతికి నివాళి దేవ ॥

ఇంత విస్తృత సృష్టి గావించి—వివిధ
సుఖములను బుద్ధి నింద్రియ స్తోమ మిచ్చి
యింక నేకాగ్రతకు బుద్ధి నిచ్చుచు గురు
వరుడవై వచ్చు నీకు నివాళి దేవ ॥

ఏ లోచూపులుగల్గ నా నయనముల్ భృంగంబులై యొప్పి తా
మీ లోకంబున దాగి ప్రత్యణువునం దింపారు నీ యందముల్
పూలం దోగెడి తేనె సోనలటు రేపుల్ మాపులుం జుర్రి న
న్నా లావణ్యము గాగజేయు నవి యిమ్మా! దేవ! నివ్వాళియౌన్ ॥

## సమర్పణ

మాం లేఖినీకృత్య కరే స్వకే చి
దాత్మనా కృతి ర్యోఽ రచయత్ స్వగాథాః ।
జగత్తమోహాపన వైభవాయ
తస్మై ప్రబంధోస్తు సమర్పితోఽయమ్ ॥

యుష్మత్కృతి రేషా కృతి
రిత్యుక్తే తవ తు కించి దపకీర్తిః ।
వేద శ్వసితస్య స్యా
త్కింవా స్వామిన్ క్షమస్వ న మమేయమ్ ॥

ప్రవర్తమానే చ కథాప్రసారే
గాథా యథార్థేయ ముదీరితా యత్ ।
యతశ్చ నేతా రఘునాథ తుల్య
స్తతో జనిర్మే సఫలా నితాంతమ్ ॥

# సమర్పణ

తానై నన్నే కలముగ
పూనుచు తన కథల నిట్లు పొంగించిన చి
ద్భావాకృతి కఖిల తమో
హానాయతి కీ ప్రబంధ మర్పిత మగుతన్॥

వేదములే ఊరుపులౌ
నీదే యీ కావ్యమన్న నీ కవమానం
బో దేవా, ఔనేమో।
నాదిది మాత్రమ్ము కాదు నలుసంతైనన్॥

కథ జరుగుచుండగానే
కథ చెప్పిన భాగ్య మిట్లు కలుగుట వలనన్
కథయును రాముని బోలిన
పృథు కీర్తిది గురిని దాట ఈ జని పండెన్॥

# సద్గురు స్తవమ్

శ్రీగణేశాయ నమః శ్రీ సరస్వత్యై నమః శ్రీపాదవల్లభ
నరసింహ సరస్వతి శ్రీగురు దత్తాత్రేయాయ నమః

సిద్ధి బుద్ధి మహాయోగ వరణీయో గణాధిపః ।
యస్స్వయం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ 1

యస్య దత్తాత్రేయ భావో భక్తానా మాత్మ దానతః ।
సూచ్యతే సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 2

యోగా జ్జ్యోతి స్సముద్దీప్తం జయలక్ష్మీ నృసింహయోః ।
అద్వయం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 3

యోగవిద్యా చిత్రభానుం చిత్రభాను శరద్భవమ్।
జ్ఞానదం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 4

గణేశ హోమేఽర్కదినే నిత్యం శ్రీచక్ర పూజనే ।
దీక్షితం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 5

అగస్త్యముని సంక్రాంత నానావైద్య ధురంధరమ్ ।
భవఘ్నం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 6

వాద్యోదంచ ద్దివ్యనామ సంకీర్తన కళానిధిమ్ ।
నాదాబ్ధిం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 7

దత్త పీఠాధిపం ధర్మ రక్షణోపాయ బంధురమ్ ।
సత్కవిం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 8

విధూత భక్త సమ్మోహ మవధూతం జగద్గురుమ్ ।
స్వాశ్రయం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥ 9

సాధుత్వం భక్తి మైశ్వర్యం దానం యోగ మరోగతామ్ ।
సన్మతిం జ్ఞాన మానందం సద్గురు స్తవతో లభేత్ ॥ 10

# అష్టలక్ష్మీ స్తుతి

1. రథమధ్యా మశ్వపూర్వాం గజనాద ప్రబోధినీం ।
సామ్రాజ్య దాయినీం దేవీం గజలక్ష్మీం నమామ్యహమ్ ।

2. ధనమగ్ని ర్ధనం వాయుః ధనం భూతాని పంచ చ ।
ప్రభూతైశ్వర్య సంధాత్రీం ధనలక్ష్మీం నమామ్యహమ్ ।

3. పృథ్వీ గర్భ సముద్భిన్న నానావ్రీహి స్వరూపిణీం ।
పశుసంప త్స్వరూపాం చ ధాన్యలక్ష్మీం నమామ్యహమ్॥

4. న మాత్సర్యం న చ క్రోధో న భీతి ర్న చ భేదధీః ।
యద్భక్తానాం వినీతానాం ధైర్యలక్ష్మీం నమామ్యహమ్ ॥

5. పుత్రపౌత్ర స్వరూపేణ పశు భృత్యాత్మనా స్వయం ।
సంభవ న్తీం చ సంతానలక్ష్మీం దేవీం నమామ్యహమ్ ॥

6. నానావిజ్ఞాన సంధాత్రీం బుద్ధి శుద్ధి ప్రదాయినీం ।
అమృతత్వ ప్రదాత్రీం చ విద్యాలక్ష్మీం నమామ్యహమ్ ॥

7. నిత్యసౌభాగ్య సౌశీల్యం వరలక్ష్మీ ర్దదాతి యా ।
ప్రసన్నాం స్త్రైణ సులభాం ఆదిలక్ష్మీం నమామ్యహమ్ ॥

8. సర్వశక్తి స్వరూపాం చ సర్వసిద్ధి ప్రదాయినీం ।
సర్వేశ్వరీం శ్రీ విజయలక్ష్మీం దేవీం నమామ్యహమ్ ॥

9. అష్టలక్ష్మీ సమాహార స్వరూపాం తాం హరిప్రియాం ।
మోక్షలక్ష్మీం మహాలక్ష్మీం సర్వలక్ష్మీం నమామ్యహమ్ ॥

10. దారిద్ర్య దుఃఖ హరణం సమృద్ధి రపి సంపదాం ।
సచ్చిదానంద పూర్ణత్వం అష్టలక్ష్మీ స్తుతే ర్భవేత్ ॥

ఇతి శ్రీదత్త పీఠాధీశ్వర
శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద యతివర విరచితా
అష్టలక్ష్మీ స్తుతి స్సమాప్తా ॥

# శ్రీ దత్త స్తవము

1. దత్తాత్రేయం మహాత్మానం వరదం భక్తవత్సలం ।
ప్రపన్నార్తి హరం వందే స్మర్తృగామీ స నోవతు ॥

2. దీనబంధుం కృపాసింధుం సర్వకారణ కారణం
సర్వ రక్షాకరం వందే స్మర్తృగామీ స నోవతు ॥

3. శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణం ।
నారాయణం విభుం వందే స్మర్తృగామీ స నోవతు ॥

4. సర్వానర్థ హరం దేవం సర్వమంగళ మంగళం ।
సర్వక్లేశ హరం వందే స్మర్తృగామీ స నోవతు ॥

5. బ్రహ్మణ్యం ధర్మ తత్వజ్ఞం భక్త కీర్తి వివర్ధనం ।
భక్తాభీష్ట ప్రదం వందే స్మర్తృగామీ స నోవతు ॥

6. శోషణం పాప పంకస్య దీపనం జ్ఞాన తేజసః ।
తాప ప్రశమనం వందే స్మర్తృగామీ స నోవతు ॥

7. సర్వరోగ ప్రశమనం సర్వపీడా నివారణం ।
విపదుద్ధరణం వందే స్మర్తృగామీ స నోవతు ॥

8. జన్మ సంసార బంధఘ్నం స్వరూపానంద దాయకం ।
నిశ్శ్రేయస పదం వందే స్మర్తృగామీ స నోవతు ॥

9. జయలాభ యశః కామ దాతు ర్దత్తస్య యస్తవం ।
భోగ మోక్ష ప్రద స్యేమం ప్రపఠేత్ స కృతీ భవేత్ ॥

శ్రీ గణేశాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

శ్రీ పాదవల్లభ

నరసింహ సరస్వతి

శ్రీగురు

దత్తాత్రేయాయ నమః

శ్రీ గురుభ్యో నమః

జయ గురు దత్త

# 1 వ అధ్యాయం దీక్ష

*శ్రీ మాతృ దివ్యకరుణా*
*నర్తన రంగాయితాంత రంగోఽయమ్,*
*జయతి గురు రర్క గణపతి*
*దర్శిత సద్ధర్మమార్గ జంఘాలః ॥*

[ ఆయన హృదయం శ్రీమాత దివ్య కరుణకు నాట్యరంగమైంది. ఇక ఆయన అర్కగణపతి దర్శకత్వంలో ధర్మమార్గ ప్రబోధనకు యాత్రసాగించారు. అట్టి శ్రీ గురుదేవుల జయిస్తున్నారు. ]

అర్కగణపతిని చేతబట్టుకొని వీధిలోకి వచ్చిన సత్యనారాయణ కొద్ది దూరం వచ్చి, తను ఎక్కడున్నదీ, ఎటుపోతున్నదీ గమనించుకున్నాడు.

అతని మనస్సు ఎటో తేలిపోతున్నట్టు హాయిగా, ప్రశాంతంగా వుంది.

అర్ధరాత్రి, చిమ్మచీకటి. వాతావరణం చల్లగా వున్నది.

ఎలక్ట్రిసిటీ కాలనీకి వెళ్ళే దోవలో వున్నాడు తను. రోడ్డు కిరువైపులా చడీచప్పుడూ లేకుండావున్న యిళ్ళు, సమాధులలోవున్న ఋషికుమారులలాగా కనిపిస్తున్నాయి. వీధి లైట్ల వెలుతురులో, అలలు....అలలుగా కదులుతున్న నులిమంచు పొరలు ఎగసిన హోమ ధూమాలలాగా కనిపిస్తున్నాయి. గాలికి కదులుతున్న చెట్ల ఆకుల చప్పుళ్ళు సంకీర్తన నాదాలలాగా వినిపిస్తున్నాయి.

ఒక దివ్యమైన ఋషివాటికలో తాను నడుస్తున్నా ననిపిస్తోంది సత్యనారాయణకు. చేతిలోని జాజికాయ పెట్టెలో అర్కగణపతి వున్నాడు. ఏరు దాటుతున్న రైతు నెత్తిన ముద్దుల కొడుకు కూర్చున్నట్టుగా సత్యనారాయణ నెత్తిమీద ఆనందంగా కూర్చుని వున్నాడు ఆనంద గణపతి.

తనకు ముందు భాగములో తన్ను ఆవహించుకొని, ఒక వెలుగు వంటిదేదో కనిపిస్తోంది సత్యనారాయణకు. క్రమంగా ఆ వెలుగు ముందుకు సాగుతోంది. తనూ సాగిపోతున్నాడు. తను సాగటంలో తన ప్రయత్నమూ లేదు, నిరోధమూ లేదు.

అతనితో కలిసి ఆ వెలుగు ఎలక్ట్రిక్ కాలనీలో ప్రవేశించింది.

తలకు మించిన కడవలను నెత్తికెత్తుకొని ఆ కడవలు జెసిగి పోకుండా చేతులతో యిటూ అటూ అదిమిపట్టుకొని నిశ్చలంగా నిలబడిన దొమ్మరి ఆటగాళ్ళలాగా పెద్ద పెద్ద కరెంటు స్తంభాలు ఆకాశంలోకి పొడుచుకొని నిలుచునివున్నా యక్కడ. నెత్తిమీద అంత విద్యుచ్ఛక్తివున్నా వెలుగే లేని ఆ స్తంభాలను జాలిగా చూశాడు సత్యనారాయణ. వాటిచుట్టూ చీకటి ముసుగులో దిగులుగా పడివున్న విశాలమైన మైదానాన్ని పరికించి చూశాడు.

ఆ మైదానం పక్కగా ఒక సన్న తారురోడ్డు ఉంది. ఆ రోడ్డు నానుకొని యిళ్ళ వరుస వుంది. ఇరుకు బాటను వదలి మైదానంలో అడుగుపెట్టాడు సత్యనారాయణ. అతనితో పాటు ప్రవేశించిన వెలుగు విస్తరించి మైదానమంతా వ్యాపించింది. క్రమంగా ఆ వెలుగు మైదానాన్ని దాటి దారిలో వున్న పర్వతాల అడ్డుగోడల్ని దాటుకుంటూ నేల నాలుగు చెరగులకు వ్యాపించసాగింది.

ఆ వెలుగు అంచులు ఎక్కడిదాకా పాకినాయో తెలియటంలేదు. ఇప్పుడు సత్యనారాయణ ముందుకు సాగుతున్నాడు. వెలుగు కదులుతున్నట్లే కనిపించటంలేదు.

ఆ మైదానానికి అడ్డంపడి నడిచిన సత్యనారాయణ అవతల యిరుకు రోడ్డుకు చేరి, దాన్నిగూడ దాటి, ఒక యింటి ముందు నిలబడ్డాడు.

తలుపు కొట్టబోయి చటుక్కున ఆగిపోయాడు. అతని దృష్టి ఆ యింటి మండిగం మధ్యలో మెరుస్తున్న రాతిముక్కమీద నిలిచింది. అతను చటుక్కున వంగి ఆ రాతిని చేతుల్లోకి తీసుకొని ఆదరంగా కళ్ళ కద్దుకొంటూ "అమ్మా! వచ్చాడు....చింతామణి గణపతి మళ్ళీ వచ్చాడు" అంటూ కళ్ళు మూసికొని నిలబడిపోయాడు. అతని మనస్సు ఆనందపరవశమై ఏవేవో పురాతన, పవిత్ర మధుర స్మృతులను నెమరువేసుకోసాగింది........

* * *

# దర్శనము

........అది 1952. నందన సంవత్సరం. సత్యనారాయణకు పదకొండో యేడు ప్రవేశించింది. అప్పు డతని వాడుక పేరు సత్యం.

ఆ యేడు అమ్మ మళ్లీ గర్భవతి అయింది. ఈ మాటు గర్భవతి అయిన దగ్గరనుంచీ అమ్మ ప్రబోధం అంతా కాలతత్వం మీద ఆధారపడి సాగుతోంది.

గ్రహగోళాల చలనాలమీద ఆధారపడిన కాలమేమిటి, ఖండకాలమేమిటి, అఖండ కాలమేమిటి, మహాకాలమేమిటి అని ప్రారంభించి కాలశబ్దపు సూక్ష్మ నిర్వచనాలు వివరించ సాగింది క్రమంగా. తరువాత కాలతత్వమూ, పరమేశ్వరుడూ అభిన్నమని వివరిస్తూ మహాకాల, మహాకాళీ తత్వాలకు సమన్వయించి చూపింది. ఈ కాలతత్వాన్ని వివరిస్తూ అంతకు ముందు సూక్ష్మంగా చెప్పివున్న జ్యోతిషశాస్త్రాన్ని తత్వశాస్త్రంతో సమన్వయించింది.

పరమ పురుషుని సంకల్ప సంక్షోభమే కాలమన్నది ఒకరోజున. బాగా అర్థంకాలేదు ఆ మాట. అక్కడి నుంచి ప్రకృతి పురుష తత్వాల వివరణ అరంభమైనది. ఆ వివరణ, సరాసరి ఉపనిషద్విద్యలోకి ప్రవేశించింది. ఇలా ఉపనిషద్విద్యలోకి ప్రవేశించి ముందుకు సాగుతున్న కొద్దీ క్రిందటి యేడల్లా అమ్మ పేరబెడుతూవున్న చిక్కు ముళ్ళు, ఒకటొకటిగా వాటంతటవే విడిపోసాగాయి.

అమ్మ చెప్పేది తక్కువే. సూత్రాలు చెప్పినట్టు చెపుతుంది. ఎప్పుడో తప్ప వివరణ యివ్వదు. చెప్పి మౌనంగా కూర్చుంటుంది. ఆమె యెంతసేపు కూర్చుంటే అంతసేపు ధ్యాన నిమీలిత నేత్రుడై నిశ్చలంగా కూర్చుంటాడు సత్యం.

ధ్యానంలో కూర్చున్న సత్యానికి అంతరంగంలోనే చర్చ జరుగుతుంది. వివరణ లభిస్తుంది. సందేహాలు తీరుతాయి. విషయం అనుభవానికి వస్తుంది. సత్యం ఏకసంథగ్రాహి. అమ్మ చెప్పిన మంత్రమో, వాక్యమో మరచిపోయి మళ్ళీ చెప్పించుకొన్న సందర్భం యీ అయిదారేళ్ళలోనూ జరగలేదు.

ఒకరోజున అమ్మ ఏ బోధా చెయ్యలేదు. అలాంటి రోజున మననమే అతని కర్తవ్యం. ఒకరోజు అర్ధరాత్రి ఒంటిగంటకే నిద్రలేచి, మంచంమీద పడుకునే మననం సాగించాడు. ఆ రోజు మననమంతా **"నేనెవరు"** అనే ప్రశ్నమీదే సాగుతోంది. పరిష్కారం దొరకటం లేదు సరిగదా, ప్రశ్నలు పెరుగుతున్నాయి.

ఆ కొట్టుమిట్టాటలో సత్యం మనస్సు తన జన్మ ఘట్టం మీద లగ్నమయింది క్రమంగా.

" అపుడు నా మెడలో బంగారు తీగతో చుట్టిన రుద్రాక్షమాల, సాలగ్రామాల మాల వున్నాయంది అమ్మ. అంటే అవి నా శరీరం కన్న వేరుగా వున్నాయిగా! పైగా ఆ తీగ లోహమయం.

"ఇప్పుడు నాశరీరం పెరిగింది. కంఠం లావయింది. ఆ మాలలు అలాగే నా మెడలో వుండివుంటే, అవి గూడ పెరిగి పెద్దవయివుండేవా ?

" మరి లోహం నిశ్చేతనం గదా ! అదెలా పెరుగుతుంది ? పెరక్కపోతే అవి నా మెడకు ఉరేనా ?"

" అదలావుంచు. స్వర్ణలోహం నిశ్చేతనమే. మరయితే ఈ శరీరం జడవస్తువుకదా ! ఇదెట్లా పెరుగుతుంది ?"

" అసలు పెరగటమంటే ఏమిటి ? "

అంతరంగంలో చర్చ యీ ఘట్టంలో నిలబడి ప్రాణం గిలగిల లాడుతోంది.

" నేను పెరిగాను "

" పెరగటమంటే ఏమిటి "

" అది ఒకరకమైన మార్పు."

" మార్పు అంటే ? "

" ఒక రూపం పోయి మరోరూపం కనిపించటం."

" నిన్న మా యింటి గడపల్లో ఒక నాపరాయి వుంది. ఇవాళ్ళ ఒక కొండ రాయి వుంది. నాపరాయి, కొండరాయిగా మారిందా ? "

" ఛీ, ఛీ, నాపరాయి పగిలిపోతే, కొత్త కొండరాయి వేశారు. దానికీ దీనికీ సంబంధం లేదు."

" అంటే నాపరాయి నశించింది. కొత్తగా కొండరాయి వచ్చింది. ఇది మార్పు కాదన్న మాటేగా ? "

" ఇది మార్పు కాదు. ఒకే వస్తువులో, కొంతభాగం యథాతథంగా మిగిలిపోయి కొంతభాగమే రూపాంతరం చెందాలి. అప్పుడే మార్పంటారు."

"అంటే నువ్వు చెప్పిన దాన్ని బట్టి, మార్పు చెందే వస్తువులో రెండు భాగాలుంటాయని తోస్తోంది. స్థిరంగా ఉండే భాగం వొకటి, మారే భాగం వొకటి. అంతేనా ?"

"అంతే"

"అయితే యితర వస్తువుల మాట మనకెందుకు. ఇప్పుడు పెరిగింది_అంటే మార్పు చెందింది నువ్వుగదా ! అంటే నీలో నీకె రెండు భాగాలున్నా యన్నమాట ! అంతేనా ?"

"అదెలా కుదురుతుంది ? ఏదో చిక్కు తెచ్చిపెట్టావే."

"చిక్కేముంది. నీలో చాలా భాగాలు ఉన్నాయిగా ! కాళ్ళూ, చేతులూ, తలా, వగైరా, వగైరా"

"మరీ అంత ఎక్కిరించకు. నా శరీరానికీ, నాకూ సంబంధమేమిటి ? గాఢ సుషుప్తిలో నాకు నేను కనిపిస్తూనే ఉన్నాను గదా ! నాలో భాగాలు లేవు."

"అయితే నీ శరీరం పెరుగుతోందన్న మాట, పెరగనీ."

"శరీరం జడం కదుటయ్యా ! అదెల్లా పెరుగుతుందీ ?"

"నీలో భాగాలు లేవు కనుక, నీకు మార్పు లేదు. జడం కనుక శరీరం పెరగదు. మరి పెరిగినట్టు కనిపిస్తోంది కదా ! దీన్నేమనాలి ?"

సమస్య మరింత చిక్కుపడింది. పరిష్కరించాలనే పట్టుదల పెచ్చు పెరిగింది. ఈ రెంటికీ పోరాటం విస్రవీగుతున్న కొద్దీ సత్యం గొంతుకు ఉరిబిగిసినట్లే ప్రాణాలు గిలగిల్లాడు తున్నాయి.

"ఓహో, ఏదో అయింది. గొంతు చుట్టూ నిజంగానే యేదో బిగుసుకుంటోంది."

ఇహలోకంలోకి ఒకసారిగా దూకిన సత్యం మెడచుట్టూ తడిమి చూచుకొన్నాడు చేత్తో. "అరె, సాలగ్రామమాల! రుద్రాక్షమాల !" అని ఆశ్చర్యం బయటుకు వ్యక్తం చెయ్య బోయాడు.

మాట పెగలలేదు.

గొంతు పూడుకుపోయింది.

తెల్లగా తెల్లవారింది. సత్యానికి మంచంమీదనించి లేచే శక్తిలేదు. లేవవేమిరా అని కేక వేసి దగ్గరకొచ్చిన తండ్రి, పిల్లవాడి వాలకం చూసి నాడి చూశాడు. ఒళ్ళంతా పరిశీలించాడు. కెవ్వున కేక పెట్టాడు—

"గండమాలలురా" అని.

ఇంట్లో గోల ప్రారంభమైంది. గండమాలలంటే సామాన్యమైన వ్యాధికాదు. దాని అసలు పేరు కంఠమాల. కంఠంలో ఉన్న గ్రంధులు వాచి, ఒక మాలికలా ఏర్పడి స్వరపేటిక మూసుకుపోతుంది.

ఆ రోజుల్లో దానికి వైద్యంలేదు. అది వస్తే యిక రోజులు లెక్కపెట్టుకోవటం కన్నా గత్యంతరంలేదు.

శోకమూర్తి అయిపోయాడు తండ్రి నరసింహశాస్త్రి.

కొడుకు బ్రతికితే రామగిరిలో నరసింహస్వామి పేర చెవులకు "మీది పోగులు" వేయిస్తానని మొక్కుకున్నా డాయన. అంతకన్నా చెయ్యగలిగింది లేదు.

ఆ సమయానికి దొడ్లో తులసి పూజ చేస్తోంది అమ్మ. భర్త గోల ఆవిడ చెవిన పడ్డది. తులసి తల్లికి నీళ్ళుపోస్తూ "కంఠమాలల్ని స్మరించావా? అక్కరలేని పని. సరేలే, వెళ్ళి ద్వాదశ మహానదుల్లో స్నానాలు చేసిరా" అనుకొన్నది తనలో తనే.

సత్యం సంకల్పం నిలబెట్టి, ప్రాణం కదిలించసాగాడు. క్రమంగా నాడులు, చక్రాలు స్వాధీనమై లింగశరీరం విడివడి యివతలకు వచ్చి నుంచుంది. స్థూలశరీరం నొమ్మసిల్లి పడివుంది.

నరసింహశాస్త్రిగారు పిల్లవాడి నాడి చూశారంటే గోలవుతుంది. అందుకని "కదల కుండా జపం చెయ్యండి, పిల్లవాడకోసం" అన్నది అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

"అదే మంచిది. ఏడిస్తే ఏంవస్తుంది" అని మడికట్టుకున్నాడు శాస్త్రిగారు.

భరతఖండానికి ప్రదక్షిణం చేస్తూ పన్నెండు నదులలో స్నానం పూర్తి చేసుకు వచ్చేసరికి దాదాపు ఇరవైనాలుగు గంటలు పట్టింది సత్యానికి.

లింగశరీరం తిరిగి స్థూల శరీరంలో ప్రవేశించే సరికి గండ మాలలు హరించుకు పోయాయి హఠాత్తుగా.

రామగిరిస్వామి అనుగ్రహించాడనీ, తన జపం ఫలించిందనీ పొంగిపోయాడు నరసింహశాస్త్రిగారు. కొద్దిరోజుల్లోనే కొడుకును రామగిరి తీసుకువెళ్ళి రెండు చెవులకు పెద్ద రాగి పోగులు వేయించాడు.

ఆ తరువాత కొన్నాళ్ళకు అమ్మ దీన్ని ప్రస్తావిస్తూ—'లేని మార్పును తనకు తగిలించుకోవటమే జీవుడి ప్రాణాలకు తెస్తోంది. అనాదిగా మార్పే మాయ. దాన్ని గురించి కాదు ఆలోచించాల్సింది. నీకు అది దగ్గరిది కాదు. నీకు నువ్వే దగ్గరవాడవు. నీ గురించే నువ్వు ఆలోచించుకో. నిన్ను నీవు తెలుసుకో. అదే మార్గం' అన్నది.

ఈ సూత్రం మీద కొన్ని వారాల నిరంతర మధనం జరిగింది సత్యానికి. "అమ్మా, నువ్వు చెప్పింది నిజం. తత్వంలో పరిణామ మనే ప్రశ్నయే లేదు. ఉన్నదంతా వివర్తమే. కాని, ఆ వివర్తానికి ఆధారమైన నా స్వరూపం భాసించటం లేదు" అన్నాడు, అమ్మతో. "పోనీలే, వాయుస్తంభనకి అంకురార్పణం అయిందిగా" అంది ఆమె మాట మారుస్తూ.

"మరి నా మాట ?" అన్నాడు సత్యం. ఆ విషయం తేలకపోతే అతని ప్రాణాలకు విశ్రాంతి లేదు. ఆ తపనకు అవధులు లేవు.

కాని అమ్మకేమీ దయ కలిగినట్లు లేదు.

"ఇంకా మధన జరగాలి" అని వూరుకొన్నది.

అమ్మకు నెలలు ముదురుతున్నాయి. ఈ మాటు అలసట ఎక్కువగా ఉంటోంది. 1953 ప్రవేశించింది. పురుడు పొయ్యటానికి వెంకమ్మత్త వచ్చింది. ఆవిడ కాషాయ వస్త్రాలు చూసి, సరస్వతికి కొత్తయి, దగ్గరకు వెళ్ళటానికి భయపడింది. కాని అమ్మ మెల్లిగా దాన్ని అత్తకు అలవాటు చేసింది.

సహజంగా మితభాషి అయిన అత్త ఈ మాటు అమ్మతో కొంచెం ఎక్కువ సేపు మాట్లాడుతోందేమో అనిపించింది సత్యానికి. తను విన్నప్పుడల్లా మాత్రం వాళ్ళు లోకాభి రామాయణమే మాట్లాడుకున్నారు.

నందన సంవత్సరపు శివరాత్రి వచ్చింది. మంచి పర్వాలు వస్తే నాన్నకు ఇంట్లో ఉండే తీరిక ఉండదు. అప్పుడే ఆయనకు నాలుగు రాళ్ళు దొరికేది.

వెంకమ్మత్తకు మాత్రం శివరాత్రి చాలా ప్రధానం. ఆనాడు మౌనం, నిష్ఠ, జపం తప్ప మరో ధోరణి పెట్టుకోదు. ఆవిడ అరుణాచలేశ్వర భక్తురాలు గదా !

అమ్మకు ప్రతిరోజూ పర్వమే. శివరాత్రికి ప్రత్యేకత ఏమీలేదు. ఆ రోజు మాత్రం "నేను మాత్రం సంగమేశ్వరస్వామి భక్తురాల్ని కాదా ఏమిటి? నాకూ శివరాత్రి ముఖ్యమే" అని ఆడపడుచుతో పోటీ పెట్టుకొని తనుకూడ ఉపవాసం ఉంటానంది. కాని వెంకమ్మత్త బతిమాలి రెండు పూటలా రొట్టెచేసి పెట్టింది.

రాత్రి అయింది. పిల్లలంతా పడుకున్నారు. అత్త వంటింట్లో మరం వేసుకొని కళ్ళు మూసుకొని వళ్ళు తెలియకుండా కూర్చుంది.

అమ్మ మంచం మీద పడుకుంది. పక్కనే చాపమీద పడుకున్న సత్యానికి ఆ రోజు, ఒళ్ళంతా తేలిపోతున్నట్లు అదో రకంగా ఉంది. ఏ ఆలోచనా సాగటం లేదు. ఈ స్థితి ఏమిటో అర్థం కావటం లేదు.

"నేనెవరు" అనే ప్రశ్న తేలక ఆ చింతన ఎక్కువై మనస్సు మొద్దుబారుతుందో ఏమో అనుకున్నాడు తను.

అర్ధరాత్రి దగ్గర పడుతోంది. లింగోద్భవ కాలం సమీపిస్తోంది.

అతను అమ్మ వంక చూశాడు. ఎందుకు చూశాడో తనకే తెలియదు. అమ్మ ముఖం ఎన్నడూ లేనంత గంభీరంగా ఉంది. ఆ గాంభీర్యం చూసి, పూర్తి ఏకాగ్రత వచ్చి సిద్ధంగా ఉన్నాడు, అమ్మ ఏమయినా చెపుతుందేమోనని.

అమ్మ మంచం మీదినించి లేచింది. మౌనంగా అతను గూడ లేచి చాపమీద కూర్చుని చూస్తున్నాడు, నిశ్చలంగా.

అమ్మ తనవంక చూడటం లేదు. నిలబడి నిదానంగా వాకిట్లోకి నడిచింది. అతి నిదానంగా మౌనంగా అనుసరించాడు సత్యం.

ఎన్నడూ లేనిది అమ్మ ఆంజనేయస్వామి గుళ్ళోకి నడిచింది. వెంట నడిచాడు సత్యం. అమ్మ దేవుడి వంక చూడలేదు. దణ్ణం పెట్టలేదు. సరాసరి గర్భగుడి వాకిలి దగ్గర కెళ్ళి కళ్ళు మూసుకొని ఒక ప్రక్క నిలబడి పోయింది.

"ఈ స్వామి శివుడి అవతారం. ఇది సరిగా లింగోద్భవకాలం" అనుకొని తలుపు సందులలోంచి స్వామిని చూసి సాష్టాంగ దండప్రణామం చేశాడు సత్యం.

అది అమ్మ పాదాలకు గూడ వందనమైంది. లేచి నిలబడుతున్నాడు సత్యం. అమ్మ తన కుడిచెయ్యి ముందుకు చాచింది. అమ్మ అరచెయ్యి అతని నడినెత్తిని సూటిగా వొత్తుకుంది.

ఒక్క క్షణం వొళ్ళు తెలియలేదతనికి ! ఆ క్షణంలో ఏవో దుర్భర మహాజలపాత పరంపరలు, తనలో దూకి నిలిచిపోయినట్లనిపించింది.

అతనలా పారవశ్యానికీ, బహిర్ముఖతకీ, మధ్య ఉయ్యాల లూగుతూ వున్న తరుణంలోనే అనేక మంత్రాలు ఉచ్చరింపజేసింది అమ్మ. అప్పుడు మెల్లిగా కూర్చుని గోడకు జారగిలబడింది.

కొద్ది క్షణాలు మౌనంగా వుండి తన అంతర్ధారణలో అమ్మ ఉపదేశాలన్నీ సుస్థిరం చేసుకున్నాడు సత్యం.

ఏదో ఒక అనిర్వచనీయమైన దివ్యశక్తి తనలో ప్రవేశించి ప్రచండ శివతాండవం చేస్తోంది. ఆ తాండవంవల్ల యావత్ప్రపంచమూ ఆనంద సుందరంగా, ఆమోద మేదురంగా భాసిస్తోంది.

ఝంపా ప్రకంపిత బ్రహ్మాండయై దూకిన దివ్యగంగ పరమేశ్వరుడి ముడి పాయలలో ఒరిగిపోయినట్లు, తను ప్రవేశపెట్టిన దివ్యశక్తి అతనిలో ఇమిడిపోతోందని గ్రహించింది అమ్మ.

"కరపాత్ర యతీంద్రులు తమ దండ స్పర్శతో అనుగ్రహించిన శ్రీ విద్యా సర్వస్వాన్నీ నీకు అందించాను " అన్నది తన ఆనందం లోలోనే దాచుకుంటూ. మరొక్కసారి వందనం చేశాడు పుత్రుడు.

" చాలా సందేహాలు పరిష్కారమై పోయినాయి " అన్నాడు జంకు జంకుగా.

" మిగిలిన వేమిటో కొన్ని చెప్పు " అన్నది అమ్మ. ఒక పది పదిహేను ప్రశ్నలు వేశాడతను.

" వీటన్నిటికి పునాది ఒకటే " అంది అమ్మ.

" ఔను, నేనెవరు, నేనెవరు, నేనెవరు ? యిదే పునాది. ఇదే నా దిగులు. ఇదే నా ఆధి. నాకిప్పుడే ఆనందమూ తృప్తి నివ్వటంలేదు. అమ్మా ! నువ్వు పూర్ణంగా అనుగ్రహించు. "

సత్యం కళ్ళ వెంట అశ్రువులు ధారలై ప్రవహించినై. అతను తన శిరస్సు అమ్మ పాదాల మీద వుంచాడు, విహ్వలుడై.

ఆప్యాయంగా లేవదీసి కళ్ళు తుడిచింది అమ్మ. " నాన్నా ! నాకు రెండు కారణాల వల్ల ఆనందంగా వుంది. ఒకటి, నాశక్తి ప్రసరణ నీలో సుఖంగా జీర్ణమయిపోయింది. రెండు,

ఈ ఆనందానికి నీవు సమ్మోహపడి పోలేదు. భాగ్యశాలివి నువ్వు. చిరంజీవ" అని కొంచెం ఆగింది.

తనకు రావలసిన సమాధానం యింకా రాలేదు. శ్రద్ధగా ఎదురు చూస్తున్నాడు సత్యనారాయణ.

ఒకక్షణం ఆగి పలుక సాగింది అమ్మ, ఈ మాటు ఆ గొంతు ఆమెది కాదు. ఎవరిదో!

"నాన్నా నువ్వెవరివో నేను నీకు చెప్పను. చెయ్యవలసిన మహా వాక్యాలు ఉపదేశం చేశాను. అనుభవం నీ అంతట నీకు రావాలి. దానికి పుణ్యమయిమైన పూర్వ సంస్కారమూ, విశుద్ధమైన స్మృతీ వుండాలి. ఆ రెండూ నీకు నే నను గ్రహిస్తాను. నీ వెవ్వరవో నువ్వే తెలుసుకుందువు గాని."

సుఖాసనంలో గోడనానుకొని కూర్చుని, ఉపదేశిస్తున్న తల్లివంక తదేకంగా చూస్తూ నిశ్చల మనస్కుడై ఏకాగ్రంగా వింటున్నాడు సత్యనారాయణ.

క్రమంగా, అమ్మ తలమీద నానామణి ఘృణి దేదీప్యమానమైన సువర్ణ కిరీటం మిలమిలలాడసాగింది. ఇదేమా అనుకునే లోపల, ఆ కిరీటాగ్రాన సాంద్ర సుధాస్యంద బంధుర మైన చంద్రలేఖ తళతళ లాడసాగింది.

ఆ గుడెగోడలు, కప్పు కనిపించటం లేదు. క్షణాలలో అమ్మ ఆకారం ఆకాశాన్ని మించి ఎదుగుతోంది. అమ్మకు ఒకింత తక్కువగా తనూ ఎదుగుతున్నాడు.

నివ్వెరపోయిన సత్యం కళ్ళు క్రమంగా క్రిందికి దిగసాగాయి.

అమ్మ నుదుటి మీద మూడు విభూతి రేఖలు వున్నాయి. వాటి నట్ట నడుమ నిట్ట నిలువుగా, మూడవ కన్నొకటి కలకలలాడుతోంది. ఆ కంటి కడుగున ఇటూ, అటూ జంట పొదరిళ్ళ చూర్లలాగా, రెండు కనుబొమ్మలు కొనలు సాగివున్నాయి. చూరుల క్రింద మణి దీపాలలాగ అమ్మ కళ్ళు జిగేలు మంటున్నాయి. ఆ కళ్ళు యిటు చూసినా, అటు చూసినా హ్రీంకారాలే కనిపించాలని అమ్మ చెవులనే నెపాన హ్రీంకారద్వయాన్ని స్థాపించాడు కాబోలు విధాత. ఆ హ్రీంకార శిల్పాలు స్పష్టంగా కనిపించేందుకు దుద్దులనే పేరుతో దీపాలు పెట్టాడు కాబోలక్కడ.

మూడు కళ్ళ త్రిపుటీ సంగమంలోంచి, ఓంకారపు తుండంలాగా అమ్మ నునుముక్కు క్రిందికి జారుతోంది. అమ్మ తలపూవైన అమృత శిరఃసుధి చంద్రికా గనబిందువులు, ఆ తుండాగ్రాన నిలచి పేరుకొన్నాయి గాబోలు, ముక్కెరల్లే తళుక్కు మంటున్నాయి.

ఆ ముక్కెర జిలుగులను మరింత విరజిమ్మి దిక్కుల ననుగ్రహించాలని గాబోలు అమ్మ తన నునులేత బుగ్గలను అద్దాలుగా ఇరుప్రక్కలా సరిదిద్దుకొంది.

ఆకాశపు పై అంచులను దాటివున్న, అమ్మ కిరీటానికి చాలా దిగువన సూర్యుడు ఉదయిస్తున్నాడా ? కాదు, కాదు అది అమ్మ అందాల పెదవుల వెలుగు.

కొత్తదనపు బెరుకులు వదలక, అమ్మకూ నాన్నకూ మధ్య దూరి, నిక్కిచూసి పలకరించే ముద్దుకూనల లాగా, తెల్లని పళ్ళ కొసల కాంతు లా పెదవులను నెట్టుకొని తొంగి చూస్తున్నై. ఈ సందు చూసుకొని అమ్మ కరుణ మందహాసమై పొంగుకొని వస్తోంది.

ఆ దిగువన చందన చర్చితమైన అమ్మ కంఠప్రదేశం ప్రకాశిస్తోంది, తన కిటూ అటూ, రత్నాలసరులు, పుష్పాలమాలలు బరాబరులు చేస్తుండగా.

అమ్మకు నాలుగు చేతు లున్నాయి. అందులో రెండు చేతులు కుడి ఎడమలలో పైకి నిలబెట్టుకొంది. ఆ చేతుల్లో పాశమూ అంకుశమూ వున్నాయి. మరో ఎడమ చేతిలో పచ్చని చెఱకుగడ ఆకులతో రెపరెపలాడుతోంది. మిగిలిన కుడిచేతితో బొటనవ్రేలి మొదట్లో ఒక విచ్చిన కమలాన్ని ఒడిసి పట్టుకొంటూనే, అభయముద్రను చూపిస్తోంది. కెందామర కింజల్కాలలో ఇరికిన చెంగల్వలాగా వుంది అమ్మ అరచేతిలో వొదిగిన ఆ లీలారవిందం.

సువర్ణస్తంభాలకు రత్నలతలు అల్లుకొన్నట్లుగా నాలుగు దండకడియాలు అమ్మ చేతుల రవిక జరీ అంచుల మీదికి ఎగబాకినై.

అమ్మ కట్టుకొన్న ఆకుపచ్చని జరీ చీరకు ఉన్న జానెడు, జానెడు జరీ అంచులు మెడలోని పూలమాలల సందులలో మెరుగు లీనుతున్నాయి.

నవరత్న ఖచిత సువర్ణమయ శ్రీమత్సింహాసనేశ్వరియై అమ్మ ఠీవిగా కూర్చొని వున్నది. అమ్మ చీరకుచ్చెళ్ళ వెంబడి సవదరించిన బంగరు పద్మాలు మెట్లుగా క్రిందికి దిగినై సత్యం చూపులు.

హరి హర బ్రహ్మాది వందనీయాలైన అమ్మపాదాలు అక్కడ దేదీప్యమానంగా తేజరిల్లు తున్నాయి, త్రిజగన్మనోహర సువర్ణ కమలాల జంటలాగా. ఆ కమలాల చుట్టూ హంసల సహస్రాలావరించి వున్నాయి, సూక్ష్మరూపంలో.

సత్యం అమ్మ అడుగు దమ్ములకు మనస్సుతో ముమ్మారు ప్రదక్షించాడు. అటుపై పాదాది కిరీట పర్యంతంగా కిరీటాది పాద పర్యంతంగా, అమ్మ సౌందర్యలహరిలో పలుమార్లు

ఓలలాడాడు. ఓలలాడి ఆడి చివరకు అమ్మ చరణాల నాశ్రయించిన హంసల దండులో తనూ ఒక హంసై తనలో తనే కరిగిపోయాడు.

ఆ కరిగిపోయిన స్థితిలో ఎంతకాలం కరిగి పోయిందో అతనికి ఎరుక లేదు.

కరిగిపోయిన తను మళ్ళీ పేరుకొనేసరికి జగన్మాత రూపం అలాగే వుంది కాని ఆ పరిమాణం తరిగింది. ఇప్పుడు ఆ రూపం ఆ చిన్న గుడిలో ఒదిగివుంది. తను బాలు డయి పోయాడు.

గుడిగోడలు, కప్పు కనిపిస్తున్నాయి. అమ్మ రత్న సింహాసనంలో చిరునవ్వులు చిందిస్తోంది.

చాలసేపుగా, నిస్సంకల్పమై నిశ్చలంగా బిగిసి మొద్దు బారివున్న అతని మనస్సులో యేదో ఒక అవ్యక్త మనోహరమైన సంకల్ప సంచలనం బయలుదేరింది.

ఫలితంగా 'అమ్మా' అన్నాడు అతను. కాని ఆ అక్షరాలను పూర్తిగా వెలువడ నీయనే లేదు, కళ్ళల్లో కమ్మిన ఆనందాశ్రువులు, గొంతికలో కొసరిన డగ్గుత్తిక.

అమ్మ నవ్వు మరింత సెలవులకు పారింది. అమ్మ కళ్ళు రవ్వంత సన్నపడి, కదలిన్నై. అమ్మ బుగ్గ లోకింత తృప్తిపడిన్నై.

అతని మానసహంస తన రెక్కలను, బారలకన్న పెద్దచేసి, అల్లల్లాడించి ఆకాశపు అంచులకు ఎగిరి దిగివచ్చింది.

ఆ దిగివచ్చేటప్పుడు, అది అప్రయత్నంగా అనాహత ప్రణవనాదాలను విశృంఖలంగా, విజృంభింప చేసింది. ఆ అఖండ నాదాలు ఆ ఇరుకు గుడిలో బీజాక్షరాలుగా ప్రతిధ్వనించిన్నై.

నవవసంతపికశాబకకలకూజిత నాదాలవలె పునః పునరావర్తమానాలైన ఆ ధ్వని ప్రతిధ్వనులు క్రమక్రమంగా శమించి శమించి ధ్యానమయ శ్లోకంగా పరిణమించిన్నై.

స్ఫురతి యత్తవ రూప మనుత్తమం
జయతి యచ్చ జగన్మయ మంబికే!
ఉభయ మేత దనుస్మరతాం సతాం
అభయదా వరదా భవతీ సదా॥

( తా॥ అమ్మా ! ఉత్తమోత్తమమైన నీ రూపం ఒకటి కనిపిస్తోంది. సమస్త జగన్మయమైన మరోరూపం గూడ కనిపిస్తోంది. సన్మార్గవర్తనులై నీ యీ రూపాలను రెంటినీ నిరంతరంగా ధ్యానించేవారికి భయాలను పోగొట్టి వరాలిస్తావు నువ్వు. )

అప్పటికి మనసు పూర్తిగా శాంతించింది. ఇప్పుడు హృదయానికి ఏ ఉద్వేగమూ లేదు. ఆ నిర్మల స్థితిలో ఉండగా, మూలపుటమ్మ, మానవియైన అమ్మగా మారింది క్రమక్రమంగా, మెట్టు మెట్టుగా.

అప్పటికి బ్రాహ్మీ ముహూర్తం ప్రవేశించింది.

పాలేళ్ళు నిద్ర లేచే సమయమైంది.

తల్లీ కొడుకులు యింట్లోకి వచ్చేశారు.

ఒక నలభై రోజులు నిశ్శబ్దంగా పరుగెత్తినాయి. ఈ నలభై రోజులూ, అమ్మ, కొడుకు, అత్త ఎవరికి వారే దాదాపు మౌనవ్రతంగా బిగుసుకుపోయారు. సత్యం అల్లరే కాదు, ఆటలుగూడ తగ్గిపోయాయి.

ఈ రోజుల్లోనే నందన సంవత్సరం వెళ్ళిపోయి విజయ సంవత్సరం ప్రవేశించింది. శ్రీరామనరాత్రులు మొదలైనాయి.

మండల దీక్ష పూర్తయింది.

శ్రీరామనవమి రేపనగా అమ్మకు పురుడు వచ్చింది. పండంటి మొగబిడ్డ పుట్టాడు. రాముడు పుట్టాడని గంతులేశాడు శాస్త్రిగారు.

సత్యం ఆటలు మళ్ళీ పెరిగినై.

పదకొండో రోజు బారసాల చేశారు. కోదండరాముడు అని పేరు పెట్టాడు తండ్రి.

" ఈ కోదండ పదం ఎందుకు " అన్నాడు సత్యనారాయణ తల్లి చెవిలో.

" ఉండాలి " అన్నది తల్లి కరుకుగా.

సత్యనారాయణకు సహజంగానే పిల్లలంటే ఉత్సాహం ఎక్కువ. అందులోనూ యింత వరకూ, తనకు చెల్లెళ్ళే తప్ప తమ్ముడే లేడాయె. ఇక యీ తమ్ముణ్ణి ఎప్పుడెత్తుకొందామా, ఎప్పు డాడిద్దామా అని పురిటి పది రోజులూ ఎదురు చూస్తూనే ఉన్నాడు.

బారసాల కాగానే అమ్మ దగ్గర ఆత్రంగా చెయ్యిచాచాడు.

అమ్మ గుడ్లురిమి చూసి పిల్లవాణ్ణి పమిటి చెంగులో దాచుకుంది.

"వాణ్ణి నువ్వు ముట్టుకో కూడదు. గుచ్చి చూడను కూడా చూడకూడదు. వాడి కళ్లు దూరంనుంచి గూడా చూడకూడదు" అన్నది.

"అస్సలు ముట్టుకోకూడదా" ! అన్నాడు సత్యం దీనంగా.

"నేను చెప్పేదాకా అంతే" అంది అమ్మ నిర్దయగా. సత్యం దొడ్లోకివెళ్ళి గుడ్లనీరు కుక్కుకున్నాడు, అమ్మ ఎదురుగా ఆ పనిచేస్తే ఏమంటుందోనని.

మెల్లగా అమ్మ దగ్గర లేని సమయం చూసి, అత్త దగ్గరకెళ్ళి వినయంగా నుంచు న్నాడు. ఏదైనా చిరుతిళ్ళు కావాలన్నపుడు అత్త దగ్గర నుంచునే వాలకమది.

"ఏమిట్రా" అందావిడ నవ్వుతూ. తెలుసుగా విషయం.

"తమ్ముణ్ణి ఎత్తుకుంటా నత్తయ్యా, ఒక్కసారేగా, జాగ్రత్తగా ఎత్తుకుంటాగా" ఎంతో లయగా అడిగాడు సత్యం.

కాని ఏమయిందో ఏమో ఉన్నట్టుండి అగ్గిమీద గుగ్గిలమైంది అత్త.

"అమ్మ చెప్పినట్టు చెయ్యరా వెధవా ! నీబోడి తెలివితేటలు ఉపయోగించకు."

ఇంకానయం అత్త మడితో వుంది గనుక అరుపుతో సరిపోయింది. లేకపోతే చెంప మీద వాతలు తేలేవి.

పూర్తిగా వోడిపోయి తోకముడిచాడు సత్యం.

మరో యిరవై రోజులు జరిగి పోయాయి. వైశాఖం ప్రవేశించి ఎండలు ముదిరాయి. వెంకమ్మత్త చేతి, తిరగమూతతో కొత్త మాగాయికి సరికొత్త పసందు వచ్చింది. కొడుకు పుట్టాడన్న సంబరంలో ఎంత ఖరీదయినా లెక్కచేయకుండా మామిడిపళ్ళు తెచ్చి పోస్తున్నాడు నరసింహాశాస్త్రిగారు.

వైశాఖ శుద్ధ చవితినాడు మరోబుట్టెడు మామిడి పళ్ళు తెచ్చి పడేశాడు శాస్త్రిగారు. "ఒరే, రేపు మీ అమ్మ పుట్టిన రోజు. నేను ఈసాయంత్రానికే వెళ్ళి పోతాను. రేపు తెల్లవారు జామునుంచీ అభిషేకాలూ అవీ వున్నాయి. రేపు పొద్దున అత్తచేత నైవేద్యం పెట్టించి తినండి. ఇంటికి వచ్చిన వాళ్ళకి యివ్వండి" అని అరిచాడు శాస్త్రిగారు.

ఇది నాన్న అమ్మకు ఆజ్ఞ జారీ చేసే విధానమని పిల్లలందరికీ తెలుసు.

ఆ రోజు అమ్మ కొంచెం అనారోగ్యంగా వుంది. ఎక్కువసేపు మంచం మీదే కాలక్షేపం చేస్తోంది.

రాత్రి పెందరాడే భోజనం చేసి పొరుగూరు వెళ్ళిపోయాడు శాస్త్రిగారు. నాన్న వెళ్ళిపోయాక నైవేద్యం వరకూ ఆగుతారా ఇంట్లో పిల్లలు. అందులో వరలక్ష్మి! ఇంట్లో పళ్ళబుట్ట వుండేసరికి ఆ పిల్లకి నిద్రే రావటం లేదు.

రాత్రి తొమ్మిదయింది.

రెండు పళ్ళిచ్చి, "పోయి వాకిట్లో అరుగుమీద కూర్చుని తినవే వరలక్ష్మీ" అంది అమ్మ.

ఎగిరి గంతేసింది వరలక్ష్మి. పళ్ళు పుచ్చుకొని వాకిట్లోకి వెడుతూ అన్నకు చాటుగా సంజ్ఞ చేసింది, 'రారా, తిందాం' అని.

బెల్లం కొట్టిన రాయల్లే కదలకుండా కూర్చున్నాడు అన్న. "పిచ్చి వెధవ, సమయానికి ఎక్కడో ఆలోచిస్తాడు. మామిడి పళ్ళు ఎదురుగా కనిపిస్తుంటే, వేరే ఆలోచన లేమిటి?" అనుకుంటూ వాకిట్లోకి వెళ్ళిపోయింది వరలక్ష్మి.

సరస్వతిని పక్కలో వేసుకొని వెంకమ్మత్త వంటింట్లోనే నిద్దరపోతోంది.

అమ్మ మంచానికి కొద్ది దూరంలో చాపమీద నిటారుగా కూర్చుని సత్యం నిశ్చలంగా అమ్మను చూస్తున్నాడు.

ఇంట్లో వున్న గుడ్డి దీపం మినుకు మినుకు మంటోంది.

అమ్మ లేచి వెళ్ళి ఉయ్యాలలో వున్న కోదండరాముణ్ణి తెచ్చి సత్యం చేతుల్లో పెట్టింది సంతోషంగా. సత్యం పరధ్యానమంతా ఎగిరిపోయింది. ఆనందంతో పొంగిపోతూ తమ్ముణ్ణి ఎత్తుకొని ముద్దాడసాగాడు.

కాని క్రమంగా వాడు చేతులకు బరువుగా వున్నట్టు తోచి వొళ్లో పడుకోబెట్టు కున్నాడు.

వాడు కళ్ళు తెరిచి చూస్తున్నాడు.

ఓహ్! ఏమి కళ్ళవి! కాలనాగు తలలమీది రత్నాలేమో అవి; తెలిమంటల బుగ్గ లేమో అవి!

ఆ కళ్ళల్లోకి చూడలేక సత్యం, తన కళ్ళు మూసుకున్నాడు. కొంచెం ఓర్చుకొని, సంబాళించుకొని కళ్ళు తెరిచేసరికి ఒళ్ళో వున్న కుర్రాడు బరువెక్కి పెద్ద కొండరాయంత బరువున్నాడు. మొయ్యటం కష్టమవుతోంది. ఈ మాటు కళ్ళుమూసుకొని వున్నాడు కోదండరాముడు.

సత్యం అయోమయంగా, ప్రక్కనే వున్న అమ్మ వంక చూశాడు.

"కాలుడు నాలో పుట్టాడు నాన్నా" అని వెళ్ళి మంచంమీద పడుకుంది అమ్మ.

అయోమయింగా మళ్లీ కోదండరాముడి వంక చూశాడు సత్యం.

ఈమాటు వాడి కళ్లు తెరచి వున్నాయి. ఆ కళ్లవంక చూడటం కన్న మిట్ట మధ్యాహ్నపు సూర్యుడి వంక చూడటం తేలిక. ఆ బరువు కొండరాయంత కాదు, నిజంగా కొండంతకు ఎదిగిపోతోంది.

ఆ కళ్లల్లోంచి, ఆ లేత శరీరంలోంచి గూడా, తనలోకి ఏవో, ఏవో, ఏవేవో అఖండ విద్యున్మహా ప్రవాహాలు ప్రవహిస్తున్నట్టున్నది సత్యానికి; ఆ బరువూ, ఆ శక్తీ తను భరించలేనేమో అనిపిస్తోంది.

గాబరాగా అమ్మవంక జూశాడు అతను. అక్కడ మంచంలేదు.

అనేకానేక మణిఖండమండిత మహా సింహాసనం వున్నది. అందులో చిదగ్ని కుండ సంభూత అయిన శ్రీ రాజరాజేశ్వరి చిన్ముద్ర దరించి సమాసీనయై వున్నది. ఇయి తన వడిలో పసిపాప వంక చూశాడు తను. ఒళ్లో పసివాడు కాడు, ఆ స్థానంలో, ఒక మహా బృహదాకారం జాజ్వల్యమానంగా నిలబడివుంది. తేరిపార చూశాడు సత్యం.

ఆకారం కనిపిస్తోందనేందుకు వీల్లేకుండా వుంది. కనిపించటం లేదనేందుకూ వీలు లేకుండా వుంది. తనకు మామూలుగా కనిపించే ఆకాశమంతా, ఆ ఆకారపు పెనుబొజ్జలో బొడ్డుగుంట అయిపోయింది.

క్రిందికి దృష్టి సారించసాగాడు సత్యం. లోకాలు దాటిపోతున్నాయి. అతని దృష్టి ఆగటం లేదు. ఆ బృహద్రూపమూ ఆగటం లేదు. చివరకు పాతాళ లోకం వచ్చింది. అతని దృష్టి ఆగింది.

"ఓహో! ఇదీ ఈయన పాదమూలం" అనుకున్నాడు అతను సంతోషంగా. ఆ పవిత్ర పాదాలకు నమస్కరిద్దామని ఆ పాదాల వెంట తిరిగి తడుమ సాగాయి అతని దృష్టులు. "ఈ మహాతలం ఈయన చీలమండలం అయిపోయింది" అని ఆనందపడ్డా డతను.

ఆనందాశ్చర్య సమ్మేళనంలో కేరింతలు కొడుతూ పైకి సాగినాయి ఆ దృష్టులు.

తలాతలం పిక్కలుగా, సుతలం మోకాళ్ళుగా, అతలవితలాలు తొడలుగా ఆ మూర్తిలో ఒదిగిపోయాయి.

తనున్న భూమి, దీని చుట్టూ తిరిగే సూర్యచంద్రాది గ్రహాలు, వీటన్నిటినీ ధరించిన ఆకాశమూ ఆ మంగళకరమూర్తిలో నాభిదేశ మయింది.



శ్రీ స్వామీజీ బాల్య దశలలో ఒకటి



అంతరంగంలో అంతర్లీనత బహిరంగంలో వెర్రిబాగుల తనము పొంగులెత్తిన ఒకానొక కౌమారదశలో శ్రీ స్వామీజీ

శ్రీ స్వామీజీ జననీ జనకులు



పితృపాదులు
బ్రహ్మశ్రీ గండ్లూరు
నరసింహ శాస్త్రిగారు



మాతృమూర్తి
శ్రీ స్వామీజీవారి శ్రీ విద్యా
రాజయోగ గురు మూర్తి
శ్రీమతి జయలక్ష్మీమాత



శ్రీ స్వామీజీ పితృపాదులు - సన్యాస స్వీకారానంతరం శ్రీ నరహరి తీర్థ యతీంద్రులు

"నే నీయన మణిపూరంలో వుండి అటూ, యిటూ గూడ నా దృష్టులను వ్యాపింప చేస్తున్నాను '' అనుకున్నాడు సత్యం.

ఇంకా పైకి సాగినాయి అతని దృష్టులు. అనంత తారకా పరంపరల అల్లిబిల్లిచుక్కల ముగ్గులు విస్తరించే నక్షత్ర మండలం ఆ స్వామికి వక్షస్థలమై అమరింది. మహనీయ తేజో మయమైన మహర్లోకం రత్నమాలికాలంకృతమైన ఆ దేవుని కంఠస్థలమైంది. సమస్త జగత్తునకు ఉత్పత్తి బీజ స్థానమైన జనోలోకం ఆ తండ్రికి నోరయింది. సుమహిత తపస్వి జనగణ తేజోదుర్నిరీక్షమైన తపోలోక మా ప్రభువు ఫాలభాగంగా వుంది. ఆపైన అది సత్యలోకం. అది అనేక సహస్ర మునిగణ సందోహ సమ్మర్దితమై, అయుతాయుత, వేదవాది బృంద సంకులమై, మార్గసహస్ర ప్రచలిత బ్రహ్మవిచారసార పరమమై, సహస్ర ముఖాలుగా విస్తరించి ప్రకాశి స్తోంది. ఆ బ్రహ్మలోకం ఆ పరమ పురుషుని శిరస్సై, ఆయన సహస్రశీర్షుడై జ్వలిస్తున్నాడు.

ఔను, దిక్కు లేమయి పోయాయి? అవిగో ఆయన చెవులయి పోయాయి. మరి దేవతలో? ఆయనలో అవయవా లయిపోయారు. ఓహో! ఈ సృష్టి అంతా ఈయన శరీరమన్న మాట! మరి సృష్టికి మూలమయిన వేదా లెక్కడ? ఇవిగివిగో! అవి ఆయన బ్రహ్మ రంధ్రమై అవ్యక్తంగా దాక్కున్నాయి. అతని సుసూక్ష్మ దృష్టులు మరింత నిశితంగా ఆ పరమ పురుషుణ్ణి పరిశీలిస్తున్నాయి. చూస్తున్న కొద్దీ ఈ విశ్వరహస్యాలన్నీ ఆ మూర్తిలోగోచరిస్తున్నాయి. ప్రాణము, జీవులు, జీవులలో అంతరాలు, వ్యవస్థలు, వర్ణాలు, ఆశ్రమాలు, ధర్మాలు, విద్యలు, యజ్ఞాలు-ఒక టేమిటి, అక్కడ కనిపించనిది లేదు. పరస్పర విరోధులుగా కనిపించే అనేకానేక అంశాలకు అక్కడ సమన్వయమై, ఒక సువిశాల శరీర నిర్మాణంలో అంతర్భాగాలుగా సాక్షాత్క రిస్తున్నాయి. ఆనందపరవశుడైన సత్యం కళ్ళు అప్రయత్నంగా మూతలుపడ్డాయి.

భూ నభోంతరాళాలను దిగమింగి, మించి విజృంభించి వున్న యీ బ్రహ్మాండ బృహన్మూర్తి తన హృదయాకాశంలో చిన్న మరుగుజ్జై కేవలం తన బొటన వేలంతై ఠీవిగా నిలబడివున్నాడు.

సూక్ష్మతమాలైన అతని దృష్టులు ఆ వామన మూర్తిని నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూసినై. ఏమీ సందేహంలేదు! ఆ బృహన్మూర్తిలో వున్న ప్రతి అణువూ యీ అంగుష్ఠ మాత్రమూర్తిలో గూడ వుంది. ఓహో అతడే యితడు!

సత్యం కను రెప్పలు వాలుతున్నై, లేస్తున్నై, వాలుతున్నై, లేస్తున్నై, చురుకుగా చురుకుగా! బృహన్మూర్తీ, వామనమూర్తీ కనిపిస్తూనేవున్నారు. ఒకసారి ఎదుటకు సారించాడు తన చూపులను. అక్కడ శ్రీమాత చిన్ముద్ర వహించే వుంది.

అతని కళ్ళు మూతలు పడ్డాయి మళ్ళీ. అంగుష్ఠమాత్రుడు అక్కడ లేడు! కళ్ళు తెరిచాడు. బృహన్మూర్తి యిక్కడ లేడు! ఏమయ్యాడు? అతని మనస్సు ఇంద్రియాలను

దాటి యింకా దూరాలకు వెళ్ళింది. ఏవో పొరలు, పొరలుగా కనిపిస్తున్నాయి. ఏమిటవి ? అవి భూత సూక్ష్మాలు. భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము. ఈ పొరలు అవలీలగానే చీలిపోయి మార్గ మిస్తున్నాయి. ఆ తరువాత అహంకారపు పొర వుంది. కొంచెం కష్టమయినా ఇది గూడా చిరిగిపోయింది. ఇంకా ఏదో అడ్డం కనిపిస్తోందే ! అవును. ఆ పొర పేరు మహత్తు. అది తెగుతున్నట్టే వుందిగాని తెగటం లేదు.

'ఓహో ! యిదీ మన స్థితి. ఇక్కడ మన కృషి ఏకాగ్రం కావలసి వుంది' అనుకున్నది అతని మనస్సు. ఆ మనస్సుకు విసుగుకానీ, నిర్వేదం కానీ లేవు. తృప్తి, సంతోషమూ గూడా లేవు. సత్యం మనస్సు కిందికి దిగి వచ్చింది. కళ్ళు తెరుచుకున్నాయి

ఒళ్ళో పిల్లవాడున్నాడు. వాడి బరువు మోయటం కష్టంగా లేదిప్పుడు. ఎదురుగా నులకమంచం మీద అమ్మ ఒత్తిగిలి పడుకుని తన వంకే చూస్తోంది.

'నేను ధన్యుణ్ణి. ఈమె జగన్మాత శ్రీ రాజరాజేశ్వరి, శక్తిరూపిణి. ఈమెయే ప్రకృతి. ఇతడు సాక్షాత్ పురుషుడు—పరమపురుషుడు. ఈ యిద్దరి సమాయోగం వల్లనే సృష్టి, స్థితి, లయ రచన జరుగుతోంది. రూపాలకు అతీతులయిన ఈ తత్వమూర్తులకు, సంబంధ కల్పనం చెయ్యటం; కేవలం బాలబోధ కోసమేనా ఏదో ఒక సంబంధం చెప్పకపోతే, వీరి చర్యలతీరు గ్రహించటం కష్టం గదా! ఇప్పుడు వీరిద్దరూ తల్లీ బిడ్డలై, నాకు దర్శన మిచ్చారు. నన్ననుగ్రహించారు. ఆహా ధన్యుణ్ణి!''

కృతజ్ఞతగా యిద్దరికీ మనస్సులోనే వందనాలు చెల్లించాడు అతను.

అతనిలో ఆలోచన అక్కడితో ఆగలేదు.

''ధన్యుణ్ణే. సందేహం లేదు. అమ్మ అనుగ్రహించింది. సందేహం లేదు. కానీ నేనెవరిని ? నేనెవరిని ? కనిపించలేదే, నా విశుద్ధ స్వరూపం! ఇంకా ఏదో పొర మిగిలి పోయిందే! దాన్ని నేను ఛేదించలేకపోయానే! అమ్మ కడుపున దత్తుడు పుడతాడని, ఫకీరు తాతగారు, యోగిస్వాములవారు చెప్పారట. ఇప్పటికి నాకు పదకొండేళ్ళు వచ్చాయి. దివ్యోపదేశం అయింది. అయినా నాకు తెలటం లేదే నే నెవరన్నది! నేనే దత్తుడి నయివుంటే నాకీ ఆవరణ మిగిలి వుండేదా ? నేనే దత్తపరమాత్మనన్న స్ఫురణ పుట్టుకతోనే కలిగేదికదా! కనుక అమ్మ కడుపున పుట్టిన యీ కోదండరాముడే ఆ దత్తాత్రేయ పరబ్రహ్మ అయివుంటాడు. అయివుంటాడేమిటి వీడే! కాకపోతే వీడి కళ్ళలో యీ తేజస్సెలా వుంటుంది ? ఈ లేత శరీరంలో ఇంత విద్యుత్ప్రవాహం ఎలా వుంటుంది ?

"సందేహం లేదు. వీడే దత్తాత్రేయుడు. వీడే భవిష్య జ్జగద్గురువు. జయ జయ ప్రభో, త్రిజగద్గురో, దత్తాత్రేయా, జయ జయ !"

అమ్మ దగ్గరకు వచ్చినట్టు అలికిడి అయి, ఆలోచనలు ఆగిపోయినై.

అమ్మ వచ్చి వళ్ళోవున్న పిల్లవాణ్ణి అందుకుంటోంది. వాణ్ణి చేతుల్లోకి తీసుకొంటూ యథాలాపంగా అన్నది. "సందేహంలేదు. నువ్వే! రెండో ఆలోచనకి చోటులేదు."

ఉలిక్కిపడ్డాడు సత్యం. తన మనస్సులో సందేహాలకు అడగకుండానే అమ్మ సమాధానం చెప్పటం కొత్తగా దతనికి.

ఇదివరలో అమ్మ సమాధానం చెపితే తను వూహించని సమస్యలుగూడా పరిష్కారం అయిపోయేవి.ఇప్పుడు అమ్మ సమాధానంతో ఉన్న ప్రశ్నకు తోడు కొత్త ప్రశ్న వొకటి వచ్చి పడ్డది.

"అయితే మరి వీడెవడు; ఈ అఖండ తేజశ్శాలి ?" ఈ ప్రశ్న గూడ అమ్మను పైకి అడగలేదు సత్యం.

అమ్మ పిల్లవాణ్ణి తొట్టెలో పడుకోబెట్టి, తనవంక తిరిగి మెల్లగా అన్నది.

"వీడు కాలుడు. మహాకాలుడు. నన్ను తీసుకువెళ్ళటానికి వచ్చాడు."

"ఓహో"

శాస్త్ర విషయాలు విన్నట్టే యిదీ వింటున్నాడు సత్యం. అతనికి భయం వెయ్య లేదు, దుఃఖమూ రాలేదు. అప్పటికి అపరరాత్రి దాటి నాలుగోజాము సమీపిస్తోంది. పళ్ళు తిని అరుగుమీదే నిద్రపోయింది వరలక్ష్మి. అమ్మ వెళ్ళి దాన్ని తెచ్చి యింట్లో పడుకోబెట్టింది.

తరువాత "రా" అని పిలిచి, తను ఆంజనేయస్వామి గుళ్ళోకి నడచింది. గుళ్లో సత్యాన్ని పద్మాసనంలో కూర్చోమని మరోసారి 'హస్తమస్తక సంయోగం' చేసింది. ఏవేవో సిద్ధులు తనలో ప్రవేశించాయని తెలిసింది సత్యానికి. అతని వొళ్ళు గగుర్పొడిచి,కొద్దిగా చెమట పట్టింది. కొద్ది సేపటిలో స్వస్థితిలోకి వచ్చాడు. అమ్మ బాగా నిస్త్రాణగా కనిపించింది. తను కళ్లు తెరవగానే నీరసంగా కూర్చుంటూ, "సిద్ధ సంకల్పోభవ" అని ఆశీర్వదించింది.

సత్యం ఒక దివ్యస్థితిలో వున్నాడు. ప్రకృతి పురుష సాక్షాత్కారం, దివ్యజ్ఞాన సంపన్నత, యోగ సిద్ధ్యనుభవం అన్నీ ఒకేసారి అతనిని వరించిన జగత్కల్యాణ సమయ మది.

## ఉపదేశము

ఆ ఆనందం వర్ణనలకు అందదు. ఏ మాటలు, ఏ వివరణలు, ఏ ముద్రలూ, ఆ స్థితిని సూచించనైనా లేవు. ఆ అవ్యక్తానుభూతిలో కొంతసేపు అతనిని మునిగి వుండనిచ్చింది. తరువాత మృదువుగా పిలిచింది.

"నాన్నా"

తెరిచిన అతని కళ్లు క్రొంగ్రొత్త కిరణాలను వెదజల్లుతున్నాయి. అమ్మ ఒక దివ్య మణిని అందించింది ఇదం అంటూ. రెండు చేతులతో ఆదరంగా అందుకొని కన్నుల కొత్తుకొని, శిరసున ధరించి, వొళ్లో పెట్టుకున్నాడు అతను.

అమ్మ చెప్పసాగింది.

"చూడు నాన్నా, యిది పైకి కొండరాయి పెంకులాగానే కనిపిస్తుంది. కానీ యిది ఒక దివ్యమణి. ఇది గణపతి శిల! చింతామణి-గణపతి శిల! ఈ మూర్తిని గణపతిగా నేను బాల్యంలో చాలా కాలం అర్చించాను. ఇది దైవదత్తమై నాకు సంప్రాప్తమయింది.

"నీ కిప్పటికి ఉపనయనం అయివుండవలసింది. కాకపోవటంలో కొన్ని వ్యావహారిక సౌకర్యాలు వున్నాయి. కనుక కాలేదు. ముమ్ముందు నీకు ఉపనయనం జరుగుతుంది. ధర్మ సంస్థాపనకై నీ వొక పీఠం స్థాపించవలసి వుంది. నీ పీఠానికి, చింతామణి గణపతి మూల స్థానీయుడవుతాడు. ఈయనను నీ దేవతార్చనలో వుంచుకో. ఈ స్వామికి అభిషేకం చేసి, ఆ తీర్థం నువ్వు పుచ్చుకో. ఇతరుల కివ్వు.

"ఇక పీఠ స్థాపనమున్నా — ధర్మ ప్రతిష్ఠాపనమున్నా — అది తేలిక పని కాదు. నువ్విప్పటిదాకా చేసిన అనుష్ఠానం వంటిది అసలుకాదు. మురికినీటి సముద్రంలో ఈదుతూ గూడా వంటికి తడి అంటనీయని "కౌశలవిద్య" కరతలామలకం కావాలి ఆ కార్యసిద్ధికి.

"దానికి ఎన్నో తంత్రాలు వేద విహితములై వున్నాయి. వాటి ఆవశ్యకత ఏర్పడినప్పుడు ఆ యా వైదిక కర్మలను గణపతి నీకు ఉపదేశిస్తాడు. అంతేగాదు, ధర్మ విచికిత్స గాని, అర్థ విచికిత్స గాని ఏర్పడినప్పుడుగూడా యీస్వామిని చెవి దగ్గర ధరించు. నీ వాచరించవలసిన మార్గం, నీకు ఆయన ఉపదేశిస్తాడు."

అమ్మ ఒక్క క్షణం ఆగింది.

సత్యం చేతిలోని మణి మాయమైపోయింది. చేతులు ఖాళీ అవటం అతను గమనించుకొన్నాడు. ఏమీ మాట్లాడలేదు. అమె గమనించింది. ఏమీ మాట్లాడలేదు.

మంద్రమధురంగా మళ్లీ పలకసాగింది అమ్మ.

"అంతర్యాగమే తప్ప, బహిర్యాగం లేదు నీకు. అక్కర లేకపోయినా బహిర్యాగం చేసి చూపవలసిన సమయం వస్తుంది. అప్పుడు ఆ గణపతి హెచ్చరిస్తాడు. అలాగే సహజ సమాధే తప్ప నిర్వికల్ప సమాధిలోగాని, సవికల్ప సమాధిలోగాని, మునిగి వుండే పద్ధతి నీకు లేదు. ఆ అనుమతి లేదు. దాని కాలం యితరుల కోసం వస్తే గణపతి చెపుతాడు. నిర్నిబంధమైన అంతర్లీన స్థితిలో వుంటూనే పూర్తి మెలకువతో లోక వ్యవహారంనడపటమే సహజ సమాధి. అది నీ సహజ స్థితి కావాలి. ఈ విషయంలో నీ స్థితిని నువ్వు పరీక్షించుకొందుకే నీ కిద్దరు చెల్లెళ్లున్నారు.

"కోట బురుజుపై నిలబడ్డ వీరుడు, బయట శత్రువులనూ చూస్తాడు, లోపల ప్రభువునూ చూస్తాడు. వాడి స్థితి నిత్య ప్రమాదమే కాని వాడు అక్కడ నిలబడే దిగ్విజయం సాధిస్తాడు. ఆ పరాక్రమం నీకు వుంది. మరింత స్థిరపరచుకోవాలి. గర్భగుడిలో నిలబడ్డ అర్చకుడికి నిజానికి దేవుడే దగ్గర. కానీ అతడు ప్రజలకుగూడా దగ్గరవాడే. అతని అర్చన అంతా ప్రజల అర్చన, ప్రజలకోసం అర్చన. నీవు పీల్చే ఊపిరికి గూడా అలాంటి అర్చకత్వ స్థితి రావాలి. "నీ వ్రతంలో అంగంగా, అనేకమార్లు నువ్వు సముద్రాలు దాటి భూప్రదక్షిణలు చెయ్యవలసివుంది. చెదరిపోయిన కొందరు పురాతన బంధువులను పిలిచి, బుజ్జగించి యింటికి తేవలసివుంది. అలా సముద్రతరణం జరిగినపుడల్లా ఇదిగో యీ మంత్రం జపించు."

చెవిలో మంత్రోపదేశం చేసింది అమ్మ.

సత్యం ధారణ చేసినాక, 'ఈ మంత్రాలు గూడ స్వీకరించు' అని, దత్తమంత్ర సముచ్చయాన్ని అందించింది అమ్మ. తరువాత 'ఇవి ప్రత్యేకంగా ఉపదేశించవలసిన పని లేదు నీకు. అయినా సంప్రదాయ విచ్ఛేదం ఎందుకులే అని చెపుతున్నాను. వుంచు, వీటి ఉపయోగం తరువాత వస్తుంది. గణపతే చెపుతాడు.' అన్నది.

ఇనప్పెట్టెలో రత్నాల మూట దాచినట్లు మనస్సులో ఒక పక్క వాటిని వుంచాడు సత్యం.

కొంచెం ఆగి మళ్లీ అమ్మ బోధించసాగింది. "నాన్నా, నీ సాధనా మార్గం క్లిష్టమైంది. ఆపైన నీ కర్తవ్య ప్రణాళికగూడా జటిలమైనది. కనుక నీకూ, సమస్త జగత్తుకూ కల్యాణకరంగా కొన్ని సూక్తులు నీకు ఉపదేశిస్తాను. ఇంతవరకూ నేను ఉపదేశించిన మంత్రాలు ఎంత ముఖ్యమైనవో, యీ సూక్తులు అంత ముఖ్యమైనవే, నీకూ, నీ శిష్య పరంపరకూ గూడా. జాగర్తగా విను." అలా ప్రత్యేకంగా హెచ్చరించి, ఉపదేశించసాగింది అమ్మ.

1. అందరు స్త్రీలలోనూ నన్నే చూడు.
2. దీన దళితుల యందు దయ చూపు.
3. ఎటువంటి పరిస్థితిలో అయినా సరే, శాస్త్ర సమ్మతంగానే ఆలోచించు, ఆచరించు.
4. సద్భావుడైన జీవుణ్ణి ప్రాణమిచ్చి అయినా సరే రక్షించు.
5. సర్వభూతాలూ ఒకటే అని ఎంచు. భేద భావన పరిత్యజించు.
6. ఏ కష్టం వచ్చినా సరే నీ అనుష్ఠానం నీవు మానరాదు. దానివల్ల యితరులకు తాపత్రయం కలుగరాదు. పైగా దానివల్ల ఇతరులకు ఎప్పుడూ ఉపకారం జరుగుతూ వుండాలి.
7. అన్ని భూతాలయందు నన్నే చూడు.
8. సత్యాన్ని వదలకు.

9. నీకు తెలిసిన దివ్యజ్ఞానాన్ని చమత్కార రూపంగా సులభంగా చేసి ప్రజలకు అందించే తెలివి పెంచుకో.
10. నీ రాబోయే అవతారాల గురించి బహిరంగంగా ప్రకటించవద్దు.
11. ధర్మ ప్రచారానికి పూనుకో. ఇదిగూడ సాధ్యమైనంత సులభశైలిలో.
12. నీకు నొప్పి కలిగినా ఫరవాలేదు గాని, ఇతరు లెవ్వరికీ, ఏ విధమైన నొప్పి కలిగించకుండా ప్రపంచంలో జీవించు.

ఇంతవరకూ చెప్పి ఇంక ఏం చెప్పాలా అని ఆలోచించుకొంటూ, కొంచెం ఆగింది అమ్మ. ఈ వ్యవధానంలో ఉపదేశాన్ని, శిలాశాసనంగా బుద్ధిలో ముద్రించుకున్నాడు సత్యం. "ఎన్ని అయినాయి" అమ్మ అడిగింది. "పన్నెండు" అన్నాడు సత్యం. "బాగుంది. అంతే, ఇవి ద్వాదశ సూత్రులు. ఇవి నీకు మహా మంత్రాలు. ఇప్పుడు బృహస్పతి నీ జన్మ లగ్నమైన వృషభరాశిలో వున్నాడు. ఆకాశంలోని సూర్యులకు, భూమిమీది జ్యోతిర్లింగాలకూ, నదులకు, నీలోని మంత్రాక్షరాలకు, అవయవాలకు రాశి చక్రంతో గల సంబంధం నీకు తెలుసు. ఇప్పటికి నీవు పూర్ణంగా దీక్షితుడవయ్యావు.

"రాశి చక్రం ఒక ఆవృతి తిరగాలి. అప్పటికి నీ సాధన పరిపూర్ణమవుతుంది. అప్పుడది దానంతటదే ప్రపంచంలో ప్రకటితమవుతుంది. అప్పుడు మళ్లీ ఒక ఆవృతి పని వుంటుంది.

"ఇది మా గురువుల సంకల్పం
నీకు శుభం కలుగుగాక
నీ వల్ల మానవజాతికి మేలగుగాక."
అమ్మ కళ్లు మూసుకుని కూర్చుంది.

ఒక క్షణం తరువాత కళ్లు తెరిచి యిటూ అటూ చూసింది. అప్పటికి బ్రహ్మ ముహూర్తం బాగా ప్రవేశించింది. రైతుల గొడ్లసావిళ్లలో అలికిడి మొదలైంది. ఎందుకో అమ్మ కొంచెం తొందరపడసాగింది.

"ఆ, నాయనా ! శంకర జయంతి ప్రవేశం చేసింది. ఇక నాకు సమయం లేదు. ఒక కారణం కోసం జన్మెత్తాను. సంసారం చేశాను. ఆయన గూడ వైరాగ్య మార్గంలో మంచి మెట్టులో వున్న వారే. గుర్తించటం కష్టం. ఆయన సహకారంతో నాపని బాగా జరిగింది. మరో కారణం కోసం ఇక నేను బయలుదేరుతున్నాను. ఈ కాలుడు గూడ నా వెనకే వచ్చేస్తాడు. ఇక___పద___పద___"

అమ్మ తొందరపెట్టింది.

ఇంటికి వచ్చారు యిద్దరూ.

అమ్మ మంచం మీద పడుకుంది మెల్లిగా.

మంచం చప్పుడుకో, లేక దానంతట అదే వచ్చిందో వరలక్ష్మికి మెళుకువ వచ్చింది. బద్ధకం వల్ల లేవక పడుకునే చూస్తోంది. "ఏమిటి, వీడింకా కూర్చునే వున్నాడు? అమ్మ నిద్దర పోతున్నట్టు లేదే? వీళ్ళ కబుర్లు యింకా తెమలలేదా" అనుకుంటూ.

ఇంతలో అమ్మ మంచం మీదనుంచి జాగ్రత్తగా దొర్లుతున్నట్టుగా కిందకి జారింది. మంచం పక్కనే చాప వుంది. ఆ చాప మీద వెల్లకిలా దిండు లేకుండానే పడుకుంది. ఇది అమ్మకు మామూలే.

వరలక్ష్మికి మళ్ళీ నిద్ర పట్టేసింది.

అమ్మ అలా పడుకొనే వుంది. సత్యం అలా కూరుచుని, పగిలిన పతికాయిలల్లో కళ్ళు తెరుచుకొని చూస్తూనే వున్నాడు.

పక్షుల కిలకిలలు వినిపించే సమయానికి వెంకమ్మత్త ఆ గదిలోకి వచ్చింది. వచ్చి సరాసరి అమ్మ నాడి చూసింది.........

* * *

మళ్ళీ ప్రస్తుత లోకంలోకి వచ్చిన సత్యనారాయణ మనస్సు కొద్దిక్షణాల దాకా స్తబ్దంగా వుండిపోయింది. తరువాత "గణపతీ! యిక నువ్వు నన్ను నడిపించు" అన్నది.

జాజికాయ పెట్టెలో అర్కగణపతి అల్లరిగా గంతులెయ్యసాగాడు.

టక్-టక్-టక్-టక్-టక్-టక్
టక్-టక్-టక్-టక్-టక్-టక్

తలుపు తెరుచుకుంటోంది. అర్కగణపతి ఎగరటం ఆపేశాడు. సగం తెరుచుకున్న తలుపుల సందులోంచి నిద్దరమత్తుగావున్న నల్లటి ముసలిమొహం ఒకటి ముందుకు పొడుచుకొని వచ్చింది.

ఓ, అది శ్రీకంఠయ్యగారి ముఖం!

ఎదురుగా సత్యాన్ని చూసి ఆయన కంగారుపడుతూ తలుపు పూర్తిగా తీసి—

'రా సత్యనారాయణా! లోపలికి రా! ఏమిటిది? ఈ వేళపుడు వచ్చావేమిటి? అంటూ చెయ్యి లోపలికి చూపిస్తూ ఆహ్వానముద్రను ప్రదర్శించాడు.

"మా గణపతిని మీ యింట్లో కాస్త వుండనిస్తారా!" అన్నాడు సత్యనారాయణ కదలకుండా అక్కడే నుంచుని.

"మీ గణపతిని వద్దన్నానా? నిన్ను వద్దన్నానా? ముందు లోపలికి రావయ్యా!" అని చనువుగా జబ్బ పట్టుకుని లోపలికి గుంజాడు శ్రీకంఠయ్యగారు.

సత్యనారాయణ సరాసరి లోపలి గదిలోకి వెళ్ళి, దేవతార్చన పెట్టెను దేవుడి గూట్లో పెట్టి మౌనంగా ముందరి గదిలోకి వచ్చాడు. ఎప్పుడూ హుషారుగా ఉండే సత్యనారాయణ ఇవ్వాళ ఇలా మౌనంగా, గంభీరంగా వుండటం చూసి, శ్రీకంఠయ్యగారు తల పంకించారు.

"కుర్రాడికి యింట్లో ఏదో చిక్కు వచ్చి వుంటుంది. ఇదుకు యిల్లు గదా! ఇదివరకటి నుంచీ సూచన చేస్తూనే వున్నాడుగా! నేను రమ్మని పిలుస్తూనే వున్నానాయె. అందుకే వచ్చి వుంటాడు. నాకూ మంచి కాలక్షేపంగా వుంటాడు. ఉండనీ. ఇంకా అడిగే దేముంది. వివరాలు అడగకుండా వుండడమే మర్యాద" అని అనుకున్నాడు శ్రీకంఠయ్యగారు.

సత్యనారాయణకు ఏ భావాలూ లేవు. శ్రీకంఠయ్యగారందించిన దుప్పటి తీసుకొని హాయిగా పడుకున్నాడు.



# 2 వ అధ్యాయం

# ప్రశ్నగణపతి

పరిప్రశ్నైస్సేవనైర్యః
ప్రశ్నాన్నిర్మూలయ త్వరమ్ ।
స ప్రశ్నగణరాడ్భక్తః
శ్రీగురుర్మే ప్రసీదతు ॥

(ఆయన ప్రశ్నగణపతి భక్తుడు. తనను ప్రశ్నించగా, సేవించగా ప్రశ్నలే లేకుండా చేస్తారాయన. అట్టి శ్రీ గురుదేవుడు నాయందు ప్రసన్నుడగుగాక.)

**ప్రకాశిక :**

"ఇకనుంచీ నా పేరు ప్రశ్నగణపతి"

"అదేమిటి ?"

"నువ్వు ప్రశ్నలు వేస్తావు. నేను సమాధానం చెపుతాను కనుక."

"ప్రశ్నలు లేందే"

"పుడతాయ్"

"అదేమిటి ?"

"వాటికి పుట్టే సమయం వచ్చేసింది"

"ఎందుకని ?"

"నీ తిరుగుప్రయాణం మొదలైందిగదా"

"అప్పుడేనా ? పుష్కరాలు యింకా రాలేదుగా"

"వచ్చే లోపల యింకా చాలా కథ వుంది"

"అంటే"

"కైలాసశిఖరం ఎక్కటం ఒకచే సాధనకాదు, దిగటం కూడా సాధనే"

"అసలు దిగటం దేనికి ?"

"ఇతరులను ఎక్కించేందుకు"

"ఓహో"

"ఎలాగో ఎక్కి ఎలాగో దిగటం కాదు. ఓనగూరగ ఎక్కటం దిగటం అవలీల కావాలి. చివరికి పైనా కిందా ఒకే కాలంలో వుండాలి."

"మరి అప్పుడే వీధిన పడేశావేం ?"

"వీధిన పడటమే దిగటమంటే"

"ఇప్పుడు నేనేం చెయ్యాలి ?"

"నువ్వు చేస్తున్న పనే"

"అంటే ?"

"అదేనయ్యా ! ఇదివరలో నువ్వు చీత్కరించి పక్కకు తోసిన సిద్ధుల్ని పలకరిస్తున్నావుగా ! ఆ పనే ! అలాగే కిందికిరా"

"ఎంతకిందదాకా ?"

"నీ చుట్టూ వున్నవారి తలలదాకా. అప్పుడు చేయి అందించి వారిని పైకి లాగవచ్చు."

"ఆజ్ఞ"

"ఇప్పుడే నా సహాయం నీకవసరం"

"ఎక్కటం కన్నా దిగటమే ఎక్కువ కష్టమా ?"

"ఎక్కువ తక్కువల సంగతి కాదు. తొందర. నీ సాధన త్వరగా కావాలని నా తొందర"

"ఇక సాధనకు సూత్రమేమిటి ?"

"ఒక సూత్రం యిందాకనే చెప్పాను."

"అంతేనా ?"

"అంతమాత్రమే అయితే నా సహాయ మెందుకు ?"

"గణపతిదేవా, సరిగా వివరించు తండ్రీ."

"చూశావా, ప్రశ్న వేశావు. అందుకనే నా పేరు ప్రశ్నగణపతి"

"ఈ పేరెక్కడా వినలేదే.

"ఎన్ని పేర్లు విన్నావు."

"పదహారు ఒక పక్షం—ఇరవై ఒకటి అని మరో పక్షం. ముప్పై రెండు అని యింకొక పక్షం."

"అంతేనా"

"కొందరు యాభై నాలుగనీ, మరి కొందరు నూట ఎనిమిది అనిగూడ అంటారు.

"ఉన్నది నేనొక్కణ్ణే. నా కార్య నిర్వహణ విధానాన్ని బట్టి పేరు పేరు పేర్లు పెట్టుకుంటారు, అది నా సరదా. నా లీల కాదనేందుకు నువ్వెవరు ? అయితే వీటిల్లో కొన్నింటిని ప్రధానంగా తీసుకొని, పదహారు అనీ, ఇరవై ఒకటి అనీ, ఇరవై నాలుగు అనీ ముప్పై రెండు అనీ, ఇలా తమ శిష్యులకు ఉపదేశిస్తూ వుంటారు నా భక్తులు."

"సరే"

"నేను మాత్రం రెండు పేర్లు నీకు ఉపదేశిస్తున్నాను."

"చిత్తం అనుగ్రహించు"

"ప్రశ్నగణపతి—అర్కగణపతి"

"ప్రశ్నగణపతి, అర్కగణపతి"

"ఇందులో మొదటి వాడు నీ కోసం, రెండో వాడు నీ శిష్యుల కోసం."

"సరే"

"ఇక ప్రశ్న వెయ్యి"

"సాధన సూత్రాలలో రెండవది"

"మానస సరోవరం దగ్గర నువ్వు విన్నదే"

"నా అవతారం గురించినదే-"

"ఉదే. ఇంతవరకూ నువ్వు ఏకముఖంగా సాగిపోయావు. ఇప్పుడు బహుముఖంగా ప్రసరించాలి, పాదరసంలాగా, సూర్యుడిలాగా"

"తెలుస్తోంది"

"ఇప్పుడు నీకున్న పని తక్కువేమీ కాదు. నీకు సంబంధించిన జీవులు, నువ్వు కావాలనుకున్నవి, నీకు కేటాయించబడ్డ జీవులు వీరంతా ఎక్కడెక్కడున్నారో చూసుకోవాలి. వారిని నీ దగ్గరకు లాక్కోవాలి. లేదా నువ్వే వాళ్ళదగ్గరకు పోవాలి. దాని కోసం వాళ్ళ జీవితాలలో నువ్వు యిప్పుడే ప్రవేశించాలి."

"వాళ్ళల్లో కొందరు ప్రస్తుతం ఈ లోకంలోనే లేరు."

"అదే చెప్పేది. ఇదికాక లోక వ్యవహారం అభ్యసించాలి"

"ఇది సాధన సూత్రమా"

"అవును. నీ మంత్రాలకు సిద్ధించివున్న * బహుళినీ శక్తిని ఇక ఉపయోగపెట్టాలి."

"అంటే మంత్రశాస్త్ర ప్రయోగ ఉపసంహారాల పట్ల బుద్ధి పెట్టాలన్న మాట."

"ఔను. దానితో పాటే మంత్రాలకూ, మనస్సంయమన విధానాలకూ ఉన్న సంబంధాన్ని కార్యరూపంలోకి దింపాలి."

"అంటే యోగ మార్గంలో విభూతులను ఆదరించాలన్నమాట. ఇందాక చెప్పిన మాటే యిది"

"అయితే యోగాన్ని ఉపాస్యమంత్రాలతో సమన్వయించ మంటున్నారు అంతేనా"

"సాధు వత్సా, సాధు! అంతే. అయితే అంతమాత్రమే కాదు. ఇది ఎంత కలియుగమైనా, ధర్మసాంకర్యం ఎంత వున్నా, వైదిక కర్మలను పూర్తిగా ప్రజలలోంచి పోనీయరాదు.

"అంటే అగ్ని ఉపాసన ప్రారంభించాలి."

"కొత్తగా ఉపాసించే దేముంది? నే నెదురుకుండానే వున్నాగా?"

"మీకూ అగ్నికీ సంబంధ మేమిటి?"

"నా పేరేమిటి?"

"ప్రశ్నగణపతి".

"నరేలేవయ్యా! అసలుపేరు చెప్పు."

"గణపతి"

"ఇంకా అసలు పేరు?"

"గం".

"అదీ నా పేరు. ఇందులో గ్ - అ బిందువులు గదా! ఈ గకారానికి దేవత అగ్ని; అకారానికి పరశివుడు దేవత. బిందువుకి తురీయాతీత పరబ్రహ్మ దేవత. ఇవే నా రూపాలు. వరుసగా స్థూలము, సూక్ష్మము, సూక్ష్మతమము - ఈ ఏనుగ తలకాయ రూపం మరీ స్థూలతర రూపం. అందుచేత అగ్ని ఉపాసన అంటే, అది నా ఉపాసనే."

---

వైదిక మంత్రాలకు నాలుగు శక్తు లుంటాయి.

1. ప్రామాణ్యశక్తి : దీనివల్ల ఆ మంత్రజపం చేసే సాధకుని స్థితి పెరుగుతుంది.
2. ఫలిణీశక్తి ; దీనివల్ల సాధకుడు అభిమంత్రించిన వస్తువులు మహత్తుగల వవుతాయి.
3. బహుళీశక్తి : దీనివల్ల ఆ సాధకుడు చేసినమంత్ర ప్రయోగము సర్వజనులకు, సర్వలోకాలకు, లాభదాయకమవుతుంది.
4. అవ్యగ్రహీశక్తి : దీనివలన ఔషధ, మణ్యాది ప్రత్యేక సాధనామార్గాలద్వారా త్వరగా మంత్రసిద్ధి కలుగుతుంది.

" చిత్రం "

"అంతేకాదు. దేవతలు అగ్నిముఖులని తెలుసుగా! అంటే అగ్నిద్వారా ఆహుతులు స్వీకరిస్తారని ఒక అర్థం. ముఖమంటే ప్రధానమైంది అని గూడ అర్థం.

అందువల్ల దేవతల్లో అగ్ని ప్రధానుడు అన్నమాట.

ఇక నేను ప్రథమ పూజ్యుడ్ని. ముందు నన్నే పూజించాలి. ఎందువల్ల? నన్ను పూజిస్తే అందరినీ పూజించినట్టే. అందుకని. అంటే నేనే దేవతలందరికీ పూజ లందిస్తున్నాను. అదే అగ్ని చేసే పని. అందుచేత నేనే అగ్నిని."

అలాగే ప్రథమ అనే పదానికి గూడ ప్రధానుడనే అర్థంవుంది. పూజ్యుల్లో కల్లా నేనే ప్రథముడిని. అంటే దేవతల్లో కల్లా నేనే ప్రధానుణ్ణి. అందువల్ల గూడ నేనే అగ్నిని. కనుక నువ్వు అగ్ని ఉపాసన ప్రారంభించు. సిద్ధి ఎదురుగా వుండనే వుందిగా."

" మీరు నన్ను పూర్తిగా కర్మమార్గంలో పెట్టేస్తున్నట్టున్నారు. "

" నేనే జ్ఞానాన్నయితే నువ్వు కర్మ మార్గంలో ఎలా పడతావు? "

" ప్రశ్నగణపతి ప్రభో, యింకా వివరించండి."

" ఒక కథ చెపుతా విను, ఇది జరిగిన కథే. *

"మా నాన్న, సదాశివుడి రూపం "ఓం"కారమని నీకు తెలుసుగా. అందుకనే వేదమాత 'సదాశివోం' అన్నది. ఈ 'ఓం' లో- అ- ఉ- మ్, అనే అక్షరాలు వున్నాయి. ఈ అక్షరాల వరసను ఉ- మ్- అ గా మార్చి, ఉమ అని పేరు పెట్టుకొంది మా అమ్మ.

'ఒకప్పుడు వాళ్లిద్దరూ వాళ్ల పేర్ల గురించి మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. అపుడు వాళ్ల ఎదుటకు ఒక ఏనుగు వచ్చి, తొండం ఎత్తి ఆనందంగా ఘీంకారం చేసింది. ఎత్తిన ఏనుగు తొండమూ ఓంకారమే. దాని ఘీంకారమూ ఓంకారమే. ఒకటి కళ్లకు కనిపించే ఆకారం. మరొకటి చెవులకు వినిపించే ఆకారం.

సరిగ్గా సమయానికి వచ్చి వాళ్ల 'ఓం'కారానికి ఆకారం చూపించిన ఏనుగుమీద వాళ్లకు దయ కలిగింది. ఆ అనుగ్రహంవల్లే నేను ఏనుగుతలతో వాళ్లకి పుట్టాను. ఇది ఒక కల్పంలో జరిగిన కథ. అందుచేత నేనుగూడా ఓం కారాన్నే.

** ఓం అనే పదం "అవ" అనే ధాతువునుంచి పుట్టింది. ఈ 'అవ' అనే ధాతువుకి 19 అర్థాలు వున్నాయి.

---

* ఈ కథ స్కాంధపురాణంలో కాంచీమాహాత్మ్య ఖండంలో వుంది.

** అవ = రక్షణ, గతి, కాంతి, ప్రీతి, తృప్తి, అవగమ, ప్రవేశ, శ్రవణ సామర్థ్య, యాచన, క్రియేచ్ఛా, దీప్తి, వ్యాప్తి, అవాప్తి, ఆలింగన, హింసా, దాన, భోగ, వృద్ధిషు-అనేది యీ ధాతువు.

"ఇందులో పన్నెండు అర్థాలు ఓంకారానికి జ్ఞానమనే అర్థాన్ని సాక్షాత్తుగా సాధిస్తున్నాయి. మిగిలిన ఏడు అర్థాలు పరోక్షంగా అదే అర్థాన్ని సాధిస్తున్నాయి."

"ఓం"

"ఆగు. మరొక విశేషం వుంది.

"చిత్తం"

"ఓంకారం నాదంగూడా అవుతుంది. అవ ధాతువుకి శ్రవణం ( వినుట ) అనే అర్థం వుందిగా మరి."

"నాదోపాసనగూడా ఎక్కువ చేస్తానిక".

"మంచిది"

"ఇప్పటికి, ఉపాసనామార్గ, యోగమార్గ, కర్మమార్గ, జ్ఞానమార్గ, నాదమార్గాల సమన్వయ మయింది"

"ఇంకేం మిగిలింది?"

"ఏమీ మిగలలేదు."

"మరి అగస్త్యాది ఆజ్ఞ ఒకటి ఉన్నట్టుందిగా నీకు ?"

"మరిచిపోలేదు. ప్రజలకు చెయ్యి అందించి పైకి లాగాలన్నారుగా. ఆ మూలికా విద్యను అప్పుడు ఉపయోగిస్తాను.

"మరి ఈ అధునాతన విజ్ఞానశాస్త్రం మాటో ?"

"ఈ అల్పవిద్య మనకెందుకు ?"

"నీ వనుభవించిన దానిని చమత్కారరూపంగా చెప్పమని మీ అమ్మ చెప్పినట్టుందిగా."

"చిత్తం దీనిమీద గూడ దృష్టి పెడుతాను."

"దృష్టి పడితే చాలు. తక్కిన పని అదే అయిపోతుంది.

"తండ్రీ! అది నీ ఆశీస్సు కానీ!"

"తథాస్తు! మరి ఎప్పటిలోగా పూర్తిచేస్తావ్ యీ పనంతా ?"

"నీ ఆజ్ఞ."

"నీ సౌకర్యం. రేపో, ఎల్లుండో, నీ యిష్టం."

"రేపో, యెల్లుండోనా — అంటే మీ దేవమానంలోనా" ?

"పోనీ అలాగే కానీ. ఆ లెక్కలోనే పూర్తిచెయ్యి."

"రెండేళ్ళలో ఇంత పని జరగాలా ? పైగా ఒక ప్రక్కన వీధినపడి. ఐతే నీ అనుగ్రహం లేకుండా జరిగే పనా తండ్రీ."

"అందుకనే — సహాయం నీ కవసరం బాబా అని చెప్పా ఇందాకే. నువ్వు వినిపించుకుంటేగా."

"నువ్వు క్షమిస్తానంటే నా సందేహం చెప్తాను."

"మధ్యలో ఈ మర్యాద లెందుకు! ఊ! చెప్పు."

"నేను నిన్నింతగా ఎప్పుడూ ఉపాసించలేదే. నీ కింత శ్రమ ఎలా కలిగించేది. అని బాధపడుతున్నాను."

"నువ్వు ఎంత ఉపాసన చేశావో నీకు తెలిసే అంత లెక్క, డొక్క నీ దగ్గర వున్నాయా?"

"అలా అనికాదు."

"అసలు నీకీ సందేహం ఎందుకు? మీ అమ్మ ఉపవాసాల ఆధారంగానే నన్ను అనంతంగా ఉపాసించింది. ఆ తర్వాత బాలవృద్ధునై వెళ్ళి మీ అమ్మకీ, నాన్నకీ పెళ్ళి చేసింది నేనే. ఆ తరువాత నువ్వు బెంగుళూరులో, నీ మేనమామ యిల్లు తెలీక, తిండి తిప్పలు లేక తిరుగాడుతుంటే నీకీ సహాయం పెట్టింది నేనే బాబూ!

చాముండీ దేవాలయంలో, నీ పెదతండ్రి చేతికింద పనికి నిన్ను వాడుకుంటుంటే, నేనే నాన్నా, నిన్ను నా సన్నిధికి లాక్కున్నాను. ఉపాసన చేయించుకున్నాను. కేసరే చతుష్పథంలో నవరాత్రి వుత్సవాలలో నీ చేత నేను నా అర్చన చేయించుకున్నాను. నీ ఉపనయనాగ్నిలో నీకు బ్రహ్మస్వరూపంగా దర్శనమిచ్చిన విరాట్పురుషుణ్ణి నేనేనయ్యా! ఆ తరువాత రోజుల్లో నీచెవుల్లో ముద్గల పురాణం వినిపించిందెవరు? నేను కాదుటయ్యా! మీ పాఠశాలలో నా చవితినాడు, నిన్ను వేదికమీది కెక్కించి నీ నోటంబడి ఉపన్యసించింది నేనే. ఆ విధంగా నీ ప్రజ్ఞావిష్కరణకు బహిరంగ ప్రారంభోత్సవం నేనే చేశాను."

"వత్సా! నీ ఉపాసన మీ అమ్మతోనే ప్రారంభమైంది. నేను ఫలమివ్వటం నీ ఉపనయనంతోనే ప్రారంభమైంది. నువ్వు నాకు పరాయివాడవు కాదు. నేను గూడ........"

"ప్రశ్న గణపతి ప్రభో నువ్వు నాకు తండ్రివి, నన్ను నడిపించు."

"సరే విను. ఒకటి నీ దీక్ష ప్రణాళికకు సంబంధించిన పనులు చెప్పానే, అవి వెంటనే మొదలుపెట్టు"

"సరే, రెండు" :

"నీ హోమం మొదలుపెట్టు"

"మూడు"

"నీ దగ్గరకు ప్రజలు తండోపతండాలుగా వస్తారు."

"వస్తేరానీ! ఆ హోమశక్తి వారికి ఫలితాల నిస్తుందికదా."

"ఇస్తుంది. కాని వారు దానితో తృప్తిపడర్రు. నీ నెత్తిన అనేక సమస్యలు పడేస్తారు. అనేక ప్రశ్నలతో విసిగిస్తారు."

"అప్పుడేం చెయ్యాలి. ?"

"అప్పుడు నీబుర్ర వాటిమీద పెట్టకు. నాకు చెప్పు. ఏం చెయ్యాలో నేను చెపుతాను. చిన్న సమస్యలన్నీ మన అర్కగణపతిగారున్నారుగా, వారు చూసుకుంటారు. పెద్ద సమస్యలు వస్తే నీ యోగశక్తి ఉపయోగించుకో."

"సరే".

"ఏఏ యోగప్రక్రియలు, ఏఏ పూజాకల్పాలు, ఏఏ హోమ విధానాలు, ఆచరించాలో అవన్నీ నేనే చెపుతాను."

"అనుగ్రహం".

"ప్రజలకు ఏం బోధలు చెయ్యాలో గూడ చెపుతాను."

"అనుగ్రహం".

"క్రమంగా నీకు తీరిక చిక్కుతుంది. అప్పుడు నాకు పని తగ్గుతుంది."

"ధన్యోస్మి"

"నీ యెదుటవున్న ప్రణాళిక విశాలమైనది, జటిలమైనది, దీర్ఘకాలికమైనది. అనేకమైన మెలికలు, మలుపులు వుంటాయి."

"తండ్రీ నువ్వే నడిపించు."

"తథాస్తు. ఎప్పటికేది కావాలో అంతమాత్రమే మాట్లాడుకుందాం."

"చిత్తం"

"అదిగో శ్రీకంఠయ్య వస్తున్నాడు. పని మొదలుపెట్టు".

"ఆజ్ఞ".

సత్యనారాయణ తన చేతిలోవున్న గణపతి శిలను చటుక్కున పూజాసంపుటంలో పెట్టేసి నమస్కారం చేస్తుండగా శ్రీకంఠయ్య యింట్లోకి ప్రవేశించాడు. 'ఏమప్పా భోజనం అయిందా ?' అంటూ.

అయింది అన్నాడు సత్యనారాయణ ఉత్సాహంగా.

"ఎక్కడ చేశావు?" అనుమానంగా అడిగాడు శ్రీకంఠయ్య.

"ఇప్పటిదాకా మా యింట్లోవుంటి యిప్పుడే వస్తున్నాను. మీరొచ్చారు." అన్నాడు సత్యనారాయణ.



"ಶ್ರೀ ಸತ್ಯ ಗಣಪತೆಯೇ ನಮಃ"

ದುರಹಂಕಾರಿಗಳಿಗೆ ಗುರುವಿನ ಮನದಲಿ ಸ್ಥಾನವಿಲ್ಲ.

ಅಹಂಕಾರಗಳಿಂದ ತುಂಬಿದ ಮಹಾತ್ಮರ ದೈವ ಪರೀಕ್ಷರು ಗುರುವಿನ ನೇತ್ರಗಳಿಗೆ ಅಗೋಚರರು.

ಕಾಮ, ಕ್ರೋಧ, ಲೋಭ, ಮೋಹ ಮದ, ಮಾತ್ಸರ್ಯಗಳಿಂದ ತುಂಬಿದ ನೀಚ ಶರೀರಕರಿಗೆ ವಿಭೂತಿ ಪ್ರಸಾದವಿಲ್ಲ.

ತನು, ಶಿರ ತಗ್ಗಿಸಿದವನನ್ನು ಗುರುವಿನ ಅಭಯವು ಎತ್ತಿ ಹಿಡಿಯುವುದು.

ಚಾಪಲ್ಯ ಚಿತ್ತ ವಿಕಲರಿಗೆ ರಸವತ್ತಾದ ಜಲತೀರ್ಥವಿಲ್ಲ.

ತನ್ನ ತಾನರಿತು ಶಿರ ಬಾಗಿದವಂಗೆ ಗುರು ಅವನಲ್ಲಿ ಭಾಗಿ.

ಕೋಪ ತಾಪಗಳ ಸಮುದ್ರದಲಿ ಸಿಕ್ಕಿದವಗೆ ಗುರು ನಾವೆಯಾಗುವುದಿಲ್ಲ.

ಹಣ ಕಾಸಿನ ಅಹಂಕಾರದಲ್ಲಿ ತಲೆದೂಗಿದವಂಗೆ ಗುರುವಿನ ಮೃದುವಾದ ಹೂವು ಇಲ್ಲ.

ಗುರುವಿನಲಿ ಯಾವಂಗೆ ಧೃಢಾಭಿಮಾನವೋ ಅವನಲ್ಲಿ ಗುರು ಅಭಿಮಾನವು.

ನನ್ನ ವಾಕ್ಯವು ಕೆಲವರಿಗೆ ಕುತ್ತಿಗೆಗೆ ಕತ್ತರಿ ; ಕೆಲವರಿಗೆ ಕುತ್ತಿಗೆಗೆ ಹಾರವು. ಕೆಲವರಿಗೆ ಕರ್ಣ ಕಠೋರವು, ಕೆಲವರಿಗೆ ಅಮೃತ ವಾಕ್ಯವು.

ನಾನು ಯಾರೆಂಬ ಅರಿವು ಯಾರಲ್ಲಿ ಬೆಳೆವುದೋ ಅವರಲ್ಲಿ ಬೆಳೆದು ನಿಂದಿಹೆನು ನಾನು.

ಕಲಿ ಧರ್ಮದಲಿ ಇಂದು ಜಲವಿಲ್ಲದ ಈಜು, ಉಸಿರಾಟಕ್ಕೆ ವಾಯುವಿಲ್ಲ. ಧರ್ಮ, ಸತ್ಯಗಳ ಎತ್ತಿ ಹಿಡಿವಾತರ ಶಿರಸ್ಸು ನೆಲ ಬಾಗಲಿಕ್ಕಿಲ್ಲ.

ಕರ್ಮ ತೊಳೆಯುವ ವಾಕ್ಯ, ಸತ್ಯ ಬೀರುವವಾಕ್ಯ, ಪ್ರೇಮಸಾರುವ ನುಡಿಯು ಅಗ್ನಿಯಿಲ್ಲದೆ ದಹನ ಮಾಡುವ ನುಡಿಗಳು.

ಅರ್ಥ ಅರಿಯದೆ ಆಡುವ ಮಂತ್ರ ಬೆಳಕಿಲ್ಲದ ಕುರುಡ ಹಣತೆ.

ಅರಿತು ಆಡಿದ ಗುರುವಾಕ್ಯ, ಪಾಲನೆ ಮಾಡುವಂಗೆ ದೈವದ ನುಡಿಗಳು.

ಸರ್ವ ಧರ್ಮ ಸತ್ಪುರುಷ ಸತ್ಯನಾರಾಯಣಸ್ವಾಮಿ,
ಸತ್ಯ ವಾಕ್ಯದ ಹಿತ ನುಡಿಗಳು.

ಎಂ. ವಿ. ಪಿ ಪ್ರೆಸ್, ಮೈಸೂರು.

1964 ప్రాంతాలలో శ్రీ స్వామీజీ ప్రకటింపజేసిన మొట్టమొదటి ధర్మప్రచార కరపత్రం



1964 ప్రాంతాలలో తను దేవతార్చన సంపుటం చేతదాల్చివున్న శ్రీ స్వామీజీ



1964లో తమ తెల్లబట్టలు వదలి శోణవస్త్రదీక్ష ప్రారంభించిన రోజులలో శ్రీ స్వామీజీ

దాంతో కొంత విశ్వాసం కుదిరింది శ్రీకంఠయ్యకు. అంచేత కాస్తా గోడకు చేరగిలబడి కూచుంటూ–

"చూడు బాబూ నువ్వు చిన్నవాడివి. పెద్దవాళ్లు కోపంలో అన్నవి మనసులో పెట్టుకోనరాదు. వాళ్లు మన మంచికోసమే గదా అంటారు" అన్నాడు.

"అబ్బెబ్బే అదేంలేదండీ. దేవతార్చనకు యింట్లో చోటు తక్కువగా వుంది గదా అని, మీ యింట్లో దేవతార్చన విశ్రాంతిగా చేసుకోవచ్చు గదా అని వచ్చానంతే." అన్నాడు సత్యనారాయణ.

తన మాటను అతను అపార్థం చేసుకున్నాడేమో అని, "అహహ ! నువ్విక్కడ విశ్రాంతిగా సుఖంగా వుండు. దేవతార్చన చేసుకో. జపం చేసుకో. పడుకో. నీ యిష్టం. ఇది నీ యిల్లు. అసలు మనిద్దరం దేవుడికి నైవేద్యం చేసికొని చెరికాస్తా తింటే సరిపోతుంది. అదికాదు నేననేది. పెద్దవాళ్ళ మీద వేరే ద్వేషం పెట్టుకోవద్దు అంటున్నా నంతే" అని సవరించుకొన్నాడు శ్రీకంఠయ్య.

"ద్వేషమా, అది లేనేలేదు కదండీ మా సర్వీసులో!" అన్నాడు సత్యనారాయణ హాస్యంగా. అని ఒక క్షణం ఆగి–

"మనసుంటే వొక చిన్న హోమప్రక్రియ వుందండి. దాని ఫలం అద్భుతం. మనిద్దరం కలిసి చేసుకొంటే బ్రహ్మాండంగా వుంటుంది." అన్నాడు శ్రీకంఠయ్య కళ్ళల్లోకి గుచ్చి చూస్తూ.

"మనిద్దరమే చాలా? చేయించేందుకు ఇంకెవరూ అక్కరలేదా?" అన్నాడు శ్రీకంఠయ్య.

"ఎవ్వరూ అక్కర్లేదండీ. ఒక పావుకిలో నెయ్యి వుంటే ఎక్కువ. చేతనయితే పూర్ణాహుతిలో, ఎండు కొబ్బరికాయ వేద్దాం. లేకపోతే కొబ్బరిముక్కతో సరిపోతుంది." చాలా సులభంగా చెప్పాడు సత్యనారాయణ.

"అయితే ఆలస్యమెందుకయ్యా. ఇప్పుడే మొదలు పెడదామా." అన్నాడు ఎగిరిగంతేసి శ్రీకంఠయ్యగారు.

"ఆగండి, ఆగండి, రేపు ఆదివారం మనిద్దరం రహస్యంగా చేసుకుందాం. ఇంకొకరి గోల మనకొద్దు" అన్నాడు సత్యనారాయణ.

ఆ రోజు సాయంత్రమే యింటికి వెళ్ళాడు సత్యనారాయణ. ఎవరూ పలకరించలేదు. తాతగారు బాగా దగ్గుతున్నాడు. ఆయనకు మందు అందించాడు తనే. ఆయన మందు వేసుకొని ఆయాస పడుతూ "అన్నం తిన్నావు్రా" అన్నాడు ముక్తసరిగా.

'శ్రీకంఠయ్య ఇంట్లో' అని హెడిగ అనేసి, వచ్చేశాడు సత్యనారాయణ. వచ్చే టప్పుడు తన బట్టలు నాలుగు తెచ్చుకొన్నాడు.

## మొదలు

ఆ రాత్రి ధ్యానంలో కూర్చున్నాడు సత్యనారాయణ. మెల్లిగా కునికిపాట్లు పడుతున్నాడు శ్రీకంఠయ్య. గదిలో చిన్న రాత్రి దీపం ( **Bedlamp** ) వెలుగుతోంది.

కొంతసేపయినాక సుమారుగ అర్ధరాత్రి సమయంలో ఏదో అద్భుతమైన సువాసన వస్తున్నట్టనిపించి కళ్లు తెరిచి చూచాడు శ్రీకంఠయ్యగారు. చూచినవాడు కొరడాతో కొట్టినట్టు లేచి వపటా వేసుకొని కూర్చుని, గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయాడు.

సత్యనారాయణ పద్మాసనంలో కూర్చుని రెండు అరచేతులూ మోకాళ్లమీద వెల్లకిలా పెట్టుకొని ధ్యానంలో వున్నాడు. అతని అరచేతుల లోంచి అరికాళ్లలోంచి గూడా విభూతి సన్న ధారలుగా కారుతోంది. ఆ వాసన ఆ విభూతిది. ఓహ్ ! ఏమి సువాసన అది ! జన్మలో తన జన్మలో తను, అటువంటి పరిమళం ఎరగడు. శ్రీకంఠయ్య ఆశ్చర్యస్తబ్ధుడై, అలా వుండి పోయాడు. ఆ విభూతి, సత్యనారాయణ మోకాళ్ల దగ్గర కుప్పగా పేరుకొంటోంది. కుప్ప క్రమంగా పెరిగి, అతని మోకాళ్ళు మూసుకుపోయాయి.

ఆ స్థితిలో సత్యనారాయణ కళ్ళు తెరిచాడు. ఆ కళ్లు జ్యోతులలాగా వెలుగుతున్నాయి. ఇద్దరి కళ్ళూ కలిశాయి. భయంవేసి కళ్ళు దించేసుకొన్నాడు శ్రీకంఠయ్య.

సత్యనారాయణ మౌనంగా ఆ విభూతి, ఒక చిటికెడు తీసి శ్రీకంఠయ్య వంక చూశాడు. దోసిలి పట్టి ప్రసాదం అందుకున్నాడు శ్రీకంఠయ్య. తరువాత సత్యనారాయణ మెల్లగా లేచి, ఒక కాయితం తెచ్చి, ఆ విభూతి ఎత్తసాగాడు. అది చూసి శ్రీకంఠయ్య ముందుకెళ్ళి "నేను తీస్తాను, మీరు తప్పుకొండి" అన్నాడు.

ఈ బహువచన సంబోధనకు గాబోలు కొంచెం ఆశ్చర్యంగా చూసి, సత్యనారాయణ మౌనంగా పక్కకు తప్పుకొని ఇవతలకు వచ్చి చాపమీద పడుకున్నాడు.

విబూతి సర్దాక శ్రీకంఠయ్య ఒకగంటో, రెండుగంటలో పడుకున్నాడేమో ! ఇంతలో దేవతార్చన గంట వినిపించింది. లేచి లోపల గదిలోకి వెళ్లి చూశాడు. ఎప్పుడు లేచాడో, చప్పుడు కాకుండా స్నానం ఎలా చేశాడోకాని అప్పుడే అర్కగణపతికి అభిషేకం చేస్తున్నాడు సత్యనారాయణ. పరమానంద పడ్డాడు శ్రీకంఠయ్య. ఆ పూజ తెల్లవారేదాకా సాగింది.

ఈలోగా స్నానం చేసి వచ్చి, తనూ పక్కగా కూచున్నాడు శ్రీకంఠయ్య. పూజ అయినాక తీర్థం పుచ్చుకుంటూ అడిగాడు, 'సత్యనారాయణా! ఆ విగ్రహం ఏం విగ్రహం?' అని,

'ఆయన అర్కగణపతి.' అంటూ, అర్కగణపతి తనకు లభించిన కథ సంగ్రహంగా చెప్పాడు సత్యనారాయణ.

"ఆ రాయేమిటి?" అన్నాడు దేవతార్చనలోకి చూస్తూ శ్రీకంఠయ్య.

"తప్పు, అలా అనరాదు. ఆయన ప్రశ్నగణపతి. మహా తేజశ్శాలి. నమస్కారం పెట్టుకోండి. వీరి గురించి మీకు తరువాత తెలుస్తుంది లెండి" అన్నాడు సత్యనారాయణ.

అర్కగణపతి అని విన్నాక శ్రీకంఠయ్య రోజూ దగ్గరలో వున్న తెల్లజిల్లేడు పూలు కోసుకొచ్చి పూజకు అందించసాగాడు.

ఆ రోజునుంచే ఆదివారం హోమానికి యేర్పాట్లు చేయసాగాడు శ్రీకంఠయ్య. సత్యనారాయణ అక్కరలేదని చెప్పినా పూర్ణాహుతి ద్రవ్యాలు గూడ పూర్తిగా తెచ్చాడాయన. ఇద్దరూ కలిసి సమిధలు వగైరా పోగేశారు.

ఆదివారం రానేవచ్చింది. ఆ రోజు శ్రీకంఠయ్యకు సెలవు కలిసొచ్చింది. మిత్రు లిద్దరూ తలుపు వేసుకొని మెల్లగా హోమం ప్రారంభించారు. హోమం ప్రారంభ మయ్యేసరికి క్రమంగా సత్యనారాయణ స్వరూపం మారిపోసాగింది.

ఇంట్లోనే నేలమీద కాస్త యిసక పోసి చుట్టూతా నాలుగు సున్నపు పెళ్ళలు, బరంతు రాతిముక్కలు అడ్డం పెట్టి మధ్యలో అగ్నిని ప్రతిష్ఠించారు. పూర్వరంగం పూర్తిచేసి ప్రధాన హోమం దగ్గరకు వచ్చేసరికి సత్యనారాయణ ప్రశ్నగణపతి శిలను కుడిచేత్తో తనకుడి చెవ్వు దగ్గర పెట్టుకొని అంతులేని వేగంతో మంత్రాలు చెపుతూ శ్రీకంఠయ్యనే హోమం చెయ్యమని సంజ్ఞ చేశాడు.

శ్రీకంఠయ్య మామిడాకుతో నెయ్యి తీసి అగ్నిలో వేస్తూ, ఆ వేగం అందుకోలేక యిబ్బంది పడుతున్నాడు. హోమం సాగి, హోమధూమం ఆ చిన్న యింటిని ఆవరించేసి చోటుచాలక కిటికీ ద్వారా ఆకాశంలోకి యెగరసాగింది.

రైలింజనులోంచి వస్తున్నట్టు, ఉన్నట్టుండి అంత పొగ శ్రీకంఠయ్య ఇంట్లోంచి రావటం గమనించిన ఇరుగు పొరుగువారు ఏమయిందో ఏమో అని ఆదుర్దాపడుతూ గబగబా పరిగెత్తుకొచ్చారు. వచ్చి దబదబా తలుపులు బాదారు.

హోమం తమకంలో వున్న శ్రీకంఠయ్యకు చిర్రెత్తింది. మాట్లాడకూరుకుంటే వాళ్ళే వెళ్ళిపోతార్లే అని కదలకుండా కూర్చొని హోమం చేస్తున్నాడు. సత్యనారాయణ అసలీ లోకంలో లేడు. ఈ విషయమే అతనికి తెలియదు.

లోపల్నించి ఏవో విచిత్రమైన మాటలు వినిపిస్తున్నాయి. తలుపులు కొడితే పలకటం లేదు. దాంతో భయం వేసి కుర్చీపీట తీసుకొని వెంటిలేటరు లోంచి చూచారు పొరుగువారు. లోపల దీక్షగా హోమం జరుగుతోంది.

దాంతో వాళ్లకు అదుర్దా అయితే తగ్గింది గాని వార్త మాత్రం యీ పొగకంటె సుదూరాలకు గుప్పుమన్నది. "శ్రీకంఠయ్య ఇంటికి ఎవరో కుర్రాడొచ్చాడు. అతను గణపతి ఉపాసకుడట. మహిమలు గలవాడట. వాళ్లింట్లో హోమంగూడ చేస్తున్నారు" అని. శ్రీకంఠయ్య దగ్గర వాకబు చేయటాలు పెరిగినాయి. "నన్నడుగుతారేమయ్యా ? అతను గణపతి ఉపాసకుడు. రోజూ పూజ చేస్తాడు. ఆ సమయానికి వచ్చి మీరే చూడండి" అన్నాడు విసుగ్గా.

ఆయన విసుగే ఆహ్వానంగా పరిణమించింది. అసలు విషయ మేమిటో చూద్దామని ఆ మర్నాడు పొద్దున్నే పూజవేళకు నలుగు రయిదుగురు కాలనీవాసులు వచ్చారు. అందులో కొందరు తెల్లజిల్లేడు పువ్వులు తెచ్చారు.

ఆ కుర్రవాడు సహస్రనామాల పుస్తకం చూస్తూ నామాలు చదువుతున్నాడు. ఒక్కొక్క జిల్లేడు పువ్వు యాంత్రికంగా తీసి గణపతి మీాదికి విసురుతున్నాడు. అది గణపతి మీాద పడేసరికి మల్లెపూవు అవుతోంది. క్రమంగా మల్లెపూల సువాసన ఆ గదిలో గుబాళించసాగింది.

వేసవికాలం గడిచిపోయి, వర్షాకాలం మొదలయిన రోజులవి. మార్కెట్టులో మల్లెపూలు బాగా తగ్గిపోయినై. అంత ఖరీదు పెట్టి మల్లెపూలు తేగలిగిన వారెవరూ ఆ వచ్చినవారిలో లేరు. ఈ జిల్లేడు పూలంటే వూరికే దొరికాయి గనుక తెచ్చినవారే. ఒకవేళ తెద్దామనుకున్నా అంత పొద్దున్నే అంత చక్కగా అరవిచ్చిన పూలు బజార్లో కాదుగదా తోటల్లో చెట్లమీాద గూడా వుండవు.

రాత్రి పూలయితే పూర్తిగా నెరవిచ్చిపోయి కళ తప్పి వుంటాయి. ఇవాల్టి పూలు యింకా మొగ్గలుగానే వుంటాయి. మరి ఈ అరవిచ్చిన తాజా పువ్వు లీ పొద్దున్నే ఎక్కడి నుండి వచ్చాయి ? చూసే వాళ్ళకు మతి పోయినంత పనైంది. పూజ అయింది. తీర్థం తీసుకొని మౌనంగా వెళ్ళిపోయారు.

రోజురోజూ పొద్దుటి పూట పూజ చూడటానికి వచ్చేవారి సంఖ్య పెరుగుతోంది. ఆ పూజా సమయంలో రోజుకొక వింత జరుగుతోంది. నిన్నటి వింత యివాళ్ల జరగటం లేదు.

నాలుగైదు రోజులు పోయినాక నటరాజు అనే కాలనీవాసి సాయంత్రం వేళ వచ్చి శ్రీకంఠయ్యతో కబుర్లు మొదలెట్టాడు. పక్కన సత్యనారాయణ గూడా వున్నాడు.

"శ్రీ కంఠయ్యా ! మొన్న ఆదివారం హోమం చేయించావుగా, నీ కేమి వచ్చింది ?"

"నాకేం రావాలి ? నాబొంద. నే నొక సన్యాసిని. నా కేమీా కావాలనీ కోరుకోలేదు. రానూ లేదు."

"మరెందుకు చేయించావు ?"

" చేయించటు మేమిటి ? చేద్దాం అంటే చేద్దామనుకున్నాం. ఇద్దరం సరదాగా చేశాం. అంతే. "

" రేపు ఆదివారం మళ్లీ చేస్తారా ? "

" వారంవారం అదే పనా యేమిటి ? "

" ఏం, ఎంతయిందేమిటి ? "

" పది రూపాయ లయింది. "

" రేపు ఆదివారం మళ్లీ హోమం చెయ్యమంటే చేస్తాడా మీ కుర్రాడు ? "

" మా కుర్రాడేమిటి ? నేనేమీ కొనుక్కోలే దతన్ని. నువ్వే అడుగు. ఎదురుగానే వున్నాడుగా. "

ఇంతవరకూ వచ్చాక సత్యనారాయణ తనే అందుకున్నాడు " ఏమిటండీ అది "అని.

" రేపు ఆడవారం గూడ హోమం చెయ్యమంటున్నాడు యీాయన " అన్నాడు హేళనగా శ్రీకంఠయ్య.

" అదా ! కనుక్కొని చెపుతా వుండండి " అని లోపలికి వెళ్లి ప్రశ్న గణపతిని చెవి దగ్గర పెట్టుకొని, ఒక క్షణంలో తిరిగివచ్చి, " సరే నంటున్నాడు గణపతి " అన్నాడు.

ఆ పెద్దమనిషి అయోమయంగా చూశాడు. చూసి చూసి చివరకు " ఆహాఁ.... ఊరికే అడుగుతున్నా ! ఈ హోమం చేస్తే మనకేం వస్తుందండీ " అన్నాడు.

"ఏమీరాదు. గణపతి అనుగ్రహం వస్తుంది. ఏదో రావాలనుకుంటే దింట్లోకి దిగకండి. నాకేం జవాబుదారీ లేదు. ముందే చెప్తున్నా" అన్నాడు సత్యనారాయణ, ఏమాత్రం మర్యాదలేని కంఠధ్వనితో.

నటరాజు కాస్త తొట్రుపడి - "అబ్బెబ్బే అదేంలేదండీ. వూరికే అడిగా. ఏమేం తీసుకు రావాలో చెప్పండి" అన్నాడు.

లిస్టు రాసుకు వెళ్లిపోయాడు.

ఆ ఆదివారంనాడు ఆ నటరాజుతో పాటు భార్య గూడ వచ్చింది. ఈమాటు తలుపులు తెరిచే హోమం చేయసాగారు. మళ్లీ శ్రీకంఠయ్యే ఋత్విక్కు. ఒక పదిమంది దాకా చూడ టానికి వచ్చారు. అగ్నిహోత్రం కాక, ఈ పదిమందీ కూర్చునేసరికి ఆ గది కిటకిటలాడింది.

సత్యనారాయణ ప్రశ్నగణపతిని చెవిదగ్గర పెట్టుకొని వేగంగా ఏవో బీజాక్షరాలు ఉచ్చరించసాగాడు. సూపర్ఎక్స్‌ప్రెస్ రైలుబండి పిష్టను కదలికకు గూడ అంత వేగం గల ధ్వని వుండదేమో. అవి మంత్రాలో, బీజాక్షరాలో ఏవోగాని అక్కడ కూర్చున్న పదిమందికి ఆ రెండుగంటలూ వొళ్లు తెలియలేదు.

హోమం పూర్తయింది. అప్పటి వరకూ సత్యనారాయణ మిరుమిట్లు గొలిపిన తేజస్సులో ఉగ్రతగూడ తగ్గింది. ప్రసాదం యిచ్చేటప్పుడు నటరాజును, పక్కకు తప్పుకోమని భార్యచేతిలో పెట్టాడు సత్యనారాయణ. ఎందుకోగాని ఆవిడ కళ్ళంబడి రెండు అశ్రువులు రాల్చింది. ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

వచ్చిన వారందరికీ ఏదో కొద్దిగా ప్రసాదం పెట్టారు. ఎందుకో తెలియదుగాని వచ్చినవారంతా ఆనందంగా యింటికి వెళ్ళారు.

నాలుగు రోజులు పోయాక, ఆ నటరాజు శ్రీ కంఠయ్యను ఆఫీసులో కలిసి " మీ కుర్రవాడు గట్టివాడేనల్లే వుందయ్యా" అన్నాడు.

" ఏమిటి విషయం ? " అని అడిగారు శ్రీ కంఠయ్యగారు. అతను చెప్పసాగాడు.

"మా ఆవిడకు కడుపులో పెద్ద అల్సరు వుంది. ఆపరేషను చేయాలన్నారు. మొన్న సోమవారం చేస్తామన్నారు. ఆపరేషను ముందర ఏదైనా పూజలు చేయించుకుంటే బావుండు ననుకుంటున్నాను. ఇంతలో మీ యింటిలో కుర్రాడి సంగతి విని, పోనీలే పూజ బదులు హోమం చేయిద్దామని చేయించాను. ఆ రోజున ఆయన ప్రసాదం నా కివ్వకుండా నా భార్య చేతికే యిచ్చాడు. నువ్వు గమనించావో లేదో, సరే, ఆ మర్నాడే సోమవారం గదా! హాస్పిటలుకి పోయాం. వెళ్ళంగానే "నిన్నరాత్రి యివ్వాళ్ళ గూడ నొప్పి రాలేదు" అని చెప్పింది మా ఆవిడ. డాక్టర్లకు అనుమానం వచ్చి మళ్ళీ పరీక్షలు చేశారు. మళ్ళీ మరో డాక్టరుని పిల్చి పరీక్ష చేయించారు. చివరికి యిపుడు ప్రస్తుతంలో అల్సరేమీ కనిపించటం లేదు. మళ్ళీ పదిరోజులు పోయాక కనిపించండి అని పంపించేశారయ్యా. మా ఆవిడ హాయిగా తిరుగుతోంది. ఇప్పుడు మా అమ్మాయి గారి వూరు వెళ్ళింది, దాన్ని పురిటికి తీసుకురావటానికి." ఈ కథ విని శ్రీకంఠయ్య నిజంగానే ఆశ్చర్యపోయాడు.

" ఒకసారి మీ దంపతు లిద్దరూ వచ్చి, అతనితో యిల్లా జరిగిందని చెప్పి కృతజ్ఞతలు తెలపితే బాగుండేదిగా" .అన్నాడు.

"అదే అనుకున్నానయ్యా ! ఏమిటో బద్ధకంగా వుంటోంది. వస్తా. పైవారమయినా తప్పక వస్తా " అన్నాడు నటరాజు.

"అహా ! ప్రాణ ప్రమాదమైన రోగం. వేలు మింగే ఆపరేషను. రెండూ పది రూపాయలతో ఎగిరిపోయాయి. వచ్చి కృతజ్ఞతలు చెప్పటానికి బద్ధకంగా వుంది!! కూతుర్ని పురిటికి తెచ్చుకోటానికి బద్ధకం లేదు. ఆహా, ఏమి లోకం ? ఏమి జనం ?" అనుకున్నాడు శ్రీకంఠయ్య.

ఆ నటరాజు కృతజ్ఞత చెప్పటానికి బద్ధకించినా, తన మిత్రులందరికీ తన సంతోష వార్త ఆనందంగా చెప్పుకున్నాడు. ఆ విధంగా యీ రోగ నివారణ వార్త, కాలనీ దాటి పేటలో వెళ్లిపడ్డది. అలాగే ఆ నటరాజు భార్య, కూతురుతో ఆవిడ అత్తారితో చెప్పటం వల్ల ఈ వార్త ఊరు గూడా దాటింది.

సత్యనారాయణ రోజు కొకసారి యింటికి పోయి చూసి వస్తున్నాడు. అంతకు ముందే అతని దగ్గరకు భక్తితో వచ్చి పోయేవారికి, ఇతను ఎలక్ట్రిసిటీ కాలనీలో శ్రీకంఠయ్య యింట్లో వుంటున్నాడనీ, ఆదివారాల్లో హోమం గూడ చేస్తున్నాడనీ తెలిసింది. దాంతో అప్పటిదాకా నిద్రాణంగా వున్న ఆ చిన్న యిల్లు నలుగురి పలకరింపులతో పులకరించసాగింది.

మూడవ ఆదివారం హోమంగూడా ఎవరో వచ్చి చెయ్యమని కోరటంతో యథా ప్రకారంగా జరిగిపోయింది. అయితే క్రిందటి వారమే కిటకిటలాడిన ఆ యిల్లు యీ మాటు పెటపెటలాడి ఉక్కిరి బిక్కిరై పోయింది.

రెండు రోజులు గడిచాయి.

ఒక రోజు సత్యనారాయణ ఎక్కడికో వెళ్ళి వచ్చేసరికి కోపంగా కూర్చొని వున్నాడు శ్రీకంఠయ్య. సత్యనారాయణను చూస్తూ,

"అబద్ధాలు చెప్పొచ్చా" అన్నాడు. విషయం సులభంగానే అర్థమైంది సత్యనారాయణకి.

"ఏంచేస్తాం? ఒక్కొక్క జీవితానికి కొన్ని దౌర్భాగ్యాలు తప్పవు" అన్నాడు విషాదంగా.

"ఏమీ, నేను చచ్చాననుకొన్నావా? నేను బ్రతికుండగానే నీవు పస్తులు పడు కొంటావా? ఇది ధర్మమా? చెప్పు. నువ్వు పెద్ద ఉపాసకుడివిగా." శ్రీకంఠయ్య కంఠం ప్రేమోద్వేగం వల్ల పెరిగిపోయింది.

"ఏంచెయ్యనండీ? ఇప్పటికే మా వాళ్ళకు ఎంతో ఋణపడి వున్నాను నేను. ఆ ఋణ భారం యింకా దిగలేదు నాకు. మళ్ళీ–" సత్యనారాయణ దీనంగా సగంలో ఆగిపోయాడు.

"నేను ఒక్కణ్ణి. నా కెవరున్నారు వెనకా ముందూ? నువ్వొక్కడివి. ఆ గణపతికి నైవేద్యం చేసింది చెరిసగం తింటే, ఇంతలో నా కేమయినా దరిద్రం వస్తుందా? నువ్వు నాకు ఋణపడి పోతావా?"

రెట్టించాడు శ్రీకంఠయ్య. మౌనంగా వుండిపోయాడు సత్యనారాయణ.

"అయినా, యిక్కడ తిన్నానని అక్కడ, అక్కడ తిన్నానని యిక్కడ చెప్పి మూడు వారాల నుంచీ పస్తున్నావు గదా! ఇంత పంత మెందుకయ్యా నీకు?" మళ్ళీ నిలదీసే ధోరణిలో అడిగాడు శ్రీకంఠయ్య.

"పంతం ఎవరిమీదండీ" అన్నాడు నిస్సహాయంగా సత్యనారాయణ.

" నామీద ".

" ఛఛ, ఎంతమాటండీ "

" పోనీ మీవాళ్ళమీద "

" వాళ్ళ తప్పేముందండీ "

" మరి ఎవరిమీద నీ పంతం "

" నామీదే నాకు పంతం."

" ఏమని "

" నా కేదయినా ఉద్యోగం దొరకాలి. నా ఋణభారం తీరాలి. అప్పుడు ఏ క్షేత్రానికో పోయి శరీరత్యాగం చేయాలి. "

ఈ మాటతో శ్రీకంఠయ్య నీరుకారిపోయాడు.

" ఏం మాటలయ్యా అవి ? ఉద్యోగం లేదని అంత బెంబేలు పడతారా? ఉద్యోగం కోసం పస్తులుంటారటయ్యా ఎవరైనా ? ఇన్ని మాట లెందుకు ? నేను చెప్పినట్టు చేస్తావా, చెయ్యవా ? " అన్నాడు లాలనగా.

" చెప్పండి, చేస్తాను " బుద్ధిమంతుడిలాగ అన్నాడు సత్యనారాయణ.

" అయిందేదో అయింది. ఎందుకిలా చేశావని నే నడగను. ఏం జరిగిందనీ అడగను. " గతం గతం " వదిలేయ్. ఇవాల్టి నుంచీ నాతోనే కలిసి నువ్వన్నం తినాలి. తెంటానని వాగ్దానం చెయ్యి. " అని చెయ్యి ముందుకు చాచాడు శ్రీకంఠయ్య.

" చేతిలో చెయ్యక్కర లేదు లెండి. మీరు చెప్పినట్టే కానీండి. మీ ఋణం ఎప్పటికో అప్పటికి తీర్చుకోలేక పోతాను." అన్నాడు సత్యనారాయణ.

"ఋణం గిణం ఏమీ లేదు గానీ ముందు కాళ్ళు కడుక్కుని అన్నానికి రా!" తొందర పెట్టాడు శ్రీకంఠయ్య.

" ఇప్పు డన్న మేమిటి ఎటూ కాకుండా ?" ఆశ్చర్యపోయాడు సత్యనారాయణ.

" ఇరవైరోజులనుంచీ తెండి తినని వాడికి వేళేమిటి? అన్నం వండి నీకోసం ఎదురు చూస్తూ కూచున్నా. నడునడు." అన్నాడు శ్రీకంఠయ్య.

కరిగిపోవటం ఈ మాటు సత్యనారాయణ వంతయింది. ఒక క్షణం తమాయించుకొని " సరే, పదండి, భోంచేద్దాం " అన్నాడు, మూడువారాల తరువాత అన్నంముద్ద నోట్లో పెట్టుకుంటూ.

" పొద్దుటూరు తరువాత, అన్నానికి ఈ రుచి మళ్లీ ఇక్కడే శ్రీకంఠయ్యగారూ !", అన్నాడు సత్యనారాయణ ఆప్యాయంగా.

ఆయనకేమీ అర్థం కాలేదు. కానీ, "ముందు సరీగా తినవయ్యా, కబుర్లు తరువాత" అని తన పెద్దకరిం చూపుతూ అదిలించాడు.

"సరే, సరే" అని గబగబా నాలుగు ముద్దలు తిని, "ఇంతకూ, ఎవరు చెప్పారు మీకు?" అన్నాడు సత్యనారాయణ నవ్వుతూ.

"ఎవరు చెపితే యేంగాని, మీ నాన్నగారు ఆంధ్రాలో వున్నారటగా, మీ చెల్లెలు పెళ్ళికి గూడా రాలేదటగా, నిజమేనా?" అన్నాడు శ్రీకంఠయ్యగారు.

"శ్రీకంఠయ్యగారూ, మీరు నాకు తండ్రి వంటి వారు. మీదగ్గర నాకు దాపరికం లేదు. కానీ మీ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే మా వంశచరిత్ర దాదాపుగా చెప్పాలి మీకు" అన్నాడు గంభీరంగా సత్యనారాయణ.

"భోజనం చేసి కూర్చుందాం" అన్నాడు శ్రీకంఠయ్యగారు.



# వంశవృక్షం

*గలద్దానగండే గణేశానగండే*
*ధృతం యస్య దృష్టి శ్చిరా ద్వాంశజానామ్,*
*గణేశశ్చ యేషాం హి కల్యాణయోక్తా*
*గురుర్బ్రహ్మ ధారా తరంగ స్సనోఽవ్యాత్ ॥*

[ఆయన వంశీకులంతా మదం స్రవించి గుబాళిస్తున్న గణపతి గండస్థలం మీద దృష్టి కేంద్రీకరించి ధ్యానించారు. గణేశుడు. వారికి కల్యాణములు చేకూర్చాడు. అట్టి బ్రహ్మవిద్యా పరంపరలో ఒక తరంగమైన శ్రీగురుదేవుడు నన్ను రక్షించుగాక.]

సత్యనారాయణ, శ్రీ కంఠయ్యగారూ భోజనాలు పూర్తిచేసి, ముందు గదిలో చెరో గోడకూ అనుకొని, చాపలమీద చతికిలబడ్డారు.

"నా కథ యెక్కడ మొదలుపెట్టేది ? ఎంత చెప్పేది ? కాని ఈ మృదుహృదయుడికి ఎంతో కొంత చెప్పటం ధర్మం" అనుకుంటూ ఆలోచనలోపడ్డ సత్యనారాయణ మనోవీథిలో పూర్వగాథలు మెదలసాగాయి.

## మూలపురుషులు

పరమేశ్వరుడి సంకల్పశక్తి స్పందించింది. కాలచక్రం మళ్లీ కదలసాగింది. శ్రీహరి నాభిసరస్సులో చిరుకమలం మొలిచి, విచ్చి కలకలలాడింది. దాని నడిబొడ్డు పీటపై వయ్యారి కింజల్కాలలో మేల్కాంచిన చతుర్ముఖబ్రహ్మను సృష్టి విస్తరణ కాంక్ష ఉ్రాత లూగించింది. నలుమొగాల ఆ బ్రహ్మకు, శతసహస్ర ముఖాలుగా ఆలోచనలు సాగుతున్నాయి. అనంత ముఖాలుగా సృష్టిలతా విటపాలు వెల్లివిరుస్తున్నాయి.

తెలివెన్నెల దారాలకన్నా సన్నని తన చేతులను అనంత దిగంతాలకు బారలుసాచి ప్రకృతిమాత, అనంతానంత గోళపంక్తులను వెంట్రుకవాసి గూడ వారరాకుండా గిరగిరా తిప్పుతోంది. ఎంత బలమో ఆ చేతులకి ?"

ముల్లోకాల మొదటి తండ్రికి, ఆ బ్రహ్మగారికి, ప్రాణం కంటె ప్రియమైనది మధ్యమలోకం. అందుకే యీ మధ్యమలోకానికి ఎనలేని నగిషీలెన్నో చెక్కి చెక్కి, చిట్టచివరకు ముల్లోకాలకూ కిరీట మనదగిన, మానవజాతిని ఈ మధ్యమ లోకానికి కానుక పెట్టాడాయన. అటు ఊర్ధ్వ లోకాలకూ, ఇటు అధోలోకాలకూ గూడ ఆధార స్తంభంగా ఈ మానవజాతి వర్ధిల్లాలని ఆయన ఆకాంక్ష. అందుకే కాలపు పెనుతుఫాను తాకిళ్ళకు, విధివిలాసాల వడగళ్ళకు, వసివాడి, చెక్కు చెదరి, నజరు తరిగిపోకుండా మానవత్వపు నిండుపంటలు నిత్యం పచ్చగా నిలవాలని ఆ ఆదిపిత, కొన్ని మహనీయ రసప్రవాహాలను ఈ భూమిమీద వెలయింపజేశాడు.

మహోన్నత మానవతా మణిశిఖరా లనదగిన, మహర్షిసత్తముల నుంచి బయిలుదేరిన మహనీయ వంశపరంపరలే, ఆ సుమహిత మహానదీ ధారలు. అలాంటి మహోన్నత శిఖరాలలోని ఒక మహోజ్వల శృంగమే అంగిరోముని. ఆ మహాపర్వతపు పెనుచెరియలలో! సుప్రసిద్ధమైన మణివేదికయే బృహస్పతి. దేవగురువై, బుద్ధికి అధిష్ఠానమై, వైదికకార్యాలకు ప్రవర్తకుడై, నవగ్రహాలలో పరమపుణ్యతమ స్థానాన్ని, ఆక్రమించిన, ఈ మహనీయుని గురించి తెలియనివా రుండరు.

ఆ పరంపరలోని మరొక మంజుల శిఖరమే భరద్వాజముని. ఈ మహాత్ముడు వేదాల అనంతత్వాన్ని కన్నులార చూడగలిగిన మహనీయుడు. దీర్ఘ బ్రహ్మచర్యానికి పరమావధి. ఇంద్రునికి ఆప్తుడై, వైమానిక, వైద్య వేదాన్తికాద్యనేక విద్యాగంగలను భువికి అవతరింప చేసిన విజ్ఞాన భగీరథుడు.

ఈ మూడు శిఖరాల మహిత తపస్సులే, భరద్వాజ మహాగోత్ర దివ్యనదిగా భూమిపై ప్రవహింపసాగినాయి. నాల్గు దిక్కులా విశృంఖలంగా ప్రవహిస్తున్న ఈ గోత్ర మహానదికి తామర తంపరగా, శాఖోపశాఖ లేర్పడినై, కాలక్రమంగా. .

ఆ మునిత్రయానికి నిత్యారాధ్యమైన, త్రిలింగాల చల్లని నీడలో వెల్లివిరిసివున్న, ఆంధ్ర దేశంలోని రాయలసీమ ప్రాంతాలలో ఈ మహానదికి ఒక సుప్రసిద్ధమైన ఉపనది ఏర్పడింది. అదే గండ్లూరి వారి వంశం.

గణపతిదేవుని గండస్థలమే తనకు నిత్యోపాసంగా భావించటంవల్ల యీ వంశం గండ్లూరి వంశమై గణపతి కృపకు నిత్యపాత్రమైంది. ఈ కలి కాలారంభ ప్రాంతాలలో, యేర్పడిన కొన్ని ఆంధ్రప్రాంతీయ, ధర్మ సంకటాల పరిష్కారం కోసం ఆనాటి ధర్మాధికారు లేర్పరచిన కట్టుబాటులను అనుసరించి యీ వంశం "ములికినాటి" పరంపరలో చేరింది.

వైదిక కర్మాచరణమే మార్గంగా వినిర్మలోపనిషద్విజ్ఞానావధులను అధిరోహించిన మహనీయులకు ఆలవాలమై, విద్యార్థి పరంపరలకు నిరంతర విద్యాన్న దానసత్రమై, యీవంశం

రాయలసీమ ప్రాంతంలోని జనులకు తలమీది మాణిక్యమై ప్రకాశించింది. ఆ పరంపరలో ఇప్పటికి సుమారు నాలుగు వందల సంవత్సరాల్ల క్రిందట సూరప్పగారనే మహనీయుడు జన్మించాడు. ఆయన తండ్రిగారికేమి దివ్యదృష్టి వుండి ఆ పేరు పెట్టారోగాని సూరప్ప గారికి సూర్యోపాసన స్వయంసిద్ధమై, ఆ త్రిజగన్మిత్రుడైన సూర్యదేవు డాయనకు సహజమిత్రు డయ్యాడు.

సప్తవ్యాహృతులకూ ప్రసవిత్రి అయిన సావిత్రి ఆయనకు నిత్యప్రత్యక్షదేవతయై అఖిల వేదవాక్కులను ఆయనకు అనుభూతి గోచరాలుగా చేస్తూ వచ్చింది. ఆ దేవి కరుణకు చిహ్నంగా ఆ పేరే గలిగిన చల్లని తల్లి ఆయనకు సహధర్మచారిణి అయి హృదయమందు భాసించే వేదవాక్కులకు నిత్యజాగరూకయై క్రియారూపమైన అనువాదాలు జరిపించింది.

వైదిక మార్గతత్పరులైన, గృహస్థులకు నిజమైన ఉపాస్యదేవత అగ్ని. అట్టి గృహస్థుల గృహాలకు అతడే పతి. అందుకే అగ్నిని గృహపతి అన్నాయి వేదాలు. అట్టి గృహస్థులకు అగ్నిదేవుడే ముందుండి అన్ని హితాలనూ కలిగిస్తాడు. అందువల్ల ఆయనే వాళ్ళకి పురోహితుడు. నిజానికి అగ్నే అందరి జీవులలోనూ వున్న జఠరాగ్ని. ఈ జఠరాగ్నే ప్రాణుల ప్రాణాలను నిలబెట్టే ప్రాణశక్తి. సువిశాలమైన విశ్వదృష్టితో చూడగలిగితే యీ అగ్నే విశ్వాంతరాళ మహా గోళ సంచారాలకు ప్రాణశక్తి ప్రదానం చేస్తున్నాడు. అణువులోనూ ఆకాశంలోనూ, అఖండంగా వ్యాపించివున్న శక్తి అసలైన అగ్ని. అందుకనే వేదమాత అగ్నిని దుర్గాదేవిగా స్తుతించినది.

సావిత్రీ సూరప్ప దంపతులు ఈ విరాడగ్నిని విశ్వతోముఖమైన భక్తితో వైదిక మార్గ తత్పరులై ఆరాధించారు. నిత్యాగ్ని హోత్ర సేవాతత్పరులైన ఆ పుణ్యదంపతులకు, అగ్ని ద్వారా, సమస్త దేవతలు ప్రసన్నులయినారు. అగ్నిముఖులు గదా దేవతలు. తమ పై తరాల కీ మహోత్తర దివ్య సంప్రదాయాలన్నీ అందించటమే తప్ప, మరొక కోరిక లేని, ఆ అమాయక దంపతులు తమ నిత్య శ్రౌత విధి పరాయణతను కొనసాగిస్తూనే వున్నారు.

క్రమంగా సప్తసోమ సంస్థలని ప్రసిద్ధి వహించిన క్రతువు లన్నింటినీ, ఆరాధనా యోగ పురస్సరంగా ఆచరించి నందువల్ల ఆ మహనీయుడు, పౌండరీకయాజి అయినాడు. ఇలా ఒకరికొకరు చేదోడు వాదోడై వేదోక్తములైన సమస్త సత్కర్మలనూ ఈశ్వరారాధన బుద్ధితో, భక్తి యోగ పరమావధిగా ఆచరించి నిష్కాములై, నిరీహులై, నిస్సంకల్పులై, నిరంజనులై బ్రహ్మస్థితిని సోపాన పరంపరగా యీ జన్మలోనే అందుకున్నారు, ఆ పుణ్యజీవులు.

ఆ మహనీయ తేజోమూర్తుల దివ్యశక్తి మిగిల్చిన ప్రసాదంగా ఈ లోకానికి లక్ష్మీ నరసప్పశాస్త్రి మిగిలాడు.శక్తి ప్రసాదరూపుడైన ఈ మహనీయుడు, మూడు శక్తుల మూల రూపమైన ఆది శక్తియే తన కిష్ట దైవమని, ఉపనిషత్తంత్ర తత్పరుడై దేవీ ఉపాసన మార్గంలో

పయనించాడు. అగ్నికి అపరావతారమైన నరసింహుని అంశగా జన్మించి, సింహసటా దేదీప్యమానయై అగ్నివర్ణయై, జాజ్వల్యమానమైన పరాశక్తినే ఆరాధించే, ఆ ఉగ్రమూర్తికి, సహజ సుందర సుకుమార మందహాస చంద్రికా మనోహర ముఖారవిందుడైన శ్రీ కృష్ణుని తాదాత్మ్య బుద్ధితో ఉపాసించిన, కృష్ణమ్మ తల్లి సహధర్మచారిణి అయి, సమశీతోష్ణ స్థితి తెచ్చి లోకాలకు ఊపిరి పోసింది. ఆ వంశానికి నారు పోసింది.

తన సర్వతోముఖత్వాన్ని లోకానికి చాటదలచిన పరమేశ్వరుడు, పంచముఖుడయినట్లుగా, తనలోనూ, తన తండ్రిలోనూ దాగివున్న శక్తి శాఖలు లోకంలో విస్తారంగా వ్యాప్తి చెందేందుకై, ఈ లక్ష్మీనరసప్పశాస్త్రిగారు, లోకానికి అయిదుగురు పుత్రులను తనకు ప్రతినిధులుగా కానుక పెట్టి, ఋణత్రయ విముక్తుడై పరమపదాన్ని చేరాడు.

అప్పటికే దేశంలో ఉత్కల ఎద్దడి ఆంధ్ర దేశందాకా పాకి వైదిక కర్మలు కష్టసాధ్యాలు కాసాగినాయి. కలి ముదిరి సదాచారానికి వెనుకబాటు గూడ తగ్గసాగింది. అందువల్ల లక్ష్మీనరసప్పశాస్త్రిగారి పుత్రులిక "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" అన్న భగవద్వచనాన్నే మేలుబంతిగా పెట్టుకొని, అగ్ని ఆరాధనం అంతర్యాగ క్రమంలో మాత్రమే ఆచరిస్తూ లోకానికి ఇతర మోక్ష మార్గాలనే ప్రదర్శించసాగారు.

పెద్దకొడుకు జాలప్పశాస్త్రిగారు సరస్వతీ ఉపాసకుడై ఆ పలుకుల తల్లి రెండు చన్నుల పాలు కడుపార తాగి, కవిత్వంలో అష్టావధానియై, సంగీతంలో మానవవీణాదండ మర్మజ్ఞుడై క్రమంగా ప్రణవనాద లీనాత్ముడయ్యాడు. రెండవ కొడుకు నంజుండప్పశాస్త్రిగారు నరసింహోపాసనా రూపంలో అగ్ని ఆరాధనను హృదయంలో పునః ప్రతిష్ఠించుకొన్నాడు. చిత్రం, ఆయనకు లక్ష్మీనరసమ్మ భార్యయై, ఆయన అంతరుపాసనను బహిరంగంలో గూడా స్థిరపరిచింది. తాతగారిపై గల గౌరవం వల్ల మూడవ కొడుకుకి సూరప్ప అనే పేరు పెట్టారు. అయితే ఆ తాతగారిపై గల మైత్రివల్లనో యేమో సూర్యదేవుడు యీయనకు ప్రత్యక్ష ఉపాస్య దైవమైనాడు. బహిర్ముఖ స్థితిలో వీరికి వ్యవసాయపు పనులమీద అవ్యాజమైన మోజువుండేది.

తమ వంశదేవుడైన గణపతి మీది ప్రేమవల్ల నాలుగవ కొడుకుని బొజ్జప్ప అని ముద్దుగా పిలుచుకొన్నారు, లక్ష్మీనరసప్పశాస్త్రి గారు. అయితే అంతమాత్రానికే ఆనందం పట్టలేక కడుపు ఉబ్బిపోయి, ఆ బొజ్జగణపతి యీ బొజ్జప్పగారికి తన యోగవిద్య అంతా దోచిపెట్టాడు. అయిదవ కొడుకు సుబ్బరాయదాసు గారు మౌద్గల్య మహర్షి మతావలంబుడై నిత్య స్వాధ్యాయమే తన సాధనామార్గమనుకొన్నాడు. పేరులో వున్న సుబ్రహ్మణ్యాంశ ఆచరణలోకి రావటంలో ఆశ్చర్యం లేదుగదా! ఈ అన్నదమ్ములు అయిదుగురిలోనూ నంజుండప్ప శాస్త్రిగారి దగ్గర వున్న విశేష మేమిటో మనకు తెలియదుగాని, వంశధారను ముందుకు

కొనసాగించే భారాన్ని ఆయన మీదే వుంచారు, వారి తండ్రి లక్ష్మీనరసప్ప శాస్త్రిగారు.

తండ్రి ఆజ్ఞకు లొంగి గార్హస్థ్యాన్ని నిరీహంగా సాగించిన నంజుండప్పగారికి నలుగురు సంతానం కలిగారు. పెద్దవాడు శేషప్పదాసు హరిదాసుడై, నైష్ఠిక బ్రహ్మచర్యంలో జీవితం గడిపాడు. ఆసేతు సీతాచలం పాదసంచారియై తిరిగి, భరతభూమిలో గల సమస్త సంగీత సంప్రదాయాలనూ ఆకళించుకొని, శతాధిక వాద్యవాదనా నిపుణుడై, స్వయంగా హరికథా గాన తత్పరుడై కీర్తి కెక్కాడు. ఆయన హరికథ చెపితే మనుష్యులు శిలాప్రతిమ లవుతారనీ, శిలలు ద్రవిస్తాయనీ, ఆ రోజుల్లో నానుడి అయిపోయింది.

హరికథా గానం చేస్తూ వుండగా తన ప్రాణాలు పోవాలన్నది ఒకటే, తన జీవితంలో తనకున్న కోరిక అని ఆయన చెప్పేవాడుట. దానికి తగ్గట్టే, ఒకానొక భీష్మ ఏకాదశి నాడు నృసింహావతార కథ చెపుతూ అనంతపురంలో ఆయన హఠాత్తుగా పోయారట, వేదిక మీదే! ఆ విధంగా ఆ శేషప్పశాస్త్రి గారి అఖండ సంగీత శక్తి హఠాత్తుగా నిద్రాణమై పోయింది.

రెండవ కొడుకు సుబ్రహ్మణ్య భాగవత్‌గారు నిజంగానే భక్తిమార్గ తత్పరుడు. మూడవ సంతానం ఆడపిల్ల. పేరు వెంకమ్మ. ఈమెను పొద్దుటూర్లో నంద్యాలవారి అబ్బాయి కిచ్చి వివాహం చేశారు.

తన తండ్రిపై గౌరవము, తన ఉపాస్య దైవంపై భక్తి, తన సహధర్మచారిణిపై అనురాగమూ, ముప్పేటగా ముప్పిరిగొనగా నంజుండప్పగారు తన నాలుగవ కొడుకుకి నరసింహశాస్త్రి అని పేరు పెట్టారు.

ఇంచుమించు ఇరవైయవ శతాబ్దంతో పాటుగా యీ లోకంలోకి నరసింహశాస్త్రిగారు ప్రవేశించగా, వీరు ప్రవేశించిన దశాబ్దం లోపుగానే వీరి తల్లితండ్రు లిద్దరూ లోకంలోనుంచి నిష్క్రమించారు. సూరప్పగారు అన్నగారి పిల్లల బాధ్యత తనే తీసుకున్నారు. ఇంచుమించు ఆ రోజుల్లోనే నిస్సంతువైన సూరప్పగారు యెవరో కుర్రవాడిని తెచ్చి దత్తత చేసికొన్నారు.

అప్పటికి గండ్లూరువారికి పెద్ద అగ్రహారాలు అనేకం వుండేవి. రాతకోతలు లేని ఆ పూర్వపు రోజులలో ఎవరెవరో జమీందార్లు తమ జన్మసార్థకత కోసం గండ్లూరి మహర్షులకు సుక్షేత్రదానాలు చేస్తూ వుండేవారు. ఆ పొలాలు, అగ్రహారాలూ యెక్కడున్నాయో చూసుకోవటానికి గూడా తీరిక చాలని అంతర్దృష్టిలో నిమగ్నులైన ఆ తపస్వులు, ఆ యా రైతుల్ని 'మీరే చేసుకుంటూ వుండండ్రా మేం చెప్పేదాకా' అంటూ వుండేవారు. కృతజ్ఞతాబద్ధులైన ఆ రైతులు తామే ఉండబట్టలేక యెప్పుడైనా ఓ నేతిచెంబు తెచ్చి యిస్తే, అది ఆరోజే ఊరంతా సంతర్పణయిపోయేది,

అలా గడిచే సత్యకాలపు రోజులవి. పల్లెమీది పంటంతా నాలుగు వర్ణాల వారికీ, కుటుంబావసరాల మదింపు ఆధారంగా పంపిణీ అవుతున్న సత్యకాలపు రోజులవి. అప్పటికి ఇతర ప్రాంతాలలో, అగ్రహారాల మాటెల్లా వున్నా, బండమీది పల్లె, యర్రబండపల్లె, బొమ్మెపర్తి, కందుకూరు మొదలైన ఆ పల్లెల గుత్తిలో, గండ్లూరివారి మాన్యాలు వందల ఎకరాలున్నాయని చెప్పుకొనేవారు.

"ఇవి మన పొలాలురా" అని తండ్రులు, పిల్లలకు చెప్పటంగాని, మన పొలా లేవబ్బా అని పిల్లలు మనస్సులలో ఆలోచించటంగాని చేతగాని గండ్లూరి వంశంలోకి ఒక కొత్త కుర్రవాడు దత్తుడుగా ప్రవేశించటంతో సూరప్పగారి యింట్లో కొంచెం గరగర మొదలైంది.

తల్లిదండ్రు లిద్దరూ గతించగా, పిల్లల కోసం మొహంవాచి వున్న పినతల్లి గారాబు పెంపకంలో పెరిగినందు వల్లనో యేమో, నరసింహశాస్త్రి గారికి చదువు పూర్తిగా అబ్బలేదు కాని, తన పేరుకు తగిన ఉగ్రావతార లక్షణం మాత్రం పూర్ణంగానే వచ్చింది. ఆ పల్లెలంబడీ, వీటి నానుకొని వున్న కోనలంబడీ, చెడ తిరిగే కుర్ర నరసింహశాస్త్రి యెలా పట్టాడోకాని మూలికావైద్యం, ఆయుర్వేద వైద్యం, చేతినాడివాసి గట్టిగా పట్టాడు.

అనంతపురంలో వున్న అంపాపురం వారికీ, గండ్లూరి వారికీ, తరతరాలుగా సంబంధాలూ, బాంధవ్యాలూ వుండేవి. అంపాపురం వారందరూ వేదశాస్త్ర పండితులు, పుష్పగిరి పీఠాధిపతుల ఆస్థాన విద్వాంసులు. గండ్లూరి వారు సంస్థానాలలోనూ పదవులకు అంగీకరించక పోయినా, పుష్పగిరి పీఠంలోనూ, శృంగేరీ పీఠంలోనూ, కామకోటి పీఠంలోనూ గూడ ఈ రెండు కుటుంబాల వారికి ఎప్పుడూ పోటీపడుతూ వుండేది. విద్యలలో పోటీ పెరిగిన కొద్దీ యీ కుటుంబాలకు స్నేహం పెరిగింది. స్నేహం క్రమంగా బంధుత్వంగా మారసాగింది.

నరసింహశాస్త్రి రోజులొచ్చేసరికి యిటు గండ్లూరివారి వంశంలో, పాండిత్యం పాలు రవ్వంత వెనుకబట్టగా, అనంతపురంలో వున్న అంపాపురపు దానంభొట్లు గారికి మంచి పండితుడన్న కీర్తి వుండేది. కీర్తి గర్వంతో ఎవరిన్నీ దగ్గర చేరనీయడని ఆ దానంభొట్లు గారికి పేరుండేది. ఏ కారణమూలేని పైలా పచ్చీసుతనంతో, అన్ని విద్యల్లోనూ వేలు పెట్టిన అరకొరతనంతో యెవరినీ మెచ్చడని నరసింహశాస్త్రికి పేరుండేది.

చిత్రమేమిటో, ఈ ఇద్దరికీ అంతులేని స్నేహం కుదిరింది. అప్పటికి దానంభొట్లు గారు నడివయసు దాటి; పిల్లలున్న గృహస్థు, అనుభవశాలి అయిన పండితుడు

అప్పుడప్పుడే ప్రవేశిస్తున్న నూత్న యౌవనపు పొంగుకు తోడు, వంశానుగతమైన నరసింహోపాసనలో, కొద్దిపాటి పట్టు చిక్కటంవల్ల యేర్పడ్డ హుంకరింపులతో, మొరటు తేలివున్న అచ్చపు మృగరాజు నరసింహశాస్త్రి.

ఏరోజు ఏపల్లెలో తిండి తింటాడో, ఏ పల్లెలో నిద్రపోతాడో, తనకే తెలియని నరసింహశాస్త్రి ఉన్నట్టుండి ఒకరోజు, చప్పుడు లేని పిడుగల్లే అనంతపురంలో వాలేవాడు. ఔను, నరసింహశాస్త్రి ఇతరుల దగ్గర ఉగ్రనరసింహమేగాని 'దాసయ్య మావ' దగ్గర మాత్రం పెంపుడు పిల్లే. ఈ 'నరసిమ్మప్ప'ను చూస్తే, ఆ దాసయ్య మావకు అదేం పొంగో, దేవతార్చన గూడ అంతగా కాబట్టేది కాదు. ఉపనిషత్తులు ముందేసుకొని యిద్దరూ కూచున్నారంటే రాత్రి అరగడియలా గడిచిపోతుండేది, వారిద్దరికీ.

నరసింహశాస్త్రికి సంస్కృతం వచ్చా అంటే వచ్చని చెప్పరాదు. అలాగే ఆయన వేదమంత్రం అంతా స్వచ్ఛంగానే వుందని చెప్పే వీలుగూడ లేదు. మరోడు గనక, యిలాంటి వాడు తన దగ్గర ఉపనిషత్తు పేరు గాదుగదా, పురాణం పేరెత్తేడంటే దాసంభొట్లుగారు వాడి నాలుక చీరేస్తాడన్న మాటే! మరి యీ నరసింహప్ప మీద ఎందుకింత అభిమానమో తెలియదు గాని, ఒకసారి రాత్రి ప్రొద్దుపోయాక ఉపనిషచ్చర్చ చేస్తూ వీళ్ళు కూర్చున్నప్పుడు, ఓ రాత్రి వేళ, దాసంభొట్లు గారి భార్యకు మెలకువ వచ్చి చూస్తే, గురుశిష్యు లిద్దరూ ఒకళ్ల వంక ఒకళ్లు చూస్తూ బిగుసుకు పోయి, గుడ్లగూబల్లాగ మాటా పలుకూ లేకుండా వుండిపోయేవారు.

ఆవిడ చూచి, ముక్కుమీద వేలేసుకొని, మళ్ళీ నిద్రపోయేది. తెల్లారేక అనేది "దాసయ్యా శాస్త్రీ, నిశ్శబ్దంగా బాగా చర్చించుకొంటున్నారే రాత్రి! అలాంటి చర్చలయితే, నేనూ చేద్దును" అని. పట్టుబడ్డ యింటి దొంగలాగ నవ్వేవాడు నరసింహశాస్త్రి.

ఇలా అక్కడో అంగా, ఇక్కడో అంగా తిరుగుతున్న నరసింహశాస్త్రికి మేనమామ వెంకోబరావు నరసింహస్వామి గారి కూతురు లక్ష్మీదేవి నిచ్చి వివాహం చేశారు. ఆవిడ కాపరాని కొచ్చినాక పదేళ్ళకు మొగపిల్లవాడు కలిగాడు.

ఆ కుర్రవాడికి రెండేళ్ళు గడచినాక, ఒకరోజున—

"ఒరేయ్ నరసింహోయ్" అని సూరప్పగారు పిలిచారు. ఆ పిలుపు వినిపించగానే రెండేళ్ళ ముద్దుల కొడుకు నంజుండప్పతో ఆటలాడుతున్న నరసింహశాస్త్రి ఒక అంగలో పినతండ్రి గారి దగ్గరకు వచ్చాడు.

"కంచుకూరు నుంచి ఉత్తరం వచ్చింది."

"ఏమని?"

"కొడుకువైనా, అల్లుడివైనా నువ్వేగా నీ మేనమామకు."

"ఊ!"

"పైగా స్వయానా మేనమామాయె"

"ఏమి రాశాడు?

"నిన్ను వచ్చి కాస్త దగ్గరవుండి తనకి, సాయంగా వుండమంటున్నాడు"

"తన కోర్టు వ్యవహారాల్లోనా?" నరసింహశాస్త్రి మాటలో హేళన బాగా వ్యక్తమైంది.

"ఏమో సహాయం అంటున్నాడు. దేంట్లో అయితే మాత్రం మనకి చేతకాని దేముంది?"

నరసింహశాస్త్రి మౌనంగా ఆలోచనలో పడిపోయాడు.

"ఎప్పటికైనా వాళ్ళ పొలం నువ్వేగా చూచుకోవలసిన వాడివి."

నరసింహశాస్త్రి చురుక్కున చూశాడు కాని సూరప్పగారు అది పట్టించుకోకుండా "మన దత్తుడు గూడ ఇక్కడి వ్యవసాయం పనులవీ, తనే చూచుకుంటా నంటున్నాడు. నేనూ పెద్ద వాడినై పోయాను."

సూరప్పగారు తన అనుభవం అంతా తన మాటలో పూర్తిగా యిమిడిందా లేదా అని బేరీజు వేసుకుంటున్నారు కాబోలు, కాసేపు మౌనంగా వుండిపోయారు.

నరసింహశాస్త్రి గూడ "నాకసలే తిక్కనరసయ్య అని పేరు. నిజంగానే నాకు తల తిరగటం లేదుగదా" అని తనను గురించే బేరీజు వేసుకొంటూ, మౌనంగా వుండిపోయాడు.

మౌనపాలనంలో పినతండ్రికి, కొడుకుకు పోటీ పడింది కాని పెద్దవాడిని ఓడించటం యిష్టం లేకపోయింది, నరసింహశాస్త్రికి.

"మరి, నేనా బొమ్మెపర్తి సన్నాసులకు మాటిచ్చేశాగా" అన్నాడు వున్నట్టుండి తన సహజ ధోరణికి వస్తూ.

"ఏమనిరా ?"

"ఆ వెధవలు నాకో యిల్లు ఇస్తామన్నారు. ఆ వూళ్ళోనే వుండి, ఏదో కాస్త శాస్త్రా నుంచీ చెప్పటం, కాస్త వైదికం చేయించటం. మామూలు అఘోరింపే ----- "

"ఎప్పుడు మాటిచ్చావ్ ?"

"నిన్ననే"

"నాతో అనలేదేం ?"

"అందామనుకుంటున్నాను, నువ్వే పిలిచావు"

"మీ మామగారికి, ఏమి రాద్ధాంరా ?"

"ఉత్తమం స్వార్జితం విత్తం అన్నారు. ఆడదాని ఆస్తి మన కెందుకులెద్దూ."

"ఒరేయ్, మేనమామ, పిల్లనిచ్చినవాడు, పెద్దవాడు, ఆయనతో ఈ మాట అంటూ వున్నావా ?"

"పిల్లని ఆయన మీద గౌరవంతో చేసుకున్నా నంటావా! నీ మీద గౌరవంతో చేసుకున్నా గాని."

"నేను ఆయన మీద గౌరవంతో గదా! పిల్ల నిస్తానని యింటికి రాగానే, రెండో మాట చెప్ప లేక పోయాను. యింతకీ యేమి రాద్దామో చెప్పు"

"అవన్నీ నాకు తెలిస్తే నేను టిక్కానరసింహా న్నెందుకవుతాను. ఎల్లుండి పంచమీ గురువారం అభిజిత్తులో బొమ్మెపర్తిలో గృహప్రవేశం చేసి పాలు పొంగిస్తాను. తక్కిన రాత కోతలు నువ్వు చూసుకో" సేదగవాడు, వెదురు బద్దలని నరికినట్టు టపటుకా విషయాన్ని నరికి పారేశాడు నరసింహశాస్త్రి.

సూరప్పగారు యెందుకో గాని, ఏం మాట్లాడటానికీ నోరు తెమలక, ఇటు కదిలి, అటు కదిలి, బుర్ర గోక్కొని, దగ్గి, ముక్కు తుడుచుకొని నానా యాతనా పడుతున్నారు.

"సరే, ఎల్లుండి పెందరాళే బయలుదేరి బొమ్మెపర్తి పోదాం మన మంతా" అంటూ లేచాడు నరసింహశాస్త్రి, మీది తుండు దులుపుకుంటూ.

రెండు నిముషాలు ఆగి 'ఒరేయ్, ఒరేయ్', అని వెనక్కి పిలిచారు సూరప్పగారు. వచ్చి నిలబడ్డాడు నరసింహశాస్త్రి. ఆ నరికి సూరప్పగారు గూడ లేచి నిలబడి, వెనకాల గోచీ, కుచ్చిళ్ళు జారిపోయినట్టు నటిస్తూ, వెనక్కు తిరిగి, ఆ కుచ్చిళ్ళు సవరించుకుంటూ—

"మన దత్తుడుగాడు ఏవో పొలాల లెక్కలూ, డొక్కలూ రాస్తున్నా నంటున్నాడు. అదేదో తెమిలాక మరోసారి మాట్లాడుదాం" అన్నారు. పకపక విరగబడి నవ్వాడు నరసింహ శాస్త్రి. నవ్వి, వో నమస్కారం చేసి—

"బాబాయ్! నువ్వు నాకు గాయత్రి నిచ్చావు, సూర్య మంత్రం యిచ్చావు. చాలు. ఇంకా, యీ లెక్కలూ డొక్కలూ నా కక్కరలేదు. ఆ దత్తుడూ, ఆ లెక్కలు, ఆ పొలాలూ, ఆ ఆస్తులూ, ఆ ఆలోచనలే నా కొద్దు. ఆ సంపర్కమే నా కొద్దు. సరేనా" అన్నాడు. అనేసి గిర్రున వెనక్కి తిరిగి మరో మాటకు అవకాశ మీయకుండా వచ్చేశాడు.

ఆ రాత్రల్లా నరసింహశాస్త్రికీ, భార్య లక్ష్మీదేవమ్మకూ కీచులాట జరుగుతూనే వుంది. ఆ మర్నాడు నిద్దర లేస్తూనే మొహమైనా కడుక్కోకుండా ఇంట్లోంచి వెళ్ళిన నరసింహశాస్త్రి, ఆ మర్నాడు, అంటే పంచమీ గురువారంనాడు జాము పొద్దెక్కాక యింటికి చేరాడు. వట్టిగా కాదు-రెండు గుర్రపు బళ్ళతో.

ఇంట్లో అత్తమామలు ఏం నచ్చచెప్పారో యేమో, శాస్త్రికి తెలియదు గాని, లక్ష్మీ దేవమ్మ కొంత సామాను సద్దుకొని ప్రయాణానికి సిద్ధంగా వుంది. కొద్దిసేపట్లోనే ఆ రెండు

గుర్రపు బళ్ళకు తోడు, మరో రెండెడ్లబండి గూడ బయలుదేరింది. ఉత్తర ముఖంగా సుమా రెనిమిది మైళ్ళు గొంక దార్లంబడి ప్రయాణం చేసిన బళ్ళు బొమ్మెపర్తి గ్రామం చేరాయి.

మరో బ్రాహ్మణ గృహం లేని ఆ వూళ్ళో రెడ్లు, వైశ్యులు వికసించిన ముఖాలతో వచ్చి నరసింహశాస్త్రికి ఘన స్వాగతం చెప్పారు.

"మన వాడికి యీ వూళ్ళో మంచి ప్రాపకమే వుంది" అనుకున్నాడు సూరప్పగారు.

బళ్ళన్నీ ఆంజనేయస్వామి కోవెల ముందు దింపారు. సూరప్పగారికి ఆ వూరూ, ఆ మనుషులూ పరిచయమైన చోటే అయినా మరోసారి పరిశీలనగా పరికించారు.

బొమ్మెపర్తి చిన్న వ్యవసాయ కుగ్రామం. ఆ వూరికి వున్నదల్లా ఒకటే పెద్ద వీధి. ఆ వీధికి యించుమించు నడిబొడ్డులో చిన్న ఆంజనేయ కోవెల వుంది. వీధికి ఒక చివర మంచినీళ్ళ బావి వుంది. ఆంజనేయాలయానికి సరిగా వెనకాల, చక్కని నలుచదరపు స్థలంలో వో చిన్న మిద్దె యిల్లు వేసి వుంది. అది కొత్తగా కట్టిన యిల్లని తెలుస్తూనే వుంది. కోమటి బద్వేలు కొండప్ప అరుగుమీద చేరిన పిల్లలు, ఎదురుగా ఉన్న ఆ మిద్దెను చూపిస్తూ, "ఇదే కొత్త పంతులు గారి యిల్లు" అని గోల చేస్తున్నారు.

సూరప్పగారికి కొంత తృప్తి కలిగినట్లుంది. ముఖం కొంచెం వికసించింది. ఆయన ఆకాశంలో సూర్యభగవానుణ్ణి ఒకసారి చూసి "ఇక ప్రవేశించండ్రా" అని తొందర పెట్టారు.

అందరూ కోవెలలో ఆంజనేయస్వామికి నమస్కరించి మిద్దె ముందుకు వచ్చేసరికి సూరప్పగారు ఒక పెద్ద జాజికాయ పెట్టె తెచ్చి నరసింహశాస్త్రి చేతిలో పెట్టారు. ఆ సమయంలో ఆ పెట్టెను చూసేసరికి, నరసింహశాస్త్రికి, ఒళ్ళు పులకరించింది. ఆనంద బాష్పాలు జలజలా రాలాయి. తనకు తనే సంబాళించుకొని ఆ పెట్టెను కళ్ళ కద్దుకొని గృహప్రవేశం చేశాడు నరసింహశాస్త్రి. వెనకాలనుంచి, సూరప్పగారు గృహప్రవేశ, మంగళ మంత్రాలను గానం చేస్తుండగా నరసింహయ్య సరాసరి దేవుడి గూడు దగ్గరకు వెళ్ళి, ఆ పెట్టె అక్కడ వుంచి భార్యతో కలసి ఆ పెట్టెకు సాష్టాంగ వందనం చేశాడు.

ఆడవారు పాలు పొంగించారు. అక్కడితో గృహప్రవేశపు తంతు లఘువుగా ముగిసింది.

ఊరివారు సెలవు తీసుకుని ఎవరిళ్ళకు వారు వెళ్ళగా ఆడవారు బద్వేలు వారి సాయంతో, వంటలకు కావలసిన ఏర్పాట్లు చూసుకోసాగారు.

ఇంతలో సూరప్పగారు, నరసింహశాస్త్రి స్నానాలు చేసి వచ్చి అనుష్ఠానాలు ప్రారంభించారు. నరసింహశాస్త్రి జాజికాయ పెట్టె తెరిచి దేవతార్చనను రాగి పళ్ళెంలో సర్దసాగాడు. ముందుగా ఒక పంచాయతన సంపుటము బయటికి తీశాడు. అందులో, అద్భుతమూ అపూర్వమూ అయిన పెద్ద నృసింహసాలిగ్రామం వుంది. ఆ సంపుటం కాక ఒక వెండి

లక్ష్మీనృసింహ విగ్రహమూ, ఒక బంగారు దేవీ విగ్రహమూ, ఒక వెండి బాలకృష్ణ విగ్రహమూ ఆ పెట్టెలో వున్నాయి.

తండ్రీ కొడుకూ అభిషేకానికి ఉపక్రమించటం చూసి ఇంక, తమ వంటకు తొందర లేదని, తృప్తి పడ్డారు అడంగులు. ఆ దేవతార్చన సూర్యాస్తమయం దాకా సాగింది. వంట విశ్రాంతిగా చేసికొని, రాత్రికి భోజనాలు చేశారు.

ఆ మర్నాడు కందుకూరునుంచి నరసింహస్వామి మామ, అంబమ్మత్తా దిగేవరకూ గృహప్రవేశపు ఆనందం బాగా కొనసాగింది.

ఆస్తి గలవాడనీ, ఉన్న ఒక్కగా నొక్క కూతురు సుఖపడుతుందనీ ఆశపడి పిల్లనిస్తే, యీ తిక్క నరసింహయ్య ఉన్నదంతా దులుపుకొని, ముష్టిచెంబు చేత పుచ్చుకొని, యీ బొమ్మెపర్తి చేరితే అంబమ్మత్త కడుపు మండిపోవటంలో అసహజం ఏమీలేదు గాని, ఆ చుట్టుపక్కల్లో ఎవరికీ లేనంత పెద్దగొంతు వుండటమే; ఆవిడకున్న అసహజ లక్షణం.

" బండమీది పల్లెలో ఆస్తి బండల పాలైనా, దిక్కు లేనట్టు యీ వూరెందుకు రావాలి ? కందుకూరు వస్తే కలిసే వుండుంగదా " అని ఆహ్వానిద్దామనే సదుద్దేశంతోనే ఆవిడ అక్కడకు వచ్చింది. కానీ, అత్తా అల్లుళ్ళ సంభాషణలో ఆ ఆహ్వానం అడుగంటి పోయి రామ రావణ యుద్ధం సీను మాత్రం వూరివా రందరికీ పండగగా సాగింది.

మామగారు మాత్రం తక్కువ వాడా, నరసింహస్వామి గారే గదా స్వయంగా !

ఇక ఆ మంటలు అనతికాలంలోనే ఆకాశాని కంటాయి. అవి అక్కడ దుఃఖ మేఘాలుగా మారి శోకాలు, కన్నీళ్ళు, వర్షాలుగా కురిపించాయి. వాటివల్ల ఆ కుటుంబాల మధ్య వైమనస్యపు మొలకలు చక్కగా మొలిచాయి. అప్పుడు మొలిచిన మొలకలు పెరిగి పంటకు రావటానికి రెండేళ్ళు పైగా పట్టింది. ఈ రెండేళ్ళలో నరసింహశాస్త్రి సంపాదన, రెండు చేతులా సాగింది.

వుల్లల రేవు, ఎర్రగుంట్ల, బొమ్మెపర్తి, రాపతాడు, కందుకూరు మొదలుగా గల ఆ రైతు పల్లెల గుత్తికి నరసింహశాస్త్రిగారు ఏకైక పురోహితుడు, ఏకైక వైద్యుడు, ఏకైక జ్యోతిష్కుడు అయ్యాడు. దాంతోపాటు అన్ని వూళ్ళలోనూ అందరికీ ఆయన " మామ " అయ్యాడు. చిన్నకూ, పెద్దకూ, ఆడకూ, మగకూ, అందరికీ ఆయన " నరసయ్య మామే. "

అయితే మామను ఉబ్బేసి, కరగేసి, సొమ్ములు వడుక్కునే కిటుకు వూళ్ళో రైతులు చాల మంది పట్టేశారు. ఎక్కడో పెళ్ళి చేయించి, బియ్యమూ బట్టలూ, కొబ్బరిచిప్పలూ, యిత్తడి చెంబులూ వగైరా మూట కట్టుకొని ఎగురుకుంటూ వస్తూ వుంటాడు నరసింహశాస్త్రి. దార్లో ఏ యింట్లోనో మొగుడూ పెళ్ళాలు కొట్టుకుంటూ తిట్టుకుంటూవుంటారు. " ఎక్కడా దొరక్కపోతే చావనా ఏమిటే ? ఈ పూటకు పస్తుండు " అంటాడు మొగుడు, దాంతో శోకాలందుకొని,

"నీ చావు నువ్వు చావు, సంపాదించి నాకు పెట్టాల్సిన బాధ్యత నీదే కాదట్రా నచ్చినోడా" అంటుంది భార్య. "ఛయ్ నన్ను తిడతావంటే" అని రెండు తగిలిస్తాడు మొగుడు. ఈ సీను చూడగానే నరసయ్యమామ గుండె తరుక్కుపోతుంది. సరాసరి ఆ యింట్లోకి జొరబడి ఆ మగాణ్ణి యివతలకు లాగి పారేస్తాడు."మామా నన్ను చంపుకు తింటున్నాడు. పెళ్ళానికి పెట్టలేనివాడు నన్నెందుక్కట్టుకోవాలి" అని ఏడుస్తుంది ఆడది.

చాలు—— బుజం మీద ఉన్న మూట మొత్తం, ఆ దంపతులకు నైవేద్యం!

గోదానం తీసుకుని, ఆవుని తోలుకు వస్తూ వుంటాడు నరసింహశాస్త్రి. చొప్పకట్ట నెత్తిన పెట్టుకుని దార్లో కనిపిస్తాడు ఏ వెంకటరెడ్డో.

"మామా, నువ్వు, మంతరం చెపుతూంటే మొన్న అనంతపురం పెద్ద పంతుళ్ళు, నోళ్ళు తెలేశారేంది."

"ఏదోలేరా"

"మీ యింట్లో సాలగ్గామాలా ఏంటువి. అవి మీ ముత్తాత దగ్గరనుంచీ వస్తున్నాయటగా"

"ఔన్రా ముత్తాతేమిట ? ఇప్పటికి ఏడు తరాలకు తక్కువ లేకుండా ఆ నరసింహుడు మా యింట్లోనే వున్నాడు, తెలుసా"

"అమ్మమ్మా అలాంటి సాలెగ్గామాలు అందరు తట్టుకోలేరంటుగా, నువ్వెట్టా తట్టుకుంటా వయ్యా."

"తట్టుకోవటమేందిరా, ఆ నరసింహుడే నన్ను కాపాడతాడు."

"ఎట్టాగయినా నువ్వు అసాధ్యుడివి లేవయ్యా."

"ఏడెచావ్ లేవో"

"మామా, ఈ ఆవెక్కడిది"

"కోటిరెడ్డి యిచ్చాడ్రా"

"నీ ఇంట్లో పాడావు ఉందిగా"

"వుంటే నీకేం"

"ఏంలేదు. చంటాడికి పాలు చాలటం లేదని యేడుస్తోంది మామా, నీ కూతురు. నాల్రోజులు నీ ఆవిస్తే— — —"

"ఏడిచావు, వెధవ తెలివితేటలు. తీసుకుపో. ఈ నాలుగు రోజుల బేరం ఎందుకు? నాకు కావాలంటే దేవుడు మళ్ళీ ఇవ్వడూ !"

ఆవు అటునుంచి అటే వెంకటరెడ్డి దొడ్లోకి చేరుతుంది !!

ఇక మావ దగ్గర సంభావన రూపాయు లున్నాయని తెలిస్తే రైతులకు ఇంత నాటకా లాడాల్సిన కష్టంలేదు. 'చే బదులు మామా' అని ఒక్క మాట అంటే చాలు, బొడ్లో ఉన్నదంతా హక్కు భుక్తులతో ధారాదత్తమే! ఇవిగాక, పట్నానికి పోయినప్పుడో, మరో అప్పుడో గుడ్డలు సరిగాలేని ముష్టివాళ్ళో, తేజస్సు గలిగిన సాధువులో కనిపించారంటే ఆయన పైమీది ఉత్తరీయం లేకుండా ఇల్లు చేరవలసిందే! ఇక ఎవరన్నా వచ్చి చందా అడిగితే చేతులో ఉంటే వాళ్ళ పుణ్యం, లేకపోతే వాళ్ళ పాపం అన్న పద్ధతిగా నడిచేది వ్యవహారం. ఇలా పోయింది పోగా, మిగిలిన సంపాదనే, ఎక్కి తొక్కిగా వుండేది లక్ష్మీదేవమ్మకు. ఆ రోజుల్లోనే, నాలుగైదు ఎకరాల పొలం గూడా కొన్నాడు నరసింహశాస్త్రి.

వైదికప్పనులు తగ్గి తీరిక చిక్కిందంటే, జపాలని ప్రారంభించేవాడు. ఏమి జపాలో గాని రాత్రిల్లా నిద్దర పోకుండా జపాలు చేస్తాడు. అంతవరకూ లక్ష్మీదేవమ్మకు పెద్ద చిక్కు లేదుగాని, ఆ జపాలయినాక శాంతులని పేరు పెట్టి పదిమంది బ్రాహ్మల్ని భోజనాలకి పిలుచుకొస్తాడు. తీరా చూస్తే భోజనాల వేళయ్యేసరికి పదిమంద్లల్లా ఏభైమంది అవుతారు, ఎక్కడ నుంచి దూసుకు వస్తారో ఏమో ?

ఇక నలుగురు మనుష్యులు కనిపించేసరికి నరసింహశాస్త్రికి ఒకటే కంగారు, హడావిడి, చిందులూను. ఇలాంటి పండగ జరిగిందంటే, భార్య వద్దన్నా వినకుండా, కందుకూరు వెళ్ళి అత్త మామలను పిలవ వలసిందే. వారు రాము, రామంటూనే రావలసిందే! నలుగురి ముందూ, అత్తతూ అల్లుడికీ రాద్ధాంతం కావలసిందే, ఇది తప్పదు !

ఇంత రగడ జరిగినా, మర్నాడు నిశ్చింతగా దేవతార్చన చేసుకుంటాడు నరసింహశాస్త్రి. నాలుగు దులుపులు దులిపి లేచి వెళ్ళిపోతుంది అంబమ్మగారు హాయిగా! ఎటూ చెప్పలేక, చెప్పకుండా ఆగలేక, యీ గుండెబరువు మోయలేక, మధ్యలో నలిగిపోయేది లక్ష్మీదేవమ్మ.

ఈ దిగులే రోగమై, ఆమెను క్రమంగా కుంగదీయసాగింది. చుట్టుపక్కల పల్లె లన్నిటికి అమృతహస్తమైన, నరసింహశాస్త్రి నాటువైద్యం, ఇక్కడ, మొక్కపోయింది. అనంతపురంలో చేయించిన ఘనవైద్యం అలంకారమే అయింది. రెండో ఆడదిక్కులేని ఆ యింట్లో భార్యకు, ఆడసేవ, మగసేవ రెండూ తనే చేసేవాడు. ఏమి చేస్తే నేమి, ఎంత శ్రమ పడితేనేమి ! పై వాడి ప్రణాళిక ఒకటుందిగదా! దయా, దాక్షిణ్యాలూ, అడ్డూ ఆపులూ లేని అద్భుత ప్రణాళిక! దానికి లోబడి లక్ష్మీదేవమ్మ శాశ్వతంగా, కన్నుమూసింది. అయిదేళ్ళ నంజుండయ్యను వదలిపెట్టి, వైరిబాగుల మొగుణ్ణి వదలిపెట్టి.

* * * *

## సన్యాసేచ్ఛ :

"నీకు సన్యాస మెందుకు?"

ఈ కసురుడు కసురుతున్నది ఒక పండు వృద్ధ సన్యాసి. ఆయినకు ఎనభై యేళ్ళకు తక్కువ ఉండవు. కేవలం ఎముకల మీద తోలు కప్పి ఆ శరీరంలో ప్రాణం పోశాడేమో బ్రహ్మదేవుడు? కాదు కాదు, రక్త మాంసాలకు బదులు ఏవో దివ్యకాంతులు కరగించి ఆ చర్మం వెనకాల పోశాడేమో! లేకపోతే లేచి కూర్చోటానికి గూడ ఓపిక లేని మనిషి కళ్ళల్లో అంత కాంతి ఎలా ఉంటుంది?

ఎర్రని గుడ్డను తన నడుముకు చుట్టుకొని ఒక అంచును ఎలాగో అలా పైకిలాగి, తన బట్టతల మీద వేసికొని ఉన్న ఆ యతీశ్వరుడు, తన చేతిలో ఉన్న పొడుగాటి దండాన్ని తను కూర్చొనివున్న కృష్ణాజినానికి ఆనించి ఉంచుకున్నాడు.

"నేను మూడు ఋణాలూ తిర్చుకున్నాను." ఈ సమాధానం చెపుతున్నది ముప్ఫయి, ముప్ఫయి అయిదేళ్ళ కోడె వయసులో దుక్కలాగున్న మోటు బ్రాహ్మడు. అతని గడ్డాలు మాసి ఉన్నాయి. చీకిన తాటిపీచులా పెరిగిన అతని తలజుట్టులో సన్నని పిలకపాచలు కలిసి పోయాయి. మోకాళ్ళ పైకి ఎగదీసి కట్టుకున్న అతని పంచె, అతను నడుముకు చుట్టుకొన్న కోరా కొల్లాయి కన్న ఏమంత నయంగా లేదు. అయితే అతని మెడలో ఉన్న సన్న రుద్రాక్షల మాల మాత్రం మంచి కళగా ఉంది.

ఎంతోసేపటె నుంచి బ్రతిమాలినా ఆ స్వాములవా రేమీ కొరుకు పడటం లేదు గాబోలు, యీతని కళ్ళల్లో దీనత తాండవిస్తోంది.

"ఆ! ఏమిటీ" ఆ స్వాముల వారికి కొంచెం చెముడు గూడ ఉన్నట్టుంది.

"మూడు ఋణాలూ తీరిపోయా యంటున్నా." బ్రాహ్మడు గొంతు పెంచి, మోర ముందుకు సాచి వివరంగా పలికాడు.

"ఋణాలు తీరిపోయాయా, తీరితే మళ్ళీ చెయ్యి"

ఆయనకేదో పరాచికంగా ఉన్నట్టుంది.

"తమ ఉపదేశం నా కర్థం కాలేదండి." అయోమయంగా అన్నాడు బ్రాహ్మడు.

"ఉపదేశమూ కాదు, బండలూ కాదు. సరేగాని నీ పేరేమి టున్నావు."

"నరసింహం అంటారండి"

"ఇంటి పేరు"

"గండ్లూరి"

"గండ్లూరా- అంటే అనంతపురమా యేమిటి స్వగ్రామం?"

" అవును. ఆ పక్కన బండమీదిపల్లె " అని.

" అదే లేవయ్యా. నంజుండప్ప నెరుగుదువా "

" మా నాన్నగారేనండి ".

" అట్టాగుటోయ్- వాడు గట్టివాడు. పూర్వం పుష్పగిరిలో ఒకసారి తగిలాడ్లే "

" చిత్తం "

" సరి, ఏం చదువుకున్నావు. "

" ఏమీ లేదండి "

" మరి ఈ సన్యాసం మాట ఎక్కడ పట్టుకున్నావు ? "

" అంపాపురపు దాసంభొట్లు వారి దగ్గరండీ. "

" అంపాపురపు దాసంభొట్లా--- అనంతపురం వాడేనా ?

" చిత్తం "

" వాడయితే నే నెరుగుదును. వాడు నీకెక్కడ తగిలాడు ? "

" ఆయన నాకు దూరపు బంధువండి "

" వాడి దగ్గర నీకేం తెలిసింది. "

" ఏమీ తెలీలేదండి. ఏమీ తెలీలేదనీ మాత్రం కొంత తెలిసింది. "

" బలే చదువే. ఆపైది వాడినే అడగకపోయావా ? "

" వారిప్పుడు లేరండి "

" హరిః ఓం. హరిః ఓం.

" ___ ___ ___ ___ "

" సరే, ఈపూట దేవతార్చన అయిందా?"

" అయిందండి "

" మొహాన గంధం లేదే "

" మహానైవేద్యం లేదుగదా అని "

" మహానైవేద్యం లేదా ! ఇవాళ్ళేనా, నిన్న గూడానా ?"

" అయిదు రోజుల నుంచీ "

" అయిదు రోజులనుంచీ సన్యాసం కోసం ప్రాయోపవేశం చేశావన్న మాట! ఏడిచినట్టే వుంది. మరి నీరసంగా లేవేం ? "

"చిత్తం "

" ఏమైనా జపాలు చేస్తూవుంటావా ? "

" చిత్తం. కొంచెం, కొంచెం. "

" ఏం మంత్రాలు "

" గాయత్రి "

" ఇంకా "

" నరసింహం "

" ఇంకా "

" కృష్ణం "

" ఇంకా "

" ఆదిత్యం "

" ఇంకా "

" ఇంతేనండీ - ఈ బతుక్కి "

" ఏమాత్రం చేశావు ? "

" అబ్బే కొంచెం, కొంచెమేనండి. "

" దిష్టి కొట్టనులే, చెప్పు.

" అమ్మమ్మా, గురువుల దగ్గర దాపరిక మేముంది స్వామీ "

" నారసింహం ఎంతచేశావు ? "

" అయినా, నా మొహం జపం - ముక్కి మూలిగి ఒక అవృత్తి అఘోరించాను "

" అవృత్తి అంటే అక్షర లక్షలేనా "

" చిత్తం "

" ఆదిత్యం ? "

" అదీ అంతేనండి ఇంచుమించు "

" కృష్ణం ? "

" దానికి లెక్క పెట్టలేదండి "

" గాయత్రి "

" దాని కింకా పునశ్చరణ పూర్తి కాలేదు స్వామీ. "

" ఏం ?"

" పూర్తి చేద్దామనుకుంటుండగానే, భార్యకు రోగం పెరిగింది. ఋణశేషం తీరాలిగా. ఆ సేవలో పడ్డాను. ఈ లోగా అది పోనే పోయింది. "

" దాంతో, దానంభొట్లు బోధలు తలకెక్కి, సన్యాసం మీదికి బుర్ర తిరిగింది. అంతేనా ?"

" తమబోటి మహనీయులు అనేక ఆవృత్తులు ఆవలీలగా ఆచరించి వుంటారు. తమ ముందర ........ "

" ఛా, ఛా, ఇలాంటి చిల్లర దేవుళ్ళు మాకు చిన్నప్పటినుంచీ లేరు. మాకు వున్నదల్లా ఒక్క తపసిషత్తే "

ఈ మాటకు మాత్రం నరసింహశాస్త్రికి ఉవ్వెత్తున ఉగ్రం వచ్చింది, " ఏమిటి ఈయన అహంకారం " అని. కాని పూర్వపుణ్యం అక్కరకొచ్చి, వెంటనే తనను తనే సంబాళించుకొన్నాడు.

ఆ స్వాములవారు మాత్రం తన సమాధానానికి తానే పొంగిపోయి, తెగనవ్వి, నెత్తిమీద జారిన కాషాయం సవరించుకొని దండం పక్కన పెడుతూ—

" ఇదిగో ఓయ్- పేరేదో చెప్పావు - మరిచిపోయాను " అన్నారు.

" ఏమి పేరంటే నా బొందపేరు. కొందరికి నా పేరు తిక్క నరసింహం, కొందరికి నరసింహశాస్త్రి, మరి కొందరికి నరసింహాయ్, మరి కొందరికి నరుసులు మామ, ఇంకా కొందరికి పంతులు. ఇందులో నాపేరు ఏదనమంటారు ? ఇవికాక, ఇంకా చాలా పేర్లున్నాయి నాకు'' నరసింహశాస్త్రికి తిక్క తిరిగితే మెత్తగా మాట్లాడటం కుదరదు మరి.

'' అయితే, మరి నీ మొట్టమొదట పేరు ; పుట్టంగానే నీతో వచ్చిన పేరు ఏమిటి ? "

" పుట్టంగానే, నాకు పేరెక్కడ వచ్చింది ? కొన్నాళ్ళు పోయాక గదా పేరు పెట్టేది, యెవడికైతే మాత్రం ''

" ఒకవేళ, నువ్వు పుట్టంగానే పేరు పెట్టారనుకొందాం.''

'' అలా అనుకున్నా, అది ఎవరు పెట్టారో వారి పేరవుతుంది గాని, నా పేరెలా అవుతుంది ? "

" అయితే నీకు సొంత పేరంటూ అస్సలు లేనే లేదంటావా "

'' నే ననేదేమిటి స్వామీ, అదేగా వున్న సత్యం."

" పోనీ కిందటి జన్మలో ఏదో పేరు వుండక పోతుందంటావు ? "

" క్రిందటి జన్మలో కుక్కనో, నక్కనో, ఎవడికి తెలుసు ? "

" అంటే అప్పుడు కుక్కరూపం, యిప్పుడు మనిషి రూపమూ, అయితే నీ అసలు రూపమేమిటి ? ''

" అది తెలీకేగా, మహాప్రభూ, కొట్టుకు చస్తున్నాను."

" అలాగా ? అయితే నీ పేరూ నీకు తెలీదు. నీ రూపమూ నీకు తెలీదు. అంతేనా "

" తెలీదు మహాప్రభో! నన్ను వుద్ధరించండి "

" నీపేరూ, నీరూపం, నీకు తెలియవుగాని, ఆ భగవంతుడికి, సింహం తలకాయ వుంది, లేకపోతే గుర్రం తలకాయి వుంది, ఆయన పేరు ఫలానా అని నీకు తెలునుగదూ!"

" అబ్బెబ్బే ఏమిటో! అది కాదనుకోండి. "

" పైగా నువ్వు చెప్పిన పేరుతో దేవుణ్ణి పిలవకపోతే-కోపం ....మహాబాగా వుంది."

" చిత్తం.... చిత్తం.... క్షమించాలి."

" ఇలాంటి నీకు, నేను సన్యాసం యివ్వాలి "

" స్వామీ, క్షమించి, నాకెలా బోధించాలో, అలా బోధించి, అనుగ్రహించి, ఉద్ధరించండి." నరసింహశాస్త్రి మరోసారి, సాష్టాంగవందనం చేసి, లేచి, చేతులు జోడించుకొని నుంచున్నాడు. ఆ యతి యెగాదిగా చూచి మళ్ళీ మొదలెట్టాడు.

" నా మొహం. బోధించేందుకు నా దగ్గరేముంది కాని, ఎంతమంది పిల్లలన్నావు "

" ఎవరికండీ "

" ఎవరికేమిటి, నాకు లోకమంతా పిల్లలే, నీ సంగతి చెప్పు."

" ఒక్క మగపిల్లవాడండి "

" ఎన్నేళ్ళవాడు "

" ఆరేళ్ళు "

" మరి నువ్వు సన్యాసుల్లో కలిస్తే వాడి గతేమి కాను."

"భార్య పోగానే వాణ్ణి అమ్మమ్మ, తాత, తీసుకుపోయారండి. వాళ్ళకు వేరే మగ పిల్లలు లేర. వీడ్ని వాళ్ళే పెంచుకుంటామన్నారు. వాడికి లోటు లేదు, తమ దయవల్ల. "

" నా దయగూడ ఓటి చేర్చావు. సరేలే. భార్య పోయి ఎన్నాళ్ళయింది ?

" ఏడాది దాటిందండి "

"భార్య పోయి ఏడాదయినాక ఇప్పుడు సన్యాసపాలోచ నెందుకు పుట్టింది? వండిపెట్టే దిక్కు దొరకలేదా ?"

"ఈ సంవత్సరంలో ఆదిత్యం ఆవృత్తి పూర్తి చేశానండి.

"అది మంచి పనే. మరి నా సంగతి నీకెవరు చెప్పారు. "

" అభేదానందస్వామి "

" వాడెవడు "

"పొద్దుటూరిలో ఉంటారండి. రమణ మహర్షుల వారి శిష్యులు."

"ఆ ఎం.బి.బి.యస్ వాడా ? వాడు గట్టివాడే. వాడి దగ్గర కెందుకు పోయావు నువ్వు."

"ఆ ఊళ్ళో మా అక్కగారు వుంది, వెంకమ్మగారని. దాని మొగుడు అదే మా బావగారు, నంద్యాల సుబ్బయ్యగారని, ఆయుర్వేద వైద్యం చేసేవాడు లెండి. ఆయన పోతేనూ, చూడటానికి వెళ్ళా. మా అక్కగారు గూడ, కాస్త ముక్కు పట్టుకొని కూర్చుంటూ వుంటుంది లెండి. దానికీ ఈ అభేదానంద స్వామివారికి స్నేహం. తద్వారా ఆయన సాంగత్యం నాకు పొద్దుటూర్లో లభించింది.

"అదా సంగతి. సరిసరి. నంజుండప్ప కొడుకువి. కాస్తో కూస్తో, జపాలు చేశానంటున్నావు, అనంతపురం దాసయ్య ఏదో చెప్పాడంటున్నావు, అభేదానంద స్వామి సిఫార్సు చేశాడంటున్నావు. కనుక నిన్ను కాదనటు మెట్లా."

"అయ్యా అనుగ్రహించండి స్వామీ!"

"అనుగ్రహం బోలెడంత వుందయ్యా, కాని మాకు కాళ్ళూ, చేతులూ లేవు, ఇచ్చేందుకు, పుచ్చుకునేందుకూను."

"నా జీవితమంతా తమ సేవ చేసుకుంటాను."

"మంచిదే-కాని పైవాడి ప్రణాళిక ఒకటి వుంటుంది. అది నీకోసం, నా కోసం కాక, లోకాలన్నిటికీ క్షేమం కోసం సాగుతూ వుంటుంది."

"స్వామీ, నాకు సరీగా అర్థం కావటం లేదు."

"అర్థమయ్యేందు కేముంది. సన్యాసమంటే ఇచ్చేదీ, పుచ్చుకొనేదీ కాదు-లడ్డూలాగ."

"అయ్యా నేనంత స్థాయివాణ్ణి కాదు. ఏదో వివిదిషా సన్యాస మార్గంలో క్రమ సన్యాసంగా తమ దయలో గట్టెక్కవలసినవాణ్ణి. కనికరించండి.

"అదయినా రికమండేషన్ల మీద యిచ్చేది కాదు."

"సిఫార్సు లొద్దు స్వామీ! నన్ను తమ దగ్గరే పెట్టుకొని, రాచి రంపానపెట్టి కావలసినవన్నీ నేర్పండి. తొందరలేదు. నాకు అర్హత వచ్చిందని తమకు తోచిన తరువాతే సన్యాసం యివ్వండి."

"అంతకాలం ఆగుతావా అని."

"అయ్యా ఈ కంఠంలో ప్రాణం వుండగా మాట తప్పను."

"నీ కంఠంలో సరే, నా కంఠంలో ప్రాణాలు, ఏరోజు కారోజు ఎగిరెగిరి పడుతున్నాయి. సరే, దానికేమిగాని, ఒ పని చెయ్యి."

"చెప్పండి."

" ఒక సంవత్సరం పాటు నా దగ్గర వుండి శుశ్రూష చెయ్యి. "

" చిత్తం-మహాప్రభో ధన్యోస్మి."

" పైవాడు అప్పుడేమంటాడో అప్పుడే విందాం"

" చిత్తం. తమరు గెంటెయ్యకుండా వుంటే, అంతే చాలు "

" సరేగాని, మరి నీ బోజనం మాటేమిటి ? "

"స్వామీ, తమ భోజనం గురించి తమకు లేని చింత నా భోజనం గురించి ఎందుకండి?"

" శిష్యుడని నెత్తిన పెట్టుకున్నాక, మా ఖర్మ మింతే మరి. వాడికోసం అన్ని చావులూ, చావవలసిందే "

" స్వామీ, వేదమాతను నమ్ముకొని జీవిస్తే, అన్నం లేక చచ్చిన బ్రాహ్మణ్ణి నే నింత వరకూ చూడలేదు. "

ఈ సంభాషణ యీ స్థితిలో వుండగా సుమారు అరవైయేళ్ళ వయిస్సులో వున్న బ్రాహ్మణు డొకడు, అరటిపళ్ళ అత్తం చేత పుచ్చుకొని వచ్చి స్వాముల వారి పాదాల ముందు పెట్టి వందనం చేశాడు.

" శాస్త్రుల్లూ, నాకంటె తలకు మాసినవా డొకడు దొరికాడోయ్. వీడికి సన్యాసం కావాలిట. నేను గురువునట " అన్నారు స్వాములవారు, ఆ వచ్చి నాయనతో. ఆయన కొంచెం ఆశ్చర్యంగా చూసి, నరసింహశాస్త్రి వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు.

" ఒక సంవత్సరం పోయాక, ఆలోచిద్దామన్నానయ్యా. ఈ లోపల ఏదో సేవ చేస్తాట్ట, చూద్దాం. " అన్నారు. స్వాములవారు మళ్ళీ. ఆయన ఈమాటు నిజంగానే ఆశ్చర్య పోయాడు.

" ఏమండోయ్, మీ రెవరో నిజంగానే అదృష్టవంతులు. గత పాతికేళ్ళుగా వీరు " సరే చూద్దాం" అని నోటంబడ అని, ఒక శిష్యుణ్ణి చేరదీయగా నేను చూడలేదు. ఎటువంటి పండితులూ, వీరికి నచ్చరు. ఎటువంటి ఉపాసకులూ వీరికి నచ్చరు. వీరి మార్గమే వేరు. మీరు నిజంగా అదృష్టవంతులు" అని ఆ ఆగంతకుడు నరసింహశాస్త్రిగార్ని ధారాళంగా అభినందించి-

" సరే, ఇంతకూ తమ రెక్కడ దిగారూ"

" ఇక్కడే దిగాను. "

" భోజనం "

" ఇంకా కొంచెం అనుష్ఠానం వుందిలెండి "

" అయిదు రోజుల్నుంచీ చేస్తూనే వున్నాడట అనుష్ఠానం. ఇంకా తెమలలేదు" ఎక్కిరింపుగా అందుకున్నారు స్వాములవారు. అయిదు రోజులుగా భోజన్ణం లేకుండా, ఇంత

తాపీగా నిలబడివున్న మనిషిని చూచి, ముందర ఆ ఆగంతకుడికి నీరసం వచ్చినంత పనయింది. ఇహ రెండో మాట వినకుండా, తొందరపెట్టి, నరసింహశాస్త్రిని తన ఇంటికి భోజనానికి తీసుకువెళ్ళాడాయన.

భోజనం అయాక ఆ గృహస్థు ఎంత చెప్పినా వినకుండా, వెంటనే స్వామివారి దగ్గరకు వచ్చేశాడు నరసింహశాస్త్రి.

అది కర్నూలు ప్రాంతంలో, ఒక మధ్యరకం పల్లెలో వూరికి చివరగా వున్న శివాలయం వెనుక వున్న, చిన్న పెంకుటి వసారా గది. వానలేని రోజున, ఏ బాధా లేదుగాని వానవున్న రోజున మాత్రం ఆ గదిలో గురుశిష్యులకు దాదాపు జాగారం అయ్యేది. ఉగ్రనరసింహం అని పేరు పొందిన నరసింహశాస్త్రి ఆ స్వాముల వారి ముందు కుంటిపిల్లి అయిపోయాడు. ఆ చిన్న గ్రామంలో ఆ స్వాముల వారికి మాత్రం కోపిష్ఠి స్వాముల వారనే పేరు ప్రసిద్ధి.

రోజులో ఎక్కువ భాగం ధ్యానస్థితిలో గడిపేవాడు ఆ స్వాములవారు. కళ్ళు తెరిచిన కాసేపట్లో ఎవరన్నా వచ్చి ఉపనిషత్తు వినిపిస్తే సంతోషం ఆయనకు. ఏదో స్వాములవారు గదా, గుళ్ళో లింగానికి పెట్టినట్టే యీయనకు గూడ ఒక దణ్ణం పెట్టి పోదామని వస్తే మాత్రం, ఏదో వంకన తిట్టందే ఆయన ఆగేవాడు కాదు. అందులో కొంద రెదురు తిరిగేవారు. ఎదురు తిరిగితే ఈయన రెచ్చిపోయి అరిచేవాడు. దాంతో వారూ వీరూ పోగయి సద్దేవారు. దాంతో ఆ రోజుకి మామూలుగా వచ్చేవారు గూడ వచ్చేవారు కాదు. ఈయన హమ్మయ్య అని కళ్ళు మూసుకొని కూర్చునేవాడు.

ఈయన ఇంత మోటుగా వున్నా, రోజూ ఎవరో ఒకరు ఏదో వకటి తెచ్చిపెట్టేవారు. అంతకు ముందుదాకా ఒకరు తెచ్చిన పదార్థాన్ని మరొకరికి ప్రసాదంగా యిచ్చి పంపేవారు స్వాములవారు. నరసింహశాస్త్రి వచ్చాక మాత్రం ప్రతి అర్పణలోనూ ప్రసాదభాగం ఈయనకు ముందు నచ్చేది.

ఆ రకంగా అక్కడ తిండికి లోటు లేదుగాని ఆ కోపిష్ఠి స్వాముల వారికి రాత్రిపూట నిద్ర వుండేది కాదు. రాత్రి పొద్దు పోయేదాకా జపం చేసుకొని కాసేపు గాఢంగా నిద్రపోయి మళ్ళా వెంటనే నిద్ర లేవటం నరసింహశాస్త్రి అలవాటు.

కావాలని చేసేవాడో, దానంతటదే జరిగేదో గాని యీ జపం విషయంలో మాత్రం ఆ స్వాములవారు నరసింహశాస్త్రిని నానాతిప్పలూ పెట్టేవారు. ఆ రోజుకు కావాల్సిన సంఖ్యతగ్గితే ప్రసాదాలెక్కువై బద్ధకం బలిసిందా అనేవాడు. జపంచేస్తుంటే అనుక్షణం పలకరించేవాడు.

---

శ్రీ నరసింహశాస్త్రిగార్ని వారి 82 వ సంవత్సరములో కలిసి మాట్లాడాడీ రచయిత. ఆ వయస్సులో అప్పటికే అస్తవ్యస్తంగా వున్న ఆరోగ్యంలో శ్రీ శాస్త్రిగారు, ఆ వూరి పేరుగానీ, ఆ స్వాములవారి పేరుగాని గుర్తు చేసుకోలేకపోయారు.

సహజంగా ఏ అలజడినీ తట్టుకోవటం ఎరగని మన ఉగ్రనరసింహం గారికి జపం చెడిపోతే తట్టుకోవటం అసలు కుదరని పని. అది ప్రాణాంతకంగా వుండేది. అయినా తట్టుకొని ఆయనకు సేవ చెయ్యగా చెయ్యగా, అలా మాట్లాడుతున్నా జపం సాగటం అలవాటయింది. "మనకిది అలవాటవుతోంది. ఇక ఆయన పిల్చినా ఫరవాలేదు" అనుకొనేవాడు నరసింహశాస్త్రి మనస్సులో. వారింక పోయి పలకరించేవారు కాదు స్వాములవారు. మళ్ళీ నిశ్చలంగా జపం చేసుకోవటం రుచి మరిగేవాడు శాస్త్రి. మళ్ళీ తనను పిలిచేవారు స్వాములవారు.

రెండు రోజులకీ, మూడు రోజులకీ, ఆయనకు మూడొచ్చినప్పుడు అర్ధరాత్రి లేపి ఉపనిషద్వ్యాఖ్యానం మొదలెట్టేవారు. అప్పుడు మాత్రం ఆ బ్రహ్మపదార్థం చేతికందినట్టు వుండేది, నరసింహశాస్త్రికి.

ఇక ఆయనకు చేయవలసిన శారీరక సేవలు చాలా స్వల్పమే అయినా ఆయన తిట్టే తిట్లు ఘోరంగా వుండేవి. తను ఒకర్ని తిట్టటమే తప్ప, తనని ఒకరు తిట్టటం యెరగని నరసింహశాస్త్రికి యీ పరిస్థితి రోజురోజుకీ ప్రాణాంతకంగా వుండేది. అయితే శాస్త్రి సహనాన్ని స్వాములవారే మెచ్చుకుంటూ వుండేవారు. ఏమయితేనేమి "దాని సంపాన పెట్టండి" అని ఏ ముహూర్తాన, శాస్త్రి తనంత తను కోరుకున్నాడో గాని, ఆ స్వాములవారు నిజంగానూ అంత పని చేయసాగారు. మరో లోకం ఎరుగకుండా ఇలా అసిధారావ్రతంగా సేవ చేస్తున్న నరసింహశాస్త్రికి, సుమారు ఆరు నెలల కాలం గడిచింది అన్న గమనిక కలగలేదు.

ఆ రోజు రాత్రి నిద్రలేపి "శాస్త్రీ! కొంచెం కాక తగిలినట్టుందోయ్" అన్నారు స్వాములవారు.

శాస్త్రికి, చేతి నాడెం బాగా తెలుసు. నాడి చూద్దామంటే నసేమిటా వల్లకాదన్నారు, స్వాములవారు. కాస్త జపం చేద్దామనుకున్నాడు శాస్త్రి. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని ఉపనిషత్తు అందించారు స్వాములవారు.

వారి అభీష్టం మేరకు ఆ ఉపనిషత్తు కొనసాగించాడు శాస్త్రి. కాని నరసింహశాస్త్రి గొంతు బహు మొరటుగొంతు, అది యింపుగా వుండదు. ఆ మాట తనకు గూడ తెలుసుగనుక గురువు గారికి యెక్కడ కోపం వస్తుందో అని, ఆయన కొంచెం జంకుగానే చెపుతున్నాడు. ఇంతలో ఆయనకు నిద్దర పట్టిందనిపించి పనస ఆపాడు శాస్త్రి. ఒక క్షణం ఆగి "శాస్త్రీ" అని పిల్చాడు స్వాములవారు.

ఆ గొంతులో ఏదో మార్పు గమనించాడు శాస్త్రి. కాని అదేమిటో ఆయనకు అర్థం కాలేదు. అయోమయంగా వుండిపోయాడు, మౌనంగా. మళ్ళీ స్వాముల వారు అదే వింత గొంతుతో కొనసాగించారు,

“ బ్రాహ్మీముహూర్తం ప్రవేశించింది.” శాస్త్రి తలయెత్తి ఆకాశంవంక చూడబోతుండగా మళ్ళీ స్వాములవారి కంఠం వినిపించింది.

“ ఇక మాకు కాలమంతా బ్రహ్మముహూర్తమే ”

ఏమీ అర్థం కాలేదు శాస్త్రికి. మౌనంగా వూరుకుండి పోయాడు. కొంత అయోమయంగా కొంత ఆలోచనగా.

“నీకు గూడా అందుతుంది బ్రహ్మానందం” స్వాములవారు మళ్ళీ అన్నారు.

ఆ గొంతులో మార్పు అనారోగ్యంలోని అలసటవల్ల కావచ్చు ననిపించింది శాస్త్రికి. ఇక మళ్ళీ మాట్లాడలేదు స్వాములవారు.

విశ్రాంతే మంచిది అనుకున్నాడు శాస్త్రి. ఇక ఆ తరువాత తన శ్వాసలో శ్రీకృష్ణ మంత్రాన్ని లయం చేసుకొంటూ అక్కడే కూర్చుండి పోయాడు శాస్త్రి.

మధ్య మధ్యలో స్వామివారి ముఖం చూస్తూనే వున్నాడు. అది ప్రశాంతంగా వుంది. కాని ఒకపక్క తన గుండెలో బిక్కు బిక్కు మంటోంది.

శాస్త్రిలాగే బిక్కు, బిక్కు మంటూ ఆ చీకటి గదిలోకి సన్నసన్నగా తొంగి చూడ సాగాయి, తొలి తెలిరేకలు. చూస్తున్న కొద్దీ వాటి మొహాలు కందిపోయి, క్రమంగా ఆకాశమే ఎర్రబారసాగింది. అలా ఆకాశపు మొగం గాంఢ్రించి, గాంఢ్రించి, లోపల బిగపట్టుకొన్న దుఃఖం భళ్ళున పగిలి, వెర్రిశోకమై బయటపడ్డట్టు భూమి మీదికి దూకింది సూర్యగోళం.

ఇక ధైర్యం చేసి స్వాములవారి నాడి చూశాడు శాస్త్రి. క్షణంసేపు నాడి చూసి, నిమ్మదిగా స్వాములవారి చెయ్యి నేలపై పెట్టాడు శాస్త్రి. ఇకపైన ఆయన ఏం చేస్తున్నాడో ఆయనకు తెలిసినట్టులేదు. లేచి మౌనంగా మూడు ప్రదక్షిణాలు చేసి, స్వాములవారికి సాష్టాంగ వందనం చేశాడు. ఇక వెళ్ళి ఆ గదిగోడకు చారగిలబడి ఆకాశంలోకి చూస్తూ కూర్చుండిపోయాడు.

దుఃఖం వచ్చినా, సంతోషం వచ్చినా, భళ్ళున బయట పడటమే శాస్త్రికి జన్మతో వచ్చిన విద్య. అందులోను ఏడుపు ఆయనకు కొత్తకాదు. అమ్మ పోయినపుడు ఏడ్చాడు, నాన్న పోయినపుడు ఏడ్చాడు, పెళ్ళాం పోయినపుడు ఏడ్చాడు, బావ పోయినపుడు ఏడ్చాడు. కాని యివాళ ఎందుకో ఏడుపు రావటం లేదు.

తన గొంతులోని శబ్ద నాళాలను పురికొసలు తెంపినట్టు తెంపి, పైకి చర్మం మీదికి దెబ్బ కనిపించకుండా లోపలికి లోపలే, గునపాలు పెట్టి గుండెలో ఎముకలు పొడిచి, పొడిచి, ముక్కలు చేసినట్టుగా వుంది శాస్త్రికి. తన కడుపులోకి ఎవరో తమ అదృశ్య హస్తం పెట్టి లోపలి పేగులు ముక్కలు చేసి పారేసి పకపక నవ్వుతున్నా రనిపిస్తోంది శాస్త్రికి.

ఇదేమీ పట్టించుకోని పొద్దుటి గాలులు అలయ ధ్వజస్తంభపు చిరుగంటలతో సరసాలాడి గణగణలాడిస్తున్నాయి హాయిగా.

* * *

వెంకమ్మక్క

అసలే విధం వెడి, నలుగురిలోకీ రావటానికి మొహం చెల్లక తను బాధపడుతుంటే, బద్వేలువారు పంపిన వార్త గోరుచుట్టుమీద రోకటి పోటులాగ తగిలింది వెంకమ్మగారికి.

"సర్లే, పోయిన వాళ్ళకోసం యేడ్చేకంటే, బ్రతికున్న వాళ్ళకోసం యేడవటం మేలులే " అని గుండె రాయి చేసుకొని తీరా ఇంత దూరం వస్తే ఇక్కడ యీ మురికిమాటలు వినటం మరీ కష్టంగా వుంది ఆమెకు. అవును మరి, ఆ బొమ్మెపర్తి బండరైతులకు అంతకన్న పై ఆలోచన లెలా వస్తాయి ?

"నరసయ్య మామకు పెళ్ళాం పోయింది, పిచ్చెక్కింది, పెళ్ళాం పిచ్చి." ఇదే వాళ్ళు ఎగరగలిగిన ఎత్తు, వాళ్ళు చూడగలిగిన లోతు.

"అయినా, యీ నరసాయికి వెర్రి గాకపోతే, పోయి పోయి, కాటికి కాళ్ళు చాచుకున్న వాడి కాళ్ళు పట్టుకుంటే, ఆయన గుటుక్కుమన్నాడంటే, అనడా మరి ? ఇంతలో ఏంపోయె? సన్యాసం పుచ్చుకోకపోతే ముక్తిలేదా ? సుబ్బయ్య మామన్నా వుంటే నాలుగు చివాట్లు పెట్టేవాడేమో! ఇప్పుడు ఎవరు చెబితే ఈ మొండి వెధవ వింటాడు ? ఈ ముండమోపి మొహం వేసుకొని, నే నెవరి చుట్టూ తిరిగేది ? ఏ దిక్కూ తోచకుండా వుంది. " అని వెంకమ్మ గారు పరిపరి విధాల ఆలోచిస్తూ, తమ్ముడికి కాస్త రుచి పాకంగా వండిపెడుతూ నాలుగు రోజులు బొమ్మెపర్తిలో కాలక్షేపం చేసింది.

అక్కగారి తిండి పడినాక గుంటలుపడ్డ కళ్ళలోకి లోతుగా కూరుకుపోయిన ప్రాణాలు కాస్త తెప్పరిల్లి నరసింహశాస్త్రి ముఖంలో కాస్త జీవకళ రాసాగింది, ఇన్నేళ్ళొచ్చినా అక్కగారి కంటికి యింకా "తల్లిలేని పిచ్చి సన్నాసి" గానే కనిపిస్తున్న నరసింహశాస్త్రి పిచ్చిధోరణిలో మాత్రం మార్పు లేదు. తింటాడు. ఏడుపు మొహం పెట్టుకొని, తలవంచుకొని మూల కూర్చుంటాడు. ఎవరైనా వచ్చి పలకరిస్తే, పెద్ద సంతోషంగా వున్నట్టు మొహం చాటుంత చేసుకుని " బావున్నారా " అంటాడు. అంతే, వెంటనే అత్తిపత్తి ఆకల్లే ముడుచుకు పోయి వూరుకుంటాడు. వాగి, వాగి, గోడతో వాగినట్లే లెమ్మనుకొని వచ్చినవాళ్ళు తామే లేచి పోతారు. రోజూ యిదే వరుస.

"నిన్నగాక మొన్న ముండమోసిన దాన్ని నేను బాగానే వున్నాను. నీకేం తెగులురా? అలా పోయి పంట లెలావున్నాయో చూసుకు రాక, ఇలా కొంపలో తగలబడతావు." అని తిట్టిపోస్తుంది, కడుపులో మండినపుడు వెంకమ్మగారు. ఎట్లాగైనా కదులుతాడేమో అన్న ఆశతో.

మరీ ఎక్కువ తిట్టిన రోజున ఎదురు తిరిగి, విసుక్కుని, "నిన్నెవడు పిల్చాడు. పో పోవమ్మా" అని కసురుకొని, ఉత్తరీయం పరుచుకొని పడుకొని వూరుకుంటాడు తప్పితే ఇల్లు కదలడు నరసింహశాస్త్రి.

ఇక వీడితో లాభం లేదని, రైతుల్ని పిలిపించి, పంటలు, బాకీ డబ్బులు, వగైరా వ్యవహారాలు తనే విచారించసాగింది వెంకమ్మగారు. 'మామ'ని యిట్టే బోల్తా కొట్టించటానికి అలవాటుపడ్డ రైతుల ట్రిక్కులేవీ యీావిడ దగ్గర సుతరామూ పని చేయలేదు. దాంతో రైతులు వాయిదా మంత్రం ప్రయోగించసాగారు.

ఒక రైతు యువకుడు ఒక రోజున, ఊరి బావి దగ్గర బాకీ అడిగిందని కాస్త మాట తూలాడు. అంతే, వాడి చమడాలు లేచిపోయి మరుక్షణంలో వాడు గింగిరీలు తిరిగాడు. అసలే ఆడవాళ్ళలో ఆజానుబాహువు వెంకమ్మగారు. దానికి తోడు నెత్తిన తెల్లముసుగుతో, నుదుట విభూతి పట్టీతో, పొన్ను వున్న కర్ర ఒకటి అందుకొని కండలు తిరిగిన ఆ కుర్రవెధవను బాదుతుంటే, ఆ ఉగ్రరూపానికి ఊరిపెద్దలు దడుచుకొని ఎక్కడి వారక్కడ సద్దుకొన్నారు.

దాంతో నరసింహశాస్త్రికి రావలసిన బకాయిలన్నీ మరునాటికల్లా ఇంటికి వచ్చి వాలాయి. "దండం దశగుణం భవేత్" అని వూరికే అన్నారా పెద్దలు.

ఇలా వుండగా ఒకరోజు మెరుపులాంటి ఆలోచన వచ్చింది వెంకమ్మకి. వెంటనే "ఒరేయ్ చీపిరికట్టా" అని పిలిచింది మూల కూర్చున్న తమ్ముణ్ణి.

'ఊ' అన్నాడు నరసింహశాస్త్రి బుద్ధిగా.

"నంజుండప్ప కళ్ళలో మెదులుతున్నాడ్రా"

"ముక్కుల్లో మెదలటం లేదా ?"

"నీకేం తెలుస్తుందిరా ఆడదాని మనస్సు? తల్లిలేని పిచ్చి సన్నాసి, ఎలా ఉన్నాడో ఏమో."

"పాపం"

"ఏడిచావ్ లేవోయ్! చిన్నప్పుడు అమ్మపోతే నువ్వెలా ఏడ్చావో, నిన్ను చంక నేసుకొని ఎంత యాతన పడేదాన్నో నీకేం గుర్తు? నీలాంటి వాడు కాదా నీ కొడుకు?"

"ఏమిటంటావు ఇప్పుడు"

"ఒకసారి చూడాలని వున్నదిరా ఆ చిన్న నాగన్నని"

"కందుకూరు పోయిరా"

"ఒక్కత్తెనూ ఎలా పోయేదిరా"

"ఏం, అక్కడ నువ్వెరగని వారెవరు ?"

"ఎంత తెలిస్తే మాత్రం, మేనమామ అయితే మాత్రం, ఈ పాడు మొహం, నా అంతట నేనే పోయి ఎలా చూపేదిరా ?" అక్కగారి మొహంలో యిదివర కెన్నడూ చూడని

ధైర్యాన్ని చూచి చలించి పోయాడు తమ్ముడు. "ఎంత ధైర్యంగల ఆడదాన్నయినా వైధవ్యం ఇంత కుంగదీస్తుంది గాబోలు" అనుకున్నాడు. దాంతో కాస్త మెత్తబడి 'నన్నేం చేయమంటావు' అన్నాడు.

"కాస్త తోడురారా"

"సరేలే"

ఇంకేం, వెంకమ్మగారి యెత్తు ఫలించి, అక్కా తమ్ముడూ ఆ మర్నాడే కందుకూరు చేరారు. వెళ్ళేటప్పుడు నాలుగైదు రకాల పిండివంటలు చేసి మూటకట్టి పట్టుకోరా అని తమ్ముణ్ణి పురమాయించింది.

కందుకూరు చేరేసరికి, గడ్డాలు పెరిగివున్న తండ్రిని చూసి, ముందర గుడ్లప్పగించి దూరంగా పోయిన నంజుండప్పను, అక్కగా రిచ్చిన తినుబండారాలతో ఆకర్షించవలసి వచ్చింది నరసింహశాస్త్రి.

మొత్తంమీద పట్టుబట్టి కొడుకును మాలిమి చేసుకొని తీపి ముక్కలు తినిపిస్తున్న తమ్ముడ్ని చూసి కొంత తృప్తి పడసాగింది వెంకమ్మగారు.

ఇది తృప్తిగానే వుందిగాని, వాకిట్లోకి వచ్చి, వసారాలో కూర్చుని అరగంట దాటుతున్నా కాళ్ళు కడుక్కోమని నీళ్ళిచ్చిన వారు లేరుగదా, లోపలికి రండన్న వారు గూడ లేరు.

ఎనిమిదేళ్ళ వయస్సులో అప్పుడే, చదువనూ వ్రాయనూ నేరుస్తున్న నంజుండప్ప తండ్రి వచ్చాడన్న సంబరంలో, పిండివంట ముక్కల సంబరంలో, ఇంట్లోకి బయటకి పరుగులు తీస్తూ హడావిడి చేస్తున్నాడు.

"మా నాన్న వచ్చాడు, రా అమ్మమ్మా" అని మధ్య మధ్యలో అరుస్తున్నాడు.

చాలసేపయినాక "బావున్నారా" అంటూ నరసింహస్వామి మామయ్య ఇంట్లోంచి బయటకు వచ్చాడు.

మళ్ళీ ఒక్క క్షణం—ఉభయ వర్గాల్లోనూ మౌనం ముద్రవేసింది.

"ఒరేయ్ నంజుండప్పా, ఈ నంచు లవ్వీ లోపల పెట్టిరా" అని ఒక హుకుం పారేశాడు నరసింహస్వామిగారు. అదే ఘనస్వాగతంగా భావించుకోమని ఆయన అభిప్రాయమని స్పష్టంగానే తెలుస్తోంది.

ఓ అని నంజుండప్ప ముందరి కొచ్చే లోపలే— "కొంచెం పనుంది. రాత్రి కుంటారుగా" అని గోడతో అన్నట్టు అనేసి, సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్ళి పోయాడు నరసింహస్వామిగారు,

ఈ ఆహ్వానం, ఈ ఆదరణ పద్ధతీ చూసి, వెంకమ్మకు తల తిరిగిపోతోంది. మిగిలిన విషయా లెలావున్నా, తను యిలాంటి పరిస్థితుల్లో, ఇలాటి అవతారంలో, ఇంటికి వస్తే స్వంత మేనమామ పలకరింపు తీరు చూసి ఊపిరాడన ట్టయింధి ఆవిడికి. ఇదికాక అప్పుడే తమ్ముడు నరసింహశాస్త్రి ముఖంలో ఉగ్రపూనకం ఛాయల్ని గమనిస్తూనే వుంది మరో కంటితో. తీరా యిక్కడిదాకా వచ్చినాక వెనక్కి తిరిగిపోతే తన తమ్ముడికీ, వాడి అత్తవారికీ, సంబంధాలు తన చేతుల్తో తనే తెంచిన ట్టవుతుంది. అందుచేత సహనానికే నిర్ణయించుకుంది వెంకమ్మ. ఆ నిర్ణయం వచ్చాక ఆవిడ ముఖం అచ్చం ఒక రాయి అయిపోయింది. అందులో యిప్పుడు ఏ భావాలూ లేవు.

" రారా లోపలికి పోదాం " అని నంజుండప్పతో అంటూ తనే సంచులు పుచ్చుకొని లోపలికి నడిచింది వెంకమ్మ.

" నీకు కాపలా వెధవగా రావటం, పోవటం, అంతేగా నాపని. తక్కిన యేడుపులు నాకెందుకు ?" ఈ ఒక్క మాటలోనే, తన ఉగ్రాన్ని కుదించుకొని వూరుకొన్నాడు నరసింహ శాస్త్రి. వెంకమ్మ తనే పెరట్లోకి పోయి, కాళ్ళు కడుక్కొని, వంటింట్లోకిపోయి తనే పలకరించింది అంబమ్మత్తని.

'' ఎల్లా వున్నావమ్మా అంబమ్మత్తా " అని.

" ఊ " అన్నది అంబమ్మత్త, వారం రోజులనుంచీ, లంఖణా లన్నంత నీరసంగా.

'' చెట్టంత కూతురు, పండంటి కూతురు, అట్టా ఆ కొంపలో బడి అర్ధాయుష్యపు చావు చచ్చినాక, ఏం చెప్పమంటావు నాసంగతి. ఇటు బతికిన వాళ్ళలోనూ లెక్కకాదు, అటు చచ్చిన వాళ్ళలోనూ లెక్కకాదు. ఇట్లా తగలడ్డాను. " అని అంబమ్మత్త రెండు ముక్కులూ ఎగబీల్చి కళ్ళు వొత్తుకుంటూ వుండిపోయింది.

మనిషి ధృఢంగానే వుంది. వంటిమీద నగలూ, తల్లో పూలూ, ఘమకంగానే వున్నాయి. కనుక అంబమ్మత్త నీరస నాటకం వెంకమ్మను కంగారు పెట్టలేదు.

" ఏంచేస్తాం అత్తా, నీ ఖర్మ అట్టా కాలింది, నా ఖర్మ యిట్టా కాలింది. అంతా వాడి లీల " అని తనే పొడి పొడిగా వోదార్చింధి వెంకమ్మ.

ఆ తరువాత రాత్రి భోజనా లయ్యేదాకా, మొత్తం సేవంతా దాదాపు మూకీగానే నడిచింది. భోజనా లయినాక, వెంకమ్మే మేనమామతో ఆ మాటా ఈ మాటా కలిపి ' పిచ్చినాగన్న, నంజుండప్ప, ఎలా వున్నాడో యేమో అని వాడికీ, ( అంటే తమ్ముడికి) నాకూ ఒకటే దిగులుగా వుంది. చూడాలని వచ్చాం మావయ్యా. ఎలా అయినా తండ్రి ప్రాణంగదా !" అంది తమ్ముడు దూరంగా వుండగా.

"తండ్రి ప్రాణం, నా వల్లకాటి ప్రాణం, రెండేళ్ళయింది పిల్లవాడి మొహం చూసి" అన్నాడు పుటుక్కున నరసింహస్వామి.

"ఏమిటో మావయ్యా వాడి మతి మతిలో వున్నట్టు లేదు, ఆ భార్య పోయిన దగ్గర నుంచీ" అన్నది వెంకమ్మ. మాట పూర్తికాక ముందే ఆవలిస్తూ అందుకున్నాడు నరసింహస్వామి. "అది చిన్నప్పటినుంచీ ఉన్న ధోరణేలే. అమ్మ పుట్టిల్లు మేనమామకు చెప్పాలా అనీ, నాకు తెలియందేముంది?"

"నల్లే మావయ్యా, నీకు నిద్దరొస్తున్నట్టుంది. రేపు మాట్లాడుకుందాం" అని మాట తప్పించేసింది వెంకమ్మ. ఆ రాత్రి నరసింహశాస్త్రి గుర్రుపెట్టి నిద్రపోయాడు గాని వెంకమ్మకు కంటి మీద కునుకు లేదు. ఆలోచనలన్నీ తీరూ తెన్నూ లేకుండా పరిగెత్తుతూ వుండటం చూసి చూసి, అర్ధరాత్రి దాటినాక ఇక విసుగెత్తి, మెళ్ళో వున్న రుద్రాక్షమాల తీసి తిప్పుతూ పడుకున్న చాపమీదే కూర్చుంది. తెలవారింది. వెంకమ్మ మనస్సులో ఒక నిశ్చయానికొచ్చి యిప్పుడు తెరిపిగా వుంది. నరసింహశాస్త్రి అప్పటికే స్నానం చేసి ముఖాన విభూతి పట్టెలు పెట్టుకొని సంధ్యావందనం అతి లఘువుగానే పూర్తి చేసి వీధి వసారాలో మోకాళ్ళను కావలించుకొని కూర్చుని అటూ యిటూ వూగుతున్నాడు.

ఏడు గంటలు దాటేసరికి నంజుండప్పను బడికి తరిమేసింది అంబమ్మత్త. ఆ పిల్లవాడు ఎక్కువగా తండ్రి దగ్గర ఆడుకోటం, ఆవిడకు కంటగింపుగా ఉంది. పిల్లవాడు బడికి వెళ్ళగానే వెంకమ్మ "మావయ్యా! కాసేపు యిలా కూర్చో, నీతో రెండు ముక్కలు మాట్లాడాలి" అని పిల్చింది. త్వరగా చెప్పు, పనుంది అవతల అంటూ వచ్చాడు మేనమామ. వెంకమ్మ తూచి, తూచి ప్రారంభించింది. "మావయ్యా, నువ్వు వాడికి పిల్లనిచ్చిన మామగారివే కాక, నయానా మేనమామవు. వాడి క్షేమం ఆలోచించవలసిన వాడవు."

"నా బొందలే!"

"విను కాస్త."

"సరే చెప్పు."

"అన్నంలేక, నీళ్ళులేక, నా అన్న ఆదరణలేక, వాడి మతి చలిస్తోందేమో అని భయంగా వుంది మావయ్యా!"

"బ్రతికి వున్నంతకాలం వాడు పెళ్ళాన్ని ఆదరించాడా?"

"ఉన్నంతకాలం వాళ్ళ కాపరం వాళ్ళు బాగానే చేశారు. దాని ఆయుష్షు తీరిపోయింది. అది పోయింది. తెలిసినవాడివి నువ్వు గూడ యిలా మారిపోతే ఎలా మావయ్యా?"

"బిడ్డలు కన్నవాళ్ళకు తెలుస్తుంది ఆ బాధ." ఇది అంబమ్మత్త గొంతు. ఆశ్చర్యపోయి తల తిప్పి చూసింది వెంకమ్మ. ఎప్పుడొచ్చిందో గది గుమ్మంలో మొహం కందగడ్డ చేసుకొని

నిలబడి వుంది. ఆవిడ మాటలు తనను గురించి పొడిచిన పొడుపే అని తెలుసు వెంకమ్మకి. ఏ ఆడదాని కయినా కడుపులో మెలిపెట్టే పొడుపు అది ఒక క్షణం కళ్ళు మూసుకొని శివస్మరణ చేసిగాని నిభాయించుకోలేక పోయింది వెంకమ్మ. అయినా మరుక్షణంలో తేరుకుని—

"మంచివాడైనా, చెడ్డవాడైనా వాడు నీ బిడ్డ వంటివాడు. మా కుటుంబానికి నీ కంటె ఇంకా పెద్ద దిక్కు ఎవరున్నారు? నువ్వే కాస్త వాడి యింటికి ఓ పచ్చతోరణం కట్టించి పుణ్యం కట్టుకుంటే వాడి ప్రాణం నిలిపినవాడి వవుతావు" తన జన్మ సంస్కారానికి ఎంత దీనత్వం సాధ్యమవుతుందో, అంత దీనత్వాన్ని స్వీకరించి యీ మాటలు చెప్పింది వెంకమ్మ.

"ఈ కోసిన గొంతు చాలక ఇంకో గొంతుక కోయించాలా? చాల్లేమ్మా చాలు." రెండు కణతల దగ్గరా చేతి మెటికలు విరుచుకుంటూ ఇంత గొంతుతో బళ్ళు మన్నది అంబమ్మత్త.

"బాగా చెప్పావు. అసలయినా బైరాగుల్లో కలిసి భంగు తాగుతూ తిరగవలసిన వాడికి మళ్ళీ పెళ్ళెందుకె" నరసింహస్వామి మాటలో భార్యకు వత్తాసుతోపాటు వెటకారం ఖంగున మోగింది.

"నేను బైరాగుల్లో కలుస్తానని నీ కెవడు చెప్పాడయ్యా?" నరసింహశాస్త్రి వసారా లోంచే అరచిన అరుపుకి గదిలో వున్న ముగ్గురూ కొంచెం కంగారు పడ్డారు.

పరిస్థితి యిట్లా విషమిస్తుందని ఊహించని వెంకమ్మ ఏం చెయ్యాలో తేల్చుకొనే లోపలే దెబ్బతిన్న సింహంలాగా గదిలోకి ప్రవేశించాడు నరశింహశాస్త్రి.

"ఒకరు చెప్పేదేమిటి? ఊరంతా చెప్పుకుంటోంది." అంబమ్మత్త ముందు తేరుకొని యెదురు దాడి ప్రారంభించింది.

"అయినా వీడికి పిల్ల నిచ్చే పిచ్చితొత్తుకొడుకు ఎవరే వెంకమ్మా, భారతదేశంలో? నే నంటే నా తోడబుట్టిన దానిమీద ఆపేక్ష కొద్దీ ఆ ఘాతుకం చేశాను గానీ" నరసింహస్వామి మరీ ఇంత వాచ్యంగా కుండ బద్దలు కొడతాడని కలలో గూడ వూహించలేదు వెంకమ్మ.

"అదేం మాట మామయ్యా" వెంకమ్మ మాట మరీ ఉక్రోషంలో వుంది.

"ఉక్రోషం ఎందుకమ్మా! ఎవడైనా బుద్ధి తక్కువవాడు పిల్లనిస్తే ఆశీర్వదిద్దాంలే మనమంతా" నరసింహస్వామి తన అక్కసును వేళాకోళంగా అనువదించాడు. అంబమ్మత్త అరవటం, తను గంతు లెయ్యటం నరసింహశాస్త్రికి పాత కథే. ఇవాళ్ళ మేనమామ గూడ ఇంత నీతి బాహ్యంగా మాట్లాడటంతో కోపం మరీ మిక్కుటమై ఏమి మాట్లాడటానికి మాట పెకల్లేదు నరసింహశాస్త్రికి.

నట్టనడి వయస్సులోనే భార్య గతించింది. పాడిపంటలున్న యింట్లో రెండో దిక్కు లేదు. బంధువుల ఆదరణ లేదు. ఇలాంటివాడి కెవడికైనా, మానవత్వం ఉన్నవాడిచ్చే సలహా,

ఇవ్వవలసిన సలహా ఒక్కటే. "నాయినా, నీ యిల్లు నిలబెట్టుకో - నీ బ్రతుకు పండించుకో" అని. తనకు వైరాగ్యం వుంది. తను సన్యాస ప్రయత్నంలో వున్నాడు అనేది వేరే విషయం. స్వంత మేనమామ అయి వుండీ తన కూతురికే అన్యాయం జరగలేదని తెలిసి వుండీ నరసింహస్వామి యిలా అమానుషంగా మాట్లాడటంతో ఎంత మొండి బండవాడయినా నరసింహశాస్త్రికి తల తిరిగి పోతున్నట్టనిపించింది. వెనుకటి కల్పాలలో అవతరించిన నృసింహమూర్తుల కఠోర కంఠరావాలన్నింటినీ, తన లోనికి ఆహ్వానించుకొని, లోకంలో అన్ని భాషల్లోనూ వున్న తిట్లన్నీ తిట్టి వుంటే ఆ కోపం తగ్గిపోవునేమో! కానీ మేనమామని, పెద్దవాణ్ణి, చదువుకున్న వాణ్ణి చూసేసరికి, నోటంబటి ఒక తిట్టూ పెకలక, ఒక్క గాండ్రింపయినా ఊడిపడక, ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు నరసింహశాస్త్రి. తన ఒళ్ళు తనకు తెలుస్తోందా లేదా అని తనకే అనుమానం వస్తోంది. అనూహితమైన ఈ మౌనంతో ఆ గదిలోని గాలే, కొద్ది క్షణాలు స్తంభించి పోయిందేమో అన్నట్టుంది కాని, ఇంతలోనే మారుమ్రోగింది.

"మామయ్యా! ఈమాటు నా పెళ్ళాంతోనే నీ యింటికొస్తాను, ఆశీర్వదిద్దువుగాని." తన గొంతులోంచి వచ్చిన ఈ గర్జనకు తానే ఆశ్చర్యపోయాడు నరసింహశాస్త్రి. అంబమ్మ, నరసింహస్వాములు ఒకరి మొగాలొకరు చూచుకున్నారు అయోమయంగా. "థూ" అని ఒక పెద్ద థూత్కారం చేసి విసవిసా వెళ్ళిపోయాడు నరసింహశాస్త్రి. అలా వొళ్ళు తెలియకుండా వెళ్ళిపోతున్న నరసింహశాస్త్రిని ఒక పెద్ద పొలికేక యీ లోకంలోకి దింపింది.

"ఒరేయ్, బండవెధవా ఆగు. నేను గూడ వస్తున్నా." ఈ పొలికేక వెంకమ్మది. ఒళ్ళు తెలిసి యిటూ అటూ చూసుకున్న నరసింహశాస్త్రికి, తాను జొన్నచేల మధ్య డొంక దోవలో వున్నట్టు తెలిసింది. రెండు చేతులతోనూ రెండు మూటలు పట్టుకుని, రొప్పుకుంటూ వస్తున్న అక్కగార్ని చూసి కంగారుగా యెదురెళ్ళి, చేతుల్లో మూటలు లాక్కొని—

"ఏమంత కొంప మునిగిపోయె! నేను కాస్త ముందు పోతే, నువ్వు దారే ఎరగవా? ఈ పరుగులెందుకు" అని సన్నగా మందలించాడు.

"ఈదారి తెలీకేం, నీ దారి తెలీక యేడుస్తున్నా గానీ" అన్నది వెంకమ్మ.

"నా కాళ్ళకు గుదిబండల్లే నువ్వొకత్తెవు పట్టుకొన్నావుగా. ఇక నే నెటుపోతాను వల్లకాట్లోకి" అని విసుక్కున్నాడు నరసింహశాస్త్రి. అక్కడితో ఆ సంభాషణ ఆపేసి, కాసేపా డొంకదిబ్బ మీద చదికిలబడి ఆయాసం తీర్చుకొన్నాక మళ్ళీ నడక సాగించింది వెంకమ్మ. ఈమాటు మూటలు రెండూ తమ్ముడే మోస్తున్నాడు. నడక మెల్లగా సాగుతోంది.

"ఇంత అవమానం జరుగుతుందనుకోలేదురా అబ్బీ" వెంకమ్మగారే మౌనభంగం చేసింది.

"అవమానం ఏముంది లెద్దూ! ఏదో వాళ్ళ తిక్క గొద్దీ వాళ్ళేదో కూశారు. మన తిక్క గొద్దీ మనమూ కూశాం. అయిపాయె" చాలా సులభంగా దులిపేసుకున్నాడు నరసింహశాస్త్రి.

"నీ దగ్గర తిక్కేముంది? శివుడాజ్ఞే నీ నోట వచ్చింది" వెంకమ్మ కొత్తమెలిక పెట్టింది

"నీ శివభక్తి మండినట్టే వుందిలే!"

"మధ్యలో నా భక్తిని తిట్టిపోస్తా వెందుకు?"

"మనుష్యులకు తిక్కబుట్టి తిట్టుకున్న మాటలుగూడా శివాజ్ఞ అంటుంటే ఏం చెయ్యాలి?"

"వాళ్ళకి తిక్క పుట్టింది నిజమే కాని నువ్వు ప్రశాంతంగానే వున్నావుగా!"

"అది ప్రశాంతమా? మంచి తెలివే. ఇంతకూ ఏమిటి నువ్వు చెప్పవచ్చేది? నేను మహా ప్రశాంతంగా ఆ కూత కూశాను గనుక అదే శివాజ్ఞ అనుకొని నిజంగానే మళ్ళీ మెడకో డోలు కట్టుకోమనా?"

"మొండి వాదన ఆపితే యేదయినా చెపుతా"

"ఏమిటమ్మా మొండివాదన. పంతం కోసం పెళ్ళి చేసుకోమంటావుటమ్మా! అది పెళ్ళా? వాడు మానవుడా?"

"అలాంటి రాక్షసపు ఆలోచనలు చేసేది నేనే నంటావు, అంతేనా?"

"నే నెందుకంటాను. చెప్పేదేదో సరిగా అర్థం అయ్యేలా చెప్పరాదూ. ఆ అభేదానంద స్వామి దగ్గర నేర్చుకొన్న తర్కాలన్నీ నా మీద ప్రయోగిస్తే నే నెక్కడ చస్తాను?"

"తర్కం లేదు, వ్యాకరణం లేదు. తిట్టకుండా వింటానంటే నా ఆలోచన చెపుతాను."

"చెప్పు. వినదగు నెవ్వరు చెప్పిన అన్నారుగా"

"వినినంతనే వేగపడక వివరింపదగున్ అని గూడ అన్నారు. కనుక వేగపడకుండా విను. నీ యిల్లు నీకు నిలబడాలనీ, నీ సొంత మనిషి నీకు వుండాలనీ నేను మొదట్లో అనుకున్న మాట నిజమే."

"ఆహా, ఓహో"

"వింటానని మాటిచ్చావు"

"సరే చెప్పు."

"అది అలా వుండగా యిక్కడ ఆ తలవని తలంపుగా నీ నోట ఆ మాట వచ్చేసరికి అది శివాజ్ఞ అనుకొన్నాను. ఆ మాటే బయటికి అన్నాను."

"అయిందా?"

"కాలేదు, విను. అంతమాత్రంచేత నీ సాధన నాశనం చేద్దామనీ నాకు లేదు. ఎవత్తె గొంతు కోద్దామనీ నాకు లేదు."

"తెములు్చ తొందరగా"

"వేగపడక వివరింపవలెన్ అన్నారు పెద్దలు."

"సరే చెప్పు, ఇంతకీ ఏమని వుంది నీకు?"

"మనకు కాలం బాగా లేదని వుంది."

"కాలానికి బాగుండటం, బాగుండక పోవటం వుంటాయా?"

"కాలం అంటే యిక్కడ కర్మం అని అర్థం"

"కర్మ ఎలాంటి దయినా అనుభవించాల్సిందే గదా!"

"అలాగా! అలా అయితే, ఒక కుక్కకీ, ఒక పందికీ, నీకూ తేడా ఏమిటి?"

"అవి దుఃఖం వస్తే దానికి విరుగుడు చేద్దామని కోరుకుంటూ గతిలేక అనుభవిస్తాయి. సుఖం వస్తే మళ్ళీ మళ్ళీ అది కావాలని కోరుకుంటూ చర్వణ బుద్ధితో అనుభవిస్తాయి."

"మరి నువ్వో?"

"కర్మ క్షయించి పోవాలనే బుద్ధితో!"

"ఆ బుద్ధితోనేనా, ఆ స్వాములవారు పోయారని గగ్గోలు పెడుతున్నావు?"

"అదేమిటో అప్పుడు దుఃఖం మనస్సును కమ్మేసినట్టే వుంది."

"అంతకుముందు, సన్యాసం పుచ్చుకోవాలనే కోరిక మనస్సును కమ్మేయలేదా?"

"సన్యాసం కోరిక ఎలా అవుతుంది లెద్దూ!"

"పుచ్చుకోటం అనేనరికి అది కోరిక కాక మరేమిటి?"

"ఆలోచించాలి."

"కోరికంటే కామమేనా? దానిక్కూడా ఆలోచించాలా?"

"చెప్పు"

"మరి యిక కర్మ క్షయం ఎక్కడి మాట!"

"ఆ దృష్టి గూడా వుంది లోపల."

"అది చదువుకున్న చదువువల్ల బుద్ధిలో దూరి దర్జాగా కూర్చుని వుంది. అంతేకాని హృదయంలోకి దిగలేదు. హృదయంలో దిగితేగాని అది నెత్తుటిలో కరిగి వంటబట్టదు. వంటబట్టని చదువులు, ఒకోసారి, ఇంటు దూరిన దొంగలలాగా గూడా మారిపోతూవుంటాయి."

"ఊ"

"మనం సాధక స్థితిలో వున్నాం."

"మన మాటలు మాత్రం సిద్ధ స్థితిలో వుంటాయి."

"..........."

"దీనిని ఆత్మవంచన అనవచ్చునేమో"

"అబ్బ, చెప్పదలచుకున్నది చెప్పవమ్మా, మధ్యలో యీ పొడుపు లెందుకు?"

"మనం సాధక స్థితిలో వున్నాం. ఒప్పుకుంటావుగదా? "

"ఒప్పుకుంటాను. "

"సాధక స్థితిలో వున్నవాడు, తన పూర్వపు దుష్కర్మ అనుభవానికి -వస్తున్న కాలంలో సామాన్యుల సంపర్కంలోనే వుంటే, వీడు క్రమంగా, ఆ సామాన్యులకన్నా గూడా క్రింద స్థితికి దిగజారిపోయే ప్రమాదం వుంది. అందుకనే, సర్పమయి క్రిందపడి పోయే నహుషుడు, తాను సత్పురుషుల మధ్యలో పడాలని కోరుకున్నాడట. "

"నిజమే. "

"మనకు గూడ యిప్పుడు, చెడురోజులు నడుస్తున్నాయి. ఈ సమయంలో, తుంటరి వెధవల మధ్య వుండే దానికన్నా, అలా అలా ఏదో మనకు చేతయిన క్షేత్రాలు చూచు కుంటూ తిరిగామంటే భగవత్సన్నిధిలో కాలం గడిపిన వాళ్ళం అవుతాం. అలా స్వామి పాదాలు పట్టుకు వేళ్ళాడుతుంటే ఆయన కరుణించక మానడు."

"ఊ"

"ఆ భగవంతుడి కరుణ వుంటే, మనకు మంచి ఆలోచనలు వాటంతటవే పుడతాయి. తరువాత నందోరాజా భవిష్యతి "

"ముందర భగవత్సేవ దక్కుతుందిగదా! " ఈ మాటకోసమే, ఇందాకటినుంచీ తోము తోంది వెంకమ్మ. ఈ మాటతో ఆవిడ ముఖం చాటంత అయింది. ఆసరికి బొమ్మెపర్తి కనుచూపుమేరలోకి వచ్చింది. నరసింహశాస్త్రి ఒకసారి ఇటూ అటూ చూసి—

"సరే అయితే నువ్వటుపో, యింటిదగ్గరుండు. నేను యిటునుంచి యిటే అనంతపురం రోడ్డెక్కేస్తా." అన్నాడు.

"మళ్ళీ ఏం తిక్క వచ్చిందిరా ?" అక్కగారికి పరిస్థితి అయోమయంగా తోచింది.

"తిక్కేమిటమ్మా, తీర్థయాత్రలకు పొమ్మంటివిగా "

"మరి యిట్టా యెట్టా పోతావురా ?"

"ఎట్టాబోయేదేముంది, రోడ్కెక్కి నడుస్తూ వుంటే క్షేత్రాలు అవే వస్తూ వుంటాయి. యింకేం గావాలి? దేవుడిచ్చిన కాళ్ళున్నాయి. గురువు లిచ్చిన మంత్రాలు నోట్లో వున్నాయి. యింకేం గావాలి తీర్థయాత్రలకి? "

ఇప్పటికి వెంకమ్మకు విషయం బాగా అర్థమైంది. కానీ తమ్ముణ్ణి యీ పరిస్థితుల్లో అలా వంటరిగా పంపటం సుతరామూ యిష్టం లేదావిడకు. కాని ఆ మాట చెపితే తమ్ముడు అసలు మొండికెత్తవచ్చు. అందుకని ఒక క్షణం ఆలోచిస్తూ వుండిపోయింది. అనుకొన్నాక ఆగటమనే సహనం నరసింహశాస్త్రి గారికి చిన్నప్పటినుంచీ అందని పళ్ళగుత్తే. ఇప్పుడు అక్క గారి నాన్పుడు బేరం ఆయనకు చికాకుగా ఉంది. అందుకనే ఏమిటి నీ బాధ అన్నాడు చిరాగ్గా.

"నీకు దేవుడిచ్చిన కాళ్ళున్నాయి. తిరుగుతావు. నాకు కాళ్ళు చచ్చుబడే యిట్టా తగలడ్డాయి. నా దేవుడు నా మొహాన బూడిద రాసిపోనే పోయాడు. ఇక నన్ను తీర్థయాత్రల కెవరు తీసుకుపోతార్రా?" వెంకమ్మ బాణం బ్రహ్మాస్త్రంలా కాకపోయినా, యింద్రాస్త్రంలా పని చేసింది. 'నీతో యాత్రలంటే, యిక రైలుమీదా బస్సులమీదా తిరగాలిసిందే. ఊ! సరే యింటికి పద, ఒక ఎకరం అమ్మిపారేద్దాం" అన్నాడు నరసింహశాస్త్రి సాలోచనగా.

"పొలం అమ్మట మెందుకురా? మొన్న వచ్చిన పంట డబ్బు, బకాయిలూ అన్నీ యింట్లో ఉన్నాయిగా!"

"ఔనమ్మోవ్........ఆ మాటే మరిచిపోయాను. సరే యింటికి నడు."

* * *

## తీర్థయాత్ర

*ఏకేన చక్ర మపరేణ కరేణ శంఖం*
*అన్యేన సింధుతనయా మవలంబ్య తిష్ఠన్ ।*
*వామేతరేణ వరదాభయ పద్మచిహ్నం*
*లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్ ॥*

అహోబిలంలో అర్చకుడి కంఠంలో ఆనందం ప్రతిధ్వనిస్తోంది. ఆయన చేతిలో వున్న హారతి పళ్ళెంలో కనిపిస్తున్న వందరూపాయల నోటు, ఆ ఆనందానికి ఒక హేతువైతే కావచ్చు. ఏమయితే నేమి ఆయన ఆనందం, ఎదురుగా వున్న కొత్త దంపతులలో ఒకరి కళ్ళలోంచి మరొకరి కళ్ళలోకి దూకుళ్ళాటలాడుతూ వుంది. అది చూచి ఆ రోజు నిండుగా అలంకరించు కొన్న నృసింహదేవుడు అలవోకగా అమ్మవారి వైపు వాలుచూపులు విసురుతున్నాడా అనిపిస్తోంది. గుళ్ళోకి అడుగు పెట్టేసరికి కనిపించిన ఈ దృశ్యాన్ని చూచి "నా సంకల్పం ఈశ్వరాజ్ఞే. ఇంకా సందేహం దేనికి?" అనుకుంది వెంకమ్మ. హారతి చూడంగానే 'నర్క ప్రజాంమెగోపాయ' అని ఖంగున మంత్రం అందుకుని కళ్ళకద్దుకొన్నాడు, రెండో ఆలోచన లేకుండా నరసింహశాస్త్రి. కళ్ళ కద్దుకొని ఇక కళ్ళు మూసుకుని ఒక మూల కూర్చుండి పోయాడు. ఒక పావుగంట ఆగి మెల్లగా పిల్చింది వెంకమ్మ. కసురుకున్నాడు తమ్ముడు.

"ఇక పోదామా?"

"అహోబిల నరసింహుడు మనకు ఇలవేల్పు. ముందాయన దగ్గరకు వెళ్ళి ఆయన సెలవైతేగాని కాలు కదపటానికి లేదని కాకిగోల చేస్తివిగా. తొందర పడతావేం?"

"సెలవు కోసం ఎగువ క్షేత్రంలో ప్రార్థిద్దాంలే."

ఇంత ఉపాయం, నేర్పు తనకెలా వొచ్చాయో తనకే ఆశ్చర్యంగా వుంది వెంకమ్మకి.

"అలా అయితే పద. నరసింహుడికి ఎగువకొంత, దిగువకొంత కాబోలు" అని సాగదీస్తూ లేచాడు నరసింహశాస్త్రి.

అహోబిలంలో బస్సు దిగిన దగ్గరనుంచీ అంతర్జపం మొదలెట్టాడు. ఇక అక్కగారు తీసుకుపోయినట్టుగా పోవటం తప్ప రెండో యావలేదు నరసింహశాస్త్రికి. ఆ పూటకు ఆళ్వారు చెరువుకు వెళ్ళి అక్కడ ఛత్రవట నరసింహస్వామిని దర్శించారు. అక్కడ జప చేసుకొంటూ కూర్చున్న అక్కా, తమ్ముళ్ళను చూసి, అర్చకుడు భోజనానికి రమ్మని పట్టు బట్టాడు గాని క్షేత్రోపవాసం చేద్దామనే సంకల్పంతో వారిద్దరూ ఆహ్వానాన్ని తిరస్కరించారు. కాని అతని పట్టుదలవల్ల రాత్రి వారింట్లో ఫలహారం చేసేందుకు మాత్రం అంగీకరించారు. కాస్త ఎండ తగ్గినాక మళ్ళీ బయలుదేరి కొండదారుల్లో కొంత దూరం నడిచి భార్గవ నరసింహ స్వామిని దర్శించి వచ్చారు.

మర్నాడు సూర్యోదయానికే నిత్యానుష్ఠానాలు పూర్తి చేసుకొని యాత్రికులిద్దరూ యెగువ సన్నిధికి బయలుదేరారు. కొండదారుల్లో మెలికలు తిరిగిపోతూ గునగునా సాగుతున్న భవనాశినీ నదిని చూసి "ఈ నది అచ్చం కొత్త కోడలల్లే వుంది" అనుకొంది వెంకమ్మ.

ఔను, తన సంసారమే తనకు సాధన అని యెరిగిన యిల్లాలికి అడుగడుగునా ఎన్ని కొండరాళ్ళు ఎదురైనా ఆమె ఆ రాళ్ళకు ఎదురు తిరిగి కలబడి కయ్యాలాడదు. అలాగని ఆమె నడకా ఆగదు. ఒదుగుబాటుతో ముందుకు దూసుకుపోయే ఆమె ఒడుపులో పుట్టే గలగల లోకానికే గాక, ఆ గండ శిలలకి గూడ గిలిగింతలు పెట్టి పులకింతలు చేస్తాయి. గండశిలలు, బండరాళ్ళు అలాగేపడి వుంటాయి. ఆమె మాత్రం భవనాశిని అయి జగత్పావని అవుతుంది.

పదిగట్లు ఎక్కేసరికి వెంకమ్మకు "అమ్మయ్యా" అనిపించింది. కాని ఉగ్రనరసింహుడి గుహ కనిపించేసరికి ప్రాణం లేచివచ్చినట్లనిపించి అలసట కనిపించకుండా పోయింది. ఉగ్రనరసింహుడి సన్నిధిలో బిగించుకు పోయి కూర్చున్న మన ఉగ్రనరసింహశాస్త్రిని కదిలిస్తే ఏం కొంపలు మునుగుతాయో అని సంకటపడుతున్న వెంకమ్మను అక్కడి సుగాలీలు పాపం సమయానికి ఆదుకున్నారు.

ఆ గుహనుంచి, జ్వాలానరసింహ స్థానానికి, వెళ్ళదలుచుకున్న సాహస యాత్రీకులెవరైనా దొరికితే వాళ్ళకు, "నాలుగు రాళ్ళు" దొరుకుతాయని ఆ సుగాలీలకు ఆశ. అట్టా వచ్చి యిట్టా పోయే నాజూకు యాత్రీకులు, అటు వేపు చూడటానికి కూడ భయపడతారు. ఇక వీళ్ళను చూస్తే, వీళ్ళ తాపీతనం చూస్తే, వీళ్లు నిర్భయంగా నడిచే వాళ్ళనే తెలుస్తూవుంది. ఆ ఆశతోనే ఆ సుగాలీలు, ఇంతసేపూ కాచుకొని, విసుగెత్తి వున్నారు. దాంతో ఒక సుగాలీ పెద్ద ముత్తైదువ "ఓలమ్మో ఈడకూకుంటే ఏముంది? పైనున్నాడు జ్వాలానరసింహయ్య. అక్కడుంది మాత్తంతా. లెగండి మరీ" అని వింత రాగంలో, ఒక పొలికేక పెట్టింది.

ఆ కేకతో ఈ లోకంలోకి వచ్చిన నరసింహశాస్త్రి, మెల్లిగా సద్దుకొని విషయం తెలుసుకొని "ఏమమ్మా ఏంచేద్దాం?" అన్నాడు అక్కగారితో

"రండర్రో అని ఆప్యాయంగా జ్వాలా నరసింహుడు పిలుస్తుంటే, ఇంకా ఆలోచన ఏమిట్రా అబ్బాయ్" అంది వెంకమ్మ. ఇకనేం, ఆనందంగా వెంటబడ్డది సుగాలీ గుంపు.

అది కొండంచు మీద ఇరుకుబాట కాలు జారక్కరలేదు కిందికి తేరిపార చూస్తే, కళ్లు తిరిగి పిూడు తాళ్ళ లోతు లోయలో, ధామ్మని కూలిపోవలసిందే. రెండు చేతుల్లో రెండు కర్రలు పట్టుకొని, ఎగుడు దిగుడు బండలమీంచి ఒడుపుగా నడుస్తూ దారి చూపిస్తున్నారు సుగాలీలు.

ఒక పక్క సూర్యరశ్మిని దూరనీని ఉవ్వెత్తుకొండ కొప్పులు, వాటిపైన చిక్కుముడుల ఎంటి కీకారణ్యాలు! మరోవంక నోరు తెరుచుకున్న, పాతాళ లోకంలాగా వున్న లోయి! అందులో అల్లల్లాడిస్తున్న పాము నాలికలవంటి చెట్లు. ఈ రెంటి నడుమ, గండుచీమలలాగ, ఎగబాకుతున్న మానవుల వరుస!!!

"ఇది లోయి; అది శిఖరం. ఈ మధ్యలో స్వామికోసం ప్రాకులాడుతున్నాం. ఇదే కాదుటమ్మా సాధనంతా? లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం! స్వామీ నీ చేయూత లేకపోతే, ఈ పాకులాటకు అంతుండదు. లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం." నరసింహశాస్త్రి మాట ఒక పూనకం మనిషి మాటలాగా వుంది.

"ఓయ్ పంతులుగారూ, గమ్మునుండు. ఇది కొండదారి. ఇక్కడ ఎకసెక్కాలు, నాటకాలూ సెల్లవ్" సుగాలీ వృద్ధు డొకడు గద్దించాడు.

"ఔను, సాధనలో ఎకసెక్కాలు పనికేరావు. ఎకసెక్కాలేగాదు, ఏడుపులు, దేపిరింపులు, కూడ పనికిరావు, నిశ్చలంగా, చెయ్యవలసిన పని చెయ్యటమే! అంతే!" అనుకున్నాడు నరసింహశాస్త్రి లోలోపలే రెండుమైళ్ళు నడకసాగినాక ఉక్కుస్తంభ శిఖరం కనిపించింది. అక్కడ నుంచే ముందొక నమస్కారం పెట్టుకున్నారు సుగాలీలు మరో మైలు బాట గడుస్తుండగా ఆ మిట్ట మధ్యాహ్నపు వాతావరణం ఉన్నట్టుండి చల్లబడి పోయింది. పైగా ఒకసారి గాలివాటానికి చిరుతుంపురు చిందులు బాటసారులకు విందులు చేస్తున్నాయి. ఇదంతా భవనాశిని దేవి చలవ అని నరసింహశాస్త్రికి త్వరగా అర్థం కాలేదు ఆ తల్లి పుట్టినిల్లు దగ్గరపడుతున్న కొద్దీ నరసింహశాస్త్రికి ప్రాణం పూర్తిగా సేదదేరింది. ఆ నదీదేవి పుట్టింటి ఆడబడుచు లాగా ఆ పెనుబండల మీద తెగ గంతులు వేస్తుంటే తాతగారింటికి వచ్చిన దుడుకు మనవల్లాగా ఎగిరిపడుతున్నాయి నీటితుంపరలు.

"ఈ చలచల్లని వాకలు అక్కడ ఇలా విజృంభించి వుండకపోతే ఆ జ్వాలా నరసింహుడి ఊదరకు ఈపాటికి పర్వతమే భస్మమై ఉండేదేమో అనిపించింది నరసింహశాస్త్రికి. ఈ భావం వచ్చేసరికి అప్రయత్నంగా ఒక శ్లోకం గుర్తుకు వచ్చింది.

శ్లో. తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం
తమీడే సంవర్తం జనని మహతీం తాంచ సమయాం।
యదాఽఽ లోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే
దయార్ద్రాయ ద్దృష్టి శ్శిశిర ముపచారం రచయతి॥

అమ్మా స్వాధిష్ఠాన చక్రంలో అగ్ని తత్వం వుంది. ఆ అగ్ని తత్వాన్ని ఆశ్రయించుకొని సంవర్తేశ్వరుడు, సమయాంబికవైన నీవు ఇద్దరూ వున్నారు. ఆ సంవర్తేశ్వరుని కోపపు చూపు లోకాలను దహించి వేస్తూవుంటే అమ్మా! దయగల నీ చల్లని చూపు లోకాలకు శిశిరోపచారం చేస్తోంది.

"ఇది ఆదిశంకరుల సౌందర్యలహరి లోనిది. ఎప్పుడో దాసంభొట్లు మావ వివరించిన శ్లోకము. యోగపరంగా సృష్టిక్రమపరంగా గూడా ఆయన అప్పట్లో వివరించాడు. నరసింహుడి దగ్గరికొస్తే యిప్పుడీ శ్లోకం మనస్సుకి తగిలిందేమిటబ్బా! ఏదొలే మనస్సంటేనే ఓ కోతి! పోనిస్తూ" అని దులిపేసుకుని మంత్రజపంలో పడిపోయాడు మళ్ళీ నరసింహశాస్త్రి.

ఉగ్ర నరసింహ, లక్ష్మి నరసింహ, యోగ నరసింహు లక్కడ వున్నారు "ఒకే తత్వం త్రిమూర్తులవటమంటే ఇదే కాబోలు" అనిపించింది నరసింహశాస్త్రికి. కాని అంతలోనే "ఇదిగో మనసా! ఊహలూ గీహలూ చెయ్యవద్దని చెప్పాను" అని తన మనస్సును అదలించి నిర్దయగా మంత్రంలో లయింపచేసి పారేశాడు.

నరసింహశాస్త్రి కళ్ళు మూసి తెరిచేసరికి, సుగాలీలు భోజనాలు పూర్తి చేసి, ఒక కునుకు లాగించేశారు. ప్రసాదపు పళ్ళే ఆ పూటకు ఫలహారంగా పుచ్చుకొని పై ప్రయాణానికి సిద్ధమయ్యారు అక్కా తమ్ముళ్ళు. పై ప్రయాణం కోసం వీళ్ళే సుగాలీలను కొంత ప్రోత్సాహపరచవలసి వచ్చింది. ఆ ప్రయాణం నిజంగానే శ్రమకరం, పైగా ప్రమాదకరం. అయితే వెంకమ్మ బొడ్లోంచి తీసి విసిరే వెండి రూపాయలు సుగాలీలలో నూతనోత్సాహాన్ని నింపాయి. మరో మూడు మైళ్ళ ప్రయాణం బిగపట్టిన ఊపిరితో కొనసాగింది. ఉక్కు స్తంభం నరసింహుడు, రాక రాక వచ్చిన అతిథుల్ని ఆనందంగా ఆహ్వానిస్తున్నాడా అన్నట్టు ఆ వాతావరణమంతా పరమ ప్రశాంతంగా వుంది. అక్కడ అక్కకూ, తమ్ముడికీ గూడా నిశ్చల మౌనమే స్వయం సిద్ధమైంది. ఒక భావం లేదు, మననం లేదు, ఒక జపం లేదు, పూజ లేదు, ఒక స్తోత్రం లేదు. ఇంతెందుకు మనస్సుకు ఏమీ వుండడానికి వీలువుందో అది ఆ యిద్దరికీ లేనేలేదక్కడ.

తిరుగు ప్రయాణంలో కొంత దూరం వచ్చినాక గానీ, తిరిగి వస్తున్నామన్న స్ఫురణ లేదు వాళ్ళిద్దరికీ. తిరుగు ప్రయాణం ప్రహ్లాదబండకు దారి తీస్తోంది. దార్లో లక్ష్మీనరసింహాలయం తగిలింది. అక్కడి అర్చకులు స్థల పురాణగాథ బడబడా మొదలు పెట్టారు. ఆదిశంకరులకు చేతులు కాలిందీ, కరావలంబస్తోత్రం చెప్పిందీ ఇక్కడేనంటూ.

"ఆపవయ్యా నీ సొద" అంటూ ఒక్క గదుము గదిమాడు నరసింహశాస్త్రి. మొహం యింత చేసుకుని అవతలకు పోయాడు అర్చకుడు. అక్కడ నుంచి, ప్రహ్లాదబండకు తరువాత యోగ నరసింహ గుహకు ప్రయాణం సాగింది. నృసింహుడి యోగ గుహలోకి ఒక్కరొక్కరే పోవాలి.

"అవును యోగం అంటే రెండు లయించి, ఒకటయ్యే చోటు. అక్కడ రెండుకు చోటెలా వుంటుంది"అనుకున్నాడు నరసింహశాస్త్రి. అక్కడ సుగాలీల్ని వెళ్ళిపొమ్మన్నాడు నరసింహశాస్త్రి. వాళ్ళాశ్చర్యపోయారు. బ్రతిమాలారు చివరకు.

"పంతులుగారూ ! నువ్వొంటే వున్నావు. చిరుతపులులూ, కొండచిలువలూ తిరిగే చోటు, రాత్రి పూట ఆడకూతుర్నెందుకయ్యా నిలబెడతావు? " అన్నారు.

" ఆవిడ నా కంటే గట్టిదే లేరా, పోండ్రా సన్నాసుల్లారా" అని చనువుగా మందలించి, మరో రెండు రూపాయలు యిప్పించి పంపించేశాడు శాస్త్రి. అప్పటికే చీకట్లు బాగా ముదిరాయి. పరిసరాలు నిశ్శబ్ద గంభీరంగా వున్నాయి.

"అక్కయ్యా ! కాస్సేపు గహలో కూర్చుందామని వుందమ్మా " అనుమతి అడుగు తున్నట్టుగా అడిగాడు.

" నేను గుహలోనే వున్నా లే, నువ్వెళ్ళు" అక్క సమాధానం విని అయోమయంగా చూసి వెంటనే నిభాయించుకొని, గుహలోకి దూరాడు నరసింహశాస్త్రి. ఎంతకాలం గడిచిందో తెలీదు. ఆ గుహను గూడ, మారు మోగించే సింహగర్జనకు, చెవులు గడియలు పడినట్లయి ఒళ్ళు జలదరించి స్పృహలోకి వచ్చాడు నరసింహశాస్త్రి. వళ్ళు తెలిసిన తరువాత, గుహలో గర్జన ప్రతిధ్వని సుళ్లు తిరుగుతోంది. ఒక క్షణం నిశ్చలంగా కూర్చొని, గుహ వాకిట్లోకి వచ్చాడు నరసింహశాస్త్రి.

గుయ్యి మంటున్న కీచు రాళ్ళ కూతలు అడవి గాలిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఆ శుక్ల దశమి అపరరాత్రి సమయపు చీకటిలో గాలికి వూగుతున్న పెనువృక్షాలు, జూలు విదలించుకొని దూకుతున్న సింహాలు లాగా వున్నాయి. కదులుతున్న చెట్లమీద పక్షులు, రెక్కలు టప టప లాడిస్తూ వికృత శబ్దాలు చేస్తున్నాయి. మధ్య మధ్యలో మిణుక్కుమంటున్న మిణుగురు పురుగులు నృసింహ గుహలోంచి యెగిరిపడుతున్న నిప్పు కణాల్లా మండి, నిప్పుల వాన కురవబోతోందేమో అనిపిస్తోంది. ఆకాశం నిండా నక్షత్రాలు కణకణ లాడుతున్నాయి. నిశ్శబ్దంగా వున్నట్టే వుండి యేదో మూలనుంచి, యేదో వికృత జంతు ధ్వని వినిపిస్తూనే వుంది. తన కాళ్ళ అలికిడి తనకే కొత్తగా వినిపిస్తోంది.

నరసింహశాస్త్రి అక్కవంక చూశాడు. ఆవిడ పద్మాసనంలో వుంది. కళ్లు అరమూసి వున్నాయి. ఆవిడకు ఈ గర్జన వినిపించిందో లేదో అర్థం కాలేదు. పిలిచి అడుగుదామా వద్దా అని కొద్దిగా మనసులో వూగిసలాట అయి, వద్దని నిర్ణయించుకొన్నాడు. ఆ గర్జనేమిటి?

తనకది ఎందుకు వినిపించినట్టు ? అది విని తను బయటకు ఎందుకు వచ్చినట్టు? ఆలోచనలు, ముసరసాగాయి. అన్నీ ప్రశ్నలే. సమాధానాలు ఏవో తోస్తున్నాయి గానీ, ఏవీ తృప్తికరంగా లేవు. తృప్తికరమైన సమాధానం దొరకటంలే దెందుకని ?అనిపించింది. ఎవరో బుర్రలో దూరి చెప్పినట్లు తటాలున తోచింది— '' అసలు ప్రశ్నే నిస్సారం గనుక" అని.

ఒళ్ళు ఒక్కసారి దులపరించాడు నరసింహశాస్త్రి. ఒక క్షణం ఆగి—

శ్లో. చేతో భలింగ భ్రమసి వృధా
భవమరు భూమౌ విరసాయామ్
భజ భజ లక్ష్మీ నరసింహానఘ
పదసరసిజ మకరందమ్ ॥

అనుకుంటూ మళ్ళా గుహలోకి వెళ్ళాడు. మళ్ళీ నరసింహశాస్త్రి బయటకు వచ్చేసరికి సూర్యకిరణాలు అహోబల పవిత్ర శిఖరాలకు కుంకుమపూజ చేస్తున్నాయి. ఆ పూజకు అక్కడి పక్షి సంతతులు సహస్రనామాలు చెపుతున్నాయి. విచ్చిపోతున్న చీకట్లు పొద్దుటి చల్లగాలిలో తేలిపోతున్న పల్చటి ధూపపు పొరలల్లే వున్నాయి. సూర్యాభిముఖంగా నిలబడి మానసిక పూజలో నిమగ్నమైయున్న వెంకమ్మకు తమ్ముడి అలికిడి తెలీలేదు.

"స్వామివారి అనుమతి అయినట్టే తోస్తోంది" అక్కను చూస్తూనే అన్నాడు నరసింహశాస్త్రి.

"అవుతుంది. అది శివ సంకల్పం గదా" వెంకమ్మ మాట సగం నిద్దర మత్తు మాట లాగా వుంది.

"శివ సంకల్ప మేమిటి ? మహన్యాసం గుర్తు కొస్తోందా ?"

"నువ్వేమన్నావు ? "

"తీర్థయాత్రకు స్వామివారి అనుమతి అయింది అంటున్నాను."

"శుభం, శుభస్య శీఘ్రం" అంటూనే గుహలోకి వెళ్ళిపోయింది వెంకమ్మ. వెళ్ళిన మనిషి బంతిలాగ వెనక్కి వచ్చేసింది. "దణ్ణం పెట్టుకొచ్చా లే, ఇక పద" అంటూ ముందుకు దారి తీసింది. ఇలవేలుపు దర్శనం అయినాక ఇష్ట దైవం కనుక ఈశ్వరుణ్ణి దర్శించాలంది వెంకమ్మ. దాంతో నాలుగు రోజులకల్లా అక్కా, తమ్ముడూ శ్రీశైలంలో దిగారు.

అటు తరువాత భద్రాచల సీతారాములను సేవించుకొని, తిరుపతి శ్రీనివాసుని దర్శించుకొని రామేశ్వరంలో సేతు స్నానం చేసి, గురువాయూరు కృష్ణదేవుని అర్చించుకొని శృంగగిరి శంకరాచార్య సంస్థాన శారదాదేవిని ఉపాసించుకొని క్రమంగా కర్ణాటక రాష్ట్ర క్షేత్రాలను చూసుకొంటూ ముందుకు సాగుతున్నారు అక్కా తమ్ముడూ.

* * *

నాంది

"నీ పేరేమిటి ?"

"గణేశ"

"ఏ ఊరు మంది ?"

"ఇది తానే"

"బెంగుళూరేనా ? సరిసరి. మరి నీకు తెలుగెలా వచ్చింది? "

"మనం ఎల్లవూరుగళు తిరుగుతుంది. ఎల్లభాషగళు వచ్చింది" ఆ కుర్రవాడి మాటలకు పగలబడి నవ్వుతున్న నరసింహశాస్త్రి ఉత్సాహాన్ని చూచి వెంకమ్మ ఆశ్చర్యపోతోంది.

నరసింహశాస్త్రి నవ్వటం చూచి ముందాపిల్లాడు కొంచెం బిత్తరపోయాడుగాని అంతలోనే తేరుకొని తను గూడ నవ్వసాగాడు. నవ్వుతున్నపుడు చూస్తే వీడు మరీ ముద్దొస్తున్నాడు అనుకొంది వెంకమ్మ. ఆ కుర్రవాడికి 7, 8 ఏళ్ళు మించి వుండవు. నడుముకు ఒక చిన్న తుండు చుట్టుకొని, భుజం చుట్టూ మరో చిన్న ఉత్తరీయపు ముక్కను చుట్టి ఎగిరిపోకుండా ముడేసుకున్నాడు. మొహంమీద విభూతి రేకలు సగం సగం చెరిగిపోయాయిగాని, కనుబొమ్మల మధ్య వున్న బొట్టు మాత్రం మిలమిల మెరుస్తోంది. బహుశా అది రక్తచందనపు చుక్క కావచ్చు. అసలే నల్లటి నలుపు మనిషేమో, ఆ వంటిమీద నున్నగా గీసిన గుండు మరీ తెల్లగా మెరుస్తోంది. ఆ గుండు వెనకాల పిలకజుట్టు పోచలు రేగిన తాటిపీచల్లే గాలికి రెపరెప లాడుతున్నాయి. కుర్రవాడు బక్కపలచగానే వున్నాడు కాని. వాడి కళ్ళు మంచి చురుకుగా వున్నాయి. ముద్దులొలుకుతున్న ఆ వటువును మరోసారి తేరిపార చూచి___

"ఎక్కడ పట్టావురా వుడతని ?'' అంది వెంకమ్మ తమ్ముడితో. ఆ బెంగుళూరు బస్సుస్టాండు రొదలో, అక్కయ్య యేమన్నదో సరిగా వినిపించలేదు తమ్ముడికి.

"నువ్వెళ్ళంగానే వచ్చాడు, ఎవరబ్బాయో యేమో " అన్నాడు నరసింహశాస్త్రి.

నంజనగూడు దగ్గరనుంచీ చిరుబుర్రులు సాగించిన తమ్ముణ్ణి అట్టే కదిలించటం మంచిది కాదని బెంగుళూరు బస్సుస్టాండులో దిగగానే, తమ్ముణ్ణి మూటల దగ్గర కూచోబెట్టి_

"అబ్బాయోయ్. మూటలు జాగర్త, నీకు కన్నడం రాదుగా, నేనేపోయి అనంతపురం బస్సెదన్నా వుందేమో వాకబు చేస్తా" అని వెళ్ళిన వెంకమ్మ దాదాపు అరగంటకు గానీ తిరిగి రాలేదు. అందుకనే_

"అబ్బా, అరగంట నుంచీ నిన్ను మాట్లాడిస్తున్నాడన్న మాట.'' అన్నది వెంకమ్మ.

"ఆ వసపిట్ట ! మన బస్సు సంగతేమైంది ?" అసలు విషయంలోకి వచ్చాడు శాస్త్రి.

"ఇప్పుడే వెళ్ళిపోయిందట. ఇక రేపేనట" అంది వెంకమ్మ.

"సరిపాయే" అని విసుక్కున్నాడు శాస్త్రి.

"నే జెప్పింది కదా సార్—సంగమానికి పోక పోయె—అది యాత్ర యెట్టా అయె ?" అంటూ కుర్రవాడు ఎడమ అరచేతిలో కుడి పిడికిలి దట్టించి కొడుతూ రెట్టించాడు.

"ఏమిట్రా అంటాడు ?" వెంకమ్మకి విషయం బొత్తిగా అర్థం కాలేదు.

"ఏమీ లేదు, ఇక్కడికి దగ్గరలో సంగమమని ఒక క్షేత్రం వుందట. అక్కడ కావేరీ, అర్కావతీ, గుప్తగామినీ, సంగమం వుందట. అది త్రిమూర్తి క్షేత్రంట. అక్కడ యెవరో మహర్షిగారు తేజోరూపంలో తిరుగుతూ వుంటారట. అక్కడికి వెళ్ళి దర్శనం చేసుకోమని ఇందాకటి నుంచీ తోమేస్తున్నాడు" నరసింహశాస్త్రి సంపూర్ణంగా వ్యాఖ్యానించాడు.

"హౌదు. సంగమ దర్శన లేకపోయె. తీర్థయాత్ర గళు యెల్ల నిష్ఫలవాయె" వటువు మరోసారి బుర్ర వూపుకుంటూ ఉద్ఘాటించాడు.

"అబ్బా"....అంది వెంకమ్మ సగం సంతోషంగా, సగం వెక్కిరింపుగా.

"నిజ-తాయె ! సంగమ దర్శన మూలక ఎల్ల, కల్యాణగళు ఇష్టాతానే చిక్కింది." కుర్రవాడు తన ఉత్తరీయం ఒడిగా పట్టి ఒడిలో సమస్త కల్యాణాలూ పడతాయని నటించి చూపించి తన భాషను పూరించాడు. ఆ నటనకు మురిసిపోయి కుర్రవాడి బుగ్గలను నులిమి ముద్దు పెట్టుకోందామని వెంకమ్మ అనుకొంటూ వుండగా—

"బాలవటువు అయాచితంగా వచ్చి యేదో మహాక్షేత్రం దగ్గరలో వుందంటున్నాడు, ఏమంటావమ్మా ?" అన్నాడు నరసింహశాస్త్రి.

"అటో ఇటో కట్టె విరిచేయటమే తప్ప ఇలా నాన్చటం, ఊగులాడటం, ఇదివరకు లేవే వీడిలో" అనుకోసాగింది వెంకమ్మ లోలోపలే. కానీ యింతలోనే—

"సరే బస్సులేవయినా వున్నాయేమో కనుక్కో. ఓ అడుగు అట్టా పోయొస్తే అయిపోయె" అన్నాడు నరసింహశాస్త్రి, ఒక్కసారి తల విదిలించి.

"ఇదీ వీడి అసలు వరస" అనుకొంది వెంకమ్మ.

"ఉండె. నాను చూసితిని. బన్ని....బన్ని" అంటూ వెంకమ్మని చెయ్యి పట్టుకొని గుంజాడు, ఆ వటువు. చెట్టంత వెంకమ్మకు వళ్ళు జలదరించినట్టనిపించింది. అప్రయత్నంగా ఆ పిల్లవాడి వెంట వెళ్ళింది. అప్పటిదాకా లోకాన్ని మలమలమాడ్చిన సూర్యుడి ప్రతాపం, ఆ సరికి పూర్తిగా చల్లిపోయింది. తాపాల అధ్యాయం ముగిసింది. సంతోషమేగాని, యికపై ఏ అధ్యాయం మొదలవుతుందో, తెలీక మథన పడుతున్నయ్యా అన్నట్టు, దిక్కుల ముఖాలు మసక

మనకగా వున్నాయి. దిక్కులలా దిగులుగా వుంటే ఆ బస్సు స్టాండులో, ఊరివారి కాకిగోల మాత్రం అదుపూ ఆజ్ఞా లేకుండా వుంది. "ఊరి బయట కాకుల గోలకన్నా ఊళ్ళో మనుషుల గోల మరీ ఘోరం" అనుకున్నాడు, లఘువుగా సాయంసంధ్య వారుస్తున్న నరసింహశాస్త్రి. నరసింహశాస్త్రి సంధ్యావందనం అయ్యేసరికి వెంకమ్మ తిరిగి వస్తోంది.

ఆవిడవెనుక దోరజామకాయ కరకర నములుతూ ఉత్సాహంగా నడుస్తున్నాడు వటువు.

"రేప్పొద్దున్నే ఆరింటికి బస్సుందిట. ఆ సంగమం ఒక అడివిట. అక్కడికి కొత్తగా బస్సు వేస్తున్నారట. రోజూ ఒక్క బస్సేట. ఆ బస్సులో వెళ్ళి స్నానం చేసి, మళ్ళీ అదే బస్సులో వచ్చెయ్యాలట." వస్తూనే వివరాలన్నీ చెప్పింది వెంకమ్మ.

"ఎంతసేపు పడుతుందో ప్రయాణం?"

"మూడు గంట" వటువు జామముక్క నములుతూనే అందుకున్నాడు.

"ఇంకేం, రేపు మధ్యాహ్నానికల్లా వచ్చేసి, అనంతపురం బస్సు ఎక్కేయవచ్చు మనం" అన్నాడు నరసింహశాస్త్రి.

"మరైతే యీ పూటకు ఏదైనా సత్రానికి పోదామా?" అంది వెంకమ్మ.

"ఎందుకు లెద్దూ, ఈ బస్సుస్టాండులోనే కాసేపు కునికి పాట్లు పడదాం. తెల్లవారు జామునే ఏ పంపు దగ్గరో స్నానం చేసి పొద్దున్నే బస్సెక్కెయ్యవచ్చు." అన్నాడు కొంచెం ఆలోచించి నరసింహశాస్త్రి.

"అదీ బాగానే ఉందిలే. ఈ వూళ్ళో మంచి సత్రాలు దగ్గరలో వున్నాయో, లేవో గూడాను" అంది వెంకమ్మగారు. వాళ్ళ నిర్ణయం విని ఆ వటువే, బస్సుస్టాండులో ఆరాత్రి గడిపేందుకు వో మంచి చోటు చూపించాడు. అలా చూపి, "రేపు వచ్చేను తాయె" అంటూ చటుక్కున వెళ్ళిపోయాడు.

అన్నట్టుగానే! ఆ మర్నాడు సంగమం బస్సు కదలబోయే సమయానికి, కిటికీ దగ్గరకు వచ్చాడు. "తాయే" అంటూ.

అప్పటి వరకూ వాడికోసమే తపనపడుతున్న వెంకమ్మ వాడి చేతిలో ఒక మామిడి పండు పెట్టింది. కుర్రవాడు నరసింహశాస్త్రిని పిల్చి మరీ పలకరించాడు. కుర్రవాడు సంతోషంగా చెయ్యి వూపుతూ "సాక్షాత్ లక్ష్మీదేవి, మీకు చిక్కుతాడు" అంటూ వుండగా బస్సు కదిలింది.

ఒక గంటసేపు ప్రయాణం సుఖంగానే వుంది కాని, ఆపైన దాదాపు, రెండున్నర గంటలు కుదుపుల ప్రయాణంతో, వళ్ళు హూనం, హూనం చేసి చివరకు వరసంచారం లేని నట్టడవిలో ఆగింది బస్సు. ఊరూ వాడా కాదుకదా, చిన్న చుట్టు గుడిసైనా లేని చోట బస్సు

ఆపి దిగమంటే జంకుతున్నారు కొత్తవాళ్ళు. బస్సాగినచోటు, చుట్టూతా, కొండల్లాంటి చెట్లూ, వాటికి దూరంగా, చుట్టూతా నిజంగానే కొండలు తప్పితే మరోటి యేమీ కనిపించ టం లేదు. బస్సులో దిగిన జనంతోపాటే కాలిబాటంబడి, కొంచెం ముందరికిపోగా కుడిచేతి వైపున ఒక పెద్ద దిబ్బమీద, ఒక చిన్న దేవాలయం కనిపించింది. ఆ గుడి తలుపులు వేసేసి వున్నాయి. ఆలయం ఇంచుమించు శిథిలావస్థలో వుంది. "అదే సంగమేశ్వరాలయం" అన్నారు తోటి ప్రయాణీకులు. మరి కొంత ముందరికి పోగా పరమపావని అయిన కావేరీ ప్రవాహం దర్శనమిచ్చింది.

"గంగే మంగళ తరంగిణీ" అన్నాడు నరసింహశాస్త్రి ఉత్సాహంగా. ఏమి కారణమో తెలియదుగాని బస్సు దిగిన దగ్గర నుంచీ నరసింహశాస్త్రి ముఖం బాగా వికసించి వుంది. మనిషి ఉత్సాహంగా వున్నాడు. తూర్పుగా వెళ్ళుతున్న కావేరిలో దక్షిణ వాహినిగా వస్తున్న ఒక చిన్న నీటిపాయ కలుస్తోంది. ఆ నీటిపాయే అర్కావతీ నది అన్నారు. మరొక నది అంతర్లీనంగా భూమిలో పారుతోందనీ, ఆ నది పేరే గుప్తగామిని అని కొందరు వృద్ధ ప్రయాణీకులు చెప్పారు.

కొండరాళ్ళ మీంచి గున గునా జారుతూ కొంచెం వేగంగానే సాగుతోంది కావేరీనది. వీరు వెళ్ళేసరికి సుమారు పది గంటలయింది. అప్పటికే కరుకుతేలిన యెండలో ఆ నది మరింత ఆహ్లాదదాయినిగా వున్నది. ఎంతదూరం పోయినా పెద్దగా లోతులేని ఆ నదీ సంగమంలో ఆనందంగా స్నానం చేస్తూ జనానికి బాగా దూరంగా వెళ్ళిపోయాడు నరసింహశాస్త్రి. అలా వెళ్ళి వెళ్ళి ఒక చిన్న రాతిబండ చాటుగా మొలబంటి నీళ్ళలో నిలబడి జపం మొదలు పెట్టాడు. తమ్ముణ్ణి ఒక వంక కనిపెడుతున్న వెంకమ్మ తమ మూటలు ఆ దగ్గరలో ఒక గుట్టమీద పెట్టి తనూ స్నానం చేసివచ్చి యిసకలోనే పద్మాసనం వేసుకు కూర్చుంది.

జనం బాగా దూరంగా వున్నారు. వాళ్ళకు తాము కనిపించటం కష్టం. బస్సు వెళ్ళి పోతే, చాలా యిబ్బంది అవుతుంది. అయినా, జనం వెళ్ళేటప్పుడు, అలికిడి మనకు తెలియ కుండా వుంటుందట లెమ్మనుకుంటూ తనూ శివ ధ్యానంలో ఒక్క క్షణం కన్ను మూసింది వెంకమ్మ. అలా కన్ను మూసి క్షణం అయినట్టు లేదు ఇంకా. ఇంతలో తనుకూర్చున్న నేలంతా తడిసిపోయి తన మోకాళ్ళమీద నీళ్ళుకొట్టుకుంటున్నట్టనిపించి కళ్ళు తెరిచింది, ఒక్క క్షణం పాటు. కళ్ళుమూసి వున్న దానికీ, తెరచి వున్న దానికీ తేడా తెలియలేదు. మొత్తం చీకటిగా వుంది. కళ్ళు నులుము కొని తేరిపార చూస్తేగాని, అప్పుడే బాగా చీకటి పడిపోయిందని తను జానెడు లోతు నీళ్ళల్లో వున్నానని తెలియలేదు. నది పోటులో వుందనీ, నీళ్ళు యెగదట్టు కొని వస్తున్నాయనీ అర్థమయ్యేసరికి, తమ్ముడి సంగతి గుర్తుకొచ్చి కంగారుగా పక్కకి చూసింది.

అక్కడ తమ్ముడు లేడు. గుండె గుభిల్లు మంది వెంకమ్మకు. అప్పటి వరకూ తానునుభ వించిన, ఆనందమయ ధ్యాన లోకాలలోంచి, యీ దౌర్భాగ్య మానవప్రపంచంలోకి రావటం కంటగింపుగానే వుంది. కానీ గుండెకు తగిలిన అదురు ఆమెను వేగంగా యీ లోకానికి తెచ్చింది. లోకంలోకి వస్తూనే అరిచింది, 'నరసింహా' అని.

ఆమె అరుపు ఆ చీకటి అడవిలో సన్నగా ప్రతిధ్వనించింది. బదులు మాత్రం లేదు. ఒక్కసారి గుండె నిబ్బరం చేసుకొని, శివస్మరణ చేసి, మళ్ళీ పిలిచింది వెంకమ్మ.

"ఊ" అన్నాడు వినుగ్గా పక్కనే వున్న రాతి బండ మీంచి నరసింహశాస్త్రి.

వెంకమ్మ హమ్మయ్య అనుకొంటుండగా "యేటికి పోటొచ్చిందేమిటమ్మా" అన్నాడు తాపీగా.

కృష్ణపక్షపు కటిక చీకట్లు, ఆ కారడవిలో నిరంకుశ రాజ్యం చేస్తున్నాయి. కొండ రాళ్ళమీద నుంచి దూకుతున్న నీటి తరగలమీద కొండ గాలులు సుళ్ళు తిరుగుతూ, వింత ధ్వనులు పుట్టిస్తున్నాయి. దూర ఝూరాలలో మసకమసకగా వూగుతున్న పెద్ద చెట్లు తొండా లూపుతున్న యేనుగుల్లాగా వున్నాయి. పోటులో వున్న యేటి హోరు ఒకోసారి ఏనుగుల ఘీంకారం లాగానే వుంది. వెంకమ్మ ధైర్యంలో తమ్ముడికి తీసిపోయిన మనిషికాదు. కాని ఎందుకో అక్కడ నిలుచో బుద్ధి కావటంలేదు.

"అసలు చీకటిపడి ఎంతసేపయి వుంటుందంటావు?" అంది తమ్ముడితో.

"నెత్తిమీది నక్షత్రాలను బట్టి చూస్తే ఎక్కువ పొద్దుపోయినట్టులేదు. రాత్రి ఎనిమిదో, తొమ్మిదో అవుతుందేమో" అన్నాడు నరసింహశాస్త్రి, మనస్సులోనే లెక్కలు గట్టి.

ఎందుకో, వెంకమ్మ అసహనంగా, జాగర్తగా తడువుకుంటూ యిటూ అటూ తిరగ సాగింది. అలా కొంతసేపు తచ్చాడాక "ఒరేయ్ యిటురారా" అని పిల్చింది. వెళ్లాడు తమ్ముడు.

"ఇదేదో నలిగిన కాలిబాటల్లే వుందే" అంది నేలమీదకు వంగి పరిశీలిస్తూ.

"పోనీ రెండడుగులు వేసి చూద్దాం. మనం చేసే ఘనకార్యం ఏముందీ యిక్కడ?" అన్నాడు నరసింహశాస్త్రి.

తమ్ముడి సమాధానం అక్కకే ఆశ్చర్యంగా వుంది. నాలుగడుగులు వేసేసరికి ఒక పెద్ద రాతిబండ అడ్డం వచ్చింది. ఒక పక్కనుంచి మెల్లగా ఆ బండమీద కెక్కి—

"ఏవమ్మోయ్! ఏదో దీపం కనిపిస్తోందమ్మా" అన్నాడు దాదాపు అరిచినంతగా నరసింహ శాస్త్రి.

*          *          *

"........ ఎవరో కొత్త మనిషి. గదిలోకి రావటంతో సత్యనారాయణ ఆలోచనలు ఒక్కసారిగా ఆగిపోయినై.

వచ్చిన పెద్ద మనిషి పై ఆదివారంనాడు హోమం చెయ్యమని అడగటానికి వచ్చాడు. ఈ సంభాషణలో పడటంతో సత్యనారాయణ శ్రీ కంఠయ్యల సంభాషణ వెనక్కిపోయింది.

# కల్యాణ యోగము

బహిర్ముఖాంతర్ముఖ జీవనోద్య
త్కల్లోల హ్లాద నక చిత్ర యోగే,
సుష్ఠు ప్రతిష్ఠాపిత సామ్యయోగ
నిష్ఠానిధిం నౌమి గురుం గరిష్ఠమ్ ॥

[బహిరంగ జీవితంలో ఒక నిరంతర కల్లోలము, అంతర్ముఖ జీవితంలో ఒక ఆనంద లాస్యము కలిసిన విచిత్ర యోగదశలో, ఆయన ఒక సామ్య యోగాన్ని (సమానత్వమనే యోగాన్ని), సుస్థిరంగా స్థాపించారు. అట్టి నిష్ఠానిధియైన శ్రీ గురు శ్రేష్ఠునకు నమస్కరిస్తున్నాను.]

## ఖానువార హోమం

ఆ కాలనీలో యిళ్ళు అన్నీ దాదాపు ఒకటే మోస్తరు. వీధి మీదికి ఒక ఇరుకు గది. దాని పేరే హాలు. దాంట్లో మామూలుగా అయితే, ఇరుక్కుని కూర్చుంటే ఒక పాతికమంది కూర్చోవచ్చు. దాని నానుకొని మరింత చిన్న గది వొకటి. ఇది వంటిల్లు. ఇది హాలులో సగం వుంటుంది. మిగిలిన సగం బాత్‌రూమ్‌గా, రేకుల షెడ్డుగా అమర్చబడి వుంది. మొదటి రెండు గదులు శ్లాబ్ గదులు.

ఇందులో ముందరి హాలులో హోమగుండం, కలశానికి పీఠం, వగైరా పోగా ఓ పది మంది పట్టటం కష్టంగా వుంది. ఆ యిళ్ళకు వేరే దొడ్డి లేదు.

ఈ వారం గణపతి హోమంలో జనం స్వతంత్రించి అటు వంటింటిలోకి గూడ చొరబడి నిలబడ్డారు. ముఖ్యంగా ఆడవారు. అయినా చోటు చాలక, వాకిట్లో ఎండలో కొందరు నిలబడ్డారు. వారికీ హోమం చూడాలని ఉత్సాహం. అందుచేత ఇంట్లో నిలబడ్డవారు, వాకిట్లో ఎండలో నిలబడ్డవారు, కాసేపు ఒకరు, కాసేపు ఒకరుగా స్థానాలు మార్చుకొంటూ హోమం చూడసాగారు.

జనం కదలికవల్ల హోమ స్థలంలో ప్రశాంతికి కొంత భంగం జరిగినా, హోమం ఆనందంగానే ముగిసింది.

జనం సంతోషించారు.

కానీ యీా వచ్చినవారిలో ఉన్న బ్రాహ్మణుల్లో ఒకరిద్దరు "కుర్రవాడు చక్కగా హోమం చేస్తున్నాడు. బాగానే ఉందిగాని బొత్తిగా ఆచారం లేదు" అన్నారు.

అన్నవారు అన్ని హోటళ్ళలోనూ తినేవారే!

ఇది విని అయోమయంగా చూశాడు సత్యనారాయణ.

పకపకా నవ్వాడు ప్రశ్నగణపతి. "మొదటి సమస్య నెత్తిన పడ్డదా" అని.

ఆ రోజు రాత్రి విచారంగా కూర్చున్న సత్యనారాయణను చూసి—

"ఏమి సత్యనారాయణా! అప్పుల గురించీ, ఉద్యోగం గురించీనేనా ఆలోచనంతా" అని పలకరించాడు శ్రీకంఠయ్యగారు. గోడకు చారిగిలబడి కూర్చున్న సత్యనారాయణ ఈ మాట వినగానే యేదో గుర్తు వచ్చినట్టు నిటారుగా కూర్చుంటూ—

"ఆఁ....ఆ రోజు మీాకు నా కథ చెపుతానన్నాను. కానీ నా ఆలోచనలతోనే నాకు సరిపోయింది. ఇవాళ్ళ కొంతన్నా చెపుతాను, ఉండండి" అన్నాడు.

*　　　*　　　*

ఇరవైయేళ్ళు వచ్చిన సత్యనారాయణ అనేక కారణాలవల్ల చదువులో వెనకబడ్డాడని యింట్లో అందరికీ దిగులు వుందిగానీ, అతనికి మాత్రం ఎంత మాత్రమూ లేదు. ఈ సంవత్సరం **S. S. L. C.** తప్పినాక అయినా ఆ దిగులు రాలేదు. ఊళ్ళో హరికథలు, ఉపన్యాసాలు, పురాణాలు ఎక్కడున్నా సరే, ఎన్ని మైళ్ళదూరమైనా సరే, ఎంతఖర్చులైనాసరే, వెళ్ళి మంగళం దాకా వుండి రావటమే అతని ప్రధాన కార్యక్రమం. కొంతవరకు నాటకాలకయినా పోతాడుగానీ, భరత నాట్యాలకు అసలుపోడు.

అతనికి ఒంటి శుభ్రం, గుడ్డ శుభ్రం అక్కరలేదు. జుట్టు దువ్వుకోవాలని నియమం లేదు. మఠం వేసుకొని, నోరు తెరుచుకొని, తల పైకెత్తుకొని ఆకాశంలోకి చూస్తూ కూర్చున్నాడంటే ఇక అతనికి లోకమే తెలీదు. అలా గంటలు దొర్లిపోతాయి. అది పరధ్యానమో, నిద్దరో, కిర్రో, మరేంటో అతనికే తెలియాలి.

సత్యనారాయణకు ఉన్న యిద్దరు చెల్లెళ్ళలో పెద్దది వరలక్ష్మి పెళ్ళికెదిగి సిద్ధంగా వుండటం ఇంట్లో అమ్మమ్మగారికి ఒక పెద్ద భారంగా వుంది. పార్వతమ్మకు ఈవిడ పోరు రోజురోజుకూ ఎక్కువైపోతోంది. ఇల్లు గడవటమే కష్టంగా వున్న జీవితాలకు పెళ్ళిగడవటమంటే మాటలా? ఈ సత్యనారాయణ కనీసం **S. S. L. C.** అయినా పూర్తిచేసి, యెక్కడయినా నాలుగు రాళ్ళు తెస్తాడేమో, అప్పుడెలాగో అలా యీాపిల్ల పెళ్ళిసంగతి ఆలోచిద్దామని పార్వతమ్మ తపన. కానీ సత్యనారాయణకు బాధ్యతన్న మాటే పట్టటం లేదు.

సృష్టిలో లేని విచిత్రాలు లేవు. ఇంట్లో వాళ్ళందరికీ ఇంత "పనికిరాని చవట అయిన సత్యనారాయణ మీద వాళ్ళ బంధువర్గంలోనే ఒక పిల్ల కళ్ళు పడ్డాయి. బంధువర్గం అవటంచేత కాస్తో కూస్తో చనువుగా తిరుగుతున్న ఆ పిల్ల ఒక దుర్ముహూర్తం చూసి తన అభిప్రాయం సత్యనారాయణకు వెల్లడిచేసింది. ఎగిరి గంతెయ్యవలసింది పోయి, ఏవేవో వేదాంత వాక్యాలు వల్లించసాగాడు సత్యనారాయణ.

ఒక రోజున ఆ పిల్ల తండ్రి కబురు చేస్తే వెళ్ళాడు సత్యనారాయణ. తీరా వెళ్ళాక "నీకు మహారాజాలాంటి ఉద్యోగం నే నిప్పించుకుంటాను. అదిగాక పిల్ల పేర ఇంత ఆస్తివుంది, ఇంత బంగారం వుంది. నువ్వు దాన్ని చేసుకో" అని సరాసరి బేరం పెట్టేశాడు. ఇలా జరుగుతుందని ఊహించలేదు సత్యనారాయణ. ఈ బేరానికి లొంగలేదని కోపగించిన ఆ పిల్ల అన్నలు నాలుగు ఉతికి చంపేస్తామని బెదిరించారు.

"ప్రాణం పోగొట్టుకోవటమా? పెళ్ళికి ఒప్పుకోవటమా?" అన్న సంకటంలో పడి తల్లిని తలచుకొని ధారాపాతంగా అశ్రుధారలు రాల్చాడు సత్యనారాయణ. ఆ స్థితిలో, ఎందుకనో, ఆ పిల్ల తండ్రి ఉన్నట్టుండి మనస్సు మార్చుకొని, మళ్ళీ తన యింటికేసి రావద్దని బెదిరించి సత్యనారాయణను పంపించి వేశాడు. అమ్మ అనుగ్రహంతో ఆ గండం గడిచిన సత్యనారాయణకు త్వరలోనే మరో గండం ఎదురైంది.

తన పినతల్లి పార్వతమ్మ నడుపుతున్న "సరస్వతీ శిశువిహార్" అనే ప్రైమరీస్కూలులో లెక్కల పంతులమ్మగారి భర్త అయ్యంగార్ అనే ఆయన సత్యనారాయణ పెద్ద చెల్లెలు వరలక్ష్మికి ఒక మంచి సంబంధం తెచ్చాడు. కె. ఆర్. మిల్సులో నెలకు రెండు వందలు సంపాదించు కుంటున్న "సుబ్బణ్ణ" అనే ఆ యువకుడు కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవటానికి అంగీకరించాడు.

మొదట్లో తెలియలేదు కాని, కొద్దిరోజులకే ఈ సుబ్బణ్ణ తమ కుటుంబానికి ఆప్త మిత్రుడైన కృష్ణప్ప గారికి సోదరుడని తెలిసి ఇంట్లో అందరూ చాలా సంతోషించారు. పోస్టల్ డిపార్ట్‌మెంటులో ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్న ఈ కృష్ణప్పగారిపట్ల మొదటినుంచీ గూడా సత్యనారాయణ ఎంతో గౌరవంగా వుండేవాడు. అత నాయన్ని ఎప్పుడూ "భావయ్యా" అనే పిల్చేవాడు. ఈ మధ్య ఆయన వచ్చినప్పుడల్లా తనకు ఏదయినా చిన్న ఉద్యోగం యిప్పించమనీ, శ్రద్ధగా పని చేస్తాననీ బహు దీనంగా బతిమాలుకుంటున్నాడు. ఈమాత్రం బాధ్యత కలిగినందుకు సంతోషించినా S. S. L. C. తప్పినందుకు బాగా చివాట్లుపెట్టి, సావకాశం వచ్చినపుడు సహాయం చేస్తానని చెపుతున్నాడు కృష్ణప్ప గారు.

ఇది యిలా జరుగుతుండగా, ఈయన తమ్ముడు సుబ్బణ్ణ ఈ పేద సంబంధానికి ఒప్పు కోవటం ఆ కుటుంబం వారికి అంతగా ఆనందదాయకం కాకపోయినా, వాళ్ళు మరీ మొరటుగా

వ్యతిరేకించలేదు. ఇక ఇంట్లో వాళ్ళు తన పెళ్ళికోసం పడుతున్న గుంజాటనలు, కష్టాలు చూచి, తను పెళ్ళి చేసుకోనని వరలక్ష్మి పట్టుబట్టసాగింది. పెద్దలంతా ఆమెకు మెల్లగా నచ్చ చెపుతున్నారు.

ఆ రోజుల్లోనే ఒకరోజున—

## ప్రసాదం

అది దీపాలు పెట్టే వేళ.

ఎక్కడి నుంచో వచ్చి ఇటూ అటూ చూడకుండా, సరాసరి బావి దగ్గరకు వెళ్ళి చరా చరా నీళ్ళు చేదుకొని తలమీద స్నానం చేయసాగాడు సత్యనారాయణ. చేదుతున్నాడు, పోసుకొంటున్నాడు, చేదుతున్నాడు, పోసుకొంటున్నాడు. వళ్ళు రుద్దుకోవాలనే ధోరణే వున్నట్లులేదు అతనికి. అలా ఎంతసేపు చేశాడో, అతనికేమయినా లెక్క వుందేమోగాని, స్నానం చేస్తున్నంతసేపూ లోలోపల యేదో గొణుక్కుంటూనే ఉన్నాడు. ఈ అలికిడికి ఇంట్లోంచి తన తాతగారు లింగణ్ణగారు బయటకు వచ్చి, అల్లంత దూరంలో తెల్ల జిల్లేడు చెట్టు దగ్గర నిలుచుని తననే గమనిస్తున్నాడని అతను చూసుకోలేదు.

పొడుగూ, పొట్టీగాని కుదిమట్టపు శరీర నిర్మాణంతో, ముసలితనం పండువారులో ఆ వృద్ధుడి నుదురంతా ముడతలు బడి అడ్డగీతలు యిరుకు, యిరుకుగా గీచినట్లు వుంది. కొంచెం బండగా వున్న ముక్కు, నస్యానికి బాగా అలవాటు పడ్డదని సులభంగానే గ్రహించవచ్చు. క్రిందికి దిగజారుతున్న ఆ బుగ్గలూ, కనుబొమలూ గమనించినపుడు "బాగా కష్టపడ్డ జీవి" అనిపిస్తుందిగాని గుంటలుపడ్డ ఆ కళ్ళల్లోకి, నిదానించి చూస్తే ఆయనది, చల్లని ప్రశాంతమైన మనసని తెలుస్తుంది.

ఎడం చేతిలో వేసుకున్న పొడుం పట్టును, కుడి చేతి వేళ్ళతో నలుపుతూ, ఎంతసేపు ఓపిక పట్టినా మనవడి తలస్నానం పూర్తి కాకపోయేసరికి తన విసుగుకు సూచనగా ఆయన గుర్రని నశ్యంపట్టు పట్టేశాడు. అలా నశ్యం పీల్చి భుజంమీది తుండుతో, ముక్కు సవరించుకొని—

"ఏమిటూ కాకి స్నానం? ఎంతసేపు? కనుచీకటి పడ్డాక" అన్నాడు. నశ్య ప్రభావంవల్ల కొంత బొంగురుతనం చేరినా, ఆ గొంతులో మంచి లోహశక్తి వుంది. తాతయ్య మంచి మూడ్‌లోనే ఉన్నాడని యిట్టే గుర్తు పట్టేశాడు సత్యనారాయణ. దాంతో "కాకి స్నానం కాదు తాతయ్యా, గంగా స్నానం" అన్నాడు హుషారుగా!

"ఓహో, కాశీదాకా బలాదూరు తిరిగి వచ్చావన్న మాట. లేకపోతే పొద్దునవగా పోయిన వాడివి, యీ మైసూర్లో, ఇంతసేపు ఎక్కడని తిరుగుతావు పాపం?"

"కాశీ అన్నా, మహా స్మశానం అన్నా ఒకటేగదా తాతయ్యా."

"ఇప్పుడా సందేహం ఎందుకొచ్చింది. స్మశానాలు పట్టుకు వేళ్ళాడడం నేర్చుకున్నావా ఏమిటి కొత్తగా?" యువకుడేదో సమాధానం చెప్పబోయాడు కాని, వాకిట్లో ఎవరో గట్టిగా అడుగుతున్నారు.

"సరస్వతీ శిశువిహారం యిదేనా అండీ ?"

"ఆఁ ఇదే–ఎవరు కావాలి," అంటూ, తాతయ్య వీధి వాకిలికేసి నడిచాడు మరో పొడుంపట్టు బయటకు తీస్తూ.

యువకుడి కా మాటలు వినిపిస్తున్నాయి.

"సత్యనారాయణగారున్నారా అండీ?"

"సత్యనారాయణగారా ! వారెవరండీ?"

"అదేనండీ, గణపతి ఉపాసన చేస్తూ ఉంటారు."

"ఉపాసకులా ! సత్యనారాయణగారా, ఎవరబ్బా"

"అదే నాన్నా మన సత్యం గాబోలు" లోపలినుంచి ఆడగొంతు.

"ఓహో సత్యమా, ఔను ఉపాసకుడంటున్నారేమిటి?"

తాతయ్య స్వగతం బహిర్గతమై పోయింది. కాని యింతలో—

"మీరా, రండి, రండి, స్నానం చేస్తున్నాలెండి" అంటూ సత్యనారాయణ అక్కడికి వచ్చాడు. ఆ ఎదురుగా ఉన్నవారెవరో, కార్మిక, కర్షక వర్గం బాపతువారిలాగ వున్నారు. దాదాపు ఏభై ఏళ్ళు పైబడ్డవారే. వారితో ఒక ముసల్మానుగూడ వున్నాడు.

వీరంతా, వళ్ళు తుడుచుకుంటూ, తడి గుడ్డలతో వచ్చిన యువకుణ్ణి చూసి, దాదాపు నేలకు వంగి నమస్కరించారు.

అది చూసి అవాక్కయి పోయాడు తాతయ్య. సత్యనారాయణ మాత్రం, ఆ నమస్కారాలని పట్టించుకున్నట్టే లేదు. "మా యింట్లో కూర్చునే చోటే లేదు. పాపం నిల్చుని ఉన్నారు. ఇంతకూ ఎలావుంది పాపకు? ఎలావుంది దూడకు?" అన్నాడు ఆప్యాయంగా.

అంటూనే వాళ్ళ సమాధానం కోసం ఎదురు చూడకుండా, వెనక్కు తిరిగి యింటి వెనక్కు నడిచాడు. అక్కడ నిత్యమల్లె పొదుపక్కన, చిన్న చెల్లెలు సరస్వతి, వెలవెల బోతున్న మొహంతో నిల్చుని వున్నది. ఆ కనివెలుతుర్లో, ఆ పిల్ల ముఖకవళికలు అట్టే కనిపించటం లేదుగాని ఆకారం పూచిక పుల్లలాగా ఉందని స్పష్టంగా తెలుస్తోంది.

చెల్లెల్ని చూస్తూనే, "ఒసేయ్, సరసూ! తొందరగా వెళ్ళి గాదెలో బూడిద కొంచెం పొట్లం గట్టి తీసుకురా" అన్నాడు సత్యనారాయణ హడావిడిగా.

"వాళ్ళకి మందుగా యిస్తావా?"

"ఔను"

"ఇది ద్రోహం"

"ఎందుకని ?"

"ఇది పచ్చి మోసం"

"అక్కర్లేని ఆలోచనలు నీకెందుకు ? పోయి చెప్పినట్టు చెయ్యి"

సత్యనారాయణ కంఠం గుసగుసగానే వున్నా కొరడా ఝుళిపించినట్టుంది. పైగా అతను చెయ్యి పైకెత్తాడు ఉగ్రంగా. అన్న ఓపట్టాన చెయ్యి ఎత్తడు. కాని గుర్రొచ్చి దెబ్బ వేశాడో, బుగ్గబూరె కావాలిసిందే. సప్తర్షులు ప్రత్యక్షం కావాలిసిందే. ఆ విషయం స్వానుభవంగా తెలిసిన సరస్వతి యిక వాదించలేదు. బుద్ధిగా లోపలికివెళ్ళి బూడిద పొట్లం కట్టసాగింది. చల్లారిపోయిన కచ్చిక నలిపి, బూడిద పొట్లం కడుతుంటే, అదేమిటో వెచ్చ వెచ్చగా చేతికి తగిలి ఆశ్చర్యపోయింది. కాని ఆ పిల్ల అంతగా ఆ విషయం పట్టించుకోలేదు. సత్యనారాయణ వంటిమీద పొడి గుడ్డలు తగిలించుకొని, వీధివాకిటి దగ్గర కొచ్చేసరికి సరస్వతి యింట్లోంచి పొట్లాలతో వచ్చింది.

సత్యనారాయణని చూస్తూనే "చాలా వరకు తగ్గిపోయింది బాబూ. అమృత హస్తం నీది. గణపతి చేతికి తిరుగు ఉంటుందా" అంటున్నారు ఆగంతకులు.

"దీంతో పూర్తిగా తగ్గిపోతుంది. భయంలేదు నేనున్నాగా" అంటూ, "ఇయ్యవే అమ్మాయ్" అన్నాడు సత్యనారాయణ సరస్వతితో. ఆమె అన్న చేతిలో పెట్టబోయింది. "ఎందుకు, వాళ్ళ కిచ్చెయ్" అన్నాడు సత్యనారాయణ.

మంత్రముగ్ధలా చెప్పినట్లు చేసింది. "మునపటిలాగే వాడండి. వెళ్ళిరండి" అని వెనక్కు తిరిగాడు సత్యనారాయణ.

వాళ్ళు పొట్లాలు పుచ్చుకొని కళ్ళ కద్దుకొని అయిదు రూపాయల నోటు తీసి నేల మీద పెట్టి దూరంగా జరిగారు. ఇంటి వాకిటి లైట్లలో ఆ నోటు బంగారపు తునకలాగా మెరిసిపోతోంది తాతయ్య మసగ కళ్ళకి.

"ఎందుకిది ?" సత్యనారాయణ అడిగాడు.

"గణపతి పూజ చెయ్యి బాబయ్యా !"

"పూజకు రూపాయలు ఎందుకు ?"

"చూడు బాబయ్యా ! నువ్వు కుర్రాడవు. సంజెవేళ ఇంటికి నడిచి వచ్చిన మాలక్ష్మిని కాదని కాలదన్నరాదు. ముసలోణ్ణి. నామాట విను. ఇవ్వనివారిని అడగకు. ఇచ్చేవాడి దగ్గర తీసుకో, కాదనకు, మంచి పనికి వాడుకో. అల్లా మెచ్చుకుంటాడు" అన్నాడు వాళ్ళలో

వున్న సాయిబ్బు తాత సగం సగం తురకంలో. లింగణ్ణగారు నివ్వెరపోతున్నాడు. "ఇతగాడు సాయిబ్బా, ఎవరైనా దేవదూతా" అనిపించింది ఆయనకు.

సత్యనారాయణ మౌనంగా ఊర్కుండి పోయాడు. వాళ్ళు నమస్కరించి వెళ్ళిపోయారు. ఎందుకో తెలియదు. కొన్ని నిముషాలుఎవరి స్థానాల్లో వాళ్ళు అల్లాగే నిలుచుండిపోయారు. ఇంతలో, ఆకాశంలోంచి వూడిపడ్డట్టుగా ప్రత్యక్షమైంది, ఒక పచ్చి బాలెంత ముష్టిది.ఒక చాటలో ఒక పసికందుని పట్టుకొని, ఆ చల్లమాటు వేళలో తిరుగుతూ దీనంగా ఆక్రోశిస్తోంది.

"అయ్యలారా, అమ్మలారా, పిల్లలగన్న తల్లులారా, తండ్రులారా, నా కడుపు పంటను కాపాడండి."

లింగణ్ణగారు ఆ ఆక్రోశం విని నిలువెల్లా వణికిపోయాడు. గుడ్లనీరు కుక్కుకుంటూ "ఏమైందమ్మా!" అన్నాడు.

"రెండు నెలల పసికందు బాబూ నా బిడ్డ! ఏదో రోగం, మాయరోగం వచ్చింది బాబూ. జనరలాస్పిటలోళ్ళు మందిస్తారంటే పోయాను. ఆడ మందులైపోయాయంట. సూదిమందు కొనుక్కు తెచ్చుకోమని కాయితం రాసిచ్చారు" అన్నది ముష్టిది.

"పాపం, ముందీ గుడ్డ పిల్లకి కప్పు" అని మీది తుండు చాటలోకి వేశాడు లింగణ్ణగారు. ముష్టిదాని ముఖం వికసించలేదు. "చచ్చే బిడ్డకు పొత్తిళ్ళెందుకు బాబూ" అంది దీనంగా.

"అదేం మాట?"

"ఇంక మాటేంది బాబూ, ముష్టిదాని కడుపున పుట్టినవాడికి మందులేటి బాబూ, చావో, బతుకో అంతేగాని?"

"సూదిమందు ఎంత అవుతుందిట"

"కనుక్కొన్నాను బాబూ, అయిదుర్రూపాయలంట. నేనెంత ఊడిగం చేసినా రూపాయలు కళ్ళ చూడలేను."

"ఇటు చూడు" సత్యనారాయణ మాట గంభీరంగా వుంది. అతని చూపుడువేలు నేలమీద నోటును చూపిస్తోంది. చూసింది ముష్టిది. దానికళ్ళు మెరిశాయి.

"తీసుకో_" సత్యనారాయణ స్వరం గంభీరంగా పలికింది. ముష్టిది భయంతో వణికింది.

"నా దగ్గర చిల్లరలేదు బాబూ" ఆ మాట బిక్కచచ్చిపోయి వుంది.

"అక్కరలేదు తీసుకో"

ముష్టిదాని మొహం వెలిగిపోవటంలో ఆశ్చర్యంలేదు. ఆశ్చర్యమల్లా లింగణ్ణగారి మొహం అంతకన్నా వెలిగిపోవటంలోనే వుంది. తన ఆనందంలో, ఆ ముష్టిది సత్యనారాయణను

ఎన్నెన్ని విధాల దీవించిందో, ఎలా వెళ్ళిపోయిందో తెలిసే తెలియదు లింగణ్ణగారికి. కొంత సేపటికి, లోపలినుంచి, కూతురు పార్వతమ్మ అరుపులకుగాని ఆయనకు బాగా తెలివిరాలేదు.

"అద్భుతంగా వుంది; మనవడి తెలివీ, తాత తెలివీను. ఇక లోపలికిరండి, వీధివారు నవ్విపోతారు" అందరూ మౌనంగా యింట్లోకి నడిచారు. అదివొక చిన్న హాలు. ఒక పక్కన, ఒక నులకమంచం, దానిమీద బొంతపరిచి సిద్ధంగా వుంది. లింగణ్ణగారు పోయి ఆ మంచంమీద కూర్చున్నాడు. ఆ గదిలో లైటు వెలుగుతోంది గాని, బలుబు మసక మసకగానే వుంది.

గదిలో మరో మూల ఒక చిన్న టేబులు, దానిముందు ఒక స్టూలు, పక్కనే బట్టలు వేసుకొందుకు కట్టిన తీగ, ఈ రెంటి మధ్యలో, ఎలాగో ఒదిగి ఇరికిన గణపతి కాలెండరు ఉన్నాయి. ఇంతకన్నా ఎక్కువ వివరాలు అక్కరలేదు. ఆ యిల్లు కేవలం నికార్సు మధ్య తరగతి యిల్లని తెలియటానికివి చాలు. అయితే లింగణ్ణగారి మంచానికి, తలవేపు వున్న అలమార ముందర, చిన్న బ్లాకుబోర్డు ఒకటి నేల కానించి వుండటం, దానిమీద కొన్ని హిందీ అక్షరాలు చిందరవందరగా రాసి వుండటం చూస్తే, ఇది హిందీ పండితుల యిల్లుకాదు గదా! అని అనుమానం తగులుతుంది.

ఆ అనుమానంలో కొంత నిజం లేకపోలేదు. ఎందుకంటే, అది హిందీ పంతులుగారి యిల్లు కాదుగానీ, హిందీ పంతులమ్మగారి యిల్లు మరి.

ఔను, లింగణ్ణగారి కుమార్తె పార్వతమ్మ హిందీ పంతులమ్మే! పొట్టిగా నడివయసులో వున్న, ఆ పార్వతమ్మగారి నల్లటి ముఖంమీద కుంకుమ బొట్టులేదనీ, ఆ పెరట్లో నిత్యమల్లె తీగె విరబూస్తున్నా యీవిడ కొప్పులో, పూరేకు గూడ లేదనీ గమనిస్తే, ఆమెకు విధిచేసిన అన్యాయం చెప్పకనే తెలుస్తోంది.

ఒక పక్క యింటి పనులు చూసుకొంటూనే, పొద్దుటినుంచీ పాఠాలు చెప్పి, చెప్పి అలసి అణగారిపోయిన వాలకం, ఆమె ముఖంలో స్పష్టంగానే తెలుస్తోంది.

"ఏరా, పొద్దుటినుంచి ఎక్కడ వూరేగావు" పార్వతమ్మ ప్రశ్న విని గూడా సత్యనారాయణ నిశ్చింతగా లుంగీ సవరించుకొని గోడ కానుకొని, నేలమీద చతికిలబడి, మోకాళ్ళు ముడుచుకొని ఆకాశంలోకి చూడసాగాడు.

"ఇంటి కప్పులో ఏమైనా రాసుందా ఏరా"

".... .... .... .... ...."

"అన్నం తిన్నావా ఎక్కడయినా?"

".... .... .... .... ...."

"ఎక్కడ తింటాడు?" తాతగారందుకున్నారు.

"వీడికీ, నాకూ పెట్టేదెవరు, ఆ శారదక్కను తప్పిస్తే."

"సరేలే, తినేడిస్తే ఆ మొహం అలా ఎందుకు వేళ్ళాడిపోతుంది."

" ఇంకేం, అందుకనే లోపల కంచంలో వడ్డించే వుంచాను. వెళ్ళి తినమని బతిమాలు, ముద్దుల మనవణ్ణి " అనేసి రివ్వున వీధి వాకిట్లోకి వెళ్ళిపోయింది పార్వతమ్మ.

"బతిమాలటమెందుకు చిన్నమ్మా, వచ్చేస్తున్నాగా."

సత్యనారాయణ దర్జాగా వంటింట్లోకి నడిచాడు. అప్పటిదాకా, తాతయ్య మంచంకోడు మీద మిడతలాగ వాలి వున్న సరస్వతి చ్రురున లేచి తాతయ్య ఎదురుగా నిల్చుంది.

సరస్వతి 13-14 ఏళ్ళపిల్ల. దాని నీడకీ, మైకుస్టాండు నీడకీ, తేడా వుండదని, ఎక్కిరిస్తూ వుంటాడు సత్యనారాయణ. కాని, దాని కళ్ళల్లో వున్న కాంతి చూస్తే మాత్రం దాని తల్లి గుర్తు వస్తూ వుంటుంది లింగణ్ణ గారికి. ఆ మాట మరోసారి గుర్తు చేసుకొంటూ—

"ఏమిటమ్మా" అన్నాడు తాతగారు.

"తాతా! మోసం చేసి డబ్బు సంపాదించవచ్చా?" మనవరాలి గొంతులో ఉక్రోషం ఆశ్చర్యంగా వుంది తాతగారికి.

" అదేం ప్రశ్నమ్మా ".

" మోసంతో సంపాదించి దానం చేస్తే అది పుణ్యమా ? దేవుడు సంతోషిస్తాడా ? "

" మోసం చేసేవాళ్ళ ఊసు మనకెందుకమ్మా "

" నా చేతుల్తో నేనే మోసం చేశాను గనుక "

" నువ్వా "

" ఔను నేనే, గాదెలో బూడిద తెచ్చి, ఇందాక వాళ్ళకి నా చేతుల్తో నేనే యిచ్చాను."

" ఎవరికీ "

" నీ మనవడి పాదాలకి, ఐదు రూపాయలు దోచిపెట్టుకొన్న దౌర్భాగ్యులకు "

" ఏమిటి అది పొయ్యి బూడిదా ? నువ్వెందు కిచ్చావు ? "

" ఇమ్మన్నాడు, ఇవ్వకపోతే తంతానన్నాడు "

" ఎవరు మన సత్యే "

" ఆ, నీ ముద్దుల మనవడే."

లింగణ్ణగారి అడ్డమడతల నుదుట నిలువుగీత లేర్పడి, నిచ్చెనమెట్లు తయారయాయి.

" అన్నం తినిరానీ అడుగుదాంలే "

లింగణ్ణగారికి, యిక చేతిలో వున్న, నస్యం పట్టు పీల్చ బుద్ధికాక దులిపి పారేసి, రెండు చేతులూ నులకమంచం బద్దీమీద వేసి, మెల్లగా వూగిసలాడసాగాడు—గంభీరాలోచనగా,

టేబుల్ ముందర కుర్చీపీటమీద కూర్చుని మొహానికి ఏదో పుస్తకం అడ్డంపెట్టుకుంది సరస్వతి. అన్నం తినటం పూర్తిచేసి వచ్చిన సత్యనారాయణ సరాసరి తాత ఎదురుగా వచ్చి చాపవేసికొని కూర్చున్నాడు.

ఎలా మొదలెట్టాలో లోలోపలే ఆలోచిస్తున్నాడు లింగణ్ణగారు.

ఒక్క క్షణం ఆగి మనవడే మొదలెట్టాడు.

"తాతా నా పేరేమిటి"

"ఏం ? తెలివి ఎక్కువైపోయిందా ?"

"కాదులే చెప్పు తాతా"

"సత్య"

"మరి తాతా సత్యమేదో, మోసమేదో తెలిసేదెలా ?"

"ఇతరులకు మోసమే సత్యం లాగా కనిపించవచ్చు. కాని మనిషై పుట్టిన వాడికి, హృదయం అని ఒకటి వుంటుంది. దానికి తెలుసు మనం చేసింది మోసమో, సత్యమో !"

"మరి ! కొందరు యితరుల గురించి తీర్పులు చెప్పుతారెందుకు తాతా ?"

"కొందరు ఇతరుల చేతగూడ, బెదరించి, మోసాలు చేయిస్తూ వుంటారు. అందుకని" ఒక్క అరుపు అరిచింది సరస్వతి. ఆ మాట అంతగట్టిగా అంటేగాని సరస్వతి ఉక్రోషానికి రవ్వంత శాంతి కలుగలేదు.

"ఔనురా అబ్బీ! మీ అమ్మ యోగమాత, మీనాన్న జ్ఞాని. లేకపోతే ముష్టెత్తుకు తిన్నారేమోగాని మీ వంశీకు లెవ్వరూ ఇతరులని మోసం చెయ్యలేదేనాడూ." ఇది తుపాకీ దెబ్బ. దీనికి విలవిలలాడక తప్పదు సత్యనారాయణకు.

"ఔను తాతా ! మా వంశంలో, మోసం చేసే నడపీనుగ ఇంతవరకూ పుట్టలేదు."

"అబ్బాయీ, నువ్వా ద్వారక గాడి దగ్గర నాటకాలు తర్ఫీదవుతున్నావని నాకు తెలుసు."

సత్యనారాయణ దీర్ఘాలోచనలో పడిపోయాడు. మళ్ళీ తాతగారే అందుకున్నాడు.

"చూడు, వాళ్ళు విద్యాగంధం లేనివాళ్ళే గాని, వాళ్ళ మనసులు పవిత్రమైనవి. నువ్వేదో ఉపాసకుడవని నమ్మి నీకు నమస్కరిస్తున్నారు ఈ రోజు."

"నమ్మక మెందుకు తాతా ? ప్రత్యక్ష అనుభవం వుండగా."

"వచ్చిన రోగాలు పీట వేసుకొని కూర్చొంచవు. అంత మాత్రంచేత, గాదెలో బూది యిప్పించి ప్రసాద మని నమ్మించటం, వద్దు వద్దంటూనే రూపాయలు గుంజటం, తగునంటావా ? ఇది మోసం కాదంటావా ?"

"వ్యాధి కొంత తగ్గిందని వాళ్ళే చెప్పారుగా తాతా"

"అదే నేను చెప్పేది. వచ్చిన వ్యాధులన్నీ తగ్గక అలాగే కూచోవు. దానికి మన పొయ్యిలో బూడిద అక్కరలేదు. చూడు సత్యా, నువ్వు మంచి వయస్సు పొంగులో వున్నావు. ఇవాళ వాళ్ళు వంగి దణ్ణాలు పెట్టారని నువ్వు పొంగిపోవచ్చు. కాని ఇలాంటి మోసగాళ్ళ వల్ల మన మతమూ, దేశమూ యిప్పటికే చాలా అప్రతిష్ఠ పాలయ్యాయి."

ఇక తల యెత్తలేదు సత్యనారాయణ. తాతగారి మాట కొనసాగుతూనే వుంది.

"అదీగాక మోసం ఎప్పటికైనా బయటపడక తప్పదు. అలా బయటపడ్డ రోజున, యీ అమాయక హృదయాలకు గాయమైన రోజున, అవి యెలా ఎదురు తిరిగి రెచ్చిపోతాయో, మోసగాళ్ళను ఎలా చితక బాదుతాయో నీ వూహకు అందదు."

తాత కంఠం ఉగ్రంగా లేదుగాని మాటలు నిప్పుకణికల్లా వున్నాయి.

"సత్యం అంటుబట్టటం కష్టం తాతా"

"ఎవరికోయ్ ?"

"నీలాంటి విశాల హృదయులకి గూడ ! నిజం నిలకడ మీద తెలుస్తుంది"

"ఇన్ని వాగుళ్ళెందుకు, పొయ్యిలో బూడిద యిప్పించావా, లేదా."

"సత్యం కృత్యాలకు అర్థ మేమిటో, కొంతకాకపోతే, కొంతయినా తెలిసేరోజు వస్తుంది తాతా ! ఆ రోజులు నువ్వుగూడ చూస్తావులే."

"నా మొహం"

ఇంతలో సత్యనారాయణ అదృష్టంకొద్దీ, తాతకు పెద్ద దగ్గుతెర వచ్చింది. అది సర్దుకొనే సరికి, పావుగంట పట్టింది. సత్యనారాయణ, సరస్వతి, చెరికాస్త ఉపచారం చేశారు. దగ్గయితే తగ్గిందికాని, తాతకు ఆయాసం అందుకొంది. అది అందుకుందంటే యిహ తాత మాట్లాడ లేడు.

తాతకు మాత్రబిళ్ళవేసి నీళ్ళు తాగించి, మంచం మీదే గోడకు చేరగిల ఆనించి కూర్చోపెట్టి, చేతులక్రింద దిండ్లు సర్దాడు సత్యం.

అప్పటికి సరస్వతి ఉక్రోషం బాగా తగ్గింది. అన్నకు బాగా చివాట్లు పడ్డాయికదా అని దానికి వొళ్ళు కులికిపోతోంది.

అది చూచి, నాలిక బయటపెట్టి, "వె వ్వె వ్వె" అని వెక్కిరించాడు సత్యం.

"ఔను వరలక్ష్మి ఏది?" అన్నాడు ఉన్నట్టుండి.

"ఏం, అది ఒకత్తే చెల్లెలా నీకు? నేను చెల్లెల్ని గానా?" సరస్వతి ఉడుకుమోతుతనం నటించింది.

"కాకపోవటమేమిటి? అది మామూలు చెల్లెలే. నువ్వు దయ్యం చెల్లెలుగదూ- రాక్షసి చెల్లెలుగదూ." ఎంతో సంతోషంగా అన్నాడు సత్యనారాయణ.

"తాతా" అని పిలిచింది సరస్వతి బిగ్గరగా. ఈ కేకతో సత్యనారాయణ బెదిరిపోయాడు.

"మా అమ్మగా, మా పండుగా!" బ్రతిమలాడాడు.

"అలా రా దారికి_"

"ఇంతకూ...."

"వరలక్ష్మి అమ్మమ్మతో కలిసి శ్రీరామనవమి పందిళ్ళలో హరికథకు పోయింది. ఇప్పుడు తిన్న అన్నం గొంతు దిగిందా?"

"అర్రె. ర్రెర్రెర్రె, ఎలా మరచిపోయాను? ఇవ్వాళ్ళ బ్రహ్మాండమైన హరికథ వుందిగదా!" అంటూనే చొక్కా చేతులకి తగిలించుకొని, చటుక్కున బయటకు దూకాడు సత్యనారాయణ. ఎదురుగా పిన్ని పార్వతమ్మ రావటం చూసి అతని వేగం మరింత పెరిగి పోయింది.

"సుడికన్నా సుడిగాలి నయం, మళ్ళీ ఎటో పోతున్నాడు. అన్నం సరిగ్గా తిన్నాడో లేదో" అనుకుంటూ యింట్లోకి నడిచింది పార్వతమ్మ.

ఇలా బాధ్యత లేని ఈ సత్యనారాయణకు బాధ్యత తెలియచెప్పే దెలాగా అని పార్వతమ్మ పరిపరి విధాల మథనపడుతూ వుండేది. ఆమె ఆదుర్దాకు తగినట్లే, సత్యనారాయణ ప్రవర్తన రాను రాను మరింత విచిత్రంగా మారటమేగాక, ఒకోసారి ఆందోళనకరంగా గూడా వుండేది.

ఒకరోజేం జరిగిందంటే___

ఎప్పటిలాగే గోడ కానుకొని, తలపైకెత్తి, నోరు తెరుచుకొని ఇంటి కప్పువంక వెర్రి చూపులు చూస్తూ తాపీగా కూర్చున్నాడు సత్యనారాయణ.

అలా చూస్తున్నవాడు చూస్తున్నట్టే మెల్లిగా స్పృహ తప్పి పక్కకు వాలి, ఏమేమో సన్నగా పలవరించసాగాడు. అలా ఎంతసేపు గడిచిందో అతనికే తెలీదు.

## కల్లోల హల్లీసకం

అతనికి ఒళ్ళు తెలిసేసరికి, పిన్ని పార్వతమ్మ మొహాన నీళ్ళు చల్లుతోంది. అమ్మమ్మ, తాత, వరలక్ష్మి, సరస్వతి చుట్టూ నిలబడి, ఆదుర్దాగా చూస్తున్నారు. అందరూ చుట్టూ మూగి వుండడం చూసి కొంచెరో సిగ్గుపడి, సద్దుకొని కూర్చున్నాడు సత్యనారాయణ.

"ఏమిటి నాన్నా, ఏమయింది?" ఆదుర్దాగా అడుగుతున్నాడు లింగణ్ణగారు.

"ఏంలేదు. ఏదో కునికిపాటులో కల వచ్చిందేమో" సన్నగా నీళ్ళు నములుతూ అన్నాడు సత్యనారాయణ.

"వాడి మొహం, కలేమిటి? ఏదో ఫిట్టు వచ్చినట్టు పడిపోతేను. సాయంత్రానికి డాక్టరు దగ్గరకు తీసుకొని వెళ్ళుతాను." అంది పార్వతమ్మ.

"ఔను, పొద్దుటూర్లో వుండగా యిలాగే ఫిట్లు వస్తూ వుండేవని, వీడి మేనత్త వెంకమ్మ గారు ఎప్పుడో అన్నట్టుంది గదూ!" లింగణ్ణగారు భార్య నడిగాడు.

"పొద్దుటూర్లో ఫిట్లూ లేవు, గిట్లూ లేవు.. హాయిగా వున్నాడు మా సత్యనారాయణ" అంది వరలక్ష్మి.

"అదేమో గాని, ఇదిగో ఈ వెర్రి చూపులూ, వెర్రి వాలకాలూ, నోట్టో గొణుక్కోవటాలూ వీడి నాయన దగ్గర పూర్తిగా చూసేవాళ్ళం. ఇవన్నీ తండ్రి పోలికలే" అంది సావిత్రమ్మగారు చేలబు తిప్పుతూ.

"అమ్మ పోలికంటూ ఏపుగా మరి నన్ను" సత్యనారాయణ అమ్మమ్మకు అడ్డుపుల్ల వేశాడు.

"వుంది. అమ్మ పోలికా వుంది. ఆ కళ్ళూ, ఆ నడకా, అచ్చం మీ అమ్మవే." లింగణ్ణ గారు భార్య నాదుకున్నాడు. "ఆ ముక్కుమీది కోపమూ, వెర్రి చూపులూ మాత్రం అబ్బ పోలికలే" లింగణ్ణగారు తన వాక్యం పూర్తిచేశాడు.

"సరే తాతయ్యా, నాకో సందేహం" అన్నాడు సత్యనారాయణ లేచి వొళ్ళు విరుచు కుంటూ.

"ఏమిటోయ్" ఆసరికి అందరికీ కంగారు తగ్గి స్థిమితపడ్డారు.

"ఏంలేదు, మా నాన్నని ఇంత యెక్కిరిస్తున్నావు గదా ? చూసి చూసి అలాంటి వాడికి కూతురి నెలా యిచ్చావయ్యా తాతా, అది చెప్పు ముందర." సత్యనారాయణ నాటకంలో యాక్షన్ చేస్తూ ప్రశ్నించాడు.

"నేనూ అదే అడుగుదామనుకుంటున్నా" అంది వరలక్ష్మి, బుంగమూతి పెడుతూ.

"ఆ పెళ్ళి మేం చేసింది కాదోయ్ వెర్రిపప్పల్లారా" అంది సావిత్రమ్మ.

"ఆ మాట తాతను చెప్పమను చూద్దాం." రెట్టించాడు సత్యనారాయణ.

"ఔన్రా అదంతే. అసలా పెళ్ళి ఎలా జరిగిందా అని ఆలోచిస్తే, అదేదో కాశీమజిలీ కథల్లే వుందనిపిస్తుంది నా మటుకు నాకే." లింగణ్ణగారు నులకమంచం మీదికి మళ్ళీ చేరి నిదానంగా చెప్పుకుపోతున్నాడు.

తాతగారి మాటలు వింటూనే, పుస్తకాల షెల్ఫు వైపు తిరిగిన సత్యనారాయణ మనస్సు మళ్ళీ మరోసారి లోలోపలి లోతుల్లోకి తప్పుకుంటూ పోయింది.

"అంతర్గతంగా వెలుగుల లోకం వొకటుంది. బహిర్గతంగా బురద ప్రపంచం వుంది. ఈ రెండు ప్రపంచాలలోనూ సమకాలంలో, అసంకీర్ణంగా జీవించమని అమ్మ చేసిన బోధ యింకా అనుభవ పరిపాకానికి రాలేదు. ఆ లోపంవల్లే, అంతర్ముఖ స్థితి బయటుపడి భంగపాటుకు గురి అవుతోంది. ఈ మెట్టు దాటితే గాని అమ్మ చెప్పిన స్థాయి అందదు. త్వరపడాలి. టైమూ దగ్గరకు వచ్చేస్తోంది." ఆలోచనల మధ్యలో తాతగారి కంఠం ఖంగున వినిపించింది.

"గోడకేసి చూస్తూ దద్దమ్మలా నిలబడతావేం? సమాధానం చెప్పుమరి. మీ అయ్యను నేను వెళ్ళి వెతుక్కొచ్చానంటావా? ఇప్పుడు నువ్వే చెప్పు." లింగణ్ణగారు ఉత్సాహంగా రెట్టిస్తున్నాడు. తన ఆలోచనలలో పడిపోయిన సత్యనారాయణకి తాతయ్య ఏమి చెప్పాడో వినిపించలేదు. కాని ఈ చివరి ప్రశ్నను బట్టి కథ అల్లుకొని "తాతా! కట్టె, కొట్టె, తెచ్చె, అంటే నాకేం అర్థం కాదు. ఇదే మసిపూసి మారేడు కాయ చెయ్యట మంటే. అలా కుదరదు. నువ్వు కథంతా వివరంగా చెప్పు. అప్పుడు నువ్వు చెప్పింది ఒప్పుకుంటా." అన్నాడు.

"అలా చెప్పాలంటే చాలా చెప్పాలి" తాతగారు కొంచెం బద్ధకిస్తున్నట్టు కనిపించింది.
"అసలు నువ్వా అడవికి ఎందుకు పోయావు కాపురంతో?" సత్యనారాయణ ఎక్కేస్తున్నాడు.

"అదిగో అదంతా చాలా వుంది. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుంది."

"కదలాలి. కదిలితే గాని గడ్డిలో కూరుకుపోయిన మహా ఫలాలు బయట పడవు"

"చాల్లేవోయ్ కవిత్వం."

"అదికాదు తాతా, ఆ కథంతా వివరంగా చెపితేనే గాని యీ మొద్దుకు (వరలక్ష్మిని చూపిస్తూ) బుర్ర కెక్కదు. బుర్ర కెక్కకపోతే కుదిరే సంబంధం చెడగొడతా నంటుంది. అందుకోసం అడుగుతున్నా."

ఈ బాణం బాగా పనిచేసింది. తాతగారు కాసేపు కళ్ళు మూసుకుని తన పూర్వగాథను నెమరువేసుకుంటూ ఎక్కడనుంచి మొదలెట్టనా అనే ఆలోచనలో పడిపోయాడు.

మళ్ళీ శ్రోతలంతా యెవరి స్థానాల్లో వారు సద్దుకొని కూచున్నారు. సత్యనారాయణ మనసు మళ్ళీ తాబేలు లాగా లోతుల్లోకి పోయింది క్షణంలో.

"ఇదిగూడ ఒక లోటే. బహుముఖ క్రియాసిద్ధి ఇంకా కుదరలేదు. అందువల్లే ఆలోచనలోబడి తాతగారి మాటలు వినలేకపోయాను. అంతర్ముఖంలో సమాధి, బహిర్ముఖంలో అనేకముఖ క్రియాసిద్ధి. ఈ రెండూ కలిస్తేనే సహజ సమాధి. అది అందకపోతే అమ్మ చెప్పిన పనికి అర్హత లభించదు."

ఇంతలో 'ఇదిగో' అన్నాడు లింగణ్ణగారు. ఎవర్ని పిలుస్తున్నారో తెలియక శ్రోతలంతా ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. 'ఇదిగో నిన్నే' అని సావిత్రమ్మ వైపు చిటిక వేసి 'మధ్య మధ్యలో మరిచిపోతే అందిస్తూ వుండు.' అన్నాడు లింగణ్ణగారు.

ఆయన కథనం సాగింది.

* * *

**లింగణ్ణగారు :**

ఒకప్పుడు కర్నాటక దేశాన్ని ఆవరించిన అరాచకత్వ మేఘాలను చెదరకొట్టేందు కోసం కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు కత్తిపట్టి కదన రంగంలోకి దూకాయి. జగత్కల్యాణ కాంక్షతో అంతకు ముందు వరకు ముక్కులు పట్టుకున్న చేతులతో అటుపై, ధర్మ దండం ధరించి ధర్మరక్షణ భారం వహించాయి ఆ కుటుంబాలు. అలా "ఇదం బ్రాహ్మ్యం-ఇదం క్షాత్రం" గా ఓ వెలుగు వెలిగిన ఆ కుటుంబాలు, 'హొయిసల కర్నాటకులు' అనే పేరుతో యావద్భారత కీర్తి వహించాయి.

కాల చక్రపు పరిభ్రమణంలో హొయిసల కర్నాటకుల భాగ్యదశ వెనక్కు నడిచే రోజులు వచ్చాయి. ఫలితంగా ఆ రాజవంశీకులు శాఖోపశాఖలై వివిధ వృత్తులలో వివిధ ప్రాంతాలలో జీవనోపాధులు వెతుక్కోసాగారు.

ఆ పరంపరలలో హరితసగోత్ర వంశంలో లింగణ్ణ అనే వీరుడొకడు 19 వ శతాబ్దపు తొలిదశలలో, "సోగాల" పరగణాలో చిన్నపాళెగాడుగా, రాజ్యం చేస్తూ వుండేవాడు. ఈ సోగాల, బెంగుళూరు మండలంలోని చెన్నపట్టణం తాలూకాలో వుంది. ఈ సోగాల అనేది ఒక ఋషి పేరుమీదుగా ఏర్పడిన వూరు. మా పూర్వీకులు చాలా తరాలుగా యిక్కడే వున్నారు. అంతకు ముందు వారు అక్కబుక్క సామ్రాజ్యంలో మంత్రులుగా వుండేవారు.

గుర్రపు స్వారీలో, కత్తియుద్ధంలో, సాటిలేని మేటిగా పేరు పొందిన ఆ లింగణ్ణగారి జీవిత విశేషాలు నా కంతగా తెలియవు గాని, వీరుడుగా, పరిపాలనా దక్షుడుగా పేరు పొందిన ఆ మహనీయుడు తన మలివయసు తొలిభాగంలో ఒక రోజున వున్నట్టుండి సన్యాసం పుచ్చుకొన్నాడట.

అప్పటికే తెల్లదొరల పల్లదనం వల్ల మన దేశపు అసలైన ఆధ్యాత్మిక సంపద గుల్లబారుతోందని గ్రహించాడో యేమో నా కయితే బాగా తెలియదు గాని, ఆ రాజయోగి కొద్ది కాలానికే యోగిరాజని విశాలకీర్తి నార్జించి సోగాల పరిసర ప్రాంతాలలో తన యోగ విభూతులను విరివిగా వెదజల్లి, సమకాలీన సమాజంలో ఒక అంతర్దృష్టిని రేకెత్తించాడు. ఆయన సమాధి సోగాలలో యిప్పటికీ వుంది. ఆ సమాధికి ప్రదక్షిణాలు చేస్తే అసాధ్య రోగాలు గూడ తగ్గుతాయని

ఆ చుట్టు ప్రక్కలలో యిప్పటికీప్రతీతి. ఆయనే మా తాత. ఆయన పేరే నాకు పెట్టారు. కాని చిత్ర మేమంటే నేను మాత్రం చిన్నప్పటి నుంచీ నాస్తికుణ్ణే. మా తాత కాలానికి నామ మాత్రంగా అయినా మిగిలివున్న రాజత్వం, మా నాన్న కాలానికి జమిందారిత్వానికి దిగజారింది.

అయితే తెల్లదొరల మోచేతి క్రింది అధికారపు నీళ్ళకు కుక్కుర్తి పడటానికి అంగీకరించని మా నాన్న వకీలు వృత్తి స్వీకరించి, న్యాయ ధర్మ పరిరక్షణకు యథాశక్తిగా కృషిచేస్తూ స్వతంత్ర పౌరుడుగా జీవించసాగాడు. అందువల్ల ఆ జమిందారీ గిరి గూడ గాలిలో కలిసిపోయి, జమీను మాత్రం కొంత మిగిలింది. మా నాన్న కీర్తి మాత్రం యెంత ఘనంగా వుండేదంటే, ఫలానా తమ్మణ్ణగారి పిల్లలంటే మా కందరికీ గూడా ఆ చుట్టు పక్కలంతా అఖండ గౌరవంగా వుండేది.

రాచరికం వెనుక తరంలోనే పోయినా, రాచ దర్జాలు మాత్రం తరగని మా నాన్న హయాంలో మా జమీను ( పొలం ) క్రమంగా కర్పూరం కాసాగింది. నేను పెరిగి కాస్త పెద్దవాడినై, నా ఆలోచనలు, నేను చేనుకొనే స్థితికి వచ్చేసరికి, మా కుటుంబ పరిస్థితి, ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోతగా వుంది.

దేశ ప్రజలలో స్వాతంత్ర్య కాంక్ష మిన్నుముట్టి గాంధీజీ నేతృత్వంలో స్వాతంత్ర్య సమరశంఖం, దిక్కులు పిక్కటిల్లే నినాదాలు చేస్తున్న ఉద్విగ్న దినాలవి. రాజకీయ అస్థిరత్వపు గందరగోళంలో యువ హృదయాలు కొట్టుమిట్టాడుతున్న సంకటదినాలవి. దేశీయం అన్న ప్రతి వస్తువుపైనా అకారణమైన ప్రీతి కెరటాలుగా ఎగదన్నుకు వస్తున్న ఉద్రేకపు దినాలవి.

దేశ ప్రాచీనతపైనా, మన దేశీయ సంస్కృతిపైనా, దేశీయ కళలపైనా, అవ్యాజమైన అనురాగం పొంగి పొరలుతున్న ఉద్రూత రోజులవి. ఆ రోజుల్లోనే, ఈ దేశపు చరిత్రలోనే ఆణిముత్యా లనదగిన ధీరోదాత్త మహాపురుషు లెందరో వెలిశారు. వారు వివిధ మార్గాలలో, వివిధ రీతుల్లో, వీరవిహారం చేస్తూ ప్రత్యక్ష పరోక్ష విధానాలలో, స్వాతంత్ర్య సమరానికి ఎప్పటి కప్పుడు కొత్త ఊపిరులు ఊదుతూ ఉండేవారు.

దేశీయతా ఆవేశంలో ఇంత త్యాగం, ఇంత పోరాటం ఒక వంక సాగుతుంటే, కొద్ది మంది ఛాందసులు రాజభక్తి పేరుతో, బ్రిటిషు రాజరికాన్ని సమర్థిస్తూ వుండేవారు. వీరంతా దైవభక్తి పరాయణులే మరి. పరాయి ప్రభుత్వానికి తల వంచనొల్లక స్వతంత్ర జీవనం చేపట్టి, జమీందారు గిరిని కాలదన్నిన మా నాన్న, దేశ స్వాతంత్ర్య కాంక్షను సమర్థించే వాడేగాని, అదేమి చిత్రమో, స్వాతంత్ర్య సమరానికి మాత్రం సుదూర ప్రేక్షకుడిగా నిలిచి పోయేవాడు.

" మనకు చేతనయిన ఉపకారం, తోటివారికి మనం చేస్తే చాలు. అదే గొప్ప దేశసేవ" అనేవాడు మానాన్న. ఇదే నన్ను చాలా ఏళ్ళు ఆలోచనా కల్లోలాలలో ఉద్రూత లూగించింది.

ఆ రోజుల్లో యువవర్గాన్ని కొదమసింహాలుగా చేసి, ఉరుకు లురికించిన ఆ స్వాతంత్ర్య ఝంఝూప్రభంజనం ఒక వంకా, తరతరాలుగా సాగివస్తున్న కుటుంబ మర్యాద మరో వంకా, తాడుకొనలై నన్ను కవ్వం తిప్పినట్టు తిప్పినాయి చాల ఏళ్ళు. ఆ మధనలో నాకు క్రమంగా అమృతం దొరికింది. "ఔను. తోటివారికి చేతనయిన ఉపకారం చేయటమే దేశసేవ" నిజం, అదే నిజం. ఇది దేశసేవ మాత్రమే కాదు, ఇదే భగవత్సేవ. లేని దేవుణ్ణి, రాళ్ళలో వెతకటం మూర్ఖత్వం. ఉన్న చైతన్యాన్ని మన మనుష్యుల్లో మనం గుర్తుంచుకోవటమే దైవత్వానికి మొదటి మెట్టు. దైవం సర్వవ్యాపకంగా వుండనే వుంది. దానికి నీ చెక్క భజనల వల్ల ఒరిగేదేమీ లేదు. ఆ దైవం పేరుతో చెక్క భజనలు చేసి, చేసి ఆ నెపంగా పదిమంది చేత గొప్ప అనిపించుకోవాలనే తపన నికృష్టమైనది. ఎలాగో సర్వత్రా వ్యాపించి వున్న ఆ దివ్యశక్తి తన సంకల్పం ప్రకారం, తను సాగిపోతుంది గాని, నువ్వు తన భజన చేశావని నిన్ను అందలాల కెక్కించదు. అలా యెక్కించేటట్లయితే, ఈ దౌర్భాగ్యపు విదేశీ ప్రభుత్వానికీ, ఆ పరలోక దైవరాజ్యానికి తేడా ఏమీ లేనట్టేగా! కనుక యీ భక్తుల మనుకొని విర్రవీగే రాళ్ళ భక్తులంతా చాలా మటుకు దొంగలు, కాకుంటే వెర్రివాళ్ళు, ఆ దారి మనకు వద్దు.

మానవుడి చైతన్యంలో దివ్య చైతన్యాన్ని గుర్తించి ఆరాధించే నిష్కల్మష భక్తే అసలైన భక్తి. అదే మనకు కావాలి. మానవరూప దైవానికి మనం చేసే ఉపకారమే అర్చన. అంతేగాని, దేవుడి నెత్తిన చారెడు అక్షింతలు పోస్తే అయన కళ్ళల్లో దూగర పడటమే కాని దీనిలో పూజ ఏముంది ? ఆ మాటకొస్తే, ఉపకారం మాట దేవుడెరుగు, ప్రక్కవారి శ్రమ దోచుకోకుండా వుంటే అదే చాలు. ఇతరుల శ్రమకు నీవు దోపిడీగాడవు కాకూడదు అనుకుంటే; నువ్వు స్వయంగా శ్రమించి బతకాలి. నీ శ్రమనే నువ్వు తినగలగాలి. చేతయితే నీ శ్రమను నీ పక్కవాడికి పంచాలి. ఇదీ అర్చన, ఇదీ ఆరాధన, ఇదీ భక్తి. ఇదీ నాకు దొరికిన అమృతం.

అయితే ఈ అమృతం నాకు పూర్తిగా దొరికేసరికి అప్పటికి నాకు ముగ్గురో నలుగురో పిల్లలు. మా అమ్మ, నాన్న వృద్ధులు. మా అన్న లిద్దరూ చెన్నపట్టణంలో స్థిరపడి పోయారు. అనుకున్న మంచిని ఆచరణలో పెట్టటం నాకు మా అమ్మ ఉగ్గుపాలతో నేర్పిన విద్య. అందువల్లే అంతవరకూ బాధ్యతారహితుడని పేరు పొందిన నేను ఉన్నట్టుండి వ్యవసాయ దారుడుగా మారిపోయాను.

చిన్నప్పటినుంచీ నాకు చదువు మీద కన్నా వ్యవసాయం మీదే మక్కువ ఎక్కువ కనుక, దానిలోని మెలుకువలు నాకు అప్పటికే బాగా తెలుసు. కానీ తీరా నేను గట్టిగా నడుం కట్టి పొలంలోకి దిగేసరికి, మా పొలం నాలుగైదు ఎకరాలకన్నా ఎక్కువ మిగలలేదు. మిగిలినదంతా అప్పటికే హరించుకు పోయింది. ఆ కాస్త పొలంతో, సోగాలలో, మా

కుటుంబపు దర్జాకు అనుగుణంగా బ్రతకటం క్రమంగా కష్టమైంది. ఇంట్లో జరగడం కష్టంగా వున్నా, వార్షికంగా యిచ్చే దానాలూ ధర్మాలూ మానటం మా నాన్నకు చేతయ్యేది కాదు. నాకూ చేతయ్యేది కాదు. చెన్నపట్టణంలో కొద్దిపాటి స్థితిమంతుల కుటుంబంలోంచి వచ్చిన మా అమ్మమ్మకు ఈ పద్ధతి నచ్చేది కాదు. దానివల్ల ఇంట్లో కొంత గందరగోళంగా వుండేది. ఇలా రోజులు జరుగుతూ వుండగా, అప్పటికి నాకు యించుమించు నలభై యేళ్ళు వచ్చినాయి. పిల్లలు పెద్దవాళ్ళు అవుతున్నారు.

పుట్టు గౌరమ్మ నా పెద్దకూతురు. దాని తరువాతది శారదమ్మ. వాళ్ళిద్దరికీ అప్పటికి పెళ్ళిళ్లు చేసేశాను. ఆ పైవాడు మా కృష్ణప్ప. వాడు S. S L. C. తప్పి యింట్లో కూర్చుని వున్నాడు. తరువాతది ఓూ అమ్మ జయలక్ష్మి. దాని కప్పటికి పదిహేను ఏళ్ళు వుంటాయి. దానికన్న వో మూడేళ్ళో నాలుగేళ్ళో చిన్నది పార్వతి. వారిద్దరికీ మధ్య సీత. ఆ సీత యిప్పుడు లేదులే.

ఇంత సంసారంతో ఈ కొద్ది పొలంతో ఈదటం ఇక అసాధ్య మనిపించింది. అదీగాక నాకున్న వ్యవసాయం ఉత్సాహానికి ఆ పొలం మరీ చిన్నదిగావుంది. దాంతో ఇక, ఎక్కడయినా తక్కువ ధరకు మంచి పొలాలు దొరుకుతాయా అని విచారించసాగాను. త్వరలోనే నా దృష్టి మేకేదాటు సంగమం పొలాల మీద పడ్డది. మేకేదాటు బెంగుళూరు దగ్గరలో కనకపుర తాలూకాలో వుంది. అక్కడ జలసమృద్ధి వుంది. ఇతరుల పోటీ తక్కువ. భయం తక్కువ. కొంచెం అడవులయితేనేం అనిపించింది.

చిత్రం, ఈ వివరాలు విని మీ అమ్మమ్మ గూడ అక్కడికి మకాం మార్చటానికి వెంటనే అంగీకరించింది.

బంధువులంతా వ్యతిరేకించారు. కాని నా కది పెద్ద విషయం కాదు. రోజుల్లోనే మా సోగాల పొలం అమ్మేసి సంగమంలో పది ఎకరాల పొలం కొన్నాను. 1936 లో నేనూ, మీ అమ్మమ్మా, నలుగురు పిల్లలతో మేకేదాటు చేరాము. కొన్ని తరాలుగా సొగాలలో మా వంశీకు లున్న యిల్లు మాత్రం అమ్మబుద్ధికాక, తెలిసిన వాళ్ళొకరు అడిగితే యిచ్చేశాను. అప్పటికే మూడు నాలుగు, యిళ్ళు కట్టించి ఆశ్రితులయిన వాళ్ళకు యిచ్చాను సోగాలలో. ' వాటితో పాటు యిదీను, పోనీండి ' అంది మీ అమ్మమ్మ గూడా.

ఎడ్లబళ్ళ మీద సంగమంలో దిగి పూరి గుడిసెలో కాపురం పెట్టిన మీ అమ్మమ్మ, కారడవిలో కాపరమని యేనాడూ భయపడలేదు గాని, బ్రాహ్మణ పొరుగు లేదని మాత్రం బాధ పడుతూ వుండేది.

అయితే ఆ చింత రెండు కారణాల వల్ల త్వరలోనే తగ్గి పోసాగింది. ఆ రెండు కారణాలూ బోధ పడాలంటే ఆ రోజుల్లో ఆ సంగమ క్షేత్రం యెలా వుండేదో మీకు కొంత వివరించాలి మరి.

ఆ వూరు మాకు తెలుసులే అనుకోకండి. మీరు కళ్ళు తెరిచే నాటికి అది, బస్సుల రాక పోకలు, రవ్వంత తీర్థ యాత్రీకుల సందడి, అడపా దడపా గవర్నమెంటు వారి లారీ రాకలు, వున్న చిన్న కుగ్రామం. మేము అక్కడ కాలు పెట్టేనాటికి అది కేవలం చీమలు దూరని చిట్టడవి, కాకులు దూరని కారడవీను.

ఆ చీమల కన్న చీమలమై, ఆ కాకులకన్న కాకులమై ఆ ఘోరాటవిలో నిర్భయంగా ఎలా ప్రవేశించామా అని యివాళ, నా మటుక్కు నాకే ఆశ్చర్యంగా వుంటుంది.

అప్పటికది పూర్తిగా, కోయ లంబాడీల స్వాధీనంలో వున్న కీకారణ్యం. విచ్చలవిడిగా తిరిగే అడవి ఏనుగులు విరిచి పారేసిన పెద్ద మానులను పోగేసుకొని, కాల్చి బొగ్గుచేసి, ఆ బొగ్గులు దగ్గరలో వున్న పల్లెలలో అమ్ముకోవటం ఆ లంబాడీల ప్రధాన వృత్తి. అక్కడక్కడ, సహజ సిద్ధంగా వున్న చదును ప్రదేశాల్లో ఏ రాగులో వేసేవాళ్ళు. ఏనుగులు పడి తొక్కకుండా ఆ చేలకు రాత్రిళ్ళు నిప్పుల మంటలు వేసికొని, పగలు డప్పుల మోతలు పెట్టుకొని నెలల తరబడి కాపలా కాసేవారు.

అంత తీవ్రం కాదుగాని, చిరుత పులుల భయం గూడ లేకపోలేదు. అడవి అన్నాక, పాము భయం లేకుండా వుండటం అసంభవమే కదా!

అయితే ఆ ప్రదేశం మాత్రం మంచి ఆరోగ్యకరమైన ప్రదేశం. అడవి దోమలు గాని, అడవి ఈగలు గాని, మన్యపు రోగాలుగాని లే వక్కడ. మరో విశేషమేమిటంటే అక్కడ లంబాడీలు సాధువులు, స్నేహశీలురూను.

అక్కడకు మేము చేరే రోజుకి, అర్కావతీ నది ఒడ్డున సంగమేశ్వరస్వామి గుడికి దగ్గరలో ఒక దిబ్బమీద ఒక మంచి పాక వేయించాను నేను. మా కుటుంబం అక్కడ దిగటం చూసి, ఆ లంబాడీలు ఆ రోజుల్లో చిన్న డప్పుల ఉత్సవం చేశారు. ఆ ఉత్సవం ముగిసినాక ఒక లంబాడీ వృద్ధుడు మమ్మల్నందరినీ కూచోబెట్టి మే మింతకు ముందు ఊహించని విశేషాలు, జాగర్తలు కొన్ని చెప్పాడు.

నాకు తెలిసినంతలో అక్కడ అర్కావతీ, కావేరీ నదులు సంగమిస్తున్నాయి. ఇవిగాక, గుప్తగామిని అని మరో నది భూగర్భంలో ప్రవహిస్తూ అక్కడ సంగమిస్తోందనీ, అందువల్ల ఆ క్షేత్రం త్రివేణీ సంగమమనీ అతను చెప్పాడు.

నేను నవ్వేసి వూరుకున్నాను.

ఆ ప్రాంతాలలో మహాద్భుత శక్తిసంపన్నుడైన మహర్షి ఒకరు నివసిస్తూ ఉంటాడట. ఆయన తీవ్ర కోపిష్టిట. ఆయన పెద్ద నిప్పుమంటల్లే ప్రకాశిస్తూ వుంటాడట. అర్ధరాత్రాల్లో సంగమ ప్రదేశంలో తేజోరూపంలో ఆకాశమార్గంలో విహరిస్తూ వుంటాడట. ఆ తేజస్సు ఒకసారి మబ్బుతెరలాగ, పల్లకీలాగ, పొగలాగా ఉయ్యాలలాగా గూడ కనిపిస్తూ వుంటుందిట.

ముఖ్యంగా నిండు పున్నమి అర్ధరాత్రిని ఆ ప్రదేశంలో తప్పక తిరుగుతాడట. ఆయన వచ్చే సమయానికి ఎవరూ ఆయనవంక తేరిపార చూడటంగాని, శబ్దం చెయ్యటంగాని, వెంబడించటం గాని చేస్తే, అది తనకు అవమానంగా భావించి ఆయన ఘోరంగా శపిస్తాడట! ఆయన శాపంవల్ల కళ్ళు పోయిన వారు. నాలుక పూడిపోయిన వారూ, పక్షవాతం వచ్చినవారూ, చివరకు ప్రాణాలు పోయిన వాళ్ళు గూడా వున్నారట. కనుక అర్ధరాత్రి దాటాక ఎట్టి పరిస్థితుల్లోనూ ఎవరూ ఇల్లు దాటి బయటకు రారాదుట. ఈ విషయం చెపుతున్నప్పుడు ఆ లంబాడీ వృద్ధుడు నిజంగానే భయంతో వణికిపోతూ మరీ చెప్పాడు.

ఈ మాట వింటూనే "ఇది కొరివి దయ్యాల వల్లకాడు కాబోలండీ" అంది మీ అమ్మమ్మ భయంతో బిగిసిపోతూ. కాని ఆ తరువాత లంబాడీ తాత, తన కథనాన్ని కొనసాగించాడు. ఆయన ఋషీశ్వరుడే గాని దయ్యం కాదని తరతరాలుగా రుజవయిందట. నిజమైన కష్టంలో వుండి, ఆయన వచ్చే సమయానికి ఒదిగి పక్కగా నిలిచి కళ్ళు మూసుకొని చేతులు జోడించి ప్రార్థించిన వారికి వెంటనే కష్టాలు నివారణ అవుతాయట. ఇదొక వెర్రి అనిపించింది నాకు. తాత చెప్పుకు పోతూనే వున్నాడు.

అయితే కొందరు పెద్ద యోగీశ్వరులు, ఉపాసకులు మాత్రం అడపాదడపా అక్కడకు వచ్చి కొన్నాళ్ళు అక్కడే పడివుండి, జపతపాలు చేసుకొంటూ నిరాహారంగా వుండిపోతారట. అలాంటి యోగులు వచ్చిన రోజుల్లో ఏనుగుల బెడద తక్కువగా వుంటుందట. ఆ ఉపాసకులు కొన్నాళ్ళయిన తరువాత వాళ్ళంతట వాళ్ళే వెళ్ళిపోతారట. అలా వెళ్ళేవాళ్ళల్లో కొందరు 'మాకు ఋషీశ్వరుడి దర్శనమైంది, జన్మ తరించింది' అని యీ తాతతో చెప్పారట.

ఇది విని నేను కొంత ఆలోచనలో పడ్డాను. ఋషీశ్వరుడి కథ విన్నాక మీ అమ్మమ్మ మాత్రం చాలా సంతోష పడిపోయింది. క్రమక్రమంగా ఆ ఋషీశ్వరుడి గురించీ, ఆయన కోసం వచ్చే యోగుల గురించీ లంబాడీ వృద్ధుల వల్ల మాకు రోజు రోజుకీ, వింత విశేషాలు తెలుస్తూనే వుండేవి. ఆ కథల్లో వున్న సత్యాసత్యాల పట్ల నాకు పెద్ద శ్రద్ధ లేదు కానీ, ఆ కథల వల్ల నాకు రెండు ఉపకారాలు జరిగాయి.

మొదటిది: ఈ కథాపరంపరలు క్రమంగా మీ అమ్మమ్మకీ, ఆ చెంచు కుటుంబాలకీ మైత్రిని పెంచాయి. దానివల్ల-నా కుటుంబానికి క్షేమం పెరిగింది. రెండోది: అది మహాక్షేత్ర మనే నమ్మకం పెరిగి మీ అమ్మమ్మ అక్కడ సంతోషంగా గడపసాగింది. దీనివల్ల నాకు కుటుంబంలో శాంతి పెరిగింది. ఈ రెండు ఉపకారాలూ నా కా ఋషీశ్వరుడివల్ల పరోక్షంగా లభించా యనిపించి లోలోపల నవ్వుకొంటూ వుండేవాడిని. ఇంతకూ మీ అమ్మమ్మ చింత తీరిపోవటానికి గల రెండు కారణాలలో మొదటిది అది ఋషీశ్వర క్షేత్రమని నమ్మకం కుదరటం. అలా ఆ వన్యజీవుల స్నేహంతోనే మా అరణ్యవాసం ప్రారంభమైంది.

ఇప్పుడు మీరు సంగమంలో చూస్తున్న ఆ సంగమేశ్వరాలయం అప్పుడు గూడ అలాగే కునికిపాట్లు పడుతూనే వుండేది. దొడ్డాళ్లి నుంచి అర్చకుడు వారాని కొకసారి వచ్చేవాడు.

నాగరిక జీవుల కోసం మొహం వాచి వున్న మీ అమ్మమ్మ ఆయన వచ్చి గుడిలో అభిషేకం చేసే రోజు కోసం కాచుకొని వుండి, వెళ్ళి ఆదరంగా పలకరించింది. ఈవిడ వె[్రిబాగుల వాగుడు వల్ల తొలి పలుకుల్లోనే మనం బ్రాహ్మణులమని గ్రహించిన, ఆ అర్చక స్వామి మొహం మటమట లాడించి కసురుకొని వూరుకున్నాడట. ఇది విని నేను కొంచెం ఆశ్చర్యపడి విషయమేమిటా అని విచారిస్తే, ఆ అర్చకస్వామి లింగాయతుడని, వీరశైవాచార పరాయణుడనీ తెలిసింది.

నా గుండెలో కెలికినట్లయింది. మానవత్వానికే అలంకార మనదగిన మహాత్ముడు బసవేశ్వరుడు తాను ప్రచారం చేసిన శివధర్మానికి సంక్రమించిన ఈ వికృతరూపాన్ని చూసి కైలాసంలో ఎంత కుమిలిపోతున్నాడో అనిపించింది. అడవి గొడ్లకు అన్నదమ్ములుగా పెరిగిన ఈ చెంచులకున్న సహజ మానవ సంస్కారం గూడా లోపించినాక ఇక నాగరికతకు అర్థమేమిటి, ప్రయోజన మేమిటని గుండె లోతులలో కళవళపడ్డాను. ఇది దోషం అని నే ననుకుంటున్నాను గనుక, ఈ దోషం నాలో ప్రవేశించకుండా చూచుకోటం నాకు ముఖ్యం. ఇతరులలో ఈ దోషం ఎందుకు ప్రవేశించిందనే చర్చ నా కెందుకులెద్దూ, అనుకొని ఇక ఆ విచారం నేను వొదిలేశాను.

ఔను మరి! అంతకన్న ఆలోచించేందుకు తీరికేది? అక్కడికి చేరిన దగ్గరనుంచీ నూతన వ్యవసాయ పద్ధతుల గురించీ, ఆ ప్రాంతంలో గల వెసులుబాటుల గురించీ పరిశోధించటం, నూతన ప్రయోగాలకు సన్నాహాలు చేసుకోవటంలో నా తల మునకలై వుంది. అక్కడికి చేరిన కొత్తల్లో నేను ఎందుకైనా మంచిదని లైసెన్సు తుపాకీ ఒకటి సంపాదించి యింట్లో అట్టి పెట్టాను. చిన్నప్పు డెప్పుడో మరచిపోయిన గుర్రపు స్వారీని మళ్ళీ కొంత స్వాధీనం చేశాను. కొండ దారుల్లో విస్తారంగా పర్యటించి, అడవి ఏనుగుల ప్రధాన సంచార మార్గాలు కనిపెట్టాను. చిరుతల పొదలూ, గుహలూ గుర్తించాను. కొండ గుట్టల నడుమ ఉన్న సమతల ప్రదేశాలను అన్వేషించాను. వాటికి నదీ జలాలను అందించ గల మార్గాలను పరిశీలించాను. ఉత్సాహవంతులైన చెంచు యువకుల సహాయ సహకారాలవల్ల ఇప్పటి రోజులలో ఒక సర్కారు వార సర్వే కమీషను నిర్వహించ దగినంత పని ఆ రోజుల్లోనే నొకడనే నిర్వహించాను.

చెట్లు దట్టంగా వున్న ప్రాంతాలలోనే, ఏనుగులు ఎక్కువ సంచరిస్తాయని తెలుసుకున్నాను. వాటికి దాహం వేసే వేళలేవో, అవి నీళ్ళు త్రాగే రేవు లేవో తెలుసుకున్నాను. ఇంత తెలుసుకున్నాక, ఏనుగులు చెట్లు విరిచే దాకా ఆగక, నేనే సమతల ప్రదేశాల్లో చెట్లను గూడ ఉమ్మడిగా నరికించి పెద్ద యెత్తున బొగ్గు బట్టీ పెట్టించాను. దాంతో మా బొగ్గు వ్యాపారం ఆ సంవత్సరం పదింత లయింది.

మాకు సంవత్సరానికి సాగు చేయదగ్గ కొత్త బీళ్ళు దొరికినట్టయింది. నాకున్న పది ఎకరాలు కాక మరో పదిహేను ఎకరాలు కవుబుకు తీసికొని బీళ్ళను సాగు చేయసాగాను. చెట్ల గుంపులు తగ్గటంవల్ల ఏనుగుల రద్దీ కొంత తగ్గసాగింది. క్రమంగా నా వ్యవసాయం మాత్రమే గాక నా చెంచు సోదరుల వ్యవసాయం గూడా పెరిగింది. చెంచు సోదరులకు నా మీద ఆదరాభిమానాలు అమితంగా పెరగసాగాయి.

ఒకరోజు రాత్రి పొలంలో కాపలా కాస్తున్న సమయంలో నా పక్కనున్న చెంచు తాత ఉన్నట్టుండి మండుతున్న సెగడు కట్టెలు చెల్లా చెదరు చేసి మంట చల్లార్పేసి, బిగిసిపోయి కళ్ళు మూసుకొని నుంచున్నాడు. అప్పుడు గుర్తు కొచ్చింది అది పున్నమి రాత్రి అని.

ఆ ఋషీశ్వరుడు వచ్చే సమయానికి అడవి జంతువులు గూడ సౌమ్యంగా ఒదిగి నిలబడి పోతాయని చెంచు లంటారు. నే నయితే అలాంటి దృశ్యం ఎప్పుడూ చూడలేదు. ఇప్పుడు నేనేమి చెయ్యటమా అని ఆలోచిస్తూ అలాగే కొద్ది నిముషాలసేపు అప్రయత్నంగానే కళ్ళు మూసుకుని నిలబడిపోయాను. ఆ రెండు నిముషాలూ మనస్సు ఏదో అనిర్వచనీయమైన ప్రశాంతిని అనుభవించి నట్టయింది. అంతే, ఆ భావం సముద్రంలో ఒక అల సాగి విరిగి పోయినట్టు పోయింది.

అప్రయత్నంగానే కళ్ళు తెరచి చూశాను. నది మీదుగా సరిగా సంగమ స్థానంలో ఒక చిన్న మబ్బుతునక వంటి ఆకారం గాలిలో తేలుతూ వెళ్ళిపోతోంది. ఆ ఆకారం ఏటికి అద్దరిని గల మన యింటివేపు వెళుతూ కనిపించింది. కానీ యేరు దాటిన కొద్ది సేపటికే ఆ ఆకారం పూర్తిగా మాయమయి పోయింది. ఆ రోజు నుంచీ ఎందుకో నాకు తెలియదు గాని, ఆ ఋషీశ్వరుడంటే నాకు భయం పోయింది. పైగా ఒక విచిత్రమైన అభిమానం ఏర్పడింది. అది భక్తిగాదు, గౌరవమూ కాదు. ఈయన మంచివాడు అనే ఒక అకారణమైన భావం. అంతమాత్రమే.

క్రమంగా నాకు వ్యవసాయంతో పాటు, బొగ్గు సాగుమీద ఆసక్తి పెరిగింది. ఈ బొగ్గు సాగువల్ల నాకంటె నా చెంచు సోదరులకు లాభం ఎక్కువ వుంటుంది. అందుకోసమని నే నీ పనిమీద ఎక్కువ శ్రద్ధ తీసుకొనేవాడిని. అయితే దీని కోసం అడవిలో దూర ప్రాంతాలకు తిరగవలసి వస్తూ వుండేది. అవన్నీ కాలినడకను తిరగవలసిన చోట్లు కావటంవల్ల చీకటి పడేసరికి యీదరిని సంగమేశ్వరాలయం దగ్గరున్న మన యింటికి చేరటం కష్టంగా వుండేది. రాత్రిళ్ళు అడవిలోనే కాలక్షేపం చేయటం నాకంత కష్టమయిన పని కాదు గాని యింట్లో మీ అమ్మమ్మకు దిగులై క్రమంగా అది అనారోగ్యంలోకి దిగసాగింది. దానితో నేను ఏటికి అద్దరిని గూడ రెండు మూడు చోట్ల పాకలు వేయించి నా బొగ్గు సాగుకు దగ్గరలో వుండే టట్లుగా నా కాపరాన్ని పిల్లి కాపరం లాగా మారుస్తూ ఉండేవాణ్ణి.

నా వ్యవసాయపు పనుల్లో మీ మావయ్య, అదే కృష్ణప్ప సహాయం చేస్తానని వస్తూ వుండేవాడు కానీ, వాడి ఆలోచన అతి ఆలోచన, తెలివి అతి తెలివి అవటంవల్ల ఏదో నష్టం చేస్తూ వుండేవాడు. ఏమయినా అడవిలో అర్ధరాత్రయినా సరే నిర్భయంగా, నిశ్చింతగా తిరిగి, పొలాలకు మాత్రం చక్కగా కాపలా కాచేవాడు.

మేము సంగమానికి వచ్చిన ఏడాదీ, ఏణ్ణర్ధంలోనే, అదేమి చిత్రమో అక్కడికి వచ్చే యోగుల సంఖ్య గూడ కొద్దిగా పెరిగింది. వాళ్ళల్లో కొందరు బహు విచిత్రమైన పద్ధతుల్లో వుండే వారు. కొందరు వికృతాకారులుగా వుండేవారు. కొందరు దిగంబరులుగా వుండేవారు. కొందరు దీర్ఘమైన జడలతో వుండేవారు. కొందరు నాలుకలకు కత్తులు గుచ్చుకొని ఉండేవారు. ఇలా అనేక విచిత్రాలుగా వుండేవారు.

అంతకు ముందు దాకా సంగమానికి వచ్చిన యోగులంతా ఎన్నాళ్ళున్నా ఉపవాసం వుండిపోవటమే మామూలట. కాని మే మక్కడ కాపరం పెట్టిన దగ్గర నుంచీ, వాళ్ళు వెళ్ళే లోగా, కనీసం ఒక రోజయినా మనింటి కొచ్చి అడిగి అన్నం పెట్టించుకొని తిని వెళ్ళేవారు.

" మీరు బ్రాహ్మలు కదండీ అందుకనే మీ యింట్లో అయితే ఆచారం సరిపోతుందని అన్నం తింటున్నారు " అనేవారు చెంచుమిత్రులు.

" ఏమయితేనేమి, ఎవరో ఒక జీవి వచ్చి యింత అన్నం తినిపోతే మనకే మంచిది " అనుకొని సంతోషించే వాణ్ణి నేను. ఇంతమంది మహాత్ములకు అన్నం వండి పెట్టుతున్నాను గదా అని సంబర పడిపోతూ వుండేది మీ అమ్మమ్మ. ఆవిడ చింత తీరిపోవటానికి, రెండు కారణాలని చెప్పానే, ఆ రెండో కారణం యిది.

ఇలా క్రమంగా రెండు మూడేళ్ళు గడిచేసరికి మా పుట్టుకి, అదే మా జయలక్ష్మికి ( దాన్ని చిన్నపుడు ముద్దుగా పుట్టు అని పిల్చేవాణ్ణిలే నేను ) అడవంతా కొట్టిన పిండి అయిపోయింది. నేను వూళ్ళో లేకుండా చూసి గుర్రపు స్వారీ గూడ చేసేది. ఏనుగు లొస్తున్నా యంటే డప్పు చేత పుచ్చుకొని ఒక్కర్తే ఎదురు వెళ్ళేది. ఒకోసారి యింట్లో వున్న తుపాకీ గూడ బుజానికి తగిలించుకొని వెళ్ళేది. అయితే ఎప్పుడూ ఆ తుపాకీ ఉపయోగించ లేదు. మా పుట్టు హిందీ, ఇంగ్లీషు గూడా మాట్లాడేస్తూ వుండటం నాకు చాల ఆశ్చర్యంగా వుండేది.

ఆ సరికి దానికి పద్దెనిమిది ఏళ్ళు వుండవచ్చు. అమాయకపు తూనీగల్లే అడవంతా రివ్వున తిరిగేది. అదిగాక అక్కడికి వచ్చే యోగులూ బైరాగులూ వగైరాలంతా ఒక్కసారన్నా దాన్ని పలకరించకుండా వెళ్ళేవారు కాదు. అది నాకు గిట్టేది కాదు. ఈ బైరాగుల్లో కొందరు మోసగాళ్ళు వుండవచ్చు. కొందరు వామాచారు లుండవచ్చు. కొందరు క్షుద్రోపాసకు లుండవచ్చు. వీళ్ళతో మన కెందుకు ? యింత అన్నం పెట్టి పంపించటం తప్పితే మరో సంబంధం వారితో మనకు వుండరాదు, అదీ నా భావం.

అందుకే ఆ విషయంలో దాన్ని గట్టిగా మందలించాను. అది చాలక మా కృష్ణప్పతో చెప్పాను. "ఒరేయ్? ఇది ఆ బైరాగుల్తో పిచ్చాపాటీ చెప్పకుండా కాస్త చూస్తూ వుండరా అని. అసలే వాడికి దైవం అంటే గిట్టేది కాదు. ఇప్పుడు కొంచెం మారాడులే. ఈ బైరాగులూ వగైరాలంటే అసలే కంటగింపుగా వుండేది వాడికి. ఇక వాడికి అధికార మిచ్చానేమో, ఆ బైరాగుల్ని దాంతో మాట్లాడ నిచ్చేవాడు కాదు. నిత్యం యమదూత మల్లే కాపలా వుండేవాడు.

దానికి పది, పన్నెండేళ్ళప్పటి నుంచే కొన్ని విచిత్రమైన అలవాట్లు వుండేవి. ఇంట్లో చూర్లో ఒక కొండరాతి ముక్క దాచుకొనేది. రోజూ పొద్దున్నే స్నానం చేయగానే ఆ రాయి తీసుకుని దానిమీద నాముసుద్దతో గణపతి బొమ్మ ఒకటి గీసేది. దాన్ని తులసమ్మ దగ్గర పెట్టి పూజించేది. ఆ పూజ అయిన తరువాత చాలసేపు శ్రమపడి బుట్టెడు తుమ్మిపూలు కోసేది. కోస్తున్నంతసేపూ నోట్లో ఏదో గొణుక్కునేది. ఎవరితోనూ మాట్లాడేది కాదు. ఆ తుమ్మి పూలన్నీ పెద్ద మాలగా కట్టి పోయి గుళ్ళో సంగమేశ్వరుడికి ఆ దండ వేసేది. వేసి ఒక అయిదో పదో నిముషాలు కళ్ళు మూసుకొని కూర్చునేది గుళ్ళో. తరువాత ఇహ కొండలో పడి తిరిగేది కొంతసేపు. అదేమిటే అంటే, "ఆ ప్రకృతి దృశ్యాలు చూస్తుంటే ఒళ్ళు తేలిపోతున్నట్టు ఉంటుంది నాన్నా" అనేది.

అలా తిరిగి తిరిగియింటికి వచ్చినాక యింటినబడి ఏవేవో అపూర్వమైన పాటలు పాడేది. దానికన్ని పాట లెలా వచ్చో, ఆ రాగా లెవరు నేర్పారో అంతుబట్టేది కాదు. వాటిల్లో చాలా పాటలు తనే రాశాననేది. ఆ పాటల్లో చాలా మటుకు భక్తుల చరిత్రలు వుండేవి. వీలు చిక్కినపుడల్లా ఆ పర్వతాల ప్రకృతి సౌందర్యాన్ని ఆ పాటల్లో విరివిగా వర్ణించేది. దాని తెలివికి తగ్గ చదువు చెప్పించలేక పోయానని నేను తరచు బాధపడుతూ వుండేవాడిని.

కొండలోయలో ప్రవహిస్తున్న కావేరీ నదిని నరసింహస్వామి ఒడిలో చిరునవ్వులు చిందిస్తున్న చెంచులక్ష్మితో పోలుస్తూ ఒక రోజు సంజెవేళ ఒక పాట పాడింది మా పుట్టు. ఆ పాట, ఆ రాగం విన్నాక నా కెందుకో మనసు కల్లోలమైపోయింది.

ఏ రవీంద్రనాథఠాగుర్ లాగానో కలవారి యింట పుట్టివుంటే, యిది గొప్ప కవియై లోకంలో రాణించి వుండేది. నా దరిద్రపు కడుపున పుట్టబట్టి దీని ప్రతిభంతా నిజంగా అడవి కాచిన వెన్నె లయిపోతోంది' అని మనసులో గింగిరాలుగా భావాలు సుడులు తిరిగి రాత్రి సరిగా నిద్రపట్టలేదు.

అడవి కాపరంలో రెండో కాలక్షేపం ఏముంటుంది? గూట్లో దీపం, నోట్లో ముద్దగా వుండేది మా పని. అదయినాక పంట వుంటే కాపలాకి పొలానికి పోవటం, లేదంటే యింట్లోనే కుక్కిమంచంలో వాలటం. నా కా రోజుల్లో రాత్రి పూట వేరే వ్యాపకం లేదు. అందుచేత ఝాము పొద్దునే నిద్దర పట్టకపోతే రాత్రల్లా జాగారం చేసినట్లుగా వుండేది నాకు.

## సంగమ క్షేత్రం

అలాగే ఒక రోజు నిద్దర పట్టక గుంజాటన పడుతున్న సమయంలో, మెల్లిగా మా పుట్టు నా దగ్గర చేరి కబుర్లు సాగించింది.

"నాన్నా! గమనించావో లేదో, మన క్షేత్రం సామాన్యమైంది కాదు. చూశావు గదా మన వూరికి మూడు పక్కలా మూడు కొండలు ఒకదాన్ని ఒకటి వొరుసుకొని ఒక చక్కని త్రిభుజంగా ఏర్పడ్డాయి.

ఇందులో దక్షిణ భాగపు భుజంమీదకు ఎక్కి, లోపలికి దిగి ఈ త్రిభుజం మధ్య క్షేత్రంలోకి ప్రవేశిస్తున్నాం మనం. ఈ త్రిభుజానికి సరీగా మధ్య బిందువులో మూడు నదులు సంగమిస్తూ వున్నాయి. వేసంగిలో గాలులు బిగదీసి, కావేరి అర్కావతులు రెండూ నిశ్చలంగా వున్నపుడు దృష్టి కేంద్రీకరించి వింటే గుప్తగామిని పారుదల సవ్వడి వినవచ్చు మనం. ఈ బిందు త్రికోణ సన్నివేశం వల్ల ఇది ప్రకృతి సిద్ధమైన శ్రీచక్ర స్థానమవుతోంది.

త్రిపర్వత, త్రినదీ సంగమ మవటంవల్ల ఇది త్రిమూర్తి క్షేత్రం గూడా అవుతోంది. అందువల్లే ఆ త్రిమూర్తి ఋషీశ్వర రూపంలో యిక్కడ సంచరిస్తున్నాడు.

పశ్చిమ ఉత్తర భాగాలలో వున్న, రెండు కొండల మధ్య ఒక తూములాంటి లోయ యేర్పడి వుంది. ఆ తూములోంచి కావేరీనది పూర్వవాహినిగా సాగిపోతోంది. ఈ తూము వెంబడి ముందుకు వెళ్ళిన కొద్దీ రెండు పక్కలా కొండచరియలు పెనుతాళ్ళలాగ పైకి ఎదిగిపోతూ వుంటాయి. అలా సుమారొక మైలు లోపలికి పోయి పర్వతాగ్రాన నిలిచి మూడు తాళ్ళ లోతున లోయలో నెమ్మదిగా సాగిపోతున్న నదిని చూస్తే శ్రీ శైలపు పాతాళగంగ గుర్తుకు వస్తుంది. అక్కడ కొంచెం నిలబడి, నిదానించి చూస్తే నదికి దక్షిణపు పక్కన ఉన్న కొండగోడలో పెద్ద గిట్టలవంటి రంధ్రాలు కొన్ని కనిపిస్తాయి. అవి మేకగిట్టలట! వాటి వల్లే మన వూరికి " మేకదాటు " అని పేరు వచ్చిందట. విన్నావా నాన్నా?

ఆ ప్రదేశాలలో దక్షిణపు కొండమీద కృతయుగంలో అత్రి మొదలైన బ్రహ్మర్షులు కొందరు బ్రహ్మసత్రమనే యజ్ఞం చేశారట. ఆ సమయంలో చాంగలుడనే గంధర్వు డొకడు శాపవశాన రాక్షసుడై ఆ ప్రాంతాలలో తిరుగుతూ వుండేవాడుట. వాడు ఆ యజ్ఞాన్ని చెడగొట్టదలచుకొని, ఒక పెద్ద మేక రూపంలో ఉత్తర దిక్కునుంచి పరిగెత్తుకొచ్చి దక్షిణపు వైపుకు ఒక్క దూకు దూకాడట. మేకగా వస్తే తన్నెవరూ గుర్తించరని వాడి వూహ. కాని ఈలోగా అది గమనించిన బ్రహ్మర్షులు కమండలోదకం చల్లగా ఆ మేక మధ్యలోనే ఉత్తరపు గట్టుమీద పడి చనిపోయిందట. అలా పడేటప్పుడు ఆ రాక్షసి మేక కాళ్ళు పొడుచుకొని, ఆ కొండలో మేకకాళ్ళ గుర్తు గల రంధ్రా-లేర్పడి నాయట. ఆ మేక దాటినందు వల్లే యీ

ప్రాంతానికి "మేకదాటు" అనే పేరు గూడ ఏర్పడిందట. అలా పడిపోయిన ఆ మేక శరీరం, అక్కడె ప్రవాహంలో పడేసరికి దాని పాపాలు పటాపంచలై దైవత్వాన్ని పొందిందట. అలా చాంగలుడికి శాప విమోచనం లభించింది.

సహజ పవిత్రమైన ఆ కావేరీ ఘట్టం బ్రహ్మఋషుల బ్రహ్మసత్ర యజ్ఞప్రభావం వల్ల బ్రహ్మకుండమని పేరు పొందింది. కొండ పైనించి చూచినపుడు అది ఒక అద్వితీయమైన కుండంలాగా కనిపిస్తుంది కనుక దానికి బ్రహ్మకుండమని సార్థక నామమైంది. ప్రమాదకరమైన ఆ బ్రహ్మకుండంలో స్నానం చేయగలిగితే అది దైవత్వాన్ని కలిగిస్తుంది నాన్నా ! ఇక్కడ నిత్యమూ గజసమూహాల సంచారం వుండటంవల్ల ఈ స్థలం గణపతి దేవుడికి ప్రతిపాత్రమైంది. ఇక్కడ దిక్కూ మొక్కూ లేకుండా పడివున్న ఈ సంగమేశ్వరుడు ముల్లోకాలకు అసలైన దిక్కు. ఈయన ఆరోగ్యదాత కావటంవల్ల ఈయన్ను వైద్యనాథేశ్వరు డని గూడ యోగులు పిలుస్తారు. గణపతినీ, త్రిమూర్తినీ, పరాశక్తినీ ముడిపెట్టి, దివ్యనాటకాన్ని రసరమ్యంగా నడుపుతున్న సూత్రధారి యీ సంగమేశ్వరుడు.

నాన్నా, ఇంతటి మహాక్షేత్రానికి మనం వచ్చాం. ఇది మన పుణ్యం నాన్నా ! కొందరు కలవాళ్ళుగా పుట్టి గొప్ప క్షేత్రాలను దర్శించి వచ్చి, దాన్ని గూర్చి గోరంతలు కొండంతలుగా చేసి, తలగడల్లాంటి పుస్తకాలు రాసి, అమ్ముకొని, డబ్బులు సంపాదిస్తూ వుంటారు. కాని వాళ్ళకు దానివల్ల జన్మసార్థకత్వం వస్తుందంటావా నాన్నా ? నువ్వు మమ్మల్నిక్కడికి తెచ్చావు గనుక, మాకు యింతటి మహా కైలాసవాస పుణ్యం లభిస్తోంది నాన్నా ! దీనికి మన మంతా గర్వించవద్దా, చెప్పు నాన్నా ?"

జయలక్ష్మి చేసిన మహోపన్యాసానికి నేను అప్రతిభుడి నయిపోయాను. అసలా భాషే కొత్తగా వుంది నాకు. ఇళ్ళల్లో కబుర్లాడుకొనే భాష కాదు. నా ముద్దుల కూతురు నా దగ్గర పిచ్చుక కథలు చెప్పే భాష కాదు. ఎవడో ఒక మహామేధావి ఏ పండిత సభలోనో సిద్ధాంత వ్యాసం చదివినట్టు వుంది, ఆ ప్రసంగం అంతా ! దానికి తోడు చివర్న అది అన్న మాటల కర్థమేమిటి ? నా మనస్సులో వున్న ఆలోచనలు తెలిసే ఇది ఇంత భారతమూ చెప్పిందా ? లేక యిది కాకతాళీయమా ? ఇన్ని ఆలోచనలు మనసును ముప్పిరిగొనగా, దాని వీపు నిమురుతూ, "ఓసినీ, ఇన్ని విషయాలు నీ కెవరు చెప్పారే పుట్టూ" అన్నాను.

"కరపాత్ర స్వామివారు" అంది వెంటనే మా పుట్టు. కరపాత్ర స్వామివారు అనేసరికి నా వొళ్ళు జలదరించింది. సుమారొక అయిదారు నెల్లనుంచీ, ఒక దండకమండల యతీశ్వరుడు యీ క్షేత్రంలో సంచరిస్తున్నాడు. ఆయన గూడ ఋషీశ్వరుడి దర్శనం కోసమే వచ్చాడంటు న్నారు లంబాడీలు. ఆయనకు వయస్సు తొంభై యేళ్ళకు తక్కువ వుండదు. మనిషి శల్యావ శిష్టంగానే వున్నాడు. కాని బాగా నడవగల ఓపికలోనే వున్నాడు. మనిషిని చూస్తే ప్రశాంతి

ముద్ద అనిపిస్తుంది. ఇంచుమించు వారాని కొకసారి ఏదైనాపెట్టమని మన యింటికి వచ్చే వాడు. ఆ పెట్టేది జయలక్ష్మిచేత పెట్టించమని సంజ్ఞ చేసేవాడు. ఆయన పూర్తిగా మౌనం కాదు గాని, చాలా తక్కువ మాట్లాడేవాడు. ఏదైనా పెడితే దోసిలిపట్టి, దోసిట్లో వేయించుకుని నది దగ్గరకు పోయి కూర్చుని తినేవాడు. ఆ నది నీరే తాగేవాడు. ఆయన ఎక్కువగా, సంగమేశ్వర ఆలయంలోనే కాలక్షేపం చేసేవాడు. అక్కడ లేనప్పుడు ఎక్కడికి పోయేవాడో ఎవరికీ తెలీదు. అంత మితభాషి స్వామివారితో ఇది యింత సంభాషణ ఎలా చేసిందా అని నా కాశ్చర్యం అయింది.

అయితే ఈ కరపాత్ర స్వామి వారంటే నాకు కొంత ప్రత్యేక గౌరవం వుండేది. ఎందుకంటే ఆ క్షేత్రానికి వచ్చే యితర బైరాగుల్లాగా యీయన ఏ ఆర్భాటమూ చేసేవాడు కాదు. గుడ్లు వెనక్కి తిప్పటం, ఆకాశంలోకి చూడటం, మనుష్యుల వంక తేరిపార చూడటం ఇలాంటి పనులేవీ చేసేవాడు కాదు. పూర్ణిమలు వచ్చినపుడు హడావుడిగా నది వెంబడి తిరిగే వాడు కాదు. ఎప్పుడూ శాంతంగా వుండేవాడు. ఆయన పద్ధతి చూస్తే, ఆయన నిండుకుండ అనిపించేది. అందువల్లే ఆయనతో ఇంతెందుకు మాట్లాడావు అని జయలక్ష్మిని నిగ్గదీయలేదు నేను. పైగా "ఇంకా ఏం చెప్పారమ్మా" అన్నాను లాలనగా.

"ఆయన బలే బలే కథలు చెపుతారు నాన్నా" అన్నది పుట్టు.

"సరేగాని ఆయన ఎక్కడివాడు.?"

"వాళ్ళది కాశీ ప్రాంతమట."

"పేరు?"

"వాళ్ళకి ప్రత్యేకం పేరుండదట. ఆ సంప్రదాయం వాళ్ళంతా కరపాత్ర స్వాములేనట."

"ఆ సంప్రదాయమంటే, ఏ సంప్రదాయ మేమిటి?"

"అచ్చమైన అద్వైతమే వాళ్ళ సంప్రదాయం."

'అలాగా? ఆయన యిక్కడికి ఋషీశ్వర దర్శనం కోసం వచ్చాడా?"

"అదే తెలియటం లేదు నాన్నా. ఆయన ఆ ఋషీశ్వరుడి దర్శనం కోసం ఆరాటం ఏమీ పడుతున్నట్టు కనిపించటంలేదు. కాని ఋషీశ్వరుడంటే మాత్రం చాలా భక్తిగా వున్నారు. అంతా చిత్రంగా వుంది."

ఇంకా ఏవో చాలా అడగాలనుకున్నాను గాని, ఆసరికి నాకు నిద్దరమత్తు వచ్చేసింది. దాంతో ఆ సంభాషణ ఆగి పోయింది. ఇది జరిగిన కొద్ది రోజులకు ఒక చిత్రం జరిగింది.

ఆ యేడు మేం వరినాట్లు వేశాం. వేసిన కొద్ది రోజులలోనే ఏనుగుల గుంపు వచ్చి, చేనంతా చెడ తొక్కిపోయింది. ప్రాణం వుసూరుమంది. ఏం చేస్తాం? మళ్ళీ పొలం దున్ని

పదును చేసి, నానా అగచాట్లు పడి నారు సంపాదించి మళ్ళీ నాటాం. నాటిన రాత్రే మళ్ళీ ఏనుగులు కదం తొక్కినాయి. ఏదో పంట లప్పుడు, కోత లప్పుడు అయితే కాపలా కాస్తాం గాని, నాట్ల రోజునుంచీ పొలానికి కాపలా కాయగలమా? ఏం చెయ్యాలా అని మధనపడు తుండగా, లంబాడీ తాత వచ్చి "బాబూ, ఏమన్నంటే ఓ మాట చెపుతా" అన్నాడు.

"చెప్పు"

"ఏం లేదు, మన అమ్మాయిగారు, అదే జయలక్ష్మమ్మ గారు తలుచుకొంటే యీ ఏనుగుల బెడద వుండదు."

"ఏమిటి నువ్వనేది!"

"బాబుగారూ, పని గావాలంటే ఉపాయం చెప్పాను. ఆ తరువాత తమ చిత్తం" అని తుండు దులుపుకొని లేచి చక్కా పోయాడు తాత.

ఏమనాలో తోచక అలాగే నోరు తెరుచుకొని ఉండిపోయాను నేను. ఇంతలో పిల్చినట్లు వచ్చింది జయలక్ష్మి.

"పిల్చావా నాన్నా" అంటూ. బహుశా ఆ లంబాడీతాతే పంపించి ఉంటాడు అనుకున్నాను.

"సరేగాని, ఏనుగుల బెడద ఎక్కువగా వుంది. పంట దక్కాలంటే ఏం ఛేద్దామంటావ్" అన్నానూ వున్నట్టుండి.

ఈ మాట నేనే అన్నానా? నాలో వుండి నా అనుమతి లేకుండానే యెవరన్నా మాట్లాడారా అని నాకే అనుమానం వచ్చింది.

"దాందేముంది నాన్నా! తాత యిచ్చిన యంత్రం వేస్తే సరి" అంది జయలక్ష్మి చేతులూపేస్తూ.

"తాతా! ఏ తాతా?"

"ఫకీరు తాత నాన్నా."

* * *

### పెళ్ళి-కళ

జయలక్ష్మి యంత్రాలు వేసినాక, ఏనుగుల బెడద తప్పిన ప్రత్యక్షానుభవంవల్ల ఒక పక్క తృప్తిగానే వున్నా, దానికి బైరాగుల స్నేహం ఇంత తీవ్రంగా బలపడటం పట్ల నా హృదయం కల్లోలపడసాగింది.

ఇలా ఉండగా ఒకరోజున, నా కసలే తల తిరిగి పోతున్నట్టుగా వుంది. మనస్సు కకావికలుగా వుంది. దాన్ని తట్టుకోలేక, ఏదో కాస్త పెందరాడే నాలుగు మెతుకులు తిని ఒక

కునుకు తీస్తే, సాయంత్రానికి కొంత కుదుట పడతాలే అనుకొని చేరక చేరక, పెందరాడే కొంపకు చేరితే, ఆ రోజు నన్ను చూసిం దగ్గరనుంచీ నస సాగించింది మీ అమ్మమ్మ. అది సంవత్సరం పైగా సాగుతున్న నసే. పిల్లకు పెళ్ళీడు వచ్చిందనీ, నేను శ్రద్ధపట్టి సంబంధాలు వెదకటం లేదనీ ఆ నసకు సారాంశం.

చాలా సేపు వూరుకొన్నాను కాని, భోజనమై మంచం మీద నడుం వాల్చినాక కూడా, చెవులో జోరీగల్లే పోరుతుండేసరికి నాకు చిర్రెత్తుకొచ్చి— "ఇదిగో ఇప్పటికి రెండు సంబంధాలు తెచ్చాను. రాజా లాంటి సంబంధాలు. వాళ్ళు నాకు నచ్చలేదు పొమ్మంది నీ ముద్దుల కూతురు. అయినా ఆ రౌడీకి పెళ్ళెందుకు? పకీర్ల దగ్గర యంత్రాలూ, మంత్రాలూ, ఉపదేశాలూ తీసుకొంటోందిగా. పోయి బైరాగుల్లో కలవమను" అన్నాను అక్కసుగా.

"మీ చెవినా బడ్డదన్న మాట- అదేగదండీ, నాభయం. చివరికి దానికి ధ్యానాలూ, సమాధిలూ పెరిగిపోయి నలుగురినోటాబడితే, దీన్నెవడు చేసుకుంటాడండీ ?" అంది మీ అమ్మమ్మ నోరునొక్కుకుంటూ, కళ్ళు తుడుచుకుంటూ. ఆ తరవాత ఆవిడ యింకా చాలా చెప్పింది గాని, ఆ ఒక్క పాయింటు మీద నా ఆలోచనలు నిలిచి పోయి మరి వినిపించలేదు.

"మీచెవినా బడ్డదన్న మాట" అంటోంది. అంటే మా పుట్టు సంగతి లంబాడీగూడెంలో బాగా తెలిసిందన్న మాట. వాళ్ళే మనుకొంటున్నారో యేమిటో ? నాకు ఆ క్షణంలో మా తాతయ్య సంగతి గుర్తు కొచ్చింది. నా ఆలోచనల గోల ఒక పక్క, మీ అమ్మమ్మ నసగోల మరో పక్క చాలా సేపు తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదంగా సాగిపోయాయి. చివరికి "పోనీ లెద్దూ. ఏం జరగాలంటే అదే జరుగుతుంది. నువ్వూరుకో" అన్నాను నేను.

నేనీ మాట అనేముందు మీ అమ్మమ్మ యేమందో యేమో నాకు తెలీనేతెలియదు. కాని ఆవిడ నామాట వింటూనే ఇంత గొంతేసుకుని, మండిపడి పోయింది. నేనన్న మాటలో ఏదో అసందర్భం కలిసిందన్న మాట, అనుకొన్నానుగాని నాకూ చిరాకుగా వుందేమో. ఇక అక్కడ వుంటే మాటా మాటా పెరుగుతుందని చిలక్కొయ్యకు వేసి వున్న చొక్కా చేత పుచ్చుకొని చరచరా యింట్లోంచి వెళ్ళిపోయాను. అక్కడినుంచి, ఒకటి రెండు రోజులు మెల్లగా కూపీ తీయ సాగాను, జయలక్ష్మి గురించి లంబాడీ గూడెంలో ఏమనుకొంటున్నారో అని. ఆ మాటలు వింటున్న కొద్దీ నాకు మతి పోయినంత పనైంది. ఆ లంబాడీ లందరూ జయలక్ష్మి అంటే, ఒక కొండదేవత అన్నంత ఇదిగా మాట్లాడుతున్నారు. పొలాలకు జయలక్ష్మి యంత్రాలు వెయ్యటం నేనే చూశాగదా. కొందరికి రోగాలు తగ్గించిందట. అది చింత చెట్టుకు నెంబర్లు వేసి, రక్ష కడుతుందట. దానివల్ల ఆ చింతచెట్టు పండు క్షేమంగా వుంటుందట. ఇలా ఒకటి కాదు,కదిలించిన కొద్దీ అనేకం చెబుతున్నారు. ఆ ఫకీరు తాత చెయ్యి వూపితే అడవి జంతువులు అవతలికి పోతాయట,

ఫకీరు తాత, తన శక్తులన్నీ మా పుట్టుకి ధారపోశాడని మాత్రం అంతా చెప్పుకుంటున్నారు. ఆయనే కాదు, ఆ కరపాత్ర స్వాముల వారు గూడ తన శక్తులను దీనికి ధారపోశాడని కొందరూ, "ఎబ్బే ! ఆయనకు అంతగా శక్తులేవీ లేవు లెద్దూ" అని కొందరు అంటున్నారు. ఈ ఫకీరు తాత గూడా సుమారు ఓ, ఐదు నెలలుగా యిక్కడే వుంటున్నాడు. చాలా ముసలి వాడు. తనకు నూటయిరవై యేళ్ళని ఆయనే చెపుతుంటాడు. మన కప్పట్లో మేకల పాడి చాలా బాగా వుండేది కనుక మేక పాలకోసం మన యింటికి తరచుగా వచ్చేవాడు. ఈ తాతంటే లంబాడీల్లో గొప్ప గౌరవం వుంది. వాళ్ళ కేదో తాయత్తులూ వగైరా యిస్తూ వుంటాడు. అంతవరకే నాకు తెలుసు.

ఈ తాయత్తుల ఫకీరు దగ్గర ఈ వెర్రి బాగులది యేవో కొన్ని మంత్రాలూ, తంత్రాలూ పట్టింది గాబోలు. అంత మాత్రం చేత "యేదో గొప్పదాన్ని అయ్యాను అనుకుంటోందేమో" అనిపించింది నాకు. ఎందుకయినా మంచిదని ఆ ఫకీరు తాత గురించి గూడ బాగా వాకబు చేశాను. చెయ్యగా నాకు తెలిసిన విషయాలవల్ల, నాకు, నా సమస్య జటిలమైనట్టు తోచిందే తప్ప పరిష్కారం అయినట్టు తోచలేదు.

ఆ ఫకీరుతాత, ఈ కరపాత్రస్వామి గారు బ్రహ్మగుండం దగ్గర ఒకరి కొకరు ఎదురు బదురుగా గంటల తరబడి సమాధిలో కూర్చుంటారట. లేచి ఎవరి దోవన వారు వెళ్ళేటప్పుడు ఫకీరుతాత, కరపాత్రస్వామి వారికి ఒక సాష్టాంగ వందనం చేసి వెళ్ళిపోతాడట. ఒకసారి ఆ కరపాత్ర స్వామి వారే ఒక లంబాడీ వృద్ధుకి, ఈ ఫకీరుతాత అష్టసిద్ధులు గల మహాయోగి అని చెప్పారట. వీరిద్దర్నీ తరుచు కలుస్తూ వుంటుందట జయలక్ష్మి.

ఆ రోజు ఈ ఆలోచనల్లో పడి నాకు తెలియకుండానే కొండదారు లెంబడి నడిచి పోతున్నాను. చివరికో చోటుకు వెళ్ళేసరికి కొండ చీలిపోయి నట్టనిపించి వొళ్ళు తెలిసింది. తీరా చూసుకొంటే అది బ్రహ్మగుండ తీర్థం! కొండ కొప్పున తాటిచెట్టు మీద, కాకల్లే నిలబడి వున్నాను నేను. మూడు తాళ్ళ లోతున సొరచేప పిల్లలాగా దూసుకు పోతోంది కావేరి. అడుక్కు చూస్తే నాకే కళ్ళు తిరుగుతున్న ట్లనిపించింది. కుదురైన ఏటి పారుదలవల్ల భ్రమరనాదం వొకటి, ఆ చోటంతా మందమంద్రంగా వ్యాపించింది. అవతల పక్క కొండ కొమ్ము మీంచి ఆకాశం ఉత్తర వైపుకు జారిపోతోందా అన్నట్టుంది. లోయ లోతును పట్టి చూస్తే, ఆ నది అడుగున ఎక్కడో పాతాళంలో వున్నట్టున్నది. ఆ రెండు కొండలమధ్య సందు ఒక చిన్న తూములాగ వుంది.

ఓసారి సరదాగా ఇటునుంచి అటు దూకుదామని అనిపించింది. కాని ఆ వూహ కలిగి నందుకే భయం అనిపించింది. మేక అవలీలగా దూకగలదు గనుక ఆ స్థానానికి "మేకదాటు" అని పేరు వచ్చిందని కొందరంటారు. అది ఏమోగాని, నాకు మాత్రం దూకాలంటే, భయం

వేసింది. వెనక్కు తిరిగి చూశాను. ఎండకు మాడిపోతున్న బండల మధ్య ఎలా పెరిగాయో జడల బఱ్ఱెల్లాంటి చెట్లు అడవిగాలికి వికృతంగా వూగుతున్నాయి. పడమర వైపుకు చూశాను. బహు సుదూరంనుంచీ పెళ్ళి నడకలు నడుచుకొంటూ వస్తోంది కావేరి.

ఈ బ్రహ్మగుండంలో పూర్వం స్నానం చేసేవారట. ఎలా చేసేవారో ? దిగేందుకు మెట్లు కాదుగదా బండలయినా అనువుగా లేవు. దిగబోయి సాహసించి, ప్రయత్నించి, కాలు జారితే లోపల నది ఎంత లోతు వుందో తెలియదు.

ఆ యెత్తునుంచి కిందపడితే లోతు వున్నా లేకపోయినా, ఆ మనిషికి ఇక బ్రహ్మ లోకంలో తప్ప ఈ లోకంలో స్థానం వుండదు. అది మాత్రం ఖాయం. తూర్పుకు చూశాను. దాగుడుమూత లాడుతున్న పదేళ్ళ పాపలా ఇంతలో మాయమైపోతోంది కావేరి. పైకి చూశాను. "ధర సింహాసనమై నడంబు గొడుగై" అన్న పద్యం గుర్తు వచ్చింది. చుట్టూ చూశాను.

అప్పటికి ఆ వర్షాకాలపు నులివెచ్చటి యెండ కావేరి పుట్టింట వేపకి కాలు చాస్తోంది. క్రిందటిరోజు కురిసిన వానకు, కడిగిన సాలగ్రామాలలాగా నిగనిగ లాడుతున్న ఆ కొండ రాళ్ళ మీద సాయంకాలపు యెండ పొరలు మిడిసి మిడిసి పడుతున్నాయి. కొండకొమ్ముల చుట్టూ నిక్కి నిలబడివున్న పెనుచెట్ల వల్ల పైనున్న తెల్లని ఆకాశమనే గొడుగు గుడ్డకు లోతట్టున ఆకుపచ్చని జలతారు కుచ్చుల వలయం అమర్చినట్లు వుంది.

అప్రయత్నంగానే రెండు చేతులూ పైకెత్తి ఆహా అని చిన్న పిల్లవాడిలాగా అరిచాను. మళ్ళీ నాలో నేనే నవ్వుకొని, నాకు నేనే సిగ్గుపడ్డాను.

"నాది మసిబొగ్గుల బుఱ్ఱ, నిజంగా." పుట్టు ఈ పరిసరాల సౌందర్యానికి ఎందుకు పరవశిస్తోందో, కొండకొప్పుల మీద నిలబడి సుదూర విశాల మైదానాలను చూస్తూ గంటల తరబడి ఎందుకు మైమరచిపోతోందో ఇవాళ్ళ కొంచెం తెలుస్తోంది. ఏమయినా దాని జన్మ సంస్కారంలో ఏదో విశేషం వున్నట్టే వుంది అనిపించింది ఆ క్షణంలో నాకు.

అలా నది వెంబడి పడమరకు నడిచాను మెల్లిగా. దాదాపు సూర్యాస్తమానం అవుతుండగా సంగమ స్థలానికి చేరాను. ఆ సమతల భూస్థలిలో నిలబడ్డ నాకు, సూర్యాస్తమయ బింబ సౌందర్యం దర్శన మివ్వలేదు. దాదాపు నడినెత్తి మీదకు తప్ప పక్కలకు, ఆకాశమే, కనిపించక పోవటంవల్ల, ఆకాశంలో ఎరుపురంగు గూడ అంతగా కనిపించలేదు. కాని సంజవేళయ్యే సరికి అకారణ, అవ్యక్తానందంతో ఒళ్ళు మరిచి గజిబిజిగా గోల చేస్తున్న అడవి పిట్టల కేరింతలు, ఆ అడవి సంజెకు అపురూపమైన వన్నె తెచ్చినాయి. తెల్లదనం పల్చ బడుతున్న ఆ సంజ వెలుగులో కావేరి చిరుతరగలు పసిపిల్ల నాట్యంలో పరికిణీ కుచ్చెళ్ళు చిక్కుబడినట్టుగా వున్నాయి.

ఆనందంగా, అలా అటూ ఇటూ చూస్తున్నాను. ఇంతలో ఎటునుంచి వచ్చారో యేమోగాని యేటి కద్దరిని, అంటే సంగమేశ్వరాలయం వున్న దరిన్నీ, నీళ్ళల్లో నిలబడి వున్నారు కరపత్ర స్వామివారు. ఆయన్ని చూడగానే నా కెందుకో చిరాకనిపించింది "తన ఏడుపేదో తాను ఏడ్చుకోక ఆడపిల్లలకు ఉపదేశాలు చేయటం ఎందుకు?" అని నాలో నేనే విసుక్కొని వెనుతిరిగి వెళ్ళిపోయాను.

అప్పట్లో మా మకాం ఏటికి అద్దరిన. అంటే బ్రహ్మకుండం వున్న దరిన కొండల్లో వున్నది. ఇక చీకటి పడుతోంది కదా అని ఇంటి దారి పట్టాను. దార్లో ఒక లంబాడీ యింట్లో ఏదో కొంచెం సందడిగా వుంటే లోపలికి తొంగిచూశాను. నాకు తెలిసినవాడే. వాడికి చలిజ్వరం వచ్చినట్టుంది, మూలుగుతూ వొణుకుతున్నాడు. నన్ను చూస్తూనే "బాబయ్యా, ఏదైనా పాతచొక్కా వుంటే దయచేయిండండి. మీ యింటి కొస్తాను. ఈడు సలికాగలేక ఒణుకుతున్నాడు" అంది వాడి భార్య దీనంగా.

ఆ దంపతుల దీనస్థితి చూసి నాకు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. వెంటనే నా వంటిమీద చొక్కా విప్పి తొడుక్కోరా అని, వాడి మీద పడేశాను. వాడు సందేహించాడు. చెప్పినట్టు చెయ్యవోయ్ అని గదమాయించి, వాడి చేత చొక్కా తొడిగించి ధైర్యం చెప్పి వచ్చేశాను.

మళ్ళీ నా ఆలోచనలన్నీ మా పుట్టు మీదే వున్నాయి. తీరా యింటికి చేరేసరికి, గడపలోనే గదమాయించింది మీ అమ్మమ్మ.

"ఈ కొత్త చొక్కా గూడా దానం చేసి వచ్చారా" అంటూ. అప్పుడు గానీ గుర్తు రాలేదు నాకు, అది కొత్త చొక్కా అనీ, నేను వంటిమీద గుడ్డ లేకుండా నడిచి వస్తున్నాననీ. మీ అమ్మమ్మ తన మామూలు పంచాంగం కాసేపు విప్పింది గాని—

"ఇదిగో ఎందుకట్లా అడులుతావు. మనకు కావాల్సినది మనకు పరమాత్మ యిస్తూనే వున్నాడుగా, మనకేం లోటూ లేదుగా. ఇహ వూరుకో" అని నేను కసిరేసరికి ఆగింది.

"ఔను నాన్నా! మనకేం లోటు" అని చప్పట్లు చరుస్తూ, కేరింతలు కొడుతోంది లోపలి యింట్లో పుట్టు.

నేను స్నానం చేసి ఇంట్లోకి వెళ్ళేసరికి ఆ రోజు అక్కచెల్లెళ్ళు అదే జయలక్ష్మి, పార్వతీ కీచులాడుకుంటున్నారు:

"రోజూ గణపతి పాటేనా? ఇంకొక పాట రాదూ" అంటోంది పార్వతి.

"నా యిష్టం. గణపతంటే నా కిష్టం. నేను పాడతాను. నీ కిష్టం లేకపోతే నువ్వు చెవులు మూసుకో" జయలక్ష్మి దర్జా వొలకబోసింది.

"అంత యిష్టమెందుకు? గణపతి నీకేమైనా చుట్టమా?" దెప్పుతోంది పార్వతి.

" ఆఁ చుట్టమే. గణపతి నా కొడుకు, తెలుసా " రెట్టిస్తోంది జయలక్ష్మి.

" ఆఁ ఆ! గణపతి దీని కొడుకుట, మరి నీ మొగుడెవరో ? " అన్నది సీత మధ్యలో అందుకుని. " నేను చెంచులక్ష్మిని, నా మొగుడు ఇంకెవరు. నరసింహుడు. " వాదంలో తనే నెగ్గానన్న ఫోజు పెట్టింది జయలక్ష్మి.

నా కయితే ఈ సంభాషణ సంతోషంగానే వుందికాని మీ అమ్మమ్మ మాత్రం ఇద్దర్నీ చెరొక కసురూ కసిరింది. "నోరుముయ్యండే భడవల్లారా! చిన్న పిల్లలు, చిన్న మాటలూ కాదు. అన్నీ ఆరిందా మాటలూ, ఆరిందా లక్షణాలూను " అని.

జయలక్ష్మి సామాన్యంగా పార్వతితో వాదనకు దిగేది కాదు. అన్న కిష్టప్పతో మాత్రం దానికి వాదం పరిపాటే. వాడు కొంచెం మోటుమనిషి. దీని పాటల్నీ పూజల్నీ తెగ యెక్కిరిస్తూ వుండేవాడు. వాడు దాని గణపతిని " గోడగణపతి" అంటూ వుండేవాడు. ఎక్కిరిస్తే పట్టించు కొనేది కాదు గాని, పొద్దుటి పూట దీని గణపతి పూజ చెడగొట్టాలని చూసేవాడు, అప్పు డప్పుడు కృష్ణప్ప. ఆరోజు మాత్రం వాణ్ణి పీకి పాకాన పెట్టేది. చివరికి వాడే తోకముడవాల్సిందే. నేను గూడా వాడినే కేకలేసే వాడిని. " ఎవరి నమ్మకాలు వారివి. మనకు నిర్బంధించే అధికారం ఎక్కడిదిరా " అని.

కొండలంబడి తిరగకుండా ఇంట్లో వున్నపుడు మాత్రం పుట్టుదీ, సీతదీ ఎప్పుడూ ఒకటే పార్టీ. పుట్టు పాటలంటే చెవి కోసుకునేది సీత. ఇవాళ కొత్తగా అక్క చెల్లెళ్ళ కీచులాట విని నేనేదో అనబోయేటంతలో, వాకిట్లో ఎవరో వచ్చారన్నారు. తీరా చూస్తే అది వో చిన్న లంబాడీ పంచాయతీ. " దానిలో పడితే యెప్పటికి, తెములుతారో యేమో! నాలుగు మెతుకులు తిని పొండి '' అని మీ అమ్మమ్మ వెంటపడగా అలాగే చేసి, ఆ పంచాయతీ పరిష్కారంలో పడిపోయాను.

ఆ పంచాయతీ పరిష్కారం, మూడు నాలుగు రోజులు పట్టింది. ఈ నాలుగు రోజులూ యింటికి వచ్చి నాలుగు మెతుకులు తిని పోతున్నానన్న మాటే గాని, నా ధ్యానంతా ఆ పంచాయతీ మీదే వుండేది. అదో అన్నదమ్ముల ఆస్తి పంపకం తగాదా. అందుచేత, ఆ వ్యహారం అంతా, కాలికి వేస్తే మెడకు, మెడకి వేస్తే కాలికి అన్నట్టుగా నడిచింది. ఈ మూడు నాల్గు రోజుల్లోనూ నేను యింటికి వచ్చినప్పుడల్లా నాతో ఏదో చెప్పాలని మీ అమ్మమ్మ చాలా ప్రయత్నం చేసిందిగాని, నేనే ఏ మాత్రం సందివ్వలేదు. నాలుగో రోజు రెండోజాము కల్లా పంచాయతీ, పరిష్కారం చేసి రెండు వర్గాల వారికీ సంతోషపు విందు ఏర్పాటుచేసి నేను యింటికి వచ్చే సరికి, దాదాపు యేడుపు మొహంతో వుంది మీ అమ్మమ్మ. ఏమిటబ్బా విషయమని నేను ఆరాతీస్తే వెంటనే జవాబు చెప్పక నన్ను దొడ్లోకి తీసుకెళ్ళి రోటి దగ్గర చెట్టుకింద కూర్చో బెట్టి, గుసగుస గొంతుతో రహస్యాలు చెప్ప సాగింది.

"మనపిల్ల మనకు దక్కేటట్టు లేదండీ"

"ఏమైందే— కొత్తగా ?"

"రేపు సూర్యో[illegible]ల్లోగా మనింటికి, బ్రాహ్మడెవడు వస్తే వాడే దాని మొగుట్ట".

"ఆ ఫకీరు తాత చెప్పాడా ?"

"ఋషీశ్వరులు చెప్పారటండీ"

"ఋషీశ్వరుడు చెప్పాడా, ఫకీరు తాత చెప్పాడా ?"

"అబ్బబ్బ వినిపించుకోండె. నాకు ప్రాణాలు పోతున్నట్టుంటే మీకేదో హాస్యాలుగా వుంది."

"అర్థమయ్యేటట్టు చెప్పు. కొంపదీసి ఆ ఋషీశ్వరుడు సరాసరి నీతోనే చెప్పాడా యేమిటి ?"

"వినండి. ఆ ఋషీశ్వరులు మన అమ్మాయితో చెప్పారట"

"సరిపోయె, ఎప్పుడు ?"

"ఇవాళ్ళే-ఇందాక"

"ఇవాళ పూర్ణిమ కాదు. పైగా పట్ట పగలు. అర్ధరాత్రి గానీ ఆయన తిరగడంటారుగా."

"కలలో కనిపించారటుండీ."

"పగటి కలలోనా! బలే బలే"

"మీ యెక్కిరింతలు దొంగలు తోలా, వినండి ముందు. ఇందాక అమ్మాయి సంగమేశ్వరాలయానికి వెళ్ళింది."

"రోజూ వెడుతుందిగా"

"కాని యివ్వాళ్ళ అక్కడ కూచుని ధ్యానం చేసుకుంటుంటే కునుకు పట్టిందట"

"ధ్యానం పరాకాష్ఠ చేరిందన్న మాట"

"వినండి. ఆ కునుకులో ఋషీశ్వరులు దర్శనం యిచ్చారట"

"గుళ్ళో కూర్చుని కునికిపాట్లు పడుతోందని సంతోషించి, పరుగెత్తుకొచ్చి వుంటాడాయన."

"చెప్పనిస్తారా"

"చెప్పేదేముంది? పగటి కల్లో కనిపించి యిందాక నువ్వు చెప్పిన మంత్రోపదేశం చేశారు వారు. అప్పటినుంచీ, నీ ముద్దుల కూతురూ, నువ్వూ పెళ్ళికొడుకు ఏడీ, ఏడీ, అని ఎదురు చూస్తున్నారు. అంతేగా?"

"అలా మాట్లాడటం మీకు న్యాయంగా వుందా?"

"న్యాయం మాట అలా వుంచుగాని, అంత యేడుపు మొహం ఎందుకే పెట్టావు నువ్వు? అది చెప్పు.

"ఏడుపు మొహం ఏమిటండీ, గుండె పగిలిపోతుంటేనూ."

"అదే, ఎందుకూ అంటున్నా!"

"కాశీ మజిలీ కథల్లాగ తెల్లవారేప్పటికి యే ముష్టివాడినో చూసి వీడే నా మొగుడు అంటుందేమోనండీ, ఈ మొండి మొహం! మన గతేం కావాలి? దాని గతేం కావాలి?"

"ఈ పగటి కలల వెర్రి మొహం యేదో కలగంటే, దాన్ని నాలుగు చివాట్లు వేసి నోరు మూయించక యిలా శోకాలు పెడతావేమిటి? ఇన్నేళ్ళొచ్చి యిదేం తెలివి?"

"మన అమ్మాయిగదా అని మనకు లోకువ వుండచ్చు గాని, దాన్నంత తీసి పారెయ్యటానికి వీలు లేదండి. మీకు కొన్ని వివరాలు చెప్పాలి."

"చెప్పొచ్చులే- ఇలాంటి వివరాలు నువ్వు చెప్పకుండానే నాకు తెలుస్తాయిగాని, ఆ ఋషీశ్వరుడు పూర్వాశ్రమంలో పెళ్ళిళ్ళ పేరయ్యా ఏమిటి?"

"ఏమండోయ్- అనవసరంగా ఆయన్నేమీ అనకండి. మనం పిల్లలు గలవాళ్ళం."

"సరి. ఈ పగటి కలల వాళ్ళంతా యోగులని నాకు విశ్వాసం లేదు. తాయత్తుల వాళ్ళంతా సిద్ధులని నమ్మకం లేదు. గాల్లో ఎగిరే మబ్బు తునకలు మహాత్ము లవునా, కాదా అన్న ఆలోచన నేను చేయలేను. నిజమే, నేను నాస్తికపు వెధవనే. మరి నువ్వు ఆస్తికురాలివిగా, భక్తురాలివిగా, ఇంకా ఏడుస్తావెందుకు?"

ఈ మొండి వాదనలకు సమాధానం ఎవరు చెప్పగలరు?"

"పిచ్చిదానా, ఏడవకు. మొండి వాదం కోసం చెప్పటం లేదు. అమ్మాయికి ఆ ఋషీశ్వరుడు నిజంగానే కనిపించాడని నువ్వు నమ్ముతున్నావా"

"ఆ........"

"అమ్మాయి భక్తురాలని నమ్ముతున్నావా"

"ఆ"

"ఆ ఋషీశ్వరుడు శక్తి గలవాడని నమ్ముతున్నావా?"

"ఆ"

"అలాంటప్పుడు ఆయన తన భక్తురాలైన మన అమ్మాయికి అన్యాయం చేస్తాడంటావా?

"నిజమే అనుకోండి..... "

"మరోమాట. ఇవాళ్ళ యిక్కడ ఎండగానే వుందిగాని గత వారంలో ఎగువన యెలాంటి వర్షాలు పడ్డాయో గమనించావా"

" దానికీ దీనికీ సంబంధ మేమిటండీ "

" ఏమిటా ! యివాళ ఏరు ఎలావుంది. ? "

" కొంచెం ఎక్కువగానే వుంది "

" పోటు మీద వుంది అను. సాయంత్రానికి పోటు మరీ పెరుగుతుంది. ఇవాల్టికి సంగమానికి వచ్చే బస్సు, రానూ వచ్చింది, పోనూ పోయింది; ఇక ఈ అడవిలోకి వచ్చే మనిషెవడే ? "

" ఏమోనండీ ఎవరు చెప్పగలరు. ? "

" సరే, వచ్చాడనుకుందాం. మనం ఏటికి యిద్దరిన, ఏటికి దూరంలో, అడవి మధ్యలో వున్నాం. పోటు మీదున్న ఏటిని దాటి యిటు ఎవరు రాగలుగుతారో చెప్పు. అది సాధ్య మేనా ? "

" అది కొంచెం అసాధ్యమే అనుకోండి "

" అనుకోవటం కాదు, అసాధ్యం. ఇక్కడ కావేరి అంటే కొండవాగు. అది పోటులో వుండగా, యెవడన్నా ఏ యీతో కొట్టి యిటు రావాలని చూస్తే, పోటు వేగానికి మరు నిమిషంలో తూర్పు నెక్కడో లోయలో తేల్తాడు, తెలుసా ? "

" అయితే భయం లేదంటారా ? "

" దీన్ని బైరాగుల్తో తిరగనియ్యి వద్దని చెపితే బుర్ర కెక్కించు కున్నావుగావు. ఒకటో రేండో, మంత్రాలూ, యంత్రాలూ, చిట్కాలూ పట్టి పెద్ద యోగిని నయ్యానని అనుకుంటోం దేమో నీ కూతురు. "

" అదేమో గానీ దైవాజ్ఞ అంటుందండీ "

" చూడు, నాకు దైవం, లింగంలో లేడు ; నిప్పుల్లో లేడు; ఋషుల్లో లేడు; నా దైవం అంతటా వున్నాడు, అందరిలో వున్నాడు, సమంగా వున్నాడు. వాడి ఆజ్ఞ ఏమిటో, వాడి సంకల్ప మేమిటో, తెలుసుకోవటం మానవ మాత్రులకు తరమయ్యే పనిగాదు "

" మీదంతా ఒక వితండవాదం "

" నువ్వేమన్నా అను. లేనిపోని ఆలోచనలు పెట్టుకొని, పెత్రివేషా లేయొద్దని గట్టిగా చెప్పు. "

" అంత గట్టిగా చెప్పనక్కర్లెదు లెండి. అది మన మాటకు ఎదురు తిరగదు. అంతవరకూ ఖాయమే. "

" నువ్వు గూడ లేనిపోని బెంగలు పెట్టుకోకు. ఇహ దాని పెళ్ళి మాటంటావా, నువ్వు చెప్పావే ఆ దైవసంకల్పం యెలా వుంటే, అట్లాగే దాని పెళ్ళి చేస్తాను. " నేనీ చివరి

మాటలనేసరికి, నాకు గూడ ఒక చిన్న ఉద్రేకం లాంటిది వచ్చి, నిక్కచ్చిగా, పక్కనున్న రోలు గుద్ది మరీ చెప్పాను. సరీగ్గా అదే సమయానికి వాకిట్లో ఒక శంఖారావం వినిపించింది. అది ఒక లంబాడీ ముష్టివాడి శంఖం.

"పెళ్ళి అనంగానే శంఖం వూదాడండీ. మా నాయనే నీ అమ్మకడుపు చల్లగా........" అని మహానందంగా ముష్టివాణ్ణి దీవిస్తూ వాడికి ముష్టి వేసేందుకు చెంగున లేచింది మీ అమ్మమ్మ.

దాని మూఢనమ్మకాలకి నవ్వుకొంటూ నేనూ లేచాను. లేచి రెండడుగు లేసి ఇంట్లోకి వెళ్ళబోయే సరికి ఎదురుగా పుట్టు నిలబడివుంది. దాని ముఖంలో దుఃఖం లేదు గాని, చాలా గంభీరంగా వుంది. తల కొంచెం వొంచుకొని-

"మీ మాట కాదనేదాన్ని కాదు నాన్నా! ఋషీశ్వరులు చెప్పింది అమ్మకు చెప్పానంతే." అన్నది ముక్తసరిగా, పొడిపొడిగా.

"నా మాట విని దడుచుకున్నట్టుంది పాపం" అని లోపల చాలా జాలి కలిగింది నాకు. కాని, పైకిమాత్రం గాంభీర్యం తగ్గరాదని "ఊ".... అని వూరుకున్నాను. పుట్టు మెల్లగా తిరిగి-

"ఏది జరగబోతోందో అది వారు చెప్పారు" అంటూ పక్క గదిలోకి వెళ్ళిపోయింది. మరోసారి శంఖం వూది వెళ్ళిపోయాడు ముష్టివాడు.

ఇంతలోగా బుట్టెడు పళ్ళు, తమలపాకులు, పోకలూ వగైరా చేతబట్టుకొని ఆ రాజీపడ్డ రెండు వర్గాల వారూ వచ్చారు. ఇహ సాయంత్రం దాకా ఇంటిల్లబాదికీ వాళ్ళతో కాలక్షేపం అయిపోయింది. అందరం మంచి హుషార్లో వున్నాం. భోజనాల ముందు జరిగిన గడ్డు సంభాషణల గుర్తు మా మనస్సుల్లోంచి పూర్తిగా వెళ్ళిపోయింది. పుట్టు గూడా కళకళ్ళాడుతూ అందరిలో కలిసిపోయింది. రోజూలాగా కొండలంబడి తిరగకుండా ఇంట్లోనే ఉల్లాసంగా గడిపింది.

ఆ సాయంత్రం బయటికి పోయిన నేను యింటికి చేరేసరికి రాత్రి తొమ్మిది దాటింది. పార్వతి, సీత, కృష్ణప్ప నిద్దరపోయారు. మడికట్టుకొని కునికిపాట్లు పడుతూ నా కోసం ఎదురుచూస్తున్న తల్లికి గౌరీ కల్యాణం పాట వినిపిస్తూ కూర్చుంది, పుట్టు. దానికి మొదటి నుంచీ నిద్దర తొందర లేదు.

దాని గొంతులో అమృత కళ వుండేది. అది ఒక రాగం గొంతెత్తి సాగదీస్తే కమ్మెచ్చు మీద, బంగారపు తీగ సాగదీసినట్టుండేది. జిలేబీ చుట్ట చిట్లి రసం పైకి పొంగినట్లుండేది. ఒకోసారి దాని రాగం వింటుంటే గుండెకాయ ఎగిరి పడుతున్నట్టుండేది. దానికి నేను సంగీతం చెప్పించలేదు. దాని పాటల్లో సంగతులూ, గమకాలూ, మెలికలూ ఇవేవీ వుండేవి కావు. కాని అదేమి 'చిత్రమో' ఏ రసపు పాట పాడితే, ఆ రసదేవత దాని పాటలో సాక్షాత్కరించేది.

ఆ రోజు దాని పాట మరీ జగన్మోహనంగా సాగింది. దాంతో నేనుగూడ వెంటనే భోజనానికి కూర్చోక, ఆ పాట వింటూ ముక్కాలి పీటమీద చతికిలబడిపోయాను. అది గౌరీ కల్యాణపు పాట. గౌరీదేవి అంపకాలు జరుగుతున్నాయి. మేనాదేవి దుఃఖం వచ్చేసరికి పుట్టూ పాటలో కరుణరసం పోటు, కావేరీ కన్నా మించి పొంగిపొరలింది.

"తపస్సు చేసి మొగుణ్ణి సంపాదించుకున్నావే వెర్రితల్లీ! కాని అత్తలేదు, మామలేడు. అనువయిన ఆదరణ లేదు! ఎల్లా కాపరం నెగ్గిస్తావో, మా పేరెలా నిలబెడతావో" అనే భావంగల చరణాలు వచ్చేసరికి, మీ అమ్మమ్మతో పాటు నాకు తెలియకుండానే నేను గూడ ఏడ్చేశాను.

. దక్షిణాన నీలగిరులలో నిలబడి, ఈ దృశ్యాన్ని దివ్యదృష్టితో తిలకిస్తున్న, లోపాముద్రా. అగస్త్యులు కళ్ళు వొత్తుకుంటూ___

"అమ్మా! నాన్నా, మీరు విసిరి పారేస్తే ఇక్కడకు వచ్చి పడ్డ దాసులం, కొత్త కాపురం మోజులో పడి మమ్మల్ని మరిచిపోకండేం" అని అంటున్నారట.

ఈ చరణం వచ్చేసరికి ఇందులో కరుణరసంలో చిటికెడు హాస్యం, రవంత శృంగారం గూడా కలిసి హృదయానికి చక్కలిగింత పెట్టినట్లయి, తేలికబడి హాయిగా నవ్వుకొని "ఇహ వడ్డించు" అన్నాను లేచి వొళ్ళు విరుచుకుంటూ.

* * *

## పెళ్ళికొడుకు

ఇంతలో___

"అయ్యా! ఎవరండీ లోపల"

"రే, యీరాదరు ఇద్దారే"

తెలుగులో మొగగొంతుక, కన్నడంలో ఆడ గొంతుక, ఒకదాని వెనుక ఒకటి ఖంగు, ఖంగున వినిపించేసరికి నా ఒంటివిరుపు ఒక్కసారిగా ఆగిపోయింది. "ఇంత రాత్రివేళ ఎవరబ్బా పిలిచేది." అని రవ్వంత ఆశ్చర్యంలో పడక తప్పలేదు నాకు.

'వేళకాని వేళల్లో బైరాగులు రావటం మాకు కొత్తగాదు గాని, వాళ్ళు రాత్రిపూట భిక్షకు రారు. పైగా ఆడగొంతొకటి వినిపిస్తోంది' అని పైకే సన్నగా అంటూ నేను కిరసనాయిలు లాంతరు చేత పట్టుకొని తలుపుకేసి నడిచాను.

"ముందు కిటికీలోంచి చూడండి."అని వెనకనుంచి మీ అమ్మమ్మ అంటూనే వుందిగాని, నేను తలుపు తెరిచి "ఎవరూ" అంటూ వాకిట్లోకి వెళ్ళాను. ఆ సరికి అటువైపు నుంచి ఒక

చేతిలో లాంతరూ, ఒక చేతిలో కర్ర పట్టుకొని, మా పాలేరూ వచ్చాడు "ఎవరూ" అంటూ. రెండు లాంతర్ల వెలుగులో రెండు కొత్త ఆకారాలు స్పష్టంగా కనిపించాయి.

ఇంటి వాకిటికి కొంచెం దూరంలో ఒక మగవాడు, అతని వెనకాల ఒక విధవరాలూ నిలబడి వున్నారు. ఇద్దరి చేతుల్లోనూ చెరో బట్టల మూటా వుంది. మగవాడు నడివయస్సులో నల్లగా వున్నాడు. ఆ నల్లటి గుబురు గడ్డాలు, దృఢమైన శరీరము, కాంతిగల కళ్ళు, చూసే సరికి వయస్సులో వున్న భీష్మాచార్యుడు గుర్తు వస్తున్నాడు. అతని పంచకట్టు, అంచుల ఉత్తరీయం, నుదుట విభూతి పట్టీలు ఇతను బ్రాహ్మణుడని అడక్కుండానే చెప్తున్నాయి.

నేను లాంతరు తీసుకొని దగ్గరకు, వెళ్ళేసరికి వెనుకనున్న విధవరాలు ముందరికి వచ్చింది "రే" అంటూ.

ఆవిడ సన్నగా, పొడుగ్గా వుంది. నడివయస్సు దాటిన మనిషల్లే వుంది. నెత్తిన ముసుగు, కాశాపోసి కట్టుకున్న తెల్లబట్టలు చూసి, "వీళ్ళు ఆంధ్రులల్లే వుందే" అనుకున్నాను.

"అయ్యా, మేము యాత్రీకులం. అనుకోకుండా అడవిలో చిక్కుకు పోయాం. మీకు యిబ్బంది లేకపోతే ఈ రాత్రికి తల దాచుకొందుకు కొంచెం చోటు యిప్పించండి." ఆవిడ మెల్లగా కన్నడంలోనే మాట్లాడుతోంది గాని, ఆ భాష బట్టి వారిది ఆంధ్ర అని మరోసారి ఋజువయ్యింది నాకు.

"మీరు ఆంధ్రులా"

"అవును. అనంతపురం ప్రాంతం."

"ఇక్కడికి ఎలా వచ్చారు ?"

"దక్షిణదేశ యాత్రలు చెస్తూ సంగమ స్నానానికని వచ్చాము"

"ఎలా వచ్చారు?"

"బస్సులోనే వచ్చాం. కానీ మేం జపం చేసుకొంటూంటే బస్సు వెళ్ళిపోయింది. దిగబడి పోయాం."

"ఏరెలా దాటారు ?"

"పొద్దున ఏరు ఇంత ఎక్కువగా లేదు."

"పొద్దుటి నుంచీ....?"

"మాకు ఒళ్ళు తెలిసేసరికి చీకటి పడిపోయింది." ఆ మాట విన్నాక ఇంకేం అడగాలో నాకు తోచలేదు. వీళ్ళు పొద్దుటి బస్సులో వచ్చారన్న మాట. అప్పుడు జపం ప్రారంభిస్తే చీకటి పడ్డాక కళ్ళు తెరిచారా? వీళ్ళుగూడ, ఆ బైరాగుల బాపతు వాళ్ళేనేమో! వాళ్ళయితే తలదాచుకోటానికి యిళ్ళ కోసం వెతకరే."

నా ఆలోచనల్లో నేనిలా వుండగా—

"మీకు సందేహంగా వుండటం ధర్మమే. ఏటి ఒడ్డునే వుండిపోదామంటే, అడవి జంతువు లేవయినా వస్తాయేమోననే భయంతో, మీ యింటి దీపాన్ని బట్టి మేం యిటు వచ్చాం. మీకు అభ్యంతరం లేకపోతే మీ యింటి వసారాలో పడుకుంటాం. మీరు లోపల తలుపులు వేసుకుని పడుకోవచ్చు." అన్నది ఆవిడ మెల్లగా.

ఆ మాట విన్నాక గాని, నేను వాళ్ళని నుంచోపెట్టే మాట్లాడుతున్నానని గుర్తురాలేదు.

మనిషిని చూచి మనిషి భయపడటం, మానవ జాతి దౌర్భాగ్యాల్లో ఒకటి. నట్టడవిలో, పాముల్ని నమ్మాను. ఏనుగుల్ని నమ్మాను. చిరుతలను నమ్మాను. కాని తోటి మనిషిని నమ్మాలంటే వెనకాముందూ చూస్తున్నాను. నాకు నేనే సిగ్గుపడ్డాను.

"ఎంత మాటమ్మా, ముందు కాసిని మంచి తీర్థం పుచ్చుకోండి. రండి" అని యింట్లోకి దారి తీశాను. పాలేరు వెనక్కు వెళ్ళిపోయాడు. వచ్చిన అపూర్వ అతిథుల్ని తేరిపార చూస్తూ నిలబడి పోయారు తల్లీ కూతుళ్ళు.

లోపలికి వస్తూనే ఆడావిడ ఇల్లంతా పరకాయించి చూడసాగింది. లోపలికి వస్తూనే మూట–గోడ-పక్కన–పెడుతూ.. మగతను తెలుగులో "మేం బ్రాహ్మలం" అన్నాడు గోడతో అన్నట్టుగా.

ఆ మాట వింటూనే ఒకరి మొహం ఒకరు చూసుకొన్నారు తల్లీ కూతుళ్ళు. నాకు అతను ఏమంటున్నాడో సరిగా అర్థం కాలేదు. నాకు తెలుగు అర్థమవుతుంది గాని పూర్తిగా తెలీదు. చొక్కాలేని నా వంటిమీద, జంధ్యం కనిపిస్తూనే వుంది. పంచకట్టు కనిపిస్తూనే వుంది. కానీ నా మొహాన ఏరకమైన బొట్టూ కనిపించక పోవటంవల్ల అనుమానం వచ్చి 'మీరు బ్రాహ్మలేనా' అని అడుగుతున్నాడు గాబోలు ననుకున్నాను. అనుకొని, "ఔనండీ, మేమూ స్మార్త బ్రాహ్మలమే, హరితస గోత్రం" అన్నాను.

అతనికి కన్నడం వచ్చినట్టు లేదు. నా వంక అయోమయంగా చూసి "మాది భాగద్వాజ గోత్రం" అన్నాడు.

ఇంతలో "భోజనం చేస్తారేమో అడగండి. వాళ్ళు పొద్దుటి నుంచీ భోజనం చేసినట్టు లేదుగా" అన్నది అమ్మమ్మ.

ఆ మాట వింటూనే ఆడావిడ "ఏమీ అక్కరలేదమ్మా. తల దాచుకోనిచ్చారు, అదే పదివేలు" అంది.

"దాందేముంది లెండి, ఏదో దైవప్రేరణ గదా! ఇవాళ్ళ యింకా మడిత్తోనే వున్నాను నేను. వారు కూడా యిప్పుడే యింటికి వచ్చారు. ఈ అడవిలో మాకు మాత్రం సద్బ్రాహ్మలు

అతిథులుగా దొరకటం అదృష్టం కాదా ఏమిటి ?" మా అమ్మమ్మ యింత నాజూకుగా మాట్లాడ గలదని అంతకుముందు నే నెరగను.

వాళ్ళు మడి మనుషులని, వాళ్ళ జుట్టు, కట్టు, బొట్టు చూస్తేనే తెలుస్తోంది. అందుకనే వాళ్ళ దగ్గర తన మడి మంత్రం ప్రయోగించింది, మా అమ్మమ్మ. అది పనిచేసింది. ఆవిడ పక్క నున్న మగతనితో, తెలుగులో యేదో చెప్పింది. అతడు కొంత వ్యతిరేకించాడు గాని యీవిడ నచ్చచెప్పిన మీదట, భోజనం చెయ్యటానికి అంగీకరించాడు. నాకయితే రోజూ మడి ప్రసక్తి లేదు గాని ఈ రోజు అతిథుల గౌరవార్థం నేను గూడా కొద్దిపాటి మడి కట్టుకొని భోజనానికి వచ్చాను.

"ముందర మగవాళ్ళ భోజనాలు కానీండి. తరువాత మనిద్దరం కూచుందాం" అన్నది ఆడ అతిథి.

మగవారి భోజనా లయినాక ఆడవారి భోజనాలు గూడ అయ్యేసరికి మా అమ్మమ్మకీ, ఆ ఆడ అతిథికి మెల్లగా స్నేహం కుదిరింది. ఆవిడ పేరు వెంకమ్మ అనీ, ఆ పక్కన వున్న వాడు ఆవిడ తమ్ముడు నరసింహశాస్త్రి అనీ, వారిది అనంతపురం దగ్గర బొమ్మెపర్తి గ్రామమనీ, మాకు తెలిసింది. ఈ నరసింహశాస్త్రికి భాష రాకపోవటం వల్లోయేమో నోరు విప్పటం లేదుకాని, ఆ వెంకమ్మగారు మాత్రం మంచి మాటకారి. ఆవిడ మాట్లాడుతుంటే వినడానికి ఎంతో బావుంది.

భోజనా లయ్యేవరకు జయలక్ష్మి చురుకుగా పనిచేసి తల్లికి సహాయం చేసింది. ఆ వెంకమ్మగారితో కలుపుగోలుగా మాట్లాడింది.

అతిథులకు సావిట్లో చాపలు వేసి మేం దంపతుల మిద్దరం పక్కనే చతికిలబడ్డాం, పిచ్చాపాటీ కోసం.

'ఇందాక పాట పాడింది ఈ పిల్లేనా' అంది వెంకమ్మగారు, పుట్టును చూపిస్తూ సంతోషంగా. "మీరు విన్నారా యేమిటి" అంది పుట్టూ. "వినడమేమిటి ? మేమిద్దరం అరగంటసేపు ఒళ్ళు మరచి నిలబడిపోతేను" అంది వెంకమ్మగారు. అని ఒక్క క్షణం ఆగి "మా వాడికి నాదం అంటే ప్రాణం" అంది మళ్ళీ తనే. అప్పటికి ఆ కన్నడ సంభాషణ కొంత అర్థం అయినట్టుంది. "నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ" అన్నాడు నరసింహశాస్త్రి, ముఖం విప్పార్చుకొని.

ఆ మాటకు అర్థ మేమిటో నాకు తెలియదు గాని, పుట్టు మాత్రం సిగ్గుపడి మెలికలు తిరిగిపోయి పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

"లక్ష్మి ........ లక్ష్మీదేవి అవతారం........" అని వెనకాలనుంచి మెచ్చుకొంది వెంకమ్మగారు.

"సంగీతం చెప్పిస్తున్నారా" అని అడిగింది వెంకమ్మగారు పుట్టు వెళ్ళినాక.

"అయ్యో రామ ! ఈ అడవిలో సంగీతం చెప్పటం గూడానా" మా అమ్మమ్మ తను సంగీతరాగాలు తీసింది.

"ఈ వూళ్ళో ఎన్ని గడపలున్నాయి ?" వెంకమ్మగారు అడిగింది.

అలా ప్రారంభమయిన కబుర్లు మెల్లగా సాగిసాగి మా కుటుంబ కథంతా చెప్పించినాయి. మేము సోగాల వదిలి సంగమానికి ఎలా చేరామో చెప్పించినాయి. ఇక్కడి వ్యవసాయ పద్ధతులు, ఆ క్షేత్ర మహిమ, ఋషీశ్వర మహిమ, బైరాగుల సంగతులు వగైరాలన్నీ చెప్పించినాయి. ఇలా దాదాపు మా జీవిత చరిత్రంతా సంగ్రహంగా చెప్పటం అయింది. ఆ కబుర్లలో కొంత వాళ్ళ కథ కూడా తెలిసింది నాకు. మొత్తంమీద ఆ మాటలవల్ల వెంకమ్మగారు చదువుకొన్నదీ, తెలివైనదీ అనిపించింది నాకు. నాజూకూ, లౌక్యమూ కొంచెం తక్కువేకాని ఆవిడ హృదయం నిర్మలమైందని నాకు విశ్వాసం కుదిరింది. ఇప్పటికీ నాకు మా అల్లుడి మీద కన్నా వెంకమ్మగారి మీదే గౌరవం ఎక్కువ. కొంతసేపయినాక నరసింహశాస్త్రి మెల్లగా నిద్దర్లోకి జారుకున్నాడు. ఆయన కెలాగూ భాషరాదు కనుక, ఆయన కీ సంభాషణతో సంబంధం లేకుండా వుంది.

తమ్ముడు నిద్రపోవటం చూచి, తనూ ఆవలించసాగింది వెంకమ్మగారు, "ఇక పడుకుందామంటారా" అంటూ.

"సరే పడుకోండి, పాపం అసలే అలసిపోయివున్నారు" అని నేనూ ఆవలించి లేవబోతూ కేవలం అనాలోచితంగా అన్నాను.

"పాపం మీ కీ కష్టం వచ్చిందని మీ మనశ్శాంతి కోసం మీతమ్ముడు మీ చేత యాత్రలు చేయిస్తున్నాడు గాబోలు" అని.

"నా మొహానికి అంత రాత ఎక్కడిదండీ బాబుగారూ ? నేనే వాడిచేత యాత్రలు చేయిస్తున్నాను, బతిమాలీ, భంగపడీను." అక్కడావిడ పుటుక్కున ఈ సమాధానంతో నా ఆవలింత మధ్యలోనే యెగిరిపోయింది.

"అదేమిటమ్మా" అన్నాను ఆశ్చర్యంగా.

"అయ్యా, నా దుఃఖం దేవుడు గూడ తీర్చలేడు. నా పాపం అలాంటిది. కాని వీడి దుఃఖాన్ని, దేవుడు తీర్చగలడు, తలుచుకుంటే. అందుకనే పట్టుబట్టి క్షేత్రాలన్నీ తిప్పుతున్నాను." అందావిడ.

"తమ్ముడి కేదయినా అనారోగ్యమా అమ్మా" అంది మా అమ్మమ్మ జాలిగా.

"అమ్మా, అనారోగ్యమైతే హాస్పిటలు చుట్టూ తిప్పేదాన్నిగా" అని క్షణం ఆగి "వాడి కష్టం భగవంతుడు తీర్చాలిసిన కష్టం తల్లీ, మానవులు తీర్చేది కాదు" అంది వెంకమ్మగారు. ఆవిడ మాటలో తొణికిన లాడుతున్న దీనత్వాన్ని చూసి నా గుండె కరిగిపోయింది.

"అమ్మా 'సఖ్యం సాప్తపదీనం' అన్నారు. మా కథంతా అరమరికలు లేకుండా మీకు చెప్పాం. మీరెందుకు జంకుతున్నారు" అన్నాను.

ఈ మెత్తని భావం గట్టిగా గుచ్చుకొంది. "ఎంత మాట, అన్నగారూ! చెప్పుకునే దిక్కులేక అలమటిస్తున్న అల్పురాల్ని. మీరు వింటానంటే...." ఆవిడ తన వినయాన్ని వ్యక్తం చేయటానికి ఏదో పెద్ద వాక్యం వెతుక్కుంటోంది గాని, కన్నడం అంత చురుకుగా సాగక మధ్యలో విరిగిపోతోంది. అది గ్రహించి, "అమ్మా, అసలు విషయం చెప్పండి" అన్నాను. ఆవిడ ఒక క్షణం కళ్ళు మూసుకొని యేదో ధ్యానం చేసి మెల్లగా మొదలెట్టింది.

"బాబుగారూ. చెప్పాగదా మాది బండమీదిపల్లి గ్రామం. ఆంధ్రలో అనంతపురం దగ్గర. మాది పండిత కుటుంబం. నిత్యానుష్ఠానం మాకు ప్రధాన వృత్తి. మా అమ్మ చిన్నప్పుడే పోతే ఈ వెధవని నేనే చేతుల మీద పెంచాను. మా మేనమామ కూతుర్నే యిచ్చి పెళ్ళి చేశారు. పెళ్ళి అయినాక వీడు మా పక్కవూరు బొమ్మెపర్తిలో కాపరం పెట్టి అక్కడ వైదికంలో పొలం పుట్రా సంపాదించి స్థిరపడ్డాడు. అయితే వీడికి చిన్నప్పటి నుంచీ, అనుష్ఠానం పిచ్చి బాగా వుంది. వయసుతో పాటు అది క్రమంగా పెరగసాగింది. ఇలా వుండగా రెండేళ్ళ కిందట వాడి భార్య చిన్న జబ్బు చేసి వున్నట్టుండి పోయింది. వాళ్ళకు వున్న ఏకైక పుత్రుణ్ణి మాతామహులు తీసికెళ్ళి పెంచుకొంటున్నారు.

భార్య పోయిన తరువాత వీడికి జపాల ధోరణి ఎక్కువైంది. అయి, అయి చివరికి, సన్యాసం పుచ్చుకోవాలనే ఆలోచన లోకి దిగింది. నా దగ్గరకు వచ్చి చెప్పాడు. నీ సన్యాసానికి యిప్పుడు శివాజ్ఞ లేదురా" అని నాకు భగవంతుడు తోపించిన మాట చెప్పాను. కాని వాడు నామీద కస్సుమని లేచి, ఒక వృద్ధ స్వాముల వారిని "సన్యాసం యిమ్మని" పట్టుకున్నాగు. ఆయన యిస్తా నిస్తానంటూనే ఒక అయిదారు నెలలు సేవ చేయించుకొని ఉన్నట్టుండి సిద్ధిపొందాడు. అది వీడి మనస్సుకి గట్టి దెబ్బ తీసింది. దాంతో తిండీ తిప్పలూ మానేసి గురువుగారి మీద దిగులుతో చిక్కిపోసాగాడు.

నేను యెన్నో చోట్ల ప్రశ్నలూ అవీ అడిగి చూశాను. ఎక్కడకు పోయినా వీడికి పునర్వివాహ యోగమే తప్ప ఇప్పుడు సన్యాసయోగం లేదన్నారు. పైగా వివాహమయితే అన్ని విధాలా వృద్ధిలో కొస్తాడన్నారు. నాకు గూడా చేతనయినంతలో హృదయంలో ప్రశ్నించి చూసుకుంటే అదే శివాజ్ఞ అనిపించింది.

కాని ఈ మోటు వెధవ నా మాట వినడే. పెళ్ళి పేరెత్తితే కస్సుమంటాడాయె. ఇక ఏమి చేసేది? ఏమి చెయ్యాలో తోచక, చేతుల మీద పెరిగినవాడు యెటూ కాకుండా పోవటం చూడలేక, దైవానుగ్రహం వుంటేగాని వాడి బుర్ర తిరగదని ఆలోచించి, మెల్లిగా బతిమాలి యీ తీర్థయాత్రలకు ఒప్పించాను.

ఆ దైవం వీడ్ని ఎప్పటికి కరుణిస్తాడో ఎప్పటికి గట్టెక్కిస్తాడో!" వెంకమ్మగారు తన దీర్ఘ కథనాన్ని సుదీర్ఘమైన నిట్టూర్పుతో ముగించింది. ఒక క్షణం ఆగి ఏదో గుర్తు వచ్చి

"అసలీపాటికి మా ఊళ్ళో ఉండవలసిన వాళ్ళం. ఇక్కడికి రావటం కేవలం దైవలీల. మీ అన్నం ఋణం వుండి యిట్లా వచ్చామేమో" అంది.

"అదేమిటి ఇక్కడికి రావాలని రాలేదా మీరు" అడిగింది మీ అమ్మమ్మ.

"అస లిక్కడ క్షేత్రం వుందని మాకు తెలీదు. కేవలం ఆ దైవం పట్టి బలవంతంగా మమ్మల్ని యిక్కడకు తెచ్చాడు. అంతకన్నా ముక్కుకు తాడేసి మీ యింటిలో పడేశాడు" అంది వెంకమ్మగారు.

"అదేమిటి" అడిగాను నేను.

అనంతపురం బస్సు కోసం నిన్న సాయంత్రం, బెంగుళూరు బస్సుస్టాండులో కూర్చున్నాం మేము. ఎవడో ఒక బ్రహ్మచారి వచ్చాడు. ఏడేళ్ళ భడవ. వాడు ఈ సంగమం గురించి చెప్పి అక్కడికి వెడితేగాని వల్లగాదని తోమి పారేశాడు. ఆ గుంటగాడి బలవంతంవల్ల యిక్కడకు వచ్చాం మేము. అందుకనే దేవుడు లాక్కొచ్చాడు అంటున్నాను" అంది వెంకమ్మ.

ఆ సమయంలో నేను ఏ రకమైన ఆలోచనలు చేశానో ఏమిటో, ఎంత ఆలోచించుకున్నా నాకు గుర్తు రానేరావటం లేదు. అసలు నా ఆలోచనలన్నీ బిగించి పారేసి నా మనస్సు లోని గ్రంథులకు దారాలు కట్టి తోలుబొమ్మ లాడించినట్టు ఎవరో అజ్ఞాతశక్తి ఆడించిందేమో అనిపిస్తుంది నాకిప్పుడు. లేకపోతే నాలాంటి లౌకికుడు, నాలాంటి వ్యవహారజ్ఞుడు తన స్పృహలో వుంటే అలా మాట్లాడడు. నాలో ఆ సమయంలో నా స్పృహ స్థానే మరో దివ్య స్పృహ ప్రవేశించింది గాబోలు. అందుకే—

"అమ్మా వెంకమ్మగారూ! మీ తమ్ముడు వివాహం చేసుకొంటే అభివృద్ధిలోకి వస్తాడని పెద్దవాళ్ళు అన్నారు కదూ" అన్నాను నేను ఉన్నట్టుండి.

"ఎన్నిచోట్ల ప్రశ్న అడిగినా అదే మాటండీ." వెంకమ్మగారు నొక్కి చెప్పింది.

"అయితే ఓ చిన్నమాట. నాకైతే ఈ భాషల పట్టింపులు, ఈ నాడీ పట్టింపులు లేవనుకోండి. మీకు అభ్యంతరం లేకపోతే మా అమ్మాయి జయలక్ష్మిని మీ తమ్ముడికి ఇస్తాను. ఒక సద్బ్రాహ్మడి అభివృద్ధి కోసం నే నింతకన్నా చేయగలిగిం దేమి వుంది?" అన్నాను.

తెల్లబోయింది వెంకమ్మగారు. భయంగా నా చెయ్యి పట్టుకుంది మీ అమ్మమ్మ. నేను రెండవసారి నా మాట పునరావృత్తం చేశాను. అలా ఎందుకు చేశానో నాకే తెలియదు.

"బాబుగారూ, ముందు మీరు ఆ పిల్లతో మాట్లాడండి. ఇది రెండవ సంబంధం. ఆ మాట స్పష్టంగా చెప్పండి. ఆ తరువాత మా గ్రామం వచ్చి మా గురించి వాకబు చేసికోండి. ఆడపిల్ల గలవారు చెయ్యవలసిన పద్ధతి యిది" అంది వెంకమ్మగారు. ఆ కంఠం స్నేహారసంతో ఆర్ద్రమై వుంది.

"సోగాల లింగణ్ణగారి వంశంలో, గొంతులో ప్రాణా లుండగా మాట తప్పినవాడు ఇంతవరకూ జన్మించలేదు తల్లీ." నా ప్రతిజ్ఞలో, నా వెనకాల తరాలవారి రాజరికం పొడుచుకొని ముందర కొచ్చింది.

"ఋషీశ్వరుల ఆజ్ఞ" అంది మీ అమ్మమ్మ నిస్త్రాణగా! అనూహితమైన ఈ సంఘటన పరంపరకు ఆవిడ తట్టుకోలేక పోతోందని నాకు అర్థమైంది. కాని ఆవిడ గుర్తుచేసిన ఈ చివరి మాట, నాలో నఖశిఖ పర్యంతం యేదో తెలియని వణుకు పుట్టించింది సన్నగా. నన్ను నేను సంబాళించుకొనేందుకు రెండు నిముషాలు పట్టింది. ఈ రెండు నిమిషాల్లో మా దంపతులిద్దరి హృదయాలనూ పూర్తిగా చదివేస్తున్నట్టుగా వున్నాయి, వెంకమ్మగారి కళ్ళు. 'బాబుగారూ! రేపు పొద్దున్న మళ్ళీ మాట్లాడుకొందాం. ఈ పూటకు పడుకుందాం' అంది వెంకమ్మగారు నిశ్చలమైన కంఠంతో.

"అలాగే లెండి" అంటూ నేను లేచాను. నా వెనుకే మీ అమ్మమ్మ లేచింది. నేను మెల్లగా పెరటికేసి నడుస్తూ పక్కగదిలోకి చూశాను. తక్కిన పిల్లలిద్దరితోపాటు జయలక్ష్మి నిశ్చింతగా నిద్దరపోతోంది. దాన్ని చూడంగానే, ఇందాకటి అంపకాల పాట గుర్తొచ్చి మరోసారి గుండె దిగులయింది.

నేను మెల్లగా పెరట్లోకి నడిచాను. అది కేవలం మూడు గదుల యిల్లు. అందులో వంటగది కేవలం బెత్తెడు గది. పైగా అతిథులు పడుకొన్న హాలుకి ఆనుకొని వుంది. మూడో గదిలో పిల్లలు పడుకొన్నారు. కనుక ఇక మా దంపతుల మంత్రాంగానికి పెరటి దొడ్డే రంగస్థలమైంది.

అక్కడ రోటిపక్కన చెట్టుకింద సింహాసనం మళ్ళీ అలంకరించాను. కిరసనాయిలు దీపపు బుడ్డి ఒకటి చేత పుచ్చుకొని వచ్చి పక్కన కూర్చుంది మీ అమ్మమ్మ. ఏం మాట్లాడాలో యిద్దరికీ తోచలేదు కాసేపు.

"ఏమండీ! మనం తొందర పడుతున్నామా?" ముందర అమ్మమ్మ నోరు విప్పింది. ఏమనాలో తోచలేదు నాకు. కొంతసేపు వూరుకొని "ఋషీశ్వరులు ఏమన్నారన్నావు?" అన్నాను.

"మన అమ్మాయికి గూడ నిజంగా, ఋషీశ్వరుల దర్శనం అయిందని అనిపిస్తోందండి" అంది అమ్మమ్మ. అప్పటి మా పరిస్థితి ఎలా వుందంటే ఎవరి మనస్సులో గందరగోళాన్ని వారు బయటు పెట్టుకుంటున్నాం తప్పితే ఒకరి ప్రశ్నకు మరొకరి జవాబు అనే పద్ధతి నడవటం లేదక్కడ.

* * *

నేను మళ్ళీ మౌనం వహించాను. రెండు నిమిషాలాగి మీ అమ్మమ్మ అందుకుంది.

"అసలు మూడు నాలుగు రోజుల్నుంచీ మీ కొక విషయాన్ని చెప్పాలని చూస్తున్నాను. కుదరటం లేదు, ఇక యిప్పుడు చెప్పక తప్పదు."

"చెప్పు."

"ఈ మధ్య ఏటికి వెళ్ళి మంచినీళ్ళు తెమ్మని పంపించినపుడల్లా మన జయలక్ష్మి . తెగ ఆలస్యం చేస్తోంది. నేనేదో కేక లేస్తున్నాను, నడిచిపోతోంది. కాని మొన్ననో రోజున మరీ ఆలస్యమైంది. దాంతో ఎందు కాలస్యమైందని నిగ్గదీశాను. బ్రహ్మగుండందాకా వెళ్ళి, అక్కడి నీళ్ళు తెస్తున్నానంది. నాకు వొళ్ళు మండిపోయింది. ఆ మర్నాడు యింకా ఆలస్యమైంది. ఈ మాటు గట్టిగా నిలబెట్టి నిగ్గదీశాను. "బ్రహ్మగుండానికి పోయినా అంత ఆలస్యం కావటానికి వీల్లేదు. ఏం చేశావో నిజం చెప్పు" అని గదమాయించాను. దాంతో "ఇవాళ బ్రహ్మ గుండానికి పోలేదు. ఇక్కడే సంగమం దగ్గర సప్తమహర్షులు స్నానానికి వచ్చారు. అందుకని ఆలస్యమైంది" అంది. నేను అవాక్కయి పోయాను.

తరువాత నాలుగు రోజుల క్రిందట, మీరు ఆ ఆస్తి పంచాయితీ సందట్లో వుండగా, పొద్దుననగా పోయిన మనిషి సాయంత్రం నాలుగ్గంటలైనా యింటికి రాలేదు. నాకు భయం వేసింది. వెతకటానికి కిష్టప్పని పంపిద్దామంటే వాడెటు పోయాడో తెలియదు. మీకు యింటి సంగతి పట్టదు. పార్వతి మరీ చిన్నది. అందువల్ల నేనే దానికోసం వెతుకుతూ బయలు దేరాను.

సాయంత్రం నాలుగు ప్రాంతంలో బ్రహ్మగుండం దగ్గర వెదుకుతున్నాను. అప్పటికి ఎండ, నీరెండై వాతావరణం హాయిగా వుంది. ఆ కొండ చివర నుంచి చుట్టూ చూస్తే, ఆ దృశ్యం ఎంతో బావుంది. కాని నా మనస్సులో ఆదుర్దా వల్ల నేను యిటూ అటూ తిరుగుతున్నాను.

ఇంతలో ఒక చిన్న రాతి తొర్రలో మూడు ఆకారాలు కనిపించాయి. ఉబలాటంగా దగ్గరకు వెళ్ళాను. ఆశ్చర్యం! అక్కడ మన పుట్టువుంది. కాని మామూలుగాలేదు. పద్మాసనంలో, ఒళ్ళు తెలియని స్థితిలో వుంది. దాని కెదురుగా, కరపాత్ర యతీంద్రులు అదే స్థితిలో వున్నారు. వీరిద్దరికీ దక్షిణం వైపున కొద్ది దూరంలో, ఉత్తరముఖంగా ఫకీరు తాత వున్నాడు. ఆయన గూడా పద్మాసనంలో, సమాధిలో వున్నాడు.

నాకు ఆశ్చర్యమూ వేసింది, ఆనందమూ కలిగింది, భయమూ అయింది. నేను దగ్గరకు వెళ్ళవచ్చో, వెళ్ళకూడదో తెలియలేదు. వెనక్కి పోబుద్ధికాక, దగ్గరకు పోనూలేక, ఆ రాతి సొరంగం పక్కనే దొంగలాగా నక్కి కూర్చుండి పోయాను. అలా అరగంట అయిం తర్వాత కరపాత్ర స్వామివారు కళ్ళుతెరిచి "మాతా" అని పిలిచారు.

పుట్టు కళ్ళు తెరిచింది.

పైన కొద్దిసేపటికి ఫకీరుతాత గూడ కదిలాడు. కొద్దిక్షణాల మౌనం తరువాత, కరపాత్ర స్వామివారే అన్నారు, 'మాతా! ఇప్పటితో మేము ఈ క్షేత్రానికి వచ్చిన కార్యం నెరవేరింది. ఇక మేం వెళ్ళి వస్తాం' అని.

ఒకసారి కళ్ళుమూసి వెంటనే తెరిచింది పుట్టు.

"గురుదేవా, ఈ రూపంలో (ఫకీరుతాత వంక చూపుతూ) నాకు అష్టాంగ యోగవిద్యను అనుగ్రహించారు. ఈ రూపంలో (స్వాములవారి వంక చూపుతూ) శ్రీవిద్యా అనుభూతి ననుగ్రహించారు. అరూపమైన రూపంతో ఆత్మరూప సాక్షాత్కార సిద్ధిని అనుగ్రహించారు. ఇక ఈ పార్థివదేహం (తనవంక చూపుతూ) చేయదగిన సేవ యేమిటో ఆజ్ఞాపించండి" అన్నది పుట్టు.

"ఆజ్ఞ నీకు చేరవలసిన అవుసరం వుంటే, అది నీకు చేరవలసిన సమయానికి చేర్చే వుపాయం అమ్మకు తెలుసు" అన్నారు స్వాములవారు.

పుట్టూ కొంతసేపు ఆలోచించి— "నైష్ఠిక బ్రహ్మచర్యంలో వుండి ఉత్తమ సాధకులకు సహాయం చెయ్యమని తమ ఆజ్ఞా ?" అని అడిగింది. స్వాములవారు ఒక ఆనంద హాసం చేస్తూ ఫకీరుతాత వంక చూశారు.

"బేటా, నీ శిష్యుల వినోదాలను, వారికి ఆజ్ఞలుగా అనుగ్రహిస్తూ వారిని ఉద్ధరిస్తా నంటావా ?" అన్నాడు ఫకీరుతాత.

వెంటనే లేచి సాగిలపడి మొక్కింది పుట్టు, యిద్దరికీ. "గురుదేవా, నా తప్పు నాకు తెలిసింది. క్షమించండి" అంటూ.

ఆమె తలమీద చెయ్యి వేసి నిమురుతూ "మాతా! నువ్వేమీ చేయనక్కరలేదు! ఇంద్రియములు ప్రవర్తిస్తూ వుంటాయి. నువ్వు చూస్తూ వుండు చాలు." అన్నారు కరపాత్ర స్వాములవారు.

ఆ తరువాత కొద్ది నిముషాలు ఎవ్వరూ మాట్లాడలేదు. ఉన్నట్టుండి లేచి ఇద్దరికీ మరోసారి నమస్కరించి తొణుకూ బెణుకూ లేని నడకతో మెల్లిగా యింటిదోవ పట్టింది పుట్టూ. వెనక్కి తిరిగి చూస్తే నేను కనిపించేదాన్నే కాని అది వెనక్కి చూడనే లేదు. నేను సొరంగం లోకి చూస్తే వారిద్దరూ కళ్ళు మూసుకొని సమాధుల్లోనే వున్నారు. ఉన్నచోటే ఒక నమస్కారం చేసి మెల్లగా లేచి వచ్చేశాను.

అంతకుముందు ఒకసారి మాటల్లో కరపాత్ర స్వామివారు సంస్కృతంలో మాట్లాడతారనీ, ఫకీరు తాత పారశీకంలో మాట్లాడుతారనీ, ఆ రెండు భాషలూ తనకు తెలుస్తూనే వుంటాయినీ చెప్పింది పుట్టూ. కాని యివ్వాళ్ళ వాళ్ళిద్దరూ కన్నడమే మాట్లాడారు. దీని రహస్య మేమిటో నాకు అర్థం కాలేదు.

ఇంటికొచ్చాక పుట్టూ నడుగుదామంటే, నా దొంగతనం బయట పడుతుందని పూర్కుండి పోయాను. ఆ తరువాత నాలుగు రోజుల్నుంచీ, ఆ కరపాత్ర స్వామివారుగాని, ఆ ఫకీరు తాతగాని కనబడటం లేదు. ఇదంతా మీకు చెప్పాలని నాల్గు రోజుల్నుంచీ తపన పడి పోతున్నాను. ”

మీ అమ్మమ్మ తన సుదీర్ఘ కథనం పూర్తి చేసేసరికి నాకు మనస్సు మరింత తేటపడింది.

“ దివ్యశక్తి యొక్క విశ్వప్రణాళికలో ఒక అంకం జరుగుతోంది. ఏది ఎలా జరగాలో అలా జరిగిపోతోంది. ఇందులో మనం చెయ్యగలిగిందీ లేదు, చెడగొట్ట గలిగిందీ లేదు. ” అన్నాను నేను ఒక్కొక్క మాటే ఒత్తి పలుకుతూ.

ఈ మాట మీ అమ్మమ్మకు అర్థం కాలేదు. అందువల్ల దాన్ని కొంత వివరించవలసి వచ్చింది. ఆ వివరణ అయి విషయం తెలిశాక “ చెయ్యగలిగిందీ, చెడగొట్ట గలిగిందీ లేక పోయినా, జరిగేదాన్ని చూసి సంతోషించటమో, అసంతృప్తితో అలమటించిపోవటమో, ఈ రెండింటిలో యేదో వకటి మనం చెయ్యగలం గదా ? ” అన్నది.

చదువులేదనీ, తెలివితక్కువదనీ నే ననుకొనే మీ అమ్మమ్మ నోట ఆ మాట విని నేను లోలోపలే తత్తరపడ్డాను. కనిపించని కొరడాదెబ్బ యిది అనుకొన్నాను. “ ఇంకేం చేద్దా మంటావు” అన్నాను కొద్దిగా ఆగి. సమాధానం రివ్వున వచ్చేసింది. “నాకు ఈదివ్య ప్రణాళికలూ గిణాళికలూ తెలియవు. మీరు చెయ్యమన్న పని నేను చేస్తాను. మా అమ్మ నాకు నేర్పిన ధర్మం యిదే ”

తన నోటితోనే ‘ ఔను ’ అనిపిద్దామని నేను చేసిన యత్నం దీంతో వీగిపోయింది. ఇక నా అభిప్రాయం సూటిగా బయటపెట్టక తప్ప లేదు. “ చూసి సంతోషిద్దా మనుకుంటున్నాను నేను ” అన్నాను.

“ ఆ వెంకమ్మగారితో మాట్లాడే ముందు, మీరీ ఆలోచనంతా చేసే మాట్లాడారా ? ” అనడిగింది మీ అమ్మమ్మ.

ఈ ప్రశ్న నే నూహించినది కాకపోవటం వల్ల నేను తత్తరబిత్తర పడాల్సి వచ్చింది.

“ చూడు. ఈ విషయంలో అసంభవా లనుకొన్నవన్నీ సంభవా లవుతున్నాయి. దీన్నే గాబోలు అఘటన, ఘటన అంటారు. ఇవాల్టి నా ప్రవర్తన గూడ ఒక అఘటన, ఘటనే ! అయితే ఇది ఎవరి శక్తో మాత్రం నాకు తెలీదు ” అన్నాను ఆలోచించుకుంటూ !

“ ఋషీశ్వరులది ” మీ అమ్మమ్మ కుండ బద్దలు కొట్టినట్టు చెప్పింది.

“కాదనటానికి నా దగ్గర సాక్ష్య మేమీలేదు ”. నా వాదన నీళ్ళు నమిలినట్లుగా వుందని తెలుస్తోంది.

“ఔననటానికి అమ్మాయి సాక్ష్యం చాలదా? ”

ఈ క్రాసు పరీక్షలో నేను ఓడిపోయాను. కానీ ఇంతలో మెరుపులా నాకో ఆలోచన వచ్చింది.

"ఔను! అమ్మాయి అభిప్రాయ మేమిటో సరిగా తెలుసుకోకుండా మనం పై ఆలోచనలు చేస్తున్నాం. ఇది మంచిది కాదేమో!"

"దాని అభిప్రాయం మనకు ముందే తెలుసుగా"

"ఈ దైవప్రేరణ వాళ్ళని నమ్మరాదు. నాకు దైవప్రేరణ మళ్ళీ మరో విధంగా వచ్చింది అంటే యేమి చేస్తావు?"

"నాకు దాని మీద ఆ అపనమ్మకం లేదు."

"ఆ వెంకమ్మగారు గూడ ముందు దాని అభిప్రాయం తెలుసుకోవాలందిగా."

"అలా అనటం ఆవిడ మంచితనాన్ని చెపుతుంది. అంతకన్న ఎక్కువ ఆ మాటను పట్టించుకోనక్కరలేదు"

"అంతేనంటావా"

"మీ రాలోచించాల్సింది మరోటి వుందనలు"

"ఏమిటది?"

"ఆ నరసింహశాస్త్రి గారు ఈ పెళ్ళికి ఒప్పుకుంటాడో, ఒప్పుకోడో అని"

"నిజమే నేవ్".

"కాని నాకు ఆ భయంగూడా లేదు."

"ఎందువల్ల"

"ఋషీశ్వరుల సంకల్పం వుందిగా."

"నీ బుర్రలో ఇంత పాదరసం చేరటం, పూర్వం నేను చూడలేదు సుమా"

"సరేలెండి, అయినా మన ప్రయత్నం కొంత అవసరము కావచ్చు."

"అదేమిటి మళ్ళీ! ఋషీశ్వరుల సంకల్పం వుందన్నావుగా"

"సంకల్పం నెరవేరేందుకు కొంత తతంగం జరగాలిగా"

"అంటే"

"మీ మనస్సు మారేందుకు, వెంకమ్మగారి వాక్చాతుర్యం పనిచెయ్యలా! అలాగే"

"నేనేం చెయ్యాలంటావు? నాకా చాతుర్యాలూ, చాకచక్యాలూ లేవే మరి"

"అస్తులు పంపమంటే పంచుతారు?"

"సందు దొరికితే దెప్పందే వదలవుగదా"

"వినండి మరి. రేప్పొద్దున్న మీరే చొరవ తీసుకొని పెళ్ళికొడుకుని కొంచెం బతిమాలండి."

"నాకేం కర్మ"

"లేకపోతే అతను వ్యతిరేకించవచ్చు"

"ఆయన నాకు మళ్లె నాస్తికుడు కాదుగా. ఇది ఋషీశ్వరుడి సంకల్పం అని చెప్పి నోరు మూయిస్తే పోలా"

"మంచి మామగారే. ఆయన నాస్తికుడు కాదు గానీ, బాగా మొండివాడని ఆ అక్కగారు చెపుతూనే వుందిగా."

"ఇదో పాయింటు లాగావూ"

"మొండివాళ్ళ దగ్గర కొంచెం వోడిపోయినట్టుంటే మనం దిగ్విజయంగా జయించవచ్చు."

"పెసినీ, ఇన్ని వుపాయాలు నీ కెలా తెలిసాయే"

"కొత్తగా తెలిసేదేముందీ, ఇది నేను రోజూ చేసే ఉపాయమేగా."

"నోరు ముయ్యి."

"ఇంతకూ రేపు...."

"సరే, నీకు ఓడిపోయానని ఎలాగో తెలిసిపోయిందిగా! అల్లుడి దగ్గర గూడ ఓడిపోతాను. ఏం చేస్తాను, ఆడపిల్లని కన్నాక ?"

"ఆడపిల్లని కనటం ఏమిటండీ ? అమ్మవార్ని కన్నారు మీరు. పూర్వజన్మలో, ఏ సముద్రుడో, ఏ హిమవంతుడో మీరు."

ఈ కవిత్వం వినేసరికి నవ్వు వచ్చింది. ఆ నవ్వు దగ్గుగా మారి కొద్దిగా కొరబోయింది.

దాంతో, "మీకీ మధ్య సొలం కాపలాలు మరీ ఎక్కువై పోయి, మంచు పడకుండా పోతోంది! నడవండి, నడవండి ఇంట్లోకి" అని తొందరపెట్టింది మీ అమ్మమ్మ.

"విషయం తేల్చుకున్నాం గదా ! మిగిలిన విషయాలు రేపు తెల్లవారేక చూచుకుందాం" అంటూ తనే యింట్లోకి ముందు దారితీసింది.

అప్పటికి దాదాపు యే రెండో దాటి వుండాలి. మేం యింట్లోకి వెళ్ళేసరికి పుట్టూ, బిర్రబిగుసుకొని తలకింద దిండులేకుండా వెల్లకిలా పడుకొని నిద్దరపోతోంది. అపరరాత్రి దాటిం దగ్గరనుంచీ అలా బిర్రబిగిసి నిద్దరపోవటం దానికి చిన్నప్పటినుంచీ అలవాటే. మిగతా వారంతా ఆదమరచి నిద్దరపోతున్నారు. మీ అమ్మమ్మ పోయి పిల్లల పక్కన పడుకొంది. నేను ఆ చిన్న వంటింటిలోనే చాపమీగ వాలాను. నేను అటూయిటూ దొర్లి నాకు గాస్త కునుకు బట్టేసరికి తొలికోడి కుయ్యనే కూసింది. వెంటనే వెంకమ్మ గారు లేచి కూర్చుంది.

నాకు కలత నిద్దరగా వుంది. మధ్యలో మళ్ళీ ఒకసారి మెళుకువ వచ్చి తలెత్తి తిరిగి చూసేసరికి చాపమీదే వెన్ను బిగించుకుని కూచుని వుంది వెంకమ్మగారు.

"ఇంకేం? పుట్టూకు తగ్గ జాతే" అనుకొన్నాను.

మళ్ళీ మరో కునుకు పట్టి మెళుకువ వచ్చేసరికి అక్క తమ్ముడు మూటలు చేత బట్టుకొని, గోడ కానుకొని ప్రయాణానికి సిద్ధంగా కూచుని వున్నారు.

అది చూసేసరికి నా మత్తు దిగిపోయింది. నేను వెంటనే లేచి వళ్ళు విరుచుకొని సావిట్లోకి అడుగు పెట్టేసరికి, నా అలికిడి వింటూనే వెంకమ్మగారు, గోడకేసి తిరిగి కూర్చుంది.

పొద్దున్నే తన మొహం చూస్తే నే నేదయినా బాధ పడతానేమో అని, అటు తిరిగిందని షా కర్థమైంది. నా కలాంటి మూఢ నమ్మకాలంటే వళ్ళుమంట. కానీ పాపం ఈవిడలో ఉన్న నిజాయితీకి, ఇతరులు నొచ్చుకోరాదన్న తపనకి నేను ద్రవించిపోయాను. నన్ను చూస్తూనే లేచి నిలబడి రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ " అయ్యా! శలవు, వెళ్ళి వస్తాం! ప్రాణ దాతలు" అన్నాడు నరసింహశాస్త్రి.

నేనది పట్టించుకోకుండా"అమ్మా వెంకమ్మగారూ ! నేనంత చూడదగని వాణ్ణా తల్లీ." అన్నాను. ఆవిడ నిజంగానే నొచ్చుకుంది.

"ఎంతమాట బాబుగారూ, ఎంతమాట" అంటూ ఇటు తిరిగింది. ఆవిడ యిటు తిరిగేసరికి మెరుపులాగ వచ్చి పుట్టూ ఆవిడ కాళ్ళకు దణ్ణం పెట్టింది. నే నాశ్చర్యపోయాను. వెంకమ్మ గారి కళ్ళవెంట నీళ్ళు జలజలా రాలినాయి. ఆవిడేదో ఆశీర్వదించబోయి నోట మాట రాక తటాలున వంగి పుట్టూను లేవదీసి కౌగలించుకొంది. పక్కనున్న శాస్త్రి ఇది చూసి, "యోగ్యురాలు, యోగ్యురాలు. శుభమస్తు, శుభమస్తు" అని చిద్విలాసంగా నవ్వుతూ, బుర్ర ఊపుకుంటూ తను దీవించసాగాడు.

"నాకు తగ్గ బోళా శంకరుడివయ్యా బాబూ" అనుకొన్నాను లోలోపల. వెంకమ్మ గారు కాస్త స్థిమిత పడటం గమనించి "ముందు దంత ధావనం కానీండి" అని వెంకమ్మగారితో అని, వెంటనే "అమ్మాయి పుట్టూ! పందుం పుల్లలూ, నీళ్ళూ చూడమ్మా" అన్నాను.

నా మాట అర్థమయినట్టుంది.

"అబ్బెబ్బే. ఏమక్కరలేదు. అన్నీ ఏటి దగ్గరే చేసుకుంటాము. ఆశ్రయం యిచ్చారు. ప్రాణాలు నిలిపారు. కృతజ్ఞులం. వచ్చిన పనైపోయింది. ఇక సెలవు"అన్నాడు నరసింహ శాస్త్రి గబగబా! అతను అంత వేగంగా మాట్లాడేసరికి, ఆ తెలుగు నాకు బొత్తిగా అర్థం కాలేదు. వెంకమ్మగారే దాన్ని అనువదించి తను గూడ దానికి మద్దతు పలికింది.

ఒకసారి పుట్టూ వంక చూశాను. దాని చూపులు నిశ్చలంగా వున్నాయి. దాని ముఖంలో ఏ భావమూ వ్యక్తం కావటం లేదు. ఇంతలో మీ అమ్మమ్మ లేచి వచ్చింది జుట్టు సరిచేసుకుంటూ, ఆవలించుకొంటూ.

"బయలుదేరుతా మంటున్నారు" అన్నాను, ఆవిడను చూస్తూనే.

"అప్పుడే తెల్లారిందా యేమిటీ" అంటూ వాకిట్లోకి తొంగి చూసింది ఆవిడ.

మేమున్న లోయ ప్రాంతానికి సూర్యోదయ సౌందర్యం కథల్లో చదువుకునే విషయం మాత్రమే. పక్షుల కూతల్ని బట్టీ చీకటిలో కనిపిస్తున్న నిస్తాణ్రను బట్టి సూర్యోదయం అవుతుందని అభ్యాసంవల్ల మేం గ్రహించగలం.

ఏ పంచాంగాల గణితాలతోనూ పనిలేని, ఆవుదూడలు అప్పుడే గజ్జెలు గలగల లాడిస్తూ చెంగుచెంగున దూకుతూ వున్నాయి. ఈవిడ తలుపు తీయటం ఎప్పుడు గమనించిందో, ఆవు దూడొకటి తోసుకుంటూ లోపలికి జొరబడి పుట్టూ దగ్గరకెళ్ళి మోరచాచి ముద్దులు కుడుస్తోంది.

అలా వాకిట్లోకి ఓ క్షణం తొంగిచూచి "పిన్నిగారూ, పాచినోటితో అంటున్నానని అనుకోవద్దు. ఏదో అర్ధరాత్రి వచ్చారు. ఏదో తడీపొడీ అన్నం తిన్నారు. అది మాకు తృప్తిగా లేదు. ఈ పూట వుండి భోజనం చెయ్యందే మీరు వెళ్ళటానికి వీలులేదు" అంది మీ అమ్మమ్మ.

"అలాకాదు లెండి, నా మాట వినండి" వెంకమ్మగారేదో చెప్పబోయింది.

"అసలయినా, వెనకనించి భోజనం అంటుంటే ప్రయాణం చెయ్యరాదు. అది అచ్చిరాదు." కొత్త లా పాయింటు వేసింది మీ అమ్మమ్మ. వెంకమ్మగారు మెత్తపడి పోయిందని ఆవిడ మొహం చెప్పక చెపుతోంది.

"అహా! మూఢాచారాలవల్ల గూడ ఒకోసారి మంచి ఫలితం వుంటుంది సుమా" అనుకొన్నాను నేను.

ఆ వెంకమ్మగారు కాసేపు తమ్ముడితో సంప్రదించి 'సరేలెండి. ప్రాణదాతలు మీ మాట కాదంటం గూడ ధర్మం కాదు' అని ఒక క్షణం ఆగి 'మేం యేటికి వెళ్ళి మొహాలు కడుక్కొని, స్నానాలూ జపాలూ పూర్తిచేసుకొస్తాం' అని స్నానాలకు కావలసిన బట్టలు వగైరా, చేతబుచ్చుకొని మూటలు యింట్లోనే వుంచి అక్కా తమ్ముడూ సంగమానికి బయలు దేరారు. వాళ్ళటు వెళ్ళంగానే "వెలుతురు వస్తున్నా మెళుకువరాదు. ఏం మొద్దు నిద్దరో యేమో; చుట్టాలు గూడ వచ్చారు. అప్రతిష్ఠ గూడాను. లేవండర్రా" అని పిల్లల్ని నిద్దరలేపింది మీ అమ్మమ్మ.

"ఔను, ఆ రోజుల్లో ఆస్తికత్వం, నాస్తికత్వం ప్రశ్నకాదు. తెల్లారకముందు నిద్దర లేవనివాడంటే పనికిరాని చవటన్నట్టుగా చూసేవాళ్ళు. ఎవరూ లేపకుండానే గొడ్లులేస్తాయి,

పక్షులు లేస్తాయి సకాలానికి. మనిషిమాత్రం బారెడు పొద్దెక్కినా నిద్ర లేవడు. ఇది యివాళ్ళటి నాగరికత. సరే అదలావుంచు. నేను కాస్త విశ్రాంతిగా పళ్ళు తోముకొచ్చేసరికి అప్పుడే పుట్టూకి జడ వేస్తోంది మీ అమ్మమ్మ. రోజూ తెల్లారేసరికి సంగమానికి పోయి స్నానంచేసి రావటం దాని అలవాటు. ఔను ఇది సంగమానికి ఎప్పుడు వెళ్ళొచ్చింది?" అనుకున్నాను లోపల.

నా ఆలోచనలు చదివినట్టుగా సమాధానం చెప్పింది మీ అమ్మమ్మ.

"ఇవాళ ఇంట్లోనే స్నానం చేసింది. సంగమానికి పోదుట....సిగ్గు" అని ఒక క్షణం ఆగి "ఇవాళ తలమీద స్నానం చేయరాదట." అంది నుసినుసి నవ్వులు నవ్వుతూ.

ఆ తరువాత చాలా సంవత్సరాలకి గాని నాకు తెలియలేదు. "సుమంగళ స్త్రీలు వివాహాది శుభసమయాలలో నదీస్నానంగాని, శిరస్నానంగాని చెయ్యరు" అని. ఎంత సేపటికీ, దించుకొని వున్న తల ఎత్తని పుట్టూని చూసి నేను సంజ్ఞలతో అడిగాను, మీ అమ్మమ్మని 'ఏమంటోంది' అని.

"ఆయన ఇంట్లోకి వస్తూనే మేం బ్రాహ్మలం అన్నాడే అప్పుడే ఖాయం చేసుకొందట" అన్న దావిడ.

"ఋషిగారి ఆజ్ఞగదా! ఇక నోరెత్తరాదు గాబోలు"అన్నాను నేను. ఈ మాట నేనన్నప్పుడు కేవలం అనాలోచితంగా అన్నాను. దానికి, పుట్టూకి కళ్ళనీళ్ళు తిరుగుతాయని నేనూహించలేదు.

"నాకు బాగా నచ్చాట నాన్నా. ఆయన నాకు జన్మజన్మల బంధువు". ఏడుపు దిగమింగుకుంటూ యీ మాటలను ఎంతో సౌమ్యంగా పలికింది పుట్టూ. కానీ నా వొంటిమీద సూదుల చెమికీతో చరచరా బాదినట్లు అనిపించింది. ఒక్క క్షణం ఒక పెద్ద నిట్టూర్పు వదలిగానీ తేరుకోలేక పోయాను.

"చూడు తల్లీ? ఏమీ అనకుండానే అంత నొచ్చుకున్నావు. రేపు బంధువుల్లో ఎన్ని రకాల ఘాటు లొస్తాయో ఏమో! నువ్వు తట్టుకోగలవా? అని ఆలోచించాల్సి వస్తోందమ్మా" నా బాధ సందేహంగా వ్యక్తమైంది.

"ఇంకోళ్ళ నయితే నోరెత్త నిస్తానా యేమిటి?" చప్పున వచ్చింది సమాధానం.

"ఆ! మీ కూతురు కాదా ఏమిటి? పులిపిల్ల" అని పకపకా నవ్వింది మీ అమ్మమ్మ.

ఆ అంశంమీద నేను అంత తీక్షణంగా మధనపడుతుంటే ఈవిడింత తేలిగ్గా కొట్టి పారేస్తోందేమిటా అనుకున్నాను గాని, ఇంటి విషయాల్లో వాకన్నా తనే తెలివయిందని నాకు తెలుసు గనుక ఇక వూరుకున్నాను.

సంచెయ్యాలో తోచక నేను వాకిట్లో కొచ్చాను. తోచకే అల్లా అల్లా నడవసాగాను. కొంతసేపయ్యేసరికి సంగమం దగ్గరకొచ్చాను. అక్కడ అక్క. తమ్ముడు చెరో బండమీద జపాలు చేసుకొంటున్నారు.

ఏరు హొంగు తీసివుంది. ఏటివొడ్డున గల ఇసుక పొరలు మెరుగుపెట్టినట్టు మెరుస్తున్నాయి. బరబరా పాకి వస్తున్న వర్షాకాలపు నీరెండ పొడలు ఏటి కెరటాలకు చక్కలిగింతలు పెడుతు న్నాయి గాబోలు. అవి తుళ్ళి తుళ్ళి పడుతున్నాయి. అపుడే కొందరు రైతులు, అరకలు బుజాన పెట్టుకొని యెడ్లను ఏరు దాటిస్తున్నారు. వారంతా మెట్టపంటల బాపతువారు. వాళ్ళేదో నన్ను పలకరించబోయారు గాని నేను పరధ్యానంలో వుండటం చూసి వెళ్ళిపోయారు.

నేను స్నానం చేసి ఏటిగాలికి తడిబట్ట ఆరబెట్టుకుంటూ ఏరుదాటి అలా సంగమేశ్వ రాలయందాకా వెళ్ళాను. వెళ్ళాను గదా అని, గుళ్ళోకెళ్ళి, కాస్త విభూతి మొహాన పెట్టుకొని ఆరిన బట్టలు కట్టుకొన్నాను.

* * *

## ధర్మబంధం

నాకు చిన్నప్పటినుంచీ యింట్లో అయిన అలవాటు మూలంగా కాస్త విభూతి రాసు కోవటం, దేవుడికో దణ్ణం పెట్టటం తప్పిస్తే వేరే పూజలూ, జపాలూ చేతకావు.

అలవాటు చొప్పున ఆ సంగమేశ్వరుడి కోదణ్ణం పెట్టి మళ్ళీ సంగమానికి వెళ్ళాను. ఆ సరికి జపం పూర్తిచేసి నిలబడి ఏవో స్తోత్రాలు చదువుతున్నాడు నరసింహశాస్త్రి. నన్ను చూడం గానే పలకరింపుగా నమస్కారం పెడుతూ నవ్వాడు.

నేను పక్కనే ఇసకలో చతికిలబడుతూ 'మీరు మా మూడొ అమ్మాయిని చూశారుగా' అన్నాను. కన్నడం అర్థంకాక అతను అయోమయంగా చూశాడు. ఇంతలో వెంకమ్మగారు అందుకొని మా యిద్దరికీ 'దుబాసిగా పని చేసింది.

"తమకు ఒక్కతే కూతురు గదా" అన్నాడు శాస్త్రి. అప్పుడు నేను మా కుటుంబ చరిత్ర సంగ్రహంగా చెప్పి వాళ్ళు చూసింది మా మూడో పిల్లనని వివరించాను. ఆ తరువాత పుట్టూ భక్తిని, ఆచార శ్రద్ధనీ కొద్దిగా వివరించ్చాను. అంతా అయినాక—

"ఇంతకూ మా అమ్మాయి ఎలా వుంది తమకు" అన్నాను మళ్ళీ.

"అమ్మవారల్లే వుంది" అన్నాడు శాస్త్రి.

"కళ్ళల్లో యోగికళ వుంది." వెంకమ్మగారు మరో మాట చేర్చింది.

"ఆ పిల్ల పెళ్ళి ప్రయత్నాలలో వున్నానండీ." విషయం ఎలా మొదలు పెట్టాలో నాకూ తికమకగా వుండి ఇలా అన్నాను.

నే నేదో ప్రశ్న వేశానని అత ననుకున్నట్లుంది. టక్కున కళ్ళు మూసుకొని వేళ్ళు లెక్క పెట్టసాగాడు. ఒక క్షణం ఆగి, "మీరు ప్రశ్న వేసిన వేళ దివ్యమైన వేళ. ఈపాటికి సంబంధం ఖాయమైపోయి వుండాలే. ఇంకా పదిహేను రోజులు, మహా అయితే నెలరోజుల్లోపల ఆ పిల్ల పెళ్ళి అయి తీరుతుంది. ఇటు సూర్యుడు అటు పొడిచినా సరే" అన్నాడతను ఢంకా మ్రోగించినట్టు.

"మా వంశం, సంప్రదాయం అన్నీ మనవి చేశాకదా తమకు" మళ్ళీ నేను నా ధోరణిలోకి వచ్చాను.

"అమ్మమ్మా, గొప్ప వంశం. దానికి వంకేమిటి"

"రాత్రి మీ అక్కగారూ, నేనూ కాసేపు సద్గోష్ఠి చేసుకొన్నాం."

"మీక్కూడా వేదాంతం పిచ్చి వుందా యేమిటి?"

"నా మొహం నా కివన్నీ ఏమీ తెలియవు కానీండి, మీ కుటుంబం, మా కుటుంబం ఆచారాలూ, వ్యవహారాలూ ఇవన్నీ కాసేపు తవ్విపోసుకున్నాం"

"అహా!"

"మీ చరిత్రంతా గూడా వివరంగా తెలుసుకున్నాను."

"చిత్తం"

"మీ మీద నాకు మంచి గౌరవభావం కలిగింది."

"తమ దయ."

"మీరు చూశారే, ఆ పిల్లదాన్ని. మీ కియ్యాలని మా కోరిక. మీ రంగీకరిస్తే సంతోషిస్తాను."

ఈ మాట విని ఉలిక్కిపడ్డాడు నరసింహశాస్త్రి. ఏం చెప్పాలో చేతకాక దిక్కులు చూశాడు. ఒక క్షణం ఆగి "మేం వచ్చిన పని వేరు. మీరిక ఈ ప్రసక్తి మా దగ్గర యెత్తటం బాగోదు" అని కుండ పగలగొట్టి పారేశాడు.

తల గిర్రున తిరిగిపోయింది. ఏం చెప్పాలో తోచలేదు. ఆ ఋషీశ్వరుల సంకల్పం ఇంత టప్పున ఎగిరి పోతుందని నే ననుకోలేదు. నేనిలా అవాక్కయి పోయివుండగా అక్కాతమ్ముళ్ళకు లడాయి పడ్డది.

"ఒరేయ్, యివాల్టి నుంచీ పదిహేను ఏళ్ళదాకా నువ్వికే తద్దినాలు పెట్టక్కర్లేదురా" అంది వెంకమ్మగారు.

పెళ్ళికి, తద్దినానికి సంబంధం ఏమిటో తెలీక నేను మరింత తికమక పడిపోయాను. నేనేమిటి! ఆవిడ తమ్ముడూ తెల్లమొహం వేసి "ఏం" అన్నాడు.

"ఏమా? నీకు తోచినట్టు చెయ్యటమేనా? ఏదైనా శాస్త్ర ప్రామాణ్యం వుందా?" వెంకమ్మగారు వెటకారంగా దెప్పింది.

"శాస్త్ర వాక్యం లేకపోతే ఇటు కాలు అటు పెట్టం. ఏమనుకొంటున్నావో" శాస్త్రి ఉక్రోషంతో లేచాడు. అతనికి ఉగ్రం వస్తే తట్టుకోటం కష్టమని నాకూ అప్పుడే అర్థమయింది.

"అలాగేం! అలా అయితే రంకె వెయ్యకుండా అడిగిన దానికి శాస్త్రీయంగా సమాధానం చెప్పు." ఇక శాస్త్రచర్చ మొదలవుతోంది అన్నమాట అనుకున్నాను నేను.

"అడుగు" సవాలు చేశాడు శాస్త్రి.

"పిల్ల నిమ్మని ఈయన్ని మనం అడిగామా?"

"మనకేం కర్మ?".

"ఈ వెధవ సమాధానాలు వద్దు. ఇది శాస్త్రచర్చ. శాస్త్రీయమైన సమాధానం చెప్పు."

"సరే. అడగలేదు."

"ఇప్పుడు మనం ఉన్నచోటికి ఆయన వచ్చాడా, ఆయన వున్నచోటుకి మనం వెళ్ళామా?"

"మనం వున్నచోటుకే ఆయన వచ్చాడు."

"అంటే నువ్వు ఆయన్ని అడగకుండానే, అయనంత ఆయనగా నువ్వున్నచోటికి తను వచ్చి, నీకేదో యిస్తానంటున్నాడు. నువ్వు వద్దన్నావు, అంతేనా?"

"అంతే.

"అలా చేస్తే వాళ్ళ పితృదేవతలు పదిహేనేళ్ళుపాటు ఉపవాసం వుంటారని మనువుగారు చెప్పారు. దానికి నేనేం చేసేది? అందుకే నువ్వు తద్దినాలు పెట్టటం అనవసరం అన్నాను."

ఈ సందర్భంగా వెంకమ్మగారు ఏవో * శ్లోకాలు రెండు చదివింది. నాకవి గుర్తులేవుగాని, ఆ శ్లోకాలు విన్న నరసింహశాస్త్రి తెల్లమొహం వేసి వెర్రిచూపులు చూసి కాసేపు ఆలోచించి అక్కగారి చెయ్యి పట్టుకొని దూరంగా తీసుకెళ్ళాడు, యేదో మంతనాలు చేయటానికి.

ఆ మంతనాలు దాదాపు అరగంటపైగా సాగినాయి. నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

---

* మను స్మృతిలోవి శ్లోకాలవి అయివుంటాయి.

ఆహృతాభ్యుద్యతాం భిక్షాం పురస్తాద ప్రచోదితాం।
మేనే ప్రజాపతిర్గ్రాహ్యామపి దుష్కృత కర్మణః॥
నాశ్నంతి పితర స్తస్య దశవర్షాణి పంచచ।
నచహవ్యం వహత్యగ్ని ర్యస్తామభ్యవమన్యతే॥ మనుస్మృతి అధ్యా 4, శ్లో. 248, 249

అరణ్య మదగజం లాగా ఘీంకరిస్తున్న చెట్టంత మనిషిని ఒక చిన్న శాస్త్రవాక్యంతో బంధించి పారేస్తోంది ఆ వెంకమ్మగారు.

మా కుటుంబంలో అంతా ప్రధానంగా లౌకిక జీవనులు. శాస్త్రాలను చదువుకొన్న వారిని సత్కరించటమే తప్ప మా యిళ్ళలో యిలా శాస్త్రచర్చలు జరిగే అదృష్టం మాకు పట్టలేదు. అదీగాక గత మూడు తరాలుగా, ఏ తరానికి ఆ తరం కొత్త వృత్తులు వెదుక్కొంటూ జీవిస్తున్న కుటుంబం మాది.

ఈ భారతదేశంలో మానవుల సమస్త ప్రవృత్తులనూ, ఇచ్ఛలనూ, ఉద్రేకాలనూ, ఆవేశాలనూ శాస్త్రం నిర్నిబద్ధంగా శాసిస్తూ వుంటుందనీ, ఇదే భారతదేశపు ప్రత్యేకత అనీ గ్రంథాలలో చదివినప్పుడు, ఎక్కిరింతగా నవ్వుకునే వాణ్ణి నేను. ఇవాళ ఈ సంఘటన చూసి నాకేదో కొత్తగా, కన్నులు తెరుచుకున్నట్టు అనిపించింది.

శాస్త్ర పరాధీనుడై విలవిలలాడుతున్న ఆ వెర్రి బ్రాహ్మణుణ్ని చూస్తే ఎప్పుడో తప్పిపోయిన బంధువుని మళ్ళీ కలుసుకొన్న ఆనందం కలిగింది నా మనస్సుకు ఆ క్షణంలో.

ఔను. నేను గూడా యిలాగే శాస్త్ర శాసనాలే ఊపిరి తిత్తులుగా జీవించిన మహర్షుల మహాధారలో పుట్టిన జీవినే! ఈ రక్తంలో గూడా ఆ సారమే ప్రవహిస్తోంది. ఈ నాడుల్లో గూడా ఆ స్వరాలే ప్రతిస్పందిస్తున్నాయి. కాని ఏ జన్మలోనో చేసిన యే స్వల్ప దోషానికో ఫలితంగా, ప్రవాహంలో పక్కకు నెట్టబడి, యేటి వొడ్డున గల చచ్చిన చెట్టు వేళ్ళలో యిరుక్కుపోయాను.

సంగమేశ్వరుడి కరుణ వుంటే ఆ కరుణ ఏరైపొంగి, ఆ ఏటి వేగానికి చెట్టు వేళ్ళ చిక్కుల్లోంచి బయటు పడాలి నేను. అప్పుడు నేను కాకపోయినా, నా పిల్లలయినా. కనీసం వాళ్ళ పిల్లలయినా మళ్ళీ యీ నేలలో మొలిచిన మొక్కలై ఇక్కడి పూలను ఆకాశాని కెత్తుతారు. ఇక్కడి సువాసనలను దిక్కులకు వెదజల్లుతారు.

జీవితంలో మొదటిసారి సంగమేశ్వరుడికి భక్తిగా, నమస్కరించాను. "తండ్రీ! మళ్ళీ నన్ను నీ బాటలోకి చేర్చుకో" అని. ఒకసారి గుళ్ళోకి వెళ్ళి దణ్ణం పెట్టి వద్దాం అనిపించింది.

"అక్కరలేదు. సంగమేశ్వరుడు ఇక్కడ లేడా యేమిటి" అంది మనస్సులోని మరో పొర.

---

(తన దగ్గరకు ఎదురుతెచ్చి సమర్పింపబడినదియు, అంతకు మునుపే ప్రార్థన చేయబడనదియు అగు భిక్షను పాపాత్ముని కడ నుండియైననూ స్వీకరింప దగునని ప్రజాపతి శాసించెను. అట్టి భిక్షను ఎవడు అవమానించునో అనగా తిరస్కరించునో వాని పితృదేవతలు పదునైదు సంవత్సరముల పాటు భుజింపరు. అగ్ని వాని హోమ ద్రవ్యములను దేవతలకు చేర్చడు.)

— 125 పేజీలోని రెండు శ్లోకాలకు అర్థం.

"నీ మొహం! నీ సర్వవ్యాపిత్వ సిద్ధాంతం, గుళ్ళో లింగాన్ని దేవిరించినపుడే మంట కలిసింది" అన్నది మొదటి పొర.

దీంతో నా మనస్సులో పెద్ద కల్లోలం ఏర్పడింది. ఈ కల్లోలంలో పడి నే నెంతసేపు వున్నానో నాకు తెలియదు.

అక్కడ సనగుస శాస్త్ర చర్చలు చేస్తున్న అక్క, తమ్ముడూ నా దగ్గరకు వస్తూ వుండటం కనిపించేసరికి, నా ఊహాలోకపు ఆలోచనలన్నీ పక్కకు పెట్టి ప్రస్తుత ప్రపంచానికి దిగాను.

"బాబుగారూ! మావాడు కొంచెం తొందరపడ్డాడు. తమరు క్షమించాలి." అంది వెంకమ్మ గారు దగ్గరకొచ్చి. పంతులు వెనకాల నుంచున్న బడిపిల్లవాడిలాగ, ఒదిగి నుంచున్నాడు నరసింహశాస్త్రి. వెంకమ్మగారి ముఖం సంతోషంతో వెలిగిపోతోంది. తన సంతోషం పైకి కనపడకుండా వుంచాలని, ఆవిడ ప్రయత్నం చేస్తోందని గూడ నా కర్థమవుతూనే వుంది.

"ఆయన మనస్ఫూర్తిగా ఒప్పుకున్నట్లేనా"? అన్నాను. మనమూ కొంచెం బెట్టు చేద్దాంలే అనిపించి.

"మీ అమ్మాయి అభిప్రాయం సరిగా తెలుసుకున్నారా అని అడుగుతున్నాడండి మావాడు"

నా బెట్టు యిట్లా ఎదురు తిరుగుతుందనుకోలేదు. నేను సమాధానం చెప్పబోయే లోపలే, నరసింహశాస్త్రి అందుకున్నాడు.

"నాకు నలభై ఏళ్ళు. నేను కోపిష్ఠి వెధవని. నాకు వేదమూ రాదు, శాస్త్రమూ రాదు. కేవలం పౌరోహిత్యపు మెతుకుల మీద బతకవలసిన వాణ్ణి. నాకో కొడుకు వున్నాడు. మీ కివన్నీ తెలుసునో లేదో ?"

అతను కర్రుకర్రున మాట్లాడుతుంటే వాటిని అనువదించటానికి మొదట్లో కాస్త సందేహించింది గాని తరువాత యథాతథంగా చెప్పింది వెంకమ్మగారు. అయితే చివర్లో ఏళ్ళు మాత్రం రెండో మూడో ఎక్కువవేసి చెప్పుకొన్నాడు లెండి. అయినా అదెందుకు. నలభై అనుకోండి" అన్నది.

"అయ్యా! అన్నీ ముందరే తెలుసుకున్నాను. మా పిల్ల ఎటువంటిదో నేను చెపితే మీకు నమ్మకం వుండక పోవచ్చు. మీ అక్కగార్నే దాంతో మాట్లాడి చూడమనండి" అన్నాను.

దీనితో అతనికి పూర్తిగా వాగ్బంధమైంది. వెంకమ్మగారు మాత్రం "మీరు చెప్పాక అపనమ్మకం ఎందుకండీ." అన్నది.

అప్పటికి ఎండ కాస్త ముదిరి తల చుర్రుమంటోంది. అడవిపొలాల్లో లంబాడీ కేకలు అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి. కొండల మీద ఆవులూ, మేకలూ మేతకోసం ఇటూ అటూ తిరుగుతున్నాయి.

" ఏవమ్మా! అక్కడేదో ఆలయం కనిపిస్తోంది. నిన్న బస్సుదిగి వచ్చేటప్పుడు చూసిన ఆలయం అనుకుంటా " అన్నాడు నరసింహశాస్త్రి.

" అదాఅండి. అది సంగమేశ్వర స్వామి వారి ఆలయం. ఆలయమైతే పాడుపడేవుంది గాని మంచి మహత్తు గల ఆలయం అంటారు. దర్శనం చేస్తారా " అన్నాను.

" మహాభాగ్యం. పదండి. ఏట్లో భయమేమీ లేదుగా " అన్నాడు శాస్త్రి.

" పోటు వచ్చినపుడే కాస్త జాగర్తగా వుండాలి. మామూలప్పుడంతా, మేమంతా తిరుగుతూనే వుంటాం. రైతుల రాకపోకలు చూశారుగా " అంటూ దారితీశాను. ఆలయంలోనికి వెళ్ళాం. ఆలయంలో శివుడి నెత్తిమీద చిన్న తుమ్మిపూలమాల వుంది. ఆ మాల చూసి ముందు నే నాశ్చర్యపోయాను. అటు అర్కావతి వేపుగా వచ్చి శివుడికి మాలవేసి వెళ్ళిందన్నమాట. ' ఓసినీ ' అనుకున్నాను.

ఆ పూలమాల చూసి వెంకమ్మగారు తెగ మురిసి పోయారు " అహా, తుమ్మిపూలతో మాల కట్టారు. ఎంత వోపికండీ! ఏమయినా శివభక్తి మీ కర్నాటకుల సొమ్ము. మీ వాళ్ళు ఏం పనిచేసినా కళాత్మకంగా వుంటుంది. మా తెలుగువాళ్ళు ఉత్త రాతి మనుషులు " అని తెగపొగిడింది.

ఆవిడ మా కర్నాటకాన్ని పొగుడుతుంటే నాకు యేనుగెక్కినంత సంతోషం కలిగింది.

" జన్మానికి ఒక తుమ్మిపువ్వు శివుడి నెత్తిన వేస్తే శాశ్వత కైలాసవాసం అన్నారు. అసలు శివుడికన్నా తుమ్మిపువ్వే గొప్ప అన్నారు. అలాంటి తుమ్మిపూలతో మాల కట్టి శివుడి నెత్తిన వేశారు. ఎంత పుణ్యాత్ములో. ఎవరండీ ఇక్కడ అర్చకులు. ? "

వెంకమ్మగారి పొంగు యింకా తగ్గలేదు. " ఇక్కడ అర్చకుడు వారాని కొకసారి పక్కపల్లె నుంచి వస్తాడండి "

" మరి ఈ అర్చన "

" ఇదా, యీ పూలమాల రోజూ మా పుట్టూనే వేస్తూ వుంటుందండి "

" ఏది? మా మరదలే! "

ఈ మాట అన్నప్పుడు మాత్రం శాస్త్రి ముఖం గూడా కాస్త వికసించి వుండటం నేను గమనించాను. నాకూ సంతోషమయింది.

" ఇవాళ మరీ చిన్న దండ వేసిందండీ. ఏమి కారణమో ? రోజూ అయితే యింత దండ వేస్తుంది " అని గుడివెనుక పడివున్న నిర్మాల్య పూదండ తెచ్చి చూపించాను. నోరు తెరిచింది వెంకమ్మగారు. " భేష్ " అన్నాడు శాస్త్రి.

తరువాత కాసేపు యిద్దరూ మౌనంగా ధ్యానం చేసుకున్న తరువాత, బొడ్డులోంచి, వెండి రూపాయి బిళ్ళ తీసి దేవుడి దగ్గర పెట్టాడు శాస్త్రి.

---

[ గమనిక : 1938 ప్రాంతంలో వెండిరూపాయి అంటే, ఇప్పటి లెక్కలో సుమారు 50 రూపాయలు ]

" శివయ్యా ! ఇదే అభిషేకం, ఇదే కొబ్బరికాయ, ఇదే హారతి " అన్నాడు.

" అక్కడ డబ్బెందుకు నాయనా " అన్నాను, వెండిరూపాయిని చూసి ఆదుర్దాగా.

" అర్చకుడు వచ్చినపుడు తీసుకుంటాడు లెండి " అన్నాడు శాస్త్రి.

" అర్చకుడే తీసుకుంటాడో, ఈలోగా ఏ కుర్రవెధవో లాగేస్తాడో " అన్నాను.

" అయ్యా, మనం వదిలేసినాక అది యెట్లాపోతే మన కెందుకండీ " అన్నాడు శాస్త్రి.

" నాకు తగ్గవాడివే " అన్నాను నవ్వుతూ. అతనూ నవ్వు కలిపాడు. వచ్చి గుడిమెట్ల మీద కూర్చున్నాం.

"అమ్మా, మరి పైమాటేమిటి" అన్నాను వున్నట్టుండి.

"ఇంకా పైమాట లేమిటి? మీరు ముహూర్తం పెట్టుకోండి, మేము తరలి వస్తాం" అంది వెంకమ్మగారు. నాకు మనస్సు కుదుట బడ్డది. అయినా_

"ఏవో లాంఛనాలూ అవీ వుంటాయిగా" అన్నాను.

"అవన్నీ అశాస్త్రీయపు మాటలు" అన్నాడు శాస్త్రి.

"సంతోషం. మరి ఆ ముహూర్తం గూడ మీరే నిర్ణయిస్తే........"అని నసిగాను.

"పంచాంగాలవీ మూటల్లో వున్నాయి. ఇంటికి వెళ్ళాక చూడొచ్చులెండి." అంది వెంకమ్మగారు.

"అయినా మీకెప్పట్లో ముహూర్తం కావాలి? ఈ శ్రావణంలో ముహూర్తాలున్నాయి. కాదంటే మార్గశిరం, కాదంటే మాఘం'' అన్నాడు శాస్త్రి.

ముహూర్తం అనగానే తిథులు, నక్షత్రాలూ లెక్కలే తప్ప, ఇది తన పెళ్ళి ముహూర్తమన్న ధోరణే లేదు దేవుడికి.

"శుభస్య శీఘ్రం."

నేనూ, వెంకమ్మగారూ ఇద్దరమూ ఒకేసారి యీ మాట అన్నాం. ఇలా మాట కలిసినందుకు ఇద్దరమూ నవ్వుకున్నాం.

"నా ఉద్దేశ్యంలో ఆలస్యం వద్దు. మీకు వేరే యిబ్బంది లేకపోతే యీ మాసంలోనే ముహూర్తం చూడండి '' అన్నాను.

"అలాగే. పంచాంగం చూద్దాం. ఈ లోగా మా అక్కగా గూడ ఆ పిల్లతో మ ట్లా చూస్తుంది" అన్నాడు శాస్త్రి.

అమ్మా తక్కువవాడు కాదు, గట్టివాడే, అనుకొని పైకి మాత్రం "రండి మా యిల్లు చూపిస్తాను " అంటూ దారితీశాను.

" అదేమిటి అటుగా మీ యిల్లు " అడిగింది వెంకమ్మగారు.

"మా అసలు ఇల్లు ఇటేనండి. కొండ వ్యవసాయం గదండీ. పొంగురోజుల్లో ఏరు దాటటం కష్టమని, తాత్కాలికంగా ఓ నెలరోజులు అక్కడ కాపరం పెట్టాం" వివరించాను నేను. తరువాత అర్కావతికి తూర్పు వొడ్డున వున్న మన యింటినీ, పాడి గొడ్లనూ చూపించాను. వివాహం జరిగేది యిక్కడే అని వివరించాను. తర్వాత మెల్లగా గూటికి చేరాం. అక్కడ వంట చేస్తూ మా కోసం యెదురు చూస్తోంది మీ అమ్మమ్మ. ఆడంగులంతా వంటింట్లో చేరి పిచ్చాపాటీ మొదలెట్టారు. శాస్త్రిని యింటి వసారాలో కూచోబెట్టి నేను గొడ్లసావిట్లోకి పోయాను. కొంత సేపటికి తలెత్తి చూద్దును గదా పుట్టూ వెంకమ్మగారూ బ్రహ్మకుండానికి వెళ్ళే డొన్లో కొండెక్కుతూ కనిపించారు. నేను నవ్వుకొని విషయమంతా మీ అమ్మమ్మకు మనవి చేద్దామని పెరట్లోంచి, వంటింట్లోకి ప్రవేశించాను.

నేను వంటింట్లో కాసేపు మాట్లాడి బయటకు వచ్చేసరికి శాస్త్రి పంచాంగం చూస్తూ లెక్కలు కడుతున్నాడు. ఈలోగా మా కృష్ణప్ప ద్వారా వార్త అందిన లంబాడీవృద్ధులు " ఏమిటండోయ్ అమ్మాయి గార్కి పెళ్ళిచూపులటగా " అంటూ రాసాగారు. వెంకమ్మగారూ, పుట్టూ త్వరలోనే తిరిగి వచ్చారు. వస్తూనే " పంచాంగం చూశావుట్రా అబ్బాయ్ " అంది వెంకమ్మగారు.

వెంకమ్మగారి గొంతు విని, మీ అమ్మమ్మ గూడా " తాకుతారు దూరంగా వుండండి " అంటూ వాకిట్లోకి వచ్చింది.

" చూశా, పదిహేను రోజుల్లో అయితే మంచి ముహూర్తం వుంది " అన్నాడు శాస్త్రి.

" మరీ యిరుకవుతుందేమోరా వాళ్ళకి " అనుమానంగా అంది వెంకమ్మగారు.

మేం, భార్యా భర్తల మిద్దరం కళ్ళతోనే మాట్లాడుకున్నాం.

" మాకేమీ యిబ్బంది లేదు. ముహూర్తం మంచిది చూడండి " అన్నాను.

" ఔను " అని నొక్కి పలికింది అమ్మమ్మ. దాంతో ఆ పదిహేను రోజుల ముహూర్తం లంబాడీ పెద్దల సమక్షంలో ఖాయం అయింది.

నిన్న పాపం ఆ పంపకాల వాళ్ళు తెచ్చి యిచ్చిన ఆకులూ పళ్ళూ యీ సమయంలో బాగా అక్కరకు వచ్చాయి. అన్నీ ఆ ఋషీశ్వరుల ఏర్పాటే అని మురిసిపోయింది మీ అమ్మమ్మ.

తలనిండా పూలదండలతో పెళ్లికూతురి కళ తొణికిస లాడుతున్న పుట్టు వచ్చి, అల్లుడికి నమస్కారాలు పెడుతుంటే, మేం దంపతుల మిద్దరమూ, ఒకర్నొకరు చూసుకొని మురిసి పోయాం. ఆ పూటకు యిక బస్సులేదు కనుక వెంకమ్మగారూ, శాస్త్రీ మర్నాటిదాకా ఆగిపోయారు. ఈ లోపల నా ఆప్తులందరూ ఒకరొకరుగా వచ్చి శాస్త్రిని పలకరించి పోయారు

శాస్త్రి నోట మాటమాటకు తెలుగు పద్యమో, సంస్కృత శ్లోకమో రాలిపడేది. వెంకమ్మ గారు ఓపిగ్గా అనువాదం చేసేది. ఈ కాస్తలోనే శాస్త్రి కాస్తోకూస్తో వైద్యం చేశాడు. ప్రశ్నలు చెప్పాడు. దాంతో ఆ చిన్న పల్లెలో అతని పేరు మారుమ్రోగింది.

ఆ రోజే నేను నా బంధువులకు కబుర్లు పంపటానికి ఏర్పాట్లు మొదలెట్టాను. ముహూర్తం ముందు రోజు వస్తామని చెప్పేసి, మర్నాడు పొద్దున బస్సుకు వెళ్ళిపోయారు వెంకమ్మగారు, శాస్త్రి.

ఆ మర్నాడే అర్కావతి వొడ్డు యింటికి మారాం మేము. వారం తిరగకుండానే ఇంటి నిండా బంధువులు చేరారు. ఆ సందడి నాకు బాగా యిష్టమే గాని వచ్చిన వాళ్ళు ప్రతివారూ ఈ సంబంధం గురించి యేదో మాట అనటం, వాళ్ళకు మా పుట్టు, పుల్లవిరిచినట్లు సమాధానం చెపుతూ వుండటం కొంచెం యిబ్బందిగా వుండేది. ముఖ్యంగా మా పై పిల్లలు గౌరీ, శారదా, మా పుట్టూని మరీ కొరుక్కు తినేవారు. దానికి తోడు, యీ శారద ఆ శాస్త్రి ఆకారం వర్ణించి వాళ్ళను ఎక్కేసేది. పిల్లతనపు చేష్టగదా!

రెండో పెళ్ళివాడు గానీ నచ్చ లేదా అనీ, తెలుగువాడు· గానీ నచ్చలేదా అనీ, నల్లటి వాడు గానీ నచ్చలేదా అనీ, కోపిష్టివాడు గానీ నచ్చలేదా అనీ రకరకాల వెటకారాలు చేయసాగారు.

ఒకరోజు పుట్టుకి ఒళ్ళు మండిపోయి, తాచుపాములా బుస్సున లేచింది.

"నవ్వండే, నవ్వండి. నవ్విన నాపచేనే పండుతుంది. చూస్తూ వుండండి. మీ అందరి కాపరాల కన్న, నా కాపరమే బావుంటుంది. నా యిల్లే వృద్ధిగా వుంటుంది. నా యజమానే కీర్తిలో కొస్తాడు. నోరు మూసుకోండి." అది అలా ఆరిందాలా విరుచుకు పడేసరికి అక్కలు కొంచెం తగ్గారు.

ఈ లోపల మీ అమ్మమ్మ గూడ కలుగచేసుకొని నాలుగు దులుపులు దులిపింది.

దీంతో వికట హాస్యాల జోరు తగ్గింది.

హాస్యాల మాట ఎలావున్నా ఆప్తుల అదిలింపులను పూర్తిగా తిరస్కరించటం నా వల్ల కాని పని అయింది. అందుచేత, అందరి సలహా మేరకు, ఒకసారి చూసివద్దామని బొమ్మెపర్తి బయలుదేరాను నేను. ఒక పక్క నా గుండె అదురుతోంది. "మాట యిచ్చేసి, యిప్పుడు విచారణ ప్రారంభించటమేమిటి? ఇదెక్కడి తెలివి?" అని. అయితే సంగమేశ్వరుడి దయవల్ల బొమ్మెపర్తిలో వారి పరిస్థితి నేను ఊహించిన దానికన్నా చాలా బాగుంది. పెద్ద తృప్తితో ఇంటికి తిరిగివచ్చాను. ఇక పెళ్ళి పనులు చురుకుగా సాగాయి. అనుకున్న రోజుకి పెళ్ళి వారంతా వచ్చారు.

ఈమాటు నరసింహశాస్త్రి నున్నగా గీసిన గడ్డాలతో, చక్కని పిలకముడితో, జరీ అంచుల బట్టలతో నా కళ్ళకు నాజూకుగా కనిపించాడు. కానీ మా వాళ్ళందరూ అతని తల విసురుళ్ళూ, గర్జనలూ వగైరాలు చూసి, ఇతను నరసింహం కాదు, అసలు సింహమే అని హాస్యం చేశారు. పెళ్ళివారి పరివారం, మే మనుకున్నట్టుగా పెద్దగా లేదుగాని, వచ్చిన వాళ్ళంతా మంచి పండితులుగా, ఆచారవంతులుగా కనిపించారు. మగపెళ్ళివారు మాకన్నా కొంచెం కలవారి లాగానే కనిపించారు.

శాస్త్రి కొడుకు నంజుండప్పను వెంటబెట్టుకొని, అతని తాతా అమ్మమ్మలు గూడ పెళ్ళికి రావటం మాకు కొంత వింతగానే తోచింది.

ఆ పెళ్ళిలో ప్రధాన దుబాసీ వెంకమ్మగారే. ఏ మాటా పలుకూ లేకుండా, ఏ పొరపొచ్చాలూ లేకుండా త్వరలోనే, మాకు వాళ్ళకూ స్నేహం పెరిగి, పరస్పర గౌరవాదరాలు విస్తరిల్లాయి. ఆంధ్రులనీ, కర్నాటకులనీ భేదాలు మరిచి రెండు కుటుంబాలూ ఒకటయ్యాయి. నా ఆదర్శాలలో ఒకటి నెరవేరిందనే తృప్తి నాకు కలిగింది.

పుట్టును మేము కొంచెం ఎక్కువ గారాబంగా పెంచాము. దానికి యింటి పను లేవీ రావు. పైగా దాని పట్టు మంకుపట్టు. అదికాక క్షణిక కోపం. ఇది చాలక ధ్యానాల పిచ్చి వొకటి. ఇది ఎలా కాపరం నెట్టుకొస్తుందా అని రోజు రోజూ దిగులు పడుతూ వుండేవాళ్ళం మేము.

కానీ కాపురానికి వెళ్ళిన తరువాత పుట్టూ పద్ధతే మారిపోయింది. ఎంత పెద్దరికమో, ఎంతనేర్పో, ఎంత సహనమో, మాకే ఆశ్చర్యం వేసేది. మాకు ఆశ్చర్యం కలగటం ఒక లెక్క గాదు. అత్తగారి వైపు వారంతా దీన్ని దేవత అనేవారు. అదిగూడ లెక్కగాదు. దాని సవితి పుట్టింటి వారు దాన్ని నెత్తిన పెట్టుకొనేవారు. అది కాపరానికి వెళ్ళినాక శాస్త్రి మొహంలో, తేజస్సే మారిపోయిందని, ఆ యింటికి ఐశ్వర్యం పట్టిందని, ఆ వూరికే కళ వచ్చిందని, బొమ్మెపర్తి వెళ్ళినపుడల్లా ఆ రైతులు మాతో చెపుతూ వుంటే, ఆ ఋషీశ్వరుల దయవల్ల మా జన్మ ధన్యమైందని పొంగిపోతూ వుండేవాళ్ళం.

దాని వూరొక స్వర్గమనీ, దాని యిల్లొక కైలాసమనీ, ఆ కైలాసంలోనే మా జీవితాలు కడతేరిపోవాలని కోరుకుంటూ వుండేవాళ్ళం.

కాని, కాని, మాలాంటి పాపాత్ములకు, ఆ కైలాసం దక్కదురా, దక్కనీనురా అని, విధి మధ్యలోనే, వికటాట్టహాసం చేసిందిరా బాబూ; విలయాట్టహాసం చేసింది.

* * *

తాతగారి సుదీర్ఘ కథన ప్రవాహంతో, శ్రోతలందరికీ ఊపిరి నిలిచిన ట్లయిపోయింది. కళ్ళలో నీళ్ళు ధారలుకట్టినై. అందరికన్న ముందు తేరుకొని, కళ్ళు తుడుచుకుంటూ;

"ఒప్పుకున్నా తాతా. అమ్మ కల్యాణం జగత్కల్యాణం కోసం జరిగిన కల్యాణం" అన్నాడు సత్యనారాయణ.

ఆ గది వాతావరణమంతా బరువెక్కి వుండటం గమనించి, లింగణ్ణగారు తనను తను సంబాళించుకొంటూ "ఆఁ....ఆ! వూరోకోండి. వూరోకోండి ఇంట శుభకార్యం తలపెడుతూ అలా కంట తడి పెట్టరాదు. ఊరోకోండి" అని అందర్నీ మందలించాడు సన్నంగా.

ఎంత నిబ్బరంగా మందలిద్దామని ఆయన ప్రయత్నించినా, ఆయన కంఠంలో వణుకు దాగనేలేదు.

"కనుక, అమ్మాయి వరలక్ష్మీ! మీ అమ్మ అలాటి ఉత్తమ ఇల్లాలు, అది జ్ఞాని. కాని నా మాట ఎప్పుడూ కాదనలేదు"

ఈ మాటలో, లింగణ్ణగారి కంఠంలో దుఃఖం పోయి, విషాద ముద్రితమైన గాంభీర్యం చోటు చేసుకుంది.

ఎవరికీ ఏం మాట్లాడాలో తోచటంలేదు.

మళ్ళీ లింగణ్ణగారే అందుకొన్నారు.

"అహఁ నువ్వు కాదన్నావని కాదు. ఇది మంచి సంబంధం కదా అని చెపుతున్నా. నాకు మీ అమ్మకు మల్లె యోగశక్తీ, దివ్యదృష్టి యివేవీ లేవనుకో."

"నా కవన్నీ ఉన్నాయి గదా తాతా. నేను చెపుతున్నాగా, వాడే దాని మొగుడు" సత్యం స్టూలు బల్లమీంచి యెగిరి గంతేసి మరీ చెప్పాడు.

ఆ మాటతో, ఆ చేష్టతో ఆ గది వాతావరణ మంతా, ఒక్కసారిగా మారిపోయి అందరూ ఫక్కున నవ్వారు.

"ఏడిచావ్ లేవోయ్" అంటూ గలగలా నవ్వేడు లింగణ్ణగారు గూడ.

"అయినా యోగాలు మా కెందుకురా? తాతయ్య మాట మా వరలక్ష్మి యెప్పుడైనా కాదన్నదా యేమిటి? మీవి వూరికే పిచ్చి వాదాలుగాని" అని ఒక వింతరాగం తీసింది సావిత్రమ్మగారు. దాంతో ఒక్క నవ్వు నవ్వి, సిగ్గుపడి వంటింట్లోకి వెళ్ళిపోయింది వరలక్ష్మి.

"తోకముడిచి పారిపోయింది, ఇక కేసు కొట్టేశాం. సంబంధం ఖాయం చేశాం" అన్నాడు సత్యనారాయణ ఉల్లాసంగా. అక్కడితో ఆగక, వంటింటిదాకా పోయి లోపలికి తలకాయి పెట్టి "ఒసేయ్! ఎందుకే గోల. నీకూ వాడికీ ముడిపడి వుంది. నువ్వు వాడి గంటున పడ్డావు. ఇహ నోరు మూసుకో" అని అరచి వచ్చాడు. మళ్ళీ మరోసారి హాయిగా గలగలమన్నారు గదిలో వారంతా.

"అయితే తాతయ్యా! మరి పెళ్ళి ఖర్చులకు డబ్బు మాటేమిటి? దాని కేమాలోచించావు?" అన్నాడు సత్యనారాయణ, సభ్యుల నవ్వు పూర్తి కాకుండానే.

"ఒరేయ్ ఎందుకు ఆ తొందర ? ఆ పెళ్ళికొడుకు, తన పెద్దవాళ్ళని సంప్రదించుకోవాలి. మన కండిషన్లకు వాళ్ళందరూ వొప్పుకోవాలి. మళ్ళీ వాళ్ళంతా వచ్చి పిల్లని చూడాలి, నచ్చాలి, ఖాయమని మనతో చెప్పాలి. ఇంత తతంగం వుంది. ఇప్పటి నుంచీ ఎందుకు అక్కరలేని ఆలోచనలు ?" అన్నారు లింగణ్ణగారు. వాయిదాలే సమస్యల్ని తీరుస్తూ వుంటాయని ఆయన సిద్ధాంతాల్లో ఒకటి.

"తాతా, ఎందుకు తాతా, లేనిపోని ముళ్ళు పెంచుకుంటావు ? వా డొప్పుకున్నాడు. ఇక పెళ్ళిఖర్చుల సంగతి చూడు" బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నాడు, సత్యనారాయణ.

"వాడెవడ్రా" అంది పిన్ని.

"వాడేనమ్మా, ఆ పెళ్ళికొడుకు" అన్నాడు సత్యనారాయణ. "ఒరేయ్, వాడూ, వీడూ అన్నావంటే ఆవిడ విన్నదంటే ( వంటింటి వైపు చూస్తూ ) నిన్ను చంపేస్తుంది" అంది పార్వతమ్మ హాస్యంగా.

"మర్యాద యిమ్మంటావా ? యిస్తాలే. నాలుగు రోజులు పోనీ. ఈ మర్యాదలు కోరే వారంతా నా చుట్టూ తిరుగుతారు. నే నింటి కప్పు మీద కూర్చుంటే వీళ్ళంతా, నేలమీద పడుకొని దణ్ణాలు పెడతారు" అన్నాడు సత్యనారాయణ.

"కోతివిగదూ, అందుకనే యింటికప్పు మీద కూర్చుంటావు" రక్కున అందుకుంది సరస్వతి. "నోరుముయ్యవే, నేను కారులో వెడుతుంటే, వెనకాల నాలుగు కార్లూ, ముందు నాలుగు కార్లూ నడుస్తాయి తెలుసా."

"డ్రైవింగు నేర్చుకుంటాడు కాబోలు." మళ్ళీ అందుకుంది సరస్వతి.

"ఒసేవ్ .... నిన్ను నిన్ను" అంటూ మీది కొచ్చాడు సత్యనారాయణ.

"ఒరేయ్ ....ఒరేయ్ ఆగరా, గొప్పలరాయడా" చేతికర్ర అడ్డుపెడుతూ ఆపాడు లింగణ్ణగారు.

"తాతయ్య ఆగమన్నాడుగనుక ఆగా. లేకపోతేనా" అంటూ వెనక్కు వెళ్ళి స్టూలు మీద కూర్చున్నాడు సత్యనారాయణ.

మూతి విరుస్తూ వెక్కిరించింది సరస్వతి.

"సరే తాతయ్యా ! డబ్బు సంగతి చెప్పు" అన్నాడు సత్యనాయణ అసలు విషయంలోకి వస్తూ !

"వాళ్లొప్పుకోవాలిగదరా ముందు" పాత పాటే పాడాడు తాతగారు.

"వాడొప్పుకున్నాడని చెప్పాకదా తాతయ్యా" నన్నగా విసుక్కున్నాడు సత్యనారాయణ.

"నీ కెవరు చెప్పారయ్యా?" ఎక్కిరించారు తాతగారు "వాడి మొహమే చెప్పింది. ఇందాక చూశాగా" సమర్థించుకొన్నాడు సత్యనారాయణ.

"ఒరేయ్, అట్లా మాట్లాడకూడదు, తప్పు." సావిత్రమ్మగారు అడ్డుకుంది.

"తప్పా, అట్లా చెప్పవేం మరి? అతని విషయంలో నీకేం అనుమానం అక్కరలేదు తాతా. చూడు కావాలంటే, సాయంత్రం లోపల అతని దగ్గరనుంచి కబురు రాకపోతే నన్నడుగు" పంతం పట్టాడు సత్యనారాయణ.

"సర్లేనాన్నా, ముందు భోజనానికి లేవండి, పొద్దుపోయింది" అంది పార్వతమ్మ.

"ఔను, లేవండి. వాళ్ళ దగ్గరనుంచి కబురొస్తుందని డబాయిస్తున్నాడుగా! వచ్చాకే చూద్దాం" అంటూ లేచాడు లింగణ్ణగారు.

"ఈ మధ్య ఈ సొంత డబ్బా ఎక్కువైందిలే తాతయ్యా. ఎప్పుడు చూసినా ఏదో గొప్పలు చెపుతూ వుంటాడు. నువ్వు పట్టించుకోకు" అంటూ సరస్వతి గూడ వంటింట్లోకి నడిచింది.

పొద్దుపోయాక భోజనాలేమో, అందులోనూ సంతోష సమయమేమో, అందరూ ఓ ముద్ద ఎక్కువే లాగించారు. దాంతో భోజనాలవగానే అందరూ తలో కునుకూ తీసేసరికి సాయంత్ర మయింది. లింగణ్ణగారు ఇక సాయంత్రం షికారుకి బయలుదేరబోతూ వుండగా ఉత్సాహంగా దిగారు అయ్యంగార్ దంపతులు, "ఏమండోయ్, ఇహ ముహూర్తాలు చూడండి" అంటూ.

ఆ దంపతులు ఒక గంటసేపుండి, ఎంతో ఉత్సాహంగా మాట్లాడి, ఇక మీరు పెళ్ళి ప్రయత్నాలలో వుండండని చెప్పి వెళ్ళారు.

*　　*　　*

## పెళ్ళి పనులు

సంబంధం ఖాయం అవుతోంది అనేసరికి, అప్పటి దాకా అణిగిపడివున్న డబ్బు సమస్య అందరి నెత్తిమీదకు ఎక్కి నాట్యం చేయసాగింది.

"పార్వతీ" అన్నారు లింగణ్ణగారు సాలోచనగా.

"ఎంతలేదన్నా రెండు మూడు వేలైనా కావద్దా నాన్నా!"

పార్వతమ్మ సరాసరి సమస్యలోకి వచ్చేసింది.

"మనకి ఏమాత్రం అప్పు పుడుతుందంటావు?" లింగణ్ణగారు మరో అడుగు ముందు కేశారు.

"వీడేదో వాళ్ళ నాన్న దగ్గరనుంచి తెస్తానంటున్నాడుగా"

"వాడి మొహంలే. అవన్నీ జరిగే పనులా అమ్మా."

"ఎందుకు జరగదూ ?" సత్యం కస్సుమని అందుకున్నాడు.

లింగణ్ణ : ఒరేయ్, నేనూ మా అల్లుడూ ఒకే జాతివాళ్ళం. మా వంటిమీద నీటి చుక్క నిలవదు.

సత్యం : అంటే ?

లింగణ్ణ : అంటే చేతిలోకి ఒక రూపాయి వచ్చిందంటే అది వదిలి పోయేదాకా మాకు తోచదు. ఖర్చన్నా చేయాలి, లేకపోతే యెవడికన్నా యిచ్చెయ్యాలి.

సావిత్రి : అది నిజమే లెండి.

లింగణ్ణ : అందుచేత మీ నాన్న దగ్గర డబ్బు నిలవ వుంటుందని నే ననుకోను.

పార్వతి : అసలయినా ప్రస్తుతం ఆయన సంపాదన నెలా వుందో, ఏమో ?

సావిత్రి : నా నెత్తి సంపాదన.

సత్యం : ఒకసారి వెళ్ళి స్వయంగా చూసి వస్తే అన్నీ తేలిపోతాయిగా. ఆయనకి వరలక్ష్మి అంటే ప్రాణం. దాని పెళ్ళంటే ఎక్కడో అక్కడ పుట్టిస్తారు.

సావిత్రి : చెప్పావులే పెద్ద ఆరిందా మాటలు. పిల్లలెక్కడ వున్నారో, ఉన్నారో, ఊడారో, పట్టించుకోని మనిషి ఆ మనిషి. అసలు కన్నకడుపా అది.

లింగణ్ణ : వూరుకోవే, అబ్బబ్బ, ఎవరి పద్ధతి వారిది.

పార్వతి : ఒకవేళ ఆయ నిద్దామనుకున్నా, ఆయన పెద్దకొడుకు, కోడలు ఒప్పుకుంటారో, ఒప్పుకోరో ?

సత్యం : వాళ్ళు అలాంటి వారు కాదు. అసలు దాని పెళ్ళి వాళ్ళే చెయ్యాలని యెంతో వుబలాట పడ్డారు మొదట్లో.

లింగణ్ణ : అసలు సమస్య అది కాదురా అబ్బాయీ. నువ్వా చిన్నవాడివి. ఇంతకాలంగా తండ్రికి దూరంగానే వున్నావు. ఇప్పుడు ఉన్నట్టుండి, నువ్వు వెళ్లి డబ్బు, డబ్బు అంటే అది బావుంటుందా ?

పార్వతి : వాళ్ళసలు నీ మాట నమ్ముతారా ?

సత్యం : సరే, అయితే నువ్వెళ్లి మాట్లాడిరా తాతా.

లింగణ్ణ : ఒకళ్ళ నడగటం నా వల్ల కాదురా, ఈ జన్మ కదిలేదు.

సత్యం : నా కదీ లేదు తాతా. నే నెందర్నయినా అడుగుతాను. ఒకర్నే ఎన్నిసార్లయినా అడుగుతాను. నాది అనుకునేది లాక్కోవటమే నా పని.

లింగణ్ణ : ఏమిటే పార్వతీ వాడనేది?

పార్వతి : ఈ అసందర్భపు వాగుడు ఈ మధ్య ఎక్కువైందిలే. ఆ నాటకాలేవో అఘోరిస్తున్నాడు గదూ! సరేలే గాని నాన్నా, ఓ పని చేస్తే బావుంటుందేమో,

లింగణ్ణ :
సత్యం : ఏమిటది?

పార్వతి : వాడితో పాటు నేనుగూడ వెళ్ళి వాడితో మాట్లాడిస్తే.

సత్యం : చాలా బాగుంటుంది.

పార్వతి : ఎలాగో వేసంగి సెలవలు వస్తున్నాయి. ఆ ఇబ్బంది గూడ వుండదు నాకు.

లింగణ్ణ : బాగానే వుండేట్టుంది గాని........

సత్యం : ఏమిటి తాతా లిటిగేషను ?

లింగణ్ణ : ఉండరా! నువ్వెక్కడ దిగుతావమ్మా.

పార్వతి : అదే ఆలోచిస్తున్నాను.

లింగణ్ణ : మీ బావకు ప్రస్తుతం యిల్లూ వాకిలీ లేదు. నంజుండయ్య ఇంట్లో దిగచ్చు. కాని అది అంబమ్మగారి ఇల్లు, అంటే నీ అక్క సవితి పుట్టిల్లు. ఏం బావుంటుంది చెప్పు.

సావిత్రి : ఆ పుల్లల రేవు కరణాలు అప్పట్లో మనమంటే ఎంతో అభిమానంగా ఉండేవాళ్ళు.

పార్వతి : ఔను నాన్నా, వాళ్ళింట్లో దిగవచ్చు. వాళ్ళ కోడలికీ నాకూ మంచి స్నేహం కూడా.

లింగణ్ణ : సరే ఆ ప్రయత్నం చెయ్యండి. ఎలాగో ఆ తండ్రితో చెప్పాల్సిన ధర్మం మనకు ఉంది. కాకపోతే ఆయనకు ఈ కన్నడం వాళ్ళ సంబంధం అంటే గిట్టకపోవచ్చు. ఆయనేదన్నా అంటే నొచ్చుకోకుండా వుండే నిబ్బరం ఉంటే నువ్వు వెళ్ళవచ్చు.

పార్వతి : జీవితంలో ఇన్ని దెబ్బలు తిన్నాకయినా నాకా సహనం రాలేదంటావా నాన్నా?

లింగణ్ణ : సరే శుభం.

"హమ్మయ్య, ఈ డైలాగు ఈ సీను మొదట్లోనే రావాల్సింది. కొంచెం డైరక్షన్ మిస్టేకు" అంటూ వీధిలోకి పరిగెత్తాడు సత్యనారాయణ, గుడికి గాబోలు. "పీడ కిప్పుడిప్పుడే కొంచెం బాధ్యత తెలుస్తోందే అమ్మాయి. కాని అల్లరి పోలేదు" అన్నాడు లింగణ్ణగారు నవ్వుకుంటూ.

కాని సత్యనారాయణ ఆ రోజు గుడికి వెళ్ళలేదు. సరాసరి ఫిడేలు విద్వాంసుడు వెంకటప్ప గారింటికి వెళ్ళాడు. అప్పటికి దాదాపు ఏడు గంటలయింది. అతను వెళ్ళేసరికి వెంకటప్పగారి భార్య నంజమ్మగారు, వారి పదేళ్ళ పిల్ల లీల, ఇంటి వాకిట్లో కిటికీ దగ్గర ఆదుర్దాగా చిందులు వేస్తున్నారు. లోపలనుంచి నంజమ్మగారి పసివాడి ఏడుపు, గోలగోలగా వినిపిస్తోంది.

వాడు రెండు మూడేళ్ళవాడు. వాడిని ఇంట్లో ఉంచి నంజమ్మగారు పొరుగింటి కెళ్ళేసరికి ఏం జరిగిందో ఏమో పీడు లోపలినుంచి గడియ వేసేశాడు. అది తీయటం చేతకాక, ఇక భయం వేసి ఏడుపు లంకించుకున్నాడు. అదీ పరిస్థితి. ఆ ప్రక్కవారూ ఈ పక్కవారూ పోగయ్యారు. ఏదో రకంగా గడియ తీయాలని కాసేపు ప్రయత్నించారు. గడియ పగలకొట్టక తప్పదని సత్యనారాయణ మొదటి నుంచీ చెపుతూనే వున్నాడు. చివరికి అదే ఖాయమయింది.

సత్యనారాయణే పొరుగువా రింట్లోంచి ఒక రోకలి తెచ్చి ఒడుపుగా, తలుపు విరగ కుండా గడియ వూడగొట్టాడు. చిత్రం, బెంబేలు పడ్డ పసివాడు తల్లి దగ్గరకు పోలేదు. సత్యం మీద పడి కావిలించుకొని ఏడుస్తున్నాడు. పిల్లవాడిని ఓదారుస్తూ, "అమ్మా! ఇవాళ శ్రీరామ నవమి. ఆంజనేయుడి దయవల్ల పిల్లవాడికి ఒక గండం ఈ విధంగా తప్పింది. ఆ స్వామికి కాస్త వడపప్పు నైవేద్యం పెట్టు. దోషం పరిహారం అవుతుంది" అన్నాడు మెల్లగా సత్యనారాయణ.

"ఏమోలే! బాలవాక్యం బ్రహ్మ వాక్యం'' అనుకుంటూ ఆవిడ పిల్లవాడిని సముదా యించుకొంటూ ఇంత పెసరపప్పు నానబోసింది.

ఇంతలో వెంకటప్పగారు ఇంటికి వచ్చాడు. సత్యనారాయణను చూడగానే "నీ మాటే అనుకొంటున్నానోయ్" అంటూ లోపలికి వచ్చాడు.

రాగానే జరిగింది విని "సమయానికి ఆదుకున్నావ్" అని సత్యనారాయణని అభినందిం చాడు.

వెంకటప్పగారు మైసూర్లో ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. "ఫిడేలిష్టు". వాడకట్టువాడు. (కేసరే-వాసి).

అప్పట్లో సత్యనారాయణకు రెండు వృత్తులు వుండేవి. ఒకటి కొద్ది ఇళ్ళల్లో చిన్న పిల్లలకు ప్రైవేటు ట్యూషన్లు చెప్పటం. రెండు పాల అమ్మకం. అదెలాగంటే, జీవనాధారం కోసం లింగణ్ణగారు ఏర్పరచుకొన్న చిన్న పాడి పరిశ్రమలో రోజూ పాలు అమ్ముకురావటం సత్యనారాయణ వంతు. అలా రోజూ పొద్దున్నే అతను పాలమ్ముకొనే యిళ్ళల్లో వెంకటప్ప గారిది గూడ ఒక యిల్లు.

ఆ పాలధార ఆధారంగా ప్రారంభమైన పరిచయం సంగీతామృత ధార ద్వారా వీరిద్దరి మధ్యా వయో భేదాలతో నిమిత్తం లేని స్నేహబంధంగా మారింది. సత్యనారాయణలోని

సంగీత రసికత, సంగీత మర్మజ్ఞత, వెంకటప్పగారిని ఆకట్టుకున్నాయనే మాట నిజమే గాని, అతన్ని చూస్తే తనకంత వొళ్ళు తెలియటం పోవటమేమిటా అని ఆయనకే ఆశ్చర్యంగా వుంటుంది. ఒకోసారి ఆయన ఫిడేలు వాయిస్తుంటే సత్యనారాయణకు కాలమే తెలియదు.

సత్యనారాయణ యింటికి రావటం ఆలస్యమైతే లింగణ్ణగారు వెళ్ళికే రెండు మూడు చోట్లలో వీరిల్లు ప్రధానం.

"అయ్యా! మావాడి కెలాగూ వొళ్ళు తెలియదు. మీరె కాస్త పెందరాడే యింటికి పంపుతూ వుండండి" అంటూ వుంటాడు లింగణ్ణగారు నవ్వుతూ వెంకటప్పగారితో.

ఎవరేమన్నా, ఎన్ని పాటలు వాయించినా, "చెలమేలరా సాకేత రామ" అని గాని, "మోక్షము గలదా భువిలో" అని గాని, "రామభక్తి సామ్రాజ్య" అనిగాని పాడితే గాని కదలడు సత్యనారాయణ.

సత్యనారాయణబొత్తిగా కనిపించకపోతే వెర్రెత్తినట్టుండి ఫిడేలు మీద పిచ్చిగీతలు గీస్తూ వుంటాడు వెంకటప్ప గారు. వాళ్ళ పిల్లలు గూడ పార్వతమ్మ శిశువిహార్‌లో చదువుతూ వుండటం వల్ల వాళ్ళంతా " అన్నా అన్నా " అని సత్యనారాయణ చుట్టూ తిరుగుతూ వుంటారు.

సత్యనారాయణ వచ్చాడంటే ఆయన రమాను దానంతటదే ఫిడేలు మీదకి వెళ్ళిపోతుంది. ఆరోజు ఆయన, 'మోక్షము గలదా' అని అందుకున్నాడు. రాగప్రస్తారంలోంచి పాటలోకి వెళ్ళేసరికి సత్యనారాయణ ముఖంలో కళే మారిపోయింది. స్వరప్రస్తారం దగ్గరకు వచ్చేసరికి, వెంకటప్ప గారు తన్ను తాను మరచిపోయి వాయిస్తున్నాడు. పాట చివరకు వచ్చి, ఆయనకు వళ్ళు తెలిసేసరికి సత్యనారాయణ చెక్కిళ్ళ మీద నీళ్ళు ధారలు కట్టివున్నాయి.

"ఏమండోయ్! ఇక్కడ కచేరీ బాగానే వుంది. అక్కడ మీ కింకో కచేరీ వుంది యివాళ్ళ" అని లోపలి నుంచి భార్య నంజమ్మగారు వేసిన కేకకు యిద్దరూ పూర్తిగా ఈ లోకంలోకి వచ్చారు. ఈ లోకంలోకి రాగానే శుభవార్త ఆ దంపతులకు అందించి అక్కడనుంచి శ్రీరామ నవమి పందిరి కేసి బయలుదేరాడు సత్యనారాయణ.

" గడియ విరిగింది. తలుపు పగలలేదు. స్వయంకృత బంధంనించి పిల్లవాడు విముక్తుడయ్యాడు. మంచి శకునం " అనుకున్నాడు దార్లో సత్యనారాయణ. దార్లో శ్రీకంఠయ్యగారు తగిలాడు 'ఏమయ్యా, ఏమంటున్నాడు నీ గణపతి ' అంటూ.

శ్రీకంఠయ్యగారు, యాభై యేళ్ళు దాటిన పెద్దమనిషి. ఆయన ఆకారం నల్లని నలుపే గాని, హృదయం తెల్లని తెలుపు. K. S E. B లో పనిచేస్తూ కెనరే లోని ఎలక్ట్రిసిటీ క్వార్టర్సులో వుంటున్నాడు. ఆ వంటరి జీవికీ ఈ తుంటరి కుర్రవాడికీ లంకెగొలుసు గణపతి.

" నమస్కారమండీ, నమస్కారం. ముందర మా పెద్దచెల్లెలు పెళ్ళంటున్నాడండీ మా గణపతి " అన్నాడు సత్యనారాయణ సంతోషంగా.

" అహో, చాలా సంతోషం ".

" మీరు తప్పకుండా పెళ్ళికి రావాలి. మా యిల్లు మీదను కోవాలి మీరు. మీ యిల్లు నాదే అనుకొంటాను కనుక, సరేనా "

" సంతోషం, సంతోషం. "

ఇద్దరూ కలిసి నడుస్తున్నారు.

" ఏమిటి బొత్తిగా కనిపించటం మానేశావు ? " అన్నాడు శ్రీకంఠయ్యగారు నడుస్తూ.

" ఏముందండీ పరీక్ష పోయిందిగా, మళ్ళీ పుస్తకాలు తప్ప లేదాయె. "

" ఉపాసన ఎలా వుంది ? "

" విఘ్నేశ్వరుని పెళ్ళికి అన్నీ విఘ్నాలే అంటారు కదండీ. విఘ్నేశ్వరుడి ఉపాసనకూ అన్నీ విఘ్నాలే అనుకుంటా. "

" ఏమయింది ? "

" అబ్బే, ఏమీ కాలేదు. సాగుతూనే వుంది లెండి. ఎంతయినా మా యిల్లు యిరుకిల్లు. పైగా స్కూలు. యిదిగాక మా తాత దగ్గు, "

" పోనీ మా యింట్లో కూచుని జపం చేసుకోవచ్చు. నేను వంటరివాడ్ని. నువ్వూ ప్రస్తుతానికి వంటరివాడివి. గణపతి మనిద్దరికీ స్నేహితుడే నాయె. "

" ఏమోలెండి, నేను మీ యింట్లో వుండే రోజు రావొచ్చు. మీరు నాదగ్గరుండే రోజు రావచ్చు. ఆ భేదాలు మనకి వద్దని యిపుడేగా చెప్పాను. "

పందిళ్ళు అంత దూరంలో కనిపిస్తున్నాయి.

" హాయ్ సత్యం " అంటూ వెనకాలనుంచి దున్నపోతులా వున్న కుర్రాడొకడు, మీద చెయ్యేసి పలకరించాడు.

" హాయ్ ద్వారకా ! మన ప్రోగ్రాం ఎప్పుడు ? " అన్నాడు సత్యనారాయణ.

" ఛయ్, మన నాటకం ఏమిటి ? నిన్ను మన ప్రోగ్రాంలోంచి తీసి పారేశాగా "

" ఆడటం లోంచి తీసేశావా, చూడటం లోంచి తీసేశావా "

" బలేవాడివే, ఏమిటి మంచి హుషారుగా వున్నావ్ " ?

" చెప్పమంటావా "

" అంటావా యేంటి, చెప్పు "

" మా చెల్లెలు పెళ్ళి కుదిరింది "

"కంగ్రాట్యులేషన్స్"

"స్కూలు ఫంక్షన్లకు చేసినట్టే యీ పెళ్ళికి నువ్వు సహాయం చేయాల్"

"బలేవాడివే. టీచరమ్మ గారింట్లో పెళ్ళంటే పైగా కూతురి పెళ్ళంటే మా యింట్లో పెళ్ళే, నా సొంత చెల్లెలు పెళ్ళి. నేనొచ్చి టీచరమ్మతో మాట్లాడతాగా" అంటూనే హడావిడిగా వెళ్ళిపోయాడు ద్వారక.

అతను కాస్త దూరం వెళ్ళేదాకా ఆగి, "వాడితో అంత చనువెందుకు?" అన్నాడు శ్రీకంఠయ్యగారు.

"ఏమండీ?" ఎంతో అమాయకంగా అడిగాడు సత్యనారాయణ.

"ఏమిటేమిటి? యీ పందిట్లో ఎవడ్నైనా అడుగు. అందరూ ఒకటే చెప్తారు. వాడు ఉత్త రౌడీ."

"ఔననుకోండి"

"వాళ్ళ నాన్న రైల్వేలో పనిచేస్తాడు. నాకు తెలిసినవాడే. దేవుడులాంటి వాడు. వాడి వల్ల వాళ్ళింటి మీదికి రోజుకో తగాదా. వాళ్ళ నాన్నగారు గోల పెట్టేస్తున్నారు తెలుసా."

"నిజమే అనుకోండి"

"వాడికెప్పుడూ నాటకాలు, ఆటలు, దెబ్బలాటలు ఇవి తప్పితే చదువక్కరలేదు."

"మరి మన సెంటర్లో గణపతి ఉత్సవాల కోసం వొళ్ళు విరుచుకు పనిచేస్తాడు గదండీ"

"ఎందుకు చేస్తాడో, అదొకటి మాత్రం మంచి పని చేస్తాడు. మన సెంటర్లో గణపతి నవరాత్రుల ఉత్సవాలు మాత్రం వాడు లేందే జరగవు"

"వాళ్ళ తమ్ముడు ఎవరో మా స్కూల్లో చదువుతున్నాడండీ. మా స్కూలు వార్షికోత్సవాలకి గూడ ఇతను బోలెడంత సాయం చేస్తాడండీ."

"చేస్తే చెయ్యొచ్చు. మనిషి దుర్మార్గుడు."

"మనకి అంతా మంచివాళ్ళే కదండీ."

"అబ్బాయ్, అవన్నీ పుస్తకాల్లో మాటలు. దుష్టులకి దూరంగా వుండాలి. అంతే."

"అలాగేనండి. అయినా! నేను పలకరిస్తే పలుకుతానండి. ఎవరితోనయినా అంతే. ఇతనితోనయినా అంతే."

ఇంతలో హరికథ మొదలైంది. సంపూర్ణమైన ఏకాగ్రతతో ఆమూలాగ్రంగా విన్నాడు సత్యనారాయణ.

ఆ మర్నాడు తను పాలుపోసే యిళ్ళన్నిటిలోనూ తన చెల్లెలు పెళ్ళి సంగతి ప్రత్యేకంగా చెప్పాడు. పాలుపోసి యింటికొచ్చేసరికి కట్టెలు తేవాలంది అమ్మమ్మ సావిత్రమ్మ.

అలవాటు ప్రకారం లక్ష్మయ్య అడితీకి వెళ్ళాడు. వెళ్ళేటప్పటికి లక్ష్మయ్య ఎక్కడికో వెళ్ళాడు. ఆయన భార్య లక్ష్మీదేవమ్మ గల్లా ముందు కూర్చొని వుంది. లక్ష్మయ్య లేడని తెలిసేసరికి పక్కన బల్లమీద కూర్చున్నాడు సత్యనారాయణ.

బల్ల మీద మఠం వేసుకొని అరచేతిలో, అరచెయ్యి వేసుకొని, తల వొంచుకుని నిటారుగా వివేకానందుడి ఫోజులో కూర్చుండి పోయిన సత్యనారాయణను చూసి "ఏమి కావాలో చెప్పయ్యా, ఆయన ఎంతసేపటికి వస్తారో యేమో" అంది లక్ష్మీదేవమ్మగారు.

"పర్లేదండి" అని మళ్ళీ తల దించేసుకొని బుద్ధ విగ్రహంలాగా కూర్చుండి పోయాడు సత్యనారాయణ.

"ఏమయ్యా అందరిళ్ళల్లోనూ వస పోసినట్లు మాట్లాడుతావంటారు. నా దగ్గర కొస్తే అల్లా పెళ్ళికూతుర్లాగా కూర్చుంటా వేమిటి? చెప్పు. ఏమిటి విశేషాలు ?"

లక్ష్మీదేవమ్మగారు రెట్టించింది.

ఆవిడ పిల్లలుగూడ, పార్వతమ్మగారి శిశువిహారంలో చదువుతున్నారు. ఆవిడకి పార్వతమ్మకు మంచి స్నేహం గూడాను. సత్యం మౌనంగా కూర్చున్నాడంటే చేతుల్లో డబ్బులేకుండా వచ్చాడన్న మాట. పార్వతమ్మ దగ్గర డబ్బు లెక్కడికీ పోవు. లక్ష్మీదేవమ్మ అరువిస్తుంది కాని అరువు తీసుకు వెళ్ళేట్టయితే ఎంత బతిమాలినా సరే లక్ష్మయ్య లేందే తీసుకు వెళ్ళడు సత్యనారాయణ. పైగా ఉలకడు పలకడు.

అది ఆవిడకు మామూలే. కొంతసేపటికి లక్ష్మయ్య వచ్చాడు. వస్తూనే యీ బాల వివేకానందుణ్ణి చూసి "ఎంతసేపయిందేమిటి వచ్చి" అంటూనే కాటాలో కట్టెలు వేయ సాగాడు. వాళ్ళ యింటికి ఏ రకం కట్టెలు కావాలో, ఎన్ని కావాలో అతనికి తెలుసు. అతన్ని చూడగానే, తన ధ్యానం ఫోజు వదిలేసి, కిందికి దిగాడు సత్యనారాయణ, 'మీ యింట్లో ప్రశాంతంగా వుంటుందండీ' అంటూ.

"ఏమిటి విశేషాలు" అన్నాడు లక్ష్మయ్య.

అక్కడ గూడ శుభవార్త అందించాడు సత్యనారాయణ.

"ఇదిగో, పెళ్ళివా రొచ్చినప్పుడు, యిలా మఠం వేసికొని కాలక్షేపం చెయ్యకు. ఎన్ని కట్టెలు కావాలంటే అన్నీ నేను లేకపోయినా తీసుకెళ్ళు. లెక్కలు తరువాత చూసుకో వచ్చు. తెలిసిందా" అన్నాడు లక్ష్మయ్య సంతోషంగా.

"ఏం, ఈ మంచిమాట ఆయనొస్తేగాని చెప్పకూడదా? ఈ మాట రా చెపుతాను." అని తూచిన కట్టెలు సత్యనారాయణ చేతుల్లో పేరుస్తూ, గలగలా నవ్వింది లక్ష్మీదేవమ్మ.

చాచిన చేతుల్లో మోచేతుల వరకు పేర్చిన కట్టెలు గుండెల మీదకు, కంఠందాకా ఎగదోసుకొని మోర పైకెత్తి వగరుస్తూ మెరక యెక్కుతున్నాడు సత్యనారాయణ. వాళ్ళ యిల్లు అడితీనుంచి యించుమించు ఫర్లాంగు దూరం వుంటుంది.

సైకిలు మీద రయ్యిన ఎదురయ్యాడు ద్వారక. సత్యనారాయణని చూస్తూనే ఎక్కిరింతగా నవ్వుతూ, "ఓయ్ ఏమిటయ్యా, ఆ పీనాసితనం? ఓ ఏగానీ యిచ్చి కూలిపెట్టుకోలేవూ" అంటూ వెళ్ళిపోయాడు.

"ఏగానీయ్యా, దాని విలువ తెలిసే రోజు నీకు రావద్దులే" అనుకున్నాడు సత్యనారాయణ ముందుకు సాగిపోతూ. తరువాత క్రమంగా తను ప్రైవేట్లు చెప్పే యిళ్ళల్లో గూడ యీ శుభవార్త తెలిపి, ఓ పది పదిహేను రోజులు సెలవు తీసుకున్నాడు సత్యనారాయణ.

తరువాత కొద్దిరోజులకే సత్యనారాయణ పార్వతమ్మను తీసుకొని బొమ్మెపర్తి చేరాడు.

* * *

…………సత్యనారాయణ కథనం యీ స్థాయికి వచ్చేసరికి, శ్రీకంఠయ్యగారికి బాగా ఆవలింతలు రాసాగాయి. దాంతో "మరోసారి చెప్పుకుందాం లెండి, పడుకోండి" అని ముందు తనే పడుకుని ముసుగు పెట్టుకున్నాడు సత్యనారాయణ.



నిత్యప్రముక్తస్య చిదాత్మకస్య
కృతావతారస్య దయామయస్య ।
కథం ప్రసజ్యేత జనిర్మృతిర్వా
వికల్ప దూరస్సగురుస్సదాఽవ్యాత్ ॥

[ ఆయన నిత్య ముక్తుడు, జ్ఞాన స్వరూపుడు, వికార రహితుడు, అయి వుంటూనే దయామయుడై అవతరించారు. ఇక ఆయనకు జన్మగాని, మరణంగాని ఎలా అంటుతాయి ? అట్టి శ్రీ గురుదేవులు నన్ను రక్షించుగాక. ]

## వాహనయోగం

* " మేరానూర్..........మేరానూర్ "

ఆ పిలుపులో ఆర్తి వుంది.

జనసమ్మర్దంతో నిండివున్న ** మేటగల్లి పెద్ద వీధిలో జనానికి అడ్డంపడి పరిగెత్తుతూ చప్పట్లు చరుస్తూ పిలుస్తున్నాడెవరినో ఆ తాత. ఎవర్ని పిలుస్తున్నాడోగాని ఎవరూ పలకటం లేదు. తాత అరుస్తూనే గబగబా అడుగులువేస్తూ రోడ్డు దాటివెళ్ళాడు.

అక్కడ పెద్దపెద్ద ఉత్తరాల సంచులు బుజాన వేసుకొని, ఆ బరువుకి ముందుకు బాగా వొంగి రొప్పుతూ వేగంగా నడుస్తున్నాడు ఒక పోస్టల్ బంట్రోతు. అతను ముందుకు నడుస్తున్నాడు. అతనిది దాదాపు పరుగు. తాత వెనకాల వస్తున్నాడు. తాత పరిగెత్తుతున్నాననే అనుకుంటున్నాడు గాని అది నడకే. మొత్తానికి తాత పరిగెత్తినంత పనిచేసి, ఆ పోస్టల్ బంట్రోతు వీపుమీద సంచీ దొరకపుచ్చుకొని ఆపాడు. కాకీబట్టలతోవున్న ఆ బంట్రోతు ఆగి విసుగ్గా వెనక్కి తిరిగాడు.

అతను సత్యనారాయణ !

---

* మేరానూర్ అంటే విలువైనది, ప్రియమైనది.

** మేటగల్లి : ఇది మైసూరు నగరంలో ఒక పేట.

చటుక్కున బుజంమీది మూటలు నేలకు చేర్చి తాతను అప్యాయంగా చూశాడు సత్యనారాయణ.

ఎవరికివారు అయాసం తీర్చుకుంటూ ఇద్దరూ కొద్దిక్షణాలు మౌనంగా వుండిపోయారు. ముందు సత్యనారాయణే తేరుకున్నాడు.

"బావున్నావా, ఖాదర్ తాతా" అన్నాడు అప్యాయంగా.

"మేరానూర్, ఇదేమిటి? యీ పనేమిటి నువ్వు?" అయాసం తీరకపోయినా బాధ అపుకోలేక తాత అదుర్దాగా అడిగాడు జాలిగా.

"ఏముంది తాతా, బ్రతుకుతెరువు" అన్నాడు నవ్వుతూ సత్యనారాయణ.

"మేరానూర్, ప్రాణాలు పోసి బతుకులు నిలబెట్టేవాడికి, బ్రతుకుతెరువా? ఏమి దేశమిది భాయ్? మనుషులుండే దేశమేనా యిది?" తాతలో అవేదన ఎక్కువైంది.

"తాతా, నేను చిన్నవాణ్ణి. నీకు చెప్పకూడదు. అయినా, తప్పు లేనివాళ్ళను నిందిస్తున్నావు నువ్వు"

"అది సరేలే, దీంట్లో కెందుకు దిగావు నువ్వు?"

"అదేం తాతా, ఇది పని-ఉద్యోగం. ఉత్-యోగం. సర్కారు ఉద్యోగం."

"అదికాదు బేటా. ఈ మూటలు మోసే పని మాలాంటి కూలీ వెధవలమే చెయ్యమే! చదువుకున్నవాడవు, దేవుడి బిడ్డవు. నీ కెవ్వరయ్యా, ఈ పని అప్పచెప్పింది? అసలేం జరిగింది? చెప్పు" తాత ఆర్తి క్రమంగా కోపంగా పరిణమిస్తోంది.

నిదానించి చూశాడు సత్యనారాయణ.

"తాతా, టైమవుతోంది. ముందు మూటలు పోస్టాఫీసులో పడేసి, మధ్యాహ్నం విరామ సమయంలో నీ షాపు కొస్తా. అపుడు చెపుతాగా అన్నీ" అన్నాడు, లోలోపల ఏదో ఆలోచిస్తూ.

"మేరానూర్, నువ్వు వచ్చేదాకా చాయ్‌గూడ తాగను. గుర్తుంచుకో" అంటూ మూటలు బుజాల మీదికి ఎత్తుకొంటున్న సత్యనారాయణకి సాయం చేశాడు తాత. సత్యనారాయణ ముందుకు పరిగెత్తాడు. తాత వెనక్కివచ్చి, ఒక చిన్న సైకిలు షాపులో ప్రవేశించి, స్టూలుమీద కూర్చున్నాడు.

తెల్లని బట్టలతో, అంతకన్నా తెల్లని గడ్డాలతో, ఆ తాత నిర్మలంగా కనిపిస్తున్నాడు. మీసం లేని గుబురు గడ్డాలు, నున్నగా గీసిన గుండును బట్టి అతను ఒక ముసల్మాను అని త్వరగా పోల్చుకోవచ్చు. అతని మెడ మాత్రం కొంచెం వంకరగా వుంది.

సైకిల్ షాప్‌కి వచ్చిన దగ్గరనుండీ, అతను పని కుర్రాళ్ళకి ఇదీ అదీ పురమాయిస్తూ రిపేరుపని చేయిస్తున్నాడు. కాని అతని వాలకమంతా పరధ్యానంగా వుంది.

ఆ షాపులో ఒక అయిదారు సైకిళ్ళు రిపేరవుతున్నాయి. మరో ఐదారు సైకిళ్ళు అద్దెకు తిప్పేవి వున్నాయి. మాసిపోయి, ఆయిల్ రంగు కొట్టుకొని వున్న ఆ గది గోడలకు తురక అక్షరాల రాతలున్న యంత్రాలేవో వేళ్ళాడుతున్నాయి. కొన్ని మహమ్మదీయ మత సంబంధమైన ఫొటోలున్నాయి.

ఇంతలో ఒక కుర్రాడు వచ్చి "సేఠ్‌జీ" అంటూ చాయ్‌గ్లాసు అందించబోయాడు. వద్దని పంపేశాడు తాత. మధ్యాహ్నం రెండింటికి కుర్రాళ్ళంతా భోజనానికి వెళ్ళారు. కొట్టులో తాత వొక్కడే వున్నాడు. అప్పుడు "తాతా" అంటూ వుషారుగా సత్యనారాయణ వచ్చాడు. "మేరానూర్, వచ్చావా........రా, కుర్చో" అని ఆహ్వానించాడు తాత.

సత్యనారాయణ కూర్చుంటూనే అందుకున్నాడు "ఖాదర్ తాతా, నీ ప్రేమ నాకు తెలుసు. జరిగింది చెపుతా కొంచెం విను ముందు. నాకు ఉద్యోగం రాక మేం పడుతున్న బాధలు నీకు తెలును గదా. కృష్ణప్పగారని మా బంధు వొకాయన పోస్టల్ ఇనస్పెక్టరుగా పని చేస్తున్నాడు. ఆయన ఈ ఉద్యోగమైతే తను యిప్పించ గలనన్నాడు. ఇష్టపడి అప్లికేషన్ పెట్టాను. దీనికి ప్రస్తుతం యాభైరూపాయ లిస్తారు. రోజుకి అయిదు గంటలు పనిచెయ్యాలి. E. D. D. A. అంటారు యీ పోస్టును. Extra Departmental Delivery Assistant అన్న మాట."

"పర్మనెంటు ఉద్యోగమా" ఆ మాటకు అడ్డువచ్చాడు తాత.

"కాదు........"

"హమ్మయ్య"

"అదేంటి తాతా అలా అంటావు? మన అదృష్టం బావుంటే పర్మనెంటు కావచ్చు."

"బేటా, నిజం చెప్పు- నువ్వు యిష్టపడే యీ పని చేస్తున్నావా?"

"తాతా, నేనేం పనులు చెయ్యాలో అవే నా దగ్గరకు వస్తాయి."

"మేరానూర్, నువ్వు చేయాలిసింది యీ కూలిపనికాదు. చచ్చే మనుషుల్ని బతికించాలి. కూలే కొంపలన్నీ నిలబెట్టాలి. దిక్కులేని దీనులకు దారి చూపించాలి. కళ్ళుండి కూడా చూడలేని యీ గుడ్డిలోకానికి అల్లాని చూపించాలి." తాత మాట ఉద్వేగంలోకి వెళ్ళిపోయింది.

"తొందరపడరాదు" గంభీరంగా అన్నాడు సత్యనారాయణ.

"ఏం తొందర పడరాదు బాబూ, ఎలా మోస్తున్నావు ఆ బరువులు నువ్వు? ఎన్నాళ్ళ నించీ చేస్తున్నావీ పని?"

"వారం రోజులనుంచీ"

"అంటే ఈ 1962 జులై నెల ఒక పాడు నెల అన్నమాట. సర్లే, రోజూ యిటే పోతున్నావా ?"

"అవును. రోజూ ఒంటికుప్పల్ పోస్టాఫీసు, యీ మేటుగల్లు పోస్టాఫీసూ రెండూ చూసుకోవాలి నేను."

"ఏమిటి ఒంటికుప్పల్ నుంచీ మేటుగల్లికి, యీ బరువులు మోస్తున్నావా ?"

"లేమి అంతకన్నా బరువైంది తాతా."

తాత ఈ మాట వినిపించుకోలేదు. తనలో తానే, ఆలోచనలో పడిపోయాడు.

గత నాలుగైదేళ్ళుగా సత్యనారాయణ తనకి తెలుసు అద్దెసైకిలు కోసం వస్తూ వస్తూనే మెల్లిగా చనువు పెరిగి సైకిల్ రిపేరు గూడా నేర్చుకుంటూ వుండేవాడు. నిరుడు తన ఒక్కగా నొక్క కొడుక్కి జబ్బుచేసింది. పెద్దాసుపత్రిలో గూడ వైద్యాలయిపోయి, ఆశ వదులుకుని యింటికి తెచ్చారు. అప్పుడు సత్యనారాయణ పరామర్శించటానికి వచ్చాడు. వచ్చి "తాతా, నీకు వేరే యిబ్బంది లేకపోతే, నే నిచ్చే విభూతి నీ కొడుకు నోట్లో వెయ్యగలవా?" అన్నాడు తనంతట తానే. మామూలుగా అయితే ఈ బాపన విభూతికి తను ఒప్పుకొనే వాడు కాదు గాని ఆ సమయం అలాంటిది కాదు. ఏమీ విశ్వాసం లేకపోయినా కొడుకుమీద వుండే ప్రీతివల్ల వేసిచూద్దాంలే అని నోట్లో వేశాడు విభూతి. అరగంటలో లేచి కూర్చోటమే కాదు, లేచి పరుగెత్తాడు కొడుకు. అందుకు ప్రతిఫలంగా, ఏదో ఒకటి ముట్టచెప్పాలని విశ్వప్రయత్నం చేశాడు తను. అతను ససేమిరాఅంగీకరించలేదు. ఆ తరువాత ఒకరోజు, తన నమాజ్ సమయంలో తన దగ్గరకు వచ్చాడు. తక్షణం తనకు, చంద్ర నక్షత్ర దర్శనం అయింది.

ఆ తరవాత అనేకమంది ద్వారా, యీ కుర్రవాడి మహత్తు వింటున్నాడు. కాని అదేమి చిత్రమో యీ కుర్రవాడు తన దగ్గరకు వచ్చేసరికి మాత్రం, తను తాత అయినట్టు, అతను సొంత మనమడే అయినట్టు వుంటుంది తనకు మాత్రం. ఇవ్వాళ చివరికి దరిద్ర బాధవల్ల ఈ పనికి ఒప్పుకున్నాడన్నమాట. తను ఏదో ఉపాయంచేసి, ఈ కుర్రాడికి రవ్వంత సాయం చేసి తీరాలి. తాత మనస్సులో ఆలోచనలు క్షణంలో గిర గిరా తిరిగాయి.

"బేటా, నువ్వు నాకో సహాయం చేయాలి" అన్నాడు తాత ఉన్నట్లుండి.

"ఈ ఉద్యోగం మానాలా."

"కాదు. అలాంటిది కాదు. చేస్తానంటే చెపుతా".

"తాతా నీ దగ్గర దాపరిక మెందుకు ? నీకు కావలసిన సాయం నాకు తెలుసు."

"మేరానూర్, నీకు మూడు లోకాలూ తెలుసు. ఒక విన్నపం విను. నేను, నీకేం బంగారం యివ్వను, డబ్బు లివ్వను, రత్నా లివ్వను. ఒక పాత సైకిలుంది, సెకండు హాండుది. నీ కాళ్ళు పట్టుకుంటాను, మరోమాట చెప్పకుండా నువ్వది వాడుకో, ఈ గాడిద మోత

కొంతయినా తగ్గుతుంది. ఇంకోసారి యిలా చూస్తే యీ తాత గొంతులో ప్రాణాలు నిలవవు." తాత గొంతులో ఏడుపు జీర ప్రవేశించింది.

"తాతా, నా కెవరి సొమ్మూ పనికిరానిది కాదు. కాని తీసుకొనే సమయం ఇంకా రాలేదు. తీసుకొన్న దానికి శాస్త్ర సమ్మతమైన వినియోగం వుండాలి. ప్రస్తుతానికి నా దగ్గర ఆ వినియోగానికి తగిన ఏర్పాట్లు లేవు."

"వినియోగ మేమిటయ్యా ? నువ్వేం చేస్తే అది వినియోగమేగా. నా సొమ్మేం చేశావని నేనడుగుతానా" ?

"అలా కాదు తాతా, ఇది విను. నీకు తండ్రి తాతల నుంచి కొంత ఆస్తి వచ్చింది. అది నువ్వు అమ్ముకొని, దులిపెయ్యటానికి నీకు హక్కు వుందా ?"

"ఎలా వుంటుంది ? మా నాన్న నా కిచ్చినట్టుగా నేను నా కొడుక్కి అందించ వద్దా?".

"ఔను. చట్టం గూడా అలాగే శాసనం చేసింది. ఇక నువ్వు సొంతంగా సంపాదించు కున్న ఆస్తి వుందనుకో, దాని మాటేమి టంటావు ?"

"అది నా యిష్టం. నేను తగలబెట్టినా అడిగే అధికారం యెవడికీ లేదు."

"అవును. అలాగే నా గురువులు నాకు కొంత ఆస్తి యిచ్చి వెళ్ళారు. దానిని ఉపయోగించే విధానం గూడ వాళ్ళే నిర్ణయించి పెట్టారు. దాన్ని అలాగే ఆచరించాలి. అంతేగాని దాంతో నన్నూ నా బంధువుల్నీ పోషించుకుంటానంటే చెల్లదు."

"అంటే."

"అంటే, యిప్పుడు నీ కొడుకును బ్రతికించినా, ఇంకో మంచి పని చేసినా గురువులు అనుగ్రహించి యిచ్చిన విద్యలతో ఆ పని జరుగుతోంది. దాని వల్ల ఆదాయం తెచ్చుకొని అనుభవించే హక్కు నాకు లేదు."

"అదేమిటయ్యా, ముందు నువ్వు బతికితేగదా, నీ గురువులు చెప్పిన పని చేసేది?"

"ఔను నిజమే. బ్రతకాలి. నా సొంత ప్రయత్నం మీద నేను బతకాలి. బ్రతికి గురువులు చెప్పిన పని చేయాలి."

"ఎట్లా బతుకుతావు మరి ?"

"గురువులు యిచ్చిన విశేష శక్తి గాక, సామాన్య మానవుడుగా నాకు ఉన్న శక్తితో నేను పొట్ట పోసికొని బతుకుతాను. ఏదో కాయకష్టం చేశానంటే, ఏదో చిన్న పాఠం చెప్పానంటే, ఏదో ముహూర్తం పెట్టానంటే, ఇవన్నీ నాలాంటి సామాన్యు లందరూ చేసే పనులే. ఇందులో దివ్యశక్తి ఏదీ లేదు. దీనివల్ల ఎంతొస్తే అంతతోనే నేనూ, నా బంధువులు, మా సుఖాలూను ! అంతకు మించి నయాపైసా ముట్టుకునే హక్కులేదు నాకు."

"మరీ చిత్రంగా వుందే, నువ్వు చెప్పేది. ఆలోచిస్తే, మా సొమ్ము తీసుకోటం యిష్టం లేక ఏదో కథ చెపుతున్నావేమో అనిపిస్తోంది."

"తాతా, నీతో ఏనాడయినా అబద్ధం చెప్పానా ?"

"అది కాదనుకో"

"నిజం తాతా, అదంతే. రానురాను యీ ప్రపంచంలో, నా స్థితి మారుతుంది.. నా ప్రపంచంలో నా స్థితి ఎప్పుడూ ఒకటేననుకో. అది వేరే విషయం. నా దగ్గరకు వేలుకాదు, లక్షల జనం వస్తారు. అందులో ముష్టివాళ్ళ దగ్గరనుంచీ, మహారాజులవరకూ, బందిపోట్ల దగ్గరనుంచీ, గంగిగోవుల వరకూ, చవటలనుంచీ సైంటిస్టుల వరకూ, వెంగళాయల నుంచీ వేదాంతుల వరకూ, అందరూ వుంటారు. అందరికీ అన్ని రకాల పనులూ చేయాలి. నేను ఏదో పని చేయిస్తే గాని వాళ్ళను అనుగ్రహించేందుకు లేదు. అప్పుడు నాకు డబ్బు కావాల్సి వస్తుంది. అప్పుడు నేను డబ్బు పిండుతాను. ఎవరిదగ్గరైనా తీసుకుంటాను. ఎంత తీసుకున్నా చాలనంత పని వుంటుంది నాకు. కాని తాతా, అప్పుడు గూడ నా సొంత బతుకుకి నా సంపాదనే సరిపెట్టుకుంటాను. ఏది నా సొంత సంపాదనో, ఏది దివ్యశక్తి సంపాదనో ఇతరులకు తెలియక పోవచ్చు. కానీ నాకు పైసలతో సహా లెక్క వుంటుంది. నా నియమం మారదు తాతా."

ధర్మదండం పట్టుకున్న మహారాజు శాసన ప్రకటనలాగా వున్న ఆ గంభీరోపన్యాసంతో, తాత కాసేపు మంత్రముగ్ధు డయిపోయాడు. మెల్లిగా తేరుకుంటూ—

"కానీ మేరానూర్, నన్ను గూడ అనుగ్రహించావు గదా! నన్ను గూడ ఒక మంచి పని చేయనీయరాదా." అన్నాడు. సమాధానం మాత్రం విసిరిన చురకత్తిలా వచ్చింది.

"తాతా, నీ లెక్కలన్నీ నా దగ్గర రాసివున్నాయి. నువ్వు ఎక్కడ ఎంత దానం చేస్తున్నావో నాకు తెలుసు. ఎంత వ్యర్థం చేస్తున్నావో గూడ తెలుసు. నాది నాకు సరిపోయింది. నీ వృథా వ్యయాలను పరిమితి చేసే అంత బాధ్యత నేను పెట్టుకోలేదు." ఈ దెబ్బకు తాత చాలసేపు మాట్లాడలేక పోయాడు. ఆలోచించి, ఆలోచించి, చివరకు అన్నాడు.

"బేటా, నేను వ్యర్థం చేస్తున్న దాంట్లో కొంత తగ్గుతుంది. నాకీ ఉపకారం చేసి పెట్టు సైకిలు తీసుకో, కాదనకు."

ఈమాటు తాత లేచివచ్చి సత్యనారాయణ చేతులు పట్టుకున్నాడు. సత్యనారాయణ, కళ్ళవెంట నీళ్ళు కారినై.

"తాతా! నీవంటివాళ్ళు పేటకు ఒకళ్ళున్నా చాలు. పోనీ వూరి కొకరున్నా చాలు. నా కార్యక్రమం అంతా సుఖంగా సాగిపోతుంది. కాని నాకంత భాగ్యమా." సత్యనారాయణ మాట్లాడేది పెద్దగా పట్టించుకోవటంలేదు తాత.

"బేటా, కాదనకు. కాదనకు" అని మెల్లిగా వంగలేక, వంగలేక వంగుతున్నాడు, కాళ్ళు పట్టుకుందామని.

సత్యనారాయణ తటాలున లేచి, తాతను కావలించుకొని కూర్చోబెట్టాడు. "సర్లేతాతా, అట్లాగే కానీ, అట్లాగే కానీ" అంటూ. తాత మొహం చిచ్చుబుడ్డల్లే వెలిగిపోయింది. ఒక నిముషం ఆగి మెల్లిగా అన్నాడు సత్యనారాయణ. "ఒక షరతు."

"సైకిలు తీసుకొనే మాట ఖాయమైతే ఏ షరతైనా ఫరవాలేదు." తాతకు సంతోషం పట్టరాకుండా వుంది.

"సైకిలు తీసుకోటం ఖాయమే. దానికి తిరుగులేదు. అయితే నెల నెలా నేను ఎంతో కొంత యిస్తాను. కాదనకుండా పుచ్చుకోవాలి."

"ఇదేం మాట బేటా. నువ్వు నాకు డబ్బిస్తావా? నేను పుచ్చుకోవాలా?" తాత ఉత్సాహం పూర్తిగా నీరుకారిపోయింది.

"తాతా, నీ మాట నేను కాదనలేదు. నువ్వూ నా మాట కాదనకు" ఈ కొత్త మెలికకు తాత మరింత యిరుకున పడ్డాడు.

"తాతా, నువ్వు సైకిలు ప్రేమతో యిచ్చావు. నిండు ప్రేమతో యిచ్చావు. నిస్వార్థంగా యిచ్చావు. నిష్కామంగా యిచ్చావు. నేను పుచ్చుకొన్నాను. ఇది నా జీవితంలో నా దగ్గరకు వస్తున్న మొదటి వాహనం. నిజానికి, సర్వలోకాల్లోనూ వాహనాలు నావల్ల తిరుగుతాయి. అయినా భవిష్యత్తులో కార్ల దగ్గరనుంచీ విమానాలదాకా అనేక వాహనాలు నన్నుతిప్పేందుకు నా దగ్గర చేరుతాయి. అయినా నువ్విచ్చిన యీ ప్రేమ వాహనం, యీ సైకిలు, నా జీవితాంతం నా దగ్గరే వుంటుంది. నేను సైకిలు కావాలని నీ దగ్గరకు రాలేదు. నేను డబ్బిస్తానని నువ్వు నాకు సైకిలు యివ్వటం లేదు. అందువల్ల యీ సైకిలు నువ్వు నా కిచ్చిన ప్రేమ కానుకే. దీనికి తిరుగులేదు. నేను నీకు నెలనెలా యిస్తాననేది వేరే కారణం మాట. అది నా నియమానికి సంబంధించింది. నా నియమం నువ్వు చెడగొడతావా చెప్పు!"

సత్యనారాయణ హృదయపూర్వకంగా అన్న యీ మాటలకు తాత ద్రవించాడు. తను యింకా, పట్టుబడితే అతను మొత్తానికి మొండికి వేసినా వెయ్యవచ్చు. అందుకని సత్యనారాయణ చెప్పిన దానికి వొప్పేసుకున్నాడు తాత. వెంటనే ఒక సైకిలు తీసి బైటపెట్టాడు.

సత్యనారాయణ దాన్నందుకొని "యిక టైం అయిపోతోంది తాతా" అన్నాడు. అని ఓ నిముషమాగి, "పోన్లే టైము లోపల యిచ్చావు, మంచి పనైంది, ఇప్పుడే దీని మీద పోస్టాఫీసుకు పోతా" అంటూ సైకిలెక్కబోయాడు.

ఆ సైకిలు బాగా ఎత్తు సైకిలు. అందులోనూ దాని సీటు బాగా పైకి ఎత్తి వుంది. అంచేత ఎక్కడం కొంచెం యిబ్బందిగా వుంది. కాలి కిందికి ఎత్తేదైనా దొరుకుతుందేమో అని ఇటూ అటూ చూస్తున్నాడు సత్యనారాయణ. అది గ్రహించి నవ్వుతూ తాత ముందుకు వచ్చాడు.

"మేరా నూర్, పని కుర్రాళ్ళు వచ్చాక సీటు క్రిందకి దింపిస్తా. ఇప్పటికి యిదిగో ఈ బండమీద కాలు పెట్టి సైకిలెక్కు. కాదనకు బాబూ." అంటూ తను నేలమీదకు వంగి పీపు చూపించాడు దీనంగా. సత్యనారాయణ కొంచెం విచిత్రంగా చూచి, తాత వీపు మీద రవ్వంత కాలానించి సైకిలెక్కేసి, తుర్రున ముందుకు వెళ్ళిపోయాడు. పరవశించిన తాత, లేచివచ్చి బల్లమీద కూర్చుని ఆనందంగా గోడకు జారగిలబడ్డాడు. అలా ఆనందంలో తేలిపోతూనే, అప్రయత్నంగా తన మెడ తడిమి చూసుకొని, ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు ఖాదర్ తాత. "అరె, ఈ దేవుడి బిడ్డ పాదస్పర్శతో నా స్పాండిలైటిస్ వ్యాధి ఎగిరిపోయింది" అని ఒక్క అరుపు అరిచాడు ఆశ్చర్యంగా. అతని మెడలో ఇప్పుడు వంకర లేదు.

పొంగిపోతూ సైకిలుమీద వచ్చి "కొత్త సైకిలు కొన్నా" అని ఉత్సాహంగా చెపుతున్న సత్యనారాయణను చూసి, తోటి పోస్టుమన్‌లు సన్నగా మందలించారు.

"ఏమిటి సత్యనారాయణా, ఇంకా మొదటి నెల జీతమయినా చేతికి రాలేదు. అప్పుడే అప్పు చేసి సైకిలు కొన్నావే! ఇంత కుర్రతన మేమిటి? డబ్బు విలువ తెలుసుకోవాలి" అని. దీన్నిబట్టి యింటి దగ్గర మందలింపులు ఏ శ్రుతిలో వుంటాయో ముందరే అర్థమయింది సత్యనారాయణకి.

క్రమంగా రెండు మూడు నెలలయే సరికి సత్యనారాయణకి పోస్టాఫీసులో పనంతా స్వాధీనమైంది. నిజానికి మూటలు తెచ్చి పడెయ్యటమే అతని డ్యూటీ. అయినా తాత్కాలిక ఉద్యోగి అన్నాక అంత మాత్రంతో వదలిపెట్టటం గవర్నమెంటు ఆఫీసులకు రివాజు కాదు. పై అధికారులు తగినంత మంది సిబ్బందిని నియమించరు. ఉన్న పనివారు బంగారపు త్రాసులో తూచి పనిచేస్తామంటారు. పని నడిచేందుకు తాత్కాలిక ఉద్యోగుల్ని వేసుకుంటారు. తక్కువ ఉద్యోగులతో పని నడపకపోతే, స్థానిక అధికారికి పై అధికారులు అక్షింత లేస్తారు. కనుక యీ స్థానిక అధికారికి యిష్టం లేకపోయినా, తప్పని తెలిసినా, తాత్కాలిక ఉద్యోగులనుంచి కావలసినంత ఎక్కువ పిండుకోక తప్పదు. ఇలా తప్పనిసరిగా ప్రారంభమైన పిండుడు కార్యక్రమం అలవాటుగా మారిపోతుంది. ఒకో సత్పురుషుడికి అది సరదాగా మారుతుంది. మరో మహానుభావుడికి పంతంగా గూడ తయారవుతుంది. అదంతా ఆ తాత్కాలిక ఉద్యోగానికి వచ్చిన దౌర్భాగ్య జీవిచేసుకొన్న కర్మ మీద ఆధారపడి వుంటుందే తప్ప వేరే నియమాలూ, నీతులూ ఏమీ వుండవు. ఈ ప్రపంచం అలవాటుపడిన అన్యాయాల్లో యిది వొకటి. దీన్నొక కొత్తగా చెప్పుకొనే వాడొక వింతపశువు. ఇలాంటి పరిస్థితుల్లో "టెంపరరీ తపాలా బంట్రోతు"గా

( ఇది ఆ వుద్యోగానికి ఆ డిపార్టుమెంటులో సంగ్రహ నామధేయం) పనిచేస్తున్నాడు సత్య నారాయణ. సత్యనారాయణ అయినా, నలుగురితో పాటు నారాయణే. ఏమీ ప్రత్యేకత లేదు.

* * *

## గణేశమజ్జనం

ఉద్యోగం ప్రత్యేకత లేకుండా సాధారణంగానే గడిచిపోతోంది గాని సత్యనారాయణలో ఎన్నడూ లేని ప్రత్యేక లక్షణాలు మొలుచుకొస్తున్నాయి క్రమంగా.

ఇంట్లో వున్నాడా, ఆఫీసులో వున్నాడా, రోడ్డు మీద వున్నాడా, అనే విచక్షణ లేకుండా ఎక్కడ పడితే అక్కడ వొళ్ళు తెలియకుండా పోతోంది రాను రాను. అదేమీ మూర్ఛలాంటిది కాదు. ఆ తెర వస్తున్నపుడు పక్కవాళ్ళకి ముందే చెపుతాడు, "కాసేపు నన్ను పిలవకండి" అని. అలా చెప్పి ఉన్నచోట చక్కగా చపటా వేసుకొని వీపు బిర్రబిగతీసుకొని, కళ్ళు మూసుకుని కూర్చుండి పోతాడు. మళ్ళీ ఎంతసేపటికి దిగివస్తాడో ఆ పైనున్న దేవుడికే తెలియాలి.

" నన్ను పిలవకండి " అని వూరికే మాటవరసకి చెపుతాడే తప్ప పిల్చినా అతనికి వచ్చిన నష్టమేమీ లేదు. అది కేవలం చెవిటి వాడి ముందు శంఖమే. ఇలా ఒకోసారి గంటల తరబడి బిగతీసుకుపోతాడు. దీనితో స్థానిక సహోద్యోగులలోనూ, స్థానిక అధికార్లలోనూ ఓ రకమైన హేళన భావం మొదలయింది.

అయితే, ఒక రోజున సత్యనారాయణ నలుగురి పని, ఎడం చేత్తో విసిరిపారేస్తాడు. ఉండి వుండి, ఒక రోజు మూటలు తెచ్చి, అక్కడ పారేసి " నా మనస్సు సరిగా లేదు " అని ముండికెత్తి బిగతీసుకు కూచుంటాడు. ఇలాంటి టెంపరరీ వాడిని సహిస్తే, అధికార్లవుతారా ? కాని యితను కృష్ణప్పగారి మనిషే! ఆ కృష్ణప్పగారి నోరు అసలే మంచిది కాదు. పైగా ఆయన మంచి ప్రజాబలమున్న కార్మిక నాయకుడు. అంచేత అధికార్లు కొంచెం తటాపటాయించ వలసి వస్తోంది.

ఇంతలో వినాయక చవితి వుత్సవాలు దగ్గరకు వచ్చాయి. సత్యనారాయణ పూర్వమంత బాగా ఆ వుత్సవాల కోసం తిరగకపోయినా, కొంతయినా తిరగక తప్పలేదు. ఆ తిరుగుడు. పోస్టాఫీసు అధికారులకు గుచ్చుకోకనూ పోలేదు. ఆ సంవత్సరం వుత్సవాల్లో గూడ సత్యనారాయణ పురోహితుడుగా పనిచేశాడు.

ఆ సంవత్సరం ఉత్సవాల పందిళ్ళలోకి, కొందరు లింగాయతులు, కొందరు తురకలు రోజూ వస్తూ పోతూ వుండటం చూసి, నిర్వాహకులకు సందేహమూ భయమూ బయలుదేరాయి.

దాంతో ద్వారక వాళ్ళని బాగా గమనించసాగాడు. సత్యనారాయణ వాళ్ళకేదో విభూతు లిస్తున్నాడు. వాళ్ళు తీసుకెళ్ళుతున్నారు. "నిన్న మీరిచ్చిన మందు బాగా పనిచేసిందని" చెప్పి దణ్ణాలు పెడుతున్నారు.

ఇది చూసి "వాళ్ళతో మనకు స్నేహ మేమిటని" మందలించాడు ద్వారక.

"అంతా మనుషులేగా" అన్నాడు సత్యనారాయణ.

"ఆ మాత్రం మాకూ తెలుసులేవయ్యా" అని విసుక్కుని వెళ్ళిపోయాడు ద్వారక. ఉత్సవాలు అయినాయి. గులాములు చల్లుకొంటూ, మహా ఆనందంగా గణేశ నిమజ్జనోత్సవం సాగుతోంది. సరిగా నిమజ్జన సమయం వచ్చేసరికి ముందుకు రావాలని అంతా తోసుకుంటు న్నారు.

విగ్రహం పట్టుకొని నుంచున్న సత్యనారాయణ మీద జనం పడకుండా ద్వారక అంగరక్షకుడుగా వ్యవహరిస్తూ విజృంభించి జనాన్ని అదలస్తున్నాడు. ఆ సందర్భంలోనే స్వామిని నిమజ్జనం చేస్తూ బిగ్గరగానే అన్నాడు సత్యనారాయణ.

"గణేశా, ఇదే చివరిసారి. ఇక నీ నిమజ్జనానికి నేను రాలేను" అని. అది విన్న ద్వారక అందుకొన్నాడు.

"ఏం పంతులూ రానంటున్నావు. వేరే యెక్కడయినా పెద్ద బేరం తగిలిందా పై యేటికి."

"నీ కర్థం కాదులే" అన్నాడు సత్యానారాయణ.

"ఇదిగో యిలాంటివి మాకు ఇట్టే అర్థమవుతాయి. ఇక్కడ ఫ్రీ సర్వీసు చేస్తున్నావు. పై యేటికి ఏదో మంచి బేరం తగిలివుంటుంది. దానికే ఏదో ఫోజు కొడుతున్నావు. ఇదిగో అంతకంటే మేమే పదిరూపాయలు ఎక్కువ యిస్తామంటే మళ్ళీ నువ్వే వస్తావు. మీ పంతుళ్ళ సంగతి నాకు చెప్పకయ్యోవ్" అని వుత్సాహంగా వెళ్ళిపోయాడు ద్వారక. సత్యనారాయణ నవ్వేసి వూరుకున్నాడు.

పోస్టాఫీసు అధికారులు మాత్రం అలా నవ్వేసి ఊరుకోలేదు. దాంతో, సత్యనారాయణ అవినయం కృష్ణప్పగారికి ఫిర్యాదు వెళ్ళింది. కాని అదే సమయానికి పక్కనున్న మరో సీనియర్ పోస్టుబంట్రోతు "సత్యనారాయణ సామాన్యుడు కాదు. అతని నోటితో ఏమైనా అంటే అది అయితీరుతుంది." అని ఒక కితాబు యిచ్చాడు.

కృష్ణప్పగారు యిరుకులో పడ్డాడు. ఏమయినా తను పెట్టిన కుర్రవాడివల్ల తనకు మాట వస్తుంటే ఆయన ఎలా చూస్తూ వూరుకోగలడు? అసలయినా ఈ జపాలు, పూజలు, ఇటువంటివన్నీ యింటి దగ్గర మడి కట్టుకొని ఏడ్చుకోవాల్సినవి గాని ఆఫీసుల్లో ఈ గోలేమిటి?

అందువల్ల ఆయన తన లోపం లేకుండా సత్యాన్ని గట్టిగానే మందలించాడు. మందలించి మందలించి, కొస మెరుగుకోసం చివరకు ఓ జోకు వేశాడు.

"సత్యనారాయణా! ఏమయినా నీ కీ పాడు పోష్టాఫీసులో కంటే వేరే యేదయినా మరో రంగంలో మంచి భవిష్యత్తు వుందేమో అనిపిస్తోందోయ్." అని.

ఆమాత్రం మాట చమత్కారం లేకపోతే, కార్మికనాయకుడుగా ఎలా చలామణీ అవుతా డాయన ?

కానీ సత్యనారాయణకు లోకానుభవం లేదు. సూటిగా అనేశాడు. "బావయ్యా, నీ ఆశీర్వచనం అట్లాగే వుండనీ, భగవంతుడు గూడ నన్నలాగే ఆశీర్వదించనీ." అని.

ఏం చెప్పాలి యీ మొండివాడికి ? తన అసహాయ స్థితిని హుంకారంగా మార్చి అవతలకు వెళ్ళిపోయాడు కృష్ణప్పగారు.

ఈ సంఘటన తరువాత సత్యనారాయణ ధ్యానంలో వుండటం ఎక్కువై పోయింది. ఆ గణపతి ఎక్కడకు పడితే అక్కడి కొచ్చి, మీద పడసాగాడు. పాపం ఆయనకు, టెంపరరీ పని వాళ్ళ చేత ఎక్కువ సేపు పని చేయించుకోవటం ధర్మమే నని తెలియదు కాబోలు! సత్యనారాయణ డ్యూటీ వేళ కాగానే వచ్చి మీద పడిపోయే వాడు. అందువల్ల అతను పోష్టాఫీసులోనే ధ్యాన సమాధుల్లో, మునిగిపోయే సంఘటనలు పెరిగిపోసాగాయి. దీనితో పాటు అప్పుడపుడు తోడి పనివా రెవరైనా ఆపదల్లో వుంటే ముందుగా హెచ్చరించి విభూతి యిచ్చి గట్టెక్కించటం నాలుగయిదు సార్లు జరిగింది. దాంతో అతనంటే హేళన పోయి భయం దగ్గరకు వచ్చింది. పోష్టాఫీసులో పని చేసినంతసేపూ మంచి హుషారుగా చేస్తాడు. ధ్యానం వచ్చి పడితే యిక పనే వుండదు. అందువల్ల అతన్ని మెచ్చుకోనూ లేక, కేక లెయ్యనూ లేక పోష్టుమాష్టరు నరసింహయ్య సతమత మవుతున్నాడు.

ఒకరోజున డెలివరీ యివ్వాల్సిన ఉత్తరాలు పోష్టాఫీసులో సార్టింగు చేస్తున్నారు. అందులో సత్యనారాయణ గూడా వున్నాడు. కుర్రాడు మంచి హుషారుగా పాటలు పాడు కొంటూ సార్టు చెస్తున్నాడు. అందరూ ఆనందంగా జోకులు వేసుకుంటూ పని చేస్తున్నారు. ఉన్నట్టుండి ఒక కవరు తీసి పట్టుకొని "ఇదుగో ఇది నీవార్డులోదే, ఇది ప్రేమలేఖ. ఇది యిచ్చి మామూలు గుంజుకో" అన్నాడు సత్యనారాయణ ఒక సహోద్యోగితో.

"కుర్రవాడికి ప్రేమలేఖలయితే వాసన చూడంగానే తెలిసిపోతుందిరా" అన్నాడు మరోడు. అంతా నవ్వుకున్నారు.

ఆ పోష్టుమేను కొంచెం వయస్సు మళ్ళినవాడు. పెద్ద కుటుంబం కలవాడు. మామూళ్ళు బాగా లాగుతాడని పేరున్నవాడు. అందువల్ల అతని మీద జోకు పేల్చాడను కున్నారు అంతా. ఆ పోష్టుమేనూ అలాగే అనుకున్నాడు. తన బట్వాడాలోకి వెళ్ళినాక

యీ ఉత్తరం ఇచ్చేటప్పుడు వాకిట్లోనే నిలబడి ఎదురుచూస్తున్న కలవారింటి పిల్ల తన చేతుల్లోంచి ఆత్రంగా ఉత్తరం లాక్కోవటం చూసేసరికి అతనికి సత్యనారాయణ మాట గుర్తొచ్చింది. అనుభవజ్ఞు డతను. ఆ పిల్ల వాలకం బట్టి సత్యనారాయణ చెప్పింది నిజమని పించింది. అయినా నిర్ధారణ కోసం అన్నాడు. "అమ్మా, తియ్యటి ఉత్తరం తెచ్చాను. మరి నాకు మామూలు."

ఆ పిల్ల తెగ సిగ్గుపడిపోయి ఇంట్లోకి వెళ్ళి ఒక రూపాయి తెచ్చి యిచ్చింది. వెనుదిరిగి రోడ్డు మీదికి వచ్చిన, ఆ పోస్టుమేను ముఖం సంతోషంగా లేదు. ఏదో దీర్ఘాలోచనలో ఉన్నాడు. ఆ ఆలోచనా భారంలోనే అతను తన విధి పూర్తి చేసుకొచ్చాడు. ఆఫీసుకి అతను వచ్చేసరికి తపాలా మూటల చాటున ధ్యానంలో వున్నాడు సత్యనారాయణ.

ఆ రోజున సత్యనారాయణ చెయ్యవలసిన పనంతా అతనే చేశాడు. అందరూ వెళ్ళారు. అతను, సత్యనారాయణ ఇద్దరే మిగిలారు.

సత్యనారాయణ చాలా ఆలస్యంగా కళ్ళు తెరిచాడు. కళ్ళు తెరవంగానే వెళ్ళి పాదాభి వందనం చేశాడా పోస్టుమేను.

"ఏం కావాలి" అన్నాడు సత్యనారాయణ తనేదో పెద్ద రాజ్యాధికారి నన్నట్టు.

"బాబూ, పిల్లలు గలవాడిని. నా భార్యకు జబ్బుగా వుందని మీకు తెలుసు. అది యిక బతకదని పెద్ద పెద్ద డాక్టర్లు చెప్పేశారు. అది లేకపోతే నా సంసారం నట్టేట మునిగిపోతుంది. నా పసికందులు దిక్కు లేకుండా పోతారు. నువ్వే కాపాడాలి. నువ్వే దిక్కు" అన్నా డతను వినమ్రంగా.

"నీ కష్టం నాకు తెలుసు. అందుకే తాడందించాను. అందుకొన్నావు. అదృష్టవంతుడివి. భయం లేదు. ఇదిగో ఈ అక్షింతలు ఆ తల్లి తలమీద వెయ్యి. అంతా గణపతి చూసు కొంటాడు." సత్యం చేతిలో కాసిని అక్షింతలు రెడీగా ఉన్నాయి. అవి అతని చేతులో పోశాడు. అతను పొట్లం కట్టుకొని వెళ్ళిపోయాడు. ఒక నెలరోజు లయిన తరువాత అతను తోటి పోస్టుమన్ లందరితోనూ టాంటాం మొదలెట్టాడు, సత్యనారాయణ దయవల్ల తన భార్యకు పూర్తిగా నయిమైందని.

కొందరు సత్యనారాయణని సూటిగా అడిగారు. "నిజమా అని ?"

"వాడి మొహం, డాక్టర్ల మందులు నిదానంగా పట్టిచ్చి వుంటాయి" అన్నా డతను. కొందరు ఇదే నిజమనుకున్నారు.

ఏమయినా క్రమంగా సత్యనారాయణ ధ్యానంచేసి లేచేసరికి కాచుకొని వుండి, అక్షతలో, విభూతో, కుంకుమో పుచ్చుకొని, లాభం పొందే వారి సంఖ్య పోస్టాఫీసులో పెరిగి

పోయింది. ఇలావుండగా, పోస్టాఫీసుకే వచ్చి, అతనికి దణ్ణాలు పెట్టి, అతని చేతి ప్రసాదాలు పుచ్చుకుపోయే అతిథుల సంఖ్య గూడ క్రమంగా పెరగసాగింది. అలా వచ్చే అతిథుల్లో కొందరు పెద్దపెద్దవాళ్ళు గూడా వుండటం చూసి తోటి ఉద్యోగులకు అతని పట్ల భక్తీ భయమూ రెండూ పెరగసాగాయి. పోష్టుమాష్టరు నరసింహయ్య గారికి ఈ రెంటితోపాటు కొద్దిగా విసుగు గూడా కలగసాగింది. ఏంచేస్తాడు పాపం, ఆయన సంకటం అటువంటిది.

ఇలావుండగా 1963 మార్చిలో, పొద్దుటూరు నుంచి ఉత్తరం వచ్చింది. 1962 లోనే సుబామణిగారు పోయారని. ఆ వుత్తరం చూసుకొని సత్యనారాయణ బొటబొటా కన్నీరు కార్చాడు. 1962 జనవరి లోనే తను వాళ్ళను హెచ్చరించాడు. అయినా వాళ్ళు గుర్తించలేదు. పైగా వాళ్ళ దుఃఖంలో వాళ్ళు పడివుండి తను యెన్ని వుత్తరాలు రాసినా సమాధానమే వ్రాయలేదు. తను వొదిలిపెట్టకుండా ఉత్తరాల మీద ఉత్తరాలు వ్రాయగా వ్రాయగా, ఇప్పుడు ఉత్తరం వ్రాశారు వాళ్ళు. "మానాన్న పోయాడు, చాలా రోజులయింది" అని.

చిత్రం, ఎంత తెలిసినా వాళ్ళ ఉత్తరం వచ్చేవరకూ దుఃఖమే రాలేదు తనకు! తన మనస్సు యిప్పుడే రెండు లోకాల మధ్య ఊగులాడుతోంది. ఆ మనస్సును తను ఒక పక్కకు లాగుతున్నాడు. గణపతి మరో పక్కకు లాగుతున్నాడు. ఈ స్థితిలో తన మనస్సే సంకట పరిస్థితిలో వుండగా యీ వుత్తరం వచ్చింది. తను వెళ్ళి చూద్దామన్నా, ఇప్పుడు తను కదలటం తన చేతిలో లేదు.

"నా దేహం మీద నాకు హక్కు లేదు" అని క్రిందటిసారే వ్రాశాడు గదా! అందుకే యిప్పుడు వాళ్ళను ఓదారుస్తూ వుత్తరం వ్రాశాడు. అందులో ముఖ్యంగా తన తల్లి "మణి"కి కలిగిన దుఃఖాన్ని, తలుచుకొంటూ........ "అమ్మా! నా తల్లి పోయిన పిమ్మట రెండవ తల్లివి నువ్వు. అమ్మా! అందులకు నీవు దుఃఖపడితే నేను దుఃఖపడతాను" అని వ్రాశాడు.

అలా వుత్తరం రాస్తూండగానే తనకు సహజసిద్ధమైన ఆధ్యాత్మికత సెట్టుకొని రాగా—
*"కొన్ని రోజులు గవర్నమెంటు పనిలో వుండి తరువాత నేను ఏదైనా క్షేత్రమునకు పోయి స్వామి పాదపూజ చేయవలెను. అక్కడ దేహమును చాలించవలెను అని అనుకొనుచున్నాను. నేను చిన్న వయస్సులో నీ దగ్గర చెప్పిన విషయములు నడిపించవలెను అని అనుకొను చున్నాను" అని వ్రాశాడు.

అలా తన రెండవ తల్లికి కలిగిన కష్టానికి బాధపడుతున్న సత్యనారాయణ మనస్సు, క్రమంగా తన తల్లి నిర్యాణమైన దివ్యఘట్టాన్ని నెమరువేసుకో సాగింది.

* * *

---

* ఇవి ఆ వుత్తరముల నుండి యథాతథముగా గ్రహింపబడిన వాక్యాలు.

........రెండు జాముల పొద్దెక్కినా ఊరి పురోహితుడు గారి యింటి ముందటి శవాన్ని యెత్తటానికి బ్రాహ్మలు ఇంకా వూళ్ళోకి దిగనేలేదు. పురోహితుడు నరసింహశాస్త్రి నోరు విప్పితే తట్టుకోలేమనే భయింతో ఎవళ్ళకి వాళ్ళు కిమ్మనకుండా వున్నారు తప్ప వూరివారికి ఈ పాచిపీనుగ సంకటంగానే వుంది మరి. బొమ్మెపర్తి యెంత కుగ్రామమైనా వూళ్ళో పీనుగ నుంచుకొని వంటలు చేసుకోలేరు గదా, రైతులు.

అదేం చిత్రమో, ఆ శవం దగ్గర అన్నీ చిత్రాలే! నెత్తిన అంగవస్త్రం వేసుకొని, మోకాళ్ళు మడలేసుకొని, గోడకి చేరగిలబడివున్న నరసింహశాస్త్రిగారు బొమ్మలాగా పొద్దుట నించి అలాగే పడివున్నాడు. ఈగలయినా తోలుకోడు. పై మాటేమిటని ఆలోచించడు. కట్టుకున్న రెండో భార్య కూడా పోయినా గూడా యీ వెర్రిబ్రాహ్మడికి యేమీ ఆత్మకి అంటినట్టు లేదు, చూస్తూ ఉంటే!

కర్ర చేత పట్టుకొని శవానికి కాపలా కాస్తున్న పదకొండేళ్ళ బుడతవాడు సత్యనారాయణైనా యేమీ కంగారుపడడు!

శవాలకు కాపలా కాసి కాసీ పండిపోయిన వాడిలాగా ధీమాగా తిరుగుతున్నాడు!

నట్టింటి ఉయ్యాలలోని నెల తిరగని పసికూన, పాలకైనా లేచి యేడవడం లేదు!

ఇక ఉన్న తాపత్రయమంతా ఈ ఇంట్లో విధవరాలు వెంకమ్మగారికీ, యెదురింట్లో కోమటి కొండయ్యకీ మాత్రమే పట్టింది. వెంకమ్మగారు కూర్చోలేకపోతోంది, నిల్చోలేక పోతోంది. ఇటు వరలక్ష్మినీ, అటు సరస్వతినీ సంబాళించుకోలేక సతమత మయిపోతోంది. వరలక్ష్మికి తొమ్మిది యేళ్ళు ఉండవచ్చు. గ్రాహికం వచ్చిన పసికూన. సరస్వతికి నాలుగేళ్ళు ఉండ వచ్చేమో! ఎంత గ్రాహికం తెలియకపోయినా, అమ్మంటే అలమటించని ప్రాణి వుంటుందా భూమిమ్మీద? వెంకమ్మగారు ఎంత ప్రయత్నించినా, ఈ ఆడపిల్లల కళ్ళ వెంట దారలు ఆగనే ఆగటం లేదు.

మధ్య మధ్యలో ఆ పిల్లలకు యెక్కిళ్ళతో యేడుపు యెగదోసుకొని ఎస్తోంది. వెంటనే వెంకమ్మగారు గభాల్న ఆ పిల్లలిద్దర్నీ డొక్కలోకి లాక్కొని

"తప్పమ్మా! ఏడవరాదు! గౌరీ దూతలు అమ్మకోసం వచ్చారుగదా! ఏడిస్తే వాళ్ళు బాధపడతారు. వాళ్ళు బాధపడితే అమ్మ మనల్ని కోప్పడుతుంది. మరి ఏడవకండేం" అని అరయేడుపు కంఠంతో సముదాయిస్తోంది.

"అయితే యేడవంలే అత్తా, ఏడవంలే" అని యేడుపు దిగమింగేసుకుంటున్నారు పసికూనలు. గౌరీ లోకం గురించీ, గౌరీ దూతల గురించీ, అక్కడ తమ అమ్మకు జరగబోయే గౌరవాల గురించి, వెంకమ్మత్త చెపుతూంటే, ఆశగా వింటున్నారు పసికూనలు.

వెంకమ్మత్త యీ ఆడపిల్లల్ని సముదాయిస్తోంది గానీ అదేమి శత్రుత్వమో, ఆ సత్యనారాయణ వంక చూడనే చూడదు. వాడు మాత్రం ఏమన్నా అరిందా గోవిందయ్యా? పదకొండేళ్ళ పసివాడు. కర్రపుచ్చుకొని తెల్లవారుజామునుంచీ ఒక్కడే శవానికి పహరా యిస్తున్నాడు. వాణ్ణి పలకరించనైనా పలకరించదు వెంకమ్మత్త!

భార్య పోయిందని కబురు తెలిసి పొద్దున్నే వచ్చి ఒక శోకం పెట్టి, బుద్ధవిగ్రహంలాగా గోడకు జారిగిలబడి వూరుకున్నాడు తమ్ముడు నరసింహయ్య, అదే నరసింహశాస్త్రిగారు. ఆయన్నీ యేమీ అనదు.

" మామా, మామా " అని శాస్త్రిగార్ని పిలిచి ఉబ్బేసి, ఇంట్లో వున్న ఆస్తుల్ని తోలుకు పోయిన రెడ్డయ్యలంతా, తొంగి చూశారు తప్పితే శవం సంగతి పట్టించుకున్న వారే లేరు. అదేం వూరో, అదేం జనమో! ఎదురింటి కొండయ్యకూ, ఇంట్లో వెంకమ్మగారికి మాత్రం యీ తాపత్రయం తప్పలేదు. చూసి, చూసి వెంకమ్మగారు ఆడపిల్లల్నిద్దర్నీ వెంటపెట్టుకొని కొండయ్య ఇంటి గడప మెట్లమీద చతికిలబడి—

" ఏం కొండప్పా! ఈ పసికూనల్ని, యివాల్టికి గట్టెక్కించవా " అంది. ఎంత దీనంగా అడుగుదామని ఆవిడ మనస్సులో అనుకున్నా, పుట్టినప్పటినుంచీ లేని మెత్తదనం, యివాళ రమ్మంటే యెక్కడ వస్తుంది? అయితే కొండప్పకీ గండ్లూరు వారి గండరితనం కొత్త కాదు' ఆ మాట కొస్తే కొండప్ప కూడా మోటతనంలో అంత మరీ బొత్తిగా తక్కువ తిన్న వాడు కాదు.

" చూడమ్మయ్యో! నన్నేం జావమంటావా యేంటి? గాడిదకొడుకులు ఊరెదవ లొక్కరూ కలసిరాకపోయె. బాపన శవాన్ని ముట్టుకొని మేం పాపం కట్టుకోలేం గదా! ఆ యాలేటి రామిరెడ్డిని, యర్రగోదల నరసింహారెడ్డినీ ఉరుకు లెత్తించా! కందుకూరు, పుల్లల రేవు, అంపాపురం మొత్తం చుట్టేసి నలుగురు బాపనయ్యల్ను లాక్కురంద్రా అని. తింటానికి తిండి లేకపోయినా మీ బాపనయ్యలకు దర్జాలకు లోటేంది? వాళ్ళు తెమిల్చి రావాలిగందా! కొంచెం తాళు మరి " అన్నాడు. సర్లే అని లేవబోయింది వెంకమ్మగారు

" సర్లే యేంటి, ఆగుమరి " అని కొంచెం ఆగి ఇటు, అటు చూసి లోపలికి చెయ్యి సంజ్ఞ చేశాడు. కొండయ్య భార్య కొంగుచాటుగా ఏదో పట్టుకొని వస్తూనే " ఇదిగో, పసికూనలకు మైలా గీలా యేందీ లేదు. వాళ్ళను చంపమోక, వాళ్ళ గొంతులో పాలు కాసినిపోసి తీసుకుపో చటుక్కున" గుసగుసగా అని పాల చెంబొకటి గడపవతల పెట్టింది.

వెంకమ్మగారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

" తొందరగా త్రాగించు. మళ్ళీ మా నరసింహయ్య మామ చూశాడంటే రంకెలు మొదలెడుతాడు " అన్నాడు కొండయ్య.

"ఆఁ ....గంగిగోవులాంటి పెళ్ళాం గుటుక్కుమంది. యింకెవరి మీద రంకెలేస్తాడూ? అని సాగదీస్తూనే, గబుక్కున పిల్లలచేత పాలు తాగించేసింది వెంకమ్మగారు.

చెంబెడు పాలూ ఆడపిల్లలకు సరిపెట్టేసి, మళ్ళీ యింట్లోకి చేరింది వెంకమ్మగారు. కోమటి కొండయ్య మళ్ళీ ఆకాశంలోకి చూస్తూ చదికిలపడిపోయాడు.

కొండయ్య భార్య మైలపడ్డదని చెంబుమీద నీళ్ళు పోస్తోంది. ఈ సత్యనారాయణ మాట ఎవరికీ గుర్తున్నట్టే లేదు.

ఈ అఖండ ప్రపంచంలో, ఇందరు వయోవృద్ధుల మధ్య, ఇందరు కరుణామయుల మధ్య, ఇందరు పిల్లలుగల తండ్రుల మధ్య, ఇందరు కనిపెంచే తల్లుల మధ్య, ఒక పదకొండేళ్ళ బొట్టిగాడు కర్ర చేత బట్టుకొని తెల్లవారుజాము నుంచీ తన కన్న తల్లి శవానికి శవజాగరణ చేస్తున్నాడని ఆ వూళ్ళో ఏ ఒక్క జీవికీ పట్టినట్టే లేదు. ఆడపిల్లలకు పాలు పోసిన ఆ చల్లని మనసులకు గూడా యీ పదకొండేళ్ళ జీవి ప్రాణంకడబట్టి వచ్చిందో, బ్రతికిందో అని ఆలోచనైనా రాలేదు. దాన్ని యేం మాయ అనాలి ? ఆ పసివాడిది యేమి అదృష్టం అనాలి ?

నా కివేవీ అసలే పట్టవని వైశాఖ మాసపు వడగాలి, నిప్పులు చెరుగుకుంటూ తన గంతులు నిబ్బరంగా సాగించుకుంటోంది.

"ఛయ్, నాయాల్ది- ఇంతసేపేంటీ- -" అని విసుగ్గా సన్నపంచ దులుపుకుంటూ గల్లా ముందునుంచి లేచి నిలబడ్డాడు కొండయ్య.

ఇంతలో ఎదురుగా కాలి, కమిలిపోయిన ఉలిపి కట్టెల్లే వున్న ఆకారం వొకటి వచ్చి వాకిట్లో నిలిచింది. ఎగదీసి కట్టిన పంచె, తలకు చుట్టిన చిన్న తుండు, ఆచ్ఛాదన లేని అస్థిపంజరంలాగా వున్న ఆ బొందెమీద మాసిన జందెప్పోగు, నల్లటి అరచేతిలో చిన్న పొడుంకాయ, జొన్నగడ లాంటి పొడుగూ, బొగ్గుపొడి లాంటి రంగూ ఇవన్నీ కలిసి ఆ జీవి శవవాహక బ్రాహ్మడని అడక్కుండగానే చెప్పేశాయి కొండయ్యకు. ఇక విజిటింగు కార్డు కోసం అడక్కుండా—

"ఏందయ్యా! పంతులుగారూ, ఏంది, మంత్రం చెప్పే అయ్యగారేడీ" అన్నాడు విసుగ్గా.

"నీ మొహం చూస్తే నువ్వు మోసేవాడివే తప్ప కూసేవాడివి కావు అని తెలుస్తూనే ఉందిలే" అన్నట్టుంది ఆ మాటలలోని భావం.

నల్ల పంతులుగారు మెల్లగా అరుగుమీద చతిగిలబడి "కాస్త మంచి తీర్థం తెప్పించగలరూ" అన్నాడు కొండయ్య ప్రశ్న తనకు వినబడనే వినబడనట్టు.

అప్పటికే కొండయ్య భార్య మంచినీళ్ళ చెంబుతో రెడీగా ఉంది.

"చల్లచుక్క లేశావా తల్లీ" అన్నాడు పంతులుగారు. అని సమాధానం కోసం ఎదురు చూడకుండానే ఆ చెంబెత్తి నీళ్ళు గడగడా తాగేశాడు. అపుడు తలపాగ తీసి, కొంచెం విసురుకొని, స్థిమితపడి, కొండయ్య వంక జాలిగా చూశాడు. చూసి-

"చూడండి శెట్టిగారూ, ఆ పోయింది యీ గుంటడి తల్లా "? అన్నాడు.

కొండయ్యకు ఎందుకో ఒళ్ళు జలదరించి నట్లయింది. కొండయ్య ఏదో చెప్పబో తుండగా వినిపించింది కర్రుమన్న కంఠం.

"నాకే కాదు, పదునాల్గు లోకాలకీ తల్లే" ఆ మాట అనేసి తల అటు తిప్పుకొని వెళ్ళి పోయాడు సత్యనారాయణ. కొండయ్యకు గుండె దడదడ లాడింది. మొగం చాటంతయింది శవ బ్రాహ్మడికి.

"శంకర జయన్తినాడు, బ్రాహ్మీ ముహూర్తంలో ప్రాణ త్యాగం చేసిందీ అంతే, ఆ తల్లి అలాంటిదే! సందేహం లేదు!" అన్నాడు సంబరపడిపోతూ.

"శంకర జయన్తా" అన్నాడు కొండయ్య శెట్టి నోరంతా తెరిచి.

"ఔను! అందుకనే కైలాసం నుంచి శివదూతలైతే దిగొచ్చారు గానీ, అనంతపురం నుంచి బ్రాహ్మలు రావటం అంత తేలిక కాదు" అన్నాడు పంతులుగారు వెటకారంగా.

" అనంతపుర మేందయ్యా "

" పల్లెల్లో బ్రాహ్మలంతా ఇవాళ్ళ రుద్ర పారాయణలకని అనంతపురం పోతారు, తెలీదా ? "

" మరి నువ్వు ? "

" నాది కూసేమొహంగాదని నువ్వు ముందే అనుకున్నావుగా " ఈ మాటకు ఉలిక్కి పడ్డాడు కొండయ్య. తేరుకోవటం కోసం కొద్దిగా దగ్గి, మరి కొద్దిగా చీది, తేరుకునే లోపల మరొక ముగ్గురు బ్రాహ్మలు వూళ్ళోకి వచ్చేశారని ఓ పిల్లవాడు వీధి చివర్నించీ అరిచాడు.

ఇంతలోనే ముగ్గురు బ్రాహ్మలూ చేతుల్లో మల్లెపూల మాలల బుట్టలు పుచ్చుకొని వచ్చారు. వాళ్ళలో మంత్రం చెప్పే ఆయన ఉండటం చూసి, ముందు సంతోషించి, ఆ తరువాత బుట్ట లేమిటని గమనించ సాగాడు కొండయ్య.

" ఔనయ్యా ! ఇవాళ శంకర జయన్తి. మహాపర్వదినం, అసాధ్యమైన పుణ్యదినం. ఈ మహాతల్లి పసుపు కుంకుమలతో బ్రాహ్మీముహూర్తంలో, పుత్ర సన్నిధిలో ప్రాణత్యాగం చేసిందంటే, యీవి డెవరంటావు ? ఎవరంటావంటు ? ఎవరేమిటి ? సాక్షాత్తూ రాజరాజేశ్వరీదేవి. ఆ తల్లిని ఒట్టిగా పంపిస్తామా ? ఇదుగో పూలతో అర్చన చేసి పంపిస్తాం. ఏమిటీ.... అలా తెల్లమొగ మేసుకొని చూస్తావేమిటి ? ఆఁ .... ఏరీ ! అంబష్ఠులేరీ ? కబురు చేయ్యలేదా ?

చెయ్యి, ముందర చెయ్యి. డోలు, సన్నాయి పుచ్చుకొని ముందర తగలడమను. ఇహ అలస్యం చేస్తే పొద్దు చాలదు."

మంత్రబ్రాహ్మడు గుక్క తిప్పుకోలేదు, తిప్పుకోనీయలేదు. ఆయనకు ఇతరుల సమాధానాలతో పనిలేదు, పాపం. ఈ అరుపులకు బుద్ధవిగ్రహం కదిలి బావురుమని ఏడవ సాగింది. దగ్గరకెళ్ళి వెన్నుమీద చెయ్యి వేసి, నిమురుతూ

"బావా! * 'దిన యామిన్యౌ సాయంప్రాతః' అది అంతే, నీకు తెలిందేమిటి? నువ్వు కూడా ఈ యేడు పేమిటి?" అన్నాడు మంత్రం బ్రాహ్మడు. ఆ కంఠంలో సానుభూతి నామమాత్రంగానే ఉంది.

ఇంతలో మిగిలిన బ్రాహ్మలిద్దరూ శవ సంస్కారానికి చురుగ్గా ఏర్పాట్లు చేస్తున్నారు. వెంకమ్మగారు ఆడపిల్లల్ని సమర్థించుకొంటూ దూరాన్నించే సహకరిస్తోంది.

ఉయ్యాలలో పిల్లవాడు మాత్రం అది నిద్దరో, మత్తోగాని స్తబ్ధుగా పడివున్నాడు.

"నరసింహం బావా! అన్నీ తెలిసిన వాడివి! ఇహ కాలం లేదు. సూర్యాస్తమయం లోగా అందుకోవాలి. ఆలస్యం లేదు. ముందు స్నానం చేసిరా" అన్నాడు మంత్రం బ్రాహ్మడు.

నోట్లో ఉత్తరీయం కుక్కుకుంటూ, ఏడుపు దిగమింగుకుంటూ ఊరి బావి కేసి బయిలు దేరిన నరసింహశాస్త్రిగారు ఇంటి ప్రక్క ఆంజనేయి స్వామి గుడి చూడగానే గడప మెట్టుమీద చతికిలబడి పోయాడు, "హనుమా, హనుమా...." అని ఏడుస్తూ.

ఇక్కడ ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. పురోహితులు శాస్త్రిగారి కోసం తొందరపడు తున్నారు.

పురోహితులు వచ్చిన దగ్గరనుంచీ, ఇక తన బాధ్యత అయిపోయిందన్నట్లు గోడ పక్క నీడలో ఇరికి నుంచుని మౌనంగా గమనిస్తున్నాడు సత్యనారాయణ. అందరి ముఖాల్లోకీ, కళ్ళల్లోకీ గుచ్చి గుచ్చి, లోతులు తవ్వుతున్నట్లుగా చూస్తున్నాడు.

---

గమనిక : దిన యామిన్యౌ సాయం ప్రాతః
శిశిర వసంతౌ పునరాయాతః ।
కస్య త్వం వా కుత ఆయాతః
తత్వం చింతయ తదిహ భ్రాతః

ఇది శంకరాచార్యుల ద్వాదశ మంజరీ స్తోత్రంలో ఒక శ్లోకం.

తా॥ రాత్రి, పగలు, శిశిరమూ, వసంతమూ మళ్ళీ మళ్ళీ, తిరుగుతున్నాయి. సోదరా, నువ్వెవడి చుట్టానివి? ఎక్కడనుంచి వచ్చావు? తత్వం ఆలోచించు.

బ్రాహ్మలొచ్చారని తెలిసినాక, క్రమంగా జనం గుమికూడసాగారు. దగ్గర కొస్తే మైల పడిపోతామని దూరంగా గోడలంబడి వొదిగి నిలుచున్నారు మగవాళ్ళు. ఇళ్ళ అరుగుల మీద నిలబడి వింత చోద్యం చూస్తున్నట్టు చూస్తున్నారు ఆడవాళ్ళు. మరి కొంతమంది దగ్గరకొచ్చి, బావురుమని వలవలా యేడ్చేస్తున్నారు. వాళ్ళ హృదయం ద్రవిస్తోంది కాబోలు, కన్నీళ్ళు జలజలా రాలుతున్నాయి. అలాంటి వాళ్ళు వచ్చినపుడు, అక్కడ నరసింహశాస్త్రి గారు గూడా తల గుడి గట్టుకేసి కొట్టుకొని భోరున ఏడుస్తున్నాడు.

కానీ చిత్రం, యీ యేడ్చేవారు కొంతసేపయినాక యేడుపు టక్కున ఆపేసి, ముక్కు చీదేసుకొని, ఏదో తొందరపని వున్నట్టు వెళ్ళిపోతున్నారు.

ఆ వీధి పిల్లలది మాత్రం అసలు యీ లోకం కాదనుకుంటూ. వాళ్ళది కేవలం ఆటల లోకం. వాళ్ళ లోకానికి గోడుంబిళ్ళే ప్రపంచ క్రీడ. రోజూ అయితే, సత్యనారాయణ లేందే ఆ వీధిలో గోడుం బిళ్ళ గాల్లో కెగరననేది. ఇవాళ మాత్రం, "తల్లి పోయినాక, వాడి మొహం, వాడి కింకా పిల్లతనమేమిటి?" అనుకుంది కాబోలు, ఇంక సత్యనారాయణ వూసే మరిచిపోయి, మిగిలిన పిల్లల కేరింతల్లో మునిగిపోయింది ఆ గోడుంబిళ్ళ.

సత్యనారాయణ గమనిస్తున్నాడు. ఇవాళ తనకు అటు పోవాలనే అన్పించటం లేదు సరికదా ఆ ఆటంటేనే విసుగ్గా వుంది.

* * *

## సాగర మథనం

ఇంతలో ఒకడు కంచాలో కర్ర బెట్టి బిళ్ళని తక్కున కొట్టాడు. బిళ్ళ ఎగిరి వచ్చి శవం పొట్ట మీద పడ్డది. సత్యనారాయణకు ఒళ్ళు జలదరించింది. కాని కోపం రాలేదు, దుఃఖమూ రాలేదు.

''ఎండ పేట్రేగుతోంది. అది దాని లక్షణం. కొండగాలి విర్రవీగుతోంది. అది దాని స్వభావం. సూర్య రథం సాగిపోతోంది. అది ఆయన ధర్మం. ఎవరాప గలరు? ఆపగలిగితే మాత్రం ఆపవచ్చా? ఏమోగాని, ఆట మాత్రం పిల్లల నైజం.

"నిజానికి యీ వెర్రి ఆటలు పిల్లలకు నైజం. కాని చాలామంది పెద్దలకు దొంగాటలే నిత్య వృత్తి. ఏం చేయగలుగుతున్నాం వాళ్ళని? అలాంటపుడు ఈ వెర్రి కుర్రల మీద గుర్రెందుకు మనకు?" సత్యనారాయణ ఆలోచనలు సాగిపోతున్నాయి.

ఇంతలో ఇద్దరు కుర్రాళ్ళు రివ్వున తూనీగలల్లే బిళ్ళతో పాటే "అమ్మ" దగ్గర వాలారు.

అమ్మ నిద్దరపోతున్నట్టుగా వుంది. బిగించుకొని వున్న ముఖంలో ఏదో ధ్యాన గంభీర ముద్ర కనిపిస్తోంది. ఆ గంభీర ముఖ ముద్ర ఉబ్బరించిన ఆ శవ ముఖంలో మరింత ఉగ్రంగా ఉంది.

మొదటి కుర్రవాడు కొంచెం తటపటాయిస్తున్నాడు. ఇదే సందని రెండో కుర్రవాడు తటాలున బిళ్ళ దొరక పుచ్చుకొని రివ్వున పారిపోయాడు. రెప్పపాటులో జరిగిన యీ ఓటమికి రెచ్చిపోయి పరుగందుకున్నాడు మొదటి కుర్రవాడు.

ఇంతలో ఇది గమనించిన యాజ్ఞీక బ్రాహ్మలు, చిర్రు బుర్రులాడి కాకుల్ని అదిలించినట్లు కుర్రమూకను దూరానికి తోలి పారేశారు. కొందరు పెద్ద రెడ్లు దానికి సాయం పట్టారు. "పీనుగును ముట్టుకుంటా రేందిరా ? ఎదవ సన్నాసుల్లారా పొండి. అట్లా ఊరి బావి దగ్గరకు పొండి." అని గదిస్తూ.

"ఓహో! అమ్మను కొట్టినందుకు కాదు! పీనుగను ముట్టుకున్నందుకు! అదీ తప్పు." ఒక వెకిలి నవ్వు నిశ్శబ్దంగా నవ్వాడు సత్యనారాయణ. కడుపులో తెమిల్చి తెమిల్చి అప్పుడు కాస్త, అప్పుడు కాస్త తెమడలు కక్కినట్టుగా ఉంది, ఆ నవ్వు. ఇది గమనించింది వెంకమ్మత్త.

"ఇదేమిటి ? వీడిక్కూడా తండ్రి వెర్రి కొంచెం ఉందా ఏమిటి?" అని కంగారు పడబోయింది. ఇంతలో అత్త తనను గమనించిందని గ్రహించి సత్యనారాయణ మళ్ళీ మామూలుగా నిల్చుండిపోయాడు.

ఇంతలోగా శాస్త్రిగారు గుడిముందర చతికిలబడ్డాడని గమనించి మంత్రం బ్రాహ్మణుడు రివ్వున అక్కడికి పోయి ఒక ఛీత్కారం చేశాడు.

"బ్రాహ్మణ పుటక పుట్టి పెళ్ళాం చస్తే ఏడుస్తావ్ ? మళ్ళీ తాడు పేనినట్లే పేస్తావుగా జపాలు. తగుల బడ్డట్టే ఉన్నాయి నీ జపాలు. చచ్చిన వాళ్ళకోసం యేడవటం ఆపి, బతికున్న పసికూనల సంగతి చూడు. దానయ్య మావ దగ్గర కూర్చుని వేదాంతాలు వాగమంటే రాత్రల్లా నిద్రపోకుండా వాగుతావూ ? ఇదేనా నీ వేదాంతం ? లేచి స్నానం చేసిరా పో, సంతోషించాం గానీ." అది చనువో, దుఃఖమో, బాధో, మొరటుతనమో, వీటి సమ్మేళనమో అని తూకం వేసుకుంటున్నాడు సత్యనారాయణ.

ఈ మాటలనేసి చర్రున వెళ్ళిపోయాడు మంత్రం బ్రాహ్మణుడు.

నరసింహశాస్త్రిగారు మళ్ళీ బుద్ధ విగ్రహం అయ్యాడు.

సత్యనారాయణ ముందుకు కదిలి హనుమయ్య ముందుకు వచ్చి నిలబడ్డాడు. రెండు చేతులూ పైకెత్తి, తల మీద అంజలిగా జోడించి "అప్పా ! హనుమప్పా" అని ఒక్క పొలి కేక పెట్టాడు.

బుద్ధవిగ్రహం ఉలిక్కిపడింది. సత్యనారాయణ లేత బుగ్గలమీద నీళ్ళ ధారలు కట్టి ఉన్నై. బుద్ధ విగ్రహానికి వెర్రి చూపు తేలింది. ఒక పూనకం వచ్చినట్టు చలించిపోతున్నాడు సత్యనారాయణ.

" అప్పా ! హనుమప్పా ! నీకు తలేగాని హృదయం లేనేలేదా యేమప్పా ? అనాడు సీతమ్మ తల్లి, భూమితల్లి కడుపులో కలసిపోయేటప్పుడు, పసికందుల్ని లవకుశుల్ని వదలేసి నువ్విలాగే, యిలాగే, నిలబడిపోయావా? చెప్పవయ్యా, చెప్పవయ్యా హనుమప్పా! చెప్పు"

ఆ పూనకం లాంటి ఆక్రోశం విని, హనుమయ్య లోలోపలే నిలువెల్లా చలించి పోయినట్టుంది చూస్తే. ఆయన విగ్రహంలో అయితే యేమీ మార్పు కనిపించ లేదుగాని, యిక్కడ మెట్లమీద చతికిలబడి వున్న బుద్ధవిగ్రహం తటాలున లేచి నుంచుంది నోరెత్తకుండా. చురుక్కు చురుక్కున, ఇటు సత్యనారాయణ వంకా అటు హనుమయ్య వంకా ఒక్కసారి చూసి, చరచరా ఊరి బావికేసి నడిచింది.

సత్యనారాయణ మళ్ళీ నిశ్చలంగా, శవం దగ్గరకు నడిచాడు.

నీళ్ళు కారుతున్న గుడ్డలతో క్షణాల్లో వచ్చాడు, నరసింహశాస్త్రి. ఇక క్రియాకలాపం శరవేగంతో నడిచిపోతోంది.

అదేమి మాయో, అదేదో పెద్ద పండగన్నట్టు, ఉత్సాహపడిపోతున్నారు పురోహితులు. అంతులేని పూల అలంకారం చేసి మహానందపడుతున్నారు. క్రమంగా కందుకూరునుంచీ, అనంతపురం నుంచీ గూడ, బంధు మిత్ర వర్గం వచ్చి చేరింది. చిత్రం, వారికి దుఃఖపడాలనే తోచటంలేదు. ప్రతివాళ్ళకీ అదొక కైలాస యాత్రోత్సవం లాగా అనిపిస్తోంది.

అంత్యక్రతువు సాగిపోతోంది. సత్యనారాయణ బుద్ధి, ఈ లోకపు అనంత తీరాల అవలికి యెగబాకాలని ప్రయత్నిస్తోంది.

" జన్మ, అవతారము, మృత్యువు, మోక్షము అనేవి మొదట్లో, నాలుగు మెట్లుగా తోచి, ఆలోచనలు టకటకా, ఆ మెట్లమీదుగా యెగబాక సాగినాయి. కాని అంతలోనే, ఆ నాలుగూ, నాలుగు స్తంభాలై, తన ఆలోచనా పరిభ్రమణమంతా నాలుగు స్తంభాలాట అయిపోయింది. మరో చిత్రం ! ఈ నాలుగు స్తంభాలాటలో స్తంభాలే యిటూ, అటూ, మారిపోతున్నాయి.

" ఇంతకూ తను, ఏ స్తంభం దగ్గర వున్నట్టు ? ఏమో, ఏ స్తంభం దగ్గర తనను తాను నిలుపుకుందామని ప్రయత్నించినా, ఆ స్తంభమే, అక్కడి నుంచి కదిలి వెళ్ళిపోతోంది? ఏమిటిది.?

" అమ్మ ఉపదేశించింది, తెలిసిందనే అనిపించింది. మళ్ళీ తనకీ గందరగోళ మేమిటి ?"

" ఏమో, ఏమయినా, తనకింకా, పట్టు చిక్కలేదేమో ?! ఇప్పుడు తన కింక దిక్కెవరు? కాలుడు తొందర పడ్డాడేమో ! మహాకాలా! ఎంతపని చేశావురా !"

"నారాయణ" అన్న పెద్ద సామూహిక కంఠ ఘోష సత్యనారాయణ ఆలోచనల్ని, కసాయివాడి కత్తి బలి పశువుల్ని నరికినట్టు నరికింది.

గత తెల్లవారు జామున, అమ్మ గతించిన తరువాత, సత్యనారాయణ తృళ్ళిపడటం, యిదే మొదటిసారి.

ఆ "నారాయణ ఘోష" శవాన్ని, పైకెత్తేటప్పుడు చేసే నిరుద్వేగ, నిరీహ, నిరంజన, నిష్ఠుర, వైరాగ్య ఘోష.

ఇది నా నిష్ప్రయోజన, భావ ప్రపంచ ప్రవాహాన్ని నిర్దయగా సంహరించింది. ఇది మంచిదే" అనుకొన్నాడు సత్యనారాయణ.

శవం కదిలింది.

నరసింహశాస్త్రిగారు నిప్పు పట్టుకొని ముందు నడుస్తున్నాడు. ఒక ప్రత్యక్షమైన, దయ్యం లాగ వుంది, ఆయన వాలకం.

కొందరు వూరి పెద్దలు, శవం వెనకాల బయలుదేరారు. సత్యనారాయణ, మౌనంగా వాళ్ళలో కలిసిపోయాడు.

అప్పటికి, డాదాపు సాయంత్రం అయిదు గంటలయింది. అప్పటికి, ఆ వూరి యిరుకు వీధుల్లో, నీడలు నిండుగానే అలముకొన్నా, రాయల సీమలో, నాకు ప్రత్యేక హక్కు వుందని, సూర్యుడింకా నిరూపించుకొంటూనే వున్నాడు. ఆకాశంలో మాత్రం, ఎవరో అదృశ్య దేవ దూతలు, తెల్ల గొడుగు పట్టినట్టుగా, రెండు మబ్బు తునకలు "అమ్మ" మీద ఎండపడకుండా, అడ్డుపడుతున్నాయి.

ఇది గమనించి, ప్రశంసగా, తల ఊపాడు సత్యనారాయణ.

అతనిలోని, చిరుసంతోష రేఖ బయటుకు వచ్చిందేమో అన్నట్టు, ఉన్నట్టుండి, కిలకిలా నవ్వు వినిపించి అటు చూశాడు సత్యనారాయణ.

పక్కనే వున్న ఒక ఉపవీధిలోంచి కొత్త దంపతుల జంట ఒకటి చెట్టా పట్టాలు వేసుకొని, పైలాపచ్చీసు మీద, ఇటు వస్తోంది. వాళ్ళదీ ఆ నవ్వు.

ఈ శవాన్ని చూసి, ఒక్కసారిగా, వాళ్ళ మొహాలు ఎందుకో వెలవెల పోయాయి. నవ్వు, ఇసుకలో నీటిబిందువులా ఇంకి పోయింది. కాని యింతలోనే ఆ ముఖాల్లో రవ్వంత చిదరింపు చోటు చేసుకొంది.

ఆ నవ దంపతులు గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

చెట్టా పట్టాలు మాత్రం చెదరలేదు.

సత్యనారాయణ నివ్వెర పోయాడు.

అది పెద్ద రెడ్డిగారి చిన్న పిల్ల. మొన్ననీ మధ్యే పెళ్ళి అయింది. పదహారు రోజుల పండుగకో యేమో అల్లుడు అత్తవారింటికి వచ్చినట్లున్నాడు.

అదీ దాని పొంగు.

ఆ పిల్ల రోజూ అమ్మ దగ్గరకు వచ్చేది. పాటలు పాడించుకొని వినిపోయేది.

ఇవాళ్ళ అమ్మపోయింది. కాని, దాని కళ్ళకు దాని మొగుడే కనిపిస్తున్నాడు. అమ్మ శవం కనిపించనే కనిపించటం లేదు.

"ఎంతచిత్రం, యీలోకం ?! దాని సుఖం, నాకు సుఖం కాదు. నా దుఃఖం దాని దుఃఖం కాదు."

సత్యనారాయణ ఆలోచనలు అతనితో పాటే ముందుకు సాగిపోతున్నాయి.

ఇంతాచేస్తే, ఆ వూళ్ళో వున్నదే ఒక్క పెద్ద వీధి. ఎంతసేపు దాటాలి ఆ వీధిని. అందులోనూ శవ వాహకులు అనుభవశాలులాయె ?

శవవాహకులు, బరువు మీద వుంటారు కనుక వాళ్ళ నడక, సహజంగానే వేగంగా వుంటుంది. వెనుక వచ్చే వారు కొంచెం కొంచెం వెనక బడుతున్నారు.

వీధి, ఇంకా కొంత నడవవలసి వుందనగా ఒక యింట్లోంచి, పెద్ద అరుపులూ తిట్లూ వినిపిస్తున్నాయి. అది ఒక సెట్టి యిల్లు. సెట్టీ, సెట్టి పెళ్లామూ, ముసలి వాళ్ళు కాదుగాని, వయసు మళ్ళిన వాళ్ళే. వాళ్ళిద్దరికీ తగాదా వచ్చినపుడల్లా, వూరివారికి పండగలా వుండటం మామూలే. ఆ సెట్టి దంపతులకు కలహం వచ్చినపుడు, వీధి వాకిలే రహస్య మందిరంగా కనిపిస్తుంది, పాపం !

శవం ముందుకెళ్ళిపోయింది. వెనుకపడి నడిచేవారిలో కొందరు చోద్యం చూడ టానికి, కొందరు తీర్పు చెప్పటానికి, కొందరు మందలించటానికి, సెట్టి గడపల మీదికి పోగుబడ్డారు.

సెట్టి దంపతులు, యీ సందడి చూసి తలకాయలు బయటకు నిగిడించి, శవం వంక ఒకసారి చూసి, ఏదో ఒక ఈగ పోయినట్టు భావించి, మళ్ళీ ఉచ్చైస్స్వరంతో తమ కలహ కార్యక్రమంలో మునిగిపోయారు.

సత్యనారాయణ ఒక్క క్షణం ఆగి, వెంటనే సాగిపోయాడు.

"ఈ దంపతు లిద్దరూ, మనకు కుటుంబమిత్రులు. అమ్మ పోయిందని తెలుసు. ఇందాక వచ్చి ఇద్దరూ శోకాలు పెట్టి వెళ్ళినవాళ్ళే. ఇంతలో యేమైంది వీళ్ళకు? ఇంటి ముందు నుంచి, శవం పోతుంటే, ఈగ పోతున్నట్టుగా గూడ లేదే వీళ్ళకు ? వయస్సు వచ్చి[illegible] లోకం

తెలిసినవాళ్ళు, ధర్మం విన్నవాళ్ళు, కష్టా లెరిగినవాళ్ళు, వీళ్ళు, ఆ పిచ్చిరెడ్డి దంపతులకన్నా ఏమి మెరుగు ?"

ఇంతలో, శవం ఊరి వెలుపలికి వచ్చింది. అనంతపురం లింకురోడ్డు ఎక్కారు వూరి పెద్దలంతా.

అల్లంత దూరంలో, రాములమ్మ గుడిపక్కన, చిన్న జువ్వి, సంతోషంగా తల లూపుతోంది. చిత్రవర్ణ కిమ్మీరితమైన సంధ్యాకాశం, మొగమంతా పువ్వాడి రాచుకున్న పెద్ద ముత్తైదువై, అమ్మకు స్వాగతం చెపుతున్నట్టు కనిపిస్తోంది. ఉత్తర దిగగ్రానగల శిఖరాల నుంచి శివదూతలు, అందాల పిట్టలై దిగివచ్చి ఆనంద కిలకిలరావాలు చేస్తున్నారు. జరిగిన కర్మ కలాపానికి సంతోషపడ్డాడు గాబోలు లోకబాంధవుడుగూడ చల్లబడి ప్రసన్నంగా చూస్తున్నాడు.

"ఇది దుఃఖం కాదు, సంతోషం కాదు. ఇది అకలుషితమైన ప్రశాంతి. ఆ ప్రశాంతినే, యీ ప్రకృతి, యిపుడు సర్వతోముఖంగా వర్షిస్తోంది. ఈ ప్రశాంతి అమ్మ అసలైన తత్వం" అనుకొన్నాడు సత్యనారాయణ.

ఇంతలో వెనకనుంచి అతని బుజం మీద, ఏదో చెయ్యి పడ్డది.

అమ్మ మరో రూపంగా లేచి వచ్చిందేమో! లేదు. ఎవరో గ్రామ వృద్ధు. "ఆ కనుబొమ్మల మీద, ఎంత తెల్లని జుట్టు. ఆ కళ్ళే కాదు, ఆ కనుబొమ్మలు గూడ ప్రశాంతిని వర్షిస్తున్నాయి." ఇవి సత్యనారాయణ ఆలోచనలు.

"నువ్వింక రారాదు బాబూ, దడుచుకుంటావు. వెనక్కు వెళ్ళరాదూ, మా బాబుగా" నిజంగానే ఆ మాటలలో ప్రశాంతి వర్షిస్తోంది.

ఆ మాట విఘ్నంగా దోచలేదు.

"రాగూడదా, సరే అయితే. కాని భయంలేదు. ఇక్కడే వుంటాను, కాదనకు తాతా"

ఇవి లోకం లెక్కలో చూస్తే పదేళ్ళ పసివాడి మాటలుకావు. వందేళ్ళ వృద్ధుడి అనుభవమూ, తూకమూ వుంది ఆ మాటల్లో. ఆ తాత ఒకసారి ఆకాశంలోకి చూశాడు. మరోసారి సత్యనారాయణ కళ్ళలోకి చూశాడు. మౌనంగా వెళ్ళిపోయాడు. ఇంకెవరూ అతన్ని పట్టించుకోలేదు. సత్యనారాయణ రోడ్డు ప్రక్కన, చెట్టుక్రింద చతికిలబడ్డాడు. మడిచిన మోకాళ్ళను కౌగలించుకొని మౌనంగా చూస్తున్నాడు.

రాములమ్మ గుడిదాటినాక జువ్విచెట్టు ప్రాంతంలో ఒకచోటునుంచి ఏదోవిచిత్రమైన శ్వేతకాంతి పైకి లేచి వస్తోంది. ఒక చిన్న హంసల గుంపు నిశ్శబ్దంగా రెక్కలల్లాడించి నింగి కెగురుతున్నట్టుంది. సత్యనారాయణ దృష్టి అక్కడే లగ్నమైంది. అమ్మను అక్కడే దించారు. వాళ్ళకిగూడ కనిపించిందో, ఏమో ఆ కాంతి, అక్కడేదో చర్చ జరుగుతున్నట్లుంది. బహుశా, స్థలనిర్ణయం గురించి కావచ్చు. నరసింహాశాస్త్రిగారు, సింహం జూలు విదలించినట్లు తల విదిలిస్తున్నాడు.

ఆయన చెప్పినచోటే కట్టెలు పేరుస్తున్నారు. కట్టెలు పేరుస్తున్నకొద్దీ, అక్కడ కాంతి పెరుగుతోంది అనిపిస్తోంది సత్యనారాయణకు. కాని, ఒక్కొక్క కట్టెకు ఒక ఆలోచన అన్నట్టుగా తనలో ఏవో ఆలోచనలు పేరుకొని, ఊరుకొని వస్తున్నాయి.

కాంతి అక్కడే వుంది. కట్టెలు పేరుకొంటున్నాయి. ప్రశాంతి అలాగేవుంది. ఆలోచనలు మాత్రం సుడులు తిరుగుతున్నాయి.

" ఏమిటీ లోకం తత్వం ? మరి కాలం తత్వం ఏమిటి ?

" కాలుడే, కోదండరాముడంది అమ్మ. కాని, లోకమెవరని నేనడగలేదు. ఆమె చెప్పలేదు. చూస్తున్నంతలో, కామమూ, క్రోధమూ, దుఃఖము, ఇవే లోకం అనిపిస్తోంది. అయితే, ఇప్పుడు నేను అనుభవిస్తున్న ఈ ప్రశాంతి లోకంలోది కాదా ?"

మరి ఎక్కడిది ? ఎక్కడిదిది ? ఎందుకిది లోకానికంతకూ అందదు ? ఇది లోకాని కందించటమే నా కర్తవ్యమట ! పదేళ్ళ పసికూనకు, గోళీకాయలాడే గుంటవెధవకు, నాకు ఇప్పుడు ప్రశాంతి నందించిన దెవరు ?

పదునాల్గు లోకాలకూ తల్లి అయిన "అమ్మ" ఇంతటి యీ విజ్ఞానాన్ని నాకే ఎందు కందించింది? అమ్మకు ఎందరు విశాలహృదయులు, త్యాగధనులు, వయోవృద్ధులు, పుత్రులు లేరు?

పదేళ్ళయినా నిండని నాకే ఎందుకిచ్చింది మరి? అంత యిచ్చినా, యీ సందేహ కల్లోల డోలలింకా అణగారవేమి ?

నేను పూర్వ జన్మలలో ఏదైనా ఉపాసన చేసి పుట్టానేమో! నాన్న ఉపాసన తక్కువదా? ఆయన వైరాగ్యం అఖండమని అమ్మే కితాబు ఇచ్చింది. మరి ఆ మృగరాజు ప్రవర్తనేమిటి ?

ఊరంతా ఒక కుటుంబంగా నడుస్తోంది. వర్ణ వ్యవస్థ ఉన్నా, ధర్మతారతమ్యం ఉన్నా, ఒకరి నొకరు మామా అనో, అక్కా అనో, వదినా అనో, అన్నా అనో వరసలు కలుపుకొని, ఏక కుటుంబంగానే పంటలు పండించుకొంటున్నారు.

నాన్న, ఊళ్ళో చాలామందికి మామ. అమ్మ అందరికీ అమ్మే. ఒకోసారి నాన్నకు కూడ అమ్మే. కానీ నాన్నకు, నిజంగా కష్టసమయం వచ్చేసరికి, ఊళ్ళో ఏ ఒక్కరూ నిజమైన అనుకంప చూపనే లేదేమిట? ఏమిటి వీళ్ళలో అంతర్గతంగా, జీర్ణించుకు పోయిన లోపం? ఎక్కడ దెబ్బ తిన్నది యీ వ్యవస్థ?

ఊళ్ళో ఎవరూ వండుకు తినలేదు, నిజమే. కాని అది కేవలం నియమ కాఠిన్యంగానే వుంది తప్ప, గుండె కదలి అయ్యో అని ఆక్రోశించిన వాడేడీ? పసికూన లేమైనారని ఆరాట పడినవాడేడీ? ఎందరికో ప్రశ్నలు చెప్పాడు. వైద్యాలు చేశాడు. ముహూర్తాలు పెట్టాడు. అప్పులిచ్చాడు. దానాలు చేశాడు నాన్న. ఎందరో అమ్మలక్కలు రోజూ అమ్మ దగ్గిర చేరి కష్టసుఖాలు చెప్పుకొని విభూతో, కుంకుమో తీసుకుపోయి, ఫలితా లనుభవించారు కమ్మగా!

అమ్మ పోయింది హఠాత్తుగా. అయినా రెడ్డి ఇంట్లో పదహారు రోజుల పండగ ఆగలేదు. శెట్టి ఇంట్లో జగడం ఆగలేదు. ఇంక పసిపిల్లల గోడుంబిళ్లాట, ఎందుకు ఆగుతుంది?

ఈ వ్యవస్థకు ఎక్కడో వెన్నెముక గొలుసు తెగింది. ఈ ధర్మ సంప్రదాయ పరంపరలో ఎక్కడో పుచ్చు పురుగు చేరింది. దీనికి నేనేదైనా చెయ్యాలి. కాని ఏమి చెయ్యాలి? నేను మట్టి గరచినా ఫరవాలేదు. ఏమైనా చెయ్యాలి. కాని ఏమి చెయ్యాలి? నేను గడ్డి తిన్నా ఫరవాలేదు. కాని ఏమి చెయ్యాలి, ఎలా చెయ్యాలి? యుగయుగాలు నా సాధనల ఫలమంతా పిండి, ధారపోయవలసి వచ్చినా ఫరవాలేదు. నేనేదైనా చెయ్యాలి. నే చేసే పని సఫలంగా చేసేదెలా? అమ్మ కరుణ నాపై ప్రసరించి, ఈ తెలివి నాకు వికసించేదెలా? ఆ, అదీ కిటుకు! అదీ మూలస్తంభం: కరుణ! కరుణ!! కరుణ!!!

ఇందాక నాలుగు స్తంభాలాటలో కళ్ళు తెరిగినై. అసలు మూలస్తంభం ఇదీ. " కరుణ " దానికి అనాద్యంత మైన పునాది జ్ఞానము.

జన్మ - అవతారము
మృత్యువు - మోక్షము
కరుణ - జ్ఞానము

ఇవి మూడు జంటలు_ ఇవే త్రిగుణాలు. ఇవే త్రిమూర్తులు.

నిర్మల జ్ఞానమే పునాదిగా, నిస్వార్థమైన కరుణే మూలస్తంభంగా, యీసమాజ దేవాలయానికి జీర్ణోద్ధరణ జరగాలి.

ద్వేష భావకల్లోల సంక్షుభితమైన యీనాంటి మానవ లోకానికి యీ త్రిమూర్తి ఉపాసన సుమధుర, సోదర భావ సౌరభాలను అలవోకగా విరజిమ్మ గలుగుతుంది.

ఆ పని జరగాలి. అపుడు దగా పడిన తమ్ముళ్లు మిగలరు. తల్లిలేని కూనలు అలమటించవు. ఒక్క కనికరింపు మాట కోసం నాలాగా దిగంతాల వెంబడి పడి, వెతికే దౌర్భాగ్యం, ఈలోకంలో యిక పైన, యే తమ్ముడికీ, చెల్లెలికీ కలగదు.

ఇదీ, నేను చెయ్యవలసివున్న పని.

" అమ్మా కరుణించు - కరుణించు, కరుణించు! "

సత్యనారాయణ ఆలోచనలు వాటంతట అవే శమించి చల్లారి పోయినాయి.

కళ్ళు మాత్రమే తెరుచుకొని వున్నాయి. జువ్విచెట్టు దగ్గర మంటలు శమించి, చాలా సేపయింది కాబోలు, శాస్త్రిగారిచేత అస్థి సంచయనం చేయిస్తున్నారు.

సత్యనారాయణ ప్రశాంతంగా, మళ్ళీ కళ్ళు మూసుకొని తన ఆలోచనాపరంపరలలో, పనికిరాని, ములుకులు గులకలు యేమైనా ఉన్నాయేమో అని నిబ్బరంగా వెతుకోసాగాడు.

* * *

........అలా తన ఊహాలోకంలోని ఊహలు శమించిన సత్యనారాయణ, ఇక యే ఊహలకూ తావులేని నిశ్చల సమాధిలోకి వెళ్ళిపోయాడు.

*యో బంధముక్తో ప్యసుజా వివాహ*
*ప్రబంధ సక్తో నితరాం చకాస ।*
*తం మాతృనిర్దేశ నిబద్ధబద్ధం*
*గురుం ప్రబోద్ధార మనువ్రతోఽస్మి ॥*

[తాను బంధాలన్నీ తొలగినవాడే అయినా, ఆయన తన చెల్లెలి వివాహ ప్రయత్నంలో చిక్కుకొని చక్కగా ప్రకాశించారు.( ఎందువల్ల ? ) ఆయన బుద్ధి మాతృమూర్తి ఆజ్ఞకు బద్ధమైవుంది. ( తన ప్రవర్తనచేత ఇలా ) బోధించే శ్రీగురుదేవుని నేనాశ్రయిస్తున్నాను. ]

ఇంటి కలహం అంటే ఈగ వాలటం—ఒకోసారి, ఈగే, పెద్ద రోగాల్ని అంటిస్తుందేమోగాని మామూలుగా యీగల్లేని యిల్లు వుంటుందా? ఇట్టే లేచిపోని యీగ వుంటుందా?

సత్యనారాయణ, శ్రీకంఠయ్య యింట్లోనే భజన చేస్తున్నా, అక్కడే పడుకొంటున్నా ఇంటికి పోయి వస్తూ వుండటం పరిపాటి అయిపోయింది. ఉద్యోగం వచ్చిన దగ్గర నుంచీ తన నెల జీతం అంతా యింట్లోనే యిస్తున్నాడు. ఎప్పుడైనా అవసరమైతే యింట్లోనే పడుకుంటున్నాడు గూడా.

## చేతిమాత్ర

ఒకరోజు అలాగే యింట్లో పడుకున్నాడు సత్యనారాయణ. ఆరోజు రాత్రల్లా దగ్గుతూనే వున్నాడు లింగణ్ణగారు. తెల్లవార్లూ విసుక్కుంటూనేవున్నాడు సత్యనారాయణ. తెల్లవారుజామున స్నానం చేసి కాసేపు జపం చేసుకుంటూ కూర్చున్నాడు. అప్పుడు గూడా తాత దగ్గుతూనే వున్నాడు. మనవడు మొహం ముటముటలాడిస్తూనే వున్నాడు.

సత్యనారాయణ ఇంట్లోంచి వెళ్ళిన దగ్గరనుంచీ, పాడి పనంతా యింట్లోవారి మీద పడింది. అప్పటికీ పాలవాళ్ళ ఫారం ఆపేశారు. గొడ్లు తగ్గించారు. అయినా కూడా పాడి వుంది. ఆడవాళ్ళంతా పాడి పనిలో వున్నారు. తెలతెలవారుతోంది. విసుక్కుంటూ జపం పూర్తిచేసి లేచి వస్తున్నాడు సత్యనారాయణ.

"బాబూ, ఆ మందు కాస్త అందివ్వరా" అన్నాడు ఆయాసపడుతూ లింగణ్ణగారు. సరే అని మందు సీసా కోసం పక్కనున్న కిటికీ దగ్గరకు వెళ్ళిపోయిన సత్యనారాయణకు ఏదో ఆలోచన ఎచ్చి చటుక్కున ఆగిపోయాడు. అతని ముఖమంతా గండరించి. వికృతంగా తయారయింది. ఏదో తిట్టుకుంటూ చేత్తో గ్లాసు పట్టుకొని దొడ్లో కెళ్ళాడు. అక్కడ ఎండ్రిన్ డబ్బా వుంది. వ్యవసాయిం బాగా అలవాటుగనుక లింగణ్ణగారు దొడ్లో పూల మొక్కలు, కూర గాయలు పెంచటానికి గూడా వ్యవసాయి పద్ధతులు ఉపయోగిస్తాడు. అందువల్ల ఆయనే ఈ ఎండ్రిన్ డబ్బా తెచ్చివుంచాడు. సత్యనారాయణ ఇటు అటూ చూసి, చటుక్కున ఎండ్రిన్ ఆ గ్లాసులో సగం దాకా పోశాడు. ఇంట్లోకి వచ్చి కొంచెం అసలు మందు వేశాడు.

"చావు ముసలి వెధవా! చావు. నీ దగ్గుతో చంపుతున్నావు మమ్మల్నందరినీ...." అని తిట్టుకుంటూ వేలితో గిరగిరా కలియబెట్టాడు. కొంతసేపు కలియబెట్టి, ప్రేమగా "తాతా" అని పిల్చి, చేతి కందించాడు.

ఆయన ఆ మందు గొంతులో పోసుకొని "రోజూ కంటె మంటగా వుందెరా" అన్నాడు బాధగా. అయితే, అసలు మందు గూడ వెగటు, మంటగల మందే కావటంవల్ల పూర్తిగా భేదం గ్రహించలేకపోయా డాయన.

"ఏం పర్లేదు తాతా, తాగెసెయ్యి. వెంటనే తగ్గిపోతుంది. ఇంకా పదేళ్ళు హాయిగా బతుకు తావు నువ్వు. తాగేసెయ్యి, తాగేసెయ్యి" అని తియ్యగా సముదాయిస్తూ తాతచేత మొత్తం తాగించేశాడు సత్యనారాయణ.

మరుక్షణం అక్కడ లేకుండా పారిపోయాడు. ఒక పావుగంట అయ్యాక ముసలాయన యేదో మూలుగుతున్నట్టు అనిపించి దగ్గర కెళ్ళి చూసింది పార్వతమ్మ. ఆయన మెలికలు తిరిగి పోతున్నాడు. విషయం అర్థంకాలేదు. ఆయన మాట్లాడే పరిస్థితి దాటిపోయింది. ఆవిడకు కంగారై గోల చేసింది. వారా, పీరా అని కేకలు పెట్టింది. ఇరుగు పొరుగువారు వచ్చారు. "ఏదో వింత వాసన వస్తోందే." అన్నారు. డాక్టరు దగ్గరకు తీసుకుపోయారు.

"ఇది ఆత్మహత్య కేసు. నేను ముట్టుకోను" అన్నాడు డాక్టరు. అంతా తెల్లబోయారు.

"ఈయన అయాసం బాధ పడలేక ఎండ్రిన్ తాగినట్టున్నాడు" అన్నాడు డాక్టరు.

"పొద్దున్నే మందిచ్చాడు సత్యనారాయణ. దాని తరువాత ఈయన కదిలినట్లులేదే. లేచి వెళ్ళి ఎండ్రిన్ తాగివచ్చే వోపిక గూడా లేదు," అని పరిపరి విధాల అనుమానాలు పడుతూ సన్నగా యేడుస్తోంది పార్వతమ్మ. తట్టుకోలేదని సావిత్రమ్మ గారికి యీ విషయం చెప్పలేదు.

సత్యనారాయణ కోసం కబురు చేశారు. అతను శ్రీకంఠయ్య యింట్లో లేడు. ఎక్కడికి పోయాడో తెలియదు. వచ్చిన పెద్ద మనుషులే డాక్టరుని బతిమాలి వైద్యం చేసేందుకు

చొప్పించారు. డాక్టరు వైద్యం చేసి ఎండ్రిన్ కక్కించాడు. ప్రాణ ప్రమాదం తప్పింది. కానీ యీ హైరానలో ఆయన పూర్తిగా నీరసించాడు.

ఆయనకు మాట్లాడే వోపిక వొచ్చేసరికి ఒక వారం పట్టింది. అయితే ఈ వారం రోజుల నుంచీ ఆయనకు దగ్గూ, ఆయాసం రెండూ రాలేదు.

అప్పుడాయిన్ని అడిగితే "ఛ ఛ, సత్యనారాయణ యిచ్చిన మందు తప్పితే నేనా రోజు ఏమీ తాగలే" అన్నాడు. అది విని అందరూ బిగిసి పోయారు. లింగణ్ణగారు జీవితంలో అబద్ధం చెప్పడు. అనుమానించక్కర్లేదు.

"అంటే-ఇక-ఇక-సత్యనారాయణ. సత్యనారాయణ....వాడెంతకు తెగించాడా? ఔరా, ఇంతకు తెగించాడా?"

ఇంతకన్నా తిట్టుకోవటానికి గూడ మతికి, పాలుపోలేదు వాళ్ళకి. అయితే, ఏమయినా, ఇంతపని చేస్తాడంటావా.......చెయ్యడే, అట్టాంటి వాడు కాదే అని మరోపక్క మనసు పీకుతోంది. ఏ సంగతీ తేల్చుకుందామంటే ఆ సత్యనారాయణ మళ్ళీ కనిపిస్తేగా ఇటువంటి విషయాలు బైటి వాళ్ళతో ఏమి చెప్పుకుంటారు?

"నా దగ్గూ ఆయాసం ఎలా తగ్గిపోయాయే అమ్మాయ్?" అని మాటి మాటికీ సంబరపడిపోతూ ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నాడు లింగణ్ణగారు.

దీనికి సమాధానం డాక్టర్లు చెప్పాలి. "ఆఁ ఒకసారి ఒక దానికి వైద్యం చేస్తే మరోదానికి పనిచేస్తూ వుంటుంది లెండి. అయినా, మీకు పూర్తిగా తగ్గిందో లేదో మళ్ళీ తరువాత పరీక్ష చేద్దాం" అన్నాడు డాక్టరు. అలా చెప్పకపోతే ఆయన చదువుకున్న సైన్సుకే అవమానం కదూ! పది రోజులు దాటాక హుషారుగా ఈలవేసుకుంటూ, ఒక రోజున సత్యనారాయణ వచ్చాడు. తీరా అతను వచ్చేసరికి యెట్లా అడగాలో తోచలేదు ఇంట్లో వాళ్ళకి. ఇలా జరిగిందని చెప్పారు.

"ఆ ఎండ్రిన్ డబ్బా యింట్లో పెట్టకయ్యా బాబూ అని చెపుతూనే వున్నా, వింటేగా ముసలి చాదస్తం. ఆ మత్తులో ఏదో పొరపాటు చేసి వుంటాడు. సర్లే, యిప్పుడు దగ్గూ ఆయాసం లేదుగదా! అదే, ఆ దేవుడి దయ. పోనీండి, మరో పదేళ్ళు హాయిగా వుండనీయండి ఆయన్ని." అని అవలీలగా కొట్టి పారేశాడు. ఎవరికీ మనసులో అనుమానం పోలేదు. కానీ ఏమీ అనలేక పోయారు. ఎందుకు అనలేక పోతున్నారో వారికే తెలియటంలేదు.

ఇక్కడ క్రమంగా ఆదివార హోమాల్లో రద్దీ పెరిగి పోతోంది. జనం పెరిగిపోతున్నారు. ఆ హోమ సమయాలలో సత్యనారాయణ ప్రశ్నలు చెప్పటం, రోగాలు తగ్గించటం వంటివి మాత్రమే కాక దయ్యాలను వదల గొట్టటం గూడ మొదలయింది. హోమ వైభవం గూడ క్రమంగా పెరుగుతోంది.

ఇలా జరుగుతుండగా వయొలిన్ వెంకటప్పగారి కూతురు లీల, పది పన్నెండేళ్ళ పిల్ల ఒకరోజు ఎవరో స్నేహితులతో, ఆదివార హోమానికి వచ్చింది.

"మన సత్యం అన్నయ్య అంత బ్రహ్మాండంగా హోమాలు చేస్తుంటే, అంతమంది "అన్నయ్య" కాళ్ళ మీదపడి నమస్కారాలు పెడుతుంటే, అంతమంది "అన్నయ్యను" పొగిడేస్తుంటే, ఆ పిల్లకు ఆనందం అగ్గలమై, వొళ్ళు పులిసి పోయింది. ఆ దూకుడుతోనే వెళ్ళి యిక్కడి వైభవం అంతా యింట్లో చెప్పింది. విన్న వెంకటప్పయ్యగారు బాధగా విసుక్కున్నారు. "కుర్రవాడు తెలివైనవాడు. దైవభక్తి గలవాడు, పైకొస్తాడను కుంటే, యీ దొంగ వేషాలు మొదలెట్టా డేమిటి? ఈ రోజుల్లో ప్రతివాడూ సాధువే. చివరికి సత్యం గూడ సాధువే అంటే ఏం చెప్పాలి?........ కలికాలం."

ఇది జరిగిన కొద్ది రోజులకే సత్యనారాయణ రైల్వే గేటు దగ్గర కనిపించాడు. మనిషి మామూలుగానే కనిపించాడు. కాని ఎక్కడో సైకిలొకటి పట్టినట్టున్నాడు. దాన్నానుకొని నుంచున్నాడు. సైకిలు మీద వస్తున్నాడు వెంకటప్పగారు.

దూరాన్నుంచే అతన్ని చూసిన వెంకటప్పగారు, "పిల్చి నాలుగు చివాట్లు పెడతా నుండు" అనుకొన్నాడు. ఇంతలో సత్యనారాయణే పిల్చాడు.

"నమస్కారమండీ వెంకటప్పగారు. మీ కోసమే నుంచున్నా. రండి, ఇటు రండి."

వెంకటప్పగారు సైకిలుదిగి దగ్గర కెళ్ళాడు. వెళ్ళాడు గాని, యేమిటో, తను ఏమను కున్నాడో అన్నీ మరిచి పోయాడు. పలకరించటం, క్షేమ సమాచారం అడగటం గూడ మరిచి పోయి అలా వుండి పోయాడు.

"ఎలక్ట్రికల్ కాలనీలో శ్రీకంఠయ్య గారింట్లో వుంటున్నానండీ. అక్కడ ప్రతి ఆదివారం గణపతి హోమం చేసుకుంటున్నాం. చాలా ఆనందంగా వుంటోంది. మీకు తీరిక వున్నప్పుడు వస్తూ వుండండి." అన్నాడు సత్యనారాయణే.

"అలాగే, దానికేమి? మరి వెళ్ళిరానా!" అని సెలవు పుచ్చుకున్నాడు వెంకటప్ప గారు. సత్యనారాయణ సైకిలు మరో వేపుకి తిప్పాడు. తనలా ఎందుకు బిగుసుకు పోయాడో వెంకటప్ప గారికి అర్థం కాలేదు. కాని, ఆయన కూడా తన మాట నిలబెట్టుకోలేదు. ఆ హోమాలకు పోలేదు.

ఆయన విద్వాంసుడు కనుక తనకంటే తక్కువ వాడొకడు ఇంతపని చేస్తున్నాడంటే కంటుగింపుగా వుందిగానీ, అమాయకురాలు, ద్వారక తల్లి మాత్రం "మన వాడకట్టు కుర్రవాడు, ఇంతవాడయ్యాడా" అని చాలా సంతోషపడిపోయింది.

* * *

అవిడను ఎవరూ పిలవలేదు. ఎవరో చెపితే చోద్యం చూద్దామని రెండు మూడు వారాలు చూసేసరికి, అవిడకు "సత్యనారాయణ ఇంతవాడయ్యాడా" అనిపించింది. ఆ తల్లికి వెంటనే తన కొడుకు గుర్తుకు వచ్చాడు. "ఈ వెధవకి ఎన్నాళ్ళుపోయినా ఆటలు పోట్లాటలు తప్పితే అక్షరం ముక్క వంట పట్టటంలేదు. వాడి నొకసారి ఈ సత్యనారాయణ దగ్గరకు తెస్తే, ఇతను తోటివాడుగదా అని. యేమయినా కరుణిస్తాడేమో? వాడు బాగుపడతాడేమో అని ఆలోచన, ఆశ, ఆ తల్లిని తొలిచివేయసాగాయి.

"అయితే ఈ వెధవ చెప్పినమాట వినడే. మెల్లిగా చెప్పి చూద్దాం" అనుకొని అందుకనే ఆ రాత్రి కొడుకును బుజ్జగించి మెల్లిగా చెప్పింది తల్లి.

"అరే ద్వారకా! నీతోపాటు చదువుకున్న వాడు, నీతోపాటు నాటకాలు వేసినవాడూ, ఆ సత్యనారాయణ యిప్పుడు పెద్ద గురువు అయిపోయాడురా. అందరూ అతన్ని సత్యనారాయణ స్వామి అంటున్నారు. కాళ్ళకు మొక్కుతున్నారు. అతడు ఎన్నో మహిమలు చేస్తున్నాడు. నువ్వుగూడా ఒకసారి పోయి చూసి రారాదుట్రా? నీ స్నేహితుడేగా!"

ఇంతెత్తున లేచాడు ద్వారక. "ఏడిచాడు, నే వాడితో నాటకాలు వెయ్యటు మేమిటి? వాడు నాకింద నాటకా లేడ్చాడు. అసలు వాడికి నటన చాతనవునా యేమిటి? మొహం లేత మొహంగా వుందిగదా అని, ఆడ పాత్రలు వేయించా. అసలు వుత్త పిరికి చవట. మన పేరు చెపితే వాడికి హడల్." అన్నాడు ద్వారక.

"నోరు ముయ్యరా, రౌడీ వెధవా! నీ పోకిరీ వేషాలు గొప్ప అనుకుంటున్నా వేమిట్రా. అతనెన్నో మహిమలు చేస్తున్నాడురా. నేను స్వయంగా చూశాను. ఇదిగో చెయ్యి యిట్లా తెరిచి వెల్లకిలా చాపుకొని కూర్చున్నాడా, ఆ అరచేతిలోంచి విభూతి ధారగా వచ్చింది మేమంతా చూస్తుండగానే ఆ ధార మెల్లిగా కుంకుమ ధారగా మారింది. విభూతి మగవాళ్ళకి, కుంకుమ ఆడవాళ్ళకి ప్రసాదంగా యిచ్చాడు. ఆ కుంకుమ పెట్టుకొన్నాక నా తలకాయ నొప్పి తగ్గిపోయింది. ఇలా ప్రతివాళ్ళూ ఆ కుంకుమవల్ల, ఆ విభూతివల్లా తమకు ఏదో ఒక మేలు జరిగిందని చెప్తున్నార్రా"

"ఊర్కోవమ్మా, అది నీ మతిభ్రమ. వాడు మొదటినుంచీ జిత్తులమారి. ఇంట్లో తిండి గడవక, సంపాదన లేక యింట్లో వాళ్ళు గెంటేస్తే, ఆ శ్రీకంఠయ్య కాళ్ళు పట్టుకొని యీ దొంగవేషం వేసి, నీ బోటి అమాయకుల్ని దోచుకుతింటున్నాడు."

"మొదటినుంచీ జిత్తులంటావ్, ఏమి జిత్తులేశాడ్రా, పాపం? అతన్ని నేనెరగనా?"

"ఇదుగో, నీకేం తెలుసే అమ్మా! సెంటర్లోకొచ్చి శనగపప్పు మిఠాయి కొనుక్కు తింటూ వుంటాడా? నాబోటి, స్నేహితులం వెళ్ళంగానే యేమీ ఎరుగనట్టు, చేతులు వెనక్కు పెట్టుకొని కబుర్లు చెపుతూ వుంటాడు. మనం ఎటో చూస్తున్నపుడు పుటుక్కున నోట్లో

వేసుకుంటాడు. ఇంకోళ్ళకు పెట్టాలిసి వస్తుందని ఏడుపు. మనదగ్గర ఈ జిత్తులు సాగవుగా. నేను మీదపడి లాక్కొని తింటూ వుంటాలే "

"ఓరి పాపిష్టి వెదవా! ఒక్కోరోజు అన్నంలేక అలా కొనుక్కు తింటార్రా. అన్నం వున్న రోజున కొనుక్కొని, చిరుతిళ్ళు తినే అంత పీలు వాళ్ళకుందట్రా? పైగా మీదపడి లాక్కున్నావా? ఎంతపని చేశావురా, బండ వెధవా."

"ఊరుకోవమ్మా. నువ్వన్నీ యిలాగే చెపుతావు. నేనొక్కణ్ణే నీకు నచ్చను తప్ప, ఊళ్ళో అంతా మంచివాళ్ళే నీకు. అసలు వాడు మొదటినుంచీ ఆ లింగాయతులకీ, తురకలకీ, గూడ విభూతి యిస్తూ ఉండేవాడు. నేను చూచినప్పుడల్లా తిడుతూ ఉండేవాణ్ణి" అని విసుక్కొని నిద్రపోయాడు ద్వారక.

అయితే ఆవిడ వదిలి పెట్టలేదు. రెండు మూడు వారాలు నూరుకు తిన్నది.

"ఆయన చేతిలో మట్టి పెళ్ళలు కలకండలుగా మారిపోతున్నాయిరా. నేను స్వయంగా చూశాను" అంది ఒకరోజున.

"నే న్నమ్మను పో"అన్నాడు ద్వారక. కానీ నోరూరింది. ఆ మర్నాడు సాయంత్రం ఫుట్‌బాల్ గ్రౌండులో మిత్రులమధ్య సత్యనారాయణ చర్చ తెచ్చాడు ద్వారక. తల్లి తనకు చెప్పినవన్నీ చెప్పాడు. మిత్రులందరూ తలో మాటా మాట్లాడారు.

"అరేయ్, అసలువాడు మన వినాయకచవితి పూజలు చేస్తున్నప్పుడే, ఇతని దగ్గర ఏదో ఉపాసన వుంది అని కొంతమంది పెద్దవాళ్ళనటం నేను విన్నాన్రా" అన్నాడొకడు.

"ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసురా" అన్నాడొకడు.

"ఒకోసారి దశ తిరుగుందిరా" అన్నాడొకడు. "దీంట్లో చాలా మోసాలు ఉంటాయిరా" అన్నాడొకడు.

చర్చ చాలా జరిగింది. చివరికి రింగ్ లీడరు ద్వారక ఒక తీర్పు చెప్పాడు.

"అరేయ్, ఇవన్నీ యెందుకురా? మనం అందరం కలసి వెళ్ళి మొత్తం పరిస్థితంతా పరిశోధించేద్దాం. ఏదన్నా మోసం వుంటే అక్కడే కీళ్ళిరగబొడిచి వచ్చేద్దాం. అంతా బాగానే వుంటే, వాడేదుపు వాణ్ణి ఏడుచుకోమందాం. ఏమంటారు"? అని. బావుందంటే బావుందన్నారు మిత్రులంతా.

"మరైతే ఎప్పుడు వెళ్ళదాం?" అని ప్రశ్న లేవనెత్తాడొకడు. "మనం అనుకోటం వొకసారి, చెయ్యటం వోసారీనా? మన చరిత్రలో లేదది. నడవండి యిప్పుడే" అన్నాడు ద్వారక సేనాధిపతిలాగా.

అప్పటికి మసగ చీకట్లు ముసురుతున్నాయి. వీధిలైట్లు చాలా చోట్ల వెలిగాయి. నిర్మలంగా వున్న ఆకాశంలో పక్షుల సందడి పూర్తిగా తగ్గిపోయింది, కాని ఎగుడు దిగుడుగా

ఉన్న ఆ వీధుల్లో మనుషుల సందడి ఇంకా కొంచెం వుంది. ఆ సమయంలో ఫుట్‌బాల్ బ్యాచ్ అంతా ఎలక్ట్రిక్ కాలనీకేసి నడిచారు. అందరూ బనీన్లు, నిక్కర్లు వేసుకొని, కాన్వాసు బూట్లు వేసుకొని, పదహారూ ఇరవై ఏళ్ళ ప్రాయపు కోడె వయస్సులో, పొంగుతున్న ఉత్సాహంతో, మదించిన పొట్టేళ్ళలాగా వున్నారు.

సంస్కారం తక్కువగా వున్న మోటు హాస్యపు నవ్వులతో, వీధులను గలగల లాడిస్తూ, ఆ కుర్రకారు గుంపు ముందుకు సాగుతోంది. గుంపుకి ముందర, పొట్టేళ్ళ ముందర గున్నేనుగల్లే నడుస్తున్నాడు ద్వారక. ఏనుగుముందెగురుతున్న కాకిలాగ అతని చేతిలోని బంతి రోడ్డుమీద గంతులేస్తోంది మాటి మాటికీ. ఒక పది నిముషాల నడకతో వాళ్ళంతా శ్రీకంఠయ్య యింటి ప్రాంతానికి చేరుకున్నారు. అప్పటికి బాగా చీకటి పడింది. శ్రీకంఠయ్య ఇంటిముందు పెద్ద బయలు మైదానముంది. అందులో హైపవర్ కరెంట్ లైన్సు వెళ్ళే పెద్ద కరెంటు స్తంభాలు వున్నాయి. ఆ ఖాళీ స్థలంలో యిళ్ళు పగలగొట్టి పోసిన బరంతు సున్నపు ముక్కలు గుట్టగా పోసి ఉన్నాయి. అందులో కొంత భాగం చదును చేసి, ఆ స్థలంలో ఓ కుర్చీ వేసివుంది. ఆ కుర్చీలో సత్యనారాయణ కూర్చుని వున్నాడు. దూరంగానే ఆగిపోయింది మిత్ర బృందం. నవ్వులు అప్రయత్నంగానే ఆగిపోగా, గమనిస్తూ ఉండిపోయారు వాళ్ళు.

సత్యనారాయణ తెల్లపంచె లుంగీగా కట్టుకొని, ఒక తెల్లని చొక్కా తొడుక్కుని కుర్చీలో దర్జాగా కూర్చొని వున్నాడు. మొహాన విభూతి, కుంకుమ ఉన్నాయి. ఒక పాతికమంది లోపు జనం ఒక పక్కగా క్యూగా నిలబడి వున్నారు. వాళ్ళంతా ఒకరి తరువాత ఒకరు ముందుకు వస్తున్నారు. వచ్చి సత్యనారాయణ పాదాలకు సాష్టాంగంగా నమస్కరిస్తున్నారు. అప్పుడు వారి చేతుల్లో ఒక టిఫిన్ లోంచి తీసి కొంచెం ప్రసాదం వేస్తున్నాడు సత్యనారాయణ. వాళ్ళు యివతలకు వచ్చి ప్రసాదం తింటున్నారు.

వీధిలైటు వెలుతురులో ఆ ప్రసాద మేమిటో బాగా తెలియలేదు గాని, మొత్తానికి ఏదో పిండివంట. పిండివంట అనేసరికి నోరూరసాగింది ద్వారకకి. మిత్రుల్లో ఒక కుర్రవాణ్ణి పంపించాడు "అదేమిటో చూసి రారా" అని. వాడు తినేవాళ్ళ దగ్గరకి వెళ్ళి చూచివచ్చి "అది కేసరిబాత్" అన్నాడు.

"అరేయ్, మీరు వెళ్ళి నుంచుని కేసరిబాత్ లాక్కురండ్రా" అన్నాడు మిత్రులతో.

"నాకు భయం. నువ్వే ముందుండు" అన్నాడు ప్రతివాడు.

"ఛ, క్యూలో నేన్నుంచుంటే వాడికి దణ్ణం పెట్టాలి. నేన్నుంచోను" అన్నాడు ద్వారక.

"మేం మాత్రం ఎందుకు దణ్ణం పెట్టాలి. మేమూ నుంచోం" అన్నారు మిత్రులు.

"నోర్మూయ్యండోయ్, నేను కెప్టెన్ను. నేను చెప్పినట్టు చెయ్యండి నోరుమూసుకుని" అన్నాడు ద్వారక. ఆ సమస్య తేలక వాగ్వివాద మవుతోంది. ఈలోగా అటు సత్యనారాయణను గమనించిన ద్వారక—

"అరే సన్నాసుల్లారా, ఓరకంట నన్నే చూస్తున్నాడా సత్యనారాయణ. ఇహ వాదాలాపి నోరుమూసుకొని క్యూలోకి వెళ్ళండి" అని గద్దించాడు ద్వారక. మిత్రులంతా కెప్టెన్ మాట శిరసావహించారు. క్యూలో నిలబడి, నామమాత్రంగా నమస్కారం పెట్టి ప్రసాదం తెచ్చుకున్నారు. అందరిదగ్గరా తలోకాస్తా లాక్కొని తింటున్నాడు ద్వారక. తింటున్నకొద్దీ అతనికి మతి పోతోంది.

'ఓహ్, ఏమి రుచి యిది! కేసరిబాత్ యిప్పటికి, కొన్ని వందలసార్లు తినుంటాడు తను. ఇంత తీపి అబ్బా, ఇదెక్కడా కనిపించలేదు తనకి. ఈ తీపితో నోరే కాదు, వొళ్ళంతా పులకరించిపోతుంది. ఏమిటో ఏమిటో, తింటుంటే హాయి. ఓహ్! అద్భుతం.'

ద్వారక యిక తాళలేకపోయాడు. ఈ కాస్తకాస్త ప్రసాదం చాలటంలేదు. వెళ్ళి క్యూలో నిలబడ్డాడు. క్యూలో తనే చివరివాడు. దగ్గరకు వెళ్ళినాక నమస్కారం చెయ్యకుండానే మొహం మరో పక్కకు తిప్పి చెయ్యి చాచాడు.

"ఏమయ్యా, యింకా బాగు పడాలనిపించటంలేదా? ఇక్కడికి వచ్చావు, చేయి చాచావు. అయినా రౌడీతనమేనా?" అన్నాడు సత్యనారాయణ.

"ఆహా" అన్నాడు ద్వారక. తనకు అలవాటైన నాటక రాక్షస ఫక్కీలో నిర్లక్ష్యంగా.

టిఫిన్‌లో వున్నది జాగ్రత్తగా తుడిచేసి ద్వారక చేతిలో వేసి, ప్రసాదం పూర్తిచేశాడు సత్యనారాయణ. ప్రసాదం తిన్న భక్తులు సత్యనారాయణ చుట్టూ కూర్చొని, ఏదో మాట్లాడసాగారు. ప్రసాదం తింటూ యివతలకి వచ్చి అటూఇటూ చూస్తున్నాడు ద్వారక.

"ఇది లోపల పెట్టేయ్" అని ఒక కుర్రవాణ్ణి పిలిచి చేతిలో టిఫిన్ యిచ్చాడు సత్యనారాయణ. ఆ కుర్రాడు యింట్లోకి వెళ్ళుతున్నాడు.

"ఓహో యిదన్నమాట, పీడుంటున్న యిల్లు. చూద్దాం లోపల ఏముందో" అనుకుంటూ, తనూ కుర్రవాడి వెనకాల లోపలికి వెళ్ళాడు ద్వారక. అక్కడ మనుష్యులెవరూ లేరు. గోడకు గణపతి, లక్ష్మి, సరస్వతి ఫొటోలున్నాయి. వాటికి పూలమాల లున్నాయి. గదిలో ఏమి చల్లారో తెలియదుగాని ఏదో మంచి వాసన వుంది.

పిల్లవాడు ఆ టిఫిన్ గణపతి పటం దగ్గర పెట్టి వెళ్ళిపోయాడు. ద్వారక అక్కడే నిలబడి, యింకా పరిశీలిస్తున్నాడు. ఆ గణపతి ఫొటో క్రిందుగా ఏదో చిన్న దేవతార్చన పెట్టెలా వుంది. పక్కన ఒక పీటవేసి వుంది. అక్కడ అంతకన్న విశేషమేమీలేదు. కానీ ఎందుకో తనకు అక్కడనుండి కదలాలనిపించటంలేదు.

ఇంతట్లో వాకిట్లో ఏదో సందడైతే అటు చూశాడు. ఒక 50, 60 మంది * కురిగి ప్రాంతీయులు అక్కడికి వచ్చారు. వారంతా క్యూలో నుంచున్నారు. సత్యనారాయణ మళ్ళీ ఆ కుర్రాణ్ణే పంపాడు. వాడు వచ్చి ఆ టిఫినే తీసుకువెడుతున్నాడు. ఆశ్చర్యం! దానినిండా కేసరిబాత్ వుంది! ద్వారకకు కళ్ళు తిరిగినంత పనైంది. ఆ టిఫిన్ తుడిచేసి తన కళ్ళెదురుగా ఇక్కడ పెట్టాడు. తనిక్కడే వున్నాడు. దాన్నిండా కేసరిబాత్. ఎలావచ్చింది యిప్పుడు? తన తల్లి చెప్పిందాంట్లో నిజముందేమో! ఆలోచనలతో తల బరువెక్కి మెల్లిగా గదిలోంచి బయటుకు వచ్చేశాడు.

ఆలోచనలతో, తల కంపరంగావుంది. కానీ క్యూ చివరి కొచ్చేసరికి మళ్ళీ తనూ క్యూలో నిలబడ్డాడు. ఈసారి మోకాళ్ళు పట్టేసినవాడిలాగ కొద్దిగా వంగి చేయి కొద్దిగా ఆడించాడు, నమస్కారార్థం.

" ఏమయ్యా, కేసరిబాత్ కోసం మళ్ళీ వచ్చావా. " అన్నాడు సత్యనారాయణ.

" ఆ........ " అన్నాడు ద్వారక మళ్ళీ నాటకశైలిలోనే. కొంచెం ఎక్కువ ప్రసాదం చేతిలో పడ్డది. ఆనందంగా తింటున్నాడు ద్వారక. ఇంతలో ఎవరో ఒక గ్లాసుతో పాలు తెచ్చి యిచ్చారు సత్యనారాయణకి. అతను ఆ పాలు తాగేసి చివర్లో గ్లాసు గలగల లాడించి ఆ గ్లాసు తెచ్చిన వారి చేతిలో బోర్లించాడు. గలగలా శబ్దం చేస్తూ ఒక బంగారు లాకెట్టు వాళ్ళ చేతుల్లో పడ్డది. ఉత్సాహంగా ముందుకెళ్ళి చూశాడు ద్వారక. మిలమిలా మెరుస్తోందది, బంగారపు లాకెట్టు బిళ్ళ. గణపతి బొమ్మ వుంది దాని మీద !! ఆశ మెరుపులా మెరిసింది ద్వారకకి.

తను ఫుట్‌బాల్ ఆడేటప్పుడు, తన మెళ్లో బనీను మీద యిలాటి బంగారపు బిళ్ళ గనుక మెరుస్తూ యెగిరెగిరి పడుతూంటే ఓహ్, ఆ అందం ఇంకొకదికి రాదు. ' ఏమయినా సరే తనూ ఇలాటి బిళ్ళోటి పట్టాలి ఇతని దగ్గర. '

" వీడు, కాస్తా ' యితను ' అయిపోయాడు ద్వారక ఆలోచనల్లో. వెళ్ళి సత్యనారాయణ ముందు చెయ్యి చాచి ఎడమొహం పెట్టి " నాకూ ఒకటియ్యి " అన్నాడు.

" ఏమిటీ "

" అలాంటి డాలరు "

" అదేమయినా పప్పు, బెల్లం అనుకున్నావేమిటయ్యా? కొన్ని నియమాలున్నాయ దానికి. "

" చెప్పు "

" రేప్పొద్దున్నే తెల్లవారు జామున లేచి, చన్నీళ్ళు తలారా స్నానం చేసి, మొహాన విభూతి పెట్టుకొని, అయిదు అయ్యేసరికి నా దగ్గరుండాలి, నేను చెప్పిన పని చేయాలి "

*దక్షిణ కన్నడ ప్రాంతీయులు.

"ఓస్ యింతేగదా"

వెళ్ళిపోయాడు ద్వారక. మిత్రబృందానికి వాగ్బంధమైంది, అప్రయత్నంగానే. దార్లో తన అనుభవం చెప్పాడు ద్వారక. ఏమనాలో ఎవరికీ తోచలేదు.

ఇంటి దగ్గర తల్లితో జరిగిందంతా చెప్పి "అమ్మా, నన్ను తెల్లవారు జామున లేపవే. లేవకపోతే నెత్తిన చన్నీళ్ళు పోసెయ్" అన్నాడు ద్వారక. తల్లి ఆనంద పడిపోయింది. ఆ రాత్రల్లా గుండెలమీద ఎగిరెగిరి పడుతున్న బంగారు డాలరే ద్వారకని మాటిమాటికి నిద్ర లేపింది. చెప్పినట్టే చేసి తెల్లవారుజామున అయిదింటికి ముందుగానే శ్రీకంఠయ్య యింటికి చేరాడు ద్వారక.

తలుపు వేసి ఉంది. తోసి చూశాడు. తెరుచుకుంది. ఎదురుగా సత్యనారాయణ పీటమీద కూర్చుని వున్నాడు. ఇతన్ని చూస్తూనే "వచ్చావా" అన్నాడు.

"వచ్చా, సత్యనారాయణా" అన్నాడు ద్వారక చనువుగా.

"నన్ను ఇక సత్యనారాయణ అనరాదు. సత్యనారాయణ స్వామి అనాలి. లేదా స్వామి అనాలి." మంద గంభీరంగా ఉపదేశిస్తున్నట్టుగా వున్న ఆ మాటలు విని, వినయంగా తల వూపాడు ద్వారక.

"అలాగే అంటాను. డాలరియ్యి" అన్నాడు ద్వారక ఆత్రంగా.

"పని చెపుతా అన్నాగా"

"చెప్పు మరి"

"హోమానికి చితుకులు కావాలి. ఆ కట్టెలు ముక్కలు కొట్టు."

అక్కడ ఒక అయిదారు లావు కట్టెలు, ఒక బండకత్తి వున్నాయి. ఒక పది నిముషాల్లో టకటక ముక్కలు చేశాడు ద్వారక. ఈలోగా శ్రీకంఠయ్య అందించిన కాఫీ పూర్తి చేశాడు సత్యనారాయణ స్వామి.

"డాలరేది" అన్నాడు ద్వారక, చెయ్యి దులుపుకుంటూ.

"ఇదేమిటి" అన్నాడు సత్యనారాయణస్వామి, తను తాగిన కాఫీ గ్లాసు చూపిస్తూ.

ద్వారక గ్లాసు లోకి తొంగి చూస్తూ, "కాళీగ్లాసు" అన్నాడు అసహనంగా.

"అలాగా? చెయ్యిపెట్టి వెతికి చూడు" అన్నాడు స్వామి. ఇతడు గ్లాసులోకి చెయ్యి పెట్టాడు.

వేళ్ళకు ఏదో తగిలింది.

తీసి చూస్తే, డాలరు! బంగారపు డాలరు!! మిల మిలా మెరుస్తోంది!!!

మొహం చాటంత అయింది ద్వారకకి.

లేచి నుంచుంటూ ఒక నమస్కారం పెట్టి " ఇక పోయొస్తా స్వామీ " అన్నాడు.

" సరేగాని, నీకు ఇష్టమైతే, మంచివాడి నవుదామను కొంటే రోజూ కాసేపు యిక్కడకు వచ్చి పోతూ వుండు " అన్నాడు సత్యనారాయణస్వామి.

" సర్లే స్వామీ " అంటూ తుర్రుమన్నాడు ద్వారక.

అతనలా వెళ్ళగానే — " వీడిలో కొంత మార్పు తెచ్చి నట్టున్నావే. బలే ఆశ్చర్యంగా వుందయ్యా " అన్నాడు శ్రీకంఠయ్యగారు. " అతనిలో మౌలికంగా కొన్ని సద్గుణాలున్నాయి. అంచేత అతని విషయంలో నేను శ్రమచేస్తే అతను బాగు పడతాడు. అయినా, అతను చెడు దశలు ఇంకా కొన్ని దాటాల్సి వుంది " అన్నాడు సత్యనారాయణ.

" అయినా, నీకు వాడిమీద కొంచెం అభిమానం జాస్తి " అన్నాడు శ్రీకంఠయ్యగారు.

" గణపతి సేవ చేస్తున్న వాడు, మా పిన్నికి బడి ఉత్సవాల్లో సహాయం చేస్తున్న వాడు, మా చెల్లెలు పెళ్ళిలో గూడా కొంత సహాయం చేసినవాడు కదా " అన్నాడు సత్యనారాయణ.

" ఏమయ్యోయ్, నీ చెల్లెలు పెళ్ళి కథ ఆరోజు పూర్తి కాలేదు " అన్నాడు శ్రీకంఠయ్యగారు చటుక్కున.

" గణపతి కరుణ నాపై అధికంగా ప్రవహించిన మంగళ కరమైన ఘట్టమది. అది కల్యాణ కరమైన కథ. ఇప్పుడు చెపుతా వినండి " అని మొదలు పెట్టాడు సత్యనారాయణ.

* * *

**అమ్మకం**

" చేసుకో "

" అదేమిటి, నీకేం బాధ్యత లేదా. "

" నాకో బాధ్యత, నాకో విలువగూడ చచ్చాయా. "

" అంత మాట లొద్దు. "

" ఉన్న మాటలే "

" నీతో చెప్పకుండా యేపని చేశాను నేను ? "

" ఇలాంటి దొంగ కూతలు కూస్తే నాకు మరీ వొళ్ళు మండుకొస్తుంది."

" కోపంవద్దు. నీతో చెప్పకుండా చేసింది, నువ్వొద్దన్న పనిచేసింది— ఒక్కటి, ఒక్క టుంటే ఒక్కటి చెప్పు."

" అసలు నువ్వక్కడకు పోయేటప్పుడు నా అజ్ఞమీదే పోయావా "

" చెపితివిగా, పోతే పొమ్మంటివిగా "

"ఎప్పుడూ, ఎక్కడ?"

"కందుకూర్లో తాతయ్య కర్మలు జరుగుతున్నప్పుడు"

దీంతో, ఇరుకున పడిపోయి గిజగిజలాడాడు నరసింహశాస్త్రిగారు. అయినా వెంటనే తేరుకొని—

"ఏడిచావులే, ఆ కర్మ తొందరలో పుండగా నువ్వేం చెప్పావో, నేనేమన్నానో?" అన్నాడు.

"ఆలోచించందే నువ్వేదీ చెప్పవుగదా అనుకున్నాను." అన్నాడు ఎదురుగా నిలబడ్డ సత్యనారాయణ దీనంగా. ఈ దెబ్బతో శాస్త్రిగారి హృదయంలో మెత్తదనం, కొంచెం ఆనందం స్థాయికి ఎగబాకింది.

"అదీ నిజమే అనుకో" అన్నాడాయన. సత్యనారాయణకి విషయం అర్థమైంది. అందుకనే వెంటనే అందుకున్నాడు.

"తాతయ్య గూడా పోయాడు. అంబమ్మవ్వకు ఇక అదుపు వుండదు. వరలక్ష్మి తట్టుకోలేదు. అన్నయ్యకు ఏమీ చెప్పలేని యిరుకయిపోతుంది అని ఆలోచించి పొమ్మన్నావు గాబోలనుకున్నాను. లేకపోతే యెందుకు పోతాను?"

అంబమ్మగారి పేరు అంటే అక్కడ బ్రహ్మాస్త్రం. అది పనిచేసింది. అందువల్లే—

"సర్లే ఏదో అఘోరించావు. అదీ ఒకందుకు మంచిదే, కానీ" అనేశాడు శాస్త్రిగారు.

శాస్త్రిగారి ప్రథమ కోపం దాటిపోతే, యిక వారిమీద, మనం యెక్కి సారా చేయవచ్చని సత్యనారాయణకు బాగా తెలుసు.

"ఆ పెద్ద కొడుకేదో అంతా బంగారమైనట్టూ, నాకు బొత్తిగా భక్తి లేనట్టూ మాట్లాడతావేమిట?" ఈ మాటు సత్యనారాయణ గొంతు కొంత లేచింది.

"ఎట్టా అయినా వాడు వాడే" అన్నాడు శాస్త్రిగారు.

"బొత్తిగా లౌక్యం చేతకాదు పాపం నాన్నకి" అనుకున్నాడు సత్యనారాయణ.

"సర్లే పోనీ, దీని పెళ్ళి మాట చెప్పు" అన్నాడు మళ్ళీ తనే సత్యనారాయణ.

"నేను చెప్పేదేముంది. నువ్వు ఖాయం చేసుకొనే వచ్చావుగా" మళ్ళ కాస్త శిష్యమన్నాడు శాస్త్రిగారు.

"అబ్బెబ్బే, నువ్వు చెప్పందే ఖాయం ఎవరు చేస్తారు? సంబంధం నచ్చింది. కట్నం లేదు, అని చెపుతున్నానంతే" మెత్తగా చెప్పాడు సత్యనారాయణ.

"అసలయినా మనకి వెధవ కన్నడ సంబంధం ఎందుకురా" తన సహజ ధోరణిలో అన్నాడు శాస్త్రిగారు.

"ఏంమాట అది" సత్యనారాయణ మాట బాగా చురుగ్గా వుంది.

"ఆ మాట పాపిష్టి మాటేలేవోయ్. నాకు తెలుసు. అంతదూరం సంబంధం మనకెందుకూ అని నా భావం" కొంచెం సవరించుకున్నాడు శాస్త్రిగారు.

ఒక్క క్షణం ఆలోచించుకొన్నాడు సత్యనారాయణ. ఆలోచనయిన తరువాత మొహం మీద మంచి చిరునవ్వు కులికింది.

"అయితే ఏంచేద్దామంటావు"

"ఇక్కడే, వో మంచి సంబంధం చూద్దాం"

"సరే చూడు"

"వారంరోజులలో రాజాలాంటి సంబంధం తీసుకురానూ"

"పెళ్ళెక్కడ చేద్దాం"

"సత్రాల్లేవా, గుళ్ళు లేవా, ఎక్కడపడితే అక్కడే చెయ్యొచ్చు."

"సరే. ఇక్కడే దగ్గర సంబంధం చేద్దాం. మంచిదే, రేపు పురుళ్ళూ పుణ్యాలూ వస్తాయి. అప్పుడు అంబమ్మవ్వచేత పోయిస్తావా?"

"ఏమిటి?"

"అదేనయ్యా; రేప్పొద్దున వరలక్ష్మికి బాలింత సేవంతా అంబమ్మవ్వే చేస్తుందా అంటున్నాను."

శాస్త్రిగారికి మొహమంతా చిట్లుకు పోయింది. తలంతా దురద పెట్టేసింది. కూర్చున్న అరుగు మీదంతా చీమలు పాకుతున్నట్టనిపించి, లేచి తుండుగుడ్డతో దులిపి మళ్ళీ కూచున్నాడు. అయినా ఆ సమస్యకు పరిష్కార మేమీ దొరకలే దాయనకు.

"చిన్న వెధవని కొట్టి పారెయ్యనంటే ఒకమాట చెపుతా" అన్నాడు సత్యనారాయణ, అదను కనిపెట్టి.

"చెప్పు" అన్నాడు శాస్త్రిగారు నిస్సహాయంగా.

"ఇక్కడ మనకు అడ దిక్కు లేదు. ఇక్కడి సంబంధం చేస్తే, అక్కడివాళ్ళకు ఇక బాధ్యత వుండదు. వొదిలిపోతుంది. కనుక ఆ సహాయమూ వుండదు మనకి." కొంచెం ఆగాడు సత్యనారాయణ.

"ఊఁ చెప్పు." నిస్సహాయంగా వుంది శాస్త్రిగారి గొంతు.

"కనుక అక్కడి సంబంధం చేస్తే వాళ్ళమీద బాధ్యత పడుతుంది. ఆ పార్వతి పిన్నీ వాళ్ళు తప్పక చాకిరీ చేస్తారు." ఆగాడు సత్యనారాయణ.

"అఘోరించినట్టే వుంది" నిట్టూర్చాడు శాస్త్రిగారు.

"పోనీ నీ అభిప్రాయం చెప్పు." అలిసిపోయిన పామును కదిలించి చూడటం సత్యనారాయణకు కొత్తకాదు.

"అసలు నా యేడుపే వేరు." అన్నాడు శాస్త్రిగారు.

"వివరంగా చెప్పు నాన్నా"

"గొందిరెడ్డిపల్లిలో మా దాసంభొట్లు మావ వుండేవాడు. విన్నావా."

"అదే హంపాపురం సుబ్రహ్మణ్యం వాళ్ళ తండ్రేగా"

"ఆఁ ఆఁ ఆయనే. ఆయన చాలా గొప్పవ్యక్తి. మహాత్ముడు. ఆయిన నాకు అనేక విధాల గురువుగా వుండేవాడు.

"ఊఁ"

"ఆయన పాపం మనతో సంబంధం కలుపుకోవాలని తాపత్రయ పడేవాడు. ఆయన జీవించి వుండగా అది కుదర్లేదని బాధపడుతూ వుండేవాడు.

"నీతో వియ్యం పొంది మన చుట్టరికం కలుపుతాను లేవయ్యా అని ఆయనకు మాటిచ్చా నొకసారి. ఈ వరలక్ష్మిని, ఆయన కొడుకుల్లో ఒకడి కిద్దాంలే అనుకున్నాను. నువ్వేమో లేనిపోని మడతపేచీ పెడుతుంటివి." శాస్త్రిగారి నిస్సహాయత విసుగ్గా వ్యక్తమైంది.

"నాదేం పేచీ కాదు. నువ్వే చెప్పు" అది సత్యనారాయణ వాదం.

"సరే డబ్బు కావాలంటావు అంతేగా" అదీ శాస్త్రిగారు అంగీకారం వ్యక్తం చేసే విధానం.

మౌనంగా వూరుకున్నాడు సత్యనారాయణ.

"ఎంత కావాలంటా?" శాస్త్రిగారు అడిగారు.

"మన దగ్గర ఎంతవుంటే అంతలోనే చేద్దాం పెళ్ళి."

"చూడబ్బాయ్! నా చేతుల్లో రూపాయి నిలువ వుండదని అందరికి తెలుసు. నా కిప్పుడు వున్నదల్లా యీ కొంప వొక్కటే. ఇవ్వాళ్ళేదో నువ్వు వచ్చావు గనుక, యింత వుడకేసుకుని తిన్నాం గాని, నాది రోజూ యెక్కడో అక్కడ ముష్టికూడే, లేకపోతే ఏకాదశే. కనక యీ యింటితో నాకేం పని లేదు. ఉన్నదల్లా మెల్లిగా వదిలిపోవటం గూడ మంచిదే. దాన్నమ్మి పారేస్తాను. ఎంత వస్తే అంత నీ కిస్తాను. తరువాత నీ కర్మ, దాని కర్మ. సరేనా."

"అలాగే కానీయ్."

ఇక కనిపించిన ప్రతివాడికీ "మా రెండోవాడు చెల్లెలికి సంబంధం చూశాడు. పెళ్ళి కోసం యిల్లు అమ్మేస్తున్నాను" అని చెప్పాడు శాస్త్రిగారు. అప్పటికి పొద్దు బాగా వాటారింది. ఇక లేచి తండ్రీ కొడుకు లిద్దరూ కాస్త వుడకేసుకు తిని పడుకున్నారు.

సత్యనారాయణకి ఆ వూళ్ళో కాలక్షేపం లేదు. చిన్ననాటి స్నేహితులంతా పెద్దవాళ్ళయి పోయి, ఎవరికి వారు ఏహా అంటే ఓహా అంటున్నారు తప్పితే అంత చనువుగా లేరు. పాపం అంత చనువుతోనూ ఆదరించి పలకరించినవాడు ఇంటిపక్క గుళ్ళో ఆంజనేయస్వామి వొక్కడే. "హనుమయ్యా, నేను నిన్ను ఉపాసించేది తక్కువే అయినా నువ్వింత అనుగ్రహిస్తున్నావు. నీకు ఎలా కృతజ్ఞత చెప్పేదయ్యా" అన్నాడు సత్యనారాయణ ఆయనతో. ఆయన పగలబడి నవ్వాడు. నవ్వి "సరే లేవయ్యా! ఆనాడు భగవద్గీతకూ నేనే సాక్షిని, మీ అమ్మ ద్వాదశ సూక్తులకూ నేనే ప్రత్యక్ష సాక్షిని" అన్నాడు. ఆ తరువాత గొందిరెడ్డిపల్లి పోయి శివాలయం చూసి వచ్చా డొకసారి. పూర్వం తండ్రితో ఆ శివాలయానికి వెడుతూ ఉండేవాడు సత్యనారాయణ.

సత్యనారాయణ ఆ ఊరు వచ్చి వారం రోజులు దాటింది. పుల్లలరేవులో కరణంగారి ఇంట్లోనో, కందుకూరులో అన్నగారింట్లోనో, గొందిరెడ్డిపల్లిలో హంపాపురం వారింట్లోనో యెక్కడో అక్కడ భోజనం చెయ్యటం, బొమ్మెపర్తి వచ్చి బద్వేలు వారి అరుగుమీద కాపలా కాయటం, ఇదీ అతని పని రోజూ. ఇవాల్టికి దొరికాడు తండ్రి. నాలుగేళ్ళ తరువాత మళ్ళీ యివ్వాళ్ళ ఆ ఇంట్లో పడుకున్నాడు తను. అయిపోయింది, ఇంక ఆ ఇంటితో ఋణం తీరి పోతుంది.

"నాన్న దృష్టిలో అది అచ్చిరాని యిల్లు కావచ్చు. అది కేవలం మట్టి మిద్దే కావచ్చు. ఇరుకు కొంపే కావచ్చు. కాని నా దృష్టిలో ఈ ఊరూ, ఈ ఇల్లూ, ఈ గుడీ అన్నీ మహా క్షేత్రాలు" అనుకొన్నాడు సత్యనారాయణ.

శ్రీరాజరాజేశ్వరీ మహాక్షేత్రంగా, నిరతాన్నదాన దివ్య సత్రంగా, నిరంతర దివ్యనామ సంకీర్తనలు మారుమోగే తీర్థస్థలంగా, ఆర్తుల బాధలను అవలీలగా నివారించే రక్షా కేంద్రంగా, ఆ ఊరును ఊహించుకుంటూ నిద్రపోయాడు సత్యనారాయణ.

తెల్లవారేసరికి తండ్రీ కొడుకు లిద్దరూ స్నానసంధ్యావందనాలు పూర్తి చేసుకొని కందుకూరు బయలుదేరారు. అక్కడికి వెళ్ళేసరికి నంజుండయ్యగారు ఎక్కడికో వెళ్ళాడు. సాయంత్రానికి వస్తాడన్నారు. సరే తండ్రీకొడుకు లిద్దరూ భోజనాలు చేసి ఆయన కోసం ఎదురు చూడసాగారు. ఈ లోపల సత్యం వచ్చిన విషయం తెలిసి వంటింట్లో చర్చలు మొదలైనాయి. సాయంత్రానికి నంజుండయ్యగారు వచ్చాడు. రాంగానే ముందుగా అంబమ్మవ్వే విషయం అందించింది.

"అక్కడ ఆ పుల్లలరేవులో, ఆ రాణీగారు మకాం పెట్టింది. ఈ బంట్రోతును డబ్బు తేతెమ్మని తిప్పుతోంది. దాని పెళ్ళిట. సంబంధం చూశారట. అబ్బాయోవ్, జాగర్త. నిన్ను గోక్కు తినాలని చూస్తారు." అంబమ్మవ్వ గొంతు వీధివాకిట దాకా వినిపిస్తోంది. ఇది ఊహించిందే కనుక సత్యనారాయణ నిశ్చలంగానే వున్నాడు గాని, ఊహించనిదొకటి జరిగింది.

"ఔ[నా, అదీ నిజమే, అసలు సంబంధం చూశారా, ఖాయిం చేశారా?" అన్నాడు శాస్త్రిగారు సత్యనారాయణతో.

అంబమ్మవ్వ ఎడ్డెమంటే, తెడ్డెమనవలసిన నాన్న ఇలా ఎందుకు అడ్డం తిరిగాడో సత్యనారాయణకు అంతుబట్టలేదు. మనస్సులో ఏర్పడ్డ ఈ అలజడివల్ల సమాధానాలు నసుగుతూ వచ్చాయి. దాంతో అనుమానం పెరిగింది శాస్త్రిగారికి. ఇక లింగణ్ణగారి ఆర్థిక పరిస్థితి గురించీ పార్వతమ్మగారి సంపాదన గురించీ గుచ్చి గుచ్చి అరాలు తీయసాగాడు.

ఇది పెద్ద సంకటం. అక్కడ ఆర్థిక పరిస్థితి బాగా లేదని చెపితే, చూశావా, మమ్మల్ని కాదని అక్కడికి వెళ్ళావు. కనుక శాస్తి యిలా అయిందని అంబమ్మవ్వ విర్రవిగుతుంది. బాగుందని చెపితే, పెళ్ళి వాళ్ళే చెయ్యలేరా అని తండ్రి పేచీ పెట్టవచ్చు. ఏం చెయ్యాలి? గిజగిజ లాడాడు సత్యనారాయణ. కాని అంతలోనే చాకులాటి ఆలోచన వచ్చింది. దాంతో,

"సరస్వతి సంగతి పూర్తిగా పిన్నమ్మ చూసుకొంటుంది. దాని సంగతి మనకక్కరలేదు. నా సంగతి, నా వొడుగు చేసిన శేషగిరిశాస్త్రి గారు చూసుకొంటున్నారు. ఇహ ఎటూ కాకుండా వుంది ఈ వరలక్ష్మి. తింటోంది, తిరుగుతోంది. దానికేం లోటు లేదనుకో. కాని పెళ్ళి బాధ్యత ఎవరూ పెట్టుకోటం లేదు. అది నువ్వే చూడాలి." అన్నాడు పీలయినంత లయగా. ఈ సమాధానం చిక్కును దాటించింది గాని కొత్త సమస్య తెచ్చి పెట్టింది.

"తండ్రి చచ్చాడనుకొని, నీ అంతట నువ్వు వొడుగు చేసుకొన్న వెధవ్వి. అసలు నీతో మాట్లాడటం నా బుద్ధి తక్కువ" అన్నాడు శాస్త్రిగారు ఇంతెత్తున ఎగిరిపడుతూ. ఈ సమస్యకు మొదట తెల్లబోయినా మరుక్షణమే తేరుకొన్న సత్యనారాయణ,

"వడుగు నా కోసం చేసుకున్నానంటావా"? అన్నాడు తనూ కోపంగానే.

"లేకపోతే నా కోసమా?" రెట్టించాడు శాస్త్రిగారు.

"ఔను. నీ కోసమే, చెపుతాను విను. నాకు ఎన్నో యేట వడుగు చెయ్యాలి నువ్వు శాస్త్ర ప్రకారం? ఏడో ఏట చెయ్యాలి. అప్పటికి మా అమ్మ బతికి వుంది. మరెందుకు చెయ్యలా?"

"పన్నెండేళ్ళ దాకా పరవాలేదని పక్షాంతరం వుంది లేవోయ్."

"శాస్త్ర ప్రకారం నడిచేవాడికి పక్షాంతరం ఎందుకు? అంత కర్మమేం కాలె? సరే పన్నెండోయేటికి, నేను పొద్దుటూర్లో వున్నా. చూసిపోటానికి నా దగ్గరకి నాల్గుసార్లొచ్చావు. నీకప్పుడు శాస్త్రం గుర్తురాలేదా?"

"ఆ పరిస్థితులు వేరు."

"విధించిన శాస్త్ర కారుడికి యిలాంటి పరిస్థితులేర్పడతాయని తెలియదా? ఆ పరిస్థితుల్లో గూడ ఆ విధిని ఆచరించవలసిందేనని శాసించింది శాస్త్రం. మనం ఉల్లంఘించాం."

శాస్త్ర వాక్యాలు ఎదురు తిరిగితే యిక శాస్త్రిగారు నోరెత్తడు. ఆ మాట సత్యనారాయణకి తెలుసు. ఆ కిటుకు యిప్పుడు పని చేసింది. అందుకే, మరింత విజృంభించాడు.

"ఏడో ఏట నుంచీ, నేను ముప్పూటలా సంధ్యా వందనం చేసి వుండ వలసింది. అలా జరుగలేదు, ఆ పాపం నాదా ? నా ఉపనయనానికి కర్తను నేను గానే! మరి ఆ పాపం ఎవరు భరిస్తారు ? ఇంకెవరు ? నువ్వే"

సత్యనారాయణ సరాసరి దెబ్బ తీశాడు. శాస్త్రిగారు ఏమీ అనలేక సంచీలో బట్టలు తీసి మళ్ళీ సర్దసాగాడు. సత్యనారాయణ ఆగలేదు.

"నాకు పదహారో ఏడు వచ్చింది. నువ్వు ఉపనయనం మాట ఎత్తటం లేదు. ఇంకా ఆలస్యమైతే నాకు బ్రాహ్మణత్వమే పోతుంది. అప్పుడు మనకు ప్రాయశ్చిత్తం గూడ వుండదు. మనలాంటి శ్రోత్రియ కుటుంబంలో ఆ స్థితి పట్టరాదని, పదహారు వెళ్ళగానే ఇక లాభం లేదని నేనే ఉపనయనం చేయించుకొన్నాను. ఏమిటి తప్పు ?" ఈ మాటు దాడిలో, కొంచెం మృదుత్వం చూపించాడు.

"శాస్త్ర ప్రకారం దోషమేం లేదు. ఊరికే లోకరివాజుగా అన్నా" అని తేల్చేశాడు శాస్త్రిగారు.

"అందుకే యీ పెళ్ళి నువ్వే దగ్గరుండి నడపమంటున్నాను. నువ్వు దగ్గరుంటే, సంబంధం మంచీ, చెడులు నువ్వు విచారించవచ్చు. నీ డబ్బూ నువ్వే ఖర్చు పెట్టవచ్చు. ఎవరి చేతికో యివ్వక్కరలేదు." అని మళ్ళీ అసలు విషయంలోకి వచ్చాడు సత్యనారాయణ.

ఈ లోపల నంజుండయ్య, భార్యవచ్చి, "అసలు దానిపెళ్ళి మేమే చెయ్యాలని ఎంతో ఉబలాట పడ్డాం" అన్నారు.

"నేను యేమంటే ఏంతప్పు అవుతుందో కానీ ఇప్పటికయినా ఇక్కడికి తెస్తే మనమే పెళ్ళి చెయ్యవచ్చు" అంది నంజుండయ్యగారి భార్య లలితమ్మగారు.

నరసింహశాస్త్రిగారు అది కుదర దన్నాడు. ఆయనకి అంబమ్మవ్వ భయం వుంది. ఇంత వరకూ నయమే అనుకున్నాడు సత్యనారాయణ. సరే యిక డబ్బు చర్చ వచ్చింది. తన మనవడు ఎక్కడ దోచి పెడతాడో నని ఉడికి పోతోంది అంబమ్మవ్వ. ఆవిడ శాంతికోసం, "నేను నయాపైసా యివ్వను" అని ప్రకటించాడు నంజుండయ్యగారు. దాంతో నవగ్రహాలూ శాంతించి, ఆపై కార్యక్రమాలు సాఫీగా నడవనిచ్చినై.

అమ్మకానికి పెట్టిన బొమ్మెపర్తి యిల్లు, అమ్ముడుపోయి డబ్బు చేతికందే సరికి పది రోజులు పట్టింది. ఇల్లు ఎనిమిది వందలకు అమ్ముడు పోయింది. ఆ వ్యవహార మంతా నంజుండయ్యగారే చూశాడు.

"ఆ డబ్బు సత్యనారాయణకే యిచ్చెయ్యరా" అన్నారు శాస్త్రిగారు, తను ముట్టుకోను గూడ ముట్టుకోకుండా.

నంజుండయ్యగారు పుల్లలరేవు వెళ్ళి, పార్వతమ్మగారి సమక్షంలో సత్యనారాయణ చేతిలో డబ్బు పెట్టాడు. లెక్కపెడితే పదకొండు వందలుంది. "ఇదేమిటీ" అన్నట్టు చూచాడు సత్యనారాయణ.

"ఉండనీ అప్పా, ఉండనీ. అసలా పెళ్ళి నేను చెయ్య వలసినవాణ్ణి. గమ్మున తీసుకెళ్ళు" అన్నాడు నంజుండయ్యగారు. ఆ మూడు వందల గురించి ప్రచారం కావటం, ఆయనకి యిష్టంలేదు. ఆయన చిక్కు లాయనవి !

పన్నెండి. యిక బయలుదేరవచ్చు అనుకుంటుండగా శాస్త్రిగారు సత్యనారాయణను బద్వేలు వారి యింటికి పిలుచుకెళ్ళాడు. వెళ్ళేటప్పటిక గోనె సంచుల్లో, యిత్తడి సామాను అరుగుల మీద పెట్టివుంది. గుండిగలు, చెంబులు, గ్లాసులు, గిన్నెలు, పళ్ళాలూ వగైరా అమాంబాపతు ఒక పెద్ద కాపరానికి సరిపోయే సామానది.

"ఇదంతా అమ్మ వాడిన సామానురా. ఇన్నాళ్ళ నుంచీ బద్వేలు వారి యింట్లో దాచి వుంచారు పాపం. తీసుకుపో. వరలక్ష్మిని కాపరానికి పంపించేటప్పుడు ఇచ్చి పంపించు, కొంత ఖర్చు కలిసి వస్తుంది." అన్నాడు శాస్త్రిగారు.

"అంతా దీనికే యిచ్చేస్తావా" ధర్మ సందేహం లేవదీశాడు సత్యనారాయణ.

"ఒరేయ్, ఎప్పటి ఏడుపు అప్పటిది. ఇప్పటి కిది వున్నది. దుఃపెయ్. తరవాత ఆలోచన మనకెందుకు? ఎవడి కర్మ వాణ్ణి నడుపుతూనే వుంటుందిగా" అన్నాడు శాస్త్రిగారు విసుగ్గా.

నాన్న సాధన మార్గం గురించి, అమ్మ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి సత్యనారాయణకి. పార్వతమ్మగారు సాక్షిమాత్రంగా కూర్చోవటమే తప్ప మొత్తం వ్యవహార మంతా సత్యనారాయణే చక్కపెట్టాడు. కానీ, కనీసం రెండుమూడు వేలయినా రాకపోతుందా అనుకుంటే కేవలం పదకొండు వందలు వచ్చాయి. కొంత పాత్రసామాగ్రి గూడా వచ్చిందనుకోండి.

ఇక్కడ వ్యవహారం సవ్యంగానే జరిగిందన్న సంతోషం కన్నా, పై వ్యవహారం సరి పెట్టుట మెలా అన్న ఆలోచనా భారమే యెక్కువయింది సత్యనారాయణకి. ఆలోచనలన్నీ లోపలే దాచుకొని, తండ్రినీ, అన్నగార్నీ, వదినగార్నీ అందర్నీ పెళ్ళికి తప్పక రమ్మని మరీ మరీ చెప్పి, తిరిగి ప్రయాణ మయ్యాడు సత్యనారాయణ.

ఇక్కడ సత్యనారాయణ ఈ ప్రయత్నాలలో వుండగా అక్కడ మైసూరులో లింగణ్ణగారు సంబంధం ఖాయపరచే ప్రయత్నాలలో వున్నాడు. సంబంధాలు ఖాయపరచటం అనేది ఏదో

ఒడుదుడుకుల్లోకి దిగుతూ వుండటం సహజం. ఈ సంబంధం విషయంలో గూడా అనుకోని చిక్కులు కొన్ని వచ్చాయి. మగపెళ్ళివారి తరపున కొందరు దూరపు బంధువులు కొన్ని లాంఛనాలయినా యిచ్చి తీరవలసిందే అని పట్టుబట్టారు.

దాంతో, ఇక యీ సమస్య నెలా తేల్చాలో తెలీక, వయస్సువల్ల వచ్చిన విసుగుదల ఓర్చుకోలేక లింగణ్ణగారు సతమతమయిపోసాగాడు. ఆయనకు అప్పుడైన మధ్యవర్తి ఒకడు ఈ బాధను చూసి-"ఎందుకండీ ఇంత సంకటం మీకు? వరలక్ష్మి తండ్రిని పిలిపించి మొత్తం బాధ్యత ఆయన్నెత్తిన వేస్తే సరిపోలేదా ?" అని ఒక సలహా చెప్పాడు.

ఆ ప్రశ్నతో మనస్సు కలతబారి పోయిన లింగణ్ణగారు, ఆ మధ్యవర్తికి తన విషాద గాథను కొంత వివరించసాగాడు.

* * *

## ఋషిదర్శనం

"బాబూ, నా దౌర్భాగ్యపు బతుకంతా ఏకరువు పెట్టి నిన్ను బాధించనుగాని, కొన్ని భాగాలయినా నీకు వివరిస్తే గాని నీ ప్రశ్నలకు జవాబు రాదు. కాస్త ఓపిగ్గా విను.

మొదటి నుంచీ నాకు వ్యవసాయ మన్నా, గొడ్లన్నా పల్లమాలిన వెర్రి. ఆ వెర్రితోనే ఉన్న వూరు వదిలి కారడవిలో కాపురం పెట్టాను. అదే, నా మేకెదాటు కాపురం గురించి చెపుతున్నాను నేను.

1936 లో నేను మేకెదాటు చేరాను. అక్కడ బొగ్గు సాగుబడి, మెట్టసేద్యం విస్తారంగా చేశాను. 1939-40 ఆ ప్రాంతాల్లో మా పూడో అమ్మాయి జయిలక్ష్మి వివాహమైంది. అదే ఈ సత్యం, వరలక్ష్మి, సరస్వతి వాళ్ళ తల్లి.

నా పూరిపాకే రాజదుర్గంగా, కొండదారులే రాజమార్గాలుగా, మా డప్పు బొచ్చెలే దివ్యాస్త్రాలుగా అడవి జంతువుల మీద దిగ్విజయం సాధించేసి, నాలుగేళ్ళపాటు నల్లేరుపై బండిగా ఆ అడవి వ్యవసాయం సాగించాను.

అది, అంటే మా జయిలక్ష్మి కాపరానికి వెళ్ళింది. ఆ యేడు అడవిలో యేనుగుల్లో రెండు మురాలకు తగాదాలయ్యి, ఆ యుద్ధాలన్నీ మా పొలాలలో జరిగి మా పంట లన్నీ సర్వనాశన మయ్యాయి. కొండ చెరియల్లో వున్న చెట్లను ఏనుగులు మా యెదుటే పటపటా విరిచి పారేసినాయి. తొండాలతో నీళ్ళు తెచ్చి మానెగళ్ళ మీద చల్లి, కాపలాదారుల్ని చెల్లాచెదురు చేశాయి. ఆ తరువాత ఒకసారి జంగురు పిల్లులకూ, పాములకూ పెద్ద యుద్ధమై, అవి కొండ లంబడి, గుట్టలంబడి, పొదలంబడి, గడ్డివాముల వెంబడి పొల్లిగింతలతో, అరుపులతో గగ్గోలు.

చేస్తుంటే ఒక వారంరోజులపాటు వొంటిమీద వెంట్రుకలన్నీ నిక్కపొడుచుకొని ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని కాలక్షేపం చేసింది గూడెమంతా.

ఏనుగులు విరిచిన చెట్లు ఎండి, యిక బొగ్గు బట్టీలు ప్రారంభిద్దా మనుకుంటుండగా, అడవిలో కార్చిచ్చు రేగి అడవి చెట్లనే కాక, మా ఆశల్ని గూడ బూడిద చేసింది. మా గడ్డి వాముల్ని గూడ కొంతవరకు పొట్టనబెట్టుకొని పుణ్యం కట్టుకుంది. ఈ కారుచిచ్చు తరువాత తేళ్ళు, మండ్రగబ్బలు తమ నివాసాలు మార్చుకుంటాయో, ఏమిపాడో అవి ఎక్కడ పడితే అక్కడ చీమల్లాగా పాకసాగాయి.

ఇది ఇలా ఉండగా, కోతుల జగడాలొకటి కొత్తగా మొదలై అవి అడవంతా కల్లోలం చేయసాగాయి. కోతుల్లో రాజులూ, రాజ్యాలూ వుంటాయి, నీకు తెలుసో తెలియదో. యుద్ధాలొచ్చాయంటే వాటికి ఒళ్ళు తెలియదు. ప్రాణాలు పోవటమే తప్ప వెనక అడుగు వుండదు వాటికి.

అవి చెట్లు మీంచి చెట్లమీదకు ఒళ్ళు తెలియకుండా పరుగులు పెట్టటాల్లో, ఇళ్ళమీద గూడ దూకటం వల్ల మా వూరిళ్ళు దెబ్బ తినసాగాయి. దాంతో రాత్రిళ్ళు ఏనుగుల కోసం పొలాల కాపలాలే కాక, పగళ్ళు కోతుల కోసం యిళ్ళ కాపలా వొకటి తోడయింది.

ఒకరోజు ఒక ఇంటిమీద పడి రెండు కోతులు పోట్లాడుకుంటుంటే, కర్రపెట్టి అదమాయించబోయిన పాలేరు మీదికి ఆ రెండు కోతులూ కలసి విరుచుకు పడ్డాయి. వాడిని ఆ కోతుల చేతుల్లోంచి తప్పించి బ్రతికించేటప్పటికి మా కందరికీ ప్రాణాంతకమైంది.

కొందరు, కొందరు బైరాగులు వస్తే యీ అడవి జంతువుల గోల తక్కువగా వుండేది. కాని, ఎట్లాగయినా మా అమ్మాయి వెళ్ళిపోయిన తరువాత బైరాగుల రాక బాగా తగ్గిపోయింది. బైరాగు లేమిటనుకుంటున్నావా? మా సంగమక్షేత్రం గురించీ, అక్కడ ఋషీశ్వర సంచారం గురించీ నువ్వు వినే వుంటావుగా. ఆయన దర్శనం కోసం కొందరు గొప్ప సాధకులు, యోగులు, ఉపాసకులు, బైరాగులు వస్తూ ఉండేవారు. నేనప్పట్లో కొంత నాస్తికంగా వుండేవాడిని. నాస్తికం అంటే పూర్తి నాస్తికం కాదు నాది.

మా వెనకాల తరాల్లో యెపుడో జరిగిన ఒక దుస్సంఘటనవల్ల మా యిళ్ళల్లో వ్రతాలూ, దేవతా ఉత్సవాలూ వగైరా అన్నీ మానేశారుట. దానికి తోడు నా దగ్గర కొచ్చేసరికి మరింత పైత్యం తోడయి, నాస్తికం వైపు మొగ్గుగా ఉండేవాడిని. అప్పట్లో నాకీ ఉపాసనలూ, బైరాగులూ మొదలైన వారిమీద చాలా లోకువ దృష్టి ఉండేది. కానీ వాళ్ళంతా సంగమంలో మా యింటికి తప్పకుండా వచ్చేవారు. ఇంటికి వచ్చినవాడు ఎట్టాంటివాడు కానీ, వాణ్ణి ఆదరించాలిసిందే, అని నా సిద్ధాంతం. అందుకోసమే వాళ్ళ సౌకర్యార్థం మా ఇంటి దగ్గర ప్రత్యేకంగా ఒక కొట్టం వేయించాను. అవుట్ హవుస్ అంటే మీ బోటి వాళ్ళకు ఎక్కువ ఇష్టంగా ఉంటుందనుకుంటా,

మా జయలక్ష్మి వీళ్ళందరకూ సేవలు చేస్తూ ఉండేది, అడపా దడపా. ఈ ఉపాసకుల్లో కొందరు వెళ్ళేటప్పుడు నాకో నమస్కారం పారేసి "అయ్యా మాకు, ఋషీశ్వర దర్శనం అయింది. కళ్ళు తెరుచుకున్నాయి. ఇక మేమంతా వామాచారాలు వదిలేస్తున్నాం" అని చెప్పి వెళ్ళేవాళ్ళు.

నా కప్పట్లో వామాచారమంటే ఏమిటో బొత్తిగా తెలీదు. ఇప్పుడు బాగా తెలుసునని కాదనుకో. ప్రతివాడికీ తలో పైత్యం అనుకొని నవ్వుకొనేవాడిని నేను.

ఇంతకూ మా మూడో అమ్మాయి కాపరానికి వెళ్ళాక, ఈ బైరాగులరాక బాగా తగ్గింది. అలా నానా ఇక్కట్లుగా రెండేళ్ళు గడిచింది.

ఈ సందర్భంలోనే సందడిగా మా నాలుగో అమ్మాయి సీత పెళ్ళి గూడ అప్పుడే చేసి కాపరానికి పంపాను. 1942 వచ్చేసరికి జయలక్ష్మిని పురిటికి తేవాలన్నారు. అడవి పరిస్థితిని బట్టి ఎలాగురా బాబూ అని భయపడ్డా. కాని తొలిచూలు, దేశం కాని దేశం, తీసుకు రాకపోతే వాళ్ళే మయినా అనుకుంటారు. పిల్ల నొచ్చుకుంటుంది. అందుకని ఏమయితే అయిందని పిల్లని తెచ్చేశాం.

అయితే చిత్రం, అది వచ్చిన దగ్గర నుంచీ అడవంతా సద్దు మణిగి పోయింది. దానిది మొదటి నుంచీ అదే ధోరణనుకో, ఆ ఏరన్నా, ఆ కొండలన్నా దానికి ప్రాణం. వాటిని చూస్తూ కాలక్షేపం చేసేది. మా జయలక్ష్మి ఆ పట్టునొక ఆరేడు నెల లుందనుకుంటా. ఆ ఆరేడు నెలలు మాకు హాయిగా గడిచినై. కాని అప్పట్లో జరిగిన రెండు సంఘటనలూ నాకు ఇప్పటికీ బాగా గుర్తున్నాయి.

అప్పటికి మా జయలక్ష్మికి యింకా పురుడు రాలేదు. ఒకరోజున చిన్న కోతుల గుంపు వచ్చి కొద్దిగా అల్లరి చేయసాగింది. మా ఆఖరి పిల్ల, అదే పార్వతి, ఇంట్లో వున్న తుపాకీ తీసి పేల్చింది. అంతకు ముందు, అంటే కాపురానికి వెళ్ళక ముందు మా జయలక్ష్మి ఎప్పుడైనా తుపాకీ బుజాన వేసుకొని తిరిగేది గాని ఎన్నడూ పేల్చలేదు. ఈ పార్వతి గూడా ఎప్పుడూ అలా చెయ్యలేదు. ఆ రోజెందుకు చేసిందో చేసింది.

ఆ కోతుల్లో ఒక కోతి కాలుకి గుండు తగిలింది. పక్క నున్న జయలక్ష్మి విలవిలలాడి పోయింది. "ఎంత పని చేశావే చెల్లీ" అంటూ.

"ఏం" అంది పార్వతి మొరటుగా. "కోతుల్ని హింసించరాదు. ఆ కోతి నిన్ను యిప్పుడు శపించింది. దాని వల్ల నువ్వు ఎన్ని కష్టాల పాలవుతావో యేమో! ఏమి చేసేది నే నిప్పుడు" నిజంగానే బాధ పడింది జయలక్ష్మి.

ఇవాళ దీనికి పట్టిన దుర్గతి చూసి, ఆ మాట తల్చుకొని కుమిలి పోతూ వుంటాను నేను లోలోపలే. ఎవరికి చెప్పుకోను బాబూ. ఏం బావుంటుంది ఈ మాట చెప్తే ?

ఇదీ మొదటి సంఘటన.

ఇక రెండవది నా జీవితానికి ముఖ్యమైనది. నా జీవనసరళిలోనే మార్పు తెచ్చిన సంఘటన అవటం చేత దీన్ని గురించి లోతులంటే విచారణ చేసి, దీన్ని అన్ని కోణాలలోంచి పరిశీలించాను నేను. ఇది జరిగేటప్పటికి గూడ మా జయలక్ష్మికి యింకా పురుడు రాలేదు. అంటే మా సత్యనారాయణ ఇంకా తల్లి కడుపులోనే వున్నాడు.

అప్పట్లో మా అబ్బాయి కృష్ణప్ప నాకో సమస్యగా వుండేవాడు. S. S. L. C. తప్పాడు. వ్యవసాయం చేద్దామని ఒకటే ఉబలాటం. దీనికి కావలసిన నిలకడ మాత్రం లేదు. పైగా నేనేదో పాత పద్ధతుల్లో వ్యవసాయం చేస్తున్నాననీ, తనయితే నూతన వ్యవసాయ పద్ధతులన్నీ ప్రవేశపెట్టి ఆ లోయ మొత్తం ఫలవంతపు సాగుచేయ గలననీ పెద్ద ఆత్మ విశ్వాసం. ఇలా వుండేది వాడి పద్ధతి.

నాదగ్గర అటూ యిటూ వున్న నాస్తికం, వాడి దగ్గర కొచ్చేసరికి ముదిరి గిడచబారింది. "ఎవర్నీ నిందించరా" దన్నది నా మతం కాగా "ఈ సాధువులు మొదలయిన వారంతా దొంగలు, వాళ్ళ నేం చేసినా తప్పు లేదని" వాడి సిద్ధాంతం.

క్రమ శిక్షణ లోపం, కృషి లోపం వాడిలో ప్రధాన దోషాలు. అవి వుంటే, ఏ ఖగోళ శాస్త్రపు సైంటిస్టో కాదగ్గ తెలివి వాడిదగ్గర వుంది. రాత్రిళ్ళు ఎప్పుడూ ఆకాశం పరిశీలిస్తూ వుండేవాడు. నక్షత్రాల్ని గుర్తు పట్టేవాడు. అవి ఏ దిక్కుకు నడుస్తాయో చెపుతూ ఉండేవాడు. మొత్తంమీద రాత్రిళ్ళు ఆకాశం పరిశీలిస్తూ ఉండటం వాడికో సరదా. ఇప్పుడు బెంగుళూరులో బిన్నీ మిల్సులో గుమాస్తాగా ఉంటూ పిల్లల తండ్రయినా గూడా వాడికా సరదా పోలేదు.

ఇంతకూ మా జయలక్ష్మి పురిటికి వచ్చి వుండగా ఒక పూర్ణిమ వచ్చింది. నే నేదో పనిమీద కనకాపురం వెళ్ళాను. ఆ రాత్రి అర్ధరాత్రి దాటాక ఒంటేలు కెళ్ళవలసి వచ్చి నిద్ర లేచి, వాకిట్లో కొచ్చాడు కృష్ణప్ప.

వేసవికాలం. అడవిలో ఏటిగాలి, ఆరబోసిన వెన్నెల, నిర్మలమైన ఆకాశం, మిలమిల మెరుస్తున్న చుక్కలు ప్రకృతి ఎంతో మనోహరంగా వుంది. అలా, అలా నక్షత్రాలు చూసు కొంటూ, పడమటి వైపుకు చూశాడు మావాడు. చూసి ఉలిక్కి పడ్డాడు. అక్కడ అర్కావతికి అవతల ఏదో మంట కనిపిస్తోంది. బాగా పరకాయించి చూశాడు.

మా యిల్లు అర్కావతికి పడమర ఒడ్డున ఉంది. మా యింటికి సూటిగా అర్కావతికి అద్దరిని ఒక చిన్న చింతల తోపు వుండేది. దానికి కొంచెం పక్కగా ఒక నలుచదరపు అగ్ని గుండంలో అగ్ని భగ భగ మండుతోంది. ఆ అగ్నిగుండం చుట్టూతా నలుగురు మహర్షులు కూర్చుని హోమం చేస్తున్నారు. వారి నలుగురికన్నా మంచి ఒడ్డూ పొడుగూ వున్న మరో పెద్ద మహర్షిగారు హోమగుండానికి బాగా సన్నిహితంగా దర్జాగా కూర్చుని వున్నాడు. ఆయన హోమం చెయ్యటం లేదు.

మావాడు అలా తేరిపార చూస్తూ నిశ్చలంగా గమనిస్తూ నిల్చున్నాడు. వాడికసలే సాధువు లంటే వొళ్ళుమంట. దానికితోడు మంట వేస్తున్నారు వాళ్ళు, వేసంగిలో అడవిలో చెట్లమధ్య. వీడికది మహాగుర్రుగా వుంది. కాని వాళ్ళంతా పూర్తిగా మహర్షుల్లాగా వున్నారు. పైగా మంచి తేజస్సుగా వున్నారు. వాడికి ఒక పక్క కొంచెం భయంగా గూడా వుంది.

ఇంతలో ఆ పెద్ద ఋషిగారు ఎందుకో తల తిప్పి వీడివంక కోపంగా చూడసాగారు. ఆయన కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయి. దాదాపు రెండు చేతులంత నుదురువుంది. ఆ నుదుట జెర్రిగొడ్డుల్లాంటి విభూతి రేఖలు మెరిసిపోతున్నాయి. ఆయన జుట్టు నడినెత్తిమీదికి యెగదీసి ముడివేసివుంది. ఆయనలా ఉగ్రంగా చూసేసరికి, వీడికి, భయమూ, పౌరుషమూ, పంతమూ, పొగరూ ఎగదోసు కొచ్చినాయి. వచ్చి—

"ఏయ్, ఎవర్రా నువ్వు" అని ఒక కేక పెట్టాడు కోపంగా. వాడప్పటికి పాతికేళ్ళ పొగరు వయస్సులో మదించిన కండరాలతో వున్నాడు. వీడి కేక అందే దూరంలోనే వున్నారు మహర్షులు. ఈ కేక వినబడగానే ఆ పెద్ద మహర్షిగారు కోపంగా చివాల్న లేచి నిలబడ్డారు. ఆయన తెల్లటి పంచ కట్టుకొని వున్నాడు. ఆయన బుజాలమీద ఉత్తరీయం వుంది. ఆయన జంధ్యం మంచి లావుగా వుంది.

ఆయన ఏదో సంజ్ఞ చేశాడు. ఆయన వాళ్ళకి లీడరు గాబోలు. ఈలోగా మా వాడు. "అమ్మా చెల్లీ, రండి రండి. ఒరేయ్ వెంకటూ-రా-రా" అని పెద్దగా కేకలు వేయసాగాడు. పెద్దాయన సంజ్ఞ అందుకున్న నలుగురు మహర్షులూ లేచి నిలబడ్డారు. అందులో ఒకాయన అగ్నిగుండం క్రిందికి చెయ్యి పోనిచ్చి, గుండం గుండం అరచేతిమీద పైకెత్తేశాడు. మరుక్షణం ఆయన ఆ అగ్నితోసహా ఆకాశంలోకి, ఇంకా తూర్పు దిక్కువైపుకి ఎగరసాగాడు, ఇంతలో ఎక్కడి నుంచి వచ్చిందో తెలియదు, ఒక చిన్న పల్లకీ వచ్చింది. పెద్ద మహర్షిగారు దానిలో కూర్చున్నారు. ఆ పల్లకీకి వెనుకా ముందూ ఉన్న కర్రలను ఇద్దరు మహర్షులు బుజాలపైన పెట్టుకొని ఆకాశంలో ముందాయన్ని అనుసరించారు. నాలుగో ఆయన ఆ వెనకాల వట్టి చేతులతో ఆకాశమార్గంలో వాళ్ళను అనుసరించాడు.

మా వాడు చేసిన కేకలకు అందరికన్నా ముందర మా పాలేరు వెంకట వచ్చాడు. వాడొచ్చేసరికి, "పారిపోతున్నాడు, పారిపోతున్నాడు" అని అరుస్తున్నాడు మా వాడు.

వెంకట ఆదుర్దాగా అటు చూశాడు.

వాడికి తూరుపువైపు కొండల్లోకి పరిగెత్తుకు పోతున్న పెద్ద జ్వాల మాత్రం ఆకాశంలో కనిపించింది. మా వాడు చెపుతున్న మనుషులు వాడికి కనపడలేదు. ఈలోగా మా యింట్లో వాళ్ళంతా లేచి వచ్చారు.

మా పాలేరుకి వెంటనే విషయం అర్థమయింది.

" లోపలికి పోరా, లోపలికి పోరా. ఇది అడవిమృగాల సంచారం. ఇవాళ్ళ వున్నవి. ఎవరో అటుకేసి చూడవద్దు" అని అదలించి అంటా కుర్రాడ్ని లోపలికి పంపించాను.

మా వాడు మొరాయించి, కాసేపు ఇంకా పరిశీలించి లోపలికి వచ్చి పడుకున్నాడు. తెల్లారి యెంతకూ లేవకపోయేసరికి, తల్లి వెళ్ళి తట్టింది వళ్ళు కాలిపోతోంది. " అరే, జ్వరం ఎచ్చి నట్టుందే " అనుకొంటూ పలకరించబోయింది.

స్పృహలో లేడు. అది నట్టడవి. వైద్యం అనేమాట అక్కడ స్మరించటానికి కూడా వీలులేదు. ఒకళ్ళిద్దరు లంబాడీలకు కొద్దిగా మూలికా జ్ఞానం వుందిగాని, అది కేవలం చిట్కాల మీద నడుస్తుంది. ఇలాంటి రోగాలకు వైద్యం చేయటం వాళ్ళ వల్ల కాదు.

ఆ సాయంత్రం నేను వూరి నుంచి వచ్చాను. వచ్చేటప్పటికి ఇదీ పరిస్థితి. పిల్లవాడు మన స్పృహలో లేడు. బాగా పరిశీలించిన మీదట తెలిసిన విషయం మరీ భయంకరం. వాడు స్పృహలోనే వున్నాడు, కాని నోరు పడిపోయింది. కదిలే శక్తి చచ్చిపోయింది. నా నవనాడులూ కృశించి పోయాయి. ఇన్నాళ్ళ నుంచీ ఎన్నో ప్రకృతి వైపరీత్యాల్ని ఎదుర్కొని మొండిగా ఆ అడవిలోనే పడివున్నాను. ఇంతవరకూ ఈ రోగాల బెడద రాలేదు. ఇప్పుడు అదిగూడ పైనబడ్డది. అందులోనూ వాడు నాకు ఏకైక పుత్రుడు. చెట్టల్లే ఎదిగి చేతికంది వచ్చినవాడు. వాడికి నోరు పడిపోయింది. చలనం ఉడిగిపోయింది. ఆ అడవిలో నిజంగా పెద్ద జబ్బు చేస్తే రెండే మార్గాలు—దానంతట అది తగ్గిపోవటం, లేదా కాటికి చేర్చటం. ఈ స్థితిలో నా మనస్సెలా నడికిపోయి వుంటుందో ఊహించుకో బాబూ, నువ్వే ఊహించుకో.

దైవానికి రూపమే లేదని, ప్రార్థించిన వారికి మాత్రమే వరాలిచ్చేది దైవం కాదనీ వాదాలు సాగదీసిన నేను, వెనుక ఒక సందర్భంలో సంగమేశ్వరుణ్ణి ఒక ప్రార్థన చేశాను. ఆయన ఆ కోరిక తీర్చాడు. కాని ఆ తరువాత, నా సిద్ధాంత విషయంలో చాలా కల్లోలపడి అలా సంగమేశ్వరుణ్ణి ప్రార్థించటం తప్పేననుకున్నాను, మరి యిప్పుడు నా గతేమిటి? నేనెందరో సాధువుల్ని, సాధకుల్ని ఆదరించాను. కాకులు గూడ దూరని కారడవిలో కొందరు నాకు నమస్కారాలు గూడ పెట్టారు. మరికొందరు వాళ్ళ మహాత్మ్యాలు నాకు చూపారు. కాని ఈ నిమిషానికి నన్ను ఆదుకొనే జీవే లేందే యీ లోకంలో !

ఒంటికి కట్టుకున్న పంచ దానంచేసి, పై మీద ఉత్తరీయం మొలకు కట్టుకొని కొంపకు చేరిన రోజులు అనేకం వున్నాయి. అది పుణ్యమనే ఉద్దేశంతో చేయలేదు. కాని అది పుణ్య కార్యమే నంటారు. కాని నాకీ అపాయ తరుణంలో ఏ పుణ్యమూ అక్కరకు రావటంలేదే ! ఏమి చెయ్యాలి? ఎవరు గతి? రక్షించ దలచుకొంటే ఎవరు రక్షించ గలుగుతారు?

ఇంకెవరు? రక్షిస్తే ఆ సంగమేశ్వరుడు రక్షించాలి. రెండో దిక్కులేదు. ప్రత్యక్ష సత్యాలను సమన్వయించి చూపి, మనకు మరింత విశాల దర్శనాన్ని కలిగించేవే సిద్ధాంతాలు! తను మునకట్టులో ఇమడలేదు గనుక ప్రత్యక్ష సత్యాలనే తిరస్కరించే వాదాలు సిద్ధాంతా భాసాలు మాత్రమే! ఈ వివేకం, ఆ స్వామి కరుణ వల్లనేమో, ఆ క్షణంలో నాకు కలిగింది. వెంటనే వలవలా యేడుస్తున్న నా భార్యను తీసుకొని సంగమేశ్వరుడి సన్నిధికి వెళ్ళాను.

కూలిపోతున్న గుళ్ళో కునికిపాట్లు పడుతున్న ఆ గుప్పెడు స్వామిని చూసి నాకు వళ్ళు తెలియని శివమెక్కి "శివా" అని అరచి, బారలు చాచి, బావురు మని ఏడ్చాను. మోకాళ్ల మీద ఒడ్డిగిలబడి, స్వామిని కౌగలించుకొని కన్నీళ్ళతో అయన విభూతి పిండికట్లు చెరిపాను. స్వామి ఉలకలేదు, పలకలేదు.

నాకు పూజలు చెయ్యటం రాదు. స్తోత్రాలు రావు. కనీసం ఒకర్ని మెరమెచ్చుగా పొగడటం గూడ నాకు చేత గాదు. కష్టాలొస్తే స్వామిని ప్రార్ధిస్తారని వినటమే కాని, నే నెన్నడూ ప్రార్థించిన వాడిని గాదాయె! ఏమి చేసేది? ఏమి చేస్తే ఆయన మనసు కరుగు తుంది? తలకాయ పగల కొట్టుకొనేదా? ఏమీ పాలుపోక వెర్రెత్తిపోతోంది. ఇంతలో నాకు పూనకం వచ్చినట్టొచ్చి స్వామి ముందు చిందులు తొక్కుతూ రంకెలు వెయ్యసాగాను.

"స్వామీ, శివా, సంగమేశ్వరా! భూమి నీ రూపమనీ, సేద్యం నీ అర్చన అనీ, పేదలు నీ పిల్లలనీ నమ్మి, నీ పిల్లలకు నా చేతనయిన సేవ చేద్దామని, యీ కొండకోనల్లో నీ ప్రక్కన చేరానయ్యా. నేను సేవ చెయ్యనే లేదేమో నీ పిల్లలకు! లేకపోతే, నా సేవ నీకు చాలలేదో. పోనీ, నా జన్మలో నే నెవ్వరికీ అపకారం చేయలేదే, మరి ఎందుకయ్యా నా మీద నీకి పగ?

నా కున్నది ఒక్కగా నొక్క కొడుకు. వాడిని గనుక నీవు పొట్టన బెట్టుకొన్నావా జాగర్త. ఆ శవాన్ని నీ వాకిట పాతేసి నీ ఎదుటే కొండెక్కి దూకి చస్తా! ఇది నిజం. గుర్తు పెట్టుకో! ఏమి, ఏమనుకొంటున్నావో" అలా కాసేపు చిందులు తొక్కి యింటి కొచ్చేశాను. అప్పటికి ఏమిటో కాస్త నా మనస్సుకి శాంతి అయింది.

ఇంట్లో రేపో మాపో పురుడు వచ్చే పిల్ల ఒక పక్క; యివ్వాళ్లో రేపో అన్నట్టున్న కొడుకు ఒక పక్క; ఏం చెప్ప మంటావు. మా దంపతుల యమ యాతన. జీవకళ లేని ముఖాలతో పిల్లవాడి మంచానికి చెరో పక్కా చతికిలబడి వున్నాం మేమిద్దరం.

ఆడపిల్లలందరూ బిక్కు బిక్కుమంటూ, ఒదిగి వున్నారు ఒకమూల.

ఒక్కొక్క నిమిషమూ భారంగా దొర్లుతోంది. అప్పుడప్పుడు నాడీ పట్టుకు చూస్తున్న నాకు, అది కూరుకుపోతోందని తెలుస్తోంది. నా మనస్సు క్రమంగా మొద్దుబారిపోతోంది.

ఇంతలో వాకిట్లోంచి ఎవరో కేకేస్తున్నారు, "లింగణ్ణ గార్ల ఎవరండీ" అని.

అది కేవలం కొత్త గొంతు. పైగా ఆ యాస, ఏదో హరిజనుల యాసలాగా వుంది. అప్పటికి రాత్రి తొమ్మిదిన్నరో, పదో అవుతుంది.

"ఇంతరాత్రివేళ ఎవరా" అని విసుక్కుంటూ "నేనే........ ఏంగావాలి?" అంటూ వాకిట్లోకి వెళ్ళాను.

"ఇక్కడెవరికో జబ్బుగా వుందటగా" అన్నాడతను. అతను కొంచెం వృద్ధుడుగా వున్నాడు, నల్లగా వున్నాడు. తెల్లని వెన్నెట్లో అతను బాగా కనిపిస్తున్నాడు గానీ దిమ్మెక్కిన నా మనస్సుకి అంతకన్నా పట్టలేదు.

"ఎవరు చెప్పారు?" అన్నాను.

"ఎవరు చెపితే ఏమిలెండి? ఏం జబ్బు?"

"నీకు వైద్యం వచ్చా"

"బాగా"

"నువ్వే లోపలికి వచ్చి పరీక్షించు బాబూ, పుణ్యం వుంటుంది."

వైద్యం వచ్చన్న జీవి కనిపించే సరికి ప్రాణం లేచి వచ్చింది వాకు. సుడిగుండంలో పడ్డ వాడికి, గడ్డిపరకయినా, పెనుదూలమే మరి!

"నేను లోపలికి రాకూడదు"

"ఏమి"

"నేను పంచముణ్ణి."

"నా కలాంటి బుద్ధులు లేవు బాబూ"

"నా కున్నాయి. మీరు రోగలక్షణాలు చెప్పండి చాలు."

నేను వాదించే వోపికలో లేను. నాకు చేతనయినట్లు రోగ లక్షణాలు చెప్పాను. నా భార్య గూడ వచ్చి మధ్యలో అందుకుంది.

"ఇంతేకదా, ఏం భయంలేదు. దీని మూలిక యిక్కడే వుంది. ఒక్క నిముషం ఆగండి."

ఆ ముసలివాడు, అర్కావతి వొడ్డున వెన్నెట్లో కాసేపు వెతుకులాడి ఏవో ఆకులు తెచ్చాడు. వస్తూనే "మీ యింట్లో ఒక నిండు చూలాలు వుండాలే" అన్నాడు.

"ఉంది, ఏం" అన్నాను నేను.

"ఈ ఆకులు ఆవిడచేత నూరించి, రసం తీసి ఆవిడచేత రోగి నోట్లో పోయించి, ఏమయిందో నాకు చెప్పండి" అని ఆకు లిచ్చాడు ముసలివాడు.

ఆ ఆకులు ఆ చుట్టు పక్కల ఎప్పుడూ చూసిన గుర్తు లేదు నాకు. మా జయలక్ష్మి రసం తీసింది. నేను అట్లకాడ పళ్ళ సందున పెట్టి నోరు పగలతీసి పట్టుకోగా రసం గొంతులో

పోసింది జయలక్ష్మి. రెండు నిముషాల్లో మొత్తం కక్కేశాడు పిల్లవాడు. ఆ మాట నేను చెప్పగానే " అదృష్టం " అన్నాడు ముసలివాడు.

" వాడు మందు కక్కేశాడని నాకు భయంగా వుంది బాబూ, నువ్వు కాస్త లోపలికి వచ్చి చూడు " అని మళ్ళీ బ్రతిమాలాను వృద్ధుణ్ణి.

" నేను చెప్పాను కదండీ, నాకు నియమం వుంది. మళ్ళీ ఆ తల్లిచేత మరోసారి రసం తీసి పోయించండి" అన్నాడు అతను.

ఈ మాటు కక్కలేదు గాని కుర్రవాడి వొళ్ళంతా చెమటపట్టి వొణికిపోయి, మంచం మీద యెగిరెగిరి పడసాగింది. ఆ మాట చెపితే " బ్రహ్మాండం, బాగా పనిచేసింది మందు. ఇంక మళ్ళీ రసం పోయక్కరలేదు, వేరే మందూ అక్కరలేదు. క్రమంగా నీరసానికి మందిప్పించుకోవచ్చు" అన్నాడు వృద్ధుడు.

నేను మళ్ళీ పిల్లవాడి దగ్గరకు వెళ్ళాను. వాడు మెల్లిగా కళ్ళు తెరిచి చూశాడు. యేమీ మాట్లాడ లేకపోతున్నాడు. కాలూ చెయ్యీ కదల్చలేకపోతున్నాడు. నేను వృద్ధుడితో చెబుదామని మళ్ళీ వాకిట్లోకి వెళ్ళాను. అత నక్కడలేడు.

"తాతా!" అని బిగ్గరగా పిలిచాను. బదులు లేదు. మా పాలేర్ని పిలిచాను. వాడూ, నేనూ చెరోపక్కా వెతికాం. దగ్గరలో వున్న లంబాడీ మిత్రులు గూడ వెతికారు. అతని జాడలేదు. దిగులుగా యింట్లోకి వచ్చాను.

" ఆయన యింకెక్కడ కనిపిస్తార్లే నాన్నా ! భయంలేదని చెప్పారుగా " అంది మా జయలక్ష్మి.

నాడి అందుకుంది. చెంచాతో పాలుపోస్తే గుటకవేస్తున్నాడు. స్పృహవుంది.

" సంగమేశ్వరా రక్షించావయ్యా— రక్షించావయ్యా "

ఈ రెండు మాటలే తప్ప, మూడోమాట నా మనస్సులోకి రాలేదు. ఆ స్వామిని పొగుడుదామంటే, కృతజ్ఞతలు చెల్లించుకుందామంటే, మాటే తోచదు. ఏమిటి చేసేది నేను ?

బాబూ, ఆ నా స్థితిని నువ్వు వూహించగలవా ? వంద సిద్ధాంతాలూ, వెయ్యి ఉపన్యాసాలూ, లక్షవాదాలూ దిగతుడుపు కాదా, నా అనుభవం ముందు ? నా కొడుకు చచ్చి బతికాడు ! సంగమేశ్వరుడి లెక్కలో నేను మళ్ళీ పుట్టాను.

ఆ మరునాడు కనకపురంనుంచి ఆయుర్వేద వైద్యుణ్ణి పిలిపించాం. ఆయన పరిశీలించి చెప్పాడు. " జరిగింది, దైవ వైద్యంగాని మానుష వైద్యం కాదు. ఇపు డీ కుర్రవాణ్ణి పది రోజుల పురిటికందు అనుకొని, మీరు సాకాలి. అదీ యితని స్థితి. జాగ్రర్త" అని........

వైద్యం సాగింది. మూడు నెలలకు పిల్లవాడు మంచంమీద ఇటునుంచి అటు దొర్లాడు. ఆరు నెలలకు మాట్లాడ గలిగాడు. పూర్తిగా స్వస్థత చిక్కేసరికి ఏడాది దాటింది. ఏమయినా యిప్పటికీ వాడిమాట మాత్రం కొంచెం ముద్దే. వాడి పొగరుకి గుర్తుగా అది మిగల్చదల్చు కున్నాడు గాబోలు సంగమేశ్వరుడు.

ఈ సంఘటనవల్ల విశ్వవ్యాప్తంగా వున్న, అనంత దైవమూర్తికి ప్రతీకగా, గుర్తుగా, మన ఏకాగ్రతకి ఆధారంగా, ఒక పరిమితమైన ఆకారాన్ని మనం స్వీకరించినంత మాత్రాన ఆ దైవానికున్న విశాలత్వం తగ్గదనీ, శక్తి కొరవడదనీ, సరిగదా ఆ విశాలత్వం, ఆ శక్తి సులభంగా, శీఘ్రంగా మన అనుభవంలోకి వస్తాయనీ నాకు నిరూపణ అయింది.

ఈ నిరూపణ అయిన ఒకటి రెండు వారాలకే, మా అమ్మాయికి పురుడు వచ్చింది. ఇదిగో ఈ సత్యనారాయణ పుట్టాడు.

## స్థానచలనం :

ఆ సంవత్సరమే మా నాలుగో అమ్మాయి సీతకు పెళ్ళి చేసేశాను.

ఆ పై సంవత్సరం వచ్చేసరికి మళ్ళీ మా అడవి వ్యవసాయం ఒడుదుడుకుల పాలయింది. ఆర్థికస్థితి గూడ చిక్కుల పాలవసాగింది. దాంతో మా కుర్రవాణ్ణి ఉద్యోగంలో పెట్టటానికే నిశ్చయించుకొన్నాను. వాడు బెంగుళూరు వెళ్ళి మెల్లగా చిన్న మిల్లులో ఉద్యోగం సంపాదించ గలిగాడు.

ఆ ప్రాంతాలలోనే, కొంచెం వెనకా ముందుగా మా పార్వతి, అదే యిప్పుడు స్కూలు నడుపుతున్న పార్వతి పెళ్ళి చేశాను. ఈలోగా మా జయలక్ష్మికి మరో ఆడపిల్ల పుట్టింది. ఆ పిల్లే యీ పెళ్ళికూతురు వరలక్ష్మి. ఈమాటు పురుడు పోయటం మనవల్ల కాలేదు. వెంకమ్మ గారని, దాని ఆడపడుచు ఒకావిడ వుండేది. ఆవిడ చాలా గొప్ప మనిషిలే. ఆవిడే మా జయలక్ష్మిని తల్లిలాగ చూసుకొనేది. పురుళ్ళూ, పుణ్యాలూ అన్నీ ఆవిడే చూసుకొనేది.

మా నాలుగో పిల్ల సీతకీ, మా జయలక్ష్మికీ ప్రాణస్నేహంగా వుండేది. ఒకసారి యీ సీత చుట్టంచూపుగా బొమ్మెపర్తి, మా జయలక్ష్మి వాళ్ళ వూరు వెళ్ళింది. అక్కడ దానికి వున్నట్టుండి యేదో జబ్బు చేసింది. మా జయలక్ష్మి మొగుడు మంచి వైద్యుడే కాని, అతని కా రోగం అంతుపట్టి లేదు. గంటల్లో ఆ రోగం వికటించి అక్క చేతుల్లోనే కన్ను మూసింది సీత.

బాధ్యతలన్నీ తీరాయనీ, ఇక గట్టెక్కుతున్నామనీ అనుకునే తరుణంలో యీ గర్భ శోకం మా గుండెల్లో గునపపు పోట్లు వేసింది. నా ప్రారబ్ధం అక్కడితో ఆగలేదు. ఇదిగో

యీ పార్వతికి యీ గతి పట్టింది. వెనకటి జన్మల్లో నే నెంత ఘోరపాపాలు చేశానో నిరూపించాడు సంగమేశ్వరుడు.

దీన్ని పరామర్శించడానికి వచ్చే సమయానికి గర్భవతిగా వుంది మా జయలక్ష్మి. దాన్ని చూస్తేనే కౌగలించుకొని "అక్కా, నా బతు కిట్లా గొడ్డుమోతు బతుకు చేశాడే దేవుడు. నన్ను కనికరించి నీకు పుట్టే బిడ్డను నా కిస్తావా?" అని గోడుగోడున ఏడ్చింది పార్వతి. జయలక్ష్మి మా పార్వతిని అనేకవిధాల ఓదారుస్తూ "తప్పకుండా యిస్తాను. మగబిడ్డ పుట్టినా, ఆడబిడ్డ పుట్టినా నీకే యిస్తాను, నువ్వే పెంచుకుందువుగాని. అసలయినా నా బిడ్డ లందరూ నీ బిడ్డలేనే, భేదమే లేదు" అంది.

మా జయలక్ష్మి మొగుడు పరమ కోపిష్ఠివాడు. అతని అనుజ్ఞ లేకుండా యిది బిడ్డ నిస్తానని మాటిస్తోందే అని నేను కంగారుపడి "ఊర్కోండి ఊర్కోండి, తరువాత చూద్దాంలే" అని సద్దెయ్య బోయాను.

"సందేహం లేదు నాన్నా. నేను చెప్పినట్టే జరుగుతుంది." అన్నది మా జయలక్ష్మి.

ఓదార్పు మాటలకు పెద్ద పట్టింపేమిటిలే అని నేనుగూడ అశ్రద్ధ చేశా నా మాటల్ని. అప్పుడు పుట్టిన పిల్లే సరస్వతి.

బాబూ, దెబ్బమీద దెబ్బ, పోటుమీద పోటు అంటే యింతకన్న వేరే వుంటుందా? నా దౌర్భాగ్యపు బతుకు ఎలాంటిదో నీకు అర్థమవుతోందిగా? ఇక్కడితో ఆగితే అది నాలాంటి పాపిష్ఠివాడి కథ ఎలా అవుతుంది? విను మరి. బాల విధవ, చదువులేదు. అత్తవారివేపు ఆదరణ లేదు. మా కుర్రవాడి తాహతు వాడిబండి లాక్కోటానికే కటకట లాడుతోంది. ఇక పార్వతి గతేమిటి? అరవయ్యోపడిలో పడుతున్న నేను దాని జీవికకోసం ఏం చేయగలను? ఈ వ్యథ అహోరాత్రాలూ నన్ను పిండి, పిల్చి పిప్పిచేసి చివరికి రోగిష్ఠివాణ్ణి చేసింది. మా ముసలిదాని మాట యిక చెప్పనే అక్కరలేదు. ఈలోగా మా ప్రాంతంలో చిరుతపులుల బెడదొకటి కొత్తగా తయారయింది. నా మేకల మందల్లో ఒకటో రెండో పులులవాతను బడితే, నాకది బాగా నాటలేదు గాని, నా దొడ్లో కట్టివున్న ఆవుల్ని రెండింటిని చిరుతలు లాక్కుపోయినపుడు వలవలా ఏడ్చేశాను. నా కన్నకూతురు సీత పోయినపుడు గూడ యేడవలేదు నేను. పాడి గొడ్లంటే అంత ప్రాణం నాకు.

దీంతో సంగమం మీద, ఆ వ్యవసాయం మీద పూర్తిగా మనస్సు విరిగిపోయింది. పార్వతిని కాస్త చదివించి దాని కాళ్ళమీద అది నిలబడేట్టు చెయ్యక తప్పదని గూడా క్రమంగా తెలిసివచ్చింది.

సొంతవూరు సోగాలలో పొలాలమ్మి ఏదో బ్రహ్మాండం బద్దలు చేద్దామని అక్కడ కొన్నాను. చెంగు నెత్తినేసుకుని అక్కడనుంచి నేను లేచి వచ్చేటప్పుడు ఆ పొలాలు

కొంటానని ముందుకొచ్చేందుకు నాలాంటి తలకుమాసిన వెధవ మరో డెవడుంటాడి భూమి మీాద. అందువల్ల అక్కడి పొలాలు, అక్కడి పాకలు. అక్కడి మేకలు అక్కడే విడిచేసి పాడి పశువులను మాత్రం వెంట బెట్టుకొని సంగమేశ్వరుడి కొక నమస్కారం పెట్టి ఈ మైసూరికి లేచి వచ్చేశాను.

బుద్ధి తెలిసినదాదిగా. వాడకట్టు కంతటికీ పాలూ పెరుగూ పంచి సంతోషించిన ఈ చేతుల్తో, యీ అపర వయస్సులో, గొడ్లను పిండి పాలమ్ముకోటం మొదలెట్టాను. వెన్ను ముదిరి దుఃఖంలో మునిగివున్న యీ పిల్లకు ఏం చదువు ఎక్కుతుంది చెప్పు. అందుకని ఏదో కాస్త హిందీ చెప్పించ సాగాను. తరువాత ట్యూషన్లు అలవాటు చేసి మెల్లిగా ఈ శిశువిహారం పెట్టించాను. 1952లో మళ్ళీ గర్భవతి అయిన మా జయలక్ష్మికి, పూర్వం మూడు కానుపులకూ లేనిది, ఈమాటు ఒక వేవిళ్ళ కోరిక పుట్టిందట. తన బంధువు లందరినీ చూసి వాళ్ళందరికీ తన కుటుంబపు గ్రూపు ఫోటో ఒకటి ఇవ్వాలనేదే ఆ కోరిక. వింత కోరికే మరి. ఈ కోరిక తీర్చటం కోసం, దాని ముగుడు దాన్ని బెంగుళూరు, బన్నీరుగట్ట మొదలైన వూళ్ళన్నీ తిప్పాడు. పిల్ల వచ్చింది, ఫోటో యిచ్చిందని మేమంతా పొంగిపోయాం. అంతకు మించిన తెలివి మా కెక్కడ వున్నది?

అయిపోయిందనుకుంటున్నావా? పాపాలపుట్ట బాబూ, ఈ పాడు బతుకు! ఆగి ఆగి పగిలి పేలిపోతూ వుంటుందే, అలాంటి అగ్ని పర్వతం ఈ లింగణ్ణ జీవితం. ఒకరోజున మా జయలక్ష్మికి మళ్ళీ మొగ పిల్లవాడు పుట్టాడని ఉత్తరం వచ్చింది. సంతోషపడ్డాం. వీలు చూసుకొని ఓసారి వెళ్ళివద్దాంలే అనుకుంటున్నాం. ఈలోగా శంకర జయంతి వచ్చింది. శంకర జయంతి అంటే మా జయలక్ష్మి పుట్టినరోజు. ఆ రోజు దాని పేరుతో సంతోషంగా పరమాన్నం వండుకు తిన్నాం. ఆ రాత్రికి టెలిగ్రాం వచ్చింది, "జయలక్ష్మి పోయింది. వెంటనే రమ్మ"ని.

నేను చచ్చానో, బతికే ఉన్నానో తెలియలేదు కొంతసేపు. అది తెలిశాక, మా ముసలమ్మను బ్రతికించుకోటం ఎలాగో అర్థం కాలేదు. అయినా మావి మొండి బతుకులు. ఇద్దరి కూతుళ్ళ ఆయుస్సూ, అల్లుడి ఆయుస్సూ గూడ మేమే పోసుకొని యింకా బతికే ఉన్నాం. నెత్తీ నోరూ కొట్టుకుంటూ బొమ్మెపర్తి పరిగెత్తాం.

చివరి చూపు గూడ దక్కలేదు మాకు. ఏం చెప్పను బాబూ, అక్కడి పరిస్థితి. అక్కడి మనుష్యులు రాతి బొమ్మలకి కీయిస్తే కదులుతున్నట్టు కదులుతున్నారు. ఏమి మాయో, అక్కడి కెళ్ళాక మేమూ అట్లాగే అయిపోయాం. ఒక ఏడుపు లేదు, ఓదార్పు లేదు, పలకరింపు లేదు, అసలు ఆలోచనే లేదు.

పాలు తాగే సరస్వతీ అంతే, పదేళ్ళ సత్యనారాయణా అంతే, పండితుడు మా అల్లుడూ అంతే, పామరులం మేమూ అంతే. బైటవారు, వూరి వారూ అంతే. కర్మలు మాత్రం విస్తారంగా శాస్త్రీయంగా సాగిపోతున్నాయి.

పన్నెండో రోజు తెలిస్పెచనమైంది. పుంపి ఒగిల కొట్టినట్టు ఒక్కున యేడవసాగాడు. మా అల్లుడు నరసింహశాస్త్రి. ఆ శోకానలం, నిముషంలో యింటిల్లపాదినీ ముట్టించింది. ఇల్లు శోకమయమై పోయింది. ఆ దుఃఖదావానలానికి నాలుగు ఓదార్పు మాటలు చెప్పి నీళ్ళు చల్లిన వారు యిద్దరే యిద్దరు. ఒకరు పాపం, ఏల పండిన వృద్ధురాలు వెంకమ్మగారు, రెండవవాడు పసివాడు సత్యనారాయణ.

మేం అక్కడ వుండగానే, ఆ పుట్టిన పురిటి కందు పోయాడు. యీ లోకంలోకి ఆ జీవి ఎందుకు వచ్చాడో, ఎందుకు పోయాడో గాని వాడు పోతే పోయాడని అనుకున్న జీవే లేదు యీ లోకంలో.

మా అల్లుడు పండితుడే, మంచివాడే కాని, అతని ధోరణి విచిత్రమైంది. అతనిది వైరాగ్యమో, కేవలం తామసమో యిప్పటికీ నా కర్థం కాదు. మా అమ్మాయి అతనికి రెండో భార్య. పెక్క పుట్టినప్పుడు చీదరించు కుంటే చీదరించుకొనే వాడుగాని అతని హృదయంలో ఇదంటే గొప్ప గౌరవం వుండేది. దీని మరణంతో, అతని మనస్సు పూర్తిగా తల్లక్రిందులయి పోయింది. మాకూ అయింది. అయితే అతని దగ్గర ఆ వెర్రి వుందిగా. దాని వల్ల "లక్ష్మి లాంటి భార్య పోయినాక, ఈ పిల్లల సంగతి నా కెందుకు, నేను పట్టించుకో" నని భీష్మించుకు కూర్చున్నాడు.

"సరస్వతిని ఎలాగా మా పార్వతి పెంచుకొందామని కొంటోంది. ఇస్తానని తల్లి వాగ్దానం చేసింది. కనుక దాన్ని మేం తీసుకుంటాం" అన్నాము.

మరి మిగిలిన యిద్దరి సంగతి ?

తల్లి పోయి అలమటిస్తున్న ఆ పసికూనల్ని "మేమున్నాం" అని చేరదిసి ఆదరించే దిక్కు లేకపోగా బావిలోకి విసిరి పారేస్తానని చిందులు తొక్కసాగాడు వన్ని తండ్రి. అదీ అయిన పాండిత్యం. దాంతో గుండె చెరుపై ఏమయితే అది అవుతుందని ఆ పిల్లల్ని గూడ మేమే తెచ్చుకున్నాం.

కాని యిక్కడకు రాగానే, యీ సత్యనారాయణకు, గొంతులో గడ్డ లేచి పెద్ద జబ్బు చేసింది. పి దగ్గర దాపరిక మందుల్, ముగ్గురు పిల్లల్ని ఒకేసారి భరించటమూ అసాధ్యమే అయింది. దాంతో మెల్లగా పై వాళ్ళిద్దరిని ఎనక్కి పంపేశాం. బాధ్యత పుత్తిన పడితే తండ్రే చూస్తాడ్లె, చూడకేం చేస్తాడనే ధైర్యంతో పంపేశాం.

కాని చివరికి పిల్లలు అసలే ఏ ఆధారమూ లేని ఆ మేనత్త వెంకమ్మగారి పాలబడ్డారని తెలిసింది. చాలా బాధ పడ్డాను. కాని చెతకానప్పు డేంచేస్తాం ? ఊరుకొన్నాను. ఇంతలో ఆవిడ పోనే పోయిందన్నారు. ఈ పిల్లలు సవితి అన్నగారి దగ్గర చేరారు. అక్కడ వీళ్ళకి అతక లేదు. అది లోక సహజమే. ఒకర్నని లాభ మేమిటి ?

ఆ తల్లిలేని, రెక్కలురాని పసి పక్షులు వచ్చి, "తాతా, యిదీ మా పరిస్థితి" అంటుంటే, యేం చెయ్యాల నేను? ఎంత పనికిరాని వాణ్ణయినా, మనిషి జన్మే కదటయ్యా నాది! "రాండిరా బాబూ, రండి" అన్నాను.

మా జయలక్ష్మి మాట ఈవిధంగా ఋజువయింది. ఈ పార్వతి కూడ వాళ్ళని కడుపులో పెట్టుకొని నాకు ప్రాణం పోస్తోంది.

బాబూ, యిదీ నా చరిత్ర. పాపిష్టిచరిత్ర. ఇపుడు చెప్పు బాబూ! నన్నేం చేయ మంటావు? ఆ తండ్రిలాగే నన్నుగూడ పిల్లల్ని బావిలోకి తోసేయమంటావా? ఆ మేనత్త లాగా నన్నే చావమంటావా? పోనీ పిల్లలకు ఆస్తి పోట్లాటలు నేర్పమంటావా? ఇదయ్యా గోడు. బాబూ! నా వల్ల తప్పుంటే జంకు లేకుండా చెప్పు."

## కళ్యాణ సిద్ధి :

కథంతా విన్న మధ్యవర్తి కళ్ళు చెమర్చినాయి. అతను, "తాతగారూ! మీరు ఋషి వంటివారని ఇదివరకే అనుకున్నాను. నేను మందమతిని. మీరు సాక్షాత్తూ మహర్షులు. నన్నాశీర్వదించండి." అని వంగి నమస్కారం చేశాడు.

ఈ మధ్యవర్తి కృషివల్ల, ఆ తరువాత సంబంధపు సంప్రదింపులలో వచ్చిన ఒడుదుడుకు లన్నీ సర్దుకున్నాయి.

ఎలాగయితేనేమి సత్యనారాయణ, పార్వతమ్మ యింటికి చేరేసరికి—

"ముహూర్తం పెట్టేశాం" అన్నాడు లింగణ్ణగారు సంతోషంగా.

1961 మే నెల ఎనిమిదవ తారీఖున ముహూర్తంట. ఇంకా నెలరోజులు గూడా వ్యవధి లేదు. ఎలా చెయ్యాలి? ఏం చెయ్యాలి? అంతా తత్తరపాటుగా వుంది సత్యనారాయణకి.

పది పైసలు అప్పు అడగటం చేతకాని సత్యనారాయణ తనకు తెలిసిన ప్రతిచోటా అప్పడిగాడు. తను పాలు పోసే యిళ్ళల్లో, ట్యూషన్లు చెప్పే యిళ్ళల్లో గూడ అప్పు అడిగాడు. ఎవరెంత యిస్తే అంత పుచ్చుకొన్నాడు గాని తన ఆసనాల విద్యార్థులు మాత్రం తనకి ఏమీ యివ్వరాదని శాసించాడు. ప్రతిచోటా ఎంతో కొంత వచ్చింది. ఎంత వచ్చినా మొత్తం చేతిలో సొమ్ము మూడువేలు కాలేదు. ఆ సమయంలో ప్రతి రూపాయి నోటూ, పంది రూపాయల నోటుగా కనిపించేది సత్యనారాయణకి. ప్రతి పైసా బంగారపు కణికగా కనిపించేది. రాత్రింబవళ్ళు 'ఉన్న సొమ్ముతో సర్దుకోటం ఎలా?' అనే ఆలోచనే.

కావలసిన సరుకుల వెలలు తగ్గించలేం, భోజనాల ఖర్చు మానలేం, ఇక తగ్గించగలది యేముంది? ఒక్క పని మనుషుల ఖర్చే వుంది.

నిలకడగా గడియసేపు ఇంట్లో నిలవటం, ఎన్నడూ ఎరగని సత్యనారాయణ కుంచె చేత పట్టుకొని యింటికి సున్నాలు వేయసాగాడు. అలవాటు లేని ఆ పనికి లేత చేతులు బొబ్బ లెక్కినై. చేతులు బొబ్బలెక్కితే అతను నొచ్చుకోలేదు. సున్నపు ధార, నేలను పడిపోతే మాత్రం అతను విలవిల లాడాడు. సున్నం, సున్నంగా కనిపించటం లేదతనికి. అది పైసలుగా, రూపాయలుగా కనిపిస్తోంది. ఆ తరువాత ముక్కులకు గుడ్డలు కట్టుకొని కారాలు కొట్టాడు. కట్టెలు మోసుకొచ్చాడు, చేతులు బొబ్బ లెక్కేదాకా, గీసుకుపోయి పుళ్ళు పడే దాకా.

ఒకపక్క తన ట్యూషన్లు, గొడ్లపని, పాల అమ్మకం చూసుకొంటూనే వున్నాడు. మరో పక్క పెళ్ళి పనులు — కాదు పెళ్ళి కూలీ చూసుకొంటూనే వున్నాడు. ఒకసారి పని చేస్తూ రొప్పుతుండగా వరలక్ష్మి ఎదురుగా వచ్చింది.

" చూడు, నీ పెళ్ళికి ఎంత కష్టపడుతున్నానో! ఇక్కడితో ఈ కష్టం ఆఖరు. సరస్వతి పెళ్ళికి చూడు, నాకింత కష్టం వుండదు " అన్నాడు సత్యనారాయణ.

ఫక్కున నవ్వింది పెళ్ళికూతురు.

" ఏం నాయనా, అప్పటికి నీకు పెద్ద ఉద్యోగం దొరుకుతుందా? దొరవై పోతావా?" అని మొహంలో మొహం పెట్టి రాగాలు తీస్తూ వెక్కిరించింది.

" చూద్దువుగాని " అన్నాడు సత్యనారాయణ మళ్ళీ పనిలో బడుతూ.

పెద్ద వ్యవహారాలు లింగణ్ణగారు చూచుకొంటున్నాడు. శుభలేఖల దగ్గర కొచ్చేసరికి చిన్న సంకటం వచ్చింది. అవి తెలుగులో వేయిస్తే, శాస్త్రిగారూ వాళ్ళు సంతోషిస్తారు. కాని మైసూరులో అవి ఉపయోగించవు. రెండు భాషల్లో వేయిద్దామంటే అది డబ్బుతో కూడిన పని. ఎటూ చెప్పేందుకు వీలు లేకుండా వుంది. ఇక, తాను ఆ విషయం పట్టించుకోకుండా ఉండటం మేలనిపించింది సత్యనారాయణకి.

శుభలేఖలు కన్నడంలోనే అచ్చయ్యాయి. అచ్చయ్యాయి కాని అవి లింగణ్ణగారి పేరుతో అచ్చయి వున్నాయి. పెద్దవాడు గనుక ఆయన పేరుతో వేయటం, యీ కన్నడ ప్రాంతపు ఆచారం. ఆంధ్రప్రాంతీయుల కది నచ్చదు. నిజమే. కాని దాన్ని సరి చేయాలంటే, అది డబ్బుతో పని. డబ్బు, అమ్మో డబ్బు ?

సత్యనారాయణ మౌనంగా వూరుకుండి పోయాడు. అతననుకొన్న ప్రతిస్పందన రానే వచ్చింది. ఆ శుభలేఖ చూసిన శాస్త్రిగారు భగ్గుమన్నాడు. ఫలితంగా ఆయనేగాక ఆయన వర్గం వారెవరూ పెళ్ళికి రాలేదు. అది అతనికీ, వరలక్ష్మికీ గూడ బాధే. కానీ చెయ్యగలిగింది ఏముంది? లేనివాడు అన్ని బాధలూ భరించవలసిందే!

పెళ్ళివారు వచ్చారు. పాపం వాళ్ళు తమ పరివారం పరిమితం చేసుకొని పొదుపుగానే వచ్చారు. కానీ వచ్చిన కొద్దిమందికి గూడ యిక్కడి ఏర్పాట్లు తగిన స్థాయిలో లేవు.

ఇంట్లోనూ, పందిట్లోనూ, ట్యూబులైట్లు విస్తారంగా ఏర్పాటు చెయ్యలేకపోయి నందువల్ల పెళ్ళివారు పెట్రోమాక్సు లైట్లతో సరిపుచ్చుకోవలసి వచ్చింది.

మేళతాళాలు ఆడపెళ్ళివారు యేర్పరచటం కన్నడ దేశంవారి ఆచారం. ఇక్కడ ఆడపెళ్ళివారు ఏర్పరచిన డప్పులమేళం మగపెళ్ళివారి హేళనకు పాత్రమైంది. అసలు పెళ్ళిళ్ళలో ఇరువర్గాల వారికీ కలహం లేచి, కంఠాలు సారించుకోకపోతే, ఒక లాంఛనానికి లోటయినట్లే. మితిమీరి విరసించి, వికటించకుండా వున్నంతవరకూ మగపెళ్ళివారి దర్జాలనూ, వారు లేవనెత్తే గిల్లికజ్జాలనూ లాంఛనాలుగానే ఆహ్వానించవచ్చు.

ఈ పెళ్ళిలో పై బంధువుల నందడివల్ల, ఒకోసారి ఆ పరిమితి దాటిపోతుందేమో అనిపించింది కాని పెళ్ళికొడుకు సౌజన్యం ఎక్కడికక్కడ అడ్డుకట్టలు వేసింది. ఉభయవర్గ మిత్రుడైన పోస్టల్ ఇన్స్పెక్టర్ కృష్ణప్పగారి సౌహార్ద్రం గూడ బాగా అక్కరకు వచ్చింది.

పెళ్ళిలో యిరుపక్షాలవారిలోనూ బంధువుల సంఖ్య తక్కువే. తీరా భోజనాల దగ్గరకు వొచ్చేసరికి జనం కిటకిట లాడిపోయారు. ఆ జనాన్ని చూసి, ఒకటే చిందులేయసాగింది పార్వతమ్మ.

"ఈ వెధవకి ప్రతివాడూ స్నేహితుడే. సాయిబ్బులూ స్నేహితులే, కొండరాజులూ స్నేహితులే. ఎలకలవాళ్ళూ స్నేహితులే, పాములవాళ్ళూ స్నేహితులే. మళ్ళీ పాటకచేరీలు చేసే సంగీతకారులూ స్నేహితులే, హరికథా భాగవతార్లూ స్నేహితులే. స్కూల్లో టీచర్లూ స్నేహితులే, పేటలో నాటకాలవాళ్ళూ స్నేహితులే. ఈ అడ్డమైన జనమూ పెళ్ళిపెళ్ళని వచ్చి పడ్డారు. చేసిన వంట వందమందికికూడ చాలదు. మీ చావు మీరు చావండి" అని, విసుక్కొని మొహం చాటేసి ఆమె ఎక్కడికో పోయింది నిస్సహాయంగా.

సత్యనారాయణ మాత్రం "దేవుడున్నాడు, కానీండి" అని వడ్డన చేయించసాగాడు. మొత్తం వెయ్యి మంది తిన్నారు, మళ్ళీ గుండిగ దిగలేదు. ఆ వంటే సరిపోయింది. ఎలా జరిగిందో ఎవరికీ తెలియదు. ఎవరూ పట్టించుకోలేదు. ఈ లోగా మగపెళ్ళి వారు విడిదిలో లేవదీసిన చిన్న కలహంతో, ఈ విషయం ఎవరికీ పట్టకుండా పోయింది.

ఏమయితేనేం, వరలక్ష్మి కాపరానికి వెళ్ళింది. సత్యనారాయణ తృప్తిగా నిట్టూరుస్తున్నాడు కాని, మరోవంక ఊపిరాడనీయని ఋణ భారం అతన్ని కృంగదీస్తోంది. అయినా అది అతని ఆత్మకు, అంతగా పట్టినట్టు లేదు.

"నా జీవితంలో ఒక ఘట్టం పూర్తయింది" అనుకున్నాడు తను హాయిగా.

ఈ తృప్తయితే వుంది గాని, అతని జీవితంలో రాబోతున్న కొత్త మలుపు అతన్ని మరింత నలిపివేయ సాగింది.

ఒక రోజున_

బ్రతుకు బరువు

"ఏరా, మన మేమిటో, మన పరిస్థితేమిటో, మన తాహతేమిటో నీకేమన్నా ఆలోచన వుందా ?"

"ఇప్పుడేమైంది ?"

"మనకే మాత్రం అప్పులున్నాయో, ఆ బరువేమయినా నీ ఏనుగు చర్మానికి తెలుస్తోందా?"

"తెలీక ఏమైంది ?"

"తెలిసే ఈ పని చేశావా ? ఏళ్ళు వస్తున్నాయి, బుద్ధి వుండక్కర్లా ?"

"ఏమయిందో చెప్పకుండా ఎందుకలా నోరు పారేసుకుంటావ్ ?

ఈ అరుపులు ఏమీ బాగా లేవు లింగణ్ణగారికి. నా కెందుకులే అని ఎంత వూరుకున్నా, ఊరుకోలేక___

"ఎందుకమ్మా పక్క యింటి వాళ్ళకు గూడ వినిపించేట్లు అలా అరుచుకొంటావు. ఏమయింది యిప్పుడు ?" అని పార్వతమ్మకు అడ్డం తగిలారు.

"ఆ ........ ఆ ........నువ్వు గూడా వాణ్ణి అట్టానే వెనకేసుకురా. ఇహ నేనొక్కతెనూ యీ సంసారమంతా యీదుతాను" అని బుడుంగున కళ్ళనీళ్ళు పెట్టుకుంది, పార్వతమ్మ.

"ఏరా, ఎందుకు దాన్నేడిపిస్తావు ? అది మీ కోసమే కదరా కష్టపడుతోంది ? ఆలోచించావా ?" తాతగారు సత్యనారాయణను గూడా మందలించారు.

"అబ్బే, ఎదిరించలేదు తాతా ! అసలు విషయమేమిటని అడుగుతున్నానంతే" తాతగారు రంగంలోకి వచ్చే సరికి సత్యనారాయణ మెత్తబడి పోయాడు.

"ఏం చేశాడమ్మా, ఈ బడుద్ధాయి." అన్నాడు లింగణ్ణగారు సాదరంగా పార్వతమ్మతో.

ఈ లాలనతో కొంత తేరుకొని ఆవిడ అసలు విషయం బైటపెట్టింది.

"అదికాదు నాన్నా, నిన్న సాయంత్రం వచ్చి ఎవరో వీడికి పాతిక రూపాయ లిచ్చి పోయారు. వాళ్ళ పిల్లవాడు తప్పి పోయాడట, వీడేదో మిడతంభొట్లు ప్రశ్న చెప్పాడుట. ఆ ప్రకారం, వెళ్ళి వెతికితే వాళ్ళకు పిల్లవాడు దొరికాడుట. వాళ్ళ వెర్రి వాళ్ళది. సరే ఎమైలేనేం, పాతిక రూపాయి లిచ్చారు వాళ్ళు. ఆ పాతిక రూపాయలూ ఏంచేశాడో వీణ్ణి అడుగు, నేను చెప్పటం దేనికి ?" అని ఆగింది పార్వతమ్మ.

ప్రశ్నార్థకంగా సత్యనారాయణ వంక చూశారు లింగణ్ణగారు.

"వాడి తల్లికి ప్రాణం పోయే పరిస్థితిగా వుందని మందుల కోసం వాళ్ళ కిచ్చేశాను" అన్నాడు సత్యనారాయణ ఎటో చూస్తూ.

"చూడు, చూడు నాన్నా. వాడి వాలకం, సమాధానం బాగా చూడు." అంది పార్వతమ్మ.

"వాడెవఁడా. సరిగ్గా చెప్పు" అన్నాడు విసుగ్గా లింగణ్ణగారు.

సత్యనారాయణ కంటె తనే ముందు అందుకుంది పార్వతమ్మ.

"ఇంకెవడు? పక్కింటి పనిమనిషి కొడుకు, ఆ దూదేకుల వాడేగా వీడి ఆప్త మిత్రుడు."

లింగణ్ణగారికి కులప్రసక్తి బొత్తిగా నచ్చదు.

"కులం ఏదయితే ఏమి లేవమ్మా" అన్నాడాయన విసుగ్గా.

"సరిపోయె - కులం ఏదయితే నాకేమి? మన మేమిటి? మన అప్పు లేమిటి? యీ దానా లేమిటి? అదీ నా గోల" అంది పార్వతమ్మ.

దానం చేశాడంటే కేకలెయ్యి బుద్ధికాక ఇబ్బంది పడుతున్నాడు లింగణ్ణగారు. ఇంతలో "ఎక్కడికి పోతుంది తండ్రి తిక్క?" అంది పార్వతమ్మ అక్కసుగా.

"ఈ తాత తిక్క గూడ కొంత వుంది లేవమ్మా. ఆ మాట లెందుకులే అగు. ఆ దానమేదో కాస్త పిన్నికే చెయ్యి రాదుటయ్యా కొన్నాళ్ళు." అన్నాడు లింగణ్ణగారు, ఉభయ వర్గాలకూ రాజీచేసే ధోరణిలో.

"ఆ డబ్బు మనం వాడుకోరాదు తాతా" అన్నాడు సత్యనారాయణ తాపీగా.

'ఏం?' తండ్రీ కూతురూ ఒకేసారి అడిగారు.

"ఆ సంపాదన వేరు, ఆ వినియోగం వేరు." ఈ మాటు సత్యనారాయణ సమాధానంలో కొంచెం విసుగు వుంది.

"నాన్నా, యీ బుకాయింపు మాటలు వినకు. నీ దాకా రానీటు మెందుకని నీకు చెప్ప లేదు కాని యిలా తోచినపుడు తోచినంత దోచి పెట్టటం వీడికి కొత్తగాదు. నాలు గయిదు సార్లు జరిగింది." మళ్ళీ అందుకొంది పార్వతమ్మ.

"అట్టాగుటమ్మా" అన్నాడు లింగణ్ణగారు ఆశ్చర్యంగా.

"ఔను, బళ్ళో కట్టమని యిచ్చిన జీతం డబ్బులూ, చివరికి పరీక్షకోసం యిచ్చిన డబ్బులు గూడ, ఇతరులకు దోచిపెట్టిన రోజులున్నాయి." పార్వతమ్మ ఉద్వేగంగా ఫిర్యాదు చేసింది.

"నీ డబ్బులు మళ్ళీ నీ కిచ్చేశాగా" ఉక్రోషంగా అన్నాడు సత్యనారాయణ.

"ఎట్లా యిచ్చావురా, ఎక్కడనుంచి తెచ్చావు?" కంగారుగా అడిగాడు లింగణ్ణగారు.

'ముష్టెత్తలేదు, అన్యాయంచెయ్యలేదు. ఎట్లా సంపాదిస్తే ఏం?' అన్నాడు సత్యనారాయణ.

"ఒకసారి మాత్రం వత్తులుచేసి అమ్మాడు నాన్నా, నాకు తెలుసు" అంది పార్వతమ్మ.

"తక్కిన స్సార్లు" అడిగాడు లింగణ్ణగారు, "అట్లాంటిదే. ఏదయితేనేం?" అన్నాడు సత్యనారాయణ.

"ఏం మాకు చెప్పకూడదా !" రెట్టించింది పార్వతమ్మ.

"కవర్లు చేసి అమ్మాను. కొట్లల్లో శుక్రవారపు పూజలు చేయించాను. యిళ్ళల్లో అభిషేకాలు చేయించాను. ముహూర్తాలు పెట్టాను. లెక్కలు రాసి పెట్టాను.

"చాలు చాలు ఆపరా" అన్నాడు లింగణ్ణగారు విసుగ్గా మధ్యలోనే ఆపాడు సత్యనారాయణ.

"అల్లా వొళ్ళు తెలియకుండా, దానాలు చెయ్యటుందేనికి? ఇంత అగచాట్లు పడటుందేనికి? మా రోజుల్లో మేమేదో చేశామంటే ఆ రోజులు వేరు. అవి కృతయుగపు రోజులు" లింగణ్ణగారు ఈ మాటలను ఆవేదనగా అన్నాడు. దాంతో సత్యం కొంత మెత్తబడి—

"తాతా, నాకో నియమం వుంది. దానికోసం, అప్పుడు అలా చేశాను. ఇప్పుడు వచ్చిన సంపాదనంతా పిన్నికే యిస్తున్నాను" అన్నాడు.

"ఎంతసేపటికీ, శేషగిరి బావగారివెంట పౌరోహిత్యం తిరిగే గతేగాని, ఆ పరీక్ష పాసయ్యి దర్జాగా ఉద్యోగం చేసుకొనే గీత లేదా మన మొహాన."

పార్వతమ్మ మళ్లీ ఓ దుఃఖపు దులిపింది.

"ఎట్లా సంపాదిస్తే యేం? మీకు కావాల్సింది రూపాయలు, అంతేగా" అన్నాడు సత్యనారాయణ.

"ఏమిట్రా. పెద్ద సంపాదించుకొస్తున్నట్టు చెప్పుతావు. ఇంత పెద్ద పట్టీ చెప్పావు, యిన్ని సంపాదనలూ కలిస్తే మొత్తం ఎంత సంపాదిస్తున్నావు నెలకి? తిప్పి తిప్పి కొడితే యాభై రూపాయలుందా?" నిగ్గతీసింది పార్వతమ్మ.

"సంపాదన దేముందిలేగాని, నియమాలేమిటయ్యా నీకు? అసలా నియమాలేమిటో చెప్పు ముందు" అన్నాడు లింగణ్ణగారు.

"తాతా, నీ దగ్గర అబద్ధం చెప్పలేను. కనీసం నలుగురికి జీతం కడితేనేగాని, నేను నా జీతం కట్టుకోను. నలుగురికి పరీక్ష రుసుము కడితేగాని నా పరీక్ష రుసుము కట్టుకోను. ఈ నియమం పొద్దుటూరునుంచీ సాగుతోంది. ఎలా సాగుతోందో ఆ గణపతికే తెలియాలి."

సత్యనారాయణ జవాబు విని లింగణ్ణగారు "ఆ" అని నోరు తెరిచి అయోమయంగా సులకనుంచంమీద వెనక్కి వాలిపోయాడు. సత్యనారాయణ కొనసాగించాడు.

"ఇంతవరకు, నేనుకష్టపడి సంపాదించిందే అలా దానాలు చేస్తున్నాను. ఒక్కసారి గూడా ఇంట్లోంచి తీసికెళ్ళి చేయలేదు. ఒకటి రెండుసార్లు అప్పుగా అవసరమై వాడుకొన్నాను. ఈలోగా నా కర్మం కాలి, మా స్కూలు టీచర్లు, మీవాడు ఫీజు ఆలస్యం చేశాడని పిన్నికి చెప్పటంతో యింత గోల చేస్తోంది."

"గోల అంటా వేమిట్రా, నీ చేతికి వచ్చిన డబ్బుతో ముందర అప్పులు తీర్చు. దానాలు తరువాత అంటున్నాను. అదీ గోలేనా?" దబాయించింది పార్వతమ్మ.

"అది కాదంటం లేదు. అన్ని సంపాదనలూ అలా చేసేందుకు వీలులేదు అంటున్నాను. ఎందుకో మీకు చెప్పినా అర్థం కాదు. అవి అంతే అంటున్నాగా, వినిపించుకోవేం?" అని కరకరలాడి కోపంగా తటాలున లేచి వీధిలోకి వెళ్ళిపోయాడు సత్యనారాయణ.

లింగణ్ణగారు కొంచెం నొచ్చుకున్నారు. ఆయన కూతురు వంక యిబ్బందిగా చూసి–

"అమ్మాయీ, ఈడొచ్చిన పిల్లాడు. వాడిమీద అలా చీటికీమాటికీ విరుచుకుపడ్డావంటే ఎదురు తిరిగితే ఏం బావుంటుంది మనకి? లేదా ఎటో లేచిపోయాడంటే ఎంత అప్రతిష్ఠ మనకి? ఆలోచించవేం?" అన్నాడు మందలింపుగా.

"నన్నంటావు తప్పితే వాడికి బాధ్యత రాలేదని అనుకోవేం నువ్వు?" అని ఓ విసుగు విసుక్కొని లోపలికి వెళ్ళిపోయింది పార్వతమ్మ.

ఎందుకో గానీ లింగణ్ణగారు చాలా దీర్ఘాలోచనలో వుండిపోయాడు చాలాసేపు. అలా ఆలోచించి, ఆలోచించి ఆయన చేతికర్ర తీసుకొని బయలుదేరాడు గంభీరంగా. ఆయన సరాసరి తన రెండో అల్లుడు శేషగిరిశాస్త్రి ఇంటికి వెళ్ళాడు. శేషగిరిశాస్త్రి చాముండీ వనంలో (ఇది మైసూరులో ఒక పేట) వున్న చాముండీ ఆలయంలో అర్చకుడు మాత్రమే కాక ఊళ్ళో మంచి పేరున్న పురోహితుడు. ఆయన ఏ సమయంలో ఇంట్లో వుంటాడో, ఏ సమయంలో ఉండడో ఆయన భార్య శారదమ్మకే తెలియదు. ఇక లింగణ్ణగారి కేం తెలుస్తుంది? ఆదుర్దా ఆపుకోలేక ఏమయితే అయిందిలే అని బయలుదేరి వచ్చాడాయన.

బయలుదేరిన వేళ బాగుంది కాబోలు ఇంట్లోనే వున్నాడు శాస్త్రి. కాసేపు పరస్పర కుశల ప్రశ్నలయినాక మెల్లగా తన మనస్సులో విషయం సంభాషణ లోనికి తెచ్చాడు లింగణ్ణగారు.

"శాస్త్రీ, మా సత్యనారాయణ ఉపనయనం అయినాక నీదగ్గర ఏదైనా వైదికమ్ముక్కలు చెప్పమన్నాడా ఏమిటి"? విషయంలోకి దిగాడు లింగణ్ణగారు.

"వాడి దగ్గర అంత నిలకడ గూడానా?"

"పోనీ అంతకుముందు నీ చేతికింద గణపతి గుళ్ళో వున్నప్పుడు ఏమైనా పూజా విధానాలవీ నూరావా?"

"ఆ, నా మొహం, అప్పుడు వాడు వడుగుకాని వెధవ. వాడికేం చెపుతాను? అయినా ఏమిటి అలా అడుగుతున్నారు?"

"ఏమీ లేదు. ఈమధ్య నీ చేతికింద వైదికంలో తిరుగుతున్నా నంటున్నాడు. అదెంత మటుకు నిజమూ అని"

"ఇదోటా! లేనిపోనిది"

"ఇందులో నాదేమీ లేదయ్యా"

"నా చేతికిందా లేదు. కాలికిందా లేదు. ఈమధ్యే, అప్పు లయినై, నాలుగు రాళ్ళు తెచ్చుకుంటాను' అని వెంటబడితే నాలుగిళ్ళు చూపించా, తాత్కాలికంగా"

"ఏం చేస్తున్నాడు వీడు?"

"అయ్యా, ఏం చేయిస్తాడో దేముడికి తెలియాలి. చూచి చచ్చేందుకు నాకు తీరిక వుందా? ఏమోగాని వీడు ఎక్కడ పూజ చేయించినా మళ్ళీ వీడే కావాలంటారు యజమానులు"

"మంత్రా లెవరు చెప్పారు వీడికి ?"

"అది నాకు తెలియదు. నేను చెప్పలేదు. నేను వెళ్ళేసరికి ఒకటి రెండుసార్లు మంత్ర పుష్పమో, ఏదో చెపుతున్నాడు. అది బాగానే వుంది."

"పూజ తంతు అంతా తెలియవద్దుటయ్యా?"

"తంతులో వాడిని మించినవాడు లేడు. ఏ క్రియా కలాపమైనా సరే, ఒకసారి చూశాడంటే మొత్తం తూచా తప్పకుండా ఏర్పాటు చేస్తాడు రెండోసారి."

"వీడి తంతులు గూడా కొన్ని నాకు కొత్తగా వుంటాయేమిటయ్యా?"

"వివరంగా చెప్పండి."

"అర్థరాత్రి ఒంటిగంటకే లేచి స్నానాలు చేస్తాడు. మంచులో, దొడ్లో తెల్లజిల్లేడు క్రింద కూచుని జపాలు చేస్తాడు. ఒకోసారి రాత్రిళ్ళు నిద్రపోడు. మీ బోటి వాళ్ళెవరూ జిల్లేడు చెట్టుకింద జపాలు చెయ్యగా చూడలేదు నేను."

"మేము అసలు జపాలు చేసి ఏడ్చాపుట గానీండి, అదల్లా వుంచండి. అయ్యా, ఈ వైదికమంతా ఒక దశ. ఉచ్చదశలో వున్న వాడు, వాడికి "నమస్సోమాయచ" రాకపోయినా మహాయోగి, మహా ఉపాసకుడూను. ఇప్పుడు ఆ సత్యనారాయణ దశ బాగున్నట్టుంది. అదేం చిత్రమో, వాడెవరింట్లో అయినా పూజో, జపమో, అభిషేకమో చేస్తే వాళ్ళు మాకు తెగ కలిసివచ్చిందంటున్నారు. సాగనీండి. ఆ దశ ఎంతకాలం వస్తుందో రానీండి"

"ఇంతకూ వాడికి మంత్రం రాదా? అది చెప్పు"

"అయ్యా, మంత్రం అంటే గురుముఖతః రావాలి. ఏ నాబోటి వాడి దగ్గరో చెప్పుకోవాలి. ముహూర్త భాగంలో మాత్రం వాడు గట్టివాడండోయ్. నేను రెండు మూడు మాట్లు చూసి సంతోషించాను."

"ముహూర్తం సరేలేవయ్యా, మంత్రం సంగతి చెప్పు."

"ఏం చెప్పను?"

"మళ్ళీ విన్న భాగం బాగానే ఉంటుందంటున్నావు. పూజలు చేయించుకున్న యజమానులు మళ్ళీ పిలుస్తున్నా రంటున్నావు, వాడి మంత్రం సరీగా వుందా లేదా అంటే తేల్చవేమిటి?"

"మాలాంటి వాళ్ళం అలా తేలికగా నోరు జారం. ఎంతో పరీక్షిస్తేగాని పెదవి కదపం."

"అది సరేగాని, కొంతమందికి ఏదో రోగాలు తగ్గిస్తున్నట్టు, కొంతమందికి పిల్లలు తప్పిపోతే ఎక్కడున్నారో చెపుతున్నట్టు, కొంతమందికి యిళ్ళల్లో చిక్కులు పోగొడుతున్నట్టు, కొంతమందికి భార్యా భర్తల విరోధాలు పోగొట్టి, సంసారాలు నిలబెడుతున్నట్టు, తలోకళ్ళూ తలోటీ చెపుతున్నారు. నీ చెవి నేమయినా పడ్డాయా?"

"ఇంతకన్న ఎక్కువే పడ్డాయి."

"అదేనయ్యా, నేనంటే లౌక్యపు వెధవను. నువ్వు అనుష్ఠాతవు, పండితుడవు. నిన్నడిగితే తెలుస్తుందని అడుగుతున్నా. ఏమిటి వీడి మార్గం? అసలు సన్మార్గమేనా? చెప్పు."

"అయ్యా, ఇందాకనే చెప్పా. వైదికమంతా దశండీ బాబూ అని. ఒక దశలో అది అంతే. చిన్నప్పటినుంచి కాచి వడపోసి చూశాను. అదంతే. ఒకడికి లేని అదృష్టం మరొకడికి పడుతుంది. అదే ఆ సిద్ధి, అదే దశ. ఇంతకన్న చెప్పేదేమీ లేదు."

అల్లుడి అభిప్రాయాలన్నీ కలగాపులగంగా కనిపించినాయి లింగణ్ణగారికి. ఇహ యింతకన్నా నిర్ణయం తేలదని గ్రహించి, ఆయన ఆ సంభాషణ ఆపివేశాడు. కాని అల్లుడే మరో మాటన్నాడు.

"ఏమయినా వాడి కీ మధ్య బాధ్యత తెలుస్తోంది. ఈ మధ్యే వైదికాలలో గూడ కాస్త నిలకడగా వుంటున్నాడు. మీకు, పార్వతికి అవమానం లేకుండా వుంటే వాడు వైదికంలో నిలదొక్కుకుంటాడు."

"నాకేం అనుమానం లేదయ్యా. అదోటి పెట్టుకు. ఉంటే నేను పిల్లనెలా యిస్తాను నీకు." అని హాస్యంగా చేస్తూ లేచి వచ్చేశాడు లింగణ్ణగారు.

ఆ రాత్రి యింటికి రాలేదు సత్యనారాయణ. పార్వతమ్మ కంగారు పడసాగింది.

మర్నాడు పొద్దున వచ్చాడు. అడిగితే "సుబ్బణ్ణ బావకు నైట్ డ్యూటీ ఉంటే వరలక్ష్మి యింట్లో పడుకున్నా" అన్నాడు కోపంగా.

వరలక్ష్మి కాపరానికి వెళ్ళిన దగ్గర నుంచీ, మధ్య మధ్యలో సత్యనారాయణకి యిదో డ్యూటీ తగులుతోంది. అయితే వాళ్ళది ఒకటే గది. అందువల్ల తోడు పడుకోవాల్సి వచ్చినపుడు ఎంత చెప్పినా వినకుండా వీధి అరుగు మీదే పడుకుంటాడు సత్యనారాయణ.

అయితే మంచులో పడుకునేది సత్యమే గాని, ఆ భారం తను తీసేసుకొన్నాడు అన్నట్టు, లింగణ్ణగారి దగ్గు, ఉబ్బసం పెరిగి పోతున్నాయి. ఏ మందులూ పని చెయ్యటం లేదు. రాత్రిళ్ళు దగ్గు, ఆయాసంతో దాదాపు నిద్దరుండటం లేదు ఆయనకు.

సత్యానికి అసలే తీరిక వుండటం లేదు. అతని దినచర్య అర్ధరాత్రి ఒంటి గంటకు ప్రారంభం అవుతుంది. అప్పు డతడు స్నానం చేసి జపాలు మొదలెడతాడు. మూడు గంటలకు జపం ఆపి పూజలోకి దిగుతాడు. నాలుగూ నాలుగున్నరకి గోసేవకు బయలుదేరుతాడు.

గోసేవ చేసుకొని, ఇళ్ళల్లో పాలు పోసి వచ్చే సరికి ఏడో, ఎనిమిదో అవుతుంది. అప్పుడు ట్యూషన్లకు బయలుదేరుతాడు. ట్యూషన్లు అయిన తరువాత కవర్లంటించటమో, వత్తులు చేయటమో, ఎక్కడన్నా లెక్కలు రాయటానికి పోవటమో, కాదంటే ఎక్కడయినా ఏ అభిషేకమో, పూజో చేయించటమో ఏదో పని వుంటుంది.

ఇవన్నీ అయినాక పుస్తకం చేత పట్టుకునే సరికి నిద్దర తూగి పోతుంది. మళ్ళీ మధ్యాహ్నం రెండయిన దగ్గర నుంచీ, గొడ్ల పని మొదలు. మళ్ళీ యిదే చక్రం. సందులో సందు కొంత మందికి యోగాసనాలు నేర్పుతాడు. వీటిల్లో ఏది మానమన్నా మానడు. ఇంత వున్నా, 'యీ మధ్య కాస్త చదువు తున్నాడు, ఫరవాలేదని' సంతృప్తి పడుతోంది పార్వతమ్మ. సెప్టెంబరులో మళ్ళీ పరీక్షలున్నాయి. ఈ మాటయినా S. S. L. C పూర్తి చేస్తే ఏదైనా వుద్యోగం వస్తుందని ఆవిడ ఆశ.

అయితే ఆవిడ ఆశ ఎక్కువ కాలం నిలవ లేదు. గణపతి అనుగ్రహం అలా వుంది మరి. ఏమంటే ఆగష్టు నెల చివర్లోనే వినాయక చవితి వచ్చింది.

కేసరె సెంటర్లో యువకులంతా కలిసి ప్రతి సంవత్సరం వినాయక చవితి వుత్సవం నెల రోజులు పైగా నిర్వహిస్తారు. దాని పేరు నవరాత్రులు. కాని జరిగేది మాత్రం నెల రోజులు. వంద వినాయక విగ్రహాలు పెడతారు. హరి కథలు, నాటకాలు, వగైరా పెద్ద పెద్ద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు. ఉత్సవం చాలా హంగామాగా వుంటుంది.

ఆ వుత్సవానికి కుర్రవాళ్ళంతా పేటలో చందాలు వసూలు చేస్తారు. ఆ పేట రౌడీ ద్వారక ఆ వుత్సవాలకు ప్రధాన హంగుదారు. సత్యనారాయణ అర్చక స్వామి. ఏర్పాట్లు మొదలైతే ఆ పేటలో ఆ కుర్ర వాళ్ళెవరికీ వళ్ళు తెలియదు. ఇప్పుడు సత్యనారాయణ ఆ మైకంలో పడ్డాడు. పార్వతమ్మ ఒకటే గోల. కేకలేద్దామంటే అసలు దొరికితేగా! ఎప్పుడో ఒకసారి దొరికాడంటే " నేను పాస్ కాక పోతే అప్పుడడుగు " అంటున్నాడు ధీమాగా. ఇంక ఏమిటి చెయ్యటం ?

చిత్రంగా ఆ సెప్టెంబరు పరీక్షల్లో సత్యనారాయణ పాస్ అయ్యాడు (1961 సెప్టెంబరు). ఇతను పాసైన దగ్గర నుంచీ, పార్వతమ్మకు ఒక కొత్త చింత పట్టుకుంది. "వీడు S. S. L. C పాసయ్యాడు. ఇక వీడికి పౌరోహిత్యం ఏమి కర్మ ? వీడికి ఏదో ఒక వుద్యోగం కావాల్సిందే" అని. తను పెంచిన పిల్లాడు, దర్జాగా ఉద్యోగంలో వుండాలని ఆవిడ ఆశ, పాపం.

ఆ ఆశవల్ల ఆవిడ సత్యాన్ని క్షణం నిలవ నిచ్చేది కాదు. తను పోరితే, వాడికి బాధ్యత తెలిసి వచ్చి, ఉద్యోగం కోసం గట్టిగా ప్రయత్నిస్తాడని ఆవిడ ఆలోచన. అందువల్లే తన పోరు

మరీ శ్రుతి మించుతోందనే విషయం ఆవిడకు అర్థం కాలేదు. అయితే ఆవిడ పోరి వూరుకోటం గాదు. ఎక్కడయినా ఉద్యోగం వేయించమని తనకు తెలిసిన ప్రతివాళ్ళనీ బ్రతిమలాడుతోంది. పోస్టల్ ఇన్‌స్పెక్టరు కృష్ణప్పగారొస్తే ఇహ చెప్పనే అక్కరలేదు.

కట్టెలడితీ లక్ష్మయ్యకు, చేతిమగ్గాల మిల్లు వుందని గుర్తొచ్చిందొక రోజున. పార్వతమ్మ తక్షణమే వెళ్ళి లక్ష్మయ్య భార్య లక్ష్మీదేవమ్మతో తన గోడు చెప్పుకుంది.

"మా సత్యనారాయణ ఏ పనీ లేకుండా, ఊరికే తిరుగుతున్నాడు. మీకు తెలుసు గదా. పిల్ల పెళ్ళి చేసి ఋణభారంలో వున్నాము. మీ వీవింగు ఫ్యాక్టరీలో మా వాడికి కాస్త వుద్యోగ మిప్పిస్తే నాకు సహాయం చేసిన దాన వవుతావు" అని.

ఆవిడ లక్ష్మయ్యతో చెప్పింది. అతనికి సత్యనారాయణ మీద మొదటి నుంచీ అభిమానమే. అయితే మాత్రం వున్నట్టుండి ఉద్యోగం అంటే ఎలా యివ్వగలడు ?

"చూడండమ్మా ! యిది మీ బ్రాహ్మలు చేసే పనికాదు. అది కాకపోయినా, ముందర పని రావాలి. ఈ నేతపని అసలు చిన్నప్పటి నుంచీ అలవాటు కావాల్సిన పని. అయినా మీ రడుగుతున్నారు కనుక కాదనను. ముందు కొన్నాళ్ళు వచ్చి పని నేర్చుకోమనండి. పని వస్తే నా భాగస్వాములతో గూడ చెప్పి మా ఫ్యాక్టరీలోనే తప్పకుండా ఉద్యోగం వేయిస్తాను. సరా" అన్నాడు.

సత్యనారాయణను ఆ ట్రైనింగుకు పొమ్మంది పిన్ని. ఎక్కిరింతగా నవ్వాడు అతను.

"ఇది దర్జా వుద్యోగం కదూ" అన్నాడు. పిన్ని కేకలేసింది.

"సరే, ఆ ముచ్చటా కానీ" అన్నాడు సత్యనారాయణ. అతను వీవింగు ఫ్యాక్టరీకి వెళ్ళసాగాడు.

నిజానికి పార్వతమ్మ తెలివి తక్కువదేం కాదు. ఆవిడ ఇంత తొందరపడి సత్యాన్ని పనికి పంపటంలో ఆవిడకు మరో బలమైన కారణం వున్నది. ఈమాటు వినాయకచవితి ఉత్సవా లయిన దగ్గర నుంచీ సత్యనారాయణ ధోరణిలో కొంత స్పష్టమైన మార్పు కనిపిస్తోంది. ఇదివరకటికన్నా నిర్భయంగానూ, నిస్సంకోచంగానూ పూజలు పెంచేస్తున్నాడు. అది చాలక మధ్యమధ్యలో కళ్ళూ నోరూ గూడ తెరుచుకొని, బిగుసుకుపోయి కూర్చుంటున్నాడు. ఇదేమిట్రా అని గట్టిగా నిగ్గతీస్తే "నమ్ముకున్న వాళ్ళను ఆదుకోవలసి వచ్చింది" అని నసుగు తున్నాడు. ఈ ధ్యానాలూ, మైమరపులూ పెరిగిన దగ్గర నుంచీ గుళ్ళూ, పురాణాలూ, హరి కథలూ, ఉపన్యాసాలూ, నాటకాలూ అన్నీ మానేశాడు. తను మాట్లాడటం గూడ బాగా తగ్గించాడు.

అసలే వూళ్ళో నలుగురూ చెప్పే మాటలు నాల్గు రకాలుగా వుంటున్నాయి. దీనికి తగ్గట్టే వీడి ప్రవర్తన మారిపోతోంది. ఇక వీడిని యిలా వదిలేస్తే, అసలే దక్కడని ఆ పినతల్లి

అదుర్దా. ఏదో పనంటూ పెడితే, యీ కొన వెర్రులు కొంతయినా తగ్గుతాయని ఆవిడ, అతనిని పీవింగులోకి దింపింది. అంతేగాని, అదేదో పెద్ద దర్జా ఉద్యోగమని కాదు.

సత్యనారాయణ మగ్గాల దగ్గరకు వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి మగ్గాలు జోరుగా తిరుగు తున్నాయి. తిరిగేటప్పుడు ఒక తాళబద్ధమైన నాదం వస్తోంది. అతని మనస్సు ఆ నాదం మీద లగ్న మయింది. రెండు నిముషా లయేసరికి ఆ తాళానికి అనువుగా ఒక ఈల అతని నోటివెంట రాసాగింది.

అతని సీనియర్సు అతనికి పనితీరు చూపించి, మెల్లిగా పని అందించారు. అతను పని చేస్తున్నాడు, నిదానంగా. నోటి ఈల తాళబద్ధంగా సాగుతూనే వుంది. క్రమంగా ఆ యీల అక్షరాలుగా మారింది "రామకృష్ణవాసుదేవ, అచ్యుత అనంత". అతనికే ఆశ్చర్యం వేసింది.

అతను చురుగ్గా పని నేర్చుకొంటున్నాడు. అంత కంటె చురుగ్గా అతని నోటి నుండి పాటలు, మగ్గాల లయతో పదం పదం కలిపి పరుగులు తీస్తున్నాయి. వాటితో చేతులు కలిపి కాలం పరిగెత్తగా, పదిహేను రోజుల కాలం ఆ మగ్గాల చక్రాలలో పడి నలిగిపోయింది. పదహారో రోజున ఏం జరిగిందో, ఎందుకలా జరిగిందో తెలియదు గాని, ఉన్నట్టుండి కెవ్వుమని ఒక చిన్న కేక, కస్సు మని ఒక చిన్న చప్పుడు రెండూ ఒకేసారి వచ్చాయి.

సోదర కార్మికులు లేచి వచ్చి విషయం తెలుసుకొని మిషన్లు ఆపేసరికి కుడి చిటికిన వేలు చివరి కణుపు ముక్క తెగి అవతల పడి వుంది. నెత్తురు ధారగా కారుతోంది. సత్యనారాయణ వొంగి వేలు ముక్క అందుకొని, దాని స్థానంలో పెట్టి నొక్కు తున్నాడు. కారుతున్న రక్తం ఆ మగ్గాన్నీ, ఆ నేలనీ అతని బట్టల్నీ తడిపేస్తోంది. ఆ స్థితిలో సహకార్మికులు అతన్ని దగ్గరున్న వైద్యుడి దగ్గరకు మోసుకెళ్ళారు.

డాక్టరు దగ్గరకు వెళ్ళేసరికి, ఆ వేలు నెత్తురు కారుతోంది గాని అతుక్కొని వుంది. కాని కొంచెం మాత్రం పక్కకు జరిగి వంకరైంది. ఆ కార్మిక జీవనానికి చిహ్నంగా ఆ వంకర ఆ వేలికి అలా నిలిచి పోయింది.

పిన్నమ్మ యిప్పించిన ఉద్యోగం వల్ల రూపాయి ఆదాయం రాకపోయినా ఒక నెల రోజులు పూర్తి విశ్రాంతి వచ్చింది. ఎవరూ నోరెత్తేందుకు వీలులేని విశ్రాంతి. దానికి మించి కార్మిక జీవనం, కార్మిక ప్రవృత్తి, కార్మిక సమస్యల పట్ల స్వానుభవ పూర్వకమైన అవగాహన ఏర్పడింది. ఈ రెండు కారణాల వల్ల పిన్నమ్మకు, మనస్సులో కృతజ్ఞత చెప్పుకున్నాడు సత్యనారాయణ.

## అర్క-గణపతి పిలుపు

చేతికి కట్టు కట్టుకొని యిలా యింట్లో నిశ్చింతగా పడున్న రోజుల్లో సత్యనారాయణకు రాత్రనకా, పగలనకా, ఏదో పిలుపు వినబడసాగింది.

" నేనిక్కడే వున్నాను, నన్ను తీసుకు వెళ్ళు " ఇదే పాట. పాడిందే పాట. ఆగదు ఆ స్వరం. విని విని విసుగెత్తింది సత్యనారాయణకు. చిరాగ్గా దొడ్లో తెల్ల జిల్లేడు చెట్టు దగ్గరకు వెళ్ళి విసుక్కున్నాడు.

" ఉంటే వుండు. నేను తీసుకెళ్ళట మెందుకు నిన్ను ? "

" నీకు మేలు చేస్తాను. " వెంటనే వచ్చింది బదులు.

" నాకా ?" రెట్టించాడు సత్యం.

" ఔను, నీకే ".

" అంటే "

" అంటే నేను చెప్పాలా ? నువ్వెవరు ? "

" —————— " ( మౌనం )

" రెండు మార్గాలున్నాయి. నీకు తెలిసినవే "

" నువ్వు కూడా చెప్పు "

" నువ్వు వహించిన మౌనం ఒక మార్గం. అదే దక్షిణామూర్తి మార్గం. మీ అత్త మార్గం. "

" ఊ "

" రెండోదాంట్లో—ఈ భూమీ, యీ నీరూ, ఈ నిప్పూ, ఈ గాలీ, ఈ ఆకాశం, ఈ లోకాలూ, ఈ జీవులూ, ఈ మనుష్యులూ, ఈ జంతువులూ, ఈ వృక్షాలూ-ఒకటేమిటి ! కంటికీ, మనస్సుకూ కనిపించేవన్నీ వున్నాయి. అవన్నీ నీవే అయి వున్నావు. అన్నింటిలోనూ నువ్వే వున్నావు. నీవే అన్నీ అయివున్నావు. ఇది దత్త మార్గం. మీ అమ్మ మార్గం.

" ఇవి వేరు వేరా ?"

" మార్గాలుగా వున్నంతవరకూ వేరే. గమ్యంలో కలిసి నపుడు, వీటికి మార్గత్వమే అంత రిస్తుంది. కనుక, వేరా అనే ప్రశ్న వుండదు గదా ! "

" ఇంటికి చేరిన వాడికి మార్గాల గోల ఎందుకు లెద్దూ "

" నిన్ను ఎవరు యింటికి చేర్చారో, వారి ఆజ్ఞ ఒకటి వుంది నీకు "

" —— —— —— —— " ( మౌనం )

" మళ్ళీ మొదటి మార్గానికే వెడుతున్నావు, కానీ నీది రెండో మార్గం. మీ అమ్మ మార్గమే నీ మార్గం . "

" .... .... — — — — " ( మౌనం )

" మీ అమ్మ గూడ చేరవలసిన యింటికి ఎప్పుడో చేరింది. కానీ నీకోసం మళ్ళీ కొంత వెనక్కి వచ్చి, నడిచి చూపింది.

" ఔను "

" నువ్వు గూడా మరింత వెనక్కి వచ్చి నడచి చూపించాలి. "

" ఔను "

" మీ అమ్మ మార్గంలో. "

" ఔను. "

"ఆ మార్గంలో కాలు పెట్టబోతున్నావు గనుకే, నీకు ........ నీకు ........నీకు తెలిసింది గా నీకు మేలు చేస్తానంటున్నాను."

" సరే. "

" మరి నన్ను తీసుకెళ్ళు. "

" ఎలా తీసుకెళ్ళాలి? "

" నీకే తెలుసు "

సత్యనారాయణ యింట్లోకి వచ్చాడు.

అప్పటికి ఉదయం తొమ్మిదయింది. ఉన్నట్టుండి బయటకు వెళ్ళిపోయాడు సత్యనారాయణ. ఆ వెళ్ళటం వెళ్ళటం రాత్రి పదింటికి వచ్చాడు.

" ఎక్కడికి వెళ్ళా " వన్నారు పెద్దవాళ్ళు.

ఏం తోచక, శ్రీకంఠయ్య ఇంట్లో కాలక్షేపం చేశాననీ, భోజనం గూడ అక్కడే అయ్యిందనీ చెప్పాడు. సరే కానిమ్మన్నారు.

ఆ రోజునుంచీ రోజు రోజూ, రోజుకోచోట భోజనం చేసి యింటికి వస్తున్నాడు.

" ఇదేం ముష్టి బతుకురా, రోజూ పరాయి కొంపల్లో భోజన మేమిట్రా. " అని పిన్ని గోలచేసింది. అయినా అతనేమీ అనలేదు. తన పద్ధతి మానలేదు.

సత్యం వేలు పూర్తిగా బాగుపడింది.

మెట్టుపళయంలో " కాఫీ క్యూరింగు వర్క్సు " వాళ్ళ దగ్గర వో ఉద్యోగం సంపాదించి పెట్టింది పిన్ని. దానిలో చెయ్యీ కాలూ విరగలేదు గాని, ఆ ఉద్యోగమే త్వరలో ఎగిరిపోయింది.

పోస్టాఫీసు కృష్ణప్పగారిని ఏదయినా ఉద్యోగం సత్యానికిప్పించమని బతిమాలుతోంది పిన్ని.

ఈలోగా హిందీ నేర్పి సత్యనారాయణను ప్రవేశిక పరీక్షకు కూచోబెట్టింది. ఆవిడ స్వయంగా హిందీ టీచరు గదా. ఇది కాక ఎలిమెంటరీ టీచర్ ట్రయినింగుకు పంపించింది.

తెల్ల జిల్లేడు పూజలు మామూలుగానే సాగుతున్నాయి. కాకపోతే దాని దగ్గర తచ్చాడటం ఎక్కువైంది.

ఒక రోజున సరస్వతి అటుపోతూ, ఆ చెట్టును యదాలాపంగా కాలితో తన్నింది. వేరే దురుద్దేశ మేదీలేదు. కాని సత్యం కస్సుమని దానిమీదకు లేచాడు. దానికి వొళ్ళు మండి పోయింది. కాని అప్పటికి వూరుకుంది.

ఆ మర్నాడు ఇల్లూడ్చినాక, కసవుతెచ్చి అక్కనుగా ఆ చెట్టుమీద దులిపింది.

దులిపి, అలా వెనక్కు తిరిగిందో లేదో ఎక్కడ నుండి వచ్చాడో, మెరుపల్లే వచ్చాడు సత్యనారాయణ. సరస్వతి చెంప ఛెళ్ళు మని మోగింది.

అక్కడితో ఆగలేదు. దాని రెండు జడలూ పట్టుకొని వీపు విమానం మోత మోగించాడు.

ఆ ఉగ్రానికీ, ఆ దెబ్బలకీ బిత్తరపోయి, వణికిపోయింది పాపం ఆ పిల్ల.

సత్యానికి ఉగ్రం వస్తే తట్టుకోవటం ఇంట్లో ఎవరికీ సాధ్యం కాదు. ఆ సమయంలో అందరూ తగ్గి ఊరుకోవలసిందే.

అలా చెల్లెల్ని దండించినాక వెంటనే స్నానం చేసి, ఆ చెట్టుకి ఏవో ప్రత్యేక పూజలు చేశాడు.

"ఏమిట్రా యిదంతా" అన్నాడు లింగణ్ణగారు.

"దానికి గణపతి శాపం తగలకుండా" అన్నాడు సత్యనారాయణ. లింగణ్ణగారు మరి నోరెత్తలేదు.

సత్యనారాయణ ట్రైనింగ్‌కి గూడ వెళ్ళి వస్తూనే ఉన్నాడు. కాని ఇంట్లో మాత్రం భోజనం చెయ్యటం లేదు.

క్రమంగా వీడెక్కడ అన్నం తింటున్నాడని అనుమానం బయలు దేరింది. బంధు వర్గంలో గూఢచారి చర్య ప్రారంభమైంది. ఊంతో దొరికాడు.

ఏ బంధువుల యింట్లోనూ అన్నం తినటం లేదతను.

అయితే, ఎవరింట్లో భోజనం చేశానని చెపుతున్నాడో, వాళ్ళింట్లోనే రోజంతా కాలక్షేపం చేస్తున్నాడు. వాళ్ళతో మాత్రం ఇంటిదగ్గర తిని వచ్చానని చెపుతున్నాడు. పైపెచ్చు, మామూలుగా తాగే పాలు కాఫీ ఫలహారాలు గూడ పుచ్చుకోవటం లేదు.

ఈ వార్తలు గూఢచారి వర్గాలవల్ల తెలియంగానే పార్వతమ్మ కంగారు పడిపోయింది. ఇంట్లో తల్లికీ, తండ్రికీ చెప్పింది. ఆ రోజు యింటికి రాంగానే ముందు బంధించేశారు.

నవ్వేశాడు సత్యం.

"చూడండి, ఇవ్వాళ్ళటికి ముప్పై ఎనిమిదో రోజు. ఒక్క రెండు రోజులు మాట్లాడకండి. దయితో నన్ను వదిలెయ్యండి. అప్పటికి నా దీక్ష పూర్తవుతుంది. దానివల్ల మీ అందరికీ మేలవుతుంది" అన్నాడు.

"అమ్మాయ్, 38 రోజులు నిరాహారంగా వుండి, ఉత్సాహంగా తిరుగుతున్నాడంటే, ఇది గమనించాల్సిన విషయమే. ఏదో నియమం అంటున్నాడు. దీక్ష అంటున్నాడు. మనం చెడగొట్టటం దేనికి? వాడి యిష్ట ప్రకారమే కానీండి." అన్నాడు లింగణ్ణగారు.

ఆ రెండు రోజులూ అయినాక, ఏదైనా పెద్ద వ్రతమో, శాంతో, మరోటో చేస్తాడేమో అని ఇంట్లో అంతా అనుకున్నారు. కానీ అలాంటిదేమీ లేదు సరిగదా, రోజూ చేసే తెల్ల జిల్లేడు చెట్టు పూజ కూడా నలభై వొకటో రోజునుంచీ మానేశాడు.

పొద్దున్నే చద్దన్నం తినేశాడు.

ఇది ఏమి దీక్షో, ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు. ఒక నాలుగైదు రోజులు పోయిన తర్వాత, ఓ రోజు తెల్లవారేసరికి, ఆ తెల్లజిల్లేడు చెట్టు పీకి పక్కన పారేసి వుంది.

ఆ చెట్టు యివాళ్ళటిది కాదు. దాదాపు పదిహేను, యిరవై సంవత్సరాలుగా అది ఆ యింట్లో వుంది. దాన్ని తవ్వటం, పెళ్ళగించటం అంత తేలిక పనికాదు. కాని ఎవరో తెల్లారేసరికల్లా నిలువెత్తు తవ్వి, దాని తల్లివేరుతో సహా బయటకు తీసివేశారు.

ఎవరీ పని చేశారని చర్చ బయలుదేరింది. "నేనే" అన్నాడు సత్యనారాయణ ముక్తసరిగా. పైగా, "మీకందరికీ ఆ చెట్టంటే కడుపు మంటగా వుందిగా" అన్నాడు మోటుగా.

'పలకరిస్తే పెడసరంగా వుండే వీడి వ్యవహారం అంతా' అని విసుక్కుని ఊరుకున్నారు అందరూ. ఇక ఎవరూ దాన్నంతగా పట్టించుకోలేదు.

అప్పటికి 1962 సంవత్సరం ప్రవేశించింది. పౌరోహిత్యం చేయటం పిన్నమ్మకు ఇష్టం లేదు. ఉన్న అతుకుల S. S. L. C. తో వెంటనే ఉద్యోగం రావటం లేదు. ట్రైనింగు పూర్తయితే ఉద్యోగం ఏదైనా దొరకవచ్చు. కాని అప్పుల మాటేమిటి?

అవేవీ నోటు రాసి తెచ్చిన అప్పులు కావు— "వడ్డీ యిస్తాంలే తొందరపడకు" అనటానికి వీల్లేదు. కలవాళ్ళ దగ్గరనుంచి తెచ్చిన అప్పులూ కావు, "ఇది రాకపోతే మాకు గడవదా" అని డబాయించటానికీ వీల్లేదు.

ఇచ్చిన వాళ్ళందరూ, ఏ రోజు కారోజు సరిపెట్టుకొనే సామాన్యులే. కుర్రవాడు మంచివాడనీ, కష్టపడి, చెల్లి పెళ్ళి చేస్తున్నాడనీ, దయతో యిచ్చినవాళ్ళే. అడగలేక, అడక్కుండానూ వుండలేక, సతమతమవుతున్న వాళ్ళే.

మరి ఆ బాకీల మాటేమిటి.

అప్పు దగ్గర అద్వైతం పనిచేయదు.

బాకీపడి భక్తుణ్ణయిపోయానంటే ధర్మంకాదు.

సాధకుడి నిఘంటువులో అలసట, బద్ధకం అనే మాటలకు చోటులేదు.

సత్యనారాయణ సి. పి. సి లో పార్టుటైమ్ ఉద్యోగం సంపాదించాడు. రోజూ సాయంత్రం మూడున్నరనుంచీ, అయిదున్నర దాకా పనిచేయాలి. నెలకి ముప్ఫయి రూపాయలిస్తారు.

ఈ రోజుల్లోనే వయోజనుల కోసమై రాత్రి పాఠశాల ప్రారంభించాడు సత్యనారాయణ. ఈ పాఠశాలలోనే అతని బోధనాశక్తి పూర్తిగా రెక్కలు విప్పుకొని బయటుకు వచ్చింది. ఆ రోజుల్లో సత్యనారాయణకి టీచర్ సత్యనారాయణ అని మారు పేరు ఏర్పడిపోయింది, ఆ పేట మొత్తంలో. అన్ని వర్గాల వయోజనుల్లో, సత్యనారాయణ గౌరవం తారస్థాయికి పెరిగింది. ఆదాయం మాత్రం నేలమీదే వుండిపోయింది.

ఉన్న పనులు చాలక ఈ రెండు కొత్త పనులతో సత్యనారాయణ దినచర్య మిషను కన్నా వేగంగా పరుగెత్తుతోంది.

ఇంతలో హిందీ ప్రవేశ పరీక్ష పాసయ్యాడు సత్యనారాయణ. దానివల్ల ఎలిమెంటరీ టీచర్ ట్రైనింగు నుంచి, అప్పర్ గ్రేడ్ టీచర్ ట్రైనింగుకు మారాడు. .

అంతరంగంలోని ఆనందలోకాలకీ, బహిరంగంలోని పంకిల ప్రపంచానికీ యేక కాలంలో ప్రభువై పాలించటంలో వున్న మెళుకువల్ని నిర్విరామంగా వంట పట్టించుకుంటున్నాడు సత్యనారాయణ.

అప్పుల బాధవల్ల కష్టపడుతున్నాడనేది లోకం పలికే తేలికమాట. హృదయింలో దానికి కోటి రెట్లు మించిన బాధ్యత, భారం వుంది.

సంకటం మరీ మిక్కుటమయినప్పుడు తన కష్ట సుఖాలను, తన పొద్దుటూరు బాల్య మిత్రులతో పంచుకోవటం సత్యనారాయణ అలవాటు.

ఆ అలవాటు ప్రకారమే 1962 వ సంవత్సరం జనవరి నెల చివర్లో, గుంటూర్లో వుండి చదువుకొంటున్న బాల్యమిత్రుడు బాలసుబ్రహ్మణ్యానికి ఒక వుత్తరం రాయాలనిపించి కలం పట్టుకున్నాడు సత్యనారాయణ.

ఏది రాయాలన్నా, ఏదో ఒక మెలిక పెట్టి ఏదో ఒక వేదాంత తత్వ విషయంలోకి లాగుతోంది మనస్సు. తనకు హృదయంలో అనుభవం వుంది. బుద్ధిలో విశాలమైన దర్శనం వుంది. సమగ్రమైన సమన్వయం వుంది. కాని తను లోకపద్ధతిలో చదువుకొన్నవాడు కాదు. అందుచేత___

తన చదువు, తన సంపాదన, తన శ్రమ గురించి సంగ్రహంగా *వ్రాశాడు. రాసి, చివర్లో " నేను ఒక స్వతంత్రుడ నయినాను. కానీ నా దేహము మీద నాకు హక్కు లేదు." అని వ్రాశాడు అక్కడితో ఆపెయ్యివచ్చు ఆ వుత్తరం. కాని ఎలా ఆపగలడు? వాళ్ళకు అనివార్యమైన కష్టం రాబోతోంది. వాళ్ళ కష్టమంటే అది తన కష్టమే. అనివార్యమైన కష్టం వచ్చి పడుతున్నపుడు వివేకదృష్టితో ధైర్యం కలిగివుండటం ఒక్కటే విజ్ఞుడు చేయదగిన పని.

తన వేదాంతం అవతలివారికి రుచించదని తెలుసు. అయినా హృదయం అటే లాగుతోంది. అందుకే వెనుకటి ఉత్తరాలలోనే వ్రాశాడు

* "బాలా! నేను వ్రాయవలసినది యీ విచారము కాని నేను ఆధ్మాత్మిక దృష్టిలో దిగుచున్నాను. ఇది అంతయు నీవు చదువలేవు. కాని చదువు. చాలసేపు అర్ధము కాదు, నిదానము మీద అవుతుంది" అని.

మామూలప్పుడే దృష్టి అలావుంటే ఇప్పుడింకా ఎట్లా వుంటుంది? అందుకే అతని ధోరణి ఇలా సాగింది. " మన జన్మము దేహము లుండే దనుక, సంతోషముతో ఉండవలెను. చింతను విడచవలెను.....బాలా, ఎవరును ఈ ప్రపంచము నందు శాశ్వతము కాదు. దుఃఖము విడచవలెను. అది అంతయు విడచవలెను "........గీతలో చెప్పినదిది.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే." ఎప్పుడునూ మనస్సును నిలకడ చేసి ఒక పని చేయవలెను.

ఇలా సాగింది ఆ వుత్తరం.

తన కొక పద్ధతిలో వేదాంత శాస్త్రం రాదు. తన కది అక్కరలేక పోయింది. కాని యిప్పుడు తను అనుభవించి, ఆనందించి వూరుకోవటంకాక, ఇతరులకు చెప్పవలసిన, హెచ్చరించవలసిన, ఓదార్చవలసిన పరిస్థితి వస్తోంది. వచ్చింది. వచ్చేసింది.

ఇప్పుడిక, తను లోకమందు ప్రచారంలో వున్న భాషలో, పద్ధతిలో ప్రమాణాలతో, ఉదాహరణతో లోకానికి అవసరమైన, ఆచరణీయమైన, విధానాలను బోధించవలసి వుంది.

లోకంలో లోకంగానే వుంటూ లోకులను లోకోత్తర స్థితికి తీసుకుపోవాలి.

దీనికి కావల్సిన బోధనాపటిమ, వివరణ, చమత్కారం, భాషా నైపుణ్యం, తనకి ఉన్నాయా? లేవా? అని బేరీజు వేసుకొంటున్నాడు సత్యనారాయణ.

ప్రస్తుతం తన భాష యిటు కన్నడమూ కాదు అటు తెలుగూ కాదు. తన అక్షరాలుగూడ కొన్ని కన్నడంవీ, కొన్ని తెలుగువీ కలిసిపోతున్నాయి. మౌనానికీ, మితభాషిత్వానికీ అలవాటుపడ్డ తన వాక్యాలు ఒకోసారి విరిగిపోయి బ్రహ్మ సూత్రాలులాగ వుంటున్నాయి.

*గమనిక : ఈ వాక్యములు ఆ ఉత్తరముల నుండి యథాతథముగా ఉటంకించబడినవి.

ఇది మారాలి.

ఇక ఈ సాధన గూడ చెయ్యాలి.

అసలు వినేవాడు, ముందు చెప్పే వాడిమీద విలువ వుంచి వినాలి. అప్పుడుగాని, చెప్పినదానికి ప్రయోజనం వుండదు. కనుక చెప్పే ముందు తన విలువ పెంచుకోవాలి. అది కూడా యిక మీదట తన దృష్టిలో వుంచుకోవాలి.

ప్రస్తుతానికి యీ "బాల" కు ఒక హెచ్చరిక యివ్వటంకన్న చేయగలిగింది లేదు. అందుకనే * నా బుద్ధీ, నా మనస్సూ అంతా నీవు తెలుసుకొన్నావు. కాని యింకను అంతను తెలుసుకొనవలెను " ఉత్తరం మరీ గంభీరమై, బరువుగా తోచరాదని, మళ్ళీ కొన్ని మామూలు మాటలు వ్రాసి ముగించి పోస్టులో వేస్తూ, "నేను రాసింది వాళ్ళు ఉపయోగించుకుంటారా, ఉపయోగించుకోరా అనేది వేరే విషయం. నాకు మాత్రం యిది ట్రైనింగు. టీచర్ ట్రైనింగ్ అవుతున్నాగా, వయోజనులకు టీచర్‌గా వున్నాగా, ఇక బాలురకూ, వృద్ధులకూ గూడ టీచర్‌ని కావాలిగా" అనుకున్నాడు చిద్విలాసంగా నవ్వుకుంటూ.

మార్చి నెలలో టీచర్ ట్రైనింగు కోర్సు పూర్తి కావటంతో సత్యనారాయణకి ఒక్కరవ్వ ఊపిరి పీల్చుకొనే విశ్రాంతి దొరికింది. కాని, యీ సందులో, అతని కోసం వచ్చే ఆగంతకుల సంఖ్య హెచ్చి ఆ తీరికను పూర్తిగా మింగేసింది. ఇది చాలక లింగణ్ణ గారి ఆరోగ్యం బాగా దిగజారింది. యీ రోజుల్లోనే పిన్ని బడి వ్యవహారాల్లో మునిగి వుంటుంది కనుక, సరస్వతి స్కూలుకి పోతుంది కనుక తాతగారి సేవ గూడ కొంత సత్యనారాయణ మీద పడింది. లింగణ్ణగారి దగ్గు మరీ విపరీతంగా వుంటోంది. రాత్రిల్లూ, ఆయాసం, దగ్గు, ఉమ్ములు వీటితో ఆయనకు నిద్దర పట్టదు. ఇతరులకు నిద్దర పట్టనీ డాయన. రోగాలనీ, కష్టాలనీ, పిల్లలు తప్పి పోయారనీ, ప్రశ్నలనీ వచ్చే యీ ఆగంతకుల వల్ల ఆయనకు యీ యింట్లో కొంత అసౌకర్యం కలుగుతున్న మాట నిజమే. ఆ వచ్చిన వాళ్ళలో కొందరు సూటిగా పని చూసుకొని పోరు. ఏదో సోది మొదలెడతారు.

క్రమక్రమంగా, ఆగంతకుల రాక ఇంట్లో వారికీ, ఇంట్లో వారి మూతి ముడుపులు ఆగంతకులకీ సంకటంగా, కంటగింపుగా పరిణమించ సాగాయి.

ఒక రోజున ధ్యానంలో పడి, పాల పని మరిచి పోయాడు సత్యనారాయణ. అందుచేత ఆడపిల్ల చేత పాలు పంపించవలసి వచ్చింది. ఆ విసుగుతో సావిత్రమ్మగారు "అంత మనస్సు బిగించుకొని కూచునే వాడవు ఏ హిమాలయాలకో పోకూడదూ" అన్నది, సత్యనారాయణ బాహ్యస్పృహ లోకి వచ్చినాక. ఆ రోజే పరధ్యానంగా వున్న తనను చూసి "హిమాలయాల్లో

* గమనిక : బుద్ధి అంటే కన్నడ వాడుక ప్రకారం తెలివి అని భావం. ఇది గూడ ఆ వుత్తరంలోంచి యథాతథంగా తీసికొనబడిన భాగమే.

పుండవలసినవాడు ఇక్కడుండి పోయాడు, పాపం" అని ఎక్కిరించింది చెల్లెలు. "నిజమేరా" అని ఏంత పాడాడు లింగణ్ణ గారు. ఆ రోజే ఒక చదువు కున్న పెద్దమనిషి సత్యనారాయణ కోసం వచ్చాడు. రావటం ఏదో ప్రశ్న కోసం వచ్చినా, హిమాలయాల గురించి కబుర్లు ప్రారంభించాడు. ఆయన ఎంతసేపటికీ వెళ్ళటం లేదని విసుగెత్తి, ఆయన ఎదురు గుండానే, "ఇక ఇద్దరూ ఆ హిమాలయాలకే పోయి కబుర్లు చెప్పుకుంటే ఇహ కదిలించే వాళ్ళుండరు." అన్నది పార్వతమ్మ.

పెద్ద మనిషి చిన్న బుచ్చుకొని వెళ్ళి పోయాడు. సత్యనారాయణ ముఖం కండలు బిగించుకొని పిన్నిని సాధించ సాగాడు. ఆవిడ వొళ్ళు మండి—

"నిజంగానే చెపుతున్నారా, నువ్వు ఏ హిమాలయాలకో పోవలసిన వాడవే. పో, అక్కడికే పో" అన్నది.

మారు మాట్లాడకుండా వాకిట్లోకి వెళ్ళి పోయాడు సత్యనారాయణ. అది మామూలే. ఎవరూ లెక్క చెయ్య లేదు. కాని, ఆ మర్నాటికి గూడ అతను యింటికి రాకపోయే సరికి ఇంట్లో కంగారు బయలుదేరింది. ఆ రోజు యింట్లో అందరూ ఏదో కారణంగా, సత్యనారాయణని యింట్లోంచి వెళ్ళి పొమ్మన్న వారే కనుక, ఎవర్నీ ఎవరూ ఏమీ అనుకోలేక పోయారు. బంధువుల్లో చెప్పుకునేందుకు మొహం చెల్లలేదు, ఏం చెయ్యాలో తోచలేదు. ఆ వంకతో, యీ వంకతో బంధువుల యిళ్ళకు వెళ్ళాడేమో అని విచారించ సాగారు.

పదిహేను రోజులు గడిచాక, ఒక రోజున, తనంతట తనే మాసిన బట్టలతో, పీక్కుపోయిన ముఖంతో, నీరసించిన శరీరంతో, యింటి కొచ్చేశాడు సత్యనారాయణ. ఎక్కడికి పోయావంటే మాట్లాడలేదు.

లింగణ్ణగారు యింట్లో అందర్నీ హెచ్చరించారు, "ఎవరూ వాణ్ణి ఎక్కువగా ప్రశ్నించకండి" అని. దాంతో అందరూ అంటీ ముట్టనట్టు వూరుకున్నారు గాని, ఇలా లేచి పోయి తనంత తానే తిరిగి రావటంవల్ల ఇంట్లో సత్యనారాయణ విలువ పడిపోయింది.

ఆ విషయం అతనికి వెంటనే అర్థమయింది. అయినా అతనికేమీ చీమకుట్టినట్లు గూడా లేదు.

ఇలా వుండగా, ఒక రోజు అర్థరాత్రి—

## ప్రపంచమే ఇల్లు

"టక్ టక్, టక్, టక్." అని ఒకటే చప్పుడు, గుండె అదిరే చప్పుడు మొదలయింది. అటకమీద ఎవడైనా దూరాడేమో? తక్కునలేచి కూర్చున్నాడు లింగణ్ణగారు. ఆయనకు దగ్గు బాగా ఎక్కువగా వుంటోంది. సత్యానికి విసుగు అంతకన్నా ఎక్కువ వుంటోంది. నిద్దర

ఇంట్లో అందరికీ తక్కువగానే వుంటోంది. ఆ రోజు అర్ధరాత్రి దాటినాక, పట్టక పట్టక అందరికీ ఒక కునుకు పట్టింది. ఇంతలో యీ మోత.

ఆయన లేచేసరికి సత్యనారాయణ ఒక కుర్చీపీట వేసుకొని, అటకమీద నుంచి ఒక జాజికాయ పెట్టె దింపుతున్నాడు.

"ఏమిట్రా అదీ" అన్నారు లింగణ్ణగారు దగ్గుతూ. ఆ దగ్గుతో సావిత్రమ్మగారూ, పార్వతమ్మా లేచి కూచున్నారు. వాళ్ళుగూడ సత్యనారాయణను చూసి "ఏమిట్రా" అన్నారు. సత్యనారాయణ మౌనంగా పెట్టె కిందకు దించాడు. అది సుమారు రెండడుగుల పొడవు, ఒక అడుగు వెడల్పు వున్న పాతకాలపు జాజికాయ చెక్కపెట్టె. ఎన్నాళ్ళనుంచో అటక మీద పడి వుంది. పూర్వ మెప్పుడో, పూర్వీకులు దాంట్లో దేవతార్చన సంపుటాలు పెట్టుకొనే వారంటారు. పారెయ్యలేక, ఉపయోగంలేక, ఎప్పటినించో అటకమీద పడి ఉంది అది. ఈ వచ్చిన మోత, చెక్కపెట్టె బాపతు మోతలాగే వుంది. అందుకే సత్యనారాయణ ఆ పెట్టె దింపాడు గాబోలు.

అంతా ఆసక్తిగా చూస్తున్నారు.

సత్యనారాయణ ఆ పెట్టె తెరిచి అందులోంచి ఒక చెక్క విగ్రహంలాంటిది తీశాడు.

"ఆ పెట్టె ఖాళీ పెట్టేనే, ఇదెలా వచ్చిందీ దీంట్లోకి ?" అన్నది సావిత్రమ్మగారు.

"ఖాళీపెట్టా" అన్నాడు సత్యనారాయణ.

"ఏమిటది" అడిగింది పార్వతమ్మ

"గణపతి" తాపీగా అన్నాడు సత్యం.

"గణపతా" అని లైటు వేసి చూడసాగారు ముగ్గురూ.

సత్యం చేతిలో ఒక జానెడు వెడల్పు, జానన్నర పొడవు వున్న చెక్కముక్క వుంది. అదేదో ముడిచెక్కలా వుంది తప్పితే విగ్రహంలాగా లేదు.

"మరి వీడు గణపతి అంటాడేమిటీ" అన్నది సావిత్రమ్మగారు.

"ఏదిరా! ఇటు చూపించు" అన్నాడు లింగణ్ణగారు, కళ్ళజోడు తుడిచిపెట్టుకుంటూ. సత్యనారాయణ దగ్గర కెళ్ళి చూపించసాగాడు.

"ఇదిగో తాతా, యిటు చూడు. ఇక్కడ తొండం వుంది. ఇక్కడ బొజ్జవుంది. ఇక్కడ కాళ్ళున్నాయా, ఇక్కడ చేతు లున్నాయా:........ ఇది గణపతే"

మిగిలిన యిద్దరూ గూడా చూసారు.

"నిజమే ఎక్కడనుంచి తెచ్చావు. అయినా సరిగా చెక్కలేదేమిటి విగ్రహం ?" అన్నది సావిత్రమ్మగారు.

"చెక్కినది కాదిది. ఇది అర్కగణపతి" అన్నాడు సత్యనారాయణ.

లింగణ్ణ : అంటే

సత్యం : అంటే తెల్ల జిల్లేడు చెట్టు మొదట్లో, దాని వేరులో, స్వయంభువుగా ఏర్పడిన మూర్తి.

లింగ : నీ కెక్కడ దొరికింది.

సత్యం : మన దొడ్లోనే.

లింగ : అంటే మొన్న చెట్టు పీకిపారేసింది నువ్వేనా?

సత్యం : నేనే, దాని పేరు పీకి పారెయ్యటంకాదు. "ఉద్ధరణ"

పార్వ : మరి చెప్పవేం?

సత్యం : నన్నడిగారా మీరు?

సావి : నర్లే, ఆ చెట్టు వేర్లో ఈ గణపతి విగ్రహం వుందని నీకెలా తెలుసూ?

సత్యం : ఆయనే చెప్పాడు.

సావి : ఆయనెవర్రా?

సత్యం : ఆయనే, గణపతి.

పార్వ : గణపతి చెప్పటు మేమిట్రా.

సత్యం : ఏమిటంటే ఏమి చెప్పను. చెప్పాడు నాకు వినిపించింది. తీసి చూశాను. ఉన్నాడు. తెచ్చి యింట్లో పెట్టాను.

లింగ : మరి యిప్పు డెందుకు దించావు?.

సత్యం : దీంట్లోంచేగా టకటక శబ్దం వస్తోంది.

లింగ : ఎందుకొస్తోంది.

సత్యం : ఈయినే అటూ యిటూ దొర్లుతున్నాడనుకుంటా.

పార్వ : ఏడిచావులే. ఏ ఎలకో దూరి కదిలించి వుంటుంది.

సత్యం : కావచ్చు.

లింగ : పెట్టెకు చిల్లి వుందా?

సత్యం : లేదు.

లింగ : మూత వేసే వుందా.

సత్యం : కొక్కెం గూడా వేసే వుంది.

లింగ : మరి ఎలక ఎలా దూరింది?

సత్యం : ఏమో !

అందరూ ఆలోచనలో పడ్డారు. కొంతసేపయిం తర్వాత "ఈ విగ్రహాలూ అవీ ఇళ్ళల్లో పెట్టుకుంటే మన కేమయినా కీడేమోరా" అని సందేహం లేవదీసింది సావిత్రమ్మగారు.

"గణపతి వుంటే కీడులు పోతాయిగాని, కీడు అవుతుందా ?" ఆశ్చర్యం వ్యక్తం చేశాడు సత్యనారాయణ.

"నీ అంత భక్తి మా కుండద్దూ" పార్వతమ్మ ఎద్దేవా చేసింది.

"అది గాదురా అబ్బీ, ఇలాంటి విగ్రహాలు యిళ్ళల్లో వుంటే దానికి నైవేద్యం అవీ చేయాలి. లేకపోతే నెత్తడుస్తాయ్, ఏమనుకొంటున్నావో" ధర్మశాస్త్రం తేల్చింది సావిత్రమ్మ గారు. "అందుకే విగ్రహం కదిలిందేమో" అంది పార్వతమ్మ. ఆవిడకి నిజంగానే భయం వేసింది. "ఇంతకూ విగ్రహం కదిలిందా, ఎలుక దూరిందా ?" లింగణ్ణగారు నిగ్గదీశాడు.

"ఇదిగో, మీరుండండి. మీవి మొదటినుంచీ నాస్తికపు ఆలోచన్లు. ఒరే అబ్బాయీ, తాతయ్యకు అసలే వొంట్లో బాగుండటంలేదు. ఇలాంటివి యిళ్ళల్లో వుండటం మంచిదికాదు. రేపు ఏదయినా గుళ్ళో యిచ్చేసి రారా నామాట విని," విషయం తేల్చేసింది సావిత్రమ్మగారు. దిగ్భ్రమ అయింది సత్యనారాయణకి. ఆ వేడిలోనే "నేను ఎక్కడ వుంటే గణపతి అక్కడే వుంటాడు" అన్నాడు దాదాపు అరిచినంతగా.

ఉన్నట్టుండి కోపం వచ్చింది వీడికి అనుకున్నారు అంతా.

"చూడు నాన్నా, వీడి పొగరు." అంది పార్వతమ్మ.

"సర్లే సర్లే, అక్కరలేని దానికి అర్ధరాత్రి గోలలూ మీరూనూ. తరువాత చూద్దాం పడుకోండి" అన్నారు లింగణ్ణగారు.

మహా మహా నిర్వహణాధికారులు ఉపయోగించే ఉపాయమే లింగణ్ణగారూ ఆ క్షణాన ఉపయోగించారు.

లైటు తీసి అంతా పడుకున్నారు.

గణపతిని పెట్టెలో పెట్టి, మీద చెయ్యేసి పడుకున్నాడు సత్యనారాయణ. సత్యనారాయణకు తప్ప అందరికీ నిద్దర పట్టింది. మళ్ళీ కదులుతున్నాడు గణపతి. మోతకాకముందే మూత తీసి, గణపతిని వొళ్ళో పెట్టుకొని, కళ్ళు మూసుకొని, పద్మాసనంలో కూర్చున్నాడు సత్యనారాయణ. అంతరంగ లోకంలో సంభాషణ ప్రారంభమైంది.

"ఏమిటి ప్రభో, నన్ను కొంపలో ఉండనీవా" ?

"హాయిగా వుండు."

"మరి ఈ అల్లరేమిటి?"

"నా బాధ నాది."

"నీకు బాధేమిటి?"

"నీ పొట్ట జాన, నా పొట్ట బాన. నీ బాధెక్కువా, నా బాధెక్కువా?"

"ఏమయింది?"

"అన్నం, నీళ్ళు లేకుండా పడివున్నా నిక్కడ"

"ఉన్నాను తీసుకుపో, ఉన్నాను తీసుకుపో అన్నావు, తెచ్చాను. ఇప్పుడు ఇలా పేచీలు లేవతీస్తావేమిటి?"

"ఏమయ్యా, శాస్త్రాలన్నీ సమన్వయమైనా యంటావు. ఇంటికి తెచ్చుకున్నాక అన్నం పెట్టమని వేరే చెప్పాలటయ్యా?"

"మేలుచేస్తా, మేలుచేస్తా నన్నావు. ఇదా మేలు"

"చేస్తాను, ఓపికేది?"

"నైవేద్యం కావాలంటావు. మా అమ్మమ్మ చెప్పినమాట నిజమేనన్న మాట"

"పెద్దవాళ్ళు అబద్ధం ఎందుకు చెపుతారు?"

"అయితే యిప్పుడేం చెయ్యమంటావు?"

"ప్రస్తుతానికి కాసిని నీళ్ళు పొయ్యి. తరువాత అన్నం పెడుదువుగాని.

"తరువాతంటే?"

"నీకు మంచి చోటు దొరికినాక".

"ఇప్పుడు నేను వేరేచోటు వెతుక్కోవాలా?"

"నువ్వీ గృహస్థుల యిళ్ళలో పడి వుండేందుకు పుట్టలేదు. మర్చిపోయావా, నువ్వు చెయ్యవలసిన పని వుంది. దాని కోసం అవసరమైతే వీధివీధీ తిరిగి మంచిచోటు వెతుకోవాలి. ఎవడి కోసం_ నా కోసమా?"

"కోపం వద్దు స్వామీ"

"అయినా నేనుండగా నీకు చింత ఎందుకు?"

"నన్నేం చేయ మంటావు?"

"మంచి చోటు చూపిస్తా. నీ పనులు బాగా జరిగే మంచి చోటు చూపిస్తా, నాతోరా."

"వీళ్ళు వెంబడి పడకుండా వుండాలిగా."

"పాపం, వీళ్ళ దేముందిలే, ఓ చిన్న చిట్కా వేద్దాం లే."

"ఏమిటది"

"ముందు నా గొంతులో నీళ్ళు పొయ్యవయ్యా బాబూ"

"సరే, సరే"

వెంటనే లేచి వెళ్ళి సత్యనారాయణ స్నానం చేసి వచ్చాడు. ఇక అర్కగణపతికి అభిషేకం ప్రారంభించాడు. అభిషేకం అంటే మామూలు అభిషేకం కాదు. గొంతెత్తి మంత్రం, మంత్రం ఆగితే ఘంటానాదం, ఇలా సాగుతోంది అభిషేకం.

అక్కడ లింగణ్ణగారికి ఉన్న కాస్త తూగూ పోవటంవల్ల, దగ్గు, ఆయాసం ఎక్కువై యాతన పడుతున్నాడు. కొంతసేపు సహించుకున్నాక ఆయన మెల్లగా లేచి వచ్చి, "ఈ అర్ధరాత్రి పూజ లేమిట్రా ? ఏదైనా క్షుద్రోపాసన మొదలెట్టా వేమిట్రా?" అన్నాడు.

"ప్రణవ స్వరూపుడయిన వక్రతుండుణ్ణి అర్చిస్తుంటే క్షుద్రోపాసన అంటావేమిటి తాతా" అని నాటకం పద్ధతిలో సమాధానం చెప్పాడు సత్యనారాయణ. అసలే దగ్గలేక, ఉమ్మేయ్యలేక ప్రాణం పోతున్న లింగణ్ణగారికి వొళ్ళు మండి—

"ఏమిట్రా ఈ వెధవ రాక్షస పూజా, నువ్వూను" అని విసుక్కున్నాడు.

"రాక్షసు లెవరో, దేవత లెవరో గూడా తెలుసా నీకు" ఇంత బరితెగించి సమాధానం చెప్పటం ఇదివరకు లేదు.

"ఛీ" అని లేచి వెళ్ళిపోయా డాయన ఏం చేయాలో తెలీక. సత్యనారాయణ మళ్ళీ పూజలో లీనమయ్యాడు. అభిషేకం అయింది. కొద్దిగా పూజ అయింది, ఇంట్లో వున్న అగరొత్తుల కట్టంతా వొక్కసారే వెలిగించి దేవుడి దగ్గర పెట్టాడు. ఇల్లంతా పొగ చుట్టేసింది. ఆ పొగకు లింగణ్ణ గార్కి వూపిరాడక ఉక్కిరిబిక్కిరయింది. దీంతో పార్వతమ్మకు, వళ్ళు తెలియని తిక్కరేగింది. అసలే యిందాకటి నుంచీ, ఎందు కెందుకని బిగ పట్టుకొని వుందావిడ. ఇక ఆపుకోలేక తోక తొక్కిన తాచల్లే లేచి వచ్చి—

"ఒరేయ్! నువ్వా వెధవ పూజలు ఆపక పోయావంటే, ఆ విగ్రహాలూ, గిగ్రహాలూ తీసి బయట పారేస్తాను. ఏమిటనుకుంటున్నావో" అంది.

"నీ యింట్లో దిక్కులేని వెధవాయిలా పడున్నాననేగా అన్ని మాటలంటున్నావు. ఇట్లాంటి యింట్లో వుండే కన్నా నాలుగిళ్ళలో ముష్టెత్తుకు తిని, ఏ బస్సుస్టాండు లోనో పడుకోటం మేలు."

"రేయ్ ! అతిగా వాగకు"

"రాత్రి నే నొచ్చే సరికి, గిన్నెలు నాకేసి మీరు పడుకున్నప్పుడే నాకు అన్నం పెట్టటం నీకు కంటగింపుగా వుందని తెలుసుకున్నా."

"ఏమిటా అసందర్భపు వాగుడు. తండ్రి తిక్కంతా అందుకుందా?"

" నీ కిష్టం లేకపోతే చెప్పు. నీ కొంపలోంచి యిప్పుడే పోతా. అంతేగాని అక్కర్లేని మాట లొద్దు. అంటే నన్నను, మా నాన్న ననాల్సిన పనేమిటి నీకు ? "

"అంత పౌరుషం వున్న వెధవ్వయితే పోరా. పోతాట్ట పోతాడు, పోయి యేం చేస్తాడు? ముష్టెత్తుకు తింటాడా ? మొన్నో సారి పోయొచ్చావుగా, ముచ్చట తీరలా ? " లింగణ్ణగారు ఆయాసంలో వుండి అశక్తంగా యీ దుర్వాదం వింటున్నాడు. సావిత్రమ్మ గారు యిద్దరినీ తగ్గమని అడుగుతోంది, గాని యెవరూ వినిపించుకో లేదు. సరస్వతి అయోమయంగా చూస్తోంది. ఏమయినా యిలా పెద్దల్ని ఎదిరించటం బాగాలేదని బాధపడుతోంది.

"ముష్టే ఎత్తుతానో, ముష్టి వేస్తానో అది నీ కనవసరం. నీ యింట్లోంచి పొమ్మన్నావు, పోతున్నాను. మాట మీరటం మర్యాదగల వారి లక్షణం కాదు. " మదించిన ఏనుగులా ఘీంకరిస్తూ తన దేవతార్చన సద్దేసుకున్నాడు సత్యనారాయణ. ఏదో బతిమలాడ బోయిన అమ్మమ్మ మీద గూడా ఒక ఘీంకారం చేసి, ఆ అర్ధరాత్రి వేళ పెద్ద పెద్ద అంగ లేసుకుంటూ వీధిలోకి వచ్చేశాడు సత్యనారాయణ.

"........ఆ విధంగా అర్క గణపతి ఆజ్ఞగా మీ యింటికి చేరాను శ్రీకంఠయ్యగారూ! ఇదీ నా ఋణభారాల కథ. ఇక నా గణపతి నన్నెప్పుడు ఋణ విముక్తుణ్ణి చేస్తాడో, ఎప్పుడెక్కడకి తీసుకుపోతాడో, అంతా ఆయన దయ " అని కళ్ళు మూసుకొని కూర్చున్నాడు సత్యనారాయణ. ఎక్కువ మాట్లాడే స్వభావం లేని శ్రీకంఠయ్య గారికి యేమనాలో తోచలేదు.

" అన్నిటికీ గణపతే ఉన్నాడులే బాబూ " అని వూర్కుండిపోయాడు.



దృఢావధూతాఖిల కర్మ బంధః
ప్రాణాగ్ని సేవా పరిబోధ దక్షః।
పిశాచవద్భాని కుబుద్ధి దృష్టే
ర్నతాను భక్షోఽసి గురో యతస్త్వమ్॥

[శ్రీ గురుదేవా ! మీరు కర్మ బంధాలను బలంగా విదిలించివేశారు, ప్రాణాగ్ని ఉపాసన విధానాలను ఉపదేశించారు. మిమ్ము ఆశ్రయించిన వారి పాపాలను మీ రారగించి వేస్తారు గనుక, దుర్బుద్ధి గలవారి వక్ర దృష్టికి మీరు పిశాచ రూపంగా కనిపిస్తారు.]

## సత్యనారాయణస్వామి

వీధి పంపు కింద బిందె పడేసి, కృష్ణస్వామిగారితో లోకాభిరామాయణం మొదలు పెట్టాడు కృష్ణమూర్తిగారు. కృష్ణస్వామిగారు టీచరయి, చేతులో శిష్యులున్నా, కృష్ణమూర్తి గారు డెప్యూటీ కమిషనర్ ఆఫీసులో మొదటి గ్రేడు గుమాస్తాగా వుండి, చేతిలో ప్యూనులు వున్నా, నీటియెద్దడి ప్రతిరోజూ వీరిద్దరి చేతులకు బిందె నిచ్చి వీధి పంపు దగ్గరకు తోలుతూనే వుంది. అక్కడ యేదో పిచ్చాపాటీ కలుపుతునే వుంది. ఈ ఉదయం గూడా అలాగే కలిశారు. కలిశాక కబుర్లు మొదలైనాయి.

ఈరోజు సంభాషణ మెల్లగా ఆధ్యాత్మిక వ్యక్తుల మీద సాగుతోంది.

"అచ్చమైన మహాత్ముడొకడు నాకు తెలుసు" అన్నాడు ఉన్నట్టుండి కృష్ణస్వామిగారు.

"అసలాయన మహాత్ముడని మీ కెల్లా తెలుసు ?" అన్నాడు కృష్ణమూర్తిగారు.

"అయ్యా, నుంచున్నవాడు నుంచున్నట్టు శరీరంలో ప్రతి భాగంలోంచీ విభూతి పొంగుకొస్తూ వుంటే, ఆయన్ని మరేమంటారు ?" ఎదురు ప్రశ్న వేశాడు కృష్ణస్వామిగారు.

" ఇది మీరు స్వయంగా చూశారా? " కృష్ణమూర్తిగారిలో ఉత్సుకత పెరిగింది.

" ఇదే కాదు. యింకా కొన్ని చూశాను. "

" చెప్పండి "

" ఆయన తెల్లజిల్లేడు పూలతో పూజ చేస్తుంటే, ఆ పూలు మల్లెపూవులుగా మారినాయి. "

" జిల్లేడులా ? ఆయన ఏ దేవుడికి పూజ చేస్తారు ?"

" ఆయన గణేశోపాసకుడు లెండి. "

" అదా సంగతి! "

" వారికి నేను మల్లెపూలు తీసికెళ్ళి పూజ కిస్తే ఆయన పూజ చేస్తుంటే, ఆ పూలు తెల్ల జిల్లేడుపూలుగా మారినై. "

" ఏ వూళ్ళో వున్నా రాయన? "

" ఏ వూళ్ళో ఏమిటి ? ఈ వూళ్లోనే, యీ పేటలోనే "

" ఏమిటి, కెనరేలోనా ?"

" ఔను. కెనరేలో ఎలక్ట్రిక్ కాలనీలో "

" ఆయన పేరు ?"

" సత్యనారాయణస్వామి "

కృష్ణమూర్తిగారికి సుమారు నలభై సంవత్సరాల వయస్సు వుంటుంది. రోజూ శాస్త్రోక్తంగా పూజ చేసుకొనే అలవాటు వుంది. అందుచేత ఈ ప్రసక్తి నిజంగానే ఆయనలో ఆసక్తిని రేపింది. ఆ రోజు సాయంత్రమే ఆయన సైకిలు తీసుకొని కొబ్బరికాయ, అరటిపళ్ళు, పూలు, కర్పూరం, అగరవత్తులు పట్టుకొని ఎలక్ట్రిక్ కాలనీకేసి బయలుదేరాడు.

అది అక్టోబరు నెల కావటంవల్ల తొందరగా చీకటి పడుతోంది. వీధిలైట్లు వెలిగినై. అది తనకు బాగా పరిచయమైనచోటు కాకపోవటంవల్ల కొంచెం మెల్లిగానే పోతున్నాడాయన. సెంట్ ఫిలోమిన్ చర్చి దగ్గర కొచ్చేసరికి రామస్వామిగారు కనిపించాడు. రామస్వామిగారు స్కూలు మాష్టారుగా చేసి రిటైరయ్యాడు. మంచి విమర్శశీలి. కృష్ణమూర్తిగారి కుటుంబానికి ఆప్తుడు.

" ఏమిటి కృష్ణమూర్తీ, ఇటు వెళ్ళుతున్నావు " అని అడిగాడు రామస్వామిగారు.

" ఇక్కడ ఎలక్ట్రికల్ కాలనీలో ఎవరో గణపతి ఉపాసకుడు ఉన్నారంటే చూడటానికి వెడుతున్నానండీ. " అన్నాడు కృష్ణమూర్తిగారు.

" ఆయన కోసంటయ్యా ? ఆయన్ని నేను బాగా ఎరుగుదును. సత్యనారాయణ ఆయన పేరు. ఆయన మహాపురుషుడు" అన్నాడు రామస్వామిగారు సంతోషంగా.

" మీకు తెలుసా ? " ఆశ్చర్యపోయాడు కృష్ణమూర్తి.

"తెలుసా ఏమిటి? ఆయన రెండు మూడుసార్లు మా యింటికి గూడా వచ్చాడు. అక్కడి కయితే నేనూ వస్తాను పద" అన్నాడాయన. దాంతో కృష్ణమూర్తిగారికి యిల్లు వెతుక్కునే శ్రమ తప్పింది. ఇద్దరూ ఆ మాటా యీ మాటా చెప్పుకుంటూ, మెల్లిగా నడిచి శ్రీకంఠయ్య యింటికి చేరారు. అప్పటికి బాగా చీకటిపడింది. ఇద్దరూ గదిలోకి ప్రవేశించారు.

అది యిరుకు గది. ఆ గదిలో ఒక మూల ఫేము కుర్చీలో ఒక కుర్రవాడు కూర్చుని వున్నాడు, తెల్లటి పంచ లుంగీగా కట్టుకొని. పైన తెల్ల చొక్కా వేసుకున్నాడు. మొహాన, విభూతి కుంకుమ వున్నాయి. తలమీద జుట్టు గుబురుగా పెరిగి వుంది. గడ్డాలు మీసాలూ యింకా సరిగా మొలిచినట్లు లేవు. మొత్తంమీద ఇరవైయ్యేళ్ళ ప్రాంతంలో ఉంటాడేమో అనిపిస్తోంది. కోలగా, పొడుగ్గా వున్న ఆ ముఖం సౌమ్యంగా వుంది. ఆ కళ్ళు మాత్రం కొంచెం తీక్ష్ణంగా వుండే సూటిగా ఆ కళ్ళల్లోకి చూడటం సాధ్యం కావటంలేదు.

"సత్యనారాయణ స్వామి వీరే" అని స్వయంగానే తెలుస్తోంది కృష్ణమూర్తిగార్కి. దానికి తగ్గట్లు ఆ గదిలో వున్న నలుగు రయిదుగురు పెద్దమనుషులు నేలమీద మౌనంగా కూర్చుని వున్నారు. తాను తెచ్చిన పళ్ళు పూలు స్వామి పాదాల దగ్గరపెట్టి నమస్కరించాడు కృష్ణమూర్తిగారు. రామస్వామిగారు గూడ నమస్కరించాడు. స్వామి లేచి పూలమాల గోడ కున్న గణపతి ఫొటోకు వేసి, హారతి యిచ్చి, మళ్లీ కుర్చీలో కూచున్నారు. ఆ గదిలో ఎవరూ మాట్లాడటం లేదు. కొంతసేపయిన తర్వాత కృష్ణమూర్తిగారే పక్కవాళ్ళ నడిగాడు. "స్వామివారు పూజ యెప్పుడు చేస్తా"రని.

"ఉదయం ఎనిమిది, ఎనిమిదిన్నరకల్లా పూజ అయి తీర్థం యిస్తారు" అన్నారు వారు.

"నేను రేపు ఉదయం తమ దర్శనం చేస్తాను" అని లేచాడు కృష్ణమూర్తిగారు. ఆయన కెందుకో ఉండ బుద్ధి కావటంలేదు.

తల వూపారు స్వామివారు.

కృష్ణమూర్తిగారు, రామస్వామిగారు లేచి వచ్చేశారు. కళ్ళల్లో కాస్తంత కాంతి తప్పితే పెద్ద విశేషమేమీ కనిపించలేదు కృష్ణమూర్తిగార్కి. "సరే ఎందుకన్నామో అన్నాం. రేపు వచ్చి చూద్దాం" అనిపించింది. మర్నాడు ఉదయం ఎనిమిదింటికి స్వామివారి దగ్గరకు వచ్చాడాయన. అప్పటికి పూజ అయిపోయింది. ఆయన్ను చూస్తూనే, "వచ్చారా" అన్నారు స్వామి.

"కొంచెం ఆలస్యమైంది"

"ఫరవాలేదు. మీ యింట్లో అంతా బాగున్నారా?"

ఇదేం ప్రశ్న? మలేరియా డిపార్టుమెంటు ప్రశ్న అనిపించిందిగాని వెంటనే తల్లి సంగతి గుర్తుకొచ్చి "మా అమ్మగారికి పక్షవాతం వచ్చి తగ్గింది. కానీ కాలూ చెయ్యీ స్వాధీనం కాక ఇబ్బంది పడుతున్నారు." అన్నాడు కృష్ణమూర్తిగారు.

" దాందేముంది, ఒకసారి యిక్కడకు తీసుకు రండి. " అన్నారు స్వామి.

మళ్ళీ కొంతసేపు మౌనం.

" ఆదివారం హోమం జరుగుతుంది. వీలుగా వుంటే వచ్చి చూసుకోండి " అన్నారు స్వామి.

మళ్ళీ మౌనం.

కొంతసేపయాక ఏంచెయ్యాలో తెలీక సెలవు తీసుకొని వచ్చేశాడు కృష్ణమూర్తిగారు. కృష్ణమూర్తిగారికి తీవ్రమైన నిరాశ కలిగింది. ఆయన పెద్ద పేరాశతో వచ్చాడు రావటం. ఏమంటే___

ఈయన తల్లి తండ్రి, అంటే మాతామహుడు పెద్ద వేదశాస్త్ర పండితుడు, ఉపాసకుడు. ఈయన విద్యార్థిగా స్కూల్లో చదివే రోజుల్లో — అంటే పది, పన్నెండేళ్ళ వయసులో— రామాయణ, భారతాలను గురించి అప్పుడప్పుడు ఆయిన, వీరికి బోధిస్తూ వుండేవారు. ఒక రోజున ఏదో మహాత్ములు, మహత్తులు మీద ప్రసక్తి వస్తే, ' ఈ రోజుల్లో యివన్నీ ఎక్కడ వుంటాయి తాతగారూ ' అన్నాడు యీయన.

" ఎందుకుండవు ? నీ జీవితంలో నువ్వే చూస్తావు. ఒక గణపతిని పూజించే మహాత్ముడు నీకు మహత్తులు చూపిస్తాడు " అన్నాడు తాతగారు.

" ఎప్పుడు ? "

" సమయం వచ్చినప్పుడు " అన్నాడు తప్పితే, ఫలానా అపుడని చెప్ప లేదు తాతగారు.

అప్పటి నుంచీ గణపతిని పూజించే మహాత్ముడి కోసం ఎదురు చూస్తూనే వున్నాడు కృష్ణమూర్తిగారు. ఇంతవరకూ తగల్లేదు. ఇప్పుడీయన ప్రశస్తి విని ఇక్కడ కొస్తే ఇదీ తుస్సు మంది. ఏ మహత్తూ కనిపించలేదు. వారూ వీరూ చెప్పినవి నమ్మటం యిష్టంలేదు. కృష్ణమూర్తి గారు చాలా నిరుత్సాహంగా ఇంటికి వెళ్ళాడు. రోజులు దొర్లాయి. ఆదివారం వచ్చింది. పోనీ ఆ హోమం. గూడా చూసి వద్దామని పోరసాగింది మనస్సు. ఆ పోరు పడలేక బయలు దేరాడు. వెళ్ళేసరికి, ఆ యిరుకు గదిలోనే హోమానికి యేర్పాట్లు చురుకుగా జరుగు తున్నాయి. ఈయనకు ఆ గదిలోనే చోటు దొరికింది. క్రమంగా ఆ గదీ, లోపలి గదీ, వీధి వాకిలి గూడా కిటకిట లాడాయి. ఎవరో పురోహితులు వచ్చారు. హోమం ప్రారంభించారు. కొద్ది సేపట్లోనే గకార గణపతి సహస్ర నామపారాయణ మొదలెట్టారు స్వామి. అలా వారు పారాయణ మొదలెట్టిన కొద్దిసేపటికి గోడమీద వున్న గణపతి ఫోటోలో గణపతి తొండం లోంచి ఒక నీళ్ళ ధార సన్నగా కింద పడసాగింది ! ఒక పెద్ద గిన్నె, ఆ ధార కిందికి తోశారు స్వామివారు. అతి సన్నగా ఆ ధార పడుతూనే వుంది. పారాయణ సాగుతూనే వుంది ! హోమం సాగుతూనే వుంది ! !

స్వామివారి పారాయణ పూర్తయ్యే సమయానికి, అక్కడికి ఒక వ్యక్తిని కొందరు పట్టుకొని తెచ్చారు. అతను బాగా ఒడ్డూ పొడవూ వున్నాడు. బలంగా వున్నాడు కానీ, వాలకం కొంచెం చిత్రంగా వుంది. అతన్ని ఒకసారి తేరిపార చూసి, స్వామి పక్కనే వున్న ఒక సమిధ పుల్లను, ఒక పక్క తను పట్టుకొని, రెండవ పక్క ఆ వచ్చిన వ్యక్తిని పట్టుకో మన్నారు. అప్పటిదాకా మామూలుగా వున్న ఆ మనిషి, గాంౘడింపులు గాంౘడిస్తూ, చిందులు వేస్తూ ఆ సమిధ పుల్లను స్వామి చేతుల్లోంచి లాక్కోవాలని విశ్వ ప్రయత్నం చెయ్యసాగాడు. స్వామి కదల్లేదు, మెదల్లేదు కానీ పుల్ల మాత్రం వదలలేదు. నిజానికి యిద్దరూ చెరో పక్కా గుంజితే ఆ పుల్ల పుటుక్కున విరిగి వూడాలిసింది. విరగలేదు. కొంతసేపు గుంజి, యిక ఆ వ్యక్తి నీరసించాడు.

" నే వెళ్ళి పోతున్నా, నే వెళ్ళి పోతున్నా " అంటూ పుల్ల వదిలేసి ఆ వ్యక్తి కింద పడి పోయాడు.

స్వామి చటుక్కున అతని మొహాన నీళ్ళు చల్లి " అగు, ఏం కావాలి " అన్నారు.

" ముక్తి—ముక్తి " అన్నాడతను.

" పూర్ణాహుతి దాకా వుండు" అన్నారు స్వామి.

అప్పటికి ఊపిరాడినట్టైంది కృష్ణమూర్తికి. ఆయనకే కాదు,.హోమం చేసే పురోహితులకు గూడ అపుడే వూపిరాడి మళ్ళీ హోమం ప్రారంభించారు. పూర్ణాహుతి వేసే సమయం వచ్చింది. పూర్ణాహుతి పళ్ళెం చేతిలో పట్టుకొని " ఇదుగో నిన్ను గూడ పూర్ణాహుతిలో వేస్తున్నా. ఇక నీకు ముక్తే " అన్నారు స్వామి, ఆ వ్యక్తి వంక చూస్తూ.

పూర్ణాహుతి అయింది.

ఆ వ్యక్తి లేచి మర్యాదగా వెళ్ళి పక్కన కూర్చున్నాడు. కృష్ణమూర్తి గారికి విషయం అర్థమై పోయింది. ఆ వ్యక్తికి దయ్యం పట్టింది. స్వామి వారు దాన్ని నలుగురి సమక్షంలోనూ అంత అవలీలగా వొదిలించారు. ఎంత ఆశ్చర్యం అనుకున్నా డాయన లోలోపల. పూర్ణాహుతి అవుతుండగానే గణపతి తొండంలో నీళ్ళ ధార ఆగిపోయింది. ఆ నరికి పటం కింద పెట్టిన పాత్ర దాదాపు నిండింది. స్వామి అందులో నీరు ఒక గ్లాసులో పోసుకొని తాగేశారు. ఇంకా గిన్నెలో మిగిలింది అందరికీ తీర్థంగా యిచ్చారు.

" ఇది తీర్థమా ? ఏమి కలిపారు యిందులో ? ఏమో తెలీదు కానీ ఈ రుచి అపూర్వం " అనుకున్నాడు కృష్ణమూర్తిగారు. ఆ తరువాత స్వామి అందరికీ స్వయంగా ప్రసాదం యిస్తున్నారు. కృష్ణమూర్తి గారి దగ్గర కొచ్చేసరికి "మీ అమ్మగారికి, తలనొప్పి మరీ ఎక్కువగా వుంది. ఈ విభూతి వారి కివ్వండి తగ్గిపోతుంది " అన్నారు.

అప్పటికి సుమారు మధ్యాహ్నం రెండు గంటలయింది. అప్పుడు యింటికి వెళ్ళి భోంచేసి, మళ్ళీ సైకిలేసుకొని బయలుదేరాడు కృష్ణమూర్తిగారు. కృష్ణమూర్తిగారి తల్లీ తండ్రి, డాక్టర్ సుబ్బయ్య రోడ్డులో స్వగృహంలో వుంటున్నారు. కేసరే నుంచి అక్కడికి పది కిలోమీటర్లకు తక్కువ లేదు. భోజనం చెయ్యంగానే అంత దూరం సైకిలుమీద వెళ్ళేసరికి కృష్ణమూర్తిగార్కి చెమటలు పట్టినై. తను వెళ్ళేసరికి తన తల్లి నిజంగానే భరించలేని తలనొప్పితో బాధపడుతూ ఉండేసరికి ఈయన ఆశ్చర్యపోక తప్పలేదు. వెంటనే జేబులో వున్న పొట్లం తిసి, విభూతిని ఆవిడ నోట్లో చిటికెడు వేసి, కాస్త ఆవిడ నుదుట పెట్టి కబుర్లు చెపుతూ కూర్చున్నా డాయన.

ఒక అయిదు పది నిముషాలయ్యేసరికి, "పూర్తిగా తగ్గిందిరా అబ్బాయ్ తలనొప్పి" అన్న దావిడ. అపుడు తను చూసిన సత్యనారాయణ స్వామి గురించి, వివరంగా చెప్పి ఆయన దగ్గరకు పోదామన్నాడు కృష్ణమూర్తిగారు. తండ్రి రామారావుగారు, తల్లి లక్ష్మిదేవమ్మ, ఇద్దరూ అంగీకరించారు. కానీ ఇంత దూరం పక్షవాతపు మనిషిని తీసుకెళ్ళటం ఎట్లా అని కాసేపు ఆలోచించారు. "సర్లే, నా స్నేహితు డెవరన్నా కారిస్తారేమో ప్రయత్నిస్తాలే" అన్నాడు కృష్ణమూర్తిగారు. అన్నట్టుగానే ఒక మిత్రుడి కారు దొరికింది. దాంట్లో మరుసటి ఆదివారం హోమానికి, తల్లి తండ్రీతో సహా శ్రీకంఠయ్య యింటికి వచ్చాడు కృష్ణమూర్తిగారు. ఈ మాటు గూడా గణపతి ఫోటో లోంచి నీళ్ళు వచ్చినై.

హోమం జరుగుతుండగానే స్వామి కుర్చీలో కూర్చుని అందర్నీ క్యూలో వచ్చి, తమ కష్టాలు చెప్పుకోమన్నారు.

అందరూ క్యూలో నుంచున్నారు. ఇద్దరు క్యూలో నిలబడకుండా పక్కకుపోయి, క్యూలో నిలబడి వున్న వారిమీద అరవసాగారు.

స్వామి తమ కుర్చీ పక్కనే వున్న కమండలం అందుకొని ఆ నీళ్ళు వారిలో ఒకరి మీద చల్లారు. వాడు పూనకం వచ్చినట్టు కాసేపు వూగి తన కథ చెప్పసాగాడు. 'తనొక పిశాచాన్ననీ, తనకేవో కోరికలున్నాయనీ, వీణ్ణి చూసి ఒర్వలేక వచ్చి పట్టుకున్నా'ననీ సారాంశం. రెండవవాడి మీద నీళ్ళు చల్లగా వాడి మీటకి గూడా మరో పిశాచి వచ్చి ఇటువంటి కథే మరొకటి చెప్పింది.

"సరే, పూర్ణాహుతి చూడండి. మీ కోరికలు తీరిపోతాయి. యిక వీళ్ళను వదిలేయండి" అన్నారు స్వామి.

ఆ వ్యక్తులిద్దరూ నిశ్శబ్దంగా క్యూలో నిలబడ్డారు. క్యూలో కృష్ణమూర్తిగారి తల్లి దగ్గరకు వచ్చేసరికి "మీకు తగ్గుతుంది. నేను చూసుకొంటాను. కాని ఇంకా కొన్నిసార్లు రావాలి మీరు" అన్నారు స్వామి.

"సరే" అని ప్రసాదం పుచ్చుకొన్న దావిడ. పూర్ణాహుతి అయిన తర్వాత అంటూ వెళ్ళిపోయారు. ఆ మర్నాడు శ్రీకంఠయ్యగారికి రాత్రి డ్యూటీ పడ్డది. టైం ప్రకారం పొద్దున పోస్టాఫీసుకు పోయిన సత్యనారాయణస్వామి కొద్దిసేపటికే తిరిగి వచ్చేశాడు.

"అదేమిటి అప్పుడే వచ్చేశావు" అని అడిగాడు శ్రీకంఠయ్య.

"కాళ్ళు పీక్కుపోతున్నై" అన్నారు స్వామి.

"మరీ జపాలు ఎక్కువ చేశావాయె. లేతవొళ్ళు, వేడిచేసి వుంటుంది. కాస్సేపు నిద్దరపో ముందు. ఇప్పుడు జపాలు గిపాలు పెట్టక" అన్నాడు శ్రీకంఠయ్యగారు ప్రేమగా. చెప్పినట్టు గానే ఒక గంట పైగా నిద్దరపోయారు సత్యనారాయణస్వామి.

ఉన్నట్టుండి లేచి కూర్చుని "ఒరేయ్-యిట్రా" అన్నారు గంభ్ర గొంతుతో. ఆ పిలుపు, ఆ గొంతు, ఆ కళ్ళు, ఆ వాలకం అన్నీ పూర్తిగా కొత్తగా వుంది. "ఏదో పూనకం వచ్చిందు గాబోల్లా బాబూ" అని కొంచెం భయపడసాగాడు శ్రీకంఠయ్య.

"రమ్మంటే రావేరా" మళ్ళ గద్దించారు స్వామి. "చిత్తం, యిక్కడే వున్నాను! ఏం కావాలి" అన్నాడు శ్రీకంఠయ్య.

"శాంతి గణపతి నీ దగ్గరనుంచి కదలనంటున్నాడు. ఇక్కడే ఉంటానంటున్నాడు. ఏం చెప్పమంటావురా" అన్నారు స్వామి. శ్రీకంఠయ్య హృదయం తేలికబడ్డది.

"అంత దయ నామీద మీకు కలిగితే ఇంకా నేను చెప్పేదేముంది స్వామీ. అంతా మీ దయ." శ్రీకంఠయ్య నరానరి సూటిగా గణపతితో సంభాషణ మొదలేశాడు.

"సర్లే అయితే" అని మళ్ళీ పడుకున్నారు స్వామి.

"ఔను, ఈ శాంతి గణపతి ఎవరు? రోజుకో పేరు చెప్తాడే యితను" అని కొద్దిగా ఆలోచించి, "ఎవడో వొకడు, మొత్తానికి గణపతే కదా! మన అదృష్టం. మనింట్లో వుంటా నంటున్నాడంటే చాలు" అని అక్కడితో ఆ ఆలోచన వదిలేశాడు శ్రీకంఠయ్య. ఆ రోజు సాయంకాలం అయిదింటికల్లా ద్వారక వచ్చాడు. అతన్ని చూస్తూనే—

"ఏం, ఆట కెళ్ళలేదేం" అన్నారు స్వామి.

"వెళ్ళ బుద్ధి కాలేదు" అన్నాడు ద్వారక.

"సరే, యీ కుర్చీ వాకిట్లో వెయ్యి. కాసేపు బయట కూర్చుందాం" అన్నారు స్వామి.

ద్వారక సున్నపు పెళ్ళల నేలమీద కుర్చీ వేశాడు. స్వామివారు వచ్చి కూర్చున్నారు. ఆయన కూర్చున్న కొద్దిసేపటికే పుట్టల్లోంచి చీమలు వచ్చినట్లు ఆ చుట్టు పక్కల యిళ్ళల్లోంచి చిన్న చిన్న పిల్లలంతా బిలబిలామంటూ వచ్చి ఆయన చుట్టూ చేరారు. వాళ్ళని చూస్తూనే స్వామి ఉత్సాహంగా, అందర్నీ తలో పెట్టుడు పేరుతోనూ పిలుస్తూ హాస్యాలు చేయసాగారు.

ద్వారక గూడా ఉత్సాహంగా ఆ హాస్యాల్లో పాల్గొన్నాడు. కొంతసేపయిన తర్వాత పిల్లలు మాకు పటికబెల్లం పెట్టమని చెయ్యి చాచసాగారు.

"ఏదీ, భజన చెయ్యందే ఎలా వస్తుందీ" అన్నారు స్వామి.

"మరి చేయించండి" అన్నారు పిల్లలు.

ఒక అరగంట పైగా వాళ్ళచేత ఏకకంఠంగా నామసంకీర్తన చేయించారు స్వామి.

ఆ కంఠం, ఆ రాగం విని సమ్మోహనమై పోయాడు ద్వారక.

"ఇతను యిదివరకు స్కూల్లో ఉత్సవాల్లోనూ, నాటకాల్లోనూ పద్యాలూ పాటలూ పాడటం నే నెరుగుదును. కానీ దీనికీ దానికీ పోలిక లేదు. ఎక్కడ నుంచి పట్టాడు ఈ నేర్పు. ఆశ్చర్యంగా వుందే. ఇది కేవలం భజన కాదు. కేవలం పాట కాదు. ఈ రెంటికీ మించి యిందులో ఏదో వుంది. ఇతను పాట పాడితే వినే ఛాన్సు పోగొట్టుకోరాదు మనం." అనుకుంటున్నాడు ద్వారక, తనుగూడ పిల్లలతో కలిసి భజన చేస్తూ.

ఆ చల్లని సంధ్యాకాలంలో జరుగుతున్న ఆ భజనలో నాలుగు దిక్కుల నుంచీ పోగయిన పక్షులూ ఆనందంగా గొంతులు కలిపి గలగల మన్నాయి. దూరాన చాముండీ కొండ నుంచి వచ్చిన సాయంకాలపు గాలులు, అమ్మవారి ఆశీస్సులను చల్లచల్లగా అందించినై. పై పుణ్య శ్లోకాల చిన్నారులకుగూడ యీ కమ్మని పాటలు వినిపించి, ఒకరొకరుగా పరిగెత్తుకొస్తున్నారు కాబోలు, ఆకాశంలో ఒకటి రెండు నక్షత్రాలు మినుకుమినుకు మంటూ కనిపించినై.

ఇక రద్దీ మరీ యెక్కువౌతుందనుకున్నారో యేమో స్వామి పాట ఆపారు. పాట ఆగిన వొకటి రెండు నిమిషాలవరకూ ఎవరూ కదల లేదుగాని, ఆ తరువాత అందరూ కప్పల తక్కెటుల్లే గంతులు వేస్తూ పటికబెల్లమని ఒకడూ, పప్పుబెల్ల మని ఒకడూ, ఖర్జూరాలని ఒకతే, ఇలా గోలగోల చెయ్యసాగారు.

స్వామి, వారితో కలిసి తనూ హాస్యం చేస్తూ, "నీకు ఖర్జూరం కాదురా, కొబ్బరిస్తా తీసుకో" అంటూ నేలమీదికి, చేయి పెట్టి అందిన రాయి విసిరారు. అది కుర్రవాడు దొరక పుచ్చుకొన్నాడు. వాడి చేతిలో పడేసరికి అది ఎండుకొబ్బరి ముక్కయింది. ఇలా ఆయన ఒక్కొక్క రాయి విసురుతున్నారు. మరోడి చేతిలో అది కలకండ చెక్క అయింది. మరొక్కతె చేతిలో బెల్లం గడ్డ అయింది. ద్వారకకి తనే లోకంలో వున్నాడో అర్థం కావడం లేదు. మధ్యలో స్వామి చేతికి ఏదో సున్న పుగడ్డ దొరికితే ద్వారకాని పిల్చి అతని కేసి విసిరారు. అది అంత లావు పటికబెల్లపుగడ్డ అయింది. పిల్లలందరికీ తలోటీ దొరికాక అందర్నీ యిళ్ళకు పంపేశారు స్వామి. ఆ సరికి కొందరు పెద్ద వాళ్ళు వచ్చారు. స్వామి మళ్ళీ గదిలోకి వెళ్ళిపోయారు.

వెళుతూ "ద్వారకా, రేపొస్తావా" అన్నారు స్వామి. "ఇలాగే పటికబెల్లం దొరుకుతుందా" అన్నాడు ద్వారక. "నీ అదృష్టం" అని వెళ్ళిపోయారు స్వామి, "నా మహత్తు కన్నా, పటికబెల్లం మహత్తు గొప్పదిరా బాబూ" అంటూ.

నిజంగానే పటికబెల్లం మహత్తు తిరుగులేనిది. ద్వారక ఫుట్‌బాల్ ఆట మాని, మర్నాడు సాయంత్రం మళ్ళీ వచ్చాడు.

## బహిరంగ హోమం

ఆ రోజు ద్వారక వచ్చేసరికి, అతని వయస్సు వాళ్ళు మరో ముగ్గురున్నారు. వాళ్ళందరూ ఆ పేటవాళ్ళే. ద్వారకలాగా కాకుండా బుద్ధిమంతులని పేరు పొందినవాళ్ళు. రోజూ స్వామి దగ్గరకు భక్తిగా వచ్చేవాళ్ళు.

ద్వారక వచ్చేసరికి, స్వామి ఏదో ఆలోచనలో గంభీరంగా వున్నారు. కొంతసేపయినాక,

"ఏమయ్యా, ఆదివారాలు హోమానికి జనం పెరిగిపోతున్నారు. ఇంట్లో చోటు చాలటం లేదు, ఏంచేద్దామంటారు" అన్నారు.

"ఏం చెయ్యాలో మీరే చెప్పండి స్వామీ, మేం చేసేస్తాం" అన్నాడు ద్వారక దూకుడుగా.

"అది కాదయ్యా! ఏం చేద్దాం చెప్పండి, నరసింహా నువ్వేమంటావు?" అన్నారు స్వామి.

'అల్లాగే లోపల సద్దుకోవటం మంచిది స్వామీ' అన్నాడు నరసింహం; అంతకన్నా ఏం చేస్తాం అన్నాడు నటేశం; నాకూ ఏమీ తోచటం లేదు అన్నాడు వెంకట.

"పోనీ మనకు ఎదురుగా పెద్ద బయలు వుందిగదా, దాంట్లో చిన్న షామియానా లాంటిది వేసుకుంటే యెలా వుంటుంది?" అన్నారు స్వామి.

"షామ్యానా అంటే అద్దె అదీ చాలా అవుతుందేమో" అన్నాడు నరసింహ.

"ఛ! ఎందుకు? నాలుగు కర్రలు పాతి పైకేదయినా టార్పాలిన్ లాంటిది వేస్తే షామ్యానా బాబు లాగుంటుంది. అయితే టార్పాలిన్ ఎక్కడ ఫ్రీగా దొరుకుతుందో చూడాలి" అన్నాడు ద్వారక.

"మరి వాసాలో" అన్నాడు వెంకట.

"వాళ్ళింట్లో, వాళ్ళింట్లో తలో రెండు కర్రలు తెచ్చి మళ్ళీ వాళ్ళ కిచ్చేస్తే సరి" అన్నాడు ద్వారక.

"ఎవరిస్తారు?" అన్నాడు నటేశ.

"నేనడిగితే ఎవడీయడు?" అన్నాడు ద్వారక.

"దీనికంతా కూలీలు కావాలిగా" అన్నాడు నరసింహం.

"ఏం, మనం చాలమా? మీకు చేతకాకపోతే మీరు తప్పుకోండి. మనం, మన గ్రూపుతో వచ్చి మొత్తం షామ్యానా వేసేస్తాం" అన్నాడు ద్వారక గుండె కొట్టుకుంటూ.

"అబ్బే అదేం లేదు, వీళ్ళూ పని చేస్తారు" అని సద్దారు స్వామి.

"సరే, మరి టార్పాలిన్ ఎక్కడ దొరుకుతుంది?" స్వామి అసలు సమస్య గుర్తు చేశారు.

"ఉండటమైతే మన కాలనీలో ఎలక్ట్రిసిటీ ఆఫీసులో పెద్ద టార్పాలిన్ ఒకటుంది. దానికి ఆదివారా లప్పుడు ఏం పని వుండదు. అయితే .... "అని నసిగాడు నరసింహ.

"అయితే యింకేముంది, నే వెళ్ళి లాక్కొచ్చేస్తాగా" అన్నాడు ద్వారక.

"మనలాంటి కుర్రకారు వెడితే వాళ్ళివ్వరు. వాళ్ళంతా పెద్ద ఆఫీసర్లు" అన్నాడు వెంకటు.

"ఇవ్వరా? బ్రతకాలని లేదా?" అప్పుడే ఉత్సాహం తలదాకా ఎక్కింది ద్వారకకి.

"ఏయ్ — ష్ ...." స్వామి గొంతు చాలా నిదానంగా సౌమ్యంగా వుంది. కాని ధృఢంగా వుంది. ఎందుకో వణికి పోయాడు ద్వారక. తనకు గర్తున్నంతలో భయమన్నది, అదే మొదలు తనకి. మౌనంగా తలవాల్చుకు వుండిపోయాడు.

"వెళ్ళి మర్యాదగా, సౌమ్యంగా అడుగు. ఇవ్వకపోతే వచ్చి నాతో చెప్పు. అంతవరకే" అన్నారు స్వామి. తనకి అనుమతి యిచ్చారు, అంతే చాలని పొంగి పోయాడు ద్వారక.

ఆ శనివారం నాడు సాయంత్రం ద్వారక గ్రూపంతా ఎలక్ట్రికల్ కాలనీలోకి దిగింది. దిగుతూనే తలో యింట్లోకి వెళ్ళి, ఎవరింట్లో పారా, పలుగూ వుంటే అవి తెచ్చారు. కాలనీ యిళ్ళ వరస ముందు ఎలక్ట్రిక్ పోల్సు వున్న బయిలును కొంత చదును చేశారు. తరువాత ఎవరి దొడ్లో వాసాలున్నయ్యా అని చూసి తీసుకొచ్చి పాతేశారు. ఎవరినీ అడగటం లేదు పెట్టటం లేదు. ద్వారక గ్రూపు వచ్చి పందిరి వేస్తుంటే అడగలేదని ఆక్షేపించే ధైర్యం ఆ పేటలో ఎవరికుంది? రాత్రి తొమ్మిదయ్యేసరికి బాదులు పాతారు. అడ్డ కర్రలు కట్టారు. పందిటి చట్రం తయారయింది, పైన కప్పు లేదు. "అది మీ కెందుకురా? నేను చూసుకుంటాను" అన్నాడు ద్వారక, కలిసి పనిచేస్తున్న నరసింహాదులతో.

రాత్రి పదయినాక, ఎలక్ట్రిసిటీ ఆఫీసరు గారి యింటికి ముగ్గురు నలుగురు మిత్రులతో కలసి వెళ్ళి వినయంగా నమస్కారం పెట్టాడు. ఆయనకి అప్పటికే యీ పందిరి వార్త చేరింది. అయితే యిలా అర్ధరాత్రి యింటికి వచ్చి టార్పాలిన్ అడుగుతారని అనుకోలేదు.

ఆఫీసులో వుండగా అడుగుతారేమో, కాస్త దర్జా చూపిద్దామనుకున్నాడు. కాని యిప్పుడేం చెయ్యాలి ? తను పిల్లలు గలవాడు. ఇటు పక్కా రౌడీలు. అటు పక్కా దైవ కార్యం. తన కెందు కొచ్చిన రిస్కు ? ఫ్యూన్ని పిలిచి "వారం వారం వీళ్ళకు టార్పాలి నిచ్చేయ్యండోయ్" అన్నాడు. కుర్ర వాళ్ళంతా వంగి నమస్కారాలు చేశారు. అప్పటికి కొంచెం ధైర్యం పుంజుకొని—

"ఇదిగో, ఆదివారం, చీకటి పడేటప్పటికి అది మళ్ళీ ఆఫీసులో వుండాలి. నే నసలే స్ట్రిక్టు. మాట తేడా వస్తే సహించను" అన్నాడు బిగ్గరగా.

"యస్—సర్." అన్నారు కుర్రవాళ్ళంతా పోలీసు కానిస్టేబుల్సులాగా.

రాత్రి పన్నెండయ్యే సరికి టార్పాలిన్ పందిరి తయారయింది. తెల్లారేసరికి చుట్టూ మామిడి తోరణాల మీద మత్తుగా తూగాడుతున్న మంచు బిందువులు సూర్య కిరణాలను చూసి పళ్ళన్నీ తెరిచి పకా పకా నవ్వాయి. ఆ రోజు అగ్ని హోత్రుడు 'హమ్మయ్య' అని ఆనందంగా వొళ్ళు విరుచుకొని జ్వలించాడు, 'అబ్బ, నా బందిఖానా వదలిపోయింద'ని హోమధూమం గాలి తెరల మీద స్వారీలు చేసింది. "ఆహా, ఇక నుంచీ నా పిల్లలందరినీ తీసుకురావచ్చు" అని సంబరపడ్డది ప్రతి తల్లీ.

"బావుంది, ఒకడుగు ముందుకు వేశావు." అని స్వామిని అభినందించాడు అర్కగణపతి. కొన్ని వారాలు గడిచినై. 1963 ప్రవేశించింది.

ఒక రోజు స్వామి ద్వారకని పిలిచి "అడగకుండా ఎవరింట్లోనూ ఏమీ తీసుకు రాను అని ప్రమాణం చేయి." అన్నారు కోపంగా.

"ఏం జరిగింది స్వామీ" అన్నాడు ద్వారకా.

"ముందు ప్రమాణం చెయ్యి" గద్దించారు స్వామి.

"అలాగే, అడక్కుండా ఏదీ తీసుకురాను" అన్నాడు చిన్న మొహం చేసుకొని.

"నువ్వు చేసే పనుల వల్ల నాకు అప్రతిష్ట అవుతోంది తెలుసా" అన్నారు స్వామి లాలనగా.

"ఓహో అలా వచ్చిందా లిటిగేషను ? అదా పాయింటు ? సర్లెండి. ఇక మీకు మాటరానీను" అన్నాడు ద్వారక ఉల్లాసంగా. స్వామి చాలా సంతోషించి ఒక అరటి పండిచ్చారు. అది తటాలున తినేసి, "స్వామీ, స్వామీ, ఈ చిన్న అరటి పండేం చాలుతుంది. ఒక పటిక బెల్లం గడ్డ యివ్వండి" అన్నాడు. అని ఆగలేదు. వాకిట్లోకి పోయి ఒక సున్నపు బెడ్డ తెచ్చాడు. "ఇదేమిట్రా" అన్నారు స్వామి నవ్వుతూ. "ఇదుంటేగా పటిక బెల్లం వచ్చేది. ఒకసారి చేతిలో పెట్టుకోండి స్వామీ. ఒక్కసారి పట్టుకోండి చాలు" అని బ్రతిమాల సాగాడు ద్వారక.

"అది అక్కర లేదురా, అవతల పారేయ్" అని స్వామి యెన్ని సార్లు చెప్పినా వినడే. కొంతసేపాగి "అరే, అదేమిట్రా" అన్నారు స్వామి, వెంటిలేటర్ వేపు చూపిస్తూ. అక్కడ ఒక పెద్ద పటికబెల్లపు గడ్డ వుంది. ఒక్క అంగలో అది తెచ్చుకొన్నాడు ద్వారక. తెచ్చుకొని "ఇది కూడ ఒకసారి ముట్టుకోండి స్వామీ. మీ సొమ్మేం పోయె. అక్కడ పెద్ద గుట్ట వుందిగా, సున్నపు బెడ్డలగుట్ట" అంటూ స్వామి చేతులో బలవంతంగా పెట్టాడు ఆ బెడ్డ. అది నిజంగానే పటికబెల్లంగా మారింది. ఆ రెండు పటికబెల్లాలూ, చెరో చేత్తో పట్టుకొని దిగ్విజయం చేసినంత గర్వంగా వెళ్ళిపోయాడు ద్వారక.

కొద్ది రోజులు గడిచాయి.

హోమం బయటి పందిట్లోకి మారిన దగ్గర నుంచీ స్వామి పద్ధతిలో చాల మార్పు రా సాగింది. ప్రతి వారం హోమ ద్రవ్యాలు విపరీతంగా వచ్చి పడసాగాయి. నెయ్యి మొద లయినవి బాగా మిగిలిపోసాగాయి. హారతి పళ్ళెంలో డబ్బు అధికం కాసాగింది. అయితే పూర్ణాహుతి కాగానే, ఆ డబ్బు పూర్తిగా ఎవరికో ఒకరికి యిచ్చెయ్యటం, స్వామివారి నియమం కావటంవల్ల, డబ్బేదీ మిగిలేది కాదుగాని, హోమ ద్రవ్యాలు బాగా మిగిలి వుండేవి. ఇక వారంలో ఎప్పుడు పడితే అప్పుడు హోమం చెయ్యసాగారు స్వామి. శ్రీకంఠయ్య యింట్లో వుంటే అయన గూడ కలిసేవాడు. లేకపోతే స్వామి వొకరే హోమం చేసేవారు. ఒకసారి అర్థరాత్రి లేచి, హోమం చేసేవారు. ఒకసారి మిట్టమధ్యాహ్నం చేసేవారు.

"గణపతి చెయ్యమన్నప్పుడు మనం చెయ్యాలి. మనకు తోచినప్పుడు చేస్తే ఏం లాభం". అనేవారు స్వామి.

అయితే ఈ హోమాలన్నీ యింట్లోనే జరిగేవి. ఎప్పుడు జరుగుతాయో ఎవరికీ తెలియదు గనుక సామాన్యంగా వేరే ప్రేక్షకు లెవరూ వుండేవారు కారు.

ఒకరోజు ఉదయం స్వామి శ్రీకంఠయ్యని పిలిచి "శ్రీకంఠయ్యగారూ, మీకు మంత్రోప దేశం చెయ్యమంటున్నాడు ప్రశ్న గణపతి. ఈ అవతారంలో మొట్టమొదటిసారిగ ఉపదేశం పొందే అదృష్టం మీకు పడుతోంది. రండి, ఉపదేశం తీసుకోండి. ఈ మంత్రంతో మీరు ముమ్ముందు బాగా పని చెయ్యాలి" అన్నారు. శ్రీకంఠయ్యగారు నిజంగానే ఆనందించాడు. మంత్రోపదేశం అయిన దగ్గర నుంచీ ఆయన గణపతి అర్చన స్వయంగా చేయటం పెంచాడు.

ఆదివారం హోమాలకు జనం రావటం పెరిగింది. అయిదారు వందల మంది జనం కనీస పక్షంగా చేరుతున్నారు. జనం వస్తున్నకొద్దీ స్వామికి వార్ని పలకరించే పని పెరుగుతోంది. అందువల్ల ఆదివారం హోమాలకు ఋత్విక్కులను ఏర్పాటు చేయటం మొదలు పెట్టారు. పూర్ణాహుతి మాత్రం స్వామి స్వయంగా చేసేవారు. పూర్ణాహుతి ముందు, తరువాత

గూడ స్వామి అందరిదగ్గరకూ వరసగా వెళ్ళి ఎంతో ప్రేమగా పలకరించేవారు. వారి కష్టాలు అడిగి తెలుసుకొనేవారు. ఒక్కొక్కళ్ళని పాదాలు పట్టుకొని నమస్కారం పెట్టమనేవారు. అయితే జనం తక్కువ వాళ్ళు కాదు: స్వామి తమ దగ్గరకు స్వయంగా వస్తున్నా ఆగలేక యీ లోగానే తొక్కిసలాట చేసేవారు. అలాంటప్పుడు స్వామి శీఘ్రకోపి, పైగా ఉగ్రమూర్తి. పూనకమొచ్చిన వాడిలాగ చేతులు విసురుకుంటూ వెర్రరుపులు అరుస్తా రాయన కోపం వస్తే. ఆ ఉగ్రం దిగేవరకూ, ఎవరికీ దగ్గరకూ వెళ్ళే సావకాశమే వుండదు.

జనం పెరుగుతున్నకొద్దీ వాళ్ళ చేత సత్కర్మ చేయించ వలసిన బాధ్యత గూడ స్వామికి పెరగ సాగింది. అందువల్ల ఆదివారాల్లో గంటల తరబడి తను స్వయంగా సంకీర్తన చేస్తూ వారిచేత చేయించేవారు.

ఆ రోజుల్లో పాటలు తక్కువ. ఒక నామం, పట్టుకుంటే ఆ నామం కొన్ని గంటలసేపు సాగేది. ఏమి పాడే వారో, ఏమి రాగమో, ఎవరికీ తెలియదు గాని ఆయన పాడు తున్నంత సేపూ ఒక్క మనిషిగూడ కదిలి పోయేవాడు కాదు. ఒక చిన్న వేదిక మీద కూర్చొని, చేత చిరతలు పట్టుకొని నామం చెప్పటం ప్రారంభించగానే ఆయన కళ్ళు అప్రయత్నంగా మూసుకు పోయేవి. అలా కళ్ళు మూసుకొని ఆయన నామం చెప్పుకుంటూ పోతుంటే సభంతా చీమ చిటుక్కు మనడానికి వీలులేదు. ఆ గానం ఎన్ని గంటల సేపు సాగుతుందో, ఎవరూ చెప్పలేరు. అయితే ఆయన కళ్ళు మూసుకొని నామం చేస్తుండగా ఇక్కడ సభలో అనేక మందికి, అనేక మహత్తులు కనిపిస్తూ వుండేవి. కొందరి ముందర గాలిలోంచి విగ్రహాలు రాలేవి. కొందరి చేతుల్లో విభూతో కుంకుమో ప్రత్యక్షమయ్యేది. కొందరి రోగబాధ తక్షణం అంతర్ధాన మయ్యేది. కొందరికి ఉపాస్య దేవత సాక్షాత్కరించేది. ప్రజలు గోల చేసి గందరగోళం చెయ్యకుండా వుంటే వచ్చిన వాళ్ళందరినీ పలకరించి, కావలసిన ఉపకారం చేసి పంపేవారు, ఎంత పొద్దు పోయినా సరే.

ఒక ఆదివారం నాడు ఒక భక్తుడు ఉత్సాహంగా నాదస్వర వాయిద్యం ఏర్పాటు చేశాడు. ఆ మేళగాళ్ళకు ఉత్సాహం వచ్చి అద్భుతంగా వాయించారు. అది వింటున్న స్వామికి కళ్ళంబడి ఆనందబాష్పాలు ప్రవాహం కట్టాయి. ఆయన క్రమంగా సమాధిలోకి జారిపోయారు. ఆయన శరీరం పక్కకు ఒరిగి పోయింది. సభలో పెద్ద కలకలం రేగింది. కొంతసేపయింతర్వాత స్వామి స్పృహలోకి వచ్చారు. వచ్చి ఆ రోజు మంగళహారతి పళ్ళెంలో వచ్చిందంతా నాదస్వరకారుల వొళ్ళో పోశారు. పళ్ళెంలో ఎంత వచ్చిందో లెక్క పెట్టే వాడుక లేదు. ఏమయినా అది ఆ రోజుల్లోనే వంద రూపాయలకు తక్కువ వుండదని అంచనా.

దాంతో స్వామికి సంగీతం అంటే ప్రాణం అని స్పష్టంగా తెలిసింది. పైగా ఆయన బాగా సత్కరిస్తారు అని గూడ తెలిసింది. దీనితో స్వామి వారికి ప్రీతి కలిగించ దలచుకున్న వారు

మంచి సంగీత విద్వాంసులను తీసుకు రావటం పరిపాటయింది. అలా వచ్చిన సంగీతకారులకు స్వామి సన్నిధిలో ఏదో అపురూపమైన అనుభవం జరిగి అటుపైన వారంతట వారే రావటం సాగింది.

ఇలా క్రమంగా ప్రతి ఆదివారం స్వామి హోమాలలో ఏదో వొక సంగీత సద్గోష్ఠి వుండటం పరిపాటయింది. పూజా సమయాల్లోనూ, హోమ సమయాల్లోనూ స్వామికి విపరీతమైన మడి నియమం. ఆయన్నెవరూ తాకరాదు. పురోహితులు చాలా నియమ, నిష్ఠగా వుండాలి. బాగా దక్షిణ లభిస్తుందన్న ఆశవల్ల రావటమే తప్ప యీ నియమాలు వాళ్ళకి కష్టంగా వుండేవి.

అయితే ఒకపక్క వందలకొద్దీ మహత్తులు, వాళ్ళ కళ్ళెదుట జరిగిపోతూ వుండేవి కనుక ఒక విధమయిన భయభక్తు లుండేవి. ఏమైనా, యీ నియమ కాఠిన్యం వారికి కంటగింపుగానే వుండేది. ఒకరోజున హోమం ప్రారంభమయ్యే ముందు పురోహితులు స్వామి దగ్గరకు వచ్చి– "అయ్యా! మేము ఎంతో నియమ నిష్ఠలతో హోమం చేస్తున్నాం. ఆ ఫలం వల్ల మీరు ప్రజలకు రోగాదులు నయం చేస్తున్నారు. సంతోషమే. అయితే మీరు యిటు హోమం జరుగుతుండగా, అటు నానా జాతులవార్నీ ముట్టుకొని వచ్చి, ఆ గుడ్డలతోనే పూర్ణాహుతి చేస్తున్నారు. ఇది అధర్మం, తప్పు కనుక మీరు పూర్ణాహుతి అయ్యేదాకా ఎవర్నీ ముట్టుకోవటానికి వల్లగాదు" అని చెప్పారు. ఆ రోజు వాళ్ళ అదృష్టం బాగుండి స్వామి చాలా సౌమ్యంగా వున్నారు. ఆయన చెప్పారు యిలా :

"అయ్యా, నాకు మీకంటే ఎక్కువ మడే వుంది. కాని ఒక స్థితికి వెళ్ళాక ఆ స్థితిలోనే నున్నంతసేపూ నావల్ల యితరులు పవిత్రులవుతారే తప్ప నేను అపవిత్రం కాను. ఆ స్థితి దాటిపోయాక నేను మళ్ళీ నియమాలన్నీ పాటిస్తాను. ఆ స్థితిలోకి వెళ్ళకపోతే మీరెన్ని హోమాలు చేసినా ప్రజలకు ఆ ఉపకారాలు జరగవు. కనుక నేను ఆ స్థితిలోకి వెళ్ళక తప్పదు. అలా వెళ్ళినపుడు వాళ్ళు నన్ను ముట్టుకోక తప్పదు. ఇది శాస్త్ర సమ్మతమే. మీరు మీవరకు మీ నియమాలను పాటించండి చాలు."

అయ్యవార్లు ఏమీ అనలేక నోరు మూసుకొని హోమం చేశారు.

తరువాత వారం, హోమానికి అన్ని ఏర్పాట్లు అయ్యాయి. ప్రజలు యథాప్రకారం వచ్చారు. మిట్ట మధ్యాహ్నం దాటింది. అయ్యవార్లు దిగలేదు. "ఏదో పని వుండి ఉంటుంది, వస్తార్లే, వస్తార్లే" అంటూ వచ్చారు స్వామి.

చివరికి "అసలేమయిందో కనుక్కురారా" అని ఒక కుర్రాణ్ణి పంపించారు. వాడు తిరిగి వచ్చేసరికి స్వామి భక్తులచేత సంకీర్తన చేయిస్తున్నారు. వాడు వచ్చి చెప్పాడు.

"అయ్యా! పురోహితు లందరూ మీ దగ్గరకు వెళ్ళకూడదని కట్టుకట్టారట. మీరు అనాచారం చేస్తున్నారట. అది మానుకుంటామని వాగ్దానం చేస్తే తప్ప ఎవరూ రారట"

సభ స్తంభించి పోయింది. స్వామివారు మౌనంగా తల దించుకున్నారు.

ప్రథమ పరివారం

అతను పోష్టాఫీసులో కాకీగుడ్డల బంట్రోతు. "ఏయ్! ఇట్రా" అంటే వచ్చి కాగితమో, ఫైలో అందించాలి. "ఉత్తరాల మూటలు మొయ్యటం నా పని, ఫైలుతో నాకేమిటి సంబంధం" అనరాదు. అంటే ఉద్యోగం ఊడుతుంది, వూడేముందు చివాట్లతో. అయితే యితను ఫైళ్ళు అందించే విధానం గూడా చిత్రంగానే వుంటుంది ఒకోసారి.

నరసింహయ్యగారు పోష్టుమాష్టరుగా ఉండగా ఆఫీసుకు సంబంధించిన ఫైలు ఒకటి కనిపించలేదు. అది ఇనస్పెక్టరు దృష్టిలో పడ్డది. ఇనస్పెక్టరు దృష్టి అంటే శని దృష్టి. శివుడి కొడుకైనా సరే తల తెగిపోవలసిందే, తప్పదు. నరసింహయ్య ఫైలు వెతకమని సిబ్బంది నందర్నీ యిబ్బంది పెట్టసాగాడు. నిజానికి ఇందులో ఆయన నిర్దోషి. కాని ఫైలు కనిపించక పోతే ఆయన ఉద్యోగం నిలవటం కష్టం. నిలిచినా శంకరగిరి మాన్యాలు తప్పవు. అందువల్ల ఆయన బెదిరి వొణికిపోతున్నాడు. సిబ్బంది గూడ ఆయన మీద జాలిపడి, ఆఫీసంతా తిరగ దోడేస్తున్నారు, గాలించేస్తున్నారు, తూర్పార పట్టేస్తున్నారు.

మొద్దు సత్యనారాయణ మాత్రం ఒక మూల బద్ధకంగా కూర్చుండిపోయాడు. అతన్ని ఎలాగో పనిమంతుల లిష్టులోంచి తీసేశారు కనుక ఎవరూ అతని సంగతి పట్టించుకోవటం లేదు.

పోష్టుమాష్టరు నరసింహయ్య తల చేత్తో పట్టుకొని కుర్చీలో కూలబడిపోయాడు. ఆ దశలో ఆయన దగ్గరకు చేరి "సార్" అన్నాడు ఆవలించి, చిటికెలు వేసుకుంటూ సత్యనారాయణ. 'ఊఁ' అన్నాడు నరసింహయ్య విసుగ్గా. అంతకన్న ఎక్కువగా నోరు తెరిస్తే లోపల వున్న రాగం బయటకు రావచ్చు.

"తమ ఫైలేదో కనిపించటం లేదటగా సార్." అన్నాడు సత్యనారాయణ విశ్రాంతిగా.

"రామాయణమంతా విని, రాముడు సీతకి ఏమవుతాడు" అన్నాట్ట ఎవడో, అలా వుంది ఇతని తంతు. ఏం చెప్పాలో తోచక ఒకసారి తలెత్తి చూచాడు నరసింహయ్య. అతని ముఖం నిజంగానే అమాయకంగా వుంది. చేతులు రెండూ తన టేబులుమీద ఆనించి, తనవంకే ఆదుర్దాగా చూస్తున్నా డతను.

"ఊఁ" అని మరోసారి మూలిగాడు ఆయన, తల మళ్ళీ వొంచేసుకుంటూ.

"అది యిదేనా సార్?"

ఈ మాట తాచుపాము పడగెత్తినట్టు తల పైకెత్తాడు నరసింహయ్య. కాని కప్ప తెరిచి నట్టు నోరు తెరిచి బిగిసిపోయాడు ఒక క్షణం. సత్యనారాయణ చేతిలో ఆ పోయిన ఫైలు

మకమకలాడుతోంది. కాని ప్రస్తుతం ఆ దిక్కుమాలిన ఫైలు ఆయన కళ్ళకు బంగారమల్లే మిలమిల లాడుతూ కనిపిస్తోంది. మరుక్షణంలో ఆయన స్ప్రింగల్లే ఎగిరి దాన్ని దొరక బుచ్చుకుంటూ—

"ఎలా దొరికిందోయ్ నీకు" అన్నాడు.

"ఏమో సార్, ఇలా చెయ్యి పెట్టానా, అది అలా వచ్చేసింది. పోన్లెండి, కావాల్సిందదే గదా, సంతోషం. మరి నేను వెళ్ళొస్తా." అని వెళ్ళిపోయాడు సత్యనారాయణ.

ఈ వార్త పోస్టాఫీసులో గుప్పని కారుమబ్బల్లే కమ్మి, సంభ్రమాశ్చర్యాలను ధారాపాతంగా వర్షించింది. కానీ ఆ ఆఫీసు అచ్చమైన సహారా ఎడారి. అక్కడ యిలాంటి వర్షాలు చాలా ఇంకిపోయినాయి. ఇలాంటివేవో జరిగితే జరుగుగాక, ఏమయినా ఆతను బంట్రోతు.

ఒక పదిహేను కిలోమీటర్లు మిట్టరోడ్ల మీద ఎదురుగాలిలో సైకిలు తొక్కి, ఆ కాకీ బట్టలు విప్పి పారేసి లుంగీ చుట్టుకొని కూర్చుంటే అప్పుడాయన సత్యనారాయణ స్వామి. అక్కడ పాద నమస్కారములు, పాదపూజలూను.

ఇదీ అప్పటి అద్భుత మహాదశ.

ఈ తపాలా బంట్రోతు ఏదో నలుగుర్ని కట్టుకొని నాలుగు రూపాయలు సంపాదిస్తున్నంత మాత్రాన, విద్వాంసులైన మహనీయులు ఈయన చెప్పే ధర్మశాస్త్రాలకు లొంగుతారా?

"హోమమంటే ఏమిటి? అదేమయినా కాసేపు కళ్ళు మూసుకొని, కాసేపు కళ్ళుతెరచి, "అదిగదిగో గణపతి తొండం" అనటమా? చిన్నప్పటినుంచీ శ్రమపడి వల్లించాలి.

"అతని సంపాదనంతా హోమంమీద ఆధారపడి వుంది. అతనికి అక్షరం ముక్క రాదని చెప్పడానికి పొట్ట పొడవవలసిన పనిలేదు. అందుచేత ఎవరూ హోమానికి వెళ్ళకుండా బిగతీస్తే అతనికీ, అతని వందిమాగధులకు గూడ అసలు విషయం తెలిసి వస్తుంది" ఇదీ అయ్యవార్ల తెలివి. ఈ తెలివితోనే వారు కట్టుకట్టారు. అయ్యవార్ల తెలివికి కొద్ది క్షణాలు తలవంచుకోక తప్పలేదు స్వామికి.

కాని వెనువెంటనే లేచి నుంచుని, రెండు బుజాలమీదా కప్పుకున్న ఉత్తరీయాన్ని వీపుమీద నుంచి చేతుల కిందుగా ముందుకు లాగి, దాని చెంగులు, ఎదురు బదురుగా తిప్పి మెడ వెనకకు లాగి అక్కడ ముడివేసుకొన్నారు.

దాంతో ఎర్రరంగు పట్టు పంచె, లుంగీపైన తెల్ల ఉత్తరీయం, గోశాయి బైరాగుల విధానంలో బిగింపూ, రెండూ కలిసి ఒక వింత అలంకారం అమరింది. అదేమి చిత్రమో ఆ నాజూకు రూపానికి యే అలంకారమైనా నప్పుతూనే వుంది, చిన్నప్పటినుంచి యిప్పటిదాకా. సరే, ఏమయితే ఏం, చేతులకు ఉత్తరీయం అడ్డు తగలని అలంకారం ఏర్పడింది.

ఇక స్వామి స్వయంగా హోమగుండం దగ్గర యేర్పాట్లు చూసుకోసాగారు. అప్పటికే అనేక హోమాల్లో సాయపడివున్న శ్రీకంఠయ్యగారు చురుగ్గా సాయపడ్డాడు.

ప్రశ్న గణపతిని చేత పట్టుకొని స్వామి స్వయంగా హోమం ప్రారంభించారు. నిరర్గళంగా హోమం సాగిపోతోంది. ప్రేక్షకులు తన్మయులైపోతున్నారు.

స్వామి ఏకాగ్రంగా హోమం చేస్తూనే వున్నారు. మధ్యమధ్యలో విశేష బీజాక్షర మంత్రాలు జపిస్తున్నారు. ప్రజల్లో కొంతమంది ముందర కొన్ని విగ్రహాలు ప్రత్యక్షమైనాయి. కొంతమంది చెవిలో "నువ్వు ఫలానా బాధ వల్ల వచ్చావు గదూ, నేను చూసుకుంటాలే" అని స్వామి కంఠం వినిపించింది. కొందరికి అగ్నిజ్వాలల్లో గణపతి కనిపించాడు. మరి కొందరికి స్వామి కూర్చున్న చోట గాయత్రీ అమ్మవారు కనిపించింది.

హోమం పూర్తయింది. ప్రసాద కార్యక్రమాలన్నీ యథావిధిగా జరిగాయి. అందరూ అధిక సంతోషంతో ఇళ్ళకు వెళ్ళారు. "పురోహితులు రాలేదు. అందువల్ల స్వామి హోమం చేశారు" అని గూడ ఎవరూ అనుకోలేదు. "స్వామి స్వయంగా చేశారు, చాలా బావుంది" అనుకున్నారు. అంతే, ఆ రెండో మాటే ఎత్తలేదు ఎవరూ.

ఈ వారం మరింత శీఘ్రంగా రోగబాధలు నివారణ అయినాయని వార్త భక్తుల్లో వ్యాపించింది. దాంతో తరువాత వారం జనం మరింత పెరిగారు. స్వామి స్వయంగా హోమం చేశారు. ఇలా మూడు నాలుగు వారాలు జరిగింది. ఈ మూడు నాలుగు వారాల్లో జనం దాదాపు రెట్టింపు అయ్యారు. అయిదో వారం మామూలు పురోహితులు వచ్చేసి, తడిబట్టలు కట్టుకొని ఏమీ ఎరగనట్లు హోమగుండం దగ్గర యేర్పాట్లు చేసికొని పోతున్నారు. కొంతసేపటికి స్వామి వచ్చారు. పురోహితులు దగ్గరకు వెళ్ళి "ఈ మధ్య కొన్నాళ్ళు రాలేకపోయాం. తమరు క్షమించాలి" అన్నారు.

స్వామి మౌనంగా సభలోకి వచ్చారు. వేదిక మీదకు వెళ్ళి సంకీర్తన చేసుకుంటూ కూర్చున్నారు. పురోహితులు హోమం మొదలెట్టారు. స్వామి మామూలు ప్రకారమే భక్తుల దగ్గరకు వెళ్ళి పలకరించారు. అంతా మామూలుగానే సాగిపోతోంది.

క్రమంగా ఆదివారాలే గాక ఇతర వారాల్లో గూడ స్వామి యింట్లో వుండే వేళల్లో జనం వచ్చి పోవటం అలవాటయింది. అందులో కొందరు కేవలం సత్సాంగత్యం కోసం వస్తున్నారు.

స్వామికి ఎంత కోపం వుందో అంతకు రెట్టింపు హాస్య ప్రియత్వం వుంది. ఎటువంటి వార్నయినా ఆయన యిట్టే నవ్వించగలరు. ఎటువంటి విషయమైనా హాస్యంగా మార్చి చెప్పగలరు.

ఒకరోజున, ఆదివారం కాదు, స్వామి హాస్యాలు మొదలెట్టారు. ఆ హాస్యాల వరసలో "మీ కందరికీ కైలాసానికి పోయినా పెసరట్టు ధ్యాసే. శివుణ్ణి గూడ యింకో పెసరట్టెయ్యి అంటారు. అందుకని మీకు నేను పెసరట్లు వేసి పెడతాను వుండండి" అని యింట్లోంచి కిరోసిన్ స్టౌ తెచ్చారు. అది వెలిగిస్తే వెలగలేదు. ఏమిటా అని చూస్తే దాంట్లో కిరసనాయిలు లేదు. వొంచి చూచారు. చుక్క గూడ లేదు. ఏదో హాస్యాలు చేస్తూ మళ్ళీ వెలిగించారు. ఈమాటు స్టవ్ వెలిగింది.

స్వామి అట్లు వెయ్యటం మొదలెట్టారు. ఆరితేరిన ముసల్లమ్మల్లే గబగబ అట్లు వేస్తున్నారు స్వామి. అట్లు చక్కగా వస్తున్నాయి. అందరికీ తలోటీ పెడుతున్నారు.

కొంతసేపయిన తర్వాత "తలనొప్పమ్మా, తలనొప్పమ్మా" అని కోర్టు అమానులాగా బిగ్గరగా పిలవసాగారు స్వామి. అందరూ నవ్వుతూ ఎవరా ఎవరా అని చూస్తున్నారు. తనూ నవ్వుతూ ముందరి కొచ్చింది ముప్పయ్యేళ్ళ ముత్తయి దొకావిడ.

ఆవిడ పొడుగ్గా వుంది ధృఢంగా వుందిగాని, దీనంగా వుంది. కళ్ళు లోతుకి పోయి వున్నాయి. ఆవిడకు అట్టిస్తూ "ఒక ముక్క నువ్వూ తినమ్మా తల్లీ, తలనొప్పి తల్లీ. చివరకు యివన్నీ నువ్వే తోమాలి" అన్నారు.

ఎవరో అడిగారు "ఆ పేరేమిటి స్వామీ?" అని.

"ఆవిడనే అడగండి" అన్నారు స్వామి. ఆవిడ తన కథ చెప్పింది.

ఈవిడది మైసూరే. పేరు నంజమ్మ. పుట్టింటివారూ, మెట్టినింటివారూ వ్యవసాయదారులే. కలవారే. రెండేళ్ళ కిందట ఈవిడ కొడుకు, ఏకైక పుత్రుడు, పదకొండేళ్ళవాడు ఉన్నట్టుండి పోయాడు. ఆ దెబ్బ ఈవిడ తట్టుకోలేక పోయింది. మతిభ్రమించిందనుకొన్నారు. కాని దేవుడి దయవల్ల ఆ ప్రమాదం తప్పింది. కాని భరించలేని వెర్రి తలనొప్పి రాత్రింబవళ్ళు అలా నిలబడి పోయింది. అనేక వైద్యాలు చేయించారు. వైద్యుల కీ తలనొప్పి అంతుబట్టలేదు. ఆ బాధ పడలేక ఆత్మహత్య చేసుకోవాలనిపించేది. పైగా కొడుకుకోసం వొకటే దిగులు.

ఇలా వుండగా 'కెనరేలో కొత్తగా గణపతి ఉపాసకులు ఒకరు వచ్చారు. చాలా మహిమలు చేస్తున్నారు. ఒకసారి పోయి చూసిరా' అని ఎవరో చెప్పారు.

ఒక రోజు యిక్కడికి ఆదివారం హోమానికి వచ్చింది ఈవిడ. వచ్చిన రోజున స్వామి రౌద్రావతారంలో వున్నారు. కోపంవచ్చి 'పొండి, వెళ్ళిపొండి,' అని అరుస్తున్నారు. భయమేసి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళేసరికి తలనొప్పి లేదు.

ఆ రోజుల్లా హాయిగా వుంది. ఎంతో సంతోషమైంది. కాని మర్నాడు పొద్దున్నే వచ్చేసింది నొప్పి. భరించలేక ఆ సాయంత్రం మళ్ళీ వచ్చింది. ఇక్కడి కొచ్చాక నొప్పి తగ్గింది. మళ్ళీ

మరునాడు పొద్దున వచ్చింది. ఇక అర్థమైంది. ఇక్కడికి వచ్చిన రోజు తలనొప్పి రాదు. అందువల్ల రోజూ రావటం తప్పనిసరైంది. ఇలా మూడు నెలలుగా యిక్కడికి వస్తోంది. ఎప్పుడైనా ఒక రోజు రావటంకుదరకపోతే, ఆ రోజు తల బద్దలుకొట్టుకుపోతుంది. ఇలావుండగా మొన్న నాలుగు రోజుల క్రిందట ఒక తెల్లవారు జామున ఇక మెలుకువ రాబోతుండగా తన తలమీద చెయ్యి వేసి తల్లిలాగ ఎవరో నిమురుతున్నట్టు అనిపించి కళ్ళుతెరచి చూసింది.

ఎదురుగా స్వామి! తన తల నిమురుతున్నారు. తనకెంతో ఆనందమైంది. లేచి నమస్కారం చేద్దామనుకొంది కాని లేవలేకపోయింది.

"తగ్గిపోతుంది, అప్పుడప్పుడు వచ్చి ఆశ్రమంలో కాస్త పని చూస్తూవుండు" అని స్వామి మాయమైపోయారు.

"ఆశ్రమ మెక్కడబ్బా! నే నెక్కడ పనిచేయాలి" అని అర్థంకాక, ఏమడగాలో తెలీక అలా వూరుకుండిపోయింది.

ఇదీ ఆవిడ కథ. ఇది విని జనమంతా ఆశ్చర్యపోయారు.

"నీ తలనొప్పితో తొమ్మిది రోజులు నా ప్రాణం తీశావు తల్లీ. సామాన్యురాలివి కాదు నువ్వు. ప్రస్తుతానికి ఇదే ఆశ్రమం! తలనొప్పమ్మా! రోజూ వస్తూనే వుండు. మరిచిపోకు" అని మళ్ళీ హాస్యం చేశారు స్వామి.

ఆ ప్రాంతాలలోనే ఒక రోజున నలభై ఏళ్ళు దాటిన పెద్దమనిషొకడు హోమం చూట్టానికి వచ్చాడు. మధ్యరకపు వొడ్డూ పొడుగూ వుండి మనిషి బాగానే వున్నాడు గాని ఆ వాలకము, ఆ చూపూ అంతా కొంత మతి చలించిన బాపతులా వుంది. పూర్తిగా చలించి వుండక పోవచ్చు. వచ్చిన మొదటి రోజునే స్వామివారు నామం చెప్పటం ఆపి ప్రజలను కలుసుకోటానికి వేదిక దిగంగానే అతను లేచి నిలబడి ఉచ్చైస్స్వరంతో నామం చెప్పి చెప్పించసాగాడు.

స్వామిగూడ ప్రోత్సహించారు. అతను చేసిన పనివల్ల స్వామికి చాలా సౌకర్యమైంది. ఆయనెంతో సంతోషపడ్డారు. కాని అతన్ని పలకరించలేదు. ఆ తిక్క బ్రాహ్మణుడు సాయంత్రం దాకా అలా కాకల్లే అరుస్తూనే వున్నాడు. సాయంత్రానికి ప్రసాదం తీసుకొని వెళ్ళిపోయాడు. ఎందుకొచ్చాడో ఏమో పాపం, పలకరించిన దిక్కులేదు.

మర్నాడు పొద్దున్నే మళ్ళీ దిగాడు. స్వామి పలకరించలేదు. ఈ రోజు తనొక్కడే సంకీర్తన మొదలెట్టాడు. ఆ సంకీర్తన సాయంత్రం దాకా సాగింది. పలకరించిన నాథుడు లేడు. సాయంత్రం వెళ్ళిపోయా డా పెద్దమనిషి. మళ్ళీ మర్నాడు పొద్దున్నే తయారు. ఇలా యీ పట్టు విడవని విక్రమార్కుడు మూడు నెలలు, యీ మహిమల మర్రిచెట్టు దగ్గరకు వస్తూనే వున్నాడు. అతని గొంతు కొండరాతి గొట్టమో యేమోగాని యీ మూడు నెలలూ

పొద్దుటినుంచి సాయంత్రం దాకా సంకీర్తన చేస్తూనే వుంది. వచ్చేవారు వస్తున్నారు, పోయే వారు పోతున్నారు. ఈ సంకీర్తన సాగుతూనే వుంది.

అయితే యీ మధ్యలో "మహిమల మర్రి" దగ్గర అనేక మహిమలు మాత్రం ఇతని కంటబడ సాగాయి. వాటిల్లో ఇతని హృదయానికి హత్తుకున్నవి రెండు.

ఒకటి : ఒక రోజున యేదో పెద్ద జబ్బుతో యమయాతన పడుతున్న పెద్ద ముత్తయిదువ ఒకావిడ వచ్చింది. ఆవిడ తన రోగం గురించి, దాని ఘనతను గురించి చాలా చెప్పుకుంది. కాని యింతలో స్వామి ఒక మల్లెపువ్వు చేత బుచ్చుకొని ఆవిడ మీదకు బలంగా కొట్టారు. ఆ మల్లెపూవు దెబ్బతో ఆవిడ రోగాలన్నీ పటాపంచలయినాయి.

రెండు : తానలా వచ్చిపోతుండగానే ఇంటి దగ్గర తన కూతురికి జబ్బు చేసింది. తనకి వైద్యం చేయించే అంత అదృష్టం లేదు. ఆ అదృష్టమే వుంటే, రాజాగారి ప్యాలెస్‌లో ఉద్యోగం అన్యాయంగా ఎందు కూడిపోతుంది తనకు ? ఎలాగో గుండె ధైర్యం చేసి పెట్టిన హోటలు వ్యాపారం తన్ను ఎందుకు నిలువునా ముంచుతుంది? పోనీ స్వామితో చెప్పుకుందామంటే ఆయన తనవంకే చూడరాయె.

అందుచేత మొండి ధైర్యంచేసి రోజూ స్వామి యిచ్చే తీర్థం సీసాలో పట్టి తీసికెళ్ళి రాత్రిపూట కూతురు గొంతులో పోసేవాడు. అదే మందు. దాంతోనే ఆ పిల్లకు పూర్తిగా నయమైంది.

ఈ రెండు సంఘటనలూ అతని మనోవీధిలో చెరగని ముద్రవేసి చలించని ధైర్యాన్ని ప్రసాదించినై. అలా మూడు నెలల సంకీర్తన తరువాత, ఒక రోజున సంకీర్తన చేస్తుండగా ఒక కుర్రవాడు తన దగ్గరకు వచ్చి "బి. యన్. చంద్రశేఖరయ్యగారు మీరేనా" అన్నాడు.

"ఔను"

"మిమ్మల్ని స్వామివారు పిలుస్తున్నారు"

గదిలో కెళ్ళాడు చంద్రశేఖరయ్య. స్వామి కుర్చీలో కూర్చుని వున్నారు. ఇతన్ని చూస్తూనే "ఏమప్పా చంద్రశేఖరప్పా! నీ కథేమిటి" అన్నారు స్వామి. కథేమిటి అన్నారు గనక తన కథంతా చెప్పాడు. తనకు ఉద్యోగం వూడటం, హోటలు బిజినెస్ పెడితే దాంట్లో బాగా నష్టం రావటం కొంత వివరంగానే చెప్పాడు. చెప్పి చెప్పి చివరకి తన కథనాన్ని ఒక ప్రశ్నతో ముగించాడు.

"అయ్యా, అలా అన్ని రకాలుగా నష్టపోయాక పిల్లలుగల సంసారం లాగటం చాలా కష్టంగా వుండి నానాయాతనలు పడుతున్నాను. ఈలోగా మా బంధువులంతా నాకు మతి చలించిందంటున్నారు. నిజంగా చలించిందంటారా ? "

ఈ ప్రశ్న వెయ్యటం కోసమే మూడు నెలలు కాచుకొని వున్నట్టుంది.

స్వామి విసుగ్గా చూచి "ఇంతకూ నీకేం కావాలి?" అన్నారు.

చంద్రశేఖరయ్య గూడా విసుగ్గానే ఆలోచించాడు. అవును నాకేం కావాలి? అని ఆలోచించి, చటుక్కున అన్నాడు. "అనాయాస మరణం కావాలి."

స్వామి రెండు చేతులూ నెత్తిన పెట్టుకున్నారు. ఒక క్షణం తరువాత "సర్లే అన్నీ నేను చూసుకుంటాగాని నువ్వు నాతో తిరుగుతూ వుండు" అన్నారు. చాలా సంతోషమైంది చంద్రశేఖరయ్యకు. ఎందుకో తనకే తెలీలేదు.

అప్పటి నుంచీ రోజూ పొద్దున్నే వచ్చెయ్యటం, మడి కట్టుకొని స్వామివారి పూజకు సహాయంగా వుండటం, పని వున్నా లేకపోయినా రాత్రిదాకా పడి వుండటం, రాత్రి యింటికి వెళ్ళి భోంచెయ్యటం చంద్రశేఖరయ్యకు అలవాటయి పోయింది.

కొన్నాళ్ళయిన తరువాత స్వామి, "నీ పిల్లల్ని హోటలు సంగతి చూడమను" అన్నారు. "ఇది గల్లాపెట్టెలో వుంచు" అని ఒక రక్ష యిచ్చారు. అలాగే చేశా డతను. వ్యాపారం కొంచెం పుంజుకొని ఆ సంసారం సరిగా గడవసాగింది. శ్రీకంఠయ్య స్వామికి ప్రథమ శిష్యుడు కాగా, చంద్రశేఖరయ్య ప్రథమ పరిచారకుడు అయ్యాడు. నంజమ్మ ప్రథమ పరిచారిక అయింది.

## ప్రాణాహుతి

రోజూ పొద్దున పూట ఎనిమిది గంటలు లోగానే వచ్చి దర్శనం చేసుకోవటం, వెళ్ళటం D. C. ఆఫీసు కృష్ణమూర్తిగారికి మామూలయింది. క్రమం తప్పకుండా రోజూ వచ్చేవా రాయన. ఒకరోజు ఆయన రావటం పడలేదు. తొమ్మిదీ తొమ్మిదిన్నర ప్రాంతంలో తనే వాళ్ళింటికి వెళ్ళారు స్వామి. ఒక జుబ్బా, చొక్కా వేసుకొని సైకిలు మీద వచ్చిన స్వామిని చూసి కొంచెం ఆశ్చర్యపోయాడు కృష్ణమూర్తిగారు.

చిన్న వయస్సు, లేత మొహం, మామూలు బట్టలు, ఈయన స్వామి అని ఎలా అని పిస్తుంది ఎవరికైనా, ఎంత తెలిసినా? పైగా సరదాగా ఆ మాటా యీ మాటా మాట్లాడ సాగారు స్వామి. అప్పుడు ఆ వీధిలోనే ఎవరింట్లోనో ఏదో వుత్సవం జరుగుతోంది. ఆ ఉత్సవం ఏమిటని మాటల ధోరణిలో అడిగారు స్వామి.

'ఏమో' అన్నారు కృష్ణమూర్తిగారు.

"సర్లే మీరంతా ఒకసారి కళ్ళు మూసుకోండి. నేనే చెపుతా" అన్నారు స్వామి. వీళ్ళు కళ్ళు మూసుకొని తెరిచేసరికి స్వామి చేతిలో ఒక కవరుంది. అది ఆ ఉత్సవం తాలూకు శుభలేఖ. వీరికి ఆశ్చర్యమైంది గాని స్వామి బాగా చనువుగా వున్నందువల్ల సరదా పెరిగింది.

ఇంట్లో గోడకి ఒక శ్రీరామపట్టాభిషేకం పటం వుంది. "దీంట్లో గణేశుడ్ని చూపించండి" అన్నాడు కృష్ణమూర్తిగారు, ఉన్నట్టుండి ఆ పటం చూపిస్తూ.

"అడుగో" అన్నారు అంత వేగంగానూ స్వామి. ఆ పటంలో ఒక మూల గణపతి కనిపిస్తున్నాడు. ఇంట్లో అందరికీ స్పష్టంగా కనిపిస్తున్నాడు. అక్కడితో ఆగలేదు స్వామి. "ఒకసారి రేడియో పెడతారా" అన్నారు.

"ఇప్పుడేం వస్తాయి" అన్నది కృష్ణమూర్తిగారి భార్య.

"ఏదొస్తే అదే విందాం" అన్నారు స్వామి. ఆవిడ రేడియో పెట్టింది.

గణపతి మీద పాటలు వస్తున్నాయి. అలా ఒక అరగంటసేపు వరసగా అన్నీ గణపతి పాటలే వినిపించాయి.

"నే నిక వెళ్ళొస్తా" అని లేచారు స్వామి. పాట లాగిపోయినై. అప్పటినుంచీ అప్పుడప్పుడు స్వామి కృష్ణమూర్తి గారింటికి వెళుతూ వుండటం అలవాటయింది.

కృష్ణమూర్తిగారి ఆప్తుల్లో అంజనప్పగారని ఒకరు ఉండేవారు. వృత్తిరీత్యా ఆయన గవర్నమెంటులో ఉద్యోగి. అయినా ప్రవృత్తిరీత్యా మంచి సంగీతగాడు. ఆయన భార్యకు చాలా అనారోగ్యంగా వుండేది. ఎన్ని వైద్యాలు చేయించినా తగ్గలేదు. వాళ్ళకు స్వాములంటే వ్యతిరేకత లేదుగాని శ్రద్ధలేదు.

స్వామిని ఒకసారి వాళ్ళింటికి తీసుకువెడితే ఆవిడకు తగ్గుతుందని కృష్ణమూర్తిగారి ఆశ. తన తల్లికి పక్షవాత మంటేనే ఇక్కడకు తీసుకురా అన్న స్వామి, వాళ్ళింటికి రమ్మంటే వస్తారా ?

తటపటాయించి, తటపటాయించి చివరకు ఒకరోజు స్వామి తమ ఇంట్లో కూర్చున్నపుడు 'అంజనప్పగారి యింటికి ఒకసారి వెళ్ళి వద్దాం స్వామీ అని అడిగాడు కృష్ణమూర్తిగారు

సరే అని లేచారు స్వామి వెంటనే. వారింటికి వెళ్ళేసరికి ఆ రోగి ఏదో, ఏదో వాగటం మొదలెట్టింది. కొద్దిక్షణాల్లోనే అది గాలిచేష్ట అని తేలింది. స్వామి అప్పటికప్పుడే ఆ దయ్యాన్ని వదిలించేశారు. "ఇక మందు లిప్పించండి. తగ్గిపోతుంది" అని చెప్పి మళ్ళీ కృష్ణమూర్తిగారి యింటికి వచ్చేశారు స్వామి.

స్వామికి ఒకటే దాహం. ఎన్ని మంచినీళ్ళు తాగినా ఆగలేదు. పైగా "ఆకలిగా ఉంది" అనసాగారు.

"ఈ పూటకు మా ఇంట్లో భోజనం చెయ్యండి" అన్నారు దంపతులు. సరే అని ఒక లుంగీ కట్టుకొని భోజనానికి కూర్చున్నారు స్వామి. వారితో పాటు కృష్ణమూర్తిగారూ కూర్చున్నారు. స్వామి పరిషేచనం చేసి ప్రాణాహుతులు మొదలెట్టే లోపల కృష్ణమూర్తిగారు ప్రాణాహుతులై పోయి అన్నం కలిపేస్తున్నాడు.

"అప్పుడే ప్రాణాహుతులైపోయాయా" అన్నారు స్వామి ఆశ్చర్యంగా.

"ఎంతసేపండీ" అన్నారు కృష్ణమూర్తిగారు.

"అలా చేస్తే అవి ప్రాణాహుతులే కావు. ప్రాణాహుతి అంటే ఏమిటి? అందులో ప్రాణ—ఆహుతి అని రెండు పదాలున్నాయి. ప్రాణాహుతి అంటే ప్రాణానికి ఆహుతి వెయ్యటం అన్న మాట. సామాన్యంగా ప్రాణవాయువు అని వింటుంటాం గదా. ఆహుతి అనేది అగ్నిలో హోమం చేసేప్పుడు ఉపయోగించే మాట కదా. ఈ రెండూ కలిసా యేమిటి? ఈ శరీరాన్ని నడిపే శక్తి ఒకటి వుంది. అది ఉంటేనే శరీరం శరీర మవుతుంది.

అది లేకపోతే శవం అవుతుంది. యీ శరీరాన్ని నిలిపి నడిపేందుకు ఆ శక్తి ప్రధానంగా రెండు రూపాలు తీసుకుంటుంది. ఒకటి జఠరాగ్ని. దీన్నే వైశ్వానరాగ్ని అంటారు. ఇది అగ్ని స్వరూపం. రెండు ప్రాణం. ఇది వాయు స్వరూపం. జఠరాగ్ని మన ఆహారాన్ని జీర్ణం చేసి, శక్తిని పుట్టిస్తుంది. ఇలా చెయ్యటంలో జఠరాగ్నికి సాధనంగా వ్యవహరిస్తుంది ప్రాణవాయువు. శక్తి పుట్టటం మాత్రమే చాలదు. ఆ శక్తి శరీరంలోని వివిధ భాగాలకూ తగు మోతాదుల్లో చేరాలి. ఆ పని గూడ ఈ ప్రాణవాయువే చేస్తుంది. ఈ పని చేసేటప్పుడు ఆ ప్రాణం ఏక కాలంలో అయిదు రకాలుగా రూపాంతరం చెందుతుంది. అయిదు రూపాల పేర్లే ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము.

ప్రాణానికి ప్రధాన స్థానం హృదయం. దీని ప్రధానమైన పని, ఆహారంవల్ల పుట్టిన శక్తిని వివిధ శరీర భాగాలకు చేర్చటం. అపానానికి ప్రధాన స్థానం గుదం. అంటే విసర్జన మార్గం. వ్యర్థ పదార్థాలను వెళ్ళగొట్టటం దీని ప్రధాన కృత్యం. సమానానికి ప్రధాన స్థానం నాభి. ఉదరంలోకి వచ్చిన ఆహారానికి పరిణామం కల్పించటం దీని ప్రధాన కార్యం. ఉదానానికి ప్రధాన స్థానం కంఠం. సప్తస్వర పేటికను పని చేయించటం దీని ముఖ్యకార్యం. వ్యానం శరీరం అంతా వ్యాపించి వుంటుంది. కనురెప్పల కదలిక దగ్గర నుంచీ, శరీరంలోని ఆయా భాగాలకు అవసరమైన ప్రకంపనలను కలిగించటం దీని పని. డాక్టర్లు జెర్క్స్ అనీ, వైబ్రేషన్ అనీ చెపుతారే అవన్నీ ఈ వ్యాన వాయువు పనులన్న మాట.

వాయు వనంగానే అది గాలి అనుకోరాదు. ఈ అయిదూ గూడ ఒకే శక్తి రూపాంతరాలు. ఆ శక్తి పేరే ప్రాణశక్తి. దీని పేరే వైశ్వానరాగ్ని శక్తి. ఆయా దృక్కోణాలలోంచి చూచినప్పుడు ఇది అగ్ని అవుతుంది, వాయువూ అవుతుంది. దీన్ని సూచించేందుకే ప్రాణ—ఆహుతి అన్నారు పెద్దవాళ్ళు.

ఈ శక్తి యొక్క మూలరూపం పరమాత్మ. ఆ పరమాత్మ మన కోసం యిన్ని రూపాలు ధరించి ఇంత పనిచేసి మన శరీరాన్ని నిలబెడుతున్నాడు. కనుక ఆయనకు కృతజ్ఞతగా మనం ఆహారం తీసుకొనేటప్పుడు ఆయన స్వరూపాలయిన ఈ ప్రాణ, అపాన, వ్యాన, ఉదానాలను, వైశ్వానరాగ్ని రూపంగా స్మరిస్తూ భోజనం చెయ్యాలి. మొత్తం భోజనం అలా

చెయ్యటం కష్టం. కనుక కనీసం మొదటి అయిదు మెతుకులు అయినా అలా తీసాలి. అందుకే ఒక్కొక్క ప్రాణాన్ని స్మరిస్తూ, మెల్లిగా, సౌమ్యంగా ఒక్కొక్క మెతుకూ సరాసరి గొంతులో వేసుకోవాలి. దార్లో పళ్ళతో కొరకరాదు. అంతే ఆ పరమాత్మకు నివేదన చేసే ముందు నువ్వు దానిని రుచి చూడరాదన్న మాట. అలా ప్రాణాహుతులు భావనతో కలిపి రోజూ తీసుకుని ఆహారం తింటే, ఆహార దోషాలు మనకు అంటవు. జీర్ణ శక్తిలో లోటు రాదు. అందువల్ల రోగాలు రావు. బుద్ధిలోకి గూడ మంచి ఆలోచనలు వస్తాయి. అదీ ప్రాణాహుతులకు ఫలం. అందుకనే నేను ప్రాణాహుతులు వేసేసరికి యింతసేపు పడుతుంది. ఇకనుంచీ నువ్వు గూడా అలాగే చెయ్యి. హడావిడి వద్దు." స్వామి బోధ విని చాలా సంతోషమైంది కృష్ణమూర్తిగారికి.

పంక్తి పావనులైన స్వామివారి సహపంక్తి భోజనం చేసే అదృష్టం దొరికబట్టి గదా, నా కింతటి మంచి జ్ఞానభిక్ష దొరికిందని సంతోషించాడు కృష్ణమూర్తి గారు. ఆ తరువాత ఒక రోజున ఉదయార్చనలో స్వామి గణపతికి పాలు నైవేద్యం చేశారు. నివేదన అయాక ఆ పాలు తీర్థంగా యివ్వబోయి ఒక చెంచాలో పాలు తీసి పట్టుకున్నారు. చెంచాలో వున్న పాలు పొంగసాగాయి. స్వామియే ఆశ్చర్యంగా చూశారు.

చూసి దానికిందేదయినా పెట్టమన్నారు. చంద్రశేఖరయ్య ఒక బక్కెట్టు పెట్టాడు. పాలు పొంగి పొంగి ఆ బక్కెట్టు నిండి పోయింది. అప్పుడాగింది పొంగు. ఆ పాలు అక్కడున్న వారిందరికీ, తలో గ్లాసూ ప్రసాదంగా యిచ్చారు స్వామి.

మరొక రోజున మధ్యాహ్నం పదకొండు గంటల సమయంలో కృష్ణమూర్తి గారి తండ్రిగారయిన కె. రామారావు గారింటికి వెళ్ళారు స్వామి. ఆ సమయానికి కృష్ణమూర్తిగారు అక్కడే వున్నాడు. ఉన్నట్టుండి ఊడిపడ్డ స్వామిని చూసి ఆయన ఆశ్చర్యపోయాడు. పైగా కెనరే నుంచి వీరింటికి సైకిలు తొక్కుకురావటమంటే అది మాటలు గాదు, ఎంత కుర్రవాడ కయినా. పైగా ఎండ మాడిపోతోంది. అందుకనే, పాపం స్వామిగూడా రాగానే రెండో మాట లేకుండా "కాసిని మంచి నీళ్ళు యిస్తారా" అన్నారు. మొహం మీది చెమట తుడుచుకుంటూ ఎదురుగా వున్న సోఫాలో చతికిలపడ్డారు.

కృష్ణమూర్తి గారు ఒక గ్లాసుతో మంచినీళ్ళు స్వయంగా తెస్తూ "పాపం, ఇంత దూరం చెమటలు కక్కుకుంటూ వచ్చారు స్వామి. సమయానికి యింట్లో నిమ్మ పానకమన్నా లేకపోయె. ఏం చేస్తాం" అనుకున్నాడు. అలా అనుకుంటూనే స్వామి చేతికి గ్లాసు అందించ బోతూ యథాలాపంగా గ్లాసులోకి చూశాడు. అంతే, ఆయన చెయ్యి కొద్దిగా వణక సాగింది. ఆ గ్లాసులో అడుగున పెద్ద పెద్ద పటికబెల్లం గడ్డలు వున్నాయి.

స్వామితో పరిచయం మొదలయి యింకా సంవత్సరమైనా కాలేదు. అప్పటికే యెన్నో మహిమలు చూసినా తన చేతులో గ్లాసు వుండగా అందులోకి పటిక బెల్లం గడ్డలు

చేరేసరికి ఆయనకు ఆనందంతో గూడిన తత్తరం బయలుదేరింది. ఎందుకయినా మంచిదని ముందు తన చేతిలో వున్న గ్లాసు టేబులు మీద పెట్టాడు.

"పోన్లే యింకో గ్లాసుతో మంచినీళ్ళు తీసుకురా, పటిక బెల్లం కలిగాలిగా" అన్నారు స్వామి, ఏ భావమూ వ్యక్తం చేయకుండా. మళ్ళీ మరో గ్లాసు తెచ్చాడు "పాపం దాహం మరీ ఎక్కువగా వుంది గాబోలు" అనుకుంటూ. మళ్ళీ గ్లాసు అందించబోతూ చూస్తే అందులో రెండు నిమ్మపళ్ళు తేలుతున్నై. చెతికి బరువులో గూడ తేడా వచ్చింది. కానీ నీరు ఒక్కటి కింద పడలేదు. మరి ఈ నిమ్మకాయలు దీంట్లోకి ఎలా దూరాయి? అది అర్థం కాలేదు. కాని తన మనసులోని నిమ్మ పానకం కోరిక సి. స్వామి నిజం చెప్తున్నారని అర్థమైంది. దాంతో కొంచెం కొంటెతనం వచ్చింది.

"ఏలక్కాయలుంటే గాని పానకానికి రుచి రాదండి" అన్నాడు.

"సరే పట్టు" అని తన గుప్పిలి బిగించి కృష్ణమూర్తి చేతిలో గుప్పెడు ఏలకులు పోశారు స్వామి. ఆనందంగా నిమ్మకాయ పానకం తయారు చెశాడు కృష్ణమూర్తిగారు. స్వామి ఒక గ్లాసులో కొంచెం పోసుకు తాగి, "మీరందరూ తలా కాస్త పుచ్చుకోండి. గణపతి ప్రసాదం. మీ అమ్మగారికి ముఖ్యంగా యివ్వండి" అన్నారు. అలా పానకం తీర్థం యిప్పించేసి, వెంటనే వెళ్ళిపోయారు స్వామి. ఎందుకు వచ్చినట్లో, ఎందుకు వెళ్ళి పోయినట్టో!

ఆ తరువాత వీరి అమ్మ గారికి వేగంగా మెరుగుదల కనిపించసాగింది. వాళ్ళింట్లో మరొకరికి తలనొప్పి, వేరొకరికి కడుపునొప్పి తగ్గిపోయాయి. అప్పటికిగాని స్వామి ఎందు కొచ్చిందీ కృష్ణమూర్తి గారికి తెలియలేదు.

## అవధూత తత్వం

ఆ మాట స్వామికి చెప్పి కృతజ్ఞత తెలుపుకుందామని ఒకరోజు శ్రీకంఠయ్య యింటికి వెళ్ళాడు కృష్ణమూర్తిగారు. ఆ రోజు ఆదివారం. అప్పటికే తొమ్మిదయింది. మెల్లగా జనం పోగవుతున్నారు.

వీరు వెళ్ళేసరికి ఇంటి తలుపు దగ్గరకు వేసివుంది. తోసుకొని లోపలికి వెళ్ళాడు.

స్వామి ఒక లంగోటీ కట్టుకొని దండాలు తీస్తున్నారు. వీరు లోపలికొచ్చి చటుక్కున తలుపేసి, చూస్తూ నుంచున్నారు. స్వామి వీర్ని చూశారు గాని ఆపలేదు, పలకరించలేదు. ఎంతసేపటినుంచి అలా దండాలు కొడుతున్నారో తెలియదు గాని, ఆ పక్కన గోడకున్న గాయత్రీదేవి కాలెండరు, గోడ గడియారపు బిళ్ళ ఊగినట్టు యిటూ అటూ ఊగుతోంది. స్వామి వేగంగా దండాలు తీస్తే కాలెండరు గూడ వేగంగా ఊగుతోంది. స్వామి వగరుస్తున్నారు. చెమటలు

కక్కుతున్నారు కానీ ఆపటం లేదు. గాయత్రి కాలెండరూ ఆగటం లేదు. కొద్దిసేపట్లో స్వామి వంటిమీద చెమటలు ఆగిపోయాయి. వాటి స్థానంలో ఒళ్ళంతా విభూతి పొంగుకు వస్తోంది. ఆ సువాసనలు గదంతా గుబాళిస్తున్నాయి. రాలుతున్న విభూతి స్వామివారి నిట్టూర్పులకు ఎగిరెగిరి పడుతోంది. అలా గుడ్లప్పగించి చూస్తూ ఒక గంటకు పైగా నిలుచున్నాడు కృష్ణమూర్తిగారు.

పది దాటాక, ఆపి నిలబడ్డారు స్వామి. అసలే గుబురుగా ఉండే ఆ వుంగరాల జుట్టంతా చిందర వందరై మొహం మీద పడుతోంది. చిత్రం, ఆయాసం మాత్రం లేదు. శ్వాస ప్రశాంతంగా వుంది. గాయత్రీ కాలెండరు గూడ ఆగింది. స్వామి తాపీగా నిలబడి మెల్లగా చెప్పసాగారు.

"కృష్ణమూర్తీ, పూర్వ యుగాల్లో దేవుడి అవతారాలుండేవి. రాముడనీ, కృష్ణుడనీ యిలాగా. అవన్నీ యుగాల చివరల్లో వచ్చిన అవతారాలు. అవిగాక యుగాల మధ్యలో వచ్చిన అవతారాలు కొన్ని ఉండేవి, ఋషభుడనీ, కపిలుడనీ యిలాగ. కాని కలియుగంలో దేవుడు తన అవతారాలకు బదులు అవధూతల్ని పంపిస్తాడు. అవతారాలంటే యేమిటి? అవధూతలంటే ఏమిటి? పంపించటమంటే ఏమిటి? అని అడక్కు. అవన్నీ ఇప్పుడు మనకొద్దు.

ఆయన పంపించే అవధూతలకు, మన మనస్సులకు గోచరంకాని అతీత శక్తి ఉంటుంది. ఆ అగోచర అతీత శక్తివల్ల వారికి భూత భవిష్య ద్వర్తమానాలు తెలుస్తూ ఉంటాయి. భూతకాల జ్ఞానం అంటే— నిన్న జరిగింది, మొన్న జరిగింది తెలియటం మాత్రమే కాదు. ఎదురుగా ఉండే జీవుల వెనక జన్మలన్నీ తెలుస్తాయి. అలాగే భవిష్యద్ జ్ఞానము అంటే ఈ జన్మతో పాటు భవిష్యద్ జన్మ లన్నీ తెలుస్తాయి. కాని అవి ఎవరికీ చెప్పరాదు, చెప్పరు. చెప్పకపోతే తెలియట మెందుకు అంటావేమో! వారు తెలుసుకొని, తమ శిష్యుల విషయంలో ఎంతవరకూ సావకాశ ముంటుందో అంతవరకూ దుష్ఫలితాలు రాకుండా, శాంతులు చేస్తూ ఉంటారు. శిష్యులకు కొద్దిగా సూచనలు గూడా ఇస్తూ వుంటారు. సూచన లిచ్చినపుడు అందుకోవాలి శిష్యులు. లేకపోతే యిబ్బందులు తప్పవు. ఒకోసారి తమను నమ్మినవారి దుష్కర్మలను తామే నెత్తిన వేసుకొని ఆ యాతనంతా పడుతూ వుంటారు. అదీ కలియుగంలో పద్ధతి.

కర్మఫలం అనుభవించటం ఈశ్వరుడికైనా తప్పదు. గురువే అన్నిసార్లూ శిష్యుల కర్మఫలం అనుభవించటం గూడ సాధ్యపడదు. గురువుమీద అచంచలమైన విశ్వాసం శిష్యుడికి వుండాలి. ఆ గురువుకి కూడ, వీడి కోసం యింతపని చేస్తే వీడివల్ల యిక పదిమందికీ మేలు జరుగుతుంది, లేదా వీడు సన్మార్గానికి వస్తాడు ఫరవాలేదు, అని శిష్యుడిమీద అచంచలమైన విశ్వాసం వుండాలి. అప్పుడు మాత్రమే శిష్యుడి కర్మ గురువు అనుభవించే వీలు వుంటుంది. అంటే ఈ పని జరగాలంటే, శిష్యుడి దగ్గర ఏదో వొక రకపు త్యాగం వుండాలి. ఆ త్యాగం

గురువు యొక్క విశ్వాసాన్ని చూరగొనాలి. ఇదీ అవధూత పద్ధతి. తెలుసుకో." మౌనంగా జాగ్రత్తగా వింటున్నాడు కృష్ణమూర్తి. ఇంతవరకూ చెప్పి చటుక్కున స్నానానికి వెళ్ళిపోయారు స్వామి. చంద్రశేఖరయ్య వచ్చి గదిలో విభూతి ఎత్తసాగాడు. అది రెండు మూడు కిరోసిన్ డబ్బాలలోకి వచ్చింది.

ఆ రాత్రి యింట్లో ఆఫీసు కాగితాలు ముందేసుకొని దీపం దగ్గర కూర్చొన్న కృష్ణమూర్తి గారికి స్వామి ఉపదేశ వాక్యాలే మనస్సులో మారుమోగుతున్నాయి.

"స్వామి చెప్పిన దాని సారాంశం ఏమిటి? అవధూత అంటారేమిటి? స్వామి బ్రహ్మచారిగదా! స్వామి తన్ను గురించి చెప్పుకోలేదేమో! అవును, స్వామి యీ రోజు నన్ను ఏకవచనంలో పిలిచారు. సామాన్యంగా అందర్నీ, నన్ను గూడ బహువచనంలో పిలుస్తారు గదా స్వామివారు. ఒక్క గణపతి వంటి మీద ఆవేశించినపుడే అందర్నీ ఏకవచనంలో పిలుస్తారు గదా! అయితే యివ్వాళ్ళ గణపతి ఆవేశం వున్నట్టుగా ఆ పొంగూ, బిగింపూ వగైరా లక్షణాలు లేనేలేవే! గణపతి శీర్ని ఆవహించి వుండటం సాదారణ స్థితి అయిపోయినదేమో! అదిసరే, అవధూత అంటే ఏమిటసలు? ఆ మాట అడగొద్దన్నారు గదా స్వామి, ఎందుకొద్దన్నారు? అవతారమంటే ఏమిటో గూడ అడగొద్దన్నారు. ఎందుకని? సరే పోనీ స్వామి అంతసేపూ ఆ దండాల శ్రమ ఎందుకు పడట్టూ? ఎవరి బాధయినా యీ విధంగా తీసుకున్నారా? కాలెండరు ఎందుకు వూగింది? శిష్యులకు సూచనలు చేస్తానన్నారు. ఇప్పుడు ఇంత చెప్పారుగదా! నాకేదయినా సూచన చేస్తున్నారా? అసలు నేను శిష్యుడినేనా?"

ఆయన ఆలోచనల నిండా అన్నీ ప్రశ్నలే అయిపోయి దేనికీ సమాధానం దొరక్క బుర్ర బరువెక్కి నిద్రలోకి జారిపోయాడాయన.

ఆ తరువాత ఒకటి రెండు సార్లు యీయన స్వామి కోసం వెళ్ళినవుడల్లా శ్రీకంఠయ్య గూడా ఓ మూల పూజ చేస్తూనో, జపం చేస్తూనో కూర్చుని కనిపించసాగాడు.

"ప్రత్యక్ష దైవాన్ని యింట్లోపెట్టుకొని వేరే పూజలు చేస్తాడేమిటి ఈయన" అనుకొని మన కెందుకులే, తప్పయితే స్వామి చూసుకుంటారుగా అనుకొని ఊరుకుండిపోయాడు. నిజంగానే స్వామి చూసుకున్నారు. కాని స్వామి ఎలా చూసుకుంటారనేది యెవరికీ అంతుపట్టదు గదా!

శ్రీకంఠయ్యగారికి ఒకరోజు పొద్దున పూట డ్యూటీపడ్డది. ఇక పూజేం చేస్తాడు, డ్యూటీకి వెళ్ళాడు. ఈయన వెళ్ళిన కొద్దిసేపటికే స్వామి అక్కడికి వచ్చారు. శ్రీకంఠయ్య బైటకొచ్చి ఏమిటేమిటి అన్నాడు ఆదుర్దాగా.

"ఇవ్వాళ్ళటినుంచీ నువ్వు పూజలు చేసేందుకు వీలులేదు" అన్నారు స్వామి గట్టిగా.

"అదేమిటయ్యా, నువ్వేగా ఉపదేశం చేస్తివి ?" అన్నాడు తెల్లబోయి శ్రీకంఠయ్య గారు.

"ఔను, అందుకే చెపుతున్నాను" నిక్కచ్చిగా అన్నారు స్వామి.

స్వామికి ఆఫీసు మర్యాదలేం తెలిసినట్లు లేవు. అయినా ప్యూనుకి అంతకన్నా ఆఫీసు మర్యాద ఏం తెలుస్తుంది ? దానికి తగ్గట్టే స్వామి కాకీ డ్రెస్సులో వున్నారు. ఆ సమయంలో శ్రీకంఠయ్యకు చిర్రెత్తింది.

"ఇది ఆఫీసు. ఆ విషయాలు యింటి కొచ్చాక మాట్లాడుకుందాం" అన్నాడు. ఇక పో అని మాత్రం అనలేదు. రక్షించాడు. స్వామి వెళ్ళిపోయారు. నాలుగు రోజులు గడిచాయి. ఇద్దరూ మళ్ళీ యీ ప్రస్తావన చెయ్యలేదు. ఎవరికి వారు ముభావంగా వుండి పోయారు. ఒక రోజు పోష్టాఫీసు నుంచి రావటమే ధుమ, ధుమలాడుతూ, కాళ్ళు నేలకు టప టపా కొట్టు కుంటూ సైకిలు ఢమ ఢమ లాడించుకుంటూ వచ్చారు స్వామి.

"ఏమిటి నాయనా అలా వున్నావు" అన్నారు శ్రీకంఠయ్య ఆప్యాయంగా.

"నీ కెందుకు ?" ఒక కుండ పగిలింది.

"అదేమిటయ్యా ఎక్కడన్నా పోట్లాట అయిందా ?

"చెప్పేది తల కెక్కటం లేదా" ఒక చెట్టు విరిగింది.

"ఏమిటి నువ్వు మాట్లాడేది ?"

"నోర్మూయ్యి." ఒక కొంప కూలింది.

"అది కాదయ్యా"

"ఛ—ఫో" ఒక బాంబు పేలింది.

అసలే నాలుగు రోజులనుంచీ బిగింపులో వున్నాడు శ్రీ కంఠయ్య. యీ దెబ్బతో వలవలా ఏడవసాగాడు. కళ్ళంబడి నీళ్ళు ఎగతట్టుకొస్తున్నాయి. మగవాడు, అనుభవం కలవాడు, మొండివాడు, చిన్నప్పటినుంచీ ఏడ్చి ఎరగనివాడు. తనకిలా ఎందుకు ఏడ్పు తోసుకొని వస్తోందో, తనకేమీ తెలియటం లేదు. కానీ ఏడుపు ఆగటం లేదు. తల వంచుకొని ఏడ్చేస్తున్నాడు శ్రీకంఠయ్య.

"ఏడు. ఇంకా ఏడు. బాగా ఏడు." అంటున్నారు స్వామి. కాని క్రమంగా ఆయన గొంతు ఏడుపు గొంతుగా వినబడేటప్పటికి ఆశ్చర్యపోయి తలెత్తి చూశాడు శ్రీకంఠయ్య. స్వామి కళ్ళ నీళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. ఆయన దుఃఖంతో ఎగబీలుస్తున్నారు.

శ్రీకంఠయ్యకు వాత్సల్యభావం రివ్వుమని దూసుకు ముందుకుకొచ్చింది. అదేమిటో ఎంత కోపంగా వున్నా ఆ కుర్రవాడు ఏడుస్తుంటే గుండె తరుక్కుపోతోంది తనకు. శ్రీకంఠయ్య చటుక్కున లేచి—

"మా బాబుగా, నువ్వేడవకు, నువ్వేడవకు అంటూ సముదాయిద్దామని స్వామి దగ్గరకు వెళ్ళబోయాడు. తనో పక్క యింకా ఏడుస్తూనే వున్నాడు. స్వామిని సముదాయిద్దామని ఆయన ఆత్రం.

"ఆగు. నన్ను ముట్టుకోకు. ముందు నీ కళ్ళు తుడుచుకో" అన్నారు స్వామి యేడుస్తూనే కోపంగా.

శ్రీకంఠయ్య కళ్ళు తుడుచుకున్నాడు. స్వామి కళ్ళనీళ్ళు ఆగిపోయినాయ్. శ్రీకంఠయ్య తనే ఏడుపాపాడు. స్వామి ఎగపీల్పు దానంతటదే ఆగింది. తరువాత ఎవరికి వారు సద్దుకొని పూసుకొండిపోయారు. ఆ రాత్రి శ్రీకంఠయ్య దీర్ఘంగా ఆలోచించసాగాడు.

"స్వామి ఒక అద్దం. ఈ హృదయంలో వున్నది ఆ హృదయంలో ప్రతిఫలిస్తుంది. స్వామి సరసన కూర్చొని పూజలు చేసే అర్హత నాకు లేదు అని నాకు తెలుసు. నా హృదయం నాకు తెలుసు గదా. ఆ మాటే స్వామి చెప్పారు. నాకు కోపం వచ్చింది. అది నా తప్పు." ఆలోచన యీ సిద్ధాంతం దగ్గర ఆగింది. మర్నాటినుంచీ ఆయన పూజలు మానేశాడు. కొన్నాళ్ళు గడిచింది.

ఆదివారప్పు హోమాల దగ్గర జనం పెరిగిపోతున్నారు. దానితోపాటు గురువారపు సాయంకాల గురుపూజలు మొదలైనాయి. గురువారాలలో గూడ స్వామి వచ్చిన భక్తుల కష్టాలు కనుక్కొని పరిహారాలు చేస్తూండటంతో గురువారపు జనం గూడ పెరుగుతున్నారు. గురువారాలలో గూడా విశేష నామసంకీర్తన జరుగసాగింది. దీనితో స్వామికి పెద్ద పూలదండలు తెచ్చి వేసే సంప్రదాయం బాగా పెరిగింది.

మొదట్లో వచ్చిన పూలదండలు గోడమీది ఫొటోకు వేసే వారు స్వామి. కాని, రాను రాను పూలదండలు మరీ పెద్దవి కావటంతో తనే వేసుకోక తప్పలేదు. ఇక గురువారపు గురు పూజల్లో స్వామివారికే స్వయంగా పూజ జరుగుతోంది. స్వామివారికి వేసేందుకు ప్రత్యేకంగా పెద్ద దండలు తేవటం భక్తులకు సరదా అయింది. ఈ దండల్లో తులసిదళాళ దండ అంటే స్వామికి చాలా యిష్టంవుండేది.

"గణపతికి తులసిమాల ఎలా యిష్టమవుతుంది? ఈయన గణపతి ఉపాసకుడు కదా" అని కొందరు చర్చ లేవదీశారు. కానీ దాన్నెవరూ అందిపుచ్చుకోక పోవటంతో అణగారి పోయింది.

ప్రతి ఆదివారం పూర్ణాహుతి సమయంలో నిలువెత్తు తులసిదండ, నవనవలాడుతున్న పెద్దపెద్ద తులసి దళాలతో ప్రత్యేకంగా కట్టించిన తులసిదండ తెచ్చి వేయడం ద్వారకకి మొదట్లో సరదాగా ప్రారంభమైంది. రానురాను ఆ దండ తేందే అటు ద్వారకకి, యిటు స్వామికీ యిద్దరికీ తోచని స్థితి వచ్చింది. తన దండ కంటె యింకొకరి దండ పెద్దదిగా వుంటే

సహించలేడు ద్వారక. మరునటి వారం దీనికి మించిన దండ తెస్తాడు. రానురాను ద్వారక తులసి దండతో పోటీ పడటం బాగా కలిగిన భక్తులకు గూడా సాధ్యం కాలేదు. మైసూరులో తులసిదళాల దండలకోసం ప్రత్యేకంగా తోటలు పెంచుతారు. అదో వ్యాపారం. ముందుగా పురమాయిస్తే దండలు కడతారు. ద్వారక తెచ్చే దండ ఆ రోజుల్లోనే వంద రూపాయలకు తగ్గదు. ద్వారక తులసీదళాల దండ తెచ్చే సరికి సభలో కరతాళ ధ్వనులు మారుమోగేవి.

స్వామి ఎప్పుడు పడితే అప్పుడు పూర్ణాహుతి వేయరు. పురోహితులు హోమం పూర్తి చేసుకొని స్వామికోసం ఎదురు చూస్తుంటారు. స్వామి ప్రశ్న గణపతిని చెవి దగ్గర పెట్టుకొని ఏవో మంత్రాలు చెపుతారు. ఆ మంత్రాల్లో ఒక చోట సత్యనారాయణ అనే పదం వస్తుంది. అప్పుడు అపుతారు స్వామి. అప్పుడు పూర్ణాహుతి వేస్తారు.

ఒకోసారి మంత్రాలు బయటకు చెప్పరు. కానీ లోపల సాగుతూనే వుంటాయట. వాటి అవృత్తి అయ్యేవరకూ పూర్ణాహుతి వెయ్యరు స్వామి. స్వామి పూర్ణాహుతి వేసేటప్పుడు ఆయన మెడలో పూలదండ వుండి తీరవలసిందే. (ఆ నియమం యిప్పటికీ వుంది) ద్వారక యిచ్చే తులసిదండ తప్పనిసరిగా వుండేది ఆ రోజుల్లో.

ఆ రోజుల్లోనే స్వామి దగ్గర తిరిగే కుర్రవాళ్ళలో ఒకడు స్వామివారి గదిలో వుంచిన చిన్న దిబ్బెన యెత్తుకుపోయాడు.

ద్వారక కూపీ లాగి దిబ్బెన బిందితో సహా దొంగను లాక్కొచ్చాడు. అయితే లోపల చిల్లర డబ్బు మాత్రం అప్పటికే హరించుకుపోయింది.

స్వామి వాడిని చాచి చెంపకాయకొట్టి "ఇక వీణ్ణి లోపలకు రానీకండిరా" అన్నారు తేలిగ్గా. "హు హు హూ" అని వొణికి పోయాడు కోపంతో ద్వారక. "వాడిని అలా వదలచ్చా? తన్నాలి, నరకాలి, తోలు తియ్యాలి" అన్నాడు ఉగ్రంగా.

'దానికంటె ఇదే పెద్ద శిక్షరా. ఊరుకో' అన్నారుస్వామి. ఏమీ చెయ్యలేక ఊరుకుండి పోయాడు ద్వారక.

ఒకరోజున ఒక రైతు శ్రీకంఠయ్య యింటికి వచ్చాడు.

"సత్యనారాయణ స్వామివార్లు ఎవరండీ" అంటూ. ఆ సమయానికి స్వామే ఉన్నారు యింట్లో.

"ఏం కావాలి, చెప్పు" అన్నారు.

"ఆ స్వామివారితో మాట్లాడాలి."

"నాతో చెపితే విషయం వారికి చేరుతుంది. చెప్పు" ఈ కుర్రవాడెవరో ఆ స్వామికి సన్నిహిత శిష్యు డనుకున్నాడు ఆ రైతు.

"మీ స్వామివారి చుట్టూ రౌడీమూకలు గూడ ఉంటారా బాబూ" అన్నాడు.

"చుట్టూతా ఏమిటి? ఒళ్ళో గూడా ఉంటారు."

"అదేం స్వామివారండి బాబూ"

"ఏం? శివుడి 'మెడచుట్టూ పాములేవూ?" ఈ కవిత్వంతో రైతుకు వాగ్బంధమైంది. కాని ఉడుకుమోత్తనం వచ్చింది.

"శివుడి పాములు ఎవడి కొంపలూ దోచటం లేదుగా" అన్నాడు.

"ఇప్పుడు నీ కొంప ఎవరు దోచారూ?"

"ఇంతవరకూ కొంపదాకా రాలేదు. రేపో మాపో అదీ మొదలుపెట్టిస్తారేమో మీ స్వామి వారు." రైతు బాధ కోపంగా వ్యక్తమై ధ్రుతిమించింది.

"రేపు సంగతి ఎందుకు గానీ, ఇవాల్టి సంగతి చెప్పు."

"నీతో ఎందుకయ్యా కుఱ్ఱపంతులూ, ఆ పెద్దస్వామివార్ని రానీ. వారితో చెపుతా."

ఈలోగా ఎవరో వచ్చి స్వామికి పాదాభివందనం చేశారు. దాంతో అనుమానం వచ్చి ఆ రైతు వచ్చినాయన చెవిలో "వీ రెవరు ?" అన్నాడు.

"వీరే సత్యనారాయణ స్వామివారు" అన్నాడా పెద్దమనిషి. రైతు కంగారుపడి తలగుడ్డ తీసి నమస్కరించాడు. ఏమనాలో తెలియక తత్తరపడుతున్నాడు.

"ఏం భయం లేదులే, ఏం జరిగిందో చెప్పు." అన్నారు స్వామి. రైతు గొంతుక సవరించుకొని మెల్లగా చెప్పసాగాడు.

"అయ్యా ! నాకు ఊళ్ళో తులసి తోట వుంది. అదే నాకు జీవనాధారం. ఈ మధ్య వారం వారం దాంట్లో దొంగలు పడుతున్నారు. ఒకటి రెండుసార్లు పట్టుకుందామని ప్రయత్నించాగానీ దొరకలేదు. దున్నపోతుల్లాగా వున్న కుఱ్ఱవాళ్ళు బస్తాల్లోకి దళాలు కోసుకుని పారిపోతున్నారు. బాగా విచారించగా, దళాలన్నీ మీ కోసమే తెస్తున్నారని పేటలో చెప్పుకుంటున్నారు. నన్ను మీరే కాపాడాలి."

స్వామి ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. అంతా చెప్పినాక, "ఇప్పటిదాకా కుఱ్ఱవాళ్ళ వల్ల నీకు ఎంత నష్టం వచ్చి ఉంటుంది? అన్నారు స్వామి.

"అయిదొందలు వుంటుందండీ" అన్నాడు రైతు.

"చూడు బాబూ, కుఱ్ఱ వెధవలు తెలీక చేసుంటారు. రేపు సాయంత్రం రా! అయిదు వందలు తీసుకెళ్ళు. ఇక నీ తోటలో దొంగతనం జరగదులే, పో" అని చేతిలో విభూతి పొట్లం వేశారు స్వామి.

పోయిన దశాల తాలూకు డబ్బుతో పాటు, వో వరం గూడ వచ్చిందని తెలియక పోయినా, సంబరపడుతూ వెళ్ళిపోయా డా రైతు. కొంతసేపయాక ద్వారక ఎగురుకుంటూ వచ్చాడు.

“ ఏమయ్యా నీకు వుద్యోగం వచ్చిందా ” అన్నారు స్వామి అతన్ని చూస్తూనే.

“ మీ దయవల్ల మొన్న నే గదండీ ఐ. టి. ఐ. ట్రైనింగ్ లో చేరాను. ”

“ నా దయవల్లే ప్రతివారం తులసి దండ కొనుక్కొచ్చి వేస్తున్నావు గదా ”

“ అహ-హ-అ, చిత్తం, చిత్తం ”

“ నా దయివల్లే తోటలో దొంగతనాలు చేస్తున్నావు గదూ ”

“ అబ్బే, ఎవడండీ చెప్పింది ”

“ అరేయ్ ద్వారకా ! బుకాయించకు. స్వామి పాదాలు పట్టుకొని నిజం చెప్పు. తులసి దొంగిలించావా, లేదా? ”

“..............” ( మౌనం )

“స్వామికి అప్రతిష్ట తెచ్చావా లేదా ? ”

“ నేనని తెలియకుండా చేశాగదండీ ! ఇహ స్వామిమీది కెలా వస్తుంది ?” ఆ ప్రశ్న నిజంగా అమాయకంగా వుంది. అందుకనే ఆ మాట బిక్కచచ్చి పోయింది.

“ మీ స్వామి దొంగల ముఠా స్వామి అని చెప్పుకుంటున్నారట పేటలో. ఇంకా నీ చెవిని పడలేదా?” గర్జించారు స్వామి.

ఇక తప్పు దొరికిందని అర్థమైపోయింది. దానికి స్వామి ఏమి శిక్ష విధిస్తారో ఈమధ్యనే కళ్ళారా చూశాడు. ఆ శిక్ష యిప్పుడు తనకు పడుతుందేమో ? వణికి పోయాడు అంత లావు ద్వారకా. ఏం చెయ్యాలో తెలీక బుడుంగున కాళ్ళమీద పడ్డాడు.

“ఆ నిలువెత్తు తులసిదండ మెళ్ళో వేసుకుంటే స్వామి సాక్షాత్తూ శివుడల్లే వుంటారు సార్. అందుకోసం అలా చేశా. తప్పయిపోయింది స్వామీ” అన్నాడు.

ఒక క్షణం మౌనంగా వుండిపోయారు స్వామి “ అరేయ్ ! యిదివరకు దొడ్లల్లో కొబ్బరి కాయిలు దొంగిలించేవాడివి. అప్పుడే చెప్పా, వినలేదు నువ్వు. నిన్నెట్లాగో అట్లా బాగు చెయ్యాలని, తెలిసిగూడ దగ్గరపెట్టుకొన్నా. నీకు బాగుపడే యోగ్యత లేదురా. పైగా నాకే అప్రతిష్ట తెస్తున్నావు.” స్వామి ఆవేదనగా మాట్లాడేసరికి ఏడుపొచ్చినంత పనైంది ద్వారకకు.

“ ఈ ఒక్కసారీ క్షమించు స్వామీ, ఇహనుంచీ జాగ్రత్తగా వుంటానుగా, క్షమించు స్వామీ ” అని బతిమాలాడు.

“ సరే పోరా. బాగుపడు ” అన్నారు స్వామి విసుగ్గా. ఇహ అక్కడ వుంటే స్వామి బుద్ధి మళ్ళీ ఎటు తిరుగుతుందో అని అక్కడనుంచి మెల్లగా జారుకున్నాడు ద్వారక.

# ౩ వ అధ్యాయం సిద్ధాంతం

*గురోఽను మూర్త్యర్పణ బోధనాద్యై*
*స్స్వధర్మ రక్షాకృతి దీక్షితస్య ।*
*నతేఽస్తి సిద్ధాంత విభేదబుద్ధి*
*స్తత్త్వం పరం య ద్భవతాఽనుభూతమ్ ॥*

[ గురుదేవా ! భక్తులకు అనుభవాలు కల్పించటంద్వారా, వారికి చక్కగా బోధించటంవంటి ఇతర మార్గాల ద్వారా, స్వధర్మాన్ని రక్షించటమే మీ దీక్ష ! మరి, మీకు సిద్ధాంతాల విషయంలో భేదబుద్ధి లేదు. ఎందుకంటే, పరతత్త్వాన్ని మీరు స్వయంగా అనుభవించారు.]

ఎంతమంది వచ్చినా ఒక్కరిని గూడా విడిచిపెట్టకుండా అడిగి కష్టాలు నివారించటం స్వామి పని ! పనయిపోయిన తర్వాత వెళ్లిపోతూ, ఈయన 'కెసరేస్వామి' గాదు, 'కోపం స్వామి' అని వెళ్ళటం ప్రజల పని!

ఇలా సంవత్సరం పైగా గడిచింది. యిప్పటికి కొన్ని వేలమంది స్వామివల్ల ఉపకారం పొందారు; ప్రశ్నలు చెప్పించుకొన్నారు; రక్షలు కట్టించుకున్నారు; దయ్యాలు వదిలించు కున్నారు; పిల్లలకు పెళ్ళిళ్ళు చేయించుకొన్నారు; రోగాలు తగ్గించుకొన్నారు. కాని ఒక్కరికి గూడ స్వామి ఎక్కడ భోజనం చేస్తున్నారు? ఇంకా పోష్టాఫీసులో ప్యూను పని ఎందుకు చేస్తున్నారు? అన్న ఆలోచనే రాలేదు. సంకీర్తన చేస్తే స్వామి రక్షలు యిస్తారు; పూజ చేస్తే అనుగ్రహిస్తారు; హోమం చేస్తే వెంటనే ఫలం యిస్తారు; మన ఉపాయాలు మనకు తెలిసి నాయిగా, మిగిలిన విషయాలు మనకెందుకు ?

అనాదిగా లోకం తీరు ఇంతే. కానీ అక్కడక్కడ లోకం పోకడ తెలీని తల్లులుంటారు. అలాంటి వారే జయమ్మగారు, వెంకటలక్ష్మమ్మగారు. వాళ్ళిద్దరూ బతిమాలి భంగపడి, రోజూ భోజనం శ్రీకంఠయ్య యింటికే తెచ్చిపెట్టసాగారు. దాంతో స్వామి భోజనంలో కాస్త కూర, చారు అమరినాయి.

అసలే స్వామి భోజనం పసిపిల్లల భోజనం. అందులోనూ అది మగవారి వంటయితే ఎలా వుంటుందో వేరే చెప్పుకోవాలా ? ఆ విధంగా శ్రీకంఠయ్యకు కొంచెం భారం తగ్గింది.

స్వామికి కూడ ఒకే యజమాని భోజనం తప్పించి. క్రమంగా మరికొందరు తల్లులు గూడ అప్పుడప్పుడు స్వామికి అన్నం పెట్టసాగారు. ఇలాంటి వారిలో కొందరు జానకిరామ మందిరంవారి సంకీర్తన కార్యక్రమాలకు గూడా పోతూ వుంటారు.

## జానకీరామ మందిరం

జానకిరామ మందిరం సుబ్బారావుగారంటే ఆ పేటలో బాగా ప్రసిద్ధి. సుబ్బారావుగారు వృత్తిరీత్యా ప్లీడరు గుమాస్తాయే గాని, మంచి భక్తుడు, ఆచారపరుడు. వాళ్ళింట్లో అనూచానంగా వస్తున్న దేవతార్చన మందిరం వుంది. ఇల్లు ఇరుకైనదే. కొంతభాగం కేవలం పూరిపాక. వారింట్లో దేవతార్చన మాత్రం పెద్దది. ఆ కుటుంబం హృదయం అంతకన్నా పెద్దది.

వారింట్లో ప్రతి ఆదివారం సంకీర్తన చేస్తారు. ఆ యిల్లే అసలు సంగీతానికి నిలయం. ఇంట్లో అందరికీ ఏదో రకంగా సంగీతంతో సంబంధం వుంది. ఆ భజనల వల్లా, సంగీతం వల్లా ఆ పేదయింటికి జానకిరామ మందిరం అనే గొప్ప పేరు వచ్చింది.

ఆ సుబ్బారావుగారి పెద్దమ్మాయి లీలకు ఈ కెనరే స్వామి గురించిన వార్తలు కొన్ని చేరి స్వామిని దర్శిస్తే బావుండనుకుంటూ ఉంది. కాని అంతలోనే ఇరవై యేళ్ళ ప్రాయంలో ఆరోగ్యంగావున్న ఆ పిల్లకు పట్టరాని ఉబ్బసం, ఎగశ్వాస వచ్చాయి. సామాన్యంగా ఉబ్బసం క్రమంగా పెరుగుతుందంటారు. కాని యిది రోజుల్లోనే పెరిగి వికటించసాగింది. వైద్యాలు రవ్వంతగూడ ఫలించలేదు. అప్తులంతా 'యిదేదో విచిత్రంగా వుంది, దైవకృప వుండాల్సిందే' అనసాగారు.

ఈలోగా 1964 ప్రవేశించింది.

అప్పుడు బాధ పడుతున్న లీల తండ్రితో అంది, 'నాన్నా, కెనరే స్వామివార్ని అడిగితే అన్నీ స్పష్టంగా చెపుతారట నాన్నా' అని.

అసలే రొప్పుతున్న పిల్లని యింకా బాధ పెట్టలేక ఆ తండ్రి కెనరేస్వామిని గూర్చి బాగా వాకబుచేసి, ఒక రోజు మధ్యాహ్నం మూడు గంటల సమయంలో శ్రీకంఠయ్య యిల్లు పట్టుకున్నాడు. కాని స్వామి యింట్లో లేరు. వారప్పటికి పోస్టాఫీసులో పని చేస్తున్నారని వీరికి తెలియదు. ఆ పక్కవార్ని, యీ పక్కవార్ని విచారించగా చీకటి పడ్డాక రమ్మన్నారు. మళ్ళీ అంత దూరమూ సైకిలు మీద వచ్చాడు సుబ్బారావుగారు.

తెల్లపంచ, తెల్లఉత్తరీయం, కోలమొహం, మొలకమీసాలు, జులపాలుగా జారుతున్న వుంగరాల జుట్టు వున్న లేత కుర్రవా డొకడు కనిపించాడు. ముఖంలో తేజస్సు వుంది అనుకున్నాడు సుబ్బారావుగారు. తన కూతురు గోడు చెప్పుకున్నాడు.

"రేపు అమావాస్య. రేపు రాత్రి ఈవేళకి వస్తే మీకొక యంత్రం యిస్తా. దాంతో తగ్గుతుంది, భయం లేదు" అన్నారు స్వామి.

సుబ్బారావుగారు మర్నాడు వచ్చాడు. అన్నీ తెలిసినవాడే కనుక కొబ్బరికాయలు, పూజసామగ్రి, యంత్రానికి రేకు అన్నీ తెచ్చుకున్నాడు. వచ్చేసరికి అర్కగణపతికి పూజ జరుగుతోంది. ఆ పూజ పూర్తయ్యేసరికి రాత్రి పదకొండయింది.

స్వామి పూజావిధానం, పూజా సమయంలో వారి ముద్ర, పూజవల్ల చుట్టూతా ఏర్పడిన వాతావరణం యివన్నీ సుబ్బారావు గారికి నచ్చాయి. 'మంచి సాత్వికుడు, ప్రజ్ఞాశాలి అనిపిస్తోంది. ఇక మన అదృష్టం' అనుకొన్నాడాయన. పూజ పూర్తయింది.

ఈయన తెచ్చిన కొబ్బరికాయను చేతికి యిమ్మని సంజ్ఞ చేశారు స్వామి. ఇచ్చాడు ఆయన. స్వామి, తను కూర్చున్న చోటుకి ఎదురుగా వున్న గోడకేసి దాన్ని విసిరి బలంగా కొట్టారు. దాదాపు ఎనిమిది అడుగుల దూరంలో వున్న గోడకు వెళ్ళి కొట్టుకొన్న ఆ కాయ బంతల్లే వెనక్కి వచ్చింది. స్వామి దాన్ని దొరకపుచ్చుకొన్నారు.

'కొబ్బరికాయేమిటి? బంతల్లే వెనక్కి రావటమేమిటి?' అని ఆశ్చర్యపోతున్నాడు సుబ్బారావుగారు. ఆ బంతాట ఐదారుసార్లు జరిగేసరికి స్వామికి ఉగ్రం వచ్చింది. దాంతో ఆ కాయ ఎడంచేత్తో పట్టుకొని నేలకేసి ఠాప్పున కొట్టారు. కాయ సరీగా మధ్యకు సులువుగా పగిలింది. తరువాత స్వామి ఆ యంత్రపురేకు తీసికొని దానిమీద ఏదో మంత్రం రాశారు. రాశాక యిలా చెప్పారు:

"చూడండి. ఈ యంత్రం బహు దుష్కరమైన యంత్రం. మీ కోసం యీ పని చేశాను. కాని ఇక పై పనికి చాలా నేర్పు కావాలి. అది మీరే చెయ్యాలి. జాగర్తగా వినండి.

"యంత్రం పుచ్చుకొని సైకిలెక్కినాక, బ్రహ్మాండం బద్ధలైనాగాని మీరు వెనక్కి తిరిగి చూడరాదు. మధ్యలో సైకిలు దిగరాదు. ఎవరితోనూ మాట్లాడరాదు. ఇంటికి చేరాక దీన్ని కింద పెట్టకుండా సరాసరి వెళ్ళి మీ అమ్మాయికి కట్టండి. ఇక ఈ రెండు నిమ్మపళ్ళు ఇస్తున్నాను. వీటిని జాగర్తగా ఆ అమ్మాయి దిండు కింద పెట్టండి. ఎక్కడన్నా పెట్టి ఇటూ అటూ చూశారంటే ఈ కాయలు మాయమయిపోతాయి, జాగర్త."

సుబ్బారావుగారు అన్నీ తీసుకొని సైకిలెక్కాడు. సెంట్ ఫిలోమిన్ కాలేజి దగ్గరకు వచ్చేసరికి వెనకాల నుంచి పెద్ద జన సమూహం వస్తున్న కోలాహలం వినిపించ సాగింది. ఆయన మనస్సు బిగపట్టుకొని ముందుకు పోతున్నాడు.

సైకిలు ఒక ఖాళీ రోడ్డులో పోతోంది. కానీ ఎవరో వెనకనుంచి గుంజుతున్నారు. సైకిలు వేగం తగ్గిపోయింది. పల్లమే అయినా ఆయన పెడలు తొక్కాల్సి వస్తోంది. క్రమంగా తొక్కినా వేగం తగ్గుతోంది.

ఆయనకి విషయం అర్థమైంది.

నిబ్బరంగా వుండి ఆంజనేయ స్తోత్రం, మహాకాళీ స్తోత్రం పారాయణ చేస్తూ తన శక్తంతా వినియోగించి సైకిలు తొక్కసాగాడు. క్రమంగా ఆయాసమై ఆ అర్ధరాత్రి మంచులో గూడా శరీరం చమటతో తడిసి ముద్దయింది.

అలా పెద్దపేట వీధి దాకా సైకిలు వెనక ఎవరో లాగుతూనే ఉన్నారు. అక్కడికి వచ్చాక యిక వదిలేశారు. సుబ్బారావుగారే గెలిచాడు.

ఇంటికి చేరి స్వామి చెప్పినట్టు యంత్రం రోగికి కట్టాడు. తరువాత నిమ్మకాయిలు జాగర్త కష్టమవుతుందని ఆవిడ దిండు చింపి, కాయలు లోపల పెట్టి మళ్ళీ కుట్టేశాడు. ఆ దిండు రోగి తలకింద పెట్టాడు. స్వామి యిచ్చిన విభూతి ఆమె నోట్లో వేశాడు.

అప్పటికి రాత్రి ఒంటిగంట దాటింది.

కాసేపు పడుకొని లేచి దేవతార్చన మొదలెట్టాడు సుబ్బారావుగారు. తెల్లారేసరికల్లా మళ్ళీ ఆయాసం మొదలైంది లీలకు. తొమ్మిదయ్యేసరికి "ఇది ఇక బతకటం కష్టం" అనుకున్నాడు సుబ్బారావు.

చివరి యత్నంగా తన నరసింహ సాలగ్రామం లీల గుండెల మీద పెట్టి తనకు వచ్చిన స్తోత్రాలన్నీ పారాయణ చేశాడాయన. కొంచెం నెమ్మదించినట్లే నెమ్మదించి మళ్ళీ పెరిగింది రొప్పు. కొంచెంసేపాగి స్వామి యిచ్చిన భస్మం ఆవిడ ఒళ్ళంతా పూసి, నోట్లో వేశాడు తండ్రి. అలాగే వుంది పరిస్థితి.

మధ్యాహ్నం రెండయింది. ప్రాణా లెగిరిపోతాయేమో అన్నట్టు యెగరొప్పుతున్న లీలకు వాళ్ళింట్లోంచి కనిపిస్తున్న ఆకాశంలో ఒక భయంకరాకారం కనిపించింది. ఏనుగంత దున్నపోతు, దాని గుడ్లు మంటల్లాగా వున్నాయి. దాని కొమ్ములు విచ్చుకత్తులులా ఉన్నాయి. దాని మీద ఒక కొండంత మనిషి! అతనూ నల్లని నలుపే. పైగా ఆ మొహం గుంటలు తేలి గండరించి, ఉబ్బుకొచ్చి వెగటుగా వుంది. జానెడేసి మీసాలున్నాయి. ఆ కళ్ళు కంచాలల్లే గుండ్రంగా వుండి బయటుకు వెళ్ళుకొచ్చినాయి. ఆ కళ్ళు కదులుతుంటే కొరివి దయ్యాలు గంతులేస్తున్నట్టు ఉంది. నెత్తిన పెద్ద కిరీటం వుంది. అర్థమైంది, ఆయన యమ ధర్మరాజు. వాళ్ళింటివైపే దూసుకొస్తోంది దున్నపోతు.

లీలకు ఒళ్ళు ఝల్లుమంది. కాని యింతలో ఆ దున్నపోతు అల్లంత దూరంలో ఆగిపోయింది. ఏమిటని చూస్తే ఇంటి వీధివాకిలి గడప దగ్గర ఎవరో ఉగ్రమైన స్త్రీమూర్తి నిలబడి వుంది.

ఆవిడ ఎర్రని చీర కట్టుకుంది. ఒక చేతిలో కత్తి వుంది. ఆ కత్తి నెత్తురు కారుతోంది. మరో చేతిలో శూలం వుంది. అది తళతళా మెరుస్తోంది. మెళ్లో మంగళసూత్రం పమిట మీద పడి

మిలమిలా మెరుస్తోంది. ఇంకా రత్నహారాలున్నాయి మెడలో. కళ్ళు భయంకరంగా ఇటూ అటూ తిప్పుతోంది. ఆవిడ ముఖానికి పసుపు రాసుకొని వుంది కాని, లేకపోతే నల్లటి మనిషే. పసుపు రాసుకున్న ఆ ముఖం మీద ఎర్రటి బిళ్ళవంటి కుంకుమ బొట్టు మరీ బాగుంది. ఆవిడ నెత్తిన కిరీటం వున్నది.

ఓహో, ఈవిడ శక్తిమాత! అందుకనే యముడు అక్కడ ఆగిపోయినట్టున్నాడు. మరి దొడ్డి వాకిట్లోంచి వస్తాడేమో? లీల దొడ్డి వాకిలి కేసి చూసింది.

అక్కడ గడప కడ్డంగా బొజ్జగణపయ్య నుంచున్నాడు. ఆయన మండిగాని కిటో కాలూ అటో కాలూ వేసుకొని, రెండు చేతులూ వీపు వెనకాల పెట్టుకొని, ఆ చేతుల ఆధారం మీద గుమ్మానికి వెన్నానించి జారిగిలబడి నుంచున్నాడు. అలా ఆయన నుంచుంటే ఆయన బొజ్జ గుమ్మం రెండవ కమ్మికి ఒత్తుకొని సొట్టపడి వుంది. తొండం పైకెత్తి సరదాగా గుమ్మం ముందు ఆడిస్తున్నాడు.

అలా ఆ ముగ్గురూ సాయంత్రం నాలుగింటిదాకా అక్కడే నిలబడ్డారు. అప్పటికి దున్నపోతు తోకముడిచి వెనక్కి తిరిగి పోయింది. యమధర్మరాజు పూర్తిగా కనుమరుగయ్యాక అమ్మవారూ, గణపతీ యిద్దరూ మాయమయ్యారు.

" నాన్నా, అందరూ వెళ్ళిపోయారు" అంది లీల. తండ్రికి అర్థం కాలేదు సంగ్రహంగా వివరించింది లీల. గండం గడిచింది కాబోలు అనుకొన్నా డాయన. లీలకు కొంచెం ఉధృతం తగ్గింది. రాత్రికి వెళ్ళి జరిగిన వివరాలన్నీ స్వామికి చెప్పాడు సుబ్బారావుగారు. కాని అక్కడ ఆయన విన్న విషయాలు ఆయనను మరీ ఆశ్చర్యపరచినై.

క్రితం రాత్రి పొద్దుపోయింది అనుకుంటూ వెళ్ళిపోయాడు సుబ్బారావుగారు. కాని స్వామి అప్పుడు హోమం మొదలుపెట్టారు.

కొంతసేపయాక ఒక క్రూరమైన స్త్రీ ఆకారం ఆ గదిలోకి ప్రవేశించింది. ఆ గది వాకిలికి మించిన లావు, వొంటికి ఎలాగోలా చుట్టబెట్టుకొన్న పాతబట్ట, వేళ్ళాడుతున్న బొజ్జ, పైకి వెళ్ళుకొచ్చిన పళ్ళు, నిప్పులు కక్కుతున్న కళ్ళు, సగం కమిలిన జుట్టు, ఉండీ వుండని బొట్టు, ఇవీ ఆ ఆకారంలో ప్రధానాంశాలు.

వస్తూనే " ఏయ్యా! ఏం ధర్మం ఇది?" అంది. వేట కుక్కలు మొరిగినట్టుంది ఆ కంఠం. స్వామి మాట్లాడలేదు.

" నా నోటి ముందు కూడు లాగేశావే "

ఆ వికృత శక్తి ఎగిరి పడుతోంది. చేతనయితే స్వామినే మింగేద్దామనే దాని ఆశ. కుదరక భయంతో ఆగిపోతోంది. స్వామి మాట్లాడలేదు.

" నా గతేం చేశావ్ " మళ్ళీ అరిచింది. యీ మాటు కొంచెం ఏడుపు గూడా కలిపింది.

"నాకేదయినా తిండన్నా పెట్టు, లేకపోతే ఈ జన్మాన్ని విరగడచెయ్యి." ఈ మాటు నిజంగా ఏడ్చింది.

ఆ యేడుపు గండభేరుండపు కూతల్లే వుంది.

"ఏం చేస్తే యీ జన్మ పోతుంది నీకు?" ఇప్పటికి నోరు విప్పారు స్వామి.

"నీ మెళ్ళో వున్న జపమాలంతా దానం చేస్తే గాని నాకు ముక్తిరాదు. కాని అది యిస్తే నీకేం శక్తి మిగులుతుంది?"

"అది నీకెందుకులే. ఇదిగో తీసుకో" స్వామి చటుక్కున తన మెళ్ళో వున్న తులసి పూసల మాల అగ్నిహోత్రంలో వేశారు.

తక్షణమే "భగ్" మని ఒక పెద్ద జ్వాల లేచింది. ఆ వికృతాకారం కరిగిపోయింది. తులసి పూసల్లో ఒకటి రెండు మాత్రం కాలిపోకుండా మిగిలిపోయినై. అప్పుడు మిగిలిన హోమం పూర్తిచేశారు స్వామి. ఆ ఒకటి రెండు తులసిపూసలు మాత్రం అలాగే కాలిపోకుండా వుండిపోయినై.

ఈ కథంతా వివరించి, మిగిలిపోయిన తులసి పూసల్లో ఒక పూస అగ్నిగుండంలోంచి తీసి సుబ్బారావుగారి చేతిలో పెట్టి, "గంధం తీసి నీళ్ళల్లో కలిపి రోగి చేత తాగించండి" అన్నారు స్వామి.

అలా చెయ్యగా లీలకు ఒక వారంలో బాగా తగ్గిపోయింది. ఆ ఆదివారం కుటుంబం అంతా హోమానికి వెళ్ళారు.

పిల్లలందరినీ చూసి "కచేరీ బాగా చేస్తారుగా, ఇక్కడ గూడా పాడరాదూ" అన్నారు స్వామి. ఆయనకు వాళ్ళ గురించి ఎవరు చెప్పారో మరి.

ఆ పిల్లలంతా ఆనందంగా కచేరీ చేశారు. ఆరోజు కచేరీ అయినాక ప్రసంగిస్తూ—

"ఇదిగో ఈ పిల్లల కచేరీతో ఈ ఆశ్రమంలో సంగీత కచేరీలకు ప్రారంభోత్సవం జరిగింది. ఇక యిక్కడ పెద్ద పెద్ద విద్వాంసులు అనేకులు కచేరీలు చేస్తారు" అన్నారు.

స్వామి తమ నివాసాన్ని ఆశ్రమమని ప్రకటించటం గూడా ఆ సంగీతోత్సవంలో కలిసి పోయింది. ఇక జానకిరామ మందిరం కుటుంబంవారు ఆ ఆశ్రమానికి వీలయినప్పుడల్లా వస్తూ పోతూ వుండటం రూఢి అయింది.

ఈ ప్రాంతాల్లోనే ఒక రోజున ఏదో ఆఫీసు పనిమీద వూరు వెళ్ళివస్తూ దార్లో ఒక సంత కనిపిస్తే ఆ సంతలో ఒక కొబ్బరికాయ కొన్నాడు డి. సి. ఆఫీసు కృష్ణమూర్తిగారు. వూర్నించి వస్తూనే స్వామిని దర్శించి ఆ కొబ్బరికాయ సమర్పించాడు.

స్వామి ఆ కొబ్బరికాయను చూస్తూనే "ఇది చాలా అమూల్యమైన కొబ్బరికాయ, చాల బాగుంది" అంటూ గణపతి పటం దగ్గర కొట్టారు. కాయ పగిలి దాన్లోంచి తులసి

పూసల మాల ఒకటి రాలింది. "అమూల్యమైనది జాగ్రత్త" అంటూ దాన్ని కృష్ణమూర్తిగారి కిచ్చారు స్వామి.

స్వామి దగ్గరనుండి యింటికి వెడుతుండగా దార్లో వీరి పై ఆఫీసరుగారు ఒకరు కనిపించి "ఏమయ్యా నన్ను గూడ మీ స్వామివారి దగ్గరకు తీసుకువెళ్ళు" అని అడిగినాడు.

వార్ని వెంటబెట్టుకొని మళ్ళీ స్వామి దగ్గరకు వచ్చాడు కృష్ణమూర్తిగారు. ఆఫీసరుగారు తమ కష్టం చెప్పుకున్నాడు. వారి అబ్బాయికి మంచి ఉద్యోగం వుంది, చదువు వుంది, కాని శరీరంలో కుడి భాగం అదురుతూ వుంటుంది. దాని వల్ల నష్టమేమీ లేదని వైద్యులు చెప్పారు. కాని దానివల్ల అతనికి పిల్ల నివ్వటానికి ఎవరూ ముందుకు రావటం లేదు. అదీ ఆయన బాధ."

"మీకు లక్ష్మి అనే కోడలు వస్తుంది. చాలా మంచిపిల్ల. భయం లేదు. నేను ఆశీర్వదిస్తున్నాను. స్వామిని దర్శించుకొంటూ వుండటం మీకు క్షేమం" అన్నారు స్వామి.

ఆ మర్నాడు స్వామి కృష్ణమూర్తిగారితో "ఆయన్నెందుకు తెచ్చారు మీరు? ఆయన వల్ల మీకు చిక్కులు రాబోతున్నాయి. అవి నేను చూసుకుంటా ననుకోండి. కానీ ఆయనైనా యిక్కడికి వచ్చిన ప్రయోజనం వుండాలంటే, కాస్త నిలకడగా వుండాలి గదా" అన్నారు.

"మీదయ, మీదయ" అని వూరుకున్నారు కృష్ణమూర్తిగారు. వారం తిరగకుండానే ఆ ఆఫీసరుగారి అబ్బాయికి సంబంధం వచ్చింది, ఖాయమైంది. పిల్ల పేరు లక్ష్మి. మెల్లిగా వివాహం కూడా అయింది. కాని వాళ్ళెవళ్ళూ మళ్ళీ స్వామి దగ్గరకు రాలేదు.

స్వామి హెచ్చరిక చేశారు. ఏం లాభం? ఆ చెవ్వు చెమిటి చెవ్వు, శంఖాలేం చేస్తాయి? త్వరలోనే ఆ ఆఫీసరుగారి భార్య పోయింది. ఆయనకు పునర్వివాహం అయింది. దానివల్ల ఆయనకు చాలా యిబ్బందు లొచ్చిపడ్డాయి. ఇలా అనేక వివరాలు తెలిసి ఏమీ చేయలేక బాధపడి వూరుకున్నాడు కృష్ణమూర్తిగారు.

ఆ తరువాత స్వామి చెప్పినట్టుగానే అనేక పర్యాయాలు ఆ ఆఫీసరుగారి వల్ల వీరికి అనేక చిక్కులొచ్చిపడ్డాయి. మనస్పర్థలు పెరిగాయి. కాని ప్రతిచోట స్వామి వీరి పక్షాన నిలిచి, వీరికి దిగ్విజయం అయ్యేట్టు చేస్తూ వచ్చారు.

ఆ ప్రాంతాలలోనే, ఒకసారి మైసూరులో కలరా వ్యాధి తీవ్రంగా వ్యాపించింది. అందువల్ల జనం ఎక్కడా అధికంగా గుమిగూడరాదని నిషేధాజ్ఞలు జారీచేశారు. దాంతో కాలనీలో హోమం ఆ వారానికి రద్దుచేశారు. కాని హోమం ఎక్కడో అక్కడ జరగాలిగా, ఎక్కడా అని ఆలోచిస్తుంటే "మా సొంత యింట్లో (అంటే తండ్రిగారి యింట్లో) చేయండని" కృష్ణమూర్తిగారు ప్రార్థించారు. సరే అన్నారు స్వామి.

ఆ రోజు యిద్దరూ కలిసి, చెరో సైకిలు మీదా ఇంటికి చేరారు. మొత్తం కలిపి 15-20 మంది పోగయ్యా రక్కడ. హోమం ప్రారంభం అవుతుండగా ఒక వడ్లగింజంత భస్మం యిచ్చి

అందరికీ పంచి రమ్మన్నారు స్వామి. అది అసాధ్యం. అందుకే "ఇంకా కొంచెం వెయ్యండి స్వామి" అన్నాడు కృష్ణమూర్తి.

"చాల్లే, అదే పంచు" అన్నారు స్వామి. వొంటి నిండా బూడిద పొంగే స్వామికి అంత పీనాసితన మేమిటి ? ఇది పంచేదెట్లా ? వున్నది కాస్తా వొక చేతిలో వంచేస్తే మళ్ళీ ఆయనే కాస్త యిస్తారు" అనుకొంటూ ఆ కాస్త విభూతి ఒకరి చేతిలో వొంచాడు.

"అమ్మయ్య, అయిపోయింది. ఇక ఆయిన్ను అడగవచ్చు" అనుకుంటూ స్వామి వైపు తిరగబోయాడు. అరే, కాయితంలో ఆ రవ్వంత విభూతీ అట్లాగే వుందేమిటి ? కాగితం బోర్లిం చేశాడుగా? అయోమయం అయింది కృష్ణమూర్తి గారికి. "అబ్బే, తను ఆ విభూతి ఎవరి చేతు లోనూ వంచలేదేమో" ఇది మరో అనుమానం. పక్కకి చూశాడు. మొదటి పెద్దమనిషి చేతిలో విభూతి కనిపిస్తోంది. ఇంకేం చేస్తాడు ? అసహాయంగా రెండో పెద్దమనిషి దగ్గరకెళ్ళి ఆయన చేతిలో గూడ విభూతి వంచేశాడు. వంచితే యేం నష్టం ? మళ్ళీ వస్తోందిగా. స్వామి యీయన్నే చూస్తున్నారు. ఈయన అలాగే అక్కడున్న అందరికీ ఆ భస్మం పంచి వచ్చాడు.

"సరిపోతుందా" అన్నారు స్వామి ఏమి తెలీనట్టు.

"సరిపోయింది కానీండి, ఇలా యీ శక్తి యెంతసేపుంటుంది ?" అని అడిగాడు కృష్ణమూర్తిగారు.

"హోమం అయ్యేదాకా అంటే మధ్యాహ్నం ఒకటిన్నర దాకా ఇలా పుట్టు కొస్తూనే వుంటుంది వడ్లగింజంత" అన్నారు స్వామి.

"అందరికీ అయిందా" అన్నారు ఒక క్షణం ఆగి.

"అయింది"

"అయితే ఆ కాగితం తీసికెళ్ళి హోమకలశం ముందు పెట్టిరా"

చెప్పిన చోట ఆ కాగితం పెట్టాడీయన. ఆశ్చర్యం ! ఆ కాగితం మీద విభూతి బదులు నీళ్ళు నిల్చి వున్నాయి. ఆ నీళ్ళు హోమం అయ్యేంతవరకూ అలాగేవున్నాయి.

ఆ మరునటి వారానికి మైసూరు పరిస్థితి చక్కపడింది. కాలనీలో హోమాలు యథా ప్రకారంగానే సాగుతున్నాయి. అయితే కృష్ణమూర్తి గారింట్లో హోమం చెయ్యటంతో క్రమంగా మరి కొంతమంది భక్తులు మా యిళ్ళల్లో గూడ హోమం చెయ్యమని ప్రార్థించ సాగారు. అంగీకరించారు స్వామి. ఆదివారాలు కాకుండా యితర వారాల్లో కొందరిళ్ళకు వెళ్ళి గణపతి పూజకానీ, హోమంగానీ స్వయంగా చేసి వచ్చేవారు స్వామి.

దీనితో కొందరు భక్తులు గురువారపు గురుపూజలకు ఆనందపడి స్వామిని తమ యిళ్ళకు పాదపూజలకు పిలవసాగారు. అంగీకరించారు స్వామి. ఇలాంటి సందర్భా లన్నిటిలో స్వామి

సైకిలుమీద వాళ్ళ యిళ్ళకు వెళ్ళేవారు. ద్వారకా లాంటి వాటు ఒకరిద్దరు సైకిళ్ళమీద కూడా వచ్చేవారు. వెళ్ళేటప్పుడు మామూలుగా ప్యాంటు, షర్టుతోనే వెళ్ళేవారు. అక్కడి కెళ్ళాక సంచీలోవున్న పట్టుబట్ట కట్టుకొని పూజో, హోమమో చేసేవారు లేదా తనే స్వయంగా కూచుని పాదపూజ చేయించుకొనేవారు. అంతా అయినాక మామూలు బట్టలేసుకొని సైకిలు మీదే తిరిగి వచ్చేవారు.

ఆ రోజుల్లోనే—

ఒకరోజు శ్రీకంఠయ్య, స్వామి ఇద్దరూ కలిసి చెరో సైకిలుమీదా కావేరీ పశ్చిమ వాహిని స్నానానికి శ్రీరంగపట్టణం వెళ్ళారు. వెళ్ళేటప్పటికి ఉదయం పదయింది. జనం లేరు.

కావేరి మెట్లనుంచి దిగుతుండగా శ్రీకంఠయ్యగారి దృష్టి గాలి కెగిరింది. పక్కనవున్న గణపతి శిలావిగ్రహం మీద పడింది. గబగబా వెళ్ళి గణపతి విగ్రహం మీద చెయ్యి పెట్టి తెలుసుకుంటుండగా, ఆ విగ్రహం కదిలిపోతూ వుండటం కనిపించింది.

దాంతో ఆయన నవ్వుతూ స్వామి దగ్గరకు వచ్చి "ఇక్కడ మెట్ల మీద గణపతి దిక్కూ మొక్కూ లేకుండా వున్నాడు. పీఠం కదిలిపోయింది. ఏ పిల్లలో పడేస్తే పగిలిపోతుంది గూడా. నువ్వు గణపతి ఉపాసకుడివిగా, దీన్ని తీసుకుపోదామా మనం? అభిషేకం చేయ టానికి పీలుంటుంది" అన్నాడు.

స్వామి నవ్వారు. "పాపం ఎవరో పుణ్యాత్ములు, స్నానం చేసేవారికి, దైవ దర్శనం కూడా కలగాలని యిక్కడ పెట్టారు. మనం ఎత్తుకుపోవటం అన్యాయం" అన్నారు. "ఏం అన్యాయం లేదు తీసుకుపోదాం" అని దాన్ని పెకలించబోయాడు శ్రీకంఠయ్యగారు.

"ఆగండాగండి. స్నానం చేసి వచ్చేటప్పుడు చూద్దాం" అన్నారు స్వామి.

"అలా అయితే సరే" అంటూ వెనక్కి వచ్చేశాడు శ్రీకంఠయ్య.

స్నానం అయి వెళ్ళబోయేటప్పుడు దాని మాట ఎత్తకుండా గబగబా మెట్లెక్కు తున్నారు స్వామి. శ్రీకంఠయ్య మాత్రం గుర్తు పెట్టుకొని వెళ్ళి గణపతిని ఎత్తబోయాడు. ఇందాక కదిలిపోయి పడిపోతూవున్న పీఠం ఇప్పుడు బిగిసి వుంది. విగ్రహం కదలటం లేదు. బిత్తరపోయాడు శ్రీకంఠయ్య. "ఆయిన రాడులెండి. మీ రొచ్చెయ్యండి" అని పకపకా నవ్వుతూ సైకిలెక్కేశారు స్వామి.

ఇలా వుండగా ఒక రోజున జానకీరామ మందిరం సుబ్బారావుగారు "మీకు వీలుగా వున్న రోజున మా యింటికి భోజనానికి రండి" అని పిలిచాడు.

"రేపే వస్తా" అన్నారు స్వామి.

"సరే అయితే, మిమ్మల్ని తీసుకువెళ్ళటానికి పొద్దునే వస్తాను." అన్నారు సుబ్బారావుగారు.

"ఎందుకూ? నేనే సైకిలు మీద వచ్చేస్తాగా, మీరు మీ పని చేసుకోండి" అన్నారు స్వామి.

"సరే" అని వెళ్ళిపోయాడు సుబ్బారావుగారు. ఇంటికి వెళ్ళాక, తను అడ్రసు చెప్ప రాలేదని గుర్తుకొచ్చింది. "సరే రేపు వెళ్ళి తీసుకొద్దాంలే, ఆయన వద్దన్నా అదే మర్యాద గదా." అనుకొని వూరుకున్నాడు సుబ్బారావుగారు.

మర్నాడు పొద్దున తొమ్మిదింటికల్లా సైకిలు మీద వచ్చారు స్వామి. ఆశ్చర్యపోయారు సుబ్బారావుగారు.

"ఎలా వచ్చారు? అడ్రసు చెప్పలేదుగా నేను" అన్నాడు నోరు తెరిచి.

"నా సైకిలుకి అన్ని అడ్రసులూ తెలుసుగా, అదే లాక్కొచ్చేసింది" అన్నారు స్వామి నవ్వుతూ. ఇంట్లో అప్పుడే వంటలు మొదలైనాయి. అసలే యిరుకు యిల్లది. పైగా స్వామి కోసం ఏదీ ఏర్పాటు చెయ్యలేదింకా. ఇల్లంతా చిందర వందరగా వుంది. సరే ముందటి ఒక స్టూలుబల్ల ముందుకు లాగి స్వామిని కూర్చోమన్నారు.

స్వామి కూర్చున్నారు. కానీ ఆ కుర్చీపీట కాళ్ళు సరిగా లేవో ఏమో, స్వామి కూర్చోగానే ఒడుదుడుకై, స్వామి ఒక పక్కకు వొరిగి పడిపోబోయి లేచి నుంచున్నారు.

"కుర్చీపీట గట్టిదేనే, నేలలోగూడ గుంటలు లేవే, ఏమయిందబ్బా" అని కంగారుగా కుర్చీపీట పక్కకు జరిపారు సుబ్బారావుగారు. కుర్చీపీట కింద దానంత పటికబెల్లపు అచ్చు పేరుకొని వుంది. అది చూసి అందరూ మొహా మొహాలు చూసుకో సాగారు. స్వామి నవ్వుతూ తనే కుర్చీ పీట పక్కకు లాక్కొని కూచుంటూ "సరే పోన్లే. అందరికీ తలో ముక్కా పెట్టెయ్యండి" అన్నారు.

వంటకింకా చాలా ఆలస్యం వుందిగదా అని స్వామికి పాలిచ్చారు. స్వామి ఆ పాలను తాకి అందరికీ తీర్థంగా యిమ్మన్నారు. అందుకోసమని పాలను మరో గిన్నెలో పొంచారు. ఆ పాలగ్లాసులో అడుగున కలకండ పలుకులున్నాయి. ఎలా వచ్చాయో?

స్వామి వచ్చారని తెలిసి ఆ చుట్టుపక్కల వారంతా డెబ్భై యనభై మంది దాకా పోగయ్యారు. అందరికీ విభూతి ప్రసాదం స్వామి స్వహస్తంలోంచి సృష్టించి యిచ్చారు. తరువాత పూజ జరిగింది. పూజ అయిన తరువాత అందరికి వడపప్పు వగైరా ప్రసాదాలు పెట్టారు. సుబ్బారావుగారు ప్రసాదం పెట్టటమంటే సాగనంపటమన్న మాటే. వేరే చెప్పేదేముంది?

స్వామి సుబ్బారావుగార్ని పిలిచి "వచ్చిన వారందరికీ విస్తళ్ళెయ్యండి. అందరూ ప్రసాదం తీసుకోవాలి" అన్నారు.

"వాళ్ళకు ప్రసాదం పెట్టేశామండి" అన్నాడు సుబ్బారావుగారు.

"అలా కాదు. అందరూ అన్నం తిని వెళ్ళాలి" అన్నారు స్వామి. తెల్లమొహంవేసి యిటూ అటూ చూశాడు సుబ్బారావుగారు.

ఆ రోజు వాళ్ళింట్లో మూడు శేర్ల బియ్యంతో అన్నం వండారు. అది వాళ్ళ కుటుంబానికి సరిపోతుంది. అంత కుటుంబం అది. అందరికీ సంతర్పణలు చేసే తాహతున్న కుటుంబం కాదది. సరే ఏదో రకంగా ఎక్కడయినా అప్పు తెద్దామన్నా విస్తళ్ళు వెయ్యమంటున్నారే స్వామి? పైగా నలుగురిలో!

"స్వామీ, మీ రొక్కసారి యిలా రండి" అని పక్కకు పిలిచాడు సుబ్బారావుగారు. స్వామి కదిలితేగా!

"భగవంతుడి మీద భారం వెయ్యండి. విస్తళ్ళెయ్యండి ముందు. ఇప్పటికే పొద్దు పోయింది పాపం. తరువాత మాట్లాడుకుందాం" అని తొందరపెట్టారు పైగా.

ఇక స్వామి మాటకు ఎదురుచెప్పలేక బిక్కు బిక్కు మంటూనే విస్తళ్ళు వేయించ సాగాడు సుబ్బారావుగారు. అప్పుడు స్వామి వంటింట్లోకి వెళ్ళి తులసిదళంతో వంటలమీద కొన్ని నీళ్ళు ప్రోక్షించారు.

"ఇక వడ్డించండి" అన్నారు. వడ్డనలైనాయి.

అందరితో పాటు స్వామిగూడ పంక్తిలో కూర్చున్నారు. "సంకోచం లేకుండా విశ్రాంతిగా భోజనం చెయ్యండి" అని అందరినీ ప్రోత్సహిస్తూ భోజనం చేశారు స్వామి. వడ్డన బ్రహ్మాండంగా జరిగిపోతోంది. అందరూ భోజనాలు చేసి లేచారు. తరువాత యింటివారంతా రెండవ బంతిలో భోజనం చేశారు. అప్పటికి వంటకాలు పూర్తయిపోయాయి.

సుబ్బారావుగారి తాహతేమిటో, అదీకాక వారింట్లో చేసిన వంటేమిటో, ఆ వాడకట్టు తల్లులందరికీ తెలిసిన విషయమే. ఇంటివాళ్ళు కాకుండా బైటవాళ్ళు ఎనభై మందికి తక్కువ లేకుండా భోజనం చేశారు.

జానకీ రామమందిరం సెంటర్లో సెంటుబుడ్డీ పగిలింది!

ఆ మరుసటి ఆదివారంనుంచీ, జానకీరామమందిరం వారితో పాటు అనేకులు, స్వామి హోమశాలలో శాశ్వత సభ్యు లయిపోయారు. జానకీరామమందిరం పిల్లల సంకీర్తన ఆదివార హోమాల్లో నిత్యకృత్యమై పోయింది. అంతేకాదు. స్వామి ఎక్కడికైనా పాదపూజకో, హోమానికో వెడితే, యీ పిల్ల లందరినీ తీసుకెళ్ళి అద్భుతంగా సంకీర్తన చేయించటం అలవాటయిపోయింది.

స్వామివారి ఆదివార హోమాల్లో వెయ్యిమంది జనం రావటం కనీసపక్షం అయింది. జనం అధికం కావటంతో వారిని పలకరించి, కష్టం అడిగి నివారించటానికి కాలం సరిపోవటం లేదు. దాంతో ఒక కొత్త పద్ధతి పెట్టారు స్వామి.

అందర్నీ క్యూలో నిలబడమనేవారు. స్వామి కమండలం చేతపట్టుకొని వరసగా క్యూ వెంబడి వచ్చేవారు. వస్తూ ప్రతివారి దగ్గరా ఆగి "నువ్వీ పని మీద వచ్చావు. నీ పని అవుతుంది. ప్రసాదం తీసుకో. నీ సంగతి నేను చూసుకొంటాను, నువ్వు భయపడకు" ఈ విధంగా చెప్పుకుంటూ ముందుకు వెళ్ళిపోయ్యేవారు. లేదా "నీ పనికాదు. ఆశ వదిలేయ్." లేదా "కొన్నాళ్ళాగు" ఇలా చెప్పేవారు.

దయ్యం పట్టినవాళ్ళు వస్తే వాళ్ళు క్యూలో నిలబడటానికి వొప్పుకొనేవారు కాదు. స్వామి, వారి మీద కమండలోదకం చల్లేవారు. అప్పుడు దయ్యం తన కథ చెప్పేది. స్వామి దానికేదో పరిష్కారం చేసేవారు. ఆ మనిషి వచ్చి క్యూలో నిలబడేవాడు. స్వామి యిలా చెప్పుకుంటూ వెళ్ళటమంటే ఆ నడక దాదాపు పరుగల్లే వుండేది.

ఈ సత్యంలో ఎవరూ మాట్లాడక్కరలేదు, ఏడవక్కరలేదు, గోడు చెప్పుకోనక్కరలేదు. ఎవరైనా అలాంటి పనులు చేసి కాలం వ్యర్థం చేశారా, స్వామికి రౌద్రావతారం నిముషంలో వచ్చేస్తుంది. ఆ కోపమే లేకపోతే అసలు అదుపే వుండదే వెర్రిజనానికి.

పూర్ణాహుతి అయినాక ఇంతమందికీ తీర్థం స్వామి స్వయంగా యిచ్చేవారు. ఇంత మందికి ప్రసాదాలు తయారు చెయ్యటం పెద్ద సమస్యగా వుండేది. శ్రీకంఠయ్య యింట్లో చోటే అంతమాత్రం. అదీగాక ఆ యింట్లో ఆడ దక్షతలేదు. అందువల్ల ప్రసాదాల పని చాలా కష్టంగానే వుండేది.

## నిజాయితీ

ఇలావుండగా శ్రీకంఠయ్య యింటికి పొరుగిళ్ళల్లో మల్లయ్య అనే అతను వుండేవాడు. అతను నమ్మింది ఆచరించే నిక్కచ్చి మనీషనీ, నిజాయితీ పరుడనీ మాత్రమే గాక, మోట మనిషనిగూడ పేరు ఆ కాలనీలో. ఈ చివరి బిరుదుకు అతని కమ్యూనిజం వెర్రే కారణం. కమ్యూనిజం సిద్ధాంతాన్ని నమ్మిన వాడవటంవల్ల, దాన్ని ఆచరించే తీవ్రత కలవాడు కావటంవల్ల, అతను తరుచుగా తోటివాళ్ళను యిబ్బందుల్లో పెట్టేవాడు. ఈ దేశంలోని అనేక మంది కుహనా కమ్యూనిస్టుల లాగ పైకి నాస్తిక ప్రచారం, చాటుగా మొక్కులు చెల్లించి వస్తూ వుండటం అతని వంటికి పడని పని. ఆ పెద్ద మనిషికి యింటి పక్క ఈ సంతగోల భరించటం కష్టం గానే వుండేది. ఆ మాట అతను బహిరంగంగానే చెప్పేవాడు. ఇతనితో ఎప్పుడే చిక్కు వస్తుందో అని అక్కడి భక్తులు భయపడుతూ వుండేవారు.

"నిజాయితీ గల వాళ్ళతో ఏ చిక్కూ లేదు. కమ్యూనిజాన్ని నమ్మి, నిజంగానే కమ్యూనిస్టుగా బతుకుతున్న వాడితను" అనేవారు స్వామి.

ఇతని భార్యకు ఎప్పటినుంచో కడుపులో పుండు వుంది. అది యివాళ్టిది కాదు. చివరి కది ముదిరి "ఇక ఆశ వదలుకో" అనే దాకా వచ్చింది. చుట్టు ప్రక్కలవాళ్ళు ఇతన్ని

పోరసాగారు. "అరే పిచ్చివాడా, పోయి సత్యనారాయణ స్వామిని పట్టుకో. మీయింటి పక్కనే గదా! ఆయన తప్పకుండా అనుగ్రహిస్తారు. నీ భార్య నీకు దక్కుతుంది" అని.

"దేవు డొకవేళ వున్నాడేమో" అనే సందేహం లవలేశం గూడా లేని మల్లయ్య అందుకు ససేమిరా అంగీకరించలేదు "ఈ మూఢ నమ్మకాలే మన దేశాన్ని చెడగొడుతున్నాయి" అన్నాడు.

ఇక ఈ మొండి వెధవతో లాభం లేదని అప్తులతని భార్యకే నచ్చచెప్పారు. ఆవిడ ఒక రోజున స్వామివారి దగ్గరకు, భర్తకు తెలియకుండా వచ్చి తన బాధ చెప్పుకుంది. స్వామి విభూతి పొట్లం మొహాన వేశారు. ఆ రాత్రికి ఆవిడకు నొప్పిరాలేదు. పొంగిపోతూ భర్తకు చెప్పిందావిడ. "నీ బొంద, ఇదే మానసిక తృప్తి అంటే. ఇవ్వాళ ఆ స్వామిని చూసిన ఆనందంలో నీకునొప్పి తెలియటం లేదంతే. లోపలి పుండు బూడిదతో పోతుందా? నోరు మూసుకో, సిగ్గుచేటు పని చేశావు" అన్నాడు భర్త.

వాళ్ళు మామూలు ప్రకారం ఆ మరునాడు హాస్పిటలుకు వెళ్ళారు. వైద్యుడు ఈవిడ చెప్పిన కొత్త లక్షణాలు విని మళ్ళీ ఎక్స్‌రే తియ్యమన్నారు, తీశారు. లోపల అసలు అల్సరు ఛాయలే లేవన్నారు. మందు లాపెయ్య మన్నారు. మల్లయ్య మతి తిరిగిపోయింది.

అనేక రకాల క్లాసులకు హాజరయ్యి, కమ్యూనిష్టు సిద్ధాంతం వంటబట్టించుకొన్న వాడు తను. అనేక రకాల వైజ్ఞానిక గ్రంథాలతో అక్కడి నాయకులు ఇలాంటివన్నీ మోసాలు, డబ్బు సంపాదనకోసం, ఇతరులమీద ఆధిపత్యంకోసం వేసే ఎత్తులు" అని నమ్మించారు. మరి యిదేమిటి? ఇవాళ్ళ విజ్ఞాన శాస్త్రమే బూడిదతో అల్సరు పోయిందని నిరూపిస్తోందే? మోసం ఎక్కడ వుంది? అతనికి అంతర్మథనం భరింపరానిదైంది. ఆ భారంతోనే సరాసరి స్వామి దగ్గరకు వచ్చాడతను. అతను వచ్చే సరికి స్వామి చిన్న ఉపన్యాసం చేస్తున్నారు. అంతకు ముందే కొంత అయిపోయినట్టుంది, ఇతను వెళ్ళే సరికి,

"సిద్ధాంతం అంటే ఏమిటసలు?" అని అడుగుతున్నారు స్వామి. ఎవర్నడిగారో ఏమో గాని, ఎవరూ సమాధానం చెప్పలేదు. ఒక నిముషం ఆగి మళ్ళీ స్వామే అందుకున్నారు.

"లోకంలో మనకు కొన్ని సత్యాలు కనిపిస్తాయి. మన తెలివి పెరిగినకొద్దీ యింకా సూక్ష్మమయిన సత్యాలు కనిపిస్తూ వుంటాయి. అలాగే మన-అదృష్టం బావున్నకొద్దీ ఆ యా సత్యాలు మనకు కనిపించే సన్నివేశాలుగా ఏర్పడుతుంటాయి. న్యూటన్‌కి అదృష్టం కలిసొచ్చి కొన్ని సత్యాలు కనిపించాయి. పైథాగరస్‌కి కొన్ని సత్యాలు కనిపించాయి. అన్ని సత్యాలూ ఒకరికే గోచరించలేదు. ఎందువల్ల? ఆయా బుద్ధులు ఆయా శాఖల్లో వికసించగా ఆ వికాసం యొక్క అవధినిబట్టి ఆయా సత్యాలు గోచరిస్తూ వుంటాయి. నీ బుద్ధి వికసించలేదు గనుక నీకు గోచరించలేదు. వాడి బుద్ధి వికసించింది కనుక వాడికి గోచరించింది. అంతే.

మనకి తెలిసిన వాళ్ళందరికీ గోచరించిన సత్యాలను పోగుచేసినా గూడా ఇంకా కొన్ని సమస్యలు పరిష్కారం కాకుండానే వున్నాయి. అంటే ఇంకా కొన్ని సత్యాలు మన కెవ్వరికీ గోచరం కాలేదన్నమాటేగా. సత్యాలను గోచరం చేసుకోవాలనే ఆసక్తి, తపన మానవుడికి సహజం. అందుకోసం తనకు యింతవరకూ తెలిసిన సత్యాలన్నీ సమన్వయించి, వాటిద్వారా మరికొన్ని కొత్త సత్యాలను కనిపెట్టే ప్రయత్నం చేస్తూ వుంటాడు మానవుడు. ఈ ప్రయత్నం అనాదిగా వస్తోంది. అనంతంగా సాగుతూనే వుంటుంది. ఇలా యింతవరకూ దొరికిన సత్యాలను సమన్వయించుకోవటం పేరే సిద్ధాంతం. అయితే ఈ సమన్వయం చేసే విధానం ఆయా వ్యక్తుల బుద్ధి ప్రవృత్తిని బట్టి మారుతూవుంటుంది. అందుకనే ప్రపంచంలో అనేక సిద్ధాంతాలు పుట్టాయి.

ఒక సిద్ధాంతం తప్పా, ఒప్పా అనటానికి కనిపిస్తున్న సత్యాలతో అది పొందికగా అమరుతుందా లేదా అన్నదే ఋజువు. వేరే వాదన అక్కరలేదు.

ఆకాశం నీలంగా వుంది. ఇది సత్యం. దీనికి వాదాలతో పనిలేదు. ఎందుకు నీలంగా వుంది అనటానికి, అనేక సిద్ధాంతాలు అనేక సమాధానాలు చెపుతాయి. ఒక సిద్ధాంతి లేచి "ఆకాశం నీలంగా వుండటానికి వీల్లేదు" అని అరిచాడనుకోండి. వాడితో మనం వాదించాలా ? ఆకాశం నీలంగా వుండటం కళ్ళతో చూసినాక తన సిద్ధాంతాలలో లోపం వుందని గ్రహించి, లోపం ఏమిటో వెతుక్కునే ప్రయత్నం చెయ్యటం, నిజమైన మానవ లక్షణం. సత్యాన్వేషణ మానవుల నైజం అనుకున్నాం గదా !

కాని కొందరికి సిద్ధాంతం, తను కీర్తి ప్రతిష్ఠలతో ముడిపడి వుంటుంది. అలాంటి వారు తమ సిద్ధాంతం తప్పని ఒప్పుకోక, ఆకాశం నీలంగా లేదంటారు. వారు కొంత నయిమే. అసలు ఆకాశమే లేదంటారు మరి కొందరు, వారికిక తిరుగు లేదు ! మరి కొందరి సిద్ధాంతాలు వారి నాయకత్వానికీ, వారి రాజకీయాలకూ, వారి వ్యక్తిగత పంతాలకూ ముడిపడి వుంటాయి. వీరికి గూడా తిరుగు లేదు !! నిజమైన సత్య దృష్టి గలవాడు మాత్రం కొత్త సత్యం వొకటి కనిపిస్తే దాన్ని ముందు సత్యంగానే స్వీకరించాలి. ఆ సత్యాన్ని, సిద్ధాంతాన్ని సమన్వయించి చూప గలిగితే, ఆ సిద్ధాంతాన్ని స్వీకరించాలి. లేకపోతే సిద్ధాంతాన్ని సవరించుకోవాలి. అంతేగాని సత్యాన్ని బహిష్కరించరాదు. అది మానవత్వం కాదు."

స్వామి తన అనర్గళమైన ఉపన్యాసం ఆపారు. అక్కడున్న భక్తులలో ఒకడు లేచి " తెలిసింది " అని కృతజ్ఞతగా సాష్టాంగ వందనం చేశాడు.

ఆ మర్నాటినుంచీ మల్లయ్య, రోజూ స్వామి దర్శనం చేయసాగాడు. ఆదివారపు ప్రసాదాలన్నీ, అతని భార్య, దగ్గరుండి తమ యింట్లో తయారు చేయించటం మొదలు పెట్టింది.

క్రమంగా స్వామికి ఉపన్యాస ధోరణి బాగా అలవాటు పడ్డది. ఆయనకు దివ్యనామ సంకీర్తనే ప్రధానమైనా, ఆయన కార్యక్రమాల్లో నామ సంకీర్తనకు, హోమానికి వున్న ప్రాముఖ్యం ఉపన్యాసానికి లేకపోయినా, ఉపన్యాస విధానం గూడ మెల్లిగా దూరి సందు చేసుకోసాగింది. ప్రతిరోజూ కాకపోయినా ఆదివారం, గురువారం స్వామి ఉపన్యసించటం రివాజయింది.

స్వామి ఏ విషయం తీసుకున్నా, దాన్ని ఎవ్వరూ వూహించని పద్ధతిలో అందుకుంటారు. వీలయినంత వరకూ మితభాషి. ఆయన ఉపన్యాసాలూ పొట్టివే. ఒకోసారి బొత్తిగా మరుగుజ్జులు గూడ. ఏమయినా ఆయన ఉపన్యాసం విన్న ప్రతివాళ్ళూ ఒక నిండు తృప్తితో ఇళ్ళకు వెడతారు. వెళ్ళినాక ఆ వాక్యాలు వద్దన్నకొద్దీ అనేక సంవత్సరాల పాటు గుర్తు వస్తాయి.

స్వామి భాష పండిత భాషకాదు. ఆయన ఉపన్యాసంలో శ్లోకాలూ, మంత్రాలూ ఉదహరించటం సామాన్యంగా వుండదు. అయినా ఆయన భాషణాలు విన్న పెద్దలు "అబ్బా! అనేక గ్రంథాలలో విషయాలు క్రోడీకరిస్తున్నారు." అని ఆనందపడుతూ వుంటారు.

సిద్ధాంత భాగాలు స్వామి ఉపన్యాసాలలో సామాన్యంగా చోటు చేసుకోవు. వాదాలు ఆ చుట్టుపక్కల్లో వుండవు. ఆచరణ స్వామివారి నిత్య ప్రణాళికకు ప్రాణ సూత్రమైనట్లే, వారి ఉపన్యాసాలకు, ఆచరణ, సాధన, వాటి మెలకువలు, వాటిల్లో వచ్చే విఘ్నాలు, వాటికి పరిష్కారాలూ అనేవే ప్రధానంగా విషయాలు అవుతూ ఉండేవి.

స్వామివారి ఉపన్యాసాలవల్ల మైసూరులోనే గాక, ఆ చుట్టుపట్ల అనేకమంది విద్వాంసులు, జ్ఞానప్రియులు, సాధకులు ఆకర్షితులు కాసాగారు. అలాటి వారిలో మైసూరులోని విద్యారణ్యపురంలో నివసించే సుబ్రహ్మణ్య మొదలియార్‌గారు వొకడు. సుబ్రహ్మణ్య మొదలియార్‌కి స్పిరిటు కంపెనీ వుండటంవల్ల, స్పిరిట్ మొదలియార్ అని గూడ అంటూ వుండేవారు జనం. ఆయన స్వామి కార్యక్రమాలకు, విశేషించి ఉపన్యాసాలకు ఆకర్షితులై, అప్పుడప్పుడు స్వామి ఉపన్యాసాలను విద్యారణ్యపురంలోని తమ యింట్లో యేర్పాటు చేయటం ద్వారా, ఆ చుట్టుపక్కల ప్రజలకు సేవ చేయటం మొదలుపెట్టాడు.

ఇలా పేట దాటిన స్వామి కీర్తి త్వరలోనే ఊరు దాటి రాష్ట్ర రాజధాని బెంగుళూరును చుట్టబెట్ట సాగింది. ఫలితంగా అనేకమంది బెంగుళూరు నుంచి వచ్చి స్వామి దర్శనం చేసుకొని లాభం పొందసాగారు.

కాలనీలో వున్న అధికారులకు యీ కొత్త రద్దీ కంటగింపుగా వుండటం సహజం కాని, త్వరలోనే వారిలో అనేకులు స్వామివారివల్ల అనూహ్యమైన లాభాలు పొందసాగారు. అందువల్ల వారే స్వయంగా స్వామివారి కార్యక్రమాలకు సహకరించసాగారు.

ఉదాహరణకు, A. U. నారాయణచెట్టిగారు ఎలక్ట్రిసిటీ ఆఫీసులో శ్రీకంఠయ్యగారికి పై ఆఫీసరు. ఆయనకు అనేక సంవత్సరాలుగా ఉబ్బసం వ్యాధి ముదిరిపోయి వుంది. స్వామి

వారు వారికొక రుద్రాక్ష యిచ్చి అరగదీసి నీళ్ళలో కలుపుకు తాగమన్నారు. "ఇదేం మందు? సరే, చెప్పినట్లు చేసి చూద్దాం. నష్ట మేమొచ్చిందిలె" మ్మని రోజూ కాస్త అరగదీసికొని పుచ్చుకోసాగాడు. ఒక వారం పోయాక గుణం కనిపించింది. మూడు వారాలు పూర్తయ్యే సరికి ఆ ఉబ్బసం నామరూపాలు లేకుండా పోయింది.

అప్పట్లో వీరి అత్తగారికి గొంతు కాన్సర్ వచ్చి యిక లాభం లేదు పొమ్మన్నారు వైద్యులు. దాన్ని స్వాములవారి విభూతి కొద్ది నెలల వ్యవధిలో అవలీలగా తగ్గించివేసింది.

ఉపకారాలు పొందిగూడా దులుపుకు పోయినవారు కొందరున్నారు. కాని పొందిన ఉపకారంవల్ల మనస్సులో కృతజ్ఞత వహించి, స్వామివారికి సహకరించి, తద్వారా ఇతోధిక లాభం పొందినవారు గూడా కొందరున్నారు. ఆ కాలనీలో నారాయణచెట్టిగారు అలాంటి వారిలో ఒకరు.

అలా తాము లాభం పొందటమేకాక స్వామికి సేవగూడా చేద్దామని తపనపడ్డ వాళ్ళలో బెంగుళూరులోని తమ్మణ్ణగారు, వాసుదేవమూర్తిగారు మొదలైనవారు ముఖ్యులు. తమ్మణ్ణగారు వీలయినప్పుడల్లా మైసూరు వచ్చి స్వామిని అనేక విధాల సేవించుకుంటూ వుండేవాడు. స్వామికి ఎప్పుడైనా అవసరమైతే తమ్మణ్ణగార్ని పిలిపించేవారు. ఒకసారి ఏం జరిగిందంటే___.

D. C. ఆఫీసు కృష్ణమూర్తిగారికి, సోమవారం నాడు ఒక టూరు ప్రోగ్రాం వుంది. లారిలో సరుకు తీసికెళ్ళి పొరుగూళ్లో ఒక కో-ఆపరేటివు సొసైటీకి అప్ప చెప్పాలి.

ఆ సోమవారం ఉదయం గూడా హోమం చేశారు స్వామి. ఎందుకో మరి హోమమయ్యాక కృష్ణమూర్తిగారు బయలుదేరి వెళ్ళబోతుండగా "నువ్వు యివ్వాళ్ళ వెళ్ళ వద్దు, ఇక్కడే వుండు" అన్నారు.

"నేను వెళ్ళకపోతే కుదరదు. ఇవాళ్ళ టూరు వుంది. నేను వెళ్ళకపోతే లారీలో సరుకు గల్లంతవుతుంది. నా కొంప మునుగుతుంది" అన్నాడు కృష్ణమూర్తిగారు.

"భగవంతుడున్నాడు లెద్దూ" అన్నారు స్వామి. స్వామిమాట కాదనలేక ఉండిపోయా డాయన. ఆ మధ్యాహ్నం అయ్యేసరికి స్వామికి విపరీతమైన జ్వరం వచ్చింది. ఆయన చాలా బాధ పడుతున్నారు.

"ఇందుకోసమే స్వామి ఆగమన్నారు గాబోలు." అనుకున్నాడు కృష్ణమూర్తిగారు. మంగళవారం గూడా స్వామి జ్వరం తగ్గలేదు గాని "ఇక నువ్వు డ్యూటీకి వెళ్ళు" అన్నారు స్వామి. అయిష్టంగానే వెళ్ళా డాయన. నిన్నటి రోజున తను సరుకులు తీసుకు వెళ్ళవలసిన లారీకి, వేరే అర్జంటు పని తగిలి తన ప్రోగ్రాం రద్దయిందట. ఇవాళ వేరే ప్రోగ్రాం వేశారు. ఆశ్చర్యపోయాడు కృష్ణమూర్తిగారు. కాని స్వామిని జ్వరంలో వదిలి వచ్చినందుకు బాధపడి, యిప్పుడు బాధ్యతగా స్వామి సంగతి చూసుకోగల వారెవరా అని ఆలోచిస్తే ఆయన మనస్సుకి బెంగుళూరు తమ్మణ్ణగారే తగిలాడు.

వెంటనే ఫోను చేస్తే తమ్మణ్ణగారు వచ్చి, స్వామికి జ్వరం తగ్గేవరకూ తన కార్యక్రమా లన్నీ రద్దు చేసికొని, మైసూర్లో వుండి సేవ చేసుకొని వెళ్ళాడు.

తమ కీర్తి దేశాన పడి పరుగులెత్తటమే తప్ప తాను ఎక్కడికీ కదలని స్వామి ఈ తమ్మణ్ణగారి వల్లే మొదటగా కదిలి బెంగుళూరు వెళ్ళారు. అలా బెంగుళూరు చాలాసార్లు వెళ్ళి వచ్చినాక గానీ, దారిలో వున్న మాండ్యలో దిగలేదు స్వామి.

పోస్టాఫీసులో క్రమంగా సత్యనారాయణ పద్ధతి మరీ మరీ మీరసాగింది. పోస్టాఫీసులో, C. I. D. డిపార్టుమెంటువారు, అవసరమనుకొన్న ఉత్తరాలను రహస్యంగా తెరిచి చదివి మళ్ళీ అతికించి పంపేవారు. దీనికి కావలసిన ప్రత్యేక పద్ధతులు వాళ్ళ కుంటాయి. సత్యనారాయణ తరచుగా ఆ డిపార్టుమెంటులో మిత్రులకు శ్రమ తగ్గించేస్తూ వుండేవాడు. ఏ ఉత్తరం చేత్తో పట్టుకున్నా అందులో వున్న వాక్యాలను, అవి ఏ భాష అయినా సరే, గబగబా అప్పచెప్పే సే వాడు. మొదట్లో యిది వినోదంగా వున్నా, క్రమంగా దీనివల్ల వాళ్ళు భయపడసాగారు. క్రమంగా ఆఫీసులో పని చేస్తున్న సమయంలోనే కళ్ళలోంచి, చేతులలోంచీ, విభూతి, కుంకం, పసుపూ రాలసాగాయి. ఈ సంఘటనలు గూడా నిత్యకృత్యంగా కాకపోయినా అరుదని అనరాని పరిస్థితి వచ్చింది.

అప్పట్లో ఇన్‌స్పెక్షన్ డ్యూటీలో ఇటూ అటూ తిరిగే కృష్ణప్పగారి కంటగూడ యిది రెండు మూడు సార్లు పడి ఆయనకు వాగ్బంధమైంది.

ఇలా ఉండగానే కృష్ణప్పగారిని మాండ్యలో * పోస్టుమాస్టరుగా వేశారు. అక్కడ వీరికి అనంత రామభట్టుగారితో స్నేహం కుదిరింది.

అనంత రామభట్టుగారు మాండ్యలో పేరుపొందిన సంపన్నులు. వారిది బస్సుల వ్యాపారం. అందువల్ల ఆయన మకాం మాండ్య అయినా, రోజులో ఎక్కువ భాగం మైసూరు లోనే వుండేవాడు. వాళ్ళది పండిత వంశం. వీరి పూర్వీకులు కంచి కామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారి పూర్వాశ్రమ బంధువులు. అందువల్లే వీరి కుటుంబం అంతా గూడా కామకోటి పీఠానికి సన్నిహిత భక్తులు.

ఈయన ఒక రోజున మాండ్యలో కృష్ణప్ప గారితో ఇష్టాగోష్ఠి చేస్తుండగా—"నిన్న మైసూరులో ఒక మహాత్ముణ్ణి చూసి వచ్చానండీ. చాలా ఆశ్చర్యమైంది. ఆయన మహత్తులు నేనున్న కాసేపటిలోనే అనేకం చూశాను. ముఖంలో మంచి సాత్విక తేజస్సు ఉట్టిపడుతోంది." అన్నాడు.

"మైసూర్లో ఎక్కడా?"

"కెసరేలో, ఎలక్ట్రికల్ కాలనీలో"

---

* గమనిక : మాండ్య అనేది మైసూరు-బెంగుళూరు దారిలో, మైసూరుకు 50 కి. మీ. దూరంలో చిన్న పట్నం.

" ఆయన పేరు "

" సత్యనారాయణ స్వామట. "

" సత్యనారాయణ అని మా పోస్టల్ డిపార్టుమెంటులో, ఒకడుండాలండీ. అతను గూడ ఏవో చిన్న చిన్న తమాషాలు చేస్తూ వుంటాడు. సత్యనారాయణస్వామి అంటే అతనూ, యితనూ ఒకటేనేమో. "

"కావచ్చు. ఎందుకంటే ఈ స్వామి గూడ పోస్టాఫీసులో పని చేస్తున్నారని చెప్పారు. ఏ పోస్టాఫీసో నేను కనుక్కోలేదు. "

ఆ తరువాత అనంతరామభట్లుగారు తను విన్న అనేక చిత్ర విచిత్ర కథలు, స్వామికి సంబంధించినవి చెప్పాడు. అన్నీ విన్నాక కృష్ణప్పగారు ఆలోచనలో పడ్డాడు.

" చూస్తే మన మేదో సత్యనారాయణని, తక్కువ అంచనా వేస్తున్నామేమో అనిపిస్తోంది. ఓసారి అతని ప్రస్తుత పరిస్థితి ఎలావుందో స్వయంగా చూస్తే బావుంటుంది. "

ఈ ఆలోచన వచ్చాక ఈ మాటు తను మైసూరు వెళ్ళినపుడు వో మధ్యాహ్నం పూట శ్రీకంఠయ్య ఇంటికి వెళ్ళాడు కృష్ణప్పగారు. ఇంటి తలుపులు వేసి వున్నాయి. వాకిట్లో నిలబడి పరిసరాలు గమనించసాగా డాయన.

రెండు మూడు నిముషా లయిందేమో, ఇంతలో ఒక కుర్రవాడు లోపలనుంచి వచ్చి " కృష్ణప్పగారు ఎవరండీ " అన్నాడు.

" నేనే " అంటూ ముందరికి వెళ్ళాడాయన.

" స్వామి రమ్మంటున్నారు " అంటూ లోపలికి దారి తీశాడు కుర్రవాడు.

కొత్తగా ఆశ్చర్యమేసింది కృష్ణప్పగారికి. లోపలికి అడుగుపెట్టాడు. ఒక క్షణం కొయ్యబారి పోయాడు. అక్కడ పెద్ద విచిత్రమేమీలేదు. స్వామి ఒక పీట మీద పద్మాసనంలో కూచుని వున్నాడు. ఆయన ముందర ఒక చిన్న కుర్చీపీటకు ఆనించి ఒక కాళికాదేవి పటం వుంది. ఆ పటం ముందర ఒక పక్క అడుగెత్తు విభూతి రాశీ, మరోపక్క మరో అడుగెత్తు కుంకుమ రాశీ వున్నాయి.

తలుపులు వేసి వుండటం వల్ల అరవెలుతురుగా వున్న ఆ గదిలో స్వామిరూపం స్పష్టంగానే కనిపిస్తోంది. వెనక్కు సాగిన జుట్టు, మొలక గడ్డాలున్న కోల ముఖం, వొళ్ళంతా మాత్రం విభూతి రాసుకొని వుంది. ముఖాన పెద్ద కుంకుమబొట్టు. ఇది సామాన్యంగా అందరూ చూచే ఘట్టమే. ఇందులో బిగుసుకు పోవాల్సిందేమీ లేదు. కాని కృష్ణప్ప గారు బిగుసుకుపోయాడు. ఆ తరువాత మెల్లిగా బిగింపు సడలింది కాని వణుకు మొదలైంది. చెమట తోడైంది.

" శివా, నాగభూషణా, గంగాధరా " అంటూ గొణుగుతున్నా డాయన! ఆయన కక్కడ శివుడు కనిపిస్తున్నాడు!! అది ఆయన అదృష్టం. అలాగే మెల్లిగా మెల్లిగా నేలకు చారగిలబడి సాష్టాంగ వందనం చేశాడాయన.

నేలమీద వాలిన ఆ పెద్దమనిషికి, వణుకు ఆగిపోయింది. స్పృహపోయింది. అలాగే పడివున్నాడు నేలమీద. స్వామి కదలలేదు, మెదలలేదు. చూస్తూ వూరుకున్నారు. కొంతసేపటికి కృష్ణప్పగారు లేచి, సంబాళించుకొని, స్వామి ఎదురుగా కూర్చున్నాడు, తదేకంగా స్వామి వంకే చూస్తున్నాడు.

అప్పుడు స్వామి మెల్లగా మాట్లాడసాగారు.

" బావయ్యా "

అది చిన్నప్పటినుంచీ ఆయన పిలిచే పిలుపు. ఆ పిలుపు విని కృష్ణప్పగారి హృదయం జలదరించింది. స్వామి కొనసాగిస్తున్నారు.

" బావయ్యా, మీ రనేకసార్లు ఆశీర్వదించారు, 'నాకు వేరే జీవితం బాగా రాణిస్తుందని'. ఆ ఆశిస్సులు ఫలించినయ్యి బావయ్యా, మీ ఆశీస్సులవల్లేనేమో, నేను యోగినయ్యాను.

యోగినై నేను దేవుడవైపు నడుస్తున్నాను. నా చుట్టూ వున్న వాళ్ళందరినీ దేవుడి వైపుకు తీసుకువెళ్ళటమే యిప్పుడు నా పని. ఇదివరలో మీరు నీకు యక్షిణీ సిద్ధి వుందా అని అడిగారొకసారి. గుర్తుందా ? ఆ సిద్ధులన్నీ అల్ప సిద్ధులు. అసలు సిద్ధి వినాయకుడే సిద్ధించాడు. ఆయన ఆజ్ఞలో నేనిప్పుడు నడుస్తున్నాను. మన ధర్మం సనాతనమైనది. విశాలమైనది. ఈ ధర్మాన్ని విశ్వమంతటా ఘోషణ చేసే పనిలో నన్ను పెట్టాడు గణపతి.

నా కున్న కార్యక్రమం విస్తారమైంది. నా అసలు కార్యక్రమం ఇంకా మొదలే కాలేదు. నేను యిప్పుడు చూపిస్తున్న, మహిమలు మొదలైన వన్నీ కేవలం పునాదులు తీయటం మాత్రమే. ఈ పునాదులలో, ఉత్తమ జీవులనే ఇటుకలతో, ధర్మ భవంతి నిర్మాణ మవుతుంది. ఇల్లు కట్టుట మయ్యాక మళ్ళీ గోడల పక్కన గుంటలు తవ్వరు కదా ! అలాగే యీ నా మహత్తు లనబడే కార్యాలు అప్పుడు వుండబోవు.

అసలైన మహత్తు అప్పుడు మొదలవుతుంది.

మానవులలో పరివర్తన తెచ్చి, ధర్మంపట్ల సహజమైన అభిరుచి కలిగించటమే నా పని. అందుకు, ఎన్ని ఉపాయాలున్నాయో అన్నీ వాడుకుంటాను. ఇందుకు అనేక విధాలయిన ప్రణాళికలు ఇప్పటికే నా మనస్సులో వున్నాయి.

ముందు ముందు మీరుగూడ చూస్తారు.

ప్రస్తుతానికి యిదే నా ఆశ్రమం. ఇక్కడ జరిగే కార్యక్రమాలు చెవిన పడ్డాయి గదా, మీకు వీలు దొరికినపుడల్లా వస్తూ వుండండి.

స్వామి అంత వివరంగా మాట్లాడేటప్పటికి ఆనందం అధికమై యేమీ మాట్లాడలేక, మరోమారు చేతులెత్తి ఔదల దాల్చి నమస్కరించాడు కృష్ణప్పగారు.

తరువాత స్వామి కాసేపు వారి కుటుంబ క్షేమాలు విచారించి, ప్రసాదం యిచ్చి ఆయనను పంపేశారు.

ఇక్కడ జరిగిందంతా తు. చ. తప్పకుండా మాండ్యలో అనంతరామ భట్టుగారికి చెప్పాడు కృష్ణప్పగారు. స్వామివారి ధర్మ రక్షణ ప్రణాళిక విన్నాక భట్టుగారికి స్వామివారి మీద మరింత శ్రద్ధ బయలుదేరింది.

అయితే ఆయనకు యింట్లో కుటుంబ సభ్యుల వల్ల చిక్కు వచ్చింది, "మనం కామకోటి వారి భక్తులం. మనం మళ్లీ వారి చుట్టూ వీరి చుట్టూ తిరగటం దేనికి ?" అన్నారు యింట్లో వారు.

## గణపతిస్వామి

ఇంతలో ఒక చిత్రం జరిగింది.

ఒకసారి యీ అనంతరామ భట్టుగారు కంచిస్వామివారి దర్శనం చేసినప్పుడు, మాటల సందర్భంలో, ఈ సత్యనారాయణస్వామి ప్రసంగం వచ్చింది. "ఆయనను గురించి బాగా వింటున్నాం. ఇంతవరకూ చూడలేదు" అన్నారు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు.

ఆ మాటలో వారిని చూడాలనే భావం స్పష్టంగానే తెలుస్తోంది. దాంతో ఈ మహాత్ము లిద్దరికీ సమావేశం చెయ్యాలని అనంతరామ భట్టుగారికి కోరిక పుట్టింది.

కంచిస్వామివారి నోట వెంట ఆ మాట విన్నాక, వారి యింట్లో వారి అనుమానాలన్నీ ఎగిరిపోయాయి.

అనంతరామ భట్టుగారు, తరుచు స్వామి దర్శనానికి రాసాగారు.

ఆ రోజుల్లోనే— ఒకరోజున ఒక కారు వచ్చి కాలనీలో ఆగింది. ఆ కారులోంచి దిగిన పెద్ద మనుషులు, అరవంలో కొంత, మళయాళంలో కొంత, ఇంగ్లీషులో కొంత మాట్లాడు తున్నారు.

వారంతా కేరళనుంచి వచ్చామనీ, గణపతిస్వామి కోసం వెతుకుతున్నామనీ చెప్పారు.

"గణపతి స్వామి ఇక్కడ ఎవరూ లేరన్నారు" అక్కడివారు. "కాదు వుండాలి, నాడీ గ్రంథంలో వున్నది. తప్పదు" అన్నారు కేరళవాళ్ళు.

బాగా ఆరా తీయగా గణపతిని ఉపాసించే స్వామి ఒకరు అక్కడ వున్నారని తెలిసింది. దాంతో వాళ్ళు మరింత వివరాలు సేకరించి "వీరే" అన్నారు.

"ఏమిటండీ అసలు విషయం?" అన్నారు అక్కడివారు. ఆగంతకులు ఇలా చెప్పసాగారు.

"అయ్యా! మాది కేరళ దేశం. కొచ్చిన్ ప్రాంతం. మేమంతా మిత్రులం. గణేశనాడీ, వశిష్ఠనాడి అనే నాడీ గ్రంథాలలో మా గురువు గణపతిస్వామి అనీ, ఆయన మైసూరు పట్టణం

శివార్లలో వుంటారనీ వుంది. వశిష్ఠనాడిలో యింకా అనేక విశేషాలు వున్నాయి. మేము మైసూరు శివార్లన్నీ తిరుగుతూ యిటు వచ్చాం. ఇక్కడ మీరు చెప్పిన లక్షణాలన్నీ నాడీ గ్రంథంలో చెప్పిన లక్షణాలకు సరిపోయాయి. కనుక వారే మా గురువు. అదీ విషయం."

అది విని అక్కడ వారంతా ఆశ్చర్యపోయారు.

ఎక్కడ కేరళ? ఎక్కడ మైసూరు? ఈ నాడీ గ్రంథాలు పట్టుకొని, వీరంత దూరం రావటమేమిటి?

సరే ఏమయితేనేం, వారంతా స్వామి దర్శనం చేశారు.

స్వామి, వారందరూ పరిచయం వున్నట్టే మాట్లాడారు. వారితో అరవంలో మాట్లాడారు. ఆ సంవత్సరమే వారందరూ కలిసి రెండు మూడుసార్లు వచ్చి దర్శించారు. వాళ్ళల్లో శ్రీకంఠయ్య అనే ఆయన ప్రధానుడుగా వుండేవారు. ఆయన కొచ్చిన్‌లోని పోర్టులో పెద్ద ఆఫీసరట.*

కేరళ దేశీయులు ఒకటి రెండుసార్లు వచ్చేసరికి స్వామి మనస్సు శ్రీశంకరాచార్యుల మీదకి, వారి జన్మస్థలం "కాలడి" మీదికి పోసాగింది.

కేరళ భక్తులు వచ్చిన దగ్గరనుంచీ స్వామికి గణపతిస్వామి అనే పేరు ఎక్కువ ప్రసిద్ధిలోకి రాసాగింది. హోమాది సమయాల్లో ఆ పేరుతోనే జైకారాలు మారుమ్రోగ సాగాయి.



*1964 ప్రాంతంలో వచ్చి స్వామీజీని దర్శించిన కేరళ భక్తుల గురించి ఎక్కువ వివరాలు సంపాదించలేక పోయాను. దానికి కారణాలు ముందు ముందు ఈ గ్రంథంలోనే తెలుస్తాయి.

## ౧౭వ అధ్యాయం

# నాదయోగం

సుసూక్ష్మ చక్ర సంచారో
వృద్ధ నాదసుధోదధిమ్ ।
గురుం గురూణాం తం వందే
నాద బిందు కళాధిగమ్ ॥

(ఆజ్ఞ నుంచి సహస్రారం వరకు గల)

సూక్ష్మ చక్రాలలో సంచరించటంవల్ల ఆయనలో నాదామృత సముద్రం పొంగింది. ఆయన స్వయంగా నాదబిందు కళలను అధిగమించి గురువులకు గురు వయ్యారు. అట్టి శ్రీ గురుదేవులకు నమస్కరిస్తున్నాను.

### ప్రథమ రికార్డింగ్

సంగీతం వినోదం చాలామందికి. కొద్దిమందికి అది పాండిత్యం. కాని ఎంతో అరుదుగా ఎవరో ఒకరికి అది యోగవిద్య.

మానవుడి వెన్నుపూసకు వీణాదండ మని యోగ సంప్రదాయంలో సంకేతం. చదువుల తల్లి సరస్వతీదేవి చేతులో వున్న వీణ యీ వీణే అని తంత్ర రహస్యజ్ఞులు అంటారు. కనుకనే వీణ భారతీయ వాయిద్యాలలో అన్నిటికన్న ముఖ్యమైనదని ప్రసిద్ధి పొందింది.

ఆ వీణకు వికృతిగా విదేశాలలో తయారయిన వయొలిన్, భారతదేశంలో సంగీత సాధకుల మన్ననలను విరివిగా చూరగొన్నది.

మన కథా కాలంనాటికి భారతదేశాన్ని ఉర్రూత లూగించిన సంగీత చక్రవర్తులలో కర్నాటక దేశంలోని చౌడప్పగా రొకరు. ఆయన పూర్తి పేరేమోగాని “ఫిడేల్ చౌడప్ప” అనే తప్ప మరోపేరు ప్రజలకు తెలియదు. ఆయన మైసూరు నగరవాసి.

ఆయన మరణానంతరం ఆయన పేరుతో పూర్తిగా వయొలిన్ ఆకారంలో ఒక గొప్ప సంగీత సభా భవనాన్ని బెంగుళూరులో నిర్మించారంటే కర్నాటక ప్రజలలో ఆయన ఎంత ప్రాభవాన్ని సృష్టించారో మనం వూహించవచ్చు.

ఆ ప్రభావం వెనక అరవైయేళ్ళకు పైబడిన సంగీత యోగసాధన వుంది. ఆయన సంధ్యారాగం వాయించి ఎండిన మోడులను చిగురింపచేసేవాడట. ఆయన్ని గురించి ఎంత

చెప్పినా సంగీత సరస్వతికి సేసే అవుతుంది గాని మన ప్రస్తుత కథకు మాత్రం పక్కదోవ అవుతుంది.

ఆయన యింకా మూడు నాలుగేళ్ళలో పోతారనగా, 1964 ప్రాంతంలో వొకసారి స్వామి దర్శనానికి వచ్చాడు. అప్పటికి ఆయన షష్టిపూర్తి దాటిన వృద్ధుడు.

అప్పటికే స్వామికి సంగీత ప్రియులని పేరు బడ్డది. కొందరు సంగీతకారులు వచ్చి సత్కారాలు పొంది వెళ్ళారు. కాని చౌడప్పగారు వచ్చిన పద్ధతే వేరు. ఆయన మొదటిసారి దర్శించినప్పుడు, ఏమి అనుభూతి పొందాడో మనకి తెలియదుగాని మరునటి ఆదివారం నాడే కచేరీ చెయ్యటానికి తన సొంత వాద్యబృందంతోసహా కాలనీ ఆశ్రమానికి వచ్చేశాడాయన.

ఆ రోజుల్లో చౌడప్పగారి కచేరీ అంటే, సులభ సాధ్యం కాదు. ముందు ఆ పక్క వాద్యాల్ని ధరించటమే లక్షాధికారులు చెయ్యాలసిన పని. ఇక ఆయనకు తీరిక చిక్కి సమయం కేటాయించటం మాట చెప్పనే అక్కరలేదు.

అలాంటిది ఆయన స్వయంగా తన బృందంతో సహా వచ్చి, వేదిక ఏర్పాట్లు సరిగా లేకపోయినా కచేరీ చేస్తున్నాడంటే, ఏం జరిగింది, ఏం జరిగిందని ప్రతివాళ్ళూ పక్కవాళ్ళని ప్రశ్నించసాగారు.

అంతకు ముందు ఏం జరిగిందో గాని, కచేరిలో మాత్రం స్వామి ధారాపాతంగా కన్నీరు కారుస్తూనే వున్నారు. కచేరీ చివరిలో చౌడప్పగారికి గూడా కన్నీళ్ళు ధారాపాతమై వయొలిన్ తీగలు తడిసి కచేరీ దెబ్బ తిన్నది.

అందరికీ పళ్ళెంతో డబ్బు కుమ్మరించే స్వామి వీరికి మాత్రం ఒక చిన్న లాకెట్ సృష్టించి యిచ్చారు. దానికే పొంగిపోయాడు ఆ ముసలాయన. ఆ తరువాత అప్పుడప్పుడు రాత్రిపూట తన వయొలిన్ పెట్టె తీసుకొని, వాద్యాలేవీ లేకుండా, వంటరిగా, స్వామి దగ్గరకు రాసాగాడు. ఆయన వచ్చాడంటే, ఆయనా, స్వామీ తలుపులేసుకొని గదిలో కూర్చుంటారు. శ్రీకంఠయ్య గూడ ఎక్కడికయినా వెళ్ళి పడుకుంటాడు. ఇక లోపల వయొలిన్ సంగీతం మొదలవుతుంది. అది ఏ అర్ధరాత్రికి ఆగుతుందో ఎవరూ గమనించలేదు.

ఆ తర్వాత మైసూరులో జరిగిన ఒకటి, రెండు పెద్ద సంగీత సభలలో మాత్రం చౌడప్ప గారు "అరవై ఏళ్ళ సాధన తరువాత ఇవాళ యింకా ఆ కెసరే కుర్రవాడి దగ్గర సంగీతపు అక్షరాలు దిద్దుకొంటున్నాను నేను" అని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

అలా చౌడప్పగారి రాకతో కెసరే ఆశ్రమంలో సంగీతకారుల రద్దీ పెరిగింది.

ఆ రోజుల్లోనే స్వామి సంకీర్తన ధోరణిలో గూడ మార్పు రాసాగింది. అంతేగాక స్వామి యితర చోట్లకు వెళ్ళినా గూడా స్వయంగా సంకీర్తన చేసే పద్ధతి మొదలైంది. ఆ సంకీర్తనలను టేప్‌లో రికార్డు చేసే పద్ధతి గూడ అప్పుడే మొదలైంది.

స్వామి సంకీర్తనలను ప్రప్రథమంగా రికార్డు చేసిన ఘనత బెంగుళూరు తమ్మణ్ణగారికీ, ఆయన మిత్రుడు మనోహర్ గారికే దక్కింది.

అదెలా జరిగిందంటే—

బెంగుళూరు తమ్మణ్ణగారి వల్ల, స్వామి బెంగుళూరికి వెళ్ళటం అధికం అయింది. క్రమంగా అక్కడ కొందరి యిళ్ళల్లో సంకీర్తన చెయ్యటం గూడ మొదలయింది. అప్పటికి యింకా పోస్టాఫీసు ఉద్యోగం సాగుతూనే వుంది.

అలాగే ఒక రోజున బెంగుళూరు వెళ్ళినపుడు "తమ్మణ్ణా, ఈ సాయంత్రం సంకీర్తన టేప్రరికార్డు చెయ్యాలి" అన్నారు స్వామి.

"అలా అయితే ఎక్కడన్నా టేపు రికార్డరు సంపాదిద్దాం. నా దగ్గర లేదు" అన్నాడు తమ్మణ్ణ. "నీకు, అందరి కన్నా ముఖ్యుడైన మిత్రుడి దగ్గరే టేపురికార్డరు వుంటుంది" అన్నారు స్వామి.

'ముఖ్యమైన మిత్రుడు అంటే మనోహరే. వాడి దగ్గర టేప్ రికార్డర్ వుందా? నాకు తెలీదే. కనుక్కుంటా!' అనుమానం వ్యక్తం చేశాడు తమ్మణ్ణ "ఉందిలే. దాన్నీ, అతన్నీ రెండూ లాక్కురా, ఇప్పుడే వెళ్ళు" తొందరపెట్టారు స్వామి.

లేడికి లేచిందే ప్రయాణం పద్ధతి స్వామిది. ఆ మనోహర్ సిండికేట్ బ్యాంకులో క్లర్కు. బ్రహ్మచారి. ఏ సమయంలో ఎక్కడుంటాడో? సరే చూద్దాం" అనుకుంటూ బయలుదేరాడు తమ్మణ్ణ.

సగం దారిలోనే ఎదురు పడ్డాడు మనోహర్. అతను తమ్మణ్ణ కోసమే బయలుదేరాడట.

"ఏమిటి విశేషం, నా కోసం బయలుదేరావు? అది సరేగాని నీ దగ్గర టేప్ రికార్డర్ వుందా?"

అడిగాడు తమ్మణ్ణ.

"వుంది మొన్ననే కొన్నాను, ఏమయింది?"

"ఏం లేదు, నాకది ఒకసారి కావాలి."

"తీసుకో, యింతకూ విశేష మేమిటి?"

"నా కొక స్నేహితుడున్నాడు. అయనొక యోగి!"

"యోగులు నీతో ఎందుకు స్నేహం చేస్తారయ్యా?"

"నువ్వే చూస్తావుగా, ముందు నీ రూముకి పద, టేపురికార్డరు తెద్దాం."

ఇద్దరూ మళ్ళీ మనోహర్ రూముకి వెళ్ళారు. అక్కడ తమ్మణ్ణ తన స్నేహితుడి గురించి చెప్పాడు.

"మైసూర్లో నా స్నేహితు డొకడు, ఇక్కడొక మహాత్ముణ్ణి చూపిస్తా రమ్మని నన్నొక చోటికి తీసుకు వెళ్ళాడు. ఆయిన చిన్న కుర్రాడు. ఇంచుమించు మన వయస్సే. కాని పెద్ద మిరకిల్సు చేస్తాడు. ఆయన్ను చూట్టానికి వెళ్ళాం యిద్దరం. ఇతరుల కేమోగాని నాకు మాత్రం ఆయన ఒక మిత్రుడు లాగానే కనిపించాడు. ఆయన గూడా అలాగే నాతో ప్రవర్తించాడు. ఒక రెండు రోజుల్లోనే మా కిద్దరికీ చనువూ, సాన్నిహిత్యం ఏర్పడిపోయాయి.

అక్కడ అంతా ఆయనను వాడుకొనే వాళ్ళే తప్పితే ఆయన్ని పైకి లెద్దామనే ఆలోచనే లేదే ఎవరికీ! అంతా స్వార్థపరులనుకో. ఆయనకు ఈ వ్యవహారాల విషయంలో నేర్పు శూన్యం. కాని చాలా మంచివాడు, వోపెన్ హార్టెడ్ (**Open Hearted**).

నేనే ఆయన్ను బెంగుళూరులోనూ అక్కడా పరిచయం చేసి, అసలాయనను మన బెంగుళూర్లోనే స్థిరపరుద్దామనుకొంటున్నాను.

ఇదీ ఆయన సంగ్రహ కథ.

ఇద్దరూ కలసి తమ్మణ్ణ యింటికి వెళ్ళారు. వెళ్ళేసరికి, పాంటు షర్టులో వున్న లేత మొహం వాడొకడు వాళ్ళింట్లో మంచం మీద కూర్చొని వున్నాడు. కొంచెం పొడుగ్గా వున్న జులపాల జుట్టూ, మొహం మీద విభూతీ, కుంకుమా తప్ప ఆతనిలో ప్రత్యేకత ఏమీ కనిపించ లేదు మనోహర్‌కి.

వీళ్ళని చూస్తూనే "హల్లో" అని స్నేహంగా పలకరించాడు. పైగా ముగ్గురూ ఒకే మంచంమీద కూర్చుని కాలక్షేపపు కబుర్లు ప్రారంభించారు. ఎక్కువగా గేమ్సు, స్పోర్ట్సు మీద ప్రసంగం జరిగింది. కాసేపు టేపురికార్డులు, వాటి కంపెనీలు వగైరాల మీద సాగింది.

కాసేపు సంభాషణ అయ్యేసరికి మనోహర్‌కి, ఇతను చాలా మంచివాడు అనిపించ సాగింది. అతను మాట్లాడుతున్న కొద్దీ సంతోషంగా వుంది.

హాయిగా ఆ ముగ్గురు మిత్రులూ కాసేపు మాట్లాడుకున్నాక "సాయంత్రం సంకీర్తన చేస్తాను, మీరు గూడ వచ్చి రికార్డు చెయ్యండి" అన్నారు స్వామి.

"సరే" అన్నాడు సంతోషంగా మనోహర్.

ఆ సాయంత్రం స్వామి సంకీర్తనల మొట్ట మొదటి రికార్డింగు జరిగింది. ఆ కాసెట్టు తమ్మణ్ణ కిచ్చి "ఇది నీ దగ్గర వుంచుకో" అన్నారు స్వామి.

మైసూరు వెళ్ళే ముందు—

"ఎప్పుడైనా మైసూరు వస్తూ వుండండి. సరదాగా మాట్లాడుకుందాం" అన్నారు స్వామి మనోహర్‌తో. దాన్ని మర్యాద మాటగా కొట్టిపారేశాడు మనోహర్.

కాని, ఆ రోజు శనివారం మధ్యాహ్నం. రెండింటికి బ్యాంక్ నుంచి బయటకు వచ్చే సరికి, మైసూరు పోదామని మనస్సు పీకసాగింది. "ఎందుకు లెద్దూ" అనుకొన్నాడు. కాని మనస్సు ఊరుకోలేదు.

చివరికి మైసూరు బస్సు ఎక్కేశాడు. సాయంత్రం ఏడు గంటల ప్రాంతంలో కాలనీకి చేరాడు మనోహర్. అప్పటికి స్వామి దగ్గర కొద్దిమంది జనం వున్నారు.

ఆ తరువాత రాత్రి పొద్దుపోయేదాకా స్వామీ, అతనూ పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. స్పోర్ట్స్ గురించీ, సినిమాల గురించీ, రాజకీయాల గురించీ మాత్రమే సంభాషణ జరిగింది.

తెల్లవారి లేచి మనోహర్ బెంగళూరు వెళ్ళిపోయాడు.

అలా తస్మణ్ణ ద్వారా మొదలయిన మనోహర్ స్నేహం క్రమంగా పెరిగిపోయి, శనివారం రాత్రి స్వామి, మనోహర్ల పిచ్చాపాటీ వరస తప్పని కార్యక్రమమయింది.

ఆ విధంగా ప్రప్రథమ సంకీర్తన రికార్డింగు, స్వామికి ఒక కొత్త స్నేహితుడ్ని గూడ సంపాదించి పెట్టింది.

## ప్రథమ ప్రచురణ

స్వామి పుస్తక ప్రచురణ కార్యక్రమానికి గూడ ఆ సంవత్సరమే అంకురార్పణ జరగటం మరో విశేషం.

అదెలా జరిగిందంటే:—

మైసూరు విద్యారణ్యపురం ప్రాంతాల్లో బసవరాజ బహద్దరుఅర్సు, నంజుండరాజ అర్సు అనే అన్నదమ్ములు వుండేవారు. వీరిద్దర్నీ (దొడ్డర్సు, చిక్కర్సు) పెద్దర్సు, చిన్నర్సు అని పిలవటం ఆశ్రమ భక్తులకు తరువాత తరువాత అలవాటయింది.

వీరిలో చిక్కర్సుగారు రైల్వేలో పనిచేస్తూ వుండేవాడు. దొడ్డర్సుగారు అప్పటికే మైసూరు వాటర్ సప్లై ఆఫీసు నుంచి పదవీ విరమణ చేశాడు.

ఈ చిక్కర్సుగారు రైల్వే డిపార్టుమెంటులో మిత్రులవల్ల స్వామి గురించి బాగా వినటం జరిగింది. ఒకసారి దర్శనం చేద్దాం, చేద్దాం అనుకుంటూ వుండటంతోనే కాలక్షేపం అయిపోయింది.

ఇంతలో బెంగుళూరులో వున్న వీరి మరొక సోదరుడి కొడుక్కి పెద్దజబ్బు చేసింది. ఆ జబ్బు వైద్యులకు లొంగలేదు. చూడటానికి వీరుగూడ బెంగుళూరు వెళ్ళారు. అక్కడ పిల్లవాడి పరిస్థితి చూసి వీణ్ణి "ఆ గణపతి స్వామివారికి చూపిస్తే మంచిది" అనిపించింది వీరికి. సోదరుడితో చెపితే వాళ్ళుగూడ అంగీకరించారు. ఒక టాక్సీ వేసుకొని పిల్లవాడిని తీసుకొని వెంటనే బయలుదేరారు. కాలనీలో, ఆశ్రమానికి వచ్చేసరికి రాత్రి ఏడు దాటింది.

వీరి టాక్సీ ఆగుతుండగానే యెవరో దగ్గర కొచ్చారు. వచ్చి—"మీరు అప్పగారేనా?" అన్నారు.

"ఔను" అన్నారు వీరు.

"మీ తాలూకు పిల్లవాడి కెవరికైనా అనారోగ్యంగా వుందా?"

"ఉంది. మీకెవరు చెప్పారు?"

"కుర్రవాడికి ప్రమాదంగా వుందా ?"

"ఉంది. మీరెవరు? మీకెవరు చెప్పారు?"

"మీరు బెంగుళూరు నుంచి వస్తున్నారా?"

"వస్తున్నాం. మీ సంగతి చెప్ప రేమిటి?"

"మీరొస్తున్నారనీ, కారణం ఇది అనీ, స్వామివారు ఇందాకటి నుంచీ చెపుతూనే ఉన్నారు లెండి. మీ రెన్నాళ్ళనుంచీ స్వామివారి దగ్గరకు వస్తున్నారు?"

"ఇదే మొదటిసారి రావటం."

"వస్తున్నామని కబురు చేశారా ?"

"కబురు చేసేందుకు మేం వస్తున్నామని, మాకు ముందుగా తెలిస్తే గదా?"

"అయితే స్వామివారికి, మీ కథంతా ఎలా తెలిసింది?"

"అదేనండీ, నేనూ ఆశ్చర్యపోతున్నాను."

సరిపోయింది. ఇద్దరూ ఆశ్చర్యపోతూనే లోపలికి పోయారు. లోపలికి వెడుతుండగానే, వీరి వందనాలకు గూడ సావకాశం యివ్వకుండా స్వామి ముందరకొచ్చి, ఆ రోగి పిల్లవాడికి నాభి దగ్గర చేయి వేసి రాసారు. ఒక విభూతి పొట్లం చేతిలో పెట్టారు. "రేపొకసారి కనిపించండి" అన్నారు.

వీరు నమస్కారాలు చేసి, పళ్ళూ, పూలూ సమర్పించి వెళ్ళిపోయారు. మర్నాడు తెల్లవారేసరికి, పిల్లవాడికి బాగా తేలికిచ్చింది. ఆ సాయంత్రం కెసరే వెళ్ళేసరికి స్వామి సత్యనారాయణ వ్రతం చేస్తున్నారు. వీర్ని చూచి "మీ కోసమే చేస్తున్నా" అన్నారు. వ్రతం అయినాక ప్రసాదం యిచ్చారు. ఆ మర్నాటికి కుర్రవాడికి పూర్తిగా తగ్గిపోయింది.

ఆ ఘటనతో అప్ప సోదరులంతా స్వామి భక్తు లయ్యారు. అందులో మైసూరువాసు లయిన ఈ చిన్నవారు, పెద్దవారులు తరచు స్వామిని సేవించుకోసాగారు. ఒక రోజున ఉపన్యాసంలో—

"నేను ధ్యానంలోంచి బయటకు రాగానే, నన్ను దర్శించుకున్న వారికి అనుకున్న పని వెంటనే అవుతుంది" అని స్వామి చెప్పారు. అది విన్న దగ్గర నుంచీ స్వామి ధ్యానానంతర దర్శనం

సంపాదించేందుకై వీరు కాలసీ ఆశ్రమానికి వెళ్ళటం పెంచారు. దీనికి తగ్గట్టే వీరికి స్వామి దర్శనం జరిగిననాడు అనేక సంకట కార్యాల్లో దిగ్విజయంగా కార్యసిద్ధి అయింది.

స్వామి చెప్పే ఉపదేశ వచనాలు వీరి హృదయాన్ని బాగా ఆకర్షించినాయి. క్రమంగా కెసరే ఆశ్రమ పరిస్థితి గమనించగా, ఇంత అమృత వర్షం, ఇసకలో యింకి పోతోందేగాని ప్రవాహమై పక్క జీవికి అందటంలేదే అని బాధ కలుగ సాగింది.

ఇక్కడ ఇటిక రాళ్ళ చాటున, ఒక ఆణిముత్యం ప్రకాశిస్తోంది. ఈ మారుమూల కోనలో, దేవతా కోకిల నిరంతరంగా కూస్తోంది. కైలాన కుసుమం మొకటి ఈ గుహలో గుబాళిస్తోంది.

దీని ప్రయోజనం ఇలా పరిమితంగా, సంకుచితంగా అంతరింపటం మన జాతి దుర్దశ అవుతుంది. కాని, సామాన్య కుటుంబీకుడు తను ఎంత ఆవేదనపడి ఏం లాభం? ఏంచెయ్యగలడు ?

కలలు కంటూ కూర్చుని లాభమేమిటి? ఓకటని తిట్టిపోస్తే వొరిగిందేమిటి? ఈ ప్రపంచంలో మిణుగురు పురుగుకి గూడ ప్రయోజనం వుంది. తను చెయ్యగలిగినంత చేసితీరాలి.

ఈ ఆవేదనతో చిక్కర్చుగాపు, స్వామి దగ్గరకెళ్ళి, "స్వామీ తమ సూక్తులు కొన్ని కరపత్రంగా అచ్చువేద్దామని వుంది" అన్నారు.

"దీనివల్ల నీకు చాలా మేలు జరుగుతుంది." అన్నారు స్వామి.

వెంటనే ఆయన స్వామిని గురించి, కొద్దిపాటి పరిచయంతోపాటు స్వామి సూక్తులు కొన్ని కరపత్రాలుగా ప్రకటించి భక్తులలో పంచాడు.

ఆ విధంగా ప్రచురణ కార్యక్రమానికి, అప్పు చేతిమీదుగా అంకురార్పణ చేశారు స్వామి. ఆ రోజుల్లోనే, మృదంగ రామాచారి అనే మృదంగ విద్వాంసుడు స్వామివారి సంకీర్తనలకు, మృదంగసేవకుడుగా ఆశ్రమంలో ప్రవేశించాడు. ఆయన క్రమంగా స్వామికి సన్నిహితుడై ఆశ్రమం ఖర్చులలో కొంత పొదుపుచేసి, స్వామికి కొన్ని నిత్యావసర వస్తువులు అమరే యేర్పాట్లు చేయసాగాడు.

స్వామి తరపున, అవసరమైన, కొద్దిపాటి ఉత్తర ప్రత్యుత్తరాల పని చూసి పెట్టేవాడు. పైకి ప్రకటించని స్వామి ఆఫీసుకు, రామాచారి మొదటి మేనేజరై స్వామి హృదయంలో మంచిచోటు సంపాదించుకున్నాడు.

రామాచారి చేసే సేవను గుర్తించలేని కొందరు అసూయకులు, ఓర్వలేని అల్పులతో కలిసి డబ్బు దోచుకుంటున్నాడని రామాచారిమీద నీలాపనిందలు వేశారు. ఆ పేరు బయటికి అలాగే వుంచి, పొదుపు చేసిందంతా స్వామికి చూపి లెక్కలు చెపుతూ వుండేవాడు, ధన్యజీవి రామాచారి.

ఆ రోజుల్లోనే డాక్టర్ అనసూయమ్మ అనే ఆవిడ స్త్రీలనందరినీ పోగేసి, ప్రోత్సాహపరచి, క్రమబద్ధంచేసి, సంకీర్తన, ప్రసాదాలు చేయడం, స్వామి భోజనం ఏర్పాట్లూ, దేవుడి పూల ఏర్పాట్లూ వగైరాలన్నీ ఎంతో సామర్థ్యంగా చూసేది. అప్పటికి, ఎవరూ కలలో గూడ ఊహించని మాతృమండలికి ఆ తల్లి స్వామి చేతిలో మొదటి విత్తయింది.

మొదటి పురోహిత వర్గం, తమ అహంకారాన్ని ప్రదర్శించుకొన్నాక క్రమంగా ఆశ్రమంనుంచి జారిపోయారు. ఆ తరువాత నిర్మలమైన భక్తి భావంతో, స్వామికి సహకరించి, సేవించే ఈనాటి పురోహిత బృందానికి శ్రీకారం చుట్టినవారు, వెంకటేశ్వరశాస్త్రి. రామశాస్త్రి మొదలయినవారు. వారు లేందే ఆ రోజుల్లో స్వామి కార్యక్రమాలే లేవని చెప్పవచ్చు.

స్వామి పర్యటన కార్యక్రమాలకూ, తీర్థాటన కార్యక్రమాలకూ, దానికి అంగంగా వాహన సౌకర్యానికీ కూడ, ఆ ప్రాంతాలలోనే అంకురార్పణ జరిగింది. అయితే ఆ విశేషం తెలుసుకోవాలంటే ఇంకా రెండు మూడు సంఘటనలు పరిశీలించక తప్పదు.



# 10 వ అధ్యాయం — దానం

*దానేన దాత్రైవ తరత్యఘౌఘం*
*లోకేషు శాస్త్రేషు చ సిద్ధ మేతత్,*
*గురోస్తు తీర్ణస్య కృపా ప్రదానాత్*
*తరంతి నీచా అపి మాదృశాద్యాః॥*

(దానం వల్ల దానం చేసినవాడే తరిస్తాడని లోకంలోనూ, శాస్త్రంలోనూ గూడా ప్రసిద్ధమే. కాని తాముగా తరించిన శ్రీగురుదేవుల అనుగ్రహ దానం వల్ల (ఆ దానం పుచ్చుకొన్న) నాలాంటి నీచులు గూడా తరిస్తున్నారు.)

## ముష్టి

అది జీతాల రోజు.

జీతం పుచ్చుకొని, ఇంటికి (పార్వతమ్మ యింటికి) బయలుదేరాడు పోస్టాఫీసు సత్యనారాయణ.

దార్లో ఒకచోట "బాబూ రక్షించాలి" ఏడుపుధ్వని–ఒకరిది కాదు యిద్దరిది వినిపించింది. తనకు దార్లో తరుచు కనిపించే ముష్టి దంపతులు వారు. వాళ్ళు ముష్టెత్తుకోవటం కొత్తగాదు కానీ, ఏడవటం కొత్త, కలిసి ముష్టెత్తటం కొత్త.

"ఏడుస్తున్నా రెందుకు?"

"పిల్లాడిని పెద్ద ఆస్పత్రిలో చేర్చాం. అక్కడ మందులేవంటున్నారు. మేం తిండి తిని నాలుగు రోజులయింది. అందువల్ల పిల్లవాడికి పాలు లేవు, కొని పోసే శక్తి లేదు. వాడు చచ్చిపోతాడు. వాడు చచ్చిపోతే మేమూ చచ్చిపోతాం. నువ్వే కాపాడాల బాబూ, నువ్వే కాపాడాల."

అవి ముష్టి మొహాలు. వాటికి సిగ్గూ ఎగ్గూ లేవు. మానాభిమానాలు లేవు. నీతి నియమాలు గూడ లేవంటారు. కానీ తినే కడుపు లున్నాయే! పిల్లలను కన్న చల్లని కడుపులే అవి! ఆ కడుపు మంటల్ని, ఆ కడుపు కోతల్ని పట్టించుకునే దెవడు ?

వాళ్ళు ఎవరితోనైనా అబద్ధం చెపుతారేమోకాని, తనతో అబద్ధం చెప్పరు. ముందు పబ్బం గడిచి యిక మిగిలితే తగలేస్తారేమో కాని కన్న పసికందును చంపుకొని వీళ్ళు గంతు లెయ్యరు.

స్వామి హృదయం కరిగింది.

స్వామి జేబులో రూపాయలకట్ట మొత్తం రెక్కలొచ్చి ఎగిరింది.

సైకిలు చక్రాలు గిర్రున తిరుగుతూ యింటివైపు పరిగెత్తుతున్నాయి. స్వామి మనస్సులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతూ ఎకెటో పోతున్నాయి.

ఇప్పుడొక దానం జరిగింది. దీనికి ప్రయోజన మేమిటి? ఈ జరిగిన దానం ఆ సమస్యకు పరిష్కారం మాత్రం కాదు. దానిమీద నీళ్ళు చిలకరించటం మాత్రమే. అసలు సమస్య ఎక్కడుంది? ఎక్కడిదాకా వ్యాపించివుంది? ఈ ముష్టివాళ్ళను తయారుచేసిన సమాజపు పునాదుల్లోకి దీని వేళ్ళు వ్యాపించి వున్నాయి. దీని శాఖలు సమాజంలో అన్ని కక్ష్యలలోనూ వ్యాపించి వున్నాయి. బొచ్చె పట్టి అమ్మా, బాబూ అని అడుక్కుంటే అది నీచం. ప్రజా సేవ అని పేరు పెట్టుకొని పదవిని మనస్సులో పెట్టుకొని ఓట్లు ముష్టెత్తితే అది గొప్ప. రోడ్డునబడి తలకిందులుగా నిలబడి పైసలు దేవిరిస్తే అది దొమ్మరి ముష్టి. ఒలింపిక్ గేమ్స్ అని పేరుపెట్టి వైతక్కలాడితే అది దర్జా. ఏకతార పట్టుకొని తత్వాలుపాడి చెయ్యి చాపితే అది ముష్టి. వేదిక లెక్కి, వ్యాసాలు చదివి సన్మానాలు చేయించుకొంటే అది గౌరవం.

ఇద్దరిదీ బడి వొకటే, తరగతి తేడా. పెద్దక్లాసువాడు చిన్నక్లాసు వాణ్ణి గుడ్డలు విప్పించి యేడిపిస్తున్నాడు. ఇది దిగుమతి చేసుకొన్న నాగరితకు ఫలం. ఇది పిల్లలకు, పిల్లలలో పుట్టిన పిల్ల చేష్ట మాత్రమేనా? పెద్దలలో యిది మరింత పెద్దదై ఒక్కొక్క రంగంలో ఒక్కొక్క ముష్టి జాతిని యేర్పాటు చేస్తోందే! దీన్నేమనాలి?

అంటుకున్న కొంపల మీద బిందెలెత్తి నీళ్ళుపోసినా, వెనకాలనుంచి మళ్ళీ అంటిస్తూనే వుంటారు ఈ పెద్ద మనుషులు. నువ్వెన్ని దానాలు చేసినా, ఎంత మంది నాదుకున్నా, ముష్టి వారిని ఉత్పత్తి చేస్తూనే వుంటుంది యీ సమాజం. ఇప్పుడున్న ముష్టి వారందరినీ తెల్లారే టప్పటికి కాల్చి పారేసినా రేపొక్క రోజు విశ్రాంతి యిచ్చి, యెల్లుండికల్లా, కొత్త ముష్టి సైన్యాన్ని దింపుతుందీ సమాజం.

సమాజంలో ఎవరీ ఘనకార్యాన్ని ఇంత పట్టుదలగా సాధిస్తున్నారు?

ఎవరు తాము స్వయంగా ముష్టివారో, ఆ గొప్ప దర్జా గౌరవనీయులైన ముష్టి మహనీయులే యీ పని చేస్తారు! ఈ ముష్టివారు వారి సంతానమే!

అందుకనే యిద్దరిదీ ఒకటే గుణం. అదే స్వార్థం.

కనుక ఈ సమస్యను పరిష్కరించాలంటే పని ఇక్కడ ప్రారంభించాలి, ఈ స్వార్థం దగ్గర. ఈ సమాజానికి స్వార్థం లేకుండా పని చెయ్యటం నేర్పాలి. అలవాటు చెయ్యాలి.

అందుకు మొదటి మెట్టుగా, అలా స్వార్థరహితంగా పని చెయ్యటం సాధ్యమని చేసి చూపించాలి.

అంత మాత్రమే చాలదు. స్వార్థమనే ఈ రాక్షసిగుణం మానవులలోకి ఎలా ప్రవేశించింది? మానవులలో అంతర్దృష్టి లోపించటమే దీనికి మూలహేతువు. అంతర్దృష్టికి ఫలం నిస్స్వార్థత. బహిర్దృష్టికి ఫలం స్వార్థత. ఇదీ వీటి లంకె.

కనుక ఒక పక్క నిస్వార్థ జీవితాన్ని ఆచరణ రూపంలో ప్రదర్శిస్తూనే, ఈ సమాజానికి అంతర్దృష్టిని కలిగించి మెల్లి మెల్లిగా రగిలించాలి. అదే ఈ సమస్యకు పరిష్కారం. ఇది సుదీర్ఘకాలికమూ, నిత్య సంకట కంటకితమూ అయినమాట నిజమే. కాని పరిష్కారం మాత్రం యిదే. వేరే లేదు.

"ఇదే అమ్మ ఆజ్ఞగా నా యెదుట వున్న దీక్ష." సైకిలుతో పాటు ఆగిన ఆలోచనలు, రెండూ సమవేగంతో పరిగెత్తాయని నిరూపించాయి.

"ఆలోచనా, ఆచరణా సమతూకంగా వున్నాయన్న మాట" అనుకొంటూ యింట్లోకి వెళ్ళారు స్వామి. కొంతసేపయిన తరువాత పిన్ని యెక్కడినించో వచ్చింది. కుశల ప్రశ్నాదులైన తరువాత మెల్లిగా అడిగింది.

"ఇవాళ్ళ జీతాలనుకుంటాను"

"ఔను"

"మరి డబ్బేదీ?"

"ఆ సంచీలో వుంది."

ఈ మాట నోటంబడి ఎందుకు వచ్చిందో తనకే తెలియదు స్వామికి. పోనీ నోటంబడి వచ్చిన తరువాతయినా ఇలా అన్నానేమిటి అని కంగారు పుట్టటంలేదు. తీరా ఆమె వెళ్ళి చూస్తే అక్కడ డబ్బు వుండదు. అప్పుడేం చెప్పాలి? ఎందుకొచ్చిన గోల, ముందే చెప్పేస్తే పోలా? కొత్తేముంది? నాలుగు తిడతారు అంతేగా. ఎన్నిసార్లు గాలికి పోలా?"

స్వామి మనస్సులో ఆలోచనలు సాగుతూనే వున్నాయి. పిన్ని వాకిట్లో ఎవరినో పిల్చి డబ్బులిస్తోంది. "మావాడి జీతం వచ్చింది. దీంతో మీ బాకీ తీరిపోతుంది. లెక్క సరిపోయిందా?" అంటూ.

ఆశ్చర్యంగా వాకిలి దగ్గరకు వెళ్ళి చూశారు స్వామి. తను చూపించిన సంచీ, చేతులో పెట్టుకొని దానిలోంచి డబ్బుతీసి యిస్తోంది పిన్ని. స్వామి ముఖంలో ఆలోచన గంభీరమై పోయింది. ఆ ఆలోచన చాలా భారంగా వుందని గూడ సులభంగానే తెలుస్తోంది.

"ఎలా జరిగిందిది? అలా జరగాలని నేను సంకల్పించలేదు. దానికోసం యే మానసిక ధారణా చెయ్యలేదు. అసలా మాట అందామనే సంకల్పించలేదు. అనలామాటే నేనన్నది కాదు. ఇది నా పనికాదు.

"ఆ మాట అన్నవాడెవడో, వాడే, ఆ మాట నిజం చేసుకున్నాడు గాబోలు.

"అసలు వాడెవడు? ఎందుకన్నాడామాట? అంటే నాద్వారా ఎందుకన్నాడు? అన్నాక దాన్ని ఎందుకు నిజం చేసుకున్నాడు? తన శక్తిని వ్యయం చేసుకొన్న దానివల్ల వాడికేమిటి ప్రయోజనం? వాడికేదో ప్రయోజనం వుండి వుండవచ్చు గాక, ఇంత అవశ్యంగా వాడి చేతిలో పనిముట్టుగా మారే బలహీనత నా కెలా వచ్చింది?"

స్వామి గబగబా, కాలనీ ఆశ్రమానికి వెళ్ళి, స్నానం చేసి ధ్యానంలో కూర్చున్నారు. సమాధానం దర్శిద్దామని ధ్యానంలో కూర్చుంటే మనస్సు పూర్తిగా లీనమై ఆలోచనే లేకుండా పోయింది. రాత్రి చాలా పొద్దు పోయాక, వ్యుత్థానంలోకి వచ్చిన స్వామి "సరే, సమాధానం రావలసిన సమయంలో అదే వస్తుందిలే, కానీ" అనుకున్నారు ప్రశాంతంగా.

కొన్ని రోజులు గడిచిపోయాయి. కార్యక్రమాలు యథావిధిగా సాగిపోతున్నాయి. ఇలా జరుగుతుండగా ఒక రోజున చిక్కరుసుగారు యెక్కడి నుంచో సైకిలుమీద వస్తున్నారు. ఒక సెంటరు దగ్గర కొచ్చేసరికి మరోవైపు నుంచి స్వామి కాకీబట్టలతో, తపాలా సంచులతో సైకిలు మీద శరవేగంతో వస్తున్నారు. కాని ఆ సైకిలు నేలకు రెండు మూడు అంగళాల ఎత్తులో వుంది. స్వామి సైకిలు తొక్కటం లేదు కాని సైకిలు వేగం ఒక కారు వేగం కన్నా ఎక్కువగా వుంది. స్వామి వీర్ని గమనించినట్లులేదు. వీరికి ఆ దృశ్యం చూసేసరికి ఎందుకనో కాసేపు ఊపిరాగి పోయింది. వెంటనే సద్దుకుంది.

"ఓహో, స్వామి అంత ఆలస్యంగా బయలుదేరి వెళ్ళినా పోస్టాఫీసుకు టైముకు అందు కొనే కిటుకు ఇదా" అనుకొని వూరుకొన్నాడు. ఎవరితోనూ చెప్పొద్దులే అనుకొన్నాడు. కాని చెప్పకతప్పలేదు. ఎందుకంటే___

ఆ రోజుల్లో లక్ష్మమ్మ గారనే ఒకావిడ చాలా నిష్ఠగా స్వామికి అన్నం తెచ్చి పెట్టేది. ఆవిడ మనుమరాలు పది పన్నెండేళ్ళ పిల్ల ఒకరోజు మునుచీకటి వేళలో వంటరిగా వీధంబడి వస్తూ చిక్కరుసుగారు చూచిన దృశ్యమే చూసింది. ఆ పిల్ల అదృష్టం యింకా కొంచెం బాగుంది. స్వామి మొహాన్ని బాగా పరిశీలనగా చూసింది. ఆ ముఖమూ, ఆ కళ్ళూ అగ్నిజ్వాలల్లాగా వెలిగిపోతున్నాయి. పాపం చిన్నపిల్ల వెంటనే దడుచుకుంది, జ్వరం వచ్చింది. ఇలా జరిగిందని చెప్పింది కాని ఎవరూ తొందరగా నమ్మటం లేదు "ఏదో భ్రమ పడ్డదిలెద్దూ" అంటున్నారు.

అప్పుడా చిక్కరుసుగారు తనుగూడ చూశానని బయటపెట్టక తప్పలేదు. అప్పుడు "ఇదేదో స్వామికి చెప్పాలి తప్ప మందులు వెయ్యరా" దని, పోయి స్వామికి పిల్ల జ్వరం సంగతి మనవి చేశారు. స్వామి వెంటనే లేచివచ్చి పిల్ల నోట్లో స్వయంగా విభూతి వేశారు. మర్నాటికల్లా తగ్గింది.

"ఇంకా నయం, మా మేనమామవల్లే కాలేదు" అన్నారు స్వామి. ఎవరికీ అర్థం కాలేదు. ఏదో హాస్యంలే అని వొదిలేశారు.

సైకిలు మీద పది నుంచీ ఇరవై దాకా తపాలా సంచులు పేర్చుకొని డార్లో ఒక్కటి జారిపోకుండా అంత వేగంగా స్వామి ఎలా వస్తారా అని ప్రజలకు ఉన్న అనుమానానికి సమాధానం దొరికింది. దీనికితోడు ఇలాంటి దర్శనం ఆ ప్రాంతంలో మరో యిద్దరు ముగ్గురికి అయింది.

ఒక రోజున సాయంత్రంపూట జానకిరాము మందిరానికి వెళ్ళాలని సంకల్పం కలిగింది స్వామికి. సైకిలు మీద బయలుదేరారు. స్వామి వెళ్ళుతున్నారని తెలిసి D. C. ఆఫీసు కృష్ణమూర్తి వగైరాలు కూడా వచ్చారు. అక్కడ సుబ్బారావు గారు యింట్లో లేరు. స్వామి వాళ్ళమ్మాయిని పిల్చి "నాన్న దగ్గరికి వెళ్ళి, స్వామి వచ్చారు, సంకీర్తన చేస్తామంటున్నారు, అర్జంటుగా రమ్మన్నారు అని చెప్పి పిల్చుకురా" అని పంపించారు.

హూటాహుటి, కబురు చెప్పేసరికి ఆయన ఎగిరి గంతేశాడు. కాని వెంటనే చతికిలబడ్డాడు. "ఖర్మం, చేతిలో పావలా గూడ లేదు. స్వామి స్వయంగా వచ్చి సంకీర్తన చేస్తానంటుంటే కనీసం వడపప్పయినా లేకుండా ఎలా చేసేది?" అని దిగులుపడసాగాడు.

"సరే ఏం చేస్తాం. ఇంతే చేసుకుపుట్టా" అనుకొని బయలుదేరి వచ్చేశాడాయన. ఇంటి కొచ్చేసరికి రోడ్డుమీదే నుంచున్నారు స్వామి. ఈయన్ని చూస్తూనే చేతిలో పది రూపాయల నోటు పెట్టి "సైకిలు దిగకు. పోయి పూలూ, పళ్ళూ పట్టుకురా" అన్నారు. నిరుత్తరుడైనాడు సుబ్బారావుగారు.

స్వామి డబ్బు తీసుకోనని పంతం పడితే, దేవుడికి నైవేద్యం గూడా లేదు. ఏం చేస్తాడు? తల వంచుకొని ఆ డబ్బు తీసుకొని అన్నీ కొనుక్కొచ్చాడు.

## వృత్తి విసర్జనము

స్వామి సంకీర్తన మొదలు పెట్టారు. పొద్దుపోయేదాకా అద్భుతంగా సంకీర్తన సాగింది. స్వామి అక్కడ సంకీర్తన చేస్తున్నారని తెలిసి కృష్ణమూర్తిగారి తండ్రి, సోదరుడు గూడా అక్కడికి వచ్చారు. ఇంకెవరో కారున్న భక్తులు గూడ అక్కడికి వచ్చారు. సంకీర్తన కాగానే యింకా ప్రసాదాలు పంచుతుండగానే, కారున్న భక్తులు స్వామిని తమ కారులో రమ్మని కోరారు. సరే అని ఆ కార్లో వెళ్ళిపోయారు స్వామి. కాలనీకి చేరాక "వెళ్ళేటప్పుడు సైకిలు మీద వెళ్ళా"నని స్వామికి గుర్తు వచ్చింది. తీవ్రంగా ఆశ్చర్యపోయారు స్వామి.

"యోగికి మరుపు పనికిరాదు. గతంలో మరుపు నన్ను ఆవరించిన సంఘటన లేదు. ఇవాళ్ళ యిలా ఎందుకు జరిగింది. అయిదు కిలోమీటర్ల దూరం కార్లో వచ్చాను. కాని మధ్యలో ఒకసారయినా గుర్తు రాక, ఇక్కడికి వచ్చాక గుర్తు వచ్చిందేమిటి? ఈ మధ్యకాలంలో

యిది రెండవ సమస్య." అనుకొన్నారు స్వామి. అక్కడ అందరూ వెళ్ళిపోయాక గూడ మిగిలిన సైకిలు చూసి, అది స్వామి సైకిలని గుర్తించారు. దాంతో దాన్ని కృష్ణమూర్తిగారు సొసైటీకి యిచ్చి కాలనీకి పంపించారు.

"ఆ పక్కన పెట్టు. సైకిలెక్కే సమయం దాటిపోయింది" అన్నారు స్వామి అతన్ని చూస్తూనే. దానివల్ల స్వామి తన విద్యార్థి దశను గుర్తు చేసుకుంటూ, ఏడెనిమిది కిలోమీటర్లు నడిచి పోస్టాఫీసుకు పోతున్నారు. ఎవరైనా పాదపూజలకు పిలిచినా నడిచే పోతున్నారు. ఎందుకొచ్చిన నియమమో ఎవరికీ అర్థం కాలేదు.

ఆ ప్రాంతాల్లోనే అంటే 19-3-64 రోజున బొడ్డుపూడిలో తన మిత్రులకు ఒక ఉత్తరం వ్రాశారు స్వామి. అందులో "నాకు సిద్ధ వినాయక ఆవాహనము, సిద్ధ అయినది" అని వ్రాశారు. ఈ వాక్యం వ్రాయాలిసిన పూర్వాపర సంబంధమేదీ ఆ ఉత్తరంలో లేదు. ఈ ఉత్తరంలో ఆధ్యాత్మిక ఆవేశంగాని, ఆవేదనగానీ ఏమీ లేదు పైగా, "నీ జాతకముగాని, హస్త ముద్రిక గాని ఖండితముగా పంపవలెను" అని వుంది. ఇంక నాలుగు వాక్యాలయినాక "అందరి జాతకము, లేక పుట్టిన తేదీ పంపవలెను అని కోరినాను" అని వ్రాశారు. ఈ వాక్యాలు మినహాయిస్తే మిగిలిన ఉత్తరం అంతా పూర్తి దేశవాళీ సంసార పక్షపు సమాచారాల ఉత్తరమే. తన యెత్తునుంచి పూర్తిగా నేలకు దిగిన తన స్థితిని ఈ ఉత్తరంలో 'రికార్డు చేసి' ఉంచుకున్నారు స్వామి. వెనుకటి ఉత్తరాలకీ, ఈ ఉత్తరానికీ వున్న భేదం గాని, ఈ ఉత్తరంలో వున్న అంతర్యం గాని, ఆ మిత్రులకు ఏమీ వాసన గూడ తగలలేదు. "సత్యనారాయణ మనవాడు. ప్రేమగా ఉత్తరాలు వ్రాస్తున్నాడు" యిదీ వాళ్ళ ఆలోచన. అంతవరకే వాళ్ళ సంతోషం.

తరువాత కొద్ది రోజులకి, పోస్టాఫీసులో, నరసింహయ్యగారు దిగులుగా కనిపించాడు. సత్యనారాయణ అయన్దగ్గర కెళ్ళి "అలా వున్నారేమిటి"? అన్నాడు.

ఆయన మాట్లాడలేదు.

మీసాలు సరిగా రాని కుర్రాడు; రిటైరవబోయే ఒక పెద్ద మనిషిని అలా అడిగితే, ఆయనేం చెప్పగలడు? అన్నీ చిన్న పిల్లలతో చెప్పే సమస్యలే వుంటాయా? పైగా తనచేతి కింద ప్యూనుతో తన కుటుంబ సమస్యలు అయిన చర్చిస్తాడా?

ఒక నిముషం ఆగి స్వామి అన్నారు:

"దానికంత దిగులక్కర్లా. పైవారంలో మీ అమ్మాయి పెళ్ళి ఖాయం అవుతుంది. పైనెల్లో పెళ్ళయిపోతుంది." వింతగా చూశాడు నరసింహయ్య గారు. ఇతని దగ్గరేదో శక్తి వుందని అప్పుడప్పుడు కనిపిస్తూనే వుంది. ఇపుడు నోటంబడ మంచిమాట చెప్తున్నాడు. కాదననటం మెందుకని మౌనంగా వూరుకుండి పోయాడు. కాని పైవారంలో నిజంగానే, ఆ కూతురు పెళ్ళికి

ముహూర్తం పెట్టేశాడు. ఈ వారంలోనే సంబంధం రావటం, పిల్లను చూట్టం, నచ్చిందనటం, అన్నీ జరిగిపోయాయి.

స్వామిమీద గౌరవం ఏర్పడిందాయనకు. సరీగా ఆ రోజునే స్వామి కళ్ళల్లోంచి, చేతుల్లోంచి, పసుపు, విభూతి, కుంకుమ మాత్రమేగాక, కలకండ పలుకులు పొంగసాగాయి.

నరసింహయ్యకు భయం వేసింది. స్వామిని లోపలికి పిలిచి పాదవందనం చేశాడు.

"అయ్యా! నువ్వు మహాత్ముడిలా వున్నావు. నీ చేత పని చేయించుకోవటం పాప మనిపిస్తోంది. పైగా భయం వేస్తోంది" అన్నాడాయన దీనంగా. స్వామి మౌనంగా యివతలకు వచ్చేశారు. ఆ రావటం రావటం ఇక మళ్ళీ పోష్టాఫీసుకు వెళ్ళలేదు.

ఆ విధంగా పగలల్లా గూడ స్వామికి విశ్రాంతి దొరికే సరికి, ఎలక్ట్రిక్ కాలనీ పగలల్లా గూడా వచ్చే పోయే జనంతో కళకళలాడ సాగింది.

## గురుతత్వం

ఆ రోజుల్లోనే గుండ్లుపేట తాలూకా తహసిల్దారుగా వున్న రంగయ్య గారికి స్వామితో పరిచయ మయింది. గుండ్లుపేట మైసూరికి సుమారు 60. కి. మీ. దూరంలోని చిన్న బస్తీ. ఆ రోజుల్లో ఆ ప్రాంతం అంతా, అనావృష్టికి గురై కరువువాతన బడ్డది. అక్కడ తహసీల్దారుగా కరువు నివారణ కార్యక్రమాలు ముమ్మరంగా నిర్వహిస్తున్న రంగయ్య గారికి అప్పటి క్షామ పరిస్థితి తీవ్ర మనస్తాపం కలిగించింది.

"ప్రభుత్వం ఎంత శ్రమిస్తే మాత్రం ఏమవుతుంది ? ఈ ప్రజలకున్న కష్టాల్లో ఈ వచ్చే సహాయక నిధి ఏ మూలకి? పైగా పంపకాలకు ఎలాగో వుంటాయి గదా. దైవం చల్లగా చూసి వానలు పడాలి, పంటలు పండాలి, ఎవరి అన్నం వారికి దొరకాలి గాని, ఇదేం పని కొచ్చే పద్ధతి కాదు, ఎలాగరా భగవంతుడా" అని ఆలోచనలో పడసాగాడు రంగయ్యగారు.

ప్రభుత్వోద్యోగంలో వుంటున్నా గూడా, జీతం హాయిగా చేతి కందుతున్నా గూడా, ప్రజల కోసం బాధపడే జీవులు వుంటారు, వున్నారు. కాని ప్రభుత్వానికి, రంగయ్యకున్న ఆలోచన లేదు. ప్రభుత్వం నడిపే వాడికి అలాటి ఆలోచనలున్నా, అవి బైట పెట్టటం ఫాషను కాదు. పైగా అది పై ఎన్నికలకు దెబ్బ. మరి ప్రజల గతేం కావాలి ?

ఎవరు సమాధానం చెప్పగలరు కాసిండే, రంగయ్యగారు మాత్రం కనీసం, తన తాలూకా వరకైనా వర్షాలు పడే ప్రయత్నం చేయాలని నిశ్చయించుకున్నాడు.

"కెసరేలో గణపతి స్వామి వున్నారు. ఆయన అఘటనఘటనా సమర్ధుడు. ఆయన వచ్చి ఏదైనా యాగమో, మరోటో చేస్తే వర్షాలు పడతాయి. ఇంతకన్నా మార్గంలేదు."

ఈ ఆలోచన తన ప్రాంతంలో కొంతమంది పెద్దలకు చెప్పాడు. చాలమంది బావుందన్నారు. కొంతమంది తోటి వుద్యోగులు మాత్రం, "ఇదెక్కడి తెలివిరా బాబూ? కరువుంటేనేగదా నివారణ కార్యక్రమాలూ, నిధులు, సరుకుల రవాణాలూ, వుండేది. ఇదెక్కడి పోగాలప్పు బుద్ధి, సీదెకి?" అని విసుక్కున్నారుగాని, పైకి అనేందుకు నమ్మీలు లేక వూరుకుండి పోయారు.

తాలూకా పెద్దలంతా పర్యాలోచన చేశారు. చేస, "ఇక్కడికి దగ్గరలో పార్వతి కొండ వుంది. అది దేవీమహాక్షేత్రం. మన తాలూకాకి అది ప్రతిష్ఠాకరమైన ప్రదేశం. కనుక అక్కడ స్వామివారిచేత యేదయినా యాగం చేయిద్దాం." అని నిర్ణయించుకున్నారు.

అలా ఆలోచించుకొన్న పెద్దల్లో, గుండ్లుపేటకు చెందిన హెచ్. ఎస్. రామణ్ణగారు గూడా వున్నారు. రామణ్ణగారు ప్రధానంగా వ్యవసాయదారుడే అయినా, వంశపరంపరగా వస్తున్న డాక్యుమెంటు వ్రాత, కొద్దిపాటి రాజకీయ ఆసక్తి గూడా వున్నాయి. కుటుంబం సహజంగా, సనాతన సంప్రదాయపరమైనది గనుక యింట్లో దేవతార్చన, పారాయణలు కొద్ది కొద్దిగా వున్నాయి. పూర్వుల వేదశాస్త్ర పాండిత్యాలూ, పూజలు, మొదలయినవి నామ మాత్రంగానే మిగిలినా, ఎవర్నయినా గొప్ప వారనాలంటే సందేహించే గుణం మాత్రం పూర్తిగా మిగిలే వుంది ఆయనలో. వీరంతా ఎవరో కెనరే స్వామి గొప్ప వాడంటుంటే "సర్లే" అన్నాడే తప్ప ఆయనకు తృప్తిగా లేదు. మనస్సులో నసుగుకుంటూనే వున్నాడు. ఈ నసుగుడు వదిలించేందుకో ఏమో, ఆయన అల్లుడికి ఏదో జబ్బు చేసింది. గుండ్లుపేటలో వైద్యం చాలక, చివరికి మైసూర్లో హాస్పిటల్లో చేర్చారు. అక్కడ కొంచెం నిలబడి వుంది రోగం. ఆ అల్లుడి సేవకోసం, యీయన మైసూర్లో కొన్నాళ్ళు వుండవలసి వచ్చింది. ఆయన, ఆయన బంధువులు, తడవలు, తడవలుగా హాస్పిటల్లో కూర్చొనేవారు.

ఆ రోజుల్లో గణపతి స్వామి గుర్తు వచ్చారు రామణ్ణగారికి. ఎలాగో మధ్యాహ్నం రెండింటి నుంచీ యేమీ పనిలేదు. "అసలీ స్వామి సంగతేమిటో, పద్ధతేమిటో, శక్తి యేమిటో అన్నీ స్వయంగా చూద్దాం" అని కెనరే బయలుదేరాడు.

పరిశీలించటమేగా పని! అందుకని లోపలకు వెళ్ళలేదు. వాకిట్లోనే కూర్చుని మొత్తం గమనించసాగాడు. రోజూ మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతాల్లో రావటం, రాత్రి దాకా వుండి పోవటం, అంతేగాని స్వామితో మాట్లాడలేదు.

ఆ రోజుల్లో, స్వామి, గదిలో కూర్చుని చేసుకునేటప్పుడు, గాయత్రీ హోమాలు విరివిగా చేస్తూ వుండేవారు. ఆదివారాలు గణపతి హోమం చేసేవారు కనక, స్వామి యే హోమం చేసినా గణపతి హోమమే అనటం పరిపాటి అయింది కాని, గదిలో కూర్చుని హోమం చేసేటప్పుడు యే హోమాలు చేస్తారో పక్కనున్న చంద్రశేఖరయ్యకు గూడ తెలిసేదికాదు.

రుద్ర హోమాలూ, చండీ హోమాలూ, గాయత్రీ హోమాలూ, కొంచెం తరచుగా జరిగేవి. ఇవికాక, చంద్రశేఖరయ్యకుగాని, శ్రీకంఠయ్యకు గాని తెలిసి హోమం, ఆదిత్య హోమం, సుదర్శన హోమం, పవమాన హోమం మొదలయినవి గూడా వుండేవి. ఏమయినా గణపతి హోమాల తరువాత రెండవ స్థానం గాయత్రీ హోమాలదే.

ఇక అర్చనలో ప్రముఖ స్థానం సత్యనారాయణ వ్రతానికి వస్తుంది.

రామణ్ణగారు వుండగానే ఒక పూర్ణిమ వచ్చింది. సూర్యాస్తమయం అవుతుండగా యించుమించు వందమంది దంపతులు పోగయ్యారు. అందరూ, ఎవరి కలశం వారు పెట్టుకొని అతిబయట సత్యనారాయణ వ్రతం చేసుకొన్నారు. స్వామి స్వయంగా చేయించారు. (ఇలా ప్రతి పూర్ణిమా కొన్నాళ్ళు జరిగింది) ఆ తరువాత వారందరికీ భోజనాలు పెట్టారు. పూర్ణిమ రోజుల్లోనేగాక, ఇతర రోజుల్లో గూడా సత్యనారాయణ వ్రతాలు జరుగుతూ వుండటం రామణ్ణగారు చూశాడు.

ఇక విగ్రహాల సృష్టికి లెక్కలేదు. ఆయన చూసినంతలో, ఆ కాసేపట్లో రోజుకి పదిహేను, ఇరవై విగ్రహాలు సృష్టి అయినట్టుగా కనిపించింది. ఇక కలకండ సృష్టికి లెక్క లేదు. రోజుకి ముగ్గురు నలుగురయినా రోగాల వాళ్ళు ఏడుస్తూ వచ్చి నవ్వుతూ వెళ్ళటం యీయన చూశాడు.

ఒక రోజున ఒకడొచ్చి "స్వామీ, మీరిచ్చిన మందు పనిచెయ్యలేదండీ" అన్నాడు బాధగా. "పోనీలే, యిది తీసుకో" అని నోట్లోంచి ఏదో తీసిచ్చారు స్వామి. అది గంధపు వుండ. "దీనివల్ల తగ్గిపోతుంది" అన్నారు స్వామి. "నోట్లోంచి వచ్చిన గంధపు వుండ పొడిగా ఎలా వుందీ? తడి ఎందు కంటలేదు?" అని ఆశ్చర్యం అయింది రామణ్ణగారికి. ఆ మర్నాడు ఆ రోగి వచ్చి తన రోగం తగ్గిపోయిందని చెప్పాడు.

ఇంతా చేసి ఆదివారం గణపతి హోమం ఆయన చూడనే లేదు. క్రమంగా ఆయనకి కెసరేస్వామి మీద గౌరవభావం, ప్రీతి, భక్తి కలగసాగాయి. అయిదో రోజున లోపలికి రమ్మని కబురు చేశారు స్వామి.

"ఏం రామణ్ణా, యిన్నాళ్ళు పట్టింది?" అన్నారు స్వామి యీయన్ను చూడంగానే.

నలభై ఏళ్ళ జీవితానుభవం వున్నవాడు, స్వామి మహత్తు బాగా పరిశీలించిన వాడు అవటం వల్ల రామణ్ణగారు కంగారు పడలేదు. "ఔను స్వామి! నాలుగు రోజులు పట్టింది. నేను నిదానంగా పరిశీలించాను. కాని యిప్పుడు చాలా యిష్టపడుతున్నాను. మీరంటే హృదయ పూర్వకంగా యిష్టపడుతున్నాను. మీరు మహాత్ములు" అని సాష్టాంగ వందనం చేశాడు.

"నేను గూడ నువ్వంటే బాగా యిష్టపడుతున్నాను రామణ్ణా! ఇలా పరిశీలించే వాళ్ళు నాకు కావాలి.

"స్త్రీలకు భర్త ఎలాంటి వాడో, జీవులందరికి గురువు అటువంటివాడు. స్త్రీకి తన భర్తను మార్చుకోటానికి వీలులేనట్లే జీవి తన గురువును మార్చుకొనే వీలులేదు. గురువును ఎన్నుకొనే ముందరే బాగా పరిశీలించి, పరీక్షించి, నిదానించీ ఎన్నుకో, తప్పులేదు. కాని ఒకసారి ఈయన నా గురువు అని యెన్నుకున్నాక ఇక పరీక్షించే హక్కు నీకు లేదు. పరిత్యజించే హక్కు గూడా లేదు.

అయితే నువ్వు ఆయన్ని గురువుగా ఎన్నుకొన్నంత మాత్రంచేత, ఆయన నీకు గురువయి పోడు. ఆయన నిన్ను తన శిష్యుడిగా ఎన్నుకోవాలి. ఎన్నుకునే అధికారం నీకు మల్లే ఆయనకూ వుంది. నిదానించి, పరిశీలించి నువ్వు అర్హుడవనిపస్తేనే నిన్ను శిష్యుడిగా తీసుకుంటారు. ఆయన తీసుకుంటే అప్పుడు ఆయన నీకు గురువవుతారు. నువ్వు ఆయన శిష్యుడివవుతావు. అందుచేత ముందు నువ్వు గురువును ఎన్నుకొన్నాక ఆయన నిన్ను ఎన్నుకునే కృషి నువ్వు చేయాలి. నువ్వెంత వెనకబడి వున్నావో, నువ్వెంత కృషి చెయ్యాలో నీకు తెలియదు, ఆయనకు తెలుసు. తనకు తృప్తి కలిగిననాడే ఆయన నిన్ను తీసుకుంటారు. అప్పుడే నీకు శిష్యత్వం వచ్చేది.

ఇదీ గురు శిష్య తత్వం. ఇది గ్రహించక కొందరు ఏవో చిన్న టుమ్రీ మహత్తులు చూసి బోర్లపడి గురువు, గురువు అని వెంటబడతారు. మళ్ళీ కొంతకాలం పోయాక దులిపేసుకు వెళ్ళిపోతారు. వాళ్ళు ఉభయ భ్రష్టులవుతారు. ఈ గురువు వాళ్ళను బహిష్కరిస్తాడు. మరో గురువు వాళ్ళను దగ్గరకు రానీయడు.

ఇక కొందరున్నారు. వాళ్ళకి మహిమలను చూసేసరికి పొంగిపోయి, మతి తప్పి పోతుంది. నువ్వే మా గురువు వని వెంటబడతారు. కాని వాళ్ళ దృష్టిలో గురువు నడుచుకో వలసిన ప్రవర్తనా నియమావళి వొకటి వుంటుంది. ఏదో వొకనాడు ఈ గురువు ఆ ప్రవర్తనా నియమావళిని అతిక్రమించి కనిపిస్తాడు. అప్పుడు ఈ ఉన్మత్త శిష్యులు తమ పాత నిర్ణయాన్ని వెనక్కి తిప్పి వేసుకొని, మరోగురువు కోసం వెతుకులాడతారు. వీరు గురునిందకులు, కనుక పతితులు.

మరికొంద రున్నారు. వారు తాము శిష్యులవటం వల్ల గురువు కీర్తి పెరుగుతుందనీ, గురువును తాము వెలుగులోకి తెస్తున్నామనీ, గురువుకు తాము సహాయం చేస్తూ పైకి తెస్తున్నామనీ భావిస్తుంటారు. వీరు ఒక పక్క గురువు గొప్పవాడని ఆత్మలో అంగీకరిస్తూనే తమ గొప్పదనాన్ని తమ హృదయాలలో స్థిరపరచుకొంటూ వుంటారు. వీరు ఆత్మవంచకులు. వీరికి నిష్కృతి కష్టసాధ్యం.

వీరంతా శిష్యులు కారు, శిష్యాభాసులు. శిష్యుల్లాగా లోకానికి కనిపిస్తారు. శిష్యులమే అని తమలో తాము అనుకొంటూ వుంటారు. గురువు దృష్టిలో మాత్రం వీరసలు శిష్యులు క్రానేకారు. వీరందరి తప్పుకి మూలం ఒకటే. అదే మహత్తు మీద వెర్రి.

మహత్తులనేవి అల్పమైనవి. చేతకాని వాడిచేతిలో పడితే అవి నీచమైనవిగూడా అవుతాయి. శివమంటే శివుడని అర్థం. అలా శివస్వరూప అయిన గురువుని అల్పమయిన మహిమల ద్వారా నిర్ధారించుకోటం అవివేకం. గమనించాలసింది మహత్తులను కాదు. మహత్తుల ద్వారా ఏమి జరుగుతోంది అని గమనించాలి.

మనకు కొన్ని విత్తనపు గింజలు దొరికాయి. అవేవో సరిగా తెలియటం లేదు. సన్నగా వుండే విత్తనపు గింజలను గుర్తించటం కష్టమే మరి. ఏం చెయ్యాలి? చేసేదేముంది, ఒకటో రెండో గింజలు నేలలో నాటి నాలుగు రోజులు చూడటమే. అప్పుడది తులసో, గంజాయో తెలుస్తుంది. ఒనుక మొలచిన మొలకనుబట్టి గింజను గుర్తించాలి.

అలాగే ఒకరి దగ్గర వ్యక్తమయిన మహిమలు చుట్టూతా వుండెవారిలో ఏ రకమయిన పరిణామాలను మొలకెత్తిస్తున్నాయి, ఏ ప్రయోజనాలను సాధిస్తున్నాయి అనేది గమనించాలి. అది ముఖ్యం. అంతేగాని "అబ్బో, మహిమలు జరిగి పోతున్నాయి" అని పొంగిపోవటం సరిగాదు.

ఇదిగాక జీవులకు పరమేశ్వరు డనుగ్రహించిన హృదయ మనేది ఒకటి వుంది. దీన్ని నిర్మలంగా వుంచుకొని దాని సలహా తీసుకోవాలి. నిర్మలమైన హృదయం సహజమైన శాంతితో, తృప్తితో యే స్థానంలో సత్వగుణ ప్రధానం అవుతుందో అది శివస్థానం. అది సిటు సిదుస్థానం.

అందుచేత గురువు కోసం పరిశీలన చేసేటప్పుడు నీ హృదయాన్ని నీవు బాగా పరిశీలన చేసుకోవాలి. అసలు గురు పరిశీలన అంటే హృదయ పరిశీలనే. అదీ పరిశీలించే విధానం. ఏమయినా నువ్వింత వివరంగా పరిశీలించక పోయినా చక్కగానే పరిశీలించావు. నీ అదృష్టం బావుంది. నీ గురువు మాత్రం నిన్ను నేను పరిశీలిస్తాననకుండా వెంటనే పిలిచేశారు."

గుప్పెడు ఉపదేశం కొండంత వరం! రామణ్ణగారు ఆనందంలో తేలిపోయాడు. ఇక రెండో మాట తోచే పరిస్థితా అది? స్వామి యిచ్చిన విభూతి ప్రసాదం తీసుకుని వందనం చేసి వచ్చేశారు రామణ్ణగారు.

ఆ మర్నాడు మళ్ళీ దర్శనానికి వెళ్ళినపుడు అల్లుడి సంగతి చెప్పబోయాడు.

"నాకు తెలుసు. ఆయిన ఫలానా హాస్పిటల్‌లో వున్నాడు. పదకొండో నెంబరు గదిలో వున్నాడు. అదేమీ ప్రమాదమైన వ్యాధి కాదు. నా సహాయం దాకా అక్కరలేదు. అయినా యీ విభూతి ఉపయోగించు" అన్నారు స్వామి.

ఆ తర్వాత కొన్నాళ్ళు రావటం కుదరలేదు. ఇక మైసూరు నుంచి వెళ్ళిపోబోతుండగా ఒక రోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకే కాలనీకి వెళ్ళాడు. స్వామి ఇంట్లో లేరు. వచ్చేద్దామనుకుంటుండగా పక్కయింటివారు ఎవరో చూసి "మీరు రామణ్ణగారా?" అంటూ దగ్గర కొచ్చారు.

"ఔను."

"స్వామి పాదపూజకు వెళ్ళారు. మిమ్మల్ని అక్కడికి రమ్మన్నారు."

"ఎవరు చెప్పారు?"

"స్వామే చెప్పారు. ఫలానావారు వస్తారు, రాగానే అక్కడికి పంపండి అని చెప్పి వెళ్ళారు." ఈ మాటతో ఆశ్చర్యపోక తప్పలేదు రామణ్ణగారికి. వాళ్ళు ఆ పాదపూజ జరిగే యింటి గుర్తులు చెప్పారు. అక్కడికి వెళ్ళేసరికి అందరూ భోజనాలకి కూర్చున్నారు. ఈయిన్ను చూస్తూనే "రా రామణ్ణా, నీ కోసమే విస్తరి అట్టి పెట్టించా" అన్నారు స్వామి. వడ్డించి సిద్ధంగా వున్న విస్తరి చూపిస్తూ, అలా స్వామి సహపంక్తి భోజన భాగ్యం పొంది, నయమైన అల్లుడిని తీసుకొని గుండ్లుపేట వెళ్ళిపోయాడు రామణ్ణగారు.

ఈ మాటు గుండ్లుపేటలో పార్వతి కొండ దగ్గర యాగ ప్రయత్నాలు మరింత ముమ్మరంగా సాగాయి.

ఇక్కడ కెసరే కాలనీలో స్వామీజీ కార్యక్రమాలు మరింత రద్దీ అయిపోతున్నాయి. స్వామి రోజంతా దొరకటంతో స్వామి కోసం యితర వూళ్ళనుంచి వచ్చేవారి సంఖ్య ఎక్కువయింది. ఆ రోజుల్లోనే స్వామివారి సన్నిధిలో విశేష ఉత్సవాలు గూడ ప్రారంభమైనాయి.

అప్పటిలో వినాయక చవితి ప్రాముఖ్యం ఎక్కువగా వుండేది. తరువాత స్థానం నరసింహ జయంతికి వస్తుంది. ఈ నరసింహ జయంతి ఉత్సవాలలో స్వామి ఉగ్రత్వం తారాస్థాయిలో వుండేది. దయ్యాలు, చిత్తచాంచల్యాలవారు వందల సంఖ్యలో వచ్చి నివారణ పొందేవారు. శివరాత్రి ఉత్సవం గూడ జరిగేది. రాత్రి జాగరణ, సంకీర్తన, హరికథ ప్రధానంగా వుండేవి. ఇలాంటి ఉత్సవాలలో, కన్నడ దేశీయులేగాక తమిళ దేశంనుంచీ, ఆంధ్రదేశం నుంచీ గూడా కొందరు భక్తులు రాసాగారు.

స్వామి తల్లివైపు బంధు వర్గంలో గూడా స్వామిమీద విశ్వాసం పెరగసాగింది. స్వామి పెదతండ్రి శేషగిరి శాస్త్రిగారు, ఇక్కడ హోమాది కార్యక్రమాల్లో పురోహితుడుగా పాల్గొంటున్నాడు. పినతల్లి యింటికీ, చెల్లెలు ఇంటికీ మాత్రం స్వామి తనే అప్పుడప్పుడు పోయి వస్తున్నారు.

## మరో జన్మ

తండ్రివైపు బంధువులకు మాత్రం తమ కుర్రవాడు పోష్టాఫీసులో బంట్రోతు పని చేస్తున్నట్టు తప్ప మరో వార్త లేదు.

తమ్ముడి ఉద్యోగం, అన్న నంజుండయ్యకు నచ్చలేదు.

"నాన్న ఊళ్ళో పురోహితుడై పదిమందికీ పెద్దగా, గురువుగా వుండె. నేనేమో ఉపాధ్యాయుడినై పిల్లల్ని గదమాయిస్తూ దర్జాగా వుంటిని! మనవాడిలా బంట్రోతుగా ఉండటమేం ప్రారబ్ధం? పైగా S. S. L. C. పాసయ్యె. ఇక్కడికి పిలిపించి, ఏదో రకంగా తంటాలుపడి, ఎక్కడో అక్కడ ఏ ఎలిమెంటరీ స్కూల్లో పంతులుగా పడేస్తే అది నయం. వీలయితే కాస్తో కూస్తో వైదికం గూడ చూసుకోవచ్చు." అని కనిపించినప్పుడల్లా తండ్రితో అనసాగాడు నంజుండయ్య.

ఆయన కేమీ పట్టదు "పొట్ట పోసుకోడానికి దర్జా ఎందుకురా" అంటాడాయన. గట్టిగా వెంటబడితే, "వాడు కన్నడప్పు వెధవ. వాడికి తెలుగే సరిగ్గా రాదు. వాడు యిక్కడ ఉద్యోగం ఏం ఏడుస్తాడు" అంటాడు.

"అ....ఈ బళ్ళల్లో చెప్పి చచ్చేందుకేం తెలుగు రావాలి? అయినా ఏ లెక్కల పంతులుగానో వేయిస్తే సరిపాయె. చేస్తుంటే అదే వస్తుంది" అంటాడు నంజుండయ్య. ఈ వాదాలతో రెండేళ్ళు గడిచింది.

ఒక శుభ ముహూర్తాన నరసింహశాస్త్రిగారు కొడుకు నంజుండయ్య యింటికి వచ్చాడు. ఆ రోజు మైసూరు సత్యనారాయణ దగ్గర నుండి తండ్రి పేర ఉత్తరం వచ్చింది. అందులో * "అప్పా, తక్షణం నీవు రావలిసింది. నీ ముఖం చూసి ప్రాణం విడుస్తూ వుంటిని" అని ఉంది. ఆ ఉత్తరం చూసిన దగ్గర నుండీ నరసింహశాస్త్రిగారు శోకాలు మొదలెట్టాడు.

నంజుండయ్య గారికి గూడ కంగారయింది. కాని మెల్లిగా తమాయించుకొని—

"ఎందుకయ్యా, అంత గోల చేస్తావు? ప్రాణాలు విడిచేవాళ్ళు చెప్పి విడుస్తారటయ్యా? మొత్తానికి అక్కడ వాడేదో కష్టాల్లో పడి వుంటాడు. నువ్వు ముందు బయలుదేరి వెళ్ళి, వాణ్ణి కేకలేసి కంగారు పెట్టకుండా ఇక్కడికి తీసుకురా. తరువాత సంగతి తరవాత ఆలోచిద్దాం" అన్నాడు. సరే అని వెళ్ళాడు శాస్త్రిగారు.

తీరా వెళ్ళి చూస్తే ఏమీ కంగారు లేదక్కడ! వచ్చేపోయే వారితో పాదవందనాలు చేయించుకుంటూ, హాయిగా ఉన్నాడు కొడుకు.

వచ్చిన తండ్రిని పలకరించి క్షేమ సమాచారాలు కాస్త విచారించారు తప్పితే, అంత కన్న ఎక్కువ ఏమీ మాట్లాడలేదు స్వామి.

ఆ తండ్రి గూడా, ఈ కొడుకు అనుష్ఠానం, అదృష్టం, వైభవం, చూసి అనలేం మాట్లాడాలో అర్థం కావటంలేదు. ఆనందం పట్టటానికి వీల్లేకుండావుంది. పార్వతమ్మ మొదలయిన బంధువుల దగ్గర విచారించాను. "ఏం జరిగింది, ఇలా ఎప్పుడు మారాడు, ఉపదేశం

* ఆ ఉత్తరం దొరకలేదు. దాంట్లో పున్న వాక్యం యథాతథంగా యిదీ అని, తనకు బాగా గుర్తుందనీ శ్రీ నంజుండయ్యగారు చెప్పారు.

ఎవరు చేశారు." వగైరాలన్నీ. వాళ్ళకు చేతయింది వాళ్ళు చెప్పారు. స్వామి దగ్గరకొచ్చే శిష్యుల్ని అడిగాడు. ఎవరికి వాళ్ళు వాళ్ళ ఆనందంలో వాళ్ళున్నారు తప్పితే, ఈయన అడిగిన ప్రశ్నలకు జవాబు లేమిటని పట్టించుకున్న వాడే లేడు.

ఆ దెబ్బంబడి, నెలరోజులు అక్కడేవుండి కొడుకు పద్ధతంతా జాగ్రత్తగా గమనించాడు శాస్త్రిగారు. వందలకొద్దీ జనానికి ఉపకారం జరుగుతోంది. అది మొదటి తృప్తి. ఎవర్నీ డబ్బు అడగటం లేదు. అది రెండో తృప్తి. చేసే హోమాలన్నీ వైదిక మార్గంగా వున్నాయి. అది మూడో తృప్తి.

ప్రాథమిక పరిశీలన చాలా తృప్తికరంగావుంది. ఇంకేం! వెంటనే తన ఆనందాన్ని వ్యక్తంచేస్తూ, నంజుండయ్యకి ఒక వుత్తరం రాసాడు. రోజు రోజుకీ ఆనందం పెరుగుతోంది. చెప్పుకుందామంటే అక్కడ సరిగ్గా తెలుగు వచ్చిన వాడు ఒక్కడూ లేడు. దాంతో నంజుండయ్యకే రోజూ ఒక ఉత్తరం రాయసాగా డాయన.

ఆదివారం వచ్చింది. వందలు అనుకున్న జనం, యిప్పుడు వేలు అయ్యారు. ఆ వైభవం, ఆ మహత్త్వ వర్షం, చూసి ముసలాయనకు కళ్ళు తిరిగి పోయాయి. తరువాత కొడుకు ఉపన్యాసం చెప్ప సాగే సరికి ఆశ్చర్యంగా చూశాడాయన. అదంతా అడవిగోలగా వుందాయనకి. ఆయనకి కన్నడం బొత్తిగా రాదు.

"వీడి ఉత్తరాలు చూస్తే అడుక్కుతిన్నట్టుంటాయి. వీళ్ళంతా వీడి ఉపన్యాసం ఇలా చెవులు దోరపెట్టుకొని వింటున్నా రేమిటి ?" అనుకున్నా డాయన. కానీ ఆ మాట ఎవరిదగ్గరా అనేందుకు లేదు. శిష్యులంతా తమ గురువంటే దేవుడన్నట్టుగా చూస్తున్నారు.

అంతా అయినాక, కాస్త తెలుగు వచ్చిన వాళ్ళని ఎవర్నో అడిగాడు "ఏమిటండీ, మా సత్యనారాయణ చెప్పింది ?" అని. వారు తమకు చేతనయినంత చెప్పారు. విని ఆశ్చర్య పోయా డాయన "అరే, వీడికి మంచి రహస్యాలు చిక్కాయే! ఎలా దొరికిందబ్బా వీడికి పట్టు ?"

శాస్త్రిగారికి మంచి గౌరవం సాగుతోందక్కడ. వచ్చిన వారంతా ఆయనకి గూడ ఒక నమస్కారం చేస్తున్నారు. కాని కొడుకుతో మాట్లాడాలంటే కుదరటంలేదు. "ఏమిటి రాశావు ? దాని సంగతేమిటని" అడుగుదామంటే, ముందు తనకే భయంగావుంది. ఒకోసారి తనకే, కొడుక్కి నమస్కారం పెట్టాలనిపిస్తోంది.

నెల రోజు లయ్యాక, శాస్త్రిగారికి విసుగుపుట్టింది. "వాడామాట ఎత్తటంలేదు. ఇక్కడ అంతా సాత్వికంగా వుంది, వీడి పరిస్థితి బావుంది. గౌరవమూ వుంది. సంపాదనా వుంది. ఇక ఆ కొంకిరి మాట నేను మాత్రం ఎత్తటం దేనికి ? వట్టిగా రమ్మని రాస్తే ఢానేమో అని అట్లా

రాసి వుంటాడు. కనుక యిక వాడిగోల వాడు పడతాడు. నే వెళ్ళిపోతాను, నా బతుకు నాది. ఈ నమస్కారాలూ, యీ గౌరవాలూ, మన కెందుకు ?" అనుకొన్నా డాయన.

అనుకొన్నాక ఆలస్యం వుండదుగా, కొడుకు దగ్గరకెళ్ళాడు. అప్పుడాయన చుట్టూ పది మంది వున్నారు. ఈయన దూరంగా నిలబడి "ఇహ నేను వెళ్ళొస్తానయ్యా" అన్నాడు.

"సరే, అన్నయ్యా నొకసారి పంపించండి" అన్నారు స్వామి. అంతే. అయిపోయింది సంభాషణ. శాస్త్రిగారు స్వగ్రామం వెళ్ళాడు.

ఉద్యోగం మానేసిన దగ్గరనుంచీ, పాంటు, షర్టూ మానేశారు స్వామి. బైటకెళ్ళినా గూడ తెల్ల లుంగిపంచ, ఉత్తరీయంతోనే వెడుతున్నారు.

పూజ, హోమం, పాద పూజల సమయాల్లో మాత్రం యెర్ర పట్టుబట్ట కట్టుకుంటున్నారు.



# 11 వ అధ్యాయం — మతసామరస్యం

*వైష్ణవ శైవ స్మార్త విభేదే*
*జాతే హార్థిక్ కలహపరే,*
*సమరసతాప్త్యై స్వీకృతదేహం*
*గురు మీడే త్వాం ప్రాగ్గురుసారమ్॥*

(వైష్ణవ, శైవ, స్మార్త సిద్ధాంత బేదాలు, అయ్యో. చివరకు కొట్లాటలకు దారి తీశాయి. అందువల్ల ఆ యా మతాల వారిలో సామరస్యాన్ని, సాధించేందు కోసం, ఆయా పూర్వ గురువుల సారమంతా పోగై. ఈ గురుదేవులుగా అవతరించింది అట్టి గురుదేవుని) స్తుతిస్తున్నాను.

అమ్మమ్మ

వీరశైవం స్థాపించి, విరివిగా ప్రచారం చేసిన బసవేశ్వరుడు కన్నడదేశీయుడు. శివభక్తి తత్పరుడైన ఆ మహనీయుడు సర్వసమతా బుద్ధితో, ప్రపంచంలోని జనులంతా భక్తికి అర్హులేననీ, జనుల ఉత్తమత్వానికి కొలబద్ద శివభక్తేనని ప్రవచించాడు. ఆయన వీరశైవం కన్నడ దేశంలో గట్టిగా కాలూనింది. ఆ బసవేశ్వర మతానుయాయులకు లింగాయతులని పేరేర్పడ్డది.

అయితే ప్రపంచంలో మతం పేరిట జరిగినన్ని వికృత కృత్యాలు మరో సాకుతో జరగలేదు—ఏ దేశంలో అయినా సరే! మహనీయులైన ఆదిపురుషులు ప్రతిష్ఠించిన మౌలిక విలువల్ని విస్మరించి, దైనందిన బాహ్యాచార సంప్రదాయాలకే ప్రాముఖ్య మిచ్చి; చివరికి, వాటిలో, నాయకత్వము రాజకీయాల్ని పెనవేసి పేనటమే ఈ దుష్పరిణామాలకు కారణం. బసవేశ్వరుల తరువాత వీరశైవానికీ, సాంప్రదాయక హిందూ మతానికి రాజకీయ యుద్ధాలు కొన్ని జరిగినాయి. రక్తపుటేరులు ప్రవహించాయి. ఫలితంగా రెండు మతాలూ, అవి వ్యాపించిన ప్రాంతాలూ బలహీన పడ్డాయి. తరువాత కొద్దికాలానికి దండెత్తి వచ్చిన ముసల్మానులకు పని సులువు చేసి పెట్టాయి.

ఆ తరువాత బ్రిటీషువారు వచ్చారు. అన్ని మతాలూ దెబ్బ తిన్నాయి. ప్రపంచంలో ఆర్థికస్థితి మారి ధన సంపాదనా విధానం మారి, జీవన ప్రణాళికలు మారి అంతకుముందు వూహింపని కొత్త సమాజం రూపు దిద్దుకొంటోంది.

అయినా హిందూమతపు బ్రాహ్మణులకు, బసవేశ్వరుని లింగాయతులకు మాత్రం సామరస్యం ఇంకా కుదరనేలేదు. ఉభయవర్గాలలోనూ సహృదయులు కొందరు సామరస్య సాధనకై తరతరాలుగా వినిర్మలమైన కృషి చేస్తూనే వున్నారు. లింగాయత పక్షంలో అలాంటి సహృదయులలో ప్రముఖులైన నంది బసప్పగారు మైసూరులో సుప్రసిద్ధులు, వారి పుత్రుడు నాగప్పగారు తండ్రికి తగ్గ కొడుకు.

తమ సంప్రదాయాన్ని నిర్ద్వంద్వంగా ఆచరించుకుంటూ ప్రపంచాన్ని లింగ స్వరూపంగా ఆరాధిస్తూ మంచి యెక్కడున్నా ఆరాధించటం వారి కుటుంబపు ఆనవాయితీ. వంశ పరంపరగా సంపన్నులై అనేక వ్యాపారాలు కలిగివున్న నాగప్పగారికీ, D. C. ఆఫీసు కృష్ణమూర్తిగారికీ అరమరికలు లేని స్నేహం వుంది.

నాగప్ప గారికి 1964 ప్రాంతాలలో వ్యాపారపరమైన చిక్కులు మిక్కుటమై మనశ్శాంతి కరువైన పరిస్థితి వచ్చింది. అప్పుడు ఆప్తుడు కృష్ణమూర్తిగారు తన్నివారణకు శ్రీ గణపతి స్వామివారి పేరు సూచించాడు. భేదభావన ఎరగని నాగప్పగారు సరాసరి వెనరే పోయి, స్వామిని దర్శించి, వారింటికి పాదపూజకు రమ్మని ఆహ్వానించాడు. అంగీకరించారు స్వామి.

స్వామివారి అంగీకారం విని, మంగలంలో వేసిన పేలాలల్లే ఎగిరిపడ్డది స్వామి చుట్టూ వున్న పురోహిత వర్గం. పేలం–రెండవసారి ఎగర్లేదుగా! వీరూ అంతే! అప్పటికే స్వామి మహత్తు, శక్తి వారికి అనుభవానికి కొంత వచ్చే వుంది గదా ! ఈ అనుభవం ఏ మాత్రంలేని జయమ్మ గారికి మాత్రం ఊపిరాడని సంకటం వచ్చి పడ్డది.

జయమ్మగారు నాగప్పగారి భార్య. నిత్య శివపూజా దురంధరురాలు. సంప్రదాయ పరాయణ. భర్తను అనుసరించి పోయే స్వభావం గలది. ఎంత అనుకూల దాంపత్యం అయితే మాత్రం చెప్పాపెట్టకుండా తన భర్త యింత పని చేసి వస్తే భరించటం ఎట్లా ? తనేదో తలవంచి వూరుకున్నా బంధువులు, సాటి కులం వారు, కాకులై ఇనప ముక్కులు పెట్టుకొని పొడిచిపెట్టరా ?“ ఆ బ్రాహ్మణస్వామి కాళ్ళు పట్టుకున్నారా ? బ్రాహ్మణస్వామిని వంటింట్లోకీ, దేవుడింట్లోకీ తిప్పారా ” అని దెప్పరా ?

అది భరించటం కష్టంగదా ! అందుకే ఆవిడ కొంచెం మొరటుతనం చేసి భర్తను వ్యతిరేకించవలసి వచ్చింది. ఆవిడ యింత గోలపెడితే నాగప్పగారు, ఒక్కటే మాట అన్నారు. “నేను పిలిచి వచ్చాను, అయిపోయింది. ఇక చర్చవద్దు. ఏర్పాట్లు చూడు”.

ఇక ఏం మాట్లాడినా కీచులాటలూ, కొంపలో గోలలూ, ఊళ్ళో అప్రతిష్ఠా, ఇంతేగా ఫలితం ! కనుక ఒక ఉపాయం ఆలోచించిందావిడ.

20

"సరే, మనింటికి వ్యాపారం కోసం ఎందరు రావటంలేదు? అలాగే యీ స్వామినీ. హాల్లోనే కూర్చోబెట్టి, ఆ పూజేదో అక్కడే కానిచ్చి, అటునుంచి అటే పంపేద్దాం. ఎవరన్నా అడిగినా అది లౌకిక మర్యాద లెమ్మని సర్దిచెప్పవచ్చు."

ఈ ఆలోచన వచ్చాక ఆవిడ మనస్సు కొంత శాంతపడ్డది. ఇక ఆవిడ ఏర్పాట్లలో పడ్డది. ఆ ఏర్పాట్లంటే సామాన్యమా! అది మహారాజ కుటుంబమయ్యె! చేసే పాదపూజ వారి స్థాయికి తగ్గట్టు వుండద్దూ?

పాదపూజ రోజు రానే వచ్చింది. స్వామి కార్లో వచ్చారు. ఆ వెనుక నాలుగుకార్లు వచ్చాయి. వాటిల్లోంచి స్వామి పరివారం దిగింది. అందులో యిరవైమంది దాకా బ్రాహ్మణ పురోహితులు ఉన్నారు. ఇవి చూసిన జయమ్మగారికి నీరసం వచ్చినంత పనైంది. ఏదో స్వామి ఒకరే వస్తారనుకుంటే ఈ బ్రాహ్మణ తంబంతా వచ్చి పడ్డది. ఇదెక్కడి అప్రతిష్ఠ! ఆవిడ గజగజ లాడిపోయింది. కాని బైట పడేందుకు లేదు.

స్వామి కారును చూసేటప్పటికి, బెల్లంగడ్డ చూడగానే ఈగలు వాలినట్లు, చుట్టుపక్కల జనం అంతా వచ్చిపడ్డారు. వాళ్ళు రెండు మూడువందలదాకా ఉన్నారు. వీళ్ళకు ఆహ్వానాలూ పాడూ అక్కరలేదు.

వాళ్ళ యింటి ఆవరణ చాలా పెద్దదే అయినా అప్పుడు యిరుకయి పోయింది.

ఒకటే సందడి, రద్దీ, జయ జయ ధ్వానాలు! వీటిని మించి కంచు గంటలు కొట్టినట్టు బ్రాహ్మణుల స్వస్తి వచనాలు, మరో పక్క మంగళవాద్యాలు. ఈ సంరంభంలో, ఎలాగో స్వామికి దండలు వేసి, పూర్ణకుంభం చూపి, హారతి యెత్తి లోపలికి తెస్తున్నారు.

స్వామి కుర్రస్వామి. ఆయన మొహం చూస్తే, యింకా ఇరవై ఏళ్ళు వచ్చాయో లేదో! మనిషెత్తు దండలు రెండు మెళ్ళో వేశారు. మనిషి మంచి ఉషారుగా వున్నారు. ఉషారుగా వుంటే వుండనీ, స్వాగతంలో పూర్ణ కుంభం పట్టుకొన్నది మొదలు హాల్లోకి వచ్చే వరకూ కుర్రస్వామి చూపులు జయమ్మగారి మీదే అతుక్కుపోయినై.

గేటు దగ్గరనుంచీ, హాల్లో దాకా, నడుస్తున్నంతసేపూ ఒక కంట గమనిస్తూనే వున్న జయమ్మగారికి, వొళ్ళు కంపరమైంది. తనది నలభై యేళ్ళు దగ్గర పడుతున్న వయస్సు. తనది కాయఃశరీరం, సహజంగా స్ఫురద్రూపం, పైగా రాజపోషణ, అది చాలక మంచి అలంకరణ! అయితే అవొచ్చుగాక, స్వామి అని పేరు పెట్టుకొన్నాక యీ పాడు చూపు లేమిటి? ఆవిడ యిది సహించలేక, ఏమయితే అయిందని భర్తను లోపలికి పిలిచింది.

"సొగరు వయస్సు స్వామిని తెచ్చారు. ఈయన వచ్చిన దగ్గరనుంచీ నా మొహమే చూస్తాడేమిటి? ఇక్కడ యింకా మొహాలేవీ లేవా?" అంది.

నాగప్ప గారు సంకటంలో పడ్డాడు. కాని అనుభవజ్ఞుడు, ఆలోచనశీలి. తనకూ ఆయన్ని గురించి యింకేమీ తెలీదు నిజమే. కాని తన భార్య మొదటి నుంచీ, వ్యతిరేక కోణం నుంచి ఆలోచిస్తోంది అనేది తెలిసిన విషయమే కనుక, ఈవిడ చెప్పింది వెంటనే నమ్మక్కరలేదు.

ఇదంతా చెప్పక, "ఇప్పుడేం మాట్లాడకు. ముందు పూజ కానీ" అన్నాడు.

అంతకన్నా విశ్రాంతిగా మాట్లాడుకుందుకు అప్పుడు సావకాశ మేదీ? సరే! పాదపూజ మొదలైంది. మనస్సులో విసుగు బయట పడకుండా పొందిగ్గా బిగపట్టుకొని పూజకు భర్త పక్కన కూచుంది జయమ్మగారు. ఒక అయిదు నిమిషాలు అయ్యేసరికి, ఆవిడ సన్నగా, ఒణక సాగింది. "నందా....నందా...." అంటూ.

మరో అయిదు నిముషాలయింది.

"ఏమండోయ్, కుర్చీలో మన నందా ఉన్నాడండీ. తొమ్మిది నెలలప్పటి నందారూపం! అంతే, వాడే, నవ్వుతున్నాడండీ." అన్నది ఆవిడ భర్త చేయి పట్టుకొని. ఆయన అయోమయంగా చూశాడు.

'నందా' వాళ్ళ మనవడు. కూతురు కొడుకు. వాళ్ళు యిప్పుడు బెంగుళూరులో వున్నారు. వాడికిప్పుడు అయిదేళ్ళు. తొమ్మిది నెలల నందా యిప్పుడు కనిపించట మేమిటి? ఇక్కడ స్వామి కూచునే వున్నారుగా? ఆవిడకి స్వామి కనిపించటంలేదు. భర్తకు నందా కనిపించటంలేదు.

పురోహితుడి సంకల్పం పూర్తయి పూజ దగ్గరకు వచ్చింది. చటుక్కున పురోహితుణ్ణి ఆపి, "అమ్మకు అన్ని మంత్రాలూ వచ్చు. ఆవిడ తనే చెప్పుకొని పూజ చేసుకొంటుంది. మీరూరుకోండి" అన్నారు స్వామి. ఆవిడ కొంత కొంత ఈ లోకంలోకి వచ్చింది.

స్వామి అనటం అమ్మ అన్నారు గాని ఆవిడ తను పూర్తిగా అమ్మమ్మ అయిపోయింది. స్ఫురద్రూపం, రాజపోషణ అన్నీ యిగిరిపోయాయి. కేవలం అమ్మమ్మ మిగిలింది. ఆ మాట్లాడేది ఆవిడ దృష్టిలో యిక స్వామి కాదు! తొమ్మిది నెలల నందా ముద్దు పలుకులవి!

ఒక పక్క స్వామి తెలుస్తూనే వున్నారు! మరో పక్క నంద నవ్వుతూనే వున్నాడు! స్వామి మాటలు వినిపిస్తూనే వున్నాయి! నందనవ్వులు గలుగల్లు మంటున్నాయి! ఈ ఉయ్యాల ఊపు ఆవిడకే సిగ్గయింది. అందుకే "నాకేం రావండీ" అంది సిగ్గుపడుతూ.

"లేదు, నీకు అన్నీ వచ్చు. రోజూ పూజ చేసుకొనేది నువ్వేగా" అన్నారు స్వామి. ఆశ్చర్యంగా చూసింది "మీ కెట్లా తెలుసూ" అన్నట్టు.

"నేను గూడ నీతో కలిసి చెపుతాను. నువ్వూ చెప్పు" అన్నారు స్వామి. అని వెంటనే రోజూ యీవిడ శివపూజకు చెప్పుకునే నామాలే స్వామి మొదలు పెట్టారు. సరిగా ఆవిడ

విధానంలో, ఆవిడ రాగంలో ఈనాటు ఆశ్చర్యం, ఆనందంగా పరిణమించి, స్వామితో తనూ గొంతు కలిపింది. ఆ తల్లి, కాదు అమ్మమ్మ.

పూజ మొదట్లో గణపతి నామాలు చెప్పి గణపతి పూజ చెయ్యటం ఆవిడ అలవాటు. ఆ వరుసలోనే స్వామివారి మంత్రం గూడ మొదలయింది. కానీ ఆ నామాల పూజ గూడ స్వామి పాదాలకే చేయసాగిందావిడ.

ఆగమన్నారు స్వామి.

"ఏమమ్మా! పూజ లన్నింటికీ గణపతి పూజ ముఖ్యం. అసలు పూజంటే గణపతి పూజే. గణపతి పూజ చేస్తున్నావు, మరి యిక్కడ గణపతి యేడీ?" అన్నారు స్వామి.

"తమరే ప్రత్యక్ష గణపతి అయి వుండగా ఇకవేరే గణపతి ఎందుకు స్వామీ" ఆ అమ్మమ్మ దృష్టిలో అప్పుడే దత్తస్వామి గణపతి అయిపోయారు.

"అలా కాదులే, గణపతి నా తండ్రి. గణపతి వుండాలి" అన్నారు స్వామి.

"అలా అయితే తెస్తా నుండండి" అని పూజా మందిరంలోకి వెళ్ళింది జయమ్మగారు.

ఆవిడట్లా వెళ్ళంగానే స్వామి ఒక చిన్న చప్పట్టు చరిచారు. వారి అరచేతిలోంచి ఒక గణపతి విగ్రహం జారి పడింది. జయమ్మగారు పూజా గృహంలోంచి పాత గణపతిని తెచ్చే టప్పటికి ఇక్కడ కొత్త గణపతి తళతళ లాడుతున్నాడు. ఆవిడ విషయం తెలుసుకొని పాత గణపతిని పాతచోటే పెట్టి వచ్చి కొత్త గణపతిని కొంగొత్త ఉత్సాహంతో పూజించింది. అలా స్వామియే తను పాదపూజకు మంత్రాలు చెప్పుకోగా పాదపూజ పూర్తయింది. చివరిలో నాగప్పగారు స్వామివారికి ఒక పెద్ద పూలదండ వేసి ఒక మంచి శాలువా కప్పారు.

"ఇదేమిటి ఈ శాలువా యింత బరువుంది" అంటూ శాలువా పక్కకు లాగెయ్య బోయారు స్వామి.

పక్కనేవున్న శేషగిరిశాస్త్రిగారు తటాలున ముందుకొచ్చి "బాబూ, బాబూ, అది మర్యాద కాదు. అలా తీసెయ్యరాదు. దాతలు బాధపడతారు. కప్పుకొనే వుంచుకోవాలి" అన్నారు బతిమాలు ధోరణిలో.

"ఓయమ్మో యీ బరువు నేను మోయలేను బాబూ" అంటూ స్వామి ఆ శాలువా తీసి విదిలించేశారు. తప్పని మోతయింది. ఆ శాలువా లోంచి వీసెడు (కిలోన్నర) పటికబెల్లం అచ్చు కిందపడింది. అందరూ ఆశ్చర్య పోయారు. దాన్ని ముక్కలు చేసి అందరికీ ప్రసాదం పెట్టమన్నారు స్వామి.

అందరూ యీ అపూర్వ పటికబెల్లపు ప్రసాదం ఉత్సాహంలో ఉన్నారు. యజమాని దంపతులకు గూడ ఆనందంలో వొళ్ళు తెలియటం లేదు.

ఇంతలో వున్నట్టుండి "ఏమప్పా సత్యనారాయణా లోపలికి వెడతావేమో వెళ్ళు" అన్నాడు శేషగిరిశాస్త్రిగారు. ఆయనకి ఎవడు పూనాడో ఏమో ?

"ఔను, యిల్లు చూస్తాను" అంటూ ముందరికి సాగిపోయారు స్వామి.

మెరుపు మెరిసినట్టుగా జరిగిపోయిన యీ సంఘటనకు జయమ్మగారు ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. అయిపోయింది, తన పథకం అంతా తల్లకిందులైపోయింది. తనకు ఆయన మీద విశ్వాసం కుదిరింది. అది వేరే మాట. మరి బంధువుల పోటో? దొంగ పోటు కంటె లింగపోటు ఎక్కువని శైవుల్లో వున్న సామెతేనాయె! ఇహ చేయగలిగిం దేముంది ?

ఈ యిల్లు తనకు చిరపరిచితమైనట్టూ, తనకెవరూ దారి చూపాల్సిన పనిలేనట్టూ టకటకా అడుగులు వేసుకొంటూ సరాసరి దేవుడి గదిలోకి నడుస్తున్నారు స్వామి. బిక్కచచ్చి పోయి, చేయగలిగిందేమీ లేక, తనూ వెనకాల వెళ్ళింది జయమ్మగారు. ఈవిడ వెళ్ళేసరికి స్వామి పూజా మందిరంలో పీటమీద కూర్చుని వున్నారు. ఆ పూజా మందిరం ఒక ఆలయపు గర్భగుడి లాగా తీర్చిదిద్దబడి వుంది. అక్కడి వాతావరణం గూడ అచ్చం గర్భగుడిలా వుంది. ఎంతో నిష్ఠతో, శ్రద్ధతో, ప్రీతితో, లింగమూర్తిని కొన్ని తరాలుగా అర్చన చేసిన పవిత్రత అక్కడ గుడి కట్టుకొని వున్నది.

ఆ మందిర స్థితికి స్వామి చాలా ప్రసన్నులయ్యారు. "అహా! ఎంత చక్కటి పూజా మందిర మిది! ఎంత పవిత్రత! ఎంత ప్రశాంతత! నా కిక్కడే వుండిపోవాలని వుంది" అన్నారు స్వామి ఆనందంగా.

"దానికేమి స్వామీ. యిది మీ యిల్లు. మీరు యథేచ్ఛగా వుండవచ్చు." అనేశాడు నాగప్ప గారు.

"అది సరేగాని, ఏమిటి మీరిద్దరూ మరోలా కనిపిస్తున్నారు ? "

స్వామి ఛటుక్కున మాట మార్చేసరికి గతుక్కుమన్నారు దంపతులు. "ఈయనేదో, ఇందాక తాము మాట్లాడుకున్న సంగతి కనిపెట్టేసినట్టున్నాడురా బాబూ" అనుకున్నారు కంగారుగా. పైకిమాత్రం—

"ఆ....ఆ.... ఏమీలేదే" యిద్దరూ ఒకసారే అన్నారు "ఉందిలే, ఉందిలే" అమ్మమ్మను మనవడు పూరించినట్టే పూరించారు స్వామి.

దంపతులు తెల్లమొహం వేశారు.

"అయినా భయపడ వలసింది లేదు" అన్నారు స్వామివారు గంభీరంగా.

"హమ్మయ్య" అనుకున్నారు దంపతులు.

"మీరొక ఉత్తరంకోసం ఎదురు చూస్తున్నారు. అది రాలేదేమని బాధపడుతున్నారు. కాని అక్కడ వాళ్ళ కొక చిన్న చిక్కువచ్చింది. పిల్లవాడికి కొంచెం అనారోగ్యంగా వుంది.

అదిగూడా నేనే చూసుకుంటా, భయంలేదు. మూడు రోజుల్లో ఉత్తరం వచ్చేస్తుంది. వచ్చే వార్తగూడ శుభమే " అన్నారు స్వామి.

దంపతు లిద్దరూ మొహాలు చూసుకొన్నారు. వీరు ఎదురు చూసేది ఆ మనవడి...వాడే నందా___ ఆరోగ్య వార్త కోసమే. అదే కొంచెం పరోక్షంగా చెపుతున్నారు స్వామి. అంతవరకూ అర్థమయింది. మనవడి విషయం గుర్తు చేసేసరికి జయమ్మగారికి ఆందోళన యెక్కువయింది. " ప్రాణభయం లేదుగా స్వామీ " అన్నది ఆదుర్దాగా

" ఏమీలేదు. శుభమే అంటున్నాగా. అది సరేగాని నాకేమైనా ఫలహారం పెట్టేది లేదా ?" అన్నారు స్వామి.

" పాలిస్తే సేవిస్తారా స్వామీ " అని అడిగిందా జయమ్మగారు.

"నా కోసం చేసిపెట్టిన టిఫెన్ నువ్వు తింటావా ?" స్వామి ఉడుకుమోతుతనం నటించారు.

ఆవిడ తెల్లబోయింది. నిజానికి స్వామికి పెడదామని యిడ్లీలు చేసిందావిడ. కాని యింతమంది బ్రాహ్మణ పరివారంతో వచ్చిన స్వామిని చూసి, ఈయన లింగాయతుల యింట్లో తింటారో తినరో, అని సందేహించి ఆ మాట ఎత్తకుండా " పాలు తాగుతారా ?" అని అడిగింది. దాన్నే స్వామి ప్రస్తావిస్తున్నారు.

ఇక మారు మాట్లాడకుండా వంటింట్లోకి పోయి ప్లేటులో యిడ్లీలు పెట్టుకొని దేవుడి గదిలోకే తెచ్చింది. స్వామి వారు ఆనందంగా ఆరగించారు. మళ్ళీ హాల్లోకి వచ్చి కూర్చున్నారు స్వామి. వచ్చిన జనానికి పంచి పెట్టటానికి కొంత ప్రసాదం చేశారు, మహా అయితే యాభై మంది రావచ్చు అనే వూహతో. అంత మాత్రానికే ప్రసాదం తయారు చేయించింది జయమ్మ గారు. తీరా చూస్తే వచ్చిన జనం మూడు వందలకీ నాలుగు వందలకీ మధ్యలో వున్నారు. ప్రసాదం అందరికీ అందక పోయినా అవమానమే, అసలు మానినా అవమానమే. ఏం చెయ్యాలి?

భర్తను చాటుకు పిల్చి అడిగింది. ఆయనకూ పాలుపోలేదు, "అంత పనాసితనమేమొచ్చె? అన్నీ పరువు పోయే పనులు చేస్తావు.ఏం చేస్తావో చేసుకో" అనేసి వెళ్ళి స్వామి వారి పక్కన కూర్చుని కబుర్లు చెప్పసాగా డాయన.

ఈవిడ ఒక నిమిషం ఆలోచించి ప్రసాదం పళ్ళెం చేత్తో పుచ్చుకొని స్వామికి మనసారా మనస్సులోనే ఒక దణ్ణం పెట్టుకుంది. ఇంక పంచటం ప్రారంభించింది. అక్కడున్న వాళ్ళందరికీ స్వయంగా పంచింది. బాగా చేతినిండానే పెట్టింది. ప్రసాదం వస్తూనే వుంది.

కొంతసేపయినాక స్వామి బయలుదేరి వెడుతూ " అప్పుడప్పుడు ఆశ్రమానికి వస్తూ వుండండి " అన్నారు.

స్వామి వెళ్ళినా ప్రసాదాల పంపకం సాగుతూనే వుంది. ప్రసాదం వూరుతోనే వుంది. ఇలా వూరుతోందని తెలిసి అదో ఆశ్చర్యంగా చూసి ప్రసాదం పెట్టించుకోటానికి విడతలు విడతలుగా జనం వస్తూనే వున్నారు. ఈవిడ విసుక్కోకుండా పెడుతూనే వుంది. ఇలా రాత్రి పదకొండు గంటల దాకా సాగింది. అప్పటికి జనం రావటం ఆగింది. ప్రసాదం మాత్రం పళ్ళెంలో యింకా మిగిలే వుంది.

ఆ తరువాత కొద్ది రోజులకే ఒక రోజున యీ జయమ్మగారు తన స్నేహితురాలు ఒకామెతో కలిసి మనవరాలు మోహినిని వెంట బెట్టుకొని, కెనరే ఆశ్రమానికి వెళ్ళింది. వీరు వెళ్ళేసరికి, ఇంటి ముందరి బయలు ప్రదేశంలో కూర్చుని వున్నారు స్వామి. కాని ఎవరి మీదో బిగ్గరగా అరుస్తున్నారు. అసలు మనిషి వాలకమే అదోమాదిరిగా వుంది.

వీరు రాగానే వీరివైపుకు గూడ ఒక ఘీంకారం విసిరారు. "ఎప్పుడు రావాలో, ఎప్పుడు రాకూడదో తెలియదా; పోండి, పోండి అవతలికి" అని.

ఆ రోజు అంత తియ్యగా మాట్లాడి ఇవాళ్ళ యిట్లా తిడతారేమిటి ? అసలీయన మనని గుర్తు పట్టారా లేదా ! అని తికమకలో పడ్డది జయమ్మగారు. పైగా ఎరక్కపోయి ఒక స్నేహితురాల్ని గూడ తెచ్చిందాయె. పోనీ దగ్గరకు వెళ్ళి పరిచయం చేసుకుందామంటే దైర్యం చాల లేదు. అందుచేత స్నేహితురాళ్ళు యిద్దరూ ఆలోచించి, వాళ్ళ పిల్ల మోహినిని "మనం నాగప్ప గారి తాలూకు అని చెప్పి రావే" అని స్వామి వారి దగ్గరకు పంపించారు.

అది వెళ్ళి భయం భయంగానే నమస్కరించి "మేము నాగప్ప గారి తాలూకండీ స్వామి" అంది.

స్వామి వెంటనే ఆ పిల్లని వొళ్ళో కూర్చోబెట్టుకొని ఒక సున్నపు బెడ్డ చేతిలో పెట్టారు. ఆ పిల్ల చేతిలో అది పటిక బెల్లపు ముక్క అయింది. మరో రెండు బెడ్డలు స్నేహితురాళ్ళ యిద్దరి వైపు విసిరారు. వాళ్ళవి అందుకొన్నారు. అవి గూడ పటిక బెల్లంగా మారినాయి. కళ్ళ కద్దుకొని తీసుకున్నారు.

"ఇది సమయం కాదు, మరోసారి రండి" అన్నారు స్వామి.

జయమ్మగారు అప్పుడు వెళ్ళిపోయి మరోసారి వచ్చింది.

"ఎప్పుడైనా అవసరమైనపుడు నాకు, నీ కారు పంపగలవా?" అన్నారు స్వామి.

సంతోషంగా అంగీకరించింది జయమ్మగారు. అప్పటి నుంచీ స్వామివారికి ఏమాత్రం అవసరం అనిపించినా, ద్వారకనో, నరసింహానో పంపటం, కారు తెప్పించుకోవటం పరిపాటయి పోయింది. క్రమంగా, నాగప్పగారి కారు స్వామికి దాదాపు స్వంత కారులాగా తయారయింది. ఈ విధంగా వాహన సౌకర్యానికి అంకురార్పణ ఏర్పడటంతో స్వామి వారి పాదపూజ కార్యక్రమాలు మైసూరు నలుమూలల వ్యాపించసాగాయి.

నాగప్ప గారి లాంటి ప్రఖ్యాత వ్యక్తి, సంపన్నుడు, విశేషించి లింగాయతుడు, స్వామికి దాసానుదాసు డయ్యాడని తెలిసినాక మైసూరు మహా నగరంలోని అనేకానేక మంది సంపన్నుల, అధికారుల, రాజకీయవాదుల కళ్ళు గణపతి స్వామివారిపై పడినాయి.

## శ్రేయోభిలాషులు

ఇలా విచ్చేసిన గొప్ప భక్తులలో కొందరు స్వామి కార్యకలాప విధానాలను చూసి పెదవి విరిచారు. "స్వామి దగ్గర అసామాన్యమైన ఆధ్యాత్మిక శక్తి వుంది నిజమే. కాని, సంస్థా నిర్వహణ చాతుర్యం లేదు" అన్నారు.

"ఇంకా కుర్రవాడు గదా" అన్నారు కొందరు. "మనం సహాయం చేసి వార్ని పైకి ఏసుకొద్దాం" అన్నారు కొందరు.

ఈ విధంగా స్వామికి సహాయం చెయ్యాలనే ఆశయంతో ఆ రోజుల్లో కొందరు పెద్ద మనుషులు చేరి, ఒక కమిటీ ఏర్పాటు చేశారు. వాళ్ళల్లో లింగయ్యగారు, శ్రీనివాస మూర్తి గారు, నంజుండయ్య గౌడుగారు, మొదలైనవారు ముఖ్యులు. వారంతా కమిటీగా ఏర్పడి మొదటగా సమావేశమై, ఆ సమావేశానికి ఫొటో తీయించారు. స్వామి నిజంగానే "సంస్థా నిర్వహణ శక్తి" లేక ఆ గ్రూపు ఫొటోలో తాము నిలబడటానికి నిరాకరించారు.

ఆ మొదటి సమావేశంలో అది స్వామివారి "శ్రేయోభిలాషుల కమిటీ" అనీ, ఇకనుక సంస్థాగత విషయాలన్నిటిలోనూ స్వామి, వారి సలహాల్లను పాటించాలనీ, అలా పాటిస్తే త్వరలోనే ఆ కమిటీ కృషి చేసి, ఒక సొంత స్థలం సంపాదించి, నూతన ఆశ్రమ నిర్మాణం చేయిస్తుందనీ తీర్మానించి, తీర్మానపు కాపీని స్వామికి భక్తిపూర్వకంగా సమర్పించారు. స్వామి గూడ బాగుందని హర్షించారు. అయితే యిలాంటి సంస్థాగతమైన చింతలు లేని భక్తులు గూడ కొందరు నాగప్పగారి ద్వారా స్వామి పాద సన్నిధికి చేరారు. వారిలో శ్రీవిష్ణు కాఫీ ఏజన్సీ అనంతరాముగారు, జయలక్ష్మి జ్యూయల్ మార్టు అధినేత శ్రీ నాగప్ప శెట్టిగారు ముఖ్యులు. మాండ్య అనంతరామ భట్టుగారికి గూడా నాగప్ప గారితో మంచి మైత్రి ఉండేది.

ఈ రోజుల్లోనే మరో మార్గంలో టి. రామస్వామయ్యగారు స్వామి దగ్గరకు చేరారు. రామస్వామయ్యగారు (Food Tahsildar) ఆహార తహసీల్దారుగా పని చేసి కొత్తగా రిటైరయ్యాడు. ఈయన 1965లో ఒక ఆధ్యాత్మిక ఉపన్యాసం వినటానికి వెళ్ళాడు. అక్కడ టి. డి. రామకృష్ణయ్యర్ గారు కలిశాడు. రామకృష్ణయ్యర్‌గారు గొప్ప ఆంజనేయోపాసకుడు. స్వయంగా కొన్ని శక్తులున్నవాడు, పండితుడు. రామస్వామయ్యర్ గారికి వీరిమీద విశేష విశ్వాసముంది. ఇద్దరూ మాటల్లో పడ్డారు. మాటల పరసలో ఆంజనేయోపాసకుడు యిలా అన్నాడు.

"రామస్వామిగారూ, యివాళ ఉపన్యసించబోయే స్వామివారి జిహ్వా మీద సరస్వతి తాండవిస్తుంది. దానికి కారణం వారికి వాగీశ్వరీసిద్ధి అయింది. కాని మీకు నిజమైన మహా పురుషుణ్ణీ, అవతారమూర్తినీ చూడాలని ఉంటే మీరు కెసరే వెళ్ళాల్సిందేనండీ" అని.

"అక్కడున్న దెవరు?"

"ఎవరని చెపుతాం? కెసరే స్వామి అంటారు కొందరు, గణపతి స్వామి అంటారు కొందరు"

"మీరు స్వయంగా పరిశీలించారా?"

"అయ్యా, నేను పరిశీలించకుండా నోరు తెరిస్తే మా అంజనేయస్వామి నాలుక చీరేయడటుండీ."

"కొద్దిగా ఉదాహరణ ఏదయినా చెప్పండి"

"అలా అడగండి. * విద్యారణ్యపురంలో బసవన్న అని వొక పెద్దమనిషి వున్నాడు. ఆయన కొడుక్కి కడుపులో అల్సరు. విపరీతమైన బాధ. వాళ్ళు పెద్దపెద్ద సర్జన్లకి చూపారు. పరిస్థితి విషమించి వుందనీ, వెంటనే ఆపరేషన్ జరిగితే తగ్గే ఆశ స్వల్పంగా వుందనీ చెప్పారు. దాంతో ఆ బసవన్నగారు కొడుకుని ఈ గణపతి స్వామివారి దగ్గరకు తీసుకెళ్ళాడు. స్వామి వారు కుర్రవాడి పొట్టు మీద చెయ్యివేసి రాశారు. విభూతి నోట్లో వేసి పొట్టకి రుద్దారు.

స్వామివారు ఆ అల్సరు తనే స్వీకరించి ఆ రాత్రల్లా అంతులేని బాధ పడ్డారు, తెల్లవారేసరికి కుర్రవాడికి బాధ తగ్గిపోయింది. మళ్ళీ వైద్య పరీక్షలు చేయించారు. లోపల అల్సరు లేదన్నారు. ఇలాంటివి కోకొల్ల లున్నాయి. ఇవిగాక వారి కార్యక్రమ పద్ధతు లున్నాయి. అన్నీ పరిశీలించాను. అన్నీ ఒక సత్యాన్ని సూచిస్తున్నాయి, ఆయన ప్రత్యక్ష గణపతి అని

ఈలోగా ఉపన్యాసం మొదలైంది. ఆ విషయం అక్కడితో ఆగిపోయింది.

ఆ తరువాత రామస్వామిగారు ఒక మిత్రుడింట్లో పెళ్ళికి వెళ్ళాడు. అక్కడ ఒక పక్క గదిలో కుర్చీలో ఒక బ్రహ్మచారి కనిపించాడు.

లేత మొహం, ఎర్ర పట్టు బట్టలు, జులపాల జుట్టు వున్న ఆ కుర్రాణ్ణి చూసి, ఇక్కడ యితనికి ఉపనయనం జరుగుతున్నట్టుంది అనుకొన్నాడీయన. దీనికి తగ్గట్టే ఆ గదిలో వాతావరణం అంతా హాస్యాలతో ఉల్లాసంగా వుంది. ఆ కుర్రవాడు గూడ జోకులేసి అందర్నీ నవ్వించి తనూ నవ్వుతున్నాడు. ఇంతలో ఆ యజమాని వచ్చి ఆ కుర్రవాణ్ణి చూసి, "వీరే,

---

* ఇది మైసూరులో ప్రస్తుత ఆశ్రమానికి దగ్గరలో వున్న పేట.

శ్రీగణపతి సత్యనారాయణ స్వామి వారు. సాక్షాత్తూ గణపతి స్వరూపులు. కెసరేలో వుంటారు. కొంతమంది కెసరేస్వామి అంటూ వుంటారు. మీరూ వినే వుంటారు. వీరే యీ సంబంధం అనుసంధానం చేశారు " అంటూ పరిచయం చేశాడు.

వీరు సాష్టాంగ వందనం చేశారు. వీరు లేస్తుండగానే, " మీ బుజం మీది తుండుగుడ్డ ఒకసారి యిస్తారా " అన్నారు స్వామి.

" ఎందుకబ్బా " అనుకొంటూ యిచ్చారు వీరు.

స్వామి ఆ తుండు గుడ్డను దులపసాగారు. ఆ తుండులోంచి విభూతి రాలసాగింది. ఆ వాసనకు, పెళ్ళి పందిరంతా గుబాళించింది. వీరికి ఆశ్చర్యమైంది. ఇంతలో అక్కడికి శేషగిరి శాస్త్రిగారు వచ్చారు. ఆయన పెళ్ళికి వుంకోహాలుడు. రామస్వామయ్యగారికి దూరపు బంధువు. ఆ బంధుత్వం బీరకాయ పీచు బంధుత్వం. ఆ శేషగిరిశాస్త్రిగారు సరాసరి వెళ్ళి స్వామి వారితో చాలా చనువుగా మాట్లాడాడు. అది చూసి శేషగిరిశాస్త్రిగార్ని, " ఏమిటయ్యా, నీకు బాగా తెలుసునా యీ స్వామివారు " అని రామస్వామిగారు అడిగాడు.

" తెలియటం మేమిటి. మా మరదలు కొడుకే. అయినా, నాకంటే మీకే దగ్గర చుట్టం. మీ లింగణ్ణగారి దౌహిత్రుడు సాక్షాత్తూ " అన్నాడాయన.

రామస్వామయ్యగారి స్వగ్రామం సోగాల. ఆ సోగాలలో ఇప్పటి లింగణ్ణగారి తాత గారయిన మరో లింగణ్ణగారికి గొప్ప పేరుంది. ఆయన సమాధికి బృందావనం నిర్మించింది వీరి తండ్రిగారే. పైగా వారికీ వీరికీ దగ్గర బంధుత్వం వుంది. అందుకని శేషగిరిశాస్త్రి గారు చెప్పిన చుట్టరికం వినగానే—

" లింగణ్ణ మనవడా! అయితే యింకేం మనవాడే" అనిపించి మహా సంతోషమయింది రామస్వామిగారికి.

" ఆ పెద్ద లింగణ్ణగారి తరువాత మన బంధువుల్లో మరో మహాయోగి పుట్టాడన్న మాట." అని గూడా అనిపించింది. ఆ సంతోషంతో యీయన మళ్ళీ స్వామిదగ్గరకు వెళ్ళి కాసేపు ఆ మాటా యీ మాటా మాట్లాడి—

" మీరొకసారి మా యింటికి రండి" అని పిల్చాడు.

" ఎలా వచ్చేది? వచ్చేపోయే జనంతో తీరికే వుండటంలేదు. జనం మరీ యెక్కువై పోయారు " అన్నారు స్వామి.

" విన్నాను, అయితే అంతా మైసూరు జనమేగా వచ్చేదీ? "

"ఎక్కడ మైసూరు జనం? మాండ్య, గుండ్లుపేట, బెంగుళూరు, చెన్నపట్టణం, ఒకటేమిటి, యివన్నీ మన చుట్టుపక్కల వూళ్ళు. కేరళనించీ కొందరు వచ్చారు. వాళ్ళు కొచ్చిన్

రమ్మంటున్నారు. ఆంధ్రలో అనంతపురం దగ్గరవాళ్ళు, ఏదో గుడికి రమ్మంటున్నారు. ఉమ్మయ్య మన పార్వతీ కొండ వాళ్ళు ఎవరో వస్తున్నారు. ఇదంతా నానా చిక్కుగా వుంది. ఇంటిలో కొందరితో ఉత్తర ప్రత్యుత్తరాలు గూడ ప్రారంభించాలేమో అనిపిస్తోంది." అన్నారు స్వామి.

ఈ వ్యవహారం యింత వివరంగా తనతో ఎందుకు చెప్పారో రామస్వామయ్య గారికి లక్ష్యం కాలేదు. "బంధువని నా మీద ప్రేమకలిగి వుంటుందలే" అనుకున్నాడు.

అంతా విని 'మా యింటికి రావాలి తమరు' అన్నారు మళ్ళీ. "చూద్దాం" అని వూరుకున్నారు స్వామి.

'సర్లే, ఎక్కడికో వచ్చినప్పుడు పిలవటం గూడ బాగాలేదు, ఒకసారి మనమే ఆ కేసరే వెళ్ళి పిలుద్దాంలే' అనిపించింది. దాంతో యింతకన్నా బలవంతపెట్టక వదిలేశాడు.

ఆ రోజుల్లో, R. G. Brand (బ్రాండు) ఫీ కంపెనీ చెట్టియార్ కుటుంబం ఒకటి స్వామిని ఎంతో భక్తితో సేవించుకొనేవారు. నాగప్పగారి కారులాగే వీరి కారు గూడ స్వామికి నిత్యోపయోగంగా, స్వతంత్రంగా వుండేది. అలాగే గణేశ్ టాకీస్ వారి కారు గూడా స్వామికి బాగా ఉపయోగంగా వుండేది. మరికొందరి కార్లు గూడ స్వామికి అప్పుడప్పుడు ఉపయోగ పడుతూ వుండేవి.

చెట్టియార్ గారికి ఏకైక పుత్రుడు. అతనికి వివాహమై ఏడాదయింది. ఇంతలో అతనికేదో జబ్బు చేసింది. కలవారు గనక, ఘనవైద్యం చేయించారు. కానీ వ్యాధి ముదరటమే కాక, వికటించి వైద్యులు పెదవి విరిచేదాకా వచ్చింది.

కర్మ తోసుకొని వస్తున్నపుడు కల్పవృక్షం పెరట్లో వున్నా గుర్తురాదు. కాలంమీరి పోతే, కల్పవృక్షం గూడ అక్కరకురాని కొయ్య అవుతుంది. అంత కాలం మీరిపోయేవరకూ, ఆ నిత్య భక్తులకు స్వామి గుర్తురాక పోవటం కేవలం కర్మబలం కాక మరేమిటి? కాలుడు వచ్చేసి కొడుకు మెడలో వుచ్చేశాక, అప్పుడు కాళ్ళ పారాణి ఆరని కోడల్ని తెచ్చి స్వామి కాళ్ళమీద పడేశారు. రక్షించమని బ్రతిమాలారు.

స్వామి ఎంత సేపటికీ ఓదార్పు మాటలు చెపుతున్నారు, విభూతి, కుంకుమ ప్రసాదం యిస్తున్నారు తప్ప నిస్సందేహమైన అభయప్రదానం చెయ్యటంలేదు. అది తృప్తిలేక, పట్టుబట్టింది చెట్టియార్ కుటుంబం.

"ఇప్పుడు నా మనస్సు శాంతిగా లేదు. రేపు రాత్రికి రండి చూద్దాం" అన్నారు స్వామి.

"పాపం వారి మనస్సే శాంతిగా లేనప్పుడు మనం పట్టుపడితే యెలా!" అనుకొని వెళ్ళి పోయారు భక్తులు.

ఆ రాత్రి స్వామి చాలా విచారంగా వుండటం గమనించి ద్వారక మెల్లగా దగ్గరకు చేరాడు. ఎందుకంటే స్వామి ఉంటే ఉల్లాసంగా వుంటారు, లేదా సమాధిలో గంభీరంగా వుంటారు లేదా కోపంగా వుంటారు తప్పితే ఇలా విచారంగా వుండటం ఇంతవరకూ చూడ లేదు తాను.

"ఏంచేసేదిరా? వాళ్ళు మరీ సమయం దాటించేసి వచ్చారు. ప్రశ్నగణపతి ఇక వాడు బతకడని స్పష్టంగానే చెప్పేశాడు. వాళ్ళకు ఎలా చెప్పేది?" అన్నారు స్వామి.

"మరి వాళ్ళని రేపు రమ్మన్నారు కదండీ" అన్నాడు ద్వారక.

"వాడు రేపు రాత్రి దాకా వుండడురా" అని కళ్ళు మూసేసుకున్నారు స్వామి. కొంచెం సేపాగి "ఎన్ని విధాల చూసినా, వెళ్ళిపోవటమే ఆ జీవికి క్షేమంరా. ఆ మాట వాళ్ళకు అర్థం కాదు" అన్నారు.

ఆ మర్నాడు రాత్రి చెట్టియార్ కుటుంబంవారు దుఃఖం ఆపుకోలేక "వాడి శవం నీ వాకిట్లోనే పాతిపెడతాం. నువ్వు తల చుకుంటే వాణ్ణి బ్రతికించ లేవా" అని నానా గోలా చేశారు, రౌడీల్లాగా తిట్టారు.

పక్కవాళ్ళెవర్నీ వాళ్ళకు అడ్డు చెప్పనీయలేదు స్వామి. తిట్టి తిట్టి, ఏడ్చి ఏడ్చి వాళ్ళు వెళ్ళిపోయారు. పాపం అభాగ్యులు! వాళ్ళు నిజంగానే శవం తెచ్చి యిక్కడ పాతిపెడతారేమో అని కంగారు పడ్డాడు ద్వారక. ఆ మర్నాడు స్మశానానికి ద్వారకను పంపారు స్వామి. అంత వరకు పోట్లాటలు, తన్నులాటలు, తిట్లు, పెడసరపు మాటలు తప్ప, సౌమ్యత్వపు వాసన యెరుగని ద్వారక, ఆ రోజు సౌమ్యతకీ, సానుభూతికీ అక్షరాభ్యాసం చేశాడు.

"ఏమిటి సార్ చదువుకున్నవారు, పెద్దవారు, తెలిసినవారు మీరే అట్లా అయి పోతారూ? తప్పు మన దగ్గరుండె. ఆపద మొదలుకాగానే వచ్చి చెప్పవద్దా? స్వామి మనస్సు బాగా లేదు అని చెప్పినప్పుడె మనకి అర్థం కావద్దా?—మన కర్మ వుంది సార్. అది మనని నెట్టుకువచ్చింది. దేవుడైనా సరే కర్మ అనుభవించాల్సిందే కదా సార్." తన నాటకాలలో గూడ వీరరసం పాత్రలు, రాక్షస పాత్రలు తప్ప కరుణరసం పాత్ర లేవీ ముట్టుకోని ద్వారక హృదయం లోంచి నిజమైన కరుణ ఉబికింది—ఆ క్షణంలో.

తత్వచింతనకు స్మశానమే తపోవనం. అందులో మైసూరు లాంటి మహానగరంలో స్మశానాలు గూడ తలో మూలా మంటలతో రద్దీగానే వుంటాయి. ఆ మహాకాల భూమిలో గూడ రవ్వంత తత్వచింత రాలకపోతే ఆ జీవిలో చైతన్యచ్ఛాయ అడుగంటినట్టే. ద్వారక ఆవేదన చెట్టియార్ వృద్ధులకు కళ్ళు తెరిపించింది. ఆ తరువాత వాళ్ళు స్వామి దర్శనం చేసుకొని తమ దుఃఖవేగపు అవినయాన్ని క్షమించమని ప్రార్థించారు.

"క్షమించక్కరలేదయ్యా! నేను గూడా ఆ సమయంలో మీలాగే దుఃఖపడుతున్నాను" అన్నారు స్వామి.

ఈ సంఘటన చూసి—" ఎంతటి వాడికీ తిట్లు తప్పవు " అనుకున్నాడు ద్వారక.

" దేనికయినా సమయం వుండిరా. సమయం మించిపోతే ప్రార్థనయినా పని చేయదురా. అందుకే నీ జీవితం సమయం మించకుండా స్థిరపడాలని తొందర పడుతున్నానురా, అది గ్రహించు. " అన్నారు స్వామి.

" ఈయన దగ్గర ఏది అనుకొన్నా ప్రమాదమే " అని అక్కడ నుండి పారిపోయాడు ద్వారక.

ఆ సంవత్సరం ఎండలు తీవ్రమై వానలు రావటం ఆలస్యమైంది. మైసూరులోనూ అసలు ఆ ప్రాంతంలోనూ అనావృష్టివల్ల కరువు పరిస్థితు లేర్పడ్డాయి. ఒకరోజు హోమానికి ముందు స్వామి ప్రసన్నంగా, సరదాగా వున్నారు. అప్పుడు—

" కొంచెం వర్షం కురిపించరాదా స్వామీ " అన్నాడు నరసింహ, పిల్లతనంగా.

" ఎందుకురా వర్షం ?" అన్నారు స్వామి.

" జనం అంతా బాధ పడుతున్నారు స్వామీ" అన్నాడు నరసింహ. ఆ మాటకు చాలా ముచ్చట పడుతున్నట్టుంది స్వామి.

" సర్లే, హోమం కానీరా చూద్దాం" అన్నారు. ఆ సమాధానం ఎవరూ లెక్క చేయలేదు.

" వానంటే పటికబెల్లమా, కుంకుమానా ఏమిట్రా ? నోరు మూసుకుండు " అని నరసింహాన్ని మందలించాడు ద్వారక—పెద్దరికం, దర్జా నటిస్తూ.

హోమం జరుగుతోంది. స్వామి కళ్ళు మూసుకొని సంకీర్తన చేస్తున్నారు. కళ్ళు తెరవ లేదు. ఇంతలో ఎండ మాయమై, మబ్బులు కమ్మి, డబడబా వాన పడసాగింది. స్వామి వానలో తడుస్తూనే సంకీర్తన చేస్తున్నారు. కళ్ళు తెరవ లేదు. ఒక అరగంటసేపు వాన కురిసి తగ్గిపోయింది. కుర్రవాళ్ళ ఆనందం యింతా అంతా కాదు. ద్వారక మరీ ఆశ్చర్య పోయాడు. ఇది జరిగిన కొద్ది రోజుల్లోనే గుండ్లుపేట నుంచి రంగయ్యగారు, రామణ్ణగారు వగైరా పెద్ద లంతా స్వామి దగ్గరకు వచ్చి—

" మా ప్రాంతమంతా అనావృష్టితో కటకట లాడుతోంది. తమరు వచ్చి ఏదైనా యాగం చేసి వర్షం కురిపించాలి " అని ప్రార్థించారు.

" గాయత్రీ యాగం చేద్దాం " అన్నారు స్వామి.

" మీ యిష్టం ! మీరేది చేసినా సరే, వర్షం వచ్చేటట్టు అనుగ్రహించండి " అన్నారు పెద్దలంతా.

ఆ చేసే యాగం, పార్వతీ కొండమీద అమ్మవారి ఆలయం దగ్గర చేస్తే బావుంటుందని గూడ మెల్లగా అంపించారు. అదీకాక యాగ శాంతికై విస్తారంగా అన్నదానం జరిపే ప్రయత్నంలో గూడ వున్నామని చెప్పారు.

స్వామి చాలా సంతోషించారు. "కాని అల్లాంటి బహిరంగ స్థలాల్లో సంతర్పణంటే భరించటం కొంచెం కష్టమవుతుందేమో" అన్నారు.

"అబ్బే అదేంలేదండీ. ఓ వెయ్యో రెండు వేలో జనం వస్తారనుకుంటున్నాం. కాని అత్తై యిత్తై దానికి రెట్టింపైనా, జంకేది లేదు. మా గుండ్లుపేట వాళ్ళం దిగామంటే దిగటమే" అన్నారు పెద్దలు.

"అదీ అలా వుండాలి. అదిసరే, మరికొండమీద యాగం అంటున్నారు. మంచినీళ్ళ అందింపు కష్టమేమో" అన్నారు స్వామి మళ్ళీ.

"అది మేం చూచుకుంటాం గదండీ" అన్నారు పెద్దలు.

"సరే అయితే వస్తాను. యాగం చేయిస్తాను. మిగిలిన విషయాలు మళ్ళీ మరోసారి కలిసి మాట్లాడుకుందాం" అన్నారు స్వామి.

పెద్దలంతా సంతోషించి, ఇక సర్వ విషయాలూ వారి తరఫున రంగయ్యగారే మాట్లాడుతారని చెప్పి, సెలవు తీసుకొని వెళ్ళిపోయారు. ఆ తరువాత ఒక రోజున రామస్వామిగారు స్వామివార్ని యింటికి ఆహ్వానిద్దామని కెనరే వెళ్ళాడు. వెళ్ళేటప్పటికి స్వామి లేరు.

గణపతి హోమాలు చెయ్యగా, చెయ్యగా మిగిలిపోయిన హోమ భస్మాన్ని కావేరిలో కలిపి రావటానికి స్వామి వెళ్ళారని తెలిసింది. వారి రాకకోసం కాచుకొని వున్నారు రామస్వామిగారు.

ఇంతలో గుండ్లుపేట తాసిల్దారు రంగయ్యగారు వచ్చారక్కడికి. ఇద్దరూ ఒకే తోట చిలకలు- బాగా సాన్నిహిత్యం వున్న వాళ్ళు. మీరిలా వచ్చారేమిటంటే, మీరిలా వచ్చారేమిటని పరస్పరం తమ కథలు చెప్పుకున్నారు. రంగయ్యగారు చేస్తున్న సత్కార్యం విని రామస్వామిగారు చాలా ఆనందపడ్డారు.

ఇంతలో స్వామి వచ్చారు. పార్వతికొండ యాగానికి రోజు నిర్ణయించారు. తాము ఎలా వచ్చేదీ మొదలైన యేర్పాట్లన్నీ నిర్ణయించారు. రామస్వామిగారు వారి ఆహ్వానాన్ని పునస్సూచించారు. "పార్వతికొండ నుంచి వచ్చాక, మీ యింటికి వస్తా" నన్నారు స్వామి.

రంగయ్యగారు, రామస్వామిగార్ని గూడ ఆ యాగానికి తప్పక రమ్మని ఆహ్వానించారు.

ఆ సంవత్సరం శివరాత్రి ఉత్సవం విశేష వైభవంతో జరిగింది. అప్పటికి ముందే స్వామి నామసంకీర్తనే కాకుండా, హరికథ చెప్పటం గూడా ప్రారంభించారు. స్వామి హరికథ మామూలు హరికథ కన్న భిన్నంగానే వుంటుంది. కరుణరసం సందర్భం వచ్చినప్పుడు వారు స్వయంగా ఆ రసంలో లీనమై కన్నీళ్ళు కారుస్తూ కథ చెప్పేవారు. అది గొప్పకాదు, శ్రోతల్లో, స్త్రీలేగాక, పురుషులు గూడ వెక్కి వెక్కి ఏడ్చేవారు. భక్తిరసం సందర్భాలు వచ్చినపుడు రససిద్ధి యిక వేరే చెప్పుకోనక్కరలేదు.

ఆ రోజుల్లో స్వామి సంకీర్తన ప్రధానంగా మందస్వరంలో, మంద్రస్థాయిలో, విలంబగతిలో సాగుతూ వుండేది. సంకీర్తన అయ్యేసరికి శ్రోతలందరికీ తమ కళ్ళల్లో నీళ్ళు ఊరికి వుండటం తెలిసేది.

ఈ సంవత్సరం శివరాత్రి ఉత్సవంలో సంకీర్తన ఆనందరసంలో పరాకాష్ఠ చేరి భక్తుల్ని సమ్మోహపరిచింది.

నాటి హోమంలో పూర్ణాహుతి సమర్పిస్తూ "ఇక కొద్దికాలంలో శివరాత్రి హోమానికి, నన్ను నేనే పూర్ణాహుతిగా సమర్పించుకుంటాను" అని ప్రకటించారు స్వామి. ఇది విని సరిగా అర్థంకాక అపార్థమయి కల్లోల పడుతున్న భక్తుల శాంతికోసం—

"అలా ప్రతి శివరాత్రికీ నన్ను పూర్ణాహుతిగా సమర్పించుకుంటూనే వుంటాను" అని గూడా స్వామి ప్రకటించారు.

## చెవిపోటు

శివరాత్రినాడే, స్వామి సోదరి వరలక్ష్మికి మగపిల్లవాడు పుట్టాడు. ఆ సందర్భంగా స్వామి వారి యింటి దగ్గరే (పార్వతమ్మ గారి యింట్లోనే) పడుకోవటం ఎక్కువయింది. శివరాత్రి నాడు పుట్టటం వల్ల ఆ పిల్ల వాడికి శివప్రసాద్ అని పేరు పెట్టారు. ఎందుకోగాని ఆ పిల్లవాడు రోజూ రాత్రల్లా ఏడుస్తూనే వుండేవాడు. ఏం బాధో ఏమో? నోరులేని జీవి. ఎక్కడ బాధో చెప్పలేడు. చేసే వైద్యాలు ఫలితం యివ్వటం లేదు. ఊరందరికీ రోగాలు తగ్గించే మేనమామ "అయ్యో" అని ఎత్తుకుని ఆడిస్తాడు తప్పితే ఏ విభూతో, రక్షో కట్టడు.

ఒకరోజు రాత్రి పన్నెండయ్యేంటుంది. పిల్లవాడు గుక్కపట్టి యేడుస్తున్నాడు. ఎలా సముదాయించాలో తెలీక కళవళపడుతోంది తల్లి. మేనమామ నిద్దర పట్టక యిటూ అటూ దొర్లుతున్నాడు. ఇంతలో ఏదో చప్పట్లూ, నవ్వులూ వినిపించినై. ఏమిటా అని తల ఎత్తి చూస్తే బొజ్జ, డోలల్లే ఎగిరెగిరి పడుతుండగా చప్పట్లు చరుస్తూ తొండం పైకెత్తుకొని పకపకా నవ్వుతున్నాడు అర్క గణపతి.

"నవ్వనీ, నష్టమేమి" అనుకున్నారు స్వామి.

త్వరలోనే నవ్వాగి పోయింది.

"ఏం, నవ్వాపేశారేం?"

"నే నవ్వటమంటే సామాన్యమా? రోలంత పొట్ట ఎగిరి పడాలి!"

"నవ్వకపోతే నవ్వకపోయారు. అలా ఏడిపిస్తారెందుకు?"

"నా చెవుల్లో శూలాలు గుచ్చుకుంటున్నాయి."

"ఎవరు వేస్తున్నారు శూలాలు?"

"దేవతలు."

"ఎందుకని?"

"మా ఇంట్లో పడుకొని నిద్దరపోతున్నానని."

"అయ్యో, క్షమించాలి. చేసిన వివాహానికి సార్థకత సిద్ధించింది. వెళ్ళి సహాయం చెయ్యమని మీరే గదా పంపించారు."

"పంపించాను. కాని ఎందుకు పంపించాను?"

"ఈ శివరాత్రికి పుష్కరం అయింది. అందుకని పంపించారను కొంటున్నాను."

"నిజమే. పుష్కరం అయింది. కాని మరో పుష్కరపు పని ఎదురుగా ఉందే. దాని మాటేమిటి?"

"ఉంది, ఎప్పుడు ప్రారంభించ మంటారు?"

"ఎక్కడనుంచి ప్రారంభిస్తావు?"

"అదీ మీరే చెప్పండి."

"దానికి రంగస్థలం సిద్ధంగా లేదు"

"చెప్పండి."

"గృహస్థుల యిళ్ళల్లో పడుకున్న వాడికి ఏం చెప్పను?",

"సన్యాసులకు యిళ్ళుంటాయా?"

"ఈ సన్యాసికి వుండాలి."

"అర్థమైంది. అలాగే చేస్తాను."

"శుభం"

"ఒక సందేహం వుంది."

"అడుగు."

"రెండవ ఆవృత్తి వుందని చెప్పింది మా అమ్మ. అది ఏమిటని నే నడగలేదు."

"శిష్యులకు ఎప్పుడేది చెప్పాలో గురువులకు తెలుసు."

"మరొక సందేహం వుంది."

"అడుగు."

"శ్రమ సాధ్యాలయిన కొన్ని పనులు, నా సంకల్పం లేకుండానే జరిగి పోతున్నాయి."

"నేను నవ్వితే నష్టం లేదుగాని పనులు జరిగితే నష్టమా"

"మీరు చేస్తున్నారా ఆ పనులు ?"

"ఏ కంపని ? నేనేం బాకీ వున్నానా నీకు ?"

"మరి యెలా జరుగుతున్నాయి ?"

"జరిగితే నష్టమేమిటి నీకు ?"

"ఇంత వరకూ నష్టంలేని పనులే జరుగుతున్నాయి కనుక బాగానే వుంది. ఎలా జరుగుతున్నాయో తెలుసుకోకపోతే రేపు నిజంగా నష్టం జరగవచ్చు."

"అదీ నిజమే."

"అందుకే అడుగుతున్నాను. ఎలా జరుగుతున్నాయని ?"

"ప్రశ్నలే లేవన్నావుగా"

"అప్పుడు లేవు"

"ఎందుకని ?"

"అప్పుడు ఇలాంటి వ్యవహారాలు లేవు"

"ఏం వుంది ?"

"నేనే వున్నాను"

"ఎక్కడున్నావు ?"

"అంతటా వున్నాను"

"ఎలా వున్నావు ?"

"ఆనందంగా వున్నాను."

"ఇప్పుడు ?"

"ఇప్పుడు ప్రపంచం అంతా వుంది. అందులో నేను అణువణువునా వ్యాపించి వున్నాను."

"అణువునూ అణువునూ కలిపి ఉంచే దెవరు ?

"శక్తి. ఆమె పేరే ప్రకృతి, అమ్మ, శ్రీమాత, శ్రీవిద్యా స్వరూపిణి. ఆమెనే నేను ఉపాసిస్తున్నాను."

"అణువునూ, అణువునూ విడదీసే దెవరు ?"

"శక్తి. ఇంతెందుకు. యీ ప్రపంచాన్నంతా ఈ శక్తి అన్ని విధాలా నడుపుతోంది."

"నువ్వేం చేస్తున్నావు ?"

"నేనా శక్తిని ఉపాసిస్తూ, శక్తిమాత ద్వారా పనులు చేస్తున్నాను."

"ఇది యిప్పటి కథ. మరి అప్పుడో ?"

"అప్పుడు నాకు ఉపాసనా లేదు, పనులూ లేవు. నేనే వున్నాను, నేనే, నేనే."

"చూశావా తిరుగు ప్రయాణం ఎంత కష్టమో ?"

"ఇతరుడున్నాడనీ, వాడికి బోధించాలనీ అనుకోవటంవల్ల యీ కష్టం వచ్చింది."

"ఔను, అయినా తప్పదు గదా మరి".

"ఇంతకూ నా ప్రశ్న ?"

"ప్రశ్న గణపతి పెళ్ళికి ప్రశ్నల విఘ్నాలు సబబేగా మరి"

"అంటే నేనెక్కడో తప్పానన్న మాట."

"తప్పేముంది? నువ్వు ఉపాసిస్తున్నావు. ఆ తల్లి అనుగ్రహిస్తోంది. ఇందులో ప్రశ్నకి తావేది ?"

"నా సంకల్పం లేకుండా, నాకు తెలియకుండా పని జరిగిపోతోంది."

"మీ అమ్మ నువ్వడక్కుండానే మిఠాయి చేసి పెట్టింది. అందులో తప్పేమిటి ?"

"ఏమీ కనిపించటం లేదు."

"నా చెవులో శూలాల మాటేమిటి చేశావు ?"

"ఇదుగో బయలుదేరుతున్నాను."

వెంటనే లేచి పక్క బట్టలు మడత పెట్టి బుజాన వేసుకొన్న అన్నను చూసి వరలక్ష్మి కంగారు పడ్డది.

"ఛీ, ఛీ ఒకటే ఏడుపు. చెవులో పోటోయేమో! నే నిక్కడ పడుకోలేను. పోతున్నాను" అవటం, వుడాయించటం రెండూ ఒకేసారి జరిగిపోయాయి.

"పసివాడేడుస్తుంటే కోపగిస్తాడు. వీడింత కఠినుడేవమ్మా" అనుకుంది సావిత్రమ్మ గారు.

"నీ మూలంగా మా అన్న అర్ధరాత్రివేళ యింట్లోంచి వెళ్ళిపోయాడ్రా ఏడుపుగొట్టు వెధవా" అని కొడుకు మీద విసుక్కుంది వరలక్ష్మి.

ఆ మర్నాడు వైద్యుడు పసివాడి చెవిలో పోటని నిర్ధారించి మందు వేశాడు. వాడికి త్వరలోనే తగ్గిపోయింది.

స్వామి మాత్రం మళ్ళీ ఆ యింట్లో అడుగు పెట్టలేదు.



సత్యానందాంబోధి మగ్నస్య నిత్యం
వారిస్తంభ స్సద్గురో! తే కియాన్ వా,
అబ్ధేరుద్యద్భాన్వవ ల్లోకబుద్ధ్యై
త్వామీ డేఽహం శోణవస్త్రప్రదీప్తమ్ ॥

( సద్గురుదేవా! సత్యమైన ఆనంద సముద్రంలో మునిగిన మీకు జల స్తంభన పదెంత? సాగర గర్భం లోంచి బయట వెడలిన సూర్యదేవుడి లాగా, ఎర్రటి వస్త్రాలతో ప్రకాశిస్తూ లోకాలకు ప్రబోధంగా వస్తున్న (మేలుకొలుపుతున్న) మిమ్ము స్తుతిస్తున్నాను. )

## శోణవస్త్రదీక్ష

ఆ రోజు తెల్లవారు ఝామున కోడికూత వేళకే కావేరికి బయలుదేరారు స్వామి. నేనూ వస్తానని బయలుదేరాడు శ్రీకంఠయ్యగారు.

ఎందుకో గాని ఆ రోజు స్వామి బాగా గంభీరంగా వున్నారు. అసలు పూర్తిగా ఉత్థాన స్థితిలో వున్నారా లేరా అని గూడ అనుమానం వస్తోంది. అలాంటి సమయాల్లో స్వామిని పలకరించే ప్రసక్తి వుండదు. రేవుకు బాగా దూరం వెళ్ళి ఎవరూ జనం రానిచోటుకు వెళ్ళారు యిద్దరూ. 'రిద్దరే తప్ప మరో మనిషి ఆ చుట్టు పక్కల్లో లేడు. ఆ రోజు స్వామి నీళ్ళలో మునిగి మూడు గంటలసేపు అలాగే వుండిపోయారు. స్వామి చేసే మహత్తుల్లో యిది గూడ ఒక మహత్తనుకున్నాడు శ్రీకంఠయ్య.

స్వామి లేచి నీళ్ళలోంచి బయటకు వచ్చేసరికి అరుణోదయ రేఖలు ఆకాశానికి తెల్లజరీ అంచుల ఎర్ర పట్టుబట్టలు కట్టబెడుతున్నాయి. వైశాఖ మాసపు ప్రాతః పవనాలు, చల్లగా వెన్ను తట్టి ఆనందంగా అభినందిస్తున్నాయి. ఏటి చిరుతరగల చప్పట్లు, పిట్టల జయజయ ధ్వానాలతో కలసి నలుదిక్కుల వ్యాపిస్తున్నాయి.

స్వామి వొడ్డు కెక్కుతున్నారు. ఇంతలో ఒక గాలి తెరవచ్చి, వొడ్డునే పెట్టి వున్న స్వామి బట్టల సంచీ ఒక్క దెబ్బలో ఏటిలోకి దొర్లిపోయింది. అప్పటికి నదిలో దిగి స్నానం చేస్తున్న శ్రీకంఠయ్య యిది గమనించి సంచీ పట్టుకోబోయాడు గాని ఆయన, నదిలో పాకుడు

రాళ్ళమీద కాళ్ళేసుకుంటూ వచ్చేసరికి ఆ సంచీ అందలేదు. ఒడ్డుమీద తడిబట్టలతో నిలబడ్డ స్వామి కుడివైపు చూశారు.

అక్కడ ఒకరాయిమీద యెఱ్ఱటి పట్టుబట్టలు పెట్టి వున్నాయి. గాలి బాగానే వేస్తోంది. కాని అవి ఎగరటంలేదు. వాటి పక్కనే ఒక అంకోలదండం, ఒక ఔదుంబర దండం, ఒక చెక్క కమండలం వున్నాయి. స్వామి ఒక్క క్షణం వాటివంక చూసి మౌనంగా వాటిని ధరించారు. జరీ అంచువున్న యెఱ్ఱటి పట్టుపంచా, పట్టు ఉత్తరీయం, రెండు దండాలూ, ఒక కమండలం. ఏమి కారణమోగాని అవి ధరించిన స్వామి ముఖం పద్మమల్లే వికసించింది. ఇందాకటి గాంభీర్యమంతా పోయి విచ్చిన మల్లె పువ్వల్లే నవ్వుతోంది.

ఇవన్నీ ఎక్కడివా అని ఆశ్చర్యంతో చూస్తున్న శ్రీకంఠయ్య దగ్గరకొచ్చి, "ఇవి ఎవరు పెట్టారో యిక్కడ ?" అన్నాడు.

"ఏమో"

"ఎవరన్నా వచ్చారా యిటు ?"

"ఏమో"

"మరి ఎవరివో యేమిటో ? నువ్వు తీసుకున్నావేమిటి ?"

"ఏమో"

"ఎవరైనా వచ్చి పోట్లాడతారేమోనయ్యా బాబూ ?"

శ్రీకంఠయ్య కంగారు చూసి స్వామి నవ్వు మరింత వికసిస్తోంది. అందుకేనేమో_

"కాసేపాగి ఎవరైనా వస్తారేమో, అడుగుతారేమో, చూసిపోదాం పోనీ" అన్నారు స్వామి.

"అది బావుంది" అన్నాడు శ్రీకంఠయ్య.

కాసేపు ధ్యానం చేసుకుంటూ కూర్చున్నారు స్వామి. "తరవాత యిక వెళ్ళవచ్చా" అని అడిగారు.

"వెళదాం" అన్నాడు శ్రీకంఠయ్య.

"ఇక్కడ జరిగింది ఎవరికీ చెప్పకండి" అన్నారు స్వామి.

"సరే" అన్నాడాయన.

అలా కొత్త యెఱ్ఱ పట్టుబట్టలతో (శోణవస్త్రాలతో) కెసరే ఆశ్రమానికి చేరేసరికి ఎవరో ఒక భక్తుడు కృష్ణాజినపు పట్టీలు వేసివున్న చెక్క పాదుకలు తీసుకొచ్చి స్వామికి సమర్పించటానికి సిద్ధంగా వున్నాడు. ఆ పాదుకలు వేసుకొని మరీ గదిలోకి అడుగు పెట్టారు స్వామి. ఆ రోజు నుంచీ శోణ వస్త్రాలు, చెక్క పాదుకలు నికరమైనాయి స్వామికి. దండాలు, కమండలం మాత్రం పూజలోనే వుంచారు.

ఇది జరిగిన మర్నాడే పొద్దునపూట భక్తులంతా వెళ్ళిపోయినాక స్వామి ఒక్కరే యింట్లో వున్నారు. శ్రీకంఠయ్య డ్యూటీకి వెళ్ళాడు. ఇంతలో భళ్ళున తలుపు తోసుకొని అయిదేళ్ళ కుర్రాడొకడు కోతల్లే లోపలికి దూకాడు.

మొలకొక చిన్న నిక్కరుంది. వంటిమీద చొక్కా అయినా లేదు. పిల్లవాడు నల్లగా, బక్కగానే వున్నాడు గాని మంచి కళగా, చురుగ్గా వున్నాడు. ఆ జుట్టు గుండూ కాదు, క్రాపూ కాదు. మొహాన బొట్టూ లేదు, విభూతీ లేదు.

"వీణ్ణి చూస్తుంటే విష్ణుమూర్తిని చూసినట్టుంది" అనుకున్నారు స్వామి.

కుర్రవాడు లోపలి కొస్తూనే "హేయ్, సత్యానందా, బావున్నావా ?" అన్నాడు.

"బాగున్నాను" అన్నారు స్వామి.

"ఇవాల్టినుంచీ నిన్ను సత్యానంద అని పిలుస్తున్నా" అన్నాడు మళ్ళీ కుర్రవాడు.

"అదేమిటి ?" అన్నారు స్వామి.

"నా యిష్టం. నీకు నామకరణం చేయటానికే వచ్చా ! సరేగాని నాకు అన్నం వండి పెడతావూ ?" కుర్రవాడు ఆశగా అడిగాడు.

"సరే" అని లేచి స్టవ్ వెలిగించి అన్నం వండసాగారు స్వామి. అన్నం వుడుకుతున్నంత సేపూ, ఏవో యీ కబుర్లూ ఆ కబుర్లూ చెపుతూనే వున్నాడు కుర్రవాడు. ఆ క్షేత్రంలో అది వుంది, ఈ క్షేత్రంలో యిది వుందీ అని యేదేదో చెపుతూనే వున్నాడు.

అన్నమూ సాంబారూ వుడికాక చక్కగా భోంచేసి "సత్యానందా, వెళ్ళొస్తానేం" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ కుర్ర వాడెవరు? ఎక్కడినుంచి వచ్చాడు? ఎక్కడికి పోయాడు? మొదలైన ప్రశ్నల్లో దేనికీ మనకి సమాధానం తెలియదు. వాడు మళ్ళీ కనిపించలేదు. కాని వెడుతూ వెడుతూ కాలనీలో ప్రతి యింట్లోనూ చెప్పి వెళ్ళాడో ఏమో ఆ సాయంత్రానికి సంకీర్తనకు వచ్చిన భక్తులంతా "గణపతి సత్యానంద స్వామికీ జై" అన్నారు.

ఆ తరువాత ఒకనాడు స్వామివారి మెడలో జంధ్యం లేకపోవటం గమనించి వెంటనే ఒకటి తీసుకువచ్చి యిచ్చాడు ఒక భక్తుడు. స్వామివారు ఒకసారి అతనివంక పరిశీలనగా చూసి ఏ మంత్రమూ లేకుండానే మెడలో వేసుకున్నారు. ఎందువల్లనో గాని ఆ తరువాత అనేకసార్లు స్వామివారి జంధ్యం పోతూ వుండడం, ఎవరో ఒకరు గమనించి తెచ్చియిస్తే వేసుకో [illegible] చాలాసార్లు జరిగింది.

ఒకరోజు సాయంత్రం స్వామి వారు ఉల్లాసంగా వున్నారు. నరసింహ, నరేష్, [illegible] కూర్చొని [illegible] చిన్న పిల్ల[illegible] మధ్యలో

యిరికి కూచున్నారు. స్వామి ఉల్లాసంగా వుంటే యిక అందరికీ ఉల్లాసమే. ఆ రోజే రెండవ అర్కగణపతి, స్వామి వారి దగ్గరకు చేరటమే వారి ఉల్లాసానికి ప్రధాన కారణం.

సార్వజనిక హైస్కూలు ఆవరణలో ఒకమూల ఒక ముసలి తెల్ల జిల్లేడు చెట్టు వుంది. అది పిల్లలందరికీ తెలిసిన విషయమే. నిన్న సాయంత్రం కుర్రవాళ్ళను పిలిచి "ఆ చెట్టు కింద భూమిలో గణపతి వున్నాడు" అన్నారు స్వామి వారు. "అయితే లాక్కొచ్చేద్దాం స్వామి" అన్నారు కుర్రవాళ్ళు. "లాక్కురావటం కాదురా! నెత్తిన పెట్టుకొని తీసుకురండి" అన్నారు స్వామి. "ఏం చెయ్యాలో చెప్పండి?" అన్నారు పిల్లలు. "ఆ చెట్టు తల్లివేరు భూమిలో నిటారుగా దిగి వుంది. ఆ వేరు మధ్యలో స్వామి వున్నాడు. రేపు పొద్దున పోయి పలుగుదెబ్బ స్వామికి తగలకుండా తవ్వి తెచ్చేయండి" అన్నారు స్వామి వారు.

ఇంకేముంది పొద్దున్నే వెళ్ళారు, తవ్వి గణపతిని తెచ్చేశారు. అది స్కూలు గిదా ఎవరైనా అడ్డు పెడతారేమో అనే ఆలోచన వాళ్ళకు రాలేదు. ఆ జిల్లేడు కోసం ఎవరూ అడ్డుపడనూ లేదు. మొత్తానికి పొద్దున తొమ్మిదింటికల్లా, రెండో అర్కగణపతి ఆశ్రమంలోకి వచ్చేశాడు.

చెట్టు వేరులోనే అలా గణపతి ఆకారం స్వయంగా తయారయి వుండటం మాత్రం పిల్లలను ఆశ్చర్యపరచింది. పైగా యిది స్వామికి ఎట్లా తెలుసా అని ఆశ్చర్యం. ఇదీ ఆ రోజు ఉల్లాసం!

## సేవ

ఆ ఉల్లాసం మధ్యలో వున్నట్టుండి "అరేయ్, మొట్టమొదటిసారిగా బయటు పర్యటన వచ్చింది రా. అక్కడ స్వామికి సామూహికార్చన చేస్తారు. ముందు యిక్కడ జరగాలి, తరువాతే బయటు, ఏమంటారు?" అన్నారు స్వామివారు.

"ఔనంతే స్వామీ. ఇక్కడే ముందు జరగాలి" కోరస్‌గా అరిచేశారు పిల్లలు.

"అయితే, యిప్పటికిప్పుడు మన ఆశ్రమానికి సున్నం వెయ్యాలిరా. మీలో ఎవరు వేస్తారు, చెప్పండి. బైట వాళ్ళు వెయ్యకూడదు, మీరే వెయ్యాలి" అన్నారు స్వామివారు.

"చేతులు పొక్కుతాయండీ" అన్నాడు నరసింహ.

"కళ్ళలో పడితే అఖరు" అన్నాడు వెంకట.

"అది మనబోటి వాళ్ళ పనికాదు" అన్నాడు నటేశ. ద్వారక ఆలోచిస్తున్నాడు. ఏమీ అనలేదు.

"ఏరా నువ్వేమంటావ్" అన్నారు స్వామివారు. ద్వారక ఇక్కడ [illegible] చేసి—

"నేను వేసేస్తాను స్వామీ. నేనొక్కణ్ణే చాలు. ఇంకెవరూ అక్కరలేదు" అన్నాడు తెగింపుగా.

"భేష్" అన్నారు స్వామివారు.

"డబ్బులియ్యండి సున్నం తెస్తా" అన్నాడు ద్వారక.

స్వామివారు అయిదు రూపాయల నోటు ద్వారకచేతిలో పెట్టారు. అది చూసి, మిగిలిన పిల్లలు కళ్ళు పెద్దవి చేసుకున్నారు. దానికి తగ్గట్టే, ఆ డబ్బు జేబులో పెట్టుకొని సరాసరి హోటలుకి వెళ్ళాడు. కడుపు పట్టినంత తిన్నాడు. బిల్లు రెండు రూపాయిలయింది. అక్కడి నుంచి కొట్టు కెళ్ళి అర్ధరూపాయి సున్నం కొనుక్కొని స్వామివారి దగ్గరకు వచ్చాడు. మిగిలిన రెండున్నర స్వామివారి కిచ్చి—

"డబ్బులు చూసేసరికి ఆకలయిందండీ. రెండు రూపాయలు పెట్టి తిన్నాను. అర్ధ రూపాయి సున్నం తెచ్చాను' అన్నాడు.

"నిజం చెప్పావు. అంతే సంతోషం. కానీరా" అన్నారు స్వామివారు.

సున్నం నీళ్ళలో పోసి, ఇంటికి వెళ్ళాడు ద్వారక. అక్కడ తల్లితో, "ఇలా స్వామీవారి గదికి సున్నం వెయ్యమన్నారు. వేస్తా నన్నాను" అని చెప్పాడు. "నువ్వు బాగుపడే రోజు లొస్తున్నాయి" అని ఆవిడ చాలా సంతోషించి సున్నం పడ్డా, పొక్కకుండా వుండేందుకు చేతులకు బాగా ఆముదం రాచి పంపించింది.

ఒక రెండు గంటలు మిషను లాగా పని చేసి గదంతా సున్నం కొట్టి, కడిగి అద్దంలాగా చేశాడు ద్వారక. కొత్త యిల్లు కట్టినంత సంతోషించారు స్వామివారు.

"రెండున్నర పెట్టి కూలివాడితో వేయించలేక కాదురా, నీతో వేయించింది. నావాళ్ళే నాకు పని చెయ్యాలి, అదొకటి. నా పనివల్ల నావాళ్ళే లాభపడాలి, అది రెండోది. నువ్వు తిన్న రెండు రూపాయలు నీకు లాభం కాదు. అది నష్టమే. నువ్వు పని చేసిందే నీకు లాభం" అన్నారు స్వామి.

ద్వారకకి సరిగా అర్థం కాలేదు. కాని ఇంతలో వాకిట్లోకి ఏదో కారు వచ్చింది. దాంతో అందరి దృష్టి అటు తిరిగింది. ఈమధ్య కాలనీ ఆశ్రమానికి కార్లవరస బాగా పెరిగింది. ఆదివారా లప్పుడూ, గురువారా లప్పుడూ 50 లేక 60 కార్లు గూడా రోడ్డుమీద నిలబడి వుంటున్నాయి. అయితే కార్ల వాళ్ళు వస్తే ద్రాక్ష, యాపిల్, ఖర్జూరం వంటి ఖరీదైన పళ్ళు వస్తాయి. అందుచేత పాపం ద్వారక ప్రత్యేకంగా చూస్తాడు కారంటే!

ఈ కారువాళ్ళు, పళ్ళతోపాటు ఒక కొత్త దుప్పటి ఇచ్చి వెళ్ళారు. వాళ్ళు వెళ్ళగానే "ద్వారకా, ఇవాల్టి నుంచీ నువ్వు రాత్రిళ్ళు ఇక్కడే పడుకోవాలి" అన్నారు.
[illegible] ద్వారక.

"ఫరవాలేదు. వాళ్ళు ఒప్పుకుంటారు, సంతోషిస్తారు గూడా. ఆ ఉప్పుడే తీసుకో" స్వామివారి మాట ఆజ్ఞగా వచ్చింది.

అంతే ఆ రోజు నుంచీ ద్వారక పడక స్వామివారి పాదాల దగ్గరే.

"నా పనివల్ల నావాళ్ళే లాభపడాలి" అంటే, ఇది అని కుర్రవాడు ద్వారకకేం తెలుసు పాపం?

అప్పటి నుంచీ రోజూ తెల్లవారుఝామున లేచి స్వామివారికి వేడినీళ్ళు కాచటం, దేవుడి పటాలూ వగైరా తుడిచి, స్వామివారి జప పాత్రలు వగైరా తోమి, స్థలశుద్ధి చేసి దేవుడి పూజకు అన్ని ఏర్పాట్లూ చేయటం ద్వారక డ్యూటీ అయింది. ఇంతకు మించిన మంచి డ్యూటీ గూడా ఒకటి అతనికి దొరికింది. రోజూ రాత్రి పడుకోబోయేటప్పుడు ఆ రోజుకు మిగిలిపోయిన పళ్ళన్నీ ఖాళీ చేయటం!

ఆ మర్నాడే స్వామివారికి సామూహిక గురుపూజ జరిగింది. ఆ మర్నాడు సాయంత్రమే స్వామీజీ పార్వతీ గుట్టకు బయలుదేరారు.

జయ జయ ధ్వానాల మధ్య స్వామివారి కార్లు కదలటంతో వారి పర్యటన కార్యక్రమాలకు శ్రీకారం చుట్టటమైంది. ముందు కార్లో స్వామివారు మరో కొంతమంది ముఖ్యులు కూర్చోగా, వెనుక కార్లలో జానకీరామ మందిరం వారి భజన పిల్లలు, వగైరా పరివారమంతా కూర్చున్నారు.

గుండ్లుపేట పార్వతి కొండకు అయిదుమైళ్ళు యివతల వుంది. రామణ్ణగారు ఆహ్వానించటం వల్ల, స్వామివారు సపరివారంగా వారింటి కెళ్ళారు. వారింట్లో పాదపూజ తరువాత, స్వామివారు ఉత్తరీయంలోంచి భస్మం తీయసాగారు. అది వొక పెద్ద మూటంత అయింది.

అక్కడ నుంచి ఆ వూళ్ళోనే మరో భక్తుడి యింటికి వెళ్ళారు. అక్కడ ఆ భక్తుడే స్వామివారికి భస్మం సమర్పించాడు. దాంట్లోంచి, ఒక వస్త్రం తీసి అతనికి యిచ్చారు స్వామివారు. ఇలా దారిలో పాద పూజలూ వగైరాలు పూర్తి చేసుకొని పార్వతి కొండకు చేరేసరికి రాత్రి పదయింది.

## గాయత్రీ యాగం

పార్వతి కొండలో గాయత్రీ యాగానికి చాలా పెద్ద యెత్తున యేర్పాట్లు జరిగాయి. అది మూడు రోజుల యాగం. మొత్తం పాతికమందికి పైగా ఋత్విక్కులు, పెద్ద పెద్ద పండితులను పిలిపించి, పండిత సదస్సు గూడ ఏర్పరిచారు. యాగశాంతికి అన్నదానం విరివిగా యేర్పాటు చేశారు. స్వామివారి పూజకు విస్తారంగా ఏర్పాట్లు చేశారు. ఇంకా చాలా చేశారు. ఒక మహాయోగి వస్తుంటే యేమేమి ఘనమైన ఏర్పాట్లు చెయ్యాలా అని ఆలోచించి అన్ని

యేర్పాట్లూ చేశారు, కొన్ని యింకా చేస్తున్నారు. ఇన్ని ఏర్పాట్లు అయినాయి గాని, స్వామివారికిగాని, వారి పరివారానికిగాని ఆహారపు యేర్పాట్లు లేవక్కడ!

స్వామివారు అనంగానే, హోమం గుర్తొస్తోంది. పూజ గుర్తొస్తోంది. సంకీర్తన గుర్తొస్తోంది. ఉపన్యాసం గుర్తొస్తోంది. వారి కోపం గుర్తొస్తోంది. అంతేగాని యీ అన్నం మెతుకుల మాట గుర్తు రావటంలేదు. అది వాళ్ళ తప్పా? కాని యీ వివేచన, స్వామివారితో వచ్చిన కుర్ర కుంకల పొట్టలకు లేదు. స్వామివారి మహత్తులకు, ఉపదేశ వాక్యాలకు, గుండ్లుపేటలో పెద్ద మనుషులు పొంగిపోతుంటే, యీ బాల పరివారం ఆకలితో విసుగ్గా నకనకలాడుతున్నారు. ఎలా గోలా పార్వతి గుట్టకు చేరితే అక్కడ నాలుగు మెతుకులు పెడతార్లే అనుకుంటే, అక్కడ పూర్ణకుంభాలున్నాయి, స్వాగత వచనాలున్నాయి, ఆనంద బాష్పాలున్నాయి తప్పితే తాగేందుకు మంచి నీళ్ళయినా లేవు.

బసలో దిగారు. స్వామివారికి ప్రత్యేకంగా బస యేర్పాటు చెయ్యాలని గూడ అక్కడ వారికి ముందు ఎవరూ చెప్పలేదు. పరివారమూ, స్వామివారూ అందరూ ఒకచోటే దిగారు. దిగింతరవాత యిక ఆకలికి ఆగలేక పిల్లలంతా స్వామివారి యెదుట హాహాకారాలు చేశారు. స్వామివారికి అంతులేని ఉగ్రం వచ్చింది. "ఛ, ఏమి ఏర్పాట్లివి?" అని తమ ఒంటి మీదున్న శాలువా తీసి విసురుగా గోడకేసి కొట్టారు. కోపం ఆపుకోలేక పోయారు గాబోలు! ఆ మాత్రపు దెబ్బకే ఆ పాత గోడ ఊగిందో, కూలుతోందో ఏమోగాని దమ, దమ మని పెద్ద చప్పుడు కాసాగింది. ఇంచుమించు గోడలు కూలుతున్నట్టున్న ఆ చప్పుడికి ఇంటి బయిట కాపలాగా వుంచిన సబిన్స్పెక్టర్లు, రెవిన్యూ అధికార్లూ పరిగెత్తుకొచ్చారు.

వాళ్ళొచ్చేసరికి, గోడ బాగానే వుందిగాని ఆ గోడలోంచి పటిక బెల్లం చెక్కలు, ఖర్జూరపు ముద్దలు, సీమ బాదం పప్పులు, ద్రాక్ష గుత్తులు వర్షం పడుతున్నట్టు రాలి పడుతున్నాయి. కొద్ది నిముషాల్లోనే ఆ నాలుగు గుట్టలు ఒక్కొక్కటి వాకిలంత ఎత్తు తయారయినాయి.

పోలీసు అధికారులకు గుండెలు జారినై, రెవెన్యూ అధికారులకు మతులు తప్పినై. ఇతరులకు ప్రాణాలు దడ దడ లాడినై. రోజూ మహిమలు చూసి విసుగెత్తిన వాళ్ళే అయినా ఆశ్రమం పిల్లలకి గూడ మరీ యింత పర్వతాల్ని చూసేసరికి కొంచెం కంగారు పుట్టింది.

"తినండిరా, కావలసినంత తినండి. మిగిలింది వాళ్ళకి మీరే పంచి పెట్టండి. మనకి వాళ్ళ ఏర్పాట్లెందుకురా" అన్నారు స్వామి తీవ్ర స్వరంతో.

అక్కడితో కంగారు తగ్గిన కుర్రకార్లు గబ గబా రెండు చేతుల్తో లాగించసాగారు. ఏకచక్రపురంలో అన్నంబండిలో కూర్చున్న భీముడిలాగా వుంది వాళ్ళ పద్ధతి.

మెల్లిగా స్పృహలోనికి వచ్చిన అధికారులకు తమ లోపం తెలిసి వచ్చింది. అప్పుడు కంగారుపడి తమ పెద్దల్ని తెచ్చి స్వామివారికి క్షమాపణలు చెప్పి, వద్దన్నా వినకుండా,

అప్పటికప్పుడు వంటలుచేసి, అర్ధరాత్రి పన్నెండు గంటలకు బ్రతిమాలి పిల్లలచేత అన్నాలు తినిపించారు.

ఇక ఈ పర్వతాలు నాలుగూ, అక్కడ ఏర్పాట్ల కోసం విధి విరామం లేకుండా శ్రమిస్తున్న వందలాది కార్యకర్తలకు ప్రసాదంగా వినియోగమయినాయి.

మరునాటి కల్లా రామస్వామిగారు, కృష్ణమూర్తిగారు వంటి భక్తులంతా వచ్చి కలిశారు. యాగం ప్రారంభమైంది. రెండు రోజుల యాగం చక్కగా సాగిపోయింది. ఆ మర్నాడు పూర్ణాహుతి. పార్వతికొండ అనేది చిన్న వూరు. ఆ వూళ్లో ఒక చిన్న కొండ. దానిమీద పెద్దగుడి. అది పార్వతీ అమ్మవారి గుడి. మామూలుగా నిద్రాణంగా వుండే ఆ గుడి యివాళ్ళ క్రమంగా విశ్వరూపం ప్రదర్శించ సాగింది. ఆ కొండ మీద నుంచుని యాగపు పనులన్నీ పర్యవేక్షిస్తున్న అధికార్లకు ఏవైపు చూచినా దూరపు పొలాల్లో గండు చీమల బారుల్లాగా సాగి వస్తున్న జన ప్రవాహాలు చూసి సంతోషమైంది.

క్రమంగా కాస్త ఎండపడుతున్న కొద్దీ, ఎండె, బీటలు పారివున్న ఆ పరిసరపు పొలాలలో, గట్లన్నీ కాలిబాటలుగా మారినాయి. మరింత పొద్దు సాగేటప్పటికి జనం మిక్కుటమై, ఆ గట్ల ఇరుకు బాటలు చాలక, జనం పొలాల కడ్డంపడి పరుగులు తీసుకుంటూ వస్తున్నారు.

ఏ నోట విన్నా వొకటే మాట. " గణపతి స్వామిట " "సత్యానందస్వామిట " అయితే ఏమిటి? ఏమో! ఏమిటో సంతోషం !! చూద్దామని ఆశ !!!

క్రమంగా మిట్ట మధ్యాహ్నం అయ్యేసరికి పార్వతికొండ పుల్లతో కెలికిన చీమల పుట్టల్లే వుంది. గాలికి కదిలిన తేనే పట్టల్లే వుంది. ఈగలు ముసిరిన బెల్లపుగడ్డల్లే వుంది. కార్యకర్తలు అంచనాలు వేశారు. జనం పదివేలకూ పన్నెండు వేలకూ మధ్యలో వుంటారన్నారు. వాళ్ళకు కాళ్ళు చచ్చుపడినై.

ఇంతమంది జనాన్ని చూసి, వొళ్ళు మరిచి సంకీర్తన చేస్తూ, చేయిస్తూ, పొంగిపోతున్నారు స్వామివారు. యాగం బ్రహ్మాండంగా సాగుతోంది. మైకులో స్వామివారి కంఠం మారుమ్రోగుతోంది, అఖండంగా!! స్వామిని చూసి జనం ఉద్రూత లూగిపోతున్నారు అనంతంగా!!!

కార్యకర్తలకు స్వామివారి దగ్గర కెళ్ళటానికి గూడ వోపికలు లేవు. జీవనాడులు జారిపోయాయి. ఆ వచ్చింది ప్రధానంగా రైతాంగ జనం. భోజనాలున్నాయని ముందే ప్రకటించారు. తీరా వచ్చాక లేదు పొమ్మంటే వెళ్ళిపోయేవాళ్ళు కాదు వాళ్ళు. పోనీ నాలుగు తిట్టి వూరుకునే ఘటాలూ కావు. చందాలు పోగుచేసిందంతా దోచుకు తిన్నారటరా, అని కీళ్ళు విరిచేస్తారు.

పుణ్యానికి పోతే పాపం ఎదురైంది. ఏంచెయ్యటం! ఇలా కార్య కర్తలు దిగులు పడుతుండగానే, ఒక అరగంటలో ఆకాశంలో నాలుగు వేపుల్నుంచీ, మబ్బులు కమ్ముకు రాసాగాయి. ఇందాకటి నుంచీ భూమి మీద జనం జాముల తరబడి శ్రమపడి వచ్చి పార్వతి

కొండపైపున్న స్వామివార్ని చుట్టబెట్టటం చూసి ఇప్పుడు నిముషాల్లో నాలుగు పక్కల నుంచీ దేవతలంతా పరిగెత్తుకు వస్తున్నారు గాబోలు, ఆ దేవతలంతా యీ మేఘాల్ని తమకు అడ్డుగా పెట్టుకొన్నారు గాబోలు, లేకపోతే దేవతలంతా జనం కంట పడిపోరూ?

స్వామివారు పర్యటన ప్రారంభిస్తే ఇటు భూమేనా పులకించేది. నేను పులకించనా అని దివి గూడ పులకించ సాగింది, మెరుపుల సందడులతో.

ఇంకా యాగం సాగుతూనే వుంది. పూర్ణాహుతి కాలేదు. పైనున్న మబ్బు దేవతలు మెరపుల మెరమెచ్చులతో ఆగక, స్వామివార్ని చూడగా పొంగిన ఆనంద బాష్ప ధారలతో ఆ పార్వతి కొండకు సహస్ర ఘటాభిషేకం చెయ్యసాగారు. వారు సంతోష గర్జనలు గూడా చేశారు గాని, కొండ మీద భక్తుల జయ జయ ధ్వానాలు ఆ మేఘగర్జనలను ఎదిరించి తల లెగరేసినై. వానలో తడుస్తూ వెర్రిగంతులు వేస్తున్న ఆ రైతాంగం మధ్యలో నిలబడి కొండ మీద ఆనందంగా సంకీర్తనం కొనసాగిస్తున్న స్వామివారు, కైలాసంలో ప్రమథ గణాలమధ్య నిలబడ్డ నటరాజస్వామిలాగా ప్రకాశించారు.

జనం అంతా వర్షం వచ్చినందుకు ఒకందుకు సంతోషిస్తుంటే, కార్యకర్తలు మరో అందుకు సంతోషిస్తున్నారు. ఈ వాన దెబ్బకు కొంతమందయినా వెళ్ళిపోతార్లే అని వాళ్ళ ఆశ!

లోపలి నుంచి సంతోషం పొంగు కొస్తున్నా సంతోషించే భాగ్యం లేని వాళ్ళయి పోయారు, పాపం యాగం సాగిస్తున్న ఋత్విక్కులు. మండు టెండల్లో వాన భయం కలలో గూడా లేదు గదా అని అగ్ని గుండాల నెత్తిన మామూలు పందిరే వేశారు. వర్షం మొదలు పెట్టి అరగంట అయినా తగ్గలేదు. ఇప్పుడు యీ వానకు అగ్నులను కాపాడు కోవటం యిక సాధ్యం కావటంలేదు.

దాంతో వారంతా స్వామి వారి దగ్గరకొచ్చి, ప్రార్థించక తప్ప లేదు. ఈ ఋత్విక్కు లంతా అంతకు ముందు చాటునో మాటునో "స్వాములు వస్తే వాన లొస్తాయా" అన్న వారే. ఇప్పుడు వారే వెళ్ళి ప్రార్థించవలసి వస్తోంది. "మహాప్రభో! ముందు అగ్నుల్ని రక్షించండి" అని.

"పాపం ఈ అమాయకులంతా వచ్చివున్నారు. వీళ్ళ జఠరాగ్నిని గూడ రక్షించాలిగా" అన్నారు స్వామి.

ఒక అయిదు నిమిషాల్లో వర్షం ఆగిపోయింది. యాగం నిర్విఘ్నంగా పూర్తయింది. ఇహ కార్యకర్తలు బలం కూడదీసుకుని, స్వామి దగ్గరకు వచ్చి, మెల్లగా చెవిలో వూదారు.

"అయ్యా! వంట రెండువేల మందికే చేశాము" అని. వాళ్ళ మొహాలలో అప్పుడే ప్రాణ భయం తాండవిస్తోంది. ఇక వాళ్ళని అని లాభమేమిటి? "సర్లే, ముందు వడ్డనలు చేయించండి. దేవుడు ఉన్నాడుగా" అన్నారు స్వామి.

ప్రాణాలు తెప్పరిల్లినై. అయినా హాత్రం లోపల సందేహమే! ఇది సామాన్యమైన పని కాదు.

ఏదో జానకిరామ మందిరంలో ఇలాగే చేశారంటే అంతా కలిపితే, వందమంది లేరక్కడ. నాగప్పగారింట్లో చేశారంటే అది ఒక ప్రసాదం సంగతి. ఇది అలా కాదే. చేసింది రెండువేల మందికి. ఉన్న జనం ఎంత తక్కువ లెక్క వేసినా పదివేల పయిన. పైగా వీళ్ళది నాజూకు తిండి కాదు. చెయ్యగలిగిం దేముంది? గుండె లదురుతుండగానే వడ్డనలకు ఏర్పాటు చేస్తున్నారు.

వాళ్ళు మంచినీళ్ళ కోసం కొండమీద వున్న ఒక బావిమీద ఆధారపడ్డారు. ఈ రద్దీకి ఆ బావి అరగంటలో ఇంకిపోయింది. ఇంక, కొండ కిందినుంచి నీళ్ళు తీసుకు రావాలి. అది కార్యకర్తల వల్ల సాధ్యమయ్యే పని కాదు. పైగా ఈ తాకిడికి ఆ బాపులెంత మటుకు నిలుస్తాయో?

ఈమాటు స్వామివారు గుడిపక్కనే వున్న ఒక చిన్న రాతిగుంట చూపించి, దాంట్లోంచి నీళ్ళు తెచ్చుకో మన్నారు. ఈ ఎక్కిరింతకు కార్యకర్తలు గుడ్లు తేలవేశారు. కాని, స్వామి వారి బలవంతం మీద అక్కడే నీళ్ళు తీసుకు రాసాగారు. ఆ తేవటం తేవటం రాత్రి పొద్దుపోయే దాకా తెస్తూనే వున్నారు. ఆ నీళ్ళు తాగిన వాళ్ళంతా "అవి కొబ్బరి నీళ్ళ"న్నారు.

స్వామివారు ఒకసారి వంటశాలలోకి వెళ్ళి కళ్ళతో చూసి "ఇక కానీండి" అన్నారు.

మళ్ళీ పొయ్యిమీద నుంచి గుండిగ దింపకుండా, రాత్రి పొద్దుపోయేదాకా వడ్డనలు సాగుతూనే వున్నాయి. రాతిగుంటలో నీళ్ళు వస్తూనే వున్నాయి.

ఒక పక్క ఈ సందడి ఇలా సాగుతుండగా స్వామివారు మెల్లిగా అమ్మవారి గుడివేపు సాగారు. రామణ్ణగారు వెనకాలే వెళ్ళాడు.

స్వామివారు పార్వతికొండ వచ్చిన దగ్గరనుంచీ విడవకుండా వెంటనే వుంటున్నాడు రామణ్ణగారు. స్వామివారు గుడి ఆవరణలోకి ప్రవేశించినాక, రామణ్ణగార్ని చూసి, "మీ వాళ్ళంతా నువ్వుగూడా సన్యాసుల్లో కలుస్తావేమో అని భయపడుతున్నారు. నువ్విక్కడ ఆగు" అని ముందుకు వెళ్ళిపోయారు. ఆయన ఆగిపోయాడు. వెనకాల నుంచి బంధువులు దగ్గరకొచ్చి, స్వామివారు అన్నమాటే అన్నారు.

స్వామివారు ప్రదక్షిణం చేసే ప్రాకారంలోకి వెళ్ళారు. అటు చుట్టు తిరిగి మళ్ళీ యిక్కడకు రావాలి. వేరే దారి లేదు. కాని స్వామివారు ఎంతసేపటికీ రాలేదు. ఏమయ్యారో అనుకుంటూ రామణ్ణగారు ఆ ప్రాకార మార్గం అంతా చూశాడు. స్వామివారు లేరక్కడ! ఏమయ్యారా అనుకుంటూ, ఏం తోచక గర్భగుడి దగ్గరకు వెళ్ళాడు. స్వామివారు అక్కడ వున్నారు.

"ఎలా వచ్చారు?" బంధువులు వున్నారు అక్కడ.

తనూ అక్కడే వున్నాడు. వేరే దారి లేదు.

" స్వామివారు గర్భగుడిలోకి వచ్చేశారు. ఎలా?" రామణ్ణగారు నివ్వెరపోయాడు.

ఉరుములు ఉరుముతున్నా, మెరుపులు మెరుస్తున్నా, వినిపించని, కనిపించని బధిరాంధులు ఉంటారని నిరూపించాడు ఆలయ అర్చకుడు. స్వామి అలా గర్భాలయంలోకి రావటం వల్ల, తన అధికార ముద్రంతా తుడిచి పెట్టుకుపోయినట్టు తల్లడిల్లి పోయాడు ఆ అభాగ్యజీవి. పాపం కొద్ది రోజుల్లోనే చెట్టంత కొడుకును కోల్పోయి నిజంగానే తల్లడిల్లవలసిన పరిస్థితి రాబోతోందని అతనికి అప్పుడు తెలియదు.

అతని బాధ గ్రహించి వెంటనే బయటకు వచ్చేశారు స్వామివారు. వచ్చి అతనిని పిల్చి, " పెద్దలు వచ్చినపుడు సేవించుకుంటే మనకు జీవితంలో రాబోయే కష్టాలు నివారణయ్యే సావకాశం వుంటుంది. " అని చెప్పారు.

స్వామివారి పక్కన రామణ్ణగారి లాంటి పలుకుబడిగల పెద్ద మనుషులున్నారు గనుక భయపడి నోరునూసుకుని వూరుకున్నాడు అర్చకుడు.

ఈలోగా స్వామివారు ఆలయంలో వున్నారని తెలిసి జనం అటు పరిగెత్తుకు రాసాగారు. స్వామివారు ఆలయం వరండాలో ఒక వేదిక మీద కూచొని భోజనం అయిన జనాన్ని యిటు పంపించమని కార్యకర్తలకు చెప్పారు.

స్వామివారు అర్చకుణ్ణి చూసి "వీళ్ళు నమస్కారాలు పెట్టటానికి వస్తున్నారు. వీళ్ళకి కాస్త విభూతి యిస్తే బావుంటుంది. దేంట్లో అన్నా కాస్త విభూతి వేసి తీసుకురండి " అన్నారు.

" గుళ్ళో కూర్చుని తనకు నమస్కారాలు పెట్టించుకోవటమేమిటి ?" అని అర్చకుడికి గుర్రుగా వుంది కాని పెద్ద మనుషులకు భయపడి ఒక చిన్న వెండిగిన్నెలో విభూతి వేసి తెచ్చి యిచ్చాడు. తను పక్కనే నిలబడ్డాడు.

జనం తేనెటీగల్లాగా వరసగా రాసాగారు. నమస్కారం పెట్టిన వాడి చేతులో కాస్త విభూతి వేస్తున్నారు స్వామివారు. కొద్దిసేపట్లో గిన్నె ఖాళీ అయింది.

" రామణ్ణా, విభూతి అయిపోయింది, ఏమంటావ్ " అన్నారు స్వామి.

" చిత్తం చిత్తం " అన్నాడు రామణ్ణగారు అయోమయంగా.

అర్చకుడు ఉల్లాసంగా చూస్తున్నాడు. ఈ మాటు తన్నడిగితే, "విభూతి అయిపోయింది" అని చెపుదామని. కాని యింతలోనే ఆ గిన్నె విభూతితో నిండి పోయింది, అతని కళ్ళ ఎదురు గానే ! అలా రాత్రి పొద్దు పోయేదాకా భోజనాలు జరుగుతూనే వున్నాయి. జనంవచ్చి నమస్కరిస్తూనే వున్నారు. స్వామివారు విభూతి యిస్తూనే వున్నారు ఆ క్యూ ఆగటం లేదు.

ఈ విభూతి తరగటం లేదు. అర్చకుడు పక్కనే వుండి చూస్తున్నాడు. కొంచెం కళ్ళు దిగిసై. అంతా అయి వెళ్ళబోయే ముందు, స్వామివారు అతని గిన్నె అతనికి యిచ్చి వేయబోయారు. అప్పుడు కాళ్ళ మీదపడి నమస్కారం పెట్టాడు .

" ఈ అద్భుత ఘటనకు సాక్షిగా ఈ గిన్నె మీ దగ్గరే వుంచండి " అన్నాడు అంజలి ఘటించి.

ఒక క్షణం ఆలోచించి " సరేలే " అన్నారు స్వామి.

తరువాత బసలోకి వచ్చిన తరువాత పరివారంతో అన్నారు స్వామివారు. "పాపం అభాగ్యుడు. ఇచ్చిన సమయం దాటినాక, సేవకు ముందుకు వచ్చాడు. పోనీ రాసి పెట్టి వున్న దుర్ఘటన తప్పకపోయినా ఉత్తర జీవితమన్నా సుఖంగా వుండనీ"* అని.

ఎవర్ని గురించి చెపుతున్నారో, ఏమి చెపుతున్నారో ఆ పిల్లలకి సరిగా అర్థం కాలేదు.

ఆ రోజే అనంతరామయ్య అనే ట్రస్టీ వచ్చి ఏదయినా ప్రసాదం యిమ్మని ప్రార్థించగా తన చేతిలో వున్న పువ్వుని గబగబా నలిపారు స్వామివారు. అలా నలుపుతుండగా గర్, గర్, మని ఒక ధ్వని వచ్చింది. ఏమిటా అనుకుంటుండగా వారి చేతులోని ఒక తులసి పూసలహారం వచ్చింది. దాన్ని అనంతరామయ్యకు అనుగ్రహించారు స్వామివారు.

అలా ప్రథమ పర్యటన అనూహ్యమైన పరిమాణంలో దిగ్విజయంగా, ఆ మరునాడే బయలుదేరి మైసూరు వచ్చేశారు స్వామివారు. ఆ తరువాత నాలుగో రోజున బ్రహ్మాండమైన కుంభవృష్టి పడి గుండ్లుపేట తాలూకాలో వెంటనే పొలం పనులు మొదలైనై.

ఇది జరిగిన కొద్ది రోజులలోనే ఆంధ్రదేశంలో అనంతపురానికి అరవై మైళ్ళ దూరంలో వున్న విదురాశ్వత్థం అనే క్షేత్రం నుంచి కొందరు భక్తులు వచ్చి అక్కడ ఆలయానికి కుంభాభిషేకం చేయమని పట్టుబట్టారు. స్వామివారు అంగీకరించారు.

ఈ వార్త అనంతపురంలో నంజుండయ్యగారికి తెలిసింది కాని ఆయన కదలలేదు. కాని ఆ కుంభాభిషేకానికి అనంతపురం నుంచి గూడ అనేక మంది వెళ్ళారు. అలా వెళ్ళిన వారంతా ఆ వైభవము గురించీ, గణపతి సత్యానందస్వామివారి మహిమల వర్షం గురించీ పడిపడి చెప్పసాగారు.

స్వామివారు అక్కడ తెలుగులో చేసిన మొట్టమొదటి ఉపన్యాసం భాష యాసగా వున్నా పండిత పామరుల్నిద్దర్నీ ఉర్రూతలూగించింది. అప్పటికి చలనం గలిగిన నంజుండయ్య గారు, తమ్ముడి వైభవం తను గూడా కళ్ళారా చూద్దాం అని సరాసరి కెనరే వచ్చాడు.

---

* గమనిక : ఆ వెండిగిన్నె యిప్పటికీ స్వామివారి దగ్గర భద్రంగా వుంది. దాన్ని పూజలో వాడరు. ఆ అర్చకుడికి త్వరలోనే ఎదిగిన కొడుకు పోయాడనీ తరువాత వచ్చి స్వామి దగ్గర ఏడ్చి వెళ్ళాడనీ తెలిసింది. ఆయన యిప్పుడు లేడు.

కన్న తండ్రి వస్తే బెరుకు, బెరుకుగా అంటీ ముట్టకుండా వున్న స్వామివారు అన్నగారికి మాత్రం అతిథి సత్కారాలు అధికంగా చేశారు. అనుక్షణం అప్రయత్నంగా జరిగిపోతున్న అనేక మహత్తులను చూసి, అక్కడ జరుగుతున్న క్రియాకలాపాలను చూసి, అక్కడికి వచ్చే భక్తులలో వున్న సమర్పణ భావాన్ని చూసి, ఆనంద పరవశుడై పోతున్న అన్నగార్ని కార్లో కూచో బెట్టుకొని మైసూరు విశేషాలు కొన్ని స్వయంగా చూపించారు.

ఆ తరువాత 'నంజనుగూడ' తీసుకువెళ్ళి నంజుండయ్యగారి పేరుకి మూల పురుషుడయిన నంజుండేశ్వరుడి దర్శనం చేయించారు. తిరిగి వస్తుండగా మైసూరికి దగ్గర్లో ఒక పొలం దగ్గర ఆగి అన్నగార్ని పొలంలోకి తీసుకు వెళ్ళారు.

పాము పుట్టల మయంగా వుండె పల్చ పల్చగా వున్న మామిడి తోట అది. కొన్ని చింతలు గూడా వున్నాయి. కొద్దిపాటి మెట్ట వ్యవసాయం ఒక మూల సాగుతోంది. ఆ పొలంలో యిటూ అటూ కాసేపు తిప్పి ఒకపక్క ఒకచిన్న కోనేరు చూపించారు. దాన్ని, అక్కడ మెరక పంటకు నీరు చల్లటానికి కొద్దిగా వాడుతున్నట్లుగా వుంది.

మరో పక్కన ఒక భూ సొరంగం చూపించారు. ఆ సొరంగం పాత కాలపు సున్నపు కట్టడంగా వుంది. లోపలికి మెట్లున్నాయి. అడుగున ఒకరిద్దరు కూచునే చోటుంది. అక్కడ గోడకు "ఓం" అని వ్రాసిన ఫలకం వొకటి అంటించబడి వుంది. ఆ సొరంగంలోకి వాననీళ్ళు పోకుండా వుండే యేర్పాటు చేయబడివుంది.

ఆ కోనేరు పవిత్రమైందనీ, యీ సొరంగంలో పూర్వం కొందరు యోగులు సాధనలు చేశారనీ చెప్పారు. అంతా చెప్పి చెప్పి, "ఈ స్థలం మనదే. ఇక్కడ ఆశ్రమ నిర్మాణం జరగబోతోంది. ఆ ఆశ్రమం ఏర్పడ్డాక నేనిక్కడే వుంటాను" అని చెప్పారు స్వామివారు.

ఆ స్థలం నంజుండయ్యగారికి పెద్దగా నచ్చలేదు. "దీనిని చదును చేయించటానికే చాలా అవుతుంది ఏం లాభం" అనిపించింది. అయినా ఆ మాట బయటకు అనలేదు.

"ఏదో వొకటి. మొత్తానికి ఒక స్థలం కొనుక్కొని తనదంటూ ఓ కుటీరం నిర్మించుకొంటున్నాడు. అక్కడి కదే సంతోషం" అనుకున్నా డాయన. నాలుగురోజులు వుండి, కించిత్ భక్తి భావాన్ని హృదయంలో మొలకెత్తించుకొని వెళ్ళిపోయాడు నంజుండయ్యగారు.

ఇది ఇలా ఉండగా—

స్వామివారి శ్రేయోభిలాషుల కమిటీ 1964 లో ఏర్పడిన దగ్గర నుంచీ ఆశ్రమ నిర్మాణానికి స్థలం చూడాలి, చూడాలి అనుకుంటూనే వుందిగాని, సంవత్సరం దాటినా, ఇంత వరకూ చూడటం పడలేదు.

కమిటీలో వ్యక్తులంతా పెద్ద వాళ్ళు, (పెద్దవాళ్ళంటే ముసలివాళ్ళు కాదు) ఎప్పుడూ [illegible] పను లొస్తున్నాయి. ప్రభుత్వపు యెద్దడులో, మునిసిపాలిటీ [illegible]

కో-ఆపరేటివ్ తగాదాలో, పై నాయికుల పర్యటనలో వ్యాపారపు హడావిడులో— యిలా యేదో వొకటి వస్తూనే వున్నాయి. ఏదివచ్చినా స్వామి ఆశీస్సు లేందే వారు కాలు ముందుకు వేయటం లేదు. కొందరికి ఏవేవో పై పదవులు వచ్చి తీరిక తగ్గిపోతోంది. కొందరికి కొత్త వ్యాపారాలు తోడై ఊపిరి పీల్చుకోటం కష్టంగా వుంది. ఇలాంటి యీతి బాధల వల్ల వారింకా స్థలాన్వేషణ చెయ్యలేకపోయినా చెయ్యాలనే కోరికను మాత్రం మనస్సుల్లోంచి పోనీయలేదు. భక్తులు గదా !

## పత్రికా సమావేశం

ఇల్లా వుండగా కొత్తగా పరిచయమైన రామస్వామయ్యగారికి ఒక కొత్త వూహ పుట్టింది. "ఈయన మన వంశంవాడు. మహాత్ముడు. పైకి వస్తున్నాడు. పదిమందికి ఉపకారం చేస్తున్నాడు. మనమా, రిటైరై పోయి ఖాళీగా కూర్చున్నాము. ఓపిక వుంది. వ్యవహార జ్ఞానం వుంది. కనుక, మనం మన కుర్రవాడికి చేతనయినంత సహకారం చెయ్యాలి. మన బంధువు. నాకు మనవడి వరస. నా మనవడికి కీర్తి వస్తే నాకు వచ్చినట్లు సంతోషం కాదా ?"

ఈ వూహ వల్ల, ఆయన చొరవ తీసుకొని, స్వామి వారి వ్యవహారాల్లో పాల్గొన సాగారు. పార్వతికొండ పర్యటన తరువాత, స్వామివారు వీరింటికి వెళ్ళటం, అక్కడ రవ్వకేసరిలోంచి డాలర్లు సృష్టించి ఇంట్లో తలోటీ యివ్వటంతో, యింట్లో అందరికీ స్వామి వారి మీద విశ్వాసం కుదరటం, అప్పటి నుంచీ వీరు దాదాపు రోజూ స్వామివారి దర్శనం చేసుకొంటూ వుండటం జరుగుతోంది. అందువల్ల ఆశ్రమ వ్యవహారాలు వీరికి, బాగా ఆకళింపు అవుతూ వచ్చాయి.

ఆ రోజుల్లోనే స్వామివారి కార్యకలాపాలకు ఒక చిక్కులాంటిది రాబోయేట్లు కనిపించింది.

ఆ కాలనీ ఎలక్ట్రిక్ కాలనీ. అక్కడ హైపవర్ ఎలక్ట్రిక్ జనరేటరు వుంది. అది ప్రమాద స్థలం. అందుచేతనే ఆ కాలనీ పూర్తిగా ప్రైవేటు కాలనీ. అక్కడికి ప్రవేశం అనుమతి లేకపోతే నిషిద్ధం. "నిషిద్ధ ప్రాంతము, ప్రవేశము లేదు" అనే బోర్డులు ఆ కాలనీ మొదట్లోనే వేలాడ గట్టి వుంటాయి.

అలాంటి స్థలంలో స్వామివారు తమ కార్యకలాపాలు సాగిస్తున్నారు. వేలకొద్దీ జనం యథేచ్ఛగా వస్తున్నారు, పోతున్నారు. వారం వారం బ్రహ్మాండమైన బహిరంగ సభ జరుగు తోంది. ఉపన్యాసాలు, కచేరీలు, హరికథలు వగైరాలన్నీ ముమ్మరంగా సాగిపోతున్నాయి.

ఇలాంటి కార్యకలాపాలు, ఆ కాలనీ ఆవరణలో పొరపాటున గూడ జరగరాదు. ఎవరైనా పదిమంది అక్కడ అనవసరంగా గుమిగూడితే పోలీసు రిపోర్టు చేయవలసిన బాధ్యత అక్కడ ఆఫీసర్ల మీద వుంది. కాని అలాంటి దుడుకు పని ఎవ్వరూ చేయటం లేదు. సంగతిదే. కాక దీనివల్ల వాళ్ళకి "ఎప్పటికో అప్పటికి ప్రమాదం రావచ్చు" అనే భయం బయలుదేరింది.

ఇప్పటికి మూడేళ్ళు సాగనిచ్చారు. కొందరు కాలనీవాసులే "ఈ రద్దీ వల్ల కాలనీ ప్రశాంతతకి భంగమౌతోందని" కూయసాగారు. అలాంటి వాళ్ళవల్లే ఆఫీసర్లకు భయం పట్టుకుంది.

కాని స్వామివారంటే అంతకన్నా ఎక్కువ భయం వుంది. ఆయన కార్యక్రమాలంటే ప్రీతి వుంది. అందువల్ల చెప్పలేక అధికారులు యిరకాటంలో పడుతున్నారు. చివరికి మెల్ల మెల్లగా కృష్ణమూర్తిగారి లాంటి పెద్దలకు తమ సంకటం ఇలా వుందని చెప్పసాగారు.

దాంతో స్వామివారికి వేరే స్థలం చూసుకోవలసిన అగత్యం నెత్తిన బడ్డదని పెద్దలంతా గ్రహించారు. శ్రేయోభిలాషి కమిటీవారు గూడా గమనించారు. గమనించి, మీటింగుల మీద మీటింగులు వేస్తున్నారు. ప్రతి మీటింగులోనూ, కాఫీలు, టిఫిన్లు ఎగిరిపోతున్నాయి. స్థలం ఎక్కడ వుందా అని మాత్రం తేలటం లేదు. ఆ కమిటీలో వున్న కృష్ణమూర్తిగారి తండ్రి రామదాసులాంటి వారు ఎంత తొందర పెట్టినా విషయం మాత్రం ముందుకు కదలటం లేదు.

ఇటు రామస్వామయ్యగారు, అనంతరామభట్టుగారూ, నాగప్పగారూ వంటి భక్తులు గూడ ఈ విషయం మీద తీవ్రంగా దృష్టి పెట్టసాగారు.

స్వామివారు కూడ, ఎక్కడయినా మంచి స్థలం వుంటే చెప్పండని కనిపించిన వాళ్ళందరికీ చెపుతున్నారు.

ఇది ఇలా వుండగా స్వామివారికి సరియైన ప్రచార యంత్రాంగం లేకపోవటం మీద రామస్వామయ్యగారి దృష్టి పడింది. దానితో వారూ, మరో భక్తుడు నంజుండయ్యగారూ కలిసి, ప్రయత్నించి, మరి కొందరి సహాయం తీసుకొని 1965 ఆగష్టులో మొట్ట మొదటి పత్రికా సమావేశం ఏర్పాటు చేశారు.

ఆ సమావేశం (Press Conference)వల్ల స్వామివారికి కొత్తగా ఏర్పడిన కీర్తి ఏమీ లేదు గాని మైసూరు పత్రిక అధినేత నారాయణరావు గారికి మాత్రం జీవితంలో అది మరపురాని మైలురాయి అయింది.

మైసూరు పత్రిక నారాయణరావుగారు, ఆనాటి స్థానిక పాత్రికేయులలో ప్రముఖుడు. మైసూరు పత్రిక, మైసూరు నుండి వెలువడే కన్నడ పత్రిక, దానికి నారాయణరావుగారే అధినేత. పట్టణంలో ఏ మూల ఏ చిరునవ్వడి లేచినా రిక్కించుకొని వినటం ఆయన చెవులకు వెన్నతో పెట్టిన విద్య.

సద్వంశంలో పుట్టి సహజంగా సరళ స్వభావం గలవాడవటం చేత పాలేవో, నీళ్ళేవో పోల్చుకోగల శక్తి ఆయనకి జన్మ సిద్ధమై వుంది. అందువల్ల ఆయన తన పత్రికలో [illegible] వ్యాఖ్యలకు, రాసే వ్యాసాలకు సర్వజనామోదం వుండేది. నారాయణరావు [illegible] పూర్తిగా పరిశోధిస్తేనే గాని రాయడని కీర్తి వుండేది.

ఆ నారాయణరావుగారి దృష్టి గణపతి సత్యానందస్వామి వారిమీద ఇదివరకే పడింది. అయితే తనకు సహజసిద్ధమైన పరిశోధనా దృష్టితో దాదాపు సంవత్సరకాలం, వీరిమీద తన పరిశోధనలు పరోక్షంగా సాగించాడు. అయితే ఈ పరిశోధనా కాలంలోనే వీరి ద్వారా అనేకులు స్వామివారి కీర్తిని తెలుసుకొని, ఉపయోగించుకొని లాభం పొందారు.

ఈ పత్రికా సమావేశంలో అన్ని పత్రికలవారూ వచ్చి స్వామివార్ని ప్రశ్నల వర్షంలో ముంచివేశారు. ప్రధానంగా ఆ ప్రశ్నలన్నీ స్వామివారు చేసే మహత్తుల మీద, అద్భుత కృత్యాల మీద ఆధారపడి వున్నాయి.

ఈ ప్రశ్నలన్నిటికీ ఓపికగా సమాధాన మిస్తూ చివర్లో స్వామివారు ఒక క్లుప్తమైన ప్రసంగం చేశారు.

"మిత్రులారా, మీ ప్రశ్నలన్నీ గారడీ విద్య మీద కేంద్రీకృతమై వున్నాయి. కానీ మీ రీ గారడీ విద్యలను చూసి మోసపోవద్దు అని సలహా ఇస్తున్నాను.

ఇవి ప్రజలను ఆకర్షించటానికి నీచస్థాయి సాధనాలు.

పాము కరిచినా బతికేవాడిని చూడాలంటే పాముల వాళ్ళకోసం వెతకండి. కత్తితో పొడుచుకున్నా నెత్తురు రానివారిని చూడాలంటే దొమ్మరాట గాళ్ళని చూడండి. విగ్రహాలూ, విభూతులూ సృష్టించేవాడు కావాలంటే కనికట్టు, గారడీ విద్యల వారి వెంటబడండి.

నేను పాముల్ని మచ్చిక చేస్తాననీ, విషం తింటాననీ, నిప్పులో నిలబడతాననీ ఎవరైనా మీతో అంటే "అవన్నీ క్షుద్రమైన గారడీ విద్యలు" అని మీరు చెప్పండి. అటువంటివి చూసి మీరు మోసపోవద్దని నేనే స్వయంగా మీకు చెపుతున్నాను. ఇవి ఎవరు చేసినా నమ్మవద్దు. నేను చేసినా నమ్మవద్దు. ఇది నా సందేశంగా మీ పత్రికల్లో ప్రకటించండి.

తత్వవిద్య ఉన్నతమైనది. అది వాస్తవికత మీద ఆధారపడి వుంది. గారడీలమీద కాదు. అసలైన మార్గం తెలియక బాధపడే వారికి ఆధ్యాత్మిక జ్ఞానం యివ్వటమే నా జీవితాశయం.

సమయం దొరికినప్పుడు మీరు మా ఆశ్రమంలో జరిగే సత్సంగాలలో పాల్గొనండి. హోమం, పూజ, కీర్తనలల్లో పాల్గొనండి. అప్పుడు ఇక్కడ గారడీ జరుగుతోందా, వాస్తవమైన తత్వం బోధపడుతోందా అని మీరే గ్రహిస్తారు.

ఎవర్నీ ఆకర్షించాలని నాకు లేదు. నాకు కావలిసింది ఆధ్యాత్మిక మార్గం కావాలని తపనపడే జీవులు. వారు ధనికులా, పేదవారా అన్నది నాకు అనవసరం.

సత్సంప్రదాయంలో నాకు విశ్వాసముంది. నాకు వంశ పారంపర్యంగా వస్తున్న సంప్రదాయాలకు అనుగుణంగా నేను పూజ, కీర్తన, ధర్మప్రచారం, యోగ బోధనం, సంస్కృత భాషా ప్రోత్సాహం, అందరిపట్లా సమతాదృష్టి, దీన దళితులకు చేతనయిన సహాయం నా జీవిత విధానాలుగా ఆచరిస్తున్నాను.

నామాట వినదలుచుకున్న వారు వుంటే వారికి ఇవే బోధిస్తున్నాను. ఇది అర్థం చేసుకోక, కొందరు తాము గందరగోళపడి నే నేదో మహత్తులు చేస్తున్నా ననుకొని ఇతరులను గందరగోళ పెడితే వాళ్ళను నేనేం చెయ్యగలను?"

అద్భుతమైన చాకచక్యం ఉట్టిపడుతున్న స్వామివారి సంభాషణా కౌశలానికీ, సరళమై, స్వచ్ఛమై వున్న స్వామివారి ఆచరణ సిద్ధాంతానికీ పూర్తిగా దాసుడయ్యాడు నారాయణరావు గారు. ఆ సమావేశానికి హాజరయిన ఆయన పుత్రుడు వెంకట్రామ్‌గారు గూడ స్వామివారి వల్ల పూర్తిగా ప్రభావితుడయ్యాడు.

దీనితో స్వామివారికి ఒక స్థానిక పత్రిక అండదండలు ఏర్పడటమే కాక పత్రికా రంగంలోనూ, గ్రంథ ప్రచురణ కార్యకలాపాలలోనూ గల లోతుపాతులు బాగా మనస్సుకు పట్టే సావకాశం ఏర్పడింది.

ఈ విధంగా చిక్కర్సు గారు నాటిన విత్తుకు ఇప్పుడు కొంచెం తొలకరిజల్లు పడ్డట్లయింది.



# 13వ అధ్యాయం మహిమావిష్కారం

శ్లో. హన్త! యస్య మహిమా విభాంతో
భక్తరక్షణపరా అనంతశః।
తం హి నిత్య మహిమాన మవ్యయం
సద్గురుం మనసి సంతతం భజే॥

[సద్గురు దేవుని మహిమలు అనంతాలు. భక్తులను రక్షించటమే వాటి ప్రయోజనం. నిజానికి ఆయన మహిమ నిత్యమైనది, అవ్యయమైనది అట్టి సద్గురువును హృదయంలో నిరంతరం సేవిస్తున్నాను.]

కావేరీతీరాన శోణ వస్త్ర దీక్ష అయిన దగ్గర నుంచీ స్వామివారి నియమాలు కొన్ని మారాయి. వారు గడ్డం చేసుకోటం మానేశారు. ఇతరులతో కలిసి భోజనం చెయ్యటం గూడా మానేశారు. అంతకు ముందుదాకా తమ యింట్లో వండి తెచ్చి పెడుతున్న తల్లులు యిపుడు యిక్కడికే వచ్చి వంట చేసి పెడుతున్నారు. దీనికై జట్లు జట్లుగా వారిలోవారే యేర్పాట్లు చేసుకొన్నారు తల్లులు. దీనితో శ్రీకంఠయ్యగారికి గూడ చెయ్యి కాల్చుకునే శ్రమ తప్పింది.

స్వామివారి భోజనానికి "భిక్ష" అనే వ్యవహారం గూడా ఆ రోజుల్లోనే ఏర్పడింది. ఎవరు దానికి ప్రారంభోత్సవం చేశారో తెలీదు. స్వామివారికి భిక్ష తయారు చేసిపెట్టటానికి వస్తూవున్న తల్లులలో ఒక తల్లి వెంట ఒక కుంటిపిల్ల వస్తూవుండటం కృష్ణమూర్తిగారు మొదలైనవారందరికీ తెలుసు. ఆ పిల్లకు పోలియోవ్యాధి ముదిరిపోయింది. కొన్నాళ్ళు పోయాక స్వామివారు స్వయంగా ఆ పిల్ల కాలికి భస్మం రాయసాగారు. ఒక వారం రోజు లయింది. క్రమంగా ఆ పిల్ల కాలు బాగుపడి మామూలుగా నడవసాగింది.

దీనికే ఆశ్చర్యపోతుంటే, ఆ రోజుల్లోనే ఇటువంటి సంఘటన మరొకటి కంటబడ్డది కృష్ణమూర్తిగారికి. స్వామివారు తాను అన్నం తిన్న ఏ యింటికీ తన ఋణం వుంచుకునేవారు కాదనటానికి గూడ నిదర్శనం దొరికింది ఆయనకు.

స్వామివారికి అన్నం తెచ్చే మరోయింట్లో రెండేళ్ళ పిల్లవాడికి పోలియోవల్ల నడుం దగ్గర నుంచీ రెండు కాళ్ళూ గుడ్డ పీలికలు లాగా వేళ్ళాడి పోతూవుండేవి. పాపం వాళ్ళు చాలా బీదవాళ్ళు కావటంవల్ల పెద్దగా వైద్యాలు చేయించలేక పోవటంవల్ల ఆ స్థితి వచ్చింది.

ఆ పిల్లవాడికి గూడ స్వామివారే స్వయంగా భస్మం కొన్నాళ్ళపాటు రాసారు. సుమారు ఒక నెలయినాక ఆ కుర్రవాడు తన కాళ్ళతో తానే నడిచాడు.

ఇది చూచి * "పంగుం లంఘయతే గిరిం" అంటే ఇదే గాబోలు, అనుకున్నారు కృష్ణమూర్తిగారు.

ఆ తొలి రోజుల్లో గూడ స్వామివారి దర్శనానికి వచ్చేవారిలో అన్ని జాతులవారు వుండేవారు. స్వామివారి కరుణగూడ అందరిమీదా సమానంగానే ప్రసరించేది.

ఒకసారి ఒక ముస్లిం కుర్రవాడికి ఒక అసాధ్యమైన ** వ్యాధి నిముషాల్లో పోగొట్టారు స్వామివారు. వృత్తిరీత్యా వడ్రంగి అయిన ఆ ముస్లిం భక్తుడు స్వామివారికి ఒక మంచి పూజామందిరం చేసి యివ్వాలని సంకల్పించుకొన్నాడు. తన సంకల్పం రామచంద్రా బుక్ డిపో జగదీష్‌గారి దగ్గర వ్యక్తం చేశాడు. ఎందుకంటే, ఆయనే యితన్ని స్వామి దగ్గరకు తెచ్చింది. కుర్రవాడి సత్సంకల్పాన్ని అభినందించి జగదీష్‌గారు ఆర్థికంగా చేయూత యిచ్చాడు. ఫలితంగా రోజ్‌వుడ్‌తో చేసిన అతి మనోహరమైన పూజామందిరం తయారయి స్వామివారి పాదాల దగ్గరకు చేరింది. ఆ మండపం అందాన్ని, దానిలో నిగారించే ఆ భక్తు లిద్దరి భక్తినీ గమనించి, స్వామివారు స్వయంగా దానిలో కూర్చుని గురుపూజ చేయించుకున్నారు.

"భవిష్యత్తులో రూపుదిద్దుకోబోయే నా పీఠానికి ఇదే ప్రథమ పూజా మంటపం అవుతుంది" అని అనుగ్రహించారు.

వెన్నెల సెలయేటికి రాజవీధి అనీ, మాదిగవాడ అనీ భేదం వుండదు గదా!

మరొక కార్మిక భక్తుడికి పోయిన కాళ్ళను రప్పించారు స్వామివారు. కృతజ్ఞతగా అతనొక చక్క కుర్చీ తయారు చేసి స్వామివారి కిచ్చాడు. అదే స్వామివారికి లభించిన మొదటి కుర్చీ.

ఒక రోజున ఒక మహమ్మదీయుడు ఆదివారపు సభలోకి వచ్చాడు. రావటం ఏదో అనారోగ్యంతో వచ్చాడు. తగ్గించుకుందామని వచ్చాడు. ఏమయినా "హిందూ సాధువు దగ్గరకు వెడుతున్నామే అని మనస్సు పీకుతోంది. ఆ పీకులాటలో "సరే, ఈయన నన్ను గుర్తించి ఒక విభూతి పొట్లం తనకు తానుగా యిస్తే, అప్పుడు నమ్ముదాం యీయన్ని" అనుకున్నాడు.

---

* "మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వందే పరమానంద మాధవమ్ ॥"

తా. ఎవని కృప మూగవానిని వక్తగా చేస్తుందో కుంటిచేత కొండలు దాటిస్తుందో అట్టి పరమానంద స్వరూపి యగు మాధవునకు నమస్కారము. ఇది ఒక సుప్రసిద్ధ చాటుధార.

** ఈ వ్యాధి వివరాలు తెలియరాలేదు.

ఆ రోజు స్వామివారు తన సందేశంలో, "నువ్వు నమ్మకపోతే ఆయనకేం నష్టం లేదు. నువ్వు నమ్మటం కోసం నిదర్శనాలు చూపుకొనే గతి ఆయనకు లేదు. నిదర్శనాలు వెతుక్కొని నిన్ను నీవు ఉద్ధరించుకోవాలి" అని ఉపన్యాసం చెప్పారు. కానీ ఆ ఉపన్యాసం చివర్లో అతన్ని పిలిచి, ఏమీ మాట్లాడకుండా ఒక విభూతి పొట్లం యిచ్చారు.

దాంతో ఆ పెద్ద మనిషికి, మనం తప్పు చేశామే అనే పశ్చాత్తాపం గలిగి బాధపడ సాగాడు. ఆ బాధవల్ల అతనికి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. అలా జాగరణ చేస్తుండగా స్వామి అతని యెదుట భౌతిక శరీరంలో ప్రత్యక్షమై అతనిని స్పృశించారు. దాంతో అతని రోగం మటుమాయమైంది.

ఈ దెబ్బతో పూర్తిగా భక్తుడుగా మారిన, ఆ మహమ్మదీయ భక్తుడు స్వామివారి ఫోటో ఒకటి కొని దాన్ని తీసుకెళ్ళి, తన నమాజు సమయంలో చూసుకొనేందుకు మసీదులో పెట్టుకున్నాడు. ఇది ఆ మసీదులో కొంత గందరగోళం సృష్టించుతుండగా స్వామివారే అతనితో చెప్పి ఆ పటం అక్కడ నుంచి తీసివేయించారు.

కార్మిక భక్తులు యిలా వస్తురూపేణా సమర్పణ చేసుకొంటూ వుండగా, కళాకార భక్తులు, తమ కళా సమర్పణలను ముమ్మరం చేయసాగారు. అట్టి వారందరిలోకి శ్రేష్ఠులు వయొలిన్ చౌడప్పగారు. ఇతర ప్రముఖులలో అంజనప్పగారు, ఫిడేలు వాదనా విశారదాద్యనేక బిరుదాంకితులు A. S. శివరుద్రప్పగారు, * వీణా విద్వాంసులు, పార్వతీశ్వరమూర్తిగారు, సూర్యనారాయణగారు, గాత్రంలో శ్రీకంఠన్‌గారు, మొదలైన హేమాహేమీ లుండేవారు.

ఇంతమంది ఉద్దండ సంగీత పండితులు వస్తున్నా, పాండిత్యంలో మధ్యముడే అయినా, ఉన్నప్పటి నుంచీ సన్నిహితుడే అయినా, ఫిడేలు వెంకటప్పగారు రావటం మాత్రం కొంచెం ఆలస్యమే అయింది. ఆయన భార్య నంజమ్మగారు ఆయన కన్న ముందడుగు వేసింది.

తన భర్తతో కలిసి వద్దామని ఆవిడ ఎంత ప్రయత్నించినా ఆయన మొండితనం తగ్గక పోవటంతో, కూతురు లీలను వెంట బెట్టుకొని ఆదివారపు హోమాలకు తనే రాసాగింది.

* శ్రీ శివరుద్రప్పగారు 1988లో స్వామీజీ దర్శనం చేసినపుడు ఈ రచయిత స్వయంగా చూశాడు. అప్పటికి 97 సం॥ల వయసులో వున్న, రుద్రప్పగారు స్వామీజీ పాదాలు పట్టుకొని తమకు ముక్తి అనుగ్రహించమని ప్రార్థించారు. శ్రీ స్వామీజీ, వారికి స్వహస్తాలతో దత్త వస్త్రం కప్పారు. ఇలా స్వహస్తాలతో పండితుల్ని సత్కరించటం, అంతకు ముందు చూసి వున్నది కాదు. శ్రీ స్వామీజీ సన్నిధిలో కచేరీ చేస్తే, ఊర్ధ్వలోకాలకు వెళ్ళి నట్టుండేది. "అది నా అనుభవం" అని చెప్పారు వీరు. బేహగ్, శంకరాభరణం, భైరవి, కల్యాణి, వసంత, హంసధ్వని రాగాలంటే శ్రీ స్వామీజీ ఎక్కువగా యిష్టపడేవారని వీరు చెప్పారు. కీర్తనలలో "ఏ తావునరా, (కల్యాణి), నన్ను బ్రోచుటకు (శంకరాభరణం), వాతాపిగణపతిం. (హంసధ్వని) ఎక్కువ యిష్టపడేవారట. వీరికి 'ఫిడేలు వాదన విశారద' అనే బిరుదు 1933 లో కాశీ విశ్వవిద్యాలయంలో ఇచ్చారట.

వస్తున్న కొద్దీ విశ్వాసం పెరిగిపోసాగింది. ఆ విశ్వాసంతో భర్తతోగట్టిగానే వాదించిందిగాని ఆయన కదలలేదు. ఆవిడకు ఎన్నాళ్ళనుంచో వదిలిపెట్టని అనారోగ్యం ఒకటి వుంది. అది స్త్రీ సంబంధమైనది. తిని తిరిగే రోగమే గాని, దానివల్ల చాలా బాధ పడుతోంది. ఎంత బాధవున్నా సంసారం, మధ్య తరగతి సంసారం. ఇంటెడు చాకిరీ చేసుకోక తప్పదు కదా!

స్వామివారు అనుగ్రహిస్తే ఆ బాధ పోతుందని, ఆశ బయలు దేరింది. కానీ ఎలా అడుగుతుందీ! ఎంత తెలిసిన కుర్రాడయినా, ఇప్పుడు ఆయన స్వామాయె. పైగా ఈ రోగం పదిమందిలో చెప్పుకునేది కాదు. భర్త వస్తే ఆయన యేదో రకంగా చెప్తాడనుకుంటే ఆయిన మొండికెత్తె! ఇక ఏం చేస్తుంది? మనమే ప్రయత్నం చేద్దాంలే అనుకుని భర్తకు అన్నం పెట్టి, స్కూలుకు పంపించినాక తను ఒక్కత్తే కాలనీ ఆశ్రమానికి బయలు దేరింది. అక్కడ సాయంత్రం దాకా కూచుని వచ్చేసింది.

ఇలా నాలుగు రోజులు జరిగాక, ఒకరోజున స్వామివారు వేడినీళ్ళు కాచమని లోపలి నుంచి ఎవరినో పిలుస్తున్నారు. కానీ అక్కడ ఎవరూ లేరు. అందుచేత ఈవిడ ముందు కెళ్ళి "నేను కాచేదా" అని అడిగింది.

"నువ్వు కాస్తావా అమ్మా" అన్నారు స్వామివారు సందేహంగా.

"నీకు చేస్తే తప్పా, పరమాత్మా!" అంది ఆవిడ నిండు భక్తితో. సరే కానిమ్మన్నారు స్వామివారు. ఆ రోజు స్నానమయ్యాక, "ఏమిటి కారణం, రోజూ వస్తున్నావు?." అన్నారు స్వామివారు.

"అనారోగ్యంతో బాధపడుతున్నాను పరమాత్మా" అందీవిడ.

"నీకు నామీద విశ్వాసం వుందా?" తెలియనట్టు ప్రశ్నించారు స్వామివారు.

"లేకేమి పరమాత్మా! నీ పరమాత్మ లీలలు, నేను కళ్ళారా చూస్తూనే వున్నాను గదా" గట్టిగా చెప్పిందావిడ.

"సర్లే, మీ వార్ని గూడ రానీ చూద్దాం" అన్నారు స్వామి.

అలా ఆశ చూపి యిలా తీసి పారేసినట్టయింది ఆవిడ పని. ఆ భర్త రావాలంటున్నారు ఈయన! ససేమిరా రానంటున్నా రాయన! ఇదెక్కడి చిక్కు? సరె, ఏం చేస్తుంది? మానకుండా రోజూ ఆశ్రమానికి వస్తోంది. పని వున్న రోజున ఏదో కాస్తో కూస్తో పని చేస్తోంది. లేని రోజు పడిగాపు వుండి పోతోంది.

ఇలా కొద్ది రోజు లయ్యాక, భర్త స్కూలుకి వెళ్ళాక అనుకోని సెలవేదో వచ్చింది. ఆయన యింటికి తిరిగి వచ్చేశాడు. వచ్చేటప్పటికి యిల్లు తాళం పెట్టి వుంది. ఎక్కడికి పోతుం దీవిడ? ఆ గణపతి స్వామి పిచ్చే! మరో పిచ్చిలేదు. అందుకని తాళం చెవికోసం ఈయన ఎలక్ట్రిక్ కాలనీకి వెళ్ళాడు. ఈయన వెళ్ళేసరికి స్వాములవారు ఎక్కడికో వెళ్ళటానికి

కారెక్కబోతున్నారు. ఈయన్ని చూస్తూనే చేతులో వున్న ఎండు కొబ్బరి చిప్పని రెండు ముక్కలు చేశారు. ఆ సమయానికి వారి చేతుల్లో, యెండు కొబ్బరి చిప్ప ఎందుకుందో ఏమోగాని అది విరుగుతుండగానే దాంట్లోంచి ఒక రుద్రాక్ష పూసల మాల రాలింది. ఆ మాలను వెంకటప్పగారి చేతిలో పెట్టి కారెక్కేశారు స్వామివారు.

కేవలం అనాలోచితంగా తీసుకున్నారు వెంకటప్పగారు. లేకపోతే అసలు దాన్ని ముట్టే వాణ్ణికాదు అనుకున్నాడాయన. అలా ఎంతనుకున్నా, చేతికివచ్చిన రుద్రాక్షమాల మాత్రం పారెయ్య బుద్ధికాలేదు. కొబ్బరి చిప్పలోంచి యిదెలా వచ్చిందీ అన్న ఆశ్చర్యం మాత్రం మరో పక్కనుంచి మనస్సును కుదుపుతోంది.

సరే, భార్యా భర్తలు యింటి కెళ్ళిపోయారు. ఆ రోజునుంచీ ఆవిడ బాధలు మాయం అయ్యాయి. అదిచూసి నోరు తెరిచాడు వెంకటప్పగారు.

"నేనే పొరపాటు పడ్డాను, సత్యనారాయణ సామాన్యుడు కాదు" అన్నాడాయన సంతోషంగా.

అప్పటినుంచీ ఆయన ఆశ్రమంలో జరిగే కార్యక్రమాలలో నిరంతరంగా పాల్గొనే కళాకారుల్లో ఒకడయ్యాడు.

విద్య కలవారిలాగానే, ధనం కలవారిలో వినయమూ, భక్తి కొంచెం విచిత్ర రూపాలలో వుంటాయి. వారికి భక్తి లేదని గాని, వినయం లేదని గాని చెప్పలేం. కాని వాటిని మనం గుర్తించాలంటే, ఆ భక్తి వినయాలకు పులుముకొని వున్న, అహంకారపు రంగును కడగాలి. అలాంటి ప్రక్షాళన కార్యక్రమంలో స్వామివారిది అందెవేసిన చేయి.

షావుకారు చెన్నయ్యగారు మైసూర్లో పెద్ద ధనికుడు, రాజకీయనేత్త. ఈ రెండూ చేరితే ఆయన ప్రసిద్ధికి లోటెలా వుంటుంది? ఇప్పుడు ఇంటింటికీ వ్యాపిస్తున్న మధుమేహం (షుగర్) వ్యాధి అప్పట్లో కలవారికి మాత్రమే ప్రత్యేకతగా వుండేది. చెన్నయ్యగారు బాగా కలవారు కనుక, వారి కీ వ్యాధి బాగా ముదిరి, వైద్యుల నెదిరించి చివరకు మంచం మీదించి లేవటం చేతగాని పరిస్థితి తెచ్చిపెట్టింది.

ఈయన నాగప్పగారితో వున్న మైత్రివల్ల స్వామివార్ని గురించి యింతకు ముందే బాగా విన్నాడు. ఇప్పుడు వ్యాధి ముదరటంవల్ల స్వామివారి సహాయం తీసుకోవాలని కోరిక కలిగింది. దాంతో కారిచ్చి డ్రైవర్ని పంపాడు. "వెళ్ళి స్వామివారికి మనవిచేసి వారి నొక సారి తీసుకు రారా" అని. వాడొచ్చి చెపితే "ఆయన్నే రమ్మను" అన్నారు స్వామివారు.

ఆ డ్రైవరుకి ఆశ్చర్యం వేసింది. "షావుకారు చెన్నయ్యగారు కబురుచేస్తే కదలడు, ఇదెక్కడి అయోమయం స్వామిరా బాబూ" అనుకున్నాడు. స్వామివారన్న మాట షావుకారుతో చెప్పాడు. ఏంచేస్తాడు? ఆయనే కార్లో బయలుదేరాడు. ఎవడికోసం? కారు కెసరే ఆశ్రమం దగ్గర ఆగింది.

"అరేయ్, నేను దిగి లోపలికి రాలేనని చెప్పి రారా. వారినే వచ్చి ప్రసాదం యివ్వమని ప్రార్థించు" అని డ్రైవర్ని లోపలికి పంపా డాయన. డ్రైవరు వెళ్ళి చెప్పాడు.

"నువ్వు ఒక అడుగు వేయి, నేను పది అడుగు లేస్తాను" ఇది కదా స్వామివారి ప్రతిజ్ఞ. స్వామివారు విచిత్రంగా నవ్వి, లేచి వెళ్ళి గడపదగ్గర నుంచున్నారు. కార్లో వేళ్ళాడి పోతున్న చెన్నయ్యగారు గణపతిస్వామివార్ని చూశాడు. అదే మొదటిసారి చూడటం. ఏమయిందో తెలియదు. ఉన్నట్టుండి బడబడా కారు తలుపు తెరుచుకొని, పరుగున వచ్చి స్వామి పాదాల దగ్గర సాష్టాంగవందనం చేసి నిలబడ్డాడు.

డ్రైవరు తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. ఇందాకటి నుంచి వున్న నీరసం నటనా? లేక యిప్పటి ఓపిక నటనా? అయినా యిలా రోడ్డు మీద బోర్లాపడి నమస్కారం చేస్తున్నాడు. ఈయిన కేమైంది? అంతుపట్టలేదు డ్రైవరుకి.

ఆ తరువాత షావుకారు చెన్నయ్యగారు రాజు వెనక బంట్లలే నడుస్తూ, స్వామివారి వెంట లోపలికి వెళ్ళాడు. ప్రసాదం పుచ్చుకొన్నాడు. అప్పటి నుంచీ హాయిగా తిరుగుతూ వీలయినపుడు ఆశ్రమానికి వచ్చి పోతున్నాడు.

ఆ తరువాత బన్నిమటం అనే పేటలో వున్న ఆంజనేయస్వామి గుడిలో ఉత్సవాలు చేయిస్తూ స్వామివారి సంకీర్తన యేర్పాటు చేశాడు యీ చెన్నయ్యగారు. ఆ సందర్భంలో స్వామివారు ఆయిన కొక పంచలోహ ఆంజనేయ విగ్రహం సృష్టించి యిచ్చారు.

* * *

ఆ రోజుల్లో కార్యక్రమాలు యింత ముమ్మరంగా జరుగుతున్నా, సంపన్నులు విరివిగా వస్తున్నా, వాళ్ళకి కెమెరాలున్నా, ఎవరికీ ఫొటోలు తీసేందుకు అనుమతి లేదు. ఒక రోజున కొందరు భక్తులు స్వామివారు నలుగురిలో కూర్చుని మాట్లాడుతున్నపుడు చటుక్కున నాలుగు క్లిక్‌లు లాగేసి గప్‌చిప్‌గా వూరుకున్నారు. స్వామివారు గూడా ఏమీ అనలేదు. స్వామివారి చుట్టూ కూర్చున్నవారిలో జానకీరామ మందిరం సుబ్బారావుగారు గూడా వున్నాడు.

వీరందరికీ స్వామివారితో కూర్చుని ఫొటోలు తీయించుకునే అదృష్టం హఠాత్తుగా దక్కిందని చాలా సంతోషమై ఆ ఫొటో తీసిన భక్తుణ్ణి తెగ మెచ్చుకొని అందరూ తలో కాపీకి ఆర్డరిచ్చారు. తీరా ఫొటో ప్రింటు అయినాక అందరూ తెల్లమొహం వేశారు. అందులో అందరి బొమ్మలూ బాగానే వున్నాయి. స్వామివారు ఉన్నచోట మాత్రం పెద్ద తెల్లని సున్నా వుంది, పూర్ణచంద్రుడి లాగా.

స్వామివారికి చెప్పారు. "పోనీ యింకోసారి ప్రయత్నించుకో" అన్నారు స్వామి. మళ్ళీ గ్రూపు ఫొటో తీశారు. మళ్ళీ యిదే కథ. దాంతో ఆ ఫొటోగ్రాఫర్‌కి స్వామివారి కాళ్ళ మీద పడక తప్ప లేదు. అప్పుడు స్వామివారు ఆ కెమెరా మీద [illegible] చల్లి "యిప్పుడు తీయి ఫొటోలు" అన్నారు. ఈమాటు ఫొటో [illegible]

అలా తీసిన మొట్టమొదటి ఫోటోలలో ఒక దానిమీద "సత్యనారాయణ" అని సంతకం చేసి "పూజలో పెట్టుకో" అని జానకిరామ మందిరం సుబ్బారావుగారికి యిచ్చారు స్వామివారు.

ఆ రోజుల్లో స్వామివారి కార్యక్రమాలు ముమ్మరం అయిపోతున్న కొద్దీ కృష్ణమూర్తిగార్కి ఒక సందేహం పెరగసాగింది. "స్వామివారు ఎవడికి పడితే వాడికి నేను చూసుకుంటాను పొమ్మంటున్నారు. ఇక్కడ చూడబోతే కార్యక్రమాలు పెరిగిపోతున్నై. ఇదికాక సంచారం పెరుగుతోంది. ఇదెలా కుదుషతుందబ్బా? ఈ వ్యవహారం చివరికి ఏదైనా ప్రమాదంలోకి దిగుతుందేమో" అని.

పైకి అంటే బాగుండదని వూరుకొన్నాడు.

ఇంతలో ఒక రోజున రాత్రి స్వామి దర్శనం చేసుకొని "అయ్యా నాకు ఫలానా చిక్కు వ్యవహారం వుంది. మీరు ఆశీర్వదించాలి" అన్నాడాయన.

"అయితే రేపు పొద్దున పావు తక్కువ ఎనిమిదింటికి రా. ఒకసారి దర్శనం చేసుకు వెళుదువు గాని" అన్నారు స్వామివారు.

కృష్ణమూర్తిగారు రోజూ పొద్దున పూట దర్శనం చేస్తాడు. రేపు కుదురుతుందో కుదరదో అనే అనుమానం ముందుగా వచ్చింది. కాని స్వామివారు రమ్మంటున్నారు గనుక సరే అని వెళ్ళిపోయాడు.

మర్నాడు పొద్దున ఆయన సరిగా సమయానికి వచ్చాడు. కానీ ఇల్లు తాళం పెట్టి వుంది. వాకిట్లో ఒక ముసలావిడ కూర్చుని వుంది. ఆవిడ, స్వామివారు ఒంటె కుప్పల పోస్టు మాస్టరు గారింటికి పాద పూజకు వెళ్ళారని చెప్పింది.

"అంటే పూర్వం స్వామివారి మీద అధికారిగా వున్న పోస్టుమాస్టరు గారింటి కన్న మాట! సరె మన పని అయ్యే యోగం లేదేమో" అనుకుంటూ సైకిలు దగ్గరకు వెళ్ళిపోయాడు కృష్ణమూర్తిగారు. ఇంతలో వెనకాల నుంచి ఎవరో పిలుస్తున్నట్టు తోస్తే వెనక్కి చూశాడు.

ఆశ్చర్యం! ఇంటిలో కిటికీ దగ్గర స్వామివారు నిలబడి వున్నారు! భుజాలమీద శాలువా కప్పుకొని మకుటం ధరించి వున్నారు!! రెండు చేతులూ ఎత్తి ఆశీర్వాద ముద్రని వ్యగ్రంగా ధరించి వున్నారు. సంతోషంగా దగ్గరకు వెళ్ళాడు కృష్ణమూర్తిగారు.

"దర్శన మయిందా? తృప్తేనా?" అన్నారు స్వామివారు.

సంతోషంతో తృప్తితో వెళ్ళిపోయాడు కృష్ణమూర్తిగారు. పని చక్కగా జరిగింది. ఆ సాయంత్రం విచారిస్తే, స్వామి ఉదయం ఏడుగంటల నుండి పదింటి దాకా, ఒంట కుప్పల లోనే వున్నారని, అదే శాలువా ధరించి వున్నారని తెలిసింది.

దాంతో వీరికి ఆశ్చర్యం పట్టశక్యంకాక స్వామివారి దగ్గరకు వెళ్ళి "స్వామీ! మీరు ఒంటికుప్పలలో పదిమందిలో కూర్చుని వుండగా యిక్కడ నాకు దర్శనం ఎలా యిచ్చా రండీ" అని అడిగాడు.

స్వామివారు నవ్వి, "పడిమందిలో కూచుని గూడ యిక్కడకు రావచ్చు గానీ. ఇప్పుడది యింకా వాడుకలో పెట్టలేదు. ఈ మాట ఏంచేశానంటే పని వున్నట్టు ఒంటికప్పలలో బాత్ రూము లోనికి వెళ్ళాను. అక్కడినుంచి నీ దగ్గరకు వచ్చి, మళ్ళీ అక్కడే కెళ్ళి, బాత్ రూము లోంచి హాల్లోకి వెళ్లాను" అని చెప్పారు. స్వామివారికి తనపై ఎంత అనుగ్రహమో అని సంతోషించాడు కృష్ణమూర్తి గారు.

అయితే ఆ సంవత్సరమే కృష్ణమూర్తిగారి కోసం ఇంతకన్నా క్లిష్టమయిన పని వొకటి చేశారు స్వామివారు.

కృష్ణమూర్తిగారు రెవిన్యూ శాఖకు చెందిన పరీక్షలకు కట్టాడు. కానీ సరిగ్గా చదవలేదు. అందువల్ల ఒక పేపరుకి మానేద్దామనుకున్నాడు. స్వామివారు వొద్దన్నారు. "ఆ పరీక్ష అయితే ప్రమోషను వస్తుంది. అశ్రద్ధ చేశావేమిటని" సన్న సన్నగా మందలించారు పైగా.

స్వామివారి మాట కాదనలేక నామమాత్రంగా పరీక్ష రాసి వచ్చాడు. ఆ మాటే స్వామివారికి చెప్పాడు. "నేను పాస్ చేసుకుంటాలే" అన్నారు స్వామివారు పరధ్యానంగా. అప్పటినుండి ప్రతి ఆదివారపు పూర్ణాహుతి సమయంలోనూ "నేను పాస్ చేసుకుంటాలె" అంటూనే వున్నారు.

రెండు నెలలయింది. ఆ ఆదివారంనాడు మాత్రం "నీ పరీక్ష ఫలితాల్లో కొంచెం ఇబ్బంది వచ్చింది. అందువల్ల ముందు వాటిని వాయిదా వేస్తున్నాము. మామూలుగా అయితే ప్రకృతికి విరుద్ధంగా పోరాదు. నీ విషయంలో వెళుతాను" అన్నారు స్వామివారు. అన్నట్టే పరీక్షా ఫలితాల ప్రకటన వాయిదా పడ్డదని ప్రకటించారు.

మరో పదిహేను రోజులయినాయి. ఆ ఆదివారంనాడు "నువ్వు అన్ని పేపర్లలోనూ పాసయ్యావు" అన్నారు స్వామివారు. పై వారం ఫలితాల జాబితా ఆఫీసులో బోర్డుకు వేళ్ళాడ కట్టారు. అందులో వీరి సంఖ్య దాని క్రమస్థానంలో కాక, జాబితా చిట్టచివర వుంది. వీరి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. అనతికాలంలోనే వీరికి శిరస్తాదారు పదవి లభించింది.

* * *

బెంగుళూరునుంచి వచ్చి, స్వామివార్ని సేవించుకొంటున్న భక్తులలో వాసుదేవమూర్తి గారొకరు. ఆయన స్వామివారికి ప్రీతిపాత్రులుగా వుండి, విశేషసేవ చేస్తూ వుండేవాడు. ఆయినది హోల్ సేల్ కాఫీ వ్యాపారం. మరో కాఫీ వ్యాపారి విష్ణు కాఫీ వర్క్సు అధినేత అనంతరాము గారు గూడా స్వామివారి బెంగుళూరు భక్తుడే. వారిద్దరూ ఒకసారి స్వామివార్ని, తమ యిళ్ళకు పాదపూజకు, భిక్షకు రమ్మని పట్టుపట్టారు.

ఒక రోజున కార్యక్రమం నిర్ణయించుకొని వాసుదేవ మూర్తిగారి కార్లో, బెంగుళూరు బయలుదేరారు స్వామివారు. ఆ కార్లో కృష్ణమూర్తిగారు గూడా వున్నారు. వాసుదేవమూర్తి గారే కారు నడుపుతున్నాడు కాని ఆయన ఏదో దీర్ఘాలోచనలో సతమతమవుతున్నాడు

దార్లో ఒక ఆంజనేయస్వామి ఆలయం కనిపించింది. వాసుదేవమూర్తిగారు కారు ఆపి వెళ్ళి ఆంజనేయస్వామికి హారతి యిచ్చి వచ్చి, యిక ధైర్యం పుంజుకున్నాడు కాబోలు మెల్లగా స్వామివారితో చెప్పసాగాడు.

"స్వామీ, మేము మధ్వులం, మీకు తెలుసు కదండి. మా నాన్నగారు వృద్ధులు. పూర్తిగా పూర్వాచారం, కొంచెం చాదస్తం ఎక్కువ. ఆయనకు స్మార్తులంటే బొత్తిగా గిట్టదు. ఎంతటి వాళ్ళు వచ్చినా నమస్కరించడు సరిగదా, చూడను గూడ చూడడు. నా పద్ధతి నేరుసుకోండి. అయితే నా పద్ధతి ఆయనకు గిట్టదు. తమలాంటి వారెవరైనా యింటికి వస్తే ఆయన వెళ్ళిపోయి అప్పుడే హాలులో కూర్చుంటాడు. ఎవరొచ్చినా అంతే. పూర్వం శృంగేరీ స్వాముల వార్ని పిలిచినపుడు గూడ యిలాగే చేశాడాయన అహ....ఏమీ కాదు. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, ఇంటికి వెళ్ళాక మా నాన్నగారు రాలేదేమని తపురనుకుంటా రేమోనని!"

వాసుదేవమూర్తిగారు ఆంజనేయస్వామికి హారతిచ్చి, ధైర్యం సంపాదించుకోవలసినంత పని ఏమొచ్చిందో బాగా అర్థమైంది కృష్ణమూర్తిగారికి. స్వామివారు వాసుదేవమూర్తి చేతులో ఒక ఆంజనేయస్వామి విగ్రహం పెట్టారు. మధ్వులకు ఆంజనేయుడు ప్రధాన దైవం. వాసుదేవమూర్తిగారు ఆనందపడ్డారు, ఆశ్చర్యపోయారు.

"అబ్బే నాకలాంటి వేవీలేవు. అయితే ఏమయినా తమాషా జరిగితే ఇప్పుడాశ్చర్య పోయినట్టు మరోసారి ఆశ్చర్యపోకు" అన్నారు స్వామివారు చమత్కరిస్తూ.

ఇక్కడితో భారం దిగి వాసుదేవమూర్తిగారి ముఖం తేలిక పడ్డది. కాని స్వామివారి ముఖం మాత్రం ఆలోచనాముద్రలో పడిపోయింది.

"ఏ, ఏమి భేదాలివి ? ఎక్కడ చూసినా భేదాలే ! త్రిమతాల సిద్ధాంతాలలో భేదాలు యే స్థాయి మాటలు ? ఆ స్థాయికి చేరినవాడెవడున్నాడు ? చేరినవాడు సర్వగుణమయుడై, వివాదాలకు అతీతంగానే వుంటాడు. ఇక లోక సామాన్యంగా, స్మార్తుడైనా, వైష్ణవుడైనా, మధ్వుడైనా చేసేదే ఉపచారమాత్రమైన ఉపాసన. అదిగూడ ప్రతీకమయమైన ఉపాసన. దానిలో మాత్రం యే మాత్రం పట్టు దొరికిందని ? భక్తి యోగ స్థాయి యింకా ఎంత దూరంలో వుంది వీరందరికీ ? అయినా హృదయమంతా భేదభావనా కల్లోలమే !

దనివల్ల రెండు నష్టాలు వస్తున్నాయని ఈ అమాయకులు గ్రహించటంలేదు. ఒకటి వీరి ఉపాసన తమోరజస్సులను దాటి పైకి పోవటంలేదు. రెండవది సమాజంలో చీలిక లేర్పడి సనాతన ధర్మపు అస్తిత్వానికి దెబ్బ తగులుతోంది.

ఒకవైపు నాస్తిక వాదాలు పెరుగుతున్నాయి. మరోవైపు విస్తరిస్తున్న విజ్ఞాన శాస్త్ర మంతా నాస్తికాన్నే బలపరుస్తోందని భ్రమపడే ప్రబుద్ధులు విర్రవీగుతున్నారు. మరొక వైపు

ప్రభుత్వం ధర్మ విషయాలలో ఔదాసీన్యం వహిస్తోంది. వీలుగా వున్న చోట్ల వ్యతిరేకిస్తోంది గూడా.

ఇటు సనాతనులలో యెక్కువమంది పుస్తక పాండిత్యం వారూ, విద్యాహంకారపు వారూ తప్ప, మంత్ర బలాన్ని నిరూపింపగల వీర్యవంతులు గాని, చెడిపోతున్న తమ్ముళ్ళను చేయి పట్టుకొని యింటికి తెద్దామనుకునే విశాల హృదయులు గానీ కనిపించటమే లేదు, అక్కడొకరు అక్కడొకడు తప్పితే ఈ భేద భావుకులు, ఆత్మహాని, ధర్మ హాని గూడా చేసుకుంటున్నారు. ఏ పేరుతో ? ? ధర్మాభినివేశం పేరుతో ! అదీ విచిత్రం ! !

ఇప్పుడు, వాసుదేవమూర్తి తండ్రి చదువుకున్న వాడు, అనుష్ఠానశీలి. జనం లెక్కలో స్థాయి గలవాడు. తనకంటె చిన్న వాళ్ళకు అనేక మందికి ఆదర్శజీవి. ఈయనకి, శృంగేరీ స్వామిని దర్శిస్తేనే చెడిపోతాననే దురాగ్రహం తప్పటంలేదు.

ఒకరికి ఒక దేవత పరదేవత అయితే, మరొకరికి ఆ దేవత స్మరణమే పాతిత్య హేతువు. ఒకరి గుళ్ళలోకి మరొకరు వెళ్ళరు. ఈ దుస్థితి పోవాలంటే సనాతనమైన, త్రిమూర్తి భావన వీరిలో వికసించాలి. త్రిమతాలవారు సమానంగా ఆదరించదగ్గ దేవతా ఆలయాలు ప్రపంచంలో విస్తరిల్లాలి. ఆ త్రిమూర్తి తత్త్వ దర్శనం అందరిలో అందుబాటులోకి రావాలి.

ఏంచెయ్యాలి దీనికి ?

ఏదో చెయ్యాలి. ఈయన కొక్కడికే కాదు, ఈ దురూహలో వున్న వారందరి చెవులకూ ఒకసారి శంఖం వూది వినిపించాలి. ఈ ఆలోచన త్రిమతాలలోని పెద్దలందరికీ సమ్మతమే. స్థాయిగలిగి, మెట్లెక్కి, మేడమీద నుంచి చూడగల త్రిమతాధిపతు లందరికీ సమ్మతమే. అయితే చొరవ తీసుకొని, ఈ సమన్వయ శంఖాన్ని ఊదవలసిన ఆవశ్యకత, అగత్యం, తరుణం యిప్పుడు వచ్చేసింది.

స్వామివారి ఆలోచనలు సాగుతుండగానే అనంతరాముగారి యిల్లు దగ్గరకొచ్చేసింది. అక్కడ స్వామివారికి పాదపూజ జరుగుతుండగా, తమ యింట్లో జరగవలసిన ఏర్పాట్లు చూసుకోవటానికి వాసుదేవమూర్తిగారు ముందుగా వెళ్ళిపోయారు.

స్వామివారు వారింటికి చేరేసరికి, మూర్తిగారి తండ్రి వాకిట్లో అరుగుమీద కూర్చుని, భగవద్గీత చదువుకుంటున్నాడు. వాకిట్లో కారు చూడంగానే, విషయం అర్థమైపోయి, ధుమ ధుమ లాడుతూ, వెనకాల అవుట్ హౌసులోకి వెళ్ళిపోయా డాయన.

మూర్తిగారు పూర్ణకుంభాది మర్యాదలతో స్వామివార్ని లోపలికి తీసుకెళ్లారు. పాదపూజ అయింది. ఉన్నట్టుండి స్వామివారు ఉచ్చైస్స్వరంతో అద్భుతమైన తన ప్రత్యేక రాగశైలిలో రామాయణ శ్లోకాలు గానం చెయ్యసాగారు.

పక్క వాద్యాలూ వగైరా యేమీ లేవు. అది పాటగానూ లేదు. కాని అది శరీరంలోని నాడీతంత్రుల మీద వీణ వాయిస్తున్న అద్భుతగానం. ఇంతవరకూ విన్న సంకీర్తనలొక యెత్తు, ఈ శ్లోక పరనం ఒక యెత్తు అనుకుంటున్నారు కృష్ణమూర్తిగారు, వాసుదేవమూర్తిగారు. అక్కడున్న వారంతా పరవశులై వింటున్నారు.

ఇంతలో వాసుదేవమూర్తిగారి తండ్రిగారు పరుగు పరుగున అక్కడికి వచ్చి శ్లోకాలు వినసాగాడు. ఆయన రాగానే ఆపేశారు స్వామివారు. ముసలాయన కళ్ళల్లో నీరు జలజల రాలుతుండగా వచ్చి స్వామివారి పాదాల మీద వ్రాలాడు. "ఒక్కసారి మా పూజా మందిరంలో అడుగుపెట్టండి" అని దీనంగా ప్రార్థించాడు.

"సరే" అని లోపలికి వెళ్ళారు స్వామివారు. అక్కడ స్వామివారే దేవుడికి హారతి యిచ్చారు. తరువాత బయటకు వచ్చి కాసేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడసాగారు. ఆ ముసలాయన అక్కడే కూర్చున్నాడు.

చివరికి స్వామివారు బయలుదేరటానికి లేచి నుంచున్నారు. ఈమాటు ఒక్క ఉదుటున స్వామి పాదాల మీద పడి వదలకుండా పట్టుకున్నాడు ముసలాయన. "స్వామీ! నాకు ముక్తి ప్రసాదించండి" అని బావురుమనసాగాడు. స్వామి మందహాస పూర్వకంగా ఆయనను వోదార్చి బయలుదేరి వచ్చేశారు.

* * *

ఒక రోజు సీతమ్మగారనే పాత భక్తురాలితో కలసి ఒక పెద్ద ముత్తైదువ స్వామివారి దర్శనానికి వచ్చింది. ఆవిడను చూస్తూనే ఏదో ప్రాణం లేచి వచ్చినట్లుగా పలకరించారు స్వామివారు. "వచ్చావా అమ్మా, రా రా, శంకరలింగ భగవానులు యిక్కడ వున్నారని నీ కెలా తెలిసిందమ్మా"—అంటూ.

ఈ అసందర్భపు మాటలకు పక్కనున్న వాళ్ళలో పెద్దవాళ్ళు అసలే ఆశ్చర్యపోతుంటే ఆ వచ్చిన పెద్ద ముత్తైదువ ధారాపాతంగా కన్నీళ్ళు కారుస్తూ స్వామివారి పాదాలమీద పడిపోయింది. "భగవాన్, భగవాన్, దర్శన మిచ్చావా" అంటూ. పెద్దవాళ్ళు ఆశ్చర్య పడటానికి కారణం వుంది.

కర్నాటకంలోని హరిహర క్షేత్రమైన మల్లెచెన్నూరులో శృంగేరీ పీఠపు ఉపపీఠం ఒకటి వుంది. రంగనాథ ఆశ్రమం అంటారు దాన్ని. ఆ పీఠానికి ఇప్పుడున్న పీఠాధిపతికి పైవారి పేరు శంకరలింగ భగవానులు. వారు దత్తాత్రేయోపాసనలో సిద్ధులై దాదాపు వంద ఏళ్ళు జీవించి, అనేక మహత్తులు ప్రదర్శించి, సుప్రసిద్ధులై పరమపదించారు. అది గూడా ఈ మధ్యే పదేళ్ళలోపు. ఆ వందేళ్ళు, శంకరలింగ భగవానులకూ, వీరికీ సంబంధమేమిటో పెద్దలకు అర్థం కావటం లేదు.

ఈ వచ్చినావిడ అంత ధారాపాతంగా ఏడవవలసిన పనేమి వచ్చిందో అని విచారించారు అక్కడివారు.

ఆవిడ కథ యిది :

ఆవిడ పేరు శారదమ్మ. ఆవిడ పుట్టినింటివారు, మెట్టినింటివారు గూడ శంకరలింగ భగవానుల శిష్యులే. ఈవిడ గూడ వారి సేవ చేసింది. 1956లో బాగా వృద్ధులై వున్నపుడు ఒకరోజున వారు ఈవిడతో, "పదేళ్ళ తరవాత ఇరవై ఏళ్ళ బాల రూపంలో నేను నీకు కనిపిస్తాను" అని చెప్పారట. ఆ మాట అర్థం కాక గల్లంతు పడిపోయిందావిడ. ఒకవేళ వారు శరీరం చాలించి మరో శరీరం తీసుకుంటారనుకున్నా, పదేళ్ళలో ఇరవైయేళ్ళ వారెలా అవుతారో ఈవిడకు అంతుబట్టలేదు. అడిగితే "అదంతా నీకెందుకు" పొమ్మన్నారు భగవానుల వారు. తరువాత వారు శరీరం త్యజించారు.

ఇవాళ అనుకోకుండా ఇక్కడికి వచ్చింది. ఈవిడ వస్తుండగానే 'నేనే శంకరలింగ భగవానులను' అని యీ బాలకుడు చెప్తుంటే, ఆవిడ కరిగి కన్నీరు కాక మరే మవుతుంది? అప్పటినుంచీ వీలున్నపుడల్లా ఆవిడ స్వామివారి దర్శనం చేస్తూనే వుంది.

స్వామివారిలో అయ్యప్పను చూసిన వారున్నారు. షిరిడీ సాయిని చూసిన వారున్నారు. స్వామివారు స్వయంగా తన పూర్వపు అంగ విభూతులలో ఒక దానిని ప్రకటంగా చెప్పుకున్న మొదటి సందర్భ మిది.

*                    *                    *

పిల్లలకు, దివ్యనామ సంకీర్తనలో శిక్షణ యిచ్చి వాళ్ళను తయారుచేసి, తన సంకీర్తన సమయంలో వీళ్ళని వంతపాటగాళ్ళుగా పెట్టుకొనే విధానం గూడ ఆ తొలినాళ్ళలోనే స్వామి వారు ప్రారంభించారు. జానకీరామమందిరం వారి పిల్లలు రావటం మొదలు పెట్టిన దగ్గరనుంచీ అది మరీ పెరిగింది. స్వల్పంగా సంగీత దృష్టివున్న పిల్లలందరూ స్వామి దగ్గర తరిఫీదయి త్వరలోనే సంకీర్తనా విధానంలో ఆరితేరుతుండే వారు.

ఒకసారి స్వామివారు ధ్యాన నిమగ్నులై, మౌనంగా వుండిపోయిన సమయంలో యీ పిల్లలే నిరంతర సంకీర్తన చేసి ఆదివారం హోమ సభలను రక్తి కట్టిస్తూ వుండేవారు.

అయితే ఒకోసారి యీ పిల్లల సంకీర్తనకే పరవశించి, స్వామి సమాధిలోకి జారిపోయిన ఘటనలుగూడ ఆ రోజుల్లో అరుదు కాదు.

ఒక రోజు, ఆ జానకీరామమందిరం పిల్లలు బుల్‌బుల్, తరంగ్, మాండలిన్, తబలా వాద్య సమ్మేళనంతో నాగస్వరం వాయించసాగారు. ఈ మధ్యలోనే యెప్పుడో స్వామి వారికి స్మృతిపోయింది. కొంతసేపయ్యేసరికి ప్రజల్లో గాభరా బయలుదేరింది. ఒకగంట అయ్యాక ఉత్థానంలోకి వచ్చారు స్వామివారు. అప్పుడు ఆ పిల్లలను అభినందిస్తూ "నే నిప్పుడు నాగ లోకానికి వెళ్ళి వచ్చాను" అని చెప్పారు.

స్వామివార్ని సమాధిలోకి తీసుకు వెళ్ళటానికి, సమాధిలో వుంటే ఉత్థానంలోకి పిలవ టానికి గూడ శక్తిగల వాడు, సుప్రసిద్ధ వాయులీన విద్వాంసుడు చౌడప్పగారే. ఆయన సంగీతం

వల్ల అలాంటి సంఘటన లెన్నో జరిగినాయి. ఒకసారి బెంగుళూరులో వాసుదేవమూర్తి గారింట్లో సంకీర్తన జరిగింది. చాలామంది జనం వచ్చారు. అక్కడికి చౌడప్ప గారు గూడ వచ్చారు. సభలోకి వచ్చి కూర్చుని స్వామివారు చంద్రశేఖరయ్యను పిలిచి " జై కపీశా! " పాట పాడ మన్నారు. ఆయన పాడుతుండగా స్వామివారు సమాధిలోకి వెళ్ళిపోయారు.

ఆ రోజుల్లో స్వామివారు సమాధిలోకి వెళ్ళటం చాలా తరచుగా జరిగేది. రోజులో అనేక గంటలు సమాదిలోనే గడిచిపోయేది. అంచేత అది కొత్త కాదుగాని, ఇలా బహిరంగ సభలో జరగటం కొత్తగా వుంది. దానికి తోడు సుమారు గంట అవుతున్నా స్వామివారు స్మృతిలోకి రాలేదు. అప్పుడు చంద్రశేఖరయ్య చౌడప్పగారి దగ్గరకు వెళ్ళి " మీరేదయినా చెయ్యండి " అని అడిగారు.

ఆయన ఫిడేలు తీసి ఒక రాగం వాయించారు. ఒక అయిదు నిముషాలయ్యేసరికి స్వామి వారు లేచారు. మిగిలిన సభ చక్కగా జరిగిపోయింది.

చౌడప్ప గారికి యింత ప్రజ్ఞ వుంది గనుకే స్వామివారికి కొంచెం శరీరంలో అస్వస్థత వస్తే మందు వేసుకోక, చౌడప్పగారిని పిలిపించి, ఏవేవో రాగాలు వాయింపించి వినేవారు. తరువాత, తరువాత, స్వామివారే స్వయంగా ఆయనింటికి వెళ్ళి రాత్రిళ్ళు అక్కడ గడిపి రావటం గూడ జరిగింది.

చౌడప్ప గారి యింట్లో మంచి పూజ గది వుండేది. స్వామివారు యింటికి వచ్చారంటే, యిద్దరూ ఆ పూజ గదిలోకి వెళ్ళి తలుపు వేసుకొని, కూర్చునేవారు. మళ్ళీ యివతలకు రావటం తెల్లవారుజామునే. అలా స్వామివారు వచ్చిన రోజున, " నేను సంగీతంలో ఇంకొక మెట్టు పైకెక్కాను " అని చెపుతూ వుండేవారు చౌడప్ప గారు.

స్వామివారు తమ ప్రచురణ కార్యక్రమాలకు అంకురార్పణ జరిపించిన చిక్కర్సు గారి యింటికి మొట్టమొదటిసారిగా పాదపూజకు వెళ్ళినపుడు, వాళ్ళు చౌడప్పగారి కచేరీ ఏర్పాటు చేశారు.

అర్సు గారు, చౌడప్ప గారి కచేరీ పెట్టించగలంత ధనవంతుడు కాదు గానీ, చౌడప్ప గారికీ, అర్సు గారి కుటుంబానికీ బాగా స్నేహం వుండేది. ఆ స్నేహాన్ని, స్వామివారి యందున్న భక్తిని పురస్కరించుకొని కచేరీకి అంగీకరించాడు చౌడప్ప గారు.

ఆ పాదపూజ రాత్రి ఏడుగంటలకు ఏర్పాటు చేశారు. తీరా స్వామివారు వచ్చేసరికి కరెంటు పోయింది. అక్కడ స్వామివారు చౌడప్ప గార్ని ఒక ప్రత్యేక రాగం* వాయించమని ఆదేశించారు. వారు వాయించారు. అయిదు నిముషాల్లో కరెంటు వచ్చింది.

---

* ఆ రాగం పేరు సంధ్యారాగమని చిక్కర్సుగారికి గుర్తు కాని, గట్టిగా చెప్పలేక పోతున్నారు. ఆ రాగానికి దీపాలను వెలిగించే శక్తి వుందని స్వామివారు అన్నారుట।

స్వామివారికి మనస్సు కరిగిపోయే సంగీత కచేరీ జరిగితే ఆ సమయంలో వారి వొంటి మీద పాములు కనిపించేవి. అలాంటి సందర్భాలలో వారి మెళ్లోనో, వొళ్లోనో, మోకాళ్ళ మీదో, తల చుట్టూనో పాములు పాకుతూ వుండేవి.

చౌడప్పగారి కచేరీలలో అనేకసార్లు అలా జరిగింది. అంజనప్పగారి కచేరీలో గూడ ఒకసారి అలా జరిగింది.

అయితే ఈ నాగ దర్శనానికీ, సంగీత కచేరీలకీ అవినాభావసంబంధం అనుకునేందుకు లేదు. ఆ రోజుల్లోనే ఒక రోజున జానకీరామమందిరం వారి 'గురు' అనే పిల్లవాడు స్వామి వారికి వీపుమీద నూనె మర్దన చేస్తూ వుండగా వాడి చేతిలోకి ఒక పాము వచ్చింది. (ఆ పిల్లవాడు తబలా వాద్యగాడు) వాడు కంగారుపడి పాము పామని కేక వేశాడు.

"ఏం నేడు లే వూరుకోరా" అంటూ స్వామివారు వాడిని సముదాయించారు. పాము మాయమయిపోయింది.

* * *

మరొక రోజున స్వామివారు, చంద్రశేఖరయ్యగారు, శ్రీకంఠయ్యగారు ముగ్గురూ కూర్చుని ఇంట్లోనే హోమం చేస్తున్నారు. సామాన్యంగా అర్ధరాత్రిళ్ళు ఉన్నట్టుండి చేసే హోమాలు మాత్రం స్వామివారు ఒక్కరే చేసేవారు. పగలు హోమం చేస్తే చంద్రశేఖరయ్య గారు కానీ, శ్రీకంఠయ్యగారు కానీ వుంటే వారిని గూడా కూర్చోపెట్టేవారు. అది మామూలే.

ఆ రోజు హోమంలో ఏం మంత్రం చెప్పారో ఏమోగాని ఆ మంటల సెగ దుర్భరం అయిపోయింది.

చంద్రశేఖరయ్యగారు, శ్రీకంఠయ్యగారు మెల్లి మెల్లిగా వెనక్కి జరిగి జరిగి, హోమగుండం అందని దూరానికి వచ్చారు. స్వామివారు మాత్రం అలాగే కదలకుండా ఉండిపోయారు. అయితే ఇంతలో స్వామివారు కనిపించటం మానేసి ఆ చోటులో ఒక పెద్ద నాగుపాము పడగ విప్పుకొని నిలచి వుంది. అలా ఆ నాగేశ్వరుడు కొద్దిసేపు ఉండేసరికి ఆ అగ్నిహోత్రుడి సెగ తగ్గింది. స్వాములవారు మామూలుగా కనిపించారు.

ఆ రోజుల్లో స్వామివారి పూజా విధానం, సంకీర్తనా గూడా ఒకోసారి వింతగానే వుండేవి.

సంకీర్తన సామాన్యంగా సుదీర్ఘంగా వుండేది. చిరతలు చేత బుచ్చుకొని కళ్ళు మూసుకొని తాను తన్మయత్వంలో పడి గంటల తరబడి సంకీర్తన చేసేవారు. అలా వారు సంకీర్తన చేస్తుండగా ఇక్కడ భక్తుల జేబుల్లో ఏవేవో విగ్రహాలు చేరుతూ వుండేవి. ఒకోసారి వారి ముందు రాలి పడేవి. ఆయన మాత్రం కళ్ళు తెరిచి చూసేవారు కాదు. ఒకసారి ఆయన చేతిబొటనవేలు, ఒక పక్కకు తిప్పితే విభూతి, మరో పక్కకు తిప్పితే కుంకుమ రాలి పడ్డాయి. ఇలా కాసేపు విభూతి కాసేపు కుంకుమలతో నాట్యం చేయించి హాస్యం చేశారు.

ఒకోసారి పూజ అయినాక పూలు దోసిళ్ళతో జనాల మీదికి చల్లేవారు. వారు చల్లేవి పూలేగాని నెత్తిన పడేవి పటిక బెల్లపు పలుకులు, బాదం పప్పులు వగైరాలు. కొన్నిసార్లు చిల్లర డబ్బులు గూడ పడ్డాయి.

ఒకోసారి జనం మధ్యలో ఎక్కడో కూర్చున్న వాణ్ణి పిలిచి, నీకు ఫలానా రోగం వుంది అని చెప్పి తగ్గించేవారు.

ఆ రోజుల్లో హారతి పళ్ళాలలోకి వచ్చిన డబ్బు మాత్రం లోపలికి తీసుకు వెళ్ళేవారు కాదు. ఎవరికో ఒక్కరికి ఇచ్చేసేవారు.

రోజూ పొద్దున్నే ఆరు గంటలకల్లా సూర్య స్తుతి చేయించేవారు.

* * *

ఆ రోజుల్లో కేరళ నుంచి ఇద్దరు దంపతులు వచ్చారు. ఇద్దరూ స్ఫురద్రూపులు. ముదిరిన వయస్సువారు. బాగా సంపన్నులని తెలుస్తూనే వుంది. ఆవిడ ఒంటిమీద నగలు విపరీతంగా వున్నాయి. వారిద్దరూ స్వామి దర్శనం చేసి, తాము చేసే పూజలూ, అనుష్టానాలూ గురించి చాలా సేపు చెప్పుకున్నారు. ఆ మాటలను పట్టి చూస్తే వాళ్ళు చాలా గొప్ప సాధకులు లాగానే వున్నారు.

కాని అదేమో! స్వామివారు వాళ్ళిద్దర్నీ తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి, బైటికి నడవం డన్నారు. వాళ్ళు చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయారు. చంద్రశేఖరయ్యను పిలిచి, "వాళ్ళు నీతిలేని మనుషులు. వాళ్ళు కూర్చున్న చోట ఫినాయిలు వేసి కడుగు" అన్నారు. కడిగించారు నిజంగానే.

"పూజలకన్నా నీతి అంత ముఖ్యం అన్నమాట"

* * *

శిరస్తదార్ కృష్ణమూర్తిగారి బంధువుకి T. B. వచ్చింది. వాళ్ళు ఒక ఆదివారం నాడు అతని ఆరోగ్యం కోసం హోమం చేయించారు.

అప్పట్లో హోమం చెయ్యటమంటే ఆశ్రమానికి డబ్బు కట్టి, చేతులు కట్టుకొని కూర్చోవటం కాదు. హోమానికి కావలసిన వస్తువులన్నీ తెచ్చియిచ్చి, యితర ఏర్పాట్లుగూడ దగ్గర వుండి చూసుకోవాలి.

కృష్ణమూర్తిగారు ఆ వివరాలన్నీ తెలిసినవాడే గదా! ఏ దెంత కావాలో అన్నీ ఆయనకు తెలుసు గదా! నెయ్యి కొలతగా డబ్బాలో తెచ్చాడాయన.

ఆ రోజు స్వామివారే హోమం చేశారు. చేస్తూ చేస్తూ, హోమం సగంలో వుండగానే ఆ డబ్బా ఖాళీ చేశారు. చేసి "కృష్ణమూర్తీ నెయ్యి" అన్నారు.

ఉన్నట్టుండి అపు నెయ్యి ఎక్కడ నుండి వస్తుంది? రాదంటే ఎటూకాకుండా హోమం ఏమవుతుంది? స్వామివారికి ఆగ్రహం వస్తే? అమ్మో, ఏం చెయ్యాలి?

వణికిపోయాడు కృష్ణమూర్తిగారు. ఏంచెయ్యాలో తెలీక ఆ ఖాళీ డబ్బా వంకే చూస్తున్నాడు. ఇంతలో ఏం జరిగిందోగాని ఆ డబ్బా అడుగు నుంచి నెయ్యి వూరుకొస్తోంది. నిమిషంలో డబ్బా నిండింది. ఊరటం ఆగింది. చిరునవ్వు నవ్వుతూ హోమం సాగించారు స్వామివారు.

"తెలుసు ననుకోటం తప్పు బాబూ, బుద్ధి వచ్చింది" అనుకుని తప్పు దిద్దుకున్నాడు కృష్ణమూర్తిగారు.

* * *

ఇలా బుద్ధి చెప్పుకున్నా మానవ బుద్ధి సామాన్యమైంది కాదు. ఒకసారి స్వామివారు ఈ కృష్ణమూర్తిగార్ని పిలిచి "కాస్త రవ్వకేసరి చేయించి పెడతావూ?" అన్నారు.

స్వామివారడగటమూ తను కాదనటమూనా? పైగా రవ్వకేసరి ఒక భాగ్యమా? అక్కడి నుంచి వో కుర్రవాడితో యింటికి కబురు చేశారు. "త్వరగా రవ్వకేసరి చేసి వుంచండి. ఒక అరగంటలో నేను స్వామివారిని తీసుకొని వస్తాను" అని.

"యింట్లో పరిస్థితి ఏమిటో? యిలా హుకుములు జారీ చేస్తే యెలా?" అన్నారు స్వామివారు.

ఇంట్లో అన్నీ వున్నాయి. అందులో తను నిన్ననే అయిదు కిలోల పంచదార యింటికి పంపాడు. ఇక లోటేమిటి? అందుకే "పర్వాలేదు స్వామీ" అన్నాడు నవ్వుతూ. సరే, వో గంటాగి స్వామివార్ని వెంటబెట్టుకొని యింటికి వెళ్ళాడు. వెళ్ళేటప్పటికి ఫలహారపు పళ్ళాలు ఎదురు చూస్తూ వుంటాయనుకొంటే—

"ఇంట్లో రవ్వ లేదు, పంచదార లేదు. తెచ్చేందుకు చేతిలో పిల్లలు లేరు" అని శుభవార్త ఎదురొచ్చింది.

నిన్న తను పంపించానన్న పంచదార యింకా యింటికి చేరలేదు. స్వామి పకపకా నవ్వసాగారు. దాంతో మరోసారి గర్వం దిగి కాళ్ళుపట్టుకు బతిమాలి స్వామివార్ని అక్కడ కూచోబెట్టి, కొట్టుకు పరిగెత్తి సరుకులు తెచ్చి కేసరి చేయించి పెట్టాడాయన.

ఏమయినా, స్వామివారు అంత వోపికగా కూర్చునే చల్లని రోజు అది !!

* * *

యోగశక్తి అనేక విచిత్రాలు చేయగలదు. యోగేశ్వరులైన సాధుపురుషులకు విశాల ప్రకృతి గూడా తన సర్వశక్తులను పాదాలకు కానుక పెట్టి సేవిస్తూ వుంటుంది. అయితే యేదో ఒక ప్రత్యేక ప్రయోజనం లేకపోతే మహాత్ములయినవారు ఆ శక్తిని వుపయోగించరు.

కృష్ణమూర్తిగారి తండ్రిగారింట్లో ఒకసారి హోమం జరుగుతోంది. అది రాత్రి సమయం. వర్షాకాలం. జనం చాలా అధికంగా వచ్చారు. యజమాని ఏర్పాట్లు గూడా విస్తారంగా

చేసుకున్నాడు. ఇంతలో మబ్బులు కమ్ముకొచ్చి చినుకులు పడసాగాయి. ఆ యింటికి ఒక లోపం వుంది. ఆ పొగగొట్టం దగ్గర ఏదో లోపం వుంది. వాన వస్తే నీళ్ళు పొయ్యిలో పడుతాయి.

ఇప్పుడు వంటలు మధ్యలో వున్నాయి. హోమం మొదలైంది. ఇప్పుడు వానవస్తే, హోమం ఆగదు గానీ, వంటలు ఆగిపోతాయి. వచ్చిన భక్తులు ప్రసాదం లేకుండా వెళ్ళిపోతారు. యజమాని దంపతులు బాధ పడిపోతున్నారు. స్వామిని మనస్సులోనే ప్రార్థిస్తున్నారు, "రక్షించు తండ్రీ" అని.

సభలోవున్న కృష్ణమూర్తిగార్ని దగ్గరకు పిలిచి, "కృష్ణమూర్తీ ! వాన పెరిగితే ప్రసాదాలు దెబ్బతింటాయి. ఏమంటావు ?" అన్నారు స్వామివారు.

"చిత్తం" అన్నాడు కృష్ణమూర్తిగారు.

"అందుకే వర్షం ఆపేస్తున్నాలే" అని స్వామివారు తన వంటిమీద వున్న శాలువాతీసి గాలిలో దులపసాగారు. అలా రెండు మూడు సార్లు దులిపి, మళ్ళావేసుకొన్నారు. ఒక అయిదు నిముషాల్లో మేఘాలన్నీ తలోదార్లో పరుగెత్తాయి. వాటి పిరికితనం చూసి నక్షత్రాలు పళ్ళికిలించి నవ్వసాగాయి.

*    *    *

ఒక రోజున జానకీ రామమందిరంవారి లీలకు ఉన్నట్టుండి ఏదో తెలియని బాధ బయలుదేరి, నోటినుండి నురుగు రాసాగింది. ఏంచెయ్యాలో తోచక స్వామివారి దగ్గరకు పరిగెత్తాడు సుబ్బారావుగారు. సమయానికి ఎవరిదో కారువుంది అక్కడ. ఆ కారులో స్వామివారు స్వయంగా వీరింటికి వచ్చారు. వస్తూనే ఆమె వీపుతట్టి, గ్లాసుతో నీళ్ళు తెప్పించి, లీలను గట్టిగా పుక్కిలించి ఉమ్మెయ్యమన్నారు. ఆమె అలా చేసింది. ఆమె వుమ్మేసిన నీళ్ళు, బాగా నీలంగా వున్నాయి. ఆ నీళ్ళు వుమ్మేసినాక లీలకు బాగా తేలికిచ్చింది.

"ఇప్పుడు యిక భయంలేదు, ఎవరో విషప్రయోగం చేశారు. నేను రావటం మంచిదైంది. లేకపోతే పిల్ల దక్కేది కాదు." అన్నారు స్వామివారు.

ఎవరికెప్పుడు ఏమి వస్తుందో, ఎలా రక్షించాలో వారికే తెలుసు. శరణాగతి చెయ్యటం వొక్కటే మనకు తెలిస్తే చాలు.

*    *    *

రక్షణ బాధ్యత అంటే సామాన్యంకాదు. బాధ్యత తీసుకున్న గురువు అనుక్షణం వెన్నంటి కాపాడుతాడు.

ఒకసారి ఈ లీలే సాయంత్రం పూట కెసరే వెళ్ళింది. స్వామివారు ఒంటికుప్పలలో హోమానికి వెళ్ళారు. కొంతసేపు ఎదురు చూసి, రాత్రి యేడయి పోయిందని ఇక బయలుదేరి, సిటీబస్సు స్టాప్ దగ్గర నుంచుంది. అది కాలేజీ ప్రాంతం. పైగా ఊరికి చివర. ఆ సమయంలో ఆడపిల్ల లక్కడ వొంటరిగా నిలబడటం క్షేమంకాక పోవచ్చు. కాని బస్సు ఎంతసేపటికీ

రావటంలేదు. ఒకపక్క భయంగా వుంది. ఇంతలో వెనకనించి స్వామివారి కంఠం వినిపించింది. "ఇదేమిటి యిక్కడున్నావు? " అని.

ఉలిక్కిపడి చూస్తే నిజంగానే స్వామివారు.

"ఈ వేళలో యిక్కడెందుకు నుంచోటం! గుర్రప్పు బండిలో పోరాదూ? సరే ముందీ ప్రసాదం తీసుకో " అని లీల చేతిలో ఒక విభూతి పొట్లం వేశారు. స్వామివారే అటు పోతున్న గుర్రపు బండిని పిలిచి, బేరం చేసి డబ్బులిచ్చి, లీల నెక్కమని తనూ ఎక్కారు.

ఇంక భయ మేముంది? హాయిగా కూర్చుంది లీల. కానీ, ఒకసారి తల అటు తిప్పి యిటు చూస్తే స్వామివారక్కడ లేరు. ఆశ్చర్యపోయి స్వామివారికి వెయ్యి దణ్ణాలు పెట్టుకుంటూ ఇంటికి చేరింది లీల. ఆ సమయంలో ఒంటికుప్పలలో ఆనందంగా జరుగుతున్న హోమంలో నిశ్చలంగా కూర్చునే వున్నారు స్వామివారు. [ ఈ మాటు బాత్‌రూమ్ ట్రిక్కు ఉపయోగించలేదు. ]

* * *

రక్షణ బాధ్యత అన్నాక, జట్కాలు మాట్లాడటమే కాదు, ఒకోసారి కోర్టుల చుట్టూ కూడా తిరగవలసి వస్తుంది.

R. T. C. లో పనిచేసే డ్రైవరొకడు స్వామి వారికి ప్రీతిపాత్రుడైన భక్తుడు. అతను నడుపు తున్న బస్సు, ఒకసారి యాక్సిడెంటు పాలయింది. "నా తప్పు లేదు మొర్రో" అని అధికారుల దగ్గర గోల పెట్టాడతను. అయినా సరే యెవర్నో ఒకర్ని సస్పెండు చేసి యాక్షన్ తీసుకోక పోతే రూల్సు వొప్పుకోవన్నారు అధికారులు. పెద్ద సంసారం, బీద బ్రతుకు. గతిలేక, స్వామి వారితో మనవి చేశాడు.

"అయ్యా, కేసు కోర్టులో వేశారు. అవతల పార్టీ ఏదో రాజకీయ పలుకుబడితో పట్టు పడుతోందట. రేపు విచారణ ప్రారంభం. ఆఫీసర్లు గూడా అటే వున్నారు. ఏమీ చెయ్యలేని పరిస్థితిగా వుంది " అన్నాడు.

"ఏం కాదులే " అని విభూతి పొట్లం చేతిలో వేశారు. ఈ విభూతి పొట్లాలు కట్టిన వారిలో అతనూ వున్నాడు. ఆ పొట్లం మొహాన పడేసి భయంలేదులే అంటే పోతుందా భయం?

స్వామివారు తన కోసం ఏ హోమమో చేస్తారేమో, ఏ వ్రతమైనా చేయిస్తారేమో అనుకుంటే ఏమీ చెప్పకుండా పొమ్మన్నారు. కనుక, యిక ఆశ వదులుకోవచ్చు అని నిర్ధారణ చేసుకొని మర్నాడు కోర్టు కెళ్ళాడు. కోర్టు వాకిట్లో చెట్టు కింద సాయంత్రం దాకా పడి వున్నాడు. కోర్టువారు పిలవలేదు. ఆశ్చర్యమైంది. రాత్రి వచ్చి ఇట్లా జరిగిందని స్వామి వారితో చెప్పాడు!

"నీ ఫైలు పోయిందిరా ఎక్కడికో " అన్నారు స్వామి.

మర్నాడు కోర్టులో విచారిస్తే స్వామివారు చెప్పింది నిజమేనని తేలింది. ఒకర్ని పోయిన ఫైలును తెప్పించి రక్షిస్తే, మరొకర్ని ఈ విధంగా రక్షించారు స్వామివారు! ఆ మాటకొస్తే రక్షణ బాధ్యత పెట్టుకొన్నాక భక్తుడి వెంట నీడల్లే తిరక్క తప్పదు. కాని యీ మాట చెపితే, నమ్మటం కష్టమే. అందుకే ఆ గృహస్థు మీద కోపం రాలేదు స్వామివారికి.

ఆ రోజు శనివారం ఒక యింట్లో పాదపూజ జరుగుతోంది. ఉన్నట్టుండి స్వామి చెవు లోంచి నెత్తురు ధారగా కారసాగింది. ఏమిటేమిటని కంగారు పడ్డారు, పూజ చేస్తున్న యజమాని.

"నా భక్తు డొకడు కాలుజారి పడ్డాడు. తల పగిలి నెత్తురు కారుతోంది. వాడిక స్పృహ తప్పి పోయింది. వాణ్ణి రక్షించటం కోసం కొంత బాధ నేను తీసుకున్నాను." అన్నారు స్వామి.

"మరి యింత సొంత డబ్బా అయితే, ఇక మనమేం చెపుతాం. చెవిలో ఏ పుండు పుందో ఏమో? గొప్పలకు పోయి, మందు వేసుకోక పోతే ఈయనకు ప్రమాదమస్తుంది. అయినా చెవిలోంచి నెత్తురు ధారగా వస్తుంటే మందులేం పనిచేస్తాయి. తక్షణం సర్జను దగ్గరికి పోవటం మంచిది." అనుకున్నాడాయన లోలోపల. ఇక పూజ చెయ్యలేక పోతున్నారు దంపతులు.

ఆయన అనుకున్న దాంట్లో దోషం వుందేమో కాని, ప్రేమగూడా వుంది. పైగా ఆయన సందేహంలో సబబు వుంది. లోక విరుద్ధంగా జరిగే సంఘటనను లోక సామాన్యులు అర్థం చేసుకోలేకపోతే అది పెద్ద దోషమా మరి? అందుకే స్వామివారు ఆగ్రహించలేదు. చెవుకి గుడ్డ అడ్డం పెట్టుకొని, బలవంత పెట్టి పూజ పూర్తి చేయించి, ప్రసాదం యిచ్చి "రేపు హోమానికి తప్పకుండా రా" అని చెప్పి వెళ్ళారు.

మర్నాడు ఈయన హోమం చేస్తే గదా అనుకొని, అసలు స్వామి వారెలా వున్నారో చూడటం మన ధర్మం. మనింట్లో పాదపూజలో ఇలా జరిగిందాయే! అనుకొని మర్నాడు వెళ్ళాడు.

స్వామివారు మంచి హుషారుగా వున్నారు. ఇదేమా అనుకొంటుండగానే, "నిన్న పడి తల బద్దలుకొట్టుకున్న వారెవరో లేచి నుంచోండి బాబూ" అన్నారు స్వామివారు హాస్యంగా. తలకు పెద్ద కట్టుతో నీరసంగా నిలబడ్డాడు జానకీరామ మందిరం సుబ్బారావుగారు.

"ఏం జరిగింది?" అన్నారు స్వామివారు. నిన్న ఆయన యింట్లో నడుస్తుండగా, తల తిరిగినట్లయి కాలు జారిందట, పడ్డాడట, తలకాయ గుమ్మానికి కొట్టుకొని నెత్తురు వరద లయిందట, స్పృహ తప్పిందట. స్వామివారి విభూతి యింట్లో వుంటే ఆయన భార్య అది తెచ్చి గాయానికి చటుక్కున అద్దిందట, వెంటనే బిరడా పెట్టినట్టు నెత్తురాగి పోయిందట, తరువాత స్పృహ వచ్చిందిట, కట్టు కట్టించుకున్నాడుట, అదీ కథ.

"నిజంగా అంత పెద్ద దెబ్బ తగిలిందా? ఏదీ చూపించు" అన్నారు స్వామివారు.

"అబ్బా! సామాన్యమైన దెబ్బ కాదండీ స్వామీ" అంటూ కట్టు విప్పి చూపాడు సుబ్బారావు గారు. తమకు వచ్చిన కష్టాలకు, రోగాలకు గూడా అంతర్గతంగా గర్వపడటం మానవ నైజం.

స్వామివారు నవ్వుతూ "నీకు కాబట్టి యింత దెబ్బ తగిలింది?" అంటూ దగ్గరకు రప్పించి తమ అమృత హస్తంతో పుండుమీద్ధ విభూతి రాసారు.

ఆశ్చర్యం! అద్భుతం! ఆ పచ్చి పుండు, అప్పటికప్పుడు చెక్కు కట్టేసింది. దాని నెప్పంతా, ఆ క్షణంలోనే అంతరించింది. ఆ సుబ్బారావుగారి మీద స్వామి కెంత కరుణో! ఆ జీవి ఎంత ధన్యుడో!

నిన్నటి పాద పూజ పెద్ద మనిషి మనస్సులోనే క్షమాపణను చెప్పుకొన్నాడు.

*　　　*　　　*

విగ్రహాలను సృష్టించి భక్తులకు యివ్వటం చూసి చూసి మామూలయి; స్వామివారి పరివారానికి విగ్రహాలంటే శనగపప్పు లంత చవకయి పోతూ వుంటుంది. మలయ పర్వతంలో బోయివారు, మంచి గంధపు చెక్కలను కట్టెలుగా వాడతారని వూరికినే అన్నాడా, మహా కవిగారు? అందులోనూ, నదీ స్నానాలకూ, సముద్ర స్నానాలకూ వెళ్ళినపుడు, విగ్రహాలూ, సాలగ్రామాలూ, శివలింగాలూ నీళ్ళలోంచి దోసిళ్ళ కొద్దీ తీసి, పంచుతూ వుండటం స్వామి వారికి మామూలు.

అలాగే ఎవరైనా పూలదండ వేస్తే దాంట్లోంచి ఒక దేవుడి విగ్రహం తీసి యిస్తూ వుండటం, లేదా మరేదయినా వస్తువు తీసి యిస్తూ వుండటం, దాదాపు స్వామివారు అడుగుపెట్టిన ప్రతి యింట్లోనూ జరిగేది. స్వామివారి దగ్గర కొచ్చిన ప్రతి కొత్త వ్యక్తి దగ్గర జరిగేది.

ఇలాంటివి చూసి చూసి ఒక రోజున, జానకీరామ మందిరం సుబ్బారావుగారికి మెరికలాంటి ఆలోచ నొకటి వచ్చింది. "కోతులకు మరమరాలు చల్లినట్లు, ఈయన యీ విగ్రహాలు చల్లుతున్నారు. ఇది వీరికి వినోదమేమో, లేదా ఆకర్షణకు మార్గమేమో" అనుకున్నారు. పైగా అనుకున్న దెక్కడ? కావేరీ గర్భంలో స్వామి వారితో కలిసి స్నానం చేస్తూ!

ఆ రోజు గూడ స్వామివారు మామూలుగా చేసే విగ్రహ సంతర్పణ చేశారు. అక్కడ నుంచి ఒక యింటికి పాదపూజకు వెళ్ళారు. అక్కడ వాళ్ళు వేసిన పూలదండలోంచి వొకటి కాదు, నాలుగో అయిదో విగ్రహాలు తీసి వాళ్ళ కిచ్చారు. ఆ తరువాత ఆ దండలోంచే ఒక తులసి పూసల మాల తీసి సుబ్బారావుగారి చేతిలో పెట్టి, "ఇది దేవుడి దగ్గర వుంచు. ఇంట్లో ఎవరికయినా అనారోగ్యం చేసినపుడు దీన్ని వాళ్ళ మెళ్ళో వెయ్యి. ఆరోగ్యం త్వరగా చక్కబడు తుంది. ఇప్పుడే తీసికెళ్ళి దేవుడి దగ్గర అట్టేపెట్టు" అన్నారు. ఇది విన్నాక కళ్ళు తెరుచుకు న్నాయి సుబ్బారావుకు.

"ఓహో ఇదా కారణం. ఒక్కొక్కరికి వున్న అవసరాన్ని బట్టి, రాబోయే ప్రమాదాన్ని బట్టి వాళ్ళకు విగ్రహాలు గానీ, మూలికలు గానీ, లాకెట్టులు గానీ, డాలర్లు గానీ, రక్షలు గానీ యిస్తూ వుంటారన్నమాట. అంతేగానీ వూరికే సరదాకు వెదజల్లటం కాదన్న మాట." అని. ఆ తరువాత ఆ పేద భక్తుడికి తన లంకంత సంసారంలో ఆ మూలిక అనేకసార్లు సిద్ధమూలికగా పని చేసింది.

* * *

స్వామివారిచ్చిన విగ్రహాలు గానీ, ప్రసాదాలు గానీ జాగ్రత్త చేసుకోక పారేసుకొని, దానివల్ల కష్టాల పాలయిన ప్రబుద్ధులు చాలామంది వున్నారు. తమ కిచ్చిన ప్రసాదాలను, ఇంకొకరికి దానం చేసేసి దానివల్ల అవతలివారు లాభం పొందినంత, అసూయపడి అపహరించిన ఉద్దండులూ వున్నారు. నిర్లక్ష్య బుద్ధితో ఏమూలో పారేసి, తేలిక బుద్ధితో తక్కువ చేసి చూసి తల బొప్పెలు కట్టె "శఠగోపాలు" తిన్న ప్రజ్ఞావంతులూ వున్నారు. ఏ రైల్లోనో పోగొట్టుకొని మళ్ళీ వెనక్కి వచ్చి స్వామివారికి మనవి చేసుకొనే సాహసం లేకో, సావకాశం లేకో, నష్టపోయిన అభాగ్యులూ వున్నారు. ఇతరులకు స్వామివారిచ్చిన ప్రసాదాలను దొంగిలించి వారి లాభాలు తాము కొట్టేద్దామని ప్రయత్నించి బోర్లపడి పళ్ళు రాలగొట్టుకున్న గుంట నక్కలూ వున్నారు.

ఎన్ని విగ్రహాలూ, రూపులూ, లాకెట్లూ వర్షంగా కురిసినా, ఎన్ని వేల మందికి యిచ్చినా, స్వామివారికి మాత్రం ఎవరికేది యిచ్చాం, ఏ సందర్భంలో యిచ్చాం అనేది పూర్తిగా గుర్తే. తనకసలు ఆ గమనికే లేనట్టు నటిస్తూ వుండటం మాత్రం ఆయనకు ఒక విలాసం. అందుకే విభూతి పొట్లం చేతులో పెట్టినా సరే జాగ్రత్త అని చనువయిన వార్ని హెచ్చరిస్తూ వుంటారు స్వామివారు. ప్రసాదాలను అశ్రద్ధ చేసినా, అవమానం చేసినా, నిర్లక్ష్యం చేసినా, అజాగ్రత్త చేసినా అవి తిరిగి తన దగ్గరకే వస్తాయని స్వామివారు చెపుతూ వుంటారు గూడా.

* * *

చూడామణి సుబ్బమ్మగారు వారి భర్త సుబ్బణ్ణగారు, మైసూరు దగ్గరలో వున్న మాండ్య కాపురస్తులు. చూడామణిగారి పుట్టిల్లు మైసూరు కావటంవల్ల, స్వామివార్ని గురించి విన్నది. అప్పుడప్పుడు దర్శిస్తూ వుండేది.

ఆవిడది సామాన్య కుటుంబమే. అయినా అనుకూల దాంపత్యం. భర్త డి. సి. ఆఫీసులో చిన్న వుద్యోగం చేస్తున్నాడు. జీవితం సాగిపోతోంది. ప్రత్యేకంగా కోరుకోవలసిందేమీ లేదు. ఊరికే భక్తిగా వస్తోంది. స్వామివారి మహత్తులు చూస్తోంది. సంతోషపడుతోంది. వెళుతోంది. వీరింటి పక్కవారికి, యిద్దరాడ పిల్లలు, పెళ్ళి కెదిగి వున్నారు. వాళ్ళు పెళ్ళి చెయ్యలేక, సంబంధాలు కుదరక నానా బాధలూ పడుతున్నారు. అలాంటావిడని, యీవిడే

ఒకరోజున స్వామివారి దగ్గరకు తీసుకొని వచ్చింది. స్వామివారు ఆవిడకు ధైర్యం చెప్పి ఒక విగ్రహం యిచ్చారు. ఫలానా అప్పటిలోగా పిల్లల పెళ్ళిళ్ళు అవుతాయని ఆశీర్వదించారు.

అంతా అయినాక ఈ చూడామణిగారికి గూడ ఒక రూపు ( డాలరు ) యిచ్చి "జాగర్తగా వుంచుకో, పూజలో పెట్టుకో. సీకూ అవసరమే " అన్నారు. ఇద్దరూ యిళ్ళకు వెళ్ళిపోయారు. అయితే చూడామణిగారు యింటికి వస్తూనే ఆ రూపు ఎక్కడో పెట్టింది. ఎక్కడ పెట్టిందో మరిచిపోయింది. అది మళ్ళీ కనిపించలేదు. బాధ పడి వూరుకుంది.

ఏ రుగెంటావిడ పిల్లలకు, స్వామివారు చెప్పినట్టే పెళ్ళిళ్ళు అయినాయి. వాళ్ళ అప్పులు తీరిపోతున్నాయి. వాళ్ళు హాయిగా వున్నారు. సుబ్బమ్మగారు " ఇలా జరిగింది కదా పోనీ వొకసారి స్వామివారిచేత హోమం చేయించుకుంటే బాగుండును" అనుకొందిగానీ, ఆ రోజుల్లో హోమానికి పాతిక రూపాయల ఖర్చు అయ్యేది. అంత లాపు వున్న కుటుంబం కాదది.

ఇలా వుండగా ఒకరోజున యీవిడ భర్త కేదో కోపం వచ్చి యీవిడ మీద అలిగి యింట్లోంచి బయటకు పొమ్మని గోలచేయసాగాడు. ఇరవై యేళ్ళు కాపరం చేశాక, ఇన్నాళ్ళూ పల్లెత్తు మాట పడకుండా గడిపినాక, ఉన్నట్టుండి, ఇంత మాట భర్త నోటంబడి వచ్చిందంటే ఎలా వుంటుం దావిడకి? ఆ గండం ఎలాగో గడిచింది. కాని భర్త క్రమంగా అర్ధరాత్రి వేళ లేచి కూర్చొని విష్ణు సహస్రనామం, సంధ్యావందన మంత్రాలు ఇల్లదిరి పోయేటట్టు పారాయణ చేయసాగాడు. లేదా అర్ధరాత్రి తలుపులు తీసుకొని వీధిలోకి వెళ్ళిపోసాగాడు. "నువ్వు నాకు అన్నంలో విషం కలుపుదామని చూస్తున్నావు " అని అన్నం తినటం మానేశాడు, ఉద్యోగానికి వెళ్ళటం మానేశాడు.

నలుగురూ చేరారు. దయ్యం అన్నారు, చేతబడి అన్నారు, పిచ్చి అన్నారు, దుర్దశ అన్నారు. తోచిందల్లా చెప్పారు. వాటికేవో శాంతులు చెప్పారు. ఆ శాంతులతో ఒక యేడాది లోగా కొంప గుల్లయింది. పూర్తిగా గుల్లయినాక, కెసరే స్వామి, గుర్తు వచ్చారావిడకు. కాని ఏం లాభం? మాండ్య నుండి మైసూరు వద్దామంటే బస్సు చార్జీలు లేవు. ఇంట్లో వున్న వస్తు వేదో తాకట్టు పెట్టి, భర్తను తీసుకొని మైసూరు పుట్టింటికి వచ్చిందావిడ.

అక్కడి దాకా వచ్చాడుగానీ, తీరా స్వామివారి దగ్గరకు బయలుదేరబోయే సరికి నేను రాను పొమ్మన్నాడు. సరే ఈవిడొక్కత్తే వెళ్ళింది. అక్కడ స్వామిలేరు. ఈవిడ ఏడుపాగక భోరున ఏడ్చింది. శ్రీకంఠయ్యగారు ఓదార్చి " స్వామివారు బెంగుళూరు వెళ్ళారు. రేపు వస్తారు. రేపు రండి " అన్నాడు.

మర్నాడు గూడ భర్త రానని భీష్మించినందువల్ల ఒక్కతే రావాల్సి వచ్చింది. కథంతా విన్నారు స్వామివారు. ఏం చెప్పాలి ? భక్తి వుంది. విశ్వాసమూ వుంది. శ్రద్ధ లేదు. అందుకనే

యిచ్చిన రక్ష పారేసుకుంటే. ఫలితంగా యీ వయస్సులో యీ గోల. విగ్రహం యిస్తే అది తమ రక్షణ కోసం యిచ్చిన "వరం" అనుకోర్రు. ఆ సృష్టి ఒక వినోదం అనుకుంటారు. చూసి ఉల్లాసపడతారు. మరిచిపోతారు. ఏం చెయ్యాలి వీళ్ళను ? చేసేదేముంది ? ముందు గట్టెక్కించాలిగా. ఒక విభూతి పొట్లం యిచ్చి "యీ విభూతి ఆయినకు పెట్టు. రేపు ఆయిన్ని గూడ తీసుకురా. వస్తాడులే" అన్నారు స్వామివారు.

ఆ విభూతి ఆయన పెట్టుకోటానికే కొంత గోలయింది. పెట్టుకున్నాక తిట్లు ఎక్కువై నాయి. నీకూ నాకూ సంబంధం లేదు పొమ్మన్నాడు. ఇంతగోల చేశాడు గాని మర్నాడు స్వామివారి దగ్గరకు రమ్మంటే బయలుదేరాడు ! కాకపోతే, ఆవిడతో తనకు సంబంధంలేదని సిటీబస్సులో విడిగా కూర్చున్నాడు.

కెసరే ఆశ్రమానికి వచ్చిన యితన్ని చూడగానే స్వామివారు కుర్చీలోంచి లేచి ఎదురెళ్ళి గట్టిగా కౌగలించుకొన్నారు. అతనికి ఒక్కసారిగా తల తిరిగినట్టయింది.

"ఇక నీకు పట్టిన పీడలన్నీ పోయాయి. ఎవరో ఏదో ప్రయోగం చేశారు. అయినా ఆ విచారణ నీకక్కరలేదు. ఇక మీ జీవితం హాయిగా ఉంటుందిలే" అన్నారు స్వామివారు.

తక్షణంలోనే అతనిలో పూర్తి మార్పు వచ్చింది. పనికిరాని శాంతుల కోసం ఇల్లంతా గుల్ల చేసుకున్నాం. పనికివచ్చిన చోట సమర్పించుకొందుకు చేతిలో రూపాయయినా లేదు" అనుకుందావిడ బాధగా.

కానీ వాళ్ళిచ్చే దేమిటి? స్వామివారే వాళ్ళకొక పుష్పం యిచ్చారు.

అవును మరి. విగ్రహాలిస్తే పారేసుకొనే వారికి పూలే నయం. ఇప్పుడే తల్లో పెట్టుకుంటే సాయంత్రానికి ఎక్కడిది అక్కడ రాలపోతుంది. ఏ దోషమూ వుండదు. అప్పటి నుంచీ ఆ దంపతులిద్దరూ ప్రతి ఆదివారం మాండ్య నించి వచ్చి హోమం దర్శించి వెడు తున్నారు కృతజ్ఞతగా.*

* * *

ఇలాంటిదే మరో కథ.

మైసూరులోనే ఒక ట్రాన్స్‌పోర్టు కంపెనీలో పనిచేసే వాసుగారు స్వామివారి దగ్గరకు చాలసార్లుగా వచ్చి పోతున్నాడు. ఆయనకు యింట్లోనూ, ఆఫీసులోనూ గూడా చాలా ఇబ్బందులొచ్చి చాలా యాతన పడుతున్నాడు. ఒకరోజున ఏమయినా సరే ఇవ్వాళ నా కష్టాలు స్వామివారితో మనవి చేసుకోవాలి, అనుకొని కెసరే బయలు దేరాడు. దార్లో

---

* ఆయన పదవీ విరమణ చేసిన తరువాత, ఆ దంపతు లిద్దరూ ఆశ్రమంలోనే కాటేజీ కట్టించుకొని యథాశక్తిగా సేవ చేసుకుంటూ గురు సన్నిధిలో జీవితశేషం గడుపుతున్నారు.

ఓ మిత్రుడు తగిలాడు. "ఎక్కడికి పోతున్నావయ్యా?" అన్నాడు. "కెవరే గురువుగారి దగ్గరకు" అన్నాడు వాసుగారు. "నేనూ వస్తాను పద" అన్నాడు మిత్రుడు. ఇద్దరూ ఆశ్రమానికి చేరారు.

ఆ రోజు వాసుగారికి నిజంగానే స్వామివారితో మాట్లాడటం కుదిరింది. మిత్రుడు గూడ పక్కనే వున్నాడు. తనకు వేరే ఏ పనీ లేదు. వాసుగారు కష్టాలు చెప్పుకున్నాడు. స్వామివారు రెండు రుద్రాక్షలు సృష్టించారు. వాసుగారి చేతిలో ఒకటి పెట్టి ఆ మిత్రుడి చేతిలో గూడ ఒకటి పెట్టారు. నోరెత్తి మాట్లాడలేదు.

వాసుగారికి ఆశాభంగమై పోయింది. స్వామివారు ఒక్కమాట గూడ మాట్లాడలేదు. ఏ నవగ్రహ శాంతి అయినా చేయించుకోమని చెప్పలేదు. ఓ రుద్రాక్షకాయ చేతిలో పడేసి వూరుకొన్నారు. ఇదేమి ఏనేది కాదు. ఇదొక్కటే మెళ్ళో కట్టుకున్నా బాగుండదు. అందుకే అదేమీ వాసుగారికి తృప్తి నివ్వలేదు.

ఇంతలో తన మిత్రుడి చేతిలోని రుద్రాక్ష తీసుకొని చూశాడు. తనకిచ్చిన రుద్రాక్ష కన్నా అది బావుంది. తనది అక్కడక్కడ ముక్కలు పోయి వుంది. ఈ రుద్రాక్ష ఏం చేసుకోవాలి తను? ఆలోచించి, ఆలోచించి ఆ రుద్రాక్షతో ఉపయోగమేమీ కనిపించక దాన్ని ఆ మిత్రుడి కిచ్చివేశాడు వాసుగారు. రోజులు జరిగినకొద్దీ తన కష్టాలు పెరుగుతున్నాయి. మరోపక్క ఆ మిత్రుడికి అనుకోని సదుపాయాలు కలిసి వస్తున్నాయి. ఉద్యోగం, వ్యాపారం కలిపి లాగిస్తూ లాభాలు గడించేస్తున్నాడు.

ఒకరోజున వాసుగారికి ఆలోచన వచ్చి, ఆ మిత్రుణ్ణి అడిగారు. "ఆ స్వామి వారిచ్చిన రుద్రాక్షలు ఏమి చేశావయ్యా" అని. "రోజూ పూజ చేస్తున్నాగా" అన్నాడాయన. దాంతో బుద్ధి వచ్చింది వాసుగారికి. అప్పుడు చెంపలు వేసుకొని పోయి స్వామివారి పాదాలమీద పడ్డాడు. అతను కొంచెం కవి కావటంవల్ల స్వామివారి మీదే కీర్తనలు కట్టి పాడాడు ఆ రోజు. అలా కొన్నాళ్ళు పాడమన్నారు స్వామివారు. కొన్నాళ్ళు పోయాక విభూతి ప్రసాదం ఇచ్చారతనికి. ఆయన యిక్కట్లు అప్పటికి సద్దుకున్నాయి.

* * *

విగ్రహాలు అయిన తరువాత ఆ రోజుల్లో తరచయిన మహత్తు విభూతి సృష్టి. కొండ చెరియల్లోంచి కొండవాగులు దూకినట్టు స్వామివారి ప్రతి అవయవములోంచి విభూతి ఎగిరి దూకుతూ వుండేది.

"బహుశా ఆయన వంట్లో నెత్తురు గాక విభూతి పొడే ప్రవహిస్తోందేమో" అనిపించేది. కాని, ఒకోసారి కుంకుమ గూడ రాలుతోంది గనుక యీ వూహకు అవకాశం కుదిరేదికాదు. ఇంతింత విభూతి రాలుతోంది కనుక ఈయన "శివుడు" అని కొంతమంది తర్క పాండిత్యం వుపయోగించి నిర్ణయించుకుంటూ వుండేవారు.

అయితే మహాత్ములను చూసి మోసపోవద్దనీ, ఒకరి గొప్పదనం వారి దగ్గరున్న మహాత్తులను బట్టి తెలియదనీ స్వామివారు సందర్భం వచ్చినప్పుడల్లా అనేక రకాలుగా బోధిస్తూ వుండేవారు. అయినా ఎక్కని వారికోసం ఒక విభిన్నమైన మహత్తు చూపారొకసారి.

ఒకసారి ఒక పెద్ద పేరున్న సభలో పిల్లలనేక మంది అనేకరకాల వాయిద్యాలు తెచ్చి వాద్య సమ్మేళనంతో సంగీత కార్యక్రమం నడుపుతున్నారు. పిల్లలంటే పొంగిపోయే స్వామి వారు, తను స్వయంగా తాళంవేస్తూ వాళ్ళను ప్రోత్సాహ పరుస్తున్నారు. అందులో ఒక కుర్రవాడు గిటారు వంటి వాయిద్యం వాయిస్తున్నాడు. కొంతసేపయ్యాక, వాడు తీగలు మీటుతుంటే, ఆ తీగల్లోంచి విభూతి రాలసాగింది.

సభ ఆశ్చర్యపోయింది. వాడూ ఆశ్చర్యపోయాడు. ఉన్నట్టుండి ఆ మాండలిన్ డొక్కలో రాళ్ళలాంటి వేవో చేరి తీగల ధ్వని మారసాగింది. వాడు ఖంగారు పడుతుంటే స్వామివారు, ఆ మాండలిన్ తీసుకొని ఒకసారి గలబరించి వొంచారు. వెంకటేశ్వరస్వామి, గణపతి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వగైరా దేవతల డాలర్లు దాంట్లోంచి దొర్లిపడ్డాయి.

జనమంతా చప్పట్లు కొట్టి " గణపతి సత్యానంద స్వామికీ జై " అని జైకారాలు చేశారు. ఆగమన్నారు స్వామివారు.

" వాడు మీటుతుంటే విభూతి వచ్చింది. వీడు మీటుతుంటే విగ్రహాలు వచ్చినాయి. మధ్యలో నాకు జైకారం చెపుతారేమిటి ? వాళ్ళకు చెప్పండి " అన్నారు.

ప్రజలు నిజంగానే తమకు జైకారాలు చెపుతారేమోనని కంగారుపడి నమస్కారాలు పెట్టారు కుర్రవాళ్ళు. స్వామివారు చెప్పే దాని తాత్పర్యం అర్థంకాక తెల్లమొహం వేసుకొని మౌనంగా వుండిపోయారు జనం.

అప్పుడు స్వామి వివరించారు.

" వీళ్ళు విభూతీ, విగ్రహాలు సృష్టించారిప్పుడు. అయినా మీరు వాళ్ళని నమ్మటం లేదు, ఎందుకనీ ? వాళ్ళు యింకా మహాత్ములు కాలేదని మీ హృదయాలు చెపుతున్నాయి. హృదయాల కెలా తెలుసు? వాళ్ళ దగ్గరనుంచి విభూతి రాలినా, వాళ్ళదగ్గర మహాత్ములవడానికి తగిన యితర గుణాలు లేవు. బూడిద రాలటంవల్ల గొప్పతనం వస్తుందంటే, వీళ్ళకంటే, నాకంటే, బూడిదగుమ్మడి కాయలు గొప్ప మహాత్ములు.

బూడిద రాలటం కాదు ముఖ్యం. రాలిన బూడిద వల్ల ఎలాంటి ఫలితాలు వస్తున్నాయి అనేది ముఖ్యం. విగ్రహాల సృష్టి ముఖ్యం కాదు. సృష్టి అయిన విగ్రహాలు మిమ్మల్ని ఎలా రక్షిస్తున్నాయి అనేది ముఖ్యం. అలాగే యిక్కడికి వస్తూ వున్నందువల్ల, మీ హృదయాల్లో ఏదయినా మంచి పరివర్తన, మంచి పరిణామం వుందా లేదా, అనేది మీకే తెలుసు. మీకు

మీారే సాక్షి. ఆ సత్పరిణామం వుంటే, మీారొచ్చే చోటు మహత్తు గలది. మీా గురువు మహత్తు గలవాడు. అంతేగాని గారడీలు చేసినందువల్ల గొప్పవాడుకాదు. మీాలో ఎంత పరిణామం వచ్చిందో కొలుచుకోండి. అది పెంచుకుందుకు ప్రయత్నించుకోండి. అదే మీా గురువు దగ్గరున్న అసలైన మహత్తు. దాన్ని పట్టుకోండి"

*　　　*　　　*

మహాత్ములైనవారు "ఉత్తమ జీవు లెక్కడ వుంటారో, వారిని గూడా మహాత్ములను చేద్దా"మని ఎప్పుడూ వెతుకుతూ వుంటారు. ఎవడైనా, కొంచెం అర్హుడనిపిస్తే వాణ్ణి యింకా పైకి తీసుకు వద్దామని ప్రయత్నిస్తూనే వుంటారు. అయితే, ఆ జీవికి సంస్కారబలం చాలకపోతే వాడు దాన్ని నిలబెట్టుకోలేక పోవచ్చు.

మైసూరులోనే కృష్ణశాస్త్రి—నంజమ్మ అనే సాధు దంపతు లుండేవారు. వాళ్ళు యథాశక్తిగా పూజా పురస్కారాలు చేసుకొంటూ పెద్దల దగ్గర మంచి మాటలు వింటూ లోక సామాన్యంగా కాలక్షేపం చేస్తున్నారు. ఈ నంజమ్మగారి కొడుకు జయరామ్‌కి అనారోగ్యంగా వుంటోంది. కూతురికి పెళ్ళి కావటం లేదు. అన్ని యిళ్ళలో వున్న సమస్యలే. కొత్తేం లేదు.

కెనరే స్వామిగారిని గురించి విన్న నంజమ్మగారు ఒక రోజున ఒక స్నేహితురాలిని వెంటబెట్టుకొని కెనరే ఆశ్రమానికి వెళ్ళింది. అది మధ్యాహ్నం పూట. ఆ యింట్లో ఎవరో కుర్రవాడు కనిపిస్తే "నాయనా! ఇక్కడెవరో సత్యనారాయణస్వామి అని వున్నారట, ప్రశ్నలవీ చెపుతారట నీకు తెలుసా" అన్నది.

"తెలుసుకానీండి. ఆయన ప్రశ్నలు చెప్పరు" అన్నాడు కుర్రవాడు.

"చెపుతారన్నారే" అన్నది ఆవిడ అయోమయంగా.

"ఇంతకూ వారివల్ల మీాకు కావాల్సిన దేమిటి?" అడిగాడు కుర్రవాడు.

"నా కొడుక్కి ఆరోగ్యం కావాలి. వాడికి ఎన్ని మందులు వేసినా సరిపోవటం లేదు. వ్యాధేమిటో తెలియటం లేదు. నా కూతురు చెట్టల్లే ఎదిగింది. సంబంధాలు కుదరటం లేదు. వార్ని పట్టుకుంటే యేదయినా ఉపాయం చెపుతారంటే వచ్చాను నాయనా" ముసలి చాదస్తం పూర్తిగా చూపించిందావిడ.

"ప్రశ్న చెపితే మీాకేం లాభం? మీా చిక్కులు తీర్చాలి అంతేనా" అన్నాడు కుర్రవాడు.

"అదే నాయనా, ఏదో పాతకాలంవాళ్ళం తెలీక ప్రశ్న అంటాం" అందావిడ. అని వొక క్షణం ఆగి "ఇంతకూ ఆయన ఎక్కడవుంటారు నాయనా?" అంది.

"నన్నే సత్యనారాయణ అంటూ వుంటారులెండి" అన్నాడు కుర్రవాడు నవ్వుతూ.

"ఆఁ...." ముసలమ్మ లిద్దరూ నోరు తెరిచారు కంగారుగా.

"ఏం ఫరవాలేదమ్మా. మీారు రేపు ఆదివారం హోమానికి, మీా పిల్లల్ని తీసుకురండి, చూద్దాం" అన్నారు స్వామివారు. వాళ్ళు వచ్చారు. హోమం చెయ్యగా మిగిలిన చరువు

( అన్నం ) లోంచి ఒక మెతుకు తీసి జయరామ్‌కు నోట్లో వేశారు. ఆ పిల్లకు ఆరు వారాల తరువాత పెళ్ళవుతుందని చెప్పారు స్వామివారు.

కుర్రవాడి ఆరోగ్యం నయమైంది. ఆడపిల్ల పెళ్ళయింది. నంజమ్మ దంపతులు ఆశ్రమానికి నిత్య భక్తులయ్యారు. ఇంతవరకూ మామూలు కథే.

అక్కడి నుంచీ స్వామివారు సూక్ష్మరూపంతో రోజూ వోసారి వారింటికి వెళ్ళి వస్తూ వుండేవారు. వచ్చేటప్పుడు వూరికే రాకుండా ఏదో వొక గుర్తు వదిలి వస్తూ వుండేవారు. ఒకసారి దేముడి గదంతా విభూతి చల్లి వచ్చేవారు. ఒకోసారి కొత్త పూలు దేవుడి దగ్గర పెట్టి వచ్చేవారు. ఈ రకంగా అన్నమాట, ఒక రోజున నంజమ్మ గారికి ఒక పువ్వు యిచ్చి మూడు రోజులు పూజలో వుంచి తరువాత నీళ్ళలో వెయ్యమన్నారు. ఆ పువ్వు మూడు రోజులూ మూడు రకాలుగా కనిపించింది.

ఆ తరువాత నంజమ్మగారు కనిపించినపుడల్లా " నా వెన్నులో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వున్నాడు. ఎప్పుడో అప్పుడు బయటకు వస్తాడు. ఎప్పుడు వస్తాడో, ఎవరింటికి వెడతాడో అది చెప్పలేం " అనసాగారు.

ఒక రోజున ఇంట్లో నిద్రపోతున్న జయరామ్ అర్ధరాత్రి నిద్రలేచి "స్వామివారొచ్చారు, స్వామివారొచ్చారు" అని అరుస్తూ హడావిడిగా వీధి తలుపు తీసి అక్కడే కింద పడిపోయాడు.

తల్లీ, తండ్రీ కంగారు పడి " గణపతి స్వామీ రక్ష, రక్ష " అంటూ వాడిని లేవతీయ పోతే, వాడు కొండంత బరువున్నాడు. వాడిని ఎత్తటం సాధ్యం కాలేదు. గణపతిస్వామిని ప్రార్థించగా, ప్రార్థించగా, ఎలాగోలా ఇంట్లో అందరూ కలిసి వాణ్ణి ఎత్తి మంచంమీద పడుకో బెట్టటం కుదిరింది.

కాని పడుకో పెట్టిన రెండు నిముషాలకే లేచి " అమ్మా పక్కకు తప్పుకో, పక్కకి తప్పుకో, పాము పాము '' అన్నాడు కంగారుగా.

నంజమ్మగారు పక్కకు తొలిగి చూస్తే పామూ లేదు, ఏమీలేదు. వాడు మాత్రం "అమ్మా, పాలు తీసుకురా సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారికి పాలుతీసుకురా" అని హడావిడి పెట్ట సాగాడు.

" ఏమో, వాడికి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కనిపిస్తున్నారో, యేమో " అని ఒక గిన్నెలో పాలు తెచ్చి, యిచ్చిందావిడ. ఆ పిల్లవాడు మంచానికి కొద్ది దూరంలో పాలగిన్నె పెట్టి దణ్ణం పెడుతూ మంచం మీద కూర్చున్నాడు.

పాలు తాగుతున్న శబ్దం వినిపించ సాగింది. గిన్నెలో పాలు క్రమంగా తగ్గిపోతున్నాయి! అందరికీ చెమటలు పట్టినై, జయరామ్‌కి తప్ప. పాలన్నీ అయిపోయినాక గిన్నెలోకి, కుంకుం వచ్చింది. జయరాం మంచం దిగి నేలమీద కూర్చున్నాడు. కొంచె సేపయినాక—

"సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారు నన్ను ముద్దు పెట్టుకున్నారు. తరువాత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారు, మన గణపతి స్వామి వారు యిద్దరూ వెళ్ళిపోయారు" అన్నాడు. ఎవరికీ, ఏమీ చెప్పేందుకు తోచలేదు.

ఇంతలో జయరామ్ అక్కడే పడిపోయాడు. స్పృహ లేదు. అది మూర్ఛ కావచ్చు ననుకున్నారు తల్లిదండ్రులు. తెల్లారి లేస్తూనే—

"నువ్వు నాకు తల్లివి కాదు, నేను నీ కొడుకునీ కాదు" అన్నాడు జయరామ్. ఏ తల్లి కడుపైనా ఈ మాటకు తరుక్కుపోక తప్పదు.

"మరి నువ్వెవరివిరా?" అది తల్లి ఆక్రోశం.

"నేను సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణి."

బాపుంది. అదృష్టవంతుడు, స్వామి ఆవేశించాడు. ఇక వాడికి తల్లి కనిపిస్తుందా? లోకం కనిపిస్తుందా? ఎవరేం చేస్తారు దానికి?

కుర్రవాడు వెంటనే స్నానం చేసి మట్టితో ఒక పాము బొమ్మచేసి దానికి చాలా సేపు పూజలు చేశాడు. ఆ పూజ జరుగుతుండగా ఆ బొమ్మ నిజం పాముగా కనిపించసాగింది. క్రమంగా ఇరుగు పొరుగువారు చేరారు. వచ్చిన వారందరికీ తలో రూపంలో దర్శనమిస్తు న్నారు సుబ్రహ్మణ్యస్వామివారు. కొందరికి అయిదు తలల పాముగా గూడా దర్శన మిచ్చారు. కొందరు ఒక సుబ్రహ్మణ్య పటం తెచ్చి పెట్టారక్కడ. కుర్రవాడు మట్టి విగ్రహానికి అభిషేకం చేస్తుంటే, పైనున్న పటంలోంచి తేనె ధార కారసాగింది. మెల్లిగా పేటు గుప్పుమంది. ఆ మర్నాటికి భయంవేసి పాముల వాళ్ళని పిలుచుకొచ్చారు. వాళ్ళకీ పామే కనిపించింది. పట్టుకోబోతే ఏమీ లేదక్కడ. జయరామ్ సుబ్రహ్మణ్యావేశంవల్ల ఇలా యిల్లంతా గొడవ గొడవ అయింది. ఇక తట్టుకోలేక ఇంటిల్లపాదీ వచ్చి స్వామివారి దగ్గర గోల పెట్టారు. స్వామివారు కొంచెం విచారంగా కనిపించారు. "నేను రమ్మన్నానని చెప్పి వాడిని ఇక్కడికి తీసుకురండి" అన్నారు.

స్వామివారు రమ్మన్నారనగానే లేచి వచ్చేశాడు జయరామ్. అతను వచ్చేసరికి స్వామివారి చేతులో ఒక మంత్రదండం వుంది. (సినిమాల్లో మహర్షుల మోచేతి కింద నిలబెట్టే మాదిరిది.)

జయరామ్‌ని చూడగానే—

"ఒరేయ్, నిన్ను పోషించటం కంటె మేకను పోషించటం నయంరా. అది ఇంత అరవదు. అయినా నీకు వివాహ యోగం వుంది. నువ్వు లాభం లేదు" అన్నారు స్వామివారు.

వాడు మాట్లాడలేదు. స్వామి తన మంత్రదండం వాడి శిరస్సుకు తాకించారు. జయరామ్ మళ్ళీ పాత జయరామ్ అయిపోయాడు.

" ఎందుకయినా మంచిది, రెండు రోజులు నా దగ్గరే వుంచండి వీడిని" అని రెండు రోజులట్టిపెట్టుకొని ఏదైనా, అడుగూ బొడుగూ అంటుకొని వుంటే అది గూడ బుర్రలోంచి లాగేసి యింటికి పంపించారు స్వామివారు.

ఉన్న సంస్కార విశేషాన్ని గుర్తించి, వాడికి కాస్త యోగశక్తి ఇస్తే మెల్లిగా సాధన సాగించి పై మెట్లు ఎక్కుతాడనుకుంటే, పదిమందికీ ఉపయోగిస్తా డనుకుంటే మొదటి పాదంలోనే తల్లిని తల్లి కాదన్నాడు. వచ్చిన శక్త్యావేశాన్ని సంబాళించుకోటం చేతకాలేదు. ఇది ఒకటే తన స్థితి, లోక స్థితి సమన్వయించుకొనే తెలివి లోపించింది. ఇది మరొకటి అంటే ఆత్మ సంయమనంలో తాహతు చాలలేదన్న మాట. అందుకనే స్వామి తన శక్తిని ఉపసంహరించుకోవలసి వచ్చింది.

* * *

స్వామివారి విభూతి సృష్టిని గురించి, చెప్పుకుంటున్నాం గదా! ఈ విభూతి సృష్టి ఒకోసారి నమ్మటానికి శక్యం కానంత విపరీతమైన పరిమాణాలలో వుండేది. అయితే స్వామి వారు పదిమందిలో వున్నప్పుడు సృష్టించే విభూతి కంటె, వారు ఏకాంతంలో వున్నపుడు సృష్టించుకొనే విభూతి, యింకా ఎక్కువ అని చెపితే ఆశ్చర్యపోక తప్పదు. అలాగే ఆశ్చర్య పోయాడు K. L. రాజుగారు.

కర్నాటక రాష్ట్ర కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగా పనిచేసి విరమించిన K. L. రాజుగారు మొదట్లో ఒక బేకరీ ఓనరు. కెనరే ఆశ్రమానికి వెళ్ళి స్వామివార్ని సేవించుకుంటూ వుండే వాడు. వీరింటి నుంచి కెనరేకి వెళ్ళే దారిలో పెద్ద మురుగు కాలవ ఒకటి వుంది. ముక్కులు బద్దలయ్యే దుర్గంధం భరిస్తూ రోజూ దాన్ని దాటి రావటం, పోవటం ఈయనకు మామూలే. అప్పట్లో సైకిలే ఆయన వాహనం.

ఒక రోజు రాత్రి స్వామివారిచ్చిన ప్రసాదం తీసుకొని తిరిగి వస్తుండగా యీ మురుగు కాలవదగ్గరకు వచ్చేసరికి అద్భుతమైన చందన సౌరభం గుబాళించ సాగింది. ఓహో, ఏమి సువాసన అది!

మంచి గంధపు సువాసన మైసూరు వారికి, ఎరుగని దూరదేశాల వస్తువుగాదు. కానీ యీ సువాసన ఎంత తీవ్రంగా, విచిత్రంగా వుందంటే, వొళ్ళంతా గగుర్పొడుస్తోంది. అది ఏదో దివ్యసుగంధం అయివుండాలి తప్పితే మానవలోకపు సుగంధం మాత్రం కానేరదు అనిపించిం దాయనకు. అలా కొంత సేపు ఆ సుగంధానికి ఆనందించిన తరువాత గానీ ఆయనకు తెలియ లేదు తను సైకిలు దిగివున్నాననీ, అది సరిగా మురుగు కాలవ వొడ్డనీ.

ఈ స్పృహ కలిగాక మరింత ఆశ్చర్యమైంది, ఆనందమైంది. "ఏమిటీ విచిత్రం" అనిపించింది. "వెంటనే వెళ్ళి యీ విషయం స్వామివారికి చెప్పాల్సిందే" అనిపించింది. తక్షణమే సైకిలు వెనక్కి తిప్పి కెనరే చేరాడు. అక్కడ తలుపులు వేసి వున్నాయి.

ఒక క్షణం తటపటాయించి తోసి చూశాడు. కొద్దిగా తెరుచుకున్న తలుపు సందులోంచి చూసి అవాక్కయి పోయాడు. స్వామి తను పూజా పీఠం చోట కూర్చుని ఉన్నారు. ఆయన చుట్టూ పాముల పుట్టలులాగా కొనలు తేలి, విభూతి, పుట్టలు పుట్టలుగా ఉంది. ఆ పుట్టల్లో ఆయన కప్పుకు పోయి వున్నారు. ముందర పక్క మాత్రం ఆయన ముక్కుల గాలికి విభూతి చెదిరి పోయి ముక్కుల దగ్గర నుంచి కళ్ళూ, నుదురూ కనిపిస్తున్నాయి.

తలుపు చప్పుడికి కళ్ళు తెరిచారు స్వామివారు. రాజుగారు భయపడ్డాడు కాని, స్వామి వారు లోపలికి రమ్మన్నట్టు సంజ్ఞ చేశారు, వెళ్ళాడు. "ఎందుకు మళ్ళా వచ్చావు?" అన్నారు. ఆ కంఠస్వరమే విచిత్రంగా, పరమ మనోహరంగా వుంది. అది మామూలుగా వుండే స్వామి వారి కంఠధ్వని కాదు. ఒళ్ళు మరోసారి పులకరిస్తుండగా జరిగింది చెప్పాడు రాజుగారు.

"అదృష్టవంతుడివి. రెండదృష్టాలు పట్టినై" అని, స్వామివారు ఆ విభూతి పుట్టలలో నుంచి కొంచెం విభూతి తీసి వీరి చేతిలో వేసి, సెలవిచ్చి పంపారు. ఆ చెయ్యి కదిలినప్పుడు ఆ పుట్టలు కొంచెం చెదరగా, స్వామివారు చిన్న తుండుతో, పద్మాసనంలో కూర్చుని ఉన్నారని తెలిసింది రాజుగారికి.

* * *

వీరు విస్తారంగా హోమాలు చేస్తున్నా, ఆ హోమ భస్మానికీ, వీరి సృష్టిలో వచ్చే భస్మానికీ పోలిక లేదు. అయినా హోమ భస్మం ఎక్కువగా పేరుకు పోయినపుడు వెళ్ళి కావేరిలో కలిపి వచ్చేవారు. అలాంటప్పుడు ఇంత విభూతి ఎక్కడి నుండి వస్తుంది? ఈ విభూతికి పరిమళం ఎట్లా వస్తుంది? ఈ ప్రశ్నలు ఆ రోజుల్లో భక్తులను వేధించటం వింత కాదు.

ఒకసారి ఈ సందేహం తీరిపోయే ఘట్టం జరిగింది. అప్పుడప్పుడు గదిలో కూచుని గడియ వేసుకోటం గాని, లేదా బయట తాళం వేసుకోమని చెప్పి లోపల కూర్చోవటంగాని స్వామి వారికి మామూలే.

ఆ యిల్లు మరీ యిరుకు యిల్లు కావటం, వచ్చే జనం మరీ అధికం కావటంతో, తన అనుష్ఠానాల కోసం ఇలా చేయక తప్పదు మరి.

ఒకరోజు తలుపు తాళం వేసుకోమని లోపలికి వెళ్ళారు-స్వామివారు. చాలా సేపయినాక ఏదో పని వచ్చిందేమో, బెల్లు కొట్టారు స్వామివారు. వెంటనే తాళం తీసి లోపలికి వెళ్ళాడు చంద్రశేఖరయ్య.

అయితే ఆ సమయానికి ఆ రోజు అక్కడ చాలామంది స్వామివారి కోసం వేచి వున్నారు. అందరూ ఆత్రంగా లోపలికి చూశారు. ఇందాక రాజుగారు చూసిన దృశ్యం ఈ రోజు అక్కడి భక్తులంతా చూశారు.

భక్తులు పోగుపడి ఉండటం చూసి స్వామివారు బయటకు వచ్చేశారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ "ఇప్పుడే మానస హోమం పూర్తయింది. ఇప్పుడు మీరు చూసింది ఒక విశ్వ రూపం. మీరు అదృష్టవంతులు" అన్నారు స్వామివారు. అప్పటినుంచీ స్వామివారి భస్మ సృష్టిలో కిటుకు భక్తులకు కొంతలో కొంత అర్థమయింది.

* * *

ఇన్ని మహత్తులు చేస్తున్నారు గదా, ఈ స్వామివారు ఎవరి అవతారము ?

ఈ చర్చ ఆ రోజుల్లో స్వామివారి భక్తుల్లో తరచుగా జరిగే చర్చ. "గణపతి అవతారము" అనేది ఆ చర్చకు నూటికి తొంభైమంది చెప్పే సమాధానం. కాని ఆ మిగిలిన పదిమంది ఆ సమాధానంతో తృప్తి పడక వాదాలు సాగదీస్తూ వుండేవారు. వారి అసంతృప్తికి గూడ కారణాలు లేకపోలేదు.

స్వామివారు తరుచుగా "గణపతి నా తండ్రి" అని చెప్పుతూ వుండటం ఒక కారణం. దీనికన్న ప్రబలమైన కారణం ఒకటి ఉండి. స్వామివారు ఆయా భక్తులకు వారి వారి ఇష్ట దేవతల రూపంలో సాక్షాత్కరించటమే ఆ కారణం.

ఇళ్ళల్లో పూజలో జపాలో చేసుకొనేటప్పుడూ, ఆశ్రమంలో హోమం దగ్గర సంకీర్తనలో కూర్చున్నప్పుడూ, నాకు అమ్మగా కనిపించారని ఒకరు అంటే, నాకు నరసింహస్వామిగా కనిపించారని ఒకరు, నాకు రామచంద్రస్వామిగా కనిపించారని ఒకరంటే, నాకు అంజనేయ స్వామిగా కనిపించారని మరొకరూ అనేవారు. ఇలా అందరికీ ఎన్నో రూపాలలో కనిపించే వారు స్వామి. గణపతిగా చాలామందికి కనిపించేవారు.

దాంతో కొంతమంది విజ్ఞులు "స్వామివారు ఏ దేవతా మంత్రాన్ని ఉపాసిస్తూ ఉంటే ఆ రూపంలో కనిపిస్తూ వుంటారు" అనే సిద్ధాంతం లేవదీశారు.

ఒక ఆదివారం సభలో స్వామివారు నిర్మొహమాటంగా, కేవలం వాచ్యంగా ఒక ప్రకటన చేశారు. "నన్ను నిర్మలమైన భక్తితో చూచేవారికి వారి వారి యిష్టదేవతల రూపాలలో నేనే సాక్షాత్కరించి వరప్రదానం చేస్తాను" అని.

వారు ప్రకటన చేస్తున్న సమయంలోనే సుబ్బారావుగారి బంధు వొకావిడకు చతుర్హస్త గణపతిగా, సుబ్బారావుగారి భార్యకు నరసింహస్వామిగా, సుబ్బారావు గారికి దేవిగా, ఇట్లా తలొకరికీ తలో రూపుగా ఒకే సమయంలో కనిపించారు. అందరి అనుభవాలూ ఆ సభలోనే చెప్పించి చివరికి బోధించారు స్వామివారు.

"స్వామివారి అవతారం ఏది అనేది మీకు అందే విషయం కాదు. మీకు ఏ అవతారం కావాలన్నా ఇందులోంచి పని చేస్తుంది. అంతవరకూ గ్రహించి, మీరు నిర్మలభక్తిని పెంచుకోండి చాలు."

---

గమనిక : ఈ అధ్యాయంలో చెప్పుకున్న సంఘటనలలో కొన్నిచోట్ల ఏది ముందు, ఏది వెనక అనేది నిర్ణయించటం సాధ్యం కాలేదు.

*బభూవ సా కేరళ కాలడీ తే*
*ధర్మప్రచారే ప్రథమో హి రంగః।*
*సా మేకదన్తాను గతావ సత్యం*
*యచ్ఛంకర స్త్వం జగతో గురుశ్చ॥*

(గురుదేవా! కేరళలోని కాలడి మీ ధర్మప్రచారానికి ప్రథమ రంగమైంది. మరి మీరు శంకరులూ, శుభములు గలిగించువారూ, జగద్గురువులూ గదా! ఏక దంతుడైన గణపతి ఎల్లప్పుడూ మీవెంట వుంటాడు. అట్టి మీరు మమ్ము రక్షింతురు గాక!)

## పరశురామ క్షేత్రం

ఒక పక్క దివ్య విభూతుల ఆవిష్కరణ జరుగుతుండగానే మరోపక్క అవతార ప్రణాళికకు కావలసిన మార్గ రచన గూడా సాగుతూనే వుంది. తమ మాతృశ్రీ వల్ల శ్రీ విద్యాదీక్షాను గ్రహం పొందిన స్వామివారు తమ పర్యటనల కార్యక్రమాలను పార్వతి కొండతో ప్రారంభించటం కేవలం కాకతాళీయం కాదు.

ఇంచుమించు ఆ ప్రాంతంలోనే స్వామివారు శ్రీకారం చుట్టుకొన్న తమ తీర్థయాత్రా కార్యక్రమాలు కేరళలోని కాలడితో ప్రారంభం కావటం మాత్రం కొంత విచిత్రంగానే జరిగింది.

దేశంలో సుప్రసిద్ధాలయివున్న కాశీ, రామేశ్వరాది మహాక్షేత్రాలన్నీ వదలి సమీపంలో ఉన్న శ్రీశైలాది సిద్ధిక్షేత్రాలు వదలి, షణ్మతస్థాపనాచార్యులైన ఆదిశంకర భగవత్పాదాచార్యుల జన్మస్థలమైన కాలడినే స్వామివారు ఎన్నుకున్నారు.

కేరళ భక్తులు కొందరు వచ్చి, వారి యిళ్ళకు రమ్మని పిలుస్తున్న కొద్దీ స్వామివారికి కాలడి మీదే దృష్టి పెరగసాగింది. కొచ్చిన్ పోర్టులో పనిచేసే శ్రీకంఠయ్యగారు పూర్తిగా చొరవ తీసుకున్నారు. ఆయనకు నారాయణ మీనన్, శంకరమీనన్, నారాయణ వైద్యార్ వంటి పెద్దలు చేయూత యిచ్చారు. కాలడి యాత్ర ఖాయమైంది.

ఆ రోజుల్లో అంతదూరం ప్రయాణం చేయటం అదే మొదలు స్వామివారికి. తీసికెళ్ళే భక్తులు గూడ పూర్తిగా కొత్తవారు. కాగా అది కేవలం ఆ గృహస్థుల యిళ్ళకు వాళ్ళ బంధువు లెవరో వచ్చినట్లుగా మాత్రమే ఆ మొదటి యాత్ర* జరిగింది.

ఒక కార్లో స్వామివారిని కేరళ తీసుకెళ్ళారు. ముందు సరాసరి కాలడే వెళ్ళాలని స్వామి పట్టుబట్టారు. కాలడి శంకర దర్శనం, పూర్ణానదీ స్నానం అయినాక తిరుగు ప్రయాణంలో కొచ్చిన్‌లో నారాయణ మీనన్‌గారి యింట్లో దిగారు స్వామివారు. కొద్దిమంది యితర భక్తుల యిళ్ళకు గూడ వెళ్ళి అనుగ్రహించారు.

ఆ పర్యటనలో ఒక అటవీశాఖాధికారి** స్వామివారికి రెండడుగుల పొడుగున్న ఏనుగు దంతము, ఒక నల్లఏనుగు బొమ్మ సమర్పించాడు. గణపతి గజ ముఖుడు గదా!

లేతమొహం, పట్టుబట్టలు, జులపాల జుట్టు వుండి, చకచకా నడుస్తున్న కుర్ర వాడిని స్వామివారుగా గుర్తించటానికి అనేకమంది పెద్దలకు సాధ్యం కాలేదు. అయితే ఒక చిక్కు మాత్రం వీళ్ళని ఉక్కిరిబిక్కిరి చేసింది.

అది స్వామివారి కళ్ళలో కనిపించే ఉగ్రకాంతి. ఆ కేరళ పర్యటన మొత్తంలో స్వామి కళ్ళు లీనావస్థలోకి జారిపోతుండగా పట్టి బలవంతాన వ్యవహార ముఖంలో నిలబెట్టే కళ్ళుగా యేమాత్రం అనుష్ఠానానుభవం వున్న వార్లకైనా స్పష్టంగా తెలుస్తాయి. స్వామివారి మాట గూడా దానికి తగ్గట్టే తీవ్రంగానూ, విసుగ్గానూ, సంగ్రహంగానూ వుండేది. అయితే ఆ మాటలకు ఫలం మాత్రం సద్యఃఫలమే.

కొచ్చిన్ నుంచి గురవాయూర్ వెడదామని వెంటబడ్డారు కొచ్చిన్ భక్తులు. కేరళీయులకు గురువాయూర్ అత్యంత ముఖ్య క్షేత్రం గదా! గురువాయూర్ అంటే యిప్పటి క్షేత్రమా మరి, అది ద్వాపరాంతానికి, కలి ప్రారంభానికి చెందిన క్షేత్రం. అంటే ఐదువేల సంవత్సరాల పైమాట.

శ్రీకృష్ణ పరమాత్మ తన అవతారం చివరలో, ద్వారకలో తన స్వహస్తాలతో ఒక నారాయణ విగ్రహం ప్రతిష్ఠించాడట.

ఇక ద్వారకను సముద్రంలో ముంచి వేయదలుచుకున్నపుడు ఆయన దేవ గురువైన బృహస్పతికి "ఈ విగ్రహం అతి ముఖ్యమైనది. ఇది ప్రజలకు దక్కకుండా పోరాదు. దీన్ని నీవు ఏదైనా ఉపాయం చేసి రక్షించు" అని కబురు చేశాడట. గురువుగారు ఆలోచించి

---

* ఈ మొట్టమొదటి కేరళ పర్యటన గురించి యింతకన్న వివరాలు సంపాదించలేక పోయాను.

** వీరి పేరు గూడ తెలియదు. ఒక ఏనుగునే యిద్దామను కొన్నారనీ, స్వామివారు 'పోషించలేను. వద్దు' అన్నారనీ చంద్రశేఖరయ్యగారు చెప్పారు. దీన్ని ధృవీకరించేందుకు వేరే ఆధారమేమీ దొరకలేదు.

తన శిష్యులలో ఒకడైన వాయువును వెంటబెట్టుకొని ద్వారకకు వచ్చాడట. అప్పటికి ద్వారక, నీళ్ళలో మునిగిపోతోంది. ఎలాగూ ఆ జలప్రళయంలో తన శిష్యుడు వాయుదేవుడి పాత్ర గూడా వుందిగదా !

గురువుగారు వాయుదేవుణ్ణి ఆ విగ్రహాన్ని ఎగరదన్నుకు రమ్మన్నాడు. వాయుదేవుడు స్వామివారిని బుజానపెట్టుకొని వెనకరాగా, గురువుగారు ముందు నడవసాగారు. నర్మదానది దాటి కృష్ణా, గోదావరీ, కావేరులు దాటి కేరళలో ప్రవేశించాడు గురువుగారు. అక్కడ ఆగాడాయన.

రెండు కారణాలు ఆయనను ఆపినాయి. ఆ క్షేత్రంలో ప్రవేశించినప్పటి నుంచీ, విష్ణు శక్తి మంత్రమయమై ఆయన అంతర్నేత్రానికి ప్రకాశించసాగింది. దానికి కారణం, ఆ నేల విష్ణుమూర్తి అంశావతారమైన పరశురాములవారి మంత్ర శక్తి వలన పుట్టిందవటమే.

ఆ కథ యింకా వెనక్కి, త్రేతాయుగారంభానికి సంబంధించినది.

భూమిమీద వున్న రాజు లందర్నీ సంహరించినాక పరశురాముడు శ్రీ దత్తాత్రేయ స్వామి అధ్వర్యంలో ఒక యాగం చేశాడు. ఆ యజ్ఞం చివరలో ఋత్విక్కులకు, తను సంపాదించిన భూమి అంతా దక్షిణగా దానం చేశాడు.

అప్పుడు ఆ యాగంలో ప్రధానులలో ఒకడయిన కశ్యప మహర్షిగారు, ఇతర మహర్షులను సమావేశపరిచి, "ఇతను దుర్మార్గులైన రాజులను సంహరించాడు. సంతోషమేగాని, ఎప్పుడూ అడవులలో ముక్కు మూసుకొని కూర్చునే మనంగాని ఇతనుగాని, ఈ పృథివీ పరిపాలనకు అర్హులంకాము. అదీగాక యితడు మహాకోపి, కనుక ఎవరు రాజ్యంలోకి వచ్చినా, ఇతనివల్ల వారికి ప్రమాదం తప్పదు. కనుక యితన్ని దగ్గరకు రాకుండా కట్టుదిట్టం చేసి, ఈ రాజ్యం అంతా ఎవడైనా మంచి క్షత్రియుడి చేతిలో పెట్టటం మంచిది." అని బోధించాడు. వారంతా, బావుందన్నారు. అప్పుడు వారు పరశురాముడి దగ్గరకు వచ్చి—

"ఏమయ్యా, నువ్వు భూమంతా మాకు దానం చేశావు గదా ! దానం చేసిన భూమిలో నువ్వు నివసిస్తూ వున్నావంటే ఆ భూమిని నువ్వు అనుభవిస్తున్నట్లేగదా ? అది ధర్మం కాదు" అన్నారు.

ఈ వూహించని దెబ్బకి పరశురాముడు ఉగ్రుడయ్యాడు కాని, ధర్మానికి కట్టుబడె "నిజమే, కొంచెం సమయ మియ్యండి, వెళ్ళిపోతాను" అన్నాడు.

అప్పుడా పరశురాముడు ఆలోచించాడు. "ఇప్పటికి వున్న భూమినే కదా నేను దానం చేశాను ! నీళ్ళల్లో వున్న భూమిని పైకి లేవనెత్తితే, అది దానం చేసిన భూమి కాదు గదా ?"

అలా ఆలోచించి పశ్చిమ సముద్ర తీరానికి వెళ్ళి మహేంద్రగిరి అనే కొండ యెక్కి సముద్రం మీదికి తన ఆయుధం ప్రయోగిద్దా మనుకునేసరికి ఆ సముద్రుడు గడగడలాడ

సాగాడు. అది చూసి ఆయుధం పక్కన పెట్టి చేతిలో వున్న స్రువాన్ని వేసి సముద్రుణ్ణి కొట్టాడు పరశురాముడు.

ఆ దెబ్బకు పశ్చిమ సముద్రం వెంబడి ఒక పొడుగాటి మట్టి పెళ్ళ బైటికి వెళ్ళుకు వచ్చింది. అదే కేరళ దేశం. (ఇప్పటి కేరళ రాష్ట్రానికన్నా కొంచెం విశాలమైనది.)

మహర్షులీ అద్భుత కార్యాన్ని మెచ్చుకొని ఆ దేశమంతా క్షేత్రమే అని ప్రశంసించారు. దాన్ని వారు పరశురామ క్షేత్రం అని పిలిచారు.

అందుచేత గురువుగారికి, కేరళకు రాగానే విష్ణువుయొక్క స్వార్జిత క్షేత్రానికి వచ్చి నట్టు తెలిసింది.

ఇక రెండోది. ఆ స్వామి ఎలాగూ ద్వారకలో సముద్ర తీరపు చల్లగాలులకు బాగా అలవాటు పడి వున్నాడు. అందుకని ఆ కేరళ సముద్ర తీరంలో ఒక పవిత్రతర ప్రదేశంలో, గురువుగారు, వాయువు కలిసి ఆ విగ్రహాన్ని పునః ప్రతిష్ఠించి అక్కడ స్వామి సేవార్థమై ఒక నగరాన్ని నెలకొల్పారు. గురువు, వాయువు కలిసి ఏర్పరచిన క్షేత్రం కనుక దాన్ని గురు-వాయు పురం అన్నారు ప్రజలు. అదే గురు-వాయు-ఊరు=గురువాయూరు అయింది కాలక్రమంలో.

వాయువు ఆరోగ్య దేవత కనుక ఆ స్వామి, ఆరోగ్యం అనుగ్రహించటంలో శీఘ్ర ఫలదాత అయ్యాడు. గురువు జ్ఞానదేవత గనుక, ఆ స్వామి జ్ఞానప్రదుడు గూడ అయ్యాడు. అందుచేత గురువాయూరు అనతి కాలంలోనే యావద్భారత ఖ్యాతి నందుకొని ఈనాటికీ కేరళ దేశానికి అలంకారంగా వుంది. అందుచేత ఆ కేరళీయులు తమ గురువుతో కలిసి గురువాయూరప్ప (గురువాయూరులోని స్వామి) దర్శనం చేద్దామని ఉవ్విళ్ళూరారు. స్వామివారు గూడ అంగీకరించి, ఆ క్షేత్రానికి వెళ్ళారు.

అది చాలా గొప్ప క్షేత్రం, పెద్ద గుడి. పెద్ద ఆవరణ. నిరంతరమూ జన సందోహం.

ఆ గుడి ఆవరణలోకి అడుగుపెట్టి అలా ధ్వజస్తంభం దాకా వెళ్ళేసరికి ఆ ధ్వజస్తంభం పైనించి—

"సత్యనారాయణా, బాబూ సాధుపెయ్యా, సత్యనారాయణా" అని ఒక కేక విని పించింది స్వామివారికి. ఆయన పైకి చూచారు.

"సాధుపెయ్యా, సత్యనారాయణా, నేనేరా, ఇక్కడుండి పోయాను." ఎవరో అదృశ్య జీవి పైనుంచి ఆక్రోశిస్తున్నాడు! క్షణంలో స్వామివారి కళ్ళల్లో నీళ్ళు ధారలు కట్టినై. కూడా వున్న భక్తులు కంగారుపడి పోతున్నారు. స్వామి ఆ జనంలో ధ్వజస్తంభం దగ్గర చతికిలబడి పోయారు.

"ఏమయింది? ఏమయింది?" భక్తులకు ఏమీ అర్థం కావటం లేదు. ఒక క్షణం అయ్యాక స్వామివారు తెప్పరిల్లారు.

"ఇప్పుడు నేను ఆలయంలోకి రారాదు. మీరు వెళ్ళి వచ్చెయ్యండి" అన్నారు.

"అదేమిటి స్వామీ ?"

"చెపుతాను, దార్లో చెపుతాను. ముందు నేను పొద్దుటూరు వెళ్ళాలి."

"అలాగే వెదుదురుగాని, గుళ్ళోకి రండి."

"చెప్పాగా, ఇప్పుడు రారాదు. గురువాయూరప్పతో నేను మాట్లాడాలే. మీరు వెళ్ళి రండి త్వరగా."

అదయిన తరువాత ప్రయాణంలో కార్లో చెప్పసాగారు స్వామివారు.

* * *

## భల్లూక మైత్రి

మీరంతా నా దగ్గరకు శిష్యులుగానే వచ్చినా, నాకన్నా చాలా వృద్ధులు నాకు గౌరవనీయులు. మీకు చాలా లోకానుభవం వుంది. కాని సాధనానుభవం గురించి కథ లయినా తెలియవు ఇప్పుడు ఈ వయస్సులో మీకు సాధనోపదేశం చేసినా మీ శరీరం మీకు సహకరించదు. వయస్సు మళ్ళినాక ఆధ్యాత్మిక దృష్టి సంగతి చూసుకోవచ్చునను కుంటారు చాలామంది. శాస్త్ర సంస్కారం వున్న కొందరు ముందు చిన్నతనంలో జీవనానికి కావలసిన చదువు వచ్చాక ఆపైన ఆధ్మాత్మిక సంగతి చూసుకుందాంలే అనుకుంటారు. రెండూ తప్పే. ఆధ్యాత్మికత ఉగ్గుపాలనుంచీ రావాలి. చిన్నప్పటి పిచ్చిక గూళ్ళనుంచీ ఆ దృష్టి పడాలి. బుడి బుడి కథలలోనే ఉపదేశాలు జరగాలి. అప్పటినుంచీ సాధన ఏదో రూపంలో ప్రారంభం కావాలి. అప్పటికిగాని అందుకోదు కరెంటు. అన్నీ వుడిగి కాటికి కాళ్ళు చాచినాక అప్పుడు మొదలెడతానంటే వచ్చే ఫలం స్వల్పం.

ఇప్పుడు కాకపోయినా పైజన్మలో అయినా మిమ్మల్ని నాకు దగ్గరలోనే జన్మింప చేసుకొని బాల్యం నుంచీ మిమ్మల్ని నడుపుకోవాల్సిన బాధ్యత నాకే వుంది కనుక, నా సాధనా విధానం మీకు చెపుతాను. ఇది ఉపదేశం. ఇది మీకు సంస్కారంగా, ఉత్తమ జన్మలకు మూలధనంగా ఉపయోగిస్తుంది.

ఇందాక స్వామి ధ్వజస్తంభం దగ్గర, నా తండ్రి తరువాత తండ్రి అని చెప్పదగిన జీవి ఆక్రోశిస్తూ నన్ను కౌగలించుకొన్నాడు. ఒక విధంగా నేనొక పొరపాటు చేశాను. ఆ జీవిని యిదివరకే లీనం చేసుకొని వుండవలసింది. ఆలస్యానికి వేరే కారణాలు వున్నాయను కోండి. ఆ జీవి ఎవరో, ఆయన నాకు పితృతుల్యుడెలా అయ్యాడో తెలుసుకోవాలంటే నా సాధన కొంత చెప్పాలి.

సామాన్యంగా సాధనా రహస్యాలు ఇతరులకు చెప్పరాదు. దానివల్ల ఇతరుల సాధనలో మార్గ భేదం కలుగవచ్చు. చెప్పేవాడికి అహంకారంగా పరిణమించవచ్చు. కాని యిప్పుడిది నేను నాకథ చెప్పటం కాదు. మీకు సాధనోపదేశం చేయటం కనుక జాగ్రత్తగా వినండి.

మా అమ్మ ఒక శ్రీ విద్యా సిద్ధయోగిని. మా నాన్న నిత్య వైరాగ్యశీలి. మా మేనత్త వెంకమ్మగారు జ్ఞానమార్గావలంబిని అయిన హఠయోగిని. ఈ ముగ్గురూ నా సాధనకు త్రిమూర్తులు. వీరిలో నాన్న కన్న అత్త, అత్త కన్న అమ్మ నాకు ముఖ్య గురువులు.

మా అమ్మ నా పదకొండవ యేట శరీర త్యాగం చేసింది. చేసే ముందు నాకు ఉపదేశం చేసింది. అంతకు ముందే దానికి కావలసిన పూర్వ రంగం సిద్ధం చేసింది. ఈ విషయం మా నాన్నకు గూడ తెలియదు. మా అమ్మ పోయేసరికి నాకు యిద్దరు చెల్లెళ్ళు వున్నారు. మా అమ్మ పోగానే, " ఈ పిల్లలందర్నీ ఎలా పెంచటం " అని ప్రశ్న వచ్చింది. మూరెండో చెల్లెలు సరస్వతిని, మా అమ్మ చెల్లెలు పార్వతమ్మగారు పెంచుకుంటానంది. పెద్ద చెల్లెల్ని మరో పెద్దమ్మ తీసుకుంటానంది.

కాని, నన్ను తీసుకెళ్ళడానికి యెవరూ వొప్పుకోలేదు. అది నా భాగ్యం. దానికి తోడు మా పెద్ద చెల్లెలు వరలక్ష్మి నన్ను వదిలి వుండనని గోల చేసింది. దుఃఖంతోకూడిన వైరాగ్యంతో వివశుడై వున్న మానాన్న ఉగ్రుడై, ఈ పిల్లల్నిద్దరినీ నూతిలోకి తోసేస్తే, అందరి బాధా తీరి పోతుందని చిందులేసి ఊరిబావి దగ్గరకు లాక్కుపోయాడు. మా చెల్లెలు భయపడి ఏడవసాగింది. నేను మాత్రం " నీళ్ళల్లో వెయ్యి, నాకు భయంలేదు " అన్నాను.

అప్పటికి నేను కొంచెం కొంచెంగా సమాధిస్థితి ద్వారా జలస్తంభన అభ్యసిస్తున్నాను. సిద్ధి అప్పటికి రాలేదు. ఈ మధ్య యీ శోణ వస్త్రాలు నాకు లభించే ముందు అది సిద్ధించింది. అయినా అప్పటి మొండి ధైర్యం అది!

ఈలోగా వూరి పెద్దలు వచ్చి మా నాన్నని కేకలేసి, మమ్మల్ని వెనక్కి తెచ్చారు. ఈ గోలతో కోపం వచ్చిన మా తాతగారు లింగణ్ణగారు, ముగ్గుర్నీ నేనే తీసుకుపోతానని తీసుకు పోయాడు. అన్నాడు గాని ఆయనకే జరగని పరిస్థితిలో వున్నాడు. ఆయనే మా పిన్నమ్మ పార్వతమ్మ దగ్గర మైసూరులో వున్నాడు. అందువల్ల నన్నూ, మా పెద్ద చెల్లెలు వరలక్ష్మినీ బన్నీరుగట్టులో దింపారు.

బన్నీరుగట్టు బెంగుళూరు దగ్గరలో ఒక చిన్న క్షేత్రం. చంపక దామేశ్వర ఆలయంవుంది అక్కడ. అప్పట్లో అక్కడ మా పెద్దమ్మ శారదమ్మగారి భర్త అర్చకుడుగా వుండేవాడు. వాళ్ళు మా వరలక్ష్మిని వుంచుకుంటామని ముందే చెప్పారు. కాని యిప్పుడు బలవంతం పెట్టి " ప్రస్తుతానికి కానీండి " అని నచ్చచెప్పి నన్ను గూడ అక్కడే వుంచారు. అక్కడ మా పెద నాన్నగారి చేతికింద సహాయంగా వుంటూ కొన్ని నెలలపాటు వుండిపోయాను.

అవి కొత్తగా ఉపదేశ స్వీకారం చేసిన రోజులు. అంతర్యాగ క్రమంలో, అనుష్ఠానం బహు తీవ్రంగా సాగుతూ ఉండేది. మా అమ్మగారు నాకు, బహిఃప్రతీకోపాసన వద్దని నిషేధించారు. నాకు అయాచితంగా ప్రాప్తించిన అమ్మవారి సన్నిధి, నా అంతరుపాసనకు మంచి వాతావరణం సృష్టించింది.

అది డాదాపు పల్లెటూరు. ఆ ఊరు చుట్టూ అడవి. ఆ ఆలయానికి పెద్దగా జనం తాకిడి లేదు. అందువల్ల ఆ ఆలయం నా ప్రారంభ సాధనకు చాలా అనుకూలించింది. అప్పుడప్పుడు మా అమ్మగారు రుచి చూపించిన, దివ్యస్థితి దర్శనం ఇస్తూ ఉండేది. ఆనందం అగ్గలమైనపుడు, ఆ తల్లి ముందు విశృంఖలంగా నాట్యం చేసి సంతోషించేవాణ్ణి.

చిత్తశుద్ధితో సాధన చేసే సాధకుడికి, ఆ పరమేశ్వరి అనేక సౌకర్యాలను కల్పిస్తుంది. అలాంటి సౌకర్యాలలో, బంధువుల అనాదరం నాకు ప్రధానమైనది. బన్నీరుగట్టులో బంధువుల అనాదరం నన్ను తరుచు ఊరి బయట అడవిలోకి నడిపించేది. ఆలయంలో ఏ మాత్రం నరవాసన వున్నాగూడా, నా స్థానం ఊరి బయట అడవే. ఆ అడవి నాకు నిజంగా తపోవనంగా పరిణమించింది అనేక రోజులు, పగలల్లా అడవిలో గడిపేవాణ్ణి.

భాష మారటం వల్ల నాకు చదువు బాధ ఉండేది కాదు. అయినా, నా చదువు గురించి బాధపడేవారు లేరు అప్పట్లో. గుళ్ళో పని చూడటం, రాత్రికి యింటికి చేరటం, యిది చాలు. ఇక నా బాధ వారికి లేనట్లే. కాని సాధకుడికి చేసే సహాయాల్లోనే, పరీక్షలు గూడ మేళవిస్తుంది ఆ శ్రీమాత. ప్రేమతో గూడిన అన్నపు ముద్దలకు కరువు వాచివున్న నా కుర్ర మనస్సుకు ఆ అడవిలో వూహించని ఊరట ఒకటి దొరికింది.

అడవిలో ఒక చెట్టు కొమ్మమీద కూర్చుని, అంతర్యాగం సాగిస్తున్నా నొక రోజు. ఒక పెద్ద ఎలుగుబంటి నా దగ్గరకు వచ్చింది. నేను కూర్చున్న కొమ్మ పెద్ద ఎత్తుగా లేదు. ఎలుగుబంటి కొమ్మకన్నా ఎత్తుగా వుంది. నాకు భయం వెయ్యలేదు. సంతోషంగా దాని వంకే చూస్తున్నాను. అది గూడా మెల్లగా వచ్చి, నా కాలు నాక సాగింది. నాకు చక్కలిగింత పెట్టి కొమ్మమీది నుంచి దూకాను. అలా మెల్లిగా దానికీ నాకూ స్నేహం కుదిరింది. ఒక రోజున, అది పనస పండొకటి నోటితో పట్టుకు వచ్చింది. ఆ పండు నా దగ్గర పెట్టి వెళ్ళింది. ఆ పండు నేనేం చేసుకొనేది? ఇంటికి తీసుకుపోదామన్నా నేను మొయ్యలేను. ఆ కాయ అంత పెద్దది. పైగా నాకు చాలా నీరసంగా వుంది. ఇంతలో ఒక తేనెపట్టు పట్టు కొచ్చింది నా ఎలుగుబంటి నేస్తం. కొన్ని అడవి ఆకులు తెచ్చింది. ఈ పనస పండు తనే గోళ్ళతో వొలిచింది. ఆ తొనలమీద యీ పుట్ట తేనె పిండింది. ఒక్కొక్క తొనా, నా నోటికి అందించ సాగింది. ఆ ప్రేమకు నాకు వొళ్ళు పులకించింది. ఇంక ఆ రోజునుంచి రోజూ నాకు తేనె పనస తొనలే ఆహారం అయింది. అది యోగి ఆహారం. దానివల్ల నా సాధన ఎంతో తీవ్రతరంగా

కాని, నాకు ఎలుగుబంటితో స్నేహం బలపడసాగింది. సాధకుడికి బంధకరమైన స్నేహం పనికిరానిది. బంధువుల నిరాదరణ అమ్మ అనుగ్రహం అనుకునేవాడికి, ఎలుగుబంటి ఆదరణ సంతోషించదగిన దవుతుందా ? నాకీ ఆలోచన వచ్చేసరికి ఒక ఆరు నెలలు పట్టింది. అప్పటికి, సాధనకు ఏకాంతం కావలసిన అవసరం దాటిపోయింది.

ఇంతలో వున్నట్టుండి నా గొంతు వాచి, జ్వరం వచ్చింది. నేను అడవిలో అడ్డమైన తిరుగుడూ తిరుగుతున్నందువల్ల అది వచ్చిందనీ, అదేదో గండమాల వంటి పెద్ద జబ్బనీ, భయపడ్డారు మా బంధువులు. మా తాతకు వుత్తరం వ్రాశారు.

ఆయన అప్పుడు నగువళి అనే వూళ్ళో వుండేవారు. నగువళి నా జన్మస్థలం. మేకేదాటు అనే అడవికి దగ్గరలో ఒక పల్లె. ఆయన నన్నొక్కడినే తీసుకెళ్ళి వైద్యం చేయిద్దామనుకున్నాడు కాని, మా చెల్లి వరలక్ష్మి తను వొక్కతీ అక్కడ వుండనంది. చేసేదిలేక ఇద్దర్నీ తీసుకు వెళ్ళాడు.

నేను నా ఎలుగుబంటి మిత్రుడికి యివ్వవలసింది యిచ్చేసి అక్కడి నుంచి సంతోషంగా బయిలుదేరాను. అక్కడ వైద్యుడి కోసం రోజుకు ఆరు మైళ్ళు నడిచేవాణ్ణి. కానీ నా రోగం అక్కడ తగ్గలేదు. అందువల్ల అక్కడే నుంచి మైసూరు మా పిన్నమ్మ పార్వతమ్మ గారింటికి తెచ్చారు. అక్కడా నా రోగం తగ్గలేదు. రోగం ఎక్కడ తగ్గాలో అమ్మకు తెలుసు. వాళ్ళు మా నాన్నకు రాశారు. ఆయన వచ్చాడు. "ఆడ పిల్లను బన్నీరుగట్టులో వాళ్ళు అట్టే పెట్టుకుంటామంటున్నారు. దాన్ని అక్కడ దించేసి వీడిని నువ్వు తీసుకుపొ"మ్మన్నారు, మా నాన్నతో తాతగారూ వాళ్ళూ. సరే అని మా నాన్న మమ్మల్నిద్దరినీ బన్నీరుగట్టు తీసుకువెళ్ళాడు. దార్లో మా చెల్లెలికి చెప్పవలసిన బుద్ధులన్నీ చెప్పాడు, సరే అంది. కాని తీరా నేను మా నాన్నతో కలిసి బన్నీరుగట్టునుంచి బయలుదేరుతుంటే అది "నేనుండను, అన్నయ్యతోనే వుంటాను" అని ఏడవసాగింది. పెద్దమ్మా, పెద్దనాన్నా దాన్ని బతిమిలాడారు నాన్న చావగొట్టాడు. అయినా అది నన్ను వదలనని నన్ను వాటేసుకుని శోకాలు పెట్టింది.

"ఏమిరా, ఆ జీవి నీ కోసం ఏడుస్తోంది. ఏం చేస్తాం, కానీ" అన్నాడు మా నాన్న చివరికి.

తల్లిపోయి అఘోరిస్తున్న తొమ్మిదేళ్ళ ఆడపిల్ల కొత్త చోట వుంటానికి భయపడితే అది తప్పా ? కాదు. కానీ నాకీ బంధమేమిటి ? అది అమ్మ యిచ్చిన వరం. వరలక్ష్మి కదా అది. "సరే కానీ, చూద్దాం, ఏమవుతుందో !"

మా వూరు వెళ్ళేసరికి నాకే కాదు, మాకు వండి పెట్టలేక మా నాన్నకు గూడ రోగం కుదిరింది. మా నాన్న చిన్నప్పటి నుంచీ విరాగిగా తిరిగినవాడు. దైవయోగ ప్రాబల్యంవల్ల గృహస్థయినవాడు. కూర్చుని పిల్లల్ని సాకటం ఆ జీవి సంస్కారంలో లేని పని. దాని కాయన కర్త కాదు.

ఆయన మా మేనత్త వెంకమ్మకు ఉత్తరం వ్రాశాడు. ఆవిడ పొద్దుటూరు నుంచి వచ్చింది. ఆవిడ రాంగానే కాళ్ళు గూడా కడుక్కోకముందే—

"వద్దన్న కొద్దీ పెళ్ళి చేశావు. ఇప్పుడు నానా యాతనా పడుతున్నాను. నీ మూలంగానే వచ్చి పడ్డదీ పాడుసంత. నువ్వే తీసుకుపోయి సాకు, నెలకింతని పంపిస్తాను." అన్నాడు.

పల్లె ప్రజలకు నాజూకులు తెలియవు, గుండెల్లో గుట్టు దాచుకోవటం తెలియదు. అందులో మా వూరు పూర్తిగా ఇక్ష్వాకుల నాటి వూరు. అందువల్ల, ఆ అక్కాతమ్ముళ్ళ వాదన బస్తీవాళ్ళకు మొరటుగానూ, హీనంగానూ కనిపించవచ్చునుగాని, నిజానికి అందులో వైరాగ్యానికీ, బాధ్యతకీ మధ్య నలుగుతున్న, దాపరిక మెరుగని పాతకాలపు జీవుల ఆవేదన వ్యక్తమవుతున్నదని గ్రహించాలి మనం.

వైరాగ్యంలో, పట్టుదలలో తమ్ముడికన్న ఒక ఆకు ఎక్కువే చదివిన మా మేనత్త "నీ డబ్బు నీ దగ్గరే వుంచుకో. బాధ్యత నా దన్నావుగా, పిల్లల్ని నేనే తీసుకుపోతానులే" అని తీసుకుపోయింది. ఆ విధంగా మేము, మా కాషాయి గుడ్డల వెంకమ్మత్త వెంట పొద్దుటూరు చేరాం.

మా వెంకమ్మత్తకు ఉండటానికి ఇల్లు లేదు. ఆవిడ భర్త నంద్యాల సుబ్బయ్యగారు ఆస్తంతా తగలబెట్టి, తక్షణమే స్వర్గానికి వెళ్ళిపోయాడు. ఆవిడకు సంతానం లేదు. తమ్ముల దగ్గర డబ్బు తీసుకోదు. ఆవిడ కొద్దిగా వైద్యం చేసేది. ఎప్పుడైనా బాగా తెలిసిన వాళ్ళిళ్ళల్లో వంటలు చేసేది. ఆ సంపాదన మీదే అప్పటిదాకా ఆవిడ జీవితం గడుస్తోంది.

పొద్దుటూరులో మెయిన్‌రోడ్డుమీద అవధానంవారి దేవాలయం అని ఒక శివాలయం వుంది. ఆ శివాలయంలో ఒక చిన్న గదిలో వుండేది. ఆ ఆలయం చిమ్మటం, కడగటం, రాత్రిళ్ళు దీపం పెట్టటం ఆవిడ పనులు. ఇదీ ఆవిడ ఐశ్వర్యం. ఇప్పుడు యిద్దరు పిల్లల్ని తెచ్చి నెత్తిన పెట్టుకుంది. ఏమిటి ఆవిడ ధైర్యం ?

అకుంఠితమైన హఠయోగ సాధన వల్లా, నిరంతమైన తత్వచింతనవల్లా యేర్పడిన ఈశ్వరార్పణ బుద్ధే ఆవిడకు ఉన్న బలమని, యీ లోకంలో చాలా మందికి తెలియదు. మా నాన్నకు గూడా పూర్తిగా తెలీదు. ఆవిడ మమ్మల్నిద్దర్నీ తన యిరుకు గదిలోనే వుంచుకొని మునిసిపల్ స్కూల్లో చదువుకు చేర్చింది. ఆ చదువుతోపాటే తన స్వంత చదువు నాకు ప్రారంభించింది.

ఆవిడ నాకు చెప్పిన చదువును గురించి మీకు తెలియాలంటే ఆవిడ గురించి కొంచెం తెలియాలి.

వెంకమ్మత్త స్త్రీయే గాని ఆవిడ లక్షణాలన్నీ పురుష లక్షణాలే. ఆవిడ మేధాశక్తి అద్భుతం. ధారణ ఆశ్చర్యకరం, ధైర్యం అనన్యం. ఆవిడది శిలోపాసన. నిప్పులు కడిగే ఆచారం, కత్తుల మీద నడిచే క్రమశిక్షణ, దీనులమీద విశాలమైన దయ, ఆవిడ జీవ సంపుటిలో సహజసిద్ధమై వచ్చిన లక్షణాలు.

అవైదిక మార్గము లందు అసహ్యం, నిత్య జప పరత్వం, నిరంతర భగవద్గీతా అనుసంధానం, ఆవిడ సాధనకు ప్రకటంగా కనిపించే మూల సూత్రాలు. ఆ జీవికి అసలైన అంతర్నాడి మాత్రం హఠయోగం. ఇది రహస్యం. విపరీతమైన కోపం ఆవిడ సాధనకు రక్షా కవచం.

హఠయోగం విషయంలో ఆవిడ గురువు ఎవ్వరో చెప్పేది కాదు. గురువు శరీరం చాలించినాక శివుడే గురువని భావించే సంప్రదాయంలో మనిషి కనుక, శివుడే నా గురువని నాబోటి వాళ్ళతో చెప్పేది. జ్ఞాన మార్గంలో ఆమె ప్రధానంగా రమణ మహర్షి పరంపరకు చెందినది. రమణ మహర్షిగారి శిష్యుడైన అభేదానందస్వామి వారని ఒకరు ఆ రోజుల్లో పొద్దుటూర్లో ఒక ఆశ్రమం ఏర్పరచుకొని వుండేవారు. ఆయన ఈవిడకు గురువు కాదుగాని గురుతుల్యుడు. ఆవిడ రోజూ తన అనుష్ఠానం చేసుకొని భోజనం చేసేసరికి మధ్యాహ్నం మూడయ్యేది. రాత్రి మంచినీళ్ళు గూడా తాగదు.

సాధకుడికి క్రమశిక్షణ ప్రాణంతో సమానం. అది పట్టుబడాలంటే సమర్థవంతమైన శిక్షణ కావాలి. అది నాకు మా అత్తద్వారా అనుగ్రహింపబడింది.

మేము పొద్దుటూరు చేరిన రోజునే రోజు మొత్తానికి కార్యక్రమం పట్టిక తయారు చేసి పెట్టింది—నాకూ, వరలక్ష్మికీ గూడా.

తెల్లవారు జామున నాలుగు గంటలకు నిద్రలేవాలి. అయిదింటి దాకా పాఠాలు చదవాల. అప్పుడు చన్నీళ్ళు స్నానం చెయ్యాలి. చేసి, తడిబట్టలతో శివుడి ఎదురుగా నుంచుని కొన్ని స్తోత్రాలు పారాయణ చెయ్యాలి. (వాటిలో బ్రహ్మ మురారి సురార్చిత లింగం, నాగేంద్రహారాయ ముఖ్యం) తరువాత దేవుడికి పూలు కోసుకు రావాలి. ఇదయ్యేసరికి బడికి వేళ అయిపోతుంది. రాత్రిళ్ళు చదువుకొని తొమ్మిదింటి కల్లా పడుకోవాలి. ఇది నాకు, చెల్లెలికి కలిపి కార్యక్రమ పట్టిక. ఇక నాకు విడిగా రహస్యంగా వేరే వుంది. ఏ కార్యక్రమంలో నిమిషం తేడా వచ్చినా, ఆవిడ చేతిలో విసిని కర్ర దెబ్బలతో వీపు వాచి పోవలసిందే.

ఆ వున్న కాస్త యిరుకు గదిలో, కప్పుకునేందుకు బట్టలయినా లేకుండా, ఆ దోమలకు, చలికి తట్టుకుంటూ రాత్రిళ్ళు గడపటం, ఇతరులకైతే ఒక శాపం. నాకు మాత్రం అది వరం! ఉన్నంతలో చేతయినన్ని సౌకర్యాలూ, వరలక్ష్మికి చేసేది. వెంకమ్మత్త. నా దగ్గర ఏదన్నా కాస్త సౌకర్యంగా వుందని కనిపిస్తే లాగి పారేసేది.

ఇలా సాగుతుండగా అక్కడికి వెళ్ళిన కొద్దిరోజులకే ఆవిడ దగ్గర వున్న కాసిని బియ్యం అయిపోవచ్చాయి. తెలిసిన వాళ్ళని నలుగురినీ అడిగి చందాలు పోగు చేసి మాకు స్కూలు డబ్బులు కట్టింది. ఊరి కరణంగారితో చెప్పి, ఆయన రాసి పారేసిన కాగితాల్లో ఒక వైపు తెల్లగా వున్న కాగితాలు కొన్ని నాకు నోట్సు పుస్తకాలుగా యిప్పించింది. టెక్స్టు పుస్తకాలు కొనే తాహతు లేదు కనుక పక్క వారి దగ్గర రాసుకోమంది. ఇక బియ్యం అయిపోతున్నా యనగా వొంటి పూట భోజనం మొదలెట్టింది. ఈలోగా మానాన్న దగ్గర నుంచి మూడు వందల రూపాయల మనియార్డరు వచ్చింది. ఆ రోజుల్లో మూడు వందలనేసరికి డబ్బిచ్చే పోస్టువాడికే ఆశ్చర్యమైంది. వెంకమ్మత్త ఆ డబ్బు తీసుకొంది. నే నాశ్చర్యపోయాను. కాని ఆ రోజే అప్పు చేసి బొమ్మెపర్తి వెళ్ళి ఆ డబ్బు తమ్ముడి మొహాన కొట్టి వచ్చింది. యోగబలం ఉన్న వారికి అధైర్యమనేది వుంటుందా?

మా నాన్న సరే పొమ్మన్నాడు తప్పితే, తను వచ్చి పిల్లల్ని చూడనుగూడా చూసే వాడుకాదు. గర్భమోహం వదలనివాడు వైరాగ్య మార్గంలో అడుగు పెట్టలేడు కదా!

ఒంటిపూట భోజనం అనేసరికి రాగాలు మొదలెట్టింది వరలక్ష్మి. నిజంగా వొంటిపూట భోజనం మొదలెట్టాక నేలమీద పొర్లి శోకాలు పెట్టసాగింది. ఆ రోజుకు నాలుగు విసినకర్ర దెబ్బలతో దాన్ని నిద్దర పుచ్చింది. ఆ రాత్రి మామూలు ప్రకారమే నన్ను వొంటిగంటకు నిద్ర లేపింది వెంకమ్మత్త.

## మధుకరి

ఆ రోజు బ్రహ్మచర్య లక్షణాల గురించి, భిక్షాటన ప్రాశస్త్యం గురించి, మధుకర విధి గురించి ఎంతో మనోహరంగా వివరించసాగింది. సామాన్యంగా వెంకమ్మత్త ఉపదేశ విధానంలో మాటలు తక్కువ. ఇవాళ్ళ మాత్రం చిన్నప్పుడు మా అమ్మ చేసే బోధనాశైలి గుర్తుకొచ్చే లాగా బోధించసాగింది.

"నాలుగు ఆశ్రమాల్లోనూ బ్రహ్మచర్యాశ్రమం మొదటిదని తెలుసు గదా! బ్రహ్మచర్యం అంటే అది ఒక ఆశ్రమం మాత్రమే అనుకొనే వాడికి చాలా హాయి. వేదాధ్యయనంతో వాడి పని పూర్తయిపోతుంది. మన కలాంటి దుస్థితి లేదుకదా! మనబోటి వాళ్ళ బ్రహ్మచర్యం అఖండమైంది. బ్రహ్మచర్యం అంటే బ్రహ్మయందు చరించటం.

కదలటం అని తత్వశాస్త్రంలో ఎక్కడయినా వస్తే తెలుసుకోవటం అని సంకేతం. బ్రహ్మయందు చరించటమంటే బ్రహ్మను తెలుసుకోవటం అన్న మాట. బ్రహ్మను తెలుసుకో టానికి వున్న అడ్డం ఒక్కటే. అదే అహంకారం. ఈ అహంకారానికి రెండు రూపాలున్నాయి. రాగం, ద్వేషం.

రాగంచేత పుణ్య కర్మలను స్వీకరిస్తాడు, ద్వేషంచేత పాపకర్మలను పరిత్యజిస్తాడు. ఇది లోకంలో ఉండే సాధు పురుషుల సామాన్య స్థితి. ఈ రెంటినీ విసర్జిస్తే అది వైరాగ్యం.

జ్ఞానం, వైరాగ్యం అనేవి ఒకే రూపాయికి రెండువైపులు వంటివి. బండికి కట్టిన జోడెద్దుల వంటివి. పక్షి రెక్కల వంటివి. ముందు నువ్వా వైరాగ్యం అందుకోవాలి. లోకంలో కొందరు దానం చేసి గర్విస్తారు. వార్ని చెయ్యి చాచమంటే ఆత్మహత్య చేసుకుంటా మంటారు. మరి కొందరు ముష్టికి అలవాటు పడిపోతారు, అవసరం లేకపోయినా. ఒకసారి వీధిలోకి ముష్టికి పోయి రాకపోతే నిద్దర పట్టదు వీరికి. వీరిద్దరికీ వైరాగ్యం కలగలేదు. అంటే అహంకారం తొలగలేదు.

వైరాగ్యం కలవాడు రెండూ చెయ్యగలుగుతాడు. రెండూ మానగలుగుతాడు, సమమైన ఆనందంతో ! ఇది అంతరంగ సాధన. అయినా దీనికి బహిరంగ సాధన కూడా సహాయ పడుతుంది. దీనికోసం నువ్వు భిక్షాటన చేయాలి.

అన్నం లేకపోతే శరీరంతోపాటు మనస్సు నీరసించి వేళ్ళాడి పోతుంది. అతిగా తింటే మత్తిల్లి చచ్చుపడి పోతుంది. కనుక మనం తినే అన్నమే మన మనస్సును పోషిస్తుందని తెలుస్తోంది. మనస్సులో రెండు పొరలున్నాయి, ఆలోచనలూ, సంస్కారాలూ అని. ఆలోచనలు పుట్టించే పొర పేరు సంస్కారం. ఈ రెండు పొరలూ గూడా అన్యోన్యాశ్రయాలే.

మనం తినే అన్నం యీ రెండు పొరలనూ పోషిస్తుంది. అన్నంలో వున్న భౌతిక లక్షణాలు ఆలోచనల పొరను పోషిస్తాయి. ఉదాహరణకు కల్లు తాగితే, ఆలోచనలు వేగం అవుతాయి, అన్నంలో వున్న పవిత్రత సంస్కారపు పొరను పోషిస్తుంది. భౌతికంగా చెడు లక్షణాలు వున్న అన్నం సామాన్యంగా మనం తిననే తినం. ఇక అన్నానికి పవిత్రత ఎలా వస్తుంది? అది మనకెలా తెలుస్తుంది?

ఈ అన్నానికి యజమానులైన వారి భావన ఎలా వుంటుందో, ఏ భావన కలవారు యీ అన్నం తయారు చేశారో, ఏ భావనతో నువ్వీ అన్నాన్ని లోపలికి తీసుకుంటున్నావో, ఈ మూడంశాలమీద అన్నం యొక్క సంస్కారం, అనగా పవిత్రత ఆధారపడి వుంటుంది. అందువల్లే అన్నం పవిత్రతను తెలుసుకోవటం మహాత్ములకు తప్ప ఇతరులకు సాధ్యంకాదు. మరి సామాన్యుల గతి ఏమిటి? అందుకోసమే శాస్త్రాల్లో కొన్ని నియమాలు ఏర్పరిచారు. ఏ రకమైన అన్నం తినవచ్చు, ఏది తినరాదు అని. ఆ నియమాల ప్రకారం వున్న అన్నం పవిత్రంగా వున్నదని గ్రహించవచ్చు నన్నమాట.

అందరి నియమాలు వేరు, యోగసాధకుడి నియమాలు వేరు. అన్నం విషయంలో గూడా అంతే. ఒక్కసారి సొమ్మే తినకుండా, నలుగురి సొమ్మూ కలుపుకొని, మరుపూటకు మిగుల్చు కోకుండా తినటమే యోగికి ప్రధాన ధర్మం. దీనివల్ల ఏ ఒక్కరి సంస్కారమూ అందులో ప్రబలంగా చేరకుండా వుంటుంది. బిచ్చమెత్తి తినాలి, మరు పూటకు మిగలరాదు కనుక వైరాగ్య సాధనకు వీలు ఏర్పడుతుంది.

దీన్ని మధుకర వృత్తి అంటారు. మధుకరం అంటే తుమ్మెద. తుమ్మెద అన్ని పూవుల లోంచీ తలో రేణువూ తెస్తుంది. అయినా ఏ పువ్వు వాసనా దాని కంటుకోదు. పూవు దెబ్బ తినదు.

ఏ పూవు వల్లా సాధ్యం కాని అమృతరసాన్ని సృష్టించు కుంటుంది. వృత్తి అంటే అది జీవనోపాయం అని అర్థం. ఈ జీవనోపాయం గూడ పైన చెప్పిన దాన్ని పోలి వుండి కనుక దీన్ని మధుకరవృత్తి అన్నారు. అందుకనే పెద్ద పెద్ద మహర్షుల దగ్గర నుంచీ పెద్దలందరూ దీన్ని సాధన చేశారు పూర్వం.

ఒక స్థితి వస్తుంది. ఆ స్థితి వచ్చాక అన్నం యొక్క సంస్కారం తనమీద పడటం కాక, తన సంస్కారమే తన కంటబడ్డ అన్నంమీద బడుతుంది. అప్పటి సాధన పద్ధతే వేరు మళ్ళీ. కనుక ప్రస్తుతం నువ్వు రేపటి నుంచీ మధుకరం చెయ్యి."

అత్త చేసిన ఉపదేశం ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క సూత్రంగా ఆ రోజుల్లా మననం సరిపోయింది నాకు! తెల్లారిన దగ్గరనుంచీ ఆకలికి తాళలేక నన్ను కొట్టి, రక్కి గిల్లసాగింది వరలక్ష్మి.

'' నే నెక్కడ తేనే అన్నం? ముష్టెత్తాలి యింకా. '' అన్నాను నేను విసుగ్గా.

" ఏమో ఏం చేస్తావో, నాకు అన్నం పెట్టు. నీ చావు నువ్వుచావు" అదీ వరలక్ష్మి ఆజ్ఞ.

అత్త ముష్టెత్తటం ఒకటే ఉపదేశించింది. ఇది దానం చెయ్యటం గూడా ఉపదేశిస్తోంది. రెండూ ఒకదాని కొకటి సరిపోయాయిగా.

ఆ రోజు పదకొండింటికి బడి నుంచి రాగానే నన్ను తలమీద స్నానం చేయమని, నా మొహానికి విభూతి దట్టంగా పెట్టి, నా చంక కొక తడితుండుతో జోలికట్టి, ఆ జోలిలో ఒక గిన్నె పెట్టింది వెంకమ్మత్త. ఒక నాలుగిళ్ళ పేర్లు చెప్పింది. " ఆ యిళ్ళకే వెళ్ళు. ఎంత వేస్తే అంతే! మళ్ళీ అడక్కు. నురో యింటికి వెళ్ళకు. పులుసు, చారు పోస్తే ఆ గిన్నెలో పోయించుకో, అన్నం గుడ్డలో వేయించుకో '' అన్నది.

ఆ తడిగుడ్డలతోనే వెళ్ళి జీవితంలో మొదటిసారిగా పరాయివాళ్ళ వీధివాకిట్లో నిలబడి ''భవతి భిక్షాం దేహి" అని అరిచాను. అచ్చ తెలుగులో చెప్పాలంటే ''అమ్మా, మాదాకవళం'' అని అరిచాను.

కార్లలో తిరుగుతూ మీ గురువును గూడా కార్లలో తిప్పే మీరు అలా అరచిన పసివాడి హృదయం ఎలా వుంటుందో వూహించలేరు అది మీవల్ల కాదు. మీ హృదయాల నెవరూ రంపాలతో పరపరా కొయ్యలేదుగా! మిమ్మల్నెవరూ నిప్పుల్లో పొర్లించలేదుగా, మీరూహించలేరు. మీవల్లకాదు.

బాధ అనుకోరాదే! గురువు ఆజ్ఞ అది!! తెగిపోయిన పేగుల్ని చేతులతో బిగపట్టుకొని నాలుగిళ్ళూ పూర్తిచేసి యింటికి వచ్చాను, ఇంటి వాకిట్లోనే నుంచున్నాడు యముడు—అదే, మా వెంకమ్మత్త—చేతిలో విసినికర్ర పట్టుకొని మిర్రిమిర్రి చూస్తూ. తల వొంచుకుని లోపలికి నడిచాను. కంచం పట్టుకొని సిద్ధంగా వుంది వరలక్ష్మి. అత్త వంక చూశాను. అనుమతిగా

తల వూపింది. వరలక్ష్మి కంచంలో అన్నం, కూరలు కావలసినంత వేసి పులుసు పోశాను. మళ్ళీ అత్త వంక చూశాను. ఆవిడేం మాట్లాడలేదు. కాని ఆవిడ చెప్పే దేమిటో నాకు తెలుస్తూనే వుంది. ఆ మిగిలిన అన్నం, కూరలూ, పచ్చళ్ళూ అన్నీ పులుసు గిన్నెలో వేసి గబగబా పిసికాను. ఆ తరువాత తమిళ తద్దినపు పిండాలల్లే చిన్న చిన్న ముద్దలు చేశాను. ఆ గిన్నె వాకిట్లోకి తీసుకెళ్ళి గుడివాకిట్లో కూర్చున్న బైరాగులకు తలో ముద్దా పడేశాను. రెండు చిన్న ముద్దలు మిగిలాయి.

నిన్న రాత్రినుంచీ అన్నం లేదు. మండుటెండ, మిట్టమధ్యాహ్నం. నేను సొంతంగా ముష్టెత్తి తెచ్చుకున్న అన్నం చివరికి నాకు మిగిలింది రెండు పిడికిళ్ళా? కళ్ళల్లో నీళ్ళు తిరగబోయి ఆగాయి.

"మళ్ళీ మరోసారి పోయి రానా?" సందేహిస్తూనే అడిగాను, ఉండబట్టలేక, అంతే! వెంకమ్మత్త చేతిలో వున్న మేదర విసినికర్ర పిడి సుత్తిలాగ నా బుర్రకు వచ్చి కొట్టుకుంది. ఆవిడ మడిగా! తాకదు. జపంగా! మాట్లాడదు. అదే సమాధానం. అదే సత్కారం. సరే, ఏం చేస్తాను? ఒక ముద్దను నోట్లో వేసుకున్నాను, అమ్మను తలుచుకుంటూ.

'ఓహ్! ఏమిటిది? ఏమిటి నేను తినేది? అన్నమేనా? అమృతపు ముద్దా? కాదు, ఇది కూరలూ పచ్చళ్ళూ పులుసూ ఏకమైన ముష్టి ముద్ద కానే కాదు! ఇదేదో దేవలోకం నుంచి వచ్చిన దివ్యభక్ష్యం! నా శరీరంలోని నాడులు ఒక్కసారిగా వీణలు మీటసాగినై. మహానందమై, ఆ మాట చెపుదామని పక్కకు తిరిగాను. అత్త అక్కడ లేదు. తన ఆసనంమీద కూర్చుని జపం చేసుకుంటోంది. ఆనందం కలగటం మాత్రమే కాదు. ఆకలి తీరిపోయింది. ఓపిక వచ్చింది. ఇక ఆ రెండవ ముద్ద ఎక్కువయిం దనిపించింది. అది మహాదేవ ప్రసాదమనీ, పారెయ్యరాదనీ మెల్లగా తినేశాను.

అలా రెండు పూటలా మధుకరం తెస్తూ నాలుగు రోజులు హాయిగా గడిపాను. అయిదో రోజున సరిగా నేను తినబోయే సమయానికి విసిన కర్రతో ఎట్టయెదుట ప్రత్యక్షమైంది అత్తమ్మ. ఆవిడ చెప్పేది నా కర్థమై బిక్క మొహం వేశాను. చెప్పేసి వెళ్ళిపోయిం దావిడ.

దాని కంచంలో అన్నం తినటమైపోయిన తర్వాత వరలక్ష్మి చెయ్యి కడుక్కుంటూ అరిచింది.

"తినకుండా అలా చూస్తూ కూచుంటా వేమిట్రా, అయోమయం మొద్దూ" అని.

నోట్లో నీళ్ళూరకుండా, లోపలి గ్రంథుల్ని నాడుల్ని సంయమనం ద్వారా నిగ్రహిస్తున్న నావంక అసంతృప్తిగా చూసింది వెంకమ్మత్త.

కొంతసేపయిన తరువాత లేచి వచ్చి "ఏమిటా అయోమయం చూపులు, తిను" అని విసినికర్ర తీసి కొట్టింది.

విసిన కర్ర తగిలింది. తెలిసింది, సంయమనం చెయ్యవలసింది నాడుల్ని, గ్రంథుల్ని కాదు. "ఇది రుచికరమైనది, తినతగ్గది" అనే భావాన్ని సంయమనం చెయ్యాలి.

ఆ రోజు కది చేతకాలేదు. ఆ రెండు ముద్దలు మాత్రం తినేశాను. ఆ పరాభవ శోకంలో ఆ ముద్దల అమృతపు రుచి నాకు సంతోషం కలిగించలేదు.

ఆ రాత్రి నాకు అన్నం తిన బుద్ధి కాలేదు. నా మనసులో మాట చదివినట్టుగా ఇవాల్టి నుంచీ వొంటి పొద్దు భోజనం నియమం పెట్టుకో అన్నది అత్త. అప్పటి నుంచీ మధుకరం వున్నన్నాళ్ళు నాకు మాత్రం వొంటి పొద్దే.

ఆ మర్నాటికి సాధించాననుకొని, అత్త ఆజ్ఞ అయ్యాక ఇక భోజ్య భావన మీద ధారణ చేద్దామని సిద్ధంగా కూర్చున్నాను కాని, ఆ రోజు తినమన్నది అత్త. సరే తింటున్నాను. సగం నమిలాను, ఆహా అనుకుంటున్నాను, ఆపెయ్యమంది అత్త.

ఒకక్షణం విలవిలలాడింది మనస్సు. కాని, నిన్న చేసిన సాధన వుంది గనుక, ఆ రేఖలోనే త్వరగా, యీ ధారణ సిద్ధించింది. ఇంద్రియానికీ, విషయానికీ సంయోగం వున్నా గూఢా విషయానుభవ భావం మనస్సులోకి వెళ్ళలేదు. అంతా బాగానేవుంది. కానీ అత్త తృప్తిపడలేదు. ఎందువల్ల ?

ఎందువల్లో తెలిసేందుకు ఒకరోజు పట్టింది నాకు. అది ధారణవల్ల నిలబెట్టుకున్న స్థితి కాకుండా, నిత్య సహజస్థితి కావాలి. దానికి కొన్ని వారాలు పట్టింది నాకు.

ఇలా మా అత్త ఇచ్చిన శిక్షణంతా చెప్పుకు పోవాలంటే, గ్రంథాలు గూడా చాలవు. సూత్రంగా చెపుతున్నాను. నోరెండుకు పోయేదాకా ఎండలో చాలాదూరం పరిగెత్తించేది. నీళ్ళు నోట్లో పోసుకొని మింగవద్దనేది. ఒకో రోజు నా అన్నం నీళ్ళల్లో జాడించి, అప్పుడు తినమనేది. ఇలా రోజుకో మెట్టుగా నేను వరసగా యెక్కుతుంటే "మీ అమ్మ బాగానే తయారు చేసిందిరా " అనేది.

బహిరంగంలో నేను సామాన్య విద్యార్థిగా వుండేవాణ్ణి, బడిలో కొంచెం మందకొడిగా వుండేవాణ్ణి. అందువల్ల బడిలో కొంతమంది పిల్లలు నన్నేడిపించేవాళ్ళు.

నా చెవులకు పైవేపున పెద్ద రాగి పోగులుండేవి. వాటిని పట్టుకొని ఏడిపించటంలో ఒక రోజున చెవ్వు తెగి నెత్తురు కారింది. అప్పుడు మా స్కూల్లో షడ్దర్శనం సోమసుందరశర్మగారని తెలుగు మాష్టారు వుండేవారు. ఆయన మంచి పండితుడు. వాళ్ళ పెద్దబ్బాయి నా క్లాస్‌మేటు. అతను నన్ను తీసుకెళ్ళి వాళ్ళ నాన్నగారికి చూపించి, ఫిర్యాదు చేశాడు. నేనెవరో తెలియక పోయినా, ఆయన కరుణతో నాకు వైద్యం చేయించి, మా క్లాసు పిల్లల్ని కేకలేసి, నాకు రక్షణ చేశారు.

ఇంటి దగ్గర నాకూ చెల్లెలికీ అనుక్షణం పోటీయే, పోట్లాటే. అది నాతో చచ్చేట్లు పోట్లాడేది గాని, నన్ను వదలి వుండేదికాదు. నేను తెల్లవారు జామున ఒంటిగంటకే లేచి సాధన చేసినా, మళ్ళీ వరలక్ష్మి లేచే వేళకు దానితో పాటు లేచినట్లు నటించాలి. దానితోపాటు చదవాలి. తెల్లారేలోపల చన్నీళ్ళ స్నానాలు చెయ్యాలి.

చలికాలం తెల్లవారుజామున స్నానం నాకు హాయిగానే వుండేది కాని, వరలక్ష్మి రోజూ యేడుపే! కాని, అక్కడ వేరే బాత్‌రూమ్ వగైరా లేనందువల్ల, చీకటే బాత్‌రూమ్. చీకటిగా వుండగా స్నానంచేసి తీరవలసిందే.

మా అత్త వరలక్ష్మికి గూడా నియమాలు పెట్టింది. కాని అవి లోక సామాన్యమైనవి. వాటిల్లో గూడా చూసీ చూడకుండా పోయేది. నేను పోట్లాడుతూ వుండేవాణ్ణి. స్తోత్రాలు సరిగా చెప్పటం లేదనీ, నేను కోసిన పూలు దొంగతనం చేస్తోందని, కూర్చునే కునికిపాట్లు పడు తోందనీ, ఇత్యాదిగా ఫిర్యాదులు చేసేవాణ్ణి. మా చెల్లెలు గూడా తక్కువదేం కాదు. అదీ గట్టిగానే నా మీద కేసులు పెట్టేది. మా అత్త తీర్పు సామాన్యంగా దాని పక్షానే వుండేది.

ఆవిడ పెట్టిన నియమాల్లో యేది తేడాచేసినా, నాకు మాత్రం విసినకర్ర వాతలు తక్షణం సాక్షాత్కరించేవి. నా వొక్కడిమీదే అంత ద్వేషమెందుకో ఆవిడకి ?

* * *

## సాధకమండలి

నేను చదివే మునిసిపల్ హైస్కూల్లో ఉపాధ్యాయులంతా, నేను మొద్దబ్బాయినైనా, నామీద ఎంతో ప్రేమగా వుండేవాళ్ళు. కారణం, వాళ్ళు చదువు చెపుతున్నారు కనుక. వాళ్ళకు ఏదో ఒక పని చేసిపెట్టాలని నా నియమం. కట్టే జీతం గురు ఋణానికి సరిపోదని నాకు తెలుసు. అందుకనే వాళ్ళ యిళ్ళకు వెళ్ళి అడిగి ఏదో పని చేసి పెట్టేవాణ్ణి. మా ఉపాధ్యాయు లందరిలోనూ, మునెయ్యగారి వల్ల నాకు ఎక్కువ ఉపకారం జరిగింది.

ఈ మునెయ్య గారికి తిక్క మునెయ్య అని పేరు వుండేది. ఈయన అగస్త్యేశ్వర ఆలయంలో ప్రైవేట్లు చెపుతూండేవాడు. మా యిద్దర్నీ మా అత్త ఆయన దగ్గర ప్రైవేటుకు వేసింది. కిరోసిన్ లాంతరు చేత పుచ్చుకొని ఇద్దరం వెళ్ళేవాళ్ళం. ఆయన ఇల్లు గూడా మేము ఉండే గుడికి దగ్గరే.

ఆయనకు రోజు కొక కొత్త పద్యం అప్పచెప్పాలి. ఆ రోజుల్లో నాకు ఏ విషయమైనా సరే, ఒకసారి వింటే మనస్సులో అచ్చయిపోయినట్లు వుండేది. అందువల్ల రోజూ తప్పకుండా పద్యం అప్పచెప్పేవాణ్ణి. అప్పచెప్పని వాళ్ళని ఆయన తీవ్రంగా కొట్టేవాడు. ఆ దెబ్బలకు ఆగలేక వరలక్ష్మి ఆ ప్రైవేటుకు రావటం మానేసింది.

మునెయ్యగారు సంగీత సాధకుడు. సమర్ధ రామదాసుగారి శిష్య పరంపరలోవాడు. రామభక్తుడు. ఆయన తెలుగు భాగవతం ఎంతో ఆర్తితో చదివేవాడు. దాంతో పోతన్నగారి పద్యాలు నాకు చాలామటుకు నోటికి రాసాగాయి. అది గమనించిన మునెయ్యగారు మరింత ఆసక్తితో నాకు భాగవతం వినిపించి వివరించసాగాడు. ఒకోసారి, నేను వారింట్లోనే పడుకునే వాణ్ణి. భాగవతమేకాక మరికొన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు గూడా ఆయన నాకు వినిపించేవాడు. ఆయనకి అవి శాస్త్ర విషయాలే అయినా, నాకు అవి నిత్య సాధన విషయాలు గనుక, నాకు ఎంతో లాభంగా వుండేవి. అందువల్ల మునెయ్యగారి సాంగత్యం నాకు అప్పుడు చాలా విలువైనదిగా వుండేది.

ప్రొద్దుటూర్లో మా మేనత్తగారి గురుతుల్యులు, అభేదానందస్వామివారు అప్పటి నా సత్సంగ సభ్యులలో ముఖ్యులు. వయోజ్ఞాన వృద్ధులైన అభేదానందులు నన్ను, మా చెల్లెల్నీ గూడా ఎంతో ఆదరించేవారు. అభేదానందులు ప్రధానంగా అద్వైతోపాసకులే అయినా, భక్తిలో రామ భక్తులు. "నువ్వు వచ్చిన రోజున నా రాముడు నా దగ్గరకు వస్తాడురా. అందుకోసం రోజూ నువ్వు రారా" అనే వారాయన. నేను వెళ్ళకపోతే ఆరాటపడేవారు. నా రాక కోసం పళ్ళూ ప్రసాదాలు దాచి వుంచేవారు. వాటి కోసం ఆయన దగ్గరకు వచ్చేదాక ప్రాణం తీసేది మా చెల్లి. తనొక్కతే వెళ్ళదు మళ్ళీ!

ఆయన ఆశ్రమంలో మంచి తోట వుండేది. దానిలో సపోటా చెట్లు, దానిమ్మ చెట్లు బాగా వుండేవి. ఆయన ఇచ్చే ప్రసాదాల మీద నాకు అట్టే ఆసక్తి లేదుగాని, ఆ తోటలో చెట్లమీద పడి కాయలు కోసుకు తినటం మీద ఆసక్తిగా వుండేది. "తోటంతా నీదేరా, ఆశ్రమమే నీది. నీ ఇష్టం" అనే వారాయన.

వీరు శ్రీ రమణ మహర్షుల శిష్యులు. వీరి దగ్గర నా సంకీర్తన కళ రూపు దిద్దుకొన్నది. ఆ మొదటి రోజులలో వీరి దగ్గర నుంచి వచ్చినదే "అరుణాచల శివ" అని నేను పాడే కీర్తన.

మా అత్తకీ, వీరికీ గూడా మిత్రులయిన యోగీంద్ర భారతి అనే ఒక యోగీశ్వరులు అప్పుడప్పుడు ప్రొద్దుటూరు వస్తూ ఉండేవారు. వీరు మహారాష్ట్ర ప్రాంతీయులు. దత్తోపాసకులు. వీరి సాంగత్యం గూడా నాకు చాలా విలువైనది. వీరి విషయంలో ఒక విచిత్రం గూడా జరిగింది.

వీరు ప్రొద్దుటూరు మొదటిసారిగా వచ్చినపుడు—అంటే నేనుండగా మొదటుసారి అన్నమాట—వారి గౌరవార్థం మా గుడి ఎదురింట్లో వారు వారిని భిక్షకు పిలిచారు. వాళ్ళ బంధు మిత్రులను గూడా భోజనాలకు పిలుచుకున్నారు. ఆ రోజు ఎందుకో నాకు బడిలేదు. ఇంట్లోనే వున్నాను. మధ్యాహ్నం పన్నెండయింది. ఆ రోజుకి మధుకరం అయిపోయింది గాని నేను తినలేదు. సహజ ధారణ చేస్తూ చూస్తూ కూర్చొన్నాను. ఇంతలో ముక్కులకు ఏవో వంటకాల రుచి తగిలింది. మనస్సులో ఏ సంకల్పమూ లేదు. నిశ్చలంగా ఆ వాసన వెంబడి వెళ్ళాను.

ఎదురింటి వారంతా వాకిట్లో నిలబడి యోగీంద్ర భారతి వారి రాకకై యెదురు చూస్తున్నారు. నేను సరాసరి లోపలికి వెళ్ళిపోయాను. నేను తెలిసిన కుర్రవాడినే కనుక నన్నెవ్వరూ పట్టించుకోలేదు. లోపలికి వెళ్ళిన నేను అక్కడున్న పిండి వంటలన్నీ తినేశాను. అవి ఏ యాభై మందికో, అరవై మందికో చేశారు. తరువాత అన్నం గూడా తినేశాను. ఇదంతా ఒక పావు గంటలో తినేశాను.

తినేటప్పుడూ సంకల్పంలేదు. తినక ముందూ లేదు. తింటున్నానని మాత్రం తెలుసు. నేను తినటం అయ్యే చివరలో ఎవరో వచ్చి చూశారు. గోల అయింది. నలుగురూ తిట్టారు. ఎందు కిట్లా చేశా వన్నారు. ఆకలేసింది అన్నాను.

చివరకు నన్ను దండించ బోతుండగా, సరీగా సమయానికి యోగీంద్ర భారతీస్వామి వారు వచ్చారు. ఆయన వచ్చేసరికి అంతా ఆయన హడావిడిలో పడ్డారు. నేనూ నమస్కారం చేశాను.

నమస్కారా లయినాక, మెల్లిగా సిగ్గుపడుతూ చెప్పారు వాళ్ళు—"అయ్యా! క్షమించి మాకు కొంచెం టైమివ్వాలి. తమకోసం చేసిన వంటలన్నీ ఒక కుర్రాడు చెడగొట్టాడు" అన్నారు.

"ఏం చేశాడు? ఎంగిలి చేశాడా"? అన్నారాయన.

"కాదండీ, మొత్తం వంటలే తినేశాడు" అన్నారు ఇంటి వారు.

"మొత్తం తినేశాడా? ఏదీ చూద్దాం" అని వంటింట్లో కెళ్ళి మొత్తం పరిశీలించా రాయన.

"మొత్తం ఒకడే తిన్నాడా"? అనడిగారు యోగిగారు.

ఔనన్నారు వారు.

"ఎవరు వాడు?" అడిగారాయన ఆదుర్దాగా.

"వాడే" అని నన్ను చూపించారు కోపంగా. వెంటనే ఆ పెద్ద స్వాముల వారు "ఇన్నాళ్ళకు కనిపించినావా, ప్రభో" అంటూ నా కాళ్ళమీదపడి కన్నీళ్ళు కార్చసాగారు.

నాకేమీ అర్థం కాలేదు. ఆయన వాళ్ళతో ఇలా అన్నారు. "మీ తెలివి తెల్లవారినట్లే వుంది. బొరియల్లో ఈలలుంటే లోపల పాములున్నయ్యని గుర్తించరా మీరు? అంతమందికి చేసిన వంటకాలు ఒక్కడే తిన్నాడంటే, అర్థం కానక్కరలేదా? ఈ బాలుడు అద్భుతబాలుడు. నా భిక్ష అతడు తినటం నా అదృష్టం. ఇతను ఉత్తరోత్తరా గొప్ప మహాపురుషుడుగా గుర్తింప బడుతాడు."

* ఆ రోజు వాళ్ళు నన్ను గౌరవంగానే చూశారు. ఆ యోగిగారు ఆ రాత్రే వెళ్ళి పోయారు. ఆ మర్నాటి నుంచీ నా వెర్రి వేషాలు చూసి చుట్టు ప్రక్కలవారికి నా మీదున్న గౌరవం పోయింది.

ఆ యోగీంద్ర భారతిగారు వెళ్ళే ముందర అభేదానందాశ్రమంలో, మేము ముగ్గురం కాసేపు కాలక్షేపం చేశాం. ఆ తరువాత అప్పుడప్పుడు ఆయన ప్రొద్దుటూరు వస్తూ వుండేవారు నాకూ, మా అత్తకు గూడా ఆయన వస్తే మంచి సత్సంగంగా వుండేది.

ఈ భిక్షాన్న సాధన జరుగుతున్న రోజులలో మరికొన్ని విచిత్రాలు జరిగాయి.

నేను భిక్షకు వెళ్ళేది నాలుగిళ్ళే కాని క్రమంగా జోలెనిండా అన్నం రాసాగింది. అత్త నన్ను తేరిపార చూసింది గాని కొట్టలేదు. అయితే, అలా అన్నం యెక్కువయిన రోజున వాకిట్లో సాధువులూ పెరిగేవారు, వారికి పడే ముద్ద పరిమాణమూ పెరిగేది. నా రెండు ముద్దలే నాకు !! ఒకో రోజు అదీ మిగిలేది కాదు !!!

ఒకో రోజు వాకిట్లో బైరాగులు అడిగేవారు "ఇంత అన్నం ఎక్కడ కొట్టుకొచ్చావయ్యా పంతులూ? " అని. "దొరుకుతోంది. తినండి. ప్రశ్నలొద్దు" అనే వాణ్ణి నేను.

ప్రొద్దుటూరు దగ్గరలో నుసం అని వొక వూరు వుంది. అక్కడ మా పెద్ద నాన్నగారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వారి పిల్లలు ఉండేవారు. ఆ కుటుంబం మా కుటుంబం కన్నా మా అత్తకు బాగా సన్నిహితంగా వుండేది. బాగా దగ్గర వాళ్ళు కదా. అప్పుడప్పుడు ఆ పిల్లలు వచ్చేవారు. వారు గూడ నా మధుకర అన్నమే తినేవారు. ఎంతో ఆనంద పడేవాళ్ళు. అప్పుడు ఆ మధుకరాన్నం తిన్న వాళ్ళు అంతా ఆ రుచి యిప్పటికీ మరచిపోకుండా చెప్పుకుంటూ వుంటారు. మా చెల్లెలు వరలక్ష్మి అయితే మరీను.

నాకు గూడా ఆ మాధుర్యం వున్న అన్నం మళ్ళీ తగల్లేదు. మధ్యలో ఒక్కసారి శ్రీకంఠయ్య ఇంటికి వచ్చిన మొదటి రోజు, అదీ ఒక్క రోజు మాత్రం ఆ మాధుర్యం తగిలింది.

ఆ రోజుల్లో చంద్రు అని నాకొక క్లాసుమేటు వుండేవాడు. వాళ్ళన్నయ్యలు కూడా ఆ బళ్ళోనే పై తరగతులు చదువుకుంటూ వుండేవాళ్ళు. నాకు ఈ అన్నదమ్ములతో స్నేహం బాగా పెరిగింది. వాళ్ళు కొంచెం కలవాళ్ళే గాని, ఆ గర్వం వాళ్ళ దగ్గర లవలేశం గూడ వుండేది కాదు.

వాళ్ళ నాన్నగారి పేరు సుబామణిగారు. వాళ్ళు కేరళదేశం వాళ్ళు. గురువాయూరప్ప భక్తులు. ప్రొద్దుటూరులో ఆర్యభవన్ అనే హోటలు వ్యాపారం చేస్తున్నారు. ఆ వ్యాపారం బాగా సాగుతోంది. సుబామణిగారు సాధు జీవనానికి ఆదర్శంగా వుండేవాడు. తన హోటల్లో ప్రతి

* ఈ కథ జయలక్ష్మి మాత సమక్షంలో జరిగినట్లు వెనుకటి పుస్తకాల్లో వుంది. అది తప్పనీ, ఇదే వొప్పనీ శ్రీ స్వామీజీ అన్నారు.

రోజు కనీసం ఎనిమిదిమంది బీద విద్యార్థులకు ఉచితంగా అన్నం పెట్టేవాడు. మరి కొందరికి ఉచితంగా టిఫిన్ పెట్టేవాడు. నేను నా స్నేహితులతో కలసి మెలసి పోవటంతో, ఆ పిల్లలతో పాటు నేను గూడా వాళ్ళ ఇంటికీ, హోటలుకీ గూడా స్వతంత్రంగా తిరుగుతూ వుండేవాణ్ణి. నేను మధుకరం చేసుకుంటున్నానని తెలిసి, ఆయన గూడా బ్రాహ్మడు గనుక, మధుకర వృత్తి అంటే తెలిసినవాడు గనుక, నన్ను ఇంకా ఎక్కువ ఆదరంగా చూసేవాడు.

ఆయన నాలో ఏమి చూశాడో నాకు తెలియదు. కానీ నన్ను మాత్రం 'సాధుపెయ్యా' అని పిలిచేవాడు. నేను వాళ్ళ యింట్లో తిర్రగటం ఎక్కువ అయిన కొద్దీ నా స్నేహితుల తల్లి రాజమ్మగారు గూడా నన్ను తన పిల్లలతో సాటిగా చూడసాగింది. కొత్తగా తల్లిని పోగొట్టుకొని వున్న నేను, ఆమెలో నాతల్లిని పరిపూర్ణంగా చూడసాగాను. అందుకనే, ఆమె పిల్లలతో పాటు, నేను గూడా ఆమెను మణ్ణీ అని పిలిచేవాణ్ణి. "మణ్ణీ" అంటే వదిన అని అర్థంటగా మళయాళంలో ?మణ్ణి అంటే అమ్మ అని నేను అప్పట్లో అనుకున్నాను. కాని ఆవిడ తన మరుదులను గూడా తల్లిగా పెంచిన ఉత్తమ ఇల్లాలు గనుక మరుదులు, ఆ దంపతులను అణ్ణా, మణ్ణీ అంటుంటే, ఈ పిల్లలకు గూడా అదే అలవాటయిందట. పిల్లలను బట్టి నాకూ అదే అలవాటయింది.

అభేదానంద, యోగిభారతీ, మునెయ్య, వెంకమ్మత్తలు నాకు ఆంతరంగిక సత్సంగం కాగా, సుబామణిగారి కుటుంబం నాకు బహిరంగ సత్సంగమైంది. ఈ రెండు రకాల సత్సంగాలతో రెండేళ్ళ పొద్దుటూరు జీవితం నా సాధనలో స్వర్ణయుగంగా సాగింది.

ఒక ప్రక్క మధుకర వ్రతదీక్ష పేరుతో అనేక విచిత్ర యోగసాధనలు చేయిస్తూనే రాత్రిళ్ళు హఠయోగ ప్రక్రియలలో సాధనలు చేయించేది వెంకమ్మత్త. ఆ హఠయోగ ప్రక్రియలు మీకు ఎక్కువ అక్కరలేదు కనుక, ఆ వివరాలు మీకు వొద్దు. ఒక ఆరు నెలలు గడిచేసరికి ఇక మధుకరంతో పనయిపోతుందని నాకు స్పష్టంగా తెలియసాగింది. మా అత్త గూడా అలాగే అనుకుంటుందని నాకు తెలుసుగాని, సాధనలో ఆవిడ కొంచెం అనుమానం మనిషి. ఒకటికి రెండుసార్లు నిర్ధారణ అయితే గాని ముందు అడుగు వేసేదికాదు. అప్పుడొక చిన్న చమత్కారం జరిగింది.

మా అత్తకు అంతులేని మడి. పైగా ఇతరుల సంపాదన తినదు. అందువల్ల నా మధుకరాన్నం ఆవిడ తినేది కాదు. ఆవిడ అత్తిసరు వేరు. అన్నం వండుకుని, అక్కడ పెట్టుకొని తన అనుష్ఠానాలు పూర్తిచేసుకొని నిదానంగా ఎప్పుడో తినేది.

ఒకరోజు నేను మధుకరాన్నం తెచ్చేసరికి ఆవిడ అన్నం వండుకోవటం అయింది. ఇంతలో ఎవరో వస్తే వారితో మాట్లాడటానికి గది లోంచి గుళ్ళోకి వెళ్ళింది. ఈ సందులో నేను నాలుగు మెతుకులు నా మధుకరాన్నం ఆవిడ గిన్నెలో కలిపేసి మళ్ళీ మూత పెట్టేసి వచ్చేశాను.

అత్త నుడిని చెడగొట్టి గబగబా గదా అని మా వరలక్ష్మి సంతోషంతో ఉబ్బిపోతోంది. ఆవిడ మామూలు వేళకు ఆవిడ అన్నం తినసాగింది. అన్నం నోట్లో పెట్టుకోగానే ఏమయిందో ఏమో, "నీ అన్నం కలిపావా యేమి బ్రా?" అన్నది. అప్పటిదాకా నా బెదురువల్ల నవ్వు బిగపట్టుకున్న వరలక్ష్మి కుండలు పగిలినట్లు నవ్వింది.

"మధుకరం గొప్పది. మహర్షులు గూడ సేశారు. ఆ లాభం నా ఒక్కడికేనా? నీకూ ఆ లాభం రావద్దూ?" అని ఎకసెక్కాలు చేశాను నేను.

ఆవిడ మాట్లాడకుండా మొత్తం అన్నం తినేసి, వెంటనే స్నానం చేసింది. అప్పుడు నాలుగు విసనకర్రలు చేతబుచ్చుకుని వచ్చి విసనకర్రలు విరిగేట్టు నన్ను కొట్టింది. నన్ను కొట్టటం చూసి మా వరలక్ష్మి ఉడాయించేసింది. నేను కిక్కురుమనకుండా వొళ్ళంతా వాయగొట్టించుకున్నాను. విసనకర్రలు విరిగేసరికి ఆవిడకు గూడా ఆయాసం వచ్చింది.

కొద్ది నిమిషాలు విశ్రాన్తి తీసుకొని భగవద్గీత గ్రంథం తెచ్చి వినిపించసాగింది. ఆవిడ వ్యాఖ్యానం ఏమీ చెయ్యలేదు. ఎక్కడ వ్యాఖ్యానం కావాలని నా కనిపించిందో అక్కడ ఒకటికి పదిసార్లు అదే శ్లోకం చదివింది.

ఆ రోజుతో మా అమ్మగారు దారం ఎక్కడ వదిలారో, అక్కడి నుంచీ పట్టుకుని లాగటం మళ్ళీ మొదలయింది.

ఈలోగా ఇరుగుపొరుగువారు ఆడపిల్ల అనీ, తల్లి లేని పిల్ల అనీ వరలక్ష్మి మీద జాలి తలచి వారింట్లో పడుకోబెట్టుకోసాగారు. వారిలో పద్మావతమ్మగారు అని వొకావిడ క్రమంగా దానికి రెండు పూటలా అన్నం పెట్టసాగింది.

*　　　*　　　*

## వారాలు

దీనితో నాకు దాని పోషణభారం గూడా తప్పింపబడింది. ఇక నా ఉదరపోషణ మిగిలింది. "ఒక్కడి కోసం మధుకర మెందుకమ్మా? వారా లిప్పించ" మని ఇరుగుపొరుగు వారు మా అత్తతో అనసాగారు. ఆవిడ వెంటనే వొప్పుకుంది.

వారాలు ఏర్పాటు చేసింది. అందులో ఒక వారం సుబామణిగారి యింట్లోనూ, ఒక వారం షడ్దర్శనం సోమసుందరశర్మగారి యింట్లోనూ గూడా వుండేది. మధుకరం రోజులలో మా అత్త యెన్నుకున్న యిళ్ళల్లో శర్మగారి యిల్లు ముఖ్యమైనది. శర్మగారు పండితులు, పెద్దవారు. నాకు వారంటే చాలా గౌరవం వుండేది కాని, ఎందుకో సాన్నిహిత్యం ఏర్పడలేదు.

వారాల భోజనంలో ఆధ్యాత్మిక సాధన కొత్తగా ఏమీ జరగలేదు గాని, అది లేకపోతే లోకజ్ఞానమే రాదని నాకు బాగా అర్థమైంది. ఏ రోజు ఎవరింట్లో ఏమి ఇబ్బంది వచ్చి కుదరదు పొమ్మంటారో, ఎవరిల్లు వెతుక్కోవాలో అని ఏ రోజు కా రోజు గిజగిజలాడే రోజులవి.

ఇంటికో ఆచారం, ఇంటికో పద్ధతి. ఇంటికో రుచి. ఇంటావిడ ఇంట్లో వుంటే ఒక తీరు. లేకపోతే మరో తీరు. వారాల కుర్రవాడు ఏ ఇంటికా ఇంటి పిల్లవాడు కావాలి. ఒకోసారి మానావమానాలకు అతీతుడు కూడా కావాలి. ఈ శిక్షణ నాకు చాలా అవసరం. అదీ దైవ దత్తంగా దొరికింది.

ఇది ఇలా ఉండగా, ఎలా ఈ పేరు వచ్చిందో నాకు బాగా తెలీదు గాని, నేను బోణీ చేస్తే ఆ రోజు బేరాలు బాగా సాగుతాయని వర్తకుల్లో ఒక పేరు వచ్చింది. దీనివల్ల కొందరు వర్తకులు నన్ను పొద్దున్నే రమ్మని చెప్పి నాచేత బోణీలు చేయించుకునేవారు. ప్రతిఫలంగా నాకు పప్పు బెల్లాలు, మిఠాయిలు దక్కేవి. ఇందువల్ల నా కా చిన్న వయస్సులో చిరుతిళ్ళ మీద ఉన్న వెర్రిమోజుకు మంచి హాయిగా వుండేది. ఒకోక్కసారి ఈ పప్పు బెల్లాలు, ఓంతపండు కొంచెం ఎక్కువగా వచ్చేవి. అప్పుడు అవి తీసికెళ్ళి మా అత్త కిచ్చేవాణ్ణి. ఆవిడ అవన్నీ ఏదో పిండివంటగా చేసి, ప్రత్యేకంగా బ్రాహ్మలకు పెట్టేది. నన్ను వాసన గూడా చూడనిచ్చేది కాదు. సంపాదన ఉన్నా గూడా నాకు ముష్టి ముద్దే గతి.

సాధన ఉన్నత స్థాయిలో సాగుతున్నపుడు ప్రతి అడుగు కత్తిమీద సామే. ప్రతి దెబ్బకీ కండలు కోసుకుపోవటమే తప్ప దయకు, క్షమకూ తావు వుండదు. వెంకమ్మత్త ఇంద్రియానికీ, ఇంద్రియార్థానికీ సంగం వున్నా, ఆ ఫలభోగంలో మనస్సు రమించరాదని చెప్పింది. సాధన చేయించింది. అంతేగా! అసలు కోరుకోనే వద్దనలేదుగా. అదీ మానవుడి తెలివి!

మనని నిలువునా ముంచేందు కోసం ఇంద్రియాలు ఈ తెలివిని ప్రసాదిస్తాయి. వాటిలో జిహ్వా మరీ మోసకారి. ఇప్పుడిది చిరుతిళ్ళ మీదికి మనస్సును తిప్పింది. అందుకే జిహ్వాను జయిస్తేగాని, ఇంద్రియాలను జయించినట్లు కాదన్నారు.

దీనికి శిక్ష అత్త దగ్గర నుంచి కాక అమ్మ దగ్గర నుంచి రావటం ఒక విశేషం.

ఒకరోజు ఒకళ్ళు పెళ్ళి భోజనానికి పిలిచారు. వాళ్ళు లడ్లు చేయించారని తెలిసింది. ఆ లడ్డూల కోసం ప్రత్యేకంగా భోజనానికి వెళ్ళాను నేను. కాని, నా విస్తట్లో లడ్డు పడలేదు. నే నెన్నిసార్లు అరిచి పిలిచినా, తక్కిన వంటకాలన్నీ వచ్చాయి గాని, లడ్డూరాలేదు. నేనను కున్నది రానప్పుడు, మిగిలినవి యెన్ని వస్తే యేంలాభం ? నా కంటికి, అప్పుడు లడ్డూ తప్పితే మరొకటి వంటకమే కాదు ! కాని, ఆ రోజు లడ్డూ తినకుండానే యేడుపు మొహంతో ఇంటికి వచ్చేశాను. ఆరాత్రల్లా నాకు సరిగా నిద్దర పట్టలేదు. నా బాధ చూసి, మా చెల్లెలు గూడా జాలిపడ్డది.

రాత్రి ఒంటి గంటకు విసినికర్ర కాటు నన్ను కూర్చొబెట్టింది. ఈరోజు నిద్ర మామూలు నిద్రకాదు. అది లడ్డు నిద్ర. నిద్ర లేచాను. నాకు లడ్డుమీద కోరిక పూర్తిగా తుడుచుకు పోయింది.

తెల్లారినాక, చిత్రం, ఎవరో వచ్చి ఒక బుట్టెడు లడ్డూలు తెచ్చి వాటితో శివుడికి అభిషేకం చెయ్యమన్నారు. ఆరోజు అర్చకుడు రేకపోవటం వల్ల నేనే ఆ పని చేశాను. ఆ లడ్డూల బుట్ట చూడంగానే యెగిరి గంతేసింది మా చెల్లి. పూజయినాక ప్రసాదం యిస్తుండగా "నిన్న బాధ పడ్డావుగా, ఇవ్వాళ్ళ 'బ్రహ్మ మురారి' చెపుతూ శివుడి దగ్గర ఏడ్చి వుంటావు. పొద్దున్నే లడ్డూలు పంపించాడు. తొందరగా తినరా" అని తొందర పెట్టింది.

నేను నవ్వి వూర్కున్నాను. నేను ప్రసాదం గూడా తీసుకోకుండా, అన్నీ తెచ్చిన వాళ్ళకే యిచ్చేస్తుంటే బాధపడి, మా చెల్లెలు తన వంతు ప్రసాదంలోనే నా కోసం ఒక లడ్డూదాచి, తినమని సాయింత్రం దాకా నన్ను బతిమాలింది. "నిన్న కోరితే, యివ్వాళొ వచ్చేది? ఛీ, నేను తినను పో" ఇదీ నా పట్టుదల.

రజోగుణంతో తమోగుణాన్ని జయించటమంటే ఇదే! కాని నిజానికి తమోరజస్సులను రెంటినీ, సత్త్వ బలంతోనే జయించాలి. అది గూడ త్వరలోనే సిద్ధించటం అమ్మ ఆశీర్వాదం. ఆ సత్త్వాన్ని గూడా అతిక్రమించటానికి మరో యేడాది పైగా పట్టింది. అది వేరే కథ.

ఇంతకూ వారాల ముచ్చట ఎక్కువ రోజులు సాగలేదు. నా వారాల వాళ్ళల్లో ఎక్కువ మందికి ఏవేవో ఇబ్బందులు రావటం, నేను మరోచోట అడగలేక పస్తు లుండటం, అది కనిపెట్టిన నా మిత్రులు (సుబామణి గారి పిల్లలు) వెళ్ళి వాళ్ళమ్మతోనో, నాన్నతోనో చెప్పటం వాళ్ళు నన్ను కేకలేసి, భోజనం పెట్టటం మామూలయిపోయింది. క్రమంగా అనేక సార్లు అక్కడే తిని, ఆ పిల్లలతో పాటే చదువుకొని, అక్కడే పడుకోవటం అలవాటయిపోయింది.

క్రమంగా ఆ సుబామణిగారు "నీకీ వారాలెందుకురా? మనింట్లోనే వుండిపో" అనసాగాడు. రాజమ్మగారు గూడా అలాగే అనేవి. క్రమంగా అదే జరిగింది.

ఇలాంటి మనుష్యులు మీకు లోకంలో ఎక్కడైనా తగిలారా? అన్నం లేక మధుకర మెత్తే ముష్టివాణ్ణి నేను. సొంత యిల్లు, వ్యాపారమూ, ఐశ్వర్యమూ వున్న సంపన్నులు వాళ్ళు. ముక్కు మొహం ఎరుగని నేను రోజూ ఇంట్లోపడి మెక్కుతుంటే, విసుక్కోవలసిందీ, దూరంగా నెట్టవలసిందీ పోయి, ఇంట్లోనే అట్టి పెట్టుకున్నారు. చిరిగిన గుడ్డలే తప్ప మంచి గుడ్డలు లేని నాకు వాళ్ళ పిల్లలతో పాటుగా గుడ్డలు కుట్టించారు! వాళ్ళ కంచాలలో తినిపించారు. వాళ్ళ మంచాలలో జోకొట్టారు. చివరికి వాళ్ళింట్లో గ్రూపు ఫోటో తీయించుకుంటూ, నన్ను గూడా అందులో కలుపుకున్నారు. అందుకే, మా అమ్మకీ, నాన్నకీ పుట్టినందుకు నాకు ఎంత సంతోషంగా వుండేదో, వీళ్ళ ఇంట్లో వున్నందుకు గూడా నాకు అంత సంతోషంగా వుండేది.

నాకు చంద్రు ఒక్కడే క్లాసు మేటయినా, ఇంట్లో అందరూ సమంగానే స్నేహితులు. నే నా యింట్లో పాలలో నీళ్ళు లాగా కలిసిపోయాను. నేను వీరి యింట్లో పడుకుంటూ వుండటానికి అసలు కారణం ఒకటి వుంది. అది సాధనపరమైంది.

## కఠిన సాధన

మా మేనత్త ఇచ్చే శిక్షలో, గుసపుకు దూరంగా వుండగా గూడా సాధన చేసే విధా నాలు ఒకటొకటు వచ్చినాయి ఇప్పుడు. అందుకు కొంచెం విడిగా వుండటమే మంచిదని మా అత్త భావించింది. ఏ రోజు ఆవిడ బోధ అవసర మనిపిస్తే, ఆ రోజు నన్ను గుళ్ళోనే పడుకోమనేది. అప్పటికి మా చెల్లెలు పద్మావతమ్మ గారి యింట్లో పడుకుంటోంది కనుక, నా బోధకు ఏ అంతరాయం వుండేది కాదు. ఈ గుళ్ళో నాకు బహిరంగమైన శివార్చన గూడా లభించటం మరో విశేషం. అది గూడా చిత్రంగానే లభించింది.

అది శివాలయం. ఆ స్వామి పేరు ఉమామహేశ్వరస్వామి. అది పంచాయితనాత్మక మైన ప్రతిష్ఠ. ఒకే ఎంగిలి శివపంచాయితన ప్రతిష్ఠ చేశారు. దాన్ని అవధానం వారి గుడి అంటూ వుండేవారు. అక్కడ లింగం చిన్నదే అయినా, ఆ తేజస్సు గొప్పది. దాని అర్చకుడు సుబ్రహ్మణ్యంగారని మంచివాడు. కాని తీరిక లేనివాడు. ఆయన నమక చమకాలు చెపుతుంటే, నాకు వెంటనే రావటం చూసి ఆయన ముచ్చట పడ్డాడు. నాకు ఉపనయనం కాలేదని మాత్రం సందేహిస్తూ వుండేవాడు. కాని ఆయనకు పని వత్తిడి యెక్కువగా వున్నప్పుడు "పరవాలేదు. లోపలికి వెళ్ళి హారతిచ్చిరారా" అనేవాడు. అలా నాకు ఆలయ ప్రవేశం లభించింది.

నాకు అలంకారం అంటే బలే యిష్టం. శివాలయాలలో సామాన్యంగా అలంకారం వుండదు. కాని, నేను ఉన్న వస్తువులతోనే యేదో తంటాలుపడి అలంకారం చేసి పెట్టేవాణ్ణి. అదంతా అర్చకుడే చేశాడని ఆయన్ను మెచ్చుకునేవారు జనం. నేను గూడా ఆయనే చేశాడని చెప్పేవాణ్ణి. అందువల్ల ఆయనకు నా మీద ప్రీతి పెరిగింది. అందువల్ల గూడా నాకు శివుడి దగ్గరకు ఎక్కువ దారి దొరికింది. ఆ రోజుల్లో నా ధారణ తీవ్రంగా వుండేది. గనుక ఆయన చెప్పే మంత్రాలన్నీ నాకు యథాతథంగా వచ్చినాయి. ఇలా రావటం గొప్పగా తోచేది కాదు. "ఒకరు చెప్పింది చెప్పటం గూడా గొప్పేనా" అనిపించేది. ఇది చూసి మా వెంకమ్మత్త గూడా నాకు కొన్ని మంత్రాలు చెప్పసాగింది.

"అదేమిటె? నువ్వు వేదం చెప్పటమేమిటి?" అన్నాను.

"స్త్రీ ధర్మాలు నాకు వర్తించవురా, ఆ స్థితి దాటి పోయింది" అన్నది. క్రమంగా ఆమె నాకు సామవేదం బోధించ సాగింది. సేతు సామం నాలుగు కాండలు ఆవిడ దగ్గరే పూర్తి చేశాను. ఇక శివోపాసన పద్ధతులలో ఆవిడ నిధి. అవన్నీ నాకు చేతికి అయాచితంగా అంది వచ్చాయి.

క్రమంగా, అంతకు ముందు నిద్రాణంగా వున్న ఆలయం ఇప్పుడు కాస్త జన సంచారంతో కళకళలాడ సాగింది. ఆ అర్చకుడికి నాలుగు రూపాయిలు, మా చెల్లెలికి నాలుగు ప్రసాదాలు తృప్తిగా దొరకసాగాయి.

మా అత్త భగవద్గీత వినిపించసాగిన దగ్గర నుంచీ, నాలో అనేకానేక సందేహాలు తల ఎత్తసాగాయి. అవన్నీ రాత్రిళ్ళు అడుగుతూ వుండేవాణ్ణి. ఆవిడ దగ్గర ఒక దజను దాకా

మేదరి విసిన కర్రలు ఎప్పుడూ వుండేవి. ఒక్కొక్క ప్రశ్నకు ఒక్క విసినకర్ర ఏరి తీసి వాతలు తేలేటట్టు కొట్టేది. అదే ఆవిడ సమాధానం.

ఎవరన్నా వచ్చినప్పుడు ఎంతో లయగా, ఈ తల్లి లేని పిల్లవాణ్ణి డొక్కలో పెట్టుకు సాకుతున్నానని చెప్పేది. వరలక్ష్మిని నిజంగానే అట్లాగే చూసేది గూడా. నాకు మాత్రం వాళ్ళు వెళ్ళగానే వొంటిమీద వాతలు తేలుతూ వుండేవి. అలాగాక ఎప్పుడైనా దయగా మాట్లాడితే నాకు చచ్చే భయంగా వుండేది. "ఏం తప్పు చేశానురా బాబు, ఇంత కోపంగావుంది" అని.

ఇక బాహ్య ప్రవర్తనలో నాకు బడి చదువు కేవలం నిస్సారంగా వుండేది. చెప్పే వారికే తెలియని చదువది. ఉదాహరణకు, క్లాసులో అశోకుడి గురించి గొప్పగా చెప్తున్నారు. నేను లేచి, "అశోకుడి తండ్రి, తాతల చరిత్రేమి" టని అడిగాను. అప్పుడు కదా, వీడి సంస్కార బీజాలు ఎలాంటివో తెలిసేది? "వెధవ ప్రశ్నలూ, నువ్వూనూ, బెంచెక్కి నుంచో" అన్నాడు మాస్టారు.

అలాంటి చదువులకు కాలం వ్యయం చెయ్యటం దేనికి? వాటికన్నా ఆటలు నయం. కాని వీటిలో కేవలం శరీరవృద్ధికే ప్రాధాన్యం. అందుకే ఆటలన్నా నాకు అంత ఆకర్షణ వుండేది కాదు. ఇకపోతే శివాలయం నాకు ప్రదానాకర్షణ. రోజూ, పదిహేను ఇరవైమంది మిత్రుల్ని ప్రోత్సహించి పోగేసి శివాలయానికి తెచ్చేవాణ్ణి. ఎప్పుడైనా బహిరంగంగా ధ్యానం గూడా చేసేవాణ్ణి. కథలు ఎక్కువగా వాళ్ళకు చెప్పేవాణ్ణి. పాటలు గూడా పాడేవాణ్ణిగాని, నా గొంతప్పుడు బావుండేదికాదు. కథలే బాగా చెప్పేవాణ్ణి. నా ముఖం మీద విభూతి చెరగనిచ్చే వాణ్ణి కాదు. మణ్ణిగారి యింట్లో మేడమీద ఒక ధ్యానం గది వుండేది. దాని నిండా రమణమహర్షిగారి ఫోటోలు వుండేవి. అది మా అణ్ణగారి ధ్యానం గది ఎప్పుడైనా ఒకసారి అక్కడ గూడా కొద్దిగా ధ్యానం చేసుకొనేవాణ్ణి. ఒకోసారి మిత్రు లందర్నీ తీసుకొని పెన్నా నదికి స్నానాలకు వెళ్ళి వచ్చేవాడిని. నా ఆటలు గూడా నా సాధనలే అనే విషయం ఇతరులకు తెలియదు.

అప్పటికి నాకు అనేక సిద్ధులు సాక్షాత్కరిస్తూ వుండటం, నేను నిత్య జాగరూకతతో వాటిని ప్రక్కకు తోసేస్తూ వుండటం జరుగుతోంది. కొన్నింటిని రహస్యంగా పరీక్షించుకునే వాణ్ణి. ఇదికాక సర్వకాల సర్వావస్థలలోనూ, ఏకాగ్రతను సాధించే ప్రయత్నం తీవ్రంగా వుండేది.

దానికి అంగంగానే ప్రహరీ గోడల మీద విపరీత మయిన వేగంతో పరిగెత్తటం అలవాటు చేశాను. దారిలో వచ్చిన వాకిళ్ళు మొదలైన వాటిని కోతిలాగా దాటుకుంటూ గోడమీద పరిగెత్తటం ఇతరులకు వినోదమే గాని, చేసేవాడికి ప్రాణ సంకటం. దానిలో ధైర్యం చిక్కాక యీ పరుగులు మేడల మీద పిట్టగోడలకు మార్చాను. ఇది పెద్దవాళ్ళు లేని

సమయంలో చేసేవాణ్ణి. తరువాత పెద్దపెద్ద బావుల అంచులంబడి పరిగెత్తేవాణ్ణి. ఆ బావులకు అడ్డం పడి దూకేవాణ్ణి. ఇవన్నీ వాళ్ళకు కోతి చేష్టలు. నాకు సాధనలు. నాతోపాటు చేద్దామని సాహసించిన పిల్లలు మొదట్లోనే ఆగిపోయారు.

డబ్బు విలువ ఆ రోజుల్లోనే నాకు బోధ పడ్డది. కట్టుకునేందుకు రెండో జత బట్టలు వుండరాదనీ, రెండో దుప్పటి దగ్గర వుండరాదనీ, ఉన్న దుప్పటి కప్పుకోరాదనీ, కటిక నేల మీద పడుకోవాలనీ, చన్నీళ్ళే స్నానం చేయాలనీ మా వెంకమ్మత్త పెట్టిన నియమం. అన్నానికి లోటు లేకపోయినా చేతిలో అణా గూడా ఆడేది కాదు. ఈ స్థితిలో మా అమ్మగారు పెట్టిన నియమం వొకటి వుండేది నాకు.

ఎట్లా తంటాలు పడ్డా సరే, నెలకు నలుగురి కయినా తక్కువ కాకుండా పేదవిద్యార్థులకు సహాయం చెయ్యాలి. నే నెవర్నీ డబ్బు లడగరాదని మా అత్త నియమం. ఏం చావాలి? ఎప్పుడైనా, ఏ దశో కలసి వచ్చిన రోజున వారం ఇళ్ళల్లో అణో, బేడో దక్షిణ వచ్చేది. అట్లాంటి వన్నీ పోగేసి వాళ్ళదగ్గర, వాళ్ళదగ్గర పుస్తకాలు, పెన్నులు పోగేసి, ఏ నెల కానెల ప్రాణ సంకటంగా నియమం గట్టెక్కిస్తూ వుండేవాణ్ణి.

"నీకే దిక్కు లేదు. నువ్వు మరొకరికి సాయం చేసేవాడివా?" అని మీ రనొచ్చు. నాకు దిక్కు లేకపోవట మేమి? నేను బాగానే తింటున్నాను, బాగానే సాధన చేస్తున్నానూ అంటే నాకు దిక్కు వున్నట్టా? లేనట్టా? అదీగాక నా వ్రతం ద్వారా నాకు నేను సాయం చేసుకుంటున్నా గాని వాళ్ళకు నేను సాయం చేస్తున్నాననే దృష్టి మీరు చెప్పినా నాకు రాదు.

ఇలావుండగా ఆ వూళ్ళో ఒకసారి ఒక పెద్ద సర్కసు వచ్చింది. దాన్ని చూడటానికి మిత్రులు చంద్రు వాళ్ళతో వెళ్ళటం ఇష్టంలేక వెళ్ళలేదు. నేనే ఏదో రకంగా సంపాదిద్దామంటే అది కుదరలేదు. చివరకు అది వెళ్ళిపోయే టైము దగ్గరకు వచ్చింది. "ఇవాళ్ళ ఏమయినాసరే సర్కస్సు చూడాల్సిందే" అనుకున్నాను. సర్కస్సు దగ్గరకు వెళ్ళిపోయాను.

ఒక కుర్రవాళ్ళ గుంపు వెళుతుంటే, నేను గూడా వాళ్ళల్లో చాకచక్యంగా దూరేశాను. ఎలా కనిపెట్టాడొ గాని గేటువాడు కనిపెట్టి పక్కకు లాగి ఒకటి పీకాడు. అయినా, కోపం తెచ్చుకోకుండా, ఆట మొదలెట్టేదాకా ఆగి, వాణ్ణి బతిమాలాను, "ఒక్క అయిదు నిమిషాలు చూసి వచ్చేస్తాను, దయ చూపు" అని.

అమ్మ దయ ఎక్కువగా ఉన్నందువల్ల వాడు దయ చూపలేదు. ఏడుస్తూ వెనక్కి తిరిగి ఇంటికి వచ్చాను. ప్రపంచం డబ్బుమీద నడుస్తోంది. ప్రపంచం అంటే, కోరికల సంపుటి. కోరికలే దారాలయితే, వాటి నేతలో ఏర్పడ్డ బట్ట ప్రపంచం. కనుక కోరికలన్నీ డబ్బుమీద ఆధారపడి వున్నాయి. కనుక డబ్బుమీద ఆశ ఉంటే, అన్ని కోరికలూ ఉన్నట్టే. ఏ వొక్కటీ పోయినట్టు కాదు. ఇక నేను సాధించి యేడ్చింది ఏమిటి? ఈ ఆలోచనతో తెల్లగా తెల్లవారింది. ఎండ ఎక్కుతున్న కొద్దీ మనస్సు చల్లగా చల్లబడ్డది.

ఆ మధ్యాహ్నం రోడ్డుమీద నడుస్తుంటే ఎండలో ఏదో మెరుస్తోంది. తీసి చూశాను. అర్ధ రూపాయి బిళ్ళ అది.

"అర్ధరూపాయి అంటే, రెండు సర్కసు టికెట్లు" అనిపించింది. ఇప్పుడెళ్ళితే సర్కస్ ఆట అందుతుంది. ఆ అర్ధరూపాయి చేతులో పెట్టుకొన్నాను. జేబులో గూడా వేసుకోలేదు. వెంటనే బయలుదేరాను. కానీ సర్కస్ చేరువకాదు. పొద్దుటూరు నుంచి పన్నెండు మైళ్ళు నడిచాను.

ఎందుకో తెలుసా? మీరు ఊహించగలరా?

పన్నెండు మైళ్ళు నడిచాక రైలుపట్టాలు తగిలాయి. రైలుబండి వచ్చేదాకా అక్కడ ఆగాను. ఆగి, ఆ అర్ధరూపాయి బిళ్ళ పట్టాలమీద పెట్టి యివతలికి వచ్చాను. ఆ రైలు దాని మీంచి వెళ్ళింది. ఆ బిళ్ళ అప్పడంమల్లె పెరిగింది.

"ఇవాళ్ళ కనిపిస్తావా? పైగా రెండు సర్కసులా నువ్వు? చావు."

ఈ మాట అనుకున్నానని నాలో నాకు ఎంత సంతోషమో అప్పుడు! ఇది గూడా ఒక రజోగుణ విలాసమే. అయితే యీ రకమైన "హఠం" లేందే సాధన సాగదు.

అప్పుడు "డబ్బు" అనే భావన యొక్క సమస్త చరిత్ర దర్శనం ఇచ్చింది. డబ్బు అనేది భావనే తప్ప వస్తువు కాదని మీరుగూడా సులభంగానే గ్రహిస్తారు. అనాది పురాతన కాలంనుంచి, విశాల భూ భాగపు మూల మూలలలో అది పొందుతున్న పరిణామాలన్నీ నా కప్పుడు దర్శన మిచ్చినాయి. ఆ దర్శనంవల్లే, మా వెంకమ్మత్త నోటుంబడి ఒక చిన్న పొగడ్త పొందగలిగాను. ఆ విధంగా ఒక పంతంలో నెగ్గాను.

ఎన్నో క్లిష్టమైన సాధనలు చెప్పేది. ఎన్ని చేసినా మెచ్చుకొనేది కాదు. ఈవిడ చేత ఏదో ఒక మెప్పు పొందాలని నాకో తపన! ఒక పంతం. ఇలా వుండగా ఒక రోజున నేను మా అత్త వెంబడి వీధిలో వస్తున్నాను. ఒకచోట జనం పోగుపడి వున్నారు. ఏమిటా అని చూస్తే అక్కడ రోడ్డులో పాతవలసిన పంపు గొట్టాలు కొన్ని పడేసి వున్నాయి. ఒక గొట్టం లోకి ఒక నాలు గయిదేళ్ళ పిల్లవాడు దూరి, ఎట్లా వెళ్ళాడో వెళ్ళాడు. వాడు దాంట్లో ఇరుక్కు పోయి, ఇక బయటకు రాలేక ఏడుస్తున్నాడు. వాణ్ణి బయటకు లాగాలని ప్రయత్నించగా వాడు బిగుసుకుపోయి, నొప్పి పుట్టి యేడ్చేస్తున్నాడు. అందరూ ప్రయత్నాలు చేస్తున్నారు. ఫలించటం లేదు. అదీ పరిస్థితి. నేను అత్తవంక చూశాను. ఆవిడ నా భావం గ్రహించి అనుమతి యిచ్చింది.

నేను వెంటనే, కోతిలాగా గంతులువేస్తూ, అందరి దగ్గరా, అణాలు, అర్థణాలు, బేడలు, పావలాలు ముష్టెత్తి వసూలు చేశాను. ఈ సందడికి పిల్లవాడు ఏడుపాపి నా వంక చూస్తున్నాడు. బాగా దోసిడు నిండా డబ్బులు వచ్చాక, నోటితో లొట్టలు వేసుకుంటూ అవన్నీ ఆ తూము

మొదట్లో గల గల్లాడిస్తూ పోశాను. ఇంత "డబ్బు" చూసేసరికి పసివాడికి ఒక ఊపువచ్చి తలకాయ తనే గట్టిగా నెట్టుకొని డబ్బులు అందుకొనేందుకు ముందుకు సాగాడు. ఇంకే ముంది? పిల్లవాడు గొట్టం చివరకి వచ్చాడు. బైటకి లాగేశాను.

"ఆహా! ధనలక్ష్మీ! నీ శక్తి అసాధ్యమమ్మా! కళ్ళు తెరవని పసి పిల్లలను గూడా మోహపెట్టగలవు నువ్వు" అనుకున్నాను. అక్కడున్న వాళ్ళంతా నన్ను ఆకాశాని కెత్తేశారు. నాకది లెక్కలేదు. నా చూపులు వెంకమ్మత్త మీదే వున్నాయి. ఆవిడ ఆశ్చర్యంలోంచి తేరుకుంటూ "బుద్ధిశాలివిరా నువ్వు" అంది. అంతకు మించి మరోమాట లేదు. కాని, ఆ ఒక్క మాట, ప్రపంచ రికార్డు అతిక్రమించినంత విలువైంది నాకు!

ఆ రోజుల్లో ఎవరికీ రుణపడి వుండరాదని, వీలయినంత పనిచేసి పెట్టేవాడ్ని మా మణ్ణీ వాళ్ళింట్లో గూడా, పిల్లలంతా నిద్దరపోయినా సరే, నేను నిద్రపోయే వాడ్ని కాదు. ఆవిడ వంటయిల్లు కనుక్కొని, పని పూర్తిచేసుకొని పడుకునే సరికి, రోజూ పదకొండు దాటేది. అంతవరకూ ఆవిడ దగ్గరే తిరిగే వాడ్ని. "ఏం పనీ లేదులే, పోయి పడుకోరా" అని కేకలేసేది వొకోసారి. అయినాసరే, ఆ గడప దగ్గరే కూర్చుని కునికిపాట్లు పడేవాడ్ని తప్పితే, పోయి పడుకునే వాడ్నికాదు. మా మణ్ణీ పడుకున్నాకే నేను పడుకోవటం.

అలాగే నేను వారాలు తిన్న ఇళ్ళల్లో, నాకు పాఠాలు చెప్పిన యిళ్ళల్లో గూడా చేతనయిన పని చేస్తూ ఉండేవాణ్ణి.

ఇలా సాగుతుండగా, ఎంత దాచినా కొన్ని సిద్ధులు ఏదో మూల వ్యక్తమవుతూ ఉండేవి.

చిన్న పిల్లలతో ఆటలాడేటప్పుడు ఆకు ముక్కలు ఇక్కడ మాయం చేసి, ఎక్కడ కావాలంటే అక్కడ ప్రత్యక్షం చేసేవాణ్ణి. అగ్గిపుల్లలు విరిచి మళ్ళీ అతికిస్తూ ఉండేవాణ్ణి. వేపాకులు పటికబెల్లం చేస్తూ ఉండేవాణ్ణి. ఒకోసారి మాజిక్ చేస్తానని, వాళ్ళచేతే తెల్లకాగితం, నీళ్ళు తెప్పించి వాళ్ళ ఎదుటే ఆ కాయితం నీళ్ళల్లో ముంచేవాణ్ణి. ముంచే ముందరే, నీకు వచ్చిన శ్లోకం చెప్పు అనేవాణ్ణి. వాళ్ళు చెప్పిన శ్లోకం ఆ తడి కాయితం మీద రాసి ఉండేది. ఎలా చేశావనేవారు. అదే మాజిక్ అనేవాణ్ణి. నవ్వేసేవారు. గట్టిగా అడిగితే మాత్రం ఇలాంటివన్నీ దైవభక్తివల్ల నాకు వచ్చినాయని చెప్పేవాడిని. అయినా ఇవి చాలా అరుదుగా చెయ్యటంవల్ల, కేవలం పిల్లల దగ్గర మాత్రమే చెయ్యటంవల్ల పెద్దగా లెక్కలోకి వచ్చేవి కాదు. రిహార్సల్ లేకుండానే చిన్న చిన్న నాటకాలు గూడా వేసేవాణ్ణి గాని, దానికి గూడా దైవ బలంవల్ల గుర్తింపురాలేదు.

మా మణ్ణీకి తలనొప్పి చాలాసార్లు చిటికలు వేసి తగ్గించాను. అయినా అది గూడా హాస్యాల్లోనే కొట్టుకుపోయింది.

ఒకసారి మా చంద్రుడు తమ్ముడికి పిచ్చికుక్క కరిచింది. వాళ్ళు ఇంజక్షన్లు చేయించా లనుకుంటుంటే, అక్కరలేదని నేను విభూతి రాశాను. ఆ పుండు పూర్తిగా తగ్గిపోయింది. తరువాత గూడా ఏ బాధా కలగలేదు. అయినా నా అదృష్టంవల్ల దానికి పెద్దగా గుర్తింపు రాలేదు.

ఇవన్నీ మా వెంకమ్మత్త దృష్టిలో పడకుండానే కొట్టుకుపోయాయి. అయితే ఒకటి మాత్రం ఆవిడ దృష్టిలో పడటంవల్ల నా వొళ్ళంతా కొట్టుకుపోయింది.

ఒకసారి నేను, మా చెల్లి, అభేదానందస్వామివారి తోటలో తిరుగుతున్నాం. ఇంతలో ఒక పాము వచ్చింది. నేను చటుక్కున దాన్ని పట్టుకొని మెడకు చుట్టుకున్నాను.

ఇది చూసి మా చెల్లి పెద్దపెద్ద కేకలు పెట్టింది. అభేదానందస్వామివారు పరుగెత్తు కొచ్చారు. వారు వచ్చేలోపల నేను మెడలోంచి పామును తీశాగాని పారెయ్యటం కుదరలేదు.

ఆయన ఏగాదిగా మౌనంగా నాలుగయిదు నిమిషాలు చూశారు. నేనూ చూస్తూనే వున్నాను. మా చెల్లి ఆయన పక్కకు వెళ్ళిపోయింది.

“దాన్ని వదిలేసి చేతులు, కాళ్ళు బాగా కడుక్కొని యిటురారా నాన్నా” అన్నారాయన.

*　　　*　　　*

## సాముద్రికం

ఆయన చెప్పినట్లు చేశాను.

ఆయన చాలాసేపు నా చేతి రేఖలు, కాలి రేఖలు చూసి చివరకు చొక్కా విప్పించి వీపు మీది రేఖలు గూడా చూశారు. ఆయన ఎంతసేపు చూసినా నేనేమీ అడగలేదు. మా చెల్లెలు మాత్రం “ఏం వుందండీ, మా సత్యనారాయణ చేతిలో ఏం వుందండీ?” అని గోలగోల చేసింది.

నేను గూడా “చెప్పండి” అన్నాను చివరికి.

ఆయన చాలా రేఖల పేర్లు చెప్పారు, చూపించారు. చివరికి “నీకు భవిష్యత్తులో పట్టబోయే యోగం యొక్క అవధి నా మనస్సుకి అందటం లేదురా. మహాత్ముడివిరా నువ్వు” అన్నారు.

నేను నా కుడి కాలి మడమలోనూ, ఎడమ కాలి చిటికినవేలు క్రిందా వున్న రెండు రేఖలను చూపి ‘ఇవేమిటి’ అని అడిగాను.

“తెలియటం లేదురా” అన్నా రాయన.

ఈలోగా. మా చెల్లెలు తన చెయ్యి చూడమని వెంట బడ్డది. “చూడక్కరలేదమ్మా, అంతా బావుంది. నీ కసలు తిరుగులేదు” అని దాని చేతిలో వో పండు పెట్టారు స్వామివారు.

"మరి మీ చెయ్యి నేను చూడనా?" అన్నాను నేను.

ఆయన సంతోషంగా చూపారు.

జాగ్రత్తగా చూశాను. "చెప్పరా" అన్నారాయన.

"మీరు పక్షవాతంవల్ల శివైక్యం చెందుతారు" అన్నాను.

"శివోహం" అన్నారాయన సంతోషంగా.

మా చెల్లి నామీద పడి పీకింది.

"నీకింత బుద్ధి లేదేరా సత్యనారాయణా! ఆయన మన కెంత మంచి మాటలు చెప్పారు. నువ్వాయన కిలాంటి మాటలా చెప్పేది" అని. దాని స్కూల్ ఫీజుకీ, పుస్తకాలకీ ఆయనే డబ్బులిస్తూ ఉండేవారు. అందుకని దానికి ఆయనంటే మరీ అంత అభిమానం!

ఇంటికి తిరిగి వస్తుండగా కూడా, దారంతా పోట్లాడుతూనే వుంది మా చెల్లి.

"నీకెందుకే ఈ కథలు? నేనిలాంటి స్వాముల వార్లని చాలామందిని చూశాలే" అన్నాను విసుగెత్తి.

"ఎక్కడ్రా నువ్వు చూసింది?"

"చాలాచోట్ల"

"మన గుడి బయట బైరాగుల్నా?"

"నీ మొహానికి వాళ్ళే స్వాముల వార్లులే"

"మరెక్కడోయ్ నువ్వు చూసిందీ?"

"అన్ని క్షేత్రాల్లోనూ"

"అబ్బో! బడాయిలు, ఆపవోయ్ గొప్పలు" మా వరలక్ష్మి గ్రహించలేదు గనుక బతికి పోయాను. కొన్నాళ్ళు గడిచేసరికి—

ఆ రోజు నా చేతికి దొరికిన పాము, నా వెంట తిరగసాగింది. మరి దానికి నా మీద అంత ప్రేమ ఎందుకో? ఒక రోజున అది మా గుళ్ళో వున్న పూలమొక్కల దగ్గర తచ్చాడ సాగింది. నేను దాన్ని చూసి, ఆదరంగా ఎత్తుకొచ్చి, ముద్దుగా శివలింగానికి చుట్టసాగాను.

ఇంతలో వెంకమ్మత్త గుళ్ళోకి వచ్చింది.

ఇక ఒకటో రెండో విసిన కర్రలు విరిగాయిరా బాబూ అనుకున్నా. కానీ ఆ రోజు నోటితో మందలించింది. "ఈ పని వల్ల ఎవరికి ఉపకారం చేస్తున్నావు?" అన్నది. యీ వొక్కమాటే నాకు మాత్రం తలకొట్టినట్టయింది.

"ఔను, ఒక్కరికయినా ఉపకారం లేని పని మనవల్ల ఎందుకు జరగాలి? అలాంటి ఆలోచన ఎందుకు రావాలి?" నన్ను నేనే మందలించుకున్నాను.

"సమయం రాకముందే ప్రకటనలు చేసేవాడు విద్యకు అర్హుడంటావా?" ఇది రెండవ వాత.

మా నాన్న, అత్తయ్య పోట్లాడుకుంటున్నప్పుడు చూసి, ఈవిడ ఉత్త మోటుమనిషి అనుకున్నా గాని, ఇంత నాజూకుగా వాతలు పెట్టగలదని ఇదివరకు అనుభవం లేదు నాకు.

ఈ దెబ్బతో ఆ పాము గూడ పడగ దింపేసి నన్ను ఎక్కిరించటానికా అన్నట్టు శివుడి వెనక నక్కి కూర్చుంది.

"ఆయన్ని వాళ్ళింట్లో దింపేసిరా" అంది మా అత్త.

మళ్ళీ ఇక్కడికి రావద్దని ఆ పాముకి హెచ్చరిక అది. నేను పామును చొక్కా చాటున పెట్టుకొని, గుట్టుగా అభేదానందుల తోటలో వదిలేసి వచ్చేశాను.

ఆ రోజుల్లో కొందరు నన్ను 'శకున పక్షి' అని తిట్టేవారు. ఎందుకంటే, ఒకోసారి వున్నట్టుండి, "నీకు ఇట్లా జరుగుతుంది" అని వచ్చేసేది నోటి వెంట. వచ్చిందంటే అయ్యిందన్నమాటే. అది అన్నిసార్లూ శుభమే వస్తుందని నమ్మకం లేదు.

యోగబలం వల్ల వచ్చే ధైర్యానికి అవధి వుండదు అనటానికి గూడా ఒక ఉదాహరణ అక్కడ జరిగింది.

ఆ రోజుల్లో అక్కడి నించి ఒక పల్లె వెళ్ళే మార్గంలో ఎనిమిది మైళ్ళ దూరంలో ఒక చెట్టు మీద బ్రహ్మరాక్షసి చేరిందనీ, ఆ దారిన పొయ్యే వాళ్ళు నెత్తురు కక్కుకు చస్తున్నారనీ, దూరానికి కూడా దాని వికృత ధ్వనులు వినిపిస్తున్నాయనీ పుకారు బయలుదేరింది. కొందరు సత్పురుషులు ప్రజాక్షేమం కాంక్షించి, భూత వైద్యులతో ఏవో శాంతి క్రియలు చేయించారు కాని ఫలితంలేదు.

ఇలావుండగా, నాకెందుకో దాని సంగతేదో మనం చూడాలని బుద్ధి పుట్టింది. పుట్టినరోజు రాత్రి మణ్ణీ వాళ్ళింట్లో ఒక బ్యాట్రీలైటు తీసుకొని బయలుదేరాను.

అదొక పెద్ద బూరుగ చెట్టు. చాలా పొడుగ్గా వుంది. గుబురుగా వుంది. చెట్టు కింద నుంచున్నాను. హాయిగా వుంది. మనస్సుకి ఏ వికారమూ లేదు. దయ్యమెందు కవుతుంది?

ఇంతలో ఏదో విచిత్రమైన శబ్దం భయంకరంగా చెట్టు మీది నుంచి వినిపించింది. నిజంగానే ఆ ధ్వని భయంకరం! పైగా అది అర్ధరాత్రి కావటం, ఊరి వెలుపల కావటం, దాని భయంకరత్వాన్ని పెంచుతున్నాయి. దానికి తోడు దయ్యం అన్న వూహ వుంటే ఇక వేరే చెప్పక్కరలేదు గదా!

నేను బ్యాటరీ లైటు చెట్టు మీదికి వేశాను.

అక్కడేదో విచిత్రమైన ఆకారం గల పక్షి ఎగురుతోంది. ఎగిరేటప్పుడు అరుస్తోంది. అదే ఆ దయ్యపు కూత. మరి కొంత సేపు పరిశీలించాను. అది మధ్య మధ్యలో కొమ్మమీది నుంచి కొమ్మమీదికి మారుతోంది. అలా మారేటప్పుడల్లా అరుస్తోంది. అదీ అసలు గోల.

పాపం, దాని మానాన అది చెట్టుమీద కాలక్షేపం చేస్తోంది. కాని, అది యీ దేశంలో వుండవలసిన పక్షి కాదు. ఎందుకు వచ్చిందో, ఎలా వచ్చిందో, ఇక్కడకు వచ్చింది. దానికీ భయంగా వుంది గాబోలు వికృతంగా అరుస్తోంది. దాని కూత కొత్తగా వున్నందువల్ల పిరికివాళ్ళు కొందరు దెబ్బ తింటున్నారు.

పక్షి కన్నా మనిషి ముఖ్యం. రోడ్డు నుంచి నాలుగు కంకర రాళ్ళేరాను. ఆ రాళ్ళు దానిని అటునుంచి అటే కైలాసానికి సాగనంపేశాయి.

దయ్యాన్ని తరిమేసిన ఘనత, ఆ తరువాత కొంతమంది భూత వైద్యులు స్వీకరించారు! శుభం !!

అలాగే అప్పుడప్పుడు మా అమ్మ యిచ్చిన శక్తి పునర్దర్శన మిస్తూవుండేది. ఆ ఆనందం తీవ్రమై స్పృహ తప్పిపోయేది. దాన్ని చూసి కొందరు ఇరుగు పొరుగు వారు నాకు ఫిట్సు వ్యాధి వుందనీ, సరియైన వైద్యం చేయించుకోలేక పోతున్నాననీ అనుకునేవారు. వెంకమ్మత్త గూడా వాళ్ళతో అలాగే చెప్పేది.

అలా రెండు మూడుసార్లు చూసి, ఒకరోజు మందలించింది. "పొర్లిపోతోంది అంటే పాత్ర చిన్నదైందని అర్థం" అన్నది. దాంతో దాన్ని నిగ్రహించటం గూడా సాధనలోకి వచ్చింది. దాని వల్ల మా అమ్మ చెప్పిన మెట్లలో ఒక మెట్టు ఎక్కినట్టయింది.

ప్రొద్దుటూరులో సాధనలో పైకి వెళ్ళుతున్న కొద్దీ "సాధించవలసింది సాధించానని" తృప్తి వొకటి వస్తూ వుండేది. సాధకుడికి అది శత్రువుల్లో కల్లా శత్రువని తెలుసు. దాన్ని వివేకఖడ్గంతో ఖండించి ముందుకు సాగిపోతూ వుండేవాణ్ణి.

అక్కడ జరిగిన సంఘటనల్లో రెండు అంతగా ముఖ్యం కాకపోయినా, నాకు బాగా గుర్తున్నాయి.

అప్పుడప్పుడు, నుసంలో మా పెదనాయన గారింటికి వెళ్ళి వస్తూ వుండేవాణ్ణి, నుసం వెళ్ళటం మా అమ్మ వున్నప్పుడు గూడా అలవాటే. అక్కడ మా పెదనాన్న గారింట్లో దివ్యనామ సంకీర్తన నియమంగా చేసేవారు. ఆ సంకీర్తన నన్ను ఉత్తేజపరచేది.

ఆ వూళ్ళోనే ఒక బుగ్గ వుంది. దాని వొద్దునే శివ విష్ణు ఆలయాలు ! ఆ బుగ్గ దగ్గరా, ఆలయాలలోనూ ధ్యానం ఆనందంగా సాగేది.

మా పెదనాన్న గారు జ్యోతిషంలో గట్టివాడు. జ్యోతిషం కిటుకులు అక్కడ పట్టాను. ఏ విద్య కనిపించినా ముందర దాన్ని స్వాధీనం చేసుకోవాలనే ఉత్సాహం అప్పుడు ఎక్కువగా వుండేది.

ఒకసారి నాకు మశూచి వ్యాధి వచ్చింది. చాలా బాధ పడ్డాను. నేను అంత బాధపడు తుంటే, వెంకమ్మత్త తన చేతులో వున్న మందులు గూడా నా కియ్యలేదు సరిగదా, అయ్యో అని గూడా అనలేదు. నేనే నోరు తెరిచి "అత్తా! ఏదైనా మందివ్వవా?" అన్నాను దీనంగా.

పన్నెండేళ్ళ కుర్రవెధవ! రోగం వచ్చింది. వొళ్ళు మంటలెత్తి ప్రాణాలు పోతున్నై! పైగా లోపల అనుష్ఠానం ఆగరాదు! మందిమ్మని బ్రతిమాలితే ఆవిడేమందో తెలుసా?

"నేనేం నీ సేవ చెయ్యటానికున్నానా? నీ వైద్యం నువ్వేడ్చుకోలేవా?" అంది ఊళ్ళో వాళ్ళకు ఏదైనా వస్తే, వాళ్ళ ఇళ్ళ చుట్టూ తిరిగి వైద్యాలు చేస్తుంది. సొంత మేనల్లుడికి, శిష్యుడికి రోగం వస్తే ఇదీ వరస!

నేను చెయ్యగలిగిందేముంది? అలాగే వోపిక చేసుకొని, చచ్చినట్టు వేపాకు కోసి తెచ్చుకొని, నేనే నూరుకొని, నేనే వొంటికి పట్టించుకొని, నేనే వేప కొమ్మలతో విసురు కున్నాను.

మర్నాటికి తగ్గిపోయింది.

అప్పుడు అన్నది వెంకమ్మత్త, "చూశావా, నేను మందేస్తే కనీసం పదిరోజులు పట్టేది. నువ్వే వేశావు గనుక రెండోరోజుకు పోయింది.". నాకు గుర్తు వున్నంతలో, మా అత్త నోటితో చేసిన ఉపదేశం ఇదే. ఆవిడ కాఠిన్యానికి నేను జీవితాంతం ఋణపడి వుంటాను. ఇది లోక దృష్ట్యా చెప్పేమాటే. నిజానికి ఆ జీవి సర్వఋణాలను అతిక్రమించింది. ఇది ఎంత అవతార మైనా, శరీరమన్నాక క్రమశిక్షణ వుండాలి. అది ఈ శరీరానికి అత్తద్వారా సిద్ధించింది.

ఆ రోజుల్లోనే అగస్త్యేశ్వరస్వామి ఆలయంలో, రాత్రి పన్నెండు గంటలు దాటాక విచిత్రమైన సంగీతాలు, నాట్యపు గజ్జల సవ్వడులు వినిపించేవి. మునెయ్యగారు అప్పుడప్పుడు హెచ్చరించేవారు. క్రమంగా నాలో నాకు అంతర్గతంగా రాగాలు వినిపించటం యెక్కువయింది. ఆ రోజుల్లో భైరవి రాగం బాగా యెక్కువ వినిపించేది.

నా నోటంబడి భక్తి కీర్తనలు వెలువడటం గూడా అప్పుడే జరిగింది. లోపల వినిపించే భైరవి రాగం ప్రభావం వల్లే, ఆ మొదటి కీర్తన "పాహి పాహి గజాననా" అనేది భైరవి రాగంలో వచ్చింది.

సాధన యీ స్థితికి వచ్చేసరికి, దాదాపు సంవత్సరన్నర దాటింది. అప్పటికి మా వెంకమ్మత్త ఎక్కిస్తున్న హఠయోగం గూడా ఆత్మతత్వ సమన్వయం దగ్గరకు వచ్చి, అన్వయించక గిజగిజలాడిస్తోంది. అంతకు ముందు మా అమ్మ ఇచ్చిన రాజయోగమూ, శ్రీవిద్యా గూడా ఆ స్థితిలోనే వున్నాయి. ఈ రెండేళ్ళ సాధన, రెండింటి లవలేశాలన్నింటినీ వంట బట్టించుకొని హఠయోగాన్ని స్వాధీనపరచుకోవటానికే సరిపోయింది.

మా అమ్మ వున్నప్పుడు ఏ ప్రశ్న మిగిలిందో, అది అట్లాగే వుండిపోయింది. పైగా అది వందల వేల ప్రశ్నలను సృష్టిస్తోంది. అది నోటితో చెప్పేది కాదనీ, శాస్త్ర వాదాలతో తేలేది కాదనీ బాగా తెలుసు. అయినా, మనస్సు ఆగేది కాదు. మా అత్తను వందలకొద్దీ ప్రశ్నలు వేసేవాణ్ణి.

వెంకమ్మత్తకు మా అమ్మలాగా కథలు కథలుగా విషయం చెప్పే ఓర్పు తక్కువ. తరచు విసినికర్ర దెబ్బలద్వారానే ఆవిడ బోధసాగేది. కొన్ని ప్రశ్నలు తీరేవి. ఎప్పుడైనా నోరు విప్పిందంటే మాత్రం నా ప్రశ్నలకు ఇంకా నాలుగు ప్రశ్నలు తగిలించేది. లేదా నా ప్రశ్నలు పెరిగేలాగా ప్రవర్తించేది.

నాకు ప్రశ్నలు మరీ పెరిగినప్పుడు, నన్ను రాత్రికి గుళ్లోనే పడుకోమని పిలిచి, బాగా పొద్దుపోయాక, గర్భగుళ్లో కూర్చోబెట్టి బయట తలుపు తాళం వేసేది. అలా ఎన్నిసార్లు గుళ్ళో తాళం పెట్టినా, చిత్ స్ఫురణ లేశమాత్రంగా కలిగి లిరిగి కరిగిపోయేదేగాని, నూనె ధారలాగా యెడంలేని అఖండ చైతన్యానుభవం అందలేదు. అదీగాక ధారణాబలంచేత శీతోష్ణాదుల వైషమ్యాలను జయిస్తున్నానేగాని, వాటి స్ఫురణకు అతీతమైన స్థితిలో పట్టు చిక్కలేదు.

## ప్రశ్నల గచ్చపొద

ఇలా వుండగా ఒక రోజున నా సందేహాలు మరీ విపరీతమైనాయి. ఆ స్థితి దాకా వస్తే మీకూ అలాంటి ప్రశ్నలు పుడతాయి. ఏ ప్రశ్నలు పుడతాయో ముందుగా చెప్పేస్తే తేలికవు తుంది గదా అనుకోవచ్చు మీరు. కాని దానివల్ల వ్యతిరేక ఫలమే వస్తుంది. అందువల్ల ఆ ప్రశ్నలన్నీ మీకు చెప్పరాదు. కాని విషయం ఇలా వుంటుందనేందుకు ఒకటి రెండు సూచన లిస్తాను.

1. కనిపించే బయట జగత్తులోనూ, కనిపించని లోపల జగత్తులోనూ ఇన్ని కదలికలు కలిగించే చైతన్యం ఎక్కడిది?

2. ఎందుకు తింటున్నాం ?

3. నాలుక పొడుగ్గా ఎందుకుంది ?

4. కీళ్ళు ఎందుకు అల్లల్లాడు తున్నాయి ?

5. ఈ శరీరం ఏమిటి ?

6. జీవుల్లో భేదా లెందుకు వచ్చాయి ?

ఈ ఉదాహరణలు బట్టి తక్కినవి మీరూహించుకోండి. వీటన్నింటికీ మూలమయిన ప్రశ్న వొకటుంది. అదే 'నేనెవడిని?' అనేది. ఆ ప్రశ్నే మా అమ్మను వేశాను. ఆ ప్రశ్నే మా అత్తకూ పరోక్షంగా వేస్తున్నానిప్పుడు.

ఈ ప్రశ్నలు ముదిరాక, విసిని కర్రల బలం చాలటంలేదు. ఆవిడకు ఆయాసమే మిగులుతోంది. దాంతో వొకరోజు విసిగిపోయి మందులు నూరుకుంటూ "నీ నోరు మూయిస్తాలే" అంది.

ఆవిడ ఆయుర్వేద వైద్యం చెసేది గనుక, ఆవిడదగ్గర ఒక సన్నికల్లు, ఒక సీసపు గరిట వగైరాలు వుండేవి. ఆ సీసపు గరిటకాడ రెండువైపులా పదునున్న చురకత్తిలాగా వుండేది. ఆ చాకు భాగంతో సన్నికల్లులో మందులు గీసేది. చిప్పభాగం కొలతకు ఉపయోగించేది. చాలారోజుల నుంచీ వాడుతున్నందువల్ల ఆ చాకు గరిటి, తెల్లగా తళతళా మెరుస్తూ వుండేది.

ఆ రోజుల్లో నేను కార్యక్రమ పట్టిక ప్రకారం నిద్రపోవాలసిందే. నిద్దర రావటంలేదు అనటానికి వీల్లేదు. నిద్దరపోవాలంటే, నిద్దర రావాల్సిందే! ఆ రోజు పడుకోమంది. పడుకున్నాక ఆవిడ లేపందే లేవరాదు.

ఆ రోజు ఆవిడ రెండు గంటలకు లేపింది. అప్పటికే ఆవిడేదో మందులు నూరుతూ నిప్పుల్లో పుటాలు పెడుతోంది. ఆవిడ వృత్తి అది.

"ధ్యానం తరువాత చేద్దువుగాని, ముందర స్నానం చేసి గుళ్ళో కెళ్ళి పారాయణలు చెయ్యి" అంది. ప్రతిరోజూ గుళ్ళో బ్రహ్మ మురారి, నాగేంద్రహారాయ స్తోత్రాలు చెప్పి, అప్పుడు రుద్రం చెప్పాలి. నేను రుద్రం చెప్పే సమయానికి ఆవిడ వచ్చి అభిషేకం చేసేది. నా రుద్రం తరువాత ఆవిడ కొన్ని ఋగ్వేద సూక్తులు చెప్పుకొనేది. ఇదంతా తెల్లవారుజాము మూడింటిలోపే రహస్యంగా అయిపోయేది.

ఆ రోజు నా రుద్రం అయినా, ఆవిడ అభిషేకానికి రాలేదు. చేసేది లేక నేను రెండో ఆవృత్తి ప్రారంభించాను. అప్పుడు, పండు నిప్పులున్న కుంపట్లో ఏదో ధూపం వేసుకుంటూ గుళ్ళోకి వచ్చింది వెంకమ్మత్త. తన మందుల గరిటెతో, ఆ నిప్పులను మధ్య మధ్యలో కదిలిస్తోంది. ఆ గరిటంతా ఎర్రగాకాలి వుంది. అయినా ఆవిడ తన చేతుల్లో మామూలుగానే పట్టుకుంటోంది.

* * *

**కఠిన కరుణ**

ఆ రోజు ఆవిడ ముఖమే అదోరకంగా వుంది. ఆవిడ వస్తూనే, నా వెనకాలకి వచ్చి, "మోకాళ్ళ మీద కూర్చొని, తలకాయ శివలింగానికి ఆనించి, స్వామిని గట్టిగా కౌగలించుకొని పశ్యన్తీ వాక్కులో పారాయణ చెయ్యి" అంది.

"శివుణ్ణి కౌగిలించుకున్న ఆనందంలో కళ్ళు మూసుకొని, ఆనందంగా అంతరంగంలో పారాయణ సాగిస్తున్నాను.

ఇంతలో, ఉన్నట్టుండి నామెడలోకి ఏదో కత్తి ఖస్సున దూసుకుపోవటం, నేను అరవ బోయి, అంతలోనే స్పృహతప్పి పడిపోవటం సెకండ్లలో జరిగింది.

ఎర్రగా కాలిన సీసపు గరిటె నా మెడలో గుచ్చుకుపోయి వుంది. నన్ను పొడిచిన మా అత్త, నిప్పులు చెరుగుతున్న కళ్ళతో తృప్తిగా చూస్తూ నుంచుంది. అలా ఒక మూడు నిమిషాలు ఆగి, ఆ కత్తి గరిటెను, మళ్ళీ ఖస్సని బయటుకులాగింది.

అలా లాగుతుండగా నాకు స్పృహ వచ్చింది. అంతులేని బాధతో కెవ్వన కేకలు వేయసాగాను. ఆ కేకల్లోనే-

నాగేంద్ర హారాయ త్రిలోచనాయ
భస్మాంగ రాగాయ మహేశ్వరాయ ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై న కారాయ నమశ్శివాయ ॥

అని శ్లోకం గూడా అందుకున్నాను. నెత్తురు పొంగి శివలింగం తడిసిపోయింది. అప్పటి దాకా ప్రళయ రుద్ర ముఖంతో గంభీరంగా వున్న మా అత్త తత్తర పడసాగింది. నేను బాధతో మూలుగుతూనే, ఆ శ్లోకాలు వరసగా చెపుతూనే బాధకు తాళలేక గుళ్ళోంచి బయటకు పరిగెత్తాను. వెంకమ్మత్త ఆపలేదు. నా వెనకే వచ్చింది. దారంతా రక్తసిక్తమవుతుండగా నేను గుడి వెనక్కి పరిగెత్తాను. అక్కడ పాత ధ్వజస్తంభపు మానొకటి గోడకు ఆనించి వున్నది. నేను బల్లిలాగా ఆ మానుమీద నిలువుగా పాకసాగాను. స్తంభం అంతా నెత్తుటితో తడిసి పోయింది. నేను సరాసరి స్తంభం చివరికి వెళ్ళి, అక్కడ వున్న గంటల చట్రంమీద నిలబడ్డాను. అప్పటికి మా అత్త ముఖంలో ఆందోళన తగ్గింది. ఆ స్థానంలో తృప్తి, సంతోషం, ఉత్సాహం, చోటు చేసుకున్నాయి.

"సెహబాష్....సత్యనారాయణా....సెహబాష్ భేష్" అన్నది పరిపూర్ణమైన ఉత్సాహంతో.

అప్పుడు నేను మళ్ళీ బల్లిలాగా కిందికి దిగి వచ్చేశాను. అప్పుడు బాధ అంతరించింది, నెత్తురు ధార గూడా ఆగిపోయింది.

మా వెంకమ్మత్త ఏదో మంత్రం పెడుతూ దారంతా వూదుకుంటూ గుళ్ళోకి వచ్చింది. అన్ని చోట్లా నెత్తురు మరకలు మాయమయి పోయినాయి. నన్ను పద్మాసనంలో కూర్చో మంది. ఈ మాటు పట్కారుతో కణకణలాడే పెద్ద నిప్పు బొగ్గొకటి పట్టుకొచ్చింది. దానిమీద ఏదో మూలికల చూర్ణం వేసింది గాబోలు, పొగలు వస్తున్నాయి. ఆ నిప్పుబొగ్గు నా మెడమీది పుండుమీద వేసి రుద్దింది

నేను అరమోడ్పు కన్నులతో అలాగే కూర్చుండి పోయాను. అలా నిప్పుతో రుద్దగా రుద్దగా, మెల్లిగా కొద్ది నిమిషాల్లోనే పుండు మానుపట్టసాగింది. అప్పుడు ఆమె ఆ పుండుమీద యేవో మూలికా చూర్ణాలు అద్దింది.

అప్పటికి నాలుగు దాటింది. నేను మా చెల్లెల్ని నిద్దర లేపుకు రావటానికి పద్మావతమ్మ గారింటికి వెళ్ళిపోయాను. మా అత్త మందులు నూరుకుంటూ కూర్చుంది. ఆ తరువాత కొద్ది వారాలకు ఆ పుండు పూర్తిగా మానిపోయింది. ఈ లోగా అడిగిన వారికి, సరిగా చదవటం లేదనీ, అల్లరి చేస్తున్నాడనీ వాత పెట్టానని చెప్పింది. "గొడ్డుమోతు మనిషి" అని తిట్టుకొన్నారు ఇరుగు పొరుగు వారు. ఆ వాత మహత్తు వాళ్ళకేం తెలుసు? మా అత్త స్మృతి చిహ్నంగా, ఇదిగో, ఇప్పటికీ నా మెడమీద ఆ కత్తిపోటు గుర్తువుంది చూడండి.

ఇదేదో మాయా మంత్రాల కథల్లే మీకు కనిపించవచ్చు. కాని, ఇక్కడ జరిగిన యోగ ప్రక్రియ యేమిటో మీ కర్థమయితే, ఆ సందేహం మీకు మిగలదు. చైతన్య స్ఫురణ అందుతూ గూడా, నిరంతర అఖండ చైతన్య ధార నిలబడని స్థితిలో కదా నేనున్నాను. ఆ లోటును హఠయోగ మార్గంలో పూరిద్దామని మా అత్త నిర్ణయించుకున్నది. హఠయోగంలో లంబికా యోగం శిఖరాగ్రభాగం. దానికి రెండు మార్గాలు. ఒకటి నాలిక క్రింది ఈనెను కొద్ది కొద్దిగా కొయ్యటం, అమృతపాన విధానంలో ఆనందస్థితిని అందుకోవటం. ఇది అందరికీ తెలిసిందే. రెండవది మెడవైపు నుంచి కత్తిని గుచ్చి, వెనుక వైపునుంచీ ఖేచరీ ప్రధాన నాడిని ఛేదన చేయటం. ఇది క్రూరమైనది, ప్రమాదకరమైనది, దాదాపు అసాధ్యమైనది కనుక గ్రంథాలు యీ మార్గాన్ని ఎక్కువగా సూచించలేదు. కాని, మా మేనత్త, తనకు మిగిలి వున్న ఆయుశ్శేషం అల్పం గనుక, ఆ కాస్త సమయంలో యీ నాలుక మార్గం పని పూర్తి కాదు కనుక, సాహసించి, రెండవ మార్గమే యెన్నుకుంది. అనేక పర్యాయాలు, నిస్సందేహమైన శివాజ్ఞ ఆమెనలా ఆజ్ఞాపించటమే అందుకు కారణం.

తన ఆయువు తనకు తెలుసు కనకనే, తనదగ్గరున్న హఠయోగ విద్యను, వైద్యవిద్యను నా కివ్వాలని తొందర పడ్డది ఆవిడ. నేను గూడా ఆవిడ యందున్న ప్రీతివల్ల కాదనకుండా తీసుకొన్నాను. నా మార్గం మాత్రం ప్రధానంగా రాజయోగ మార్గమే.

దారి మధ్యలో వున్న నాడులుగాని, నరాలుగాని, గ్రంథులుగాని తెగకుండా, కత్తిమొన సరాసరి, లంబికా నాడిని ఛేదించి ఆగిపోవాలి. ఇది తలుచుకుంటే భయం వేసే ప్రయోగం. శివాజ్ఞాబలం వల్ల ఈ అసాధ్యమైన సాహస ప్రయోగాన్ని వెంకమ్మత్త దిగ్విజయంగా నిర్వహించింది.

వెంటనే, నాడీచ్ఛేదమై, నిర్వికల్ప సమాధి అందటం ఆవిడ గమనిస్తూనే వుంది. ఆవిడ అంచనా ప్రకారం కనీసం కొన్ని వారాలు నేనీ సమాధి స్థితిలో వుండాలి. అలా సమాధిలో ఉండగా, ఆ కత్తి బయటకు లాగేసి, పుండుకు నిప్పుల వైద్యం చేద్దామని ఆవిడ ప్రణాళిక

చేసుకొంది. అందుకే మూడు నిమిషాలు జాగ్రత్తగా గమనించి కత్తిని వెనక్కు లాగింది. కాని అక్కడ ఒక విచిత్రం జరిగింది. ఇటు హఠయోగ మార్గంతో పాటు, అటు రాజయోగ మార్గాన్ని గూడా నేను సాధన చేసుకుంటూ వస్తున్నాను గనుక, శిఖరాగ్రస్థితిలో రెండూ కలిసి, అభేదస్థితిని పొందాయి. అవి పరస్పరం బలవర్ధకాలయి యోగవేగం పెరిగింది. సమాధి శక్తి వృద్ధి అయింది.

కాని మా అమ్మగారు రాజయోగ ప్రసరణ చేసినప్పుడు "సహజ సమాధే తప్పితే, దీర్ఘకాలిక నిర్వికల్ప సమాధిలో మునిగి వుండటం నీ పద్ధతికాదు" అని శాసించింది. అది మా అత్తకు తెలీదు. నాకూ గుర్తు లేదు. కాని, ఆమె ఆజ్ఞ అప్రతిహతమైనది గదా! అంతటి ద్విగుణీకృతమైన నిర్వికల్ప సమాధినీ నిమిషాల్లో సహజ సమాధిగా పరిణమింప చేసింది!

ఈ మతలబు తెలియక సమాధిస్థితి వికలమైందా ఏమిటని మా అత్త మొదట కొంచెం కంగారు పడ్డది. కాని మెల్లిగా అది వైకల్యస్థితి కాదనీ, సహజ సమాధి పద్ధతి అనీ తెలుసుకొని సంతోషించింది. ఇది యిలా వుండగా యీ లంబికా నాడీచ్ఛేదన ప్రక్రియలో అంతకుముందు నేను అంతరంగంగా ప్రయత్నిస్తున్న వాయుస్తంభనం హఠాత్తుగా సిద్ధికి వచ్చింది. దాని ఫలితమే నిట్టనిలువుగా ధ్వజస్తంభం ఎక్కటం, నిజాని కది యెక్కటం కాదు. ఎక్కుతున్నట్టు నటిస్తూ, గాలిలో తేలటం. ఇది గూడా మా అత్త గమనించింది.

ధ్వజస్తంభం యోగదండానికీ, వెన్నుపాముకీ ప్రతీక. దాని గంటల చట్రం సహస్రార పద్మంలో భాసించే ఆనంద స్థితికి సంకేతం. నా యోగస్థితి అఖండ చైతన్యధారా స్థితికి చేరిందనీ, అనంతానంద సిద్ధి కలిగిందనీ, ప్రశ్నలూ, ద్వంద్వాలూ లయించాయనీ సూచించేందుకు నాకు కొత్తగా సిద్ధించిన వాయుస్తంభన విద్యను ఉపయోగించి ధ్వజస్తంభాగ్రాన నిలబడ్డాను నేను. ఇదంతా గ్రహించే ఆ మహాయోగీశ్వరి నన్ను శెహభాష్ అని మెచ్చుకుంది. తను బోధించిన విద్యకాక, మా అమ్మ బోధించింది కొంత నా దగ్గర వుందని తెలిసినా, దాని పరిమితి అప్పటి దాకా ఆమెకు తెలియదు. అప్పుడది గూడా తెలిసి ఆనందించింది, అభినందించింది.

ఇక అక్కడితో నేను ప్రశ్నించేది గాని, ఆమె బోధించేది గాని యేమీ లేదు. అసలు ఆవిడ అనీ, నేననీ రెండు లేవు అక్కడ. అందుకనే ఎవరిదోవన వారు మా మా పనుల్లో పడి పోయాం. అదీ అక్కడ జరిగిన విశేషం. అలా నా సాధన చరిత్రలో శిరోభూషణ మనదగ్గ భాగం ప్రొద్దుటూరులో ఆ సత్పురుషమండలిలో జయప్రదంగా సాగింది.

ఇది ఆరూఢ స్థితి. దీన్ని సుస్థిరం చేసుకొనే ప్రయత్నం గూడా మా అత్త సమక్షంలో అక్కడే మొదలయింది. ఇక్కడ ఒక చిక్కు వచ్చింది. ఇంతవరకూ ఒక దివ్యమైన సన్మండలి సాంగత్యంలో నా సాధన సాగింది. సత్సాంగత్యం చాలా గొప్పది. దీన్ని గురించి ఎంత

చెప్పినా తరగదు. అది నిజమే. కాని ఎంతయినా అది సాంగత్యమే. పై సాధనకు ఏ సాంగత్యమూ పనికిరాదు.

చుట్టూతా వాతావరణం సత్త్వమయంగా వున్నప్పుడు సాధన సాగటంలో పెద్ద విశేషం లేదు. వాతావరణమంతా ప్రతికూలంగా వున్నప్పుడు సాధన జరిగితేనే జరిగినట్టు.

అందుకే, ఇక ప్రొద్దుటూరు నుంచి వెళ్ళిపోదామన్న దృష్టి బయలుదేరింది. మా అత్తకు గూడా జీవితం చివరికొస్తోందని తెలుసు. అందుకే 1959 వేసంగి సెలవుల్లో నన్నూ మాచెల్లెల్నీ మా నాన్నను చూసి రమ్మని పంపించింది మా అత్త. ఆ వెళ్ళటం నేను మళ్ళీ ఇటు రాలేదు. తరువాత నా సాధన అనంతపురంలో సాగింది.

ఇతర మేనల్లుళ్ళ దృష్టిలో అచ్చపు చాదస్తపు ముసలమ్మగానూ, ఇరుగు పొరుగు అమ్మ లక్కల దృష్టిలో దిక్కులేని పక్షిగానూ జీవితం సాగించిన ఆ ధన్యజీవి. మా వెంకమ్మత్త కర్మ బంధాల నుంచి పూర్తిగా విముక్తురాలై, మృత్యువును దాటి విదేహకైవల్యం చూరగొన్నది.

అలా 4–5 తరగతులు అక్కడ పూర్తి చేసుకొని, ప్రొద్దుటూరు నుంచి వెళ్ళేటప్పుడు, నా సాధనానుభవాలతోపాటు, మా అణ్ణామణ్ణి కుటుంబపు తీపి గుర్తులు గూడా తీసుకు వెళ్ళాను నేను.

కృతజ్ఞత సత్త్వగుణానికి ప్రధాన ఫలం గదా !

వాళ్ళకు నా ఆధ్యాత్మిక జీవనం గురించి ఏమీ తెలియదు. వాళ్ళు లోక సామాన్యులు, కాని లోకాతీతమైన సాధుత్వం వారి దగ్గర వుంది. విశేషించి వాళ్ళు నాకు జన్మాంతర బంధువులు. అందువల్ల నా బహిరంగ జీవితంలోని ప్రతి మెట్టులోనూ వాళ్ళకు ఉత్తరాలు రాస్తూ, వాళ్ళతో నా అనుబంధాన్ని నిలుపుకుంటూ వచ్చాను.

1962లో మా అణ్ణగారు గతించారని ఆలస్యంగా ఉత్తరం వచ్చింది. కాని అప్పటికి నా అంతరంగ సాధన గొప్ప పరిపాక దశలో వున్నది. అందువల్ల నేను వెళ్ళి ఆ కుటుంబాన్ని ఓదార్చటం కుదరలేదు. ఉత్తరాల ద్వారా మాత్రం ఆ పని చేశాను. మా అణ్ణగారు, అంటే సుబ్బామణిగారు గురువాయూరప్ప భక్తుడు కావటం వల్ల ఆయన ఆ స్వామి ధ్వజ స్తంభాన్ని ఆశ్రయించుకొని, ఆ స్వామి పాదాల దగ్గరే యీ రెండేళ్ళుగా వేళ్ళాడుతున్నాడు గాబోలు. నాకా ఆలోచనే లేదు.

ఇప్పుడు నన్నిక్కడ చూచి, ఆయన ఆక్రోశించే వరకు నా మనస్సు ఒక తీవ్రమైన ప్రణాళికా మార్గంలో నడుస్తూ వుంది. ఇప్పుడు నా సంపూర్ణ ఋణవిమోచనకు సమయం వచ్చింది. ఆ జీవికి పరిపూర్ణ తృప్తి కలిగేందుకు, ముందాయన ఇంటికి వెళ్ళి, ఆయన పుత్రు లందర్నీ వ్యక్తిగతంగా ఓదార్చి, ఆ జీవికి అందించవలసింది అందిస్తాను. అందుకే ప్రొద్దుటూరుకు పోవాలని తొందర పడుతున్నాను.

# 15 వ అధ్యాయం కనిపించని పునాది

*కృతజ్ఞతా భావ నిరూఢబుద్ధి*
*మప్యాస్మరంతం స్వకృతం గురూద్ధమ్ ।*
*ఫలోదయాత్ ప్రాక్ త్రిదశావిచింత్యా*
*క్రియా విధానాశ్రయ మాశ్రయామః ॥*

[ కృతజ్ఞతా బుద్ధి ఆయనకు గాఢంగానే వున్నా, తాను ఇతరులకు చేసిన మేలు మాత్రం గుప్తం వుంచుకోరు (ఇతరులు చేసిన పని తనకు తెలిసినా) తను చేసేది, ఫలించే దాకా దేవతల కయినా తెలియనీయరు. అట్టి శ్రీ గురుశ్రేష్ఠులను ఆశ్రయిస్తున్నాను. ]

## కృతజ్ఞత

"బాలా, బాలా"

అర్ధరాత్రి ఒంటిగంటవేళ, అలా గొంతు చించుకొని అరుస్తున్న పిలుపుకి విసుక్కుంటూ నిద్ర లేచాడు బాలసుబ్రహ్మణ్యం.

"ఎవరు" అంటూ వెళ్ళి వాకిలి తలుపు తీసాడు. ఎదురుగా ఎవరో కొత్త వ్యక్తి వున్నాడు.

నల్లటి మనిషి, తెల్లటి లుంగీ, జరీ ఉత్తరీయం, మధ్యరకం ఎత్తు, కొద్దిగా పెరిగిన గడ్డాలు, మీసాలు, ముఖాన విభూతి, కుంకుమ, జులపాల జుట్టు, నుంచున్న తీరులో దర్జా, ఇదీ ఆ మనిషి ఆకారం. అతని వెనకాల ఒక కారు వుంది. దాని దగ్గర ముగ్గురు నలుగురు జమాజెట్టీల్లాంటి మనుష్యులు నిలబడి వున్నారు. అర్ధరాత్రి సమయంలో ఆ పరిస్థితంతా అనుమానాస్పదంగా వుంది. ఈ రోజుల్లో ఏదీ నమ్మేందుకు లేదు, ఎవర్నీ నమ్మేందుకు లేదు.

అందుకనే "ఎవరు మీరు?" అంటూ గుమ్మంలోనే ఆగిపోయాడు బాలసుబ్రహ్మణ్యం.

"అరే! నేనురా బాలా, నేను సత్యనారాయణని. నన్ను గుర్తు పట్టలేదా" అంటున్నాడు మొలకగడ్డాల కొత్త మనిషి.

"ఏ సత్యనారాయణ?" తన మనస్సులోని పాత రికార్డులు ఆత్రంగా తిరగేస్తూ నింపాదిగా సాగదీశాడు బాలసుబ్రహ్మణ్యం.

"నేన్రా సత్యనారాయణని. మీ యింట్లో వున్న సత్యనారాయణని. గుర్తు పట్టలేదా ?" ఆదుర్దా పడుతున్నాడు ఆ వ్యక్తి.

అప్పటికి ఒక్కసారి పాత స్మృతి దూసుకొచ్చినట్టుంది ఆ బాలసుబ్రహ్మణ్యానికి. "ఓరి, నువ్వట్రా" అంటూ ఒక్క వుదుటున ముందరి కెళ్ళాడు.

అదే వూపుతో ముందరికొచ్చి, ఆ కొత్తమనిషి, ఇతనూ ఒక్క క్షణం గాఢంగా కౌగలించుకున్నారు.

"గుర్తు పట్టలేదురా నిన్ను, గొంతునుబట్టి చివరకు గుర్తు పట్టా సుమా! రా, ముందు లోపలికి రా" అని చెయ్యి పట్టుకు తీసుకెళుతూ, "మణీ, మణీ, మన సత్యనారాయణ వొచ్చాడమ్మా, అదే వెంకమ్మగారి సత్యనారాయణ" అని తల్లి రాజమ్మగార్ని ఉద్దేశించి ఒక కేక పెట్టాడు. అప్పటికే నిద్ర లేచి మంచం మీద కూర్చుని "యెవరా వచ్చింది" అని ఆదుర్దాగా చూస్తున్న ఆ వృద్ధాంగన "సత్యనారాయణే, మా నాయనే, మా నాయనే, యేడీ" అంటూ లేచి ముందుకు వచ్చింది. కొత్త మనిషి నేలకు చాగిలపడి ఆవిడ రెండు కాళ్ళూ పట్టుకున్నాడు.

ఆ స్పర్శతో ఆవిడ ఒక్కసారి శోకమూర్తయిం.ది

"ఒరే సత్యనారాయణా, ఈ గతి పట్టిందిరా, యీ మొహం నీ కెట్టా చూపించేదిరా" అంటూ గొల్లుమన్నది.

"ఊరుకో మణీ, ఊరుకో, ఊరుకో" అంటూ ఆమె వెన్ను నిమిరి వోదార్చాడు కొత్త మనిషి. కొంతసేపయినాక, ఆవిడే తేరుకొని, "ముందర లోపలికి రారా, కాళ్ళు కడుక్కో. ఎక్కడి నుంచి వస్తున్నావో యేమో, కాస్త అన్నం తిందువుగాని" అంది.

ఇంతలో కారు దగ్గరున్న జమాజెట్టీలు వాకిలి దగ్గర తచ్చాడటం చూసిన కొత్తమనిషి "సరే, మీరు వెళ్ళి రేప్పొద్దున రండి" అన్నాడు.

బాలసుబ్రహ్మణ్యం ఏదో చెప్పబోయాడు గాని, "ఫరవాలేదులే, వాళ్ళని వెళ్ళనీ" అన్నాడు కొత్తమనిషి. వాళ్ళు కారు తీసుకొని వెళ్ళిపోయారు.

అప్పటికి రమణి, చంద్రుడు, కృష్ణ, రాము, నారాయణ, జయమ్మ, రుక్మిణీ గూడా నిద్ర లేచి వచ్చారు. అందరూ తలోరీతిగా ఈ కొత్తమనిషిని పలకరించి ఆనంద పడుతున్నారు.

అలా కొంతసేపయినాక, "నాన్నా, ముందు కాళ్ళు కడుక్కురారా, నాలుగు మెతుకులు తిన్నాక మాట్లాడుకుందాం" అన్నది రాజమ్మగారు.

"స్నానం చేస్తాను మణీ" అన్నాడు కొత్త వ్యక్తి. అని సరాసరి దొడ్లోకి వెళ్ళి పోయాడు. స్నానమయిన తరువాత చేతిసంచీ లోంచి మంచి బట్టలు కట్టుకొని, ఒక పీట తెచ్చుకొని, హాల్లోవున్న సుబామణిగారి ఫోటో క్రింద కూర్చున్నాడు. అప్పుడు ప్రారంభించాడతను.

"నా కథంతా సంగ్రహంగా చెపుతా వినండి. మణ్ణీ, అన్నం ఇప్పుడు తిననమ్మా, కాసిని మజ్జిగ తాగుతాలే, ముందు నా కథ విను.

నాకు సిద్ధివినాయక సిద్ధి అయిందని రాశాగా మీకు. ఆ తరువాత వినాయకుడు నన్ను సంసారం వదిలేసి స్వామివయి పొమ్మని ఆజ్ఞాపించాడు. పదిమందికి ఉపకారం చెయ్యమని కొన్ని శక్తులు గూడా యిచ్చాడు. ఇప్పుడు గణపతి ఆజ్ఞ ప్రకారం, ఆ పనే చేస్తున్నాను. మణ్ణీ, ఇదంతా నీ ఆశీర్వచనం. అందుచేత నేను స్వామినయి పోయాను. అందరూ నన్ను స్వామి అనే పిలుస్తున్నారు. మీరు గూడా ఇక అలాగే పిలిస్తే మీకు క్షేమం.

నేను మొన్న గురువాయూరు వెళ్ళాను. అక్కడ గురువాయూరప్ప గుళ్ళోకి వెళ్ళ బోతుంటే, ధ్వజస్తంభంమీద "అణ్ణా" గొంతు వినిపించింది. "ఏరా, సాధుపెయ్యా" అని నన్ను ప్రేమగా పిలిచారాయన. అప్పుడు వెంటనే బయలుదేరి యిక్కడికి వచ్చేశాను. నేను స్వామి నయ్యాక నా మణ్ణీకి ఒకసారి దణ్ణం పెట్టాలని అనుకుంటూనే వున్నాను. ఈలోగా ఇది గూడా జరిగింది. అందుకే వెంటనే ఇక్కడికి వచ్చేశాను.

ఇలా మాట్లాడుతుండగా, పైన సుబామణిగారి ఫోటోకు వున్న పూలదండ తెగి, స్వామి వారి వొళ్ళోపడ్డది. ఆయన వెంటనే దాన్ని కళ్ళకు అద్దుకొని, "ఆ జీవికి ముక్తి అయింది. ఇది ఆయన ప్రసాదం. మీరంతా తీసుకోండి" అని తలో పూవు యిచ్చారు.

ఆ తరువాత తన చెల్లెళ్ళ గురించి, తన ఆశ్రమం గురించి కొంత చెప్పి, అక్కడ తన మిత్రులందరి యోగక్షేమాల గురించి అడిగి తెలుసుకున్నారు. ఆ తరువాత "నాన్నా, వేసవికాలం సెలవులు గనుక పిల్లలందరూ ఇంటో ఉన్నారు. సరిగా సమయానికి నువ్వు గూడ వచ్చావు. ఇప్పుడు నాకు యిల్లు నిండుగా వుంది. సరే గాని నాన్నా, కాసేపు పడుకోండయ్యా, అసలే వేసవికాలపు రాత్రి పొద్దు, ఇట్టే తెల్లారి పోతుంది" అన్నది రాజమ్మగారు. దాంతో ఆ పూటకు అందరూ కాసేపు నడుం వాల్చారు.

తెల్లవారినాక, ఆ కారు మళ్ళీ వచ్చింది. ఆ కారులో వెళ్ళి తనకు పూర్వం మధుకరం పెట్టిన యిళ్ళకూ, తనకు వారాలిచ్చిన యిళ్ళకూ వెళ్ళి, వాళ్ళందరికీ తాను స్వామి నయ్యా ననీ, మైసూరులో వుంటున్నాననీ చెప్పి, సాష్టాంగ నమస్కారాలు చేసి, వీలుగా వున్నప్పుడు తప్పక ఆశ్రమానికి రమ్మని ఆహ్వానించి వచ్చారు స్వామివారు.

ఎందుకో గాని, షడ్దర్శనం సోమసుందర శర్మగారి యిల్లు మాత్రం వొదిలేశారు. ఆ మధ్యాహ్నం భోజన వేళకు రాజమ్మగారింటికి చేరారు.

వీరు వెళ్ళేసరికి రాజమ్మగారు చారు కాస్తోంది. వీరు చనువుగా లోపలికి వెళ్ళి, ఆవిడతో కబుర్లు చెపుతూ, చారు గిన్నెలో గరిటెపెట్టి తిప్పి, "మణ్ణీ, ఇందులో ఏవో రాళ్ళు వేశావు" అన్నారు. కంగారుగా "రాళ్ళేమిట్రా" అని ఆవిడ గరిటెపెట్టి తిప్పింది. నిజంగానే ఏదోరాయిలాగా

తగిలింది. కంగారుగా గరిటతో దాన్ని పైకెత్తింది. విస్తుబోయి అవాక్కయి పోయింది. అది గణపతి విగ్రహం. "పోన్లే, గణపతి వచ్చాడు. పూజలో పెట్టేసుకో." అన్నారు స్వామివారు. ఈ వార్త క్షణాలలో పెద్ద ఆశ్చర్య సంచలనం సృష్టించింది ఆ యింట్లో.

ఆవిడకు అయిదుగురు కొడుకులు, బాలసుబ్రహ్మణ్యం, శార్ఙపాణి (ఇతన్నే చంద్రు అంటారు, స్వామివారి క్లాసుమేటు) క్రిష్ణన్, రామనాథన్, నారాయణస్వామి. ఇద్దరు కూతుళ్ళు-జయమ్మ, రుక్మిణి. వారిలో జయమ్మగారికి, స్వామివారు ప్రొద్దుటూరులో చదువుకునే రోజుల్లోనే వివాహమైంది. ఆమె భర్త పరమేశ్వరన్ గూడా సత్యనారాయణను బాగా ఎరుగును. రుక్మిణి యింకా చిన్న పిల్ల. స్వామివారు వచ్చేసరికి అందరూ ఇంట్లో వుండటం ఒక విశేషం.

ఆ మధ్యాహ్నం వారితోపాటు కారులో వచ్చిన భక్తులను పరిచయం చేశారు స్వామివారు "వీరు నా మిత్రులు, నామీద అభిమానంగా వుంటారు" అని. కానీ వాళ్ళు స్వామివారి మీద చూపిస్తూన్న భక్తి ప్రపత్తులు చూసి, ఇంట్లో అందరూ కొంచెం ఆశ్చర్య పోయారు.

సాయంత్రం చల్లబడుతుండగా పబ్బతి రామయ్యగారు వచ్చాడక్కడికి. ప్రొద్దుటూరులో పబ్బతి రామయ్యగారు ఒక చిన్న వర్తకుడు. అసలాయన స్వగ్రామం వెంపల్లి అని దగ్గరలో పల్లె. బ్రతుకుతెరువు కోసం ప్రొద్దుటూరు వచ్చి కో-ఆపరేటివ్ సొసైటీ కాలనీలో ఒక బడ్డీ కొట్టు పెట్టుకున్నాడు. ఇలాంటి యీ పెద్ద మనిషిచేత 1960 లో ఆంజనేయస్వామి ఆ కాలనీలోనే తనకో గుడి కట్టించుకున్నాడు. కోతులతో సేతువు కట్టించిన రామప్రభువు సేవ చేసినాక, ఇలాంటి చిన్నవాళ్ళతో గుళ్ళు కట్టించుకునే నేర్పు వంట బట్టింది గాబోలు ఆంజనేయస్వామివారికి!!

రామయ్యగారి హృదయం స్వచ్ఛమైనది. ప్రవర్తన నిక్కచ్చి అయినది. భక్తి నిస్వార్థమైనది. అంతవరకు బాగానే వుందిగాని, ఆయన నోరు ఎంత మాత్రం మంచిది కాదు. ఆయన సాటి కోమట్లలో ఇమడలేడు, బ్రాహ్మణులతో పడదు, శూద్రులతో సాగదు, ఇల్లు గడవదు. అయినా, పదిమందిని పోగేసి ఒక గుడికట్టి దాన్ని నడుపుతూనే వున్నాడు.

ఆ చిన్న మనిషికి ఈ మధ్య మరో పెద్ద కోరిక పుట్టింది. చాముండీ అమ్మవారికీ, సత్యనారాయణస్వామివారికీ, శివుడికీ, రాములవారికీ, నవగ్రహాలకీ, గణపతికీ, మొత్తం పంచాయతన దేవతలకు ఆలయం కట్టాలని. అప్పుడే స్థలం గూడా సేకరించాడు. అక్కడితో ఆగిపోయి వుంది పని.

ఈ రామయ్యగారికీ, సుబామణిగారి కుటుంబానికి పరిచయాలున్నాయి. ఆ పరిచయాల వల్ల, యివాళ రామయ్యగారు అనుకోకుండా కూరల మార్కెట్లో తగలంగానే "సత్యనారాయణ అనే మా మిత్రుడు స్వామిగా మారిపోయాడు. ప్రస్తుతం మా యింట్లో వున్నాడు" అని ఆయనకు సుబామణిగారి పుత్రులలో ఒకడు చెప్పాడు.

ఆయన ఇట్లాంటివి లెక్కచెయ్యని మోటు మనిషే కాని, ఈ రోజు ఎందుకో ఒకసారి వెళ్ళి చూద్దామని పుట్టింది. పుట్టిన బుద్ధి వూరుకోక, నిలవనీయక గల్లంతు చేయసాగింది. సర్లే పోయిందేముందని సాయంత్రం చల్లబడ్డాక సుబామణిగారింటికి వచ్చాడాయన. ఈయన వచ్చాడేమిటా అని ఆశ్చర్యపోతూ ఆహ్వానించారు సుబామణిగారి కుటుంబీకులు.

"ఆయిన మీ కోసం రాలేదు. కొత్తస్వామిని చూసిపోదామని వచ్చారు. ఏమండీ రామయ్యగారూ, మీ చాముండీ ప్రతిష్ఠకు స్థలనిర్ణయం చేశారా ముందు? అప్పుడే శంకుస్థాపన గురించి ఆలోచిస్తున్నారే?" అన్నారు స్వామివారు.

అంత లావు రామయ్యగారు బోర్లా పడిపోయాడు. ఆ తరువాత రామయ్యగారి జీవిత విశేషాలు మరికొన్ని చెప్పారు స్వామివారు. చెప్పి "మీ సంకల్పం మంచిది. మీకు దైవ బలం వుంది. నిశ్చింతగా ప్రయత్నం చెయ్యండి. హాయిగా కార్యసిద్ధి అవుతుంది" అన్నారు స్వామివారు.

మాట్లాడిన కొద్దీ స్వామి వారిమీద విశ్వాసం పెరిగిపోయింది రామయ్యగారికి. దాంతో, "అయ్యా, తమ రొక్కసారి వచ్చి మీ పాదం పెట్టి ఆ స్థలం పవిత్రం చెయ్యాలి. తప్పదు" అని ప్రార్థించాడు.

స్వామి వారికి ప్రొద్దుటూరు మీద వున్న అభిమానం గొప్పది. "సరే బయల్దేరండి" అన్నారు. వారి కారుమీదే ఆలయ స్థలానికి వెళ్ళారు. రామయ్యగారు అడగకుండానే, యెక్కడెక్కడ యేయే ప్రతిష్ఠలు జరగాలో ఆయా నిర్ణయాలన్నీ చేసేసారు స్వామివారు. ఆనందభరితుడైన రామయ్యగారు "తమరే శంకుస్థాపన ముహూర్తం నిర్ణయించి, తమరే వచ్చి శంకుస్థాపన చెయ్యాలి" అన్నాడు. స్వామివారు గబగబా ఆ స్థలంలో వొకచోట కెళ్ళి, ఒక దోసెడు మట్టి తీసుకొని అక్కడే పోశారు. ధణేలు మని భూమి లోపలే పెద్ద శబ్దం అయింది. భూమిలోపల యెక్కడయినా ఒక పర్వతమో, పెద్ద భవనమో అటు వంటిదేదో బద్దలయిందేమో! అంత పెద్ద శబ్దమది.

"శంకుస్థాపన అయిపోయింది. ఇక్కడ చాముండీ అమ్మవార్ని ప్రతిష్ఠించండి. ఆలయానికి చాముండీ అమ్మవారి ఆలయం అనిపేరు పెట్టండి. ఇక తక్కిన లాంఛనాలన్నీ మీ వీలు ప్రకారం జరిపేసుకోండి. నా కోసం ఆగద్దు". అన్నారు స్వామివారు. ఆశ్చర్యంతో సగం బిగిసిపోయివున్న రామయ్యగారు మరి నోరెత్తలేకపోయాడు.

అక్కడి నుంచి తిరిగి మళ్ళీ సుబామణి గారింటికి వచ్చేశారంతా. వచ్చినాక, ఉన్నట్టుండి స్వామి వారి చేతుల్లోకి ఒక చాముండీ విగ్రహం వచ్చింది. అది రామయ్యగారి కిచ్చి "రోజూ పూజచేసుకోండి. మీ వెంట అమ్మవారు వుంది. నేను ఉన్నాను. ఇక పని మొదలెట్టండి" అన్నారు. అప్పటికి గుక్క తిప్పుకొన్న రామయ్యగారు "నిర్మాణం అయినాక తమరే స్వయంగా ప్రతిష్ఠ జరపాలి" అని పాదాభివందనం చేశాడు.

"అలాగే కానీండి" అని కొంచెం ఆగి "మైసూరు ఒకసారి రండి" అన్నారు స్వామి వారు.

ఇలా తన దైవ కార్యానికి అతర్కితమైన దైవబలం తోడైనందుకు సంతోషపడుతూ సెలవు తీసుకు వెళ్ళిపోయాడు పబ్బతి రామయ్యగారు.

ఆ మరునాడు బయలుదేరబోతూ సుబ్రామణిగారి యింట్లో వారందరినీ మైసూరు రమ్మన్నారు స్వామివారు. వాళ్ళు వారందరి తరపునా, రమణిని (శంకర నారాయణ) పంపారు. అతన్ని తీసికొని కార్లో బయలుదేరారు స్వామివారు. అక్కడి నుంచి ముందు నుసం బయలు దేరారు స్వామివారు. ఊరుదాటింది. కార్లో ఉషారుగా కబుర్లు సాగిపోతున్నై. ఇంతలో కెవ్వుమని కేక వినిపించింది. డ్రైవరు కారును రోడ్డు ప్రక్కకు ఆపాడు. అందరూ ఆదుర్దాగా చూశారు. అందరికీ కళ్ళు తిరిగినంత పనైంది. నెత్తురు మడుగులో పది, పన్నెండేళ్ళ కుర్రాడు గిల గిల కొట్టుకుంటున్నాడు. డ్రైవరు కంగారుగా కారు దిగబోయాడు 'కదలకు' అని అరిచారు స్వామివారు.

ఇంతలో చుట్టు పక్కల పొలాలలోవున్న రైతులు కోపంగా అరుచుకుంటూ వచ్చేస్తున్నారు. డ్రైవరు దిగి వుంటే, ముందా కోపంలో రెండు దరువులు పడిపోయి వుండేవి. "దిగరా" అని గద్దిస్తూ ముందు కొచ్చాడొకడు. డ్రైవరు బెదిరిపోయాడు. "ఎందుకయ్యా" అన్నారు స్వామివారు వెనుక సీట్లోంచి. "కార్లుంటే మనుషుల్ని పొట్టన బెట్టుకోమనా? దిగు ముందు" అన్నాడు మరొకడు. "మాటలు జాగ్రత్తగా రానీ, ఏం జరిగింది, అలా అరుస్తావు?" అన్నారు స్వామివారు లోపల్నించే. "ఏం జరిగిందా, అటు చూడు" అంటూ అటు చూపిస్తూ, ఆ రైతు అర్థోక్తిలోనే ఆగిపోయాడు.

అక్కడ నెత్తురు మడుగు లేదు. కుర్రవాడు దుమ్ము దులుపుకుంటూ లేచి నుంచుంటున్నాడు. రైతుకు నోరెండి పోయింది. కార్లో వాళ్ళకు ఊపిరాగి పోయింది. నెత్తురు మడుగు, గిలగిల లాడుతున్న కుర్రవాడు, ఇది కారులో వారూ, చుట్టు ప్రక్కల రైతులూ, అందరూ చూసిందే. ఇప్పుడిదంతా ఏమైంది? ఎవరికీ ఏమీ అర్థం కావటం లేదు. ఇప్పుడు కారు దిగి స్వామివారు రైతుల్ని డబాయించేస్తున్నారు. అలా రైతుల్ని కాసేపు డబాయించి, మళ్ళీ కార్లో కూర్చుని పోనిమ్మన్నారు స్వామివారు. కారు కొంత దూరం పోయాక "కాస్త జాగర్తగా, నిదానంగా పోనీ, లేకపోతే నాకు అనవసరంగా శక్తి వ్యయం" అన్నారు స్వామివారు డ్రైవరుతో.

ఈ సంఘటనతో కారులోవున్న రమణిగారికి స్వామివారిమీద తిరుగులేని విశ్వాసం కుదిరింది. ఆ తరువాత నుసం చేరి, అక్కడ స్వామివారి పెదతండ్రిగారిని చూసి, ఆలయాల దగ్గర ఉన్న బుగ్గ దగ్గర కాసేపు ధ్యానం చేసుకున్నారు స్వామివారు.

అక్కడినుంచి కారు సరాసరి కందుకూరులో నంజుండయ్య గారింటికి చేరింది. అక్కడ కాసేపు కుశల ప్రశ్నాదులయినాక, అక్కడినుంచి బొమ్మెపర్తి బయలుదేరారు. ఈమాటు కారులో ఒకర్ని దింపి నంజుండయ్యగార్ని ఎక్కించుకున్నారు.

ఆ మాటలు, ఈ మాటలు చెప్పుకుంటూ పోతున్నారు. మాట్లాడుతూ మాట్లాడుతూనే రెండు డాలర్లు సృష్టించేశారు స్వామివారు. నంజుండయ్యగారు, రమణిగారు ఇద్దరూ ఆశ్చర్య పోయారు. వాళ్ళ ఆశ్చర్యానికి ఒక ప్రత్యేక కారణం వుంది. ఆ డాలర్లమీద స్వామివారి బొమ్మ ఉంది. అదీ విశేషం. ఆ రెండు డాలర్లూ నంజుండయ్య గారికే ఇచ్చేశారు స్వామివారు.

ఆ తరువాత నరసింహశాస్త్రిగార్ని చూసి, నంజుండయ్యగార్ని ఇంట్లో దింపి, అక్కడున్న భక్తుణ్ణి ఎక్కించుకొని మైసూరు చేరారు స్వామి. కారు దిగుతూనే "నమస్కారాల డ్రిప్పు అయిపోయింది. ఇంక మళ్ళీ మన శోణ వస్త్రాలు మనవే" అన్నారు స్వామివారు.

ఆ తరువాత రమణికి కావలసిన ఏర్పాట్లు చూసి, అప్పటికే చాలా రోజులుగా తన కోసం ఎదురు చూస్తున్న భక్తుల పని చూడటంలో మునిగిపోయారు స్వామివారు.

రమణిగారు ఒక వారం రోజు లున్నాడు. వారం రోజులు ఇక్కడ జరుగుతున్న వింత వింత మహత్తులు చూసి, ముఖ్యంగా ఆదివార హోమాలలో వైభవం చూసి ఆశ్చర్య చకితుడు, ఆనంద సమ్మోహితుడు అయి ప్రొద్దుటూరు చేరాడు.

రమణిగారు వెళ్ళిపోయాక "ఈ ప్రొద్దుటూరు పర్యటనతో పూర్వాశ్రమ బాధ్యతలలో మరొకటి తీరింది. ఇంకొకటి మిగిలి వుంది. దానికి ఇంకొంత వ్యవధానం వుందిలే' అను కున్నారు స్వామివారు.

* * *

## గడప మెట్టు

ఇది జరిగిన కొద్ది కాలానికే సుబ్రహ్మణ్య ముదలియార్ వచ్చి ఒక విన్నపం చేశాడు.

"స్వామీ! ఇంత మైసూరులో మరీ మూల ఎక్కడో ఊరి చివర కెనరేలో కార్యక్రమాలు చేస్తున్నారు. మాబోటి వాళ్ళం ఊరికి మరో చివర విద్యారణ్యపురం ప్రాంతంలో ఉంటున్నాం. ఎంత కోరిక వున్నా, ఇంత దూరం రావటం సామాన్యులకు సాధ్యం కావటంలేదు. కనుక మీరు వారానికొక రోజయినా మా ప్రాంతంలో కార్యక్రమం నడపమని ప్రార్థిస్తున్నాం మేమంతా."

ఆ ప్రార్థన వల్ల ప్రతి శనివారం సాయంత్రం విద్యారణ్య పురంలోని ముదలియార్ గారి ఇంటి ఆవరణలో అనుగ్రహ భాషణ కార్యక్రమం ప్రారంభించారు స్వామివారు. ఇలా స్థిరంగా శనివార కార్యక్రమాలు సాగటంతో కొద్ది కాలంలోనే అక్కడ గూడా జనాల రద్దీ పెరిగిపోయింది. ఫలితంగా స్వామివారు శనివారమంతా అక్కడే ఉండిపోవలసి వచ్చింది. ముదలియార్‌గారు ఒక చిన్న గది ఏర్పాటు చేయగా తన హార్మనీపెట్టె, చిడతలు తన స్నేహితులుగా, పరివారంగా ఆ గదిలో శనివారాలు గడపసాగారు స్వామివారు.

ప్రతి శనివారం బెంగుళూరు నుంచి వచ్చి స్వామివారితో కబుర్లు చెప్పటం అనేది సరదా నుంచి అలవాటుగా, అలవాటునుంచి దీక్షగా, దీక్ష నుంచి తన విధానంగా పరిణమించిన సిండికేట్ బ్యాంకి ఉద్యోగి మనోహర్‌గారు విద్యారణ్య పురం గదికే రాసాగాడు.

ఆయనిప్పుడు స్కూటరు కొనుక్కున్నాడు. బెంగుళూరు నుంచీ స్కూటరు మీద వచ్చి పోతున్నారు. ఎప్పుడైనా ఒకసారి స్వామివారితో అధ్యాత్మిక విషయాలు చర్చించటం గూడా స్వల్ప స్వల్పంగా మొదలయింది.

ఒకసారి స్వామివారు ఏదో ప్రసంగం చేస్తూ త్రిమతాల గురించీ, వాటిలో వున్న సిద్ధాంతాభేదాల గురించీ చెప్పి, చివరకు ఆచరణలో అవన్నీ ఒకటే అని వివరంగా నిరూపించారు. అంతా చెప్పి "అందుకే త్రిమతాల వారూ ఆరాధించుకోదగిన త్రిమూర్తి తత్వమే ఇప్పుడు ఈ లోకానికి కావాలి. అలాంటి ఉపాసన, అలాంటి ఆలయాలు ఇప్పుడు రావాలి" అని చెప్పారు.

నిజానికి అప్పటికే రాష్ట్రాంతరాలకు స్వామివారి కీర్తి వ్యాపించి ఉండగా, మైసూర్లో మరో భాగంలోకి వెళ్ళి స్వామివారు ప్రత్యేకంగా కార్యక్రమాలు నడపవలసిన అవసర మేమిటో శ్రేయోభిలాషి కమిటీ వారికి అర్థం కాలేదు. వారికది నచ్చలేదు. వారి మాట స్వామివారు వినలేదు. ఆయనకు సంస్థా నిర్వహణ చాకచక్యం కొంచెం తక్కువగదా! మరి స్వామివారు ఎందుకింత దూరం వచ్చి కార్యక్రమాలు చేస్తున్నారో గాని, దానివల్లమాత్రం కొంతమంది ప్రత్యేకంగా బాగుపడ్డారు.

అలాంటివారిలో ఆనందరాజు శెట్టిగారు వొకడు. అప్పటి కాయనకు 38 ఏళ్ళ వయస్సే కాని, ఆయనకున్న వ్యాధులు, మనో వ్యాధులు గూడా చాలా పెద్దపెద్దవి. ఆనందరాజు శెట్టిగారి హృదయం వెన్నే గాని, ఎక్కడలేని కోపమూ ఆయన ముక్కుమీదే తాండవిస్తూ వుండటం ఆయన జన్మ లక్షణం. కనిపించిన వాడికల్లా ఉపకారం చెయ్యకుండా ఆయన వుండలేడు. ఉపకారం చేసిన వాడితో అల్లా పోట్లాడకుండానూ వుండలేడు. అదే ఆయన గొప్పతనం. ఇలాంటి పెద్దమనిషికి ఇంట్లో తల్లిదండ్రులతో ఆస్తి తగాదాలు వచ్చాయంటే ఆశ్చర్యం లేదు. బంధువుల బాధ్యతలన్నీ నెత్తినేసుకొని, తలకు మించిన ఖర్చులుబెట్టి, తాటి ప్రమాణాన మునిగాడన్నా ఆశ్చర్యంలేదు.

ఈ స్వారస్యంవల్లనే ఆయన పాతికేళ్ళకే, తనవంతుకేమీ వాటా రాకుండానే వేసబడి, పెళ్ళాం మెళ్ళో నగలమ్మి, అది పెట్టుబడిగా, విద్యారణ్యపురానికి దగ్గరలో వున్న చాముండీ వనంలో చిల్లరకొట్టు పెట్టుకొని కాలక్షేపం చేస్తున్నాడు. ఇంత మాత్రమే అయితే యీ కష్టాల నాయన లెక్క చేసేవాడు కాదుకాని, కడుపులో మంట, నొప్పి విపరీతమై వైద్య పరీక్షలు చేయిస్తే, పెప్టిక్ అల్సర్, అబ్డామినల్ పెయిన్ వున్నాయి. ఆపరేషన్

చెయ్యాలన్నారు. చేసినా లాభం లేదన్నారు కొందరు. అసలు ముందు ఆపరేషన్ చేయించుకొనే తాహతు లేదు.

క్రమంగా పిల్లలు పెద్ద వాళ్ళు అయి సార్వజనిక హైస్కూల్లో చదువుకుంటున్నారు. కాగా సంసారం బరువుగా వుంది. ఈ మందులు అంతకన్నా బరువుగా వున్నాయి. వీటన్నిటి వల్లా, కడుపులో బాధవల్లా నిద్రమాత్రలు వేసుకొంటేగాని నిద్దరపట్టని స్థితి వచ్చింది. క్రమంగా, ఏదయినా తింటే, అది విరేచనంగా వెళ్ళిపోయే స్థితి వచ్చింది. బాధ ఎక్కువైంది. నిద్దర లేదు. ఓపిక లేదు. శాంతి లేదు.

ఆ స్థితిలో ఒకరోజు అమ్మా నాన్నా చూడటానికి వచ్చి, "కేసరేలో కొత్తగా ఒక స్వామి వారు వచ్చార్రా. మేమాయన దగ్గరకి చాలాసార్లు వెళ్ళొచ్చాం. చాలా గొప్ప వ్యక్తి, మహిమాన్వితుడు. నువ్వాయన దగ్గరకు వెళితే నీకు ఉపయోగిస్తుందేమో చూడరా" అన్నారు. వెంటనే ఒప్పుకుంటే, ఆయన ఆయనెందు కవుతాడు ?

"ఛఛ, స్వాముల్నీ గీముల్నీ నేన్నమ్మను. నేనే దేవుణ్ణి రోజూ సంకీర్తన చేసి ప్రార్థిస్తూనే వున్నాగదా! దేవుడికంటే పెద్ద మహానుభావులా యీ స్వాములంతా?" అన్నాడు. "ఈ తుస్సుపింజేరితో యెవరు మాట్లాడుతారు ? వాడి కర్మ వాడిది" అనుకొని తల్లీ తండ్రీ వూర్కొన్నారు. కొన్నాళ్ళుపోయాక ఒక రోజున యీయన మేనకోడలు చిత్రదుర్గ నుంచి చూడటానికి వచ్చింది. ఆవిడ యీ మాటా, ఆ మాటా చెపుతూ, తన చంకలో వున్న నెలల పిల్లను ఆడించుకొంటూ ఇలా అన్నది. "మామయ్యా! నిన్న నేను కెసరే స్వాములవారి దగ్గరకు వెళ్ళాను. ఇదే మొదలు నే నక్కడికి వెళ్ళటం ఆయన క్యూలో నా దగ్గరకు వచ్చి, యీ చంటిదాని నెత్తిన చెయ్యివేసి ఆడిస్తూ, "ఏమ్మా రేఖా, బావున్నావా" అన్నారు. దీని పేరు వీరికెలా తెలుసా అని నే నాశ్చర్యపోతున్నాను. ఆయన "ఆశ్చర్యపోకు! ఈ పిల్ల పుట్టి యిప్పటికి నెలా పదిహేను రోజులయింది. పుట్టిన ఏడవ రోజున దీనికి జబ్బు చేసింది. ఆ రోజు గురువారం. మీ యింటికి మూడవ యింట్లో రాఘవేంద్రస్వామి వారి పూజ చేశారు ఆ రోజున. అక్కడ ఆరోజు హారతిలోంచి విభూతి రాలింది. మీరు ఆ విభూతి తెచ్చి పిల్లకు పెట్టారు. అప్పుడే పిల్లకు తేలికిచ్చింది. నిజమేనా ? " అన్నారు. నే నాశ్చర్యపోయాను మామయ్యా! ఇది విన్నాక, 'ఏమిటి? కెసరేస్వామివారు అంత గొప్ప వారా! అయితే మనమూ ఒకసారి పోయి చూసొద్దాం " అనిపించింది శెట్టిగారికి.

ఆ మర్నాడు వెళ్ళాడు. స్వామివార్ని దర్శించాడు. నలభైయేళ్ళ పెద్ద మనిషికి, స్వామివార్లకు దణ్ణం పెట్టాలని తెలీదు. చెట్టల్లే అలాగే నిలబడ్డాడు. స్వామివారు పలకరించలేదు. వచ్చేశాడు. కాని యెందుకో తనకే తెలీకుండా విశ్వాసం కుదిరిపోయింది. మర్నాడు భార్యను గూడా తీసుకెళ్ళాడు. ఇలా నాలుగు రోజులు తిరిగాడు. ఈలోగా అక్కడ సంకీర్తన జరగటం కనిపించింది. సంకీర్తనంటే, ఇతనికి యిష్టం. వెంటనే ఆ గుంపులో కలిసి పోయాడు. మెల్లిగా నమస్కరించటం నేర్చుకున్నాడు.

ఆ రోజు శుక్రవారం. అది ఆషాఢమాసం. కన్నడదేశంలో ఆషాఢ శుక్రవారాలు చాలా ముఖ్యమైనవి. అమ్మవారి పూజలు చేసుకుంటారు. అందులోనూ అది ఆఖరి శుక్రవారం. ఆ రోజు పొద్దున్నే ఆశ్రమానికి వెళ్ళిపోయాడు శెట్టిగారు. ఆ రోజు స్వామివారు యింటర్వ్యూ లిస్తుంటే, ఇతను గూడా లోపలికి వెళ్ళాడు.

"మాది విద్యారణ్యపురం స్వామీ" అన్నాడు నమస్కరించి.

"ఔనౌను! మీది విద్యారణ్యపురంగదూ, మీ కొట్టు చాముండీ వనంలో వుంది గదూ" అన్నారు స్వామివారు.

"అహా! స్వామివారి దివ్యదృష్టి" అనుకున్నాడు శెట్టిగారు.

"దివ్యదృష్టి అనుకుంటున్నారేమో! అదేంకాదు, మా పెద నాయనగారు శేషగిరి శాస్త్రి గారు పురోహితులు. ఆయన చాముండీ వనంలోనే వుంటారు. నేను సార్వజనిక హైస్కూల్లో చదివాను. మీ పిల్లలు గూడా ఆ స్కూలే. నేను మీ కొట్టుకు చాలాసార్లు వచ్చాను" అన్నారు స్వామివారు.

"అలాగా స్వామీ, నాకేం గుర్తులేదు" అన్నాడు శెట్టిగారు.

"పోనీలెండి, మీకు సంకీర్తన వచ్చుగా, పోయి ఆ బండమీద కూర్చొని సంకీర్తన చేస్తూ వుండండి. నేను పిలుస్తాను. నాకు మీరు సహాయం చేశారుగా. నేను మిమ్మల్ని వదిలేస్తానా?" అన్నారు స్వామివారు.

"నేను మీకు సహాయం చేశానా? నాకేం గుర్తు లేదండీ?" అన్నాడు అయోమయంగా శెట్టిగారు.

"అణువంత ఉపకారం జరిగినా నేను మరిచిపోను. అదంతా మీ కెందుకులెండి. మీరు సంకీర్తన చేస్తూ కూర్చోండి" అన్నారు స్వామివారు. శెట్టిగారు ఆలోచిస్తూ వాకిట్లో బండ మీదికి నడిచాడు.

"నేను ఉపకారం చేశానా? చదువుకునే కుర్రాళ్ళు గదా అని ఎప్పుడైనా శనగపప్పో, బెల్లం గడ్డో చేతిలో పడేశానేమో! అవి రోజూ ఎందరికో చేస్తూనే వుంటాను. అంతకంటే యెక్కువ ఉపకారం చేసేందుకు, నా బొంద, నాకు వుండి చస్తేగా" అనుకుంటూ సంకీర్తనలో పడిపోయాడు.

అలా పన్నెండింటి దాకా సంకీర్తన చేశాడు. అంతసేపు ఎలా కూర్చున్నాడో, ఎలా పాడ గలిగాడో, ఆ వోపిక ఎలా వచ్చిందో తనకే తెలీటం లేదు. పన్నెండు దాటాక లోపలికి పిలిచారు. అప్పటికి రద్దీ బాగా తగ్గిపోయింది. లోపలి కెళ్ళి నమస్కారం చేశాక స్వామివారే మొదలెట్టారు. ఇక శెట్టిగారి జీవిత చరిత్రంతా అణా పైసల లెక్కలతో సహా చెప్ప సాగారు.

నువ్వు ఫలానా ఫలానా అప్పుడు ఇంతింత ఖర్చు చేశావు, ఇలా ఇలా మునిగావు, ఇలా ఇలా కష్టపడ్డావు, ఈ రోగాలు వచ్చాయి అని మొత్తం పుస్తకం చదివినట్టు చెప్పారు. శెట్టిగారికి నోటమాట రాలేదు. కళ్ళ వెంబడి ధార కారిపోతూంది.

"స్వామీ, నన్ను అప్పుల్లోంచి వొడ్డున వెయ్యండి" అని మాత్రం అనగలిగాడు.

స్వామీజీ ఇలా అన్నారు "చూడు, నువ్వు అధైర్యపడకు. నే నున్నాను. అన్నీ నేనే చూసుకుంటాను. ఇంకా 3, 4 ఏళ్ళు నీకు కాస్త గడ్డుగా వుంటుంది. అయినా నేనే చూసుకుంటాను. నువ్వు మాత్రం మానకుండా ఆశ్రమానికి వస్తూవుండు." ఇలా అని ఒక వెండి తాయెత్తులాంటి దొకటి తీసుకొని శెట్టిగారి చేతిలో వొంచారు. అందులోంచి రవ్వంత విభూతి రాలింది. ఆ విభూతిలో ఒక గణపతి డాలరు వుంది. ఆ డాలరును పూజలో పెట్టుకొమ్మన్నారు స్వామివారు. 'తాయత్తు లోంచి విభూతి రాలట మేమిటి? దాంట్లో యీ డాలరు పడట మేమిటి?' తల తిరిగిపోతోంది శెట్టిగారికి.

"సరే మీకు మంచవుతుంది. కాసేపు అలా వెళ్ళి కూర్చోండి. మళ్ళీ పిలుస్తాను" అన్నారు స్వామివారు.

బయట కూర్చున్నాక కొంతసేపటికి గుర్తు వచ్చింది. "అరెరె, నేను ప్రాణం పోయే కడుపునొప్పి భరించలేక గదా ఇక్కడి కొచ్చాను. అది మరచిపోయి అప్పుల మాటడిగా నేమిటి" అని. నాలిక కొరుక్కొన్నాడు, చెయ్యి విదిలించుకున్నాడు, తల దులుపుకున్నాడు, తన్ను తనే తిట్టుకున్నాడు. నానాయాతనా పడ్డాడు శెట్టిగారు.

ఇంతలో స్వామివారే అక్కడికి వచ్చారు. రాగానే ముందర తన రోగం సంగతి చెప్పాడు శెట్టిగారు. మరచిపోయినందుకు క్షమాపణ కోరాడు.

"అందుకనే వెళ్ళిపోకుండా కూర్చోమన్నాను. సరే ఇది తీసుకో" అని చేతులో ఏదో వేశారు స్వామివారు. ఆయన చేతిలో ఏమీలేదు కాని, శెట్టిగారి చేతిలో ఒక శంఖం పడ్డది.

"ఇవ్వాళ్ళ చివరి ఆషాఢ శుక్రవారం గదా! ఆషాఢ శుక్రవారంనాడు వెంకటేశ్వర దర్శనం చేసి భోజనం చెయ్యటం మీకు మామూలు గదా! ఇవాళ్ళ గూడా వెంకటేశ్వర దర్శనం చేసి, భోజనం ముందు ఈ శంఖం సానమీద పాలతో అరగతీసి, కొంచెం గంధం తీసి నాకేసెయ్యండి, నొప్పి తగ్గిపోతుంది. అలా కొంతకాలం గంధం పుచ్చుకుంటూ వుండండి" అన్నారు స్వామివారు.

శెట్టిగారు అలాగే చేశాడు. ఇదంతా చేసేటప్పటికి ఆ మధ్యాహ్నం రెండు దాటింది. పొద్దుటి నుంచీ కడుపులో ఏమీ లేదు. అన్నం తింటే మళ్ళీ విరేచన మవుతుంది. దాంతో మళ్ళీ శ్రమ అయి నీరసం వస్తుంది. అంత భరించే ఓపిక లేక కాస్త కాఫీ తాగి ఊర్కున్నాడు.

మామూలుగా అయితే కాఫీ తాగినా కాస్తో కూస్తో విరేచనం కాక తప్పదు. కాని, ఇవాళ్ళ ఏమీ విరేచనం కాలేదు. ఒక గంటాగాక ఆకలిగా ఉందనిపించి కొంచెం అన్నం తిన్నాడు. ఆ రోజు నొప్పి రాలేదు.

"పొద్దుటి నుంచీ కడుపు ఖాళీగా ఉందిగా, అందుకనే నొప్పి రాలేదులే" అనుకున్నాడు. రాత్రి భోజనం ఎలాగూ అలవాటు లేదు. రాత్రికి నిద్రమాత్రలు వేసుకొనే టైముకి ముందరే

నిద్దర వచ్చేసి మాత్రలు వేసుకోవటం మరిచిపోయి నిద్దరపోయాడు. తెల్లవారేదాకా మెలకువ రాలేదు.

ఆ రాత్రి నిద్దరలో ఒక కల. ఎవరో తన కడుపులో ఆపరేషనో ఏమో చేసి, లోపలి భాగాలన్నీ యిటూ అటూ సర్ది సవరించి సరి చేస్తున్నారు. తెల్లారాక కడుపులో ఏ బాధా లేదు. ఆశ్చర్యం! ఆనందం! ఇలా పది రోజులు గడిచింది. అన్నం వంటబడుతోంది. రోజూ కెనరే వెళ్ళి భజనలు చేసి వస్తున్నాడు. స్వామివారు మాత్రం పలకరించటం లేదు. ఒకరోజు కెనరేకి వెళుతుంటే దార్లోనే స్వామివారి సంకీర్తనం వినబడింది. ఏమిటా అని చూస్తే, అక్కడ ఒక గుళ్ళో స్వామివారు సంకీర్తన చేస్తున్నారు.

"ఓహో! ఇక్కడ ప్రోగ్రాం వుందని నిన్న చెప్పారు. మరచిపోయాను. అందుకే గాబోలు రోజూ వెళ్ళేదారి కాకుండా ఇటు నడిపించారు స్వామివారు. ఆహా! ఎంత అదృష్టవంతుణ్ణి. ఎంత దయ నా మీద స్వామివారికి" అనుకుంటూ స్వామివారి దగ్గరకు వెళ్ళబోయాడు. చుట్టూ ఉన్న పరివారం ఆపేశారు. ఈయన ఇంకా కొత్తవాడు గదా! వాళ్ళకు పరిచయం కాలేదు.

స్వామివారే చూసి దగ్గరకు పిలిచి, "కడుపులో నొప్పి ఎలా ఉంది" అని అడిగారు.

"ఎప్పుడైనా ఒకసారి నొప్పి కనిపిస్తోంది స్వామీ. నొప్పి రాగానే మీ పేరు జపం చేస్తున్నాను. తగ్గిపోతోంది" అన్నాడు శెట్టిగారు.

వెంటనే చేతిలోకి విభూతి తీసుకొని, అతని పొట్టకు రాసి ఒక చిటికెడు అతని నోట్లో వేసి, మరో చిటికెడు తన నోట్లో గూడా వేసుకున్నారు స్వామివారు.

"ఎలా ఉందో రేపు చెప్పండి" అన్నారు స్వామివారు.

ఆ రాత్రి మళ్ళీ కల. కలలో కడుపులో అంతా పరపరా కోసి, అక్కరలేని వేవో తీసి పారేస్తున్నారు ఎవరో. తెల్లారేసరికల్లా మొత్తం తగ్గిపోయిందన్న భావన, ధైర్యం మనస్సుకు కలిగాయి. శెట్టిగారు మానకుండా ఆశ్రమానికి పోయి వస్తున్నాడు. వీలుగా ఉన్నప్పుడు దంపతులిద్దరూ వెళుతున్నారు. ఒకరోజున దంపతులిద్దరూ వెళ్ళేసరికి స్వామివారు కారులో ఎక్కడికో వెళ్ళబోతున్నారు. శెట్టిగార్ని చూడంగానే "అమ్మని ఇంటికి పంపెయ్యండి. మీరు నాతో రండి" అన్నారు.

ఆనందంగా కారెక్కాడాయన. ఎక్కేదాకా ఆనందమే. ఎక్కినాక ప్రారంభించారు స్వామివారు.

"బస్‌స్టాండులో ఏమిటి మాట్లాడుతున్నావు?"

"అబ్బెబ్బె! ఏదో చిన్న వాగ్వాదం?"

"మరి ఎందుకు అలా మాట్లాడావు?"

శెట్టిగారికి చెమటలు పట్టి పోతున్నాయి. నిన్న బస్సుస్టాండులో ఎవరితోనో పోట్లాట అయింది. దాన్ని ప్రస్తావిస్తున్నారు స్వామివారు. పైగా వారికి కోపం వచ్చిన దానికి సూచనగా "మీరు'' కాస్తా "నువ్వు'' అయిపోయింది. ఏమి సమాధానం చెప్పగలడు? తనకు నోటి తొందర ఎక్కువ. ఎక్కడికి వెళ్ళినా ఏదో పోట్లాట తప్పదు. శెట్టిగారి గందరగోళం చూసి స్వామివారే అన్నారు. "అహా! ఏమీ లేదు, నీమీద స్వామి గమనం ఎలా ఉంటుందో చెపుతున్నాను, అంతే" అని.

ఆ రోజు నుంచీ నోరు తెరవాలంటే భయమయి పోయింది శెట్టిగారికి. "శెట్టి కోపం ఈమధ్య సగానికి సగం తగ్గిపోయింది." అని త్వరలోనే పేరొచ్చింది. కడుపులో నొప్పి కోసం వెళ్ళిన తనలో స్వామివారు ఇలా అనూహ్యమైన పరిణామం తెస్తారని కలలో గూడా ఊహించలేదు శెట్టిగారు. కాని ఇంతకన్నా అనూహ్యమైన మార్పులు తనలో స్వామివారు తీసుకు రాబోతున్నారని అప్పుడాయనకు తెలీదు.

ఒకరోజు స్వామివారు వీర్ని పిలిచి, "రోజు వస్తున్నావుగా! వచ్చేటప్పుడు నాకు పాలు తీసుకురా" అన్నారు.

ఎగిరి గంతేసి రోజూ ఫ్లాస్కులో పాలు తెచ్చి స్వయంగా స్వామివారి కియ్యసాగాడు.

ఒకరోజు, పరివారం ఈయనను లోపలికి పోనీలేదు. వారిదేముంది? స్వామివారు ఎవర్నీ పంపటానికి వీల్లేదంటే ఆపేస్తారు. కాని చూసేవాళ్ళకు అది వాళ్ళ జులుం లాగానే కనిపిస్తుంది. శెట్టిగారికీ అలాగే కనిపించింది. నోరెత్తి గోల చేసే దమ్ము లేకపోయిందిగాని, మొహం కందగడ్డ చేసుకొని, ఫ్లాస్కు పెట్టుకొని అక్కడే కూర్చున్నాడు.

చాలాసేపయినాక స్వామివారు అక్కడకు వచ్చారు. వస్తూనే, "పాలేవీ?" అన్నారు.

"ఎప్పుడో వచ్చాను" అని కోపంగా అంటూ ఫ్లాస్కు మూత తీసాడు. గ్లాసులో పోద్దామని వంచాడు. అందులో పాలులేవు! నాలిక ఎండుకు పోయింది. కాళ్ళు వణుకుతున్నాయి. "ఏమైంది" అన్నారు స్వామివారు.

"పాలు తెచ్చాను. ఇందులో లేవిప్పుడు" అన్నాడు.

"కంగారుపడకు. నేనే తాగాలే" అన్నారు స్వామివారు నవ్వుతూ.

"బ్రతుకు జీవుడా" అనుకున్నాడు శెట్టిగారు.

"తెమ్మంటే తేవటం వరకే....తక్కిన కోపాలెందుకు?" అన్నారు స్వామివారు మృదువుగా. శెట్టిగారిలో మరింత మార్పు రాసాగింది.

ఒకరోజు ఎక్కడికో భిక్షకు వెళుతూ శెట్టిగార్ని గూడా రమ్మన్నారు స్వామివారు. తీరా అక్కడికి వెళ్ళాక తను భిక్ష చేస్తూ తన ఎదురుగా కూర్చుని అన్నం తినమన్నారు. శెట్టిగారికి భయం వేసింది. కానీ తినక తప్పలేదు. అప్పటినుంచీ తన ఆరోగ్యంలో మరింత మార్పు కనిపించింది.

"స్వామివారి నియమం ప్రకారం వారు భిక్ష చేసేటప్పుడు ఎవరూ ఆ గదిలో వుండరాదు. నా కోసం యీ నియమం చెడగొట్టుకొని, నా ఆరోగ్యం బాగు చేశారు స్వామివారు. మరి నేను వారికేం చెయ్యగలను"? కొన్నాళ్ళపాటు, ఇది శెట్టిగారికి గొప్ప మథన అయింది. ఆ మథనకు సమాధానం ఎవరూ చెప్పలేదు. కానీ ఆయనకు తెలియకుండానే ఆయన ఆశ్రమం పనులలో పూసుకు తిరగసాగాడు. ఆ మథన అదే అంతరించిపోయింది.

ఆరోగ్యం బాగుపడ్డా, ఆర్థిక స్థితి అలాగే వుంది. అయినా, అదేమి చిత్రమో, తన కది చింతగానూ లేదు. చిక్కుగానూ లేదు. ఒత్తిడి ఒత్తిడిగానే వుంది. దానివల్ల ఇబ్బందిగానే వుంది. కానీ, నిద్దర హాయిగానే పడుతోంది; నవ్వు విచ్చుకొని సాగుతోంది; సంకీర్తన సమయాల్లో సంకీర్తన హాయిగా జరిగిపోతోంది.

భరించే శక్తి తనలో పెరిగిందనీ, ఇంకా అంతకు రెట్టింపు చిక్కులు వచ్చిపడినా, తన ముఖం ముడుచుకు పోదనీ, తన నిద్దర కలత పడదనీ, ఇది తనలో వచ్చిన పరిణామ మనీ శెట్టిగారికి తెలియదు. ఆయనకు తెలిసిందల్లా, "స్వామి వారి దగ్గరకు వెళ్ళొస్తే హాయిగా వుంటుంది" అంతే! మెల్లిగా ఆనందరాజు శెట్టి గారు స్వామివారి పిలుపులో "ఆనందు" అయిపోయాడు. శెట్టిగారి దృష్టిలో ఆ బాలస్వామివారు తండ్రి అయిపోయారు.

శెట్టిగారి అంతరంగంలో మార్పు వస్తున్న కొద్దీ, ఆయన నిత్య జీవిత ప్రవర్తనలో గూడా మార్పు వస్తోంది. జన్మ లక్షణమైన కోపం పూర్తిగా మటుమాయం కాకపోయినా, అది ముక్కు మీదినించి దిగి యే మోకాల్లోనో వొదిగి కూర్చుంది. దానివల్ల ఆయనకు బంధువర్గంలోనూ, మిత్ర వర్గంలోనూ వున్న వైరుధ్యాలు వాటంతటవే చక్కబడసాగాయి. ఆర్థిక చిక్కులు మాత్రం అలాగే వుండిపోయినాయి.

ఒక రోజు స్వామివారు తమలో తామే ఆలోచించుకున్నారు. "మంచి వంశంలో పుట్టి దైవభక్తి వాసన వుండి, సహజసిద్ధంగా సాధు గుణం వున్న జీవిలో పరిణామం తీసుకు రావటానికి ఇంత సమయం తీసుకొంటున్నది. ఇదే పని సమూహంమీద మనం చెయ్యగలిగితే ఇదే సమయంలో వందల మందిలో మార్పు తీసుకురావచ్చు. అప్పుడు సమాజ ప్రగతిలోనే మార్పు వస్తుంది. ఆ పని చెయ్యమనే గణపతి నన్ను తొందర పెడుతున్నాడు. అందుకు మరి కొంత పునాది కావాలి."

ఆ మర్నాడే స్వామివారు ఉన్నట్టుండి కందుకూరు వెళ్ళారు. వచ్చిన తమ్ముణ్ణి చూసి సంతోషపడ్డ నంజుండయ్యగారు, "ఈరోజు దేవతార్చన నువ్వే చెయ్యి సత్యనారాయణా" అన్నాడు. "ఇతను మంచి ఉపాసకుడుగా వున్నాడు. మనం సామాన్యులంగా వున్నాం. పోనీ దేవతార్చన అతను చేసి తీర్థం యిస్తే, ఇంట్లో పిల్ల లందరికీ మంచిది" అని ఆయన ఆలోచన. ఎవరి ఆలోచనలు వారివి, తప్పేమి? స్వామివారు దేవతార్చనకు కూర్చున్నారు.

నరసింహశాస్త్రిగారు అప్పటికి దేవతార్చన మానలేదు గాని, తను పంచాయతనం మాత్రం వుంచుకొని, మిగిలిన ప్రధాన దేవతార్చనంతా పెద్దకొడుకు దగ్గర పెట్టేశాడు. అందువల్ల గండ్లూరువారి వంశపరంపరగా వస్తున్న నరసింహ సాలిగ్రామము, నరసింహ పంచలోహ విగ్రహము నంజుండయ్యగారి దేవతార్చనలో వున్నాయి. స్వామివారు దేవతార్చన మొదలెట్టి అభిషేకం చేస్తున్నారు. నంజుండయ్యగారూ, ఇతరులూ శ్రద్ధగా చూస్తున్నారు.

ఇంతలో నరసింహస్వామి తన కుడిచేతులలో ఒక చేతిని పైకీ క్రిందికీ ఊపసాగాడు. అందరూ కళ్ళింతలు చేసుకొని ఊపిరి బిగపట్టి చూస్తున్నారు. నరసింహస్వామి ఏమిటో మహానందంతో పొంగిపోతున్నట్టుగా వున్నాడు. భక్తిలో పడ్డాక భ్రాంతులకు లోపంవుంటుందా?

స్వామివారు మాత్రం అభిషేకం అంతా అయ్యేవరకూ కళ్ళు తెరవలేదు. తరువాత పూజ చేసేటప్పుడు నరసింహ విగ్రహాన్ని ఒక సంపుటంలో పెట్టుటం మామూలు. అలాగే ఆ విగ్రహాన్ని యివాళ్ళ గూడ సంపుటంలో పెట్టారు స్వామివారు. విగ్రహం తల సంపుటం దాటి బయటుకు వచ్చింది. ఏమిటిది? ఏమయింది? అది భ్రాంతి కాదు. భక్తి భ్రాంతి అసలే కాదు. విగ్రహం ఒక పావు అంగుళం పైగా పెరిగింది. ఇది నగ్నసత్యం. మన మెవ్వరం యేమీ చెయ్యలేం దానికి. స్వామివారు మాత్రం నిదానంగా ఇతర సాలిగ్రామాలను తుడిచి వేరే సంపుటాలలో పెడుతున్నారు. ఇంతలో నంజుండయ్యగారు, "ఏదీ, ఏదీ ఆ నరసింహం ఇటు చూపించు" అన్నారు ఆదుర్దాగా. స్వామివారు చూపించారు.

* "ఇదేమిటి, యీ బిలం ఇంత పెద్దదయిపోయిందేమిటి ఇవ్వాళ్ళ" అన్నాడు ఆయన ఆశ్చర్యంతో నోరు తెరుస్తూ.

"పెరిగింది" అన్నారు స్వామివారు.

ఆ తరువాత స్వామివారేమీ మాట్లాడలేదు. మిగిలినవాళ్ళకి ఏమి మాట్లాడాలో తెలియ లేదు. ఆ మధ్యాహ్నమే బయలుదేరి బొమ్మెపర్తిలో తండ్రిగార్ని చూసి, వెనక్కి వెళ్ళి పోయారు స్వామివారు. ఎందుకొచ్చారో, ఎందుకు వెళ్ళారో ఎవరికీ అర్థం కాలేదు.

---

* గండకీ నదిలో దొరికే ఒక ప్రత్యేక జాతి శిలలను సాలిగ్రామా లంటారు. వాటికి ఒక రంధ్రం వుంటుంది. ఈ రంధ్రాన్ని బిలం అంటారు. ఆ రంధ్రంలో ఆ యా దేవతలకు సంబంధించిన యంత్రాలు ప్రకృతి సిద్ధంగానే చెక్కబడి వుంటాయి. ఆ శిలలను విష్ణు స్వరూపాలుగా భావించి, అర్చిస్తారు భారతీయులు. శంఖాలకు వెలుపల కఠిన పదార్థం వుంటే లోపల జీవి వున్నట్లే. యీ సాలిగ్రామ శిలలు ఒక రకం జీవికి పై కవచాలనీ, ఆ జీవే లోపలి యంత్రాలను చెక్కుతుందనీ చెప్తారు. ఈ సాలిగ్రామ శిలల్లో జీవం గలిగి పెరుగుదల శిలలు గూడా వున్నట్లు ఆధారాలు వున్నాయి. ఏమయినా సాలిగ్రామ శిలకు ప్రాచీన భారతీయుల దృష్టిలో అనన్య సామాన్యమైన విలువ వున్నది. ఈ సాలిగ్రామాల గురించి మరికొన్ని వివరాలు పై అధ్యాయాలలో తెలుస్తాయి.

నంజుండయ్యగారి యింట్లో మాత్రం ఈ దేవతార్చన సంఘటన విశేషమైన పరిణామాలను తెచ్చింది. ముఖ్యంగా ఆ యింటి పిల్లల మీద ఇది చెరగని ముద్ర వేసింది.

వెనక్కి తిరిగి వస్తూనే స్వామివారు ఒక రాత్రల్లా కూర్చుని, రెండు కాయితాలమీద యేవో చిత్రపటాలు (డిజైన్లు) గీశారు.

ఆ మరునాడు చిన్నయ్యగారు వచ్చారు. ఆయనను లోపలికి పిలిచి, " ఒక మహత్తరమైన సేవచేసే భాగ్యం మీకు పడుతోంది " అన్నారు స్వామివారు.

" ఆజ్ఞాపించండి. "

" మంచి చెక్కతో పాదుకలు చేయించండి. యీ డిజైన్ ప్రకారంగా ఏనుగు దంతం మీద యీ యీ రేఖలు చెక్కించండి. ఆ ఏనుగు దంతపురేఖల ముక్కలను, ఆ పాదుకలలో, యీ నమూనా ప్రకారం తాపడం చేయించండి. తొందరపడకుండా నిదానంగా, జాగర్తగా చేయించి తీసుకురండి". అది తనకు మహాభాగ్యంగా భావించి ఆ ప్రయత్నంలో పడ్డాడు చిన్నయ్యగారు.

ప్రొద్దుటూరులో పరిచయమైన పబ్బతిరామయ్యగారు, అప్పుడప్పుడు ఆశ్రమానికి వచ్చి పోతున్నాడు. వచ్చినప్పుడల్లా స్వామివారి మహత్తును మరింత ప్రత్యక్షంగా చూసి మరీ వెళ్ళుతున్నాడు. ఒకసారి ఆయన వచ్చి ఇక్కడ వుండగానే ఎవరో ఒక పిచ్చివాణ్ణి స్వామివారి దగ్గరకు తెచ్చారు. స్వామివారు వాడికి అభయం యిచ్చి, ఆ పిచ్చి తను తీసేసుకొని ఒక రోజల్లా అనుభవించారు. ఆ రోజల్లా ఆశ్రమంలో స్వామివారి పిచ్చిగోలకు అంతులేదు. ఆ మర్నాటికి చక్కబడ్డది. ఆ రోజే ఆ కుర్రవాడికి పిచ్చి పూర్తిగా తగ్గిపోయింది. ఆ తరువాత వచ్చినప్పుడల్లా ఆ కుర్రవాడి గురించి విచారిస్తూనే వున్నాడు రామయ్యగారు. వాడు బాగా చదువుకుంటూ హాయిగా వున్నాడని తెలిసింది. ఆశ్చర్యపోయాడు రామయ్యగారు. సామాన్యంగా ఎవరితోనూ సరిపడని రామయ్యగారికి స్వామివారి సర్వసమదృష్టి ప్రత్యేక ఆకర్షణ హేతువుగా మారింది.

ఆ రోజుల్లోనే నరసింహయ్యగారని ఒక నలభైయ్యేళ్ళ పెద్దమనిషి స్వామివారి దగ్గరకు తరచు వస్తూ వుండేవాడు. సన్నిహితంగా వుండేవాడు. ఒకరోజున ఆయన్ను పిల్చి—

" మీ రివాళ్టి నుంచీ జీవితాంతం గురు చరిత్ర పారాయణ చెయ్యండి " అని ఆదేశించారు.

గురుచరిత్ర అంటే దత్తాత్రేయ అవతారులైన నృసింహ సరస్వతీ స్వామివారి చరిత్ర. నరసింహయ్య గారింట్లో వంశ పరంపరగా దత్తాత్రేయ పూజ వున్న మాట నిజమేగాని, ఆ మాట స్వామివారితో ఎప్పుడూ అనలేదు. " వీరు గణపతి ఉపాసకులు గదా, వీరి దగ్గర దత్త సంప్రదాయం మాట ఎందుకు " అని వారి ఉద్దేశ్యం.

అందుకే స్వామివారు ఆయన్ను గురుచరిత్ర పారాయణ చేయమన్నప్పుడు ఆయన కొంచెం ఆశ్చర్యపోయారు. అప్పుడు స్వామివారు ఆయనతో అన్నారు.

"దత్తాత్రేయుడు గూడా నాతో వున్నాడు" అని. ఈయనతో వుండటమేమిటి ? ఎప్పటి నుంచీ వున్నాడు? ఇత్యాది ప్రశ్నలు ఆయనకు తోచలేదు. "నాలో ఉన్నాడు అనటానికి నాతో ఉన్నాడు " అన్నారు లెమ్మను కున్నాడాయన. అప్పటి నుంచీ ఆయన స్వామివారిలో గణపతిని, దత్తాత్రేయుణ్ణి గూడా దర్శిస్తూ ఉపాసించసాగాడు.

గురుం శరీర త్రయ భారదూర
మప్యాశ్రితాచార విశేషదండమ్ ।
లోకానుకంపామతి మజ్ఞమూర్ఖ
చ్ఛందానురోధార్థ సువేష మీడే ॥

ఆయనకు స్థూల సూక్ష్మ కారణ శరీరాలలో ఏ శరీరపు భారమూ లేదు. అయినా ఆయన సన్యాసాశ్రమ విశేషాచారమైన దండాన్ని స్వీకరించారు. అజ్ఞులైన మూర్ఖులను కొంత అనుసరించి వారిని తరింప జెయ్యాలనే దయతో మంచి (యతి) వేషం ధరించారాయన. అట్టి శ్రీ గురుదేవుని స్తుతిస్తున్నాను.

## దండ ధారణం

ఆ రోజుల్లో స్వామివారి దగ్గరకు రాత్రి పొద్దు పోయినాక కొందరు ప్రత్యేకంగా వచ్చేవారు. సామాన్యంగా వారంతా బాగా పండిపోయిన ముసలివాళ్ళుగా ఉండేవారు. వారు ఎటువైపు నుంచి వచ్చేవారో, ఎమో ఎవరికీ అంతుబట్టేది కాదు. ద్వారకా మొదలైన కుర్రవాళ్ళకు వాళ్ళ రాక ఆకాశంలోంచి ఊడిపడ్డట్టుగా ఉండేది.

డొక్క లెండుకుపోయి, కనుబొమ్మలు జారిపోయి, గడ్డాలు తెగ పెరిగిపోయి ఉన్న ఆ ముసలయ్యల వొంటిమీద ఒకోసారి గోచీ గూడా ఉండేది కాదు. విడిగా వాళ్ళను గురించి ఎన్ని హాస్యాలాడుకున్నా వాళ్ళు వచ్చినప్పుడు మాత్రం వాళ్ళ వంక తేరిపార చూసేందుకు గూడా పిల్లలకి ధైర్యం ఉండేది కాదు. అలాంటి వాళ్ళు వస్తూనే, నరాసరి స్వామివారి దగ్గరకు వెళ్ళిపోయి కాళ్ళు పట్టుకు నమస్కారం పెట్టటం, మౌనంగా కూర్చోవటం ఇంతేపని. పెదిమి కదిపే పనిలేదు. స్వామివారు గూడా అలాగే కూర్చుండి పోతారు. దేవతార్చనలో అర్క గణపతి విగ్రహా లెంతో వీళ్ళు అంతే. చివరికి వీళ్ళెటు పోతారో చూద్దామని ఎన్నిసార్లు కాపలా కాచుకు కూర్చున్నా ఏ వొంటగంట దాటాకో కునుకు పట్టేసేది. మళ్ళీ మెలకువ వచ్చేసరికి ఈ ముసలాళ్ళు ఉండేవారు కాదు.

కొంతమంది కొద్దిగా మాట్లాడేవారు కాని, వాళ్ళేభాష మాట్లాడుతున్నారో, స్వామి వారు ఏ భాషలో సమాధానం చెపుతున్నారో ఏమీ తెలిసేది కాదు. వాళ్ళని మీారేం ఆహారం తీసుకుంటారని స్వామివారు అడగటం, వారేదో చెప్పటం అది సృష్టించి వాళ్ళ కివ్వటం ఒకటి రెండు సార్లు కనిపించింది. ఒకరో ఇద్దరో స్వామివారి భిక్షా ప్రసాదమే భోజనం చేశారు గూడా.

స్వామివారు మంచి హాస్యం మూడ్‌లో వున్నప్పుడు "వాళ్ళంతా ఎవరు స్వామీ?" అనేవాళ్ళు కుర్రాళ్ళు.

"ఏముందిరా, నేనో బైరాగిని. బైరాగి దగ్గరకి యెవరొస్తారు? బైరాగులే! మొహం చూస్తే తెలీటంలా" అనేవారే తప్ప ఏమీ చెప్పేవారు కాదు. ఒకసారి మాత్రం వాళ్ళల్లో కొందరి వయస్సు నూట యాభై సంవత్సరాలు దాటి వుందని చెప్పారు. క్రమంగా పిల్లలకిది అలవాటయిపోయి, ఆ విషయం పట్టించుకోవటం మానేశారు.

ఒకరోజున దండకమండలాలు చేతబట్టుకున్న స్వాములవా రొకాయన వచ్చారు రాత్రి పూటే. ఆయన అప్పుడప్పుడే వార్ధక్యంలోకి అడుగుపెడుతూ, స్వామివారి గదిలోకి అడుగు పెట్టినట్టున్నాడు. వోపిక గానే వున్నాడు. పిల్లలకు ఆయిన స్వామివారికి వందనం చేసిన విధానం కొత్తగా వుండి నవ్వొచ్చింది.

ఒంటి కాలుమీద నిలబడి, కాలుకి కాలు మెలికేసి గద్దల్లే నిలబడి, చేతికి చెయ్యి మెలిక వేసి, ఆ మెలికలో దండం పట్టుకొని, ఆ దండం స్వామివారి పాదాల కానించి, మోకాళ్ళ మీద వాలి విచిత్రంగా వందనం చేశాడాయన.

అది గరుడాసనమని, యతీశ్వర వందన విధాన మలా వుంటుందనీ పిల్లలకు తెలియదు. స్వామివారు ఆయన్ను ఆదరంగా ఒక చదరమీద కూర్చో పెట్టారు.

"మీరలా బైటకెళ్ళి వో 'టీ' కొట్టి రండ్రా" అన్నారు పిల్లల్ని. పిల్లలు పొలోమని ఆనందంగా వెళ్ళిపోయారు.

"ఎవరు మీరు?" అన్నారు స్వామివారు.

"తెలీదు" అన్నారు దండిస్వామి.

"ఇక్కడికి ఎలా వొచ్చారు"?

"కనిపించీ కనిపించని అరవెలుతురులో తడుముకుంటూ ఇక్కడికి వచ్చాను"

"దేనికోసం తడువుకుంటున్నారు_మీరు?"

"పరబ్రహ్మకోసం"

"పరబ్రహ్మంగారు మీ బంధువా, తప్పిపోయారా?"

"ఆ పరబ్రహ్మమే నేనని శాస్త్రంచెపుతోంది. నాకు నేనే తప్పిపోయిన దౌర్భాగ్యుణ్ణి నేను"

"శాస్త్రం మీతో ఆ మాట ఎందుకు చెప్పవలసి వచ్చింది?"

"నాలాంటి అభాగ్యులకు దారి చూపేందుకు పరమేశ్వరుడు ఉపనిషద్రూపమైన శాస్త్రాన్ని అనాదిగా ప్రవర్తింపచేస్తున్నాడు. ఆ శాస్త్రం నాకేగాదు, సమస్త జగత్తుకు ఉద్ఘోషిస్తోంది 'తత్త్వమసి' అని."

"ఇంకేమి ? మీకు మీ... తప్పిపోతారని శాస్త్రానికి తెలుసు. తప్పిపోయిన వాళ్ళని వెతుక్కోవాలనీ, అందుకు మార్గం చెప్పాలనీ శాస్త్రానికి తెలీదా ? "

"తెలుసు గురుప్రభో, శాస్త్రాదేశాన్ననుసరించే, ఆ మార్గంలోనే, యీ సన్న్యాసాశ్రమం స్వీకరించాను."

"ఇంక సమస్య యేమిటి ?"

"బాట ఎక్కాను, కాలు సాగటం లేదు"

"మరి యిక్కడి కెందుకొచ్చారు ?"

"మొన్న పూర్ణిమకు కావేరిలో బ్రహ్మకుండ స్నానానికి వెళ్ళాను. అక్కడ హిమాలయ యోగులు కొందరు కలిశారు. వారంతా తమకోసం వచ్చి వెడుతూ, దారిలో సంగమ స్నానానికి వచ్చామని చెప్పారు."

"వారు చెపితే ఇటు వచ్చారన్న మాట."

"ఔను"

"వారంతా యోగులు, మీరు సన్యాసులు. మీకూ వారికీ పొత్తేమిటి?"

"యోగమన్నా, సన్యాసమన్నా పర్యవసానంలో ఒకటే అని పరమాత్మ ఉపదేశించాడు గదా, గురుప్రభో!"

"పర్యవసానంలో అంతే కావచ్చు. మాబోటి కుర్రకారు ఇంకా అక్కడికి చేరలేదేమో!"

"గురుప్రభో! వయస్సు చెల్లిపోయినవాణ్ణి. నన్ను ఇక పరీక్షలపాలు చెయ్యవద్దు. సంగమక్షేత్రంలో నాకు అపస్ఫురణ సంభవించదు. గురుప్రభో! శాధిమాం త్వం ప్రపన్నం."

"సంగమంలో ఏమని స్ఫురణ వచ్చింది?"

"గుప్తచరులైన యోగి జనుల ఆచరణ సౌలభ్యం కొరకై యోగి చర్యోపాసన లన్నింటినీ అనుష్ఠాన ముఖంగా ప్రదర్శించేందుకు అవతరించిన యోగీశ్వరేశ్వరులు తామని."

"అది మీ స్ఫురణ. సరే, ఇప్పుడేం కావాలి మీకు?"

"తాము యతి ధర్మాలను ఆచరించే సమయం కోసం కాచుకొని ఉండి అనుసరిద్దామని ఆశ పడుతున్నాను."

ఒక క్షణం స్వామివారు తన అంతరాలోచనలో లీనమయ్యారు. "ఈతడు సాధనలో నిజాయితీ గలవాడు, పట్టుదల కలవాడు. సాధించగలడు కాని సందేహశీలి. నేను సన్మార్గంలోనే ఉన్నానన్న విశ్వాసం కుదరకపోతే నేను చెప్పేది వినడు. నాకెందుకని వదిలేస్తే మంచివాడు అన్యాయంగా చెడిపోతాడు. అలాంటి వాళ్ళను ఎవరైనా అపమార్గంలో పెట్టవచ్చు. కనుక ఇతని కోసం ఏదో ఒకటి చెయ్యాల" ఇలా ఆలోచనయినాక–

"ఇప్పుడు నేను యతి ధర్మంలోనే ఉన్నాను'' అన్నారు స్వామివారు.

ఆయన కొంచెం అపనమ్మకంగా చూశాడు.

"ఏమిటి సందేహం?" అన్నారు స్వామివారు నవ్వుతూ.

"క్షమించాలి, తాము యతీశ్వరులైతే, తమ దండమేది, కౌపీనమేది ?"

"చూడలేదా ? అదిగో ఆ మూల" ఆ గోడ మూల ఒక ఆరడుగుల వెదురు కర్ర, ఆ పక్కన తాడుమీద కాషాయ కౌపీనం వున్నాయి.

"ఇదేమిటి, యీ దండం మా దండం లాగా లేదే ?" దండిస్వామి అడిగాడు.

"మా సంప్రదాయం వేరు"

"మీ సంప్రదాయం ఏది ?"

"అవధూత సంప్రదాయం"

"అంటే?

"దత్తాత్రేయ సంప్రదాయం"

"మీ గురు వెవరు ?"

"నాకు ఇద్దరు గురువులు, ఒకరు మా అమ్మగారు, రెండవవారు అవధూత స్వామివారు. వారిద్దరూ ఇప్పుడు శరీరాలు ధరించిలేరు.

*మాకు యోగపట్టములు వుండవు. మా దండం పేరు ఆత్మ దండం. దానికి కణుపు లుండవు"

"ఇలాంటి సంప్రదాయం గురించి ఏ గ్రంథంలో వుంది ?"

"ఇది గ్రంథాలలో వుండే విషయం కాదు. ఇది గురు పరంపరగా ప్రాప్తించవలసిన గుహ్యయోగము."

అప్పటికి ఆ దండి స్వామి ముఖంలో కొంత తృప్తి కనిపించింది. అప్పు డాయన కళ్ళు మూసుకొని, తను విన్న విషయాలను నెమరు వేసుకొని, లోలోపలే సమన్వయించు కొని ఆకళించుకోసాగాడు.

"అయ్యా" అన్నారు స్వామివారు.

ఆయన చేతులు జోడిస్తూ కళ్ళు తెరిచాడు.

"సన్యాసం అంటే దండ ధారణేనా, లోపల జరగాల్సిన పనేదయినా వున్నదా ?" అన్నారు స్వామివారు.

---

* యోగపట్టము అనగా సన్యాసులకు వుండే దీక్షనామం.

"లేకేమి గురుప్రభో! శాస్త్రపు మాటలు చెప్పగలను. ప్రణవోపాసనామార్గంలో త్రిగుణాలను ఒక దానిలో ఒకటి లయింప చెయ్యాలి. సత్వం మిగులుతుంది. దాన్ని అహం కారంలో, దాన్ని మహత్తులో, దాన్ని చిత్తులో లయింప చెయ్యాలి. ఆ ప్రయత్నం ప్రారం భించాను. అక్కడే కాలు సాగటంలేదని తమ పాదాలయందు ప్రార్థన సమర్పించుకొన్నాను." ఆవేదనగా చెప్పారు దండిస్వామి.

"అడ్డం ఏమిటి?" అడిగారు స్వామివారు.

"అహంకారాన్ని జయించే ప్రయత్నంలోనే అన్ని చిక్కులు వస్తున్నాయి గురు ప్రభో! ఆహార సమస్య నన్ను జనంలోకి యీడుస్తోంది. జనం మధ్యల్లో చేసే అహంకార నిర్మూల ప్రయత్నం అసాధు జనుల దురాగతాలకు బలి అవుతోంది."

"కారడవులలో వున్న చెట్లకూ, కొండలమీది బండరాళ్ళకూ అహంకార విజయం సులభమంటారా? వాటికి జనఘోష వుండదుగా?"

"గురు ప్రభువుల భావం నేనందుకోలేక పోతున్నాను"

"చూడండి, అహంకారంమీద యుద్ధం ప్రకటించినవాడికి ప్రపంచంలో దురాగతాలే లేవు, వుండవు. అహంకార జయందాకా అక్కరలేదు. యుద్ధం ప్రారంభిస్తే చాలు వాడికి ప్రపంచంలో అసాధువులే లేరు. వినలేదా మీరు యుధిష్ఠిర చక్రవర్తి కథ? అదలా వుంచండి, అసాధు పురుషుల దురాగతాలంటే, వారివల్ల వచ్చే అవమానాలేగా మీకు ప్రధాన ప్రతి బంధకాలు."

"చిత్తం, చిత్తం"

"అయితే, ఇది మీరు గమనించదలచుకుంటే, నా యోగిచర్యకంటే, ముందు జరిగి పోయిన నా బాల్యచర్యను దర్శించి వుండవలసింది. ఒక పదేళ్ళు ఆలస్యంగా వచ్చారు."

స్వామివారు ఒక్క క్షణం ఆగారు. ఆ దండిస్వామి కంగారుగా, "పాహి గురుప్రభో పాహి, అన్యథాశరణం నాస్తి, త్వమేవ శరణం మమ" అని లేచి సాష్టాంగ వందనం చేశాడు. స్వామివారు, ప్రసన్నమైన చూపును ప్రసరింప చేశారు.

"యతీశ్వరా, లేవండి, ఆది గురువులు మీ యందు కరుణ వహించి యున్నారు. మీరు చేసిన దత్తోపాసన సఫలమవుగాక! మీ కిప్పుడు అంతర్దృష్టిని ప్రసాదిస్తున్నాను. నా సాధనా చర్యలో ఒక ఏడెనిమిదేళ్ళ భాగాన్ని మీరు మీలోనే స్వయంగా దర్శించండి." ఇలా అంటూ వుండగానే, చంద్రోదయ సమయంలో తెలితామరలు లాగా స్వామివారి కన్నులు అల్లనల్లన మూసుకున్నాయి.

దండిస్వామి పద్మాసనారూఢుడై, కనులు మూసి, మనస్సును ధ్యానమార్గంలో ప్రవేశ పెట్టాడు. ఆయన ఇక దర్శించసాగాడు.

* * *

# ద్వేషజయం

"........ నంజుండా ఏమంటా మరి." అన్నాడు నరసింహశాస్త్రిగారు.

"నువ్వేమీ చెప్పకపోతివి. నే నేమనేది"? అన్నాడు చనువుగా నంజుండయ్య.

"అదేనప్పా, మీ అమ్మపోయినపుడు నా ప్రాణం హాయిగా వుంది. ఏ బాధా లేదు. మీ పిన్ని పోయిందగ్గర నుంచీ, నా మెడకు అన్నీ ఉరి ఉచ్చు లేనాయే. చచ్చి సాధిస్తోందనుకో." తను చాలా సౌమ్యంగా మాట్లాడుతున్నాననే శాస్త్రిగారి అభిప్రాయం.

"ఎన్నాళ్ళయినా మాట్లాడటం రాదీయనకి" అనుకున్నాడు లోలోపల నంజుండయ్య.

"ఇంతకూ విషయ మేమిటంటే ఈ గుంటల్నిద్దర్నీ ఉంచుకోవటం నా లింగణ్ణగారికి చేత కాలేదు. వాళ్ళ కుటుంబం నానా యిరకాటంలో పడించాయె మరి." అసలు విషయం లోకి దిగాడు శాస్త్రిగారు.

నంజుండయ్య తండ్రి మాటకు అడ్డు తగిలాడు.

"నీ మాత్రం జాలి నాకూ వుంది లేవయ్యా."

"సగే చెప్పు, చెప్పు".

"పెద్ద బ్రహ్మాండంగా నేను పోషిస్తానని తీసుకుపోయిన మా వెంకమ్మప్పకు నూకలు చెల్లిపాయె."

"ఔనుగదా మరి"

"ఇక మళ్ళీ యీ సత్యనారాయణా యీ వరలక్ష్మి వచ్చి నా పాలబడ్డారు"

"..........." (మౌనం)

"నేనంటావా నిప్పుల్లో మిరపకాయలు పొల్లించుకొని, నాలుగు మెతుకులు తినీ తినకా కాలక్షేపం చేస్తున్నాను. మరి వీళ్ళ గతేమిటి?"

"ఊ"

"..................."

"నువ్వేం మాట్లాడవు, నాకు తెలుసు. నా అవసరం గనక నేనే నోరు తెరిచి అడుగుతా. నువ్వేమయినా ఓపిక చేసి, యీ పిల్లల్నిద్దరినీ నీ పిల్లలతోపాటు సాకగలవా?"

"నా అంతట నేను మాట్లాడితే, యిక పెడర్థం తీస్తావోనని నోరు మూసుకున్నా. నువ్వు పంపించాలేగాని నే నెందుకు తీసుకెళ్ళను? మహారాజల్లే తీసుకెడతా, బంగారంలా వుంచు కుంటా, చదువూ చెప్పిస్తా, పెళ్ళిళ్లూ చేస్తా, మధ్యలో నువ్వు అడ్డుపడకుండా వుంటే."

"ఆహా.... మా నాయనే, మా బంగారే.... అసలు మన వంశమే అంతరా. ఒకడు వస్తున్నాడంటే సంతోషపడటమే తప్ప, రెండోమాట మనింటా వంటా లేదు." పొంగు వస్తే ఆగటం శాస్త్రిగారికి చేతకాని విద్య.

"మరి వీళ్ళ చదువుల మాటేమిటి?" నంజుండయ్య కొత్త పాయింటు లేవదీశాడు.

"అవన్నీ నాకేం తెలియవు. నన్నడగ బోక."

"అదేమిటయ్యా? చదువూ చట్టు బండలు లేకుండా తాతా, అవ్వ మొహం చూస్తూ కూర్చుంటారా వాళ్ళిద్దరూ!"

"అది సరేగాని ఒరే అబ్బాయ్, అంబమ్మత్త వీళ్ళిద్దరినీ యింట్లో వుండనిస్తుందంటావా?"

"అన్నిటికీ కలిసి వచ్చేటట్టు నేనొక ఉపాయం చెపుతా, వింటానంటే."

"చెప్పు"

"అనంతపురంలో మీా దాసంభొట్లు మావయ్య కొడుకులు అశ్వత్థనారాయణా వాళ్ళూ కాపరం పెట్టారు."

"ఎందుకు?"

"తమ్ముళ్ళ చదువు కోసం"

"గొందిరెడ్డిపల్లిలో కాపరం ఎత్తేశారా?"

"లేదు. ఇక్కడ అనంతపురంలో ఆ సుబ్రహ్మణ్యం, మరో యిద్దరు కాబోలు చదువు కొంటున్నారు. వాళ్ళకు వండి పెట్టేందుకు వాళ్ళ మేనత్త సుబ్బమ్మగార్ని తెచ్చుకున్నారు.

"అక్కడ వీళ్ళని పెడదామంటావా?"

"దానికి కావలసిన ఏర్పాట్లు నేను చూస్తా"

"నే నంత సంపాదన లేకుండా అఘోరించానంటావా?"

"అబ్బబ్బ! అది కాదు లేవయ్యా. వారం వారం నేను పోయిచూస్తా. పుస్తకాలూ బట్టలూ అన్నీ నేను చూసుకుంటా! సెలవు లొస్తే పిల్లలు మనింటికే వస్తారు. ఏమంటా?"

"బాగానే వుందికాని, ఈడొచ్చిన ఆడపిల్లను పరాయిచోట బెట్టటం నాకు బాగా లేదప్పా"

"సరే, దాన్ని మనింట్లోనే వుంచుకుందాం. దాని కేమి భాగ్యం? మరి చదువో?"

"ఒరేయ్, ఆడపిల్లలకు చదువు లేకపోతే యేమిరా? ఉద్యోగాలు చెయ్యాలా, వూళ్ళేలాలా?"

"అది నన్నడక్కు, నువ్వే తేల్చుకో"

"నువ్వా బడిపంతులువేగా, దానికి కాస్త నాలుగు ముక్కలు నువ్వే చెప్పరాదూ?"

"అట్లా చెయ్యమంటే అట్లా చేస్తా"

"అదే మంచిది. కాస్త చదవటం, రాయటం వస్తే అంతే చాలు. సరే అయితే నన్నొచ్చి మావతో చెప్పమంటావా?"

"మావతో చెప్పొద్దు. అత్తతోనూ చెప్పొద్దు. అన్నీ నేను చూసుకొంటాను. నువ్వు గమ్మునుండు. మరి పిల్లల్ని ఎప్పుడు పంపిస్తావు?"

"నువ్వెప్పుడు తీసికెడితే అప్పుడు"

"అయితే యివాళ తీసుకెళుదునా?"

"శుభస్య శీఘ్రం"

ఆ రాత్రే సత్యం, వరలక్ష్మి అన్నగారితో కందుకూరు చేరారు. వదిన లలితమ్మగారు ఆదరంగా ఆహ్వానించింది యిద్దర్నీ.

ఓ వారం రోజుల్లో ప్రొద్దుటూరు నుంచి టి. సి. వచ్చింది. ఆ సంవత్సరం వ్యర్థం కాకూడదని నంజుండయ్యగారు చాల హడావిడి పడుతున్నాడు. టి. సి. రాగానే దాన్ని పరిశీలిస్తూ నంజుండయ్యగారు తమ్ముడితో ఇలా అన్నాడు:

"చూడప్పా, మే నెల 22 తేదీ, 1942. యిదీ నీ పుట్టిన రోజు. అంటే అప్పుడే నీకు 13 ఏళ్ళు. ఇది 1955 కదా. పదమూడేళ్ళకి మామూలుగా అయితే ఫోర్తుఫారంలో వుండాలి. కాని ఇప్పుడు నువ్వు ఫస్టుఫారంలోకి వచ్చావు. చూశావా, ఎంత బాగా వెనకబడి వున్నావో? ఇంతకన్నా నీకు చెప్పను. ఎంత శ్రద్ధగా చదవాలో నువ్వే ఆలోచించుకో. బాగా చదివితే మనకే మేలు గదా." అలా చాలా బుద్ధులు చెప్పి మర్నాడే అనంతపురంలో శ్రీ పొట్టి శ్రీరాములు హైస్కూలులో ఫస్టుఫారంలో చేర్చాడు. కావలసిన బట్టలు, పుస్తకాలు, పెన్సిళ్ళు వగైరా అన్నీ కొనిచ్చి, సుబ్బమ్మగారి దగ్గర దిగవిడిచాడు.

"అమ్మా సుబ్బమ్మగారూ! మీకూ, మా జయలక్ష్మి పిన్నమ్మకూ ఎంతో స్నేహం. ఆవిడ పిల్లవాడు వీడు. మీ పిల్లవాడిలాగా చూసుకోండి" అని చెప్పి వెళ్ళాడు.

హంపాపురం దానంఘోట్లుగారి కొడుకుల్లో సుబ్రహ్మణ్యం సత్యనారాయణకంటె సీనియరే కాని ఇద్దరికీ మంచి దోస్తీ కుదిరింది. సత్యనారాయణకి "సత్యం" అనే వ్యావహారిక నామధేయం మరోసారి వాడుకలోకి వచ్చింది. కొద్దిరోజుల్లోనే అక్కడ సత్యానికి పెద్ద మిత్ర మండలి ఏర్పడింది. అయితే మరికొద్ది కాలంలోనే సత్యానికి "తిక్కస్వామి" అని నిక్‌నేమ్ ఏర్పడిపోయింది. (స్వామి అంటే బ్రాహ్మణుడు అని ఆ ప్రాంతాల వాడుక) నిక్‌నేమ్ వచ్చిందంటే రాదా? అతను చేసే పనులు అలా ఉండేవి.

పదమూడేళ్ళ కుర్రాడు ఫస్టుఫారంలో వున్నాడంటేనే, తోటి పిల్లలమీద నదరుగా కనిపిస్తాడు. అది చాలక, మాటిమాటికీ మొహంమీద పడే పెద్ద క్రాఫింగ్ వుండేది. దానికి దువ్వెన్న సంస్కారం మటుకు పండుగ రోజుల్లో అన్నగారింటికి పోయినపుడే. జుట్టు మొహం మీద పడ్డప్పుడల్లా దాన్ని ఎగదోసుకోవటం కోసమని తలకాయ యెగరెయ్యటం అతనికి అలవాటు. అది చూచినపుడల్లా బెత్తం వొకసారి ఝుళిపించటం టీచర్లకు సరదా.

అతను పొద్దున్నే స్నానం చేసేవాడు. సంతోషమే. స్నానం చెయ్యగానే కాకీనిక్కర్ మీద తెల్ల చొక్కా టక్ చేసేవాడు. నడుముకి బెల్టుపెట్టుకొని, కాళ్ళకు కాన్వాసు బూటు

వేసేవాడు. అప్పుడు గుప్పెడు విభూతి తడిపి జారిపడుతున్న జుట్టు, యెగబట్టుకొని ఆ విభూతి ముఖాన దట్టించేవాడు. ఆపైన, బాగా ముక్కు మీదికి దిగజారేటట్టు, ఖర్జూరకాయంత బొట్టు పెట్టేవాడు. ఈ అలంకారంతో సరాసరి శివాలయానికి వెళ్ళేవాడు. తొమ్మిది గంటలదాకా గుళ్ళో కాలక్షేపం చేసివచ్చి, గబగబా అన్నం తిని పుస్తకాల సంచీ బుజాన తగిలించుకొని బడికి బయలుదేరేవాడు.

అతనికి యివ్వాళ ఏ క్లాసు లున్నాయి, ఏమేం పుస్తకాలు కావాలి అన్న బాధ లేదు. అన్ని పుస్తకాలూ అతని సంచీలోనే వుండేవి. వీపుమీద పుస్తకాల సంచీ బరువు మరీ ఎక్కువ కావటంవల్ల అతను కొంచెం వొంగి నడవవలసి వచ్చేది. అయినా అది అతనికి లెక్కలో పనిగాదు.

దారినపోతూ, రోడ్డుమధ్య కనిపించిన ఖాళీ సిగరెట్టు పెట్టెలు ఏరి జాగ్రత్త చేసేవాడు. ఇక ఏ పిరియడు కా పిరియడ్, పిరియడు మొదలయ్యాక హోంవర్కు మొదలు పెట్టేవాడు. పూర్తయితే అది టీచరు అదృష్టం. సాయంత్రం అందరితోపాటే ఇంటికి వచ్చేవాడు. కాని చిత్రం, ఊళ్ళో ఏ గుళ్ళో ఏ వుపన్యాసా లున్నాయో, ఏ హరికథ లున్నాయో మొత్తం సమాచారం మిత్ర బృందానికి యిచ్చేసేవాడు.

అనంతపురం చిన్న వూరేంకాదు. సువిశాలమైన ఆంధ్రదేశం ప్రధానంగా మూడు భాగాలు. ఉత్తరాన తెలంగాణా, తూర్పున కోస్తా, పశ్చిమాన రాయలసీమ అని. అందులో రాయలసీమకు ప్రధాన పట్టణం అనంతపురం. అంత పెద్ద అనంతపురంలో అన్ని గుళ్ళలోనూ, యే రోజు కారోజు జరిగే కార్యక్రమాలన్నీ యితనికి తెలుస్తాయి. ఎవర్ని కనుక్కొని వస్తాడో యేమో ఆ దేవుడికే తెలియాలి.

ఎక్కడో అక్కడ ఆధ్యాత్మిక కార్యక్రమం ఉందంటే చాలు, అది ఎంత చెత్తదయినా ఫరవాలేదు. అక్కడ చివరి దాకా కూచుని వచ్చేవాడు సత్యం.

ఎక్కడా ఏ కార్యక్రమమూ లేకపోతే, సాయంత్రం పూట తన మిత్ర బృందంతో ఏదో గుళ్ళోకి వెళ్ళి అక్కడ కాసేపు సామూహిక దివ్యనామ సంకీర్తన జరిపేవాడు. పెద్ద పాటగాడు కాదుగాని, అవసరమైతే ఒకటో రెండో పాటలు పాడేవాడు. పాటలయిన తర్వాత ఆ గుళ్ళో ఒక మూల చేరి మిత్ర మండలితో కాస్సేపు ఆట లాడేవాడు. ఆ ఆటల్లో అతనికి అత్యంత ప్రియమైన ఆట 'బాంక్' ఆట.

అతని నిక్కరు జేబులు రెండూ ఎప్పుడూ ఎత్తుగా ఉంటాయి. కారణ మేమిటంటే, అతను వీధి వెంబడి యేరిన ఖాళీ సిగరెట్టు పెట్టెలన్నీ కత్తిరించి వాటిమీద ఏవేవో అంకెలు వేసి పేక ముక్కలుగా తయారుచేసి ఉంచేవాడు. అవి ఎప్పుడూ జేబుల నిండా వుండేవి. ఆ పేకముక్కలు కరెన్సీ నోట్లుగా, తను బ్యాంకరుగా (Banker), మిత్రులు ఖాతాదారులుగా బ్యాంకు లావాదేవీలను ఆటగా ఆడించేవాడు. దాని పేరే అతని భాషలో బ్యాంకు ఆట. *

---

* ఈ రచయిత కలుసుకున్నంతలో అప్పటి మిత్రులు ఇంతకన్నా వివరాలు చెప్పలేకపోయారు. ఈ ఆట గురించి శ్రీ స్వామీజీని అడిగితే నవ్వేసి ఊరుకున్నారు.

ఇన్ని తిక్క వేషాలు వేస్తుంటే వాళ్ళతన్ని తిక్కస్వామి అన్నారంటే అది వాళ్ళ తప్పా?

ఇలా ఉండగా అక్కడ అన్నగారింట్లో వరలక్ష్మికి ఒక చిక్కు వచ్చింది.

వెంకమ్మగారి దగ్గరున్న రోజుల్లో పాఠాలు చదవటం, స్తోత్రాలు అప్పచెప్పటం, పద్యాలు వల్లించటం, అన్నతో పోట్లాడటం ఇవే వరలక్ష్మికి చేతనైన పనులు.

వెంకమ్మగారిది సన్యాసి మఠ జీవితము. ఇదేమో మామూలు సంసారుల యిల్లాయె. పది, పదకొండేళ్ళు వచ్చిన ఆడపిల్ల ఇటు చెంబు తీసి అటు పెట్టటం చేతకాదంటే సంసారులెవరైనా సరే ముక్కుమీద వేలేసుకోరా? అయితే అంబమ్మవ్వ ముక్కుమీద వేలేసుకొని ఊరుకోక, దీని ముక్కు పిండి మరీ పని చేయించేది. దాంతో లటుపిటు ప్రారంభమైంది. ఈ అగ్నికి మరో ఆజ్యం అయాచితంగా వచ్చి పడింది.

ఏమిటంటే—

ఆ మగ వెధవ ఎక్కడున్నా ఏం భయం లేదు. పాపం! ఇది ఆడపక్షి. ఎట్లా ఉందో ఏమో అని పెద్ద కూతురుమీద ప్రేమ పొంగుకు రావటం మొదలయింది ఈమధ్య నరసింహ శాస్త్రిగారికి. దాంతో ఇంకేముంది, ఉత్తరీయం నిండా ఇన్ని పళ్ళూ, బియ్యమూ, పటికబెల్లమూ, వగైరాలు ఎక్కడో, ఏ పెళ్ళి యాజ్ఞీకంలోనో వచ్చిన బాపతు, మూట కట్టుకొని నంజుండయ్య ఇంటికి వచ్చేవాడు. అక్కడ చిన్న పిల్ల వరలక్ష్మి ఏదో కష్టపడుతూనో, బాధ పడుతూనో కనిపించేది.

"నా కూతుర్ని రాచి రంపాన పెడుతున్నా"రని గోల పెట్టేవాడు నరసింహశాస్త్రిగారు.

"ఏం? ఆడపిల్లకి పని నేర్పుకోరా? అత్తారింటికి వెడితే కాపరం చేసుకోవద్దా?" అని మొదలెట్టేది అంబమ్మగారు.

ఇక చెప్పేదేముంది? ఇద్దరి భాషలూ పై కాలాల్లోకి వెళ్ళి దృతగతిలో ఫిడేళ్ళు వాయిం చేసేవి. కొంతసేపయినాక, అటు ఫిడేలు తీగలు తెగి, ఇటు కమాను కర్ర విరిగి కచేరీ ఆగిపోయేది.

ఇటు వరలక్ష్మి వెళ్ళి తండ్రిని బతిమాలేది. "పోన్లే అప్పా! మెల్లిగా నేనే సర్దుకు పోతాలే" అని. అటు లలితమ్మగారు అంబమ్మగార్ని బతిమాలి లోపలికి లాక్కుపోయేది.

"నువ్వు భోజనం చేయకుండా వెళ్ళకు. నాకు ఏడుపు వస్తుంది" అనేది వరలక్ష్మి తండ్రితో. కూతురు బతిమాలంగానే భోజనం చేసి మరీ వెళ్ళేవాడు శాస్త్రిగారు.

శాస్త్రిగారి ప్రేమ వల్ల వరలక్ష్మికి యింట్లో కటకట ఎక్కువే అయిందిగాని యేమీ ఉపకరించలేదు. దీన్నెలా సంబాళించాలో తోచక, "మౌనమే అన్నిటినీ పరిష్కరిస్తుందిలే" అని మౌనంగా ఉండిపోయాడు నంజుండయ్య. ఇది యిలా ఉండగా అక్కడ అనంతపురంలో

తమ్ముడు సరిగా చదవటం లేదని టీచర్లంతా నంజుండయ్యకి వార్తలు పంపిస్తున్నారు. తోటి టీచరాయె. ముందరగా చెప్పకపోతే, "చెప్పలేదేం" అంటాడేమోనని వాళ్ళు ముందునుంచే కబురు చేస్తున్నారు.

వారం వారం తను వెళ్ళి చూద్దామని మొదట్లో అనుకున్నాడుగాని, తనకు యిటు స్కూలు పనులు, అటు వ్యవసాయం పనులు పెరిగిపోయి కుదర్నే కుదరటం లేదు.

ఈ మధ్య నరసింహస్వామి తాతకు అనారోగ్యం చేసిన దగ్గరనుంచీ వ్యవసాయం పూర్తిగా నంజుండయ్య మీద పడ్డది. అయితే వారానికి ఒకటి రెండుసార్లు చెల్లెల్ని చూసి పోవటానికి సత్యమే వచ్చి పోతున్నాడు. వచ్చినపుడల్లా సరిగా చదువుకోమని కేకలేస్తున్న కొద్దీ అతను మొహం ముడుచుకోవటం, అన్నగారితో మాట్లాడటం తగ్గించటం మాత్రమే జరుగుతోందిగాని, సత్ఫలితం కనిపించటం లేదు. దీనికి గూడా పరిష్కార మేమిటో తోచటంలేదు నంజుండయ్యకు.

అయితే సత్యం మొహం ముడుచుకొంటున్నది, వరలక్ష్మి యిక్కడ వుండటం వల్ల కుటుంబంలో స్త్రీ వర్గంలో యేర్పడుతున్న విచారకర వాతావరణం గురించి మాత్రమేనని, అప్పటిలో నంజుండయ్యకు తెలీదు.

ఒక రోజున నంజుండయ్య తీరిక చేసుకొని అనంతపురం వెళ్ళాడు. తన తమ్ముడి చదువుగురించి స్కూలు ఉపాధ్యాయుల దగ్గర విచారించాడు. తమ్ముడి గురించి, తలోరూ తలో రకంగా చెప్పేసరికి ఈయనకు బుర్ర వేడెక్కి పోయింది.

"వీడు చదువుకు పనికొచ్చే మనిషి కాడయ్యా! తీసికెళ్ళి వైదికంలో, మీ నాన్న చేతికింద పారెయ్యి" అని కొందరంటే, "మీ వాడు మేధావయ్యా, సామాన్యుడు కాడు" అని కొందరన్నారు. మొదటి పక్షంవారికి సత్యం హోంవర్కులు, మార్కులే సాక్ష్యం. ఇక రెండో పక్షం వారు చెప్పే మాటలే చిత్రంగా వున్నాయి. అవి నమ్మాలో నమ్మక్కర లేదో తెలీక తికమక పడుతూ యింటికి వచ్చేశాడు నంజుండయ్య. ఇంటికి వచ్చేసరికి, సత్యం కందుకూరు వచ్చి వరలక్ష్మిని పరామర్శించి మళ్ళీ వెళ్ళబోతున్నాడు. అన్నను చూసి ఆగాడు.

'వీణ్ణి ఎల్లా పరీక్షించాలా'? అని ఆలోచిస్తూ ఇప్పుడే వస్తానుండరా అని లోపలికి వెళ్ళిపోయాడు నంజుండయ్య.

మళ్ళీ నంజుండయ్య బయటకు వచ్చేసరికి ఎవరో పెద్ద మనిషి వచ్చాడు. ఆ వచ్చినాయన ఏదో అప్పిమ్మని నంజుండయ్యని అడుగుతున్నాడు. ఇయ్యటానికి యిష్టంలేక ఏదో చెపుతున్నాడు ఆయన.

"మీకు అప్పు అనవసరమండీ" అన్నాడు సత్యం మధ్యలో కల్పించుకొని.

"అదేమిటి?" పెద్దమనిషి తెల్లబోయాడు.

"మీకు రావల్సింది వుందిగా, అది రేపొచ్చేస్తుంది" అన్నాడు సత్యం.

"నాకు రావాల్సి వుందని నీకెలా తెలుసు?" అనుమానంగా అడిగాడు పెద్ద మనిషి.

"ఎట్లా తెలిస్తే ఏమిలెండి, రేపు వస్తుందన్నానుగా, ఓపిక పట్టండి." తమాషాగా అన్నాడు సత్యం.

"డబ్బియ్యక పోయినా మంచి మాట యిచ్చి పంపిస్తున్నారు, సంతోషం." అని వెళ్ళి పోయాడాయన విసుగ్గా.

"బలే తెలివిగా నన్ను బయటు పడేశాడే! వీడు తెలివి తక్కువవాడని అనటం ఎలా?" అని ఆలోచనలో పడిపోయాడు నంజుండయ్య. మెల్లిగా సందు చూసుకొని జారుకున్నాడు సత్యం.

రెండు రోజుల తరువాత ఆ పెద్ద మనిషి బజార్లో కలిసి "మీవాడు బలే చెప్పాడండీ. ఆశ వదులుకున్న సొమ్ము ఆ మర్నాడే వచ్చింది" అన్నపుడు తికమకలో పడక తప్పలేదు నంజుండయ్యకు.

"ఇదేమిటి? అది తెలివిగా నన్ను చిక్కులోంచి తప్పించటం కాదా? అది ప్రశ్న చెప్పటమా? మన వంశంలో అఖండమైన జ్యోతిష విద్య వున్నమాట నిజమే. కాని అది నేర్చుకోవటం అంత సులభం కాదే. మహామేధావులకే అది పుష్కరకాల సాధన అంటారే. వీడికెలా సాధ్యమైంది. పోని యిది మిడతంభొట్లు జ్యోతిషమేమో" అని పరిపరి విధాల ఆలోచనల్లో పడిపోయాడు. నాలుగు రోజు లయినాక సత్యం కనిపించగానే, అడగనే అడిగాడు. "మొన్న ఆ అప్పు కొచ్చినాయనకు ఆ ప్రశ్న ఎట్లా చెప్పావురా?" అని.

"అది ప్రశ్న కాదు."

"మరి?"

"ముఖ పరిశీలన" (**Face Reading**)

"ఎవరి దగ్గర నేర్చావు?"

"మొహాలు చూస్తుంటే అదే తెలుస్తోంది"

"కొందరి పిల్లలకు హస్తరేఖలు చూచి ఏవో చెపుతున్నావటగదా!"

"చెయ్యి వెనక్కి తిప్పి నాడులు చూచి గూడ చెప్పొచ్చు"

"మనస్సులో ఏముందో గూడ చెపుతావటగా"

"వాళ్ళ పిచ్చి"

"వాళ్ళు పిచ్చివాళ్ళు ఎందుకవుతారు? నువ్వు చెపుతున్నావు. వాళ్ళు వినోదంగా వింటున్నారు. విని ఎవరి ప్రయత్నాల్లో వాళ్ళు వుంటారుగాని నువ్వు చెప్పావు గదా అని నిశ్చింతగా కూచోవటం లేదుగా"

"అది నిజమే."

" ఇంకొకరి మనస్సులో ఏముందో తెలుసుకోవాలని ప్రయత్నం మన కక్కరలేదు. మన మనస్సులో యేముందో మనకు స్పష్టంగా తెలిస్తే, అక్కడికి మహనీయులమే. అలాగే ఇతరుల దశ యెలా వుంటే మన కెందుకు? మన దశ మనకి తెలిక చస్తుంటే. "

" నా మనస్సులో ఏమీ లేనే లేదు. నా దశ తిరగటానికి ఇంకా పదేళ్ళు టైముంది. "

" ఇట్లా మాట్లాడుతున్నావు గనుకనే నిన్ను తిక్కస్వామి అంటున్నారు. "

" ........." (మౌనం)

"నీ దగ్గర తెలివుంది. కాని అది పక్కదార్లు పడుతోంది. పైగా పొగరు కాస్త కలుస్తోంది."

" ..........."(మౌనం)

" ఈ తెలివి, ఈ పౌరుషం, చదువులో ఎందుకు చూపించవు ?"

" నేను పాసవకపోతే అప్పుడడుగు. "

" అప్పుడింక నేనడిగే దేముంటుంది ? చూడప్పా, వచ్చినపుడల్లా అన్న పోరుతున్నా డనుకుంటున్నావేమో. ఈ మెరుగు విద్యలు కూడు పెట్టవు. బాగా చదువు. చదువుకుంటే మనకే మేలు గదా. " ఆ చివరి వాక్యం అన్నగారి పల్లవి. అది వచ్చిందంటే, ఇక ఆ రోజుకి పిరియడ్ అయిపోతుందని సత్యానికి బాగా తెలుసు. ఆ యేడు సత్యం పాసయ్యాడు. అయితే కేవలం అత్తెసరు మార్కులతో. ఏమీ అనలేక, అనకుండా వుండనూ లేక ఇరుకున పడ్డాడు నంజుండయ్య. తిక్కస్వామి ఐకండు ఫారంలోకి వచ్చాడు. అయినా అతని దినచర్య యథా ప్రకారంగానే సాగిపోతోంది.

ఆ యేడే వరలక్ష్మి పెద్ద మనిషైంది. వదిన లలితమ్మగారు ఏడు రోజుల పాటు రంగ రంగ వైభవంగా పేరంటాలు నడిపింది. వదిన ప్రేమకు వరలక్ష్మి పొంగిపోయింది. కొన్నాళ్ళు జరిగినాయి.

ఒకరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు మిడసరి ముహూర్తాన నరసింహశాస్త్రి గారు, బుజాన యాజ్ఞీకపు మూట వేసుకొని కందుకూరు వస్తున్నాడు.

ఇక వూళ్ళోకి ప్రవేశించబోతుండగా " నాన్నా " అని కేక వినిపించింది. ఇటూ అటూ చూస్తే 'ఇదు నాన్నా యిక్కడ' అని చింత చెట్టుమీద, కేరింతలు కొడుతోంది వరలక్ష్మి. తండ్రిని చూచిన ఆనందంలో పొంగిపోతోంది ఆ పిచ్చిపిల్ల.

" అదేమిటే, చెట్టెక్కావేమిటి ? '' ఆదుర్దాగా అరిచాడు శాస్త్రిగారు.

" చిగురు కోసం నాన్నా, పప్పులోకి "

" ఆడపిల్లవు, ఈడొచ్చిన దానవు. మిట్ట మధ్యాన్నపు వేళ, దయ్యాల వేళ చెట్లెక్కు తావా? బుద్ధి లేదూ, దిగు ముందు."

శాస్త్రిగారి అరుపులకు భయంవేసి, అసలు దిగలేకపోయింది వరలక్ష్మి. ఆయనే చేయి పట్టుకు దింపి " ఎందుకు చెట్టెక్కావు ?" అని గద్దించాడు మరోసారి.

"ఎక్కకూడదా ? చింతచిగురు తెమ్మని అంబమ్మవ్వ అంటేనూ ......" నసిగింది వరలక్ష్మి.

ఇంకేం, బీజాక్షర మంత్రం చెవిన పడింది. తక్షణం పూనకం వచ్చేసింది శాస్త్రిగారికి.

"అయ్, అంబమ్మత్త పనా యిది? ఎంత ద్వేషమైతే మటుకు ఇలా ఆడపిల్లని చెట్టెక్కిస్తుందా ? నే నడుగుతానుండు" అని రంకెలు వేసుకుంటూ, వరలక్ష్మిని రెక్క పుచ్చుకొని బర బర లాక్కొంటూ ఇంటికి వచ్చాడు.

దైవానుగ్రహంవల్ల అంబమ్మగారు యింట్లో లేదు. కోడలు లలితమ్మ మామగార్ని శాంతపరచి భోజనం వడ్డించింది. ఈ లోగా అంబమ్మగారు ఇంట్లోకొచ్చినట్లుంది. మంచంలో వున్న నరసింహస్వామిగారు ఆవిడతో ఏమో చెప్పారు. ఆవిడ రింయ్యిమంటూ వంటింట్లోకి వచ్చింది. అప్పటికి శాస్త్రిగారు ప్రాణాహుతులు వేసుకొంటున్నాడో, వేసుకోబోతున్నాడో అంతే! ఇంక ఆవిడేమందో, ఈయన ఏమన్నాడో యెవరికీ అర్థంకాలేదు. కొద్దినిముషాల పాటు ఆ యింటి వాసాలు అల్లల్లాడినాయి. ఆపై పెంకులు ఎగిరి పడ్డాయి. దొడ్లో చెట్లమీది కాకులు ఎగిరి పోయాయి. శాస్త్రిగారు చేతిసంచులు గూడ వదిలిపెట్టి అంటుచేత్తోనే లేచి వెళ్ళిపోయాడు. అసహ్యాకరమైన యీ సంఘటనకు నంజుండయ్య చాలా నొచ్చుకున్నాడు. అంబమ్మగారికి యిదంతా వరలక్ష్మి పెడుతున్న పుల్లవిరుపులు, పుల్లింగాలు అనే విశ్వాసం కుదిరిపోయింది. లలితమ్మగారు గూడ వరలక్ష్మిని కొంచెం అనుమానించక తప్పలేదు.

ఈ దుష్ట పరిణామం గమనిస్తున్న సత్యం మనస్సులో మథనపడసాగాడు. చెల్లెలు పరిస్థితి బాగా లేదు. అంతకు మించి తమ యిద్దరివల్ల అన్నగారి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా వుంది. కాని ఏమిటి మార్గం ? అదే అర్థం కావటంలేదు.

రోజులు గడుస్తున్నాయి. ఈమాటు గూడ అత్తెసరు మార్కులతోనే పాసయ్యాడు సత్యం. కానీ మనస్సుకు తృప్తిలేదు, హాయిలేదు. మనస్సు మరీ వికలంగా వుండి పొద్దుటూరులో బాలసుబ్రమణ్యానికి, చంద్రుడికి ఉత్తరం రాస్తూ ఇల్లా అనుకున్నాడు సత్యం.

"ఆ సాధనకీ, ఈ సాధనకీ ఎంత వ్యత్యాసం !!"

ముష్టెత్తుకు తిన్న రోజులవి. పరాయి కొంపల్లోపడి దొర్లిన రోజులవి. కాని అక్కడ అన్ని దిక్కులనుంచీ ప్రేమ అమృత వర్షంలాగా వర్షించింది. పైగా సాధక మండలి అమరింది. ఇక్కడ అన్న సమృద్ధి వుంది. నాదని అధికారం చూపించగల నివాసం వుంది. కానీ యిదంతా అచ్చమైన అగ్ని సముద్రంలా వుంది. మానసిక త్రేతాగ్నులలో, భావనామయ పంచాగ్నులలో నిలబడి సాధన జరిగింది పూర్వం. కానీ ఈ నిరంతర కల్లోల జీవన బడబానలంలో నిలబడి నవ్వుతూ సాధన చేయగలగాలి. కాదు, స్వస్థుడై వుండగలగాలి. స్వస్థత చిక్కిందా ?

ఇంకా కొంత వ్యవధి వున్నట్టే వుంది. కాని యీలోగా మన సాధన కోసం ఆ గృహస్థు నలిగిపోతున్నాడే!

"ఏమో అమ్మ ఏమి సంకల్పించిందో, నాకెందుకు?" కమ్మని నిద్ర పట్టింది సత్యానికి. ఆ తరువాత మరో ఆలోచన రాలేదు. స్కూళ్ళు తెరిచారు. తను థర్డ్ ఫారంలోకి వచ్చాడు. ఒక రోజు అన్నగారింటికి వెళ్ళి వచ్చాక వెనకాలే కబురు వచ్చింది. "చేతి వాచీ, ఉంగరాలూ తెచ్చావా" అని.

నవ్వుకుని అమ్మకో దణ్ణం పెట్టి సరాసరి అన్నగారింటికి వెళ్ళాడు. ఇతన్ని చూస్తూనే "నువ్వు పాసయ్యావు. నేనే నీ కీ వాచీ యిద్దామనుకున్నా, తొందరపడ్డావు" అన్నాడా అన్న. బుద్ధులు చెప్పింది వదినగారు. సత్యాన్నీ, అతని తండ్రినీ, మరికొన్ని తరాల్నీ కలిపి తూర్పార బట్టింది అంబమ్మవ్వ. వలవలా ఏడ్చింది వరలక్ష్మి. తల వంచుకుని వెనక్కి వచ్చే శాడు సత్యం. అవమానంతో తల వంచుకున్నాడనుకున్నారు అంతా. కాని, అతను తలను తల లోపలి తలను బాగా వంచి, తన గుండెల్లో యే మూలయినా ద్వేషరేఖ యిరికి వుందేమో అని వెతుక్కుంటున్నాడని వాళ్ళకు తెలియదు.

నాలుగు రోజులు పోయాక, అంబమ్మగారు యింట్లో లేని సమయంలో ఆవిడ పెట్టి సోదా చేసి పోయినవన్న ఎస్తువులన్నీ ఆవిడ పెట్టెలో వున్నాయని కనిపెట్టి, ఆ విషయం అన్నగారి యెదుట ఋజువు చేసింది వరలక్ష్మి. ఏమి చెయ్యాలి నంజుండయ్య? తనను పెంచి పెద్ద చేసింది. వయోవృద్ధురాలు. ఏమనగలడు ఆవిడను? ఎలా తల ఎత్తగలడు తమ్ముడి దగ్గర? ఎంత ఆలోచించినా అన్నగార్ని ఓదార్చే మార్గమే దొరకలేదు సత్యానికి. ఇలా వుండగా నరసింహస్వామివారికి అనారోగ్యం పెరిగింది. దీనివల్ల యింట్లో పని మరీ తొక్కిసలాటగా వుంది. సందట్లో సందడి వరలక్ష్మి కుడిచేతికి తేలు కుట్టింది. పెద్ద శోకాలు మొదలెట్టింది వరలక్ష్మి.

అది వట్టి నటనేనని, పని ఎగగొట్టటానికి ఎత్తుగడ అనీ తీర్మానించి దండించింది అంబమ్మవ్వ. దాంతో ఏడవటానికి గూడ వీలులేక నోరు నొక్కుకొని యమ యాతన పడుతోంది వరలక్ష్మి. సరీగా ఆ సమయానికి పిడుగులా దిగాడు సత్యం. వరలక్ష్మి అన్నను చూట్టంతో మీదపడి బావురుమని ఏడ్చింది. తన గోడు చెప్పుకుంది. తండ్రికి రావలసిన పూనకం ఆ రోజు సత్యానికి వచ్చింది. ఎన్నడూ లేని ఘీంకారాలూ, గర్జనలూ మొదలైనాయి. అన్నగారు వచ్చి సద్ది చెప్పినా ఆ పూనకం ఆగలేదు.

"నా చెల్లెల్ని పనిపిల్లగా చూస్తున్నారు, బానిసగా చూస్తున్నారు, చంపాలని చూస్తు న్నారు. మేం క్షణం యిక్కడ వుండం. ధాం...ధూం .." ఇదీ పూనకానికి సారాంశం. ఎన్నడూ లేని మార్పు వాడిలో ఎందుకొచ్చిందో అర్థం కాలేదు నంజుండయ్యకు.

"సరే నాన్నకు కబురు చేస్తాలే, ఆయన్ను రానీ" నంజుండయ్య తన వాయిదా అస్త్రం మరోసారి ప్రయోగించాడు.

"సరే, నాన్నను రానీలే. నేను మాట్లాడతాను. ఈ లోపల యిది నోట్లో వేసుకో" అని ఒక మందు పొట్లం వరలక్ష్మి కిచ్చేసి చరాచరా వెళ్ళిపోయాడు సత్యం.

వాన వెలిసింది. "హమ్మయ్య" అనుకున్నాడు నంజుండయ్య.

"అరే అప్పుడే తగ్గిపోయిందే" అనుకొంది వరలక్ష్మి, నోట్లో మందు వేసుకున్నాక నీళ్ళు తాగుతూ.

"అన్న వచ్చి వెళ్ళేసరికి దీని తేలు విషం దిగిపోయింది. చూడు దొంగవేషాలు" అని నసిగింది అంబమ్మగారు.

ఆ తరువాత కొద్దిరోజులకే, నరసింహశాస్త్రిగారు వచ్చాడు. కాని ఆయన వచ్చింది తన మేనమామ నరసింహస్వామిగారికి దహనసంస్కారం చెయ్యటానికి. నరసింహస్వామికి పుత్ర సంతతి లేనందువల్ల, కర్తవ్యం నంజుండయ్య మీద పడటంవల్ల, ఆ కర్మలన్నీ శాస్త్రిగారే శ్రద్ధగా చేశాడు.

ఆ సందట్లో సందడి, సత్యం వచ్చి తండ్రివద్ద కొద్ది మోతాదులో గోల చేశాడు. ఆయన పెద్ద పట్టించుకోలేదు. "మనుష్యులంటే పోట్లాడుకుంటూ వుంటారు. పోనీరా" అన్నాడు. సత్యం బుస్సుమని లేచి "నేను మాత్రం యిక్కడ క్షణం వుండను" అన్నాడు. "పోతే పో" అన్నాడు శాస్త్రిగారు కర్మ సందట్లో.

అంతే! సత్యం సంతోషంగా సరాసరి రైలు స్టేషనుకి వెళ్ళాడు.

* * *

## ప్రేమజయం

బెంగుళూరు బండికి యింకా టైము వుందన్నారు. ప్లాటుఫారం అంతా ఖాళీగా వుంది. గేటు దగ్గర ఎవరూ లేరు. ఉన్న కొద్దిమంది జనం ఇటూ అటూ స్వేచ్ఛగా తిరుగుతున్నారు. సత్యం గూడ కాలక్షేపానికి యిటూ అటూ తిరగసాగాడు.

లోపలి ప్లాట్‌ఫారం మీద తిరుగుతూ వుండగా ఒక సిమెంటు బెంచీ మీద ఒక పెద్ద మనిషి సత్యం కళ్ళకు నదరుగా కనిపిస్తున్నాడు.

ఆయన నడివయస్సు బాగా దాటినవాడు. స్ఫురద్రూపి. పంచకట్టు, కోటు, ఉంగరాలు వగైరా అలంకారాలు ఆయన మంచి సంపన్నుడనే చెపుతున్నాయి. ఆయన నుదుటి మీద కుంకుమబొట్టు మంచి మెరుగ్గా వుంది.

ఓరకంట ఆయనను చూస్తూ నడుస్తున్నాడు సత్యం—"చూస్తే లౌక్యుడుగా వున్నాడు. కాని స్థాయి గలవాడు లాగా వున్నాడు" అనుకుంటూ.

అటు వెళ్ళి యిటు వస్తూ దగ్గర కొచ్చేసరికి "సత్యనారాయణా" అని పిలిచాడు ఆయన ప్రేమగా.

"నువ్వు నాకు తెలుసులే. ఇటు రా, మనం చుట్టాలం" అన్నాడాయనే, ఆశ్చర్య పోతున్న సత్యంతో.

"మనం చుట్టాలమా" అంటూ దగ్గర కెళ్ళాడు సత్యం.

"అవును, జయలక్ష్మి కొడుకు నాకు చుట్టం కాక ఏమవుతాడు ?"

"మా అమ్మ మీ కెట్లా చుట్టం ?"

"మనం అంతా ఒక అమ్మ బిడ్డలం కాదా ?"

"అంటే"

"అంటే నీకు తెలుసులేగాని, నీకు దశవిధ నాదాలూ బాగా వినిపిస్తున్నాయి గదూ ?"

"............" (మౌనం)

"ఆ నాదాలను సంగీతంగా వ్యక్తీకరించాలని ప్రయత్నిస్తున్నావు గదూ ?"

"తప్పంటారా ?"

"తప్పు కాదు గానీ, నీ స్థూల శరీర స్వరపేటికకు ఇంకా కొంత వయసు వచ్చి ముదిరితే గాని ఆ పరిపాకం రాదు. తొందర పనికి రాదు."

"శ్రీవిద్యలో మీది ఏ సంప్రదాయం ?"

"అన్ని సంప్రదాయాలూ ఒక చోటికే చేర్తాయి గాని, ముందిది చెప్పు. శ్రీవిద్యకీ, అద్వైతానికీ ముడి పెట్టాలని ప్రయత్నిస్తున్నావు గదా! అదెందుకు లేనిపోని తల నొప్పి పని ?"

"ఆదిశంకరులు శ్రీవిద్యోపాసన చెయ్యలేదంటారా?"

"చేశార్లే, వారు నీకు మల్లే మధ్యలో లంబికాయోగం, హఠయోగం అనలేదుగా!"

"ఇంతేనా, నా గురించి మీ రింకేమయినా చెప్ప గలరా?"

"మీ అమ్మ చెప్ప గలిగినంత వరకూ, నేనూ చెపుతాను."

"చెప్పండి."

"అజ్ఞకూ, సహస్రారానికీ మధ్య తిరుగుతున్నావు. సృష్టిలయములు, పరచిత్త వేదిత్వము, త్రికాలజ్ఞత, సూక్ష్మలోక దర్శనము పూర్తిగా సిద్ధించినాయి. సిద్ధ సంకల్పత, సర్వవ్యాపిత, ఈశిత్వ, వశిత్వాలు కొంచెం కొరవడి వున్నాయి. సరిపోయిందా ?"

"మీరు సామాన్యులు కారు. నన్నాశీర్వదించండి."

"అది సరేగాని, నా గురించి నువ్వేం చెప్పవేం ?

"చెప్పమంటారా ?"

"చెప్పు"

"చెపుతాను, మీ ఆజ్ఞ తిరుగులేనిది గదా!"

" బలే మాట చమత్కారం సాధించావే. ఆజ్ఞ దాటి పైకి పోదామని ఉందికాని దానికి ఒకటే ఒక చిక్కు వచ్చింది."

"ఏమిటది?"

ఇంతలో పళ్ళ రసం అమ్మకానికి వచ్చింది. ఒక చిన్న గ్లాసెడు రసం ధర పది రూపాయలు. ఆయన ఆ రసం కొని ఆప్యాయంగా తాగించాడు. తిను నాయనా అంటూ దగ్గర కూర్చోబెట్టుకొని మామిడిపండు ముక్కలు స్వయంగా కోసి తినిపించాడు. ఐస్‌క్రీము తినిపించాడు. ఆ మండు వేసంగిలో ఐస్‌క్రీము తిని, నిలువునా ఐస్ అయిపోయాడు సత్యం. ఆయన ప్రేమకు పులకించిపోయాడు.

"ఇందాక ఏదో సాధన విఘ్నం గురించి చెపుతున్నారు."

"అవును. మనకి కర్తవ్యాలు రెండున్నాయి, నా సిద్ధాంతంలో."

"ఏమిటవి?"

"మన స్వయంసాధన ఒకటి, లోక ధర్మరక్షణ రెండవది."

"బాగుంది"

"అందులో నా విషయంలో, లోక ధర్మరక్షణ విషయంలో ఒ చిక్కు వచ్చి పడ్డది."

"ఏమిటది?"

"నా కథ కొంచెం చెపుతాను. వినుకోవ్కి, వింటావా బాబూ!"

"జన్మచేత నేనొక కోటీశ్వరుణ్ణి. బొంబాయిలో పెద్ద వ్యాపారస్థుణ్ణి. వ్యాపారంలో నేను సమర్థుణ్ణి గూడా. నాకు చాలా రకాల వ్యాపారా లున్నాయి. అసలు ఒక స్థాయి దాటాక వ్యాపారం దానంతటదే వృద్ధి పొందుతుంది. నా స్థితి అదే.

మా యింట్లో వంశ పరంపరగా దేవీ నవరాత్రి కలశ స్థాపన ఆచారం వుంది. ఏ జన్మ సంస్కార బలమోగాని ఆ కలశపూజ నా కౌమార వయస్సులో నన్ను ఉద్రూత లూగించేది.

ఆ రోజుల్లోనే, నా జన్మ జన్మల భాగ్యాలూ పండి మా ఇంటికొక స్వాములవారు వచ్చారు. వారి పేరు కరపత్రస్వామి వారట. వారు చేతిలోనే అన్నం వేయించుకు తినేవారు. ఆయన కెందుకో నామీద అపార కరుణ కలిగింది. వారు నాకు శ్రీవిద్యా దీక్ష అనుగ్రహించారు.

ఆ రోజుల్లో బాల్య వివాహాలు గనుక, నాకప్పటికే వివాహ మయింది. అయితే మా శ్రీగురువుల కృపవల్ల అమ్మతో అంతర్గత తాదాత్మ్యం చెంది, నేనే ఒక స్త్రీనయి ఉన్న నాకు మరో స్త్రీతో ఐహిక ప్రయోజనాలేవీ లేకపోయినాయి.

అయినా ఆ మహా పతివ్రత, త్రికరణ శుద్ధిగా నాకు పరిచర్య చేసి, నా ఉపాసనా కార్యక్రమాలకు ఎంతో దోహదం చేసింది. ఆ తరువాత నా తల్లిదండ్రులు గతించినాక వ్యాపారాల బాధ్యతలు నామీద పడ్డాయి. అయినా అంతర్యాగం నిరంతరంగానే సాగిపోతోంది. ఇలా ఉండగా ఒకరోజున ఒక పురాణ పండితుడు మా ఇంట్లో ఒక పురాణ కథ చెప్పాడు.

అగస్త్య మహర్షి ఒక రోజున ఒక మహారాజు దగ్గరకు వెళ్ళి, నీ కూతురును నాకిచ్చి వివాహం చేయమని కోరాడట. తన కూతురు ఒక్కర్తె క్షేమం ఆలోచించి, మహర్షిని నిరాకరిస్తే ఆయన కోపంవల్ల రాజ్య ప్రజలంతా ఇక్కట్ల పాలవుతారని ఆలోచించి, ఆ రాజు, గుండె రాయి చేసుకొని తన కూతురు లోపాముద్రాదేవిని, పదేళ్ళ పసికూనను ఆ ముసలి ముని చేతిలో పెట్టాడుట. అగస్త్యమునీంద్రులు ఆ పిల్లను పెళ్ళిచేసుకొని, తక్షణమే తన ఆశ్రమానికి తీసుకువెళ్ళి పోయారట. అలా తీసుకువెళ్ళి, తక్షణమే ఆమెకు హస్త మస్తక సంయోగవిధిపూర్వకంగా తపోదీక్ష అనుగ్రహించారట. ఆ తల్లి తక్షణమే, సమాధి సిద్ధిని పొంది పదివేల సంవత్సరాలు సమాధిలో వుండిపోయారట. ఆ తరువాత ఆమెకు సంతానం పొందే అర్హత వచ్చిందని గ్రహించిన అగస్త్యమునీంద్రులు ఆమెకు, "బృహద్వ్రతుడు" అనే మహర్షి సత్తముడిని పుత్రుడుగా అనుగ్రహించారుట. ఆ మహనీయుడు మౌంజీ యజ్ఞోపవీత, దండకమండలధారియై తల్లి గర్భంలోంచి అవతరించారట! ఆ సత్పుత్ర జననంతో, పితృఋణం తీరిన వెంటనే ఆ పుణ్య దంపతులు వానప్రస్థాశ్రమం స్వీకరించారట. ఇదీ ఆ పండితుడు చెప్పిన కథ.

ఇది విన్నాక నాకొక కోరిక పుట్టింది. ఇంత ఆస్తిని దుర్వ్యసనపరులైన దూరపు దాయాదులకు వదిలి గతించటం కన్నా, ఆ మహర్షివలె ఉత్తమ సంతతిని పొంది, మన ఉపాసనా సంప్రదాయాన్నీ, పితృపైతామహమైన ఆస్తినీ గూడ పై తరాని కందించి వెళ్ళటం మన ధర్మమని. అందువల్ల నేనుగూడ ఒకరోజున, ఉత్తమశీల అయిన నా భార్యకు హస్తమస్తక సంయోగం చేసి, శక్తిపాత విధానంతో దీక్షా సంక్రమణం చేశాను. అంతా బాగానే జరిగింది కాని, తీవ్రతరమైన ఆ శక్తి సంచారాన్ని సహించలేక ఆ మరునాడే ఆ శరీరం శిథిలమైపోయింది. శిథిలమైన ఆ శరీరాన్ని శక్తిసంపన్నుడైన ఆ జీవి, తిరస్కరించి పరిత్యజించి యెగిరిపోయాడు.

నేను దిగ్భ్రమచెంది నిస్త్రాణపడిపోయాను. ఆదెబ్బనుంచి తట్టుకొని, మళ్ళీ యిలాంటి మామూలు స్థితికి రావటానికి పది సంవత్సరాలు పట్టింది. ఇలాంటి స్థితిలో నేను గట్టిగా కృషి చేసి, పద్మాటవిలో స్థిరనివాసం పెడితే, ఈ లోకధర్మం ఏమైపోవాలి? ఈ ఆస్తి అంతా ఆ దౌర్భాగ్యపు దాయాదుల చేతిలో పడి వ్యసనశాలల పాలు కావలసిందేనా? అదీగాక సంతానార్థమై నాలో కలిగిన సంకల్పం, మొక్కపోయి నిలచిపోతే, ఆ సంకల్పం సంస్కారమై, పరమ చరమ సిద్ధికి భంగకరం కావచ్చు. అందుకోసమే, అమ్మను అనేకసార్లు ప్రార్థించాను, "అమ్మా ఒక సుపుత్రుణ్ణి ఎత్తు యిప్పించుమ తల్లీ" అని. సేటుగారు ఒక క్షణం ఆగారు.

"ఏమంది అమ్మ?" అన్నాడు సత్యం ఆదుర్దాగా.

"ఇదిగో చూపించిందిగా ముద్దుబిడ్డని" అని సత్యం రెండు చేతులూ తన చేతిలోకి తీసుకొని, కళ్ళ కద్దుకొని ప్రేమగా ముద్దుపెట్టుకొన్నాడు సేటు.

ఆయన రెండు కళ్ళలో రెండు నీటిబొట్లు ఉయ్యాల లూగుతున్నాయి. సత్యం వళ్ళు పులకించి పోయింది. నాలుగేళ్ళనుంచీ నా అన్న ఆదరణ లేక, నాయనా అని పలకరించిన ఆప్యాయత లేక, నువ్వు బ్రతికే వున్నావా అని విచారించే నాథుడు లేక, వూరి సంతలో గూడ యీ జీవి ఎవరా అని విచారించే దిక్కు లేక అలమటిస్తున్న ఆ పసి ప్రాణం ఈ అంతులేని ఆదరణ చూసి, అకారణమైన అనురాగం చూసి, అవ్యాజమైన బంధుత్వం చూసి, నిష్కల్మషమైన ఆ కన్నీళ్ళు చూసి, ప్రేమ పొంగులెత్తుతున్న ఆ స్పర్శ చూసి—— గాలిలో తేలిపోయింది. మబ్బుల్లో కేరింతలు కొట్టింది. చుక్కల్లో చిందు లేసింది.

"బాబూ నువ్వెట్లాగూ యింట్లోంచి లేచిపోయి వస్తున్నావుగా! ఆ అమ్మ నిన్ను వొదిలి పోనే పోయిందిగా! ఉన్న నాన్న, పోతే పొమ్మన్నాడుగా! అమ్మనూ గాక, నాన్ననూ గాక అలమటిస్తూ ఉన్న నన్ను, యీ అల్పజీవిని అనుగ్రహించరాదా ?"

ఖేచరీ విద్యలో ఆస్వాదించిన ఆ అమృతబిందువులకు గూడ యీ తీపి లేదేమో.

"లక్ష్మీ సరస్వతులు నీ చెల్లెళ్లు. వాళ్ళ పెళ్ళిళ్ళు వైకుంఠ వైభవంగా బ్రహ్మానందంగా చేద్దాం మనిద్దరం కలసి."

ఇక చాలు ! సత్యం హృదయం కరిగి కన్నీరై ప్రవహిస్తోంది.

అమ్మ సంప్రదాయం వాడు, శ్రీ విద్యాసిద్ధుడు, సాధువు, ధర్మతత్పరుడు, అన్నింటికీ మించి ప్రేమపూర్ణుడు, ఇక సందేహమెందుకు ? అదే సత్యం హృదయంలో స్పందిస్తున్న నాదం.

ఆ సేటుగారు ఒక నౌకర్ని పంపి ఫస్టుక్లాసు టిక్కెట్టొకటి తెప్పించాడు. ఇంతలో బొంబాయి రైలు వస్తోందని మైకుల్లో కేక పెట్టారు. తల తిప్పేలోపల బుసబుస ఆవిర్లు పొంగి పోతూ రైలు రానే వచ్చింది. వస్తూనే రెండో ఆలోచనకు సందివ్వకుండా సత్యాన్నీ, సేటునీ చంకనేసుకుని దౌడు తీసింది.

రైల్లో ఇద్దరూ శ్రీవిద్యా మర్మాలనేకం ముచ్చటించుకున్నారు. కొంతసేపయినాక సేటుకి నిద్దర పట్టింది.

సత్యం కిటికీ దగ్గర కూర్చునే ఆనందంగా కునికిపాట్లు పడుతున్నాడు.

రైలాగిన కుదుపుకి సత్యానికి మెలకువ వచ్చింది. ఏ వూరబ్బా అనుకుంటూ కిటికీ లోంచి యిటూ అటూ చూశాడు.

పసుపుపచ్చ బల్లమీద పెద్దపెద్ద యెర్ర అక్షరాలు కనిపించాయి. "గుంటకల్లో" అక్షరాలు

"ఏమిటీ, గుంటకల్లా ? "

అంతే, గుంట—కల్లు అన్నమాట.

అంతే గుంటరాయి.

"ఓహో లోయ అన్నమాట"

"ఇదేమిటి?"

సత్యం కళ్ళు అప్రయత్నంగా మూతలు పడ్డాయి. అమ్మ!

అమ్మ, పెద్ద కొండవాలున నిలబడి తనవంక గుడ్లురిమి చూస్తోంది.

కళ్ళు తెరిచాడు సత్యం.

"సత్యా, నేను నీకు ఉపదేశించిన సూక్తు లేమిటి? నువ్వు చేస్తున్న దేమిటి?

"నీ సేటు ఆస్తి బాగుపడుతుంది. నీ చెల్లెళ్ళ కల్యాణా లవుతాయి. మరి నీ లోకకల్యాణ దీక్ష మాటేమిటి?" అమ్మగొంతు, చెవిలో నూరుమోగుతోంది.

"అమ్మా" అని ఒక వెర్రికేక పెట్టబోయి నోరు నొక్కుకొని, గొంతు పినుకొని ఆ అరుపు నాపుకున్నాడు సత్యం.

ప్రక్కకు చూశాడు.

ప్లాటుఫారం వెనక్కు పోతోంది. కాదు, రైలే ముందుకు పోతోంది. అమ్మో ఇక టైములేదు. ఒక్క ఉదుటున లేచాడు. మరో ఉదుటుకు, రైలు పెట్టె తలుపు లోంచి క్రిందకు వురికాడు.

పదడుగులు రైలువెంట పరిగెత్తి రొప్పుతూ ఆగాడు సత్యం. అప్పటికి ప్లాట్‌ఫారం అయిపోయి రైలు బద్దీల దగ్గరకు వచ్చి వున్నాడు.

"అమ్మా రక్షించావమ్మా రక్షించావు? నన్ను క్షమించవమ్మా. మళ్ళీ యీ తప్పు చేయను. అపారమైన దివ్య ప్రేమను ఆస్వాదిస్తూ గూడా అల్పమూ, తుచ్ఛమూ అయిన మానవ ప్రేమకు అర్రులు చాచాను. మళ్ళీ యీ తప్పు చేయనమ్మా. క్షమించు."

ఆ ప్లాట్‌ఫారం మీద సాగిలపడి అమ్మకు నమస్కరించుకొన్నాడు సత్యం.

జేబులో వున్న కొద్దిపాటి డబ్బుతో టిక్కట్టు కొనుక్కొని తిరుగు రైల్లో అనంతపురం వెళుతూ ఆలోచించుకున్నాడు సత్యం.

"ఈ మనుష్యులు అల్పులు. అలా అయితే వీళ్ళు చూపే ప్రేమగూడా అల్పమే. వారి ప్రేమ అల్పమైనపుడు, వారి ద్వేషం అల్పం కాకుండా పోతుందా? మరి అల్పులు చేసే అవమానాలు అల్పమైనవి కావా యేమిటి? అలాగే వారి సన్మానాలూను. అలా అయితే, యీ అల్పుల ఆదరణకూ, తిరస్కారానికీ విలువ యిచ్చి, ఎగుడు దిగుడులు పడుతున్న నేనెంత అల్పుణ్ణి కావాలి? ద్వేషము, ప్రేమ ఇవి రెండూ ఒక నాణేనికి రెండు వైపులు. వీటిలో దేనికి

ఓడిపోయినా రెంటికీ ఓడిపోయినట్టే. నేను ద్వేషాన్ని జయిద్దామని ప్రయత్నించానేగాని, ప్రేమను జయించాలన్న ఆలోచనే ప్రసరించలేదు. సరే ఇక ప్రయత్నిస్తాను.

కొత్త సాధనకు కొత్త చోటు. అందుకే కాబోలు స్థాన చలనానికి అనుకూలమైన ఘటనలు ఏర్పరుస్తోంది అమ్మ. కానీ, అలాగే కానీ,"

మనస్సులో బండరాయివంటి నిశ్చయం చేసుకొన్నాడు సత్యం.

## సాధన

ఆ నిండు వేసంగి మే నెలలో ఈ అస్తవ్యస్తపు ప్రయాణంవల్ల దాహంతో గొంతు ఎండుకు పోతుండగా సత్యం ఇల్లు చేరాడు. అప్పటికి సాయంత్రం నాలుగు కావస్తోంది.

వస్తూనే మంచినీళ్ళ కోసం ఆత్రంగా కుండ దగ్గరకు వెళ్ళాడు సత్యం. అది ఖాళీగా ఉంది. "పంపొచ్చే వేళయింది కదరా! నీళ్ళు తీసుకు రావాలి" అన్నాడు అరకునుకు లాగిస్తున్న మిత్రుడు.

అవసరం తనదిగా, తనే కుండ పుచ్చుకుని పక్కింటి సంపు దగ్గరికి బయలుదేరాడు సత్యం. అక్కడ ఇంటివారు పంపు దగ్గర బట్టలు ఉతుక్కుంటున్నారు.

"గొంతు ఎండుకు పోతోంది. కాసిని నీళ్ళు పట్టుకోనీండి'' అన్నాడు బతిమాలుడుగా సత్యం.

"పంపేం నీ అబ్బ సొమ్మా? ఏమిటా తొందర?'' అదీ అవతలి వారి సంస్కారం.

అనంతపురం నీటి యెద్దడికి పేరుమోసిన ఊళ్ళల్లో ఒకటి. అక్కడ బావులు తవ్వితే ఓ పట్టాన నీళ్ళు పడవు. కనీసం నలభై అడుగుల లోతు పోకపోతే నీళ్ళు పడే ప్రసక్తే లేదు. ఆ నీళ్ళు గూడ వేసవికాలం వస్తే ఉంటాయని నమ్మకం లేదు.

ఇక మునిసిపాలిటీ వారి పంపుల్లో మాత్రం నీళ్ళు రావాలంటే ఎక్కడనుంచి వస్తాయి? అందుకనే ఆ పంపుల్లో గూడ పరిమితంగానే నీళ్ళు వదులుతారు. అందువల్ల పంపులున్న ఇళ్ళ వాళ్ళు చిన్నసైజు ప్రభువులు. వారేమన్నా యితర పురుగులు పడి తీరవలసిందే. అదీ ఆ ఇంటివారి ధోరణి.

అసలే ప్రయాణపు విసుగుమీద ఉన్నాడేమో, సత్యం గూడ కొంచెం విసుక్కున్నాడు.

"ఈ జన్మలో కనీసం నీళ్ళయినా దానం చేస్తే, వచ్చే జన్మలో...... " సత్యం మాట యింకా పూర్తి కాలేదు.

"నోర్మూయ్...." అన్నాడాయన.

దాంతో మాటా మాటా పెరిగింది.

"చూడండి, మీ యింటికి నీళ్ళకి ముష్టికి వస్తున్నారు గనుక, ఈ జనమంతా మీ ముందు పురుగులయ్యారు. సరే, రేపు తెల్లారేసరికి పదిమంది సంతోషంగా నీళ్ళు తాగుతుంటారు

ఏమిటో మీ కళ్ళతో మీరే చూద్దురుగాని " అని చేతిలో ఉన్న కుండ అక్కడే బద్దలుకొట్టి వెళ్ళిపోయాడు సత్యం.

ఇత నన్నదేమిటో ఆ పంపాయనకు సరిగా అర్థం కాలేదుకాని, మరో రెండు గంటలయ్యే సరికి వో ఏడెనిమిది మంది విద్యార్థులు పలుగులు, పారలు పుచ్చుకొని సత్యం నాయకత్వంలో బావి తవ్వుతున్నారని తెలిసి పగలబడి నవ్వాడు.

ఆ బావి తవ్వుతున్న వాళ్ళల్లో హంపాపురం వారి పిల్లలు గూడ వున్నారు. కొంత సేపయినాక, యిరుగు పొరుగు పెద్దలంతా పోగయ్యారు.

" అబ్బాయిలూ ఏమిటీ వెర్రి? బావి తవ్వటమంటే సామాన్యమా? అందులోనూ అనంతపురంలో. అసలు ముందు భూమిలో జలధార వుందో లేదో నిర్ణయించుకోవాలి. దానికి మన పాత శాస్త్ర పద్ధతులు వున్నాయి. లేదా క్రొత్త సైన్సు పద్ధతులూ వున్నాయి. ఆ తరువాత తవ్వకం లోపలికి పోయిన కొద్దీ కష్టం వుంది. వొళ్ళు మోటు తేలిన వడ్డి వాళ్ళకే వారం పదిరోజులు పడుతుంది. ఇక్కడ కనీసం నలభై అడుగులు తవ్వందే నేల తడైనా తగలదు. మీ వల్ల కాదు. లేనిపోని సాహసాలు వద్దు " అని హితబోధ సాగించారు.

" మీ కెందుకు సార్, రాత్రి 12 గంటలకు వచ్చి చూడండి" అని కొందరికి, " రేపు తెల్లారేసరికి బిందె పుచ్చుకొచ్చెయ్యండి" అని కొందరికి చమత్కారంగా సమాధానాలు చెప్పుతున్నాడు సత్యం.

పద్యాలు, పాటలు, భజనలు, హాస్యాలు రంగరిస్తూ అనుచరులను అనుక్షణం హుషారు చేస్తున్నాడు.

అదేం మాయో, మంత్రమోగాని, ఎవడికి వాడు నీళ్ళు పడేదాకా " అన్నం ముట్టం " అని టకటకా తవ్వి పారేస్తున్నారు.

చెమటలు కక్కుతున్నారు. నీళ్ళు తాగుతున్నారు. అంతేగాని ఏ వొక్కడూ అలసట అనడే ! పని ఆపడే !!

అర్ధరాత్రి దాటిన దగ్గర నుంచీ ఉత్సాహం పెరిగిపోయింది. సత్యం పాటలు తారస్థాయి అందుకుంటున్నాయి.

తెల్లవారు జామున నాలుగయింది. అప్పటికి 25 అడుగుల బావి తవ్వారు. బల్ల పరచినట్లు తెల్లని పలుగురాయొకటి చక్కగా బావి అంతమేర వెన్ను విరుచుకొని పడుకుని వుంది. మిత్రుల్లో ఉత్సాహమంతా ఒక్కసారి నీరై పోయింది.

అలాంటి రాయి తగిలిందంటే, ఇక ఆ గుంట పూడ్చెయ్యటం తప్ప గత్యంతరం లేదు.

తమని తాము నిందించుకునేందుకుగాని, సత్యాన్ని నిందించేందుకుగాని ఓపికకూడ లేక యెక్కడివారక్కడ వేళ్ళాడిపోయి వూరుకున్నారు.

సత్యం మాత్రం పైకెక్కి యింట్లో కెళ్ళి ఒక కొబ్బరికాయ తెచ్చాడు. లోపలికి దిగి ఆ రాతి పలకమీద ఆ కొబ్బరికాయ కొట్టాడు.

ఇద్దరు ముగ్గురు మిత్రుల్ని బతిమాలి పలుగులు పట్టించి, తనూ ఓ పలుగు పట్టుకొని "అమ్మా" అని ఒక అరుపు అరిచి మిత్రులందరితో కలిసి ఉమ్మడి పోటుగా ఒక్క పలుగు పోటు వేశాడు.

ఏం జరిగిందో తెలీదు, కొండరాయి చిట్లి నీళ్ళు ఎగజిమ్మసాగాయి సన్నగా.

అంతే! వేళ్ళాడి పోయిన మిత్రులంతా మరోసారి విజృంభించారు. మరో అరగంటలో ఆ కొండరాయంతా మిత్రుల పలుగు పోట్లకు పిండి పిండి అయిపోయింది.

"కొబ్బరినీళ్ళు" అన్నారు వాడకట్టు వాళ్ళంతా, ఆ నీళ్ళు రుచి చూసి.

"ఇంత మండువేసవిలో ఇంత వూట వుంది గనుక ఇక యిది ఎండిపోయే ప్రసక్తిలేదు" అన్నారు అనుభవజ్ఞులైనవారు.

"పాతిక అడుగుల్లో నీళ్ళు పడటం, ఆశ్చర్యాల్లో కల్లా ఆశ్చర్యం" అన్నారు మరికొందరు.

"ఒరేయ్ కాసిని నీళ్ళు నన్ను గూడ తాగనీయండిరా" .... సంతోషంగా బతిమాలాడు సత్యం మిత్రుల్ని.

"ఔన్రోయ్! సొంతంగా తవ్విన బావిలో తప్ప నీళ్ళు తాగనని భీష్మ ప్రతిజ్ఞ చేశాడు గదా వీడిందాక. నెగ్గాడ్రా, పొయ్యండి, పొయ్యండి. వీడి గొంతులో నీళ్ళు పొయ్యండి" అంటూ మిత్రులు కేరింతలు కొడుతూ నీళ్ళు పోస్తుంటే దోసిలిపట్టి నీళ్ళు తాగాడు సత్యం.

అంతా అయినాక, "వీడి చేతులు కదుములు కట్టినట్టున్నాయిరా" అన్నాడు ఒక మిత్రుడు.

"ఒళ్ళంతా హూనం" అన్నాడు మరోడు.

"అసలయినా ఈ సత్యం ఎక్కిస్తే మటుకు మనమీ పనికి ఎలా ఒప్పుకున్నాంరా" అని అసలు కిటుకు పైకెత్తాడు మూడోవాడు.

"ఒప్పుకుంటే మాత్రం ఇన్ని గంటలు తవ్వటమా? ఈ అయిదుగురు అనుభవహీనుల చేతిలో, రాత్రికి రాత్రి బావి ఏర్పట్టమా? విచిత్రంరా" అన్నారు మరో యిద్దరు.

"చిత్రం కాదురా, దాని పేరు సాధన.

దృఢమైన సంకల్పం, స్థిరమైన నిశ్చయం, నిర్విరామమైన కృషి....

ఈ మూడిటి సమ్మేళనమే సాధన. ఇప్పుడు జరిగిన దాని పేరు సాధన" అన్నాడు సత్యం.

* * *

## అవమాన జయం

ఇది బెంగుళూరు మహానగరం. ఇక్కడ యెవడూ నడవడు మరి? ప్రతివాడూ పరిగెత్తుతాడు. ఎందుకు? ఎందుకేమిటి? కాకులెందుకు కారాడుతాయి? చీమ లెందుకు జీరాడుతాయి? పోన్లే, మనకెందుకు? మనం చెయ్యాల్సిన పనేమిటో ఆలోచించు. ఏముంది ఆలోచించేందుకు? మనం ఇక్కడి కెందుకు వచ్చాం? ఎందుకేమిటి? పొమ్మని ఆజ్ఞ అయింది, వచ్చేశాం. ఎక్కడికి పొమ్మని ఆజ్ఞ అయింది? ఏమో అది మనకు తెలీదు. పొమ్మని ఆజ్ఞ, లేచి వచ్చేశాం అంతే. సరే, వచ్చేశాంగా, మళ్ళీ వెనక్కిపోతే సరి. అదెట్టా కుదురుతుంది? పొమ్మని ఆజ్ఞేకాని, పోయి రమ్మని కాదుగా. సరే ఎటు పోదాం? ఇప్పుడెటు వచ్చాం? సరే ఎవరైనా పలకరించి చూద్దాం.

అయ్యా, ఇది బెంగుళూరు. ఇది మహా నగరం. ఇక్కడ ఎవడూ ఎవడితోనూ పలకడు. ఎందుకని? పలికితే ఏం లాభం? లాభం లేని పనులు చెయ్యనే చెయ్యరా? మనం చేస్తున్నామా యేమిటి? సర్లే, ఇప్పుడెటు పోవాలి మనం? అదేగా తేలంది. ఆఁ....ఈ ఊళ్లో మన మేనమామ వుండాలిగా? ఉండాలి, అక్కడికి పోతే సరి, సరే పోదాం పద. ఎటు పోదాం? ఎవరైనా అడిగితే చెప్పరా యేమిటి? అయ్యా, ఇప్పటికి రెండుసార్లు చెప్పుకున్నాం. ఇది బెంగుళూరు. ఇది మహా నగరం. ఇక్కడెవడికీ మరొకడు తెలీదు. ఎందుకని? తెలుసుకునే టైమేది?

అదా! సర్లే. ఇప్పుడు టైమెంతైంది? అదిగో గోడ గడియారం ఉందిగా. ఉదయం యెనిమిదిన్నరైంది. అదీ సంగతి? రోజూ చద్దన్నం తినే సమయం. అందుకే ఆకలేస్తోంది. దాని సమయానికి అది వెయ్యటం దాని ధర్మం.

ధర్మాలు సరేలేవయ్యా! ఆహారం సంగతి చూసుకోకుండా కాలెట్టా కదిపినట్టు? గడపెట్టా దాటినట్టు? కాలు కదపకుండా గడప లోపలే వుంటే ఆహారం సంగతి నిశ్చింతేనా? పాడు తర్కం పెట్టకు. అక్కడొక ఇల్లూ, వంట ఏర్పాటూ అన్నీ వున్నాయి. ప్రవాహం సాగిపోతుంది. ఇక్కడేం ఉందిప్పుడు?

గొప్ప పాండిత్యమే! ఈ ప్రవాహంలోనే ఎలుగుబంటు కొట్టుకొచ్చి పనస తొనలు పెట్టింది కదూ మనకి? ఈ ప్రవాహంలో దొరికిన ముద్దలే కదూ మనం గుడి వాకిట్లో బైరాగులకు పంచాము! ఈ ప్రవాహంలోనే కదూ వర్తకుల పప్పు బెల్లాలు తేలివచ్చి మన చేతిలో పడ్డాయి. ఈ ప్రవాహంలోనే కదూ మనం మింగిన నాభి, పాషాణం వుండలు కొట్టుకు పోయినాయి? ఈ ప్రవాహంలోనే కదూ అణ్ణా, మణ్ణీ యీదుకొని మన దగ్గరకు వచ్చారు?

సరే సరే! ఒప్పుకున్నాం, ఒప్పుకున్నాం. మనకు ఆయుష్యం ఇంకా ఉంది. అందులో సందేహం లేదు. అన్నం అదే చచ్చినట్టు వస్తుంది. ఆయుష్యం మిగిలి లేనప్పుడు అన్నం వచ్చినా చచ్చి వూరుకుంటాం. ఆ చింత అక్కర లేనిది, నీచమైనది. మనబోటి వాడు చేయదగ్గది కాదు.

ఒప్పుకున్నామయ్యా, ఒప్పుకున్నాం. ఔనది సరే, అదేమిటి! ఎక్కడ పడితే అక్కడ వినాయకుడి బొమ్మలూ అలంకారాలూ కనిపిస్తున్నా యేమిటి? ఓహో! అదీ! ఇవాళ్ళ వినాయక చవితయ్యా బాబూ! పండగపూట ఇట్టాంటి పని చేశామేమిటి మనం? మనకి పండగేమిటి నా మొహం, బైరాగి వెధవలకి! మనకి రోజూ పండగేలే. ఇప్పుడేం చేద్దామో చెప్పు. ఏంచేద్దాం? నీరసం వస్తోందే! రానీ, పీకల దాకా తిన్నరోజున రోగం వచ్చి విలవిలలాడిపోతుంటే యేం చేశావు నువ్వు? అదే యిప్పుడూ చెయ్యి. సరే, తరువాత కార్యక్రమం చెప్పు.

చెప్పాగా మేనమామ యిల్లుందని! నేను చెప్పాగా ఇది బెంగుళూరని! అపాపు, ఆ పాచి పళ్ళ పాట మళ్ళీ పాడకు. రోడ్డుమీద పడి వెతికితే అదే దొరుకుతుంది. మన్నిక్కడికి తెచ్చిన అమ్మకు మావయ్యి ఇల్లు తెలీదా?

సర్లేవయ్యా వేదాంతాలు. వచ్చే ముందరే అడ్రస్సెందుకు కనుక్కోలా? కనుక్కోవాలని నాకు తెలిసేడిస్తేగా? మరి ఏ మొహం పెట్టుకు బయలుదేరావు? అవన్నీ యెందుకు? పై సంగతి చూడు. పోనీ పేరైనా తెలుసా? ఓ, బ్రహ్మాండంగా, కృష్ణప్ప. ఇంకా నయం మా మేనమావన్నావుకాదు. ఇంటి పేరూ అదీ యేమిలేదా? కన్నడం వాళ్ళకు ఇంటి పేర్లుండవు. ఏముంటాయి? పేరు వెనుకాల ఏవో రెండు ఇంగ్లీషక్షరాలు వుండాలి. మనకు తెలుగే అంత మాత్రం. ఇంగ్లీషు గూడా వొకటా ఇప్పుడు? ఆ అక్షరాలేమిటో ఆలోచించు. అదే ఆలోచిస్తున్నా, అ, అ,... ఎస్. ఎన్. ఆఁ... ఎస్. ఎన్. కృష్ణప్ప. అదీ పేరు. ఇంకేం తెలుసు? ఆఁ... ఉద్యోగం చేస్తాడు. అదే ఎక్కడయ్యా? బిన్నీ కంపెనీ అనుకుంటా. అనుకుంటావా? మంచి పని చేస్తావు? ఆఁ...అదే, అదే అనుమానంలేదు. బిన్నీ కంపెనీయే. సరే ఏం పని చేస్తాడు? అది మనకు తెలీదు. ఇహ ప్రశ్న లెయ్యకు.

సరే, ఇప్పుడెటు పోదాం? ఎటుపోయేదేమిటి? ఇది గాలిపటం. గాల్లో ఎగుపతోంది. ఎటు గాలొస్తుందో, ఎటు పోతుందో? సరే నడు.

* * *

బెంగుళూరు స్టేషన్లో ప్లాట్‌ఫారం మీద ఇటూ అటు తచ్చాడుతున్న సత్యం ఆలోచనా ప్రవంతి ఇది.

నిక్కరూ చొక్కా మాసిపోయి వున్నాయి. జుట్టు రేగిపోయింది. దిక్కుతోచని ఆలోచనలు ఓరేవు చేరే సరికి అప్పుడే పదకొండు దాటింది. మొహంలో అప్పుడే నీరసపు వాలకం పడ్డది.

ప్లాట్‌ఫారం గందరగోళంగా వుంది. వినాయక చవితి ఉత్సాహం ప్రతి కిళ్ళీ కొట్లోనూ, ప్రతి కుర్ర పోర్టరు మొహంలోనూ ప్రత్యేక శిబిరాలు వేసింది. ముష్టి వ్యాపారులు మంచి హడావిడిగా వున్నారు.

సత్యం గేటు దాటుతుంటే టికెట్టు కలెక్టరు టికెట్టు గూడా అడగలేదు. సత్యం అదేమిటీ అనుకుంటుండంగానే, "అరేయ్ కూలీ ఇట్రారా" చప్పట్లు కొట్టి అరుస్తున్నాడొక జొజ్జ షావుకారు, ఇతన్నే కాబోలు.

కొంత మంది కుర్ర కూలీలు ఇటూ, అటూ తిరుగుతున్నారు. బిళ్ళ కూలీలు వచ్చి నపుడు పక్కకు తప్పుకుపోతున్నారు. సత్యం ఒకసారి వాళ్ళ వంకా, ఒకసారి తనవంకా చూసుకున్నాడు. పెద్ద తేడా యేమీ లేదు. చాలా సంతోషం అనిపించింది. ఆ కుర్ర కూలీల్లాగే ఆ షావుకారు కేసి పొగరుగా తల ఎగరేసి మరో పక్కకి వెళ్ళిపోయాడు, ఆనందంగా.

ఇంకేం ! గాలి వీచింది. గాలి పటం ఒక వైపుకి కొట్టుకుపోతోంది. కానీ అనుకున్నాడు.

అప్పుడప్పుడు అమ్మ మాట్లాడిన కన్నడమూ, తను మేకేదాటు వెళ్ళినప్పుడు విన్న కన్నడమూ గుర్తు చేసుకొంటూ, పలుకుతాడనుకున్న ప్రతిమనిషినీ పలకరిస్తున్నాడు, "అయ్యా ఎస్. ఎన్ కృష్ణప్ప గారు బిన్నీ మిల్లులో పనిచేస్తారు. వారియిల్లు మీకు తెలుసా ?" అని. ఫలితం అన్నిచోట్లా నిండు సున్నాయే. ఎక్కడా లోటులేదు.

పెరుగుతున్న ఎండ ఇంకా పెరిగింది. ఎండ పెరిగిన కొద్దీ నీడ తగ్గసాగింది. కొంతసేపటికి ఎండ తగ్గసాగింది. అది తగ్గిన కొద్దీ నీడ పెరిగింది. చివరికి ఎండాపోయింది. నీడాపోయింది. అయినా గాలి సాగుతూనేవుంది. గాలిపటం ఎగురుతూనేవుంది.

వినాయకచవితి పందిళ్ళలో గ్రాంఫోను రికార్డు పాటలు పెచ్చు పెరుగుతున్నాయి. అవి అప్పుడప్పుడు చెవులకు విందు చేస్తున్నాయి. కాని, కడుపు నకనకలాడి ఆ విందుల్ని చెడగొడు తోంది.

క్రమంగా సత్యం మొహంలో ఏడుపు కళ, అతని మాటల్లో కీచురాగము చోటుచేసు కొంటున్నాయి. అలాగే వోపిక చేసుకొని "ఎస్. ఎన్. కృష్ణప్ప గారు తెలుసా" అని అడుగు తున్నాడు దీనంగా.

ఇలా దీనంగా అడుగుతున్న కొద్దీ కొందరు ఎక్కిరింతగా, కొందరు జాలిగా చూస్తున్నారు. కొందరు సగం కన్నడంలో "నీకు డాన్సొచ్చా ! నువ్వు కృష్ణప్ప గారి అభిమానివా" అనసాగారు.

సత్యం అయోమయంగా తనవంక చూసుకున్నాడు. "నేను నడుస్తుంటే డాన్సు కులుకు లేవయినా కనిపిస్తున్నయ్యా యేమిటి ? అజ్ఞాతవాసపు అర్జునుడుగారు మన నేమయినా ఆవేశించారా యేమిటి ?" అనుకుంటూ తన నీరసపు నడకను మరింత కుదురు చేసుకొని నడుస్తున్నాడు. అయినా, ఆ రకం పలకరింపులు తప్పటంలేదు. విషయమేమీ అర్థంకావటంలేదు.

ఈ దీన పరిస్థితి చూసి, కాసేపు యెక్కిరించి, వెళ్ళిపోయాడు చవితి చంద్రుడు.

* "నీ దొంకడు, ఏ నింద నెత్తిన వేస్తాడో ఏమో"!

మెల్లిగా పందిళ్ళ సందడి గూడా తగ్గిపోయింది. ఇక రోడ్ల మీద జనంగూడా తగ్గిపోయారు గనుక అడిగే శ్రమొకటి తగ్గింది. ఏమైనా ఇళ్ళ వాకిళ్ళు తెరిచి వుండి, మనుషులు కనిపిస్తుంటే అడుగుతున్నాడు. అప్పటికి రాత్రి పదిదాటి వుండవచ్చు.

మనస్సు చెప్పే వేదాంతాలను కడుపైనా కొంత అలకిస్తోంది గాని, కదుములు కట్టిన కాళ్ళు మాత్రం, బొత్తిగా పొగరుగా బిర్రబిగుస్తున్నై. పట్టుబలవంతాన కాళ్ళు లాగి, అడుగులు వెయ్యవలసి వస్తోంది. కాళ్ళతోపాటు కళ్ళుగూడా పైకిపైకి తేలిపోతానంటున్నాయి. ఇక యీ గాలిపటానికి ఎగరటం సాధ్యం కాదు. ఏ అరుగుమీదో వాలిపోవటం మేలు అనుకుంటూ అలాగే పట్టుదలగా సాగుతున్నాడు సత్యం. ఇంతలో ఒక ఇంట్లోంచి మంచి ఘంటనాదం వినిపించింది. ఆ నాదంలో ఓంకారం స్వచ్ఛంగా సాగుతోంది. ఎవరిదో కాని మంచి ఘంట. ఆ యింటి తలుపులు తెరిచి వున్నాయి. ఆ యింటి గొడవ యేమిటో గాని, యీ అర్థరాత్రి సమయంలో వినాయక పూజ చేస్తున్నారు.

సత్యం ఆశగా అక్కడికి వెళ్ళి, తన ప్రశ్న వేశాడు. "ఎన్. ఎన్. కృష్ణప్ప గారు మీకు తెలుసా ? వారి యిల్లు చూపగలరా?" అని. ఇతని మాట తీరునుబట్టి, ఇది తెలుగు మొహం అని గుర్తు పట్టారు వాళ్ళు. వాళ్ళకు కొంత కొంత తెలుగు వచ్చు.

"సరిగా పూజ సమయం, అర్థరాత్రి బాలగణపతిని దేవుడే పంపించాడు. తక్కిన విషయాలు తరువాత" అనే భావం కలిగింది వాళ్ళకు. దాంతో, "అబ్బాయ్, అవన్నీ తరువాత మాట్లాడుకుందాం. ముందు ప్రసాదం పుచ్చుకో" అన్నారు.

నాలుగు వుండ్రాళ్ళిచ్చారు. గబగబా తినేశాడు సత్యం. వాళ్ళు మళ్ళీ యిచ్చారు. మళ్ళీ తినేశాడు. ఇలా 108 వుండ్రాళ్ళు ఇచ్చారు. తిన్నాడు. మళ్ళీ యివ్వబోయాడు. వద్దన్నాడు సత్యం. వాళ్ళు లెక్కపెట్టుకుంటూనే వున్నారు. 108 తో ఆపేశాడు. ఇక వద్దన్నాడు. ఇది గణపతి ఆవేశమే" అన్నారు ఒకళ్ళతో వొకళ్ళు. పానకం యిచ్చారు. అప్పటికి కళ్ళు, కళ్ళలో ప్రాణాలు క్రిందికి దిగినాయి.

ఇతని ప్రాణం కాస్త కుదుటపడటం గ్రహించి వాళ్ళు మెల్లిగా అన్నారు. "నాయనా, డాన్సు మీద అభిమానం మంచిదే. కాని పోయినవాళ్ళతో మనమూ పోతామా? ఇలా నాట్యాచార్యుల్ని వెతుక్కుంటూ తిరగటం సబబు కాదు. మీ పెద్దవాళ్ళు బాధ పడతారు."

---

* వినాయకచవితినాడు వినాయకుడికి పూజ చెయ్యకుండా చంద్రుణ్ణి చూస్తే, లేనిపోని నింద లొస్తాయని పురాణ ప్రసిద్ధి.

ఒక వాక్యానికీ, ఒక వాక్యానికీ సంబంధం కనిపించటం లేదు. ఆ మాటే వాళ్ళతో అన్నాడు. ఈ మాటు వాళ్ళు అయోమయంగా చూశారు. "ఇంతకీ నీ కెవరు కావాలి"? అన్నారు.

"బిన్నీ కంపెనీలో పని చేసే ఎస్. ఎన్. కృష్ణప్ప గారు" అన్నాడు సత్యం.

"ఆ నాట్యాచార్యులు బిన్నీలో పని చెయ్యరే?" అన్నారు వాళ్ళు.

"మా మావయ్యకు అసలు డాన్సు రాదండీ, మీ రేమంటున్నారో నాకు తెలీటం లేదు" విసుక్కున్నాడు సత్యం.

"అది కాదు నాయనా! ఎస్. ఎన్. కృష్ణప్ప గారు సుప్రసిద్ధ నాట్యాచార్యులు. ఆయన నిన్నే పోయారు. పేపర్లో ఆ వార్త వచ్చింది. నువ్వేదయినా ఆయన అభిమానివేమో, ఆయన కోసం ఏడుస్తున్నావేమో అనుకున్నాం. బిన్నీ కంపెనీ మాట మొదట్లో చెప్పలేదుగా నువ్వు" అన్నారు వాళ్ళు.

అప్పటికి సత్యానికి తను చేసిన పొరపాటు అర్థమైంది. అదే ప్రశ్న అడిగి అడిగి అందులో బిన్నీ కంపెనీ సంగతి రాలిపోయింది. దాంతో డాన్సు మాష్టారుగా విన్నవారందరికీ అపార్థమైందన్న మాట.

"కాదండీ, యస్. యన్. కృష్ణప్ప మా మేనమామ. ఆయన బిన్నీ కంపెనీలో పని చేస్తాడు" అన్నాడు సత్యం.

"ఏం పని?" అడిగారు వాళ్ళు.

"అది తెలీదండి" అన్నాడు, సత్యం

"అరేయ్, మన చిన్నవాడు బిన్నీలోనే గదా పని చేసేది. వాణ్ణి పిలవండి" అన్నాడొక వృద్ధుడు.

ఆ చిన్నవాడు, నలభైయేళ్ళ పెద్దవాడే.

"ఏరా గణపతీ, మీ బిన్నీ కంపెనీలో యస్. యన్. కృష్ణప్పట్టు ఎవరైనా వున్నార్రా?" అన్నారు అతను రాగానే.

"శతకోటి లింగాల్లో మా మేనత్త లింగం అన్నాట్ట! అలా వుంది. బిన్నీలో ఎంత మంది కృష్ణప్పలు, ఎంతమంది రామణ్ణలు" అన్నాడా గణపతిగారు.

"అబ్బాయ్, ఇతను గణపతిశాస్త్రి అని మా అబ్బాయే. బిన్నీలోనే పని చేస్తున్నాడు. ఇంకేదయినా వివరాలు చెపితే వెతుకుతాడు" అన్నాడు వృద్ధు.

"ఇంకేమీ తెలీదండి."

"ఏమీ తెలీకుండా ఎలా వచ్చావయ్యా?"

"అదంతా పెద్ద కథ లెండి. అడగకండి"

"సర్లే, పోనీగాని, మీ మేనమామగారు రాసే పని చేస్తారా ? చేతి పని చేస్తారా ?"

"రాసే పనేనండి"

"సరే అయితే, పద, నా బండిమీద తీసుకెళ్ళి నాకు తెలిసిన ఇద్దరు ముగ్గురు కృష్ణప్ప లున్నారు. ఆ యిళ్ళు చూపిస్తాను" అన్నాడు గణపతి శాస్త్రిగారు.

ఇక సత్యాన్ని వెనకాల కూర్చోబెట్టుకొని రెండు గంటలు తిప్పి 3,4 ఇళ్ళు చూపించాడు. అవేమీ కాదు. చివరికి వెనక్కి తిరిగి వచ్చేస్తుండగా, వాళ్ళ వీధిలోనే బట్టలు కుట్టే దర్జీ ఇంకా పండగకు బట్టలు కుడుతూ కనిపించాడు. పండగకు అందిస్తానన్న బట్టలు అందించ లేక, ఆలస్యం చేసిన బాపతు బట్టలు కుడుతున్నాడు. అతని దగ్గర విచారించారు. "ప్రక్క వీధిలో ఒక కృష్ణప్పగారుండాలండీ, ఆయనకూ బిన్నీలోనే పని" అన్నాడతను.

అతను చెప్పిన గుర్తుల ప్రకారం మళ్ళా వెళ్ళారు, తలుపు కొట్టారు. ఆ వాకిలి దగ్గర బాగా చీకటిగా వుంది. అప్పటికి మూడింటి గంట అయింది. తలుపు కొట్టగా కొట్టగా, పొట్టిగా వున్న పెద్ద మనిషి ఒకాయన ఆవలిస్తూ తలుపు తీసాడు.

"యస్. యల్. కృష్ణప్పగారిల్లిదేనా" అన్నాడు సత్యం.

కాదు అని బుడుంగున తలుపేస్తున్నాడు ఆ పెద్ద మనిషి.

"మామా, నేను, సత్యాన్ని" అని వొక్క అరుపు అరిచాడు సత్యం. ఆ అరుపుకి, ఆయన తలుపు వెయ్యటం ఆపి, నిదానంగా బయటకు చూశాడు.

"నేను సత్యాన్ని మామా, గుర్తు పట్టలేదా" అని తెలుగులో అరిచాడు, మళ్ళీ సత్యం.

అప్పటికి గుర్తుపట్టి, "ఓరి నువ్వట్రా, రా రా రా" అంటూ వాకిట్లోకి వచ్చి, సత్యాన్ని దగ్గరకు తీసుకున్నాడు కృష్ణప్ప గారు.

"ఈయన యస్. యల్. కృష్ణప్పగారయ్యా బాబూ, చంపేశావు గదా" అన్నాడు ప్రక్కన వున్న గణపతి శాస్త్రిగారు. తరువాత, యీ కుర్రవాడు వారింటి కోసం వెతుక్కుంటూ తమ ఇంటికి వచ్చిన వైనం వివరించి, సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు గణపతిశాస్త్రిగారు.

"ఇవాళ్ళ గణపతి పండుగ కదా మామయ్యా, గణపతే నన్ను పిల్చి ప్రసాదం పెట్టి తనే కూడా వచ్చి మీ యింట్లో దింపాడు" అన్నాడు సత్యం.

ఈలోగా కృష్ణప్ప గారి భార్య సీతాలక్ష్మిగారు లేచివచ్చి సత్యం వచ్చినందుకు సంతోషించి, పొద్దుటినించీ నీళ్ళూ పాలు లేవని తెలుసుకొని, వెంటనే వేన్నీళ్ళుపెట్టి, వీపురుద్ది స్నానం చేయించి, దగ్గర కూర్చుని అప్యాయంగా అన్నం తినిపించింది.

" రైల్వేస్టేషనులో కూలీని, వీధిలో ముష్టివాణ్ణి, లేదా డాన్సు పిచ్చివాణ్ణి, పూజయింట్లో బాలగణపతిని, ఇక్కడ ముద్దుల మేనల్లుణ్ణి, ఒక్క రోజులో ఇన్ని అవతారాలు. ఓహో! ఎంత బాగుంది " అనుకున్నాడు సత్యం అన్నం తిన్నాక మంచంమీద వాలుతూ.

ఆ మర్నాడు తన కొడుకునిచ్చి, సత్యాన్ని ఊరు చూడమని పంపించాడు మేనమామ కృష్ణప్పగారు. ఆ కుర్రవాడికి తెలుగు రాకపోయినా, సత్యాని కొచ్చిన అరకొర కన్నడం తోనే ఆ ముచ్చట పూర్తయింది. కాని, భాషా సమస్య వలన తోటివారితో ఆడుకోవటం సత్యానికి కుదరలేదు. ఏమయినా, చదువు అని ప్రాణంతీసేవారు లేరు గనుక ఒక వారం రోజులు హాయిగా గడిచిపోయాయి. మేనమామ, ఆయన భార్య ఎంతో ప్రేమగా చూస్తున్నారు. అంతా బాగానేవుంది.

ఇంతలో ఏం జరిగిందో ఏమోగాని, వాళ్ళు వస్తువులు జాగర్త చేసుకుంటున్నారు. అలమరలు తాళాలు వేసుకుంటున్నారు వాళ్ళు. కన్నడంలో ఏమేమి మాట్లాడు కుంటున్నారో పూర్తిగా తెలీదు. మొత్తానికి ఏదో కొంత తేడావుంది. రెండ్రోజులు పోయాక గాని, వాళ్ళింట్లో ఏదో చేతి గడియారం పోయిందనీ, అందుకోసం వాళ్ళు అదుర్దా పడుతున్నారనీ తెలిలేదు.

" ఈ కుర్రవాడు కొత్త. వీడి ప్రవర్తన, ఈ మధ్య ఎట్లావుందో తెలీదు. పదమూడో ఏడు వచ్చినా ఇంకా ఏడవ క్లాసులోనే వున్నాడంటే, అయితే మొద్దబ్బాయి అయినా కావాలి, లేదా అల్లరి వెధవయినా కావాలి. ఇంట్లో ఎవరితోనూ చెప్పకుండా కట్టుబట్టలతో లేచిపోయి వచ్చాడని తెలుస్తూనే వుంది. ఇలాంటి వాడికిచెయ్యివాటుతనంగూడా వుందేమోఅని అనుమానించ టంలో తప్పేమిటి? అయినా, కళ్ళతో చూడనప్పుడు మనం ఆ మాట అనరాదు. మన జాగర్తలో మనం వుందాం " అనుకొని చేతిగడియారం పోయిన దగ్గరనుంచీ వాళ్ళు జాగర్త పడుతున్నారు.

ఇది గ్రహించిన సత్యానికి గుండెల్లో సున్నం కొట్టినట్టయింది. కాళ్ళ కింద నిప్పులు పోసినట్టయింది. ఇందులో వాళ్ళ తప్పేమీలేదు. కాని, ఇక తను వాళ్ళదగ్గర వుండగలడా? " ఇక్కడ వాళ్ళు నన్ను అవమానించలేదు. కాని ఇది నాకు అవమానమే! ఈ అవమానానికి కర్త ఎవరు? ఎవరూ లేరు. అంటే, కర్త లేకుండానే క్రియ జరిగిందా? జరిగిందిగా! అయితే, యీ కర్తలేని క్రియ నానెత్తికేవచ్చి యెందుకు పడాలి? నేను చేసుకున్న పూర్వకర్మకు ఫలం, ఇది. అయితే, యీ అవమానానికి కర్తను నేనే అని తెలుతోందిగా. ఓహో, అవమానం అనుభ వించవలసిన కర్మ నాకు వుండి వుంటే అవమానించే వ్యక్తి వేరే లేకుండానే అవమానం నా నెత్తిన పడగలదన్నమాట. అలా అయితే, అవమానించే వ్యక్తి వేరేవుంటే మాత్రం, నాకు అవమానం అనుభవించే కర్మలేకపోతే వాడెట్లా అవమానించ గలడు? కనుక అప్పుడు గూడా అవమానానికి కర్తను నేనే. నిజమే, అప్పుడూ కర్తను నేనే, ఇప్పుడూ కర్తను నేనే. ఇతడు కర్తగా లేకపోయినా, నెత్తిన పడవలసిన అవమానం ఆగదు. అయితే, ఇన్నాళ్ళనుంచీ అంబమ్మవ్వా వాళ్ళు నన్ను అవమాన పరచినప్పుడు, నేను వాళ్ళను క్షమించాననీ, ద్వేషాన్ని

జయించానని అనుకున్నానే, అదెలా కుదురుతుంది? నా అవమానాలకు కర్తను నేనయితే, వాళ్ళనెవళ్ళనో క్షమించాననుకునే వెధవను నేనెంత అహంకారిని? ద్వేషించటానికి శత్రువే లేని వొట్టి పత్రలో, యుద్ధం చేసి గెలిచాననుకునే నేను ఎంత ఆత్మ ద్రోహిని.

లోకంలో దుష్టులు, ద్రోహులు లేనే లేరు. నేను నా వెనుకటి దుష్టత్వానికే ఫలం అనుభవిస్తు న్నాను. నాకు నేనే ద్రోహం చేసుకొంటున్నాను. క్రోధాన్ని జయించానుకొని, ఇంకా ద్రోహం చేసుకుంటున్నాను. క్రోధం చూపటానికి శత్రువు లేడు నాకు. జయమనే ప్రసక్తే లేదు. తెలిసింది-తెలిసింది, నా తప్పు తెలిసింది! ఇక ఇలాంటి పొరపాటు రానీను. సరి. ఈ స్థలంలో యీ పారం, ఇక వేరొక చోటుకు పోయి మన సాధన చేసుకోవటం మంచిది. ఇక వీళ్ళకు గూడా నావల్ల శాంతికి భంగమవుతుంది." చిల్లగింజ గంధం పడి, బురదనీరు తేరుకొన్నట్టుగా, ఈ సంఘటనవల్ల సత్యం హృదయిం మరింత స్వచ్ఛంగా తేరుకొంది.

అందుకే, "మామయ్యా, నేను తాతయ్య వాళ్ళని చూడాలి మామయ్యా, పంపించవూ" అన్నాడు ఆ రాత్రికే. ఆ మర్నాడే మైసూరు రైలెక్కాడు సత్యం. అయితే మేనల్లుడి తెలివి బాగా తెలిసి వచ్చింది కనుక, మైసూరు అడ్రసు, ఇంటి గుర్తులూ రాసి యిచ్చి మరీ రైలెక్కిం చాడు కృష్ణప్పగారు. మైసూరులో సత్యానికి ప్రేమ పూర్వకమైన స్వాగతం లభించింది. ఈ వారం రోజుల్లో వచ్చిన కన్నడంతో, వాళ్ళకు అంతకు ముందే వచ్చిన తెలుగుతో యిద్దరి సంభాషణ కొంచెం సాగే వీలు వచ్చింది. మెల్లగా వో వారం పదిరోజుల్లో తన కథ చెప్పు కున్నాడు సత్యం.

లింగణ్ణగారు స్వభావతః విశాల హృదయుడు, దయాశీల. సత్యమూ, వరలక్ష్మి అనంత పురంలో ఇబ్బంది పడుతున్నారని వినేసరికి, "పోనీ, యిక్కడికి వచ్చెయ్యండ్రా, అలాగే తంటాలు పడుదాం" అనేశాడు బుడుంగున. దీని కోసమే యెదురు చూస్తున్న సత్యం, తాత గారి దగ్గర డబ్బు తీసుకొని, కందుకూరు వచ్చాడు.

"మా తాతగారు, పిన్నిగారు వరలక్ష్మిని కొంతకాలం అట్టి పెట్టుకొని పంపిస్తా మన్నారు. దాన్ని తీసుకు వెళతాను" అని చెప్పాడు. తను గూడా ఇకపైన మైసూర్లోనే చదువుకుంటానన్నాడు.

ఈ మాత్రం లోకజ్ఞానం లేని వాళ్ళు కాదు, నంజుండయ్యగారు గాని, ఆయన భార్య గానీ. వాళ్ళిద్దరూ చాలా బాధ పడ్డారు. నచ్చచెప్పుదామని అనేక విధాల ప్రయత్నం చేశారు. కాని సత్యం వినలేదు అనంతపురంలో టి. సి. తీసుకొని చెల్లెల్ని తీసుకొని, మైసూరు బయలు దేరాడు. నంజుండయ్య దంపతులిద్దరూ రైలు దాకా వచ్చి వీళ్లైనంత తర్వాలో వరలక్ష్మిని పంపించేయమని మళ్ళీ చెప్పి వెళ్ళారు. అంతకన్నా వాళ్ళేం చెయ్యగలరు?

అన్నా చెళ్ళె లిద్దరూ విజయ గర్వంతో మైసూరు చేరారు.

## ఔదాసీన్య జయం

సత్యానికి మాత్రం ఆ విజయ గర్వం ఎక్కువ కాలం నిలువలేదు. చదువూ చట్టు బండలూ లేని సత్యం, నెలకు పది రూపాయల జీతానికి చిల్లర కొట్లో గుమాస్తాగా చేరాడు. పొట్ట గడవనివాళ్ళకు దర్జా లెలా కుదురుతాయి? అయితే రెండు నెలలయ్యే సరికి ఒకరోజున-

"సత్యనారాయణా, నేను శేషగిరిశాస్త్రితో మాట్లాడానురా, ఇప్పుడు అతను చాముండీ వనంలో అమ్మవారి గుళ్ళో అర్చకుడుగా వుంటున్నాడు గదా ! వాళ్ళింటి దగ్గరే సార్వజనిక హైస్కూల్లో ఉన్న మిడిల్‌స్కూల్లో నీకు సీటిప్పిస్తానన్నాడు. ఇక్కడికి బాగా దూరమనుకో. నువ్వు అక్కడా వుండవచ్చు ఇక్కడా వుంటూ వుండవచ్చు. మనకా భేదా లేమున్నాయి" అన్నాడు లింగణ్ణగారు.

అర్థమయింది. శేషగిరిశాస్త్రి గారింట్లో వుండటమంటే ఆయన చేతి కింద అసిస్టెంటుగా వుండటమన్న మాటే. బన్నిరుగట్టులో అనుభవమేగా !

1957 జూలైలోనే అనంతపురంలో టి. సి. తీసుకున్నా కన్నడం రాకపోవటంవల్ల, ఆ సంవత్సరం మైసూరులో చదువు కొనసాగలేదు. 1958లో మైసూరు సార్వజనిక హైస్కూల్లో మూడవ ఫారంలో (8వ క్లాసులో) చేరాడు సత్యం. కెసరే నుంచి యీ హైస్కూలుకి 8, 9 కిలోమీటర్లు వుంటుంది రోజూ రెండు పూటలా ఇంతదూరం నడవాలి, లేదా శేషగిరిశాస్త్రిగారి ఇంట్లో వుండాలి. శేషగిరిశాస్త్రిగారు ముక్కుసూటి మనిషి. ఆయన ముందరే చెప్పేశాడు.

"నాయనా, సత్యనారాయణా, నేను సామాన్య సంసారిని. నువ్వు ఇక్కడ వుండేట్టయితే హాయిగా వుండవచ్చు. కాని నా చేతి కింద వుండి యీ గుళ్ళో పనంతా జాగర్తగా చూసుకోవాలి. ఆపైన శ్రద్ధగా చదువుకోవాలి."

తాతగారు చెప్పినప్పుడే విషయం అర్థమయింది. ఇక ఇప్పుడు అర్థం కాకుండా వుంటుందా? అయితే, ఇది బన్నిరుగట్టు గుడి కాదు. బస్తీ గుడి. ఈ పని బాధ్యత పెట్టుకోవటమంటే, అది తలకు మించిన బరువే. ఈడుకు మించిన ఎత్తే. కాని తప్పదు. ఇది జీవిత సమరం. చాముండీవనంలోని, చాముండి ఆలయంలోని బుల్లి గణపతి గుడికి సత్యనారాయణ ప్రత్యేకంగా ఇన్‌ఛార్జి అయ్యాడు. మిగిలిన గుళ్ళల్లో కడగటాలు, తుడవటాలు, అలంకారాలు వగైరా యెలాగూ చూడాలి.

సత్యం ఇదివరకూ గుళ్ళల్లో కాలక్షేపం చేశాడు గానీ, దీనికీ దానికీ తేడా వుంది. ఇప్పుడు కాస్త వయస్సు వచ్చింది కనుక, జనం వస్తే హారతి యివ్వటం, కొబ్బరికాయ కొట్టి ప్రసాదం ఇవ్వటం లాంటి పనులు గూడా చెయ్యవలసి వస్తోంది. ఒడుగేకాని కుర్రవాడు అంతకన్నా ఏం చేస్తాడు? క్రమంగా యీ చిన్ని గణపతి గుళ్ళోనే కొబ్బరికాయల రద్దీ

పెరిగింది. అది శేషగిరిశాస్త్రిగారి అదృష్టం. కొన్ని రోజులు పోయాక "వాళ్ళకు ప్రసాదం ఇవ్వు, వీళ్ళకు కుంకుమ యివ్వు" అనసాగాడు బుల్లిగణపతి. "మన సామ్మేం బోయె, ఆయన చెప్పినట్టు చేస్తే పోలా" అని ప్రసాదా లస్తున్నాడు సత్యం. రానురాను గణపతి మరీ నిగనిగలాడి పోతున్నాడు. మెరమెరలాడి పోతున్నాడు, తళ తళ లాడి పోతున్నాడు.

"అబ్బా! ఈయన దగ్గర ఇంత అందం వుందనుకోలేదు సుమా!" అనుకున్నాడు సత్యం. ఆ ఆనందంలో గణపతికి రోజుకో అలంకారం జరుగుతోంది. అలంకారం జరుగుతున్న కొద్దీ పొంగి పోతున్నాడు గణపతి. స్వామికి అలంకారం చేయటం ఒకటే కాదు. వేదిక (స్టేజి) అలంకార మన్నా సత్యానికి ఆసక్తే. గుళ్ళో ఏదైనా కార్యక్రమం వుందంటే మహోత్సాహంగా అన్ని యేర్పాట్లు చేసేవాడు.

రోజులు సాగుతున్నాయి. ఒకో రోజు పుస్తకాలు చేతబట్టుకొని పార్వతమ్మ గారింటికి వెళ్ళేవాడు సత్యం. ఏమీ అనరు, ఏమీ అడగరు, ఎందు కొచ్చావనరు, వెళ్ళిపో అనరు. అన్నాని కొస్తే అన్నం పెడతారు. రాకపోతే పిలవరు. మళ్ళీ చాముండీవనం వచ్చేవాడు. నిన్న ఏమయ్యావురా అని అడగరు, కేక లెయ్యరు. అన్నానికి వస్తే కాదనరు. దాంతో కొన్నాళ్ళు ఒక నియమం పెట్టుకున్నాడు సత్యం. తను అర్చనచేసిన రోజున, ఆ పంచామృత ప్రసాదమే తప్ప మరొక ఆహారం తీసుకోరాదని. నియమం హాయిగా సాగిపోతోంది. అప్పుడప్పుడు పలకరించే గణపతి గూడా, "ఇదేమిటయ్యా తీర్థం పుచ్చుకున్నావు గాని, ప్రసాదం పుచ్చుకోవేమిటి?" అనడు. తెల్లవారుకట్ల ఆలయంలోని శివుడి దగ్గర కెడితే, యాగ రహస్యాలు చెపుతునే వున్నాడు కుమారస్వామి. గుళ్లోకి వెళ్ళితే ఆయన యంత్రోపాసన మర్మాలు వివరిస్తూనే వున్నాడు, అమ్మవారి దగ్గరకు వెళ్ళితే ఆనందపారవశ్యాన్ని అనుగ్రహిస్తూనే వుంది. తిండి సంగతి మాత్రం ఎవరూ అడగరు.

ఒక రోజు గణపతి దగ్గర విశ్రాంతిగా కూర్చుని, ఆలోచించుకో సాగాడు సత్యం. ద్వేషాన్నీ, ప్రేమనూ రెంటినీ జయించాలని అనంతపురం నుంచి బయలుదేరాను. ఇప్పు డిక్కడ వున్నది ప్రేమా కాదు, ద్వేషమూ కాదు. ఇది ఔదాసన్యం. ఇది అచ్చమైన ఉపేక్ష. ఊరకుక్క పుండుమీద ఈగవాలితే ఎవరికి నష్టం? వాలకపోతే ఎవరికి నష్టం? నువ్వు తిన్నావా, పడుకున్నావా, బతికే వున్నావా, అసలు చావనే చచ్చావా అని అడిగే జీవి, ఇంట్లో లేకపోతే, గుళ్ళో లేకపోతే, ఊరి సంతలో గూడా ఎవరూ లేకపోతే, అలా అడిగే జీవి అసలు జగత్తులోనే లేకపోతే, వాడి కథ ఏమయిపోతుంది? వాడి కేగతి పడుతుంది? వాడి మనస్సేమవుతుంది?

సత్యం మనస్సు ఆవేశం స్థాయికి చేరి, అక్కడ ఒక క్షణం బిగిసి నిలిచిపోయింది. "సంస్కారం లేని జీవి అయితే పిచ్చి పడుతుంది. సంస్కారం వున్న జీవి అయితే వైరాగ్యం పట్టుతుంది." ఆకాశంలోంచి వచ్చిన యీ వాక్యానికి ఉలిక్కిపడి లేచింది సత్యం మనస్సు.

" ఎవరి గొంతిది... ఇది అమ్మ గొంతు కాదే... ఓహో, ఇది యీ గణపతి గొంతు ... నిజమే... ఈయన గొంతే యిది" ... ఈ కాస్తే చెప్పి ఆగిపోయాడేమిటి? మిగిలింది నేను ఆలోచించుకోవాలి గాబోలు "

సత్యం ఆలోచనలు ఒకసారి వెనకా ముందులు పరిశీలించుకొని మళ్ళీ ముందుకు సాగినాయి.

" నా కింకా వైరాగ్యం అబ్బలేదంటున్నాడు గణపతి. ఎందుకని? నాలో ఎక్కడో లొసుగు వుందన్నమాట? ఏమిటది? పూర్వ సంస్కారబలం అనరాగా, ప్రస్తుతం వున్న పరిస్థితిని వివేచనచేసి చూడమని ఆయనే చెప్పుతున్నాడుగా! నా పూర్వ సంస్కారం ఏమిటీ? మనకు ద్వేషింపదగిన, లేదా జయింపదగిన వ్యక్తిగాని, వస్తువుగాని లేదని మన నిర్ణయం. అదీ మన సంస్కారం. మరి ప్రేమను, ద్వేషాన్నీ జయించాలనిగా బయలు దేరింది!! బయలుదేరటం అలాగే బయలుదేరాం. దార్లో యీ జయించటం అనే మాటనే తుడిచివేసేశాం. అయితే, యీ ప్రేమనీ, యీ ద్వేషాన్ని ఏం చేసినట్లు? వాటినీ వదిలేశాం. కావలసిన వాటిని వదిలేస్తారా, అక్కరలేని వాటిని వదిలేస్తారా? అక్కరలేని వాటినే. అక్కరలేని వాటిని ద్వేషిస్తారా, ప్రేమిస్తారా? ద్వేషిస్తారు. అంటే యీ ప్రేమను, ఈ ద్వేషాన్ని, వీటిని ద్వేషిస్తున్నట్టేగా మనం! ఇదేదో చిక్కుగా వుందే. అయితే ద్వేషాన్ని వదిలినట్టు కాలేదుగా. అంటే వైరాగ్యం రాలేదుగా! ఈ మాటలు ఎప్పుడో వెంకమ్మత్త చెప్పినట్టే వుందే.

"ఎక్కడ పొరపాటు పడ్డాం మనం? ఆఁ... తెలిసింది... జయించటం అనే భావాన్ని తుడిచి వేసినప్పుడు. దాని వెనక కారణం ఏమిటి? మనను ప్రేమించి ఉపకారం చెయ్యగల వాడుగాని, ద్వేషించి అపకారం చెయ్యగలవాడు గానీ లేనే లేడనీ. అలా ప్రేమకు, ద్వేషానికి ఆధారం లేకుండా పోతే ఆ ప్రేమ, ఆ ద్వేషము ఉన్నట్టా? అసలు లేనట్టా? సందేహ మెందుకు? అసలవి లేనేలేవు. లేనేలేని వాటిని నువ్వు వదిలేసే దేమిటి? నిజం, నిజం, నిజం, ముమ్మాటికీ నిజం. ప్రేమ, ద్వేషాలు లేవు. వాటిని వదలటమూ లేదు. ప్రేమ లేకపోతే, ద్వేషమూ లేక పోతే వుండే స్థితి పేరేమిటి? ఔదాసీన్యం. అదేగా వుంది యిప్పుడు! ఇక సమస్యేమిటి? ఏమీ లేదు. లేనిదాన్ని వదిలాననో, పట్టుకున్నాననో అనుకోవటమే సమస్య. ఇప్పుడిది పోయిందిగా. ఇప్పటి స్థితి పేరేమిటి? ( వైరాగ్యం ) ఇదేగా గణపతి చెప్పింది. ఆహాఁ... ఎంతబావుంది... నమస్తే గణపతయే... "

నిర్ద్వంద్వమైన ఆనందంలో సత్యం మనస్సు అంతర్లీనమైపోయింది. ఇక సత్యాని బాహ్యస్మృతి లేదు.

ఈ సంఘటన తరువాత సత్యంలో పూర్తి మార్పు వచ్చింది. అందర్లో కలిసి తిరగటం పెరిగింది. ఉత్సాహం పెరిగింది. హాస్యాలు పెరిగినై. చర్మం మందగించింది. తను వుండటం ప్రధానా

పెదనాన్నగారి దగ్గరే అయినా, అటు కేసరేలోనూ, ఇటు చాముండీ వనంలోనూ ఎక్కడ వుండ దలచుకుంటే అక్కడుంటున్నాడు. వరలక్ష్మి మాత్రం పిన్నమ్మ దగ్గర అతికిపోయి క్రమ క్రమంగా అన్న నే "సరీగ్గా చదువుకోరా సత్యనారాయణా" అని మందలించే స్థితికి వచ్చింది.

చదువులో మాత్రం సత్యం పూర్తిగా మొద్దబ్బాయి కాదు గాని, శ్రద్ధ తక్కువ. పైగా ఆ సంవత్సరం తెలుగు నుంచి కన్నడానికి మారిన చిక్కు వుంది. అయినా, ఆ సంవత్సరం మూడవ ఫారం పరీక్ష పాసయ్యాడు.

ఆ వేసవికాలం చాముండీ వనంలో వో విచిత్రం జరగసాగింది. రోజూ మధ్యాహ్నం బోజనాలు చేసి, ఎండకి అందరూ తలో మూలా కునికిపాట్లు పడే సమయంలో ఎక్కడి నుంచో ఒక తెల్లగుర్రం అమ్మవారి గుడి దగ్గరకు వచ్చేది. దాని సకిలింత వినబడగానే సత్యం బాణ మల్లే పరిగెత్తు కెళ్ళేవాడు. ఇతను రాగానే అది సంతోషంగా ముందరి కాళ్ళు పైకెత్తి సకిలించి మోకాళ్ళ మీదికి వంగేది. ఒక గట్టు ఆధారంగా దాని మీదికి ఎక్కేవాడు సత్యం. జీనూ లేదు, కళ్ళెమూ లేదు. వట్టిగా దాని మీద కూర్చుని స్వారీ మొదలెట్టేవాడు. మొదలెట్టే దేమిటి, అతను కూర్చోగానే ఆ గుర్రమే మేఘాల మీద దౌడు లంకించుకునేది. ఇక అది ఎటు పోయేదో, ఏం జరిగేదో ఎవరికీ తెలీదు. ఒక గంట అయినాక గుర్రమూ, రౌతూ హాయిగా తిరిగి వచ్చేవారు. ఇలా రాకా పోకా నెల జరిగింది. మెల్లిగా ఇంట్లో అందరికీ తెలిసింది. వాళ్ళంతా ఆ గుర్రం గురించి యే మడిగినా "నాకు తెలీదు. వస్తోంది, ఎక్కు తున్నాను, సరదాగా తిరిగి వస్తున్నాను. అంతే"* అనేవాడు.

క్రమంగా శేషగిరిశాస్త్రిగారి పిల్లలకు, తాము గూడా ఆ గుర్రం యెక్కాలని ఉత్సాహం బయలుదేరింది. "మమ్మల్ని గూడా ఎక్కించరా" అని సత్యం వెంటబడ్డారు. "మీరు దానిమీద కూర్చోలేర్రా" అని ఎన్నిసార్లు చెప్పినా వినలేదు. "ఆ గుర్రం వూర్కోదురా" అని చెప్పినా నమ్మలేదు. చివరికొక రోజున ఒక కుర్రాడు సత్యాన్ని అడ్డం పెట్టుకొని తనే గుర్రం ఎక్కాడు. సత్యం కిందే వుండిపోయాడు. రెండడుగులు వేసి, తమాషాగా, ఒక చిన్న గంతు వేసింది గుర్రం. కుర్రవాడు రెండు పిల్లిమొగ్గ లేసి, నేలమీద పడి దొర్లాడు. మొహం డోక్కుపోయి, పళ్ళు కదిలినంత పనైంది. చుట్టూతా వున్న పిల్లలు గొల్లుమని నవ్వారు. ఆ తరువాత సత్యాన్ని ఎక్కించుకొని హాయిగా వెళ్ళిపోయింది గుర్రం. ఆ మర్నాటి నుంచీ మాత్రం ఎందుకో ఆ గుర్రం మళ్ళీ రాలేదు.

* * *

* ఆ రహస్యం ఇప్పటికీ ఇలాగే వుండిపోయింది.

## రంగ ప్రవేశం

మళ్ళీ స్కూళ్ళు తెరిచారు. ఈ మాటు సత్యం స్కూలు సాంస్కృతిక కార్యక్రమాలలో ఆసక్తి ఎక్కువగా చూపించసాగాడు. తనకంటే యెక్కువ వయస్సు వాళ్ళతో స్నేహం ఎక్కువగా వుండేది. ఎలా మాట్లాడేవాడో, ఏం చేసేవాడో గాని చాలమంది ఉపాధ్యాయులకు సత్యం మీద ఒక విచిత్రమైన అభిమానంగా వుండేది. "ఇతనిలో ఏదో విశేషం వుందండీ, చదువు మీద గూడా గనక కాస్త శ్రద్ధ వుంటే, ఇంకా బాగుండేది" అనేవారు.

వీడూ వాడూ అనిలేకుండా అన్ని జాతుల వాళ్ళతోనూ స్నేహం చెయ్యటమేగాక వాళ్ళిళ్ళకి గూడా పోయి వస్తూ వుండే గుణం మాత్రం సత్యానికి ఇంట్లో అనేకసార్లు తీవ్రమైన చివాట్లు తెచ్చింది. కులం పట్టింపు లేకపోతే అదో రకం, అంతస్తు పట్టింపు లేకపోతే ఎవరైతే మాత్రం ఎలా సహించగలరు? కుల నిర్మూలన ప్రచారాలు చెయ్యవచ్చు. కులాంతర వివాహాలు ప్రోత్సహించవచ్చు, సహ పంక్తిభోజనం ప్రదర్శించి చూపవచ్చు. కాని, మన పిల్లలు మురుగు కాలవల్లో జల్లెడలు పట్టి కాసు లేరుకునే నికృష్టుల ఇళ్ళల్లో తిరుగుతున్నారంటే ప్రోత్సహించక్కర లేదు, సహిస్తే చాలు. సహించగల నాయకు లెవరైనా వున్నారా దేశంలో? కొండరాజులతో, తాపీమేస్త్రీలతో, వడ్రంగి మేస్త్రీలతో, నాటు వైద్యులతో, భూతవైద్యులతో, ముష్టివాళ్ళతో, బైరాగులతో, వాడువీరు అని లేదు, కంటికి కనిపించిన ప్రతి అడ్డమైన జాతి వాడితోనూ స్నేహమే చేస్తున్నాడంటే ఆ కుర్రవాడి మొహాన చదువు వచ్చే గీత వున్నట్టేనా? వాడికీ లోకంలో బతికే యోగ్యత వున్నట్టేనా?

అయితే మరో చిత్రమేమిటంటే, హైస్కూలు వార్షికోత్సవానికీ, గణపతి ఉత్సవాలకీ, ఉపన్యాసాలకు గానీ, హరికథాది కాలక్షేపాలకు గానీ, నాటకాలకు గానీ వచ్చే వాళ్ళల్లో ఏ ఒక్కళ్ళతోనూ ఏదో చర్చ చెయ్యకుండా వదలడు సత్యం. ఆ విద్వాంసులు, కళాకారులు అంతా "సత్యనారాయణ మంచి తెలివైన వాడండీ" అంటారు. ఇది స్కూల్లో ఉపాధ్యాయులకు ఒక చిన్న పొడుపు కథలాగా వుండేది. "వీ డీ పండితుల్ని ఎలా బుట్టలో వేస్తాడు?" అని అర్థం కాక తికమక పడుతూ ఉండేవారు.

ఈ సంవత్సరం (1959) వినాయక చవితి ఉత్సవాలలో ఒక విశేషం జరిగింది. గణపతి పూజ ఉత్సవాలు జరుగుతున్నాయి స్కూల్లో. ఆ సందర్భంగా సాంస్కృతిక కార్యక్రమాల ఏర్పాటు చేస్తున్నారు. ఒక ఉపాధ్యాయుడు "ఏమోయ్ సత్యనారాయణా, నువ్వు స్టేజి ముందర కూర్చుని మంచి ఉత్సాహం చూపిస్తూ ఉంటావుగా, ఒకసారి స్టేజి యెక్కరాదూ! ఊ... భయపడరాదు. ఏదో ఒకటి ఇవాళ్ళ స్టేజిమీద ఏదో కార్యక్రమం చెయ్యి" అని ప్రోత్సహించాడు.

సత్యం ఔననలేదు, కాదనలేదు. ఆ సాయంత్రం స్కూలు మాత్రం ఎగొట్టాడు. అతని కది కొత్తగాదు. ఆ ఉపాధ్యాయుడూ పట్టించుకోలేదు. కార్యక్రమాలు మొదలయ్యే సమయానికి నక్షత్రమల్లే రాలి పడ్డాడు సత్యనారాయణ. మామూలుగా వస్తే ఆశ్చర్యం ఏమీ

లేదు. పట్టుబట్టలు కట్టుకొని చిరతలు పట్టుకొని వచ్చాడు. "గణపతి చరిత్ర హరికథ చెపుతాను సార్" అన్నాడు సిగ్గుపడిపోతూ.

"ఊ.... మొదలెట్టు.... చెపుతుంటే అదే వస్తుంది. చెప్పేయ్" ఆ ఉపాధ్యాయుడు ప్రోత్సహించాడు.

గణపతి చరిత్ర హరికథ. అది పసివాడి పచ్చి వెచ్చి కథగాలేదు. ఒక అరగంటసేపు ప్రేక్షకుల్ని రసలీన స్థితిలో పెట్టాడు సత్యం. అతని దగ్గర అంత మధురగానం వుందనీ, అలాంటి వాక్ప్రవాహం వుందనీ ఎవరూ వూహించ లేదు. ఆ రోజు అన్ని వైపులనుంచీ అతని మీద ప్రశంసల వర్షం కురిసింది. అక్కడి నుంచీ ఉపాధ్యాయులలో చాల మంది దృష్టి సత్యంమీద ప్రత్యేకంగా పడింది. ఇక స్కూలు ఉత్సవాలన్నింటిలోనూ ఇతను వేదిక యెక్కటం తప్పని సరి అయింది.

మరొక ఉత్సవంలో "నాటకాల్లో ఏదైనా పాత్ర తీసుకోవోయ్" అన్నాడు మరో నాటకాల పిచ్చి మాష్టారు. సత్యం అప్పటి కప్పుడు మేకప్ చేయించుకొని, కొన్ని పౌరాణిక ఏకపాత్రాభినయాలు చేసి చూపించాడు. ఈ నాటకాల ఆసక్తి, కెనరేలో ద్వారకా అనే నాటకాలరాయుడి స్నేహం సంపాదించి పెట్టింది సత్యానికి. ఇది యింట్లో వాళ్ళకు అంతగా ఇష్టం లేదు. అయినా సత్యం దోవ సత్యానిదే.

ఆ రోజుల్లోనే, ఒక పెద్ద నాటకాల కంపెనీ కెనరేలో ప్రహ్లాద నాటకం ఆడటానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నారు. ప్రదర్శన చెయ్యవలసిన నాటి సాయంత్రానికి ప్రహ్లాదపాత్ర ధరించే కుర్రాడికి వొళ్ళు తెలియని జ్వరం వచ్చింది. ప్రక్క వేషాల కయితే, మరొకడితో సద్ద వచ్చు. ఇది ప్రధాన పాత్ర. పైగా చిన్న పిల్లవాడుగా వుండి, ఉచ్చారణ, నటన, స్టేజీ ధైర్యం ఇవన్నీ వున్నవాడు ఒక ట్రూపులో మరోడు దొరకటం అసంభవం. టికెట్లన్నీ అమ్మినాక ఆట రద్దు పరచటం తేలికగాదు. ఆ రోజుకి మరో నాటకం ఆడి, ఆ మర్నాడు మళ్ళీ యీ నాటకం వూరికే చూపించాలి. లేకపోతే ప్రజలు కీళ్ళు విరిచేస్తారు. అందులో అది కెనరే ప్రాంతం. పిచ్చి వేషాలక్కడ కుదరవు. నాటక మండలి యజమాని శ్లేష్మంలో పడ్డ యీగలా గిలగిల కొట్టుకొంటున్నాడు. ఈ విషయం తెలిసిన సత్యం సరాసరి అతని దగ్గరకు వెళ్ళాడు. "అయ్యా, నేను వెయ్యగలను ప్రహ్లాద" అన్నాడు. అతను ఎగాదిగా చూశాడు.

సత్యం తన వయస్సుకు తగిన ఎదుగుదలగా వుండేవాడు కాదు. మొహం లేతగా నాజూగ్గా వుండేది. అందువల్లే అతను, ద్వారకా నాటకాల్లో ఆడ పిల్లల వేషాలు వేస్తూ వుండేవాడు. అంచేత, బాలప్రహ్లాద పాత్రకు ఆకారం నప్పుతుంది, ఫరవాలేదనిపించింది నాటక యజమానికి. అయితే, ఆకారం వొకటే చాలదే! ఇదేమన్నా సినిమానా? "ఏదీ, వో పాటపాడు" అన్నాడు. తన సహజ దర్పంతో.

"అది సాధ్యం కాదు. మీరు కావాలనుకుంటే అన్నీ రంగ స్థలం మీదే చూడవచ్చు. లేదంటే లేదు" అన్నాడు సత్యం, తనకేమీ ఆసక్తి లేనట్టు. నాటకాల యజమాని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. "ఆత్మ విశ్వాసం కనిపిస్తోంది. సరే చూద్దాం" అనిపించిందతనికి. "సరే అబ్బాయి, త్వరగా నీ పోర్షన్ డైలాగు రాసుకో" అన్నాడు. "అక్కర్లేదు. ఒకసారి వినిపించండి చాలు" అన్నాడు సత్యం. ఈ దెబ్బకి నాటక యజమాని పూర్తిగా జారిపోయాడు.

"అబ్బాయ్, నాటకం అంటే ఆట గాదు. నీ పోర్షను చెడగొట్టావంటే ప్రక్కవాడి పోర్షను గూడా చెడిపోతుంది. ప్రజలు మా వీపులు చెడగొట్టేస్తారు" అన్నాడతను.

"అవన్నీ నా కొదిలెయ్యండి. నన్ను నమ్మి ఎవరూ చెడిపోలేదు." అభయహస్తం చూపించాడు బాల సత్యం చిత్రంగా.

నాటక యజమాని మనస్సు ఈ దుస్సాహసానికి బొత్తిగా అంగీకరించలేదు. ఈ లేనిపోని అభాను పని మనకొద్దు అనుకున్నాడు గట్టిగా. కాని మన మనస్సు మన చేతిలో ఉందనీ, మనం అన్నీ సకారణంగా తూచి చెయ్యగలమనీ అనుకోవటం కేవలం భ్రాంతి అని ప్రతివారికి జీవితంలో ఒకసారయినా అనుభవానికి రాక మానదు. ఆ నాటక యజమానికి గూడా అలాంటి సందర్భం ఇప్పుడు సంభవించింది.

ఇంత ఆలోచించిన ఆ పెద్ద మనిషి- "సరే అయితే, వోసారి నీ సంభాషణలు విను" అనేసి, గబగబా పుస్తకం తెచ్చి సత్యానికి సంభాషణలు వినిపించసాగాడు. తక్కిన నటకులంతా, "ఇదెల్లాగూ రసాభాస ప్రయోగమేలే పొమ్మ"నుకున్నారు. ఎవరేమనుకుంటే ఏం, ప్రదర్శన ప్రారంభమైంది. తన్మయత్వంతో హరికీర్తన చేస్తూ ప్రహ్లాదుడు ప్రవేశించాడు.

ఆ హార్మోనిస్టూ, తబలవాడు కంగారు పడ్డారు. ఆ పాట నాటకంలో పాట కాదు. ఆ రాగం వాళ్ళు అలవాటుపడ్డ రాగం కాదు. ఏమయినా అనుభవం కలవాళ్ళు గనుక, త్వరలోనే సద్దుకొని వాయించసాగారు. ప్రజలకు ఈ గోలంతా తెలీదు. పాట కాగానే హాలు దద్దరిల్లేట్లు చప్పట్లు కొట్టారు. ఈ ప్రహ్లాదుడు మాట తక్కువ. అడుగడుక్కి ఏదో పాటందుకుంటాడు. అది పక్క పాత్రధారులకు కొంచెం ఇబ్బందిగా వున్నా, మొత్తంమీద సీను రక్తి గట్టిస్తున్నాడు గదా అని చాలా సంతోషించారు. ప్రహ్లాదుడి భక్తిలో లీనత్వాభినయానికీ, లీనత్వంలో వచ్చే నాట్యానికీ సెభాష్‌లు కొడుతున్నారు ప్రేక్షకులు.

వన్సుమోర్ కొడితే మాత్రం యీ కుర్రవాడు మళ్ళీ చెయ్యటం లేదు. అదొక్కటి నాటక సంప్రదాయాలలో అవినయమే అయినా, ఆనంద పారవశ్యం వల్ల సహించి వూర్కున్నారు నాటకాభిమానులు. ప్రహ్లాదుడ్ని కొండమీది నుంచి క్రిందికి తోసే సన్నివేశం వచ్చింది. ఒక సిపాయి బల్లమీద, పట్టాగుడ్డ కప్పి రంగస్థలం మీద కొండగా ఏర్పరిచారు. అక్కడ నుంచీ ప్రహ్లాదుని రెండు మూడుసార్లు తోస్తూతోస్తూ వుండగా అతను "నారాయణా" అని పొలికేక పెడుతూ వుండగా తెర పడిపోవాలి. ఇదీ ఏర్పాటు.

సరే, కొండమీద ఒక రాక్షస భటుడు, ప్రహ్లాదుడు నిలబడ్డారు. ప్రహ్లాదుడు పాట అందుకున్నాడు. ఆ పాట ఎప్పుడు అయిపోతుందో, తను ఎప్పుడు తొయ్యాలో ఈ రాక్షసభటు పాత్రధారికి తెలీదు. అతను ఎన్నిసార్లు తోశాక ఇతను పడాలో ప్రహ్లాద పాత్రధారికి తెలీదు. పాటలో ఒకచోట ఆగినట్టుంటే, ఒకసారి తోశాడు రాక్షసుడు. వెంటనే "నారాయణా" అని నిజంగానే ఒక పెద్ద పొలికేక పెట్టి కిందపడిపోయాడు సత్యం. ప్రేక్షకులు చప్పట్లు కొట్టటం గూడా మరిచిపోయి బిగిసిపోయి చూస్తున్నారు. నిర్వాహకులకు చెమట పట్టి పోయింది- ఇది పోలీసు కేసు అవుతుందని. వెంటనే తెర లాగేసి, కుర్రవాడి దగ్గరకు పరిగెత్తు కొచ్చారు. లేచి కూర్చున్న సత్యం "తెరేశారెందుకు, తీసెయ్యండి" అంటున్నాడు చిరాగ్గా. ఆశ్చర్యపోయారు నిర్వాహకులు. "అంతెత్తు నించి పడితే బొప్పి అయినా కట్టలేదు, ఇదేం తలరా బాబూ" అని వెంటనే తెర లాగారు. ప్రజల ఆనందోత్సాహాల ఈలల, కోలాహలం మధ్య ప్రహ్లాదుడి పాట కొనసాగింది. నాటకం దిగ్విజయంగా ముగిసింది.

ఆ మర్నాడు గూడా ఆ నాటక మండలికి మరోచోట ఇదే నాటక ప్రదర్శన వుండటం వల్ల, మర్నాడు గూడా రమ్మని సత్యాన్ని పిల్చారు. సత్యం అంగీకరించాడు. రెండుచోట్లా అద్భుతమైన అభినందనలు, ప్రోత్సాహం సత్యానికి లభించినాయి. అది చూసి ఆ నాటక యజమానికి ఆశ పుట్టింది.

"అబ్బాయీ, నువ్వు మాతో వచ్చెయ్, నిన్ను బ్రహ్మాండమైన హీరోగా చేస్తాను" అని అనేక రకాల బతిమాలసాగాడు, ఆశపెట్టసాగాడు.

"చూడండి, ఆ ఆశ మీరు పెట్టుకోకండి. ఇప్పుడు మా కుర్రాడికి ఆరోగ్యం బాగు పడ్డది. ఇక యీ పాత్ర నేను వెయ్యవలసిన పనిలేదు. మీకు నా మీద అభిమానం వుంటే ఒక పని చెయ్యండి" అన్నాడు సత్యం.

కుర్రాడు ఏదో కోరుతున్నాడు గాబోలనుకొని, "చెప్పుబాబూ" అన్నాడు నాటక యజమాని ఆత్రంగా.

"మీ రెలాగూ భక్తిరస ప్రధానమైన నాటకాలు వేస్తున్నారు. ఇకమీదట ఇలాంటి భక్తిరస నాటకాలే వేస్తామని నియమం పెట్టుకోండి. అదే నాకు పారితోషికం." కుర్రవాడి మాటలు విని, ఆశ్చర్యంగా చూశాడు నాటక యజమాని. సత్యం వేరే పారితోషికం తీసుకోవ టానికి నిరాకరించి వచ్చేశాడు.

మరోసారి మరో సందర్భంలో, ఇలాగే మార్కండేయ పాత్ర వెయ్యవలసి వచ్చింది సత్యం. ఆ నాటకంలో గూడా సత్యం నాటక రసికుల్ని ఉర్రూతలూచాడు. ఆ నాటకంలో మార్కండేయుడి మెడలో యమధర్మరాజు పాశంవేసే సందర్భం వచ్చింది. యమధర్మరాజు పాశం వెయ్యగానే, శివుడి త్రిశూలం తగిలి ఆ పాశం భస్మమైపోయినట్లు ట్రిక్‌లో

చూపించాలి. కాని, ఆ పాశం నిజంగానే కాలిపోయి, యమపాత్రధారికి షాకు కొట్టినట్టయి వొణికిపోయాడు. ప్రజలకు, ఇటు మార్కండేయుడి నటనా, అటు యమధర్మరాజు నటనా గూడా అద్భుతంగా కనిపించినాయి. కాని, యిద్దరిదీ నటన కాదని తెలిసిన నాటక నిర్వాహకులకు ముచ్చెమటలు పట్టిపోయినాయి.

ఇన్ని తెలివితేటలు చూపిస్తున్నా సత్యనారాయణ చదువులో మందకొడిగా వుండటం, బడికి శ్రద్ధగా రాకపోవటం, ఉపాధ్యాయులకు బాధ కలిగిస్తూ వుండేది. అలా బాధపడుతూ వుండేవారిలో సీతారామయ్యగారొకరు. ఒకసారి స్కూలుకి ఫీజుకట్టే సమయం దాటిపోతున్నా సత్యం ఫీజు కట్టలేదని సీతారామయ్యగారికి తెలిసింది. విడిగా పిల్చి "ఈ అశ్రద్ధ ఏమిటి ?" అని మందలించసాగాడు.

సత్యం పెద్ద ఇరుకులో పడిపోయాడు. ఈ మాష్టరుగారు ఇంటికి కబురు చేసినా చెయ్యవచ్చు. కొంప మునిగిపోతుంది. అందుకని ఉన్న విషయం ఆయన దగ్గరే బయట పెట్టాడు.

"సర్, ఇంట్లో డబ్బిచ్చారండీ, తీసుకొస్తున్నానండీ, దార్లో ఒక బీద కుటుంబం పిల్లవాడికి ప్రాణ ప్రమాదంలో వుండి బాధపడుతుంటే, ముందర అక్కడ సద్దేశాను సార్. ప్రాణం ముఖ్యం కదా సార్." అన్నాడు సత్యం అతి వినయంగా.

సీతారామయ్యగారికి నమ్మబుద్ధి కాలేదు. "ఎవరికిచ్చావు, ఎప్పుడిచ్చావు, ఎంతిచ్చావు, ఎందుకిచ్చావు, ఎవర్ని అడిగి యిచ్చావు, ఎవరు చూస్తుండగా ఇచ్చావు, ఎవరి సొమ్మని ఇచ్చావు" ఇలా ఒక అరగంటసేపు క్రాసెగ్జామిన్ చేసాడాయన. చేసి వదిలెయ్యలేదు. ఇదెంతవరకు సత్యమో చూద్దామని వాకబు చేశాడు. అక్షరాలా నిజమని తేలింది. ముక్కుమీద వేలేసుకున్నాడు మాష్టారు.

"ఇదెక్కడి మనిషండీ బాబు. ఈ లోకం కళ లెక్కడా లేవల్లే వుందే! ఇలా అయితే ఎలా బతుకుతాడితను?" అనుకొని జాలిపడ్డాడాయన.

సీతారామయ్యగారు మెత్తని గుండెవాడు. మంచి ఆదర్శాలు గలవాడు. ఆయన సత్యం మీద నిజంగా జాలిపడి ఆ నెలకు ఫీజు తానే కట్టేశాడు. చేతలలో జాలి చూపించేవారు లోకంలో నిజంగా అరుదు. ఒకసారి ఈ సీతారామయ్య గారితో పాటు కృష్ణారావు గారనే మరో ఉపాధ్యాయుడు కలిసి వుండగా సత్యనారాయణ వారి దగ్గరకు వెళ్ళటం సంభవించింది.

"ఇతని దగ్గర ఏదో మహాశక్తి వుందండీ. భవిష్యత్తులో ఇతనేమవుతాడో చెప్పలేం కాని, చదువుమీద మాత్రం శ్రద్ధ లేదండీ" అన్నాడు సీతారామయ్యగారు.

"చదువు మీద శ్రద్ధ లేకుండా పైపై యెన్నున్నా ఏమీ లాభం లేదు" అన్నాడు కృష్ణారావుగారు.

సత్యం సన్నగా నవ్వి, "చూడండి మాష్టారూ, అందరూ నన్ను మొద్దూ, మొద్దూ అని నిందిస్తూ వుంటారు. కాని మీకు నా శక్తి కొంచెం చూపిస్తా! భయపడకండే" అన్నాడు. అలా అంటూనే తన జేబులోంచి రెండు సూదులు తీసి, తన రెండు కళ్ళల్లోనూ పొడుచుకున్నాడు. రెప్పలమీంచి గుడ్లలోకి కన్నున దిగినాయి సూదులు. కొద్ది సెకండ్లాగి సూదులు బయటికి లాగేశాడు సత్యం. నెత్తురు చుక్క రాలలేదు. కన్ను కందలేదు. ఉపాధ్యాయు లిద్దరికీ కాసేపు రక్త ప్రసారం నిలిచిపోయింది. ఊపిరి ఆగిపోయింది. వాళ్ళు తేరుకునే సరికి కొన్ని నిమిషాలు పట్టింది.

"సత్యనారాయణా! క్లాసులో నీ కిష్టమైతే చదువు, లేకపోతే మాను. అంతేగాని, ఇలాంటి సాహసపు పనులు మాత్రం మళ్ళీ చెయ్యకు బాబూ, మళ్ళీ చెయ్యకు" అన్నారు ఉపాధ్యాయు లిద్దరూ గుండెదడ ఆపుకుంటూ.

ఆ సంవత్సరం గూడా సత్యనారాయణ మామూలు ప్రకారం, అత్తెసరు మార్కులతోనే పాసయ్యాడు.

ఇంటి దగ్గర గణపతి దేవాలయంలో సేవ యథాప్రకారంగానే నడుస్తోంది. గణపతి మాత్రం- "సమయం దగ్గరకు వచ్చింది. నేను నీ దగ్గర కొచ్చేస్తా" అనసాగాడు అప్పుడప్పుడు.

విని విని- "అర్థమయ్యేట్టు చెప్పరాదూ" అన్నాడు సత్యం ఒకరోజున. "ఏముంది? నీ తపస్సు పరిణామ దశకు వస్తోంది. మీ అమ్మ వేసిన విత్తు మొలకకు వస్తోంది" అన్నాడు గణపతి.

విని వూరుకున్నాడు సత్యం.

గణపతి ఏ శుభ ముహూర్తంలో ఆ మాట అన్నాడో గాని, సత్యం ఆధ్యాత్మిక జీవితంలో నిజంగానే బయటకు కనిపించే మార్పు రాసాగింది. నోరు తెరుచుకొని, ఆకాశంలోకి వెర్రి చూపులు చూస్తూ గంటల తరబడి వుండటం తరచు అయింది. పరధ్యానం మామూలయింది. జపం తెమలక పోవటం నిత్యకృత్యమైంది. ఒడుగు కానివాడికి జపాలేమిటని ఇంట్లో విసుక్కోవటం అలవాటయిపోయింది. అయితే, నాకు ఒడుగు చేసేయండని సత్యం, పట్టు బడుతూ వుండటం పరిపాటి అయిపోయింది.

ఇది యిలా వుండగా "మీ సత్యనారాయణ విభూతి యిచ్చాడు, మా వాడి జ్వరం తగ్గిపోయింది" అనో, "మీ సత్యనారాయణ ప్రశ్న చెప్పాడు. దాని ప్రకారం మా పిల్లవాడు దొరికాడనో, "మీ సత్యనారాయణ బియ్యం మంత్రించి యిచ్చాడు. మా పసివాడికి ఆకలి పుట్టింది" అనో ఏదో ఒక వార్త దాదాపు ప్రతిరోజూ శేషగిరిశాస్త్రిగార్ని చేరసాగింది. ఏటిలో మరీ సన్నిహితమైన సంఘటన ఇంటి వారందర్నీ ఒకసారి కొద్దిగా కుదిపింది.

వాళ్ళింట్లో పాలు పోసే గౌరమ్మకి గేదెల గౌరమ్మ అనేది, ప్రజా ప్రదత్తమైన బిరుదు. ఒకరోజు ఈ గేదెల గౌరమ్మ నరానరి శేషగిరిశాస్త్రి గారింటికి వచ్చి, చిన్న పంతులుగార్ని పిల్చి "బాబూ! మా గేదెకి ఏదో పుట్టిందయ్యా! పాలిచ్చి చావటం లేదు. పిల్లలు గల దాన్ని. ఆ గేదే ఆధారం నాకు, కాస్తేదయినా ఉపాయం చేసి పెడుదూ, చచ్చి నీ కడుపున పుటతాను! మా బాబుగా!" అన్నది సైరనంత గొంతేసుకొని. "నువ్వు చావా వద్దు, నా కడుపున పుట్టనూ వద్దుగాని, ఓ గుమ్మడికాయ, ఓ గుప్పెడు నువ్వులు సిద్ధం చేసుకో, వస్తాలే.... నేనే వస్తా మీ యింటికి" అన్నాడు సత్యం నదురూ బెదురూ లేకుండా!

"ఓరి వీడి డాంబికం తగలడిపోను" అనుకున్నారు ఇంట్లోవారు. ఆ మర్నాడు పొద్దున సత్యం గౌరమ్మ యింటికి వెళ్ళాడు. తనకు నోటికి వచ్చిన పద్యాలూ, శ్లోకాలూ నాలుగు చదివాడు.

అక్కరకు రాని చుట్టము
ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు
తొండము నేక దంతమును
సిద్ధిర్భవతుమే సదా

ఇలాంటి మంత్రాలు ఒకటో, రెండో చదివి, ఓ చెంచాడు నీళ్ళు ఆ గేదెమీద పోశాడు. "ఇహ పాలు పితుకు" అన్నాడు. మామూలుగా ఇచ్చే అన్ని పాలూ ఇచ్చేసింది గేదె. గౌరమ్మ పొంగిపోయి, గేదెపడ్డల్లే పడుతూ లేస్తూ సత్యానికి దణ్ణాలు పెట్టింది. ఆ గుమ్మడికాయ, నువ్వులు మాత్రమేగాక, ఓ సేరు బియ్యం గూడా సత్యానికి సమర్పించింది. అవన్నీ తుండు గుడ్డలో మూట గట్టుకొని, బుజాన వేసుకొని, తన తండ్రి వాలకంలో ఇంటికి చేరాడు సత్యం.

ఇంట్లో వాళ్ళు యీ మూట విప్పి చూసి, "ఛీ ఛీ, ఆ శూద్రదాని దగ్గర ఈ నువ్వుల దానం పట్టావా యేమిట్రా, శని మొహమా" అన్నారు ఏవగింపుగా.

"శూద్రులు గనుక సంపన్నులైతే శూద్రత్వ దోషం ఉండదనుకుంటా" అన్నాడు సత్యం. ఈ మాటతో ఎవరికి వారు తలో పని మీదా తలో వైపుకూ సర్దుకున్నారు.

మరోసారి యీ గౌరమ్మే వచ్చి తన మనవడికి వొంట్లో బాగుండలేదని ప్రార్థిస్తే, ఆవిడ దగ్గర బెల్లపు గోపురం దానం పుచ్చుకొని అది నయం చేశాడు సత్యం. చెవిన బడటమే గాక, కంటబడటం యెక్కువ అయ్యేసరికి, ఇక "వీడేదో క్షుద్ర మంత్రం పట్టాడేమో" అనే అనుమానం బంధు వర్గంలో ప్రబలసాగింది.

* * *

## ఉపనయనం

ఇదిలా వుండగా ఈ మాటు వేసవి సెలవుల్లో, ఎందుకోగాని, సత్యం ఎక్కువగా పార్వతమ్మగారింట్లోనే కాలక్షేపం చేస్తున్నాడు. అక్కడ "నాకు ఒడుగు చెయ్యండి" అని తాతగార్ని రోజూ పోరుకు తింటున్నాడు. ఒడుగంటే సామాన్యమా ? ఎంత ఖర్చు ?

అందుకే "వీడికిప్పుడు ఒడుక్కేమి తొందరొచ్చే, ఏ ఆడపిల్ల పెళ్ళిలోనో కలిపి చేసేద్దాం, ఇప్పుడక్కర లేదు" అని తీర్మానించారు పెద్దలంతా.

ఈ లోగా వికారి సంవత్సరం (1960) ప్రవేశించింది. శ్రీరామ నవమి వెళ్ళిపోయింది. ఒక రోజు సత్యం గంభీరంగా తాతయ్య దగ్గర కొచ్చి, "తాతా, నాకో అయిదు రూపాయలియ్యి" అన్నాడు.

"ఎందుకురా ?"

"ఇవ్వు, చెపుతాగా"

"చెప్పవోయ్, ముందర"

"నేను నంజన్‌గూడ వెళ్ళి ఒడుగు చేసుకొస్తా"

"అదేం పనిరా ?"

"అక్కడ మా నాన్న పట్టించుకోడు, ఇక్కడ నువ్వూ పట్టించుకోవు. నాకు పదహారో ఏడు గూడా వెళ్ళిపోయె. ఇంకేం చెయ్యమంటావు ?"

"ఆ ఒడుగు లేకపోతే యేంరా మన కిప్పుడు ?"

"తాతా, మనం పుట్టటం మన చేతుల్లో లేదు. భగవంతుడు ఏ యింట్లో పుట్టిస్తే, ఆ యింట్లో పుట్టాల్సిందే. బ్రాహ్మణుడై పుట్టినవాడికి పదహారు రకాల సంస్కారాలు వున్నై. అవి చేసుకొని తీరాల్సినవి. ఈ పదహారు సంస్కారాలూ, ఉపనయనం మీద ఆధారపడి వున్నాయి. అది లేకపోతే, వాడికి బ్రాహ్మణత్వమే లేదు, అనుష్ఠానార్హత లేదు. ఉపనయనం అంటే భగవంతుడి దగ్గరకు తీసుకుపోవటం అన్న మాట. అందుకె అది రెండవ జన్మ అన్నారు. అది భగవంతుడికీ, భక్తికీ సంబంధించిన విషయం. అంతేగాని పదిమంది చేరి, తిని, సంబరాలు చేసుకోవటానికి సంబంధించింది కాదు. అది తెలీక, దానికి లేనిపోని లాంఛనాలు చేర్చి దాన్ని మోయలేనంత బరువు చేసుకొని, అందుకోసమని దాన్ని తప్పించుకు తిరుగుదామను కోవటం మూర్ఖత్వం. అంచేత, నాకు వొడుగు అయి తీరవలసిందే. నంజన్‌గూడలో ఏవో సామూహిక ఉపనయనా లున్నాయట. అక్కడికి పోతే, ఎవరో దంపతులు దొరక్కపోరు, వాళ్ళ కాళ్ళు పట్టుకుంటే నా మెళ్ళో ఓ జందెప్పోగు వెయ్యకపోరు. అందుకోసమని చార్జీలకు ఓ అయిదు రూపాయి లియ్యి చాలు.

మనవడి గంభీరోపన్యాసం విని, అతని పట్టుదల గ్రహించాడు లింగణ్ణగారు. ఆయనకు తన మనవడు దిక్కులేని వాడిలాగా అలా సామూహిక ఉపనయనాల్లో వొడుగు చేయించు కోవటం యిష్టం లేకపోయింది. దాంతో ఆయన వెళ్ళి శేషగిరిశాస్త్రిగారితో ముచ్చటించాడు.

సత్యం అక్కడికి చేరాడు. "ఇప్పటికే కాస్త పూజ చేయిస్తున్నానా? హారతి యిస్తున్నానా? మెళ్లో వో జందెపు పోగు పడితే, జపానికీ పనికొస్తాను, కనీసం తద్దినపు బ్రాహ్మడికయినా పనికొస్తాను. పెదనాన్నగారి చేతికింద వుంటే, ఏదో వో రూపాయి రానూ వస్తుంది, ఇంట్లో వేన్నీళ్ళకు చన్నీళ్ళుగానూ వుంటుంది, నాకు అనుభవమూ వస్తూ వుంటుంది" అన్నాడు. ఈ రాగం శేషగిరిశాస్త్రిగారి దగ్గర నాగస్వరంలాగా పనిచేసింది. ఆవేశేషుడులాగా తలకాయ వూపాడాయన, "అదీ నిజమే" అంటూ.

సత్యం పట్టుదల ప్రకారమే, ఆ నంజనుగూడా వొడుగుల ముహూర్తానికే, ఇక్కడ సత్యానికి ఉపనయనం నిశ్చయమైంది. శేషగిరిశాస్త్రిగారు, శారదమ్మగారు పీటలమీద కూర్చున్నారు. అత్యంత నిరాడంబరమైన విధానంలో ఉపనయన కార్యక్రమం సాగుతోంది. పీటలమీద కూర్చున్న దగ్గర నుంచీ గూడా, మామూలు మనిషిగా లేడు సత్యం. "ఒడుగు, ఒడుగు అని అంత వుత్సాహపడ్డాడు. ఇప్పు డేమిటి, ఇలా మట్టి ముద్దల్లే కూర్చున్నాడు!" అనుకుంటున్నారు బంధువులు.

శేషగిరిశాస్త్రిగారు సత్యం కుడిచేయి పట్టుకొని, "ఓ వటువా, అగ్ని నీకు గురువు. నేను నిన్ను అగ్నికి, సోమునకు, సవితకు, సరస్వతికి, మృత్యువునకు, యమునకు, గదునకు, అంతకునకు, జలములకు, ఓషధులకు, పృథివికి సమర్పించుచున్నాను. వారు నిన్ను రక్షింతురు" అనే అర్థం వచ్చే మంత్రాలు చెప్పి, అతని కుడిచెవిలో మంత్ర జపం చేసి, బ్రహ్మోపదేశార్థం తను సిద్ధింపచేశాడు.

బ్రహ్మోపదేశ సమయం దగ్గర పడుతోంది. యాజ్ఞికం చేయిస్తున్న కృష్ణస్వామిగారు హడావుడి పడుతూ, "యోగే, యోగే" హోమాలు చేయిస్తున్నారు.

"పెదనాన్నగారూ, గణపతి వచ్చేశాడు. నేను వెళతాను" అన్నాడు సత్యం ఉన్నట్టుండీ పీటల మీంచి లేస్తూ. అతని కంఠంలో ఆదుర్దా స్పష్టంగా కనిపిస్తోంది. "బ్రహ్మోపదేశం అయ్యే వరకూ పీటల మీంచి లేవరాదు. కదలకుండా కూర్చో" అని భుజాల మీద చెయ్యి వేసి నొక్కాడు శేషగిరిశాస్త్రిగారు విసుగ్గా. గణపతి అన్నవాడు సత్యం స్నేహితుల్లో ఎవరో వొకరయి ఉంటారనుకున్నా డాయన.

ఒక్క క్షణం ఆగాడు సత్యం. కాని, అంతలోనే, "పెదనాన్నగారూ, గణపతి తొండం ఆడిస్తూ, తొందరగా వచ్చెయ్యమంటున్నాడు. నేను వెళ్ళాలి" అంటూనే ఒక్క ఉదుటున లేచి పక్కగది వాకిలి దాకా వెళ్ళి, ఆ తలుపుకి దణ్ణం పెడుతూ ఏదో గొణుగుతూ నిలబడి పోయాడు. వొడుగు చేయించే కృష్ణస్వామిగారు సత్యం వెనకాలే వెళ్ళి చెయ్యి పుచ్చుకున్నాడు.

"ఒరే అబ్బాయీ! ఇలా పిచ్చిపిచ్చిగా ఆటలాడే సమయం కాదురా ఇది, జగన్మాత గాయత్రీదేవిని ధ్యానించాల్సిన సమయం ఇది" అన్నాడు లాలనగా.

"అదిగో చూడండి, కనిపించటంలా? ఏనుగు తల, ఒంటి దంతం, పొడుగాటి తొండం, డొల్లుబొజ్జ. ఆయనే గణపతి. ఆ తలుపు నానుకొని నుంచున్నాడు. మీకు కనిపించటం లేదా?" అన్నాడు సత్యం ఆనందంగా. ఆసరికి అక్కడికి చేరిన శేషగిరిశాస్త్రిగారు గూడా ఆ మాటలు విన్నారు.

పెద్దలిద్దరూ అయోమయంగా ఆ తలుపువంక చూశారు. ఆ తలుపుమీద ఏనుగు తల, కదులుతున్న తొండం, వీటి నీడ కనిపిస్తోంది. కానీ ఆకారం మాత్రం కనిపించటం లేదు. ఆ నీడ గూడా వెంటనే మాయమయి పోయింది. ఈలోగా చేతులు జోడించుకొని, ఆ గణపతి ఏదో చెపుతున్నట్టు, తను వింటున్నట్టూ శ్రద్ధగా తల ముందుకు సాచి వినయంగా నిలబడి నోట్లో నోట్లోనే ఏదో చెప్పుకుంటున్నాడు సత్యం. పెద్దలిద్దరూ తెల్లబోయి చూస్తూ నిలబడి పోయారు. ఒకటి రెండు నిమిషాలయ్యాక సత్యం వెళ్ళి పీటలమీద కూర్చున్నాడు. పెద్దలిద్దరూ ఒకసారి మొహాలు చూసుకొని, వచ్చి కూర్చుని మిగిలిన కలాపం కొనసాగించారు. హోమాలు పూర్తి చేసి, గాయత్రీ ఉపదేశం చేశారు. తరువాత దండ ధారణ చేయించి సూర్యోపస్థానం చేయించారు. ఇక పీటల మీద శేషగిరిశాస్త్రి-శారదమ్మల పని అయిపోయింది. ఇక వటువు అగ్ని కార్యం చెయ్యాలి. అక్కడ—

* "అగ్నయే సమిధ మహార్షం-బృహతే జాతవేదసే
యథాత్వమగ్నే-సమిధా సమిధ్వస
ఏవం మామాయుషా వర్చసా సన్యామేధయా
ప్రజయాపశుభి ర్బ్రహ్మ వర్చసేన
అన్నాద్యేన సమేధయ స్వాహా"

అనేది మొదటి మంత్రం. ఈ మంత్రం చెప్పించి సమిధ వేయించారు సత్యం చేత. అంతే!

సత్యం ముందువున్న అగ్ని జ్వాల ఒక్కసారి నాలుగు రెట్లు పెద్దదయింది. ఉన్నట్టుండి ఆ గదంతా వేలకొద్దీ మెరుపులు మెరిసినట్లు ఒక్కసారి వెలుగుతో నిండిపోయింది. అంతా ఎంతసేపు? ఒక సెకండు గూడా వుందో లేదో! కానీ ఆ క్షణకాలం సత్యం దృష్టిలో కొన్ని గంటల కాలమంత విశ్రాంతిగా వున్నది. ఆ మహాకాంతి అతని కన్నులకు చిరుదీపం లాగా వుంది. ఆ దీపపు చల్లని వెలుగులో ఒక పెద్ద ఆకారం అతనికి దర్శన మిచ్చింది. ఆ బృహదాకారంలో సమస్త బ్రహ్మాండాలు, చతుర్దశ భువనాలు, చరాచర జీవరాసులు, వ్యక్తావ్యక్త ప్రపంచాలూ అన్నీ అంగాలుగా అమరిపోయినాయి. అద్భుతమైన రూపం అది. ఆనంద ప్రదమైన రూపం అది. ఈ బృహదాకారం పూర్వం అమ్మ సమక్షంలో ఒకసారి దర్శించిన

---

* బృహదాకారుడును, వేదములకు జనకుడును అగు అగ్నిదేవునకు నేను సమిధ నర్పించుచున్నాను. ఓ అగ్నీ! ఈ సమిధతో నీవెట్లు వృద్ధి చెందుచున్నావో అట్లే నన్ను ఆయుస్సుతోడను, వర్చస్సుతోడను, తెలివితోడను, సంతానముతోడను, పశువులతోడను, బ్రహ్మ వర్చస్సుతోడను, అన్నాదులతోడను వృద్ధి పొందింపుము.

మధురాకారమే. ఒకటే చిన్న భేదం. అప్పుడు ఆ ఆకారం సంకోచించినప్పుడు కోదండరాముడు కనిపించాడు. ఈ ఆకారం సంకోచించగా, ఏనుగు తలకాయ కనిపిస్తోంది. ఆ ఆనంద లీనస్థితిలో వుండిపోయాడు సత్యం.

గదిలో వున్న వాళ్ళకు ఒక్కసారి కళ్ళు మిరుమిట్లై మళ్ళీ మామూలయి పోయింది. ఎవరికీ ఏమీ మాట్లాడ బుద్ధి కావటం లేదు. నోరు తెరవాలంటే భయంగా వుంది. ఎవరికివారు బిగుసుకు పోయారు. ఒకటి రెండు నిమిషాల తరువాత సత్యం కళ్ళు తెరిచి, "కానీండి" అని హెచ్చరించేదాకా ఆ గదిలో చలనమే లేదు.

"వీడిలో ఏదో కొంచెం విశేషం వున్నట్టే వుంది. ఎక్కడైనా ఏ మంత్రోపాసనయినా పట్టాడేమో! ఏమయినా, ఉపనయనం చేసుకోవాలని పట్టుబట్టాడు. ఉపనయనాగ్నిలో విశేషం కనిపిస్తోంది. వీడిది మనం అనుకున్నట్టుగా క్షుద్రం కాదేమో!" అనుకున్నాడు శేషగిరి శాస్త్రిగారు. ఇంట్లో అందరూ ఏదో ఇలాంటి భావన చేసినవారే. కాని మాయాబలం గొప్పది. త్వరలోనే యీ స్మృతి అందరిలోనూ హరించుకుపోయింది.

ఉపనయనం తంతు పూర్తయింది. గాయత్రీ మంత్రాన్ని మనస్సుకు అనుసంధించి నిశ్చలంగా కూర్చుండి పోయాడు సత్యం. కొద్దిసేపు అలా జరిగింది. మనస్సు యింకా అంతరుఖ్మంలోనే వుంది. కాని, ఏవో మాటలు వినిపించసాగాయి. ఏమిటూ అని జాగర్తగా విన సాగింది మనస్సు.

* ధ్యాయే స్థిరేణ మనసా గణేశం సర్వ సిద్ధిదమ్ ।
బుద్ధి ప్రకాశకం పూర్ణం యోగినాం హృది సంస్థితమ్ ॥

ఈ శ్లోకం మూడుసార్లు వినిపించింది. ఆ తరువాత కొంతసేపు ధారాప్రవాహంగా శ్లోకాలు వినిపించసాగాయి. ఆ ధార ఆగినాక మనస్సులో అవి ధారణ అయినాయా లేదా అని చూచుకున్నాడు సత్యం. ప్రొద్దుటూరు తరువాత ధారణ పని రావటం మళ్ళీ యిప్పుడే. ఫరవాలేదు, ధారణ అయింది" అనుకున్నాడు సత్యం. ఇంతలో—

"ఔనూ ఇది ముద్గల పురాణం గదూ, ఇదివర కెప్పుడో చదివిందే. ఇందులో మూడ ధ్యాయాలు ఇప్పుడు వినిపించాయి. ఎందుకు వినిపించాయో యేమో!" అనుకున్నాడు మళ్ళీ. ఆ రోజు నుంచీ ప్రతిరోజూ కొంతగా, నలభై రోజులు వరసగా ముద్గల పురాణం వినిపించింది. చివరిరోజున చిట్టచివరిగా—

---

* అన్ని సిద్ధులను అనుగ్రహించువాడును, బుద్ధిని ప్రకాశింప జేయు పరిపూర్ణుడును, యోగుల హృదయము నందున్నవాడును అగు గణేశుని స్థిరమగు మనస్సుతో ధ్యానింతును.

విశ్వం చరాచరం సర్వం
జానీయాత్ తత్స్వరూపకమ్॥
సర్వేషాం హిత భావేన
భజేత్తం ద్విరదాననమ్॥

* అనే శ్లోకం వినిపించింది.

"ఇదీ గణేశుడి అసలు తత్వం. అందుకనే ఉపదేశ కాలంలో ఆ రూపం దర్శింప చేశాడు స్వామి. ఇక మన కర్తవ్యం గూడా ఇందులోనే ఉపదేశించారు. శుభం. ఓం!" అనుకున్నాడు సత్యం.

ఉపనయనమైనాక గుళ్ళో పూజలకు ఎక్కువగా ఉత్సాహం చూపిస్తాడని అంతా అనుకున్నారు. కాని సత్యం మకామే అక్కడినుంచి ఎత్తేశాడు. పార్వతమ్మగారి యింట్లో వుండి రోజూ రానూ పోనూ 15, 16 కి. మీ. నడుస్తున్నాడు.

కెసరేలో స్థిరపడిన దగ్గరనుంచీ సత్యానికి ఇంట్లో పూజ పెరిగింది. మొదట్లో మొదట్లో "వీడికేదో బాగుపడే లక్షణాలు వస్తున్నట్టున్నాయి" అని సంతోషించారు పెద్దవాళ్ళు. కాని ఆ లక్షణాలు పెరుగుతున్న కొద్దీ ఇంత చెడిపోయాడేం వీడు అన్నారు. ఎక్కడ నుంచి తెచ్చాడో గాని, ఒక గంట, ఒక శంఖం పట్టుకొచ్చాడు. ఇంట్లో లింగణ్ణగారికి ఒక శివ లింగము, కొద్దిగా దేవతార్చన విగ్రహాలు వున్నాయి. వీటికే రోజూ తెల్లవారు జామున పూజ చేసేవాడు. మొహంమీదికి వాలి గంతులేస్తున్న ఆ చింపిరి జుట్టుకి కాస్త నూనె రాద్దాం, దువ్వు కుందామన్న ఇంగితం లేదుగానీ, ఆ మొహాన విభూతి, కుంకుమ మాత్రం చెరగనీడు. తెల్లవారుజామున నాలిగింటికి విభూతి పెడితే, రాత్రి పడుకునే దాకా, అదలా వుండవలసిందే. ఎప్పుడైనా చెరిగిందనిపిస్తే, తక్షణం మళ్ళీ దట్టించేవాడు. ఆడవాళ్ళకు పమిటమీద ఎంత జాగర్తో, సత్యానికి విభూతిమీద అంత జాగర్త.

ఈ సంవత్సరం స్కూల్లో ఉపన్యాసాలు గూడా మొదలెట్టాడు సత్యం. వాటిల్లో హాస్య ప్రసంగాలమీద ఎక్కువ అసక్తి సత్యానికి. ఆ తరువాత అసక్తి ఆధ్యాత్మిక ప్రసంగాల మీద. ఈ ఉపన్యాసాలు, స్నేహితులలో ఇతనికి "స్వామి" అనీ, "సన్యాసి" అనీ పెట్టుడు పేర్లను తెచ్చిపెట్టాయి.

ఉపన్యాసాలకి పడ్డవాడు చదువుకి పనికిరావటం అరుదు. సత్యం చదువు మరింత వెనకబట్టింది. పైగా అతనికోసం ఇంటికి వచ్చేవారి సంఖ్య పెరిగింది. ఆ వచ్చేవాళ్ళలో ఇతనికంటే బాగా పెద్దవాళ్ళూ, కొందరు బాగా చదువుకున్న వాళ్ళూ వుండటం ఇంట్లో వాళ్ళకి ఆశ్చర్యకరంగానే వుండేది.

---

* చరాచరమైన యీ విశ్వము సర్వము ఆ గణేశుని స్వరూపమే అని తెలియవలెను. అట్టి ఆ గజ ముఖుని అందరకు హితమును కలిగించు భావనతో సేవించవలెను.

ఇంట్లో పార్వతమ్మగారూ మొదలైన వాళ్ళకీ మరో ఆశ్చర్యం వుంది.

పార్వతమ్మగారు నడిపే శిశువిహారానికి వార్షికోత్సవాలు చేసేవారు. ఆ వుత్సవాలకి, పెద్ద పెద్ద వాళ్ళని అధ్యక్షులుగా, ఉపన్యాసకులుగా పిల్చుకొచ్చేవాడు సత్యం. అంతకు ముందు పార్వతమ్మగారు ప్రయత్నం చేస్తే సరిగ్గా సమాధానం గూడా చెప్పని వాళ్ళను సత్యం నిమిషంలో కుదుర్చుకొచ్చేవాడు. ఒకసారి సత్యం తెచ్చిన వక్తల ఉపన్యాసాలు విని, "ఈ వూళ్ళో ఇలాంటి పండితుడు ఈ మూలపడి ఉన్నాడని తెలీదే." అనే వాళ్ళు శ్రోతలు. సత్యం చేసే యేర్పాట్లు ఇంట్లో వాళ్ళకి నిజంగానే ఆశ్చర్యకరంగా వుండేవి. ఈ వార్షికోత్సవాల్లో వేదిక నిర్వహణకీ, అలంకారానికీ ద్వారకా ఎంతో సహకరించేవాడు.

నాటకాల ట్రూపు, ఫుట్‌బాల్ ట్రూపు మాత్రమేగాక అల్లరి కుర్రకారు ట్రూపు వొకటి ద్వారకా చేతిలో వుండేది. రాత్రిళ్ళు ఇళ్ళ దొడ్లల్లోకి దూకి కొబ్బరి కాయలూ, బొప్పాయి కాయలూ దులిపిపారెయ్యటం, సంక్రాంతి పండగప్పుడు కనిపించిన చెక్కలు లాక్కువచ్చి సంక్రాంతి మంట లెయ్యటం ఆ కుర్రగుంపుకి సరదా! పట్టుకోబోయిన వాళ్ళని ఏడిపించటమూ అవసరమైతే నాలుగు తన్నటమూ సరదా.

రోజురోజూ ద్వారకా యింటిమీదికి ఏదో కుటుంబం వెళ్లి ఫిర్యాదు చేసి వస్తూ ఉండటం, ద్వారకాకి తండ్రి చేతిలో బెల్టు దెబ్బలు తింటేగాని నిద్దర పట్టక పోవటం నిత్యకృత్యమై పోయింది. ఈ దుష్కృత్యాన్ని వారిద్దామని సత్యం అనేకసార్లు ప్రయత్నించాడు గాని, ద్వారక లొంగలేదు. "సర్లే, దానికి ఇంకా కొంచెం టైముందిలే" అనుకొని వూరుకున్నాడు సత్యం.

అయితే, ద్వారకా దగ్గర కొన్ని విశేషాలుండేవి. పిల్చి "బాబూ, ఈ పని నీ వల్ల కావాలి" అని అడిగితే, తనే గాదు తన ట్రూపు లన్నింటినీ నిలబెట్టి పనిచేసి పెట్టేవాడు. కెసరే సెంటర్లో జరిగే వినాయక చవితి ఉత్సవాలకు వొళ్ళు విరుచుకుని పని చేసేవాడు. ఈ ఉత్సవాల వల్లే సత్యం అతన్ని వదలలేక పోయేవాడు. సత్యానికి గూడా వినాయక ఉత్సవాలంటే ప్రాణం మరి !

మిత్రులందరూ సత్యాన్ని ఎన్ని హాస్యాలు చేసినా, సరదాగా ఎన్ని కబుర్లు చెప్పినా మిత్రులెవరూ అతన్ని "ఏరా, పోరా" అని నీచంగా సంబోధించేవారు కాదు. ఎవరైనా అలా అతన్ని పిలిస్తే, వాళ్ళకి కడుపు నొప్పి వస్తుంది అని మిత్ర వర్గంలో ఒక పేరు బడ్డది.

ఇంట్లో వాళ్ళకు మాత్రం సత్యం మీద విలువ రాను రాను తగ్గిపోతోంది. చదువు మీద శ్రద్ధ లేకపోవటం, వంటి శుభ్రం, బట్ట శుభ్రం లేకపోవటం, ముక్కు చీమిడి తుడుచుకోవటం గూడ మరిచిపోయి, నోరు తెరుచుకొని ఆకాశంలోకి వెర్రి చూపులు చూస్తూ కూర్చోవటం, అడ్డమైన వాళ్ళతో స్నేహాలు చెయ్యటం ఇత్యాది కారణాలు వెయ్యి వున్నాయి వాళ్ళకి.

క్రమంగా ఇతను ఏవో ప్రశ్నలూ వగైరాలు చెపుతున్నాడు, విభూతులిస్తున్నాడన్న మాట గూడా ఇంట్లో అతని విలువ తగ్గించటానికే ఉపయోగించింది. అందుకనే, వారి బంధువు పోస్టల్ ఇన్‌స్పెక్టర్ కృష్ణప్పగారు ఒకసారి, " ఎక్కడైనా యక్షిణీ సిద్ధి పట్టావా యేమిటోయ్ సత్యనారాయణా " అని అడిగాడు. ఇటు అటు చూసి ఎవరూ లేనప్పుడు, "ఔను భావయ్యా" అని తన సాధనా రహస్యం విప్పి అప్పచెప్పాడు సత్యం. ఆయన గూడా " నేను కనిపెట్టేశా గదా " అని సంతోషించాడు.

స్కూల్లో పెద్దలు మాత్రం, ఇతని పై ప్రతిభలకు ఎక్కువ సంతోషించి ప్రోత్సహిస్తూ వుండేవారు. అలాంటి వారిలో అతని స్కూల్ హెడ్ మాష్టరు శ్రీనివాస్ అయ్యంగారు వొకరు. ఒకసారి వినాయక చవితి ఉత్సవాలకు ఆ హెడ్ మాష్టరుగారు అనంత పద్మనాభ భాగవత్ గార్ని ప్రధాన ఉపన్యాసకులుగా పిల్చాడు. భాగవత్‌గారు ఆ వూళ్ళోనే దళవాయి హైస్కూల్లో ప్రధానోపాధ్యాయుడు, సుప్రసిద్ధ హరికథకుడు, ప్రశస్తమైన ఉపన్యాసకుడు. ఆ రోజు భాగవత్ గారు గంటపైగా అనర్గళోపన్యాసం చేశాడు.

ఉపన్యాసం అయినాక సత్యం వెళ్ళి భాగవత్ గార్ని బాగా అభినందించాడు. విద్యా వయో వృద్ధులైన భాగవత్‌గారు, యీ బాలుడి అభినందనను, అంతగా లెక్క చెయ్యలేదు. ప్రక్కనే వున్న అయ్యంగారు మాత్రం-

" సత్యనారాయణ అని ఇతను మా విద్యార్థండీ. ఇతని దగ్గర విచిత్రమైన ప్రతిభలు అనేకం వున్నాయి. ఇతను మీరు జ్ఞాపకం పెట్టుకో దగ్గవాడు " అన్నాడు. నమస్కారం పెట్టి వెనక్కి వస్తూ అనుకొన్నాడు సత్యం. " మీరు గుర్తు పెట్టుకోలేరు లెండి, నేనే మిమ్మల్ని గుర్తు పెట్టుకుంటాను " అని.

## వేషం

ఇలా రోజులు సాగుతుండగా, ఒక రోజున శేషగిరిశాస్త్రిగారి యింట్లో ఏదో వ్రతం తల పెట్టుకున్నారు. ఆ వ్రతానికి బంధువులంతా వెళ్ళారు. సత్యమూ వెళ్ళాడు. ఆ వ్రతానికి అంగంగా హోమం గూడా వుంది. చూడటానికి వెళ్ళిన సత్యం చూసి సంతోషించక, పట్టు బట్టలు కట్టుకొని తనూ హోమం దగ్గర పోయి కూర్చున్నాడు.

అసలే చోటు తక్కువ. ఋత్విక్కులు గాక, యీ కుర్ర కుంక గూడా అక్కడే చేరితే విసుగుగా వుండటం సహజం. " నాయనా, సత్యనారాయణా! నువ్వు కూర్చోవాల్సింది అక్కడ, ఇక్కడ గాదు. మనం దానికే పని కొస్తాం " అన్నాడు శేషగిరిశాస్త్రిగారు భోజనాలు చేసే చోటు చూపిస్తూ. పిల్లలంతా గొల్లున నవ్వారు.

నలుగురిలో పట్టుకొని సత్యాన్ని అంతమాటన్నాడంటే శేషగిరిశాస్త్రిగారు వూరికే అనలేదు. ఈ మధ్యే సత్యం ప్రజ్ఞ ఆయన ప్రత్యక్షంగా చూశాడు. జరిగిన లగ్గసరిలో, వొకే ముహూర్తానికి పదిచోట్ల పెళ్ళిళ్ళు చేయించవలసి వచ్చింది. ఈయన చేతికింద అంతమంది యాజ్ఞీకులు దొరకటం కష్టమేగదా! తప్పని పరిస్థితిలో, ఒక చోటికి సత్యాన్ని పంపించాడు. "వాళ్ళకు ఏదో సూత్రప్రాయంగా నడిపిస్తే చాలు, మెల్లిగా నువ్వే నడిపెయ్యి" అని.

ఏదీ తనకు రాదనడు పాపం, సత్యం. ఆ ఇంటివాళ్ళు ఎంత తెలీని వాళ్ళయినా, శేషగిరి శాస్త్రిగారికి లోపల గుబులు గుబులుగా పీకుతూనేవుంది, "వీడేం చేయిస్తాడో ఏమో" అని. అందుకే సందులో సందు చేసుకొని, ఓ అడుగు ఆ పెళ్ళియింటికి వెళ్ళాడాయన. వెళ్ళేసరికి ఖంగున మంత్రాలు చెపుతున్నాడు సత్యం. కాని, ఆ మంత్రాలు విని తెల్లబోయాడు శేషగిరిశాస్త్రిగారు.

ఆయన చటుక్కున సత్యాన్ని ఇవతలికి పిలిచి "ఏంపనిరా ఇది, నువ్వు చదివేవి ఏమిటను కుంటున్నావు?" అన్నాడు.

"గరుడ పురాణం పెదనాన్నగారూ" అన్నాడు సత్యం వినయంగా.

"అవి ఎక్కడ చదువుతారో తెలుసా" అన్నాడు శేషగిరిశాస్త్రిగారు వెర్రెత్తిపోతూ.

"ప్రేతకర్మల్లో గదా" వెంటనే చెప్పేశాడు సత్యం.

"పెళ్ళిలో మరి అవి చెపుతావేమిటి? ఎవరైనాం తెలిసిన వాళ్ళు వింటే పీక పిసికేస్తారు, తెలుసా?"

"తెలీనివాళ్ళు వింటేనే ఆ పని చేస్తారు."

"ఏమిటి నువ్వు చెప్పేది?

"పెదనాన్నగారూ, ఈ వధూవరులకు పితృశాపంవుంది. ఎదురుకుండా పితృదేవతలు ఆగ్రహంగా కూర్చున్నారు. ఈ మంత్రాలు చెపితే వాళ్ళు శాంతించి, వధూవరులకు శుభం చేస్తారు. తక్కిన భయాలు మీకొద్దు, నాకొదిలెయ్యండి నేను చూసుకుంటాగా!"

"ఎవరు నమ్ముతార్రా నీ మాట"

"ప్రస్తుతం మీరు నమ్మండి చాలు"

ఇంత నదురు బెదురు లేనివాడికి ఎవరేం చెప్పగలరు? శేషగిరిశాస్త్రిగారు నోరు నొక్కుకొని అవతలకు వెళ్ళి చెంపలేసుకొన్నాడు. అలాంటి అనుభవం వున్నాక, ఆ కుర్రవాడు హోమం దగ్గర కూర్చుంటే ఆయనేం చెయ్యగలడు? అప్పటికి వీలయినంత సౌమ్యంగా భోజనాల దగ్గరకు పంపించేశాడు. ఇందుకు సత్యం చల్లగానే వున్నాడు గాని, గుళ్ళో గణపతి మాత్రం ఉడికిపోసాగాడు.

నాకు లేని భయం మీకెందుకండి బాబూ" అన్నాడు సత్యం గణపతితో.

నీకు ఉపదేశం నేను [illegible]

" మీరు చెప్పినట్టే అనుష్ఠానం చేస్తున్నాగా ''

" ఏంచేస్తే ఏం లాభం ? నువ్వు ఇట్లాగే వుంటే, నువ్వేం చెప్పినా ఎవడూ నమ్మడు. చేసి చూపించినా యెవడూ నమ్మడు."

" ఎలా వుండాలి ? "

" మంచి వేషంలో వుండాలి. వేషంకావాలి లోకానికి. ఇదిగో ఈ తొండం, యీ బొజ్జా వున్నాయే, ఇలాంటి వింత వేషం కావాలి లోకానికి. వాళ్ళను పైకి లాగవలసిన పని నీకు ఉంది గనుక, నీకూ వేషం కావలసిందే ''

* * *

## లోపలి పొరలు

దండిస్వామి ఒకసారి కళ్ళు తెరిచి, మళ్ళీ మూసుకున్నారు. తాను దర్శించిన చరిత్ర తత్త్వాన్ని మరోసారి నెమరు వేసుకొని "గురుప్రభో! ధన్యోస్మి! అనుగృహీతోస్మి" అన్నాడు. అని ఒక క్షణం ఆగి, "తమ సెలవైతే ..."అని ఆగిపోయాడు. ఆయనకు ఏదో సందేహం ఉందని తెలుస్తూనే వుంది.

"అడగండి" అన్నారు స్వామివారు చిరునవ్వుతో.

"ఎంత ప్రయత్నించినా బహిర్ముఖంలో వున్న తమ చిత్తవృత్తిని మాత్రమే దర్శించ గలిగాను. "

"ఇందులో మీకేమి కనిపించింది?"

"దైవశక్తి అడుగడుగున తమ సాధనను నడిపించింది. "

"ఔను! కాని, ఆ దైవశక్తి అంత శ్రమ ఎందుకు తీసుకొన్నది? "

"అది తమ మహిమ."

"పొరపాటు. సాదక దృష్టిలో ఉన్నప్పుడు మహిమ ప్రసక్తి లేదు. ఈ ప్రశ్నకు సమాధానం మీరు చేసిన దర్శనం చివరలో గణపతి చెప్పాడు. ఎవడు మీకు ఉపదేశం ఇస్తాడో, వాడే మీ సాధన సంగతి గూడా చూస్తాడు. కావలసినవి మాత్రం రెండు. చెప్పినట్టు చెయ్యటం ఒకటి, ఏది చెప్పాలో ఆయనకు తెలుసునని మనకు తెలియటం రెండు.

"ఔను. ఇది శాస్త్రాలలో చదివి గూడా పొరపాటు చేశాను. "

"శరీరానికి రెండు పుష్కరాల వయస్సు వున్నది. ఈ శరీరానికి స్వగ్రామం బొమ్మెపర్తి అనే వల్లెటూరు. బాల్యం అంతా ఇంటి పక్కనే వున్న అంజనేయాలయంలో ప్రధానంగా గడిచింది. ఆ రోజుల్లోనే తండ్రి పౌరోహిత్యం కారణంగా గొందిరెడ్డిపల్లి గ్రామంలోని

శివాలయం క్రీడా స్థానమైంది. జన్మస్థలం మేకేదాటులోని సంగమేశ్వరాలయం బడి శెలవులలో తీర్థస్థానమైంది. ఇలా మొదటి పుష్కరం గడిచింది. శరీరపు బాల్యావస్థలో ఈ ఈ సంపర్కాలు మా ప్రయత్నంవల్ల దక్కలేదు. ఆపై పుష్కరకాలంలో బన్నీరుగట్టు, చంపక దామేశ్వర ఆలయం, ప్రొద్దుటూరు శివాలయాలు మాకు స్వగృహాలయినై. నుసం శివ, విష్ణ్వాలయాలు, అనంతపురం శివాలయం. కందుకూరు శివాలయం, నృసింహాలయం, మైసూరు చాముండీ వనంలో చాముండీ దేవాలయం మాకు క్రీడా కేంద్రాలయినాయి. ప్రొద్దుటూరులో అమూల్యమైన సత్సంగమండలి దానంతటది మా చుట్టూ ఏర్పడింది. ఇలా ఈ శరీరం ఎల్లప్పుడూ దేవతలకూ, దేవస్థానాలకూ, సత్పురుషులకూ సన్నిహితంగా జీవించింది. మా మాతృదేవత అనుగ్రహించిన, సంక్రమింప జేసిన దైవశక్తిగాక, ఈ దైవీ సంపర్కశక్తి మా సాధనకు దైవీ సన్నివేశాన్ని సమకూర్చింది. అందుచేత అవి రెండూ పరస్పర దోహద కాములయ్యాయి.

"దీనికి మూలం గురుకృప.

దీనికి మూలం గురుభక్తి.

దీనిమీద మీరు దృష్టి కేంద్రీకరించ వచ్చును."

"చిత్తం. జాగర్త పడతాను, మరొక సందేహం వుంది."

"అడగండి"

"తమ అంతర్ముఖ చిత్తవృత్తిని నేను దర్శించలేక పోయినా, చూచినంత దాన్నిబట్టి తమది ప్రధానంగా యోగ మార్గమేమో అనిపిస్తోంది."

(నవ్వి) "అర్థమైంది. ఈ అష్టసిద్ధుల వెంటబడి తిరిగే యోగ మార్గమేమో అని మీ సందేహం. మీ ప్రశ్న మాకు సంతోషం కలిగిస్తుంది. అణువు నుంచీ ఆత్మస్థితికి చేరవలసిందే ఏ అణువైనా సరే. ఉపాసన నిజంగా జరిగితే సగుణోపాసన ద్వారా నిర్గుణోపాసనకూ, ఆ తరువాత ఉపాసనాతీత స్థితికీ చేరుకోవలసిందే. అయితే మా చుట్టూ సగుణోపాసనాపరులైన భక్తులే ఎక్కువమంది చేరటంవల్ల మా ఉపాసనలోని గుణ భావనా భాగమే ఎక్కువగా ఆవిష్కృతమవుతూ వుంటుంది. ఈ అవతార కార్యక్రమం గూడా నూటికి ఎనభైపాళ్ళు ఆర్త, అర్థార్థి భక్తుల కోసమే కేటాయించబడింది. మిగిలిన ఇరవైపాళ్ళు మాత్రమే ఆధ్యాత్మిక సాధకుల కోసం కేటాయించబడి ఉంది. ఈ ఇరవైపాళ్ళ భాగాన్ని వాడుకోగలంత మంది సాధకులు పోగుబడటమే సమస్య మాకు.

సాధకు డెక్కడ వున్నాడసలు? ప్రతివాడు తాను సాధకుణ్ణనీ, తను చేసేది సాధన అనీ భ్రమించి, ఆత్మవంచనతో ఆగక గురువంచన చేద్దామని ఉబలాట పడుతూ వున్నాడు. ముందర, వాడికి ఈ భ్రాంతి వదలగొట్టాలి. అదే పెద్ద పని. మిగిలిన ఎనభై పాళ్ళతో కవులకు కవిగా, వ్యాపారులకు వ్యాపారిగా, ఆర్తులకు రక్షకుడిగా, బిడ్డలకు తల్లిగా, రోగులకు వైద్యుడిగా,

సనాతనులకు సనాతనుడుగా, వైజ్ఞానికులకు విజ్ఞాన సూత్రంగా, బాలకులకు హాస్యగాడుగా, వంచకులకు శిక్షకుడిగా, శరణాగతులకు కవచంగా, దైవోపహతులకు ఆశాజ్యోతిగా, దీనులకు ధైర్యంగా, పండితులకు ప్రవక్తగా, పతితులకు పావనుడుగా, మార్గభ్రష్టులకు మార్గదర్శకుడిగా, భ్రాంతచిత్తులకు చేతికర్రగా, జగత్తులకు ఉపదేష్టగా, ఆకర్షకుడిగా, సమ్మోహకుడుగా, గురువుగా ఇలా వేల వేల వైవిధ్యాలలో జీవులకు ఉపకరించవలసిన ప్రణాళిక ఎదుట వున్నది. కనుక స్వామి నుంచి మనం ఏమి తీసుకోగలం అనేది మనం ఏ సంకల్పంతో ఆయన దగ్గరకు వెళుతున్నాం అనే దాని మీద ఆధారపడి వుంటుంది.

ఇప్పుడు మీరు ఆత్మవిద్యా తత్పరులై వచ్చారు. కనుక, మీకు ఆ విషయం బయట పడుతోంది. మీరు మా చిత్తవృత్తిని కొంతవరకు దర్శించి మాది యే మార్గమా అని ఆలోచిస్తున్నారు. ఇది మేలు. ఈ కాలపు సాధకంమన్యులు ఏ ఆధారం లేకుండానే దివ్య దర్శనాలు చెయ్యగల మహానుభావులు. ఇందాకటి మీ దర్శనంలో ఒకాయన "నీది యక్షిణీ ఉపాసనా ? అని అడిగాడు. ఈయన కేవలం సామాన్యుడు. అయినా వూహ మాత్రం పెద్దది. ఇంతకన్న ఘనుడొకాయన మమ్మలను వీధిలో చూస్తూనే "నీకు క్షుద్రోపాసన ఉన్నది కదూ " అన్నాడు.

"ఔను, కర్ణ పిశాచి వున్నదని " మేము చెప్పాము.

మా ఉపాసన ఏదో దివ్యదృష్టితో గమనించి దర్శించిన ఆ మహాపురుషుడు, మరొక అరగంటలో, "గాయత్రీ జపం చేస్తుంటే మనస్సు నిలవటం లేదనీ, నిలిచేందుకు ఏదైనా యంత్రం వేసిమ్మ"నీ అడిగాడు. మీరయితే ఏమంటారు ? మీ చేతిలో దండం విరిగేట్టు తంతారు. కాని యీ అవతారం అందుకోసం పుట్టలేదు. అందువల్ల ఎడం చేత్తో యంత్రం గీసి పారేసి వచ్చాం. ఇదీ సాధకుల స్థాయి.

ఇక కొందరు మా దగ్గర గణపతి విగ్రహం వుండటం చూసి, మాది ఉచ్ఛిష్ట గణపత్యుపాసన అని నిర్ణయించారు. మా దగ్గర ఎన్నాళ్ళ నుంచీ ఆ విగ్రహం వుందీ, అంతకు ముందు ఎన్నాళ్ళ నుంచీ సాధన సాగుతోందీ, ఏమి సాధన సాగుతోందీ, ఇవన్నీ వారికి అక్కర లేని చర్చలు. వీరంతా దేన్నిబట్టి యీ నిర్ణయాలు చేస్తున్నారు ? యక్షిణివారు మొదలు ఉచ్ఛిష్టంవారి వరకూ అందరూ మా దగ్గర వ్యక్తమవుతున్న సిద్ధులను చూసి మాట్లాడుతున్నారే తప్ప దాని వెనక్కి చూపు పెట్టటం లేదు. పోనీండి. నష్టం లేదు. తాము దృష్టి పెట్టిన సిద్ధులనైనా శ్రద్ధగా పరిశీలించరే !

ఇక్కడ వ్యక్తమవుతున్న ప్రతి సిద్ధీ, ఎదుటి మనిషిలో ధార్మిక పరివర్తన తెచ్చేందుకే కృషి చేస్తోందనీ, అందులో నూటికి తొంభైపాళ్ళు విజయం సాధిస్తోందనీ వీళ్ళు గమనించటం లేదు. మనుష్యులను సన్మార్గంలోకి తిప్పే శక్తి క్షుద్రోపాసనలలో లేదు. అదీగాక,

ఏకాగ్రతా బలం యోగానికి సరిపోయే అంత ప్రబలంగా వుంటే, వాణ్ణి క్షుద్రోపాసనలో పెట్టినా సరే, యీ ఏకాగ్రతా మహిమ వాణ్ణి మహోపాసనలోకి అవశ్యంగా లాక్కువస్తుంది.

ఒకడికి లభించిన సిద్ధులను చూసి, ఇవి వాడికి ఎలా వచ్చినయ్యో నిర్ణయించాలంటే, ముందు వాడి పూర్వజన్మ సంస్కారం వైపు దృష్టి సారించాలి. ఆపైన వాడికి ఉపదేశించిన గురువు యొక్క బలాన్ని గమనించాలి. తరువాత ఈ సాధకుడి తపస్తీవ్రత ఎంతటిదో పరిశీలించాలి. ఇంకా కొన్ని పరీక్షించాలి. అంతేగాని, మొహాన బొట్టు పెద్దది కనిపించగానే, యక్షిణి అనకూడదు. నిజానికి మా దగ్గర వ్యక్తమవుతున్న సిద్ధులన్నీ యోగసిద్ధులేగాని, మంత్రోపాసన సిద్ధులు కావు. మీరు దర్శించింది ఒక కోణంలో నిజం. మా దగ్గర మంత్ర మార్గం వున్నా, యోగ మార్గమే ప్రధానం.

మా అమ్మగారు యోగ ప్రధానంగా శ్రీవిద్యా దీక్షను మహావాక్యాను సంధాన పురస్సరంగా ప్రసాదించారు. ఆ తరువాత మా మేనత్త వెంకమ్మగారు హఠయోగ ప్రధానంగా ఆత్మోపాసనను అనుగ్రహించారు. మా అమ్మగారు శరీరం పరిత్యజించేటప్పుడు మేమొక ప్రశ్న వేశాం "కోహం" (నేనెవరు) అని. వారు సమాధానం అనుగ్రహించలేదు. రెండు కారణాల వల్ల అనుగ్రహించలేదు. మొదటిది, దానికి ఏదయినా సమాధానం చెపితే, అది సమాధానమే కాకుండా పోతుంది. అదంతే. రెండోది, ఈ శరీరం ఒక అవతారంగా ఈ లోకంలోకి వచ్చింది. దీనితో చాలా ప్రయోజనాలు వున్నాయి. ఆ ప్రయోజనాలు సాధింపబడాలంటే, యీ శరీరానికి కొంత కథ వుండాలి.

భగవంతుడు బ్రహ్మలోకంలోనే ఒక శిల్పాన్ని చెక్కి కిందికి తోస్తే, అలాంటి శిల్పం ఆకాశంలోంచి రాలిపడితే, ఇక దాన్ని గురించి చెప్పుకునేందుకు మనకేమీ కథ లేదు. అదే ఆయన అడ్డ దిడ్డంగా కొండలను సృష్టిస్తే అందులో ఒక చిన్న శిలను మనం నానాయాతనా పడి యెత్తుకొచ్చి కొన్ని సంవత్సరాలు శ్రమ ధారపోసి శిల్పంగా చెక్కితే, అబ్బా! అప్పుడా శిలకు ఎంతో చరిత్ర వస్తుంది. ఆ కథలో ఎన్నో ఉలులకు పాత్ర వుంటుంది. నిజానికి శిల్పంలో ఉన్నదంతా శిలే. వేరే యేమీ లేదు. శిలలోనూ శిల్పంలోనూ వున్నది ఒక్కటే అయినా, కథ ఒకదానికే వుంది. ఈ శిల్పానికి అంత చరిత్ర వుండబట్టే, మీబోటి ఉత్తమార్థుల సందేహాలు తీరగలిగాయి.

మీ దర్శనంలో చివర్లో గణపతి వేషం గురించి ఉపదేశించాడు. మీలాంటి ఉత్తమార్థులు గూడా దండ కమండలాది వేషానికి ప్రాధాన్యం యిస్తున్నారు. అల్పులు ఇవ్వటంలో ఆశ్చర్యమేమిటి? అందుకే కొంత చరిత్ర, కొన్ని వేషాలు మేము తీసుకున్నాం. ప్రజలకు ఉపకారాలు చెయ్యటం మాత్రమే పని అయితే, ఏ వేషమైనా ఫరవాలేదు. కానీ ఈ వేషధారణలో గూడా సాధకులకు కొన్ని సూచనలూ, సంకేతాలూ ఉంటాయి. వీటివల్ల గూడా ఉత్తమ యోగసాధకులకు మార్గ ప్రదర్శన చేయవలసివున్నది. అందుకనే మాకీ అవధూత మార్గ సంబంధమైన శోణ

వస్త్ర దీక్ష సంప్రాప్తమైంది. ఇది దత్తాత్రేయ దీక్షకు సంబంధించిన వస్త్రధారణ. ఇది కేవలం సన్యాస మార్గం కాదు. త్వరలోనే ఇది మారిపోతుంది. నిజమైన వస్తువు కళ్ళకు కనిపించే వేషాలలోగాని, చెవులకు వినిపించే ఉపదేశాలలోగానీ లేదు.

మీరన్నది నిజమే. మీరు మా అంతర్ముఖ స్థితిని దర్శించలేదు. అది దర్శిస్తేగాని సన్యాస మంటే యేమిటో మీకు తెలీదు. నిజానికి మాకు అంతర్ముఖ స్థితి అంటూ వేరేలేదు. మా మనస్సులో నాలుగు భాగాలున్నాయి. చివరిభాగం మీరు దర్శించిన బహిర్ముఖ భాగం. దాని సమకాలంలోనే పైన ఇంకా మూడు భాగాలు వున్నాయి.

రెండవభాగం సంస్కారభాగం.

మూడవ భాగం నిలీన భాగం

నాల్గవ భాగం అతీత భాగం.

మేము యీ నాల్గు భాగాల్లోనూ సమంగా వుంటాము. ఒకోసారి, కార్యవశాన సంస్కార భాగం ప్రబలమైతే, దాన్ని జనులు అంతర్ముఖ స్థితి అనీ సమాధి స్థితి అనీ పిలుస్తూ వుంటారు. ఈ స్థితి తరచుగా దేశాంతర, లోకాంతరగతులైన ఆశ్రిత జీవుల రక్షణకై యోగ సంచారం అవసరమైనప్పుడు సంభవిస్తూ వుంటుంది. లేదా, ఆయా దేవతల విరాడ్రూప భావనా ప్రాబల్యం వల్లగానీ, లేదా మా విరాడ్రూపాన్నే భావించుకోవటం వల్లగానీ సంభవిస్తూ వుంటుంది. మూడవది అనుభవైకవేద్యమైన స్థితి. అది యోగ విద్యకు పరమ ఫలం.

ఇక ఆ పై భాగాల గురించి యేమి చెప్పినా, అది అసంగతమే అవుతుంది. స్థితి అనుభవ గమ్యం అనటం గూడా తప్పే. కానీ అంతకన్న మాటలేదు. అక్కడ మీరు దర్శించ గలిగింది గూడా ఏమీ వుండదు. అక్కడిదాకా వెళితే మీరే వుండరు ! దానికి గూడా ఒక పేరు వుండక తప్పదనుకుంటే, దాన్ని కైవల్యపాదం అనండి. ఇప్పుడు సదాశివుడు మా ముఖంగా అందించిన తత్త్వసూత్రం ఆధారంగా పెట్టుకొని ఇక దర్శించండి.



# 17 వ అధ్యాయం ఆషాఢభూతులు

ఆషాఢ భూతీ నపి రూఢభూతీ
నంతః పరివర్తన సంపదాయిః ।
కరోతి బాలానివ లాలయన్ స్వాన్
తస్యోపమా కాస్తి గురూత్తమస్య ॥

[ఆషాఢభూతులను (తననే మోసం చెయ్యాలని చూసేవారిని) కూడా సొంత పిల్లల లాగా బుజ్జగించి, వారి హృదయంలో పరివర్తన కలిగించి స్థిరమైన (ఆధ్యాత్మిక) సంపద కలిగిస్తారాయన. అట్టి శ్రీగురుదేవునకు సాటి ఎవరున్నారు?]

స్వామివారి మహోపన్యాసంతో అప్పటికే సమ్మోహితమై ఉన్న ఆ దండిస్వామి మనస్సు పద్మాసనాసీనులై, నిమీలిత నేత్రపద్ములై ఆనందమయులై వున్న స్వామివారి చిత్తధారపై ఏకాగ్రమై పోయింది.

దొమ్మి

ఇది మూడవది. ప్రయత్నం లేని క్రియాసిద్ధి ఆనందదాయకంగా లేదు. అదలా వుంచినా పని అయిపోయిన తరువాత గూడా ఈ దండ, కౌపీనాలు ఇలాగే వున్నాయి అంటే, వీటితో ఇంకా పని ఉందనేగా" అనుకున్నారు స్వామివారు. ఆ రోజు దండ తర్పణం పూర్తి చేసి, దండం పక్కన పెడుతూ దండిస్వామి ఆగమనం మన స్వామివారికి అంతకు ముందే ఉన్న ఉభయ సంధ్యానుష్ఠానాలకు ఈ దండపూజ, దండ తర్పణాలను జోడించింది.

ఆదివార హోమాలకు వచ్చే జనం రెండువేలు దాటిపోతున్నారు. ఒకోసారి మూడు వేలు గూడా అవుతున్నారు. ఆదివారం వచ్చిందంటే స్వామివారికి తెల్లారేసరి దగ్గరనుంచీ ఉరుకులు పరుగులుగా ఉంటోంది. హోమ సభల్లో కచేరీలు, హరికథలు పెరిగి పోతున్నాయి. స్వామివారి సంకీర్తన గూడా గంటల తరబడి సాగుతోంది. ఇక ప్రజలను క్యూలో నిలబెట్టి, వారి కష్ట సుఖాలు తెలుసుకుంటూ దండం చేతబుచ్చుకొని దాదాపు పరిగెత్తుతున్నారు స్వామివారు. వారు ఎక్కడికి కదిలినా, ఆ దండం మాత్రం వదలటం లేదు.

క్రమంగా స్వామివారు అన్నమాట తక్షణమే ఫలితాల నిస్తోందన్న మాట మైసూరు నగరంలో వ్యాపించటంవల్ల, నిజంగా సమస్య ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు గూడా పోగుబడటం

మొదలైంది. నిజానికి ఈ ప్రపంచంలో సమస్య లేని వాడెవడు? సమస్య లేకపోవటం అంటే ఆశ లేకపోవటమే గదా! అది లేని వాడెవడు?

సమస్య లన్నింటిలోకీ పెద్ద సమస్య ఆర్థిక సమస్య. ఆర్థిక సమస్య కలవారిలో సగం మందికి వారి సోమరితనమూ, దుర్వ్యసనాలూ కారణం. అయితే ఆ మాట వారు మరణ వాఙ్మూలంలో గూడా వొప్పకోరు. మిగిలిన సగంలో సగంమందికి వారి పేరాశ గాని, వ్యయ ప్రణాళికలో లోపం గానీ కారణం. మిగిలిన వారు దైవోపహతులు, సంఘోపహతులు.

ఈ చివరి రెండు రకాల వారికీ స్వామివారు తక్షణ ఆర్థిక సహాయం అందించసాగారు. అప్పటివరకు పళ్ళెంలో పోగుబడిన హారతి డబ్బులు వాళ్ళ వొళ్ళో పోయసాగారు. అయితే అలా డబ్బిచ్చిన వారికల్లా ఒకటికి నాలుగు సార్లు చెప్పసాగారు.

“ బాబూ, నీ కిప్పుడిచ్చింది పాపంతో నిండివున్న డబ్బు. అందరూ వాళ్ళ పాపాలను ఈ డబ్బు రూపంలో వదిలి వెళతారు. ఇది నువ్వు భరించలేని బరువు. దీన్ని నువ్వు జీర్ణించుకో లేవు, నీ శక్తి చాలదు. ప్రస్తుతం వున్న ఆపద గట్టెక్కేందుకు ఇది నీ కిస్తున్నాను. ఇటు తరువాత నీకు ఆదాయం పెరుగుతుంది. నువ్విప్పుడు తీసుకున్నది అప్పని భావించుకుని రోజుకు రూపాయో, అర్థో, పావలో ఎంతో అంత కట్టి అప్పు తీర్చుకో. లేకపోతే మొత్తం పడవ నట్టేట మునుగుతుంది. అప్పుడు నేనేమీ చెయ్యలేను. ”

పునరుక్తి దోషాన్ని గూడా లెక్కించక, ఇంత వివరంగా చెప్పి మరీ యిస్తున్నారు స్వామివారు. దీనివల్ల ఎన్నో పేద యిళ్ళల్లో ఆడపిల్లలకు పెళ్ళిళ్ళవుతున్నై, రోగులకు మందులు దొరుకుతున్నై, పిల్లల స్కూలు ఫీజులు నడుస్తున్నై, అప్పులవాళ్ళు కొంపల్లో సామాన్లు జప్తు చేసుకుపోవటాలు ఆగుతున్నై. కాని వాళ్ళెవ్వరూ సామాన్యంగా మళ్ళీ ఆశ్రమానికి రావటం లేదు. వచ్చినా అణాగూడా హుండీలోగాని, పళ్ళెంలోగాని వెయ్యటం లేదు. స్వామివారు మళ్ళీ అడగటంలేదు.

వారం వారం వింత వింత కథలతో, కన్నీళ్ళతో, శోకాలతో కష్టాలు చెప్పుకొని చెప్పుకొని చివరకు, ఈ రోజు మంగళహారతి పళ్ళెంలో డబ్బులు నా కిప్పించండి ” అని సమస్యా పరిష్కారాన్ని స్వయంగా సూచించే భక్తులు పెరగసాగారు.

దీంతో అంత దివ్యజ్ఞాన సంపన్నులైన స్వామివారు, తమకు అప్పుడప్పుడే వస్తున్న చిరుగడ్డాలను గట్టిగా పీక్కుని ఆలోచించవలసిన పరిస్థితి యేర్పడింది. అసలీసరికి పరిస్థితి విషమించి, మంగళహారతి పళ్ళెం స్వయంగా లాక్కుపోయే పరిస్థితి యేర్పడవలసిందే కాని, స్వామివారికి దివ్య శక్తులతోపాటు ఉన్న ఉగ్రత్వానికి భయపడి ఎవరికివారు వెనుకంజ వేస్తున్నారు. ఆ ఉగ్రత్వమే లేకపోతే, అయన్నే కొరుక్కుతినే స్థితిలోకి వచ్చారు ప్రజలు. ఈ పరిస్థితికే స్వామివారు లోలోపల ఆందోళన చెందుతుండగా, ఒక ఆదివారంనాడు

తెల్లారేసరికి, రాత్రి పందిరిగా వేసిన టార్పాలిన్ పట్టా నిట్టనిలువుగా చీల్చివేయబడి వుంది. వాలంటీరు పిల్లలంతా ఉడికి పోసాగారు. "ఎందుకురా అలా ఉడికి పోతారు. ఆ కోసినవాడు సాయంత్రం లోగానే అనుభవిస్తాడులే" అన్నారు స్వామివారు. వట్టి గర్జనలే తప్పితే, ఇలాంటి ఘోర వాక్యం ఎన్నడూ పలకని స్వామివారి నోటివెంట ఈ మాట ఎందుకు వచ్చిందో వచ్చేసింది.

ఆ రోజు సాయంత్రానికే, ఆ కాలనీలోని ఒక పెద్దమనిషిని చావుబతుకుల్లో హాస్పిటల్‌కు చేరవేశారు. ఆయన అక్కడ శోకాలు సాగించాడు. "నేను గణపతికి ద్రోహం చేశాను. గణపతి నాకు శాస్తి చేశాడు" అని. విషయం ఏమిటయ్యా అంటే, ఆయన అసలు సంగతి చెప్పాడు.

కాలనీలో యీ భజనలూ గిజనలూ గోల ఎక్కువగా వుందని వొళ్ళు మండి యీ తెల్లవారు జామున గణపతి హోమం పందిరి ఇతనే చాకు పెట్టి కోసేశాడట. ఆ తరువాత ఆఫీసుకు డ్యూటీకి వెళ్ళాడట. అక్కడ ఏదో పోట్లాట వచ్చి ఎదుటవాడు రెచ్చిపోయి, చాకు తీసి చెయ్యి విసిరాడట! ఇతని పొట్ట నిలువుగా కోసుకు పోయిందట. ఇది విని అతని కాలనీ సహోదరులు అతన్ని అసహ్యించుకొన్నారు. స్వామివారికి వార్త చేరి ఒక విభూతి పొట్లం పంపించారు. భయంలేదన్నారు. అయినా ఈ సంఘటన వల్ల వారి మనస్సు వికలమైపోయింది.

దీనికే బాధ పడుతుంటే ఓ రోజు అర్ధరాత్రి వో పాతిక ముప్ఫయి మంది జనం కత్తులు, కర్రలు పుచ్చుకొని బాగా తాగి కెసరే ఆశ్రమం మీద దొమ్మికి పడ్డారు. "రేయ్, ఎవర్రా వాడు? కెసరే స్వామంట? ఎవర్రా వాడు రమ్మను బయటికి. నరికేస్తాం, చంపేస్తాం" అంటూ గోల చేయసాగారు.

ఈ బందిపోట్ల తాకిడికి కాలనీ అంతా గజగజ లాడిపోయింది. వాలంటీరు కుర్రాళ్ళు వాకిట్లోకి వచ్చి ఏం చెయ్యాలో తోచక స్వామివారు ఉండేది ఇక్కడ కాదని చెప్పసాగారు. ఇంతలో స్వామివారు గోసాయి వేషంలో బయటకు వచ్చి "నేనేరా స్వామిని, ఏం కావాల్రా?" అన్నారు పొగరుగా.

"వెయ్యంర్రా, వెయ్యంర్రా, వేసెయ్యంర్రా చూస్తారేంట్రా" అన్ని గొంతులూ మారుమ్రోగినై. అన్ని చేతులూ పైకి లేచినై. అన్ని కాళ్ళూ ముందుకు దూకినై. కానీ అక్కడి కక్కడే బిగిసిపోయినై. ద్వారకా ఇది నమ్మలేక కళ్ళు నులుముకొని, వొళ్ళు గిల్లుకొని చూశాడు.

స్వామివారి ముఖం గంభీరంగా వుంది.

"ఆ...నువ్వట్రా, ఇటొచ్చి ఏం కావాలి, ఎందుకొచ్చారు? ఇప్పుడు చెప్పు." అన్నారు స్వామివారు, ఒకణ్ణి వేలుతో చూపిస్తూ.

వాడి చేతిలో మూరెడు కత్తి వుంది. వాడి కాళ్ళు కదిలినై. వాడు మామూలుగా నిలబడ్డాడు గాని, వొంటికి చెమటలు పట్టిపోయి కత్తి జారిపోయి నేలమీద పడిపోయింది.

"భయం లేదు. చెప్పమంటున్నాను చెప్పు" అని స్వామివారు గద్దించారు. వాడు పెదిమెలు నాక్కుంటూ నసిగాడు. "మీరు....మీరు....తమరు పంపించిన శిష్యుడికి డబ్బు లిచ్చాం....వందలు వందలు" వాడంతకన్నా చెప్ప లేకపోయాడు.

"నేను శిష్యుణ్ణి పంపించానా! మీరు డబ్బులిచ్చారా! ఏమిట్రా ద్వారకా, ఇదేదో కొత్త మలుపు తిరిగింది కథ" అన్నారు స్వామివారు గాంభీర్యం కొంచెం తగ్గించుకొంటూ.

అలా అని, "సరే, మీరంతా ఆ కర్రాబుర్రా అలా పారేసి ఇలా వచ్చి కూర్చోండి" అన్నారు. స్వామివారు లోపల్నించి కుర్చీ తెప్పించుకొని అక్కడే కూర్చున్నారు. బందిపోటు వీరులంతా "రక్షించండి మహాప్రభో" అంటూ కాళ్ళమీద పడ్డారు.

"మీకేం భయం లేదు. ఏమీ అపకారం జరగదు, ఏం జరిగిందో వివరంగా చెప్పండి" అన్నారు స్వామివారు. వాళ్ళు మెల్లగా చెప్ప సాగారు.

వాళ్ళదొక కార్మిక కాలనీ. అక్కడున్న వారంతా విద్యాగంధం లేని మూఢ ప్రజలే. వాళ్ళకు దేవుడు, భక్తి, భజనలు ఇవేవీ తెలీవు గాని, మూఢ విశ్వాసాలు మాత్రం యెక్కువ. అక్కడ యీ మధ్య రెండు మూడు నెలలుగా ఒక ఇరవై పాతికేళ్ళ కుర్రవాడు పట్టుబట్టలు కట్టుకొని తిరుగుతున్నాడట. 'నన్ను కెసరే సత్యనారాయణస్వామి ఆవహించారు. మిమ్మల్ని రక్షించటం కోసం నన్ను పంపారు. మీలో కొందరికి దుష్టగ్రహాలు ఆవేశించి వున్నాయి. అవి నేను నయం చేస్తాను' అని ప్రచారం మొదలు పెట్టాడట.

కెసరే స్వామివారి పేరు అప్పటికి బాగా వినబడుతూ వుండటంచేత, తాము అక్కడి దాకా వెళ్ళకుండా, వారి ఆవేశం తమ దాకా వస్తే, ఇక ఇంతకన్నా ఏం కావాలి? హాయిగా తమ తిండికి, తాగుడికి ఇబ్బంది లేకుండా లాభం పొందవచ్చని ఆ మూఢులంతా ఆ కుర్రవాడి దగ్గరకు భూతవైద్యాలకు చేరారు. వాడు ఇంటింటికీ డబ్బు వసూలు చేశాడు. 'ఇందులో సహం మా గురువుగారు కెసరే స్వామివారికి, మిగిలింది ఖర్చులకు, నేను పూర్తిగా నిస్వార్థ సేవకుణ్ణి' అని చెప్పాడు.

డబ్బంతా వసూలు చేసుకొని ఎవరికీ ఏ తాయెత్తూ ఇవ్వకుండానే ఆ అవతారపురుషుడు ఉడాయించేశాడు. దాంతో ఆ కాలనీ వీరులు రెచ్చిపోయి, వాడి కెలాగో అడ్రస్సు లేదు గనుక ఇక్కడి కొచ్చి పడ్డారు. అదీ విషయం.

"ఇప్పుడు నేను నిజం చెపుతానని నమ్మకం వున్నదా" అన్నారు స్వామివారు కథంతా విని.

"మా తప్పు కాయండి స్వామీ, తెలీక తొందరపడ్డాం" అన్నారు వీరులు.

"అది కాదయ్యా, మీరంతా పెద్ద మనుష్యులు గదా, ఇదాలోచించండి. రేపు వాడు మరో వూరు పోయి మీ పేరు చెప్పి డబ్బులు వసూలు చేశాడనుకోండి. అప్పుడు ఆ వూరి వాళ్ళు మీ మీదికి ఇలా కర్రలు బుర్రలు వేసుకు రావాలా ?"

"తప్పయిపోయింది. క్షమించండి"

"క్షమించటం మాట అలా వుంచండి. ముందు వచ్చి; అసలు వాడిక్కడ వాడవునా కాదా అని ఏమీ విచారించకుండా తలలు బద్దలు కొట్టటాని కొచ్చారే, ఇది న్యాయమా ?"

"తప్పయిపోయింది బాబా క్షమించండి"

"మీది తప్పేగా, నేను క్షమించాల్సిందేనా ?"

"క్షమించండి బాబూ. క్షమించండి"

"మీరు నా కొక వాగ్దానం చేస్తే నేను క్షమిస్తాను"

"చెప్పండి. నిప్పుల్లో దూకమంటారా ?"

"అదేం వద్దు, ఇక ముందు మీకు ఎవరైనా అపకారం చేస్తే, వాళ్ళని క్షమిస్తామని మీరు మాట యివ్వండి చాలు, అప్పుడు నేను మిమ్మల్ని క్షమిస్తాను."

వాళ్ళకి స్వామివారేమి చెప్పారో అర్థం కావటానికి నాలుగుసార్లు విడమరచి చెప్ప వలసి వచ్చింది. తెలిసినాక, అలాగే చేస్తామని వాగ్దానం యిచ్చి నమస్కారాలు పెట్టి, ఆదివార హోమాలకి వస్తామని చెప్పి వెళ్ళిపోయారు. ఆ అమాయకులు ఆ పై వారం నుంచీ, నిజంగానే * ఆదివార హోమాలకు వచ్చి యథాశక్తి సేవ చేసుకు వెళ్ళసాగారు.

వీరులు అటు వెళ్ళగానే స్వామివారు ప్రశ్న గణపతి దగ్గరకు వెళ్ళి ఆయనను చెవి దగ్గర పెట్టుకొని వచ్చి, ద్వారకాను పిలిచి, "నువ్వీ అడ్రసుకు వెళ్ళి యీ వ్యక్తిని పిల్చుకు రారా" అని పంపించారు. సుమారు తెల్లవారుజాము వేళలో ఒక ఇరవై పాతికేళ్ళ యువకుడు ద్వారకాతోపాటు వచ్చాడు. వస్తూనే—

"మీ శిష్యుడు దౌర్జన్యంగా ప్రవర్తిస్తున్నాడు. బుద్ధి చెప్పుకోండి" అన్నాడు స్వామి వారితో.

"మీరే బుద్ధి చెప్పకపోయారా" అన్నారు స్వామివారు.

"మీ మొహం చూసి ఊరుకున్నాను" అన్నాడతను దర్పంగా.

"చాల సంతోషం. ఇందాక వచ్చిన ఆ కార్మిక కాలనీ పెద్దలకి వీరిక్కడే వున్నారని చెప్పిరారా ద్వారకా" అన్నారు స్వామివారు విలాసంగా.

---

* ఆ వీరులలో కొందరు ఇప్పుడు మైసూరులోనే వేరు వేరు ప్రాంతాలలో వున్నా, సంవత్సరాని కొకసారి, అంతా కలిసి ఒకచోట చేరి స్వామివార్ని పిలుచుకెళ్ళి పాదపూజ చేసుకుంటూ వుంటారు.

ఆ కార్మిక కాలనీ పేరు వినేసరికి యువకుడిలో దర్పమే గాక, మొహంలో నెత్తురు గూడా అంతరించింది.

"పక్క వీధిలోనే కదా సార్ వాళ్ళని వుంచాను. నిమిషంలో తెస్తా" అన్నాడు ద్వారకా కదలబోతూ.

నీళ్ళకుండ పగిలినట్టు భళ్ళున యేడుస్తూ స్వామివారి రెండు కాళ్ళూ వాటేసుకున్నాడు యువకుడు. వాణ్ణి ఒక్క యీడుపు యివతలకు యీడవబోయాడు ద్వారకా.

"నువ్వాగరా! నేను చెపుతా నిప్పుడు" అన్నారు స్వామివారు నవ్వుతూ.

ఇక ఆ తరువాత కుర్రవెధవను లేవదీసి, బుద్ధులు చెప్పి ఆ పగలల్లా వాణ్ణి వారి గదిలోనే వెనక బాత్‌రూమ్‌లో దాచారు. రాత్రి పొద్దుపోయాక, మళ్ళీ బుద్ధులు చెప్పి "ఇక ఈ వూళ్ళో వుండక. వుంటే వాళ్ళలో యే వొకడికి వెర్రెత్తినా నిన్ను చంపేస్తారు. ఇలాంటి పిచ్చి పనులు ఇంకెప్పుడు చేయక. ఇక చదువు చాలు. స్వగ్రామం వెళ్ళి వ్యవసాయం చూసుకో" అని చెప్పి పంపించేశారు.

ఈ దుర్ఘటనవల్ల, ఆ తరువాతి ఆదివార సభలలో అనేకసార్లు తమకు ఎవరూ శిష్యులు గానీ, ప్రతినిధులు గానీ లేరనీ, తమ పేరుతో వచ్చి చందాలు వసూలు చేసేవారు ఎవరూ లేరనీ, ఎవరైనా అలావస్తే నమ్మవద్దనీ స్వామివారు ప్రకటించవలసి వచ్చింది.

కొన్ని రోజుల తరువాత క్రమంగా సంకీర్తనలకు వచ్చే భక్తులలో కొందరు కొత్త కుర్రకారు భక్తులు చేరసాగారు. వారు వెనుక వరసల్లో నుంచుని సంకీర్తనకువచ్చే ఆడపిల్లలకు రానూపోనూ అంగరక్షకులుగా వ్యవహరించి ఆనందించసాగారు. ఆడపిల్లలకు ఈ అంగరక్షకుల బాధ పైకి ఫిర్యాదు చెయ్యటానికి వీలులేని బాధ.

పాము కాళ్ళు పాముకే తెలుస్తాయని సామెత గదా! ద్వారకా మిత్రబృందం యీ దురాగతాన్ని ముందరగా గుర్తించి, కొంతమంది మీద బెదిరింపు చర్యలు సాగించారు. దాని వల్ల ఆశ్రమానికి కొంతదూరంలో చిన్న చిన్న రవరవలు సాగుతూ వచ్చాయి. ఏమయినా, ఇవన్నీ స్వామివారి దృష్టిలో పడకుండానే సాగిపోతున్నాయని పరివారంవారు తృప్తి పడుతున్నారు.

ఒక ఆదివారంనాడు ఒక 30—40 మంది కాలేజీ కుర్రాళ్ళు సిగరెట్లు తాగుతూ హోమం పందిట్లోకి వచ్చారు. వారంతా ఆ సమీపంలోనే వున్న సెంట్ ఫిలోమిన్ కాలేజీ విద్యార్థులు. వీరు వచ్చేసరికి స్వామి వారింకా బయటకు రాలేదు. వారు సరాసరి పందిరి దగ్గరకు వచ్చేసి ఈలలు, జోకులు వగైరా తంతంగం సాగించారు. ద్వారకా, నటేశ మొదలైనవారు వచ్చి చేతులు జోడించి, "అయ్యలారా, ఇది ఆశ్రమం. ఇక్కడ సిగరెట్లు తాగకూడదు, చెప్పులతో రారాదు. మీరు కొంచెం పక్కకు నుంచోండి" అని బతిమాలసాగారు.

" ఆశ్రమ మేమిటోయ్, నీ అబ్బ సొమ్మా ఇది. కాలనీ " అన్నాడొకడు.

" అసలు స్వామెవడ్రా....దొంగస్వామి. రమ్మను బైటకి. రోడ్డు మీదికి యీడ్చేస్తాం " అన్నాడు మరొకడు.

" ఆడపిల్లల్ని పోగేసి పాటలు పాడించటమే స్వాముల పనా " అన్నా డొకడు.

" కార్ల మీద తిరగటమే స్వాముల పనా " అన్నాడు మరొకడు.

" మీ స్వామికి ఇంకా సొంత కారు రాలేదా ?" అన్నాడు ఇంకొకడు.

ద్వారకాదుల సహనశక్తికి అవధి దాటిపోయింది. ఇక వాళ్ళు వీళ్ళని వొదిలేసి చాటుగా కాసేపు ఆలోచించుకున్నారు.

వీళ్ళు నలభై మంది దాకా వున్నారు. మనం నలుగురం వున్నాం. పోట్లాటకు దిగితే తట్టుకోవటం కష్టం. పోట్లాటకు దిగకపోతే వాళ్ళు తగ్గరు. ఇప్పటికే, పందిట్లో వెనకాల వాళ్ళు వెనకాల జారుకుంటున్నారు. పెద్ద మనుషుల్లో వొక్కరు గూడా ముందుకొచ్చి వీళ్ళతో నోరెత్తి మాట్లాడటం లేదు. ఆడపిల్లలు భయపడి గుడ్లు తేలేస్తున్నారు. ఏం చెయ్యాలిప్పుడు? వారిల్లా మాట్లాడుకుంటూ తంటాలు పడుతున్నారు. ఆ కుర్రవాళ్ళు హాస్యాలు పేలుతున్నారు. ఇంతలో స్వామివారు బరబరా బయటికొచ్చారు, " ఆఁ...నేనేరా...స్వామిని, నేనే దొంగ స్వామిని, ఏం కావాల్రా " అని కుర్రాళ్ళ మీదిమీద్కి కెళ్ళిపోయారు.

ఏం జరిగిందో కాని, కుర్రాళ్ళ నోళ్ళల్లో సిగరెట్లు వాటంతటవే నేలకు రాలిపోయాయి. వాళ్ళెందుకో వాటి సంగతి పట్టించుకోవటం లేదు సరికదా, ఎవడికి వాడు నేలమీద బడ్డ సిగరెట్లను చెప్పు కాళ్ళతో తొక్కి ఆర్పేస్తున్నారు.

" నువ్వు అసలు స్వామివో, దొంగస్వామివో తేల్చుకోవటానికి వచ్చాం " అన్నా డొకడు, ముందు ధైర్యం చేసి.

"ఏమిట్రా నువ్వు తేల్చుకొనేది ? నీ బతుకు నువ్వు తేల్చుకో చాలు " స్వామివారి పద్ధతి రగడకి పూర్తిగా సిద్ధమైపోయి వుంది. ద్వారకాదులకు కంగారు పెరిగిపోతోంది.

" నువ్వు అసలు స్వామివైతే, మా పరీక్షకు నిలబడతావా ?" అని అందుకున్నాడు మరొకడు.

" నువ్వేమిట్రా నాకు పరీక్ష పెట్టేది ? నువ్వేమన్నా నన్ను పోషిస్తున్నావా? నీ అబ్బ పోషిస్తున్నాడా ? " అన్నారు స్వామి.

" దొంగ స్వాముల లక్షణాలివే " అన్నాడు మరొకడు.

" నీ ముల్లె దోచాన్రా ? నీ తాత ముల్లె దోచాన్రా ? "

" అందరికీ గురువునని విర్రవీగుతున్నావుగా ? "

"నేన్నీకు గురువుననని, నీ యింట కొచ్చి చెప్పానా? నీ మామ్మ ఇంటి కొచ్చి చెప్పానా?"

"ఈ అతి వాగుళ్ళొద్దు. దమ్ముంటే నిప్పులో దిగి నుంచో. మేము నీ కాళ్ళు పట్టుకుంటాం".

"నువ్వు నా కాళ్ళు పట్టుకొంటే నాకేమయినా రాలుతుందా, ఏమిరా చవట వెధవా?"

"దమ్ము లేదని వొప్పుకో"

"మహిమలంటే నీ బోటి వెధవలు కాళ్ళు పట్టుకోవటానికి చేసేవి కావురా. నమ్ముకున్న భక్తుల కోసం అప్పుడప్పుడు అలాంటివి జరుగుతాయి. పడికాపులు పడివుండి చూడాలి. అంతగా నీకు నేను నిప్పులో నిలబడినప్పుడు చూడాలని వుంటే శివరాత్రికిరా, వచ్చేటప్పుడు భక్తిగా రా"

"ఇప్పుడేడవలేడు, శివరాత్రి కేడుస్తాడట".

ఈ సంభాషణ ద్వారకాదులకు సహించలేనిదిగా వుంది. వాళ్ళు ఒకళ్ళ కొకళ్ళు కళ్ళు సైగలు చేసుకున్నారు. ఇక వాళ్ళకు తెలీని తెగింపు వచ్చేసింది. ఇళ్ళల్లోకి వెళ్ళి నాలుగు లాటీలు తెచ్చి కాలేజీ కుర్రాళ్ళను వెనుక వైపునుంచీ ఫటుఫటూ బాదసాగారు.

ఇప్పటి దాకా వీరాలాపాలు పలికిన వీరులంతా, నిమిషాల మీద మిడతల దండల్లే హాహాకారాలు చేస్తూ పారిపోయారు. కాలనీ బైట దాకా ఇంత మందినీ పారద్రోలి వెనక్కి వచ్చిన నలుగురు పిల్లల్నీ పిల్చి చివాట్లెయ్యసాగారు స్వామివారు.

"ఎందుకురా అలా తొందర పడ్డారు? నేను మాట్లాడుతున్నాగా? నేను రాగానే సిగరెట్లు ఆర్పెయ్యలా? కాసేపయితే కాళ్ళమీద పడే వాళ్ళు. మీ కెందుకు తొందర? వాళ్ళు కుర్రవాళ్ళు, ఆత్రగాళ్ళు. నిజంగానే దొంగస్వాము లెక్కువ మంది వున్నారు గనుక మనని అనుమానించారు. వాళ్ళ తప్పేమిటి? వాళ్ళు గూడా మన పిల్లలే. మీలాంటి పిల్లలే. మెల్లిగా నయానో, భయానో దార్లో పెట్టుకోవాల్సిన బాధ్యత నాకే వుంది. ఇంకెప్పుడూ అలా తొందర పడకండి. వాళ్ళు నిజంగా ఎదురుతిరిగితే మీరు నలుగురు ఎంత? మీరు చేసిన పనివల్ల వాళ్ళకు రావాల్సిన బోధ ఆగిపోయింది. మిమ్మల్ని వాళ్ళు ఎదురు తిరిగి తన్నకుండా నేనే చూసుకోవాల్సి వచ్చింది. సర్లే, అయిపోయిందిగా. వాళ్ళల్లో కొందరు రేపు శివరాత్రికి నిజంగానే వస్తారు. అప్పుడు వాళ్ళను బతికి వుండనీయండి. వాళ్ళు పిచ్చి వెధవలు పాపం".

ఆ తరువాత సభను హాస్యాలతో నవ్వించి, అందర్నీ కుదుటపరచి హోమ కార్యక్రమాలను నడిపించారు స్వామివారు.

* * *

## కరెంటు స్వామి

కథ మామూలుగానే నడుస్తోంది. అయితే మానవ బుద్ధిలోవున్న మెలికల్ని గురించి ఎంత చెప్పుకున్నా తరగదు. ఒక అబద్ధాన్ని పాటిక్కి పదిసార్లు వింటే, అదే నిజమనిపిస్తుంది. బ్రాహ్మడు_మేకపిల్ల కథ అందరికీ తెలిసిందే. అయితే, రోజూ పాలలో పంచదార వేసుకొని తాగుతూ తాగుతూ కొన్నాళ్ళు పోయాక "తీపంటే ఇదా, నా మొహం. ఇది కానేకాదు" అనే మనిషి మన కెక్కడయినా దొరుకుతాడా? దొరికారు కెసరేలో! 1966 ప్రాంతంలో! ఒకడు కాదు, కొన్ని డజన్లు మంది!!

వాళ్ళంతా స్వామి వారివల్ల లాభాలు పొందినవాళ్ళే. అనేక విచిత్రాలు చూసినవాళ్ళే. పెద్దమనుష్యులే. భక్తులే. కాస్తో కూస్తో సేవ చేస్తున్నవాళ్ళే. అక్కడివాళ్ళే. "ఆఁ...ఇవన్నీ ట్రిక్కులు, ఇది గూడా శక్తేనా" అనుకోసాగారు వారిలోవారే. అక్కడితో ఆగితే పోను. 'అందుకే యీయనకు ఇంకా వేరే యెక్కడా చోటు దొరకటం లేదు' అన్నారు. అక్కడితో ఆగినా బాగుండును. ఒక రోజు స్వామివారితోనే అన్నారు. 'మీ దగ్గర నిజంగా అతీతశక్తి వున్నదా'? అని.

స్వామివారు వాళ్ళవంక వెర్రిగా చూశారు. "అతీతశక్తి అంటే యేమిటి" అని అడిగారు అమాయకంగా.

"మా కదంతా తెలిదు. ఇది ఎలక్ట్రిక్ కాలనీ. ఇక్కడ హైపవర్ జనరేటర్ ద్వారా ప్రధాన విద్యుత్ సరఫరా జరుగుతూ వుంటుంది. అందువల్లే మన మెయిన్ లైన్స్‌లో వచ్చే విద్యుత్తు అధిక శక్తితో వుంటుంది. మీరు ఆ ప్రధాన వైరుని సరాసరి ముట్టుకొని జీవించి వుండగలరా?" అని సవాలు విసిరారు పెద్దలు.

స్వామి : అలా బ్రతికితే అతీతశక్తి వున్నట్టా?

పెద్దలు : ఆఁ...అప్పుడు మేము నమ్ముతాం.

స్వామి : అలా అయితే, మీ ఎలక్ట్రిక్ స్తంభా లన్నింటికీ అంతులేని అతీతశక్తి వున్నట్టేగా.

పెద్దలు : ఈ వాదాలు మా కొద్దు. మీకు శక్తి వుందా లేదా?

స్వామివారి గదిలో యీ చర్చ ఇలా జరుగుతోందని ఆ కాలనీ ఇళ్ళల్లో వార్త వ్యాపించింది. కాలనీ స్త్రీ లంతా కళ్ళనీళ్ళు కారుస్తూ పరుగుల మీద వచ్చి పోగుబడ్డారు. పట్టుబట్టే తమతమ భర్తలను చేతులు పట్టుకు బతిమాలసాగారు.

"పిల్లలు గలవాళ్ళం. మనకీ ప్రమాదపు పనులు వద్దు. స్వామివారి దయవల్ల మనం అనేక ఉపకారాలు పొందాం. ఇలాంటి పరీక్షలు మనకు వద్దు. ఆ పాడు అతీతశక్తి లేకపోతే మన కొచ్చిన నష్ట మేమిటి?" అని ఏడ్చి గోలచెయ్యసాగారు.

ఆ రోజే పొద్దుటూరు నుంచి వచ్చిన పబ్బతి రామయ్యగారు ఏం జరుగుతుందా అని ఉద్రేకపూరితమైన ఉత్సాహంతో మౌనంగా చూస్తున్నాడు.

"ఏం చెయ్యాలిప్పుడు? ఈ పెద్ద మనుషులంతా కొంతకాలం విశ్వాసంతో సేవించిన వారే. తన చెయ్యి అందుకున్న వారే. కాని మళ్ళీ జారిపోతున్నారు. ఈ తల్లులంతా, తన మీద పుత్రప్రేమతో వద్దంటున్నారు. "ఆ శక్తి లేకపోతే, నష్టమేమిటి"? అంటున్నారు. వీళ్ళ నిలా దిగజారి పోనివ్వవలసిందేనా? స్వామివారు గబ గబా వాకిట్లోకి వచ్చి, ఇంట్లోకి వస్తున్న మెయిన్ లైన్ వైర్‌ని తెంపేసి, చేత్తో పట్టుకుని, ఎట్టి కాళ్ళతో నిలబడ్డారు. అంతా సెకన్లలో జరిగిపోయింది! నిలువెత్తు స్పార్క్ వచ్చింది!! ఆ స్తంభం మీద ఉన్న అయిదారు ఫ్యూజులూ టపటపా ఎగిరిపోయాయి. ఆ కాలనీలో ఒక భాగం చీకటయి పోయింది!!! చూస్తున్న ఆడామగా జనం అంతా బిగిసిపోయారు, పరీక్ష చెయ్యటానికి వచ్చిన పెద్దలకు తమ ప్రాణాలు పోయినాయో, ఉన్నాయో వారికే అర్థం కాలేదు.

"నటేశా, కొవ్వొత్తులు వెలిగించరా. అంతా లోపలికి పదండి, ఏ భయం లేదు" అని స్వామివారే అందర్నీ హెచ్చరించి లోపలకి తీసుకు పోవలసి వచ్చింది.

అందరూ కాళ్ళమీద పడటం వగైరా తంతు యథాప్రకారంగానే నడిచింది. స్వామి వారు ఇలా బోధించారు: "పెద్దలారా! మీ కందరికీ ఒక హెచ్చరిక చేస్తున్నాను. జీవితాంతం గుర్తుపెట్టుకోవలసిన హెచ్చరిక. ఏమంటే ఇదివరలో అనేక నిదర్శనాలు చూసినా మళ్ళీ నిదర్శనం అడిగారు మీరు. అయినా మీకు చూపించాను. ఇక మీ గురువెవరో ఇప్పుడే, యీ క్షణంలోనే మీరు నిర్ణయించుకోండి. మీ కెదురుగా వున్న శక్తి మీ గురువు కాదను కున్నవారు వెంటనే వెళ్ళిపోండి, ఏమీ ప్రమాదం లేదు. మా ఆశీస్సులు పూర్తిగా వుంటాయి. వేరే గురువును వెతుక్కోండి. వెంటనే నిర్ణయించుకోండి. బయటకు నడవండి. ప్రసాదం యిచ్చి పంపిస్తాం. ఏమీ ద్వేషంగానీ విరోధంగానీ లేదు." స్వామివారు ఒక నిమిషం ఆగారు. గదంతా స్మశాన నిశ్శబ్దంతో గజగజలాడుతోంది.

మళ్ళీ స్వామివారి కంఠమే ఖంగుమన్నది.

"ఎవ్వరూ కదలలేదు. ఇక కదిలే హక్కు ఎవరికీ లేదు. మీరు పరీక్షించి, నచ్చి మీరు గురువు నాశ్రయించారు. ఇక పైన కదిలే హక్కు గాని, రోజు రోజూ పరీక్షిస్తామనే హక్కుగాని మీకు లేదు. ఇకపైన అనుక్షణం మిమ్మల్ని నడిపే హక్కు, మిమ్మల్ని పరీక్షించే హక్కు, మిమ్మల్ని శిక్షించే హక్కు గూడా మీ గురువుకు ఉన్నాయి. గుర్తు వుంచుకోండి. మిమ్మల్ని రక్షించే బాధ్యత గూడా ఆయనదే. అది వేరే విషయం. ఇక మీరు వెళ్ళి రండి"

కాలనీలో స్పార్కు దృశ్యం ప్రక్కనే వున్న కరెంటు ఆఫీసులో సంచలనం సృష్టించింది. అది ఏమిటో అర్థం కాని కంగారులో, టెలిఫోన్ల మీద అంచెలంచెలుగా యీ వార్త, పై ఆఫీసర్లకు వెళ్ళి, అటునించి మంత్రుల దాకా పాకింది.

"శోకను చూస్తే పులిని చూసినట్టు కాదా ?" అని విశ్వసించే ఘనులు కొందరు, స్వామి వారు జనరేటరు మెయిన్ వైర్ పట్టుకున్నారనీ, మైసూరు నగరమే బ్లాకవుట్ అయిందనీ బాకాలు వూదసాగారు. దానికి ఆగ్రహించిన స్వామివారు "మే మసలు వైరే పట్టుకోలేదు పొమ్మ" న్నారు. స్వామివారలా చెప్పటంవల్ల తమ మీద క్రిమినల్ కేసుగాని, డిపార్ట్‌మెంటల్ కేసులుగాని లేకుండా పోయినాయని తృప్తిపడ్డారు పరీక్ష చేసిన పెద్దలు. రక్షించటం తన బాధ్యతే అని ఆయనే ఘోషించుకొన్నారు గదా!

ఇలాంటి సంఘటనలతో మనస్సు చిరాకుగా వుండటంవల్లో ఏమో స్వామివారి టూరు ప్రోగ్రాములు ఎక్కువగానే వుంటున్నాయి. ఒకో రోజున నాగప్పగారి యింటికి వెళ్ళి వాళ్ళ పూజామందిరంలో గడిపి వస్తున్నారు. ముఖ్యంగా దీర్ఘ కాలిక ధ్యానాలు అవసరమయినప్పుడు, కెసరే యింటిలో ఆ సౌకర్యం లేకపోవటం వల్ల గూడా నాగప్పగారి ధ్యానమందిరాన్ని ఉపయోగించుకోవలసి వస్తోంది.

ఆ దంపతులు గూడా ఏ రోజు కారోజు స్వామివారు తమ ఇంటికి వస్తారేమో అన్నట్టు నిత్యం సంసిద్ధతతో ఎదురు చూసేవారు.

ఒంటికొప్పల్లో నాగప్పగారి భార్య జయమ్మగారు స్వామివార్ని నిజంగానే తన మనవడిలాగా చూసుకుంటోంది. స్వామివారు గూడా బొత్తిగా అమ్మమ్మ అని పిలవటం లేదుగాని, "అమ్మా అమ్మా" అని పిలుస్తూ, ఆవిడ దగ్గర ఇంట్లో పిల్లవాడై తిరుగుతున్నారు. ఇంకా ఒకరిద్దరు భక్తులు గూడా తమ కార్లు స్వామి వారికి అందిస్తున్నా, వీరి కారు స్వామి వారికి దాదాపు సొంత కారయింది. వీళ్ళ డ్రైవరు కూడా స్వామి వారికి భక్తుడై వార్ని ప్రీతి పూర్వకంగా సేవించసాగాడు. ఉన్నట్టుండి అర్ధరాత్రి వెళ్ళమన్నా సరే ద్వారకా సైకిలేసుకొని కారు కోసం వొంటికొప్పల వెళ్ళేవాడు. ఆ డ్రైవరు నిద్దరలేచి "రెడీ" అనేవాడు. వాళ్ళ కారు రెక్కలు కట్టుకొని కెసరే ఆశ్రమంలో వాలేది.

ఒక రోజున నాగప్ప గారింట్లో హోమం యేర్పాటయింది. ఆ రోజు వాళ్ళు సుప్రసిద్ధ వాయులీన విద్వాంసుడు, రాజ సన్మానితుడు, మైసూరు రాజ్య ఆస్థాన విద్వాంసుడు అయిన ఎ. యస్. శివరుద్రప్పగారి కచేరీ యేర్పాటు చేశారు. శివరుద్రప్పగారి కచేరీ అంటే, సామాన్యం కాదు. ఆయనకు స్వామి వారి సన్నిధిలో వాయించటమంటే మహోత్సాహం. ఆ ఉత్సాహంలో ఆయన వొళ్ళు మరచి వాయిస్తున్నారు. లోకం మరిచి వింటున్నారు స్వామి వారు. ఇంతలో హోమం దగ్గర చేరిన ప్రబుద్ధులు కొందరు, "ఆ! ఈ మహాత్ములకేమి లేవోయ్! డబ్బున్న వాళ్ళ యిళ్ళలో మహాత్ములకు మహత్తు వస్తుంది. ఇవన్నీ ఆషాడభూతి వేషాలు" అని తమలో తాము అనుకుంటున్నారు. ఇంతలో స్వామి చప్పున లేచి, సరాసరి వాళ్ళ దగ్గర కొచ్చి చిన్న పిల్లవాడిలాగా రెండు పెదవులూ చిత్రంగా కదిలిస్తూ "ట్ర్రుల్" అని ధ్వని పుట్టిస్తూ నోటితో వూదారు.

గాలిలోంచి పావలాలూ, అర్ధ రూపాయిలూ, పైసలూ ఆ ప్రబుద్ధుల నెత్తిన యెగిరి పడసాగాయి. ఆషాఢభూతి జపం చేస్తున్నారుగా, అందుకని స్వామివారు ఆషాఢ భూతి చిల్లరే వాళ్ళ మొఖాన కొట్టారు. ఆ ఆషాఢభూతులు మొహాలు వేళ్ళాడేసుకొని మౌనంగా వూర్కున్నారు. క్షమించండని ప్రార్థనైనా లేదు.

స్వామి మళ్ళీ తన ఆసనంలో కూర్చున్నారు. హోమం అంతా అయినాక నమస్కారాలు పెడుతున్న క్యూలో వచ్చి నమస్కరించబోతున్న యీ పెద్ద మనుష్యుల్ని ఆపి, "ఎందుకురా అడ్డమైన ఆషాఢభూతులకు నమస్కారం పెడతారు వీళ్ళు" అన్నారు స్వామివారు పక్క నున్న కుర్రాడితో. అప్పటికి పూర్తిగా కళ్ళు కిందికి దిగి, కాళ్ళమీదపడి క్షమాపణలు ప్రార్థించారు వాళ్ళు.

* * *

ఒక రోజున ఒక పోలీసు ఇన్స్పెక్టర్ కెనరే వచ్చాడు, ఇన్స్పెక్టరు వస్తే ఒకడే వస్తాడా, ఇద్దరు ముగ్గురు పరివారంతో వచ్చాడు. "పోలీసులొచ్చారు పోలీసు లొచ్చార"ని కాలనీలో గోలయింది. వచ్చిన పోలీసులు బూట్లు విప్పి, లోపలికి వెళ్ళారు. ఆ ఇన్స్పెక్టర్ని చూడంగానే స్వామివారు ఆదరంగా నవ్వి—

"ఏం మరియప్పా, బాగున్నావా?" అన్నారు.

"బాగున్నానయ్యా! తమరు చెప్పినట్టేనయ్యా నాకు యస్. ఐ ప్రమోషన్ వచ్చిం దయ్యా. తమరికి చెప్పుకొని పోదామని వచ్చానయ్యా" అన్నాడు మరియప్ప, కాన్స్టేబుల్ కన్నా వినయంగా వొంగి.

"మంచిది" అని విభూతి పొట్లం యిచ్చేశారు స్వామివారు. ప్రక్కనున్న శిష్యులకు విషయమేమిటో అర్థంకాలేదు. వాళ్ళ సందేహం తెలిసి "అతన్నే అడగండి" అన్నారు స్వామివారు. అతను తన కథ చెప్పాడు.

స్వామివారు పోస్టాఫీసులో పనిచేస్తున్నప్పుడు సైకిలు మీద తిరిగే రోజుల్లో, యీ మరియప్ప కానిస్టేబులుగా వుండేవాడట. ఒక రోజున స్వామివారి సైకిలాపి తన సహజ పోలీసు జులుం ధోరణిలో, లైసెన్సు బిళ్ళ లేదు, స్టేషనికి నడవమన్నాట్ట. సరిగ్గా చూడవయ్యా అన్నారట స్వామివారు. ఈ మాటు సైకిలు నిండా లైసెన్సు బిళ్ళలే కనిపించాయట. ఈ దెబ్బతో తారెత్తి అక్కడే కాళ్ళమీద పడ్డాడు పోలీసాయన. అప్పుడు స్వామివారు "నీకు నేను పైకి వెళ్ళేందుకు లైసెన్సిచ్చాలే, రెండేళ్ళల్లోనే వరుసగా పై పదవు లెక్కి ఎస్. ఐ. వి అయి నన్ను చూస్తావులే" అన్నారట.

"అప్పటికి తమ రెక్కడ వుంటారో యేమో" అంటే, ఇప్పటి అడ్రసిచ్చారట స్వామి వారు. ఈ రెండేళ్ళూ ప్రమోషన్లమీద వూళ్ళు తిరిగి, ఇప్పుడు ఎస్. ఐ. అయి ఆ మాట గుర్తు

పెట్టుకొని వచ్చి దర్శించాడు మరియప్ప. మరియప్పగారు సెలవు తీసుకొని వెళ్ళుతుండగా, "నువ్వు పరీక్ష పెట్టటం మునుపే అయిపోయిందిలే" అన్నారు నవ్వుతూ స్వామివారు.

* * *

శ్రీకంఠయ్యగారు స్వామివారి పాత భక్తులలో వొకడు. అనుష్ఠానపరుడు, స్వామి వారికి ప్రీతి పాత్రుడు. ఒకరోజు వాళ్ళింటికి భిక్షకు వెళ్ళారు స్వామివారు.

"ఇవాళ్ళ మిమ్మల్ని పరీక్ష చెయ్యాలనిపిస్తోంది స్వామీ" అన్నాడు శ్రీకంఠయ్య గారు తన సహజమైన అతి వినువుతో.

"అలాగే కానీ" అన్నారు స్వామివారు గూడా. అదేం చిత్రమో! అంతకు ముందే సిద్ధంగా వున్నారు గాబోలు, ఆ ప్రక్కన ఉన్న కుర్చీ ఇంకా పక్కకు తోసాడు. ఆ చాటున ఎర్రగా కణకణా కాలుతోంది ఎలక్ట్రిక్ స్టవ్.

"దాని మీద నుంచుంటారా" అన్నాడు శ్రీకంఠయ్య, అదేదో గులాబీల గుత్తి అయ్యినట్టు.

"కావచ్చు" అన్నారు స్వామివారు తన సహజ ధోరణిలో. అంటూనే దానిమీద ఒక కాలు పెట్టి నిలబడి, కబుర్లు చెపుతున్నారు, అలా వొక పావుగంట నడిచింది.

"ఇక తియ్యండి స్వామీ" అని శ్రీ కంఠయ్యగారే గుర్తు చేశాడు. కాలు తీశాక, "శ్రీకంఠయ్యా" అని పిలిచారు స్వామివారు. స్వామివారి పిలుపు మృదువుగానే వుందిగాని, ఆ పిలుపుకి అదిరిపడ్డాడు ఎందుకో తెలీకుండానే శ్రీకంఠయ్యగారు.

"శ్రీ కంఠయ్యా! నువ్వు దీన్ని కేవలం హాస్యంగా తీసుకున్నావు. నేనూ అలాగే తీసుకుంటున్నాననుకో. అయితే, నీ హాస్యంకోసం ఒక సత్పురుషుణ్ణి 15 నిమిషాల సేపు శ్రమపెట్టావు గదూ. నీ జీవితంలో ఇలాంటి కష్టం ఒక్క నిమిషం అన్నా అనుభవించక తప్పదయ్యా నీకు" అన్నారు తాపీగా. ఆయన బెంబేలెత్తిపోయి, "తప్పుకాయండి స్వామీ" అని కాళ్ళమీద పడ్డాడు.

"నేను చూసుకుంటాలే, ఒక్క నిమిషం అనుభవిద్దువుగానిలే*" అన్నారు స్వామివారు.

ఆ రోజుల్లో అప్పటికే సిటీబస్సుల వాళ్ళు యీ ఎలక్ట్రిక్ కాలనీ ప్రాంతానికి ప్రత్యేక ట్రిప్పులు వేయటం మొదలైంది. స్వామివారి సంకీర్తన ఆలస్యమైన రోజున చివరి ట్రిప్పు సిటీబస్సులు ఈ జనం కోసం అక్కడ ఆగిపోయేవి. అందువల్ల ఎవరూ బస్సుల కోసం

* వీరు తరువాత ఒక తీర్థయాత్రకు వెళ్ళినప్పుడు ఆ బస్సుకి పెద్ద ప్రమాదము అయి అనేకమంది అక్కడికక్కడే మరణించగా, వీరు మాత్రం చావు తప్పి కన్ను లొట్టబోయి, బయట పడ్డారు. అక్కడితో ఆ శాపం తీరిపోయిందని స్వామివా రనుగ్రహించారు.

భయపడేవారు కాదు. ఈ స్టాపుకి ఎలక్ట్రిసిటీ కాలనీ స్టాపనే పేరు పోయి "గురువుగారి ఆశ్రమం స్టాపు" అని పేరు వచ్చేసింది.

ఇలా వుండగా ఒక గురువారం నాడు రాత్రి భజన పూర్తయ్యే సరికి పది దాటింది. స్వామివారు లోపలి కెళ్ళిపోయారు. ప్రసాదాలు పంచుతున్నారు. ఎలా మొదలైందో కాలనీలో కొంతమంది కుర్రాళ్ళు రగడ ప్రారంభించారు. ఇంత పొద్దు పోయేదాకా భజనలు చేస్తే మేం నిద్దరలు పోనక్కర లేదా అని వాళ్ళ బాధ. దాన్ని కొంతమంది భక్తులు ప్రతిఘటించారు. అది చివరికి తగాదా దాకా పోయి పోట్లాటలోకి పరిణమించింది. అవతలివాళ్ళు స్వామివార్ని గట్టిగా తిట్టసాగారు. ఈలోగా ఆశ్రమం కుర్రాళ్ళు స్వామివారు బయటికి వస్తే ఇది యెటు పోతుందో యేమో అని, స్వామివారి గదికి బైట తాళం వేసేశారు. ఆ కాలనీ ఇళ్ళన్నీ ఒకే రకం. వాటికి వెనకవైపు దోవలేదు. ఉన్నది ఒకటే దోవ. దానికి తాళం వేసేశారు. ఇది చూసేసరికి స్వామివారు భయపడి లోపల దాక్కున్నారని అల్లరి మూకకు తోచింది. దాంతో వారంతా లాటీలూ వగైరాలు చేత బుచ్చుకొని స్వామివారి యింటిముందు పోగుబడి, బయటకు రమ్మని అరవసాగారు. తాళం తియ్యండర్రా అని స్వామివారు ఎన్నిసార్లు పిల్చినా పరివారం పిల్లలు వినలేదు. దాంతో స్వామివారు గది కుడిపక్క గోడలోంచి దూసుకొని "ఎవడ్రావాడు పిలిచేది" అని పెద్దగా కేకలేస్తూ యివతల కొచ్చేశారు. పందలమంది చూచారు దీన్ని.

ఇలా ప్రత్యక్షంగా కనిపించిన యీ దృశ్యం చూసేసరికి అల్లరి మూకల ప్యాంట్లన్నీ తడిసిపోయాయి. కర్రలక్కడే పారేసి, తలో దోవనా దౌడందుకున్నారు కొందరు. కొందరు కాళ్ళమీద పడ్డారు. కొందరు చతికిలబడి గుడ్లు తేలేశారు. కాలనీ పెద్దలు క్షమాపణలు చెప్పసాగారు. శ్రీకంఠయ్యాదులు స్వామివార్ని బతిమాలి లోపలికి లాక్కుపోయారు.

* * *

ఇన్ని విపరీత పరీక్షలు భక్తులు తనకు చేస్తుంటే స్వామివారు గూడా ఒకటి రెండు పరీక్షలు భక్తులకు పెట్టారు.

ఒకసారి హోమసభలో ఫిడేలు చౌడప్పగారి కచేరీ జరుగుతున్నది. ఆ కచేరీ మధ్యలో స్వామివారు సభ వదిలేసి వెళ్ళి తమ గదిలో తలుపు వేసుకొని ధ్యానంలోకి వెళ్ళిపోయారు. కచేరీ అయింది, సాయంత్రం అయిపోతోంది. స్వామివారు బయటకు రారు. భక్తులందరూ గందరగోళ పడుతున్నారే గాని, ఒక్కరూ కదలటం లేదు. చివరకు కొందరు పెద్దలు చౌడప్ప గారి దగ్గరకు వెళ్ళి మీరే యేదయినా ఉపాయం చెయ్యాలని గట్టిగా పట్టుబట్టారు. "అది వారి అనుగ్రహం మీద ఆధారపడి వుంటుందయ్యా, మన ప్రజ్ఞ మీద కాదు" అని చెప్పి, చౌడప్పగారు ప్రక్క వాద్యాలు వొదిలేసి, ఒక్కడే స్వామివారి గది వాకిట్లో కూర్చుని కాసేపు ఆలోచించాడు.

శివుడి మీద కీర్తనలు వాయించాలని తోచింది. ఒక అరగంట రాళ్ళు కరిగేటట్టు శివకీర్తనలు వాయించాడు. స్వామివారు తలుపులు తెరిచారు. వారి శరీరం మొత్తం లోంచి విభూతి ధారలు కారుతోంది. ఆ గదంతా విభూతితో నిండిపోయి వుంది. ఆ దివ్యదర్శనం చేసుకొని భక్తులంతా పులకించి పోయారు. "చౌడప్పగారు నా ధ్యానంలో వున్న శివుణ్ణి అందుకున్నారు" అన్నారు ఆ తరువాత స్వామివారు.

ఒకసారి హోమం అయినాక ప్రసాదా లిచ్చే సమయానికి ధమాధమా వాన అందుకుంది.

"మీ భక్తి యేమాత్రం వుందో ఇప్పుడు చూస్తాను" అన్నారు స్వామివారు. ఒక్కరూ కదలలేదు. పూర్తిగా వానలో తడిసి ప్రసాదాలు పుచ్చుకొని వెళ్ళారు. స్వామివారు ఇలాంటి చిన్న పరీక్షలు ఎన్ని పెట్టినా అవన్నీ భక్తులకు లాభాలుగానే పరిణమించినాయి.

ఒకసారి నంజనుగూడ శివాలయానికి కొద్ది పరివారంతో వెళ్ళారు స్వామివారు. అక్కడ కొందరు వేద విద్యార్థులు వల్లెవేస్తూ వుండటం చూసి, ఆనందమై అటు వెళ్ళారు స్వామివారు. చిన్నవయస్సులో వుండి, పట్టుబట్టలు కట్టుకొని చేతిలో మామూలు కర్ర వొకటి పట్టుకొని వున్న స్వామివార్ని చూస్తే ఆ పిల్లలకి, ఆ గురువులకీ గూడా యీయన స్వామి అనిపించలేదు. ప్రక్కనున్న వా రెవరో వార్ని గురించి గొప్పగా చెప్పారు.

"వారికి వేదం వచ్చా ?" అన్నాడొక విద్యార్థి.

"వచ్చు" అనేశారు స్వామివారు.

"సాంగ్రయజ్యేష్ఠ్యాయజతే..." చెప్పండి చూద్దాం అన్నాడొక విద్యార్థి. చకచక చెప్పేశారు స్వామివారు. దాంతో ఆ గురువులు అందుకొని నాలుగయిదు పనసలు మంచి 'కవులు' వున్నవి అడిగారు. చెప్పారు స్వామివారు.

అందులో ఒక ఋగ్వేద పండితుడున్నాడు. ఆయన ఇది ఋగ్వేదమని చెప్పకుండానే ఒక పనస అందించాడు. ఋషిచ్ఛందస్సులతో సహా చెప్పేశారు స్వామివారు. చాలా సంతోషించి పండితులు, విద్యార్థులు గూడా పాదాలమీద వాలారు. "మాకు తెలీలేదు. మీరేదో భూత వైద్యాల బాపతు వారనుకున్నాం. క్షమించండి" అని క్షమాపణలు చెప్పారు.

స్వామిజీ చెప్పారు_"ఈ జన్మలో ఇవన్నీ చదువుకోలేదు నేను. కాని పూర్వం ఎప్పుడో ఇవన్నీ చెప్పుకున్నవే, వీటి పని బడ్డప్పుడు గుర్తు వస్తాయి. నాకు గుర్తురాకుండా వున్నంతసేపు మీకు ఆ సేవ చేసుకొనే అవకాశం లభిస్తూ వుంటుంది."

ఆ రోజుల్లోనే భక్తుల అవినయం వల్ల జరిగిన ఒక హృదయ విదారక ఘటన స్వామి వారిని బాగా కల్లోల పరిచింది.

మైసూరులోని వ్యాస భవన్ హోటలు వారు స్వామి వారిని నమ్మిన భక్తులలో ఒకరు. వారు రోజూ వచ్చే వారు. చిన్న పిల్లలలో చిన్న పిల్ల అయి ఆడుకునే స్వామివారు, వారి నాలుగేళ్ళ కూతురికి చాముండి అని ముద్దుపేరు పెట్టారు. ఆ పిల్ల రోజూ ఒక యాపిల్ పండు తెచ్చేది. అది తేవాలి, స్వామి వారు పండు తినాలి. ఆ పిల్ల గూడా స్వామి వారి వొళ్ళో కూర్చుని ఆయనతో పాటే ముక్కలు తినాలి. లేకపోతే తినేది కాదు. ఆ పిల్లలో చాముండీ అంశ వుందని అందరితో చెప్పే వారు స్వామివారు.

ఒకసారి వాళ్ళు తిరుపతి వెళదామనుకుని స్వామి వారితో చెప్పారు. వద్దు అన్నారు స్వామివారు. ఆగారు. కొన్నాళ్ళు పోయాక మళ్ళీ అడిగారు. "నేను చెప్పేదాకా వద్దు" అన్నారు స్వామివారు. తిరుపతిలో ఏదో మొక్కుబడికి కాలం తీరిపోతోందని తొందర పుట్టింది వాళ్ళకి. ఒకరోజు అన్నీ సిద్ధం చేసుకొని స్వామి వారితో చెప్పుదామని వచ్చారు. స్వామి వారు సమాధిలో వున్నారు. ఎంత సేపటికీ బయటకు రాలేదు. వాళ్ళు నమస్కారం చేసుకొని సొంత కార్లో తిరుపతి వెళ్ళిపోయారు. స్వామివారితో చెప్పాలి అని ఆ పసిపిల్ల ఏడ్చిగోల చేస్తూనే వుంది. దాన్ని రెండు దెబ్బలేసి నోరుమూయించి కార్లో తీసుకుపోయారు. ఆ రాత్రి వారి కారు ఒక లారీకి ముఖాముఖిగా గుద్దుకొని కారులో వున్న వారంతా అక్కడి కక్కడే ప్రాణాలు విడిచారు. ఇది తెలిసిన స్వామి ఎంత తీవ్రంగా చలించి పోయారంటే, కొన్నాళ్ళపాటు ఆయన యాపిల్ పండు చేత్తో ముట్టుకునేవారు కాదు. స్వామివారి శోణవస్త్ర దీక్ష సంగతి తెలియని కొందరు, యీ పిల్ల పోయిన దుఃఖం వల్ల స్వామివారు గడ్డాలు పెంచారని అనుకున్నారు, ఆ రోజుల్లో.

* * *

ఆ రోజుల్లోనే ఒక ఆదివారం రోజున డి. సి. ఆఫీసు కృష్ణమూర్తిగారు ఆఫీసులో పని మిగిలి పోయి వుండటం వలన ఆఫీసు కెళ్ళాడు. వెళ్ళినా వుండబుద్ధి గాక పదకొండయ్యే సరికి కెనరే ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ ఒక గంట వున్నాక ఇంటికి వెళదామనిపించింది. ఇల్లు దగ్గరే కదా, వెళ్ళాడాయన. వెళ్ళే సరికి భార్య బాతురూములో స్పృహ తప్పి పడిపోయి వుంది. కంగారు పడి, మళ్ళీ ఆశ్రమానికి వచ్చాడు. స్వామివారు తానే ఎదురు వచ్చి ఏమైంది అన్నారు. చెప్పాడు. "సరే, కార్లో డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళు, నేను చూసు కుంటున్నాలే" అని తను వాడుకుంటున్న నాగప్పగారి కారిచ్చారు. ఆయన హాస్పిటల్లో చేర్చి కొంత వైద్యం చేయించినా స్పృహ రాలేదు. మళ్ళీ ఆ కారులోనే ఆదుర్దాగా ఆశ్రమానికి వచ్చేశాడు. అక్కడ పూర్ణాహుతి అవుతోంది అప్పుడే. స్వామివారే దగ్గరకు వచ్చి, "భయం లేదు. ఆ ఇంట్లో ఒక గ్రహం వుంది. అదే యీ పని చేసింది. ఇక స్పృహ వస్తుందిలే. పద.

నేనూ వస్తున్నా " అని స్వయంగా రోగి దగ్గరకు వెళ్ళారు స్వామివారు. స్వామివారు వెళ్ళగానే కృష్ణమూర్తిగారి భార్య జయమ్మగారు లేచి కూర్చుంది.

* * *

ఒక రోజు కెసరే ఆశ్రమం ముందు ఒక జట్కాబండి ఆగింది. అందులోంచి ఒక పెద్ద పండితుడు దిగాడు. ఆయన పాండిత్యం ఎంత పెద్దదో అక్కడున్న కుర్రవెదవల కెవరికీ తెలీదు. కానీ, ఆయన అలంకారం చూసి మాత్రం వాళ్ళంతా బెదిరిపోయి నమస్కరించేశారు.

జరీ అంచు బట్టలు, చేతులకు స్వర్ణ తలాటాలు, మెళ్లో లావు రుద్రాక్షలు, చెవులకి బంగారు రుద్రాక్ష పోగులు, నుదుట గంధపు పట్టీల మధ్యలో పెద్ద కుంకుమబొట్టు, మహారాజుల వంటి నడక, చంకలో మాత్రం ఒక చిన్న సంచీలో చుట్ట చుట్టుకొని ఒక పుస్తకం, ఇదీ ఆయన ఆకారం. బండి దిగుతూనే, " కెసరే స్వాముల వారంటే యెవరూ? " అంటూ దిగాడు. ఆయన గొంతు ఆకారానికి తగ్గట్టు మంచి గంభీరంగా వుంది. నడక చురుకుగా వుంది. ముఖం తేజస్సుగా వుంది. అంటూనే లోపలికి వచ్చేశాడు. ఆయన వస్తుండగానే ఆశ్రమం బాలుడొకడు స్వామివారిని చూపించాడు వినయంగా.

అప్పటికి స్వామివారు పీటమీద కూర్చుని ప్రాతఃకాలపు జపం పూర్తిచేసుకుంటున్నారు. గదిలో కొద్దిమంది జనం వున్నారు. పండితుడ్ణి లోపలికి తెచ్చిన కుర్రాడు ఒక పీట తెచ్చి స్వామివారికి ఎదురుగా వేశాడు. పండితుడు మోకాళ్ళమీద ఆనినట్టే అని ఒక చిన్న నమస్కారాభినయం చేసి ఆ పీటమీద కూర్చుంటూ—

" తమతో మాట్లాడుదామని వచ్చాం" అన్నాడు. మాట్లాడమన్నట్లు తల వూపారు స్వామివారు.

" మేము శాస్త్ర ప్రామాణ్యంతో మాట్లాడుతాం. శాస్త్రమే మా బలం" అన్నాడాయన ఉపోద్ఘాతంగా. స్వామివారు మాట్లాడలేదు.

" మీరు ఏవో అర్చనలు చేస్తున్నారనీ, ఏవో మహత్తులు చేస్తున్నారనీ విన్నాం" స్వామివారు మాట్లాడలేదు.

" మీ సంప్రదాయ మేమిటి? "

" ......... "

"మీరు చేసే పూజా విధానం ఏ మార్గానికి చెందింది? "

"........."

"ఏమీ సమాధానము చెప్ప రేమి?"

"అన్నీ అడగండి"

"మీ వర్ణమేమిటి? మీ ఆశ్రమ మేమిటి? మీ అధికార మేమిటి? మీ శక్తి ఏమిటి? మీ గురువుల శక్తి ఏమిటి?" ఆయన మాట్లాడుతుండగానే తన దేవతార్చన సర్దుకొంటున్నారు

స్వామివారు. ఇక్కడికి వచ్చేసరికి స్వామివారు తన అరచేతిని ఒకసారి నేలమీద చరిచారు. చిన్న చప్పుడైంది. రెండడుగుల ఎత్తెగిరి ఒక అడుగు దూరంలో పడ్డాడు పండితుడు. ముఖం చెమటలు పట్టిపోయింది. వొళ్ళు వొణికిపోయింది. వెంటనే లేచి "నకర్మణా న ప్రజాయా" అని మంత్రం చెప్పి సాష్టాంగ వందనం చేశాడు. చేసి లేచి "శెలవు తీసుకొంటాను" అన్నాడు. తన జరీ అంచుల గోచీ జారిపోయిందని గూడా ఆయన గమనించుకోలేక పోతున్నాడు.

"మంచిది" అన్నారు స్వామివారు.

మరు నిమిషంలో ఆయన జట్కాలో ఉన్నాడు.

* * *

ఒకసారి ఒక చోటుకు పాదపూజకు వెళుతూ జానకీరామ మందిరం పిల్లలను తీసుకు వెళ్ళారు స్వామివారు. అక్కడ రాత్రి పది అయిపోయింది. అందువల్ల స్వామివారే ఒక జట్కావాణ్ణి పిల్చి వీళ్ళని తీసుకెళ్ళమన్నారు. వాడు పది రూపాయి లడిగాడు. నిజానికి ఆ దూరానికి అయిదు రూపాయి లిస్తే చాలా ఎక్కువ. కాని వాడు పది రూపాయలు అడిగాడు. స్వామివారు చెప్పి చూశారు. వాడు మొండికెత్తాడు. సరే తీసుకో అని పది రూపాయల నోటిచ్చారు స్వామివారు. వాడు పిల్లలను వాళ్ళ యింటి దగ్గర దింపి, ఏదో పనిమీద జేబులో డబ్బులు బయటకు తీసాడు. ఆశ్చర్యం! జేబులో అయిదు రూపాయల నోటే ఉంది, పది రూపాయల నోటు లేదు. వాడి జేబులో అంతకుముందు చిల్లరే తప్ప నోట్లు లేనే లేవు. ఇప్పుడే పది రూపాయల నోటు అయిదు రూపాయల నోటుగా ఎలా మారిపోయిందా అని వాడికి అర్థం కాలేదు. కొంతసేపయినాక వాడే అనుకున్నాడు? "దేవుడికి న్యాయం తెలుసు. న్యాయంగా రావలసిందే వుంచాడు. మిగిలింది లాగేసుకున్నాడు దేవుడు." అప్పటి నుంచీ ఆ జట్కావాడు స్వామివారి దగ్గరకు తరచు రాసాగాడు.

* * *

## పులిహోర

కెనరే ఆశ్రమంలో అడుగు పెట్టిన దగ్గరనుంచీ బ్రాహ్మణాహంకారాలనూ, శూద్రాహంకారాలనూ రెంటినీ గూడా సంస్కరించాలని స్వామివారు ప్రయత్నిస్తూనే వున్నారు. అది ఉభయ పక్షాలలోని పెద్దలకూ కొందరికి కంటగింపయింది. ఆ విషయం స్వామివారికి తెలుసు. కాని వారెవరికీ స్వామివారితో సాక్షాత్తుగా మాట్లాడే తాహతు లేదు. తాహతు లేదని ఆగితే పెద్దలకు పెద్దరికం నిలుస్తుందా?

వాళ్ళల్లో కొందరు ఒక భక్తురాల్ని బాగా ప్రోత్సహించారు. ఆవిడ మంచిదే. సాధువుల యందు వినయశీలం గలదే. కాని కులం కొంచెం తక్కువది. అయితే వాళ్ళు రెండు మూడు తరాలుగా బాగా కలవాళ్ళు గనుక ఆ మాట కొట్టుకుపోతోంది, "కానులు గలవాడె రాజు గదరా సుమతీ" అని సుమతీ శతకకారుడు వూర్కెనే అన్నాడా?

ఆవిడ పూర్వం ఒకటి రెండు సార్లు స్వామివార్ని పిలిచింది. స్వామివారు వెళ్ళారు. పాదపూజ చేయించుకు వచ్చారు. ఇప్పుడు మళ్ళీ మరోసారి పాదపూజకు పిలిచింది. ఈమాటు పొద్దునపూట రమ్మని ప్రత్యేకంగా అడిగింది. సరే అన్నారు స్వామివారు. ఆవిడ అడగటంలో భావం వుంది. స్వామివారికి ఆచారం తీవ్రం. వారు హోమంగాని, పూజలుగాని యేమి చేస్తున్నా ఇటు పూజలు చేసేవారు గాని, అటు వంటలు చేసేవారు గాని కేవలం తడిబట్టలతో పరిశుద్ధమైన ఆచారంతో చెయ్యాలి. మధ్యాహ్న అనుష్ఠానం అయ్యేవరకూ స్వామివారేమీ పుచ్చుకోరు. ఇవన్నీ అప్పట్లో వారి నియమాలు. అందుకే ప్రత్యేకంగా పొద్దున పూట రమ్మని కోరింది.

స్వామి వెళ్ళారు. వెళ్ళేసరికి ఆవిడ పులిహోర (బిసిబెళెబాతు) ప్రసాదంగా చేసి ఒక బక్కెటులో పెట్టి ఆకు కప్పి వుంచింది. స్వామివారు కూర్చోగానే "స్వామీ, నేను స్వయంగా చేశానీ పులిహోర. తాము దయతో ఆరగించి నన్ను తరింప చెయ్యాలి" అన్నది.

"అలాగే చేద్దాం...ముందు పూజకానీ" అన్నారు స్వామివారు.

"పూజదేముంది స్వామీ? తమరు ఒక మెతుకు నోట్లో వేసుకుంటే నాజన్మ తరించదా? ఇంతకన్నా పూజేముంది? ఇదిగో, మీ పాదాలమీద పూలు వేసేస్తున్నాను" అన్నదావిడ. స్వామివారు విచిత్రంగా చూశారు.

"చూడమ్మా! నువ్వేదో నాకు పూజ చేస్తున్నాననుకోవచ్చు. కాని నా దృష్టిలో పాదపూజ అంటే అది నేను మా గురువులకు చేసుకొనే పాదపూజ. అది నా నిత్యకృత్యం. ఇవాళ్ళ అది మీ యింట్లోనే చేసుకోవచ్చు గదా అని పొద్దున్నే వచ్చేశాను. నా పూజయ్యే దాకా నేనేమీ తిననని నీకు తెలుసు. అందుచేత ముందు సావధానంగా పూజకానీ" అన్నారు స్వామివారు ఓర్పుగా. ఆవిడ కొంచెం వంకరగా నవ్వింది.

"వాయిదా తప్పించుకోవటానికి మార్గం కదా స్వామీ" అన్నది కొంచెం విజయ గర్వంతో.

"బాగా చెప్పావు" అన్నారు పక్కన వున్న ఆమె ఆప్తులు.

"నీకా అనుమానం ఎందుకొచ్చింది?" అన్నారు స్వామివారు.

"అనుమానం లేదు స్వామీ. మీరిలా చేస్తారని నాకు తెలుసు" అన్నదామె.

"సరే అలా అయితే నీ చేత్తో స్వయంగా పెట్టు. ఇప్పుడే తినేస్తా" అని చెయ్యి చాచారు స్వామివారు. ఆవిడ మరింత విజయ గర్వంతో బకెటు దగ్గరకెళ్ళి, ఎడం చేత్తో దానిపైని ఆకు తీసి స్వామివారి వంకే చూస్తూ కుడిచెయ్యి లోపలికి పెట్టింది. కాని ఇంతలోనే షాకొట్టినట్టు చెయ్యి వెనక్కు తీసేసింది, ఇదేమిటి? అంటూ .

ఆ బక్కెట్టు నిండా సన్నటి సుగంధరాజా పుష్పాలు వున్నాయి. ఆవిడ మొహం వెలవెల బోతోంది.

"పెట్టు" గద్దించారు స్వామివారు. ఆవిడ వొణకసాగింది.

"మాచేత చెయ్యి చాపించావు. ఏదో వొకటి పెట్టు. లేకపోతే నీకు దెబ్బ తగులుతుంది నీ వంశానికి దెబ్బ తగులుతుంది" స్వామివారి మాట ధనుష్టంకారం లాగా వుంది.

"క్షమించండి, క్షమించండి స్వామీ క్షమించండి" వసగసాగింది ఆమె.

"తెలియక చేసింది తప్పకుండా క్షమింపబడుతుంది. ఉపాసకులకు, యోగులకు ఆహార నియమాలు అనేకం వుంటాయని నీకు తెలిసే చేశావీ పని. మా నియమాలు మీ కులాల మీద ఆధారపడినవి కావు. అనుష్ఠానాల మీద ఆధారపడినవి. ఇది తెలిసి గూడా ఈ పని చేశావు. ఇప్పటికే వయోవృద్ధురాలివి నువ్వు. ఆస్తి వున్నా చూసే దిక్కులేక అలమటిస్తున్నావు. ఇకపైన నిన్ను ప్రోత్సహించిన పెద్దలు నీ సంగతి పట్టించుకుంటారేమో, నా అన్న దిక్కులేక నువ్వేడుస్తుంటే వోదారుస్తారేమో చూద్దాం" మంత్రస్వరంలోనే అయినా గర్జిస్తున్నారు స్వామివారు. అందరూ కొయ్యిబారి పోయారు. ఒక క్షణం ఆగి స్వామివారే అన్నారు.

"అయినా, నీకు కొంతయినా క్షేమం కలుగుగాక" అలా అని ఆమె చేతిలో ఒక విభూతి పొట్లం వేసి వచ్చేశారు స్వామివారు. ఆ తిరిగి వెళ్ళేటప్పుడు దారంతా ఒకటి, రెండు మూడు, నాలుగు, ఒకటి, రెండు, మూడు, నాలుగు అని మళ్ళీ మళ్ళీ నాలుగంకెలు లెక్క పెట్టుకుంటూనే వెళ్ళారు. ఎందుకో ఎవరికీ అర్థం కాలేదు.

*　　　　*　　　　*

ఈ సంఘటన తరువాత మాత్రం స్వామివారు పూర్తిగా విచారంగా వుండిపోయారు. ఆ మరుసటి ఆదివారం సభలో తమ దుఃఖాన్ని బాహాటంగా వ్యక్తం చేశారు.

"ఎవరు ఉపకారాలు పొందుతున్నారో వారే నిందిస్తున్నారు. ఎవరు లాభం గుంజుకుంటున్నారో, వారే మాకు నిద్రాభంగమవుతోందంటున్నారు. ఎవరు నన్ను మహాత్ముడని అంటున్నారో వారే పరీక్షలు చేస్తామంటున్నారు. ఈ చోటు అనర్హమైన చోటు. ఎంత తపస్సు ధారపోసినా సత్త్వగుణం వృద్ధే కావటం లేదు. విశాలమైన స్థలం వుందిగదా అని తాత్కాలిక పక్షంగా ఇక్కడికి వచ్చాడు గణపతి. వారం వారం వేలకు వేలు జనం వచ్చి కష్టాలు నివారించుకుపోతున్నారు. వచ్చిన ప్రతి వాళ్ళకీ చెపుతూనే వున్నాం; ఎక్కడైనా మంచి స్థలం చూసి పెట్టండని. మాకేమీ దానం చెయ్యమనలేదే. అమ్మే చోటు చూపిస్తే కొనుక్కుంటాం అన్నామే. ఆ మాత్రం శ్రద్ధ ఒక్క తండ్రి, ఒక్క తల్లి చూపించలేరా? మీ పిల్లల్ని పక్క యింటివారు కొడితే, తిడితే మీరు వూరుకుంటారా? నేను మీ పిల్లల్లో ఒక పిల్లవాణ్ణి కాదా? ఇక ఎన్నాళ్ళీ గాడిద చాకిరీ చేసేది? ఎన్నాళ్ళు ఈ తిట్లు తినేది?"

స్వామివారి కంఠం రానురాను ఏడుపు జీరనబడి చివరికి మూడువేల మంది వున్న నిండు సభలో భోరున వలవలా యేడ్చేశారు స్వామివారు.

# 18 వ అధ్యాయము పాదుకాదీక్ష

*శ్రీ భూయుత శ్రీహరి చిహ్నితాభ్యాం*
*మగస్త్య రేఖాదిభి రంచితాభ్యామ్ ।*
*నిగూఢ బీజాక్షర ముద్రితాభ్యాం*
*నమోనమ స్సద్గురు పాదుకాభ్యామ్ ॥*

[ ఆయన పాదాలలో శ్రీదేవీ భూదేవీ సమేత శ్రీమన్నారాయణ చక్రముద్రలున్నాయి.
అగస్త్యాది రేఖ లున్నాయి. ఉపాసనా రహస్య బీజాక్షరా లున్నాయి.
అట్టి శ్రీ సద్గురు పాదాలకు (పాదుకలకు) నమో నమః ॥]

## స్థల సేకరణ

శ్రేయోభిలాషి కమిటీ వారికి గూడా జాలి కలగటం భక్తులను నిజంగానే ఆశ్చర్య పరచింది. ఏమయితే యేం స్వామివారి బహిరంగ శోకాలకు కదలిన కమిటీ వారు ఒక స్థలం చూశారు. అయితే రామస్వామిగారు, నారాయణరావుగారు మొదలయిన వారు ఆ స్థలం చూసి వచ్చి, అది ఒక మురుగు కాలవ పక్కన పల్లంలో వుందని, ఆ మురుగు కాలవ పొంగినప్పుడు ఆ స్థలంలో మురుగు నీళ్ళు వస్తాయని, మామూలప్పుడు గూడా, ఆ కాలవ వాసన దుర్భరమనీ గ్రహించి బాధపడసాగారు.

కమిటీలో లేని అనంతరామభట్టుగారు, నాగప్పగారు, రామస్వామిగారు, విష్ణు కాఫీ వర్క్సు వారు ఇత్యాదులు కొందరు నంజనగూడు రోడ్డులో ఒక స్థలం చూశారు. అది బావుందని వారు అభిప్రాయపడ్డారు.

ఒకరోజు స్వామివారు కొందరు భక్తుల్ని పిలిచి సమావేశపరచారు. అందులో "ఇక యీ స్థలం నుంచి లేచిపోయే సమయం వచ్చేసింది. మీరంతా కలిసి ఏదో వొక ఏర్పాటు చేసి పెట్టండి" అని బాహాటంగా చెప్పారు. ఇహ చర్చలు సాగినై. సూర్యాస్తమయానికి మొదలైన చర్చలు రాత్రి పదయినా తెమల్లేదు. తెములుతున్నాయి భగవంతుడా అనుకునే సమయానికి ఒక భక్తుడు—

"అయ్యా ! నేను శ్రేయోభిలాషి కమిటీలో సభ్యుణ్ణి. ఆ కమిటీ అనుమతి లేకుండా స్వామివారు ఎటువంటి లావాదేవీలు చెయ్యటంగాని, స్థలాలు కొనటంగాని, అమ్మటంగాని, లేదా కొనిపించటంగాని, అమ్మించటంగాని, లేదా మరే విధమైన వినిమయ వ్యాపారములు

చేయుటగాని, చేయునట్లు ప్రోత్సహించుటగాని, లేదా అనుమతించుటగాని లేదా ఆమోదించుట గాని చట్ట విరుద్ధము కదా" అని లా పాయింటు లాగాడు.

అసలే ఆకలిమీద వున్న అనంతరామభట్టుగారు ఆయన లా పాండిత్యాన్ని చెండి పారేశాడు. చివరికి "నేను, నా స్నేహితులు కలిసి స్వామి వారికి మాకు తోచింది అర్పించ దలచుకున్నామయ్యా. నీ కేమిటి యేడుపు? నీ తాత కేమిటి యేడుపు?" అన్నాడు.

ఈ మంగళ హారతులకు సంతృప్తిపడి, యీ న్యాయశాస్త్ర విద్వాంసుడే గాక, ఆ కమిటీ సభ్యు లెవరూ కూడా కొన్నాళ్ళదాకా నోరెత్తలేదు. వెంటనే అనంతరామభట్టుగారు తన వంతుగా వెయ్యి రూపాయలు తీసి స్వామివారి పాదాల దగ్గర పెట్టాడు. నాగప్పగారు మరో వెయ్యి, విష్ణు కాఫీ వర్క్సువారు మరో వెయ్యి, శిరస్తదారు కృష్ణమూర్తిగారి తండ్రి అయిదు వందలు వాగ్దానాలు చేశారు. స్వామివారి దగ్గర వున్న హుండీ తీయగా వొక వెయ్యి రూపాయలు వచ్చాయి. వారు మాట్లాడిన స్థలం తొమ్మిది వేల రూపాయలు. కూడబడిన ధనం 4500/- మాత్రమే. వున్నదానితో పని ముందుకు సాగించాలని నిర్ణయం తీసుకొని పెద్దమనుష్యులు లేచి వెళ్ళేసరికి రాత్రి పది దాటింది. ఆ రోజెందుకనో? స్వామివారికి పొద్దుట నుంచీ భిక్ష లేదు. కృష్ణమూర్తిగారు వెళుతుంటే వెనక్కి పిల్చి—

"మీ యింట్లో వేడి అన్నము, తోడుపెట్టిన పెరుగు వుంటే తెచ్చి పెట్టండి" అన్నారు స్వామివారు. ఆయన ఇంటికి వెళ్ళి చూస్తే నిజంగానే అవి సిద్ధంగా వున్నాయి. ఆయన తెచ్చి ఇచ్చాడు. ఆయన్ను చూసి—

"ఆహా, అన్నదాతవయ్యా నువ్వు. అన్నదాతవే అవుతావు!" అన్నారు స్వామివారు.

ఆ వారంలోనే తనను ఆహార శాఖకు అధికారిగా నియమిస్తూ కాయితం వచ్చినప్పుడు, స్వామివారి మాట గుర్తు వచ్చి 'మహాత్ముల హాస్యాలలో గూడా ఇంత అర్థం వుంటుంది కదా' అనుకొన్నాడు కృష్ణమూర్తిగారు.

ఒక రోజున నాగప్పగారు, రామస్వామిగారు మొదలైన పెద్దలు స్వామివార్ని తీసుకెళ్ళి నంజనగూడ రోడ్డులోని స్థలం చూపించారు. ఆ స్థలం సంవత్సరంన్నర క్రిందట స్వామివారు తమ అన్నగారికి చూపించిన స్థలమే. అయినా వారు జాగ్రత్తగా అన్ని వైపులా తిరిగి, వివరాలడిగి తెలుసుకొని ప్రతిదీ పరిశీలించి మరీ చూశారు. అంతా చూసినాక "ఈ స్థలం మీకు నచ్చిందా" అని స్వామివారు పెద్దల్ని అడిగారు.

"బాగా నచ్చింది" అన్నారు వాళ్ళు.

"అలా అయితే నాకు గూడా నచ్చింది. ఇక వెంటనే దీని ప్రయత్నం చెయ్యండి. ఆలస్యం వద్దు" అన్నారు స్వామివారు. తిరిగి వస్తుండగా రామస్వామిగారితో, "తాతా, మీరు చూస్తూవుండండి. ఈ ఆశ్రమం ఎలా పైకి వస్తుందో మీరే చూస్తారుగా" అన్నారు స్వామివారు.

అది మూడున్నర ఎకరాల చెక్క. ఆ ప్రాంతమంతా మొదట్లో మైసూరు మహారాజా వారి పొలాలు. రాజ వంశంలో పూర్వపు తరాలలో ఒక రాజయోగి వుండేవాడు. ఆయన దత్తాత్రేయ ఉపాసకుడు. ఆ ఉపాసన పరంపర ఆ కుటుంబంలో వుండబట్టే రాజా జయచామ రాజేంద్రులు, శ్రీ దత్తాత్రేయులు అనే పేరుతో పెద్ద ఉద్గ్రంథం వ్రాసి దాన్ని ఇంగ్లీషు, తెలుగు వంటి ఇతర భాషలలోకి గూడా అనువదింపచేసి యీ శతాబ్ద పూర్వార్ధంలో ప్రకటించారు.

ఆ రాజయోగి యీ క్షేత్రంలో ఒక భూగర్భ గుహ నిర్మింప చేసుకొని దాని ముఖ ద్వారం మీద ఒక శివలింగం వుంచారు. దాని కెదురుగా పెద్ద దిమ్మ కట్టి ఆ దిమ్మమీద నంది విగ్రహం పెట్టించుకున్నారు. ఈ గుహాద్వారం సరిగా తూర్పుకు తిరిగి, చాముండీ పర్వతాన్ని సూటిగా చూస్తూ వుంటుంది. గుహలో అడుగున ప్రణవ ఫలకాలను ప్రతిష్ఠించు కున్నారు. గుహకు దగ్గరలో పాపనాశిని అయిన శమీవృక్షాన్ని పెంచుకున్నారు. ఈ గుహ లోంచి చాముండీ అమ్మవారి ఆలయంలోకి అంతర్బిల మార్గం వుందని ఒక జన శ్రుతి వుంది గాని, అది సత్యం కాకపోవచ్చును. ఆ గుహకు రవ్వంత దవ్వులో ఒక దిగుడు బావి గూడా ఆయన యేర్పరుచుకున్నాడు గాని, అది ప్రస్తుత స్థలంలోకి చేరలేదు. ఈ స్థలం ప్రస్తుతం కొంత భాగం మాగాణి పంట పండుతుండగా, మిగిలిన స్థలంలో కొన్ని మామిడిచెట్లు, కొన్ని కొబ్బరి చెట్లు, కొన్ని చింత చెట్లు వున్నాయి. స్థలం ఎగుడు దిగుడుగా వుంది. ములుకు రాళ్ళతో నిండి వుంది. ఈ తోటను కాపలా కాచేందుకు ఒక తోటమాలీ, అతని కొక చిన్న పూరిపాకా ఇక్కడ వున్నాయి.

మహారాజుల సంస్థానాలు అంతరించగా యీ స్థలం ప్రస్తుతం వెంకటస్వామిగారు అనే పి. డబ్ల్యు. డి. ఇంజనీరుగారి దయింది. ఈయన రామస్వామిగారికి బాగా సన్నిహితుడే కాని ఎన్నాళ్ళికీ విషయం పరిష్కారం కావటం లేదు. రామస్వామిగారికి కంగారుగా వుంది. చివరికి విషయం ఇలా వుందని స్వామివారితో చెప్పారు. "రేపు మధ్యాహ్నం వెళ్ళండి, పనవుతుంది" అన్నారు స్వామివారు.

మండ్య అనంతరామ భట్టుగారు, నాగప్ప శెట్టిగారు, నాగప్పగారు, అనంతరామ్ (విష్ణు కాఫీ వర్క్స్) నారాయణరావుగారు (మైసూరు పత్రిక) రామస్వామిగారు, రామరావుగారు (కృష్ణమూర్తిగారి తండ్రి) గౌడుగారు, మరికొందరు పెద్దలు అంతా కలిసి వెళ్ళారు. బేరం ఖాయం చేశారు. రెండు వేలు బజానాగా యిచ్చివచ్చారు.

కొద్ది రోజుల్లోనే తొమ్మిదివేలు పోగుచేసి, 28-3-1966 సోమవారంనాడు ఆ స్థలాన్ని రిజిష్టరు చేయించారు. అది శ్రీరామ నవరాత్రి సమయం కావటం ఒక దైవికమైన విశేషం.

ఆశ్రమానికి స్థలం ఏర్పడ్డది.

కాని తల దాచుకొనే ఆశ్రయం లేదు.



1965 ప్రాంతాలలో ఒక భక్తుడు సమర్పించిన పూజామందిరంలో తామే సమాసీనులై పూజలందుకొంటున్న శ్రీ స్వామీజీ



1966 ప్రాంతాలలో పీఠపూజ చేస్తున్న శ్రీ స్వామీజీ



తమపీఠంలో పూజావిధులకోసం 1966లో నిర్మింపజేసిన పాదుకలకోసం శ్రీ స్వామీజీ
స్వయంగా రచించి యిచ్చిన నమూనా




తమ పాదతలాలలో వున్న విశేషసాముద్రిక చిహ్నాలను వీటిలో పొందుపరచారు
శ్రీ స్వామీజీ



1965 ప్రాంతాలలో భానువార హోమసభలలో శ్రీ స్వామీజీ



1968 ప్రాంతాలలో దండకమండల ధారణ అవశ్యంగా ఆచరిస్తున్న రోజులలో శ్రీ స్వామీజీ

సుమారు రెండు నెలలపాటు భక్తులంతా తీరిక ఉన్నప్పుడల్లా శ్రమదానం చేశారు. కొన్ని డజన్ల మంది యువకులూ, వృద్ధులూ గూడా పని చేశారు. ముఖ్యంగా ఆ స్థలానికి దగ్గరలో వున్న విద్యారణ్యపురం, చాముండీ వనాలలో వున్న భక్తులు ఈ పవిత్ర కార్యంలో ప్రశస్తమైన భాగం వహించ గలిగారు. గత సంవత్సర కాలంగా విద్యారణ్యపురంలో మొదలియార్‌గారి యింట్లో స్వామివారు శ్రమ తీసుకొని చేపట్టిన కార్యక్రమాల ఫలితంగా ఆ ప్రాంతంలో కొన్ని వందల మంది నిజాయితీ గల నిక్కచ్చి భక్తులు ఏర్పడ్డారు. ఈ రెండు నెలలూ స్వామివారు రోజుకు ఒకటి రెండుసార్లు గూడా వచ్చి చూసి కాసేపు వుండిపోతు న్నారు. కారు వెంటనే అందుబాటులో లేని రోజున ఆరు కిలోమీటర్లు దూరం పైగా నడిచి వచ్చిన రోజులు గూడా వున్నాయి. లేదా యెవరైనా దగ్గర వుండి జట్కామీద తెస్తే అలా వచ్చిన రోజులూ వున్నాయి. స్వామివారు యెప్పుడు వచ్చినా కొందరు భక్తులు పనిచేస్తూనే వుండేవారు. స్వామీజీ రాకకై కనిపెట్టుకొని అనేకమంది పడిగాపులు కాస్తూ వుండేవారు.

## పాదముద్ర

ఈ రోజులలోనే ఒకరోజు నూతనాశ్రమ స్థలం దగ్గరవున్న సమయంలో చాలమంది భక్తులు చేరి ఆలస్యమవుతూ వుంటే, " అక్కడ కెనరేలో ఒక భక్తుడు ప్రత్యేకంగా నా కోసం ఎదురు చూస్తున్నాడు. ఇవాళ్టికి తొందరగా పంపండి " అన్నారు స్వామివారు.

అలా అని స్వామివారు కెనరే చేరేసరికి, చిన్న అర్సుగారు స్వామివారి కోసం ఎదురు చూస్తూ నుంచున్నాడు. చేతిలో ఏదో పట్టుకొని వున్న ఆయనను చూస్తూనే " అన్నీ సవ్యంగా వున్నాయా " అన్నారు స్వామివారు.

" తమరు చెప్పినట్లే చేయించానండీ " అన్నాడాయన.

అక్కడ వున్న భక్తులందరి సమక్షంలో స్వామివారు ఆ వస్తువు బయటకు తీయించారు. అవి పాదుకలు. కేవలం పాదుకలయితే విశేషం లేదు. వాటిమీద ఏనుగు దంతంతో చేసిన ముద్రలేవో తాపడం చేయబడి వున్నాయి. స్వామివారు తానిచ్చిన ప్లాను కాయితాలు తీసుకొని పాదుకలను పరిశీలించసాగారు. పరిశీలిస్తూనే వివరించసాగారు. " చూడు, కుడి పాదంలో వేళ్ళ క్రింద మూడు చక్రాలున్నాయి. అవి మూడూ వేరు వేరు ఆకారాలలో వున్నాయి. వాటిమీద భూ. వి. శ్రీ అనే అక్షరాలున్నాయి. భూదేవి, శ్రీదేవి సమేతుడయిన విష్ణువు యీ కుడి పాదంలో ముందరి భాగాన వున్నాడన్న మాట. ఈ మూడు చక్రాలనూ కలుపుతూ ఒక తరంగ రేఖ వుంది. దాని కింద ఒక నక్షత్రం వుంది. ఇవి రెండూ కలిపి ప్రకృతి శక్తికి చిహ్నాలు. దాని కింద రెండు నాగరేఖ లున్నాయి. అందులో వొకటి యోగ సిద్ధులకీ, మరొకటి నవగ్రహ శక్తులకూ సంకేతాలు. ఈ నవగ్రహాల రేఖను వజ్రరేఖ అని గూడా అంటారు. వీటికి క్రింద మడమ మధ్యలో, ఒక విచిత్రమైన చక్రం వుంది. దాన్ని

అగస్త్య చక్రం అంటారు. దీని ఫలితం మీకు చెప్పినా లాభం లేదు. ఎడమ పాదంలో వేళ్ళ క్రింద మళ్ళీ మూడు విభిన్నరీతి చక్రాలున్నాయి. ఇందులో నిలువుగా వున్న చక్రం అగస్త్య చక్రం. రెండు కాళ్ళల్లోనూ అగస్త్య చక్రం వుండటం వల్ల, సమీకరణ, అన్యథాకరణాది శక్తులు సూచింపబడతాయి. ఇంకా కొన్ని విశేషాలు ఇప్పుడొద్దు.

మధ్యలో వున్న చక్రం దత్తాత్రేయ చక్రం. దాని విశేషం గూడా ఇప్పుడు వద్దు. మూడవదాని దగ్గర అ. శాంతి అని రాసి వుందికదూ! అఖండ శాంతి అని దాని అర్థం. అది పైకి అశాంతి లాగా కనిపిస్తూ వుంటుంది. ఈ అవతారం దగ్గర ఇదొక విశేషం. ఈ మూడు చక్రాలను గూడా కలుపుతూ ప్రకృతి శక్తిరేఖ వుంది. దాని క్రింద త్రిశూలరేఖ, వేలాయుధ రేఖ వున్నాయి. ఇవి దైవీశక్తికి చిహ్నాలు. దాని క్రింద ఒక విచిత్రమైన యంత్రం వుంది. అందులో గణేశ ఖండము, సూర్యఖండము, అమృత సరస్సు, శ్రీచక్ర బిందువు వున్నాయి. ఇదంతా శ్రీవిద్యా విధానం. ఇంతకన్నా ఇప్పుడు చెప్పరాదు. ఈ కాలి మడమ దగ్గర ఒక చక్రం, త్రికోణం, ఒక శివలింగం వున్నాయి. ఇవన్నీ కలిపి మా ప్రధాన బీజాక్షరానికి సంకేతం. అంతకన్నా ఏం చెప్పేది? ఈ రేఖలన్నీ ఈ పాదాలలో వున్నాయని పాపం, ఆ అభేదానంద స్వాములవారు ఆ రోజు నిర్ణయించి చెప్పారు.

ఇంతవరకు మీరంతా యీ పాదాలకే స్వయంగా పూజ చేస్తున్నారు. ఇక మీద జనం పెరుగుతారు. వీటికి సాక్షాత్తుగా పూజ చెయ్యటం కష్టమవుతుంది. ఆ పాదాలలోని రేఖలన్నీ చిత్రించివున్న యీ పాదుకలే ఇక ఈ పరంలో పూజాపాదుకలవుతాయి. ఈ పాదుకలు తయారుచేయించే అదృష్టం నీకు పట్టింది. ఈ పీఠానికి ప్రధాన ఆరాధనా వస్తువు నీ చేతుల మీదుగా ఏర్పడిందన్నమాట. బాగా చేయించావు, సంతోషమైంది. ఇవి కొన్నాళ్ళు నేను వాడి, ఆ తరువాత పూజలో పెడతాను. ఇంత కష్టపడి నీవు చేయించావు గనుక చాల సంతోషమైంది. ఒక పని చెయ్యి. ఇలాంటిదే మరో జత చేయించు. దాన్ని అభిమంత్రించి యిస్తాను. మీ ఇంట్లో పూజలో పెట్టుకొందువుగాని. అదృష్టవంతుడివి"

ఆ విధంగా అప్పుగార్ని ఆశీర్వదించి, ఒకరోజు తమ పూజలో పెట్టి ఆ తరువాత తను ధరించారు స్వామివారు. కాని ఎందుకో దానిలోని రేఖలను ఎవర్నీ చూడనిచ్చేవారు కాదు. అప్పుగారితో గూడా "మళ్ళీ నేను చెప్పేదాకా ఎవరికీ ఈ కాయితాలు, ఈ రేఖలు చూపించకు"* అని చెప్పారు.

---

* అందువల్లే 1987లో ఈ రచయితను శ్రీ చిన్నప్పగారి యింటికి స్వామివారే స్వయంగా పంపించి ఆ పాదుకలనూ, ఆ కాయితాలనూ తెప్పించి చూపించేదాకా, యీ దివ్యరేఖల విషయం రహస్యంగానే మిగిలి పోయింది.

ఆ రోజుల్లోనే గోపాలరావుగారని కేరళీయు డొకాయన మైసూర్లో ఒక హోటలు నడుపుకుంటూ వుండేవాడు. వాళ్ళు కేరళ వాళ్ళే అయినా చాలా కాలం ఉడిపిలోనే బ్రాహ్మణ హోటల్ నడిపినందువల్ల ఆ వంశీకులకు ఉడిపి స్వగ్రామమై పోయింది. అక్కడే యిళ్ళూ వాకిళ్ళూ ఏర్పడ్డాయి. గోపాలరావుగారు మాత్రం వ్యాపారరీత్యా మైసూరు వచ్చేశాడు.

ఆయనకు ముగ్గురు పిల్లలు. పెద్దది ఆడపిల్ల. పేరు కుసుమ. ఆ పిల్లకు వయస్సు తొమ్మిదేళ్ళేకాని, దైవ విషయాలమీద ఆసక్తిలో మాత్రం పెద్దవాళ్ళను మించి వుండేది. ఇరుగు పొరుగుల్లో కెసరేలో గణపతి స్వామివారు హోమాలు చేస్తున్నారని చెవినపడ్డ దగ్గరనుంచీ తల్లి సరోజమ్మగార్ని పోరసాగింది కుసుమ. "అమ్మా, నన్నక్కడికి తీసుకెళ్ళవే" అని.

ఈ పిల్ల పోరు పడలేక, నాలుగేళ్ళ కొడుకు మురళీధరాన్నీ, ఐదునెల్ల పసిపిల్ల సౌభాగ్యాన్నీ తీసుకొని ఒక ఆదివారంనాడు ఆవిడ బయిలు దేరింది. కార్యక్రమం బాగానే వుంది. అంతకన్నా ఆ తల్లికి విశేషమేమీ గోచరించలేదు. స్వామివారు ప్రసాదాలిచ్చే సమయం వచ్చింది. క్యూలో వీళ్ళ దగ్గరకు వచ్చేసరికి స్వామివారు యీ తొమ్మిదేళ్ళ పసిపిల్లనే పలకరించారు. "వారం వారం వస్తూ వుండమ్మా" అన్నారు.

ఇంకేం! కుసుమ వారం వారం పోరసాగింది. పిల్లలు గల తల్లికి వారం వారం అంత దూరం పోవటమంటే మాటలా! కాని యీ పెద్దపిల్ల వూరుకోదే! దాని పోరువల్ల ఆవిడకు వారం వారం రావటం తప్పటం లేదు. అలా నాలుగయిదు వారాలు వచ్చేసరికి, యిక రాకుండా వుండటం సరోజమ్మగారి తరంకాలేదు. గోపాలరావుగారు కూడా వెళ్ళిరండని ప్రోత్సహిస్తూ వుండేవాడు.

ఆ రోజుల్లోనే కోలార్ జిల్లాలోని నందిక్షేత్రం వగైరా ప్రదేశాలకు స్వామివారి సంచార కార్యక్రమాలు సాగినై. ఏ వూరు వెళ్ళినా పీఠాధిపతులతో సమానమైన గౌరవాదరాలూ, స్వాగతాలూ, వూరేగింపులూ జరుగుతూ వుండేవి. ఆ రోజుల్లో స్వామివారు తమ ఇంటికి పాదపూజకు రావటమే మహా భాగ్యంగా భావించి, ప్రత్యేక ఆహ్వాన పత్రికలు అచ్చు వేసుకుంటూ వుండేవారు. లేత ముఖంతో, విచిత్రమైన గోసాయి మెలికగా మెడకు చుట్టుకున్న ఉత్తరీయంతో, మొలక గడ్డాలతో, గుబురు జుట్టుతో, దివ్య తేజస్సుతో సమస్త భక్త జన సమ్మోహకులుగా వుండేవారు స్వామివారు.

## స్వామీజీ

ఒక రోజున స్వామివారు బాగా పని వత్తిడిలో వుండగా, అప్పుడొకరు, అప్పుడొకరు వచ్చి రేపు ఉదయం మా యింటికి భిక్షకు రండని పిలిచారు. అందరూ బాగా చనువైన వాళ్ళే. అందరితోనూ సరే అనేశారు స్వామివారు. ఒకరి సంగతి ఒకరికి తెలీదు. ఎవరి ప్రయత్నాలలో వారున్నారు.

"మా ఆశ్రమం నిర్మాణం అవుతోంది. నేను గణపతిని గదా, ఇటు చాముండీ అమ్మకు, అటు నంజనుగూడ శివయ్యకూ, ఇద్దరికీ వాళ్ళోనేగా నేనుండాలి. అందుకే నంజనగూడా రోడ్డుమీద చాముండీ కొండ దగ్గర ఆశ్రమ నిర్మాణం అవుతోంది. నిర్మాణం పూర్తయ్యాక మీ రొకసారి వద్దురుగాని. ఆ తరువాత మీరన్నట్లే మరోసారి చూద్దాం." మహారాజులకు మించిన మహారాజు దర్జాతో స్వామివారలా అనేసి చక చకా వెళ్ళిపోతుంటే, రాజకుటుంబం అవాక్కయి వుండిపోయింది.

ఆశ్రమానికి తిరిగి వచ్చేలోపున స్వామీజీ అనే పేరు స్వామీజీకి యిష్టంగా వుందని కుర్రవాళ్ళల్లో వ్యాపించేసింది. దాంతో ప్రతివాళ్ళూ స్వామీజీ, స్వామీజీ అనసాగారు. పనులు సందడిగా నడిచిపోతున్నాయి గానీ, స్వామీజీ మనసులో ఒక పొర, ప్రత్యేకంగా ఒక అంశం మీద కేంద్రీకృత మయిపోయింది. అదే రాజ కుటుంబంవారి స్వప్నం. స్వామీజీ మస్తిష్కంలో పెనుతుఫాన్ లాంటి చర్చ చెలరేగింది.

"ఇది ఆరవది. ఆరు సంఖ్యను కొన్ని శాస్త్రాలలో విరోధానికి సంకేతంగా వాడతారు. ఇపుడు ఆరోది విరోధంగానే వున్నది. నా సంకల్పం లేకుండా పనులు జరిగిపోతున్నై. ఏమిటని గణపతిని ప్రశ్నించాను. నష్టమేమిటన్నా డాయన. మళ్ళీ గట్టిగా ప్రశ్నిస్తే దాట వేశాడు. ఎందుకనీ? ఔను! దాట వెయ్యటం కాదు. చెవుల్లో శూలాల సంగతి గుర్తు చేశాడు. ఎందుకని? ఈ ప్రశ్నలో తప్పు వుందా? ఇవాళ్ళ నిజంగానే నే నూహించిన ప్రమాదం వచ్చింది. శక్తిమాత లడ్డూలు పెడితే తింటాని కేమన్నాడు గణపతి. కాని యిన్నాళ్ళూ లడ్డూలే పెట్టి, యివ్వాళ్ళ పరీక్ష పెట్టింది. అతని కలలోకి నేను పోలేదు. నా రూపంతో తనే పోయి వరం ఇచ్చింది. సరే తన పని నేను చేసిపెట్టవచ్చు. దానికి బంగార మెందు కడిగింది నా పేరుతో?

నాలో ధన కాంక్ష వుందో లేదో పరీక్షించాలనేగా?

ఆశ్రమం కట్టించమని యెందు కడగాలి?

నాలో సోమరితనం వుందో లేదో, దైవీతరంగాలను గుర్తించగల నిలకడ వుందో లేదో అని పరీక్షించాలనేగా? అయిపోయిన పరీక్షలే మళ్ళీ ఎందుకొస్తున్నాయి? పెట్టిన పరీక్షే మళ్ళీ పెడుతుంటే దీనికి అవధి యేమిటి? ఎక్కడుంది నాలో లోపం? ఆశ్రమానికి స్థల నిర్ణయం జరిగి పోయింది. జరిగేముందు గణపతి నడిగాను. ఆ స్థలం సీదే నన్నా డాయన. శక్తిమాతను అడిగాను. అదే తన స్వగృహం అన్నది. అక్కడ స్వయంగా కూర్చుని ధ్యానించి చూశాను. అద్భుతమైన దైవీతరంగా లున్నాయక్కడ. అక్కడి భూమి లోపలి పొరలలో ఏవో పురాతన యుగాలనాటి యజ్ఞవేదికలూ, స్వర్ణశిఖర దేదీప్యమానాలైన దేవాలయాలూ కనిపిస్తున్నాయి. సత్వగుణం సహజ సిద్ధంగా పండగల క్షేత్ర మది. ఇన్ని చూసి నిర్ణయించిన క్షేత్రాన్ని, వీడు విసర్జిస్తాడా అన్న అనుమాన మెందుకు రావాలి? ఇలా పరీక్ష భయం వుంటే అనుక్షణం ప్రక్కలో బల్లెం వున్నట్టేగా? ఈ స్థితి ఎందు కొచ్చింది? ఎక్కడ నేను

తప్పటడుగు వేశాను? ఇది శక్తిమాత నడిగే విషయం కాదు. గణపతి ఆ రోజున యేదో సూత్రం అందించే వుంటాడు. అందుకోలేదన్న మాట. తద్గత ధ్యానమే యీ సమస్యకు పరిష్కార మార్గం."

ఆ క్షణం నుంచీ సర్వకాల సర్వావస్థలలోనూ మనసులోని ఒక భాగం యీ విషయం మీద కేంద్రీకృతమై ధ్యాన స్థితిలో వుంటోంది. మిగిలిన వ్యవహారం అంతా యథాప్రకారం గానే సాగిపోతోంది.

ఆ రోజుల్లోనే మేదవాటిక్సు ప్రొఫెసరు అయిన యస్. శివరామశాస్త్రి గారింట్లో మూడు నెల్లు వరసగా భిక్ష చేశారు స్వామీజీ. ఆ దంపతులు స్వామివారి మహత్తులు కొన్ని వందలు కళ్ళారా చూసి ఎన్నోళ్ళుగానో సేవించుకుంటున్నారు. స్వామీజీ సమాధిలో ఉండగా అనేక భాషలు మాట్లాడటం వీరు చూశారు. వీరు గమనించిన మరో విశేషం స్వామివారు సృష్టించిన కలకండకు చీమలు పట్టక పోవటం. వీరికి గూడా అర్ధనారీశ్వర స్వరూపంతో దర్శన మిచ్చారు ఒకసారి స్వామీజీ.

ఇలా జరుగుతుండగా ఒకరోజున స్వామీజీ తన గదిలోనే హోమం చేస్తున్నారు. కొద్దిమంది చుట్టూ వున్నారు. కొంతసేపయినాక స్వామీజీ హోమం ఆపి, అక్కడికక్కడే ధ్యానంలోకి వెళ్ళిపోయారు. ఆ ధ్యానంలోనే, ఒక ఆవేశంలాగా మాట్లాడసాగారు.

"కన్నంబాడి ఆనకట్ట ఎండిపోబోతుంది. జనం నీళ్ళకు నానాయాతనలు పడతారు. కొంతకాలం అయినాక నా పుట్టిన పండుగ వస్తుంది. అప్పుడు అందరూ నాకు ఉండ్రాళ్ళు పోస్తారు. అప్పుడు వర్షాలొస్తాయి. మళ్ళీ ఆనకట్ట నిండుతుంది."

మామూలుగా జరగని యీ కాలజ్ఞాన ప్రవచనాలను విని భక్తులు ఆశ్చర్యపోయారు. అప్పటికే ఎండలు ముదిరాయని బాధ పడుతుంటే, ఆనకట్ట గూడా ఎండిపోతుందనీ, వినాయక చవితి దాకా వానలు రావనీ విని బాధగూడా పడ్డారు. కాని యేమి చెయ్యగలరు?

ఈ రోజుల్లోనే జానకిరామ మందిరం పిల్లలలో లీలకు వివాహం ఖాయ మయింది. పూర్వం యీ పిల్లనే స్వామీజీ బ్రతికించింది. ఇప్పుడా పిల్లకు వివాహం ఖాయమయింది. కాని, పేదరికంవల్ల ఆ తండ్రి యీ వివాహం చెయ్యగలనా లేదా అని సందేహ పడుతున్నాడు స్వామీజీ స్వయంగా లగ్న పత్రిక రాసి యిస్తూ అంతా బాగా జరుగుతుందిలే అని ఆశీర్వదించారు. ఆ ధైర్యంతోనే సుబ్బారావుగారు ముందుకు సాగిపోతున్నాడు.

స్వామీజీ, నూతన ఆశ్రమ స్థలానికి వెళుతూనే వున్నారు. వెళ్ళినప్పుడల్లా స్థలమంతా కలయ తిరుగుతూనే ఉన్నారు. కాని ఎన్ని సార్లు తిరిగినా, ఎటు తిరిగినా వచ్చి వచ్చి చివరకు ఒక మామిడిచెట్టు కింద కదలకుండా కూర్చుంటున్నారు.

ఆ మామిడిచెట్టు ఏం పుణ్యం చేసుకుందో కాని, స్వామీజీ ఆ చెట్టును మాత్రం వదిలేవారు కాదు.

# చల్లని నీడ

*చాముండాచల పార్శ్వగా జనజనుస్సంతాప శాంతిప్రపా*
*భక్తిజ్ఞాన విరాగసేవధిరియం ధీస్పంద విశ్రాంతిభూః।*
*విశ్వప్రార్థన మందిరేణ ఖచితా శాంతి శ్రియా పూరితా*
*భాతి శ్రీగురురాజ రాజనగరీ శ్రీదత్త వాస స్థలీ॥*

(అది జనులకు జన్మ తాపాలు పోగొట్టగల చలివేంద్రం. భక్తి జ్ఞాన వైరాగ్యాలకు నిధి. ఆలోచనలకు విశ్రాంతి గృహం. అక్కడ విశ్వప్రార్థనా మందిరం వుంది. అక్కడ శాంతి సంపద పొంగుతోంది. అది దత్తదేవునకు సొంత యిల్లు. చాముండీ కొండకు ప్రక్కన వున్న ఆ ఆశ్రమం శ్రీగురు సార్వభౌముల రాజధాని. )

## ఆశ్రమ ప్రవేశం

స్వస్తిశ్రీ పరాభవనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పంచమీ బుధవారం నాడు (25-5-1966) పుష్యమీ నక్షత్రంలో ఇంచుమించు సూర్యోదయ సమయానికి నూతనాశ్రమంలో పరివార సమేతంగా ప్రవేశించారు స్వామీజీ. ఇంకా సరిగా చెప్పాలంటే స్వామీజీ ప్రవేశించటం చేత ఆ స్థలం ఆశ్రమమయింది.

శ్రీ స్వామీజీ యీ లోకంలోకీ, తరువాత ఈ ఆశ్రమంలోకి గూడా ఒకే లగ్నంలో ప్రవేశించటం దైవ ప్రణాళిక యొక్క సమగ్రత్వంలో ఒక అంశం మాత్రమే.

| | | | |
|---|---|---|---|
| శ<br>శు | | ల<br>ర కు బు<br>రా | గు |
| | | | చ |
| | | | |
| | కే | | |



1968 ప్రాంతాలలో కేరళ రాష్ట్రపర్యటనలో శ్రీ స్వామీజీ



ఇది 1968 ప్రాంతాలలో నృసింహ నవరాత్రులలో శ్రీస్వామీజీ పీఠపూజ.
ఈ అల్లిబిల్లి తెల్లదారాల తోరణాలలో శ్రీనృసింహ యంత్రం దాగివుంది—
గమనించారా ?



1967 ప్రాంతాలలో పూర్ణాహుతికి ముందు మంత్రలీన స్థితిలో నిలబడ్డ శ్రీ స్వామీజీ



మహాశివరాత్రి హోమ జ్వాలలలో నిలబడి సమాధిలోకి ప్రవేశించిన శ్రీ స్వామీజీ

ఈ శుభ ముహూర్తమే ఈ దివ్యాశ్రమానికి జన్మ సమయం గనుక ఆ లగ్నానికి జాతక చక్రం వేసి చూసిన పెద్దలు యీ ఆశ్రమానికి అనంతమైన భవిష్యదభివృద్ధి ఉన్నదని నిర్ణయించారు.

స్వామీజీ జాతకంలో లాగానే యీ ఆశ్రమ జాతకంలో గూడా లగ్నంలో లక్ష్మీనారాయణ యోగం ఉండటం, లగ్నంలో రవి వుండటం, ద్వితీయంలో గురువు ఉండటం, ఏకాదశంలో శుక్రుడు వుండటం గమనించినప్పుడు స్వామీజీ అవతార దివ్య ప్రణాళికలో యీ ఆశ్రమావతరణ పురానిర్ణీతసత్యసంకల్పమని అవగతం కాక మానదు.

గ్రహ పంచానన, లక్ష్మీనారాయణ, బుధాదిత్యాది అనేక మహా యోగాలు పట్టిన యీ ఆశ్రమ జాతక చక్రంలో ధర్మము-సుఖశాంతులు కలిసి కాపరం చెయ్యటం యీ స్థలానికి లలాటలిఖితం. సద్భావాలు పాల బుగ్గలవలె పొంగుకు రావటం ఇక్కడ అనివార్యం. హంసలు మానస సరోవరానికి చేరినట్టు సత్పురుషు లనేకులు రెక్కలు కట్టుకొని యిక్కడ వాలటం స్వభావ సిద్ధం. రాగద్వేషాదులు వ్యయస్థితిలోబడి, మోక్ష దృష్టి వికసించటం ఇక్కడ విధి నిర్ణయం. నిరంతరమైన గురుబోధ వెల్లివిరిసి విరుల నెత్తావి లాగున నలుదిక్కులకు గుబాళించటం యీ స్థలానికి సహజధర్మం. వేదఘోష, నామ సంకీర్తన, వైదికకర్మ పరంపర ఒక దానితో ఒకటి పోటీ పడటం యీ స్థలపు చేవ. సర్పాలనుండి శునకాల వరకు అనేకానేక విచిత్రజీవులు సహజీవనం చేస్తూ, ఎప్పటి కప్పుడు అనూహ్యాలైన మార్పులను తెస్తూ వుండటం యీ స్థలాని కొక చిద్విలాసం. ఇట్టి యీ క్షేత్రంలో స్వామీజీకి ప్రియమైన మామిడి చెట్టు కింద, చిన్నర్సు గారిచేత చేయించిన పాదుకలు పెట్టి సామూహిక పాదపూజ చేయించారు స్వామీజీ.

అదే ప్రారంభోత్సవం. ఆ శుభ సందర్భంలో 500 రూపాయలు వచ్చినాయి. ఆ రోజుల్లో అది పెద్ద మొత్తం. ఆశ్రమ ప్రారంభ శుభ సమయంలో కన్యాదాన ఫలప్రాప్తి భక్తులందరకూ కలగాలని సంకల్పిస్తూ, ఆ ధనాన్ని జానకీరామ మందిరం వారి లీల వివాహానికి అనుగ్రహించారు స్వామీజీ. మహాత్ములు ఏ స్థితిలో వున్నా వారి వితరణ విశాలంగానే వుంటుంది గదా !

అతి నిరాడంబరమైన ఉత్సవంతో ప్రారంభమైన ఆశ్రమ దినచర్య, ఆ మరునాడు గురువారం నాడే ప్రారంభమైన శ్రీగురు జన్మదినోత్సవ సప్తాహంతో మంగళప్రదమైన మారాకు తొడిగింది.

ఆ పై ఆదివారం ( 5-6-1966 ) నాటితో ఆశ్రమ భూమిలో అగ్నిదేవుడు కలకలా నవ్వాడు. ఆ మరునాటి నుంచీ నిత్య గణపతి హోమ మండల దీక్ష ప్రారంభించారు స్వామీజీ.

## అగ్నిప్రతిష్ఠ

అగ్నిగుండం ఎక్కడ ఏర్పరచాలని ప్రశ్న వచ్చింది. స్వామీజీ తమ చిత్తాన్ని ఏకాగ్రం చేసి, ఆశ్రమ స్థలాన్ని తేరిపార చూడసాగారు. ఇంతలో గణపతి చేతిలో అగ్ని ధరుడై, గబగబా నడచి వచ్చి ఒకచోట ఆ అగ్నిని ప్రతిష్ఠించాడు. ఆ స్థలంలో స్వామీజీ స్వయంగా చిన్న గుంట తవ్వి అగ్నిగుండం ఏర్పరచారు. అదే తరువాత భక్తుల చేతులలో పెద్దదయింది. అదే ఆశ్రమానికి శాశ్వత అగ్నిహోత్ర స్థానమైంది.

ఒకదాని మీద ఒకటిగా, కార్యక్రమాలు సాగిపోతున్నై. నగరంలోని భక్తులంతా, నానా ప్రయాసలకు ఓర్చి వచ్చి చూసిపోతున్నారు. అంతా బాగానే వుంది, కాని స్వామి వారికి ఉండేందుకు చోటు లేదు. అప్పటి వరకూ వాచ్‌మెన్ వున్న రేకుల గది స్వామీజీకి ధ్యాన మందిరమైంది. వారభిమానించిన మామిడి చెట్టే వారి విశ్రాంతికి చలువ పందిరి అయింది. శయన మంటపమైంది. అక్కడ తాగేందుకు మంచినీళ్ళు లేవు. స్వామి వారికి భిక్షే కాక మంచినీళ్ళు గూడా భక్తుల యిళ్ళనుంచి వస్తున్నై. ఒక మూల వున్న దిగుడు బావి స్నానానికి మాత్రం ఉపకరిస్తోంది.

స్వామీజీ స్వయంగా తవ్వుకున్న హోమగుండం మీద కొబ్బరాకులతో చిన్న పందిరి వేశారు. ఆ పందిట్లో ఎక్కువ మంది జనం పట్టటం లేదు. అందువల్ల భక్తులంతా ఆ చెట్టు నీడనా, ఆ చెట్టు నీడనా నిలబడి హోమం చూస్తున్నారు. కింద కూర్చుందామంటే ఎక్కడ పడితే అక్కడ ములికి రాళ్ళు, అపైన చెదపురుగులు.

ఎంతయినా చీకటి పడేలోగా అందరూ అక్కడి నుంచి వెళ్ళిపోవాలి. అక్కడ కరెంటు లేదు. చిన్న కిరసనాయిలు బుడ్డి ఆ రేకుల షెడ్డుకి గుడ్డితోడు. స్వామీజీ ఒక్కరే కొబ్బరి చెట్ల క్రిందో, మామిడి చెట్ల క్రిందో తుండుగుడ్డ పరుచుకొని పడుకుంటున్నారు. కొబ్బరాకుల మీద జారుడు బండలాడే వెన్నెల కూనలు కొంచెంసేపు స్వామీజీతో కేరింతలు కొట్టి మెల్లిగా మొహం చాటు చేసుకొంటున్నై. విచ్చలవిడిగా తిరగటానికి అలవాటుపడ్డ పెనుపాములు, తమ కొత్త నేస్తుడి కాళ్ళ కిందా, చేతుల కిందా దూరి దాగుడు మూతలాడుతున్నై. అప్పటి దాకా అక్కడి చెట్లమీద అధికారం చెలాయించిన పాత పిశాచాలు గుర్రుగుర్రుగా చూస్తూ అల్లంత దూరంలో అలంగాలు తిరుగుతున్నాయి. తమ స్వామి తమ దగ్గర చేరిన ఆనందమో ఏమో, చెద పురుగులు గూడా ఎక్కడ పడితే అక్కడ రోజు రోజూ చిమపుట్టలను సృష్టిస్తున్నాయి.

ఈ ఆశ్రమానికి చేరిన దగ్గర నుంచీ స్వామీజీ తమ శోణవస్త్రాలు గూడా తగ్గించి, చిన్న తుండుగుడ్డతో ఎక్కువ సేపు కాలం గడుపుతున్నారు. హోమం రోజు కొకసారనే గాక, ఒకోసారి రెండుసార్లు, మూడుసార్లు గూడా చేస్తున్నారు.

ఆశ్రమంలో ప్రవేశించే ముందురోజే కృష్ణమూర్తిగారికి కొంత విభూతి యిచ్చి పంపారు స్వామీజీ. కృష్ణమూర్తిగారు స్వామీజీని స్మరిస్తూ ఆశ్రమం అంతా విభూతి చల్లాడు, ముఖ్యంగా స్వామీజీ ఉండాల్సిన షెడ్డులో!

ఆశ్రమ ప్రవేశం రోజు నుంచీ ఒక ఏడురోజులు పాటు రోజూ పిల్లల్నందర్నీ వెంట బెట్టుకొని దివ్యనామ సంకీర్తన చేయిస్తూ స్థలమంతా ఒకసారి తిప్పారు స్వామీజీ.

ఆశ్రమం వున్న నంజన్‌గూడా రోడ్డులోకి అప్పటికి సిటీ బస్సులు లేవు. ఆ రోజుల్లో ఆటోలు లేవు. జట్కా బళ్ళే అప్పటి ప్రధాన వాహనాలు. అయినా, అనేక ప్రాంతాల నుంచీ భక్తులు రోజూ వచ్చి పోతున్నారు. అయితే ఎగుడు దిగుళ్ళ నేల కావటం వల్లా, ములుకుల వంటి రాళ్ల వల్లా వచ్చిన వారికి కూర్చునేందుకు గూడా సదుపాయంలేదు. అయినా అలాగే కూర్చుని హోమాది కార్యక్రమాలను శ్రద్ధగా తిలకిస్తున్నారు భక్తులు. ఆ మండల హోమ దీక్ష ప్రారంభం రోజునే, సుప్రసిద్ధ హరికథా విద్వాంసుడు, ఉపన్యాసకుడు, దాళవాయి హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు, అన్నింటినీ మించి హనుమదుపాసన పరాయణుడు అయిన అనంత పద్మనాభ భాగవత్‌గారు ఏదో పనిమీద తమ హైస్కూలు సెక్రటరీగారయిన మైసూరు పత్రిక నారాయణరావు గారింటికి వెళ్ళాడు. నారాయణరావుగారు ఇంట్లో లేడు. గణపతి సత్యానందాశ్రమానికి వెళ్ళాడని యింట్లో వాళ్ళు చెప్పారు. అందువల్ల నారాయణరావుగార్ని వెతుక్కుంటూ భాగవత్‌గారు నంజనుగూడ రోడ్డు వెంబడి సైకిల్‌పై వెళ్ళుతున్నాడు. ఒకచోట కొంతమంది జనం, కొంత సందడి కనిపించింది. లోపలికి వెళ్ళాడు. కెనరే గణపతి స్వామివారు ఇక్కడ కొత్తగా ఆశ్రమం ప్రారంభించారనీ, ఇవాళ్ళే హోమదీక్షా ప్రారంభమనీ తెలిసింది. ఈయన వెళ్ళేసరికి హోమం అయిపోయింది. ఆయన అంతకు ముందే స్వామీజీ గురించి విన్నాడు. అయినా దర్శించలేదు. ఇప్పుడు గూడా వార్ని దర్శించాలని ఆసక్తి ఏమీలేదు.

ఒక నిర్దుష్టమైన ఉపాసనా మార్గంలో పయనించేవాడికి తన మార్గాన తాను పోవటమే తప్ప పక్కవాడు ఎంత గొప్పవాడయినా, తనకు పనిలేదు. తన ఉపాసన తనది. తన సాధన తనది. వాడికి ఎవడెలాంటి వాడో అన్న ఉత్సాహం పనికిరాదు. ఈ భావనతో దృఢమైన ఉపాసనలో ఉన్న భాగవత్‌గారికి అక్కడ మైసూరు పత్రిక నారాయణరావుగారు కనిపించాడు. ఆయన భాగవత్‌గార్ని స్వామిజీ దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

అప్పటికి భాగవత్‌గారు నలభైయేళ్ళ ప్రాంతం వయస్సులో మంచి తీవ్రంగా సాగుతున్న ఉపాసనయొక్క బలంలో వున్నాడు. ఆయన కంటికి చిన్న వయస్సులో వున్న స్వామీజీ అంతగా ఆనలేదు. అయితే స్వామీజీ ఆయనను చాలా ఆదరంగానూ, గౌరవంగానూ పలకరించి, "మీరు హరికథ బాగా చెపుతారటగదా, ఒకసారి మా ఆశ్రమంలో చెప్పరాదూ" అన్నారు.

"ఈ ఊరి బైట అడవిలో హరికథేమిటి?" అనిపించింది భాగవత్‌గారికి. అయినా, అడుగుతున్నది ఒక గణపతి ఉపాసకుడు, కాదనరాదు. అందువల్ల "అయ్యా! మీరు కావాలంటే తప్పకుండా చెపుతాను. ఎవరు విన్నారో వినలేదో నా కక్కరలేదు. మీరు వింటానంటే చెపుతాను, కదలకుండా వినాలి మరి" అన్నాడు నిక్కచ్చిగా.

"సరే, గురువారం సాయంత్రం నాలుగు గంటలకు మీరిక్కడికి రండి" అన్నారు స్వామీజీ.

అలాగే అనేసి దైవికంగా జరిగిన యీ సన్నివేశానికి కొంచెం ఆశ్చర్యపోతూ వెళ్ళిపోయాడు భాగవత్‌గారు.

విద్వాన్ టి. ఎస్. నారాయణరావుగారు గూడా ఆ రోజే మొదటిసారిగా వచ్చి స్వామీజీ దర్శనం చెయ్యటం మరో విశేషం. వీరికి స్వామీజీని చూడగానే, ఒక దివ్యమైన జ్యోతిని చూసినట్టు అనిపించింది. బుద్ధ భగవానుడికి రావిచెట్టు కింద దర్శన మిచ్చిన వెలుగు ఇదేనేమో అనిపించింది. ఆనందమైంది. అప్పటినుంచీ అప్పుడప్పుడు వచ్చి పోవటం అలవాటుగా పెట్టు కున్నాడాయన.

గురువారంనాడు చెప్పిన సమయానికి భాగవత్‌గారు వచ్చాడు. కాని, రోడ్డుమీద ఆశ్రమం ఎక్కడుందో గుర్తించే గుర్తేమీలేదు. కనుక, తికమకబడుతూ, ఆశ్రమం దాటి వెళ్ళాడు. అలా ఆశ్రమం దాటి నాలుగు అడుగులు వెళ్ళాడో లేదో వెనకాలనించి చప్పట్లు వినిపిస్తే ఆగి చూశాడు. ఒక చిన్న తుండుగుడ్డ కట్టుకొని స్వామీజీయే చప్పట్లు కొట్టి పిలుస్తున్నారు. ఇద్దరూ కలిసి లోపలికెళ్ళారు. భాగవత్‌గారు వెంటనే పట్టుబట్టలు కట్టుకొని కథకు సిద్ధపడ్డాడు. ప్రక్క వాద్యగాళ్ళు లేరు. పైగా శ్రోతలు గూడా ఇద్దరు ముగ్గురి కన్నా లేరు. ఉగ్రిత్వంలో తన ఉపాస్య దైవంతో పోటీపడుతున్న భాగవత్‌గారికి ఒళ్ళు మండటంలో ఆశ్చర్యం లేదు.

"నేను రమ్మని చెప్పాను. వాళ్ళు రాలేదు అన్నారు" స్వామీజీ నిశ్చింతగా.

"వినటానికి మీరున్నారు. తక్కినవి నాకనవసరం. నేను మొదలెట్టేస్తాను" అన్నాడు భాగవత్‌గారు కోపంగా.

"మొదలెట్టండి" అన్నారు స్వామీజీ.

ఆయన మొదలు పెట్టి మంగళాచరణం అదీ పూర్తి చేసేసరికి పక్క వాద్యగాళ్ళు వొచ్చేశారు. క్రమంగా వొక వందమంది దాకా శ్రోతలూ వచ్చారు. భాగవత్‌గారు ఆనందంగా "భార్గవ విజయం" అనే హరికథ చెప్పాడు. అదే, ఆశ్రమంలో జరిగిన మొట్టమొదటి సాంస్కృతిక కార్యక్రమం.

భాగవత్‌గారి కథా కథననైపుణికీ, గాన మాధుర్యానికీ స్వామీజీ చాలా మెచ్చు కున్నారు. చివరికి ప్రసాదం యిస్తూ వారికి ఒక మారుతి విగ్రహం సృష్టించి యిచ్చారు. భాగవత్‌గారు యీ ప్రసాదానికి పులకించిపోయాడు.

"అప్పుడప్పుడు వస్తూ వుండండి" అన్నారు స్వామీజీ. సరే అని శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు భాగవత్‌గారు.

మండల దీక్ష సాగిపోతోంది. స్వామీజీ కెనరేలో చెప్పిన కాలజ్ఞాన ప్రవచనాల ప్రకారమే ఆ సంవత్సరం జూలై వచ్చినా వానలు పడలేదు. కన్నంబాడి ఆనకట్ట ఎండి పోయింది. అందువల్ల మైసూరు ప్రజలు అల్లాడిపోతున్నారు. ఇక్కడ ఆశ్రమంలో కరెంటు గూడా లేకుండా స్వామీజీతోపాటు మరికొందరు భక్తులు గూడా రాత్రిళ్ళు చెట్ల కింద కాలక్షేపం చెయ్యసాగారు. కాని స్వామీజీ ఇలా మట్టినేలలో ఎన్నాళ్లు దొర్లాల అని భక్తులకు ఆరాటం పెరగసాగింది. దానికి తగ్గట్టే ఒక రోజు కొంచెం వాన వచ్చింది. ఆ రోజు నిద్దరే లేదు స్వామీజీకి. దాంతో భక్తుల ఆరాటం పెరిగింది. గంగణ్ణ అనే ఒక గుమాస్తా ఇటికలు ఇచ్చాడు. నరసింహయ్య అనే మరో సామాన్యుడు ఒక ద్వారబంధం యిచ్చాడు. అనేక మంది శ్రమదానం చేశారు. తేనెటీగలు తేనె పోగుబెట్టినట్టుగా ఇందరు భక్తులు చేరి స్వామీజీ తలదాచుకునేందుకై రెండు గదుల చిన్న ఆజ్‌బెస్టాస్ రేకుల షెడ్డు నిర్మించగలిగారు. స్వామీజీ అభీష్టం మేరకు దీనిలోనే ఒక చిన్న భూగృహాన్ని గూడా కొండ రాళ్ళతో నిర్మించారు. ఈ నిర్మాణంలో ఒకే ఒక మేస్త్రీని పెట్టుకొని అతని కింద కూలీగా స్వామీజీ స్వయంగా పని చేశారనీ, ఆ యింటిని స్వయంగా నిర్మించారనీ * ఈనాడు చాలామందికి తెలియదు.

ఈ నిర్మాణ వ్యవహారం అంతా రామచంద్రశెట్టి అనే ఇంజనీరుగారి ఆధ్వర్యంలో జరిగింది. ఇల్లు ఏర్పడ్డది గాని, ఇంట్లో దీపం లేదు. కిరసనాయిలు దీపాలతోనే కొన్నాళ్ళు గడిచింది. ఒకనాడు కెనరే ఎలక్ట్రిసిటీ కాలనీ అధికారులు రాత్రిపూట ఇక్కడికి రావటం సంభవించింది. అప్పుడు వారు ఈ చీకటి పరిస్థితికి బాధపడి వెంటనే కరెంటు కనెక్షను ఇప్పించి, వైరింగు గూడా తమ స్వంత ఖర్చుతో చేయించారు. కరెంటు రావటంతో నూతనాశ్రమంలో కొంచెం వూపిరాడినట్టయింది. ఇక్కడి ఏర్పాట్లు యీ స్థితికి వచ్చేదాకా స్వామీజీ పరిస్థితి ఇంకా ఒక కాలు కెనరేలోనూ, ఒక కాలు ఆశ్రమంలోనూ అన్నట్లు సాగుతూ వచ్చింది. ఇక్కడ కాస్త యేర్పాటు కుదిరింది. స్వామీజీకి శ్రీశైలం వెళ్ళిరావాలని తీవ్రమైన సంకల్పం బయలుదేరింది.

---

* ఇప్పుడు ఆశ్రమం చాలా పెరిగింది. స్వామీజీ నివాసం గూడా పెరిగింది. చాలా మారింది. కాని ఎన్ని మార్పులు వచ్చినా స్వామీజీ స్వహస్తాలతో నిర్మాణమైన ఆ గది మాత్రం తుడిచి వేయబడలేదు. అది అలాగే వుంచి దాని మీద వృద్ధి చేశారు. ఆనాడు కొద్దిపాటి పునాదులతో కట్టిన గోడలు ఈనాడు రెండు అంతస్థులను ఎలా మోస్తున్నాయి? సమాధానం దొరకని అనేక ప్రశ్నలలో ఇదొకటి.



# 20 వ అధ్యాయం ఐక్య దీక్ష

అహంకారోన్మూలనాత్త
సర్వాహంతా మయం గురుమ్ ।
శక్తి శక్తిమ దద్వైత
స్ఫుటానుభవ మాశ్రయే ॥

[తనకు అహంకారం అడుగంటటంవల్ల అంతా తనతోనే నిండిపోయింది. శక్తికి శక్తిమత్తుకు (శక్తి గలది) గల అభేదస్థితి స్పష్టంగా అనుభవంలోకి వచ్చింది. అట్టి శ్రీగురుదేవుని ఆశ్రయిస్తున్నాను.]

## శ్రీశైలశిఖరం

గణేశ టాకీసు వారి కారులో స్వామీజీ శ్రీశైలం బయలుదేరారు. అనంత రామభట్టు గారు, నాగప్పశెట్టిగారు కూడా ఆ కారులో వచ్చారు. బాబయ్య అనే డ్రైవరు కారు తోలుతున్నాడు. కారులో కూర్చున్న దగ్గరనుంచీ స్వామీజీ ముఖం గంభీరంగానే వుంది. అది గమనించి ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. కారు శరవేగంతో దూసుకుపోతోంది. తల ప్రక్కకు తిప్పి తలుపు కిటికీలోంచి కింది రోడ్డునే తీక్షణంగా చూస్తున్నారు స్వామీజీ. నిద్ర పోవటంలేదు. సమాధిలోకి వెళ్ళలేదు. అయినా స్వామీజీ మాట్లాడటంలేదు. కారు సాగి పోతోంది. ఎదురుగా వాహనాలు వస్తున్నై. నేర్పుగా తప్పుకుంటోంది. కొన్ని వాహనాలను దాటి ముందుకు పోతోంది. ఒకోసారి ఏవో అడ్డులు వచ్చి అనుకోకుండా ఆగిపోతోంది. అయినా స్వామీజీ మాట్లాడటం లేదు.

అనంతపురంలో విశ్రాన్తి తీసుకొని, మళ్ళీ ప్రయాణం సాగించింది కారు. రాత్రి ప్రయాణం. భట్టుగారు, శెట్టిగారు నిద్రలోకి జారుకున్నారు. దొర్నాల దాటింది. ఘాట్ రోడ్డు మొదలైంది. స్వామీజీ మాత్రం కళ్ళు తెరచుకొని చూస్తూనే వున్నారు. కొండలు వస్తున్నాయి. లోయలు దాటి పోతున్నాయి. వాగులు అడ్డం పడుతున్నాయి. వంతెనలు దాటిస్తున్నాయి. మెలికలు వెనకబడుతున్నాయి. మెరకలు క్రింద బడుతున్నాయి. వేగం హెచ్చుతోంది. దూరం తగ్గుతోంది. స్వామీజీ ముఖంలోని గంభీరత మారలేదు.

చూపులోనే మోక్ష పదవి ననుగ్రహించే శ్రీశైల శిఖరం దర్శనమైంది. కారు ఇంకా సాగింది. స్వామీజీ చరణ పల్లవం యుగయుగాలనాటి ఆ పెద్ద కొండను పులకించి, పరవశింప చేసింది. అయినా స్వామీజీ మాట్లాడలేదు.

ఒక సత్రపు గదిలో యేర్పాట్లు జరిగి ఉన్నాయి. భక్తద్వయం స్వామివారి సౌకర్యాలను చూసే ప్రయత్నంలో వున్నారు.

సూర్యుడు సముద్రగర్భాలను చీల్చుకొని ఉదయించే ప్రయత్నంలో వున్నాడు. ఉన్నట్టుండి గదిలోంచి బయటకు నడిచారు స్వామీజీ. ఒక చిన్న తుండు మొలకి చుట్టుకొని వున్న స్వామీజీ అలా బయటకి నడవటం చూసి కంగారుగా వెనకవెళ్ళాడు భట్టుగారు. ఆ వెనక వెళ్ళాడు సెట్టిగారు. వెనక చూపులేకుండా చరచరా వెళ్ళిపోతున్నారు స్వామీజీ. పిలిచే ధైర్యం గాని, ఆపే ధైర్యం గాని భక్తులిద్దరికీ లేదు. వీరు దాదాపు పరిగెత్తుతూ స్వామీజీ వెనకాల నడుస్తున్నారు. స్వామీజీ రథ వీథివైపు వెళుతున్నారు. అది దాటి మెట్ల దారి పట్టారు. అప్పటికి వారు పాతాళ గంగకు బయలుదేరారని అర్థమైంది. కాని స్వామీజీ స్నానానికి వస్త్రాలయినా తీసుకురాలేదే? ఏం చెయ్యాలి? స్వామీజీ పరిస్థితి మామూలుగా లేదు. అసలు నూతన ఆశ్రమానికి వచ్చిన దగ్గర నుంచీ వారి పద్ధతి అదోరకంగా వుంటోంది. సగం లోకంలో, సగం ధ్యానంలో వుంటున్నారు. అందులోనూ ఇప్పటి స్థితి మరీ కొత్తగా వుంది. ఇంకా కారుచీకటి. కొత్తచోటు., ఇలాంటి పరిస్థితిలో స్వామీజీని వదిలి వెళ్ళటానికి ఇద్దరిలో ఎవరికీ ధైర్యం చాల్లేదు. ఏమయితే అదయింది లెమ్మని ఇద్దరూ స్వామీజీ వెంట నడవసాగారు.

భక్తులిద్దరూ కిందికి చూశారు. స్వామీజీ ప్రస్తుత స్వరూపం లాగానే ఆ దృశ్యం మనోహరంగానూ, భయంకరంగానూ వుంది. అయిదారు వందల అడుగుల లోతు లోయ అది. ఆ లోయలో అట్టడుగున ఉరకలు పెడుతున్న మహాప్రవాహం, చుట్టూతా ఆకాశం కనిపించ నీయని మహావృక్షాలు, ఎటు చూసినా ఆకుపచ్చ చెట్లు, పైన దూరాన తెలుపు, ఎరుపు కలిసిన నీలాకాశం కళ్ళు తిరిగే లోతులో నల్లటి నీటిపాయ.

స్వామీజీ ఆ మెట్ల వెంబడి దాదాపు పరుగెత్తుతున్నారు. అది దుస్సాహసం. ఒక్కడుగు జారితే, అయిదువందల అడుగులు! ఎంత ప్రమాద మది! కాని సమర్థులకు సాహసమే క్రీడ. స్వామీజీ ఉరుకుల పరుగులమీద ముందుకు వెళ్ళిపోతున్నారు. రక్షణకై వారి వెనకబడ్డ పెద్దలు వెనకే పడిపోయారు. స్వామీజీ మెట్లని చూడటంలేదు. నింగినీ చూడటంలేదు. నేలనూ చూడటం లేదు. నీటినీ చూడటంలేదు. శరీరం పరిగెత్తేస్తోంది. ఆయన తాపీగా సాగిపోతున్నారు. పెద్దలు బాగా వెనకబడ్డారు. స్వామీజీ కాళ్ళకు ఇసుక తగిలింది. మెట్లయిపోయాయన్న మాట. ఒక అర క్షణం నిలబడి యిటూ, అటూ చూశారు. అంతే, మళ్ళీ చరచరా సాగిపోతున్నారు. ఈ మాటు కాళ్ళు ఇసకలో కూరుకుపోయి నడక కష్టంగా వుంది. అయినా వేగం తగ్గనీయటం లేదు

స్వామీజీ. జనం అంతా స్నానాలు చేసే రేవులకు దూరంగా నడుస్తున్నారు. స్వామీజీ, పోయి పోయి ఒక చోట ఆగారు. అక్కడ నీటిలోకి దిగి బుడుంగున మునక వేశారు.

## సోహం

ప్రపంచం చల్లబడ్డది. సవికల్ప సమాధి దానంతట అదే అందుకుంది. ఇక లోపల అప్రయత్నమైన చర్చ పెల్లుబికింది. నీటి అడుగునే వుండిపోయింది శరీరం.

"కావలసింది బాధకు నివారణ. వ్యాధికి పేరు గాదు."

"నీకున్న బాధ ఏమిటి ?"

"నా సంకల్పం లేకుండా పనులు జరిగిపోతున్నాయి."

"అది సుఖమేగా, బాధేముంది?"

"కాదు, దాంట్లోనే పరీక్షల భయముంది."

"పరీక్ష అంటే భయమెందుకు? నెగ్గగలవుగా."

"అది కాదు, పరీక్ష చేసేవాడు ఉన్నాడు అంటే, అది ఎప్పటికైనా భయమే! ఆ, ఇప్పుడు తెలిసింది. నాకున్న బాధ పేరు భయం."

"ఖాయమేనా ?"

"ఖాయమే"

"భయం దేనివల్ల వస్తుంది ?"

"భేదం వల్ల. అర్థమైంది, నా పొరపాటు అర్థమైంది. అహమిత్యేవ విభావయే భవానీం. అహమిత్యేవ విభావయే భవానీం."

"గణపతి చెప్ప లేదా ఈ మాట ?"

"చెప్పాడాయన. నేనే గ్రహించలేదు."

"ఏమని చెప్పాడాయన ?"

"ఎగువ ప్రయాణంలో ఉపాసనేమిటి, దిగువ ప్రయాణంలో ఉపాసనేమిటి, అని అడిగాడు. నేనే గ్రహించలేదు."

"అంతేనా ?"

"ఆశ్రమ స్థల నిర్ణయ సమయంలో గూడా ఆ స్థలం నీదే అని గణపతి, తనదే అని శక్తి మాతా చెప్పారు. ఆ సందర్భంలోనూ అహంగ్రహోపాసనను వారిద్దరూ స్పష్టంగానే సూచించారు."

"అయితే ఇప్పుడు నీ ఉపాసనేమిటి ?"

"చెప్పాగా, అహంగ్రహోపాసన"

"నేనే ఆ శక్తి మాతను. అహమిత్యేవ విభావయే భవానీం"

నీళ్ళలోంచి లేచి నుంచున్నారు స్వామీజీ.

రొప్పుకుంటూ అప్పుడే అక్కడికి చేరారు భక్తు లిద్దరూ. స్వామీజీ వీళ్ళవంక చూడటం లేదు. కానీ స్వామీజీ ఏదో ఆనందంలో వున్నారని వారిద్దరికీ అర్థమవుతోంది. అది వాళ్ళకూ ఆనందవిషయమే. ఆ ఆనందంలోనే వాళ్ళిద్దరూ ఆనందమూర్తిగా వున్న స్వామీజీని చూస్తూ అక్కడే నిలబడిపోయారు.

ఇంతలో, అల్లంత దూరాన, నదిలో కొట్టుకు వస్తోంది గుండ్రటి వస్తువేదో! అది క్రమంగా ఇటే వస్తోంది. అది గుండ్రటి చెక్క దొన్నె. అది దగ్గరకు, స్వామీజీకి బాగా దగ్గరకు వచ్చేసింది. స్వామీజీ దాన్ని పట్టుకోలేదు. కాని, అది అక్కడ ఆగిపోయింది. దాని వంకే ఏకాగ్రంగా చూస్తున్నారు స్వామీజీ. అందులో కొన్ని కాషాయ వస్త్రాలు, కౌపీనాలు ఉన్నాయి.

"ఏకవాడి........ఏకవాడి......ఏకవాడి"

స్వామీజీ చెవులలో యీ మాట ఘంటానాదమై గింగురు లెత్తసాగింది. ఏకవాడి అంటే ఏకవస్త్రం, అని అర్థం. "ఎవరిది, ఈ మాట? ఎవరిది?........ఎవరిది?" స్వామీజీ చుట్టూ పరిశీలించసాగారు.

ఆకాశం నిర్మలంగా వుంది. దిక్కులు ప్రసన్నంగా వున్నాయి. గాలి నిబ్బరంగా వుంది. నది హుందాగా సాగుతోంది. అలల శిలల ఒరిపిడిలో పుడుతున్న చిరునవ్వడులు, కొండమీది నుంచి ఝుమ్మని వస్తున్న భ్రమరనాదాలతో మేళవించి నాదబిందు కళాత్మకమైన ప్రణవ విద్య నుపదేశిస్తున్నాయి. ఘంట లాగిపోయాయి! స్పందం కొనసాగింది!! నాదం కూడా లయించింది!! సంస్కారం మిగిలింది. సంస్కారం గూడా అంతరించింది. కళ్ళు తెరిచి వుండగానే స్వామీజీ చిత్తవృత్తి పూర్తిగా కరిగి కృష్ణలో కొట్టుకుపోయింది.

స్వామీజీ శరీరం దొన్నెలోని కాషాయాంబరాలను అందుకొన్నది. దొన్నె కదిలి ముందుకు సాగిపోయింది. స్వామీజీ శరీరం మెల్లగా వొడ్డుకొచ్చి ఆ వస్త్రాలను ధరించింది. కాషాయి కౌపీనం బిగించుకొని ఓర అంత పెద్దదిగా వున్న ఆ కాషాయ వస్త్రాన్ని అంతకు ముందే అలవాటు వున్నట్టుగా చకాచకా ధరిస్తూ తలమీది నుంచి, మేలి ముసుగుగా తిప్పుకొని మెడ చుట్టూ పైటగా దిద్దుకొని తనను తానే చూచుకొని సంతోషపడి పోతోంది స్వామీజీ శరీరం. అవితర్క్యమైన యీ విచిత్ర ఘటనా పరంపరకు విస్తుబోయి నోళ్ళు తెరచుకొని, అప్రతిభులై చూస్తూ వుండిపోయారు భక్తులిద్దరూ.

నూతన దీక్షా వస్త్రధారణ కాగానే కొద్దిగా పక్కకు నడిచి ఒక శిలావేదిక మీద కూర్చుండి పోయారు స్వామీజీ. భక్తులిద్దరూ ఏం చెయ్యాలో పాలుపోక చూస్తుంటే, స్నానం

చేసి రమ్మని తల ఊపారు స్వామీజీ. ఇద్దరూ మూడు మునుగులు మునిగి ఆ తడి బట్టలతోనే వచ్చి స్వామీజీ పాదాలు పట్టుకొన్నారు. ధన్యజీవులు వాళ్ళు. స్వామీజీలో వున్న ఆనంద సముద్రంలో ఏ లవలేశమో వారికి గూడా అనుభవానికి వచ్చి ఏ ఆలోచనా పాలుబోక, స్వామీజీ ఎదురుగా ఇసుకలో అలాగే చతికిలబడిపోయారు. కొంతసేపు అలా గడిచాక స్వామీజీయే మెల్లిగా పెదవి విప్పారు.

"స్వామీజీ జీవనచరిత్రలో ఇది ప్రధాన ఘట్టం."

వారిద్దరూ మరింత అయోమయ పడిపోయారు. పైగా, "ఏ స్వామీజీ చరిత్ర?" అన్నారు.

"మీ స్వామీజీ చరిత్రే."

"ఈ శరీరంలో ఒక విశిష్టమైన చైతన్యం జీవనం చేస్తోంది. ఒక అతీతమైన దివ్య విభూతి గల చైతన్యం జీవనం చేస్తోంది. ఆ దివ్య చైతన్యమే అణువునూ, అణువునూ కలుపుతోంది, విడదీస్తోంది. ఆ దివ్య చైతన్యమే కాలచక్ర పరివర్తనం ద్వారా, సనాతన ధర్మ ప్రవర్తనం ద్వారా చరాచర జగత్తులను నడుపుతోంది. దాని పేరే స్వామీజీ. అది మీకయినా స్వామీజీయే, నాకయినా స్వామీజీయే." చిరునవ్వు నవ్వుతూ ఒక క్షణం ఆగారు స్వామీజీ. ఆ చిరునవ్వుల సోయగాలకు తన్ను తానే మరిచిపోయాడు శెట్టిగారు.

భట్టుగారు మాత్రం, "మరి మీరెవరు? అన్నీ ఆ స్వామీజీయే చేస్తుంటే, మీరేం చేస్తూ వుంటారు?" అని అడిగాడు.

"ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి తగిన భాష యీ ప్రపంచంలో లేనే లేదు. ఉన్నంతలో చెప్పాలంటే నేను చూస్తూ వుంటాను. అందుకనే నన్ను సాక్షి అని కొందరంటారు" అన్నారు స్వామీజీ.

"ఏమీ అర్థం కాలేదు స్వామీజీ" అన్నారిద్దరూ.

"అవన్నీ మీకెందుకు? దీంట్లో (తన శరీరాన్ని చూపుతూ) వున్న వాణ్ణి మీరు స్వామీజీ అంటున్నారా లేదా? నేను గూడా ఇకనుంచి వాణ్ణి స్వామీజీ అనే అంటాను. అది గుర్తు పెట్టుకోండి చాలు. ఇక లేవండి. అప్పుడే యెండ పొడ వస్తోంది. మెట్లెక్కడం కష్టమవుతుంది మళ్లా" అంటూ ముందుకు సాగారు స్వామీజీ.

"ఇది తేలిగ్గావుంది. స్వామీజీ అంటే మీలోవున్న పరమాత్మ పేరు" అంతేగా అన్నాడు శెట్టిగారు తనూ నడుస్తూ.

స్వామీజీ సమాధానం చెప్ప లేదు.

మళ్ళీ వారి ముఖం గంభీరమయి పోయింది. నడక చరచరానే సాగింది కాని, త్వరలోనే వయోవృద్ధు లిద్దరూ వెనక వస్తున్నారని గమనించి, నడక వేగం బాగా తగ్గించేశారు స్వామీజీ. మౌనం మాత్రం వదల లేదు. స్వామీజీ సరాసరి రథ పీఠిలోంచి, రాయల గోపురం

ద్వారా మల్లికార్జున స్వామివారి ఆలయ ప్రథమ ప్రాకారంలోకి నడిచారు. ఆ విశాల ప్రాకారంలో ఆలయానికి ప్రదక్షిణంగా నడుస్తూ, వృద్ధ మల్లికార్జునాలయ, రామ సహస్ర లింగాలయాలను ఆనుకొని వున్న, మహౌదుంబర వృక్షం మొదట్లో పద్మాసనం వేసుకొని, కళ్ళు మూసికొని కూర్చుండిపోయారు.

అది జువ్వి, మేడి, రావి చెట్లు మూడు పెనవేసుకొని పెరిగిన మహావృక్షం. ఈ వృక్షాన్ని గురించిన ప్రస్తావన శ్రీపర్వత పురాణంలో గూడా వుంది. ఎందరెందరు మహనీయులైన మహర్షులీ వృక్షాన్ని ఆశ్రయించి తమ తపస్సులను పండించుకున్నారో ఎవరు చెప్పగలరు? దీని వయస్సెంతని యెవరికి తెలుసు? శ్రీదత్త పురాణంలో దత్తాత్రేయుల వారు ఇక్కడ వేయి సంవత్సరాలు తపస్సు చేశారని వున్నది. క్షేత్ర ప్రసిద్ధిలో గూడా దత్తాత్రేయుల వారు తపస్సు చేసిన వృక్షమనే దీనికి ప్రసిద్ధి యెక్కువ. అందువల్లే వున్నవి మూడు చెట్లయినా, దానిని ఔదుంబర మనే యెక్కువగా పిలుస్తూ వుంటారు. ఎన్నో నాగ శిలామూర్తులు యీ చెట్లు వేళ్ళల్లో లీనమై మరుగున పడిపోయి వున్నై. దీనికి ప్రదక్షిణాలు చేస్తే, కోరికలు వెంటనే నెరవేరుతాయని ఈ వృక్ష రాజాన్ని పల్లెజనం ప్రత్యేకంగా ఆరాధిస్తారు.

అక్కడ బద్ధ పద్మాసనులై కాషాయాంబరధారులై వున్న యీ దివ్యతేజస్విని చూసి, వృక్ష ప్రదక్షిణాదులకై వచ్చిన యాత్రికులు సాష్టాంగ వందనాలు చేయసాగారు. ఒక పావుగంట అయినాక స్వామీజీ కన్నులు తెరిచారు.

" ఇక, ఇప్పుడు కార్యక్రమమేమిటి ? " అన్నారు స్వామీజీ లేచి నుంచుంటూ.

" ముందు తమ రొక్కసారి మన బసకు వస్తే, తక్కిన యేర్పాట్లు నేను చూస్తాను. ముందరిగానే కొందరకు ఉత్తరాలవీ రాసి యేర్పాట్లు కొన్ని చేశాను. మనం వస్తూనే పాతాళ గంగకు వెళ్ళిపోయాం. మరి వాళ్ళందర్నీ యెలా పట్టుకోవాలో యేమిటో ఇప్పుడు చూస్తాను. " అన్నాడు భట్టుగారు.

" ఏమీ కంగారు లేదు. అన్నీ బాగానే జరుగుతాయి " అన్నారు స్వామీజీ ముందుకి నడుస్తూ.

" స్వామీజీ ! ఇందాక నది దగ్గర తమరేదో చెప్పారు. నాకేమి అర్థం కాలేదు " అన్నాడు భట్టుగారు మళ్ళీ.

" ఏమన్నారు స్వామీజీ " అన్నారు స్వామీజీ. భట్టుగారు కొంచెం అయోమయంగా చూశాడు గాని, ఇంతలో దీపం వెలిగింది.

" అదే... స్వామీజీ జీవితంలో ప్రధాన ఘట్ట మన్నారు. "

"అదా ! చూడు. ఈ ప్రపంచం అంతనీ ఒక శక్తి నడుపుతోంది అని నీకు తెలుసు గదా. ఆ శక్తికి రూపం వుందా ? లేదు. కాని, రూపం లేకపోతే మనం గ్రహించలేం గదా ? అందుకని

ఆ శక్తి, రూపాలు తీసుకోవటం మొదలు పెట్టింది. అలాంటి రూపాలన్నింటిలోకీ మొదటిరూపం జ్యోతిస్సు. ఆ జ్యోతిస్సు ప్రధానంగా పన్నెండు రకాలు. దాన్ని బట్టే జ్యోతిశ్శాస్త్రంలో పన్నెండు రాసులు వచ్చాయి. దాన్ని బట్టే ఆకాశంలో ద్వాదశాదిత్యులు ఏర్పడ్డారు. దాన్ని బట్టే భూమిమీద గూడా పన్నెండు జ్యోతిర్లింగాలు యేర్పడ్డాయి.

1. *సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునం।
ఉజ్జయిన్యాం మహాకాళం - ఓంకారే పరమేశ్వరం।
కేదారం హిమవత్పృష్ఠే - డాకిన్యాం భీమ శంకరం।
వారాణస్యాంచ విశ్వేశం - త్ర్యంబకం గౌతమీ తటే।
వైద్యనాథం చితాభూమౌ - నాగేశం దారుకావనే।
సేతుబంధే చ రామేశం - ఘుశ్మేశం చ శివాలయే॥

ఇవి ఆ పన్నెండు జ్యోతిర్లింగ క్షేత్రాలు.
అలాగే శక్తి పీఠాలు గూడా పన్నెండు వున్నాయి.

2. మలయే భ్రామరీదేవీ - కామాక్షీ కంచికాపురే।
కుమారీ కేరళే దేశే - ఆనర్తే అంబికాహ్వయా।
కరవీరే మహాలక్ష్మీః - కాళికా మాళవస్థలే।
ప్రయాగే లలితాదేవీ - వింధ్యే వింధ్యా నివాసినీ।
వారాణస్యాం విశాలాక్షీ - గయా మాంగల్య గౌరికా।
వంగదేశే సుందరీసా - నేపాలే గుహ్యకేశ్వరీ॥

---

గమనిక : 1) గుజరాత్‌లోని సౌరాష్ట్ర ప్రాంతమున సోమనాధుడు 2) ఆంధ్రరాష్ట్రమున శ్రీశైలమున మల్లికార్జునుడు 3) మధ్యప్రదేశమునందలి ఉజ్జయినిలో మహాకాళేశ్వరుడు 4) మధ్యప్రదేశ్ లోనే, ఓంకార్ క్షేత్రమున అమరేశ్వరుడు 5) హిమాలయములలో కేదారక్షేత్రమున కేదారేశ్వరుడు. 6) మహారాష్ట్రమున సహ్య పర్వతములందు డాకిని యను క్షేత్రమున భీమ శంకరుడు 7) ఉత్తర ప్రదేశ్‌లోని వారణాసి యందు విశ్వేశ్వరుడు. 8) మహారాష్ట్రమందు త్రియంబకమున త్ర్యంబకేశ్వరుడు. 9) బీహార్‌లోని చితాభూమియను క్షేత్రమున వైద్య నాథుడు 10). గుజరాత్‌లోని దారుకావనమున నాగేశ్వరుడు 11) తమిళనాడున రామేశ్వర క్షేత్రమున రామేశ్వరుడు. 12) మహారాష్ట్రమందు ఎల్లోరా గుహల దగ్గర శివాలయ క్షేత్రమున ఘుశ్మేశ్వరుడు.

గమనిక · 1) శ్రీశైలమున భ్రమరాంబిక
2) కాంచీ పట్టణమున కామాక్షి
3) కేరళ రాష్ట్రమున కుమారీదేవి
4) ఆనర్తములందు అంబిక
5) కొల్హాపురమున మహాలక్ష్మి
6) మాలవదేశమున కాళిక
7) ప్రయాగయందు లలితాదేవి
8) వింధ్యాద్రియందు వింధ్యావాసిని
9) కాశీ యందు విశాలక్షి
10) గయ యందు మంగళగౌరి
11) వంగదేశమున సుందరీదేవి
12) నేపాల్‌లో గుహ్యకేశ్వరి

శక్తి పీఠాలు పద్దెనిమిది అనే ప్రసిద్ధి వొకటుంది. ఆ విధానం వేరు.

ఒక జ్యోతిర్లింగమూ, ఒక శక్తి పీఠమూగూడా కలిసి వున్న క్షేత్రం మరింత అరుదు. అలాంటి అపురూపమైన మహాక్షేత్రం శ్రీశైలం. ఇక్కడ మల్లికార్జున మహా జ్యోతిర్లింగమూ వుంది, భ్రమరాంబికా మహాశక్తి వుందిగదా! ఈ శ్రీశైలం మలయ పర్వతాలలో భాగం. మలయ పర్వతాలంటే సహ్యాద్రి పంక్తి. ఈ సహ్యాద్రి పంక్తి అంతా గూడా దత్తాత్రేయులకు నివాస భూమి. ఇప్పుడు మనం కూర్చుని వచ్చిన ఆ మహౌదుంబరం సాక్షాత్తుగా దత్తాత్రేయ స్వరూపమే. ఇప్పటికి ఈ శరీరానికి 24 సంవత్సరాల సాధన అయింది. అంటే రెండు పన్నెండ్లు అన్నమాట. ఈ జీవితానికీ పన్నెండు సంఖ్యకీ ఒక సంబంధం వున్నది. ఇవాల్టి నుంచీ మూడవ ఆవృత్తి ప్రారంభం అయింది. ఇది మళ్ళీ పన్నెండేళ్ల దీక్ష. దీని ఫలితం పన్నెండేళ్ళు తరువాత అంటే 1972లో ప్రపంచానికి వ్యక్తమవుతుంది. ఇది యీ చరిత్రలో ఒక మలుపుకి మొదలు. ఈ దీక్షా ప్రారంభం లోక కల్యాణకరం. ఈ శుభ సమయంలో మీరిద్దరే వుండటం మీ పుణ్యం. అదీ స్వామీజీ ఇందాక చెప్పవచ్చిన విశేషం."

భక్తు లిద్దరికీ విషయం ఎక్కడ మొదలైందో, ఎక్కడ ముగిసిందో బాగా అంతు బట్టలేదు కాని, ఏదో కొత్త దీక్ష అంటున్నారు కదా అని, అంతకన్న అడగటం బావుండదేమో అని ఊర్కుండి పోయారు. ఇంతలో మకాం గది వచ్చింది. గదిలోకి వెళ్ళాక గుర్తొచ్చి "ఔను స్వామీజీ! ఇందాక పాతాళగంగలో రేవు వొదిలి పెట్టి అంత దూరం వెళ్ళారేమిటి?" అన్నారు శెట్టిగారు.

"అదా! మనం కూర్చున్న ఔదుంబరం దత్తాత్రేయ స్వరూపమని చెప్పాగా. ఆ దత్తాత్రేయ స్వామివారి అవతారం నరసింహ సరస్వతీ స్వామివారు. వారు ఈ శ్రీశైలంలోనే జల సమాధి అయి శరీర త్యాగం చేశారు. ఆ సంఘటనలన్నీ గుర్తొచ్చి, ఆ చోటుకు వెళ్ళారు స్వామీజీ."

"మరి ఈ కాషాయ వస్త్రాలేమిటి మరి. ఆ దొన్నె ఎవరు పంపారు?" అన్నాడు భట్టుగారు, మధ్యలోనే అందుకొని.

"చెప్పాగా ... కొత్త దీక్ష. కొత్త దీక్షా వస్త్రాలు. ఇంకా వివరాలు దీక్ష అయినాక బయటకు వస్తాయి" అన్నారు స్వామీజీ.

అవతల వాళ్ళ రహస్యాలు గోకి గోకి అడగటం మర్యాద కాదు కదా! అందుకని ఆ పెద్ద మనుష్యు లిద్దరూ ఆ విషయం అక్కడితో వొదిలేసారు. ఆ తరువాత తీర్థయాత్రా క్రమం అంతా చక్కగా సాగిపోయింది. ఆ మర్నాడు బయలుదేరి వచ్చేశారు.

స్వామీజీ ఆశ్రమంలో ప్రవేశించేసరికి, పది పన్నెండు మంది కొత్త భక్తులు స్వామీజీ కోసం ఎదురు చూస్తున్నారు. అందరూ ఇతర వూళ్ళవాళ్ళే. అందరూ మొదటిసారిగా వస్తున్న వాళ్ళే. అందరి చేతుల్లోనూ పూలు, పళ్ళతోపాటు కాషాయ వస్త్రాలు కూడా ఉన్నాయి.

విశ్వ సంకల్పానురూప
స్వ సంకల్ప క్రమోద్గతిమ్ ।
శిష్యాంకురిత సద్భావ
వైభవం శ్రీగురుం భజే ॥

(విశ్వ సృష్టికి సంబంధించిన విరాట్ సంకల్పాలకు అనుగుణంగా ఆయన సంకల్పాలు క్రమంగా విచ్చుకుంటున్నాయి. తన శిష్యులలో సద్భావ సంపదలను మొలకెత్తించటం ఆయన పని. అట్టి శ్రీగురుదేవుని భజిస్తున్నాను.)

## కార్యాలయం

భూగృహం ఉపయోగం బాగా పెరిగి పోయింది. రోజూ గంటల తరబడి స్వామీజీ ఆ భూగృహంలో వుండటం సన్నిహిత భక్తులకు ఆశ్చర్యం కలిగించటం లేదు. ఎందుకంటే ఒకోసారి రోజుల తరబడి దాంట్లోనే వుండిపోతున్నారు. మూడు రోజులపాటు భూగృహంలో సమాధిలో వుండి పోవటం బాగా పరిపాటి అయిపోయింది. వారం రోజులు భూగృహంలో వుండి పోయిన సందర్భాలు గూడా చాలా వుంటున్నాయి. బయట వున్న రోజులలో మాత్రం రాత్రి పన్నెండు, వొంటిగంట దాకా గూడా కొందరు భక్తులతో ఏదో యేదో మాట్లాడుతూ కాలక్షేపం చేస్తూ వుండేవారు. ఆ రోజుల్లో స్వామీజీ వొద్దన్నా వినకుండా కొందరు భక్తులు వచ్చి స్వామీజీకి తోడు పడుకునేవారు. అలాంటి వారిలో చిన్న అర్సుగారు, సిల్కు ఫ్యాక్టరీలో పని చేసే వెంకటరామయ్యగారు, రైల్వేలో పని చేసే సూర్యనారాయణగారు మొదలయిన వారు ముఖ్యులు.

వీరంతా ఆశ్రమానికి సమీపంలో వున్న విద్యారణ్యపురం ప్రాంతంలో ఉన్నవారే. వీరిలో రైల్వేలో పని చేస్తున్న సూర్యనారాయణరావుగారు, వారి భార్య జయమ్మగారు కెసరేలో గూడా అప్పుడప్పుడు స్వామీజీని దర్శించేవారే కాని, దూరం వల్ల సేవించుకోలేదు. ఇప్పుడీ నూతనాశ్రమానికి వచ్చినాక వాళ్ళిద్దరూ గూడా అధికంగా సేవించుకోసాగారు. ఆ దంపతులకు సంతానం లేకపోవటం వారికి భగవంతుడిచ్చిన అనుగ్రహం. అప్పటికే జీవితంలో యించుమించు సగ భాగం గడిపేసిన ఆ పుణ్యదంపతులకు సంతాన చింతలేక పోవటం వారి పూర్వ

పుణ్య పరిపాకం. నిస్వార్థమైన సేవా దృష్టి జన్మసిద్ధమై లభించటం వారి భాగ్యం. ఈ అదృష్టాల వల్ల ఆ దంపతులు స్వామీజీని అత్యధికంగా సేవించుకొని తమ జీవితాలను ధన్యం చేసుకుంటూ వుండేవారు.

ఆశ్రమంలో కొద్ది కొద్దిగా ఏర్పాట్లు అమరుతున్న కొద్దీ, స్వామీజీ భిక్ష ఆశ్రమంలోనే తయారు చేసే పద్ధతి యేర్పడింది. దానికి కొందరు తల్లులు జట్లు జట్లుగా యేర్పడి పనులు జరుపుతూ వుండేవారు. వారిలో యీ జయమ్మగారు, సీతమ్మగారు, హోటలు గోపాలరావు గారి భార్య సరోజమ్మగారు వగైరాలు వుండేవారు.

ఇలా శారీరక, మానసిక సేవ చేసేవారు అనేక విధాల కుదిరారు, బాగానే వుందిగాని, ఋణభారమొకటి స్వామీజీ వెంటబడ్డది. ఈ రేకుల గది వేయించటం వల్ల ఈ పరిస్థితి యేర్పడ్డది. ఆశ్రమ స్థానం మారటం వల్ల వచ్చే జనం సంఖ్యలోనూ, వచ్చేవారి అలవాట్ల లోనూ మార్పు యేర్పడ్డది. ఇప్పుడు వచ్చే వారిలో చాలామంది కొత్తవారు. వారికి ఆశ్రమము, హోమాలు ఎలా జరుగుతాయన్న ఆలోచన లేదు. దీనికి తోడు అప్పుడే మండల దీక్ష వొకటి ముగిసింది. ఆదివారపు హోమాల్లో యే కొంచెమో డబ్బు వస్తే దాన్ని అప్పుకు జమ కట్టసాగారు స్వామీజీ. దాంతో, పై వారం హోమం చేయించే దెవరో ముందు వారమే వెతుక్కోవలసి వచ్చింది. ఈ పరిస్థితి చూసి, పాండవపురం తాలూకా తహసీల్దారు నంజుండరావుగారు 6, 7 వారాలకు హోమాలను తమ సిబ్బందిచేత యేర్పాటు చేయించేశారు. అది ఇతరులకు మార్గ దర్శకమయింది. అప్పటి నుంచీ హోమాలు వెతుక్కోకుండానే సాగిపోతున్నాయి.

ఈ ఆశ్రమంలోకి వచ్చిన దగ్గరనుంచీ ప్రభుత్వంవారితోనూ, పురపాలకా సంఘం వారితోనూ వ్యవహారపు పనులు వొకటి వచ్చి పడ్డాయి. ఇప్పుడక్కడ ఒక గది యేర్పడ్డది. ఇంకా భక్తులు కూర్చునేందుకై ఒక పాక, ఒక చిన్న వంటశాల ఇత్యాదులు ఏర్పడవలసి వున్నాయి. ఇంకా ఇలాంటి పనులు అనేకం ఉన్నాయి. లోకవ్యవహారంలో అంతకు ముందు ప్రత్యక్షానుభవం లేని స్వామీజీకి యివన్నీ విసుగుగా వుండటం సహజం. అయితే ఇవన్నీ ఆయన ఎందుకు పెట్టుకున్నట్టు ?

ఒకసారి శిరస్తదార్ కృష్ణమూర్తిగార్ని పిలిచి యిలా చెప్పారు స్వామీజీ. "నాకు కొన్ని ప్రభుత్వపు పనులు ఏర్పడుతున్నై. నేనే వెళ్ళి ఆ పనులు చేసుకోగలను. అప్పుడవి మరింత తేలికగా అయిపోతాయి గూడా. కాని, జరగకుండా అడ్డుపడిపోయే నీ పనులు జరగాలంటే, నా పనులు నువ్వు చేసిపెట్టు. అప్పుడు నీ పనులు నేను చేసిపెడతాను." అని.

కృష్ణమూర్తిగారు అప్పటికే స్వామీజీని నిస్వార్థంగా సేవించుకుంటున్నాడు. స్వామీజీ వ్యవహారాలన్నీ ఆ తరువాత చాలా కాలం ఆయనే చూశాడు గూడా. ఆయన ద్వారా ఇతరులకు యీ సందేశం చేరాలనే, స్వామీజీ ఆయనకు ఆ విషయం ఎంతో స్పష్టంగా కుండబద్దలు కొట్టినట్టు చెప్పారు.

స్వామీజీ ఇలా చెప్పారని నలుగురికీ చేరింది. స్వామీజీ కార్యక్రమాల కోసం ఇబ్బంది పడుతున్నారనీ తెలిసింది. అయినా, ఎలాగో అలా అక్కడ సంకల్పించిన కార్యక్రమాలు విశేషంగా జరిగిపోతున్నాయని గూడా కనిపిస్తోంది. అది చూసి వందలమంది, వేలమంది ఆనందించేసి, ప్రశంసించేసి, దులిపేసుకొని వెళ్ళిపోతున్నారేగాని, అంతకు మించి పట్టటం లేదు. అందుకని తమ పద్ధతి కొంచెం మార్చుకొని, తమ ధర్మ ప్రచార కార్యక్రమానికి యెవరైతే హృదయపూర్వకంగా సహాయం చేస్తున్నారో, వారికి మాత్రమే తాము సహాయం చేసే పద్ధతిని నిక్కచ్చిగా ప్రవేశపెట్టాలని స్వామీజీ అనుకోసాగారు. కాని, దీనిని పూర్తిగా ఆచరణలో పెట్టటం వారివల్ల కాలేదు. కాని, యీ నూతన పద్ధతిని అణుమాత్రంగా అమలుచేసి నందువల్లే అద్భుతమైన ఫలితాలు వచ్చాయి. వాటిలోకల్లా ప్రత్యేకించి చెప్పుకో తగ్గది, మైసూరు వాస్తవ్యులు కొందరు పని గట్టుకొని సాగించిన ప్రచారం! ఏమని? స్వామీజీలో దివ్య శక్తులు తగ్గిపోయాయని!

ఈ వింత ప్రచారానికి స్వామీజీ సన్నిహిత భక్తులు బాధపడసాగినా, స్వామీజీ మాత్రం చాలా సంతోషించారు. ఆ ప్రచారాన్ని ఎదుర్కోవాలని కొందరు చేసిన ప్రయత్నాలను స్వామీజీ తీవ్రంగా నివారించారు. "వాడి పనులు జరగటం లేదు. వాడి దృష్టిలో శక్తి అయిపోయింది. నీ పనులు జరుగుతున్నాయి. నీ దృష్టిలో శక్తి ఇంకా వుంది. అసలు రహస్య మేమంటే నువ్వు సేవ చేస్తే నీ పనులు జరుగుతాయి. ఇక్కడ శక్తి వున్నా నువ్వు సేవ చేయకపోతే, నీ పనులు జరగనే జరగవు. కనుక యే సేవ చెయ్యాలో ఆ సేవ చెయ్యి. మిగిలిన విషయాలు పట్టించుకోకు." ఈ ప్రబోధ పూర్వకమైన ఆజ్ఞవల్ల సన్నిహిత భక్తు లంతా ఎవరికివారు నోరు మూసుకొని వుండిపోయారు.

ఆదివారాలలో ఆశ్రమానికి వచ్చే జనం మూడు వేల నుంచీ వెయ్యికి దిగిపోయింది. కాని, దూర తీరాల నుంచీ వొచ్చే కొత్త భక్తుల సంఖ్య కొంచెం కొంచెంగా పెరగసాగింది. చిత్రమేమంటే అలా దూర తీరాల నుంచీ వచ్చేవారు ఆశ్రమానికి వస్తూనే పరిసరాలన్నీ పరిశీలించి, ఇక్కడేం కార్యక్రమాలు జరుగుతున్నాయి? ఎలా జరుగుతున్నాయి? అని విచారించసాగారు. స్థానికులలో గూడా కొందరీ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు.

మైసూరు పత్రిక నారాయణరావుగారు రోజూ సాయంత్రం పూట తప్పకుండా ఆశ్రమానికి వచ్చి, వ్యవహార విషయాలలో స్వామీజీకి సహాయకులుగా వుండసాగారు. స్వామీజీకి వీరి సేవ ఎంతో విలువయినదిగా వుండేది. ఫలితంగా నారాయణరావుగారి కుటుంబం స్వామీజీకి ప్రీతిపాత్రమైన కుటుంబం అయింది. స్వామీజీ పూర్వాశ్రమ బంధువు రామస్వామయ్యగారు గూడా విశేష సేవ చేస్తున్నాడు. శిరస్తాదార్ కృష్ణమూర్తిగారు ఆశ్రమం పని మీద ఏ ఆఫీసుకు పోయినా, అక్కడ కొత్త కొత్త భక్తులు తయారయి ఆశ్రమపు పనులు స్వంత పనులుగా భావించి చేయసాగారు. ఆ రోజుల్లో కృష్ణమూర్తిగారికి కలిగిన ఒక అనుభవం భక్తులు గమనించ దగ్గది.

16-4-2000

ఆశ్రమంలో జనసమ్మర్దం తక్కువగావున్న రోజులలో





శ్రీ స్వామీజీకి పరివారమైన కొందరు అదృష్టజీవులు



తమ పీఠపూజలో ఒక ప్రధాన భాగమైన హరిద్రా శ్రీచక్ర సుమేరు యంత్రాన్ని స్వయంగా నిర్మిస్తున్న శ్రీ స్వామీజీ



శ్రీ దేవీ నవరాత్రులలో అపూర్వమైన నవావరణ ప్రదక్షిణపూజలు అనుష్ఠిస్తున్న శ్రీ స్వామీజీ

ఆశ్రమ స్థలం నివేశన స్థలంగా మార్చటంలో అయిదు వేల రూపాయలు కట్టవలసి వచ్చింది. అప్పటికి ఆశ్రమంలో పొయ్యిలో పిల్లి యే రోజు లేస్తుందో, ఏ రోజు లేవదో తెలీకుండా వున్న రోజులవి. అయిదు వేలనే సరికి కృష్ణమూర్తిగారికి పై ప్రాణం పైనే పోయింది. దానికితోడు ," నువ్వే దీనికేదయినా ఉపాయం ఆలోచించ " మన్నారు స్వామీజీ. ఈయన చెప్పిన ఉపాయా లన్నింటిలోనూ ఏదో దోషం చూపారు స్వామీజీ. అలా చూపి చూపి, " అలాకాదు. నువ్వెంత యిస్తావో చెప్పు " అన్నారు చివరకు.

ఏ నెలకానెల సంసారం ఎలాగోలా లాక్కు వస్తున్న కృష్ణమూర్తిగారు ఒకసారి చుక్కలు లెక్క పెట్టాడు. అయినా " ఇది స్వామీజీ కార్యక్రమం, ఏమయితే అదవుతుంది " అని "నూట ఎనిమిది. అయినా ఇది వాగ్దానమే, *ప్రస్తుతం ఇవ్వలేను" అన్నాడు. అలాగే అక్కడున్న ప్రధాన భక్తులతో ఆ అయిదు వేలు పూర్తి చేయించారు స్వామీజీ. అందరూ ఇలాంటి వారే.

కృష్ణమూర్తిగారు ఆ మర్నాడు ఆఫీసుకి వెళ్ళేసరికి జీతాలు ఇచ్చే గుమాస్తా పిల్చి పిల్చి క్రితం నెలలో మీరు టి. ఎ. బిల్లు తక్కువ వేసుకున్నారు. మూడు వందలు బకాయిలు వస్తాయి మీకు" అన్నాడు. ఆశ్చర్యపోయా రాయన. ఆ సాయంత్రం ఆశ్రమానికి వెళ్ళి తోటిభక్తులను విచారిస్తే ప్రతివారూ " అనుకోకుండా డబ్బు చేతి కందింది" అని ఇలాగే తలో కథ చెప్పారు. అప్పటికి తెలిసింది, " మనకు రాబోయేది ఎంత వుందో, అందులో మనం ఇవ్వ గలిగింది ఎంత వుందో స్వామీజీకి తెలుసు. అందుకే ఆయన మనను వేయమన్నారు " అని.

పనులు ఇలా జరుగుతున్నాయి. ఆదివారాలలోను, గురువారాలలోనూ తప్ప మిగిలిన రోజులలో పగటి పూట ఆశ్రమంలో దాదాపు స్వామీజీ ఒక్కరే ఉంటూ వున్న రోజులవి. అందుచేత వారి సమాధులు సుదీర్ఘంగా సాగిపోతూ వుండేవి. ఇంతలో వినాయక చవితి వచ్చింది. ఆ ఉత్సవం ఊహించనంత బ్రహ్మాండంగా జరిగింది. వినాయక చవితితో, స్వామీజీ కాలజ్ఞానం ప్రకారమే వానలు గూడా బాగా అందుకున్నాయి. అప్పటికి హోమగుండం మీద కొంచెం మంచి పాక పడ్డది. ఆ వినాయక చవితి రోజున మళ్ళీ నిత్య హోమ దీక్ష ప్రారంభించారు స్వామీజీ. ఈ మాటు హోమాగ్నిలో స్వామీజీ స్వయంగా నిలబడి హోమం చెయ్య సాగారు. రోజూ పై వాళ్ళెవరూ వుండేవారు కాదు. మనిషికిపైన, ఇంకా నిలువెత్తు మంటలు వస్తూ వుండగా, అగ్ని గుండంలో నిలబడి ప్రతిరోజూ నిశ్చలంగా హోమం చేస్తూ వున్నారు స్వామీజీ. అయితే అంత బ్రహ్మాండంగా జ్వలించిపోతున్న అగ్ని గుండంలోకి దిగి పైకి వచ్చిన స్వామీజీ కాళ్ళకు కొద్దిగా బురద అంటి వుండటం భక్తులకు ఆశ్చర్యంగా వుండేది. అగ్ని గుండంలో గోడలంబడి నేల కొంచెం తడిగా వుండేది. ఇంత మంట మండుతుంటే ఈ తడి ఎలా వచ్చిందో స్వామీజీకే తెలియాలి.

---

* ఈ నూట ఎనిమిది రూపాయలు ఇప్పటికి 22 ఏళ్ళ క్రిందట రూపాయలని గమనించుకోవాలి.

ఇలా చేస్తుండగానే దేవీ నవరాత్రులు వచ్చాయి. ఈ సంవత్సరం దేవీ నవరాత్రి పూజలు స్వల్పంగా మొదలయినాయి. ఈ నవరాత్రి పూజలకు జనం కొంచెం అధికంగానే వచ్చారు. నవరాత్రి పూజలు జరుగుతున్నా, యీ నిత్య హోమ దీక్ష మాత్రం నిర్విఘ్నంగా సాగిపోతూనే వుంది. అయితే స్వామీజీ ఎప్పుడు హోమం చేస్తారో ఎవరికీ తెలీదు. ఉన్నట్టుండి హోమం మొదలెట్టేవారు. ఆ సమయానికి ఉన్న వాళ్ళు అదృష్టవంతులు. అంతే.

ఆ దీక్ష ప్రారంభం రోజున ఒక విచిత్రం జరిగింది. కెసరేలో వుండగా వచ్చిన " తల నొప్పమ్మ " అనబడే నంజమ్మను తీసుకొని ఆమె భర్తా మొదలైనవారు వచ్చారు.

" స్వామీజీ ! ఈవిడకి ఆశ్రమానికి వచ్చి వెళ్ళిన రోజు ఏ బాధా వుండదు. ఇక్కడికి రాని రోజున తలపగిలి పోతోందిట. ఆ బాధ మేం చూడలేకుండా వున్నాం. ఎన్ని వైద్యాలయినా పని చెయ్యటం లేదు. వైద్యాలకు ఇల్లు గుల్లయిపోతోంది. ఈ మధ్య తలనొప్పి తీవ్రమై మతి గూడా చలించింది. మీరే రక్షించాలి ఎలాగైనా సరే " అని ప్రార్థించారు వాళ్ళంతా.

" ఆశ్రమంలో వొదిలేసెయ్యండి " అన్నారు స్వామీజీ.

" మహాప్రసాదం " అని వదిలి వెళ్ళారు వాళ్ళు.

" ఇవాల్టి నుంచీ స్టోరు రూము దగ్గర కూర్చుని వస్తువులు జాగర్తగా చూసుకుంటూ వుండు " అన్నారు వెర్రిచూపులు చూస్తున్న నంజమ్మతో స్వామీజీ.

అప్పటినుంచీ అనితర సాధ్యమైన నేర్పుతో పిచ్చి నంజమ్మ ఆ పనిని నిర్వహిస్తోంది. ఎప్పుడైనా ఇంటికి పోతోంది. వెళ్ళిన రోజున తలకాయి పట్టుకొని తిరుగు టపాలో వెనక్కి వచ్చేస్తోంది.

అలా కెసరే నుంచి వచ్చేసినా, అక్కడి నుంచి వచ్చి వెంటపడి వున్న పరివారంలో ముఖ్యంగా చెప్పుకోవలసిన వారు ముగ్గురు. చంద్రశేఖరయ్య, నంజమ్మ, ద్వారకా.

ఆ హోమం జరుగుతున్న రోజుల్లో ఒకరోజున హోటలు గోపాలరావుగారు, సరోజమ్మ గారు, పిల్లలు అందరూ సకుటుంబంగా వచ్చి హోమంలో పాల్గొన్నారు. ఆరోజు శెలవు తీసుకొని వెళుతుండగా, "పిల్లల్ని ఇక్కడ వదిలి వెళ్ళండి, నాకు కాస్త కాలక్షేపంగా వుంటుంది" అన్నారు స్వామీజీ.

చివరి పిల్లలిద్దరూ మరీ చిన్నవాళ్ళని పెద్ద కూతురు కుసుమ నొక్కదాన్ని వదిలి వెళ్ళారా పుణ్య దంపతులు. అయితే అది వారి జీవితాలలో ఒక శుభప్రదమైన మలుపుకు ప్రారంభమని వాళ్ళకు ఆనాడు తెలీదు.

సహజంగానే చిన్న పిల్లలలో చిన్న పిల్లయి ఆడుకునే స్వామీజీ యీ పిల్లతో మరీ చిన్నపిల్ల అయి ఆడసాగారు. కుసుమ అప్పటికే అనేక స్తోత్రాలు, భగవద్గీత శ్లోకాలు పాడేది.

స్వామీజీ పాటలు కొంచెం కొంచెం పాడేది. అప్పటి నుంచీ మెల్లిగా ఆ పిల్లకు అప్పుడప్పుడు ఆశ్రమంలో వుండిపోవటం అలవాటయింది.

ఆ హోమ దీక్ష నలభై యెనిమిది రోజులు నిర్విఘ్నంగా సాగింది. అప్పుడాపారు స్వామీజీ.

ఈసరికి, ప్రసాదాలు అవీ చేసేందుకై ఒక చిన్న పాక యేర్పడ్డది.

ఈ రోజుల్లో బెంగుళూరు నుంచి వచ్చే భక్తుల సంఖ్య పెరిగింది. వారిలో లక్ష్మీకాంతంగారు ఒకరు.

లక్ష్మీకాంతంగారు ఆంధ్రుడు. బెంగుళూర్లో వ్యాపారం చేస్తున్నాడు. మంచి అభివృద్ధిలో వున్నారు. వ్యాపారరీత్యా వీరికి మద్రాసులోనూ, ఆంధ్రలోని అనేక ప్రాంతాలలోనూ అనేక మందితో లావాదేవీలుండేవి. బెంగుళూరు భక్తుల ద్వారా వారికి స్వామీజీ దర్శనం లభించింది. సహజంగా ఆధ్యాత్మిక దృష్టివున్న లక్ష్మీకాంతంగారు తరచుగా వచ్చి స్వామీజీ దర్శనం చేసుకు వెళ్ళసాగాడు. త్వరలోనే వారి కుటుంబమంతా స్వామీజీ భక్తులయ్యారు. ఆశ్రమంలో ఆయనకు "కాంతం" గారని పేరుబడ్డది.

ఇతర వూళ్ళ భక్తులు రావటం ఎక్కువైన దగ్గరనుంచీ స్వామీజీకి కొత్తగా ఉత్తర ప్రత్యుత్తరాల పని తగులుతోంది. ఈ బాధ్యతను రైల్వేలో పనిచేసే సూర్యనారాయణగారు స్వీకరించారు. వీరి భార్య జయమ్మగారికి స్వామీజీ భిక్షాసేవ దాదాపు నిత్యకృత్యమైపోయింది. రోజూ యీ తిప్పట పడలేక ఆ దంపతులు, వారి మకాం ఆశ్రమంలోని చిరు పాకలోకి మార్చేసుకున్నారు.

ఆశ్రమం చేరిన మొట్టమొదటి కాపరం ఆ పుణ్య దంపతులదే. వారి ప్రవేశంతో ఆశ్రమంలో మరో చిన్న పాక వెలసి, దానిపేరు "కార్యాలయం" (ఆఫీసు) అయింది. సూర్యనారాయణరావుగారు మొట్టమొదటి మేనేజరయ్యాడు.

* * *

## వృద్ధానుమతి

ఇలా జరుగుతుండగా ఒక రోజున అనంతరామభట్టుగారు, మంచి ఉత్సాహంగా వచ్చాడు. ఆయన ఉత్సాహం చూస్తూనే నవ్వారు స్వామీజీ.

ఈ అనంతరామభట్టుగారికి కంచికామకోటి పీఠాధిపతులయిన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారితో యేదో పూర్వాశ్రమపు దూరపు చుట్టరికం వుందని చెప్పుకున్నాంగదా! వీరి బంధువులే మరొకరు మణిశాస్త్రిగారనే ఆయన ఆరోజే భట్టుగారి యింటికివచ్చి "శ్రీవారు (అంటే, వారి పరిభాషలో కంచికామకోటి పీఠాధిపతులు) స్వామీజీవార్ని చూద్దామని

అనుకుంటున్నారు. నీకు వారితో పరిచయం వుందటగదా, నువ్వేమయినా యేర్పాటు చెయ్య గలవా?" అన్నారట. అప్పటికి ఎన్నోసార్లు ఆ ప్రయత్నంచేసి, సరిగ్గా కలసిరాలేదను కుంటున్న భట్టుగారు యెగిరి గంతేసి, "నీ కెందుకు, నేను మా స్వామీజీని తీసుకొస్తాగా" అని చెప్పేసి. మణిశాస్త్రిగార్ని పంపించేశాడు.

ఇదీ భట్టుగారి ఉత్సాహానికి కారణం. ప్రస్తుతం కామకోటివారు కాళహస్తి క్షేత్రంలో వున్నారట. అక్కడికి వెళ్ళివద్దాం రమ్మని పట్టుబట్టాడు భట్టుగారు. చిన్న అరుసుగారు, సూర్య నారాయణగారు, ఆనందరాజు శెట్టిగారు, అనంతరామ భట్టుగారు వెంటరాగా స్వామీజీ కాళహస్తి వెళ్ళారు. అక్కడ వీరికొక బస యేర్పాటు చేశారు. శిష్యసమేతంగా స్వామీజీ అక్కడ దిగారు.

రాత్రి రెండు గంటలకు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారు స్వామీజీని తీసుకు రమ్మని శిష్యులను పంపారు. తమ దండం ధరించి స్వామీజీ వెళ్ళారు. అక్కడ ఇద్దరికీ ఏకాంత సమావేశం ఏర్పాటు చేయబడివున్నది. ఇసుక నేలలో పెద్ద పందిరి క్రింద తడికెలతో యేర్పరచబడిన చిన్న గది అది. ఆ గది దగ్గరకు చేరుతుండగానే అర్సు మొదలైనవారు స్వామీజీ ముఖంలో ఒక అపూర్వమైన మార్పు గమనించారు. భూగృహంలో వుండగా స్వామీజీ ముఖం వాళ్ళు చూసి వుండలేదు. అలా చూసివుండి వుంటే, యిప్పటి యీ ముఖ వర్చస్సును అపూర్వమని వారు భావించి వుండేవారు కాదు. పరివారం వాకిట్లోనే ఆగిపోగా, స్వామీజీ లోపలకు ప్రవేశించారు.

ఆ గదిలో ఒక మూల మినుకు మినుకు మంటున్న చిన్న నూనె దీపం, అక్కడే వున్న మరో మహత్తర తేజఃపుంజం ముందు చిన్నబోతున్నది. ఆ తేజస్సే సుప్రసిద్ధులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీయతీంద్రులు. బక్కచిక్కి బొమికలు బయట పడుతున్న ఆ యతీంద్రుల పొట్టిమూర్తి గదిలో ఒక పక్క ఒక దర్భాసనం మీద ముడుచుకొని కూర్చుని వున్నది. కుడిచేతిలో దాల్చివున్న పొడుగాటి దండం, ఆ దర్భాసనంలో ఒక మూల పొందికగా నిలబడి వుంది. బంగారు రంగు లీనుతున్న ఆ శరీరం చుట్టూ ముతక కాషాయ వస్త్రం అడ్డ దిడ్డంగా చుట్టి వున్నది. వారి కుడి చేతి పక్కన ఒక చెక్క కమండలం వున్నది. తళుకులీనే నఖపులో మిసమిస లాడుతున్న ఎర్రగుడ్డల బాలమూర్తి లోపలికి ప్రవేశిస్తుండగా ఆ వృద్ధమూర్తి తన నేత్రదీప్తులు మరింత పెరుగగా గమనిస్తూ, తమకు ఎదురుగా సిద్ధపరచి వుంచిన కొబ్బరి పీచు ఆసనం చూపించారు. తొట్రుపాటెరుగని ఆ ప్రశాంతమూర్తి హస్త ముద్రలో ఆదర ఆనందాలు సరిజోడు నృత్యాలు చేసినాయి. సమస్త భావతరంగాలు ఆత్మానంద సాగరంలో లయిమైవున్న నిష్కంప స్థితిలో ఆ గదిలోకి ప్రవేశించిన స్వామీజీ ప్రవేశిస్తూనే సాష్టాంగవందనం చెయ్యసాగారు. కాని, అంతకన్నా వేగంగా తమ ఆసనం మీద నుంచి లేస్తూ నివారించారు చంద్రశేఖరేంద్రులు. ఆ వృద్ధతపోమయమూర్తిని

ఆసనం మీద నుంచి లేపటం యిష్టం లేని స్వామీజీ తమ వందన ప్రయత్నం ఆపి, వారు నిర్దేశించిన పవిత్రాసనం మీద ఆశీనులయ్యారు. స్వామీజీ తమ దండాన్ని ఒళ్ళో అడ్డంగా పడుకో పెట్టుకున్నారు.

అనుభవ, వయస్తపోవృద్ధులైన చంద్రశేఖరులే సంభాషణ ప్రారంభించారు.

చంద్ర : మీ తాత తపలేభట్టు అని ఒకరు వుండేవారు. వార్ని నే నెరుగుదును.

స్వామీజీ : చిత్తం.

చంద్ర : నేనూ హోయిసల కర్ణాటకుణ్ణే—నువ్వు హోయిసల కర్ణాటకుడివే.

స్వామీజీ : ( చిరునవ్వు )

చంద్ర : చాలా సంతోషమైంది. నువ్వు ధర్మ ప్రచార కార్యక్రమం చేపట్టావని విన్నాను.

స్వామీజీ : ( చిరునవ్వు )

చంద్ర : ధర్మ ప్రచారం కోసం మహత్తులను స్వల్పస్వల్పంగా మందుకు పంచదార పూతలాగా, జాగర్తగా వాడుతున్నావని విన్నాను.

స్వామీజీ : ( చిరునవ్వు )

చంద్ర : ఈ రోజుల్లో అది అవసరంగానే వుంది. మంచి పని చేస్తున్నావు. సరేగాని, మరి నాకు కావలసింది నా కిస్తావా?

స్వామీజీ : ఎందుకు కాకూడదు? ఏం కావాలో చెప్పండి.

చంద్ర : పిడికిలి కన్నా పెద్ద శివలింగం కావాలి.

స్వామీజీ : అదిగో మీ పక్కనే వుందిగా చూడండి.

చంద్రశేఖరేంద్రుల ప్రక్కన ఇసుకలో శివలింగం వుంది. వారు సంతోషంగా దాన్ని తీసుకొని శిరస్సున దాల్చి ఒక క్షణం కళ్ళు మూసుకొని ధ్యానించి తరువాత పక్కన పెట్టేశారు. ఆ తరువాత వెంటనే ఒక నృసింహ ధ్యాన శ్లోకం చదివారు.

చంద్ర : ఈ ధ్యానమూర్తి ఒక రుద్రాక్షమీద చెక్కించుకొని వుంటే బాగుండును అనిపిస్తోంది.

స్వామీజీ, "ఇది సరిపోతే తమ దగ్గర వుంచుకోండి" అంటూ వారి చేతికొక రుద్రాక్ష యిచ్చారు. దానిమీద ఆ ధ్యానమూర్తి చక్కగా చెక్కబడి వున్నది. దానిని వారు కళ్ళ కద్దుకొని కొంగున ముడి వేసుకొన్నారు.

చంద్రశేఖరేంద్రుల కోసం తెల్లవారు జాములలో ఆర్తులు పడికాపులు కాయటం మామూలే. ఈసరికి సుమారు మూడు దాటటం వల్ల, కొందరు ఆర్తులు ఆ గది వాకిటచేరి, లోపల స్వామి వారు మేలుకొనే వున్నారని తెలిసి, తమకు గూడా వారితో మాట్లాడే సావకాశం వస్తుందేమో అని ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు.

ఆ అలజడిని గదిలో ఇద్దరు స్వాములు గమనించారు. చంద్రశేఖరేంద్రులు, "రోగాలు గూడా నయం చేస్తావన్నారే" అన్నారు, ఒక విచిత్రమైన యాసతో కొంచెం సిగ్గుపడి, వినయంగా వూర్కుండిపోయారు స్వామీజీ. చంద్రశేఖరేంద్రులు, శిష్యులతో చెప్పి బయటవున్న వారిలో కొందర్ని లోపలికి రప్పించారు.

చంద్ర : ఈ పిల్లకు గంట గంటకు ఫిట్సు వస్తున్నాయట.

స్వామీజీ : ఎవరు చెప్పారండీ. రావే!

చంద్ర : నువ్వు సాయంత్రం దాకా ఇక్కడే వుంటావుగదూ!

స్వామీజీ : ఉంటాననుకోండి, అయినా, ఇంకో గంటా రెండు గంటల్లో * తెలిసిపోతుందిగా.

చంద్ర : నిజమే! ఇదిగో యీవిడకు అరవై యేళ్ళు. వీరిది సూర్యారావుపేట. ఈవిడకు గత 45 ఏళ్ళుగా ఫిట్సుట.

స్వామీజీ : అది రాంగు డయాగ్నోసిస్ అండీ. మంచి డాక్టరుకు చూపిస్తే తగ్గిపోతుంది.

చంద్ర : అమ్మా! పోయి వెంటనే ఈ వూళ్ళోనే మరో డాక్టరుకి చూపించు. ✓ మధ్యాహ్నం నాకు కనిపించు.

ఇక మిగిలిన బయటివారిని చంద్రశేఖరేంద్రులే మాట్లాడించి బయటకు పంపించి వేశారు. ఆ తరువాత మళ్ళీ వీరితో సంభాషణ కొనసాగించారు.

చంద్ర : చాలా సంతోషమైంది. నీ విధానం నాకు నచ్చింది. శక్తిని చాలా జాగర్తగా ఉపయోగిస్తున్నావు.

స్వామీజీ : ఈ పద్ధతిని యింకా మార్చాలని తొందరపడుతున్నాను.

చంద్ర : తొందరవద్దు. అనంతరామభట్టు నిన్ను గురించి చాలా చెపుతూ వుంటాడు. ఎప్పుడైనా అవసరమైతే రోగుల్ని నీ దగ్గరకు పంపిస్తూ వుంటాను.

స్వామీజీ : ఎంతమాట!

చంద్ర : ఇవాళ్ళే నిన్ను చూశాను. చాలా సంతోషంగా వుంది. చూసిన కొద్దీ సంతోషంగా వుంది.

---

* ఆ పిల్లకు ఆ క్షణం నుంచీ ఫిట్సు రాలేదు. ఆ తరువాత కొన్నాళ్ళు ఆమె మైసూరాశ్రమానికి వచ్చింది. ఆ తరువాత ఆమె వివాహమయినాక రావటం లేదు.

✓ ఈవిడ ఆ మధ్యాహ్నానికే వచ్చి, కొత్త డాక్టరు పరీక్షలు చేసి వేరే విధంగా రోగ నిర్ణయం చేశాడనీ, మందులు మార్చాడనీ చెప్పి వెళ్ళిపోయింది. ఆ తరువాత నెలరోజులకు మైసూరాశ్రమానికి వచ్చి, తనకు ఫిట్సు పూర్తిగా తగ్గిపోయాయనీ, కామకోటివారి ఆజ్ఞ వల్ల ఆ మాట చెప్పటానికి వచ్చాననీ చెప్పింది.

ఇంతలో వాకిట్లో కూర్చున్న భక్తులలో ఒకాయన అత్యంత మనోహరంగా గానం చెయ్య సాగాడు. నాద ప్రాణులయిన స్వామిజీ చాలా ఆనందపడి, చంద్రశేఖరేంద్రులతో ఆ రాగం గురించి రెండు ప్రశంసా వాక్యాలు పలికారు. అప్పటిదాకా కళ్ళు మూసుకొని వున్న చంద్ర శేఖరేంద్రులు మళ్ళీ మాట్లాడసాగారు.

చంద్ర : పరశురామాంశతో వున్నావు.

స్వామిజీ : ఇంకా కేరళలోనే వున్నారా మీరు.

చంద్ర : నీ దండం మంచి బరువుగా వుంది. బలంగా వుంది.

స్వామీజీ : కల్పన ప్రబలమైనది కదా!

చంద్ర : వయసు చెల్లి మా దండం బాగా చిక్కిపోయింది. నీ దండం దృఢంగా వుంది. ఇప్పుడిదే కావాలి. నువ్వు కేరళనుంచి ధర్మప్రచారం ప్రారంభించు.

స్వామిజీ : ఇదివరకే ప్రారంభించాను గదా.

చంద్ర : ఇదివరకు జరిగినది ప్రారంభంకాదు. ఇక ముందు జరగబోయేదే ప్రారంభం.

స్వామిజీ : దక్షిణం నుంచీ ప్రారంభమా!

చంద్ర : (నవ్వుతూ) శివుడికి దక్షిణమూ, ఉత్తరమూ వుంటాయా? నీవల్ల యీ ప్రపంచానికి ఏది అందాలో, అది ఎందుకు అందరాదు? పరశురామ క్షేత్రంలో సంతాన గోపాలస్వామి ఆలయం నుంచీ నీ ధర్మప్రచార కార్యక్రమం ప్రారంభించు. దిగ్విజయంగా జరుగుతుంది.

స్వామీజీ : సరే మీ యిష్టప్రకారమే చేస్తాను.

ఆ తరువాత ఇద్దరూ పద్మాసనాలు వేసుకొని కళ్ళు మూసుకున్నారు. ఆ కూర్చోవటం కూర్చోవటం తెలతెలవారే దాకా అలాగే శిలాప్రతిమల్లా కూర్చున్నారు. ఆరోజు చంద్రశేఖ రేంద్రుల కోసం కాచుకున్న భక్తులకు యీ దివ్య యోగీంద్రు లిద్దరి సమాధి స్థితిని దర్శించే మహాభాగ్యం పట్టింది.

తెలతెలవారుతుండగా ఇద్దరూ ఏకకాలంలో కళ్ళు తెరిచారు. సెలవు తీసుకుంటా మన్నారు స్వామీజీ. చంద్రశేఖరేంద్రులు లేచివచ్చి తమ పక్కన సిద్ధంగా వుంచుకున్న కాషాయ వస్త్రం స్వామీజీ మీద కప్పుతూ, "ఈ పూటకు ఇక్కడ మా ఆతిథ్యం స్వీకరించి, రేపు ఉదయం బయలుదేరితే సంతోషంగా వుంటుంది" అన్నారు.

"అలాగే" అని సెలవు తీసుకొని బయటకు వచ్చేశారు స్వామీజీ.

ఆ కాళహస్తి యాత్రవల్ల స్వామీజీ పరివారాని కొక కనువిప్పు కలిగింది.

ఇంతవరకు పూజలు, హోమాలు జరుగుతున్నప్పుడు శిష్యులు గురువులకు ఎలా అందించాలో రేఖామాత్రంగానైనా తెలియని యీ శిష్యులవల్ల స్వామీజీ ఎంత ఇబ్బంది

పఠుతున్నారో ఇప్పుడు వాళ్ళకు తెలిసింది. కామకోటి పీఠంలో యంత్రాలలాగా అందించు కొంటూ చంద్రశేఖరేంద్రుల పీఠపూజకు సహకరిస్తున్న ఆ శిష్యులను చూసి వీరు బుద్ధి తెచ్చుకున్నారు.

"ఆ స్వాములవారు కనీసం కనుసంజ్ఞ కూడా చెయ్యవలసిన అవసరం లేకుండా శిష్యులు అన్ని పనులూ చక్కగా చేస్తున్నారు. ఇకనించీ మనమూ అలాగే చెయ్యాలి" అని ఎవరికివారే మనస్సుల్లోనే ప్రతిజ్ఞ చేసుకున్నారు. ఆ తరువాత కాళహస్తి నుంచి తిరుమలకి వెళుతూ దారిలో, యీ సమావేశం గురించి స్వామీజీ యిలా చెప్పారు :

"నోరు తెరిచి మాట్లాడిన దానికంటే యెక్కువ నోరు మూసినాక మాట్లాడుకున్నాం. సూర్యోదయందాకా మాట్లాడుకుంటూనే వున్నాం. అయితే, యేం మాట్లాడుకున్నారో ఆయనా చెప్పడు, ఈయనా చెప్పడు. అది వారిద్దరికే తెలియాలి. మీ స్వామీజీకి యీ అవతారంలో ఆయనను (చంద్రశేఖరేంద్రులను) చూస్తే చాలా గౌరవం."



# 22 వ అధ్యాయము — శివయోగం

సురుచిర శివయోగ ప్రాప్త నైష్కర్మ్య సిద్ధే
హుతవహ పరిపూజోపాత్త శంభు ప్రసాద ।
గురువర బహుహోమ ప్రక్రియోద్బుద్ధ ధూమ
ప్రసరణ పరిపుష్యద్విశ్వశాంతే నమస్తే ॥

( సుందరమైన శివ యోగం (మంగళ ప్రదమైన యోగవిద్య, శివునితో సమాగమము) వల్ల మీకు కర్మ రాహిత్య స్థితి సిద్ధించింది. అగ్నిదేవుని ఉపాసనవల్ల మీకు శంభు ప్రసాదం (శివలింగ ప్రసాదము, మంగళముల నిచ్చు ప్రసాదము) లభించింది. హోమ ధూమాలు ప్రసరించి విశ్వశాంతికి పుష్టి కలుగుతోంది. అట్టి శ్రీగురుదేవా! మీకు నమస్కారము )

## సచ్చిదానంద

కొచ్చిన్ హార్బరులో ఆడిట్ సూపరింటెండెంటుగా పని చేస్తున్న బి. ఎస్. ఎన్. రావుగారు మంచి సమయంలో వచ్చాడు. లేకపోతే స్వామీజీ కొచ్చిన్ రావటానికి అంత తొందరగా అంగీకరిస్తారని యెవరూ అనుకోలేదు.

కార్యక్రమం నిర్ణయమైంది. కార్లలో కొచ్చిన్ బయలుదేరారు. కార్లు ఒక అడవి లోంచి వెళుతున్నై. ఎదురుగా రోడ్డుకు అడ్డంగా ఒక అడవి ఏనుగు వచ్చి నుంచుంది. కార్లల్లో అందరికీ చెమటలు పట్టినై. స్వామీజీ ఆజ్ఞ మేరకు కార్లు రోడ్డు పక్కకి తీసి ఆపారు. స్వామీజీ కారు దిగి ఏనుగుకు ఎదురు నడిచారు. ఏనుగు తన తొండంతో ఓంకారముద్ర చూపి మూడుసార్లు ఘీంకరించింది. స్వామీజీ ఆశీర్ముద్ర చూపారు. ఏనుగు మెల్లగా వెళ్ళిపోయింది. కార్లు మళ్ళీ సాగాయి.

కొచ్చిన్‌లో బ్రాహ్మణ సమూహం వారి భవనంలో మకాం చేశారు స్వామీజీ. అరుంధతీ గ్లాస్ ఎంపోరియం తాలూకు కృష్ణన్ నాయర్, కుంజుంపిళ్ళె, పి. సి. వేలాయుధన్ ప్రముఖులు అప్పట్లో స్వామీజీని సేవించుకున్నారు.

మోకాళ్ళను దాటీదాటని కాషాయ వస్త్రంతో, ఎప్పుడూ వదలని దండంతో, నుదుట భస్మ రేఖల మధ్య మూడవ కన్నులాగ ప్రకాశిస్తున్న కుంకుమ బొట్టుతో, రౌద్ర స్ఫూర్తితో ప్రకాశిస్తున్న నేత్ర కాంతి జ్వాలలతో, అతి పరిమితమైన వాగ్ధోరణితో, సద్యః ప్రత్యక్ష ఫలాలను

వర్షిస్తున్న అనుగ్రహ విధానంతో స్వామీజీ ఆ కేరళీయ భక్తులకు హోమాగ్ని జ్వాలలాగా అంటులేకపోయినా, విడిచిపెట్టరాని వారయ్యారు.

ఆ పర్యటనలో సంతాన వేణుగోపాలస్వామి ఆలయంలో వర్షపాతంగా జరిగిన మహత్తులకు వేలాది జనం సమ్మోహితు లయ్యారు. అక్కడ స్వామీజీ చేసిన పదిహేను నిమిషాల చిన్న ప్రసంగం దాదాపు పది నిమిషాల కరతాళ ధ్వనులను ఆకర్షించింది.

ఆ కరతాళ ధ్వనుల మధ్యలో "శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీకి జై" అని ఆకాశం దద్దరిల్లేలాగా జయజయ ధ్వానాలు చేయసాగారు భక్తులు. ఈ సందర్భంలోనే 'శ్రీమద్గోకుల నందన' అనే కీర్తన ఉద్భవించింది.

ఎర్నాకులంకి ఆరు మైళ్ళ దూరంలో వున్న ఆ సంతాన గోపాలస్వామి గుడి చాలా సువిశాలమైనది. ఆ గుడికి సమీపంలో క్రిష్టియనులతో ఆ గుడివారికి కొంత మనస్పర్థ లేర్పడి, ఆ ప్రాంతంలో మత కల్లోలాలు తలయెత్త బోతున్నాయని పెద్దలైనవారు భయపడు తున్నారు. అప్పుడు స్వామీజీ క్రిష్టియన్ పెద్దలను పిలిపించి, ఒక రెండు మూడు నిమిషాలు మాట్లాడారు. అంతే, ఏం జరిగిందో తెలీదు. ఒక పావుగంట బయటకు వెళ్ళి సంప్రదించుకు వచ్చి రాజీ అయిపోయామని చెప్పారు వారంతా.

ఆ తరువాత నలుగయిదు చోట్ల బహిరంగ ప్రవచనాలు చేశారు స్వామీజీ. ఈమాటు పర్యటనలో ప్రతిచోటా కార్యక్రమ పత్రికలు అచ్చు వేసేవారు. "శ్రీగణపతి సత్యానంద స్వామీజీ" అనే అచ్చు వేస్తున్నారు. ప్రజలు జయకారాలు చేసేటప్పుడు మాత్రం "శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీకి జై" అంటున్నారు. ఇది చూసి ఇకనుంచి తమ పేరు అలాగే మార్చివేయమని అలాగే శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమం అనే బోర్డు మైసూరు ఆశ్రమం దగ్గర వేయించమని ప్రక్కన వున్న మేనేజర్ సూర్యనారాయణ గారికి ఆజ్ఞాపించారు స్వామీజీ.

అలా సంతాన వేణుగోపాల స్వామివారి తగాదా తీర్చిన ఆ ధర్మ ప్రచార ప్రారంభ మహోత్సవం శ్రీ స్వామీజీకి ఒక కొత్త పేరును తెచ్చింది. ఆ పేరు శాశ్వతమైన పేరుగా నిలిచి పోవటం ఒక దైవలీల. ఆ పేరు క్రమంగా అఖండమైన పేరు ప్రతిష్ఠలకు ఆలవాలం కావటం మరో దైవలీల.

ఆ పర్యటనలో స్వామీజీ కాలడి దర్శనం మళ్ళీ చేశారు. * తరువాత ఈ మాటు గురువాయూరప్ప దర్శనం సంపూర్ణంగా చేశారు. అలా పర్యటన మంగళప్రదంగా పూర్తి చేసు కొని తిరిగివస్తూ—

---

* ఈ పర్యటన గురించి యింతకన్న ఎక్కువ వివరాలు సేకరించలేక పోవటం దురదృష్టంగా భావిస్తున్నాను—రచయిత

"తల్లి తండ్రీ పెట్టిన పేరు పూర్వాశ్రమంతోనే పోయింది. కొత్త ఆశ్రమంలో పాపం, ఆ కుర్రవాడెవడో వచ్చి పెట్టిన పేరు బలం పుంజుకోనేలేదు. గాలికి కొట్టుకు పోయింది. తనంతట తనే గణపతి ముందు పీట వేసుకు కూర్చున్నాడు పేరులో. ఆయనను కదిలించటం ఎవరివల్లా కాలేదు. ఇపుడు యీ కొత్త పేరు వచ్చింది. పేరేదయితే యేమిగానీ, దైవదత్త మైన యీ సత్యానంద నామధేయానికి యేదైనా మంచి ఉపయోగం దొరికితే బాగుండును" అనుకున్నారు స్వామీజీ.

ఈ తిరుగు ప్రయాణంలో, కొంత రోడ్డులో ఒకచోట చాలా పెద్ద నాగుపాము ఒకటి పడగ విప్పి రోడ్డుకు అడ్డంగా నిలబడి వుంది. కార్లను దూరంగానే ఆపించారు స్వామిజీ. తను కిందకి దిగి "నువ్వెవరివో తెలిసింది. నువ్వు వెళ్ళవచ్చు" అన్నారు. ఒక సాష్టాంగ నమస్కార ముద్ర ప్రదర్శించి వెళ్ళిపోయింది నాగుపాము. కారులోకి వచ్చిన స్వామిజీ, "వెళ్ళేటప్పుడు గణపతి ఆశీర్వదించాడు. ఈయనేమో యోగప్రచారం అధికంగా చెయ్యి మంటున్నాడు. అలాగే చేద్దాం" అన్నారు.

కారులో వున్న మేనేజర్ సూర్యనారాయణరావుగారు, "ఈ పాముగారెవరు స్వామీజీ?" అన్నాడు.

"ఆయన మా అన్న" అని కళ్ళు మూసేసుకున్నారు స్వామిజీ. ఆశ్రమానికి చేరిన దగ్గర నుంచీ మళ్ళీ మామూలు కార్యక్రమాల సందడిలో పడ్డారు స్వామీజీ. హోమగుండం దగ్గర వున్న పాకకు గోడలు లేకపోవటం వల్ల, వానజల్లు వచ్చినప్పుడల్లా ఇబ్బంది అవుతోంది. అందువల్ల, వాలంటీరు పిల్లల్ని పెట్టుకొని, వారితోపాటు తనుగూడా కలిసి అడుసు తొక్కి, ఇటుక ముక్కలు పోగేసి, ఒక పక్క గోడ కట్టారు స్వామీజీ.

పిల్లలతో కలసి పిల్లవాడై గంతు లెయ్యటం స్వామీజీకి ఉన్న ఏకైక సరదా. ఆశ్రమం స్థాపించిన దగ్గరనుంచీ యిక్కడికి వచ్చి స్వామిజీ వెంబడిపడి తిరిగే కుర్రవాళ్ళ సంఖ్య పెరిగింది. అందరూ 15, 20 ప్రాంతపు పొగరు వయసులో తలబిరుసుమీద వున్నవాళ్ళే. కాని, వాళ్ళంతా స్వామీజీ చేతిలో చిగురాకులు, మైనపు ముద్దలూ అయిపోతూ వుండేవారు. వీరందర్నీ సూర్యోదయ సమయానికల్లా రప్పించి, వాళ్ళకు సూర్యనమస్కారాలు నేర్ప సాగారు స్వామీజీ. వాళ్ళతో హాస్యాలు చేసి పగలబడి నవ్వేవారు. వాళ్ళను వెంటబెట్టుకొని, తప్పెటలు, తాళాలు వాయిస్తూ, గంట రెండు గంటలసేపు ఆశ్రమం చుట్టూ ప్రదక్షిణాలు చేసేవారు.

"మన అరుపులకు తట్టుకోలేక ఇవాళ్ళ ఒక దయ్యం ఎగిరిపోయిందిరా" అని చెబుతూ వుండేవారు.

ఆశ్రమ ప్రాంతం పూర్వం ఒకప్పుడు రాజకుటుంబాలకు స్మశాన భూమిగా గూడా ఉపయోగ పడినందువల్ల అక్కడ అనేకరకాల పిశాచాలు వుంటూ వుండేవి. వాటిలో కొన్ని

గా త్రిపూట స్వామీజీకి తోడుగా పడుకునే పెద్దలకు ప్రత్యక్షంగా కనిపిస్తూనే వుండేవి. "మీరేమీ భయపడద్దు, వాటి సంగతి నేను చూసుకుంటూగా" అనేవారు స్వామీజీ. వీలుదొరికినప్పుడల్లా యీ డప్పుల గోల పెట్టేవారు. క్రమంగా పిశాచాలు కనిపించటం తగ్గిపోయింది. చివరికి తెల్లబట్టలు కట్టుకు తిరిగే ఆడ పిశాచం మాత్రం వొకటి ఆశ్రమం వొదలకుండా తిరగసాగింది. ఒకరోజున స్వామీజీ దాన్ని పిల్చి ఏదో మాట్లాడారు. ఆ మర్నాడు కొన్ని విచిత్రమైన ద్రవ్యాలు తెప్పించి హోమం చేశారు. ఆ తరువాత ఆ పిశాచం కనిపించలేదు.

పిశాచాల మాట ఏమోగాని, పిల్లలను వెంటబెట్టుకొని స్వామీజీ చేసే యీ గోల ఆశ్రమంలో కాపురం వున్న జయమ్మగారికి ఒక పక్క విసుగ్గానూ వుండేది. మరోపక్క ముద్దుగానూ వుండేది.

ఒక రోజున మైసూరు పత్రిక నారాయణరావుగారు తన పెద్ద కొడుకు వెంకట్రామ్‌ను వెంటబెట్టుకొని ఆశ్రమానికి వచ్చారు. వాళ్ళని చూస్తూనే—

"ఏం కావాలి?" అన్నారు మామిడి చెట్టు క్రింద కూర్చునివున్న స్వామీజీ గంభీరంగా.

" పై నెలలో మా పత్రిక రజతోత్సవం జరుపుకుంటోంది. ఆ ఉత్సవానికి తాము వచ్చి, తమ చేతుల మీదుగా జరిపించాలి " అన్నారు తండ్రీ కొడుకూ.

" ఏం వెంకట్రామ్ ! నేను రావాలా "? అన్నారు స్వామీజీ.

" తమరు వచ్చి మా పత్రిక ఆఫీసులో పాదంపెట్టి అనుగ్రహించండి " అన్నాడు వెంకట్రామ్‌గారు.

" నారాయణ వచ్చి పిలిస్తే రాకుండా వుంటానా ? కాని రెండు షరతులు " అని ఆగారు స్వామీజీ.

" చెప్పండి " అన్నాడు వెంకట్రామ్‌గారు ఆదుర్దాగా.

" నువ్వు ఇంకెవర్నీ పిలవరాదు, తెలిసిందా ? "

" అలాగే "

" ఏదో అల్లాటప్పా టాక్సీ తెస్తే నేను రాను. లక్జరీ టాక్సీ తీసుకురావాలి. "

" అలాగే "

తరువాత సెలవు తీసుకు వెళ్ళిపోయారు భక్తులిద్దరూ. ఇంటికి చేరుతూనే—

" అబ్బాయ్ ! చెప్పమన్నావు చెప్పాను. నా వంతు అయిపోయింది. ఇక తక్కిన వ్యవహారం ఎలా చేసుకుంటావో చేసుకో. నాకు సంబంధం లేదు" అన్నాడు నారాయణరావుగారు.

"అదికాదు నాన్నా, లక్జరీ టాక్సీ కావాలంటున్నారు స్వామీజీ. లక్జరీ టాక్సీ అంటే, కనీసం 40, 50 రూపాయలవుతుంది. మన దగ్గర పాతిక రూపాయలు గూడా లేవు. ఏంచెయ్యాలి ?" అన్నాడు వెంకట్రామ్‌గారు.

"అవన్నీ నాకు తెలియవు! పిలవమన్నావు పిలిచాను. వారు వస్తే సంతోషమే. రాకపోయినా నేనేం బాధపడను" అనేశాడు నారాయణరావుగారు. ఆయనలా విరక్తి చేసుకోవటానికీ, తండ్రీ కొడుకు లిద్దరూ కలిసివచ్చి స్వామీజీ నాహ్వానించటానికీ కారణం వుంది.

ఏమంటే, నారాయణరావుగారు తన షష్టి పూర్తి వయస్సులో మైసూరు పత్రిక స్థాపించాడు. తను ఒక్క చేతిమీదుగా ఈ పాతికేళ్ళూ లాక్కొచ్చాడు. ఈ మధ్యే దాని బాధ్యతంతా పెద్ద కొడుకు వెంకట్రామ్‌గారికి అప్పచెప్పేస్తున్నాడు. తనకు ఓపిక తగ్గినందు వల్ల, పత్రికకు గూడా ఓపిక తగ్గి రాబడి తగ్గిపోయివున్న రోజులవి. వెంకట్రామ్‌గారు నలభై లోపు వయస్సులో ఉత్సాహంలో వున్నాడు. ఈ రజతోత్సవాలకు మంత్రులను తెచ్చి పెద్ద ఉత్సవం చెయ్యాలని కలలు కంటున్నాడు. దాని విషయంలో తండ్రీకొడుకులు చర్చించుకొన్నారు.

"మంచిదే. మంత్రుల వల్ల లాభమేమిటి ?"

"పత్రికకు బాగా ప్రచారం వస్తుంది."

"మన పత్రికకు ప్రచారం తక్కువైందా, మనకు పెట్టుబడి తక్కువైంది గాని. మంత్రులొస్తారు, పత్రికను పొగుడుతారు. మనకో నాలుగయిదువేలు వదులుతై, మనకేం లాభం వస్తుంది ?"

"మీరు చెప్పిందీ నిజమే. ఇవాళ్ళ చేతులో పాతిక రూపాయలు లేవు, వే లెక్కడ తెద్దాం?"

"నన్నడిగితే ఒక పని చెయ్యటం మంచిది. మన స్వామీజీని ఒకసారి మన ఆఫీసుకు తీసుకురాగలిగితే మనం గట్టెక్కుతాం అని నా విశ్వాసం."

"చాలా బావుంది నాన్నగారు. మీరు ప్రయత్నం చేస్తే స్వామీజీ వస్తారు."

"పత్రిక నీ చేతిలో పెట్టేశాను. నువ్వే వెళ్ళి స్వామీజీని పిల్చుకో."

"అమ్మమ్మ, మీరు లేందే పని జరగదు."

"సరే అయితే, నువ్వు గూడా నాతో రా, యిద్దరం స్వామీజీని పిలుద్దాం"

ఇలా చర్చ జరిగాక ఆ తండ్రీ కొడుకులు వచ్చి స్వామీజీని ఆహ్వానించారు. అందుకనే వయస్సు మళ్ళిన నారాయణరావుగారు కాడిపారేసి పక్కకు తప్పుకుంటున్నాడు. సరే, ఇక

వెంకట్రామ్‌గారు తనే ఆలోచించుకొని తన దగ్గరున్న ఉంగరాలు రెండు అమ్మాడు. రెంటికీ కలిపి ముప్పై రూపాయలు వచ్చాయి. పాతిక రూపాయలకు లక్జరీ టాక్సీ మాట్లాడి ఆశ్రమానికి తీసుకెళ్ళాడు. స్వామీజీ ఉదయం పదిన్నర ప్రాంతంలో వీరి ఆఫీసుకు వచ్చారు. ఏదో పని చెప్పి టాక్సీని మరోసారి ఆశ్రమానికి తిప్పారు స్వామీజీ. టాక్సీ ఖర్చు రెట్టింపయింది. వెంకట్రామ్‌గారికి నిలువుగుడ్లు పడ్డాయి. చేయగలిగిం దేముంది? స్వామీజీని లోపలికి తీసుకెళ్ళి, యంత్రాలు, పత్రికలు అన్నీ చూపిస్తున్నాడు.

"వెంకట్రామ్! నువ్వు పత్రిక సైజు ఎందుకు పెంచరాదు?" అన్నారు స్వామీజీ ఉన్నట్టుండి.

నవ్వుకున్నాడు వెంకట్రామ్‌గారు. పత్రికా ప్రచురణంటే యేమిటో, దాని సైజేమిటో ఆ వ్యవహారాలు స్వామీజీ కేం తెలుస్తాయి? అయినా ఆ మాట మొహం మీద అనలేడు గదా! అందుకే___

"సైజు పెంచటం అంటే మాటలు కాదండీ. దానికి యంత్రం కొత్తది కావాలి. అక్షరాలు కొత్తవి కావాలి. పత్రికలో విషయం సమకూర్చే పద్ధతి మార్చాలి" అని మొదలు పెట్టి పత్రికా నిర్వహణ మీద చిన్న సైజు ఉపన్యాసం దంచాడు వెంకట్రామ్‌గారు. అలా దంచి "నా దగ్గర డబ్బు లేదని తెలిసి. నన్ను హాస్యం చేస్తున్నారా" అన్నాడు.

"కాదు. నువ్వు కొనాలి, కొంటావు. కావాల్సినవన్నీ కొంటావు. పై వార్షికోత్సవానికి నేను ఏ వూళ్లో వుంటానో తెలీదు. నే నిక్కడున్నా, లేకపోయినా అప్పటిలోగా నువ్వు కొత్త మిషన్లు తెచ్చి కొత్త సైజులో పత్రిక నడపాలి" అని అంటూనే స్వామీజీ లేచి నుంచున్నారు. అలా లేస్తూనే తన కుడి చెయ్యి విదిలించారు. ఆ చేతులోంచి ఒక పైసా కింద పడ్డది. అలా పద్నాలుగుసార్లు విదిలించారు స్వామీజీ. ఆ పద్నాలుగు పైసలూ పూజలో పెట్టుకోమని చెప్పి ప్రసాదం యిచ్చేసి వెళ్ళిపోయారు స్వామీజీ. ఆ తరువాత తల తాకట్టు పెట్టి టాక్సీ డబ్బు లిచ్చుకున్న వెంకట్రామ్‌గారికి యేమీ పాలుపోలేదు.

"స్వామీజీ ఆశీర్వదించారంటే ఒప్పుకోవచ్చు, విభూతి యిచ్చారంటే వొప్పుకోవచ్చు, పైసలు సృష్టించారంటే ఒప్పుకోవచ్చు, ఆ ఆశీస్సువల్ల క్రమంగా తన వ్యాపారం పెరుగుతుందంటే ఒప్పుకోవచ్చు. కాని యీయనకు వార్తాపత్రిక ముద్రణ అంటే యేమి తెలుసు? సైజు గురించి యేమి తెలుసు? దాని సాధక బాధకా లేమి తెలుసు? ఇరవై ఏళ్ళ నుంచీ దాంట్లో పడికొట్టుకుంటుంటేనే, తనకు దాని అంతుపట్టటం లేదు. దాన్ని గురించి స్వామీజీ సలహా చెప్పటా రేమిటి?" అని ఆయన నానా గుంజాటన పడి, చివరికి ఆ విషయం వదిలేసి తన పనులలో పడిపోయాడు.

ఒక రెండు వారాలు గడిచాయి. అనుకోకుండా ఒక యెడ్వర్టయిజ్‌మెంటు ఏజెన్సీ కంపెనీవారు వెంకట్రామ్‌గారికి యేజన్సీ యిస్తామని కబురు చేశారు. అంతకుముందు దాకా యేదో రాజకీయ రంగంలో తిరుగుతూ వార్తాపత్రిక నడుపుకోవటమేగాని, యీ రకం వ్యాపారం యీయన యెరుగడు. అందువల్ల ఆశీస్సు కోసం స్వామీజీ దగ్గరకు వచ్చారు. ఆశీస్సు కోసం వస్తే మళ్ళీ ఓ సలహా యిచ్చారు స్వామీజీ. "ఇరవై శాతం కమిషన్ యిస్తే వొప్పుకో, లేకపోతే వద్దు" అని.

ఇదెక్కడి ఖర్మ. కొత్తగా ఏజన్సీ యిస్తుంటే ఇరవై శాతం కమీషన్ ఎవడిస్తాడు? కాని స్వామీజీతో వాదించగల వాడెవడు? ఆ రోజుల్లో ఆయన్ను చూస్తేనే భయంగా వుండేది. ఎందుకో ఎవరికీ తెలీదు. నోరు మూసుకొని బెంగుళూరు వెళ్ళి ఆ కంపెనీవారితో మాట్లాడితే వాళ్ళు పదిశాతం కమీషన్ ఇస్తా మన్నారు. స్వామీజీ వద్దన్నారుగా. ఆ భయంతో ఆ బేరం వదిలేసి వచ్చేశాడు వెంకట్రామ్‌గారు. ఆ మర్నాడు ఆ కంపెనీవాడే కబురు చేశాడు. "సరే ఇరవై శాతం ఇస్తాం రండి" అని. నోరు తెరిచేశాడు వెంకట్రామ్‌గారు.

ఆ సంవత్సరం కర్ణాటక ప్రభుత్వంవారు చిన్న వార్తాపత్రికలకు ప్రత్యేక సహాయ కార్యక్రమాలు తలపెట్టారు. ఆ సహాయం మైసూరు పత్రికకు అందలేదు. అది ప్రతిపక్ష పత్రిక కావటమే అందుకు కారణం. దాని ఆశ వీరు వదిలేసుకున్నారు. ఇంతలో ఏం జరిగిందో ఏమో ముఖ్యమంత్రి నిజలింగప్పగారి దృష్టిలో యీ విషయం పడ్డది. ఆయన "అలా ఆ పత్రికమీద ప్రత్యేక విరోధం చూపటం తప్పు. నిజానికి ప్రతిపక్షాలవారే మనకు ఆప్తబంధువులు. వారి ద్వారా గదా మన తప్పులు మనకు తెలిసేది. మైసూరు పత్రికకు సహాయం చెయ్యవలసిందే" అని ఆర్డరు వేశాడు.

ఆ ఏజన్సీవల్లా, యీ ప్రభుత్వ సహాయంవల్లా వారికి ఆ సంవత్సరం యిరవైవేల పైగా మిగులు కలిగింది. కొత్త మిషను వచ్చింది. కొత్త టైపు వచ్చింది. పత్రిక కొత్త సైజులోకి వచ్చింది. ప్రాణం పోతుందనుకొన్న పత్రికకు, పై వార్షికోత్సవంలోగానే కొత్త ప్రాణమేగాక, కొత్త శరీరం గూడ వచ్చింది.

## ఆకాశగంగ

ఆ ప్రాంతాలలోనే ఒకరోజున సగం స్పృహలో వున్న స్వామీజీ చాముండీ కొండ ఎక్కసాగారు. అడ్డదిడ్డంగా రాళ్ళమీద పరిగెత్తుతున్న స్వామీజీని చూసి హనుమన్నాయక్ (వాచ్‌మెన్) వెంటబడ్డాడు. స్వామీజీ వెళుతున్న మార్గం అంతా పొదలతోనూ, దుబ్బుల తోనూ చికాకుగా వుంది. వాటిని దాటుకుంటూ ముందుకు పోగా, ఒకచోట ఒక పెద్దబండ మీదనుంచి సన్నగా నీటిధార కారుతోంది. ఆ ధారకింద స్నానం చేద్దామని ప్రయత్నించారు స్వామీజీ. నీరు మరీ రాతి వెంబడి కారుతున్నందువల్ల అది కుదరలేదు. అప్పుడు స్వామీజీయే

పైబండ మీదికి యెగిరి, అక్కడ ఒక ఆకు దొన్నెలాటిది పెట్టారు. దానివల్ల నీటిధార కాస్త యివతలకు పడ్డది. తను స్నానం చేసిన తరువాత, హనుమన్నాయక్‌ను పంపించి ఆశ్రమంలో భక్తులను గూడా పిల్చి స్నానం చేయించారు స్వామీజీ. అంతకు ముందెప్పుడూ అలాంటి నీటి ఊట అక్కడ లేదని ఆ ప్రాంతాల ప్రజలు చెప్పారు. ఆశ్చర్యకరమైన యీ చిన్ని నదీ సృష్టి మైసూరు పురవాసులను ఒక నెలరోజులపాటు సంతోషపెట్టి ఆ తరువాత అంతర్ధానమై పోయింది. ఈ నెల రోజులూ స్వామీజీ, ఆశ్రమవాసులు గూడా ఆ జలధార లోనే స్నానం చేశారు.

ఆ రోజుల్లో జరిగిన మరొక ప్రధాన ఘట్టం భూపతి శకుంతల గారికి సంబంధించినది.

బెంగుళూర్లో భూపతి రమణారావుగారని ఆంధ్రు లొకరు గనుల వ్యాపారం చేస్తూ వుంటున్నాడు. వారి భార్య శకుంతలగారికి 27 ఏళ్ళ వయస్సులో నెత్తురు కాన్సరు వచ్చింది. అది 1962 వ సంవత్సరం. అప్పటినుంచీ ఆవిడ మంచంలోంచి లేవటంలేదు. సంపదకు లోపం లేకపోవటంవల్ల, ఆమెకు చేయించిన ఘన వైద్యాలన్నీ, ఆవిడకుగాక, ఆవిడ రోగానికి బల వర్ధకాలుగా పరిణమించినాయి. ఇక చేయగలిగిందిలేక యేడుకొండల వెంకటరమణ స్వామిని తలచుకుంటూ, రోజులు లెక్కపెట్టుకుంటూ కాలం గడుపుతున్న దావిడ. ఇలా జరుగుతుండగా, 1966 చివరి ప్రాంతాలలో ఒక రోజున ఆవిడ కొక కలవచ్చింది. అది కల అని చెప్పేందుకు గూడా వీలులేదు. ఆవిడకు రాత్రిపూట సరిగా నిద్రపట్టేదికాదు. ఆ రోజు అలా మెలకువతో, మత్తుగా, బాధగా వుండగానే, ఆ గదిలోకి ఒక సాధువు ప్రవేశించారు. ఎర్ర గుడ్డలను బట్టి సాధువనుకోవటమే తప్ప, ఆ సాధువు బాగా చిన్న కుర్రవాడుగా వున్నారు. ఆయన గడప అవతల నుంచుని, "అమ్మా, అమ్మా" అని గట్టిగా పిల్చారు. ఈవిడ లేచి మంచం మీద కూర్చున్నది. పరిస్థితి ఏమిటో సమ్మోహనంగావుంది. ఆ సాధువు తను అక్కడే నుంచుని ఈవిడనే లేచివచ్చి, తన పాదాలకు నమస్కరించమని సంజ్ఞ చేశారు. స్వంతంగా లేచే పరిస్థితి అంతంత మాత్రంగా వున్న శకుంతలగారు, చకచకా వెళ్ళి ఆ సాధువు పాదాలకు నమస్కరించింది. అంతే, ఆ సాధువు అంతర్ధానమైపోయారు. ఈవిడకు బాగా మత్తు దిగేసరికి, తను గది వాకిట్లో నమస్కార భంగిమలో వున్నది. తనకు వచ్చింది కలా, భ్రాంతా, సత్యమా, ... ఏమీపాలుపోలేదు. చివరకు ఇది "వేంకటేశ్వరస్వామి లీల" అనుకొని అక్కడితో సరిపెట్టుకొని వూరుకున్నది.

తెల్లవారేసరికి వీరి తండ్రిగారి దగ్గర నుంచి ఫోను వచ్చింది. ఆ ఫోనులో "అమ్మాయ్, మైసూరులో ఒక స్వామీజీ వున్నారట, శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ అని. వారు అనేక దివ్య మహిమలు కలవారట. నువ్వొకసారి మీ ఆయనతో చెప్పి వారి దర్శనం చేస్తే మంచిదమ్మా' అని చెప్పాడు.

ఆ రోజే మైసూరు నుంచి మరో ఫోను వచ్చింది. రాయపూరులో యీమె దూరపు సోదరుడు మల్లెల రవీంద్రనాథ్‌గారు వ్యాపారరీత్యా మైసూరు వెళ్ళాడట. అక్కడ వ్యాపార మిత్రుల ద్వారా స్వామీజీ దర్శనమైందట. స్వామీజీని చూసేసరికి ఆయనకు తన చెల్లెలు శకుంతల గుర్తు వచ్చి ఫోను చేశాడు. రెండు ఫోనులూ ఒకే రోజు రావటం, సాధువు కలలో కనిపించటం ఇవన్నీ శకుంతలగారికే కాక, ఆమె భర్తకు గూడా కాస్త ఆశ పుట్టించినై. వీలయినంత త్వరలో మైసూరు ఆశ్రమానికి వచ్చారు. తనకు కలలో కనిపించిన సాధువే ఇక్కడ యెదురుగా కనిపించేసరికి శకుంతలగారు ధారాపాతంగా కన్నీరు కార్చి, వలవలా యేడ్చింది. చాలాసేపు యేడవనిచ్చి, మెల్లిగా ఓదార్చారు స్వామీజీ. చివరకు "రావలసిన చోటికి వచ్చావు గదా, తగ్గుతుంది. అయితే నువ్వు తరచు ఇక్కడికి వస్తూ వుండాలి" అన్నారు స్వామీజీ.

ఆవిడ ఒక వారం రోజు లక్కడే వున్నది. కొంత మెరుగుదల వచ్చింది. అప్పటినుంచీ ఆశ్రమంలో వుంటే కొంత మెరుగు, ఇంటి కెళితే తరుగూ. ఇలా కొన్నాళ్ళు నడిచింది. "తగ్గితే అంతే చాలు. పూర్తిగా తగ్గేదాకా అక్కడే వుండ" మని ప్రోత్సహించాడు భర్త. కానీ ఆశ్రమంలో మనుష్యులు వుండే వీలు చాలా తక్కువ. అందులోనూ ఆడవాళ్ళు వుండే వీలు మరీ తక్కువ.

వాన వచ్చిందంటే ఆశ్రమం పరిస్థితి మరీ ఘోరం. ఎక్కడ పడితే అక్కడ నీళ్ళు ధారలు కడతాయి. దాంతో నేలంతా రొచ్చు. ఇక ఆశ్రమ వాసులైనవాళ్ళు ఇటూ, అటూ సర్దుకుంటూ ఒదిగి కూర్చోవాలి. రాత్రిపూట వాన వస్తే స్వామీజీ తన గదిలోంచి బయటకు వచ్చేసి, నిద్దర లేచి ఇటూ అటూ జరుగుతున్న కుర్రాళ్ళతోపాటు వాన వెలిసేదాకా తనూ కాలక్షేపం చేస్తూ వుండేవారు. ఇలా ఒక సంవత్సరంన్నర గడిచింది. ఈ సంవత్సరంన్నరలో ఆశ్రమంలో కొద్దిగా మనుషులు నిలిచే వీలు యేర్పడ్డది.

ఈ సంవత్సరంన్నరలో శకుంతలగారు ఆశ్రమంలో ఒక పనిమనిషితో సమానంగా పని చేసింది. స్వామీజీ చేసే మహత్తులను చుక్కలకన్న యెక్కువగా చూసింది. ఒకపక్క చనువూ మరోపక్క భయమూ పెరిగాయి. ఆవిడ బెంగుళూరులో కన్న ఆశ్రమంలో వుండటం పెరిగింది. ఆవిడ నెత్తురు కాన్సరు కనిపించకుండా పోయింది. ఇలా ఆశ్రమంలో వుండి తన ఆరోగ్యం మెరుగుపడుతున్న కొద్దీ శకుంతలగారికీ, ఆవిడ భర్త భూపతి రమణరావుగారికీ ఆశ్రమ కార్యక్రమాలమీద, ఆశ్రమ అభివృద్ధి మీదా దృష్టి పడసాగింది.

శకుంతలగారు ఆశ్రమంలో సపర్య చేస్తున్న రోజుల్లోనే ఒక రోజున స్వామీజీ ధ్యానం లోనించి బయటకు వచ్చి "శివుడు పిలుస్తున్నాడు. ఎక్కడో చిక్కుబడిపోయాడట. తీసుకు

బంమ్మంటున్నాడు" అనసాగారు. అలా ఒక వారం రోజులు అప్పుడప్పుడు అంటూనే వున్నారు. సరీగా యీ రోజులలోనే ఒక రోజ పూర్వాశ్రమపు చెల్లెలు వరలక్ష్మి ఆశ్రమానికి వచ్చింది.

ఆమె వచ్చేసరికి రేకులగది యెదురుగా వున్న మామిడి చెట్టుకు వేసివున్న వుయ్యాల బల్ల మీద కూర్చుని వున్నారు స్వామీజీ. పసిపిల్లను చంకన వేసుకొని, కళ్ళ నిండా నీళ్ళతో వస్తూవున్న చెల్లెల్ని చూసి స్వామీజీ ఆదరంగా నవ్వారు. "నువ్వు నా బుజం మీది బేతాళుడివే. నేను హిమాలయాలకు పోయినా నన్ను వొదలవు నువ్వు" అన్నారు.

వరలక్ష్మిగారు ఆశ్రమమంతా కలయచూసింది. అదే ఆవిడ యీ నూతనాశ్రమానికి మొదటగా రావటం. పెద్ద హోమగుండం, దాని మీద కొంచెం విశాలమైన కొబ్బరాకుల పాక, ఆ పాకలో ఆవు పేడతో అలికి అందంగా ముగ్గులు పెట్టివున్న నేల, ఒక రేకుల గది, చుట్టూతా భయంకరమైన అడవి కనిపించినాయి. ఒక చుట్టు తిరిగి వచ్చి—

"సత్యనారాయణా! ఎట్లా వుంటున్నావయ్యా ఇక్కడ? భయం కాదా?" అంది గుండెల మీద చెయ్యి వేసుకొంటూ. స్వామీజీ ఆవిడ వంక విచిత్రంగా చూశారు. ఆవిడ కెందుకో భయం వేసింది.

"భయమేమిటి? చూడు, అన్ని చోట్లా నేనే వున్నాను. అన్నీ నేనే సృష్టి చేశాను. ఈ మాట నీకు అర్థం కాదు. కాకపోయినా సరే గుర్తు పెట్టుకో. రోజూ అనుకో" అన్నారు స్వామీజీ. ఈ మాట స్వామీజీ నోటంబడి వచ్చేసరికి వరలక్ష్మిగారికి వొళ్ళంతా ఏదో జలదరించినట్లయింది. లోపల ఏదో సన్నగా విద్యుత్తు ప్రసరించి నట్టనిపించింది. కొంచెం ఆనందం, మరికొంచెం భయం కలిసి కలగాపులగమైంది మనస్సు.

"సరేగాని, లోపలి కెళ్ళి వెంటనే నాకు అన్నం వొండి పెట్టు. ఇవాళ్ళ మంగళవారం. ఇంటి ఆడబడుచువి. నీ చేతి మీదుగా అన్నం తింటే శుభం" అన్నారు స్వామీజీ. స్వామీజీ మాట మార్చేసరికి ఆవిడ సంతోషంగా వంట చెయ్యటానికి లోపలికి నడిచింది. అక్కడ వున్న జయమ్మగారే యీవిడకు అన్నీ అందించి వంట చేయిస్తోంది.

ఇంతలో స్వామీజీ లోపలికి వచ్చి ఇంట్లో అందరి క్షేమసమాచారాలూ అడిగారు. లింగణ్ణతాతగారు హోణుసూరు దగ్గరవున్న రత్నపురిలో తనకు వున్న కొద్దిపాటి పొలంలో యీ మధ్య మళ్ళీ సొంత వ్యవసాయం ప్రారంభించారనీ, అందువల్ల ఆయన, సావిత్రమ్మగారు గారు అక్కడే వుంటున్నారనీ వరలక్ష్మిగారు చెప్పింది.

ఆ రోజు స్వామీజీ భిక్ష అయినాక వరలక్ష్మిగారిని గూడా అక్కడే భోజనం చెయ్య మన్నారు స్వామీజీ. ఆమె భోజనం చేసి వచ్చేలోపల ఎవర్నో కుర్రాణ్ణి వూళ్ళోకి పంపించి ఒక చీర తెప్పించి ఆమెకు పెట్టారు. అలా సత్కారం చేసి, వెళ్ళేముందర ఇలా అన్నారు.

" చూడమ్మా ! ఇకనుంచీ నన్ను అందరూ పిలుస్తున్నట్టే నువ్వు గూడా స్వామీజీ అనే పిలవాలి. నాకు ఆశ్రమంలో వున్న అందరు తల్లులతోపాటు నువ్వుగూడా ఒక తల్లివి. అంతమటుకే " అన్నారు స్వామీజీ.

బెత్తెడు మొహం చేసుకొని తల వూపి వెళ్ళిపోయింది వరలక్ష్మిగారు.

## సత్యానందేశ్వరుడు

ఆ మర్నాడు ఒకరిద్దరు భక్తుల్ని రత్నపురికి పంపారు స్వామీజీ. ఆ వూళ్ళో ఏదైనా ఆలయం శిథిల మవడం గానీ, శివలింగ పూజలు లేకుండా వుండటం గానీ, అలాంటి దేమయినా వుందేమో కనుక్కోరండి " అని. వాళ్ళు వెళ్ళి వచ్చి " అలాంటిదేమీ లేదండీ. పూర్వం ఏదో దేవాలయం వుండేదనీ, నేలలో పూడిపోయిందనీ ఒక వదంతి మాత్రం ముసలివాళ్ళలో వుందని తమ అమ్మమ్మగారు సావిత్రమ్మగారు చెపుతున్నారు " అని చెప్పారు.

" అయితే నే నిప్పుడే వెళ్ళి ఆ వూరు చూడాలి " అన్నారు స్వామీజీ.

" లేడికి లేచిందే ప్రయాణమని, ఇప్పుడే చూడాలంటే యెలా కుదురుతుందండీ బాబు. మనం వెంటనే టాక్సీ చేసుకు వెళ్ళినా, అక్కడకు వెళ్ళేసరికి చీకటిపడిపోతుంది. చీకట్లో మనం చెయ్యగలిగిందేమీలేదు. రేప్పొద్దున పోదాం " అన్నారు అనుభవశాలురైన భక్తులంతా !

" శివుడు ఊరుకోవటంలేదు, నేనేమి చేసేది ? " అన్నారు స్వామీజీ.

స్వామీజీ అంతగట్టిగా చెప్పేసరికి, సరే కానిమ్మన్నారు భక్తులు. వాళ్ళు వెళ్ళి టాక్సీ తెచ్చి, వీరక్కడికి చేరేసరికి చీకటి పడనేపడ్డది.

రత్నపురి చిన్న పల్లె. ఎర్రమట్టి లేపుకుంటూ కారు వూర్లోకి ప్రవేశించేటప్పటికి, పది మంది రైతులు చుట్టూచేరారు. " మైసూరు గణపతి స్వామీజీ వచ్చారు. ఇక్కడేదో శివలింగం వుందట, దాన్ని వెతకటానికి వచ్చా " రనే వార్త ఆ చిన్న వూళ్ళో గుప్పుమన్నది. పల్లెలలో వార్తలకు రెక్కలుంటాయి గదా, ఊరివారంతా పోగుబడ్డారు. లింగణ్ణగారు వచ్చి మనవడితో మాట్లాడారు. ఆయన వూరివారితో విషయం వివరంగా చెప్పేరు. 'చీకటిపడితే యేమి ?' అన్నారు ఊరివారు. సరీగా పొద్దుగుంకక ముందే చలిగాలులు తలలు విసురుతున్న చలి రోజులవి. ఆ చలిలో కాగడాల వెలుగులో పంటమీద వున్న పొలాల వెంబడి, ఎగిడి దిగిడి పొదల వెంబడి అడ్డదిడ్డంగా తిరగసాగారు స్వామీజీ. సుమారు ఒక అరగంట లోపుగానే, ఒక చోట ఆగిపోయి " ఇక్కడ ఉన్నాడు శివుడు. జాగర్తగా తవ్వాలి " అన్నారు తృప్తిగా.

ఆ చోటుకు గుర్తువేసి, ఊళ్ళోకి వచ్చారు స్వామీజీ. ఆ చోటు ఒక పొలంలోవుంది. ఆ పొలంలో ఏదో పంటవుంది. ఆ పొలం యజమాని పంట కోశాక తవ్వుదామన్నాడు. అలా

ఆగేందుకు లేదన్నారు స్వామిజీ. స్వామిజీ వెంట వున్న భక్తులు, ఆ పంటను ఖరీదుకు కొంటామన్నారు.

ఆ లింగం తీసుకు వెళ్ళటానికి తమ కెవ్వరికీ అభ్యంతరం లేదని ఊరి పెద్దలందరూ ముక్త కంఠంతో చెప్పారు. పైగా, అలా పూజలేకుండా శివలింగం భూమిలో పడి వుండటం ఆ వూరికి క్షేమంకాదు కనుక స్వామిజీ ఆ లింగం తీసికెళ్ళటం తమకు మహోపకారం అన్నారు. అలా ఏర్పాట్లన్నీ పూర్తిచేసి, రేపు తెల్లవారగానే త్రవ్వకం మొదల పెట్టమని చెప్పి, రాత్రి పొద్దుపోయాక స్వామిజీ వచ్చేశారు.

ఆ మర్నాడు తవ్వగా నిజంగానే ఒక శివలింగం బయట పడ్డది. కానీ చిత్రం! ఆ భూమి అడుగున, ఆ శివలింగాన్ని ఒక పెద్ద నాగుపాము చుట్టుకొని వున్నది. ఎంత ప్రయత్నించినా ఆ పాము లింగాన్ని వదిలిపోలేదు. ఏమిచెయ్యటానికీ చేతగాక స్వామిజీకి కబురు చేశారు. స్వామిజీ ఆ స్థలానికి వెళ్ళారు. వెళ్ళి ఆ పామును చూస్తూ కొద్ది నిమిషాలు నించున్నారు. ఆ పాము దానంతటదే కిందకు దిగి, లింగ పీఠానికి తలకాయ బాదుకొని శరీరం వొదిలి వేసింది. ఆ మహా నాగానికి అగ్ని సంస్కారం యేర్పాటు చేయించారు స్వామిజీ.

స్వామిజీ వెనక్కి వచ్చేశారు. సర్ప సంస్కారం అయినాక మళ్ళీ తవ్వకం కొనసాగింది. తవ్వకం అయింది గాని, ఎంతమంది ప్రయత్నించినా ఆ శివలింగం పైకి లేవలేదు. అది వూళ్ళో వింత వార్త అయింది. వందలకొద్దీ జనం వచ్చి మోకులు వేసి లాగాలని ప్రయత్నం చేసి, విఫలు లయ్యారు. మళ్ళీ స్వామిజీకి కబురు వెళ్ళింది. వారు వచ్చి లింగం దగ్గర నిలబడి, జలజలా కన్నీరు రాల్చారు. దుఃఖోద్విగ్నమైన గద్గద కంఠంతో ఒక అద్భుతమైన కీర్తన గానం చేశారు. అలా ఆశువుగా ఉద్భవించిన మహత్తర కీర్తనే—

"ఈశపతీశా - జగన్నివాసా"

ఆ కీర్తనకు ప్రక్కనున్న కరకు బండల హృదయాలు ద్రవించి చలించినై. ఇక కరుణామయుడు పరమేశ్వరుడు చలించడా? పాటపాడుతూనే స్వామిజీ ముందరికి వెళ్ళి, ఆ మహా శివలింగాన్ని కౌగలించుకున్నారు. స్వామిజీ కౌగిలిలో ఆ త్రిలోకేశ్వరుడు పసిపాపలాగా వొదిగిపోయాడు. పొత్తిళ్ళ పసిపాపను అల్లారుముద్దుగా గుండెలకు వొత్తుకొని, ఎత్తుకుని వస్తున్న కన్నతల్లిలాగా ఆ మహేశ్వర మహాలింగాన్ని తన చేతులతో యెత్తుకొని వచ్చి యెడ్లబండి మీద పెట్టారు స్వామిజీ.

"జై మహాదేవ, హర హర మహాదేవ, శంభోశంకర" నినాదాలు మిన్నుముట్టుతుండగా వృషభ వాహనారూడుడై ఆశ్రమానికి తరలి వచ్చాడు ఈశ్వరుడు. ఆశ్రమం దగ్గర మంచి స్వాగతం ఏర్పాటయివుంది. బండి లోపలికి వచ్చింది. స్వస్తివాచన, నామ సంకీర్తన, మంగళ వాద్య, జయ జయ ధ్వనులు విజృంభించినై. కానీ వాహనం దిగటానికి మళ్ళీ

పేచీ పెట్టాడు శివుడు. మళ్ళీ స్వామిజీ చేతుల మీదకు ఉరకాలని ఉత్సాహం గాబోలు ఆ బోళా శంకరుడికి! అలాగే చేశారు స్వామిజీ.

ఈ త్రినేత్రుణ్ణి ఎక్కడ పెట్టాలి? పైగా, యీయన రూపం తక్కువది కాదు. గజం ఎత్తు. గజం వెడల్పు వున్న లింగమూర్తి ఆయనది. స్వాగతమైతే ఘనంగానే వుంది గాని, లోపలికి వస్తే కూర్చునేందుకు కుర్చీలు కావు గదా, చాపలు గూడా లేవక్కడ. గట్టిగా వాన వస్తే వాన ధారలు కొంచెం తక్కువ పడే చోటు, హోమగుండం వున్న వేదికా స్థానమే. ఆ రజతాద్రివాసిని అక్కడే ఒక పక్కన పెట్టారు స్వామీజీ. అంతే ఇక కదల నన్నాడు ఆ చంద్రశేఖరుడు.

లింగం దొరికింది కదా, ఆ ప్రాంతాలలోనే నందిగూడా దొరక్కపోతుందా అని ఆ వూరివాట కొంత ప్రయత్నం చేశారు. దొరకదు, ఆ పని ఆపమన్నారు స్వామీజీ.

1967 శివరాత్రికి ముందు జరిగిన ఈఘట్టం చూచిన భక్తులు కొందరు ముఖ్యంగా ఆగమ తంత్రజ్ఞులైన భక్తులు, రాబోయే శివరాత్రికి దీనికి పూజ చెయ్యాలంటే, దీనికి శాస్త్రోక్తమైన ప్రతిష్ఠ చెయ్యాలన్నారు.

"చెయ్యాలంటే చెయ్యమన్నారు" స్వామీజీ.

ఒక నంది విగ్రహం, యంత్రాలు మొదలైనవన్నీ సమకూర్చుకొని యీశ్వర ప్రతిష్ఠకు పూనుకున్నారు పెద్దలు. తతంగం ప్రారంభమైంది. స్వామీజీ గూడా మంచి ఉత్సాహంగా పాల్గొంటున్నారు. యంత్ర ప్రతిష్ఠా సమయం వచ్చింది. లింగం పక్కకు జరిపి, అక్కడ యంత్రం పెట్టి, దానిమీద లింగం పెట్టవలసి వున్నది.

ఆ త్రిశూలధారి నేను కదలనన్నాడు. ఒకరు కాదు, పదిమంది, పాతికమంది పట్టు బట్టినా ఆయన అణువంత గూడా జరగలేదు. ఇరవై చేతుల రావణాసురుడిని గర్వ భంగం చేసిన ఘటుమాయె అది. ఈ మిడతలు ఒక లెక్కా?

స్వామీజీకోసం కబురు పంపక్కరలేదు. పక్కనే వున్నారుగా! ప్రార్థించక్కరలేదు, చూస్తూనే వున్నారుగా! అందుకనే గాబోలు, "మనమేం చెయ్యక్కర లేదు. ఆయనే ప్రతిష్ఠ అయిపోయాడుగా!" అన్నారు స్వామిజీ.

అంత ఆర్భాటం చేసిన భక్తులు వెర్రిమొహాలు వేసికొని చూశారు.

"అబ్బే, బాధపడక్కరలేదు. నంది వున్నాడుగా! మనం ఆయనను ప్రతిష్ఠ చేసుకుందాం" అన్నారు స్వామీజీ.

స్వామివారి అర్చావేదిక మీద చోటు చాలక, నందీశ్వరుల వార్ని ఒక ప్రక్క కొంచెం మూలగా ప్రతిష్ఠించవలసి వచ్చింది. ఆ ఈశ్వరుణ్ణి అలాగే వుంచి చుట్టూతా కొంచెం సిమెంటు గచ్చుచేసి తృప్తిపడి వూరుకున్నారు భక్తులు. ఇలా సత్య ప్రతిష్ఠ

తనంతతానే చేసుకున్న ఆ మహేశ్వరుడికి "సత్యానందేశ్వరుడు" అని పేరు పెట్టారు స్వామీజీ. ఆ విధంగా దైవ దత్తమైన తన పేరుకి ఒక మంచి స్థానం దొరికిందని సంతోషించారు స్వామీజీ. స్వామీజీ స్వరూపానికి మరో స్థిర ప్రతిరూపం లభించిందని గ్రహించి అంతరంగిక భక్తులు సంతోషించారు.

## పాతాళ గంగ

ఈ లింగయ్య మహా ప్రభువు వచ్చిన దగ్గరనుంచీ స్వామీజీకి పగటిపూట తోడులేని కొరత కొంచెం తగ్గింది. ఎప్పుడు పడితే అపుడు హోమాలే కాక, ఎప్పుడు పడితే అప్పుడు అభిషేకాలు గూడా మొదలయినాయి.

అంతకు ముందే ఆశ్రమంలో నీటి యిబ్బంది అనుక్షణం కార్యక్రమాలకు కాలికడ్డం తగులుతోంది. ఇప్పుడీ అభిషేకాలస్వామి వచ్చిన దగ్గరనుంచీ "గంగ, గంగ" అని గోల చేయసాగాడు గాబోలు, స్వామీజీకి ఆశ్రమంలో ఒక బావి యేర్పరచాలని దృష్టి బయలు దేరింది. అనంతపురం పద్ధతిలో అయితే, బావి అవలీలగా ఏర్పడిపోను. కాని ఇప్పుడు, తను ఏ పని చేసినా కొందరికి ప్రత్యక్షంగా పాఠం చెప్పవలసి వుందాయె!

ఒకరోజు స్పిరిట్ కంపెనీ మొదలియార్ గారు, కె. ఎల్. రాజుగారు, విష్ణు కాఫీవర్క్స్ వెంకటకృష్ణశెట్టిగారు ఆశ్రమానికి వచ్చారు. "మీరు ముగ్గురూ కలసి ఆశ్రమంలో ఒక బావి తవ్వించండి" అన్నారు స్వామీజీ. శెట్టిగారు తాను వెయ్యి రూపాయలిస్తానన్నాడు. మొదలియార్ గారు అయిదు వందలిస్తానన్నాడు. కెసరేలో స్వామి వార్ని దర్శించిన దగ్గరనుంచి, బేకరీ వ్యాపారంలో సిరిపట్టి, జేబులు గలగలలాడు తున్న రాజుగారు, 'ఎంతయినా సరే, నీళ్ళు రప్పిస్తా, స్వామీజీ పనంటే. నా పని గదా' అన్నాడు దర్జాగా. అన్న ప్రకారమే తానే దగ్గరవుండి, త్రవ్వకం పని మొదలు పెట్టించాడు రాజుగారు. మైసూరులోనే నీళ్ళు పడటం కష్టం. అందులోనూ ఆశ్రమం సరాసరి కొండ క్రింద వుందాయె. తవ్విన కొద్దీ కొండరాళ్ళు వస్తున్నాయి తప్పితే, నీళ్ళు కాదుగదా, తడిమట్టి కూడా తగలటం లేదు. గలగల లాడిన జేబులు, పిచ పిచలాడినాయి. ఇంకా రాళ్ళు వూరుతునే వున్నాయి. పైగా ఒక పెద్ద పరపుబండ అడ్డం పడింది. రాజుగారు బోళా మనిషి. ఇక తట్టుకోలేక పోయాడు. స్వామీజీ నలుగురిలో వుండగావచ్చి "నీళ్ళు రప్పించండి మహాప్రభో" అని కాళ్ళు పట్టుకున్నాడు.

స్వామీజీ బావి దగ్గరకు వచ్చి లోపలికి దిగారు. దిగి, ఇటూ అటూ చూసి, "ఈ మూల తవ్వండి" అన్నారు. ఏమిటి తవ్వేది అక్కడ? అది పెద్ద బండరాయి. దానిమీదే పలుగువేసి ఊపుగా కొట్టారు. సత్యానందేశ్వరుడు తన తలమీది జటలు కొంచెం వొదులు

చేసుకున్నాడు. నాలుగు పోట్లల్లో అంత లావురాయీ ఒక్కసారి పగిలింది. పగిలీ పగలటంతోటే లోపల్నించి, ఏనుగు తొండ మొకటి తవ్వుతున్న వాళ్ళ మొహాల మీదికి దూసుకు వచ్చింది. ఇవతలకు తప్పుకొనే లోపల వాళ్ళ మొహాలు తడిసిపోయినాయి.

ఆనందంతో పొంగిపోయిన పనివాళ్ళు, పక్కకు చూసేసరికి అప్పటికే స్వామీజీ పైకి ఎక్కేసి వున్నారు. ఆ పగులును మరింత పెద్దది చేసి, నీళ్ళు మరింత పెరుగుతుండగా పనివాళ్ళు, రాజుగారు ఆనందంగా పైకి వచ్చేశారు. ఆ నీళ్ళు కొబ్బరి నీళ్ళల్లే వున్నాయి. ఆ ధార ఈశ్వరుడి జటాజూటంలోంచి పైకి దూకుతున్న గంగమ్మ తల్లిలాగా వుంది. రాజుగారి ఆనందం పట్టరాకుండా వుంది. ఆ ఆనందంలో, "చూశారా, నాకు డబ్బంటే లెక్క లేదు, నీళ్ళలాగా డబ్బు ఖర్చు చేస్తాను" అన్నాడాయన.

"తథాస్తు" అన్నారు స్వామీజీ.

తను డబ్బు నీళ్ళలాగా కర్చుచేసినందువల్ల పని జరగలేదనీ, తను వెళ్ళి కాళ్ళు పట్టుకోగా స్వామీజీ వచ్చి పక్కన నుంచుంటే పని జరిగిందనీ గమనించుకోలేదు రాజుగారు. కనీసం "తథాస్తు" అన్నారేమిటి అనయినా గమనించుకోలేదు. ఆయనకోసం స్వామీజీ యే ప్రత్యేక సంకల్పాలు చేశారో? ఆయన ప్రారబ్ధాలు ఇంకా ఏమి మిగిలి వున్నాయో? ఏమయితే నేమి, ఆశ్రమానికి మంచి బావి ఏర్పడ్డది. ఈశ్వరాభిషేకాలు హాయిగా సాగిపోతున్నాయి. సందులో సందు చేసుకొని స్వామీజీ సమాధులు గూడ సాగుతూనేవున్నాయి.

ఆశ్రమ ప్రారంభ దినాలలో హరికథ చెప్పిన భాగవత్‌గారు అప్పుడప్పుడు వచ్చి పోతున్నాడు. ఆయనకు స్వామీజీ మీద భక్తి లేదు. తన ఉపాసన తనదే తప్ప మరొకరి సంగతి పట్టే ధోరణి కాదు. అయినా యెందుకు వస్తున్నాడో ఆయనకే తెలీదు. స్వామీజీ లాంఛనప్రాయంగా అన్నారుగా, "వస్తూ వుండు" అని. ఆ మాట లాక్కొస్తోంది ఆయనను. ఆయన వచ్చేసి వెళ్ళిపోతున్నాడు. ఇప్పటికి ఆరు నెలలు పైగా అలా జరుగుతునే వుంది.

ఒకరోజున ఆయన వచ్చినప్పుడు "నా ధ్యానపు గది చూద్దురు గాని రండి" అన్నారు స్వామి.

"సరే పదండి" అని లోపలికి వెళ్ళాడు భాగవత్‌గారు. స్వామీజీ తన సమాధి భూగృహంలోకి తీసుకెళ్ళారు. అక్కడ చూసేందుకు పెద్ద ఏమీ లేదు. కొండరాళ్ళతో కట్టిన చిన్న భూగృహ మది. ఒక పులి చర్మ ఆసనము, ఒక కమండలము అక్కడ వున్నాయి. అవి చూపించినాక, స్వామీజీ ఇక చూపించటం ఆపి · భాగవత్‌గారివంక చూడసాగారు. భాగవత్‌గారు కూడా స్వామీజీ కళ్ళలోకి చూస్తున్నాడు. ఒక సెకండయిందేమో, భాగవత్‌గారిలో ఏమో జరిగింది, ఆయన కళ్ళు తెరిచే వున్నాయి. కాని ఆయన చూడటం లేదు. ఒక నిమిషమాగి భాగవత్‌గారిని మృదువుగా కౌగలించుకొన్నారు స్వామీజీ. కరిగి నీరైన భాగవత్‌గారు ఆ కౌగిలిలోంచి జారిపోయి స్వామీజీ పాదాల

మీాటికు వాలపోయి, ఆ పాదాలను తన శిరస్సుకు అలింగనం చేసుకొన్నాడు. ఆనంద పరవశ స్థితి కొద్ది నిమిషాలు సాగింది. ఆ తరువాత భాగవత్‌గారు ప్రకృతి స్థితికివస్తూ వుండగా—

"భాగవత్‌గారూ! మీా ఉపాసన మంచి స్థితిలో వుంది. బావుంది, కాని, మీారు అనుసరిస్తున్న ఉగ్రభావం మీా ఉపాసనకు అనుకూలంకాదు. ఉపాసనకు ఆధార వేదిక సత్వ గుణం. ఉగ్రభావం రజస్సులోంచి తమస్సుకు గుంజుకుపోతుంది. ఆ మార్పు చేసుకుంటే మీాకు ఉపాసనలో మంచి పట్టు చిక్కుతుంది" అన్నారు స్వామీజీ.

దృక్ దీక్ష, అలింగన దీక్ష, ఉపదేశ దీక్ష గూడా ఏకకాలంలోనే దోసిళ్ళతో జుర్రుకున్న భాగవత్‌గారు, స్వామీజీ చెప్పినది జాగ్రత్తగా గమనించుకొని, ఆజ్ఞగా శిరసావహించాడు. ఇంతలో స్వామీజీ చేతిలోకి, 108 రవ్వల రత్నహారం వొకటి వచ్చింది. ఎలా వచ్చిందో! ఒక్కొక్క రవ్వ పూస కుంకుడు గింజంత వుండి, ధగ ధగా మెరిసిపోతోంది. ఆ మాల భాగవత్ గారికి అనుగ్రహిస్తూ, "ఇది మీారు జపమాలగా వాడుకోండి. జపం బాగా వృద్ధి అవుతుంది." అన్నారు స్వామీజీ.

భాగవత్‌గారు కుండలు పగిలినట్లు, డబ్బాలో రాళ్ళు గలబరించినట్లు నవ్వాడు. "స్వామీజీ! ఇలాంటి పరీక్షలు నాకు వద్దు. రవ్వల హారాలకు ఆశపడే వాణ్ణికాదు నేను. మీా అనుగ్రహం వుండి జపం నాలో పెరగాలి గాని, మాలికలతో జపం పెరగదు. అది మీా దగ్గరే వుంచండి." అన్నాడాయన.

"ఇది నేను ఆశీర్వదించి యిస్తున్నాను, కాదంటారా" అన్నారు స్వామీజీ.

"రవ్వలెవరికి కావాలండీ. మీా అనుగ్రహం కావాలి. అది ఇవ్వండి. ఇది మీా దగ్గరె వుంచుకోండి" అన్నాడు భాగవత్‌గారు.

రవ్వలను చూస్తున్నకొద్దీ ఆయన విసుకు రవ్వంత పెరిగిపోతోంది. అది ఆయన మాట తీరు. అలవాటుజోరు. హెడ్‌మాష్టరుగా పిల్లలను అదమాయించటానికి అలవాటుపడ్డ జీవితంగదా!

"వద్దంటారా" అన్నారు స్వామీజీ మళ్ళీ మరోసారి.

"వద్దు" కుండ బద్దలుకొట్టినట్లు చెప్పాడు భాగవత్‌గారు.

"సర్లే పోనీండి" అన్నారు స్వామీజీ, ఆనందంగా నవ్వుతూ, బయటకు నడుస్తూ. తన సహస్రార సరోజాత కర్ణికా పీఠంలో స్వామీజీ పాదాలను గురుపాదుకలుగా స్థాపించుకొంటూ వెనకే నడిచాడు భాగవత్‌గారు. ఆ పూటకు సెలవు తీసుకొని ఆయన వెళ్ళిపోయాక, స్వామీజీ అనుకున్నారు తనలో తానే "గట్టిపిండం, వంచటం అంత తేలిక కాదు" అని.

ఈ గురుదీక్ష పొందిన దగ్గరనుంచి, ప్రతి ఆదివారం వచ్చి, కాసేపు స్వామీజీ సంకీర్తన విని వెళ్ళిపోతున్నాడు భాగవత్ గారు.

## శివరాత్రి

ఇంతలో శివరాత్రి వచ్చింది. ఈ సంవత్సరం శివరాత్రి యేర్పాట్లు ఊహించలేని పెద్ద యెత్తులో సాగుతున్నాయి. ప్రత్యేకంగా పందిళ్ళు వేశారు. స్వామీజీ పాత భక్తులు, కొత్త భక్తులు ప్రోగుబడుతున్నారు. వీరందరి భోజనాలకు పెద్ద యెత్తున ప్రయత్నాలు జరుగుతున్నాయి. శివరాత్రి రేపనగా, శివుడికి కావేరీ జలాలతో అభిషేకం చెయ్యాలన్నారు స్వామీజీ. దానికేమి ? లారీలతో తిసుకు రావచ్చు. కాని దానికి ఒక ప్రత్యేక పద్ధతి పెట్టారు స్వామీజీ. ఈ రోజు రాత్రే ఉపవాసం వుండి, శ్రీరంగ పట్టణంలో కావేరీ తీరానికి చేరాలి. అక్కడ వుండుఏంటి ఆ చలిలో నది దగ్గర ఆరుబయట జాగరణ చెయ్యాలి. తెల్లవారుజామున స్నానంచేసి, తడిబట్టలతో నీళ్ళు తీసుకురావాలి. అంటే, పదిమైళ్ళు నీళ్ళు మోసుకు రావాలి. ఇన్ని నియమాలకీ ఒప్పుకొని, యీ పనికి 28 మంది ముందుకొచ్చారు. వారిలో వున్న విద్వాన్ నారాయణరావుగార్ని ఆ బృందానికి నాయకుడుగా చేశారు స్వామీజీ. అందర్నీ నుంచోబెట్టి స్వామీజీ మరికొన్ని నియమాలు చెప్పారు.

1. తడి బట్టలతో నీళ్ళ బిందెలు తెచ్చేటప్పుడు, ఆ బిందెలను భుజాలమీదే వుంచుకోవాలి. మరోచోట పెట్టుకోరాదు.

2. బిందెలలో నీళ్ళను వేళ్ళతోగాని, చేతులతోగాని ముట్టరాదు.

3. నదినుంచి ఆశ్రమంలోకి వచ్చేదాకా మౌనంగా వుండాలి.

ఇన్ని నియమాలకీ వొప్పుకొని బృందం బయలుదేరబోతుండగా, స్వామీజీ కొన్ని సీమబాదం కాయలు తెచ్చి నారాయణరావుగారికి యిచ్చారు.

"నదినుంచి బయలు దేరే ముందర, అందర్నీ తలోటి నోట్లో పెట్టుకోమనండి. ఆశ్రమంలోకి వచ్చినాక, బిందెలను వాటి స్థానంలో పెట్టినాక మాత్రమే ఆ కాయలను వాళ్ళు వుమ్మెయ్యవచ్చు" అన్నారు స్వామీజీ. ఇంత కఠిన మౌనమన్న మాట అని అర్థమయింది నారాయణరావు గారికి. సరే, ఆ కాయలు తీసుకొని లెక్కపెడితే అవి 32 వున్నాయి. ఇన్నెందు కబ్బా అనుకొని గూడా, పోన్లే నాలుగెక్కువ వుంటే మంచిదే కదా అనుకొని వూర్కున్నాడు నారాయణరావుగారు.

శ్రీరంగ పట్టణం చేరటానికి రైల్వే స్టేషన్‌కు వెళ్ళింది భక్త బృందం. స్టేషనులో ఇద్దరు భక్తులు వచ్చి చేరారు. అందరూ కలసి నదికి చేరారు. అక్కడ మరో ఇద్దరు భక్తులు

వాళ్ళకోసం ఎదురు చూస్తున్నారు. స్వామీజీ యిచ్చిన సీమబాదం కాయిని లెక్క సరిపోయింది అనుకొన్నాడు ఆశ్చర్యంతో నారాయణరావుగారు.

శ్రీరంగ పట్టణం ఆశ్రమం నుంచి సుమారు పదిమైళ్ళ దూరంలో వున్న క్షేత్రం. కర్ణాటక ప్రజల హృదయాలలో మంచి ప్రభువుగా స్థిర కీర్తి సంపాదించుకొన్న టిప్పు సుల్తాను యీ ఊరునే రాజధానిగా చేసుకొని పరిపాలన చేశాడు. సువిశాలమైన రంగనాథ స్వామి ఆలయం, ఇప్పుడు చిన్న పల్లెగా మారిన యీ వూరికి ప్రధాన అలంకారం. కావేరి మహానది పశ్చిమ వాహినిగా ప్రవహిస్తూ వుండటం యీ స్థానాన్ని క్షేత్రంగా చేస్తోంది. ఈ పశ్చిమ వాహిని కావేరీ తీరంలో, 32 మంది భక్తులు సంకీర్తనలతో జాగరణ చేస్తున్నారు. రాత్రి ఒకటిన్నర రెండు ప్రాంతాలలో, అక్కడికొక తెల్లటి కుక్క వచ్చింది. అది మామూలు వూర కుక్కలాగా లేదు. ధనవంతుల యిళ్ళలో ముద్దుగా పెంచుకొనే తెల్లకుక్క అది. దాన్ని అలా వీధిలోకి ఎవరు వదిలేశారో తెలీదు. అది సరాసరి వీళ్ళ దగ్గరకు వచ్చి, యీ సంకీర్తన వింటూ ఆగిపోయింది. తరువాత ప్రతి మనిషి చుట్టూ తిరిగి అన్ని వైపుల నుంచీ పైకీ కిందికీ యెగాదిగా చూసింది. భక్తులంతా యీ కుక్క వింత నడతను చూసి నవ్వుకొని "ఇదిగూడా మనకు మల్లేనే, ఏదో భక్తి కుక్కలాగా వుంది" అనుకొని వూర్కున్నారు. ఆ తరువాత ఆ కుక్క ఎటు పోయిందో ఎవరూ గమనించలేదు.

తెల్లవారుజామున మూడున్నరకల్లా స్నానాలు చేసి, తడి బట్టలతో, చెప్పులు లేని కాళ్ళతో, ఇతర నియమాలన్నీ పాటిస్తూ, నీటి కడవలు మోసుకువచ్చారు. ఆశ్రమం దగ్గర ఆ గంగోదకానికి స్వస్తివాచన పురస్సరమైన పూర్ణకుంభ స్వాగతం ఏర్పాటుచేశారు. లోపలికి వచ్చి అందరూ కుండలు జాగ్రత్తగా దింపుతున్నారు. అందులో ఒకతని చెయ్యి జారి పోయి కుండ క్రిందపడి పగిలిపోయింది. ఆ వ్యక్తికి బొల్లి వుండటం గమనించిన పెద్దలు "భగవంతుడి లీలలు చిత్రంగా వుంటాయి" అని ఆశ్చర్యపోయారు.

అందరూ కుండలు దింపాక "రాత్రి మీదగ్గరకు దత్తాత్రేయుడు వచ్చాడు. మీరంతా చక్కగా సంకీర్తన చేస్తున్నారని సంతోషపడ్డారు. మీరాయనను గుర్తించారా!" అన్నాడు స్వామీజీ.

"అబ్బే మాకు కనిపించలేదండీ" అన్నారు అందరూ బాధగా.

"అదేమిటయ్యా, మీ అందరిచుట్టూ తిరిగి, అందర్నీ పైనుంచీ కిందదాకా చూస్తేను" అన్నారు స్వామీజీ. అప్పుడు తెల్ల కుక్క సంగతి గుర్తు వచ్చి "అరెరె, వాడు దత్తాత్రేయ స్వామివారా, బలే పని జరిగిపోయిందే" అని వారి నాలికలు కొరుక్కున్నారు ప్రతివారూ.

ఆ పగలు కార్యక్రమాలు ఉత్సాహంగా నడిచాయి. అనేకమంది భక్తులు పెద్ద పెద్ద సానలు తెచ్చి శ్రీచందనం అరగదీశారు. సాయంత్రం ఆరు అయ్యేసరికి స్వామీజీ తన గదిలోంచి బయటకు వచ్చి, కావేరి నుంచి తెచ్చిన తీర్థోదకాలతో ఆ దేవపీఠానికి ప్రదక్షిణలు

చేరి, పూజా వేదిక మీదకు ఎక్కారు. ఆ రోజు ఆశ్రమం పట్టనంత జనం వచ్చారు. ఒక ప్రక్క ప్రజలచేత నిరంతరం దివ్యనామసంకీర్తన చేయిస్తున్నారు స్వామీజీ. మరోప్రక్క సత్యానందేశ్వరుడికి స్వయంగా అభిషేకం చేస్తున్నారు.

మొదట పంచామృతాభిషేకంతో మొదలైంది. కడవలతో పాలు వర్షించారు స్వామీజీ. ఈ పాలలో ఆ స్వామి శిరసుమీది చంద్రుడి అమృతధారలు కలిసి, మరింత చిక్కనై స్వామి స్వరూపాన్ని అమృతమయం చేసినై. తరువాత పెరుగు కుండలు స్వామి శిరస్సున కుమ్మరించారు స్వామీజీ. ఆ స్వామిలో పేరుకుపోయిన ఆనంద రసం కుదపలు కట్టి పైకి పొంగిందా అన్నట్లు, ఆ పెరుగు కుదవలు చిందులు వేసినై. ఆ పైన స్వామికి ఆజ్యం ధారలు కట్టించారు స్వామీజీ.

స్వామీజీ చేతిలో వున్న పాత్రలోంచి ధార కడుతున్న నెయ్యి యీ సత్యానందేశ్వర స్వామి తలకు తగిలేసరికి, అక్కడే ఆగిపోతోంది. అదేమి చిత్రమో కిందికి దిగి జారటంలేదు. ఏమౌతుందా నెయ్యి? స్వామి శిరస్సుమీద పేరుకు పోతున్నట్లుగా వుందది. కాదు, కాదు, పేరుకుపోవటం కాదది! ఆ నెయ్యి శివలింగం శిరస్సున పడగానే వెన్నగా మారిపోతోంది!! సభ ఆశ్చర్యానికి మేరలేదు. రెండు బిందెలు నెయ్యి పోస్తే శివలింగం నెత్తిన పెద్ద వెన్న తలపాగా యేర్పడింది. నిశ్చలంగా చూస్తున్న స్వామీజీ, ఆ వెన్నను పళ్ళెంలోకి తీయించి, ప్రసాదంగా పంచమని సభలోకి పంపారు.

ఆ తరువాత తేనెతో, పంచదారతో, ఫలరసంతో అభిషేకాలు జరిగినాయి. కాని, ఆ ఆశ్చర్య నవనీతంలో కూరుకుపోయిన ఆ మహాసభకు ఈ అభిషేకాలు అంతగా పట్టలేదు. వారికి పూర్తిగా స్వస్థితి వచ్చేసరికి బహువేగంగా శుద్ధోదక స్నానం చేస్తున్నారు స్వామీజీ.

నూతనంగా యేర్పడ్డ బావి దగ్గర నుంచి పూజావేదిక దాకా రెండు వరుసలుగా మనుష్యులు నిలబడ్డారు. బావి లోంచి నీళ్ళు తోడేవారు తోడుతున్నారు. ఒక వరస చేతుల మీద నీళ్ళబిందె స్వామీజీ చేతుల్లోకి సాగిపోతోంది, సెలయేటి అలల మీద సాగిపోతున్న చిరుపడవలాగా! స్వామివారి చేతిలో అధోముఖమైన ఆ బిందె అమృతధార కురిపిస్తోంది దివ్య మేఘంలాగా! సత్యానంద మహాలింగం మీద ఆ ధార చిందీ నల్దిక్కులకు పొంగి భక్తుల హృదయాలలో శతధా, సహస్రధా, కోటిధాకాంతి వలయాలను సృష్టిస్తోంది, నిరుపమానంగా. ఖాళీ అయిన బిందె మరో చేతుల వరస మీద బావిదాకా కొట్టుకుపోతోంది ఎండు ముక్కలాగా.

కట్ట (పూజా వేదిక) మీద పురోహితుల రుద్ర, శతానువాక మంగళ ఘోష నిరంతంగా సాగుతోంది. ఎదుట పండిట్లో నమశ్శివాయ మహానాదం వాయు స్కంధాలను అధిరోహిస్తోంది. అభిషేకం కొనసాగిపోతోంది. అప్పుడే లింగోద్భవ కాలం సమీపిస్తోందన్న ధ్యాస ఆశ్రమంలో చెట్లమీద చేరిన పిట్టలకు గూడా లేదు. ఇంతలో పక్కనున్న పురోహితులను

అభిషేకం కొనసాగిస్తూ వుండమని చెప్పి స్వామీజీ ఇవతలకు వచ్చి హోమం ప్రారంభించారు. ఇదేమిటా, ఉన్నట్టుండి హోమం చేస్తున్నా రనుకున్నారు జనం. ఆ హోమం కొంత ముందుకు సాగేసరికి హోమజ్వాలలు బాగా పైకి లేచి, పైన పాక అంటుకుంటుందేమో అనిపించసాగింది. అప్పటికే హోమకుండం పైన పాక లోపల ఇనప రేకులు అమర్చి వున్నారు గనుక ప్రమాదం లేకుండా వుంది.

## అగ్ని ప్రవేశం

లింగోద్భవ కాలం కొద్దిగా దాటింది. పూర్ణాహుతి సమయం వొచ్చింది. అటు వేదఘోష ఇటు సంకీర్తన ఘోష మిన్నుముట్టి సాగిపోతున్నై. స్వామీజీ మాత్రం ఈ లోకంలో లేరు. ఆయనకు తనూ, తన ప్రశ్న గణపతి మంత్రాలూ తప్ప మరో లోకం వున్నట్టు లేదు చూస్తే. పూర్ణాహుతి పళ్ళెం హోమవేదిక పక్కన పెట్టుకొని మెరుపులాగా హోమ కుండంలోకి దూకేశారు స్వామీజీ. దూకి లోపల కూర్చుండిపోయారు. మనిషి కనిపించటం లేదు. మంటలు పైకెగసి వున్నాయి. సెగలు వేదికకు ముందు వరసలో కూర్చున్న వాళ్ళకే దుర్భరంగా తగులు తున్నాయి. ఈ అఘాయిత్యపు పనికి సభలో కొందరు బెంబేలు పడిపోయి, గందరగోళ పడసాగారు. కాని అప్పటికే ఒక మండల దీక్షా అగ్ని ప్రవేశాన్ని చూసినవారు చాలామంది వున్నారు గనుక సభలో ఎక్కువగా గోల చెలరేగలేదు. కొంచెంసేపయినాక, లేచి నిలబడ్డారు స్వామీజీ. ఎవరికీ ఊపిరాడటం లేదు. అగ్నిగుండం మధ్యలో నిలబడి వున్నారు స్వామీజీ, లేత పసుపు రంగు బట్టలు కట్టుకొని వున్నారాయన. అగ్నిగుండం వారికి గుండెల లోతు వుంది. ఆపైన అగ్ని జ్వాలలు నలువైపులా మరో నిలువెత్తు వున్నాయి. అలా నిలబడి ఆజ్యపాత్ర అందుకొని స్రువం తీసుకొని ఆజ్యాహుతులు ప్రారంభించారు స్వామీజీ. మామూలుగా అయితే ఆ ఆజ్యపాత్ర మొత్తం నిప్పు అంటుకొని మండిపోవాలి, కాని ఆయన నిశ్చలంగా హోమం చేస్తూనే వున్నారు.

ఆ ముఖంలోని గంభీరత, కనుబొమ్మలలోని బిగింపు, పెదవులలోని పట్టు, మూసిఉన్నా గూడా వ్యక్తమవుతున్న నేత్రాల తీక్షత, లోపల ఏదో మహోత్కృష్టమైన ధారణ జరుగుతోందని స్పష్టం చేస్తున్నాయి. ఆజ్య హోమాలయిన తరువాత, హోమగుండానికి దగ్గరలోనే వున్న నిలువెత్తు కనకాంబరపు పూలమాలను తనే అందుకొని మెడలో వేసుకున్నారు స్వామీజీ. ఆ తరువాత పూర్ణాహుతి పళ్ళెం అందుకొని పూర్ణాహుతి సమర్పించారు. మంటలు మరింత గుప్పున చెలరేగాయి.

స్వామీజీ మళ్ళీ హోమగుండంలో కూర్చుండిపోయారు. [illegible] లేచి నిలబడ్డారీ మాటు. వారి చేతిలో నాంగపదిగెతో ఉండిపున్న [illegible]

మెరుస్తోంది. దాన్ని చటుక్కున పక్కన వున్న పళ్ళెంలో పెట్టి, పక్కనే చెంబులో వున్న నీళ్ళు దానిమీద పోశారు. ఆవిరి లెగజిమ్మినాయి. ఆ నూతన శివలింగానికి గంధ పుష్పాదులతో లఘువుగా అర్చన చేశారు. అప్పుడు మళ్ళీ ఆజ్యపాత్ర తీసుకొని కొద్దిగా హోమాలు చేశారు. ఇదంతా పూర్తయ్యేసరికి అరగంట దాటింది. అప్పుడు హోమగుండంలోంచి పైకి యుగిరారు స్వామీజీ.

అప్పటికి ఊపిరాడింది సభకు. జయజయ ధ్వనులు మిన్ను ముట్టినాయి. నమశ్శివాయ ఘోషలు మారుమ్రోగినాయి. ఈ మధ్యలో అభిషేకం ఎప్పుడాపేశారో ఋత్విక్కులకూ తెలీదు, ఒకరికూ తెలీదు. మళ్ళీ ఊపిరి అందటంతో, ఋత్విక్కుల చేతులు చకచకా కదులుతున్నాయి. బిందెలు టకటకా నడుస్తున్నాయి. అభిషేక ధారలు బడబడా పడుతున్నాయి.

తమ యథాస్థానంలో కూర్చున్న స్వామీజీ హోమానికి ఉత్తరాంగంగా వున్న కార్యక్రమాలను పూర్తి చేసి, ఆ శివలింగాన్ని చేతబట్టుకొని అందరికీ చూపించారు.

ఎత్తిన కుడి చేతిలో ఆ దివ్యలింగాన్ని ధరించి వేదిక ముందు భాగానికి నడిచి వస్తున్న స్వామీజీ స్వర్గగంగా సరస్సులోని స్వర్ణ కమలాన్ని తుండాగ్రాన ధరించి మీంకరించబోతున్న ఐరావత మహాగజం లాగా ప్రకాశించారు. తెరచిన వారి కనుగవ లోంచి మెరుపుల దొంతరలు దొర్లి పడుతున్నాయి. వారి మెడలోని కనకాంబరాలమాల తుది కుచ్చు, నిప్పుల మీద పొర్లి పొర్లి బూడిద కొట్టుకొని కూడా, అఖండ శివయోగంలో సిద్ధి నందుకొన్న సాధకుడు లాగా కలకల నవ్వుతోంది. సిగపూవే కాక పాదాల పూవు గూడా వసివాడని ఆ అమృత రస ప్రవాహాన్ని, ఆనంద విస్ఫారితాలైన సభాసదుల నేత్రాలు చేరవులతో జుర్రుకొన్నాయి. మంద గంభీరమైన గమనంతో మైకు దగ్గరకు వచ్చి నిలబడ్డారు స్వామీజీ.

* * *

## హోమతత్త్వం

పధ్నాలుగు సంవత్సరాల క్రిందట బొమ్మెపర్తి ఆలయంలో జరిగిన తమ ప్రప్రథమ దీక్షా మంగళ మహోత్సవం స్వామీజీ మనస్సులో మెదలసాగింది. నునూగు మీసాల నూత్న శోభలు చిందులు పెట్టగా స్వామీజీ పెదవులు కదలాడ సాగినాయి.

"ఓం నమశ్శివాయ. ఇప్పుడు మీరు చూస్తున్నది, అగ్నిదేవుడు అనుగ్రహించి ఇచ్చిన ప్రసాదం. ఇప్పుడు స్వామీజీ చేసింది, అగ్నిపూజ. దీనికి మీలో కొందరు ఏవేవో పేర్లు పెట్టుకోవచ్చు. కాని, ఇప్పుడు జరిగింది మాత్రం అగ్నిపూజ.

అగ్నిని పాదాలతో తాకరాదు అని శాస్త్ర నియమం. స్వామీజీ అగ్నిలో నిలబడ [illegible] ఆ అగ్నిగుండంలోనే [illegible] ప్రతిష్ఠింపబడినాయి ఇప్పుడు.

ఆ అగ్నుల మధ్యలో తాను గూడా అగ్ని అయిపోయి నిలబడి, అర్చన చేశారు స్వామీజీ. శివుడు కానివాడు శివుణ్ణి పూజించరాదు. స్వామీజీ యిప్పుడు శివుడయ్యారు. అగ్ని అంటే శివుడే కదా ! ఈ పూజకు తృప్తి పడిన అగ్నిదేవుడు యీ ప్రసాదం అనుగ్రహించాడు. ఈ పూజను, యీ ప్రసాదాన్ని కళ్ళారా చూసిన మీరు అదృష్టవంతులు.

అనేక ఔషధులతో, దివ్య మంత్రాలతో వేద సిద్ధమైన ప్రక్రియలతో అగ్ని పూజ జరిగింది యిప్పుడు. ఇవాళ్ళే కాదు, ప్రతి ఆదివారం అగ్ని పూజ జరుగుతూనే వుంది. ఆదివారాలే కాదు అగ్ని దేవుడు ఆజ్ఞాపించినప్పుడల్లా ఇది జరుగుతూ వుంటుంది. స్వామీజీ ఒక్కరే కూర్చొని ఈ హోమాలు చేసుకున్న ఘట్టాలు అనేకం వున్నాయి. ఒకరో ఇద్దరో ఆ సమయానికి వచ్చి చూసిన ఘట్టాలూ ఉన్నాయి. ఇవాళ్ళ మీరంతా అదృష్టవంతులు. మీ సమక్షంలో ఈ పూజ జరిగింది. ఈ ప్రసాదం కూడా లభించింది.

ఇది ఎవరో చూడాలని చేసే పూజ కాదు. స్వామీజీ తన కోసం తను చేసుకునేది కూడా కాదు. ఆయన కోసం ఆయన చేసుకోవలసిన పని ఏమీ స్వామీజీకి మిగిలిలేదు. ఎందువల్లంటే ఆయనకు ఏ కోరికా మిగిలిలేదు. కేవలం జగత్కల్యాణం కోసం, వంశాను గతమైన ఆర్ష సంప్రదాయ పద్ధతిలో ఈ విధానాన్ని ప్రారంభించారు స్వామీజీ. ఈ హోమ ధూమం వల్ల సత్పురుషు లెక్కడెక్కడ వున్నారో అక్కడక్కడ రక్షణ జరుగుతుంది. భూమి మీద సత్పురుషుల సంఖ్య కూడా పెరుగుతుంది.

కంటికి కనిపించే పొగ మహా అయితే మేఘ మండలం దాకా పోతుందేమో. కాని, దివ్య మంత్ర ప్రభావితమైన హోమ ధూమంలోంచి, ఒక విచిత్రమైన తరంగ శక్తి ఉద్భవిస్తుంది. దాన్ని గూడా ధూమమనే పిలుస్తారు. ఈ తరంగ శక్తి రూపమైన ధూమం విద్యుదయస్కాంత శబ్ద తరంగాల లాగా, వాయు వీధులను దూసుకొని, అంతరిక్షంలో ప్రయాణం చేస్తుంది. ఈ వాయు వీధులు, అంతరిక్ష వీధులు కలిసి యేడు పొరలుగా వున్నాయి. ఇవన్నీ భూమిమీది వాతావారణం మీద తమ ప్రభావాన్ని నిరంతరం చూపుతూనే వుంటాయి. ఈ పొరలమీది సౌర కుటుంబంలోని గోళాల సంచలనాలు ప్రభావం చూపుతూవుంటాయి. ఈ గోళాల సంచలనాలన్నీ సూర్య మండలం మీద ప్రధానంగా ఆధారపడి వున్నాయి. అందుకనే, సూర్యమండలంలో యేరకమైన మార్పు రవ్వంత జరిగినా, సౌర మండల జీవులమైన మనందరి మీదా అది వుంటుంది. అంతరిక్షపు పొరలను చీల్చుకు వెళ్ళే హోమ ధూమాలు, దారిలో యీ యీ పొరలలోని కాలుష్యాలను నివారించుకొంటూ, సూర్య మండలంలోకి ప్రవేశిస్తాయి. అక్కడ అణు రూపాలలో వున్న జల, వాయు లోకాలను శుద్ధి చేస్తాయి. ఆ విధంగా ఆదిత్యమండలంలోని కాలుష్యం యీ హోమ ధూమ శక్తి తరంగాల వల్ల నివారింప బడుతూ వుంటుంది. దీనివల్ల అంతరిక్షపు పొరలు, దాని వల్ల వాయు మండలాల పొరలు, దానివల్ల భూ వాతావరణమూ పరిశుద్ధమవుతూ వుంటాయి. అందువల్లే భూమిమీద వర్షించే

వర్షం అనుకూల వర్షమవటమేగాక, పవిత్రమైనది గూడా అవుతుంది. ఆ వర్షం వల్ల అటవీ సంపద పెరిగి, ప్రకృతిలో సమతూకం ఏర్పడుతుంది. అంతేగాక ఆ వర్షం వల్ల పెరిగే పంటలలో పవిత్రభావతరంగాలు చోటు చేసుకొంటాయి. అందువల్ల వాటిని తినే ప్రజల హృదయాలు పవిత్రమవుతాయి. అందువల్ల వారి సంతతి సాధువులవుతారు. అందువల్ల ప్రపంచ శాంతి సుస్థిరమవుతుంది.

ఇక భౌతికంగా చూసుకొంటే, అగ్నిలో ఆహుతి యిచ్చే యీ యీ ఓషధుల గుణాలు యీ హోమ ధూమంలో వ్యాపించి ఉంటాయి. ఆ గుణాలు హోమ మంత్ర ప్రభావం వల్ల అధికశక్తిగలవి అవుతాయి. అందువల్లే కేవలం ఆ యజ్ఞవాటిక ప్రాంగణంలో వుండి, ఆ హోమ ధూమాలను దూరం నుంచీ పీల్చినంత మాత్రానవే, అనేక దీర్ఘ వ్యాధులు నివారణ అయిపోతూ వుంటాయి. శ్రద్ధగా పరిశోధన చేసే వారుంటే, మన ఆశ్రమంలోనే యీ హోమ ప్రభావం వల్ల ఎందరు ఆరోగ్యవంతు లయ్యారో పరిశోధించుకోవచ్చు. ఇలాంటి ఋషి పరంపరా ప్రాప్తమైన యీ హోమ విధాన అనుష్ఠానంలో, అగ్ని దేవుడు స్వయంగా ప్రసాదం అనుగ్రహించటం వల్ల యీ పర్వానికి విశేషమైన ప్రాశస్త్యం వచ్చింది. మీకందరికీ విశేషమైన అనుగ్రహం లభించింది.

ఇక నుంచీ యీ శివరాత్రి మన ఆశ్రమ ఉత్సవాలలో ఒక ప్రధాన ఉత్సవం అవుతుంది. అంతేగాక. మన ఆశ్రమానికి శివరాత్రి సంవత్సరాది అవుతుంది. శివరాత్రి మన దీక్షకు ప్రారంభ దినం. అందుకని, ఇకనుంచీ శివరాత్రి నాడే సంవత్సర ఫల శ్రవణం చేయిస్తారు మీకు స్వామీజీ. ఏ సంవత్సరంలో గ్రహగతులు ఎలా వున్నా సంవత్సర ఫలాలు యెలా వున్నా, ఆశ్రమానికి వచ్చే భక్తు లందరినీ ఆ అగ్ని దేవుడు, ఆ శివుడు, ఆ గణపతే రక్షిస్తారు. ఇది మీ ఆశ్రమం. ఎవరు ఈ ఆశ్రమం వృద్ధి అయ్యేందుకు కృషి చేస్తారో వాళ్ళు వృద్ధిలోకి వస్తారు. ఇంతకన్నా యెక్కువ చెప్పరు స్వామీజీ. ఓం నమశ్శివాయ.

సహ్యాద్రి శ్రేణులలోని డాకినీ శిఖరాగ్రాన భీమశంకర జ్యోతిర్లింగ పార్శ్వభాగాన, అల్లనల్లన చిరుపాయగా తలయెత్తిన భీమా మహానదీ ప్రచండ ప్రవాహంలాగా, స్వామీజీ వాక్తరంగిణి క్రమక్రమంగా విజృంభించి శ్రోతలను ముంచి యెత్తింది. ఆ తరువాత కేరళ నుంచి కృష్ణనాయర్ అనే భక్తుణ్ణి పిలిచి, అగ్నిహోత్రు డిచ్చిన, ఆ శివలింగాన్ని ఆయనకు అనుగ్రహించారు స్వామీజీ. అది కాగానే వెంటనే అభిషేకంలోకి పరిగెత్తారు. స్వామీజీ ప్రవేశించేసరికి, అక్కడ సంచలనం ముమ్మరమైంది. మళ్ళీ నామ సంకీర్తన ఉచ్ఛస్థాయికి చేరింది. కొంతసేపు అభిషేకం సాగింది. అప్పుడు నవనీతాభిషేకం ప్రారంభించారు స్వామీజీ. కాని, చిత్రం, లింగంమీద పెట్టిన వెన్నముద్ద సెకండ్లలోనే నెయ్యిగా మారి, కిందికి జారి పోతోంది. సభ మళ్ళీ ఆశ్చర్యచకితమై పోయింది. నెయ్యి వెన్నగా మారింది. వెన్న నెయ్యిగా మారుతోంది. ఇది స్వామీజీ మహాత్మా ? లింగం మహాత్మా ? ఎవరు తేల్చగలరు?

జనం ఈ సందేహంలో కొట్టుమిట్టాడుతూ వుండగానే స్వామీజీ జనం మధ్యలోకి దూసుకొనివచ్చి, హోమ జలాలను అందరికీ చల్లి అవభృథ స్నానం చేయించారు. ఈ అవభృథ స్నానంతో, కునికిపాట్లు పడబోతున్న కుర్ర కుంకలకు మత్తు వొదిలిపోయింది. తరువాత స్వయంగా సంకీర్తన చేసి, చేయించారు. సంకీర్తన మధ్యలో విచిత్రమైన హాస్యం రేపి, తెల్లవారు జామునే వస్తున్న నిద్దుర తూగును సభలోంచి దులిపి పారవేశారు.

ఇక్కడింత సంబరం జరుగుతుంటే, చూడకపోతే మా జన్మలకు సాఫల్య మేమిటని ఉషకులు, పసుగులమీద వచ్చి, చాముండీ కొండ కొప్పుమీది నించి నిక్కి నిక్కి చూడ సాగాయి, తొలి పొడుపు తెలిరేకలు. త్వర త్వరగా అలంకారం పూర్తిచేసి, లఘువుగా సహస్ర నామార్చన చేసి, శివరాత్రి వ్రతం పూర్తిచేశారు స్వామీజీ. శేవరే జనం! శేవ బుద్ధి కాదే ఎవరికీ! ఇక లాభంలేదని స్వామీజీ లోపలికి వెళ్ళిపోయారు. అప్పుడు జనం రణగొణ ధ్వనిగా లేచి స్నానాలకు వెళ్ళారు. ఆ సరికే వంటశాలలో వంటలై అందరికీ భోజన ప్రసాదం సిద్ధంగా వుంది. ఇక్కడ ఇంటర్వ్యూ ప్రసాదం గూడా సిద్ధంగా వుంది. ఒక్క చిన్న తడిక చాటుగా ఒక కుర్చీమీద కూర్చుని ఇంటర్వ్యూ లిస్తున్నారు స్వామీజీ. ఆ సాయంత్రం దాకా అటు వంటశాలలో వడ్డనలు సాగుతూనే వున్నాయి. ఇటు ఇంటర్వ్యూలూ సాగుతునే వున్నాయి. నిన్న రోజల్లా పచ్చి మంచినీళ్ళు లేవు, రాత్రి నిద్రలేదు. పైగా నిలువుకాళ్ళ జీతం. మళ్ళీ యీ పూట సూర్యాస్తమయం అవుతోంది. ఇంతవరకు ఆచమనంలేదు. అలా కూర్చునే వున్నారు స్వామీజీ. అది దేహమా? లోహమా? ఎవరికి వారికి ఈ ఊహ తమ ఇంటర్వ్యూ అయిపోయినాక వస్తోంది. యీ లోపల రావటం లేదు. చివరకు ఆశ్రమం కుర్ర వాళ్ళు కొందరు కూడబలుక్కుని, స్వామీజీ దగ్గర అడ్డంపడి, గోలచేసి, తిట్లు తిని, స్వామీజీని లోపలకు లాక్కుపోయారు.



# ౨౩వ అధ్యాయం — శాంతి శ్శాంతి శ్శాంతిః

మానసే సరసి మజ్జత స్స్వయం
మానసాచ్చ పర మీయుషో పదమ్
శాంతిర స్తి తవ యా నిరత్యయా
సా మమాఽస్తు జగతోఽస్తు సద్గురో ॥

[సద్గురుదేవా ! మీరు మానస సరస్సులో స్వయంగా స్నానం చేసి మనస్సున కందని పరమపదాన్ని అందుకొన్నారు. అందువల్ల మీకు దక్కిన అఖండ శాంతి నాకు కలుగుగాక ! సమస్త జగత్తుకూ కలుగుగాక !]

## బండికదిలింది

కెసరేలో జరిగే పూర్ణిమనాటి సత్యనారాయణ వ్రతాలు ఆశ్రమంలో పూర్ణిమ హోమాలుగా మారాయి. పూర్ణిమనాడు స్వామీజీయేకాక, ఋత్విక్కులు కూడా సాయంత్రం దాకా ఉపవాసం వుండి గణపతి హోమం చేసేవారు. ఆశ్రమంలోకి వచ్చాక స్వామీజీకి మడి నియమం మరింత పెరిగింది. విచిత్ర మేమంటే ఆయన తల్లి కన్నడదేశీయురాలు, ఆయన తండ్రి ఆంధ్రదేశీయుడు. కాని, స్వామీజీ ఆచారం మాత్రం ప్రధానంగా మహారాష్ట్ర దేశీయం. స్వామీజీ తమ గదిలో కొన్ని ప్రత్యేక పూజలు యేవో చేయసాగారు. అందువల్ల వారి గదిలోకి యెవరూ ప్రవేశించరాదని నియమం ఒకటి బయలుదేరింది. అదిగాక ఈ ఆశ్రమంలోకి వచ్చిన దగ్గర నుంచీ అక్కడ స్వామీజీని అంటిపెట్టుకు తిరిగే కుర్రవాళ్ళ గుంపొకటి ప్రత్యేకంగా తయారయింది. అది క్రమంగా పెరిగింది. దాంతో ద్వారకా లాంటి కెసరే కుర్రవాళ్ళకు పనులు తగ్గినాయి. దాంతోపాటే ప్రాధాన్యం గూడా తగ్గింది. దానివల్ల ఆ కుర్రవాళ్ళు రావటం తగ్గిపోతోంది. ద్వారకా మాత్రం వస్తూనే వున్నాడు గాని, అతని మనస్సులో అసంతృప్తి పెరుగుతోంది.

తన చుట్టూ కుర్రవాళ్ళ గుంపు పెరుగుతున్న కొద్దీ స్వామీజీ మస్తిష్కంలో కొత్తకొత్త రేకులు విచ్చుకుంటున్నాయి. ఫలితంగా సూర్య నమస్కార బోధనలు యోగాసన తరగతులుగా మారాయి. నలభై, యాభై మంది కుర్రవాళ్లు వచ్చి రాత్రిళ్లు అగ్నిహోత్ర వేదికకు ముందున్న

పాకలోనే పడుకుంటున్నారు. మరో నలభై, యాభై మంది తెల్లవారుజామున స్నానాలు చేసుకొని అయిదింటికల్లా వస్తున్నారు. ఆశ్రమంలో పడుకున్న కుర్రవాళ్ళను తెల్లవారుజామున నాలిగింటికల్లా స్వామీజీ స్వయంగా లేపుతున్నారు. వాళ్ళందరూ స్నానాలు పూర్తి చేసుకొని, సిద్ధమయ్యేసరికి బయటి విద్యార్థులు వస్తున్నారు. సరీగా అయిదింటికి స్వామీజీ కాషాయ వస్త్రాల నిక్కరు, బనీను వేసుకొని పాకలో నిలబడతారు. వెంటనే గురువందనంతో యోగబోధ ప్రారంభ మవుతుంది. ఇలా మూడు నెలల కొక జట్టు చొప్పున తరగతులు నడుపుతున్నారు. అన్ని ఆసనాలు స్వయంగా స్వామీజీ వేసి చూపిస్తున్నారు. ఆసనాలలో నైపుణ్యం చూపించిన వారిని విడిగా విడదీసి వాళ్ళకు ప్రాణాయామాదులలో శిక్షణ యిస్తున్నారు. యోగం గురించీ, యోగాసనాల గురించి సిద్ధాంత భాగం కొంత బోధించి, ఆ భాగంలో వ్రాత పరీక్ష, క్రియా రూపంగా ఆచరణ పరీక్ష గూడా స్వామీజీ స్వయంగా నిర్వహిస్తున్నారు. ఈ పరీక్ష పేపర్లు దిద్దటం, వెనకబడ్డ వాళ్ళకు ప్రత్యేకంగా వివరించటం మొదలైన పనులవల్ల ఆయనకు చాలా కాలవ్యయం అవుతోంది. అయినా ఆయన ఆ కృషి మానటం లేదు. పేడ చిక్కగా అలికిన ఆ పాకలో చాపలు పరుచుకొని బారులు తీరి పిల్లలు ఆసనాల అభ్యాసం చేస్తుంటే ప్రాచీన కాలపు ముని పల్లెల గురుకులాలు ప్రత్యక్ష మవుతున్నాయి. ఈ విధంగా స్వామీజీ సంకీర్తన మంటపంగా, సభాస్థలిగా, యోగ పాఠశాలగా, విద్యార్థులకు, భక్తులకు శయనాగారంగా పని చేస్తున్న ఆ పాకకు 'చొప్పరం' అన్న పేరు స్థిరపడి పోయింది. అన్ని భాషలలోనూ ఆ శాలకు అదే పేరయిపోయింది.

వైశాఖ శుద్ధ పంచమీ, శంకరజయంతి వచ్చింది. ఆ రోజు స్వామీజీ దీక్షా గురువైన మాతృమూర్తి వార్షిక తిథి. ఈ సంవత్సరం స్వామీజీ ఆ ఉత్సవాన్ని సువాసినీ పూజా రూపంగా నిర్వహించారు. వందల కొద్దీ సువాసినీలు ఆశ్రమంలో చేరి లలితాసహస్రనామ మాలతో జయలక్ష్మి మాతకు లక్ష కుంకుమార్చనలు చేసుకోగా ఆ తల్లులందరిలో తన తల్లిని చూస్తూ మానసార్చన సాగించుకున్నారు స్వామీజీ. ఆ తల్లులంతా అమ్మ ప్రసాదమని ఆదరంగా ఆరగిస్తుండగా, సహస్ర శీర్షయై ఆరగిస్తున్న తన తల్లిని చూసుకొని ఆనంద పడ్డారు స్వామీజీ.

ఆ నెలలోనే నృసింహజయంతి వస్తుంది. నృసింహజయంతికి ఒకరోజు ముందే ఆశ్రమంలో దిగాడు నంజుండయ్యగారు. క్రిందటేడు స్వామీజీ పూజ చేసేసరికి నరసింహ స్వామికి ఒళ్ళు పొంగిపోయిన ఘట్టం చూసిన తరువాత, యీ జయంతి పర్వాన తను పూజ చేసిన దానికంటే, తమ్ముడు పూజ చేస్తేనే ఆ స్వామికి యెక్కువయిష్టంగా వుంటుందని అనిపించిందట. ఆ విగ్రహాలు, సాలగ్రామాలు తీసుకొని వచ్చేశాడు నంజుండయ్యగారు. ఆయనతోపాటు ఆయన పెద్దకొడుకు శ్రీనాధ్‌గూడా వచ్చాడు. స్వామీజీ నృసింహజయంతికి నవరాత్రి దీక్ష చేస్తారని ఆయనకు అంతకు ముందు తెలియదు. ఆ దీక్షా వైభవం ఆ పూజల విస్తారం చూసి సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాడు.

మామూలుగానే స్వామీజీని చూస్తే ఎవరికివారు వెనక్కి తప్పుకుపోయే రోజులవి. స్వామీజీకి కోపం వచ్చినప్పుడు కేకలేస్తే తప్పుకు పోవటం కాదది. ఆయనను చూస్తుంటేనే భయంగా వుంటుంది. ఎందుకో ఎవరికీ తెలీదు. కొత్తగా వచ్చిన వాళ్ళుగూడా అంతే. పెద్ద పోలీసు ఆఫీసర్లు, మిలటరీ ఆఫీసర్లు, ఒకోసారి రౌడీలు గూడా వచ్చేవారు. అందరూ అంతే. స్వామీజీని చూడంగానే, నీళ్ళుగారిపోయి వెనక్కి వెనక్కి నడిచేవారు. రోజూ చూసే ఆశ్రమవాసుల పరిస్థితి గూడా అంతే. స్వామీజీ దగ్గరకు రమ్మని పిల్చినా వెళ్ళటానికి భయంగా వుండేది.

ఇక నృసింహ నవరాత్రులలో స్వామీజీ ఆకారమే, ఒక అగ్ని జ్వాలలాగా వుంటుంది. నృసింహారాధనమంటే, అగ్ని ఆరాధనమే అని స్వామీజీ చెప్పుతూ వుంటారు గూడా. ఆయన ముఖము, కళ్ళు సింహోగ్రంగానే వుంటాయి. ఆ నవరాత్రులలో స్వామి ముందు నిలబడి పసుపుకొమ్ములు స్వయంగా దంచి, ఆ పసుపుతో నరసింహస్వామికి హరిద్రార్చన * చేస్తారు స్వామీజీ.

ఈ విధానం స్వామీజీకి వంశ పరంపరాగతమైనది. స్వామీజీ తండ్రి నరసింహశాస్త్రి గారు ఈ హరిద్రోత్సవానికి స్వయంగా అనేకవిధాల పాటలు వ్రాసి పాడి, పాడించి చాలా విశేషంగా ఆచరించుకొనేవాడు. ఆ సందర్భంగా చిన్నప్పుడు తండ్రి నేర్పిన పాటలు కొన్ని పాడుతూ వుంటారు స్వామీజీ.

ఇక ఈ నృసింహ నవరాత్రులు వస్తే, దయ్యాలు పట్టినవారు ✓ ప్రత్యేకించి తండోప తండాలుగా రావటం కెసరే నుంచి వస్తున్న అలవాటే. అది యిక్కడా కొనసాగింది. ఇక్కడకు వచ్చాక దయ్యాలను వొదిలించే విధానం మరింత శీఘ్రతరమైంది. పూజంతా అయినాక యీ దయ్యాలవారందర్నీ ఒకచోట నిలబెట్టి కమండలోదకం చిలకరించటం సామాన్య పద్ధతిగా వుండేది. దీంతో పనయిపోయేది. ఈ గుంపులో ఒకసారి నలభై, ఏభై మంది దాకా వుండే వారు. ఇంటిదగ్గర వుండగా దయ్యపు చేష్టలు వుండి, ఆశ్రమంలోకి వచ్చేసరికి ఆరోగ్యంగా వుండేవారి సంఖ్య గూడా హెచ్చుగానే వుండేది. అలాంటివారు వస్తే, వారికోసం ఒక ప్రత్యేక హోమం తెల్ల నువ్వులతో చేయించేవారు స్వామీజీ. ఆ హోమం పూర్తయ్యేసరికి వారిని పీక్కు తినే దయ్యాలు వేల మైళ్ళ దూరంలో వున్నా సరే వచ్చి వీరి వొంటిమీద ఆవహించేవి. వెంటనే కమండలోదకం చల్లేవారు స్వామీజీ. దాంతో ఆ దయ్యం వొదిలి వెళ్ళిపోయేది.

"పూర్వం దయ్యాలచేత వాటి కథ చెప్పించేవారు గదా! ఇప్పుడు చెప్పించటం లేదే" మని ఒకసారి చంద్రశేఖరయ్య అడిగాడు.

---

* ఈ పద్ధతిన నృసింహ నవరాత్రుల విస్తృతి 1978 తరువాత తగ్గిపోయింది.

✓ 1972 దాకా యీ దయ్యాల కేసులు వందల సంఖ్యలో వచ్చాయి స్వామీజీ దగ్గరకు. ఆ తరువాత అవి రావటం తగ్గిపోయింది.

" ఎందుకు లేనిపోని గోల? ఇవన్నీ దుర్బల పిశాచాలు. మన పుణ్యం కొంచెం ధార పోసేస్తే, వాటికా జన్మ వదిలిపోతుంది" అన్నారు స్వామీజీ.

స్వామీజీ పూర్తిగా ప్రశాంతంగా వున్నారని గ్రహించి, "దయ్యాలకు పుణ్యం ఇవ్వటమేమిటండీ, పాముకు పాలు పోసినట్టు" అన్నాడు చంద్రశేఖరయ్య.

" ఏం చెయ్యమంటావు? వాటిని బంధించి, హింసించి వినోదించమంటావా? అసలే అవి యాతనా శరీరాలు. ఏదో పుణ్యలేశం వుండబట్టి యీ క్షేత్రానికి చేరినాయి. ఇక వాటికా జన్మ చాలు" అన్నారు స్వామీజీ.

" మహాత్ముల దయ ఇలా ఆలోచిస్తుంది గాబోలు" అనుకున్నాడు చంద్రశేఖరయ్య.

ఈ వ్యవహారాలన్నీ చూసిన నంజుండయ్యగారికి క్రమంగా తల తిరగసాగింది. తిరుగుతున్న కొద్దీ స్వామీజీ పట్ల తమ్ముడనే భావం పోతోంది. "ఈయన ఏదో మహాపురుషుడల్లేనే వుందే" అనిపించసాగింది. అంత తేలిగ్గా పోనిస్తారా బంధుత్వ మోహాన్ని? నవరాత్రులయినాక, విగ్రహాలను తీసుకొని ఊరికి బయలుదేరుతున్న నంజుండయ్యగారితో "ఈ శ్రీనాథుని నా దగ్గర వదిలి పెట్టిపో, నాకు తోడుగా వుంటాడు" అన్నారు స్వామీజీ. అప్పటికే ఆశ్రమంలో అమాయకపు తూనీగలాగా ఎగురుతున్న శ్రీనాథ్ దిగులులేకుండా వుంటానని ఉత్సాహపడ్డాడు. కాని నంజుండయ్యగారికే, ఇంత మరీ 12, 13 ఏళ్ళ కుఱ్ఱ నాగన్నను తమ్ముడి మీద వదలటానికి మనస్కరించ లేదు. "మరోమారు చూద్దాంలే అప్పా" అని మృదువుగా తిరస్కరించి, పిల్లవాణ్ణి తీసుకొని వెళ్ళిపోయాడాయన.

## వాద్య ప్రాప్తి

ఆ తరువాత ఒక రోజున కొద్ది మంది పిల్లలను వెంట బెట్టుకొని గోశాయి ఘట్టానికి స్నానానికి వెళ్ళారు స్వామీజీ.

తూర్పు దిక్కుగా ప్రవహిస్తున్న కావేరి నది మైసూరుకి 7, 8 కి॥ మీ॥ దూరంలో రెండు పాయలుగా చీలింది. అందులో ఒకపాయ శ్రీరంగ పట్టణంలో పశ్చిమవాహినిగా వెనక్కు తిరిగి మళ్లీ కొద్ది దూరంలోనే, తూర్పు వాహినిగా సాగుతుంది. రెండోపాయ కొంత దూరం పోయాక, అందులో కపిల అనే ఉపనది కలుస్తుంది. ఆ తరువాత, మళ్ళీ కావేరి రెండు పాయలు కలిసి, కొద్ది దూరం ఉత్తర వాహినిగా సాగుతాయి. ఇదంతా మైసూరు పరిసరాలలోనే జరుగుతుంది. అలా కావేరి ఉత్తర వాహినిగా ప్రవహించే చోటును "గోశాయి ఘట్టం" అంటారు.

ఆ ప్రదేశం ప్రస్తుతం ఊరికి దూరంగా సరియైన బాట లేకుండా, పొలాల మధ్యలో వుంది. అది పూర్వం వొకప్పుడు బాగా బతికిన క్షేత్ర మనటానికి గుర్తుగా రెండు పెద్ద దేవాలయాలు, తమ మెట్లు అనే కాళ్ళను నదిలోకి బారజాచుకొని, విశ్రాంతిగా కూర్చుని

వుంటాయి. పురాతన భారతీయ సంస్కృతి స్వర్ణ యుగాలకు చివ గుర్తులుగా మిగిలి వున్న ఆ గుళ్ళు ప్రస్తుతం కీళ్ళు సడలి వేళ్ళాడుతూవుంటాయి. అది ఉత్తర వాహిని అవటం చేత మహాక్షేత్రమని స్వామీజీకి ప్రత్యేకంగా ప్రీతికరమైన స్థానం.

స్వామీజీతో నదీ స్నానానికి వెళ్ళటమంటే పిల్లలందరికీ ఎంతో ఉత్సాహం. సామాన్యంగా నదీ స్నానంలో స్వామీజీ చాలా ఉల్లాసంగా వుంటారు. ఏవేవో విచిత్రమైన మహత్తులు చేసి నవ్విస్తారు. దోసిళ్ళ కొద్దీ సాలగ్రామాలు, శివలింగాలు, విగ్రహాలు నీళ్ళలోంచి తీసి పోస్తారు. పటిక బెల్లాలు, కర్జూరం, జీడి పప్పులు వర్షంలాగా రాలుస్తారు. ఇక ఉత్సాహం కాక మరేముంది పిల్లలకి ?

గోశాయి ఘట్టంలో స్నానం సామాన్యంగా ప్రమాదకరం కాదు. ఎక్కువ లోతు వుండదు. వయసు వచ్చీరాని అల్లరి గొల్లపిల్ల లా కావేరీనది చిరు బండల మీద గంతులు వేసుకుంటూ దూసుకు పోతూ వుంటుంది. అందుకని అక్కడికి పిల్లల్ని తీసుకెళ్ళటానికి జంకరు స్వామీజీ.

ఉత్సాహంగా స్నానానికి వెళ్ళిన పిల్లలకు ఆ రోజు పూర్తిగా నిరాశ అయింది. ఏ మహత్తులూ లేవు. నవ్వులు లేవు. అమ్మమ్మల్లాగా స్నానాలు చేసి, వొడ్డు మీదికి వచ్చి తుడుచుకోవటం అయింది. స్వామీజీ గూడా వొళ్ళు తుడుచుకుంటున్నారు. ఇంతలో అల్లంత దూరంలో అలల మీద యేవేవో కొంచెం పెద్ద వస్తువులు తేలి వస్తున్నై.

" అరేయ్, అరేయ్ ... ఏమిటో చూడండ్రా, చూడండ్రా " అన్నారు స్వామీజీ.

పిల్లలంతా అటుచూశారు. ఒక హార్మోనీపెట్టె కొట్టుకొస్తోంది. ఇహ స్వామీజీ ఆజ్ఞ అక్కరలేదు. పిల్లలు చేప పిల్లలలాగా నీళ్ళల్లోకి దూకారు. ఆ పెట్టె దగ్గరకొచ్చేదాకా చేతులే వలలుగా పట్టారు. పెట్టెను పట్టేసి, ఒడ్డుకు పట్టుకొచ్చారు.

" రేయ్, మళ్ళీ ఏదో వస్తోందిరా " అని వో చిన్న కేక పెట్టారు స్వామీజీ. ఈ మాటు ఒక సితార కొట్టుకొచ్చింది. దాని వెనక రెండు తబలాలు కొట్టుకొచ్చాయి. చివరకు రెండు చిరతలు, రెండు తాళాలు కొట్టుకొచ్చాయి. అన్నీ స్వామీజీ పాదాల దగ్గరకు చేరాయి. చిరతలను, తాళాలను మాత్రం తీసి కళ్ళకద్దుకున్నారు స్వామీజీ.

" ఏరా, ఇవి ఎవరన్నా నీళ్ళల్లో వదిలేశారేమోరా " అన్నారు స్వామీజీ. పిల్లలంతా అయోమయంగా చూశారు.

" ఔన్రా, ఇవి తడిసి లేవేమిటి ?" అన్నారు ఆయనే మళ్ళీ.

" ఇత్తడి తాళాలు నీళ్ళల్లో తేలినాయి స్వామీజీ " అన్నాడు మరో ఉడుత.

" తేలాయా, మళ్ళీ తేలుతాయేమో చూద్దాం " అని రెండడుగులు వేశారు స్వామీజీ. మీదికి దూకేసి బ్రతిమాలి, ఆ తాళాలు లాగేసుకున్నాడు, మరో కోతి పిల్ల.

"అమ్మో, మునిగిపోతే" అదీ వీడి భయం. అలా కాసేపు పిల్లలతో ఆడుకొని, ఆ చిరతలు పుచ్చుకొని, ఆ గుళ్ళో దేవతలకు, యీ కుర్ర దేవతలకూ హరికథ చెప్పి వినిపించి మైమరపింప చేశారుస్వామీజీ. ఒకరిని రాగ తాళ గతి విభ్రమాలతో, మరొకరిని హాస్య పూర్ణరస సంభ్రమాలతో. అలా ఆశ్రమానికి చేరిన వాద్యాలు స్వామీజీకి పగటిపూట సందులేని కార్యక్రమాలను సంతరించిపెట్టినాయి.

జీవితంలో మొదటిసారిగా సితారు పట్టి, వంటరిగానే వ్రేళ్ళ మొర్రి టింగు టింగు లాడించ సాగిన స్వామీజీ, రెండో రోజుకు కీర్తనలు పలికించసాగారు. తబలా దరువులతో తడికెల పాక దద్దరిల్లసాగింది. హార్మోనీ పెట్టె అరగంటలో నోరు వెళ్ళబెట్టింది.

జనం వున్నా లేకపోయినా, స్వామీజీ ఒక్కరే కూర్చుని గంటలతరబడి సంకీర్తన చెయ్యటం మొదలయింది. సంకీర్తనలో పూర్వం వలె కేవలం నామం చెప్పటం కాక, పల్లవి అనుపల్లవి చరణాలతో కొత్త కొత్త కీర్తనలు పుట్టటం పెరిగింది. కీర్తనలు చాలా చిన్నవిగా విడివిడి మాటలుగా వుండటం అప్పటి కీర్తనల ప్రత్యేక లక్షణం. ఆయా దేవతల మంత్రాల లోంచీ, ధ్యాన శ్లోకాలు లోంచీ, వాటికి జీవనాడులవంటి బీజాక్షర సంపుటిగల పదాలను తీసుకొని, వాటిని తాళగతిలో అమర్చి, పాటపాడి వెయ్యటం అప్పటి సరదా. ఒక్కొక్క మనిషిని చూస్తే ఒక రకమైన పాట వచ్చేది. ఒక రకమైన రాగం వచ్చేది. వాడికొక కష్టం తీరిపోయేది. "నీకీ పాట మందు, వదలకుండా పాడుకో" అని స్వామీజీ చెప్పిన సందర్భాలనేకం వున్నాయి.

ఒక రోజు స్వామీజీ ఉన్నట్టుండి హార్మోనీ పెట్టె పట్టుకొని, ఎవరూ లేని సమయంలో సంకీర్తన ప్రారంభించారు. సుమారు రెండు గంటలసేపు అలాగే సంకీర్తన చేసి, "ఇక ప్రమాదం దాటిపోయింది" అన్నారు.

"అదేమిటన్నాడు" చంద్రశేఖరయ్య.

"కాసేపాగు. నీకే తెలుస్తుందిగా" అన్నారు స్వామీజీ.

ఒక గంట పోయాక, గుండ్లూరిపేట నుంచి రామణ్ణగారు ఒంటి మీద చిన్న చిన్న దెబ్బలతో వచ్చాడు. ఆయన బస్సులో వస్తుంటే, దార్లో పెద్ద ఆక్సిడెంటు అయిందట. చావు తప్పి కన్ను లొట్టబోయి బయట పడ్డాడట. ఈ దార్ని వస్తున్న మరో బస్సెక్కి దడదడలాడుతున్న గుండెతో స్వామీజీ దర్శనం కోసం వచ్చాడాయన.

ఆశ్చర్యపోయిన చంద్రశేఖరయ్య, - "మీ కోసమే నన్నమాట, రెండు గంటలసేపటి నుంచీ సంకీర్తన చేస్తున్నారు స్వామీజీ" అన్నాడు.

ఆ చంద్రశేఖరయ్య ద్వారా విషయ మంతా తెలిసిన రామణ్ణగారు "ప్రాణదాతా, స్వామీజీ" అంటూ పాదాలమీద వాలాడు. అప్పట్లో ఇలాంటి సంఘటనలు అనేకం జరిగినాయి.

సితారు దోచినట్టుగా స్వామీజీ మనస్సును మరో వాద్యం దోచలేదు. ఒకోసారి అయిదారు గంటలసేపు గూడా సితారుతో కాలక్షేపం చేస్తున్నారు స్వామీజీ. రాను రాను భూగృహ సమాధి స్థితికి యీ సితారు ప్రత్యామ్నాయంగా తయారవుతోంది. బెంగుళూరు, మండ్య, మద్దూరు, దొడ్డబళ్ళాపూరు వంటి చుట్టుపక్కల వూళ్ళకు వెళ్ళినా గూడా సితారును వదిలి పెట్టటం లేదు స్వామీజీ. పగలు తీరిక లేని రోజుల్లో అర్ధరాత్రి సితారు వినోదం ప్రారంభిస్తున్నారు. ఎంతసేపు వాయించినా తన సొంత కీర్తనలు, సొంత రాగాలే వాయించే వారు స్వామీజీ. రెండవ స్థానం శంకరాచార్యుల స్తోత్రాలకు వస్తుంది. వాటిని తమ స్వీయరాగ పద్ధతిలో వాయించేవారు. ఇతర భక్తుల కీర్తనలు, వారి వారి రాగాలలోనే వాయించటం కూడా అప్పుడప్పుడు వున్నా, రాగ విన్యాస పద్ధతి మాత్రం తన సొంతమే.

ఈ రోజుల్లోనే ఆదివార సంకీర్తనలలో స్వామీజీ సంకీర్తన సంగీత విన్యాసాలకు విభ్రాంతుడైన భాగవత్ గారు, స్వామీజీ సంకీర్తనలను శ్రద్ధతో వినటం మొదలయింది. స్వయంగా మధుర గాయకుడైన భాగవత్ గారికి స్వామీజీ సంగీతంలోని లోతులు దురవగాహాలుగా తోచసాగినాయి. ఏమయితేనేమి ఆ రాగ ప్రస్తార భంగిమలు ఆయా రసాలను పొంగి పొరలింప చేస్తున్నాయి. సంగీత ప్రయోజనాలకు అది ఒక పరాకాష్ఠ కదా!

భాగవత్ గారు క్రమంగా స్వామీజీకి సన్నిహిత మవుతున్న కొద్దీ "మీరు సద్విషయ ప్రబోధం పెంచండి" అని ప్రార్థించసాగాడు. విశేష అనుభవ సంపన్నుడైన భాగవత్ గారు అలా ప్రార్థించటంలో గల గాంభీర్యాన్ని స్వామీజీ గమనించారు.

కీర్తనలలోని బీజాక్షర సంపుటీ మహిమ వలన, రాగాధి దేవతల అనుగ్రహ దృష్టుల వలన భక్తులకు ఆపదలు తొలుగుతున్నాయి. శ్రోతల హృదయాలు ఈ సంగీత రసంలో భావితములై, మెల్లిగా మృదుత్వాన్ని పొందుతున్నాయి. దీనివల్ల సదాలోచనలు పుట్టటం పెరుగుతోంది. ఇది బాగానే వుంది. కాని, లోకంలో ఎటు చూసినా ఏదో ఒక సందేహాన్ని, సంకటాన్ని కలిగించే సన్నివేశాలే కనిపిస్తున్నాయి. వద్దన్న కొద్దీ అక్కరలేని ప్రబోధాలు వచ్చి చెవిన బడుతున్నాయి. అలాంటప్పుడు వారి హృదయాలను నిలబెట్టి వుంచగల విషయ వివేచనను అందించకపోతే అది ఒక్కొక్కసారి ప్రమాదించవచ్చు. కేవలం ప్రబోధమే అయితే కరడు కట్టి కట్టెబారి వున్న హృదయానికి ప్రబోధసారం అంటకపోవచ్చు. అంటినా, దుస్తర్కాలకు దోవ చూపవచ్చు. అందువల్ల ప్రబోధ మిశ్రితమైన సంకీర్తన మనే విచిత్ర విధానాన్ని రూపొందించుకున్నారు స్వామీజీ.

ఇది హరికథా పద్ధతిని కొంత పోలి వున్నా, హరికథకూ దీనికి మౌలికమైన భేదం వుంది. హరికథలో కథమీద ఆధారపడి కొంత విషయ వివేచన, కొంత సంకీర్తన ఉంటాయి. మళ్ళీ యీ రెండూ ఒకదాని మీద మరొకటి ఆధారపడి వుంటాయి.

స్వామీజీ ప్రవచనంలో ప్రబోధ భాగాన్ని, సంకీర్తన భాగాన్నీ విడి విడిగా వేరు చేసుకొని, విడివిడిగా వింటే దేనికదె పరిపూర్ణంగానే వుంటుంది. దేని ఫలితం గూడా దానికి పరిపూర్ణంగానే వుంది. కాని, యీ రెండూ కలిసినప్పుడు, ఒక అపూర్వమైన పరిపూర్ణత, ఒక అపూర్వమైన ప్రయోజనమూ పుడుతున్నాయి. అందుచేత దీన్ని హరికథ అనటానికి వీలు లేదు, సంకీర్తన మనటానికీ వీలులేదు. ప్రబోధన మనటానికీ వీలులేదు. ఇది స్వామీజీ ప్రవచనం, ఇది స్వామీజీ సంకీర్తన, వారిదైన సొంత ముద్ర వున్న ప్రత్యేక ప్రక్రియ అది. అది ఇతరులకు అనుకరిద్దామన్నా సులభం కాదు.

స్వామీజీ ప్రవచనంలో క్రమంగా తెలుగు, కన్నడ, మరాఠీ, హిందీ, సంస్కృత భాషలలోని సుప్రసిద్ధ భక్త గాయకుల కీర్తనలన్నీ చోటుచేసుకుంటున్నాయి. ఈ భాషలు, ఈ కీర్తనలు ఆయనకు ఎప్పుడు ఎవరు, ఎలా నేర్పారో ఆయనకే తెలియాలి. ఇలా ఆయనకే తెలియాల్సిన మరికొన్ని విషయాలలో ముఖ్యమైనది అన్నపూర్ణ మందిరం. పొయ్యిలో పిల్లి సరిగా లేచీ లేవకుండా కాలక్షేపం చేసే ఆ కొబ్బరాకుల చిన్నపాక పేరు అన్నపూర్ణ మందిరం. అది పూజా వేదికకు వెనక పక్కగా వుంది. అక్కడ ఎల్లకాలమూ కదలకుండా వుండేది, స్తంభానికి తగిలించి వున్న జయలక్ష్మీమాత పటం మాత్రమే. చివరికి చీమలు గూడ అక్కడకు అప్పుడప్పుడు వచ్చి పోతాయి తప్ప పుట్టలు పెట్టవు.

జయమ్మగారు ఆ పాకలో మెల్లిగా స్వామీజీకి భిక్ష చేస్తూ వుంటుంది. ఉన్నట్టుండి స్వామీజీ కబురు చేస్తారు. "నాలుగు వందల మందికి వంట చెయ్యండి" అని. ఒకరో ఇద్దరో ఆడవారు సాయం వస్తారు. డబ్బాలో బియ్యం వొంచి గట్టిగా దులిపితే పదిమందికో, పదిహేను మందికో సరిపోయే బియ్యం వస్తాయి. వాళ్ళెవరూ ఏమీ కంగారు పడరు. ఉన్న దేదో వండేస్తారు. నియమ మేమిటంటే డబ్బా దులిపెయ్యాలి, అంతే. వడ్డించ మన్నప్పుడు వడ్డన ప్రారంభిస్తారు. నాలుగు వందల మందీ కడుపు నిండా తిని వెళ్ళుతారు. ఎలా తింటారో స్వామీజీకే తెలియాలి. ఆయనకే తెలియాల్సిన విషయమే మరొకటి ఇంతకన్నా విచిత్రంగా జరిగింది ఒకసారి.

ఒకరోజు రాత్రి పన్నెండు దాటాక, పెద్ద పెద్ద అరుపులు అరుచుకుంటూ గదిలోంచి బయటకు వచ్చారు స్వామీజీ. "మీ బండ నిద్దరలు తగలేసుకు పోను. ఏమి నిద్దర లవి? లేవండి లేవండి. వశిష్టులవారూ, వామదేవులవారూ వచ్చారు. కనిపించట్లా? లేవండర్రా, లేవండి."

ఈ అరుపులకు చొప్పరంలో పడుకున్న భక్తులు కంగారుగా నిద్ర లేచారు. ఆ రోజు బెంగుళూరు మేయరు నాగన్నగారు, వారి కుటుంబ సభ్యులు గూడా చొప్పరంలో పడుకొని వున్నారు. స్వామీజీ ఇలా అరుస్తూనే కంగారుగా అన్నపూర్ణ మందిరంవైపు నడిచారు. అక్కడేదో పార కనిపించింది. అది తీసుకొని, కొంత దూరం నడిచారు. ఆశ్రమంలో

ఉన్న భక్తులంతా స్వామీజీ వెనకాల నడిచారు. స్వామీజీ కొంచెం పిచ్చి ధోరణిగా అటూ, యిటూ తిరిగి తిరిగి, చివరికి ఒకచోట ఆగి పారతో తవ్వసాగారు. ఒక భక్తుడు "నేను తవ్వుతాను, మీరు తప్పుకోండి" అని పార లాక్కోబోయాడు. స్వామీజీ అంగీకరించలేదు. తనే తవ్వసాగారు. ఇంతలో ఒక డక్కడికి లాంతరు తెచ్చాడు.

మైసూరులో కొండరాతి నేల తవ్వటం తేలిక గాదు. పైగా అదంతా పచ్చగడ్డి పెరిగి వున్న చోటు. అలాగే కష్టపడి తవ్వుతున్నారు. తవ్వగా వచ్చిన మట్టిని, చాలా జాగర్తగా ఒకచోట పోగుబెడుతున్నారు. అలా కొంతసేపు తవ్వినాక, ఆ గుంటలో మూడు పంచలోహ విగ్రహాలు దొరికినై. ఆ విగ్రహాలు ఎంతో అందంగా వున్నాయి. అవి సీతారామలక్ష్మణుల విగ్రహాలు!! ఇంకా తవ్వారు స్వామీజీ. ఒకే రకంగా వున్న నాలుగు గుడి బొమ్మలు దొరికినై. అవి ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలలోని గుడులలాగా లేవు. జైన దేవాలయా లనూ, ఉత్తరాది దేవాలయాలనూ కొంత పోలివున్నాయి. ఇక తవ్వటం ఆపారు స్వామీజీ. లోపలనుంచి ఒక సంచీ తెప్పించి యీ తవ్విన మట్టిని ఆ సంచీలోకి ఎత్తించి ప్రత్యేకంగా తన ధ్యానం గదిలో పెట్టించారు.

"ఈ మట్టి చాలా విలువైనది. ఇది వశిష్ఠ, వామదేవులు స్వయంగా అనుగ్రహించిన ప్రసాదం. దీనితో చాలా పనుంది" అని చెప్పారు స్వామీజీ.

"ఈ విగ్రహాలు పీఠంలో పూజకోసం వచ్చాయి. ఈ గుళ్ళ సంగతి క్రమంగా మీకే తెలుస్తుంది" అన్నారు స్వామీజీ, వాటిని గురించి అడిగినప్పుడు. ఆ మట్టేమిటో, ఆ గుళ్ళేమిటో ఆయనకే తెలియాలి మరి!

ఈ వశిష్ఠ మహర్షిగారు, వామదేవ మహర్షిగారు రాత్రిపూట వచ్చారు గాని, ఈ ఆశ్రమం ప్రారంభమయిన దగ్గర నుంచీ సామాన్యంగా ఇతర యోగి వృద్ధులంతా పగటిపూటే వస్తున్నారు. వశిష్ఠ, వామదేవులు ఎవరి కంటికీ కనిపించలేదు గానీ, యీ యోగులు కనిపిస్తూనే వుండేవారు.

అలాంటి యోగులలో ఒకాయన మాత్రం ఒక విచిత్రం చేసి మరీ వెళ్ళాడు.

## నాగ కిరీటం

ఒక రోజున ఒక వృద్ధయోగి వచ్చాడు. మనిషి ముసలిగావున్నా మంచి బలంగానే వున్నాడు. జుట్టు నెరనెరా నెరిసిపోయినా ముఖం మిసమిస లాడుతూనే వుంది. నడక చురుకుగానే వున్నా, కళ్ళు ప్రశాంతంగానే వున్నాయి. నడినెత్తికి ముడి పెట్టుకున్న జుట్టు పల్చగానే వున్నా, గడ్డాలు బొడ్డుదాకా వేళ్ళాడుతున్నాయి. ఆయన వచ్చేసరికి స్వామీజీ చావడిలోనే ఒక బల్లమీద కూర్చుని వున్నారు. కొత్తయోగి సరాసరి లోపలికి ప్రవేశించాడు. స్వామీజీ

"రండి" అని ఆదరంగా స్వాగతం పలికి, ఆయనను ఒక బల్ల మీద కూర్చోబెట్టారు అప్పటికి సూర్యుడు నడినెత్తిన చుర్రుమంటున్న సమయం.

"తమరు భిక్ష యేమి తీసుకొంటారు?" అన్నారు స్వామీజీ గౌరవంగా.

"తమరేది తీసుకుంటే, మా కదే చాలు" అన్నాడాయన ఎంతో సౌమ్యంగా.

స్వామీజీ మామూలు అన్నమే తింటారు. అయితే, అందులో ఉప్పు, కారం వుండవు. ఒకోసారి నామమాత్రంగా వుంటుంది. ఈ ఆశ్రమానికి * వచ్చినాక ఆయన అన్నం ప్రత్యేకంగా మట్టి పిడతలో వొండించుకుంటున్నారు. ఆయన తినగా ఆ పిడతలో మిగిలి పోయిన అన్నం ఎవర్నీ తిననీయటం లేదు. ఒక్కొక్కసారి మాత్రం బాగా వయస్సు మళ్ళిపోయిన వృద్ధులను, విధవ స్త్రీలను తినమనేవారు.

"ఆ అన్నం తింటే ఇక ఇళ్ళలో వుండబుద్ధి వుండదు. ఆ వైరాగ్య భావాన్ని తట్టుకోవటం కష్టం" అని చెపుతూ వుండేవారు స్వామీజీ.

ఇవాళ్ళ మాత్రం ఆ యోగికీ, తమకూ ఒకసారే వడ్డింప చేశారు స్వామీజీ. ఆ యోగి చాలా స్వల్పంగా, ఒకటి, రెండు చెంచాల అన్నం తీసుకొని మిగిలింది వదిలేశాడు.

"మేము పూర్తిగా ఉపవాసానికి అలవాటు పడ్డాం. తమ ఆతిథ్యం కాదనరాదని యింతమాత్రం తీసుకొన్నాం" అన్నాడాయన మృదువుగా. స్వామీజీ మాత్రం తను రోజూ తినేదాని కంటే యెక్కువే తిన్నారు. భిక్ష అయినాక ఇద్దరూ వచ్చి మళ్ళీ చావ్పరంలో బల్లల మీద కూర్చున్నారు.

ఆ యోగి కాసేపు కళ్ళు మూసుకొని ధ్యానం చేసుకొంటూ కాసేపు స్వామీజీని చూస్తూ కూర్చున్నాడు. స్వామీజీ ఆవలిస్తూ చిటికలు వేసుకొంటూ కూర్చున్నారు. ఇద్దరూ ఏమీ మాట్లాడుకోవటం లేదు. అలా వొక గంట గడిచినాక ఆ యోగి నోరు విప్పాడు.

"తమరు ఇంత ఆశ్రమం పెట్టుకొని శిష్య ప్రబోధం చేస్తున్నారు కదా, యోగంలో ఎంతవరకూ వచ్చారు తమరు?" మాట తూచితూచి వేస్తూ జాగర్తగా అడిగాడు యోగిగారు.

"అః నా బొంద. నా దగ్గరకు వచ్చేదంతా యీ విధవరాళ్ళు, శూద్రులు, కమ్యూనిష్టులు. దీపారాధన గూడా చేతకాని సరుకు వాళ్ళను పెట్టుకొని వాళ్ళతో ఏదో కాసేపు హరే రామ హరేరామ రామరామ హరేహరే" అంటూ సంకీర్తన చేయిస్తూ వుండటం నా పని. భగవన్నామమే అన్ని పుణ్యాలమ ఇస్తుందని నా విశ్వాసం. ఆ మాటే నా దగ్గరకి వచ్చిన వాళ్ళకు చెప్తుతూ వుంటాను" అన్నారు స్వామీజీ చాలా తేలికగా.

"అలాకాదు. ఇటు చూడండి" అని ఆ యోగి తన తలదగ్గర రెండు చేతులూ పెట్టుకొని ఏదో సవరించుకొన్నాడు. ఉన్నట్టుండి కాంతులు మిరుమిట్లు గొలిపే నానామణి గణఖచిత సువర్ణ కిరీటం ఆ యోగి తల మీద ధగధగ లాడింది.

* ఈ మట్టి పిడత ఎంట సుమారు రెండు మూడేళ్ళు నడిచింది.

" ఇది యోగకిరీటం. ఇది వచ్చినవాడే గురుత్వ పదవికి అర్హుడు కదా " అన్నాడాయన చాలా కొద్దిపాటి ధీమాతో,

" మీ కిరీటానికి ప్రాణం వున్నట్టు లేదే " అన్నారు స్వామీజీ. ఆ మాటకి అర్థమేమిటా అని యోగిగారు స్వామీజీ వంక వింతగా చూశాడు. ఆ కళ్ళు అలాగే విచ్చుకుపోయి పెదల్పయిపోయి బిగిసిపోయినాయి కొద్ది క్షణాలు.

స్వామీజీ శిరస్సుమీద పన్నెండు పడగల మహానాగ మొకటి విలాసంగా పడగ లల్లాడిస్తోంది. ఆ పడగలలో ఒక్కొక్క దానిమీద మూడేసి మణులు తళతళ లాడుతున్నాయి. ఆ పడగల క్రింద స్వస్తిక ముద్రలు చిరునవ్వులు చిందిస్తున్నాయి. ఆ పడగల నాలుకలు మాటి మాటికీ బయటకు వచ్చి ఆ యోగిని యెక్కిరిస్తున్నాయి. ఆ యోగి చటుక్కున లేచి నిలబడి రెండు చేతులు జోడించి " వెళ్ళొస్తాం " అన్నాడు హడావిడిగా.

" కూర్చోండి " స్వామీజీ శాసనం, నాగపాశమై ఆయనను చటుక్కున కూర్చో బెట్టింది.

" ఏమి సాధించారు మీ రిప్పుడు ? " అన్నారు స్వామీజీ గంభీరంగా,

" మా సాధన ఇంకా అల్పంగా వుందని గ్రహించాము" పొడి పొడిగా అన్నాడా యోగి.

" అదిగాదు నేనడిగేది, ఇప్పుడు ఇక్కడికి వచ్చి మీరేమి సాధించారంటున్నాను "

" తమరు ఉన్నతులని గ్రహించాను "

" దానివల్ల మీకేమి ప్రయోజనం ? మీ గురువులు మిమ్మల్ని తీర్థ యాత్రలకు నిష్ప్రయోజనంగానే పంపారా ? "

" ఆశ్చర్యంగావుంది. మా గురువుల మనోభావాలు ఇతరులకు అందవే ! "

" ఇతరుల మనుకునే వాళ్ళకు అందవు "

" మీరు వారి బంధువులా ? "

" బంధువు ఇతరుడు కాదా ? "

" తమరు చెప్పేది తత్త్వ దృష్టిలో సత్యమే "

" అనుభవ దృష్టిలో యేముంది ? "

" భేదం వుంది "

" అనుభవం అంతా అదేనా ? "

" ఒక్క సుషుప్తిలో తప్ప "

" అప్పుడు మాత్రం ఎందుకు తప్పాలి ? "

" అదే ఈశ్వరానుగ్రహం "

" ఆ ఈశ్వరానుగ్రహం ఆ కాస్తతోనే ఎందుకు ఆగిపోవాలి ? "

" అహం ప్రత్యయమే అడ్డు "

" ' అహం ప్రత్యయం ' అంటే గౌరవం ! ' అహంకారం ' అంటే నీచం ! అంతేనా ? "

" నిజమే, దాన్ని అధిగమించే ప్రయత్నంలోనే వున్నాను "

" ఆత్మగౌరవం ఏకవచనంలోకి వచ్చింది, ఇక్కడికి వచ్చి చేసింది ఆ ప్రయత్నమేనా?"

" కుయోగులవల్ల లోకానికి అపకారం జరుగుతుందేమో అని కారుణిక భావంతో పరీక్షించ దలిచాను "

" లోకోద్ధరణ భావం అని చెప్పితే, నాకు సులభంగా అర్థమయ్యేది. "

" ఉన్న శక్తిని లోకానికి వినియోగించకపోతే యేం చేసుకోవాలి ? "

" ఆ ప్రశ్న శక్తి సంపాదించే ముందే వుండాలి. అయినా, యీ ప్రశ్నను మీ గురువుల ముందు ఎందుకు వుంచలేదు మీరు ? "

" వారు ప్రతిదీ వద్దనే అంటారని. "

" తెలివి తలకెక్కింది. గురువు వద్దన్నాక చేస్తే ధిక్కారము. వద్దంటాడని తెలిసి, చెప్పకుండా చేస్తే గౌరవము అన్నమాట... ఆహా... మంచి భక్తి "

ఇక్కడికి వచ్చేసరికి యోగిగారికి కళ్ళు గిర్రున తిరిగినాయి. తను చేసిన పని గురుధిక్కారమే అని అంతకు ముందు ఏదో ప్రారబ్ధలేశం చేత తట్టలేదాయనకు. ఇప్పుడు అది చెవినబడే సరికి తన తప్పు తనకు తెలిసి, అంతటి వృద్ధయోగి గడగడా వణికిపోయాడు. గురుధిక్కారానికి ఫలితం ఎంతహీనంగా వుంటుందో తెలియనంత అల్పుడు కాదాయన. నాది గురుధిక్కారం కాదని వాదించే మూర్ఖత్వం గూడా ఆయనలో లేదు. సూత్రం అందగానే, వ్యాఖ్యానం భావించగల బుర్ర అది. అయినా దైవయోగం పొరపాటులోకి తొయ్యనే తోసింది. ఇప్పుడు, ఇక దానికి నిష్కృతి యేమిటా అని ఉడికిపోతున్నాడు లోపల.

" అర్థమైంది మహాత్మా! అర్థమైంది. ధిక్కారానికి కోపించి గురుదేవులు తీర్థయాత్రల నెపంతో నన్ను బయటకు గెంటివేశారని నే నాక్షణాన లీలా మాత్రంగా అయినా వూహించి వుంటే, ఇంత దూరం వచ్చేవాణ్ణి కాదు. ఇంత లోతుకు జారేవాణ్ణి కాదు. ఆ పాదాలను వదిలేవాణ్ణే కాదు. మహాత్మా ! తమరు ఈ దీనుడియందు దయ తలచి, ఈ నీచుడు మళ్ళీ గురువుల కృపకు పాత్రుడు కాగల ప్రాయశ్చిత్తం ఉపదేశించండి. " అని ఆ యోగి సాష్టాంగ వందనం చేశాడు.

" కూర్చోండి. మీ పొరపాటు ఎక్కడుందో తెలుసుకుంటే, ప్రాయశ్చిత్తం మీరే చేసుకోగలరు. ముందు రోగ మూలం వెతకండి. "

" మహాత్మా! నేను గురుశాప దగ్ధుడినై వున్నాను. నా బుద్ధి సత్త్వ మార్గంలో ప్రసరిస్తుందన్న విశ్వాసం లేకుండా వుంది. తమరే ఆ నిర్ణయం చేసి పెట్టండి. అకారణ కారుణికులు గదా మహాత్ములు. "

"ఈ పాండిత్యాల వల్ల కవిత్వం పెరుగుతూ వుంటుంది. అది ఒకోసారి తత్త్వ దర్శనానికి ప్రతిబంధక మవుతుంది. ఉత్తమ సాధన మార్గంలో పోయేవాడు శాస్త్రాలనూ, కవిత్వాలనూ, కల్పనలనూ, తర్కాలనూ అన్నింటినీ కసవు వూడ్చినట్టు పక్కకు వూడ్చి వెయ్యాలి. ఈ స్థాయి తెలుసుకోకుండా శాస్త్రాలను విసర్జించిన వాడి కోసం రౌరవాది నరకాలు కాచుకొని వుంటాయి. స్థాయి దాటినాక గూడా యీ త్రైగుణ్య విషయాలనే పట్టుకొని వేళ్ళాడే వారి కోసం స్వర్గాది బ్రహ్మలోక పర్యంతం సుఖాలు కాచుకొని వుంటాయి. ఎందుకోసం ? కల్పాంతంలో క్రిందికి తోసేందు కోసం. అంతకన్నా పైది అందాలంటే ఆ దృష్టి విభిన్నమైన దర్శనం చేయగల నిశిత దృష్టిగా వుండాలి. ఇక్కడ దృష్టి అంటే, బుద్ధి అనే అర్థం. ఈ బుద్ధి ప్రశాంతమై ఉండకపోతే తత్త్వ చింతనకు అర్హమైనది కాదు. ప్రశాంతి లేని మనస్సు మీరు అనుకున్న లోకోద్ధరణకు గూడా అనర్హమే. అశాంతిని అధిగమించేందుకు ప్రత్యేకంగా ధర్మశాస్త్ర సూత్రాలు ఎక్కడా వుండవు. ప్రాచీనులైన యోగుల సాధనా చర్యలను అంతర్దృష్టితో నిశితంగా గమనించుకుంటూ పోతే మనకు కావలసిన ఘట్టాలు వాటిలో దొరుకుతాయి. అదే ఉపాయం. ఇక మీరు ఆచరించుకోండి " స్వామీజీ ఠక్కున ఆపేశారు. వెంటనే ఆ యోగి మరోసారి వందనం చేసి ఇలా అన్నాడు:

" మహాత్మా! ఎవరి మనస్సును వారు రహస్యంగా వుంచుకునే హక్కు సర్వ జీవులకు దైవదత్తం. తద్వారా ఎవరి జీవితాన్ని వారు గుంభనగా వుంచుకొనే హక్కును, అవకాశాన్ని జగత్ప్రభువు నియమించి వుంచాడు. ఒకడు మనకంటే బలహీనుడు కదా అనో, ఏమరు పాటుగా వున్నాడు గదా అనో వాడి మనస్సులోకి దూరటం యోగ చర్యలలో హత్యతో తుల్యమైన పాపం అని నాకు తెలుసు. శిష్యుడై వుండి, వాడి జీవిత సర్వ బాధ్యత మన చేతులలో వున్నప్పుడు మాత్రమే వాడి మనస్సులోకి దూరే అర్హత గురువుకి వుంటుందని మా గురువుల శాసనం వుంది. తొందరపాటులో యిలాంటి పాపం చేసే దౌర్భాగ్య దశ నాకు వొద్దు మహాత్మా, వొద్దు. తమరే తమ జీవిత ఘట్టా లేవయినా నాకు పనికి వచ్చేవి వుంటే అనుగ్రహించి చూపండి. లేదా, ఎవరి జీవితంలో అలాంటి ఘట్టాలున్నాయో చెప్పండి. వాళ్ళ కాళ్ళు పట్టుకుంటాను. " ఆ యోగి సూక్ష్మబుద్ధికీ, ధర్మతత్పరతకీ సంతోషించారు స్వామీజీ.

"భేష్! కాని, మీరు గమనించ వలసింది మరొక అంశం వుంది. మీబోటి సాధకుల పరిశీలనావసరాలు తీర్చటం కోసమే ఆవిర్భవించే సాధకావతార మూర్తులు కొన్ని ఉంటాయి. అలాంటివారు అర్హులెప్పుడు చూస్తారా, ఎప్పుడు తత్త్వం దర్శింప చేద్దామా అని యెదురు చూస్తూ వుంటారు. అయినా, మీరంత దూరం పోనక్కరలేదు. మీకు కావలసిన ఘట్టాలు మా జీవితంలోనే మీకు దొరకవచ్చు. మేము అనుమతి యిస్తున్నాం, దర్శించండి"

* * *

విశ్వ చైతన్య శక్తిలో ఒక తరంగం యీ రూపంగా మారింది. ఈ రూపానికి యిప్పుడు స్వామీజీ అని ఒక వ్యవహారం లోక సిద్ధమయింది. ఈ వ్యవహారం సిద్ధం కాకముందు దీనికి ఆయా కాలాలలో చాలా పేర్లు యేర్పడ్డాయి. కొంతకాలం సత్యనారాయణ అనే పేరుతో వ్యవహారం జరిగింది. ప్రస్తుతం మనం ఆ కాలానికి సంబంధించిన కథను గురించి ఆలోచించు తున్నాం కనుక, ఆ పేరుతోనే కథ చెప్పుకుందాం.

పరాశక్తి అంశావతార రూపిణి అయిన జయలక్ష్మీమాత తన పుత్రుడు సత్యనారాయణకు పదకొండవ యేట రాజయోగ దీక్షను శక్తి పాత విధానంలో అనుగ్రహించింది. అటు తరువాత అతని పదమూడవయేట, శివయోగినీ వరిష్ఠ అయిన అతని మేనత్త హఠయోగ మార్గంలో లంబికా నాడీచ్ఛేదం అనుగ్రహించింది. ఈ హఠయోగ లబ్ధికి ముందే తల్లిగారు గతించిన దగ్గర నుంచీ అంతరుపాసన తీవ్రమైంది. ఆ తల్లి ప్రసాదించిన దివ్యశక్తి అప్పుడప్పుడు కనిపించి పోతూ వుండేది. క్రమంగా సిద్ధులు సాక్షాత్కరించ సాగాయి. సత్యనారాయణ ఆ సిద్ధులను ప్రక్కకు తోసేసి ముందుకు పోయేవాడు. ఈ దశలో సత్యనారాయణకు వెంకమ్మత్త సహాయం అప్రార్థితంగా సిద్ధించింది. తమ దగ్గర వున్న విద్యను ఉత్తమ పాత్రుల కిచ్చి తరిద్దామని తాపత్రయపడటం సత్పురుషుల సాధనలో ఒక పరిపాకదశ. ఆ పరిపాకదశలోనే వెంకమ్మత్త హఠయోగ విద్య ధారపోసింది. ఈ రెండూ కలవటం వల్ల, గంగా యమునల సంగమమై, ప్రవాహం మరింత ఉధృతమైంది.

ఆ రోజుల్లో లౌకికమైన కోర్కెలేవీ లేవు గనుక, సాధనకు పెద్దగా ఆటంకాలేవీ కనిపించేవికావు. ఒకవేళ ఏదైనా లౌకిక వ్యవహారాలు తగిలినా, ప్రతి దానిలోనూ ఆనందాన్నే పొందేవాడు సత్యనారాయణ. ఆ సాధనలో ఏ దశలోనూ గూడా ఆకలిదప్పులవంటివి సాధనకు అడ్డంకులుగా వుండేవి కాదు. ఎప్పుడైనా ఆనంద అనుభవం తీవ్రమైతే, శరీరం స్పృహ తప్పేది. దానికే సంయమన శక్తిమీద ధారణ చెయ్యమని మందలించేది వెంకమ్మత్త. అలా ఎనిమిదేళ్ళ సాధన జరిగింది.

అమ్మగారు నెత్తిన పెట్టి వెళ్ళిన చెల్లెళ్ళ బాధ్యత, వెంకమ్మత్త పెట్టిన నియమాలు, దైవదత్తమై అడుగడుగున ఎదురెత్తి వచ్చిన ప్రేమరహితమైన బాల్యజీవనం, వీటికీ మాతృ గురుమూర్తి ఇచ్చిన జ్ఞానానికీ, నిత్య సంఘర్షణగా ఆ యెనిమిదేళ్ళ సాధనా జీవితం గడిచింది. ఆ ఘర్షణ తీవ్రతను పోల్చి చెప్పటానికి లోకంలో ఉపమానాలు లేవు. అది సముద్ర మథన మని చెప్పినా అల్పోక్తే అవుతుంది. ఈ ఘర్షణ అనుక్షణం సాధనకు దోహదమేకాక, పరీక్షా వేదిక గూడా అయింది. అప్పుడు జరిగిన సాధన పన్నెండు యుగాలకు సరిపోతుందని ఇప్పటికీ మాకు అనిపిస్తూ వుంటుంది. ఆ అవృత్తి పన్నెండేళ్ళ ఆవృత్తే అని అమ్మ ఆజ్ఞ. కాని, ఎనిమిదేళ్ళకే, ఇక సర్వస్వం వచ్చేసింది అని స్పష్టంగా తెలుస్తూ వుండేది. కాని, అమ్మ కృపవల్ల, "ఇక ఫరవాలేదు" అనుకుంటే అధఃపతనమై పోతానని అతనికి బాగా స్పష్టంగా తెలుసు. అది జీవితంలో యే క్షణం లోనూ మరపున బడలేదు. అందుకనే, సిద్ధులన్నింటినీ త్రోసిపుచ్చేవాడు సత్యనారాయణ.

అయితే యీ శక్తులన్నీ ఎందుకు వస్తున్నాయో ముందుగానే తెలుసు. వీటి ఉపయోగ మేమిటో స్పష్టంగా తెలుసు. ఈ తెలియటం వల్ల గూడా సాధకుడికి ఒక చిక్కు వుంది. అందుకే గురువులు ముందుగా ఏదీ చెప్పరు. కాని, గురువులు శరీరత్యాగం చేసినాక సాధన కొనసాగించవలసిన కాల ఘటన అతనికి వుండటంవలన, ముందుగానే, అతనికి చెప్పేశారు గురువులు. అందువల్ల రావలసిన చిక్కు అతని నెత్తిమీదికి రానే వచ్చింది. ఇక్కడే మీరు మరింత జాగర్తగా గమనించాలి.

హాలాహల జ్వాలలను మించిన సంఘర్షణను ఒకచేత, అమృతభాండం లాంటి ఆనందాన్ని మరోచేత, దాల్చి రెండిటివంక తేరిపార చూస్తూ, దేన్నీ అనుభవించకుండా, ధారణ చెయ్యవలసిన రోజులవి. ఆ పట్టు కుదిరింది. సరిపోయింది. ఇక మిగిలేదేమిటి ? ఈ హాలాహాలాన్ని మింగెయ్యటం, ఆ అమృతాన్ని లోకాల మీదికి కురిపించటం, ఇంతేగా. అంచేత, లోకంమీదకు దృష్టి మళ్ళింది. లోకమన్నది యెలా వుందో ఒకసారి చూద్దామనిపించింది.

ఓహ్ ! ఏమి లోకమిది ? ఇక్కడ వున్నది మనుష్యులు గాదు, జంతువులు కాదు, పురుగులు కాదు, గడ్డి పోచలు గాదు, సూక్ష్మజీవులు కాదు, ఏమీ కాదు. లోకం అంతటా వ్యాపించి వున్నది సమస్యలు. ప్రతి చిన్న పురుగు మీదా పెద్ద హిమవత్పర్వత మంత సమస్యల కుప్ప వుంది. అవి వొట్టి పర్వతాలు కావు. అగ్ని పర్వతాలు. నిరంతరం పగిలి, అగ్ని జ్వాలలను, అగ్ని ధారలను, అగ్ని వాయువులను వెదజల్లుతున్న అగ్నిపర్వతాలు. ఈ బరువులో, యీ మంటలలో, అల్పులైన నికృష్ట మానవులు ఏదో తప్పు చేశారంటే, ఏ ఇంద్రియానికో వోడిపోయారంటే, ఏ వ్యసనానికో లోబడ్డారంటే, అది వాళ్ళ తప్పా ? అంత కంటే వాళ్ళ వశం అవుతుందా ? ఈ సృష్టినింత ఘోరంగా ఏర్పరిచి, యీ మనశ్శక్తి నింత అల్పంగా నియమించి, ఇంతింత దండన వీళ్ళ కిస్తామంటే, ఏమి న్యాయమిది ? కరుణ గల కొందరు పెద్దలు వీరికేదో బోధలు చేస్తున్నారు. వీళ్ళనేదో బాగు చేద్దామని పైనా కిందా బడుతున్నారు. కోటి మందిని ఉద్ధరిద్దామని ప్రయత్నిస్తే ఒక్కడు పైకొస్తున్నాడు. ఈ పని ఎప్పటికి తెమిలేను ? పైగా ఏమి తెలివి యిది ? ఇది యిలా వుండగా ఉద్ధరిస్తామని బయలు దేరే వారిలో అంతఃకలహాలు, ఆచార భేదాలు, సిద్ధాంత వాదాలు, మత యుద్ధాలు అన్నింటినీ చూస్తున్నాం. దేన్నీ ఆపలేకపోతున్నాం ! ఇదేమి గతి మనకు ?

ఇంత శక్తి వున్నదే మన దగ్గర, పన్నెండు యుగాలకు సరిపోయే శక్తి ! ఈ శక్తితో యీ సృష్టి సరళిని మార్చేసి, యీ జీవుల దుష్కర్మలను దహించి, మన పుణ్య ప్రాబల్యంతో, వాళ్ళందరికీ సహస్రార ఉన్మీలనం చేస్తే, పైయుగాల బాగు కోసం, యే జీవీ శ్రమ పడక్కరలేదు గదా ! ఎందుకిలా చేతులు కట్టుకు కూర్చోవటం ? ఎందుకీ పీనాసితనం ? ఎందుకీ పిరికితనం ?

ఈ రకమైన భావ తరంగాలు సత్యనారాయణ హృదయంలో అనుక్షణం తుపానులోని సముద్ర తరంగాల కన్నా ఘోరంగా కల్లోలాలను రేప సాగాయి. ఇక అప్పటి నుంచీ, లోకం లోని ప్రతి కోణం లోనించీ వికృత విహ్వల విషాద రోదన ధ్వనులు ఆ చెవులకు సోకి మారోృగి, గింగురులెత్తి, కరుణా వేగం వల్ల హృదయ మూలాలు కోసుకుపోతూ వుండేవి. ఇది మీకు మల్లే యేదో తీర్థ యాత్రలు చేస్తుండగా, యాదృచ్ఛికంగా పొటమరించిన మొటిమె కాదు. హృదయంలో అగ్ని జ్వాలలు చెలరేగి, శరీరమంతా వుండయిన పరిస్థితి. ఇంతటి ఈస్థితిలో సత్యనారాయణను ఆపినది ఒకే ఆలోచన. గడ్డిపోచ కన్నా పలుచని ఒకే ఒక ఆలోచన: అరటి ఊచలోని దారాలకన్నా అల్పమైన ఒకే ఒక ఆలోచన, " అమ్మ పన్నెండేళ్ళని ఎందుకు చెప్పింది ? " అని.

ఈ ఒక్క దారపు పోగు ఒక మదగజం కన్నా, ఒక మహా తిమింగలం కన్నా, ఒక భయంకర శరభం కన్నా, ఘోరంగా, విశృంఖలంగా, ప్రచండంగా చెలరేగుతున్న సత్యనారాయణను కట్టి పక్కన పడేసింది. ఒక వంద నాగాస్త్రాలతో, వెయ్యి యింద్రాస్త్రాలతో, లక్ష సమ్మోహనాస్త్రాలతో గూడా కట్టుబడరాని ఆ దుర్భరావేశం చిన్ని పురికొస మెలికకు కట్టుబడి, పక్కకు వాలిపోతూ వుండేది, యెప్పటి కప్పుడు ! ఈ స్థితిలోనే ఒక సంవత్సరం గడిచింది. ఈ లోగా తల్లిగారు పెట్టిన బాధ్యతలలో ఒక బాధ్యత తీరింది. ఆ తీరటంలో ఋణభారం నెత్తినబడి, బహిర్జీవితం గిల గిల తన్నుకుంటున్న రోజులవి.

అంతర్జీవితంలో హాలాహలం! బహిర్జీవితంలో బడబాగ్ని !! ఈ స్థితి తట్టుకోలేక, ఒక రోజున, ఊరిబయటకు వెళ్ళి, బాహువులెత్తి అమ్మా అని ఆర్తిగా ఆక్రోశించాడు సత్యనారాయణ. అమ్మలగన్న అమ్మ చాముండి అమ్మ రక్షించివుండకపోతే, ఆ ఆక్రోశాలకు యీ చాముండీ కొండ ద్రవించి నీరై ప్రవహించి ఉండవలసింది. అంతటి గుండె లోతుల యేడుపది ! తను రోజూ వింటున్న యుగ యుగాల దీన జీవులందరి ఆక్రందనలు గూడు కట్టుకున్న చిక్కని యేడుపది !! తన హృదయ మర్మాల రంపపు కోతలో ఆవేశంగా వెలువడ్డ హాహాకారమది !!!

## మానస సరోవరం

అంత ఆక్రోశిస్తే, అమ్మ చిన్న మెరుపు తునక పంపింది మనస్సులోకి. "ఒక్కసారి మానససరోవరంలో స్నానం చేసిరా " అని.

ఔను ! ఆ శివాశంకరుల జలక్రీడా సరోవరమే, ఆ మంచుకొండల సరికొత్త రసమే ఈ తీవ్రతకి తాత్కాలిక శాంతి కలిగించవచ్చు. అటునుంచి అటే రైల్వేస్టేషనుకు వెళ్ళాడు సత్యనారాయణ. రైలు టికెట్టుకు డబ్బు ఉన్న రోజులు కావవి. ఉన్న శక్తిని వాడుకొనే వీలున్న రోజులయినా కానే ! ఏం చావాలి ?

"వెళ్ళిరా" అని ఆజ్ఞ వేసిన అమ్మకు తెలీదా ఏమి చెయ్యాలో? ఆ విశ్వాసంతో సత్యనారాయణ టికెట్టు లేకుండానే రైల్లో కూర్చున్నాడు. రైలు తరువాత రైలు మారాడు. ఢిల్లీ స్టేషనులో దిగాడు. ఎటు పోవాలి యిప్పుడు? పూర్వం బెంగుళూర్లో దిగినప్పుడు లేని చింత యిప్పుడెందుకు?

గాలిపటం గాల్లో వొదిలాడు. అది ఒక రోడ్డంబడి కొట్టుకు పోసాగింది. అదేదో పెద్ద రోడ్డు. అక్కడ ఒక చిత్రం జరిగింది.

రోడ్డుకు ఒక పక్క కాలిబాట మీద సత్యనారాయణ నడుస్తున్నాడు. అవతలపక్క కాలిబాటు వెంబడి ఒక కారు ఆగి వుంది. ఎందుకాగిందో ఏమో! ఇంతలో ఆ కారు తలుపు తెరుచుకొని ఒక ఐదారేళ్ళ పసిపాప రోడ్డువైపుకు దిగింది. అసలలా రోడ్డువైపు తలుపు తెరవటమే తప్పు, చాలా ప్రమాదం. ఆ కారులో ఇంకెవరూ లేరు గాబోలు. ఆ పిల్ల వెనకాల ఎవరూ దిగలేదు. ఇంతలో పిల్ల వెనకనుంచీ ఒక పెద్ద లారీ విపరీతమైన వేగంతో వస్తోంది. లారీవాడు బ్రేకు వేసినా, ఆగే లోపల పిల్ల దక్కదు. అసంభవం. ఆ పిల్లకు అక్కడితో ఆయుష్షు చెల్లి పోయింది. ఎవరూ చెయ్యగలిగిందేమీ లేదు. కానీ విధియేమైనా చెయ్యగలదు.

సత్యనారాయణకు ఉన్నట్టుండి కరుణావేశం వచ్చింది. కొండ కొప్పుమీద నుంచి దూకే కొండ ముచ్చల్లే, ఒక్కసారి ఆ పిల్ల మీదికి దూకేశాడు! పిల్లతోపాటు ప్రక్కకు దొర్లేశాడు!! సెకండులో వందవ భాగంలో లారీ చక్రాలు తప్పిపోయినై. మోకాళ్ళమీద, మోచేతులమీద డోక్కుపోయిన దెబ్బలతో పిల్ల బిత్తరపోతూ నిలబడ్డది. అసలే మాసి, తోలల్లే వున్న సత్యనారాయణ ఫ్యాంటు రెండు మోకాళ్ళ దగ్గర చిరిగి నెత్తురు మరకలై, వికారంగా తయారయింది.

ఇంతలో నలుగురూ పోగయ్యారు. వాళ్ళలో ఆ పిల్ల తల్లి తండ్రులు గూడా వున్నారు. అందరూ కుర్రవాడి సాహసానికి ప్రశంసల వర్షం కురిపిస్తున్నారు. అజాగర్తకు తల్లినీ, తండ్రినీ తిడుతున్నారు. ఆ తల్లీ తండ్రీ పిల్లను కౌగలించుకొని యేడుస్తున్నారు. అదంతా ఒక సంతగోల.

కొంతసేపయినాక గోల కొంత సద్దుకుంది. ఆ పిల్ల తల్లిదండ్రులు హిందీలో సత్యనారాయణకు కృతజ్ఞతలు చెప్ప సాగారు. వచ్చీరాని హిందీతో ఇతను పర్వాలేదన్నాడు. దాంతో కుర్రవాడు అక్కడివాడు కాదని తెలిసిపోయింది. వాలకం చూస్తే ముష్టివాడిలాగా వుంది. అక్కడ నుంచి వివరాలు అడగసాగారు. బహుమతిగా ఏం కావాలో కోరుకోమన్నారు. అనేక రకాలుగా ఏదేదో మాట్లాడారు వాళ్ళు. అందులో సగం తెలియదు. తెలిసిన దాంట్లో సగం విసుగ్గా వుంది.

తాను రక్షించాడా ఇప్పుడు? తను తూకం చూసి దూకాడా ఇప్పుడు? ఈ ఒక్క జీవి కోసం చేసిన ప్రయత్నంలో యీ శరీరం ఖండఖండాలై ఇతర జీవులకు చెందవలసిన

ఉపకారమంతా మట్టిపాలయితే యేమయి వుండేది? తను ఆలోచించి, గురిచూసి చేసివుంటే, ఇలాంటి సాహసం చెయ్యవచ్చునా? ఈ గణితం వేసిం దెవరు? ఈ తూకం తూచిం దెవరు? యీ ఊపు నిచ్చిందెవరు? ఇందులో ఏ ఒక్కదానికి కర్తృత్వం లేని తనకు వాళ్ళు కృతజ్ఞతలు చెపుతుంటే యేమి చెయ్యాలి?

సత్యనారాయణ మౌనం చూసి వాళ్ళు ఇతనేదో బిడియస్తుడనీ, యే నిరుద్యోగం వల్లో నిరాశలో వున్నవాడనీ భావించి మరింత జాలిపడి, బలవంతపెట్టి వాళ్ళ యింటికి తీసుకు వెళ్ళారు. ఆ యిల్లు చాలా పెద్దది. ఆ యింటి చుట్టూవున్న తోట ఇంకా పెద్దది. ఆ యింట్లో సత్యనారాయణకు రాజభోగంగా స్నానం అయింది. కొత్త బట్ట లిచ్చారు. కట్టుకొని యింటి ముందు తోటలో పోయి కూర్చున్నాడు. మైసూరులో మహారాజా భవంతి తప్పితే, మరో రాజసౌధం చూసి యెరగని సత్యనారాయణకు ఆ సుందర ప్రకృతిలో మనస్సు దానంతటది లయించింది. మళ్ళీ బాహ్య స్థితికి వస్తూ తనని చూసుకునేసరికి పద్మాసనంలో వున్నాడు తను. ఆ రోజు ఇంతా చేసి, ధ్యాన స్థితిలో వున్నది ఒక గంట చిల్లర. దానికే ఆ యింటివారు తబ్బిబ్బయిపోయి, ఇతనికి నమస్కారాలు పెట్టసాగారు.

ఆ ఇంటికి తగ్గట్టే వుంది ఆ భోజనం. కాని వొళ్ళంతా మంట లెత్తుతున్న వాడికి భోజనపు రుచి యేమి తెలుస్తుంది? భోజనాలయిన తరువాత, ఇతని వివరాలు తెలుసుకొని కావలసిన సహాయం చేద్దామని ప్రయత్నం మళ్ళీ మొదలెట్టారు వాళ్ళు. ఉపకారం చేసిన వాణ్ణి వెర్రి వెధవగా చూసి, పేడ నీళ్ళు చల్లే యీ రోజుల్లో, వాళ్ళు ప్రత్యుపకారం చెయ్యటం కోసం యింత తాపత్రయ పడుతున్నారంటే, అది నిజంగా గొప్ప విషయమే. కాని ఆ సమయంలో సత్యనారాయణకు ఆ దృష్టి యెంత మాత్రం లేదు. అప్పటికి కొద్దిగా ఆలోచించుకొని వున్న సత్యనారాయణ " మీకు నిజంగా నాకు ఉపకారం చేద్దామని వుందా ? " అని అడిగాడు. వాళ్ళు హిందీలో చాలా చెప్పారు. తాత్పర్యం " ఔను " అని. ఇక సత్యనారాయణ తనకు చేతయిన హిందీ ముక్కలకు హస్త సంజ్ఞలు కొంత, అభినయం కొంత చేర్చి మూడు షరతులు చెప్పాడు.

1. నా గురించి మీరు ఏ వివరాలూ అడగరాదు.
2. మానస సరోవర స్నానానికి బయలుదేరాను. మీకు చేతయితే, కుదిరితే, ఎంతవరకూ పంపించగలరో, అంతవరకూ పంపించండి.
3. ఒకవేళ మొత్తం మీరే తీసుకెళ్ళేట్టయితే, తిరుగు ప్రయాణంలో నన్ను ఢిల్లీ రైల్వే స్టేషనులో వదిలెయ్యాలి. ఆపైన మీకూ నాకూ సంబంధం లేదు.

ఇది విన్నాక, ఇందాక ధ్యానస్థితి చూశారు గనుక, ఇతనెవరో యోగసాధకుడని వాళ్ళు నిశ్చయించుకొని, మొత్తం రాను పోను ప్రయాణం అంతా తామే చేయిస్తామనీ, కానీ మానస సరోవరయాత్ర సులభంకాదనీ, దాని యేర్పాట్లకి రెండు మూడు రోజులు పడుతుందనీ

చాలా చాలా చెప్పారు. సత్యనారాయణకు అదేమీ పట్టలేదు. పట్టిందల్లా వొక్కటే! ఆ మూడు రోజులూ వాళ్ళొక గది యిచ్చారు, మంచి ఏకాంతం కుదిరింది. ధ్యానం బాగా సాగింది. నాలుగో రోజున వాళ్ళు ఇద్దరు మనుషుల్ని తోడిచ్చి నమస్కారాలు చేసి చేసి, ఒక జీపులో పంపించారు.

సత్యనారాయణకు మనస్సు మనస్సులో లేదు. అతని మనస్సంతా ఇప్పుడు మానస సరోవరమై పోయింది. ఏం జరుగుతుందో గూడా అతనికి తెలియటంలేదు. కొంతదూరం వెళ్ళాక జీపులోంచి దింపి, గుర్రం ఎక్కించారు. మధ్య మధ్యలో గుర్రందిగి నడవమన్నారు. కొన్నిచోట్ల రాత్రి మకాం చేశారు. మొత్తానికి నాలుగు రాత్రులు గడిచాక ఒకరోజు ఉదయం పది గంటల ప్రాంతాల్లో "ఇక దగ్గర పడ్డాం" అనిపించింది సత్యనారాయణకి. అప్పుడు కూడా వున్న వాళ్ళను అడిగాడు, ఇంకెంత దూరం వుందని. ఒక పావు గంటలో మానస సరోవరం వచ్చేస్తుందన్నారు వాళ్ళు. పావుగంట అయింది.

"అదిగో మానస సరోవర్"అన్నారు, కూడా వున్న వాళ్ళు ఉత్సాహంగా! సత్యనారాయణకు ఆ మాటలేం పట్టటం లేదు. గబ గబా మెట్లుదిగి బుడుంగున నీళ్ళలో మునిగాడు.

ఆ చలి దేశంలో స్నానం చెయ్యవలసిన విధానం అదికాదు. అందువల్ల, కూడా వున్న వాళ్ళు కంగారు పడ్డారు. కాని, వాళ్ళు వారించే లోపల ఇతను మునిగి మూడు మునకలు వేశాడు. ఆనందంగా నాలుగు బారలు యీతకొట్టి వొడ్డుకొచ్చి నుంచున్నాడు. "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అని వినిపించ సాగింది అతని చెవులలో. ఇంతలో, కూడావున్న వాళ్ళు ఇతని రెండు రెక్కలూ పట్టుకొని పైకి లాక్కొచ్చి పొడిబట్టలిచ్చారు. ఆ బట్టలు కట్టుకొని ఒక శిలా ఫలకం మీద పద్మాసనం వేసుకొని కూర్చుండిపోయాడు సత్యనారాయణ.

ఆ చల్లని వాతావరణం, ఆ సుందర ప్రకృతి, ప్రాణవాయువు పల్చబడి వున్న ఆ యెత్తు ప్రదేశం, ఏకాంత దృష్టిలేనివాడికి గూడా సహజంగానే, ధ్యానదృష్టిని కలిగిస్తాయి. అప్రయత్నంగానే వైరాగ్యభావాన్ని పురికొలుపుతాయి. అకారణంగానే మౌనదీక్ష నిస్తాయి. అలాంటిచోట సత్యనారాయణలాంటి దైవదృష్టిగల కుర్రవాడు ధ్యానంలో పడటం ఆశ్చర్య మేమీ కాదు లెమ్మను కున్నారు, తోటివారు. అతను మళ్ళీ కళ్ళు తెరిచేసరికి మొత్తం సమస్త ప్రపంచమూ చల్లబడి వున్నది. ఎక్కడా కోలాహలం లేదు. ఎక్కడా బడబాగ్ని లేదు. ఎక్కడా అగ్నిపర్వతం లేదు..

అది చలికాదు, వేడికాదు. అది దుఃఖం కాదు, సంతోషం కాదు. అది ద్వేషం కాదు, కరుణ కాదు. ఇంకేమీ కాదు. కాలి కాలి అగ్ని తనంతటు తను శమించిపోగా మిగిలిన తెల్లని భస్మం. ఇప్పుడు ప్రపంచంలోని ఆర్తనాదాలు వినిపిస్తున్నై కాని, హృదయంలో హాలా హలాలు లేవు. ఇప్పుడు బ్రహ్మలోకపు ఆనందరస తరంగాలు గూడా మనసుకు అందు తున్నాయి. కాని హృదయంలో ఉల్లాస సంభ్రమాలు లేవు. మనసు పాషాణమై లేదు. అది

రసమై ద్రవిస్తోంది. అగ్ని అయి ప్రకాశిస్తోంది. వాయువై స్పందిస్తోంది. ఆకాశమై వ్యాపిస్తోంది. అయినా కల్లోల పడటం లేదు. ఆ స్థితిలో సత్యనారాయణ చుట్టూ కలయ చూడసాగాడు. ఇప్పుడు ఒళ్ళు తెలుస్తోంది. ఇప్పుడు ఆశ్చర్యం పొంగుకొస్తోంది, ఓహ్! ఏమి అందమిది !! సంభ్రమాశ్చర్యాలతో ఒక్కసారి లేచి నిలబడ్డాడు సత్యనారాయణ. ఆ అందాన్ని వర్ణించేందుకు మాటలు లేవు. మాటల్లో చెప్పాలని యెంత ప్రయత్నం చేస్తే, అంత ఘోరంగా విఫలం కావటమే గతి.

మెట్లమీద నిలబడ్డ సత్యనారాయణ చుట్టూతా తిరిగి ఆత్మ ప్రదక్షిణం చేసుకున్నాడు. ఈ సరస్సులోంచి వస్తున్న ఆధ్యాత్మిక తరంగాలకు సాటిలేదు. పదహారు వేల అడుగుల యెత్తున, 150 మైళ్ళ వైశాల్యం గల సరస్సు వుందంటే నమ్మటం సాధ్యమా! ఈ సరస్సు చల్లదనంలోనే గాక గుండ్రని ఆకారంలో గూడా అచ్చంగా నిండు చందమామ. ఈ తరంగాలు మహారాజుల నడకల లాగా హుందాగా సాగుతున్నాయి. ఆ అలలమీద పెద్ద గుంపులుగా ఉయ్యాల-లూగుతూ సాగుతున్నాయి, తెల్లని పక్షులవి హంసలు గాబోలు. హంసలంటే అవేవో కల్పనా పక్షులు కావన్న మాట!

సరస్సు చుట్టూ నిగనిగ మెరుస్తున్న నల్లరాతి కొండలు, గోడల లాగా నిలిచి వున్నాయి. బాగా తల పైకెత్తి చూస్తే అక్కడ మంచు కప్పిన శిఖరాలు కనిపిస్తున్నాయి. కింద మంచులేని చోట్ల అచ్చపు నునుపు రాళ్ళే తప్ప చిన్న మొక్క గూడా లేదు. అందుకే గాబోలు యీ సరస్సు ఇంత నిర్మలంగా వుంది. ఈ నీరు పలుచటి గాజుపొరలాగా వుంది. ఒడ్డునుంచి కొంత దూరం వరకు ఆ నీలపు నీటి అడుగున మిలమిలా మెరుస్తున్న గులకరాళ్ళ నేల స్పష్టంగా కనిపిస్తోంది. కళ్ళు జిగేలు మనేలాగా రంగు రంగుల చేపలు చెంగు చెంగున నీళ్ళల్లో యీతలు కొడుతుంటే, అద్దాల తొట్టిలో కనిపించినట్టు కనిపిస్తున్నాయి. అలల గలగలలు మనసుకు గిలిగింతలు పెట్టే యీ నీటి ఒడ్డులలో తాపడమయి, నిత్యమూ జలకాలాటలలో సాన పెట్టబడి తళతళ లాడుతున్న యీ రవ్వల ప్రోగులను కేవలం గులక రాళ్ళంటే నమ్మటం కష్టంగా వుంది.

ఒక పెద్ద గాలితెర వచ్చింది. సరస్సులో అలలు ఉల్లాసంగా గంతులు వేశాయి. ఈదులాడుతున్న హంసల గుంపు రెక్కలల్లాడిస్తూ, రివ్వున లేచింది, లేస్తూ వింతగా కూసింది. అరే యేమి రాగం ఇది! ఏమి మాధుర్యమిది? ఎక్కడో విన్నట్టే వుందే. ఆ....ఇది ధ్యాన గతులలో అంతర్లోకాలలో వినిపించే రాగాలలో ఒకటి. హంసధ్వని రాగం. ఇది వేదాల రాగం. రాజహంసల కల కూజితాలంటే ఇవన్న మాట. ఈ హంసలు ఎగురుతుంటే ఎంత బావుంది? కాని యివి ఎగిరినా, వాలినా గుంపులుగా ఉంటున్నాయి. ఈ ఐకమత్యం వీటి జన్మ లక్షణం కాబోలు. హంసలు మళ్ళీ నీళ్ళమీద యీదుతున్నై. అరె, ఇవి నీటిమీద వుంటే ఎక్కువ అందంగా వుందా, ఆకాశంలో ఎగురుతుంటే ఎక్కువ అందంగావుందా? ఏమో తేల్చటం కష్టం!

సముద్రమంత చెరువు, ఆకాశం వంటి నీళ్ళు, రత్నాలవంటి రాళ్ళు, కోట గోడల్లాంటి కొండలు, వాటిపైన బురుజుల లాంటి మంచు కప్పిన శిఖరాలు. వీటిలో వేటిల్లో వుంది యీ అందం? ఓ! ఎంత చూసినా తనివి తీరటం లేదు. ఈ సౌందర్యం ఎక్కడి నుంచి వస్తోందో చెప్పటం అసాధ్యం. ఏమయినా దాని సౌందర్య రహస్యం దాని ఆధ్యాత్మిక తరంగాలలో వుందనిపిస్తోంది. నిజంగా అద్భుతం! అద్భుతం!! అద్భుతం!!!

ఆనందపరవశుడై దిక్కులు తిలకిస్తున్న సత్యనారాయణను గమనించి దగ్గరకు వచ్చారు, కూడా వచ్చిన వాళ్ళు. " అప్పుడే నాలుగు దాటింది. ఇక ఈ రాత్రికి తిరుగు ప్రయాణం చెయ్యటం సాధ్యం కాదు. ఈ రాత్రికి మరీ నీటి వొడ్డున కాలక్షేపం చెయ్యటం గూడా కష్టమే" అన్నారు.

"ఊ" సత్యనారాయణ వినీవినకుండా ఊ కొట్టాడు.

"వెంటనే బయలుదేరితే లామా ఆశ్రమానికి చీకటిపడే లోపల వెళ్ళొచ్చు" అన్నారు వాళ్ళు.

"ఆశ్రమమా" ఆశ్చర్యపోయాడు సత్యనారాయణ.

" ఉందిలెండి, దార్లో చెబుతాంగా " అన్నారు వాళ్ళు.

" సరే ఒకసారి స్నానం చేసి వచ్చేస్తా " అన్నాడు సత్యం.

" స్నానం చేస్తే మళ్ళీ బిగుసుకొని కూర్చుంటారేమో ? " అన్నారు వాళ్ళు.

" లేదులే " అంటూ యీమాటు పెద్ద బట్టలు విప్పి, తడవకుండా జాగర్త చేసుకొని, ముందర కాళ్ళు, చేతులు తడుపుకొని, జాగర్తగా సరస్సులో మునిగాడు సత్యన్నారాయణ.

" అరె, ఇంత చల్లగా వున్నాయే నీళ్ళు, ఇందాక ఇలా ఉన్నట్టు లేవే " అనుకుంటూ, రసబ్రహ్మ స్మరణ చేసి, గబ గబా మూడు మునుగులు మునిగి, ఒక గుక్కెడు నీరు గుటుక్కున మింగేసి వొడ్డుకు వచ్చేశాడు. వెంటనే పొడి బట్టలు కట్టుకొని, వాళ్ళు భయపడ్డట్లే కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. కాని, అయిదు నిమిషాలలోనే సంబాళించుకొని లేచి, వాళ్ళ వెంట నడవసాగాడు.

బౌద్ధ మతస్థులైన లామాలు ఆ పవిత్ర మానస సరోవరానికి యెనిమిది దిక్కులలోనూ యెనిమిది తపోవనాశ్రమాలను నిర్మించారట. వాటిని " లామాసరీలు " అంటారట. ప్రతి లామాసరీలోనూ కొద్దిమంది బౌద్ధ సన్యాసులు తీవ్ర తపస్సాధనలలో నిమగ్నమయి వుంటారట. ఎవరైనా యాదృచ్ఛిక అతిథులు వస్తే, ఆదరిస్తూ వుంటారట. యాత్రీకులు సరస్సు వెంట కొద్ది మైళ్ళు నడచి ఒక లామసరీకు చేరారు. ఆ రాత్రి అక్కడ గడిపాడు సత్యనారాయణ. ఆ లామాసరీలో ఉన్న లామా మంచి తపశ్శాలిగా కనిపించాడు. అక్కడ స్థల శుద్ధి గూడా తపస్సుకు మంచి అనుకూలంగా వుంది. అక్కడి లామా, ఈ యాత్రీకులను ఆదరించి మానస సరోవర జలాలతో కాయించిన వేడి వేడి టీ యిచ్చి సత్కరించాడు. అక్కడ

నివసించే వారికి నిత్యం స్నానం చెయ్యటం అసాధ్యం గనుక, ఆ మానస సరోవరోదకంతో కాచుకున్న టీ, బుద్ధ భగవానుడికి నైవేద్యం చేసి ప్రత్యేకంగా తాగుతారు. అలా మానస సరోవరోదకం జన్మలో ఒక్కసారి గొంతులో పడినా చాలనీ, అది ఆరోగ్యాన్నీ, ముక్తినీ గూడా యిస్తుందనీ విశ్వాసం.

## వశిష్ఠత్వసిద్ధి

ప్రయాణపు బడలికలో తోటివారు వెంటనే ఆదమరిచి నిద్రపోగా, లేచి నిశ్చలంగా పద్మాసనంలో కూర్చున్నాడు సత్యనారాయణ. అతని ఆలోచనా తరంగాలు మానస సరోవర హంసల రెక్కల లాగా హుందాగా కదలసాగాయి.

"ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః"

ఇదీ అమ్మ ఉపదేశం. ఇదీ అమ్మ అనుగ్రహం. ఇప్పుడు నిజంగా మూడు శాంతులూ పరిపూర్ణంగా దక్కాయి. త్రికరణ శాంతి దక్కింది. త్రిలోక శాంతి దక్కింది. త్రిగుణ శాంతి గూడా దక్కింది. ఇది నా సాధనకు అవభృథ స్నానం. నా సాధనకు శాంతి సన్మానం. సాధకుల కిది శాశ్వత విధానం. ఈ శాంతి ఇదివరలో ఎందుకు దక్కలేదు? అదీ, కారణం. గురువులు ఎంత చెప్పినా విశ్వామిత్ర మార్గంలో నడిచింది నా సాధన. నిజమే, ఇప్పుడు తెలుస్తోంది, విశ్వామిత్రుడికీ నాకూ సాధన విషయంలో ఎంతో పోలిక వుంది. కామానికీ, క్రోధానికీ, దయకూ, అహంకారానికీ నాలుగుసార్లు పరాజయం పొందాడు విశ్వామిత్రుడు. తపస్సుకోసం నాలుగుచోట్లు మార్చాడు.

నాకు గూడా యీ పరీక్షలు నాలుగూ వచ్చాయి. అయితే విశ్వామిత్రుడు గురువును ధిక్కరించిన దోషి కనుక ఎప్పటి కప్పుడు పాతాళపు అడుగంటా పడి, మళ్ళీ లేచి పైకి పాకవలసి వచ్చింది. నాకు అమ్మ దయ వుంది గనుక, పడిపోయే పరిస్థితి రాబోతుండగా, ప్రమాదం తప్పిపోతోంది.

ప్రొద్దుటూరులో వెంకమ్మత్త మీద, ఇతర సాధక సన్మండలి మీద సత్సాంగత్య ప్రీతి మొలకెత్త సాగింది. అమ్మ అడ్డుపడి నా నివాసం అక్కడి నుంచీ మార్చేసింది. అమ్మ దయతో పరీక్షలో నెగ్గిన కీర్తి దక్కించుకొని, సాధనా స్థలం మార్చాను.

అనంతపురంలో అంబమ్మవ్వ మీద క్రోధం ఉద్భవించగా, వివేక బుద్ధి నను గ్రహించి ప్రమాదం తప్పించింది అమ్మ. కాగా మళ్ళీ స్థలం మార్చవలసిన ఆవశ్యకత యేర్పడ్డది.

శరీరానికి వయస్సు చాలదు కనుక, ఇంద్రియ కామానికి పడిపోయే స్థితి వుందో లేదో తెలుసుకొనే సావకాశం అప్పట్లో లేకపోయింది. కాని క్రోధపు కోరల నుండి అమ్మ నన్ను కాపాడిన మరుసటి అడుగులోనే బొంబాయి సేటు బులిబులి వలపుల మాటలకు లొంగి రాగపు గోతిలో తల దూర్చాను. మళ్ళీ ఆ గుంతకల్లు దగ్గర అమ్మే కాపాడింది. ఇప్పటికి మూడుసార్లు

అమ్మ దయతో పరీక్షలో నెగ్గిగూడా క్రోధాన్ని జయించానని అహంకారపు మోహంలో పడి పోయిన నన్ను బెంగుళూర్లో మళ్ళీ రక్షించింది అమ్మ. మళ్ళీ స్థలం మార్పు అనివార్యమైంది. ఈ మాటు చాముండీ వనపు గణపతి సహాయం గూడా తోడయి ఇక గట్టెక్కేసినట్టే అనుకుంటుండగా వచ్చింది, స్త్రీ వ్యామోహ జయపరీక్ష.

తలకు ఇన్ని బొప్పెలు కట్టినాక శరీరానికి యుక్తవయస్సు వచ్చింది గదా అని, పరమేశ్వరుడు పెట్టిన స్త్రీ వ్యామోహ పరీక్ష గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసిన పని లేదు. పైగా అప్పటికే గణపతి రంగంలోకి దిగి దారి చూపుతున్నాడు. అందువల్ల ఆ విజయాన్ని విజయంగా లెక్కేసుకోనక్కర లేదు. అందుకే స్థలం మార్పు గూడా జరగలేదు. అది గూడా అయిపోయాక గట్టు ఎక్కడం గూడా అయిపోయింది అని వూపిరి పీల్చుకుంటుండగా వచ్చింది యీ లోకోద్ధరణ కరుణా వ్యామోహ పరీక్ష. ఇది అన్నింటికన్నా కష్టమైన మెట్టు కనుక అమ్మ యింతదూరం స్థాన చలనం చేయించింది. విశాల విశ్వ ప్రణాళిక గురించి దీక్షా ప్రదాన సమయంలోనే సూత్రీకరించింది అమ్మ. ఆ తరువాత అనేకమార్లు విరాడ్రూప దర్శనాలను అనుగ్రహించింది.

ఈ సృష్టి, యీ యుగాలు, యీ ధర్మాధర్మాల ఉచ్చనీచగతులు అన్నీ అమ్మ ఏర్పరచిన వ్యవస్థలు. అమ్మ ఏర్పరచిన దానిని గుర్తించుకోలేక పోవటం, ఇదెక్కడి అపస్మారం నాకు? శీతం_ఉష్ణం, సుఖం_దుఃఖం, పుట్టుక_చావు, ధర్మం_అధర్మం యిత్యాదులన్నీ జంటలు జంటలుగా సృష్టించింది అమ్మ. అందులో ఒక్కదాన్నే నిర్మూలించటం సాధ్యం కాదు. రూపాయి నోటులో ఒకప్రక్క కాల్చివేసి, రెండో ప్రక్క మాత్రం వాడుకుంటానంటే కుదురుతుందా ?

లోకం లోంచి అధర్మాన్ని తుడిచేస్తాను, దుఃఖాలను కడిగేస్తాను, ప్రతి జీవికీ మోక్షం తక్షణమే యిచ్చేస్తాననేవి పిచ్చి వూహలు. అమ్మ చెప్పినట్టుగా పరమేశ్వర ప్రవర్తిత మైన చక్రం వొకటి తిరుగుతోంది. అందులో మనకు, అంటే యీ శరీరాన్ని అధిష్టించివున్న చైతన్య శక్తికి ఏ పాత్ర నిర్ణయింపబడి వుందో స్పష్టంగా తెలిసే వుంది. ఆలోచన గూడా అంత వరకే ప్రసరించాలి.

రథానికి పది గుర్రాలు కడితే అందులో వొకటి ప్రబలమై బండి నొక పక్కకు ఈడుస్తా నంటే బండి యజమాని ఊర్కుంటాడా? బండి తోలేవాడు వొప్పుకుంటాడా? నాటకంలో ఒక పాత్రకు వేషం వేసుకొని వచ్చి, అన్ని పాత్రల సంభాషణలు అతనే చెపుతానని అనవచ్చా? అలా అంటే అది నాటకం అవుతుందా? ఈ వివేకం లోపించటంవల్లే ఆ తపన, ఆ వ్యథ అనుభవానికి వచ్చినాయి. ఇప్పుడు అమ్మ దయవల్ల అవి అంతరించినాయి. విశ్వా మిత్రత్వం పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది. ఈ స్థితి సిద్ధించేందుకే అమ్మ నన్ను మానస సరోవరానికి తెచ్చింది.

నిజానికి నా మానసమే నాకు అసలైన మానస సరోవరం. సృష్టికర్త మనస్సంకల్పం వల్ల పుట్టింది గనుక యీ సరస్సు మానస సరోవరం. మనస్సే ప్రధానంగా గల జీవులు మానవులు. అందువల్లే మానవులకూ, మానస సరోవరానికీ దగ్గరి చుట్టరికం వుంది. మనస్సు శిఖరాగ్రానికి వెళితే అది మానస సరోవర మవుతుంది. ఈ సరోవరం పార్వతీ పరమేశ్వర విహార భూమి అయిన కైలాస శిఖరానికి దగ్గరలో వుంది. అందువల్లే యీ సరస్సులో ఆధ్యాత్మిక తరంగాలు ఇబ్బడి ముబ్బడిగా వున్నాయి. అందువల్లే యీ తరంగాలను తనలో నింపుకున్న వాడి మనస్సులోకి పార్వతీ పరమేశ్వరులు ప్రవేశించి ఆనంద నృత్యం చేస్తారు, ప్రశాంతి వర్షం కురిపిస్తారు.

అదే ఇప్పుడు జరిగింది. ఇదే అమ్మ అనుగ్రహం !! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః !! ఈ శాంతి పాఠంలో మనస్సు పూర్తిగా నిర్వికల్పమై లయించి పోయింది. తెల్లవారుజామకు గానీ మళ్ళీ బాహ్యస్మృతి కలగలేదు. అప్పటికే నిద్రలేచిన తోటివారు తిరుగు ప్రయాణానికి తయారవుతున్నారు.

మరొక్కసారి స్నానం చేస్తానన్నాడు సత్యనారాయణ. "అది ప్రమాదం, వద్దు" అన్నారు వాళ్ళు. కాని ఇతని పట్టుదల చూసి మీ యిష్టం అన్నారు. లామాసరీ వారిదగ్గర సెలవు తీసుకొని బయటకు వచ్చారు.

వచ్చిన ఆ ముగ్గురూ కొన్ని క్షణాలు అప్రయత్నంగా తన్మయావస్థలో మునిగి పోయారు. అప్పటికి బాగా సూర్యోదయం అవుతోంది. ఆ సమయంలో, ఆ సూర్యోదయ సౌందర్యం చూస్తే మానవులే కాదు, చిన్ని చీమయినా సరే, ఆఖండ బ్రహ్మానందంలో లీనం కావలసిందే, కనీసం తాత్కాలికంగా అయినా.

ఆ లామాసరీ నుంచే మానస సరోవరం మొత్తం కనిపిస్తోంది. గుండ్రంగా చుట్టూ వున్న పర్వతాల మంచుమీద సూర్య కిరణాలు పడి ఎన్ని అద్భుతమైన అందాలను సృష్టిస్తు న్నాయో చెప్పేందుకు మాటలు చాలవు. సరస్సు నీటి పొరల మీద ఆ కాంతులెలా ప్రతి ఫలిస్తున్నాయో వర్ణించేందుకు భాష లేదు. అలా నలుదిక్కుల పొంగు లెత్తుతున్న ఆ సౌందర్యాన్ని కొంతసేపు తనివి తీరా ఆస్వాదించాలని ప్రయత్నం చేసి, తనివి తీరటం అసాధ్యమనిపించి, మెల్లిగా రేవు కేసి నడిచాడు సత్యనారాయణ.

నీళ్ళ దగ్గరకు వెళ్ళినవాడు నిన్నటికి మల్లే చటుక్కున నీళ్ళలోకి దిగాక, చేతులు జోడించుకొని, కొంతసేపు వుండిపోయాడు. ఆ తరువాత కొంతసేపటికి దిగి స్నానం చేయ బోయి ఆగిపోయి, కొంచెం పక్కకు వెళ్ళి స్నానం చేశాడు. ఆ సమయంలో హంసలు, కాసేపు నీళ్ళమీది నుంచి ఆకాశంలోకి యెగిరి, రెండు మూడు చుట్టులు షికారు కొట్టి వచ్చి కూర్చున్నాయి. స్నానం పూర్తి చేసి, ఆచమనం చేసి, కైలాస పర్వతాని కేసి చూసి నమస్కరించాడు. ఈలోగా ఇతని ఆలస్యాన్ని గమనిస్తున్న తోటివారు గబగబా వచ్చి పొడి బట్ట లందించారు.

"ఇది మీ వూరు కాదు. ఇది హిమాలయం. ఆ మాట మరిచిపోకండి" అని ప్రేమగా మందలించారు.

ఈ మాట ధ్యానంలో కూర్చోకుండా మంచునే కొద్దిగా ధ్యానం చేసి, బయలుదేరాడు సత్యనారాయణ. నడుస్తుండగా అడిగారు తోటివాళ్ళు.

"ఇందాక స్నానం చెయ్యకుండా నమస్కారం చేస్తూ నుంచున్నారేమిటి?" అని.

"కొందరు మహర్షులు స్నానాలు చేసి వెళుతున్నారు, వాళ్ళకు నమస్కరిస్తున్నాను."

"మా కెవరూ కనిపించలేదే?"

"వాళ్ళు సూక్ష్మరూపాల్లో వున్నారు."

"అలాగా, మాకు తెలీలేదు. లేకపోతే మేం గూడా నమస్కారం చేసుకునే వాళ్ళం. సరేగానీండి, స్నానం చెయ్యిబోతూ చెయ్యిబోతూ ఆగిపోయి మరో పక్కకు వెళ్ళారెందుకు?"

"అదా! ఆ దేవతా స్త్రీలు ఈతలు కొడుతున్నారు. మరీ నావైపు వస్తున్నట్టు వుంటే పక్కకి పోయాను. వాళ్ళ ఈతల వల్లే ఆ హంసలు కాసేపు ఎగిరిపోయాయి." ఈ వివరాలు విని వాళ్ళు ఆశ్చర్యపోయారు. కాని అది దేవతా భూమి అని వాళ్ళకు బాగా వినికిడి వుంది గనుక సందేహించకుండా విశ్వసించారు.

## హిమాలయం

తిరుగు ప్రయాణం మొదలైంది. గుర్రాల మీద నడక సాగుతోంది. ప్రమాదకరం అనుకున్న చోట మాత్రం గుర్రాలు దిగి జాగర్తగా నడుస్తున్నారు. అడుగడుగునా మహాద్భుత సౌందర్య నిధిగా వున్న ఆ హిమాలయ సానువులలో, ప్రతి అణువునూ నిశితంగా పరిశీలిస్తూ ముందుకు సాగుతున్నాడు సత్యనారాయణ. కొద్ది దూరంలోనే, పెద్ద సముద్రమంత చెరువు వొకటి కనిపించింది. అది దాదాపు మానస సరోవరమంతా వున్నది. అంత గుంప్రడంగా మాత్రం లేదు. అక్కడ వున్న అందాలు అన్నీ దాదాపుగా ఇక్కడా వున్నాయి. కాని అటు పోబుద్ధే పుట్టటం లేదు సత్యనారాయణకు. మొహమంతా చిట్లించుకొని "ఈ చోటు పేరేమిటి?" అని అడిగాడు తోటివారిని.

"దీన్ని రాక్షస్ స్థల్ అంటారు? పూర్వం రావణాసురుడు శివుడి కోసం ఇక్కడ తపస్సు చేశాడట. ఇక్కడినుంచి వెళ్ళి కైలాస పర్వతం ఎత్తాడట" అన్నారు వాళ్ళు.

"అదా సంగతి! అందుకనే ఇంత వెగటుగా వుంది దీని స్పందన" అన్నాడు సత్యనారాయణ. అక్కడ వాళ్ళు కొంచెం విశ్రాంతికోసం ఆగుదామనుకుంటుంటే, వద్దని కొంతదూరం పోయాక ఆపించాడు సత్యనారాయణ. మళ్ళీ ప్రయాణం సాగింది.

దార్లో అడుగడుగునా, ఏవో యేవో శిఖరాలను ఎక్కుతునే వున్నారు, దిగుతునే వున్నారు. అనేకచోట్ల వాగులు అడ్డం వస్తున్నాయి. అయితే గుర్రాలు అవలీలగా దాటేస్తున్నాయి. రాక్షస స్థల్ దాటిన కొద్దిసేపటికే, ఒక పెద్ద కొండ యెక్కి దిగేసరికి చాలా శ్రమ అయింది. అది మానస సరోవరం వున్న శిఖరం కన్నా ఎత్తయిన శిఖరం అని చెప్పారు.

కొన్నిచోట్ల మార్గం చూడటానికే భయంకరంగా వుంది. ఒక పక్క తల పైకి యెత్తినా చివర కనిపించని నిట్ట నిలువు కొండ. మరోపక్క వొంగి చూస్తే కళ్ళు తిరిగే లోతులోయ. ఈ రెండిటి మధ్య, కిటికీ మీాది చూరులాగా వున్న కొండదారి. ఇలాంటి దారి ఒకోసారి కొన్ని మైళ్ళ పొడుగు వుంది. ఈ వేసవిలో గూడా కొన్నిచోట్ల మంచు పోగులు పడి కనిపిస్తోంది. అలాంటిచోట ఆ నున్నటి బండలమీాద కాలు జెసికితే, ఇక చెప్పేపనిలేదు. "ఒక పక్క ఇంత సౌందర్యం, మరోపక్క ఇంత ప్రమాదం. అందుకనే హిమాలయ యాత్రే ఒక సాధన అన్నారు పెద్దలు" అనుకున్నాడు సత్యనారాయణ తనలో.

అనేక విచిత్రమైన ఓషధీ తరంగాలు సత్యనారాయణకు అనుభవానికి వస్తున్నాయి. కనిపించిన ప్రతి వాగులోనూ నీరొకసారి వాసన చూసి, తరువాత రుచి చూస్తున్నాడు సత్యనారాయణ. కొంతసేపయినాక "ఏమిటిది, ఎందుకిలా చేస్తున్నారు" అన్నారు తోటివాళ్ళు.

"ఒక్కొక్క వాగులో ఒక్కొక్క ప్రత్యేక ఓషధీ గుణం కనిపిస్తోందేమిటి? అందు కోసమే పరిశీలిస్తున్నా" అన్నాడు సత్యనారాయణ.

వాళ్ళు ఆశ్చర్యపోయి, యిలా చెప్పసాగారు. "అది మాకు తెలిదు కానీండి, మా పల్లెలలో పెద్ద వాళ్ళు చెప్పుకొనే మాట వొకటి వుంది. ఇక్కడ ప్రతి మొక్క ఒక ఓషధి అంటారు మా వాళ్ళు. అనేక విచిత్రాలను ప్రత్యక్షంగా ప్రదర్శించే చెట్లను మేము గూడా చూశాం.

కొన్ని చెట్లు ముట్టుకుంటే దూరంగా విసిరికొడతాయి. కొన్ని చెట్లు ముట్టుకున్న ప్రాణిని లాక్కొని నమిలేస్తాయి. కొన్ని చెట్లు ముడుచుకుపోతాయి. కొన్ని చెట్లు చచ్చి పోతాయి. రక్తప్రసారం కలిగిన చెట్లు గూడా వున్నాయంటారు. మేము మాత్రం ఎర్రని రసం గల చెట్లను చూశాం. ఆకులను తుంచితే ఎర్రటి పాలు కారుతాయి. అలాగే గడ్డి గూడా అనేక రకాలు వుంటుంది. ఒక రకం గడ్డి రాత్రి పూట దానంతట అదే మిణుగురు పురుగుల్లాగా వెలుగుతూ వుంటుంది. మరో రకం గడ్డి పుల్లలు నిప్పు అంటిస్తే, నూనె గుడ్డల కాగడాల లాగా నిలబడి కాలతాయి. ఒక రకం గడ్డి గొర్రెలకు ప్రత్యేకంగా పుష్టినిస్తుంది. ఏమయినా, గడ్డి కాని, ఓషధుల మొక్కలు గానీ అన్నీ, యిదుగో ఈ వేసవికాలంలోనే మొలిచేది. మీాకు తెలిసే వచ్చారనుకుంటా, మంచి అనుకూలమైన కాలంలో వచ్చారు. ఈ జూన్, జూలై కాలమే, ఇక్కడ బాగా రాళ్ళు బయటపడి గడ్డి, మొక్కలు, పూలు కనిపించేది. అందువల్లే మానస సరోవరం గూడా గడ్డకట్టుకోకుండా వుంది. లేకపోతే అక్కడ నీళ్ళు కనిపించవు. దాని కొండ

గోడలూ కనిపించవు. అంతా మంచు గడ్డే! ఈ గడ్డి, ఈ ఓషధులు ఇలా మొలిచి పెద్దవయేసరికి మంచుకాలం వచ్చేస్తుంది. ఆ మంచులో ఇవన్నీ పూడుకుపోతాయి. మళ్ళీ ఎండాకాలం వచ్చేసరికి మంచు కరిగిపోతుంది. అప్పుడు ఆ మంచు నీళ్ళతోపాటు యీ ఓషధులు గూడా అందులో కరిగి కొట్టుకుపోతాయి. ఈ ఓషధుల నీరు రాళ్ళల్లోకి దూరిపోయి, ఎక్కడో ఒక వాగుగా తేలుతుంది. ఏ ఏ ప్రాంతాల నీరు వాగులో కలిసిందో, దాన్ని బట్టి ప్రత్యేకంగా ఆయా ఔషధాల లక్షణాలు ఆ వాగుల్లో వుంటాయని మా పెద్దవాళ్ళు అంటారు.

కొన్ని కొన్ని రోగాలకు ప్రత్యేకంగా యాత్రలాగా చేయించి, కొన్ని వాగుల నీళ్ళు తాగిస్తారు. కొన్ని కొన్ని రోగాలకు నిమిషాలలో, నిమిషాలంటే నిమిషాలే, గుణం చూపించే వాగులు ఉన్నాయని యిప్పటికీ ఇక్కడి పల్లెలవాళ్ళు చెపుతూ వుంటారు. మీరు యీ వాగుల నీళ్ళల్లో ఔషధీ లక్షణా లున్నాయనేసరికి మా కివన్నీ గుర్తు వచ్చాయి. ఈ ఎత్తు ప్రాంతాలలో ఎక్కడా పెద్ద చెట్లు వుండవు. చూడండి, అన్నీ చిన్న చిన్న రకాలే. అదిగో తలెత్తి ఆ కొండ కొప్పులు చూడండి. అక్కడ యీ వేసంగిలో గూడా మంచు కప్పే వుంటుంది. అలాంటిచోట్ల అసలు గడ్డి గూడా మొలవదు. కిందకు దిగినకొద్దీ ఓషధులు, చెట్లు, పంటలూ అన్నీ వస్తాయి. వచ్చేటప్పు డసలు మీరు అదో మాదిరిగా వున్నారు. లేకపోతే అప్పుడే చెప్పేవాళ్ళం"

ప్రయాణపు అలసట తీరటానికి ఏదో వొకటి సరదాగా మాట్లాడుకుంటూ పోవటం బాటసారుల సామాన్య లక్షణం. ఇప్పుడు తమ బాటసారి గూడా తమ లక్షణానికి వచ్చాడు గదా అని సంబరపడిపోయి టకటకా చెప్పేశారు, ఆ తోటివారు.

ఆ ప్రయాణంలో చిన్నా పెద్దా మొత్తం కలిపి వందపైగా వాగులు తగిలాయి. కొన్ని చోట్ల వాగులు చిన్న చెరువుగా ఏర్పడటం గూడ కనిపించింది. వాగులకంటే విచిత్రమైనవి గుళ్ళు. అక్కడక్కడ ఉన్నట్టుండి, అత్యంత ప్రమాదకరమైన, ఎక్కటానికి కష్టసాధ్యమైన శిఖరాగ్రాన, చిన్న వంటరి ఆలయం కనిపిస్తోంది. దూరం నుంచి చూస్తే, యెవడో వంటరి సాధువు తపస్సు చేసుకుంటున్నట్టుగా వుంటుంది ఆ గుడి, అంత నిశ్శబ్దంగా! అంత నిశ్చలంగా!! అయితే ప్రతి గుడికీ ఒక పెద్ద కథ చెపుతున్నారు తోటివారు. ప్రతి గుడికి ఒక తిరునాళ్ళరోజు వుంటుందట. ఆ రోజు వందల కొద్దీ గ్రామాలనుంచి, వేల కొద్దీ జనాలు వస్తారట ఈ గుళ్ళకి. ప్రతి గుడికీ ఒక గురువు వుంటాడట — పూజలూ అవీ చెయ్యటానికి. ఆశ్చర్యకరమైన కథలు వింటూ ప్రయాణం సాగిస్తున్నాడు సత్యనారాయణ.

సూర్యాస్తమయం కాబోతుండగా ఒక చిన్న పల్లె చేరారు. "వెన్నెలగా వుందిగా, నడక సాగించరాదా" అన్నాడు సత్యనారాయణ.

"బలేవారే, ఇది అసలే మంచి దారి కాదు. బందిపోట్ల భయం వుంది" అన్నారు వాళ్ళు.

" ఈ మంచు ఎడారిలో గూడా బందిపోట్ల భయమా ? " ఆశ్చర్యపోయాడు. సత్యనారాయణ.

" ఇది టిబెటు ప్రాంతం గదండీ, ఇక్కడికి కొందరు ధనవంతులైన యాత్రికులు వస్తూ వుంటారు. టిబెట్ వ్యాపారులు గుర్రాలమీద ప్రయాణాలు చేస్తుంటారు. అందుకోసం దొంగల భయం గూడా వుంటుంది. మన దగ్గరున్న రొట్టెలు, బిస్కట్లు లాక్కుపోయినా మనం యాతన పడాలి. మన గుర్రాలు లాక్కున్నారంటే మనం చచ్చామే. అందుచేత ఇక్కడ ఆగుదాం " అన్నారు.

అది రెండు కొండల మధ్య చిన్న చదును ప్రదేశం. కొద్దిమైళ్ళ విస్తారం వుంటుందేమో. అక్కడ కొద్దిపాటి దున్నిన భూమి కనిపిస్తోంది. అక్కడ ఒక పాతిక ముప్ఫయి గుడిసెల పల్లె వుంది. ఆ గుడిసెలన్నీ కేవలం చెక్కలతోనూ, దూలాలతోనూ, గుండ్రంగా నిర్మించి వున్నాయి. అన్నీ చిన్న చిన్న గుడిసెలే. అటు దిగసాగారు బాటసారులు.

సూర్యాస్తమయం వచ్చేసరికి మరోసారి అందాల వాన కురిసింది. ఎటు చూసినా మంచు టోపీలు పెట్టుకున్న శిఖరాలు. ఆ శిఖరాలు గూడా మామూలుగా కనిపించటంలేదు. వెన్ను కొంచెం వెనక్కు విరుచుకొని, మెడ పూర్తిగా వెనక్కి వాల్చి, కళ్ళు చిట్లించుకొని, అరచెయ్యి నుదుటి దగ్గర పెట్టుకొని, చూస్తేగాని యే శిఖరమూ సరిగా కనిపించటంలేదు. ఏ శిఖరానికి ఆ శిఖరమే వేలకువేల అడుగులయెత్తు వున్నట్టుంది చూస్తే.

ఈ అస్తమయ కిరణాల మిలమిలలలో మరింత వెలిగిపోతున్న ఆ శిఖరాలను వెర్రిగా చూస్తున్నాడు సత్యనారాయణ. చాలా శిఖరాలలో కొందరు యక్షులు, కొన్నిచోట్ల గంధర్వులు ప్రత్యేకంగా నివాసం యేర్పరుచుకొని వుండటం అతనికి కనిపించింది. సంధ్యాకాల సౌందర్య పరామర్శలో, అన్ని శిఖరాలనూ నిశితంగా పరిశీలిస్తున్న సత్యనారాయణను చూసి, కొందరు యక్షగంధర్వాదులు తలలు వొంచుకొని తప్పుకు పోతున్నారు. కొందరు నమస్కరించి వెనక్కు పోతున్నారు. కొందరు తేరిపారచూసి వూర్కుంటున్నారు.

గుర్రాలమీద ఊళ్ళోకి ప్రవేశిస్తున్న ముగ్గురు వీరులను చూసి, పల్లెలోని ఆడ మగ బిల బిలామని వాకిళ్ళలో పోగుబడి తగు జాగర్తలో నిలబడ్డారు. అయితే తోటివారు అనుభవజ్ఞులు గనుక, వారికేవో కొన్ని సంజ్ఞలు చేయటంతో, భయపు బిగింపు పల్లెవారి ముఖాలలోంచి పోయింది. కొందరు ఎదురొచ్చి స్వాగతం చెప్పారు. తోటివారూ, వాళ్ళూ ఏవో మంతనాలు చేశారు. చివరకు పల్లెవాళ్ళు ఒక చిన్న గుడిసె ఖాళీచేసి అతిథుల కిచ్చారు. కొద్దిగా గోధుమలు, ఒక రకం గింజలు కొన్ని, నాలుగు పాత్రలు ఇచ్చి వెళ్ళారు.

"వచ్చిన అతిథులకు కావలసినవి యిచ్చి, వారినే వండుకో మనటం, యీ జాతివారికి మర్యాద లక్షణం. అతిథులు వాళ్ళకు కావలసిన రుచిలో వారు వొండుకు తింటారని వీరి అభిప్రాయం " అన్నారు తోటివారు.

"మన దగ్గర రొట్టెలున్నాయిగా, ఇవెందుకు మనకు" అన్నాడు సత్యనారాయణ.

వాళ్ళ వస్తువు లేవీ తీసుకోకపోతే, అది అవమానంగా భావిస్తారు వాళ్ళు. అందుకని కొద్దిగా వొండుకున్నామంటే వండుకున్నా మనిపించుకొని బయటపడదాం" అన్నారు తోటి వాళ్ళు.

సరే, ఆ రాత్రి అక్కడ ప్రశాంతిగా నడిచింది. తోటివారు నిద్రపోగా, ధ్యానంలో కూర్చుండి పోయాడు సత్యనారాయణ. అర్ధరాత్రి ఎప్పుడో ఒకసారి బాహ్యాస్మృతి వచ్చింది. ఒకసారి బయటకు వచ్చి కలయ చూశాడు. రంపపు మిల్లులో రంపపు పొట్టులాగా, ఆ చుట్టు పక్కలంతా మంచు బోలు బోలుగా చల్లబడి వుంది. "ఇది వేసంగి లక్షణం గాబోలు" అనుకొని, లోపలికెళ్ళి మళ్ళీ కళ్ళు మూసుకొని కూర్చున్నాడు.

ఆ మర్నాడు బయలుదేరి వస్తుంటే, దారిలో అనేకచోట్ల మంచు పేరుకొని దారి మూసుకుపోయింది. కొన్నిచోట్ల గుర్రాలు దూక గలిగాయి. కొన్నిచోట్ల వాటిమీది నుంచీ జాగర్తగా ఎక్కి దిగవలసి వచ్చింది. ఇక పోను పోను వెడల్పయిన లోయలు, వాటిలో పంట భూములు, వ్యవసాయపు పనులు, పల్లె పట్టులు కనిపించటం పెరిగింది. పల్లెలు వచ్చిన చోట్ల దారులు కొంచెం బావున్నాయి. ఎంత బావున్నా నడక ప్రమాదమే,కాని అలాంటి చోట్లలోగూడా ఆ పల్లె ప్రజలు ఉల్లాసంగా పరుగులు తీయటం కనిపించింది. కొన్నిచోట్ల పసిపిల్లలను వెన్నున కట్టుకొన్న తల్లులు గూడా పరుగులు తీస్తున్నారు. ఆ పరుగులు వారికి పని తొందర మాత్రమే కాక, పందేలు వేసుకొనే క్రీడ గూడానట! ఎంత ప్రమాదమైన క్రీడ కాని, సామాన్యంగా కాలుజారి ప్రమాదం జరిగిన సంఘటనలు వుండవట! ప్రమాదమంటే యే అయిదారువేల అడుగుల లోతులోకో పడిపోవటమే.

ఆ రోజు ప్రయాణంలో ఒకచోట ఒక దోవలో ఒక పెద్ద వ్యాపారుల గుంపు కలిసింది. ఆ గుంపులో దాదాపు వందమంది వున్నారు. వాళ్ళు గుర్రాలమీద మంచి చాకచక్యంగా సాగిపోతున్నారు. సత్యనారాయణ తోటివాళ్ళు వారితో కలిసివెళితే అది రక్షణగా వుంటుందని యెంతో ఆశపడ్డారుగానీ, సత్యనారాయణకు గుర్రం అలవాటు లేనందువల్ల అంత వేగంగా గుర్రం నడిస్తే అతమ జారిపోసాగాడు. దాంతో తోటివారు, తాము గూడా వేగం తగ్గించారు. ఫలితంగా ఆ గుంపు ముందుకు పోయింది. ఈ ముగ్గురు వెనకబడిపోయారు. సత్యనారాయణ తృప్తిగా నిట్టూర్చి గుర్రంమీద కుదురుగా కూర్చున్నాడు.

తోటివారు గుంపును కోరటంలో భావం లేకపోలేదు. క్రిందికి వస్తున్న కొద్దీ, లోయ వచ్చినప్పుడల్లా అడవి వస్తోంది. పెద్ద పెద్ద వృక్షాలు, గుబురులు పెరుగుతున్నాయి. ఆ వృక్షాలలో భూర్జపత్ర వృక్షాలు కోకొల్లలుగా వుండటం ఒక విశేషం. ఇలా లోయలుగా వున్నచోట ఒక చిన్న వాగు గూడా వుందంటే, అక్కడ తప్పకుండా ఒక పల్లె ఏర్పడుతోంది. దారిలో అలాంటి పల్లెలు చాలా కనిపించాయి. ఆ పల్లెలలో ప్రధాన జంతువులు గొర్రెలు.

ఈ వేసంగిలో ఓషధీ విలువగల ప్రత్యేకమైన గడ్డిని మేసేందుకు, బహుదూరాల శిఖరాలకు గూడా పెద్ద పెద్ద గొర్రెల మందలను తోలుకొని పోయి తిప్పుతున్నారు. ఇక్కడి ప్రజల సాహస ప్రియత్వం సత్యనారాయణను ప్రత్యేకంగా ఆకర్షిస్తోంది.

పల్లెలుగా ఏర్పడ్డచోట్ల ఏ భయమూ లేదు కానీ, ఇలా అడవులు ఏర్పడిన చోట క్రూర మృగాల భయం ఎక్కువగా వుంటుంది. అందువల్ల రక్షణ వుంటే బావుందనుకున్నారు తోటివారు. కాని, ఏం చేస్తాం? వారి కది దక్కలేదు. వారి కేమి దక్కాలని వ్రాసి పెట్టివుందో ?

కొంతదూరం పోయాక దూరంలో ఒక పల్లె కనిపిస్తోంది. ఆ పల్లెకు ఇవతల చిన్న శిఖరం వుంది. ఆ శిఖరంచుట్టూతా పెద్ద పూల తోట వుంది. అలాంటి పూల తోటలు ఇదివరకే రెండు మూడు కనిపించాయి. ఆ కారడవిలో ఈ పూల మొక్కలను ఇంత జాగ్రత్తగా ఎవరు పెంచుతారో యేమో తెలీదు గాని, ఒక మంచి ఉద్యానవనంలో వున్నంత నగిషీగా ఆ మొక్కలు తీర్చబడి వున్నాయి. ఒక రంగు పూలు ఒక బారుగా, మరొక రంగు పూలు మరొక బారుగా, ఒకోచోట రంగుల చుక్కల ముగ్గులులాగా, వింత వింత రంగుల పూల మొక్కలు ఒక ప్రత్యేక పద్ధతిగా అమర్చి వున్నాయి. మొక్కలన్నీ విరగపూచి వున్నాయి. అన్నీ సువాసనలతో గుమగుమలాడి పోతున్నాయి. మొత్తంమీద అది ఒక మహారాజ భవనంలో తీర్చిదిద్ది వున్న పూల తోటలాగా వుంది. ఆ చెట్ల క్రింద రాలిపోయిన పూలుగాని, ఆకులు గాని, అలాంటి చెత్త నలకంత కూడా కనిపించటంలేదు. ఇప్పుడు ఆ తోట దగ్గర ఒక పల్లె యువకుడు స్పృహ తప్పి పడిపోయి వున్నాడు. వాడి చుట్టూ కొందరు పెద్దవాళ్ళు కూర్చుని, దీనంగా ఆ కొండకేసి దణ్ణాలు పెడుతున్నారు.

సత్యనారాయణ గుర్రం అటు తిప్పాడు. తోటి వారిద్దరూ ఠక్కున ముందుకొచ్చి వెళ్ళటానికి వీల్లేదని దారి కడ్డంపడ్డారు. "ఏమిటి విషయ" మంటే వాళ్ళు ఇలా చెప్ప సాగారు.

"ఇక్కడ కొండలలో కొన్ని చోట్ల కొందరు దేవతలు కాపరాలు వుంటారు. ముఖ్యంగా ఆడదేవతలు ఎక్కువగా వుంటారు. వాళ్ళకు పరిశుభ్రం ఎక్కువ. వాళ్ళ ప్రాంతంలో ఎవరైనా ఉమ్మేయ్యటం గాని, వాళ్ళ పూలు తుంచటం గాని, దూరంగా వున్న ఆడవాళ్ళు అక్కడికి రావటం గాని, యిలాంటి పను లేమయినా జరిగితే వాళ్ళు వెంటనే శిక్షిస్తారు. సామాన్యంగా మరణదండన వెయ్యరు. అలా శిక్ష పడ్డవాడికి కొంతసేపు స్పృహ లేకుండా పోతుంది. ఇప్పుడదే జరిగిం దక్కడ. వాడేదో చేసివుంటా డక్కడ. ఏ మూత్ర విసర్జనమో ఏదో! అందుకే వాళ్ళవాళ్ళు ప్రార్థిస్తున్నారు.అలాంటి సందర్భంలో మనం అక్కడికి పోవటం దేనికి? వద్దు."

ఇలా చెపుతుండగానే, నిమిషాలలో నాలుగు మేఘాలు పోగై ఆ ప్రాంతాలలో దడదడా ఒక వాన దంచేసింది. అంతా ఎంతసేపు? ఒక పది నిమిషాలు. ఆ పది నిమిషాలలో ఆ తోట

ప్రాంత మంతా చక్కగా కడిగేసి నట్టయిపోయింది. ఆ వానలో తడిశాక, స్పృహ తప్పిన వాడు లేచాడు.

"ఈ వాన ఆ దేవత అనుగ్రహానికి గుర్తు. ఈ వానలో ఆ అపవిత్రతను కడిగేసు కుంటుంది ఆ దేవత. తన తోటలో గానీ, తన ప్రాంతంలో గాని చిన్న కుళ్ళిపోయిన ఆకు పడ్డా సరే, ఇలా వాన తెప్పించి కడిగేసుకొంటారు ఈ ఆడ దేవతలు. అందుకనే ఈ తోటలు ఇంత శుభ్రంగా వుంటాయి. దేవతకు కోపం తీరాక వాడు లేచాడు చూశారుగా" అన్నారు తోటివాళ్ళు. సత్యనారాయణ ఆ కొండ శిఖరం వంక పరిశీలనగా చూశాడు. అక్కడ ఒక్క ఆడ దేవతే గాదు, ఒక గంధర్వ కుటుంబమే వుంది. మౌనంగా తలపంకించేసి, ముందుకు సాగాడు సత్యనారాయణ. అనేక స్థలాలలో, మహాత్ములైన బ్రహ్మర్షుల దివ్య తరంగాలు తగులుతున్నాయి సత్యనారాయణకు. కొద్దిమంది దూరదూరాలలో ప్రత్యక్షంగా కనిపించారు. కాని, ఎవరితోనూ మాట్లాడేందుకు లోపలనుంచీ ఆజ్ఞ రావటం లేదు. అనేక చోట్ల గుహలు కనిపిస్తున్నాయి. కొన్నిచోట్ల కొందరు సాధువులు కనిపించారు. కాని, బాటలకు దగ్గరలో అంత విశేషమైన మహాత్ములు యెవరూ నివసించటంలేదు. ఈమాత్రం జనస్పర్శ గూడా వారికి సమ్మతం కాదు గాబోలు.

ప్రయాణం కొనసాగింది. ఆ రాత్రికి ఒక పల్లెకు చేరాలని వాళ్ళు అనుకున్నారు కాని సత్యనారాయణ వేగం చాలకపోవటంవల్ల చీకటి పడ్డాక గూడా నడక సాగించాల్సివచ్చింది. తోటివాళ్ళు భయంతో కంగారు పడుతుంటే "వెన్నెలలో యీ కొండ అందాలు చూసుకొంటూ పోదాం, తొందరేమి ?" అన్నాడు సత్యనారాయణ. "మీ అందం మాట సరే, ఇది అడవిగా వుంది. ఏ పులో వచ్చి మీద పడిందంటే దిక్కు లేదు. అదీ మా భయం" అన్నారు తోటివాళ్ళు.

వాళ్ళు భయపడ్డట్లే కొంత దూరం పోయేసరికి పొదలలో ఏదో వింత ధ్వని వినిపించ సాగింది. క్రమంగా ఆ ధ్వని దగ్గర కాసాగింది. దగ్గర అయిన కొద్దీ అది ఎలుగుబంటు అరుపని తెలిసింది. తోటివాళ్ళకు పై ప్రాణాలు పైనే పోయినాయి. వెంటనే బ్యాటరీలైటు బయటకు తీసి పొదల మీద వెయ్యసాగారు. దీపం గానీ, మంట గానీ చూస్తే ఎలుగుబంటు ఇక అటు రాదు. ఆ ధైర్యంతో వాళ్ళు గుర్రాల మీదే కూర్చుని బ్యాటరీలతో గబగబా పొదలు వెతుకు తున్నారు. ఈలోగా వెనకాలనుంచీ వచ్చిఒక్క అరుపు అరిచింది ఎలుగుబంటు. తోటివాళ్ళ చేతుల్లో బ్యాటరీలైట్లు జారి కింద పడిపోయినాయి. సత్యనారాయణ తనే గుర్రం మీంచి జారి కింద పడ్డాడు. ఇది గమనించిన తోటివారు ప్రాణభయంతో తమ గుర్రాలను దౌడు తీయించారు. సత్యనారాయణ గుర్రం కూడా వాళ్ళ వెంట పరిగెత్తేసింది. అలా దౌడు తీసిన తోటివారు కొంతదూరం వెళ్ళి ఒక లోయ మలుపు తిరగబోతూ వెళుతూనే జాలిగా వెనక్కి చూశారు. చూసినవాళ్ళు గుర్రాలను చటుక్కున ఆపేసి క్రిందికి దిగారు.

అక్కడ పండు వెన్నెలలో సత్యనారాయణ, ఆ ఎలుగుబంటు మంచురాళ్ళ మీద ఎదురు బదురుగా కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు! కాదు ఎలుగుబంటు ఏదో పెడుతోంది, సత్యనారాయణ తింటున్నాడు!! ఈ వింత దృశ్యం చూసి తోటి వారికి కాసేపు వూపిరాడ లేదు. గుండె కొట్టుకోవటం ఆగిపోయినట్టు వుంది. ఇలా కొద్దిసేపు జరిగినాక, సత్యనారాయణ, ఆ యెలుగుబంటు ఒకరి నొకరు కౌగలించుకొన్నారు. ఆ కౌగిలింత తరువాత సత్యనారాయణ వెన్ను తట్టగా, ఎలుగుబంటు మెల్లిగా వెళ్ళిపోయింది.

అప్పటికి ఊపిరి దిగి వచ్చిన తోటివారు మొహాలు చూసుకొని, మళ్ళీ గుర్రాలు ఎక్కారు. సత్యనారాయణ గుర్రాన్ని గూడా వెనక్కి పిల్చి అతని దగ్గరకు వచ్చారు. వాళ్ళు వచ్చేసరికి సత్యనారాయణ ముందు ఒక పెద్ద చీల్చిన పనస పండు వుంది. "రండి, రండి, భయం లేదు, మీ కోసమే అట్టే పెట్టి వెళ్ళాడు మా మిత్రుడు" అన్నాడు సత్యనారాయణ. ఆశ్చర్యచకితులైన వాళ్ళ దగ్గరకు తానే వచ్చి పనస తొనలు పెట్టాడు సత్యనారాయణ. ఆ ప్రాంతాలలో లేని ఆ వింత పండుని చూసే ఆశ్చర్యపోతున్న ఆ యిద్దరూ, ఆ రుచికి మరింత ఆశ్చర్యపోతూ, ఆ ప్రసాదం తిన్నారు. తిన్నాక మెల్లిగా, "ఇంతకూ, ఆ ఎలుగుబంటు ఎవరండీ?" అని అడిగారు.

"ఏమో!"

"అదేమిటండీ, మీరు దాన్ని కౌగలించుకున్నారుగా?"

"అది ప్రేమగా వచ్చింది, నేను ప్రేమగా కౌగలించుకున్నాను".

"అది ఎవరైనా దేవతా ఏమండీ?"

"ఏమో, మరి?"

ఇక అతను అంతకన్నా చెప్పడని గ్రహించి, వదిలేశారు ఆ యిద్దరూ. ఆ తరువాత ప్రయాణం సాఫీగానే సాగిపోయింది, ఒక చిన్న సంఘటన మినహాయిస్తే.

ఒకచోట పెద్ద వెడల్పాటి లోయ. అక్కడ పెద్ద చెట్లకన్నా పొదలు, గడ్డి ఎక్కువగా వున్నాయి. ఆ పొదలలో, ఆ గడ్డిలో అడవి దోవలు మెలికలు మెలికలు తిరుగుతున్నాయి. ఒక మెలిక కనుక తప్పిపోతే, గుర్రమూ, మనిషి కనిపించటంలేదు. అనేక సంకట మార్గాలలో దారి అనుమానం ఇది వరకూ చాలాసార్లు వచ్చింది. కానీ ఈ మాటు, ఎలా తప్పారో దారి తప్పారు. కొంత దూరం పోయాక చూస్తే మళ్ళీ వెనక్కి వెళుతున్నామని తెలిసింది. అప్పుడు యేమి చెయ్యాలో తెలీక గాబరా పడుతున్నారు, సహాయకు లిద్దరూ. ఎందుకంటే, ఆ ప్రాంత మంతా పాములతో నిండి వున్నట్టు కనిపిస్తోంది. అప్పటికే చాలా పాములు వారి కంట పడ్డాయి. ఇక దారి తప్పి, ఆ రాత్రి ఆ అడివిలోనే గడపవలసి వస్తే, తమకు నాగలోక ప్రయాణం ఖాయమే. వెర్రి ఆదుర్దాతో దారి కోసం వెతుకుతున్న కొద్దీ, తిరిగిన దారే తిరగటమవుతోంది. ఉన్నట్టుండి "ఇదీ అసలు దారి" అన్నాడు సత్యనారాయణ. "మీ కెలా తెలుసు?"

అన్నారు వాళ్ళు. "అది మీ కెందుకు? తొందరగా గూటికి చేరాలనుకుంటే ఇటు నడవండి" అన్నాడు సత్యనారాయణ గంభీరంగా. ఏదో దారి ప్రయత్నించాలిగా. అటు నడిచారు అందరూ. అదే అసలు దారి అని త్వరలోనే రుజువయింది.

ఆ తరువాత ప్రయాణం సాఫీగానే సాగింది. ఆ మర్నాడు "తకలాకోటెమండి" అనే గ్రామానికి చేరారు. అది టిబెటినుల చిన్న వ్యాపార కేంద్రం. అక్కడ ఆ రాత్రి గడిపి, ఆ మర్నాడు పగలు మధ్యాహ్నంలోపే భారత భూభాగంలోకి ప్రవేశించారు. అక్కడ ఒక గ్రామంలో వీరి జీపును నిలబెట్టుకొని వున్నారు. ఆ జీపులో ప్రయాణం చేసి ఆ రాత్రికి అల్మోరా అనే వూరు. చేరుకొన్నారు. అక్కడి నుంచి ఢిల్లీ చేరుకోవటానికి మరో రెండు రోజులు పట్టింది.

'ఇదేమిటి, ఎగువ ప్రయాణం నాలుగు రోజుల్లో అయిపోయింది. దిగువ ప్రయాణం ఆరు రోజులు పట్టింది, యిదేమిటి?' అన్నాడు సత్యనారాయణ.

"అదేనండీ, మాకూ మతి పోతోంది. ఎగువలో ఆలస్యం కావాలి. అసలు దిగువలో ఆలస్యం చేసింది యేమీలేదు. ఎగువ నాలుగు రోజుల్లో ఎలా వెళ్ళామా అనేదే మాకూ బొత్తిగా అర్థం కావటం లేదు" అన్నారు తోటివాళ్ళు.

"అదంతేలే, యీ ప్రయాణం తీరు అటువంటిది" అన్నాడు సత్యనారాయణ నవ్వుతూ. ఆ చిరునవ్వు చూసి, యేదో సమ్మోహన మయినట్టు అనిపించింది ఆ ఇద్దరికీ.

ఢిల్లీ రైల్వే స్టేషనులో తనని వదిలి వెళ్ళటానికి బాధ పడుతున్న యిద్దరితో నిష్కర్షగా చెప్పాడు సత్యనారాయణ. "చూడండి, ఇది మన షరతుల్లో వుంది. ఇక్కడితో మీకూ నాకూ రాం రాం. మీకూ, మీ యజమానికీ గూడా క్షేమం కలుగుతుంది. వెళ్ళిరండి" ఆ జన సమ్మర్దంలో ఏమీ సందేహించకుండా యీ కుర్రవాడి రెండు పాదాలకూ తల లానించి నమస్కరించి, కళ్ళనీళ్ళతో సెలవు తీసుకొని వెళ్ళిపోయారు, సహాయకు లిద్దరూ.

ఆ గందరగోళపు రైల్వేస్టేషనులో సత్యనారాయణ ఒంటరిగా మిగిలిపోయాడు. ఏం తెలివి తనది? ఆ ధనవంతులతో షరతులు పెట్టేటప్పుడే మైసూరుదాకా తీసుకెళ్ళి దింపాలని పెట్టకూడదా! కాని, ఆ షరతులు తను పెట్టాడా? అందులో తన కర్తృత్వం వుందా? కర్తృత్వం లేనప్పుడు తనకు చింత ఎందుకు?

కొందరు ఇతర ప్రయాణీకులతోపాటు ఒక బల్ల మీద కూర్చున్నాడు సత్యనారాయణ. కూర్చుని చెయ్యి పక్కన పెట్టేసరికి చేతికి ఏదో తగిలింది. తీసి చూస్తే ఒక టికెట్టు. పక్క వారందర్నీ అడిగాడు 'ఈ టికెట్టు మీదా, మీదా' అని. ప్రతివాళ్ళూ మాది కాదంటే మాది కాదన్నారు. ఆ టికెట్టేమిటి అని చూశాడు. ఢిల్లీ నుంచి బెంగుళూరుకి టికెట్టు!

ఇంతలో మైకులో వినిపించింది, బెంగుళూరు వెళ్ళే రైలు ప్లాట్‌ఫారం మీాదికి వస్తుందని. ఒక నిమిషం ఆగి, టికెట్లమ్మే కౌంటరు దగ్గరకు వెళ్ళి "అయ్యా ఈ టికెట్టు... " అని యేదో అడగబోయాడు సత్యనారాయణ. "ఇప్పుడే కాదుటయ్యా బెంగుళూరుకి టికెట్టు కొన్నావు, మళ్ళీ ఏమిటి అనుమానం. టికెట్టు సరిగానే యిచ్చాం" అన్నాడు లోపలి వ్యక్తి విసుగ్గా. ప్లాట్‌ఫారం మీాదికి నడుస్తూ ఆలోచనల్లో పడిపోయాడు సత్యనారాయణ.

"ఇంకేముంది ? అర్థమవుతోంది. అమ్మ తీసుకు రాదలచుకుంది, తీసుకు పోదలచుకుంది. వచ్చేటప్పుడు ఒక రకం మార్గం చేసింది ఢిల్లీ దాకా. అక్కడి నుంచి మరో రకం మార్గం చేసింది. ఇప్పుడు మళ్ళీ అదే మార్గం చెయ్యాలా ? అమ్మ దగ్గర లక్షల మార్గాలు ఉన్నాయి. ఇప్పుడు మరో మార్గం తనకు చూపిస్తుంది. ఇలా అడుగడుగునా చెయ్యి పట్టుకు నడిపిస్తుంటే, తనేదో ఆలోచనలు చేస్తాననటం వెర్రిగాక మరోటి అవుతుందా ?

సాధనలో ఎగువ మార్గంలో అమ్మే నడిపించింది. అప్పుడు కళ్ళు మూసుకొని విమానంలో కూర్చున్నాం. సరాసరి శిఖరాగ్రాన దిగాం. తిరుగు ప్రయాణంలో కళ్ళు తెరుచుకోమంది, చూస్తూ నడవమంది. చెయ్యి పట్టుకొని తను ముందర నడిచింది. కళ్ళు తెరుచుకుని నడుస్తుంటే, అనేక విషయాలు కనిపించాయి, కనిపించనీ. ఆ కనిపించేదంతా అమ్మ విలాసమే అయినప్పుడు అది మనకు విఘ్నమెలా అవుతుంది ? అందుకే ఇప్పుడు తిరుగు ప్రయాణం మరింత ఆనందదాయకంగా సాగింది మనకు. విమానమైనా, కాలినడకైనా, అమ్మే చూసు కొంటోంది. ఈ జ్ఞానం లేకపోబట్టే ఆ చింత కలిగింది మనకు.

చింత అంటే విశ్వామిత్రుడు ! శాంతి అంటే వశిష్ఠుడు. అమ్మ కరుణ వల్ల ఇప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠుడయ్యాడు. ఇది శాంతి. భంగం లేని, భంగమయ్యే అవకాశమే లేని శాంతి.

ఇప్పుడు భూమి శాంతి, అంతరిక్షం శాంతి, దిక్కులు శాంతి, అవాంతర దిక్కులు శాంతి. అంతా శాంతి. ఈ శాంతియే శాంతి. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!

చిరు కుదుపులలో ఉయ్యాల లూగిస్తూ సత్యనారాయణను తీసుకుపోతోంది రైలు బండి.*

* * *

"మహాత్మా ! ధన్యోస్మి. నా తప్పు తెలిసింది. దిద్దుకుంటాను. కాని, చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం తెలియ లేదు." అన్నాడు వృద్ధయోగి.

"ప్రియ శిష్యులు తమ తప్పు తాము తెలుసుకోవటమే గురువులకు పెద్ద పండుగ. ఇంకా వేరే ప్రాయశ్చిత్తం మీా గురువులు కోరరు. అయినా, మీా గురువులే తీర్థ యాత్రలు మీాకు

---

* ఈ సమయంలోనే గండకీ నదీ స్నానం గూడా జరిగిందని స్వామీజీ చెప్పారు. కాని, ఎందువల్లో ఆ ప్రయాణ వివరాలను చెప్పటానికి నిరాకరించారు. —రచయిత.

ఆదేశించారు గనుక అదే మీకు ప్రాయశ్చిత్తం. ఆ యాత్రలు పూర్తి చేస్తూనే, మీ సాధన కొనసాగించుకోండి. మీకు క్షేమం కలుగుతుంది. మీ బోటి ఉత్తమ సాధకులు, తపోమగ్నులై వుంటే చాలు, ఆ దివ్య తరంగాలే లోకానికి ఎంతో మేలు చేస్తాయి. హిమాలయ గుహలలో వేలాది మహర్షులు, యుగ యుగాలుగా తపస్సు చేస్తూనే వున్నారంటే యెందు కోసం వున్నారు ? వాళ్ళకు సిద్ధి లభించకనా ? కాదు ! సిద్ధి లభిస్తే లోకంలోకి వచ్చి లోకోపకారం చెయ్యరేమి ? వారికి కరుణ లేకనా ? కానే కాదు ! అక్కడ వారు తపస్సు చేస్తూ వుండటమే ఇక్కడ యీ లోకాలకు క్షేమం. విశేషించి యీ దేశానికి క్షేమం. కనుక మీరు నిశ్చింతగా, శాంతిగా సాధన కొనసాగించండి." ప్రశాంతంగా వివరించారు స్వామీజీ.

"ఆజ్ఞ. ఒక చిన్న ప్రార్థన" అనునయంగా అడిగాడు యోగి.

"చెప్పండి" అనుమతించారు స్వామీజీ.

"ఈ శక్తి లేశం చేత మిడిసిపడ్డ నాకు, శక్తి దగ్గర వుండటం ఎప్పటికైనా ప్రమాదమే. తాము ఈ అల్పుడికి చేసిన మహోపకారానికి ఒక చిన్న కృతజ్ఞతా సమర్పణగా, నా శక్తిని తమకు సమర్పిస్తున్నాను. దయతో అంగీకరించాలి తమరు." యోగి మాట విని సన్నగా మందహాసం చేసి, ఇలా అన్నారు స్వామీజీ.

"మీ సద్బుద్ధి నాకు చాలా సంతోషం కలిగిస్తోంది. మీ కృతజ్ఞతా బుద్ధి ప్రశంసనీయమైనది. సందేహం లేదు. కాని, యీ శక్తిని మీ గురువులకే మీరు సమర్పించండి. అది నాకు సమర్పించినట్లే అవుతుంది. నిజానికి లోకంలో వున్నది ఒక్కడే గురువు. 'శ్రీ గురుశ్శివ ఏవసః' ఆ శివుడే ఆ యా రూపాలలో ఆ యా ఉపదేశాలు చేస్తూ వుంటాడు. అందువల్లే సాధనలో వున్నవాడికి గుర్వనుగ్రహం వుంటే అణువణువూ నోరు తెరిచి పాఠం చెపుతుంది. అందుకే సాధకుడికి లోకంలోని ప్రతి అణువు గురువే. దాన్నే వెనక్కి తిప్పితే గురువే, లోకంలోని అణువుగా రూపొందాడని గ్రహించవచ్చు. అందుచేత గురువుల యందు భేదబుద్ధి వహించటం విజ్ఞులు చేసే పని కాదు.

ఇక శక్తి పక్కన వుంటే ప్రమాదం అనుకుంటే అది చెరువు చుట్టూ ప్రదక్షిణం చెయ్యటమే తప్ప స్నానం చెయ్యటం కాదు. సాధకుడికి సాధనలో అన్నీ కనిపిస్తాయి. పొగడ్తలు, గర్వం, తిరస్కృతులు, దుఃఖం, క్రోధం, ప్రతీకారవాంఛ, సందేహం, భయం, సుఖ సంపదలు, ఆదరణ, ఛీత్కారం, రోగం—ఒకటేమిటి? అన్నీ వస్తాయి, రావాలి. చిక్కుల్లో కొన్ని మంచి చిక్కులు వస్తాయి. అంటే మంచివిలాగా చాలా కాలం భ్రమ పెట్టేవి అన్నమాట. ఈ అన్ని రకాల చిక్కులు అధిగమించాలి సాధకుడు. దేనికి ఏ రవ్వంత వంగినా వాడు సాధకుడే కాదు. అలా వంగకుండా సాగిన సాధకుడే లక్ష్యాన్ని చేరగలడు. వాడే వశిష్ఠుడు కాగలడు అని పన్నెండేళ్ళ సాధనలో నాకు బాగా అనుభవానికి వచ్చింది. మీరు చూశారు గదా. కనుక, శక్తినీ, సాధననూ గూడా గుర్వర్పితంగా ఉంచి ముందుకు సాగితే సిద్ధి మీ యెదుటే కనిపిస్తుంది. అలా చెయ్యండి. గురుకృపా ప్రాప్తిరస్తు."

# 24 వ అధ్యాయం జన్మసిద్ధి

*త్వం మంత్రసిద్ధః ప్రణవాత్మకోఽసి*
*లీనాంతరంగోఽపి చ యోగసిద్ధః।*
*త్వం జన్మసిద్ధోఽసి సమాప్తకామ*
*స్సిద్ధే రసిద్ధే శ్చ గురో! పరోఽసి॥*

(గురుదేవా! మీరు స్వయంగా ప్రణవ స్వరూపులు గనుక మంత్ర సిద్ధులు. మీ మనస్సు లయించింది. గనుక యోగసిద్ధులు. భూత భవిష్యద్వర్తమాన కాలాలలోని మీ కోరిక లన్నీ తీరాయి గనుక జన్మసిద్ధులు. నిజానికి మీరు సిద్ధికి, అసిద్ధికి గూడా అతీతులు.)

## మాస్టర్‌ప్లాన్

1967 జూలైలో మళ్ళీ కేరళ పర్యటన జరిగింది. ఈ పర్యటనలో స్వామీజీ కొచ్చిన్, ఎర్నాకులం, తిర్పుణతుర, గురువాయూర్ సందర్శించారు.

ఈ సంవత్సరం కేరళలో స్వామీజీ పేరు బాగా మ్రోగిపోతూవుంది. క్రిందటిసారి దర్శించుకున్న వారే గాక, క్రొత్తవారు గూడా అనేకమంది వచ్చి స్వామీజీని దర్శించుకో సాగారు. ఒక విశేష మేమంటే స్వామీజీని ప్రధానంగా సేవిస్తూ వున్న కేరళీయు లంతా షష్టి పూర్తి యెప్పుడో దాటిపోయిన వృద్ధులే. వీళ్ళల్లో చాలామంది సంపన్నులు ఉన్నారు. వాళ్ళంతా గత సంవత్సరంలో మైసూరు ఆశ్రమానికి వస్తూపోతూనే వున్నారు. వచ్చినప్పు డల్లా ఆశ్రమంలో యేదో వొక సౌకర్యం చేద్దామని ఉత్సాహం కలిగి, భవనం కట్టిస్తామనీ, భోజనశాల కట్టిస్తామనీ స్వామీజీతో అంటున్నారు. ఎందుకో తెలియదుగాని స్వామీజీ అంగీకరించటం లేదు.

ఈ పర్యటనకు ముందే ఆ వృద్ధులంతా ఆలోచించుకొని ఆశ్రమం యొక్క సర్వతో ముఖాభివృద్ధికి అనువుగా ఆశ్రమంలో జరిగే ఉత్సవాలకు వస్తున్న వేల జనాల వసతికి అనువుగా జరగవలసిన కట్టడాలు మొదలైన యేర్పాట్లు గురించి ఒక "మాస్టర్ ప్లాన్" గీసి సిద్ధపరచి వుంచారు. దీనికి ఆ రోజుల ధరలబట్టి ఒక పాతిక లక్షల దాకా ఖర్చు కావచ్చునని అంచనాలు వేశారు,

ఈ పర్యటనలో పెద్దలంతా కలిసి ఆ ప్లాను కాయితం స్వామీజీ చేతులలో పెట్టి, ఆ ఖర్చంతా తామే భరించుకొని, ఆ యేర్పాట్లన్నీ చేస్తామనీ ఇంకేదయినా మార్పులు కావాలంటే చేస్తామనీ ప్రార్థించారు. తమ వయస్సు అయిపోతోందనీ, అందువల్ల త్వరగా యీ సత్కార్యం చేసే అదృష్టం తమకు దక్కించమనీ పాదాలమీద పడి ప్రార్థించారు.

పరశురామ క్షేత్రంలో అడుగు పెడుతుండగానే, స్వామీజీ పద్ధతంతా "ఇదంక్షాత్రం" అన్నట్టుగా మారిపోతూ వుండే రోజులవి. ఈ కాయితం చూస్తూనే, దాన్ని చించి పారేసి, "నేనే మాష్టరుని, నేనే ప్లాన్ని, నాకు నేనే మాష్టర్‌ప్లాన్ని" అన్నారు. అంతకన్నా వాడుగ్గా మాట్లాడటం అలవాటున్న రోజులు కావు అవి. ఈ దెబ్బతో ఆ ప్రయత్నాలు గాలిలో యెగిరి పోయినాయి. ఇలా పాత పెద్దలు తిరస్కరింపబడిన ఆ పర్యటనలోనే యిద్దరు కొత్త పెద్దలు స్వీకరింపబడటం ఒక చిత్రం. పరశురామ్‌గారు, రామస్వామి అయ్యరుగార్లే యీ కొత్త భక్తులు.

ఎప్పుడు చూసినా మూతి బిగించుకొని, ఎవరితోనూ కలవక ఒంటరిగా తిరుగుతూ వుండే పి. వి. పరశురామ్‌గారు ఆయుర్వేద వైద్యుడు మాత్రమేగాక, మంచి మూలికా వ్యాపారి గూడాను. ఆయనకు మెట్టుపలయం మొదలైన స్థలాలలో మూలికల పొలాలు వున్నాయి. ఆ మూలికలను, ఔషధాలనూ విదేశాలకు గూడా ఆయన ఎగుమతి చేస్తూ వుంటాడు. ఒక లాయరు మిత్రుడి ద్వారా ఆయన చేతికొక కరపత్రం వచ్చింది. మైసూరునుంచి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీవారు వస్తున్నారు అని. ఆ కరపత్రంలో స్వామీజీ ఫోటో గూడావుంది. చిన్న వయస్సులో వుండి, మంచి తేజస్విగా వున్న స్వామీజీని చూసే సరికి, పరశురామ్‌గారిలో సహజంగానే వున్న ఆధ్యాత్మికత చైతన్యం పుంజుకుంది. దాంతో భార్యా పిల్లలను తీసుకొని స్వామీజీ దర్శనానికి ఎర్నాకులం వెళ్ళాడాయన.

ఆయన వెళ్ళే సమయానికి స్వామీజీ ఎక్కడికో వెళ్ళారన్నారు. అక్కడ నారాయణ వైద్యార్ మొదలైన మిత్రులు కలిశారు. నారాయణ వైద్యార్ అంటే, ఆ చుట్టు పక్కలలో సుప్రసిద్ధుడైన ఆయుర్వేద వైద్యుడు. ఆయనా, యీయనా వృత్తిరీత్యానే గాక ప్రవృత్తి రీత్యా గూడా మిత్రులు. ఈ నారాయణ వైద్యార్‌గారు ఆ రోజుల్లో స్వామీజీని బాగా సేవించేవాడు. ఆయనకు సంకీర్తనంటే బాగా యిష్టం. బాగా సంకీర్తన చేసేవాడు గూడాను. స్వామీజీ రావటం కొంచెం ఆలస్యమయ్యేసరికి వైద్యార్‌గారు సంకీర్తన అందుకున్నాడు. పరశురామ్ గారయితే నోరు తెరవడు గాని, ఆయన భార్యా పిల్లలు సంకీర్తన బాగా చేస్తారు. వాళ్ళు గూడా ఆ సంకీర్తనలో కలిశారు. నారాయణ వైద్యార్‌గారు స్వామీజీ కీర్తనలు సంకీర్తన చేయిస్తున్నాడు. ఆ రాగాలకు పరశురామ్‌గారు అప్రయత్నంగానే పరవశించిపోతున్నాడు.

ఇంతలో స్వామీజీ వచ్చారు. కొద్దిసేపు, కొద్ది అంటే చాలా కొద్దిసేపు, ఆధ్యాత్మిక సాధన విషయంలో సలహాల రూపంలో చిన్న ఉపన్యాసం ఇచ్చారు. పరశురామ్‌గారు పులకించి పోయాడు. స్వామీజీ చాల మందిని పలకరించారు గాని పరశురామ్‌గారి మొహం కూడా

చూడలేదు. ఏం పాప కర్మమో? ఏ పుణ్య కర్మమో! పరశురామ్‌గారు ఆ రోజుకి కొచ్చిన్ తిరిగి వెళ్ళిపోయాడు. ఆయన వుండేది కొచ్చిన్‌లో గదా మరి!

ఆ రోజు పరశురామ్‌గారు వ్యాపారం పనిమీద రామస్వామి అయ్యరుగారి దగ్గరకు వెళ్ళాడు. రామస్వామి అయ్యరుగారు కొచ్చిన్, ఎక్స్‌పోర్ట్ క్లియరెన్సు వ్యాపారి. అక్కడ ఏదో మాటలలో స్వామిజీ గురించిన ప్రసంగం వచ్చింది. నిత్యమూ అనుష్ఠాన తత్పరమైన వంశంలో పుట్టి, ఇంత కోట్లమీద వ్యాపారంలో తలక్రిందులవుతూ గూడా, ఇంట్లో సదాచారాలు చెదిరిపోకుండా ఆచరిస్తూ, పిల్లలచేత ఆచరింపచేస్తూ వస్తున్న వాడవటం చేత రామస్వామి గారికి స్వామిజీ అనంగానే ఆసక్తి కలిగింది. కాని, ఎక్కువ వివరాలు చెప్పేందుకు పరశురామ్ గారికి మాత్రం ఏం తెలుసు? కాని, నాడి పట్టి చూడటం చేతయిన వైద్యుడు గనుక, తను చూసిన వాడి లక్షణం ఎలా ఉందో తనకు సహజమైన ముక్తసరి ధోరణిలో చెప్పాడు. అక్కడితో ఆ ప్రసంగం ఆగిపోయింది. ఆ మర్నాడు గూడా ఎర్నాకులం వెళ్ళి దర్శించాడు పరశురామ్‌గారు. ఆరోజూ అదే తంతు. స్వామిజీ యీయనను గమనించను గూడా గమనించలేదు. ఇక తిరిగి వచ్చెయ్యబోతుండగా, నారాయణ వైద్యార్ ఈయన దగ్గరకు వచ్చి, "అదృష్టవంతుడివయ్యా!" అన్నాడు.

"ఏమిటి విషయం?" అన్నాడు పరశురామ్‌గారు.

"రేపు స్వామిజీ గురువాయూరు వెళుతున్నారు. అటునుంచి మైసూరు వెళ్ళిపోతారు. నిన్ను వారితో పాటు గురువాయూరు రమ్మని చెప్పారు స్వామిజీ" అని చెప్పి వైద్యార్ గారు వెళ్ళిపోయాడు. పరశురామ్‌గారు ఆశ్చర్యపోయాడు. అలా ఆశ్చర్యపోయి మాట్లాడకుండా యింటికి వెళ్ళిపోయాడు.

నిన్న సాయంత్రం తన ఆఫీసునుంచి యింటికి వెళ్ళిన రామస్వామి అయ్యరుగారు ఇంట్లో వున్న చెంబై వైద్యనాథ్ భాగవతార్ గారితో స్వామిజీ గురించి తను విన్నది చెప్పాడు. చెంబై వైద్యనాథ్ భాగవతార్ గారంటే సంగీతంలో యావద్భారత ప్రతిష్ఠా సంపన్నుడైన వ్యక్తి. ఫిడేలు చౌడప్పగారు, హరి నాగభూషణంగారు, చెమ్మంగుడి శ్రీనివాసయ్యగారు, చెంబై వైద్యనాథ భాగవతార్ గారు మొదలైనవాళ్ళు ఆ రోజుల్లో కర్ణాటక సంగీతానికి చక్రవర్తులు. ఈ భాగవతార్ గారు రామస్వామిగారి కుటుంబానికి సన్నిహితుడు, భక్తుడు. ప్రస్తుతం ఏదో పనిమీద వీరింటికి వచ్చాడు. ఇద్దరూ కలిసి కాసేపు యీ విషయాలు మాట్లాడుకున్నారు. భాగవతార్ గారు అంతకు ముందే స్వామిజీ గురించి విన్నాడు గాని, చూడలేదు. ఇప్పుడు ఇద్దరికీ చూద్దామనిపించి కారేసుకుని ఎర్నాకులం బయలుదేరారు.

వీరు అక్కడికి చేరేసరికి స్వామిజీ తర్పుణతురా అనే చోటికి వెళ్ళారన్నారు. అది దగ్గరి చోటే, అందువల్ల వీరిద్దరూ అక్కడకు వెళ్ళారు.

అక్కడకు వెళ్ళేసరికి స్వామీజీ అప్పుడే చిన్న ఉపన్యాసం యిచ్చినట్టున్నారు. కొన్ని వేలమంది జనం వున్నారక్కడ. ఎంత తక్కువ వేసుకున్నా మూడు వేలు జనం వుంటారని అనిపించింది. వీళ్ళు దూరాన కారాపి "ఇంత రద్దీలో ఎలాగా స్వామివారి దర్శనం?" అనుకుంటూ ఆ జనం వెనకాలగా తచ్చాట లాడుతున్నారు. ఇంతలో జన ప్రవాహాన్ని నెట్టుకొంటూ పరుగు పరుగున అటే వచ్చారు స్వామీజీ. సార్వభౌమత్వ దర్జాలో, హుందాతనం నింపుకున్న ఆ పరుగులో చురుకుగా వున్న ఆ కుర్ర స్వామీజీని చూసేసరికి కళ్ళు మిరుమిట్లు గొలిపాయని పించింది రామస్వామి గారికి. స్వామీజీ ఇలా ఎందుకు పరుగెత్తుకొస్తున్నారో తెలియక అయోమయంగా చూస్తున్న జనంతోపాటు, ఈ కొత్త భక్తులిద్దరూ గూడా అయోమయంగా చూస్తూ నిలబడిపోయారు. స్వామీజీ సరాసరి వచ్చి చెంబై భాగవతార్ గారి చెయ్యి పట్టుకొని "భాగవతోత్తమా! రండి" అన్నారు.

అంతకు ముందు ముఖ పరిచయమైనా లేని తనను, ఆ తపోమయ తేజోమూర్తి అలా గొప్ప చేసి గౌరవిస్తుంటే వినయంచేత, ఆనందంచేత కరిగి నీరై, " నేనంతటి వాణ్ణి కాదు స్వామీజీ" అంటూ ఆ సంగీత నిధి స్వామీజీ పాదాల మీద వాలాడు.

"నీకు చాలా రాగాలు తెలుసు" అంటూ స్వామీజీ ఆయన చెయ్యి పట్టుకొని గబగబా లోపలికి లాక్కుపోయారు. వెనకే వెళ్ళాడు రామస్వామిగారు. భాగవతార్ గార్ని కాసేపు అప్యాయంగా మాట్లాడించి వారికి ఒక విభూతి పొట్లం ప్రసాదంగా ఇచ్చారు స్వామీజీ. రామస్వామిగార్ని పలకరించలేదు. భాగవతార్ గారు పరిచయం చేసినా పట్టించుకోలేదు. ప్రసాదం యివ్వలేదు. భాగవతార్ గారే తన పొట్లం లోంచి కొంచెం విభూతి యివ్వగా, దానితో సంతృప్తిపడి భాగవతార్ గారితో కలిసి ఇంటికి వచ్చేశాడు రామస్వామిగారు.

ఆ రోజు రాత్రే ఒక చిన్న విచిత్రం జరిగింది. రామస్వామిగారి భార్య ఒక కొత్త దేవతా విగ్రహం తెచ్చి చూపించి యిలా చెప్పింది:

"ఎర్నాకులం పక్కన వున్న సంతాన వేణుగోపాలస్వామి గుడికి ఒక గొప్ప స్వామీజీ వచ్చారని నా స్నేహితురాలు చెపితే, చూద్దామని యీ సాయంత్రం వెళ్ళాం. ఆయన చాలా చిన్నవారు. కాని ఎంతో గొప్పవారు. ఆయన సంకీర్తన లోకోత్తరంగా వుంది. ఆయన అడుగడుగునా మహిమలు వర్షిస్తున్నారు. ఇవాళ్ళ సంకీర్తన అయినాక కొన్ని వందల విగ్రహాలు సృష్టించి చాలామందికి యిచ్చారు. నాకు గూడా ఒకటి యిచ్చారు. సమయానికి మీరు లేకపోయారే అని చాలా అనుకున్నాను. మీరుంటే ఆయన మీకూ ఒక విగ్రహం ఇచ్చేవారే."

ఇది విని ఆ స్వామీజీ ఎలా వున్నారు, ఎక్కడున్నారు మొదలైన వివరాలన్నీ అడిగాడు రామస్వామిగారు. దాంతో, ఈ ఉదయం తను దర్శించిన స్వామీజీనే, యీ సాయంత్రం తన భార్య దర్శించిందని తేలింది. ఒకరికి తెలీకుండా మరొకరు ఒకే రోజున ఒకే స్వామీజీని

భార్యాభర్తలిద్దరూ దర్శించారు. ఈ దైవ ఘటనను గమనించుకొంటూ, "నువ్వే అదృష్ట వంతురాలివి. ఆయన నాకు విభూతి పొట్లమయినా ఇవ్వలేదు" అన్నాడు రామస్వామిగారు.

'మీరెప్పుడు వెళ్ళారు?' అన్నది ఆయన భార్య. అప్పుడు తను దర్శించిన వైనమంతా భార్యకు చెప్పాడాయన. ఆ రోజు నుంచీ స్వామీజీ గురించిన చర్చ ఆ యింట్లో అప్పుడప్పుడు నడుస్తూ వుండసాగింది.

ఆ మర్నాడు పొద్దున్నే పరశురామ్‌గారు గురువుతో కలిసి గురువాయూరు యాత్ర చెయ్యటానికి ఎర్నాకులం చేరాడు. గురువాయూరప్ప దర్శనం చక్కగా జరిగింది. స్వామి దర్శనం తరువాత స్వామీజీ ఆలయంలో వున్న భోజనశాలకు వెళ్ళి అక్కడ ఆనందంగా నారాయణ సంకీర్తన చేయసాగారు. ఇంతలో అక్కడకు ఆర్యనంబూద్రిపాదిగారు వచ్చారు. ఆర్య నంబూద్రిపాదిగారు ఆ ప్రాంతాలలో సుప్రసిద్ధుడైన భక్త గాయకుడు. అక్కడ అనేకమందికి గురుతుల్యుడు. ఆయన వస్తూనే స్వామీజీని చూసి, అకారణంగానే ఆనంద పడ్డాడు. ఆయనతో బాగా పరిచయం వున్న పరశురామ్‌గారు ఆయన దగ్గరకు వెళ్ళి "వారు మైసూరు నుంచి వచ్చారు. శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీవారు. గొప్ప మహిమాన్వితులు" అన్నాడు. నంబూద్రిగారు ఇదేమీ వినిపించుకున్నట్లు లేదు. ఆయనకు ఆవేశం వచ్చి స్వామీజీ పక్కన చతికిలబడి "ఉన్ని కృష్ణా, ఉన్ని కృష్ణా, వచ్చావా, నా తండ్రీ, వచ్చావా!" అనసాగాడు. అంతే, ఆ చుట్టుపక్కల భక్తులంతా స్వామీజీ చుట్టూతా చేరి "ఉన్ని కృష్ణా, ఉన్ని కృష్ణా' అని సంకీర్తన చేయసాగారు.

కేరళలో తాము అవహింప చేసుకొనే క్షేత్ర తీక్ష్ణతను వదిలి సవిలాసంగా చిరునవ్వులు చిందిస్తూ కూర్చున్నారు స్వామీజీ. అలనాటి యశోదానందనుడు తన వేణుగాన వైభవం చేత గో గోపీ జన బృందాలను సమ్మోహపరచి మురళీమోహనుడు కాగా, ఇప్పుడు యీ జయలక్ష్మీ నందనుడు కేవలం తన చిరునవ్వు చిందులతో యీ భక్త జనులను సమ్మోహ పరచి మందస్మిత మోహనుడైనాడు. స్త్రీ, పురుష, బాలబాలికా, వృద్ధ, యువక, పండిత పామరాది నానాజన సంకులమైన ఆ భక్త సందోహం స్వామీజీ చుట్టూ నృత్యం చేస్తూ ఉన్నికృష్ణ నామ సంకీర్తన చేస్తూ, ద్వాపరనాటి రాసక్రీడా మండల నృత్య సౌభాగ్యాలను కలియుగంలో పునరావర్తనం చేస్తూ వుండగా—

మధ్యలో కూర్చున్న స్వామీజీ, తన మెడలో వున్న పూల మాలను చేతితో కొద్దిగా దూశారు. అలా దూస్తూనే, "ఇలా వుంటాడా ఉన్నికృష్ణుడు" అంటూ ఒక ఉన్ని కృష్ణ విగ్రహాన్ని నంబూద్రిపాదిగారి చేతిలో పెట్టారు.

---

* ఉన్నికృష్ణుడు అంటే నేలమీద పాకుతున్న బాల కృష్ణుడు అని అర్థం. శ్రీ కృష్ణుని రూపాలలో యీ ఉన్నికృష్ణుని రూపం కేరళీయులకు మిక్కిలి ప్రియమైనది.

ఆదరంగా, ఆనందంగా ఆ విగ్రహాన్ని అందుకున్న నంబూద్రిగారు ఒక్క గంతేసి, ఆ విగ్రహం వదిలేశాడు. సరాసరి కొలిమిలోంచి తెచ్చినంత వేడిగా వుంది ఆ విగ్రహం! క్రింద పడిపోకుండా తనే పట్టుకొని, మెల్లిగా వూది చల్లబరిచి, మళ్ళీ విగ్రహాన్ని నంబూద్రి గారికి ప్రసాదించారు స్వామీజీ.

ఈ హఠాత్సంఘటనకు ఆశ్చర్య వివశమైన భక్తమండలి యావత్తూ, స్తబ్ధమై, నిశ్చేష్టమై, బిగిసిపోయి నిలిచిపోగా, ఇందాకటినుంచీ నృత్యంలో కలవక మధ్యలో కూర్చుని వుండిపోయిన పరశురామ్‌గారు, "నారాయిణా, గురువాయూరప్పా" అని పూనకపు అరుపులు సాగించాడు. అలా అరిచి, అరిచి స్పృహ తప్పి పడిపోయాడాయన. ఆయన్ను ముట్టుకోకుండా వొదిలెయ్యమన్నారు స్వామీజీ. కొంతసేపయిన తరువాత ఆయనే లేచి సర్దుకొని కూర్చుండిపోయాడు. ఆయన లేవంగానే స్వామీజీ తన బసలోకి నడిచారు. మెల్లిగా స్వామీజీ పరివారం అంతా గూడా బసలోకి వచ్చేశారు. బసలో స్వామీజీ ఒక కుర్చీలో కూర్చుని గురువాయూరప్ప గురించి కొద్దిగా ప్రసంగిస్తున్నారు. పరివారంలో పనిలేనివారు స్వామీజీ చుట్టూతా కూర్చుని వున్నారు. వారిలో పరశురామ్‌గారు గూడా వున్నాడు. చెపుతూ చెపుతూనే, తన మెడలో వున్న పూల దండను రెండు చేతులతోనూ రెండు పక్కలా పట్టుకొని రెమ్మ నుంచి కరివేపాకును దూసినట్టు దూశారు. రాచ ఉసిరి పళ్ళు రాలి పడ్డట్టు ఉన్ని కృష్ణ విగ్రహాలు స్వామీజీ వొడినిండా చెల్లాచెదురుగా రాలిపడ్డాయి. అందులో ఒకటి ఎగిరి వచ్చి పరశురామ్‌గారి వొళ్ళో పడ్డది.

పరశురామ్‌గారికి మళ్ళీ తాదాత్మ్యస్థితి వచ్చింది. "నారాయిణా! గురువాయూరప్పా! గురువాయూరు నారాయణా!" అంటూ వివశుడై ఉచ్చైస్స్వరంలో చాలాసేపు సంకీర్తన చేశాడు. జీవితంలో అంతకుముందెన్నడూ చవి చూసి యెరుగని—ఏ లౌకిక సుఖాలలో గాని, ఏ ఆధ్యాత్మిక సాధనలో గాని చవి చూసి యెరుగని—ఆనందపు పొంగును చవి చూశాడు.

ఆ తరువాత స్వామీజీ తిరుగు ప్రయాణం మొదలయింది. గురువాయూరు నుంచీ స్వామీజీని సాగనంపటానికి బెంగుళూరు మెయిన్ రోడ్డుదాకా వెళ్ళారు భక్తులు. అక్కడ కారాపి, స్వామీజీ, భక్తులకు శెలవు యిచ్చారు. వెనుక మరో కారులో వస్తున్న నారాయణ వైద్యార్, ఆయన భార్య, పరశురామ్ యీ ముగ్గురూ స్వామీజీ కారు దగ్గరకు వచ్చి, సెలవు పుచ్చు కుంటుండగా, పరశురామ్‌గార్ని ఉద్దేశిస్తూ "ఒకసారి మైసూరు రండి, వీలున్నప్పుడు" అన్నారు స్వామీజీ. తరువాత, ఒక కొబ్బరికాయ ఆయన చేతిలో పెడుతూ, 'దీన్ని మా కారు చక్రం క్రింద పెట్టండి' అన్నారు.

పరశురామ్‌గారు అలాగే చేశారు. కారు వెళ్ళింది. కొబ్బరికాయ రెండు చెక్కలుగా సరీగా సగానికి పగిలింది. అందులో ఒక చెక్క పూర్తిగా కుళ్ళిపోయి, నల్లగా వుంది. మరోచెక్క

చక్కని కొబ్బరితో నవనవలాడుతోంది. బాగున్న కొబ్బరిచిప్పను ముగ్గురూ ప్రసాదంగా తీసుకొని, కారులో కూర్చుని చాకుతో ముక్కలు తీసి, కళ్ళ కద్దుకొని నోట్లో వేసుకున్నారు. అది కొబ్బరి ముక్కే, సందేహంలేదు. కానీ, దాని రుచి అచ్చం అరటిపండు రుచి.

ఈ విచిత్రానుభూతితో ఇంటికి చేరిన పరశురామ్‌గారికి, వెంటనే మైసూరు వెళ్ళకుండా నిలవటం కష్టమైపోయింది. కాని, తీరా తను అంత దూరం వెళితే, స్వామీజీ కార్యక్రమా లేమిటో, ఊళ్ళో వుంటారో వుండరో! ఈ ఆలోచన ప్రయాణాన్ని వెనక్కి లాగుతోంది కాని, ఒకవారం రోజుల కన్నా యెక్కువ రోజులు లాగటం దాని తరంకాలేదు. వైద్యనాథ అయ్యర్ అనే మరో మిత్రుడితో కలిసి పరశురామ్‌గారు మైసూరు ఆశ్రమంలో అడుగుపెట్టాడు.

నంజనగూడా రోడ్డుమీది నుంచి ఒక చిన్న డొంకదోవ వాళ్ళిద్దరినీ ఆశ్రమంలోకి తీసుకుపోయింది. ఆ పెద్ద చొప్పరం అక్కడ లేకపోయినట్టయితే, ఎక్కడ పడితే అక్కడ వున్న పాము పుట్టలు, పొదలు, పిచ్చి మొక్కలు, పెద్ద చెట్లు వగైరాలన్నీ కలిపి ఆ స్థలానికి అరణ్యమనే పదవిని కట్టబెట్టి వుండేవి. ఆ చొప్పరంలో ఒక పక్కన వేదికలాగా యెత్తు చేసి వుంది. ఆ వేదికమీద ఒక పక్కన పెద్ద పూజామందిరం ఒకటి వుంది. దానిలో విగ్రహా లేమీ లేవు. దాని పక్కన పెద్ద హోమ గుండము, దాని పక్కన పెద్ద శివలింగము వున్నాయి. ఆ చొప్పరం వెనుక చిన్న పాక వొకటి వుంది. అది వంటశాలట! దాని పేరు అన్నపూర్ణ మందిరమట. ఆ చొప్పరానికి మరోపక్కన వున్న రెండు రేకుల గదులలో స్వామీజీ వుంటారని అక్కడ వున్న సూర్యనారాయణరావు చెప్పారు. రేకుల గదికీ, చొప్పరానికీ మధ్య ఒక పెద్ద మామిడి చెట్టు వున్నది. దానికి ఒక ఉయ్యాల బల్ల వేలాడుతోంది. ఇదీ, కేరళలో వేలాది జనులను సమ్మోహపరుస్తున్న స్వామీజీ యొక్క ఆశ్రమపు వైభవం! తాము ఊహించు కున్న ఆశ్రమపు బొమ్మలన్నింటినీ యీ వాస్తవపు తడితో తమ మనఃఫలకాల నుంచి తుడిచి వేసుకొంటూ, ఆ పెద్ద మనుష్యులిద్దరూ ఆ చొప్పరంలోనే, స్వామీజీ కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు.

సుమారొక రెండు గంటల తరువాత స్వామీజీ వచ్చారు. వచ్చి మామిడి చెట్టుకు వున్న ఉయ్యాల బల్లమీద కూర్చుని, వీరిద్దరినీ పలకరించి, "రేపు ఆదివారంగదా! హోమం చూసు కొని ఎల్లుండి వెళ్ళండి." అన్నారు. అలా అని, తన రేకుల భవంతిలోనే, ఒక గదిలో వాళ్ళను ఉండమని చెప్పారు.

స్వామీజీ చూపించిన గదిలోకి వెళ్ళిన యీ పెద్ద మనుష్యులకు అక్కడొక చాదస్తపు బ్రాహ్మణుడు కనిపించాడు. వీళ్ళకు తెలుగురాదు. ఆయనకు తెలుగు తప్ప మరోటిరాదు. రాదుగదా అని మాట్లాడక ఊరుకోడు. అసలే యెవరితోనూ కలుపుగోలుగా వుండటం చేతగాని పరశురామ్‌గారికి యీ అతివాగుడు ముసలాయనతో చెడ్డచిరాగ్గా వుండ. ఏమంటే బావుంటుంది? తీరా ఆ సాయంత్రం ఎవర్నో విచారిస్తే ఆయన స్వామీజీ తండ్రి అని తెలిసింది. స్వామీజీ

తేజస్సుకీ, ముసలాయన వెర్రివాలకానికీ ఎక్కడా పొంతన దొరకక, కుడితిలో పడ్డ ఎలకల్లే గిలగిల కొట్టుకొని, నోరుమూసుకుని ఊరుకుండిపోయాడు పరశురామ్‌గారు.

మరునాడు ఆదివారం. హోమాది కార్యక్రమాలు పూర్తయ్యేసరికి సాయంత్రం అరయింది. ఆ కార్యక్రమాలకు వచ్చిన వేలాది జనాన్ని చూసినప్పుడు మాత్రం పరశురామ్ గారికి మళ్ళీ మరోసారి ఆశ్చర్యపోక తప్పలేదు. నిన్న చూసిన అడవికి ఇవాళ్ళ ఇంత శోభా? ఇంత జనమా? ఆ రోడ్డంతా వందలకొద్దీ జట్కాలు నిలబడ్డాయి. వచ్చిన జనానికి ఆ చొప్పరం ఒక మూలకు రాలేదు. పాము పుట్టలని భయం లేదు, ముళ్ళపొదలని జంకు లేదు. అన్నిచోట్లా జనం హాయిగా కూర్చున్నారు. ఒళ్ళు మరిచిపోయి జనం అంతా స్వామీజీ సంకీర్తనలో లయించిపోయారు.

సంకీర్తన అయినాక స్వామీజి చాలమందిని పలకరించి వారి కష్టాలు విని, ప్రసాదా లిచ్చారు. కానీ, జనం గందరగోళం చెయ్యటంతో కోపగించి లోపలికి వెళ్ళిపోయారు. సాయంత్రమయినాక ఇన్ని వేలమందికి ప్రసాదాలు పెట్టారు. ఇంత ప్రసాదమూ అన్నపూర్ణ మందిరం అనబడే ఆ పుట్టుపాకలోనే తయారయిందని తెలుసుకొని కేరళ పెద్దమనుష్యులు ముక్కుమీద వేలేసుకొన్నారు. ప్రసాదా లయినాక వచ్చిన వారిలో పది పదిహేను మంది తప్ప మిగిలిన వాళ్ళంతా వెళ్ళిపోయారు. మిగిలిపోయిన వారందరూ ఆశ్రమంలోనే భోజనం చేశారు. భోజనం అంటే యేముంది? చారులో వాళ్ళే కలిపిన అన్నం రెండు చిప్పలూ, నీటితో సారూప్య ముక్తిని పొందుతూ పొందుతూ వున్న మజ్జిగా !! తినబోయే ముందు "ఇది నాకేం సహిస్తుందిరా బాబూ" అని ప్రతి కొత్తవారికీ భయం వేస్తుంది. తిన్నాక "ఇంకా రెండు గరిటెలు రానీ" అనిపిస్తుంది. అది ఆశ్రమంలో మామూలే. ఈ కొత్త భక్తు లిద్దరూ ఆ పద్ధతిలోనే పడ్డారు.

భోజనాలు చేసిన వారిలో ఒకరిద్దరు వెళ్ళిపోగా మిగిలినవారు మర్నాడు స్వామీజీతో ప్రత్యేకంగా మాట్లాడాలని ఆశ్రమంలో చొప్పరంలోనే పడుకున్నారు. అయితే ఆ మర్నాడు పగలు స్వామీజీ బయటకు వస్తారని నిశ్చయం ఏమీ లేదనీ, వారు సమాధిలోకి గనుక వెళ్ళిపోతే ఎప్పుడు లేస్తారో చెప్పలేమనీ, పది రోజుల తరువాత సమాధి చాలించిన * సందర్భాలు గూడా వున్నాయనీ ఆ భక్తులే చెప్పారు.

"అయితే, ఆ మర్నాటికి తమ ప్రయాణా లున్నాయా లేవా?" అని ఆలోచించుకుంటూ కేరళీయులు నిద్రపోయారు. తెల్లవారినాక పెందరాడే స్వామీజీ బయటకు వచ్చి యెదురు చూస్తున్న భక్తులను ఇంటర్వ్యూకి పిలిచారు.

---

* స్వామీజీ పది రోజులు సమాధిలో వుండటం ఎరుగుదుమని భక్తులు ఒకరిద్దరు చెప్పారుగాని, స్వామీజీ మాత్రం వారం రోజుల సంఘటనలు మాత్రమే తనకు గుర్తున్నాయన్నారు.

వైద్యనాథ అయ్యర్‌గారు లోపలికి వెళ్ళినప్పుడు ఆయనకు ఒక మురుగన్ (కుమార స్వామి) విగ్రహం సృష్టించి యిచ్చారు. ఆయన మురుగన్ భక్తుడవటం వల్ల పరమానంద పడ్డాడు. తాను మురుగన్ భక్తుడినని స్వామీజీకి ఎలా తెలుసా అని ఆశ్చర్య పోసాగాడు. కాని, ఆయనకు కన్నడం వచ్చి వుండి, నిన్న వచ్చిన జనంలో కొందరినైనా పలకరించి వుంటే ఇష్ట దేవతల విగ్రహా లియ్యటం స్వామీజీకి ఒక్క లెక్కలో పని గాదనీ, ఎవరి యిష్ట దేవత రూపంలో వాళ్ళకు స్వయంగా దర్శనం యిచ్చిన సందర్భాలే కొన్ని వంద లున్నాయనీ తెలిసి వుండేది.

తరువాత పరశురామ్‌గారు లోపలికి వెళ్ళి పాద వందనం చేశాడు. వీరు తన శిరస్సు స్వామీజీ పాదాల మీద ఆనించబోతుండగా స్వామీజీ చటుక్కున తన పాదాలు వెనక్కు లాగేసుకున్నారు. ఇలా చేస్తే భక్తి గలవారెవరైనా నొచ్చుకోవటం సహజమే. పరశురామ్ గారు గూడా అలాగే నొచ్చుకోబోయే లోపల స్వామీజీ రెండు పాదాలూ ఆయన శిరస్సు మీద వచ్చి కూర్చున్నాయి. నాచుమీద నిలబడి కలకలా నవ్వుతున్న కెందామర జంట లాగా ఆ శ్రీ పాదాలు అలాగే కాసేపు నిలిచి పోయినాయి. పరశురామ్‌గారికి దేహ స్మృతి లేదు. కొద్ది సెకండ్లయినాక స్వామీజీ తన పాదాలను ఇవతలకు తీసేసుకోగా, మరి కొద్ది నిమిషాల తరువాత పరశురామ్‌గారికి దేహ స్పృహ కలిగింది. పరశురామ్‌గారు ఎవరితోనూ మాట్లాడడనీ, గర్వి అనీ, ముచ్చు అనీ పేరు వుంది. కాని దాని వెనకాల ఆయన ఆధ్యాత్మిక నిస్పృహ గాథ వుందని ఎవరికీ తెలీదు.

సద్వంశంలో జన్మించిన పరశురామ్‌గారు చిన్నప్పుడు ఆధ్యాత్మిక వాతావరణంలో పెరగలేదు. పెద్దయినాక సంస్కార ప్రాబల్యం వల్ల ఆధ్యాత్మిక తృష్ణ చెలరేగగా, సద్గురువు కోసం దేశంలో పలుచోట్ల తిరిగాడు. ఎక్కడా తనకు తృప్తి చిక్కక, శాంతి దక్కక, యేమి చెయ్యాలో ఆలోచనలు గుక్కతిరగక, ఆధ్యాత్మిక అంతస్తాపంలో సతమతమవుతూ వుండటం అలవాటయి పోయింది. అందువల్ల బహిరంగ జీవితంలో ఉత్సాహం తగ్గిపోయి, వ్యాపారాదులు యథాప్రకారంగానే సాగుతున్నా, ఒంటరి మనిషిగా తయారయిపోయా డాయన.

దాంతో ఆధ్యాత్మిక గ్రంథాలు విరివిగా చదవటం, ఆయనకు ఒక ఊరట అయింది. ఎడతెగని ఆ వంటరితనంలో అది ఒక బానస అయింది. అలా పుస్తకాలు చదివిన కొద్దీ గురువు యొక్క ఆవశ్యకత మరింత స్పష్టపడగా, ఆ గురువును ఎన్నుకోవటం ఎలా అనే సమస్య మరింత ముడులు పడసాగింది. విహ్వలమైన, విసిగిన మనస్సులో ఒక రోజున ఒక చల్లని ఊహ వచ్చింది. "ఇక మనం వెతకవద్దు. మహాత్ములను యాదృచ్ఛికంగా దర్శిస్తూవుందాం. ఏ మహాత్ముడు, అయాచితంగా, తన రెండు పాదాలనూ నా శిరస్సుమీద వుంచి నన్ను అనుగ్రహిస్తాడో, ఆయనే నాకు గురువు. ఇక తొందరవద్దు" అని.

ఈ ఊహవల్ల మనస్సులోని తుకతుకలు కొంత శాంతించినై. బండి నడుస్తోంది. ఇది జరిగి కొన్ని యేళ్ళైంది. క్రమంగా ఆ వూహే మరగున పడిపోయింది. ఇప్పుడు స్వామీజీ

దగ్గరకు వచ్చింది ఏదో మహిమలు చూపిస్తున్న స్వామి గదా అనే తప్ప, "వీరు మన గురువేమో చూద్దాం" అన్న ఆలోచనతో కాదు. ఇపుడీ హఠాత్సంఘటనతో, దీనితోపాటు ప్రాప్తించిన స్పర్శ దీక్షవల్ల అనుభవానికి వచ్చిన నిరుపమానమైన శాంతితో, యీ దివ్యమూర్తి తనకు సద్గురు దేవుడని తెలిసి, ఆమోదమై, ఆహ్లాదమై, ఆనందమై, ఆత్మార్పణమై, మైమరిచి పోయాడు పరశురామ్‌గారు. ఇక యీయనకు విగ్రహం కాదు కదా, విభూతి గూడాలేదు. కొత్తగా రెక్కలొచ్చిన పిట్టలాగా కేరింతలు కొట్టుకుంటూ బయటకు వచ్చిన పరశురామ్‌గారు రివ్వున యింటికి వెళ్ళిపోయి, మళ్ళీ పైవారం లోనే ఆశ్రమంలో వాలాడు. వ్యాపారపు పనులమీద యెప్పుడూ కేరళ, కర్ణాటక, తమిళ రాష్ట్రాలు తిరుగుతూ వుండటం ఆయనకు ఎంతో ఉపకరించింది. క్రమంగా ఆయన కుటుంబం గూడా రాసాగింది. కుటుంబం అంతా కలిసి, నెలకు రెండు మూడు సార్లు గూడా కొచ్చిన్ నుంచీ మైసూరు దాకా వచ్చే అలవాటు త్వరలోనే ఏర్పడిపోయింది. ఇక్కడినుంచి వెళ్ళిన రోజునుంచీ మళ్ళీ ఇక్కడ వాలి పోవటం, ఆ మనస్సుకు పరిపాటి అయిపోయింది.

భక్తి ప్రవాహంలో కొట్టుకుపోతున్న పరశురామ్‌గారి కథ ఇలా నడుస్తుంటే, ఆయన మైసూరు వచ్చేసరికి ఆశ్రమంలో వున్న నరసింహశాస్త్రిగారి కథ మరోలా నడవసాగింది.

## గీటురాయి

నిజాని కాయన, తన కొడుకు సొంత కుటీరం ఏదో వేసుకున్నాడని తెలిసి, చూచి సంతోషిద్దామని వచ్చాడు. కాని, యిక్కడికి వచ్చాక, సంతోషం మాట అలావుండి, కెసరేలో గలిగిన తృప్తి గూడ తగ్గిపోయింది. దాంతో ఆయన వీలయినంత యెక్కువ మందితో మాట్లాడి వీలయినంత యెక్కువ ఆచూకీ రాబడదామని ప్రయత్నించసాగాడు. వ్యవహార సౌకుమార్యం బొత్తిగా యెరగని తను యీ ప్రయత్నంలో వెర్రిగా ప్రవర్తిస్తున్నాననీ, తన ప్రవర్తన వల్ల కొడుకుకి గొంతులో వెలక్కాయ సంకటంగా వుందనీ ఆయనకు తెలీటంలేదు. భక్తులలో తన విలువ తనే పోగొట్టుకుంటున్నానని గూడా ఆయన గమనించుకోవటం లేదు. ఆయన ఆదుర్దా ఆయనది. ఆ ఆదుర్దాలోనే ఆయనిలా ఆలోచించసాగాడు.

"క్రిందటిసారి వచ్చినప్పుడు, వీడెవర్నీ ప్రత్యేకంగా డబ్బులడగటం లేదనీ, పది మందికి ఉపకారం చేస్తున్నాడనీ సంతోషించాను. కాని ఇప్పుడు వీడి పద్ధతి చూస్తే ఇలా మారి పోయిందేమిటి? కుటీరమనే పేరుతో నాలుగెకరాల పొలం కొన్నాడు. ఎవరి దగ్గర గుంజాడీ డబ్బు? పైగా దాంట్లో ఇల్లు కట్టించాడు. ఇవాళ్ళ తాటాకులపాక కాస్త రేకుల షెడ్డుగా మారితే, రేపో యెల్లుండో అది డాబాగా మారదా? ఇలా పొలాలు, ఇళ్ళూ, కార్లూ వీటిమీద దృష్టిపడితే, వీడికింక యేమి ఉపాసన వున్నట్టు, నా బొంద!

"కిందటి సారి వీడి పద్ధతంతా వైదిక మార్గంగానే వుందనుకున్నాను. కాని యీ మాటు వీడు యీ సంగీత వాద్యాలు పెట్టుకొని గంతులెయ్యటం ఎక్కువగా వుంది, మా నూరప్ప గారు

సంగీతంతో తరించాడంటే అది యీ పద్ధతా? అసలయినా, ఆ తరం వేరు, ఆ తాహతు వేరు. పైగా వీడు యీ వీణలు, హార్మోనీలు పెట్టుకొని, భజనలు నేర్పుతానని ఆడ పిల్లల్ని చుట్టూ వేసుకొని కూర్చుంటున్నాడు. సూరప్పగారిలా చేశాడా? ఇవాళ్ళ ఏదో నాలుగు మహిమలు చేసి చూపిస్తే నలుగురు జనం వెంట బడవచ్చు. రేపెవడికో తలకు మించిన కర్మ వచ్చి నెత్తిన బడుతుంది. అప్పుడు తప్పించటం కుదరదు. కుదరకపోతే, ఇలా డబ్బులు దోచి యిళ్ళు కట్టించి యిచ్చిన వాళ్ళు వూరుకుంటారా? కీళ్ళు తీస్తారు. దాని సంగతేమి ఆలోచించినట్టు వీడు?

అసలదీగాక, వీడు చేసే ఉపాసన యేమిటి? వీడు సాధించిన విద్య లేమిటి? తస్కరిణీ విద్యతో యెక్కడైనా విగ్రహాలు వుంటే లాక్కొస్తున్నాడా? అలా అయితే, అది కేవలం దొంగతనం, అతి నీచాతినీచం, ఘోర నరకప్రదం. లేదా, కేవలం ఇంద్రజాల తంత్రాలు ఉపయోగిస్తున్నాడా? అలా అయితే, ఆ వస్తువులు శాశ్వతంగా వుండవు. లేదా, యే యక్ష గంధర్వాదులనో వశం చేసుకొని బుడబుక్కల పని చేస్తున్నాడా? అలా అయితే, అది అధర్మమే గాక అవమానం గూడాను. ఏ మహామంత్రానుష్ఠాతో వస్తే, యీ యక్ష గంధర్వ శక్తులన్నీ పటాపంచలయి పోతాయి. ఒకోసారి అవి ఎదురు తిరిగి వీడికే అపకారం చెయ్య్యవచ్చు. ఏమయినా యిలాంటి క్షుద్ర శక్తులను ఆరాధించేవారు రాజులను వదిలి ద్వారపాలకుల్ని ఆశ్రయించే వారు మాత్రమే. వారికి యిక సత్యమయమైన మోక్షమార్గంలో ప్రవేశం లేదు.

మహా మంత్రానుష్ఠాన సిద్ధి ద్వారా గాని, యోగసిద్ధి ద్వారా గాని, వీడికి సిద్ధి లభిస్తే, అప్పుడు భయం లేదు కాని, లేకపోతే, తండ్రినై వుండి నేను చూస్తూ వూరుకోరాదు. అది మన వంశానికే అప్రతిష్ఠ. అందుచేత వీడి సిద్ధులకు అవధి యేమిటో, వాటి విధాన మేమిటో జాగర్తగా పరిశోధన చెయ్యాలి, తప్పదు. సమస్త క్షుద్ర విద్యలనూ నిర్వీర్యం చెయ్యటానికీ, అవతల వ్యక్తిలో అధార్మికమైన, ఇంద్రియ లోలములైన స్పందనలు వుంటే గుర్తించటానికీ మన దగ్గర నరసింహం వుంది. భయం లేదు. నరసింహుడు అగ్నిమూర్తి. చల్లని తల్లి గాయత్రిని గూడా అనుసంధానం చేస్తే, ఇక క్షుద్రాలకు యీ చుట్టు పక్కలలో నిలువ నీడ వుండదు. అందుచేత, ఇక ఆ రెండు విద్యలనూ ప్రయోగించి, వీడి సంగతి నఖశిఖ పర్యంతం పూర్తిగా పరీక్ష చేద్దాం. అది నా ధర్మం కదా!"

ఇంత దీర్ఘమయిన ఆలోచన చేసి, ఇక ఆయన మంత్రానుష్ఠానం ప్రారంభించాడు. పని మొదలు పెడితే ఇక రాత్రింబగళ్ళతో లెక్క వుండటం ఆయనకు జన్మ లక్షణం కాదు. ఒక పది రోజులు తీవ్రానుష్ఠానం చేసి, బహువిధాలుగా పరిశీలించి తన కొడుకులోనాని, ఆయన చుట్టూ తిరిగే వారిలోగాని పాపపు చింత లేమీ వుండటం లేదని నిశ్చయించుకున్నాడాయన,

అక్కడికి కొంత తృప్తి అయింది. ఈ తృప్తి కలగంగానే, తన మకాం ఆశ్రమంలోంచి, పెద్ద కూతురు వరలక్ష్మిగారి యింట్లోకి మార్చేశాడాయన.

వచ్చిన దగ్గర నుంచీ మాటా మంతీ లేకుండా వెర్రిగా జపం చేస్తున్న తండ్రిని చూసి, ఒక పదిహేను ఇరవై రోజులు పోయాక "ఈ వయస్సులో ఇంత జపం నీ కెందుకయ్యా ?" అని కూతుపు అడిగింది. నోట్లో మాట దాచుకోవటం అట్టే చేతగాని శాస్త్రిగారు కూతురుతో ఉన్న మాట చెప్పేశాడు. అవిడ లబోదిబో మన్నది. "నీ కెందుకయ్యా లేనిపోనిది ? ఆయన మహా శక్తిమంతుడుగా కనిపిస్తున్నాడు. ఆయనతో నీ కెందుకయ్యా పోటీ" అని. "ఈ శక్తులు నన్నేం చేస్తాయి ? మన దగ్గర ఉగ్రనరసింహుడు లేడా ? అసలయినా వాడితో నాకు పోటీ ఏమిటి? వాడిది అపమార్గం అయితే దిద్దవలసిన ధర్మం నాకు వుంది గనుకనే ఈ ఏడుపు ఏడుస్తున్నాను" అన్నాడాయన.

'చాలా సంవత్సరాల తరువాత యీ మధ్యే కాస్త వస్తూపోతూ వున్నాడు తండ్రి. ఈయనతో ఇంతకన్నా తనకు పోట్లాట యెందుకు?' అనుకొని వూర్కుంది వరలక్ష్మిగారు.

శాస్త్రిగారు ఒక మండలదీక్ష పూర్తి చేసి ఒకరోజున ఆశ్రమానికి వెళ్ళాడు. అది వేసవి కాలం. వేసంగిలో ఆ ఎత్తు తక్కువ రేకుల ఇంట్లో కాలక్షేపం చెయ్యటం కష్టంగా వుండి, వీలయినంత వరకూ చెట్లకిందే గడుపుతున్నారు స్వామీజీ. రాత్రిళ్ళు గూడా ఆరుబయటో, చొప్పరంలోనో పడుకుంటున్నారు. "దారిద్ర్యంలో చుట్టాల"న్న సామెతగా శాస్త్రిగారు అప్పుడే వచ్చాడు. ఆరోజు రాత్రి ఎవరూ భోజనాలుగానీ, ఫలహారాలుగానీ చెయ్యలేదు. శాస్త్రిగార్ని ఎవరూ పలకరించలేదు. తండ్రీ కొడుకులు చాపలు వేసుకొని చొప్పరంలో పక్క పక్కనే పడుకున్నారు.

రాత్రి పదకొండు దాటాక— "అప్పా! ఆకలేస్తోందిరా" అంటూ లేచి కూర్చున్నాడు శాస్త్రిగారు.

"ఇప్పుడేమి ఆకలండీ? పోనీ లోపల కాసిని మజ్జిగ ఉన్నట్టున్నాయి, యిచ్చేదా?" అన్నారు స్వామీజీ.

"ఆకలేసి చస్తుంటే మజ్జిగ యిస్తావా? ఈ ముసలాడు పీడా విరగడైపోతే బావుండునని చూస్తున్నావా?" శాస్త్రిగారి స్థాయి మెట్లెక్కుతోంది.

"అదేమిటండీ? ఇవాళ్ళ ఆశ్రమంలో ఏమీ లేదని మీకు తెలుసు. ఏమీలేక యీ రాత్రికి మేమంతా ఉపవాసం చేశామని గూడా మీకు తెలుసు."

"తెలుసా! నాకు తెలుసా! ఇంత ఆశ్రమం కట్టుకొని ఇంతమంది శిష్యుల్ని పెట్టుకొని దేశాలన్నీ తిరుగుతున్నావు. తండ్రి ఆకలితో అఘోరిస్తుంటే ఇదా నువ్వు చెప్పేమాట ? పైగా నాకే తెలుసంటావా?"

"అబ్బబ్బ! గోల చెయ్యొద్దు. మీకేం కావాలో చెప్పండి."

"నాకు బొబ్బట్లు కావాలి."

"బియ్యపు రవ్వ వుంటే, ఉప్మా అన్నా చేయించి పెట్టేవాణ్ణి. ఏమీ లేకే గదా మీ రొచ్చినా, పలకరించకుండా వూరుకుంది. ఇప్పుడు బెల్లం ఎక్కడ తెచ్చేది, పిండి ఎక్కడ తెచ్చేది?"

"అవన్నీ నాకు చెప్పకు. ఏం కావాలన్నావు, చెప్పాను. మళ్ళీ చెపుతున్నాను. బొబ్బట్లు కావాలి. వేడివేడి బొబ్బట్లు" శాస్త్రిగారు మరో షరతు పెంచారు.

"సరే పట్టండి" అంటూ స్వామీజీ యిటూ అటూ చూశారు. వారి చాపల దగ్గరే ఏదో ఒక కాయితం ముక్క పడేసి వున్నది. అది ఏదో పొట్లాల కాయితం లాగా వుంది. దాన్ని తీసి శాస్త్రిగారి చేతులో పెట్టి దాన్ని మెల్లగా నాలుగుసార్లు చరిచారు స్వామీజీ.

టప్, టప్, టప్, టప్ అని నాలుగుసార్లు మోత వచ్చింది. నాలుగు బొబ్బట్లు, కొంచెం చెట్నీ ఆ కాయితంలోకి చేరాయి. బొబ్బట్లు వెచ్చగా వున్నాయి. పచ్చడి చల్లగావుంది.

శాస్త్రిగారు మౌనంగా రెండు బొబ్బట్లు తిని, "బావున్నాయి. ఆకలి తీరిపోయింది" అన్నాడు. అని, కాసిని మంచినీళ్ళు తాగేసి, మిగిలినవి ఆ కాయితంలోనే పొట్లం కట్టుకొని తల కింద పెట్టుకొని మాట్లాడకుండా పడుకున్నాడు.

తెల్లవారి లేస్తూనే ఆయన కూతురింటికి వెళ్ళిపోయాడు. "రాత్రల్లా తలకింద పెట్టుకొని జపం చేశానే అమ్మాయి. అయినా వీటిలో ఏమీ మార్పురాలేదు. నువ్వు తింటే మంచిదే. తినేసెయ్యి" అని ఆ రెండు బొబ్బట్లూ కూతురు కిచ్చాడు.

"బలే బావున్నాయి నాన్నా." అంది వరలక్ష్మిగారు అవి తింటూ.

"ఆ రుచి ఆ వస్తువుది కాదేమో అనిపిస్తోంది" అడాన్నాయన ఏదో ఆలోచిస్తూ.

"బొబ్బట్ల రుచే నాన్నా నేను చెప్పేది." అంది వరలక్ష్మిగారు.

"కాదులే, అది వాటిని యిచ్చినవాడి రుచి"

"ఏమిటి నాన్నా నువ్వు చెప్పే మాటకు అర్థం?"

"అది నీకు తెలీదులే"

ఈ సంఘటన అయిన తరువాత శాస్త్రిగారు ఆశ్రమానికీ, కూతురింటికీ వస్తూపోతూనే వున్నాడు. స్థిరంగా మాత్రం వుండటంలేదు. ఒకరోజున ఆశ్రమంలో ఏదో డబ్బు అవసరం వచ్చి, స్వామిజీ ఆ గూట్లోనూ, ఈ గూట్లోనూ, పెట్టి వున్న చిల్లర డబ్బులన్నీ యేరి యిచ్చినా చాలక యిబ్బంది పడుతూ వుండటం శాస్త్రిగారి కంటబడ్డది. చివరికి అక్కడ వున్న భక్తులు వాళ్ళ జేబుల్లో వున్న డబ్బులు గూడా వేసి, ఆ పని యెలాగోలా సరిపెట్టారు. అది చూసి శాస్త్రిగారి మొహం చాటంతయింది.

వచ్చిన భక్తులు నలుగురూ వెళ్ళేదాకా ఆగి, పెడమొహం పెట్టుకొని, కొడుకుతో "నేను వూరెడుతున్నాను. నాకు డబ్బు కావాలి" అన్నాడు.

"మీ దగ్గర డబ్బుందిగా, నన్నడుగుతారేం?" అన్నారు స్వామీజీ.

"ఉంటే...ఉంటే వుంటుంది, ఉంటే అడగరాదా నేను? ఇవ్వరాదా నువ్వు? ఆ డబ్బు వేఱు, దాని పని వేరు. కనీసం ఛార్జీలయినా యిచ్చి పంపించవా నువ్వు?" ఉన్న మెలికలన్నీ వరసగా పెట్టేసాడు శాస్త్రిగారు.

"ఎంత కావాలి?" అన్నాడు స్వామీజీ శాంతంగా.

"నలభై రూపాయలు" అన్నాడు శాస్త్రిగారు.

ఇక స్వామీజీ ఆశ్రమంలో వున్న ఆ రెండు గదుల భవంతిని కలయ తిరిగి వెతక సాగారు. ఆ గూట్లో ఒక రూపాయి బిళ్ళ, యీ చూర్లో ఒక పావలా బిళ్ళ, ఇలా తలా ఒక చోటా తలో నాణెమూ దొరకసాగింది. అంతకుముందు శాస్త్రిగారు ఆ చోట్లన్నీ పరిశీలించి వుంచినవే. కొడుకు ఇలాంటి ఉపాయమేదో చేస్తాడని ఆయనకు ముందే తెలుసుగనుక, కొడుకు లోపల యే మంత్రం చెప్పుకుంటున్నాడు, ఏం యోగం చేస్తున్నాడు అని నిశితంగా గమనిస్తున్నాడు శాస్త్రిగారు. ఏ రకమైన స్పందనా లేక, ఆ హృదయం కేవలం నిష్పందనంగా కనిపిస్తోంది! ఆయనకు విషయం ఏమీ అర్థం కావటంలేదు. మొత్తానికి చిల్లర డబ్బులతోనే నలభై రూపాయలు పోగుబడ్డాయి. అవి పుచ్చుకొని వెళ్ళిపోయిన శాస్త్రిగారు సరాసరి స్వగ్రామం చేరాడు. అక్కడ ఈ నాణాలు ఎదురుగా పెట్టుకొని, ఆరునెలల పాటు వివిధ సంపుటీకరణాలతో జపాలు చేశాడు. ఆ నాణాలలో ఏ రకమైన మార్పూ రాలేదు. వాటిలోంచి ఏ రకమైన దుష్ట స్పందనలూ రాలేదు. అప్పటికి ఆయనకు ఖాయమైంది, "ఇది అసలు మంత్రసిద్ధి వ్యవహారం కానేకాదు. దీనిలో ఏ రకమైన మంత్రమూ లేదు. గాణాపత్యమూ లేదు. శాక్తేయమూ లేదు, వైష్ణవమూ లేదు, సౌరమూ లేదు, శైవమూ లేదు. ఇది పూర్తిగా యోగ సిద్ధే తప్ప మరొకటి కాదు." ఈ నిర్ణయానికి వచ్చే ముందు ఆయన ఒకటికి పదిసార్లు మళ్ళీ మళ్ళీ అనుమానించి చూశాడు.

* * *

## జన్మసిద్ధి

అలా ఆలోచిస్తున్న శాస్త్రిగారికి తన పుత్రుడి బాల్యంలో సంఘటనలు కొన్ని గుర్తు రాసాగాయి. వాటన్నింటినీ నెమరువేసుకొంటూ ఆయన ఇలా ఆలోచించసాగాడు.

"వీడు జన్మసిద్ధుడా? యోగ సిద్ధుడా? అయిదారేళ్ళ పిల్లతనంలోనే, చేతిలో బియ్యం పట్టుకొని ఆ గుప్పిలిలోనే ఆ బియ్యాన్ని అన్నంగా మార్చి నాకు చూపించాడు. అప్పుడపె

దయ్యపు చేష్ట అనిపించింది. అప్పట్లోనే మరోసారి యిసక చేతిలో పెట్టి తినమన్నాడు. తింటే, ఆ యిసక పంచదారలాగా తియ్యగా వుంది. అప్పుడేదో పని తొందరలో వుండి, దాన్ని పట్టించుకోలేదు. సుమారు పదేళ్ళ వయస్సులోనో, ఇంకా లోపుగానో తొడలో కత్తి గుచ్చుకొని చూపించాడు. వూళ్ళోకి వచ్చిన గారడీవాళ్ళ పిల్లలతో తెగ గంతులేస్తూ వుండేవాడు గనుక, ఏ దొమ్మరి వెధవల దగ్గరో క్షుద్ర మంత్ర మేదయినా పట్టాడేమో అని కోపగించాను. బడి పుస్తకాల సంచిలోంచి తినుబండారాలు సృష్టించి పిల్లలకు పంచటం అప్పట్లోనే నా కంట పడ్డది. అది గారడీ మాయ లెమ్మని అశ్రద్ధ చేశాను. మూడు నాలుగేళ్ళ వయస్సులోనే వీడు విచిత్రమైన భూత భవిష్యత్తులు జ్యోశ్యాలుగా చెప్పాడు. శకునపక్షి అని ముద్దులు చేసి వదిలేశాను. పదేళ్ళ వయస్సులో గాబోలు ఒకసారి వీడు పది రూపాయల నోటు ముక్కలు ముక్కలుగా చింపేస్తే నాకు వొళ్ళు మండి కట్టె పుచ్చుకున్నాను. దడుచుకొని ఆ నోటును మళ్ళీ యథాప్రకారంగా చేసేసి నా చేతిలో పెట్టాడు. అప్పుడు దాని సంగతి నేనెందుకు పట్టించుకోలేదబ్బా? అన్నట్టు అప్పుడే ఒకసారి ఒక వెండి కడియం నా కళ్ళెదుటే సృష్టించి నాకిచ్చాడు. అది వీడి దొమ్మరి గారడీ మంత్రాల సృష్టి అని కోపగించి, దాన్ని పరీక్షిద్దామని చాలా కాలం దేవతార్చనలో పెట్టాను. అది వెంటనే మాయం కాలేదని ఆశ్చర్యపోయాను. ఆ తరువాత దాని సంగతి ఎలా మరిచిపోయాను? ఆశ్చర్యంగా వుందే! ఆ తరువాత ఇళ్ళు మారటాల్లో ఆ కడియం ఎటు పోయిందో గుర్తు లేదు. వీడు ప్రొద్దుటూర్లో వుండగా ఒకసారి వేపాకు దూసి నా చేతిలో పెట్టి తినమన్నాడు. తింటే తియ్యగా వుంది. ఇదేమిటని నేనెందుకు ఆలోచించ లేదప్పుడు? నాకేం మాయ కమ్మింది?

నిజమే, అప్పుడేదో మాయ కమ్మింది నన్ను. ఆ తరువాత నా వెర్రిలో నేనుండి వీడి మాటే ఆలోచించలేదు. ఆ తరువాత వీడీ సన్యాసం పుచ్చుకున్నాక, ఈ మైసూర్లో చాలా సంఘటనలు చూశాను. కాని నంజన్‌గూడా శివాలయంలో వీడు విభూతి రాశి, కలకండరాశి సృష్టించినప్పుడు కొంచెం అనుమానం కలిగింది. ఆ తరువాత ఒక పాదపూజ చోట, ఎడంకాలు పాదపీఠం మీద వుంచి, కుడికాలు ఎడం తొడమీద వుంచుకొని కుర్చీలో కూర్చున్నాడు వీడు. అప్పుడు ఆ కుడి అరికాలు లోంచి, అందరూ చూస్తుండగా అరగంట సేపు కుంకుమ ధార కారింది. ఈ రెండు సంఘటనలు చూసినాక ఇక్కడేదో "దైవచ్ఛాయ" ఉన్నట్టుందిరా అని అనుమానం కలిగింది. పరిశోధన మొదలెట్టాను. యోగసిద్ధుడని నిర్ణయం అవుతోంది. ఈ పరిశోధన చిన్నప్పుడే చేసి వుంటే, ఇతడు జన్మసిద్ధుడేనేమో తేలిపోయి వుండేది. జన్మసిద్ధుడేనేమో అని యిప్పు డనుమానం వస్తోంది.

మరి అంత జన్మసిద్ధుడైనవాడు చదువులో అంత మొద్దుగా వుంటాడా? అంత అల్లరి వెధవగా వుంటాడా? వీడు చిన్నప్పుడు చదువు విషయంలో మొద్దు మాత్రమే కాదు. ఉత్త దొంగకూడాను. వీడి పద్ధతి చూసి బొమ్మెపర్తిలో బడిపంతులు వీణ్ణి చేర్చుకోనన్నారు. పుల్లలరేవు

పంతులు గెంటేశాడు. చివరకు అయివారిపల్లిలో అయ్యవార్ని బతిమాలి ఆ బళ్ళో వెయ్య వలసి వచ్చింది. అక్కడా బడి యెగగొట్టి దార్లో వున్న వంకలో ఆటలు సాగించాడు. అనేకసార్లు అనేక విధాల దండించాను. ఒకసారి కోదండం వేయించి కింద ముళ్ళకంప పెట్టి మిరపకాయల పొగ వేశాను. కొన్నాళ్ళు కాళ్ళకు బండకొయ్య వేశాను. ఏమిచేసినా వీడికి చదువుశ్రద్ధ మాత్రం యేర్పడలేదు. జన్మసిద్ధుడయితే యీ చదువు దొంగతనం వుంటుందా? కాని, ఒకోసారి వీడి మాటల్లో వయస్సుకు మించిన తెలివి కనిపించేది. అదేమి చిత్రమో మరి?

ఔను, జన్మసిద్ధుడికీ అవతారమూర్తికీ భేద మేమిటి? అంబయ్య మావ వుంటే చెప్పే వాడు. సర్లే పోసీ, లేనివాళ్ళ గురించి ఆలోచన లెందుకు? 'ఇప్పు డితను మాత్రం యోగ సిద్ధుడే. అందులో సందేహం లేదు.' చివరికి ఈ నిర్ణయానికి రాక తప్పలేదు శాస్త్రిగారికి. దాంతో ఆయనకు హృదయభారం తీరింది. ఎంతో సంతోషం కలిగింది. "వాడు అదృష్టవంతుడు. వాడి కే యోగి తగిలాడొ యేమో. ఎలా అయితేనేమి, ఏదో మంచి మార్గం పట్టింది. అంతే చాలు" అనుకుని ఆయన, తృప్తిగా వరలక్ష్మి గారింటికి చేరి తన మనస్సులో మాట ఆవిడతో చెప్పేశాడు. కానీ, మానవ మనస్సు చాలా చిత్రమైంది. తెలిసి తెలిసీ తప్పు చెయ్యటం దాని ప్రత్యేకత.

"యోగంలో వీడెంతమటుకు వచ్చాడో చూద్దాం" అనిపించింది ఉన్నట్టుండి శాస్త్రిగారికి.

"దానికి మన శక్తి చాల్తుందా?" అని ఆయనకు సందేహం కలిగింది. కాని చాపల్యం మనస్సుని ఆగనీయదు కదా!

* * *

## వృద్ధాశ్శిష్యా గురుర్యువా

ఆయన సరాసరి ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ కొద్దిమంది ముఖ్య భక్తులు మాత్రమే ఉన్నారు. స్వామీజీ వాళ్ళతో మాట్లాడుతున్నారు. అలాంటి సమయంలో వెళ్ళి "అప్పా! నిన్నిప్పటికి రెండుసార్లు పరీక్షించాను. నాకు తృప్తయింది. నీది మహాసిద్ధి తప్పితే సామాన్య సిద్ధి కాదు. నీది పూర్తిగా ధర్మమార్గం. నాకు తృప్తి అయింది' అన్నాడు శాస్త్రిగారు.

ముసలాయన ఏదో పరీక్షలు చేస్తున్నాడని అప్పటికే ఆశ్రమంలో గాలివార్త లేచింది. కనుక, అక్కడ చేరిన భక్తులంతా శాస్త్రిగారి ప్రకటనకు పరమానందపడ్డారు.

స్వామీజీ ముఖంలో మాత్రం ఏమీ ఆనందం కనిపించలేదు. పైగా అక్కడున్న భక్తులను "మళ్ళీ కలుద్దాం" అని వెంటనే పంపించేసి "కొంచెం ఇలా రండి" అని శాస్త్రిగార్ని దూరంగా పొదల మధ్యలోకి తీసుకుపోయారు. అలా తీసుకెళుతుంటేనే భయం బయలు దేరింది శాస్త్రిగారికి.

శిష్యుల సమక్షంలో పొగిడితే లోపల అహంకార స్పందన ఎలా వుంటుందో గమనిద్దామని ఆయన ప్రయత్నించాడు. అదీగాక, ఇలా పొగుడుతూ వుంటే, ఏమరుపాటులో వుంచ వచ్చునీ, అప్పుడు మళ్ళీ యేదయినా పరీక్ష చెయ్యవచ్చునీ ఆయన ఆలోచన. కానీ యిప్పుడీయన దగ్గర యే అహంకార స్పందనా కనిపించకపోగా, తనను దూరంగా ఏకాంత ప్రదేశానికి తీసుకుని వెళ్ళుతున్నాడంటే తన ఆలోచన ఈయనకు తెలిసిపోయిందో యేమో అని భయం బయలుదేరింది శాస్త్రిగారికి. నేల కొంచెం బావున్నచోట, ఒక చెట్టు కింద తను కూర్చుని తండ్రిని గూడా కూర్చోమన్నారు స్వామీజీ. ఆయన కూర్చున్నాక తనే మొదలుపెట్టారు స్వామీజీ.

"ఇప్పుడు చెప్పండి. తెలిసిగూడా ఎందుకు మొదలెట్టారీ పని ?"

"ఏం తెలిసి ? ఏం పని ?"

"మీ శక్తికి మించిందని తెలిసి మళ్ళీ పరీక్షించే పని"

"అది నా ధర్మం"

"అలాగా, మనకు అందని యెత్తు అనుకుంటూనే యెగరటమే ధర్మమా ?"

"నేనలా అనుకున్నానని నీ కెవడు చెప్పాడు ?"

"నా కెవడు చెప్పాడో తరువాత చూద్దాం. మీరు పుట్టి బుద్ధెరిగిన దగ్గర నుంచి యేమేమి అనుకున్నారో వరసగా కొన్ని ఉదాహరణ లిస్తాను, వినండి ముందు" స్వామీజీ మాట తీవ్రం అయ్యేసరికి మంత్రముగ్ధుడిలాగా అవాక్కయిపోయాడు శాస్త్రిగారు. స్వామీజీ చెప్పుకుపోసాగారు.

*                    *                    *

దాసంభొట్లుగారి ప్రోద్బలం వల్ల గాయత్రీ ఉపాసన క్రమంగా పెంచసాగాడు నరసింహశాస్త్రిగారు. ఆ రోజుల్లోనే పినతండ్రి సూరప్ప శాస్త్రిగారు తన సూర్యోపాసన ధారా దత్తం చేశాడు.

"ఉగ్ర నరసింహానికి కాస్త శాంతి గదా అని గాయత్రీ ఉపాసన ప్రవేశపెడితే, మళ్ళీ సౌరం చేరి మంటలెక్కువ అవనే అయినాయి గదరా" అన్నాడు. ఒకరోజున దాసంభొట్లు గారు. అని ఒక క్షణం ఆగి 'అయినా అసావాదిత్యో బ్రహ్మ' అని గదా మన ఉపాసన పద్ధతి" అన్నాడాయన. "మామా, ఈ సూర్యుడు రోజూ పొద్దున్నే పుట్టి సాయంత్రానికి చస్తున్నాడు అని మనకు కనిపిస్తోంది గదా ! వీడు పరబ్రహ్మమిటి ?" సందేహం సూటిగా అడిగేశాడు నరసింహశాస్త్రిగారు. ఆ మాట మోటుగా వుంది. నిజమే, కాని, ఆ మాట వెనుక వున్న వూహ ఎంత సున్నితమైనదా అని సంతోషపడుతున్నాడు దాసంభొట్లుగారు.

తానిప్పటికి ఎందరో శాస్త్ర విద్వాంసులకు శాస్త్ర పాఠాలు చెప్పాడు. "అసావాదిత్యో బ్రహ్మ" (ఈ సూర్యుడు పరబ్రహ్మ) అనంగానే, "ఔను! సూర్యుడు జ్యోతి స్వరూపుడు గదా! అందుకే పరబ్రహ్మ" అన్నవాళ్ళే తప్ప, "ఉదయాస్తమయా లున్నవాడు నిత్యుడెలా అవుతాడు? దృశ్యమైన జ్యోతి, దృక్కు ఎలా అవుతుంది?" అని ఆలోచన వచ్చినవాడే ఆ పండిత శిష్యుల్లో లేడే? ఈ నరసిమ్మప్పకు, ఆ దృక్కు, దృశ్యం ఇలాంటి మాటలు తెలీవు. అందుకని ఆ మాట మోటుగానే వుంటుంది. కాని ఆ ఊహ ఎంత సూక్ష్మమైనది? వంశ పరం పరగా వచ్చిన ఉపాసనల ఫలం యితనిలో వికసిస్తోంది" అని ఆయన లోలోపల సంతోష పడుతూ మౌనంగా ఉండిపోయారు.

"ఏం మావా! సమాధానం చెప్పవేం? నాకింకా అర్హత రాలేదా?" నరసింహశాస్త్రి గారు తలవంచుకొని అడిగాడు.

కుర్రవాడి తపనకు నిజంగానే కరిగిపోయాడు దాసయ్య మామ. పైకి మాత్రం గంభీరంగా గొంతు సవరించుకొని మొదలుపెట్టాడు. "ఊ! నీకు తెలియం దేముందిరా? ఇప్పుడిక్కడ అస్తమిస్తున్న సూర్యుడు, ఇక్కడ చచ్చిపోయి రేపు కొత్తగా పుట్టబోతాడంటూనా? అదికాదు, ఇక్కడ మునిగిపోతే, మరో దేశానికి తేలుతూ కనిపిస్తాడు."

"అంటే?"

"ఓహో! అదా, దీన్తస్సగొయ్య! తెలిసింది మావా! చూసే నేను, సూర్యుడు పుట్టాడు, మునిగాడు అనుకోవటమే తప్ప, ఆ సూర్యుడు ఎప్పుడూ వొకలాగే తిరుగుతున్నాడు. ఆ సూర్యుడికి తనకు తానుగా చూసుకొంటే పొడుపూ లేదు, కుంకూ లేదు. అవునా?"

"మరి, లేనిది ఉన్నట్టు ఎలా కనిపిస్తోందిరా అబ్బీ?".

"మధ్యలో అంటే, నాకూ సూర్యుడికీ మధ్యలో భూమి అడ్డం రావటంవల్ల."

"అయితే సరిపోయినట్టేగా?"

"ఏం సరిపోవటం మావా! ఆ సూర్యుణ్ణి నేను చూస్తున్నానయ్యో, వొకోసారి ఏదైనా అడ్డం వస్తే కనిపించటం లేదయ్యో, అది బ్రహ్మమెలా అవుతుందయ్యా?"

"చూస్తున్నావా? దేంతో చూస్తున్నావు?"

"ఇంక దేంతో, కంటితోనే"

"ఉదయాస్తమయాలు కల సూర్యుణ్ణి కంటితో చూస్తున్నావు నిజమే, అవి లేని సూర్యుణ్ణి?"

"ఏంటి...సూర్యుడు, నేను వేరు వేరుగా వున్నాం కనుక, వాణ్ణి నేను చూస్తున్నాను. నేను అలా చూస్తున్నాను గనుక వాడికి పుట్టుటం గిట్టుటం వచ్చాయి...కనుక...కనుక" నరసింహయ్య బహిరంగంగా ఆలోచించసాగి, చివరికి ఆలోచనే మానేశాడు. ఇక మాటల్లేవు. అలా ఎంతసేపు జరిగిందో ఇద్దరికీ లెక్క తెలీదు.

కోడి కూసి, పాలేరు పిల్లవాడు వచ్చి తలుపులు తెరిచి వున్న గదిలో దీపం వెలుగుతూ వుండటం చూసి, అనుమానంగా లోపలికి తొంగిచూశాడు. లోపల అయ్యగార్లిద్దరూ చపటా లేసుకుని, కూర్చునే గట్టి నిద్దర లాగిస్తున్నారు గాబోలనిపించి నవ్వుకున్నాడు. ఎందుకయినా మంచిదని పిల్చిచూశాడు "అయ్యగారూ!" అని.

ఉలిక్కిపడకుండానే లేచారు. ఎదురుగా "చరణాకోల" చేతబట్టుకొని తొంగి చూస్తున్న పాలేరు పిల్లవాణ్ణి చూసి, "నిన్ను పార్థసారథి పరమాత్మ అనుగ్రహించాడురా" అన్నారు దాసంభొట్లుగారు. మౌనంగా నమస్కరించాడు నరసింహశాస్త్రిగారు. చిన్న పంతులు గారు సరాసరి తనకే నమస్కారం పెట్టటం చూసి, భయంవేసి పారిపోయాడు కుర్రపాలేరు. లేచి నుంచున్నాడు నరసింహశాస్త్రిగారు.

"కనిపించాడా, వెనకా ముందూ కర్త, కర్మ లేవీలేకుండా?" అడిగాడు దాసంభొట్లు గారు.

"చాల్లేవయ్యా మావా! కనిపించాడంటే పీక పట్టుకుందామనా ఏమిటి? వాడు కనిపించేవాడుకాదు, కనపడని వాడూ కాదులే." అంటూనే. చెప్పుల్లో కాళ్ళు పెట్టాడు నరసింహయ్య. అప్పటికి గొడ్ల సావిట్లో నిద్రలేస్తున్న ఆవుల మెడ గంటల చిరురవళులు బాగా వినిపిస్తున్నై.

"ఒరే, అల్లుడూ! నీకు మా చివరిదాన్నిద్దామని వుందిరా, చేసుకుంటావా" ఉన్నట్టుండి అడిగాడు దాసంభొట్లుగారు.

"పెళ్ళి చేసుకోవాల్సిందేనంటావా?"

"నే ననేదేముందిరా? నిన్ను సముద్రంలో పారేసినా, నీకు ఒకటి గాదు, రెండు పెళ్ళిళ్ళు తప్పవు."

"అలా అయితే, ఎవత్తెను చేసుకుంటే యేమిటి మావా? నువ్వొచ్చి మా పిన్నాన్నతో మాట్లాడు. నేను కాదనేదేముంది?"

దులుపుకు పోతున్నట్లు మాట్లాడటమే తప్పితే, నిలబడి అనునయంగా సమాధానం చెప్పటం నరసింహశాస్త్రిగారికి లేనేలేదు. ఏదీ వంటబట్టించుకోక, మనస్సుకు పట్టించుకోక, దులిపేసుకునే వాడి పద్ధతి యిలా గాక మరెలా వుంటుంది? అదంతే, అదో మోటు మేళం. కనీసం గురువు గదా అని మొహమాటమైనా లేదు.

అడ్డదోవన డొంకలంబడి పడి, తుమ్మల తోపులోంచి చరచరా నడుస్తున్న నరసింహశాస్త్రికి యివాళ్ళ ఒక్క ఆలోచన మాత్రం ఎంత దులుపుకున్నా వదలటం లేదు.

"దాసయ్య మామ ఇంత ఉపదేశమూ చేసి, కూతుర్నిస్తా నంటాడేమిటి?" ఎంత ఆలోచించినా సమాధానం అందటం లేదు.

"మామ బుద్ధిహీనుడా? కాదు. దంత వేదాంతి కానేకాదు, ఆయన మాటను అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలేగాని, అందులో తప్పులు పట్టాలని చూడరాదు.

తనకు రెండు పెళ్ళిళ్ళని తెలిసి గూడా పిల్లనిస్తానంటున్నాడు. తనకు ఇల్లు పట్టదని తెలిసిగూడా పిల్లనిస్తా నంటున్నాడు. ఎందుకు? ఎందుకు?" సమాధానం దొరక్క చిర్రెత్తు కొచ్చింది నరసింహశాస్త్రిగారికి. దాంతో అక్కడే, డొంకదారి పక్కన వో చెట్టుక్రింద మఠంవేసి, గాయత్రీ జపం ప్రారంభించాడు. అదేం ఉగ్రమో, మొదలెట్టటం బిగ్గరగా బయటికి వినపడేటట్టే జపం మొదలెట్టా డాయన. కాని, కొద్ది క్షణాల్లోనే తాటాకు మంట చల్లారినట్టు, కొండవాగు పొంగు దిగజారినట్టు, ఆ ధ్వని మందగించేసింది. ఇక తనకు వళ్ళు తెలీకుండా పోయిందన్న స్పృహ ఆయనకు లేదు.

ఆ తరువాత ఎప్పటికో ఇంటికి చేరాడు నరసింహశాస్త్రి. చేరేటప్పటికి, మేనమామ నరసింహస్వామిగారు వచ్చి కూతుర్ని తనకిచ్చి వివాహం చెయ్యటానికి ఖాయం చేసుకు వెళ్ళాడని చెప్పారు ఇంట్లో, "అట్లా జరిగిందా, సరే పోన్లే" అన్నాడు.

పన్నెండేళ్ళు గిర్రున తిరిగిపోయాయి. కందుకూరు నుంచి చెందవోలు నరసింహస్వామి గారు "మగపిల్లవాడు పుట్టాడు" అని కబురు చేశాడు. ఆ వార్త విని నరసింహశాస్త్రి ఎగిరి గంతేసినంత పని చేశాడు. భార్య కాపురాని కొచ్చి పదేళ్ళు అయి, సంతాన యోగం వుందో లేదో అని అనుమానిస్తున్న రోజుల్లో, భార్య గర్భవతి అయిందంటేనే ఆనందం సహజం! ఇక, మగపిల్లవాడే పుట్టి పితృరుణం తీరిందని తెలిసినప్పుడు శాస్త్రిగారు పొంగి పోవటంలో తప్పేమిటి? వింతేమిటి? పైగా, మనస్సులో ఒక భావం కలిగిందంటే, కుండ బద్దలు కొట్టటమే గానీ, బిగుసుకు కూర్చోవటం చేత కానేకాదు ఆయనకి! వచ్చి బారసాల చేసుకో మని రెండో కబురు వచ్చింది. ప్రయాణానికి యేర్పాట్లన్నీ జరుగుతున్నాయి.

అత్తాకోడళ్ళంచు పంచ గట్టుకొని, జరీ అంచు ఉత్తరీయం వేసుకొని, తలకు సంపెంగ నూనె రాసుకొని, పిలక జుట్టు దువ్వెనతో దువ్వుకొని, ముడి సవరించుకొని అత్తారింటి ప్రయాణం పొంగులో వున్నాడు నరసింహశాస్త్రిగారు. సూరప్పగారు గొడ్లసావిడకీ ఇంటికీ మధ్య అలంగా తిరుగుతూ బళ్ళు కట్టించే సందట్లో వున్నాడు. ఆయన దగ్గర ఎందువల్లనో సందడేగాని ఆనందం కనిపించటం లేదు. తమ్ముడికి "తోడ గుడ్డ" గా వెళ్ళటానికి వచ్చిన వెంకమ్మ పెద్దంచు పట్టుచీర కట్టుకొని ఆడబడుచు దర్జాలో అందరి మీద హుకుములు జారీ చేస్తోంది. ఈ సందట్లో దాహం వేసి, మంచి నీళ్ళు అందించే వాళ్ళు కనిపించక తనే పడమ టింటికేసి నడిచాడు నరసింహశాస్త్రి గారు. అలా వెళ్ళిన శాస్త్రిగారు, పడమటింటికి నాలుగడుగుల దూరంలోనే టక్కున నిలబడి పోయాడు. పడిమటింట్లో సూరప్పగారి భార్య నరసమ్మగారికీ, వాళ్ళ పెంపుడు కొడుకుకూ ఏదో కీచులాట సాగుతోంది. ఆ దత్తుడేదో ఆస్తి వివరాలు అడుగు తున్నాడల్లే వుంది.

"అరవకురా! మీ పెదనాన్న గారు వింటే చంపేస్తారు" అని మొత్తుకుంటోంది పెంపుడు తల్లి.

"ఏమిటి భయం? నాకేం భయం లేదు! ఆస్తి యిష్టం వచ్చినట్టు తగలేస్తున్నారు. అడ్డమైన వాళ్ళూ దోచుకు తింటున్నారు. ఆ శేషప్ప గాడు తగలెట్టిందెంత? ఆ సుబ్బాయికి కట్ట బెట్టిందెంత? వెంకమ్మ మొహాన ఎంతపోశారు? రేపీ పిచ్చి నరసింహాయకి దోచి పెట్టేదెంత? నా కింకా మిగిల్చి చచ్చే దేమయినా వుందా? ఆ వివరాలన్నీ నాకు కావాలి. నువ్వు అడిగి చెప్పినా సరే. లేదా నన్నే నిగ్గదియ్యమన్నా సరే" దత్తుడు రెచ్చిపోయి మాట్లాడుతున్నాడు.

నరసమ్మగారికి చిర్రెత్తినట్టుంది. "ఏమిట్రా నీకు చెప్పేది? మా మామగారు ఆయన కొడుకులకు ఆస్తి విభాగాలు చేసి యేమీ అప్ప చెప్ప లేదు. అదీగాక, ఇందులో మా అత్తగారి ఆస్తి వుంది, నా ఆస్తి వుంది, మా తోడి కోడళ్ళదుంది. ఇంత స్త్రీ ధనం వుంది. నీకు లెక్కలు చెప్పే దేమిటి? అట్టే వాగావంటే, మీ అమ్మకు కబురు చేస్తా, ఏమిటనుకుంటున్నావో"

"మా అమ్మా నాన్నే అడగమన్నారు... తెలుసా" రౌడీలాగా రెట్టిస్తున్నాడు దత్తుడు.

ఇక నరసింహశాస్త్రిగారికి అక్కడుండ బుద్ధి కాలేదు. దాహం ఎటు పోయిందో, ఆయన ఉత్సాహం ఎటు పోయిందో, తల వంచుకొని వెనక్కు వచ్చేశాడు. ఆ సరికి బళ్ళు తయారయి వున్నాయి. మౌనంగా వో రెండెడ్ల బండి యెక్కాడు శాస్త్రిగారు. అందులో అడబడుచు వెంకమ్మ ఎక్కింది. బండివాడు ఉషారుగా బండి దిగి తాళ్ళు పట్టుకొని ముందు నడుస్తున్నాడు. నాలుగయిదు బళ్ళు సాగుతున్నాయి. బళ్ళల్లో హాస్యాలూ, సరసాలు మరింత జోరుగా సాగుతున్నాయి. ఎందుకోగానీ, అసలు బండి వెంకమ్మ, నరసింహశాస్త్రిల బండే, నడకలోనూ, ఉల్లాసంలోనూ గూడా మందకొడిగా వుంది.

తమ్ముడి మౌనం చూసి, సిగ్గు గాబోలు అనుకొని నవ్వుకొంది వెంకమ్మ. నవ్వుకుందే తప్ప తమ్ముణ్ణి పలకరించక తనే కళ్ళు మూసుకొని కూర్చుంది. ఆ కుదుపుల్లో నిద్దర పట్టే ప్రసక్తి లేదు. కళ్ళు మూసుకొని వున్న ఆ ముఖం వంక చూస్తే "ఇది లోలోపల యేదో గొణుక్కుంటున్నట్టుందే" అనుకున్నాడు నరసింహశాస్త్రిగారు. మరో క్షణం అక్క ముఖంలోకి పరకాయించి చూసి, ఉన్నట్టుండి "ఒసే వెంకప్పా" అని పిలిచాడు. ఆవిడ సన్నగా ఉలికిపడి కళ్ళు తెరిచింది. ఆ ఉలికిపాటులో "శివాయ" అన్న ధ్వని అస్పష్టంగా నరసింహశాస్త్రి గారికి వినిపించింది.

"ఏమిట్రా అబ్బాయ్?" అక్క గొంతు చాలా మెత్తగా వుంది. ఇవాళ.

"నాకు వేదమూ సరిగ్గా అబ్బలేదు."

"ఆఁ..."

"శాస్త్రమూ పూర్తిగా అబ్బలేదు".

"ఊ..."

"పౌరోహిత్యమూ చేతగాదు...పూర్తిగా"

"ఊ..."

"జాతక భాగమూ అంతే, ముహూర్త భాగమూ అంతే"

"చెప్పు..."

"తను దూర సంధులేదు, మెడకో డోలని", సంసారం పెరిగిపోతోంది గదా? రేపు గడిచేదెల్లాగే అక్కా?" తను యింత ప్రశాంతంగా మాట్లాడటం శాస్త్రిగారికే ఆశ్చర్యంగా వుంది. వెంకమ్మ ఒక్క క్షణం ఎగాదిగా చూసింది.

"తమ్ముడూ" అని మళ్ళీ ఆగింది ఎందుకో.

"ఊఁ..."

"ఏమీ అనుకోవుగా"

"ఉహుఁ...చెప్పు"

"రేపటి గురించి ఆలోచించే వాడిది బ్రాహ్మణ పుటకేనట్రా?" ముట్టుకుంటే మెత్తగా కనిపించిన కొరడా కుచ్చు ఖసక్కున తగిలినప్పుడు వాతలు తేల్చినట్టు వుంది ఆ మాట మౌనంగా విని వూర్కున్నాడు తమ్ముడు.

"ఇలాంటి ఆలోచన చేసేవాళ్ళు మన వంశంలో పుట్టటం ఇదే మొదలేమో గదూ!" మళ్ళీ వెంకమ్మే అన్నది. వాతలకు ఆవకాయ కారం రాయటం అంటే ఇదేనేమో! నిజంగానే చుర్రుమంది తమ్ముడికి.

"సర్లే...సర్లే...నిన్ను కదిలించటం నాదే బుద్ధి తక్కువ—"అనేసి, ఆవలించి బండి తొట్లో గడ్డి సవరించుకొని పడుకున్నాడు. ఒక అర నిమిషమైందో లేదో నిశ్చింతగా గుర్రు పెట్టసాగాడు

*  *  *

బెంబేలెత్తి పోయిన శాస్త్రిగారు.... "నీ కీ విషయాలన్నీ యెలా తెలుసురా, అప్పా?" ఒక అరుపు అరిచేసరికి, స్వామీజీ వాక్ప్రవాహం ఆగింది.

"ఇవే కాదు, ఈ జీవితం మొత్తం నాకు తెలుసు. ఈ జీవితం మాత్రమే కాదు, వెనుక జీవితాలన్నీ నాకు తెలుసు. మీ ఒక్కరివే కాదు, చరాచర జీవు లందరి జన్మల కథ లన్నీ నాకు తెలుసు." ఈ మాట లంటున్న తన కొడుకు చతుర్థాధ్యాయం బోధిస్తున్న గీతాచార్యుడి లాగా కనిపించి ఒణికిపోసాగాడు శాస్త్రిగారు. కొద్ది క్షణాలాగి, మెల్లిగా తనను తాను సంబాళించు కొని, బహు దీనంగా అన్నాడు శాస్త్రిగారు.

"అప్పా, నువ్వు సిద్ధుడవులాగా కనిపిస్తున్నావు. ఆనాడు అంబయ్య మావ దగ్గర మిగిలిపోయిన ఆ ప్రశ్న అలాగే వుండిపోయింది. ఆ ముడి విప్పి పుణ్యం కట్టుకోరా, నీ సిద్ధుల సంగతి నాకెందుకు?

. "ఈ ముడి విప్పకునేందుకు ఇన్నాళ్ళుగా మీరేం కృషి చేశారు?" కోపమూ, జాలీ రెండూ లేవు స్వామీజీ మాటలో.

"ఈ ముడి ఊడి తత్వం దర్శించందే, ఇక ఈ లోకంలో యేదీ విలువైనది లేదని, అన్నింటినీ తృణీకరించి తిరిగాను."

"అన్నీ తృణీకరించిన మీకు వంశ ప్రతిష్ఠా, పుత్రుడి ప్రవర్తనా ఎందుకు పట్టాయి?"

"అది గృహస్థాశ్రమ ధర్మం గదా!"

"గృహస్థాశ్రమ ధర్మం పాటించే మీరు మీ పుత్రుణ్ణి మొదటి నుంచీ ఎందుకు జాగర్తలో పెట్టుకోలేదు?"

"ఒక వైరాగ్య భావంలో పడి, ఎవరి కర్మ వాళ్ళనే నడుపుతుందని అప్పుడు వదిలేశాను."

"పుత్రులను శిక్షించుకొని, సద్ధర్మం నేర్చుకోవాలని విధించిన శాస్త్రానికి ఎవరి కర్మ వాళ్ళను నడుపుతుందని తెలీదా? శాస్త్రానికి వైరాగ్యం మాట తెలీదా?"

"....(మౌనం)

"పోనీండి, ఆ వైరాగ్య భావాన్ని ఇప్పుడెందుకు వదిలేసి పుత్ర మోహంలో పడ్డారు?"

"........"

"మీరు మొదటినుంచీ ఒక కాలు గృహస్థ ఆశ్రమంలో వుంచారు. రెండో కాలు ఎక్కడ పెట్టాలో తెలీక గాలిలో వేళ్ళాడదీస్తున్నారు. దానికి వైరాగ్యమని ఒక పేరు మీరే పెట్టుకున్నారు."

"మీ అమ్మ పోయినప్పటి నుంచీ వానప్రస్థ జీవితం నడుపుతున్నాను."

"కలియుగంలో వానప్రస్థాశ్రమం శాస్త్ర సిద్ధమేనా?"

"అంటే.... ఆశ్రమమని కాదు...."

"మీరు గృహస్థ ధర్మం పాటించలేదు. సన్యాసాశ్రమం స్వీకరించలేదు. వానప్రస్థాశ్రమం కలిలో లేనేలేదు. ఇక మీరు ఏ ఆశ్రమంలో వున్నట్టు?"

"....(మౌనం)

"మీ దగ్గర ఉపాసన ఉన్నది గదా! ఆ ఉపాసనాబలంతో, మీ పక్కనే ఉన్న మహాయోగిని, మా అమ్మను ఎందుకు గుర్తించలేక పోయారు?"

"ఒకటి రెండుసార్లు అనుమానం తగిలింది గాని, గట్టి దృష్టి పెట్టలేదు."

"పోనీ, మీ అక్క వెంకమ్మగారి మీద ఎందుకు దృష్టి పెట్టలేదు?"

"ఆవిడ, ఏదో కొంచెం సాధించిందని తెలుసుగానీ, ఎవరినైనా మంచి స్వాములవార్ని పట్టుకుంటే మంచిదని ఆశ పడ్డాను."

"ఆవిడ సన్మార్గంలో వుందో లేదో అని చింత పడలేదు. పోనీ, ఇప్పుడు మీ పుత్రుణ్ణి చూశారు. మంత్రగబ్బలు, పాములు, వొంటిమీద పాకిపోతున్నాయి. నిద్దరపోతుంటే చుట్టూతా చెరి పడుకుంటున్నాయి. ఆడుకుంటున్నాయి. పీడు మరణస్తాడేమో అని మీకు భయం కలగలేదు, ఎందువల్ల ?"

"నీ ఉపాసన స్థాయి నాకు తెలుసు."

"ఆ స్థాయి వాయిద్యాలు పక్కన పెట్టుకున్నంత మాత్రంతోనే జారిపోయే స్థాయేనా?"

"........." (మౌనం)

"మీ పుత్రుడు అగ్నిలో నిలబడి గూడా కాలిపోలేదని విని మీరు సందేహించలేదు. ఎందువల్ల ?"

"చెప్పాగా, ఉపాసన బలం"

"ఆ బలం ఒక భవనం కనిపించగానే ఎగిరిపోయే బలమేనా ?

"పాములు, కప్పలు; పాములు, నెమళ్ళు; కుక్కలు, కుందేళ్ళు; కుక్కలు, కోతులు; జింకలు, కోతులు: కుక్కలు, పావురాళ్ళు; ఇక్కడ కలసి ఆడుకోవటం మీరు చూశారు. ఇవన్నీ నా పెంపుడు జంతువులేమో అన్న అనుమానం మీకు రాలేదు. ఎందువల్ల ?

"పెంచే అంత వ్యవధానం నీకు లేదు. నీది కేవల సాత్వికోపాసన అని గ్రహించాను."

"ఈ సాత్వికత నలుగురికి భజన నేర్పగానే పోయేదేనా ? నలుగురు వచ్చి నమస్కారాలు పెట్టగానే పోయేదేనా ?"

"ఆ బలం సరిగా వుందో లేదో అని పట్టి చూశాను, అంతే"

"దానివల్ల మీకు వచ్చిన ప్రయోజన మేమిటి ?"

"నాకేమి కావాలి ?"

"వంశ ప్రతిష్ఠ"

"అది తాత్కాలికంగా మనస్సులోకి వచ్చిన వికారం"

"నిజమే, మీ దగ్గర కొంత వైరాగ్య చింతన వున్నది. కాని, యే ఆశ్రమ ధర్మాన్ని మీరు మనస్సులో ఆరాధిస్తున్నారో అది మీ ఆచరణలో లేదే. ఇక మీకు తత్త్వదర్శనం ఎలా అవుతుంది ?"

"..........." (మౌనం)

"పరమేశ్వరుడు ధర్మచక్రాన్ని పితృపుత్ర పరంపరగా, గురుశిష్య పరంపరగా ప్రవర్తింప చెయ్యాలని సంకల్పించి వ్యవస్థ యేర్పరచాడుగదా, అది మీ దగ్గర ఎందుకు భంగమయింది?"

"జీవితపు కష్టాలవల్ల వచ్చిన ఒడుదుడుకులలో మనసుకు స్థిమితం లేకపోవటంవల్ల."

"అది వైరాగ్యమెలా అవుతుంది? వివేకంవల్ల వచ్చేదేకదా వైరాగ్యం!"

ఇక్కడ టక్కున మాట ఆపేశారు స్వామీజీ. కారణం? శాస్త్రిగారు బాహ్యస్మృతిలో లేరు. నిశ్చలంగా ఆయినవంకే చూస్తూ వుండిపోయారు స్వామీజీ. అలా దృగ్దీక్ష జరుగుతూ వుండగా, కొద్ది నిమిషాల తరువాత మూసివున్న శాస్త్రిగారి కళ్ళలోంచి బాష్పాలు ధారలు కట్టినై. మరికొద్ది సెకండ్లకే ఆయన లేచి నిలబడి, ఉత్తరీయం నడుముకు కట్టుకొని చేతులు జోడించి....

* "న కర్మణా న ప్రజయాధనేన...." అని మంత్రం చెప్పి నాలుగుసార్లు నమస్కారం చేసి, తన తల స్వామీజీ పాదాలకు ఆనించాడు. తరువాత, కళ్ళు తుడుచుకొని నిశ్చలమైన కంఠంతో ఇలా చెప్పసాగాడు.

"స్వామీ! అంబయ్యమావ పోయిన తరువాత, తత్త్వపరమైన నేత్రం ఇవాళ్ళే కొద్దిగా తెరుచుకుంటోంది. నేను చేసిన విషయ చింతనంతా నిర్గుణ తత్త్వ విషయమేగాని, నా ఉపాసన మాత్రం అంతా సగుణోపాసనగానే సాగింది. ధర్మాచరణ విషయంలో గూడా తప్పు జరిగిందని యిప్పుడు గ్రహించాను. అయినా, నా తండ్రి నృసింహుడి దయవల్ల ఇవాళ్ళ నీ తత్త్వం రవ్వంత దర్శించగలగాను. నువ్వు నాకు పుత్రుడివన్న భ్రమ తొలగించేశాడు ఆ తండ్రి. నువ్వు యోగులకు యోగివి. యతులకు యతివి. లోకాలకు గురువువి. త్రిగుణాత్మకుడివి. త్రిగుణాతీతుడివి గూడా! నువ్వు చతుర్వర్గాలకూ, చతురాశ్రమాలకూ అతీతమైన, నిస్త్రైగుణ్యమైన స్థితిని అందుకున్నావని నృసింహదేవుడు దర్శింపచేస్తున్నాడు నాకిప్పుడు. పుత్ర వ్యామోహంలో పడి ధర్మం చేస్తున్నాననుకొని నేను చేసిన తెలివి తక్కువను క్షమించు స్వామీ, క్షమించు"

"తాతగారూ, కూర్చోండి. మీరు నా పేరు మార్చారు. గనుక మీ మీద గౌరవంతో నేను గూడా మీ పేరు మారుస్తున్నాను. ఆశ్రమంలో అందరూ మిమ్మల్ని తాత అంటున్నారు. నేనూ అలాగే అంటాను" అన్నారు స్వామీజీ చిరునవ్వు నవ్వుతూ.

"స్వామీ, తాతో, ముత్తాతో చచ్చే వెధవకు ఏ పేరైతే నేమి? అయినా నువ్వన్నట్లు తాతనై శరీరం శిధిలమై వున్న యీ అపర వయస్సులో కైవల్య సిద్ధికై నేను చేయదగిన అనుష్ఠానం ఏమిటో నాకు ఆజ్ఞాపించు. తక్కిన మాటలు నా కెందుకు?" అన్నాడు శాస్త్రిగారు.

"ఏదైనా చేస్తే దాని ఫలితంగా వచ్చేది కైవల్యం అవుతుందా?"

* ఇది యతీశ్వరులకు వందనం చేసేటప్పుడు చెప్పే వేద మంత్రం.

"ఈ తర్కాలు నేను చాలా విన్నాను స్వామీ. నా కేదయినా మార్గం చెప్పు. ఇప్పుడే మొదలు పెడతాను. యీ జన్మకు కాకపోతే పై జన్మకైనా కొంత అందుకుంటానేమో !"

"తాతగారూ, మీకు పై జన్మ వుంటే కదా !"

"ఇవన్నీ ఉదార్ప్ప మాటలు"

( తన వంక చూపించుకొంటూ )

"ఈ ఉపాధి యందు, పుత్ర వ్యామోహాన్ని మీ రిప్పు డెలాగూ తుడిచివేసుకున్నారు. ఇక్కడ ఒక విశిష్టమైన, ఉత్కృష్టమైన శక్తి అవతరించి వున్నదని గ్రహించారు. మీరు గ్రహించిన గ్రహింపును దృఢపరచి మీ ఉపాసనా మార్గాన్ని సుగమం చెయ్యటం కోసమే పెద్ద వారయినా మీతో కటువుగా మాట్లాడవలసి వచ్చింది. ఇది యీ ఉపాధిని అధిష్ఠించి వున్న శక్తి మీ యందు చూపుతున్న ప్రేమే తప్ప మరొకటి కాదు. ఇందరి క్షేమాన్ని చూస్తున్న శక్తి మీ చెయ్యి వొదులుతుందా ? మీ ఉపాధి పవిత్రమైనది. ఈ అవతారానికి ద్వారమైంది. ఆ పుణ్యం మీకు చాలు. చేసే పుణ్యాల ఫలమూ, చేసే పాపాల ఫలమూ గూడా యీ అవతారానికే అర్పించి ప్రారబ్ధాధీనంగా జీవించండి......ఇదే మీకు ఉపదేశం"



# 25 వ అధ్యాయం — ముందడుగు

*తవావతారే తరణప్రదస్య*
*ధర్మప్రచారైకపరేఽపరస్య ।*
*పురోగతిస్త్వాఽనుగతా గురూత్త*
*పురోహితస్త్వం కిల సర్వజంతోః ॥*

( శ్రీ గురుశ్రేష్ఠా ! మీరు భక్తులను తరింపజేస్తూ వుంటారు. సర్వోన్నతమైన స్థానంలో వున్న మీ ఈ అవతారానికి ధర్మప్రచారమే పని. అందుచేత, పురోగతి అన్నివిధాలా మీ వెంట పడింది. ఔను. జీవులందరికీ మీరు పురోహితులుగదా ! పురోహితుడు-ముందుండి హితాన్ని కలిగించేవాడు, అగ్నిదేవుడు. )

## విచిత్ర సమాధులు

రామకోటి వ్రాయమని భక్తులను స్వామీజీ ప్రోత్సహించటం కెసరేలో వున్న చివరి రోజుల నుంచే ప్రారంభం అయింది. ఈ సంవత్సరం కాలంలో పదికోట్లకు పైగా రామనామం ఆశ్రమంలో పోగుబడ్డది. మనుష్యులు కూర్చునేందుకే చోటులేని ఆశ్రమంలో యీ పుస్తకాల బస్తాలు దాచటం పెద్ద కష్టమైపోయింది. చొప్పరానికి దక్షిణంవైపున ఉన్న మామిడి చెట్టే స్వామీజీకి ముద్దుల చెట్టు. ఆ చెట్టు కిందే పెద్ద గొయ్యి తవ్వించి, యీ రామనామం పుస్తకాలను అందులో వేయించి, వాటిపైన ఒక గట్టు కట్టించారు స్వామీజీ. ఆ గట్టు పేరే సరస్వతీ పీఠం. ఆ గట్టుకి ఆ పేరు ఎందుకు పెట్టారో స్పష్టంగా తెలియదు కానీ, స్వామీజీ దానిమీదికి వెళ్ళి కూర్చుంటే మాత్రం అది పగలైనాసరే, రాత్రయినాసరే గంటల తరబడి ఆధ్యాత్మిక బోధ చేస్తున్నారు. అలా సరస్వతీ ప్రవాహం స్వామీజీ ద్వారా వస్తున్నందువల్ల, ఆ పేరు ఒక రకంగా సార్థకమయింది. ఈ గట్టు కట్టిన దగ్గరనుంచీ ఎవరున్నా, లేకపోయినా, స్వామీజీ బయటకు వచ్చారంటే దీనిమీద కూర్చొని వుండటం ఎక్కువైంది. స్వామీజీ యీ గట్టు మీద కూర్చుని వుండగా ఎవరైనా కోరికలు కోరితే, అవి వెంటనే నెరవేరటం గూడా భక్తుల అనుభవంలోకి బాగా వస్తోంది. స్వామీజీ ఈ రామకోటి వేదికమీద కూర్చుని వున్న తరుణంలోనే ఒకరోజున ఒకాయన ఒక జెర్సీ ఆవును తీసుకొని వచ్చి, తనను కామకోటి స్వాముల వారు పంపారనీ యీ గోవును సమర్పించటానికి వచ్చాననీ చెప్పాడు. ఆయన పేరు నారాయణ

అయ్యర్. ఆ విధంగా ఆశ్రమంలో గోశాల ప్రారంభమైనది. గోశాలతో పాటే, స్వామీజీకి నిత్య గోపూజ ప్రారంభమైనది.

అంతకు ముందుదాకా పాములు, కుందేళ్ళు, కోతులు, కుక్కపిల్లలు, పిట్టలు వంటి చిన్న ఆకారపు ప్రాణులతో ఆడుకుంటున్న స్వామీజీ యిక ఆవుదూడలతో గూడా ఆడుకోసాగారు. అయితే, శంకరలింగ భగవానుల వారి భక్తురాలయిన శారదమ్మగారి కొడుకు రాధాకృష్ణ ఆశ్రమానికి వచ్చాడంటే మాత్రం యీ ఆవుదూడతో ఆట అల్లరిగా మారి దాన్ని ఏడిపించటంలోకి దింపిగాని ఆగదు.

ఆ రోజుల్లో శారదమ్మగారి భర్త శంకరన్‌గారు "హెగ్గడ దేవరకోట" అనే వూళ్ళో పని చేసేవాడు. కాని, పిల్లల చదువుల కోసం కాపరం మైసూరులో ఉంచేశాడాయన. వాళ్ళ పెద్దబ్బాయి నరసింహ కాలేజీలో చదువుతున్నాడు. ఈ రాధాకృష్ణ వాళ్ళ నాలుగవ కొడుకు. పిల్లల చదువులు చూసుకుంటూ 'జయనగర' అనే పేటలో వుంటున్న శారదమ్మగారు తరచు ఆశ్రమానికి వస్తూ యదాశక్తి సేవ చేసుకుంటూ వుండేది. అప్పటికి పదేళ్ళ వయస్సులో వున్న రాధాకృష్ణ మొదట్లో తల్లి వెంబడే ఆశ్రమానికి వచ్చినా, క్రమంగా తల్లి వచ్చినా రాకపోయినా రోజూ ఆశ్రమానికి వస్తున్నాడు.

బొద్దుగా ముద్దొస్తూ కోడె దూడల్లే చెంగు చెంగున గంతులేస్తున్న యీ కుర్రవాడంటే, వాడి ఆట అల్లరిలోకి మారకుండా వున్నంత వరకు, ఆశ్రమంలో అందరికీ ముద్దే. కాని చివరికి స్వామీజీ మీద గూడా ఎక్కి తొక్కి అల్లరిచేసి, ఎవరో వొకరిచేత చివాట్లు తినకపోతే వాడికి ఆశ్రమానికి వచ్చినట్టే వుండదు. వాడు వచ్చి యింత గోల చెయ్యని రోజున పిచ్చెత్తినట్టే వుంటుంది స్వామీజీకి.

ఒక రోజున వాళ్ళమ్మ శారదమ్మగారు వచ్చి స్వామీజీని వాళ్ళ యింటికి పాద పూజకు రమ్మని పిలిచింది. "సాయంత్రం ఫలహారానికి వస్తాలే" అన్నారు స్వామీజీ. ఆయన అలా అన్నందుకు ఆవిడ ఒక విధంగా చాలా సంతోషించింది. ఎందుకంటే, ఆవిడ భర్తకు యీ స్వామీజీలంటే బొత్తిగా గిట్టదు. స్వామీజీకి పాదపూజ అంటే, ఆయన కూర్చోడు. అసలు రహస్యం స్వామీజీకి తెలిసిపోతుంది. సాయంత్రం ఫలహారమంటే, ఏదో రకంగా సర్దుకోవచ్చు, అదీ ఆవిడ ఆలోచన.

కాని ఇంటి దగ్గర భర్త దీనికి గూడా అభ్యంతరమే చెప్పాడు. ఇంట్లో లఘు యుద్ధం వొకటి చేసి గెలిచింది శారదమ్మగారు :- "సరే అట్లా అయితే, నే నింట్లో లేకుండా బయటకు పోతాను. నీ స్వాములను నువ్వే చూచుకో" అన్నాడాయన. ఇలా అయితే, ఆయన వూళ్ళో లేనప్పుడే చేసుకోవచ్చు. కాని, ఆయన లేకుండా స్వామీజీని యింటికి పిలవటం ఆవిడకు యిష్టం లేదు. కాని, యేంచేస్తుంది ? ఇంతకన్న గతిలేదు.

తేదీ నిర్ణయించారు. ఆ రోజు సాయంత్రం స్వామీజీని తీసుకెళ్ళటానికి రాధాకృష్ణ వచ్చాడు. వాళ్ళిల్లు కొంచెం దూరమే. ఎలా పోదామా అని కాసేపు ఆలోచించి, చివరకు నడిచే పోదామని నిర్ణయించారు స్వామీజీ. నలుగురయిదుగురు పరివారం వెంటరాగా స్వామీజీ కాలినడక మీద బయలుదేరారు. సరదాగా కథలు చెపుతూ, నవ్విస్తూ నడుస్తుండగా వారిలో ఒకడు ఆకలిగా వుందనుకున్నాడు. అంతే, స్వామీజీ తన చేతిలో వున్న దండాన్ని తారు రోడ్డు మీద రోకలిపోటు వేసినట్టు వేశారు. ఆ పోటులోంచి ఓ అరటిపళ్ళ గుత్తి ఎగిరి పడ్డది. నాలుగడుగులు వేసి మళ్ళీ మరో పోటువేశారు. ద్రాక్ష గుత్తులు రాలాయి.

పరివారం అప్పటికే ఆరితేరి వుంది. అవి యేం చెయ్యాలని వేరే చెప్పక్కర లేదు. ఎవరికివారు ముందుకు దూకి లాగేసుకున్నారు. అలా దారంతా ఏదో సరదా చేస్తూనే వున్నాడు.

ఇంటికి చేరారు. అప్పటికి శారదమ్మగారు ఇంకా ఉప్మా చేస్తోంది. స్వామీజీ వచ్చారని కంగారుపడుతూ, ఒకపక్క కలియబెడుతూ మరోపక్క స్వామీజీని ఆహ్వానించింది. స్వామీజీ లోపలి కెళ్ళి కూర్చుంటూ " శంకరలింగ భగవాన్ వచ్చేశారు " అన్నారు. ఆ మాటకు ఆవిడ హృదయం పులకించిపోయింది. ఒక ప్లేటులో ఉప్మా తెచ్చి స్వామీజీకి యిచ్చింది. ఆవిడ స్వయంగా భిక్ష వంటకు సేవ చేస్తూవుండేది గనుక ఆవిడకు ఆ చనువు వుంది. స్వామీజీ ఆ ఉప్మా తినకుండా చేత్తో ఇటూఅటూ కదిలించసాగారు. అలా కొద్దిగా కదిలించి ఏమిటి దీంట్లో ఇంతింత రాళ్ళు వేశావు అంటూ ఉప్మాలోంచి పిడికిలంత గణపతి విగ్రహం తీశారు. స్వామీజీ విగ్రహాలు సృష్టించటం చూసినా తనకోసం సృష్టించినప్పుడు ఉండే ఆనందం వేరు అని తెలిసింది శారదమ్మగారికి.

భర్త ఏడని అడుగుతారేమో స్వామీజీ అని ఆవిడ భయపడ్డది. కాని, అదేమీ అడగకుండానే తిరిగి వచ్చేశారు స్వామీజీ.

" ఈ కుర్ర వెధవ వచ్చేసరికి స్వామీజీ ఇంత దూరం నడిచి వాళ్ళింటికి వెళ్ళి రావటమేమిటబ్బా ? స్వామీజీకి ఎలాగయినా యీ రాధాకృష్ణ అంటే అతిమోజు " అనుకున్నారు ఆశ్రమ భక్తులు కొందరు.

స్వామీజీకి వాడి మీద మోజే కాదు చనువు గూడా ఎక్కువే. ఎవరిమీద కోపం వచ్చినా యీ రాధాకృష్ణని కొట్టటానికి స్వామీజీకి యేమీ జంకులేదు. తల ఎగరేసి, పొగరుగా మాట్లాడి, ''నే నీ ఆశ్రమానికే రాను పో " అనేసి కాళ్ళు నేలకు బాదుకుంటూ వెళ్ళిపోవటానికి రాధాకృష్ణకూ జంకు లేదు. అయితే, తెల్లారేసరికి యిద్దరికీ పరగడుపే. మర్నాడు వాడు యథాప్రకారంగా రానే వస్తాడు, " ఏరా, బావున్నావురా " అని స్వామీజీ స్వాగతం చెప్పనే చెపుతారు.

ఆశ్రమంలో పనులు చక్కపెట్టే పెద్దలందరూ, " అసలీ వెధవకు యీ అల్లరి నేర్పేది స్వామీజీయే " అని చాటు మాటుగా విసుక్కోవటం మామూలయి పోయింది. వాళ్ళ విసుగులో

నూటికి నూరుపాళ్ళు కాకపోయినా, నూటికి ఎనభై పాళ్ళు సత్యం లేకపోలేదు. ఈ రాధాకృష్ణ లాంటి కుర్రమూకను వెంటవేసుకొని ఎక్కడ లేని ఆటలూ ఆడుతారు స్వామీజీ. వాళ్ళతో కుస్తీలు పడతారు. కోతుల్నీ, కుక్కల్నీ, కుందేళ్ళనీ పోగేసి వీళ్ళచేత ఆట లాడిస్తారు. భక్తులు తెచ్చి యిచ్చే పళ్ళు ఫలాలు ఎలాగూ స్వల్పమే గనుక, వీళ్ళకోసం రోజూ గుత్తులు గుత్తులుగా ద్రాక్షలు, కర్జూరాలు, కలకండలు, బాదం పప్పులు, అరటిపళ్ళు సృష్టించి తినమంటారు. తినటంలో రాధాకృష్ణతో పోటీ పడగలవాళ్ళు ఆ గుంపులో లేరు.

ఇలా ఆడి ఆడి చివరికి తనకు వేరే పని వుంటే, వాళ్ళను వదిలించు కోవాలంటే స్వామీజీకి ఒక చిన్న ఉపాయం వుంది. వీళ్ళని సరదాగా యిటూ అటూ తిప్పుతూ, ఎక్కడ పడితే అక్కడే వున్న పాము పుట్టలలో ఏదో ఒక దాంట్లో చటుక్కున చెయ్యి పెట్టి కెలికి, కన్నుమూసి తెరిచేలోగా ఏదో ఒక పెద్ద పామును బయటకు లాగుతారు. అంతే! కుర్ర వెధవలంతా దౌడో దౌడు! చిరుబొజ్జ వున్నా, పరుగులో గూడా రాధాకృష్ణే మొదటివాడు.

పెద్దవాళ్ళు వచ్చారంటేనే గంభీర ముఖంగా వుండే స్వామీజీ, యే కారణం లేకుండానే అవతలి వాడిలో వొణుకు పుట్టించే స్వామీజీ, ఈ పిల్లలకు ఇంత లోకువయి పోవటం దేనికో? వాళ్ళతో ఇంతకాలం వ్యర్థం చెయ్యటం యెందుకో, పెద్దలకు ఎంత మాత్రం అర్థం కాలేదు. దానికి తోడు స్వామీజీయే స్వయంగా అల్లరి ప్రారంభించేవారు.

సంతానం లేని జయమ్మ సూర్యనారాయణరావు దంపతులు యశోదానందులై స్వామీజీలో తమ పుత్రుణ్ణి చూసుకోసాగారు. అందులో జయమ్మగారు పూర్తిగా యశోదతో తాదాత్మ్యసిద్ధిని అందుకోసాగింది. ఆ తల్లి కంటికి అప్పుడప్పుడే గడ్డాలు పెరుగుతున్న యీ కాషాయ బట్టల స్వామీజీ, అచ్చమైన "ఉన్ని కృష్ణుడు" గా కనిపించసాగాడు. ఆవిడ ఉపాసన అలా పెరుగుతున్న కొద్దీ స్వామీజీ స్వయంగా అల్లరి సాగించారు. అయితే, యీ రహస్యం ఆ చల్లని తల్లికే తెలియదు. ఇక ఇతరులకెలా తెలుస్తుంది?

జయమ్మగారు తలంటి పోద్దామని నూనె అంటుతుంటే, మధ్యలో పారిపోయి, ఏ చెట్లో ఎక్కి దాక్కొని కూర్చునే వారొకసారి. జయమ్మగారు గోపాలకృష్ణుడి మీద పాటలు పాడేది. ఒకసారి మెడలో పాము చుట్టుకొని వచ్చి, నూనె అంటుతావా లేదా అని కూర్చునే వారు. ఒకసారి ఆవిడ స్వామీజీ భిక్ష కోసమని ప్రత్యేకంగా తోడు వేసి వుంచిన పెరుగు చాటుగా తినేసేవారు. ఒకోసారి ఆవిడ పొయ్యిమీద అన్నం గిన్నె పడేసి ఏదో పనిమీద ఎటో పోతే, చాటుగా వెళ్ళి ఆ గిన్నె దింపేసి వచ్చి ధ్యానంలో కూర్చున్నట్టు నటించి, లేచి "ఆకలేస్తోంది, తొందరగా అన్నం పెట్టు" అనేవారు. ఒకోరోజు నైవేద్యం కాకుండానే, వంట రుచి చూపించమని వెంటబడేవారు. పిల్లలతో అల్లరి చేయించటమే గాక, ఇలా తనుగూడా అల్లరికి దిగిన స్వామీజీని చూసి, యేమనాలో తెలీక, యేమనుకోవాలో తోచక, "ఎట్లా

అయినా, యీ స్వామీజీకి ఇంకా కుర్రతనం తీరలా " అనుకొని సంతోషించేవారు పెద్దవాళ్ళ మనుకొనేవాళ్ళు.

ఆ పెద్దవాళ్ళ దిగులుకు తగ్గట్టుగానే, అలా ఒక రోజున చెట్టెక్కి కూర్చున్న స్వామీజీ అక్కడే సమాధి స్థితిలోకి వెళ్ళిపోయి, కొమ్మపట్టు వదిలిపోయి, కొబ్బరి పండల్లే క్రింద రాలి పడ్డారు! క్రిందపడ్డా స్మృతి రాలేదు. చెట్టు గుబురుగా వుండి, కొమ్మలు దట్టంగా వున్నందు వల్ల కొమ్మల మీద పల్టీలు కొడుతూ నేలకు రాలారు స్వామీజీ. స్వామీజీ కోసం ఆశ్రమంలో పడి వెతుకుతున్న జయమ్మగారు చెట్టుమీది నుంచీ వస్తున్న చప్పుడికి అదిరిపడి అటు చూసింది. కిందకు దొర్లుతున్న స్వామీజీని చూసేసరికి ఆమె పై ప్రాణాలు పైనే పోయి, గుండెలు పగిలిపోయేలా ఆ తల్లి ఆర్తితో పెట్టిన కేకలకు ఆశ్రమంలో వున్న వారెవరో కొద్దిమంది పరిగెత్తుకొచ్చి వాళ్ళంతా డొక్కుపోయి, నెత్తురు కారుతుండగా స్పృహ తప్పి నేలన బడివున్న స్వామీజీని చూశారు.

ముందు వాళ్ళకు కాళ్ళు, చేతులు ఆడలేదు. కాస్త తేరుకొని స్వామీజీని చావ్పరంలోకి మోసుకుపోయి, ఏం చేద్దామా అని ఆలోచించసాగారు. ఆశ్రమంలో ఫోను లేదు. ఏ వైద్యుడి దగ్గర కన్నా పోయి పిల్చుకు రావాలంటే కనీసం 34 మైళ్ళు దూరం పోవాలి, రావాలి. ఆశ్రమానికి కనీసం సైకిలు గూడా లేదు. ఏం చెయ్యాలి?

ఆశ్రమవాసులిలా మధనపడుతుండగానే స్వామీజీ లేచి కూర్చున్నారు. ఆయన లేచి కూర్చునేసరికి చుట్టూతా వున్న నలుగురూ తాము ఏడవటం మొదలెట్టారు. ఒళ్ళంతా డొక్కుపోయి వున్న స్వామీజీయే వాళ్ళను వోదార్చవలసి వచ్చింది. కొంత ఉద్వేగం తగ్గినాక, వాళ్ళన్నారు, "అదేమిటి స్వామీజీ, అలాంటి పనిచేశారు? ఏ ఎముకో విరిగితే ఏమయ్యేది? ఎంత ప్రమాదం " అని.

"నిజమే, మనకు ఎముక విరిగినా బతకవచ్చు. అక్కడ వాడు లారీ క్రిందపడితే, ఎముకలలో సున్నం గూడా మిగిలేది కాదు" అన్నారు స్వామీజీ.

"వాడెవరండీ?"

"ఒక భక్తుడు."

"మన వాళ్ళల్లో ఎవరైనానా?"

"వాడు మీ కింకా తెలీదు. వాడు భక్తుడై ఆశ్రమానికి వచ్చేసరికి మరో పదిహేనేళ్ళు పట్టువచ్చు."

"ఇంకా భక్తుడే కానివాడికోసం ఇంత సాహసం ఏమిటి స్వామీజీ? ఎప్పుడో పదిహేనేళ్ళకు మీ దగ్గరకు రాబోయే వాడికోసం ఇంత తాపత్రయ మెందుకు మీకు?

"నాకా తాపత్రయం లేకపోతే మీ తాపత్రయాలు పోవు. పదిహేను సంవత్సరాలు మీకు పెద్ద కాలమే కావచ్చు. ఎన్నో జన్మలుగా మిమ్మల్నందర్నీ నడిపించుకొంటూ

వస్తున్నాను. మీరు భక్తులు అవటమూ, కాకపోవటమూ మీ చేతుల్లో లేదు. ఇవాళ్ళే భక్తులవటమూ, రేపే భక్తులవటమూ గూడా మీ చేతుల్లో లేదు. ఆ మాట మీకు తెలిసే స్థితికి మీరింకా ఎదగాలి ".

ఈ చర్చ, ఈ స్వామీజీ ధోరణి యిలాగే సాగితే అవతార రహస్యాలు ఎన్ని బయటకు వచ్చేవో గానీ, అసలే నెత్తురు కారుతుంటే మరోపక్కన యీ వేదాంతా లేమిటని వొళ్ళు మండిన జయమ్మగారు నలుగుర్నీ కేకలేసి అవతలకు పంపించి స్వామీజీ దెబ్బలకు వెన్న రాసి లోపల పడుకోబెట్టింది.

చెట్టుమీది నుంచీ పడటం అదే మొదలయినా, సమాధిలోకి వెళ్ళినప్పుడు స్వామీజీ వొంటికి దెబ్బలు తగలటం పూర్తిగా కొత్తగాదు. భూగృహంలో రోజుల తరబడి సమాధిలో పడి వుండటం, అలా వుండగా ఒకోసారి సమాధీ, మెలకువా కాని మధ్య స్థితిలో చుట్టూతా వున్న అడవులలోనూ, ఆశ్రమానికి తూర్పుగా వున్న చాముండీపర్వతపు పాదాలలోని ముళ్ళపొదల్లోనూ అడ్డదిడ్డంగా తిరుగుతూ వుండేవారు స్వామీజీ. ఇలా తిరిగేటప్పుడు ముళ్ళపొదల ముళ్ళు వళ్ళంతా గీసుకొని నెత్తురు కారిపోతున్నా తెలిసేది కాదు. అలా తిరిగి తిరిగి ఎక్కడో పూర్తిగా స్పృహతప్పి పడిపోతూ వుండేవారు.

ఇక ఆశ్రమీయులు జట్లు జట్లుగా వెతికి స్వామీజీని పట్టుకుంటూ వుండేవారు. ఒకోసారి కొంతసేపయినాక స్వామీజీయే లేచి వచ్చేసేవారు. అందుచేత స్వామీజీ కదులుతున్నా రనుకుంటే, తక్కిన పనులన్నీ ఆపుకొని వెయ్యి కళ్ళతో కనిపెట్టుకుంటూ వుండేది జయమ్మగారు. అయినా, మధ్య మధ్యలో ఇలాంటి సంఘటనలు జరుగుతునే వుండేవి. " ఇదేమిటి, స్వామీజీ యిలా చేస్తారు? ఇదేమి సమాధి? " అని భక్తులకు సందేహంగా వుండేది. కాని అడిగేందుకు ధైర్యంలేక వూర్కునేవారు.

ఒక పూర్ణిమనాడు సాయంత్రం పూర్ణిమ హోమం జరుగుతోంది. భక్తులందరూ హోమంలో మునిగిపోయి వున్నారు. పూర్ణాహుతి దగ్గరకు వచ్చేసరికి, స్వామీజీ పూర్ణాహుతి వెయ్యాలి గనుక, స్వామీజీ ఏరీ అని చూశారు. స్వామీజీ ఎక్కడా లేరు!

భక్తులకు కంగారు పుట్టింది. రాత్రివేళ, చుట్టూతా పాము పుట్టలు, ఎక్కడపడితే అక్కడ మంత్రగబ్బలు, ఎవరు వెతకగలరు? అయినా, సాహసించి భక్తులు వెతికారు. పండువెన్నెల కాస్తున్న నిండుచందమామ వాళ్ళమీద జాలిపడి సహాయం గూడా చేస్తూనే వున్నాడు. అయినా, ఏమీ ఫలితం దక్కలేదు. కొంతసేపయినాక, ఆశ్రమంలో స్వామీజీ చుట్టు తిరుగుతూ వుండే కుక్క పప్పీ అక్కడికి వచ్చి విచిత్రంగా మొరగసాగింది. ఈ పప్పీ స్వామీజీకి ముద్దుల కుక్కపిల్ల. దీని నిత్యప్రవర్తన గూడా విచిత్రంగానే వుండేది. ఇది స్వామీజీ స్వయంగా పెడితేనే యేదన్నా తినేది. లేకపోతే నీరసంతో మూలుగుతూ పడి వుండేది తప్ప, ఎంత బతిమాలినా ఏమీ తినేది కాదు. అదిగూడా స్వామీజీ కనిపించక గోల చేస్తోంది గాబోలని

అనుకున్నారు అంతా. అసలే విసుగ్గావున్న భక్తులకు యీ కుక్క మొరుగుళ్ళు మరీ చిరాకుగా వుండి, ఎన్నిసార్లు తోలేసినా, అది అవతలకు పోవటంలేదు. మళ్ళీ మళ్ళీ వెంటబడి, అలాగే మొరుగుతోంది. పూర్ణిమనాడు పూర్ణచంద్రుణ్ణి చూసి మొరుగుతూ వుండటం కుక్కలకు ఒక లక్షణమే గనుక, ఆ మొరుగును ఎవరూ పట్టించుకోలేదు.

కాని, ఆంజనేయోపాసనలో ఆరితేరి, స్వామీజీవల్ల ఆలింగన దీక్ష పొంది, స్వామీజీ చిత్తవృత్తి తరంగాలను అందుకోవటంలో అప్పుడప్పుడే ఆరితేరుతున్న భాగవత్‌గారికి, యీ కుక్క మొరుగులో యేదో సందేశం వుందని తోచసాగింది. వెంటనే, దాన్ని తోలేస్తున్న భక్తులను నివారించి భాగవత్‌గారు దాని దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు. ఆయనలా దగ్గరకు రాగానే, ఆ కుక్క అరుపు ఆపేసి వెనక్కి వెనక్కి చూస్తూ ముందుకి పరిగెత్తసాగింది. భాగవత్ గారు వెనక నడవసాగారు. ఆయనను మరికొందరు భక్తులు అనుసరించారు. ఆ కుక్క మైన్ రోడ్డుకీ, రోడ్డు అవతల ముళ్ళ పొదలకీ అడ్డంపడి చాముండీ కొండమీదికి నడవసాగింది. ఆ దారి చాలా ప్రమాదంగా వుంది. అయినా అందరూ అలాగే కష్టపడి ముళ్ళదిబ్బల మీదినుంచీ దూకుతూ, రాతిబండలమీదికి పాకుతూ, కుక్కవెంట వెళుతున్నారు. కుక్కకూడా అనుక్షణం వీళ్ళు వస్తున్నారా లేదా అని చూసుకొంటూ ముందుకు పోతోంది. ఆ చాముండీ కొండ సగం దూరం ఎక్కినాక, కుక్క ఒకచోట ఆగిపోయి తోక ఆడిస్తోంది. అందరూ అక్కడికి చేరారు.

అక్కడ స్పృహతప్పి పడిపోయి వున్నారు స్వామీజీ ! ముళ్ళు గీసుకొని వొళ్ళంతా నెత్తురు కారుతోంది. ఇక అక్కడ వుండనీయటం ఇష్టంలేక, స్వామీజీని చేతులమీదికి ఎత్తుకొని మెల్లిగా కొండ దిగసాగారు భక్తులు. అది ప్రమాదకరంగా వుంది. ఏ ఒకడి కాలుజారినా, చెయ్యి పట్టు తప్పినా, స్వామీజీకి లేనిపోని ప్రమాదం కలుగవచ్చు. అందువల్ల అతి జాగర్తతో నానా ప్రయాసపడి స్వామీజీని ఆశ్రమానికి చేర్చారు భక్తులు.

చాలా సేపటికి లేచారు స్వామీజీ. హోమం పూర్తయింది.

అప్పుడు భాగవత్‌గారు అడిగేశారు. " ఇదేం పనండీ ? ఈ వొళ్ళంతా గీసుకోవటా లేమిటి ? ఈ సమాధు లేమిటి ? " అని. ఆయనకు స్వామీజీ మీద ఆ చనువు మొదటినుంచీ వుంది.

" ఒక భక్తుణ్ణి విచిత్ర పరిస్థితుల్లో రక్షించాల్సి వచ్చింది. ఆ బాధ ఎవరు అనుభవిస్తారు ? అందుకే ఇలాంటివి జరుగుతూ వుంటాయి " అన్నారు స్వామీజీ. ఇలాంటి బుకాయింపు కోతల్ని నమ్మే ఘటం కాదు భాగవత్‌గారు. ఆ మాట ఆయన నోటితో అనకపోయినా, ఆయన నవ్విన నవ్వు బిగ్గరగానే చెప్పేసింది. స్వామీజీ మాట్లాడలేదు. ఆ మర్నాడు సాయంత్రం భాగవత్‌గారు మళ్ళీ ఆశ్రమానికి వచ్చాడు. ఆయన వచ్చేసరికి, వొంటి మీద అక్కడక్కడ చిన్న చిన్న 'పాచ్‌లు' (కట్టులు) వేసుకొని వున్న భక్తు డొకడు స్వామీజీ దర్శనం కోసం ఎదురు చూస్తున్నాడు. ఆ కట్లుచూసి, ఏమిటి విషయమని విచారించాడు భాగవత్‌గారు.

నిన్న రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో, ఇతని మోటారు సైకిలు ఒక పెద్ద లారీతో ఢీకొట్టేలు గుద్దుకున్నట్టు గుద్దుకుంది. ఇతన్ని యెవరో నడ్డిమీద గట్టిగా తన్నగా ఎగిరి రోడ్డు పక్కన పడిపోయాడు. మోటారు సైకిలు పప్పు పప్పై పోయింది. రోడ్డు మీద దొర్లినందు వల్ల మోకాళ్ళు, మోచేతులు వగైరాలు డొక్కుపోయి బ్రతుకు జీవుడా అని లేచి నిలబడ్డాడితను. ఆ సందర్భంలో తనను అంత గట్టిగా నడ్డిమీద తన్నిందెవరు? రోడ్డు అవతలకు విసిరిందెవరు? అలా తన ప్రాణాలను కాపాడిందెవరు? అని ఆలోచించుకొని, యేమీ అర్థంకాక స్వామీజీకి కనిపించి పోదామని వచ్చాడితను.

ఈ కథ విని ముందు భాగవత్‌గారు కన్నీరు కార్చసాగాడు. అప్పుడు భాగవత్‌గారి వల్ల నిన్న రాత్రి ఆశ్రమంలో జరిగిన కథ విని, తనను రక్షించింది స్వామీజీయె అనీ, అలా రక్షించేందుకు ఆయన అంత బాధ తను తీసుకొన్నారని తెలిసి, ఆ భక్తుడు పూర్తిగా ద్రవించి పోయాడు. * ఈ సంఘటన భాగవత్‌గారిలో, స్వామీజియందు భక్తిని మరింత పెంచింది. దానివల్ల ఆయన ఉపాసనలో మరింత పట్టు చిక్కసాగింది. ఇలా కొత్తగా భక్తుడైన భాగవత్ గారికి పట్టు చిక్కుతున్న రోజుల్లోనే, ఎప్పటినుంచో స్వామీజీని సేవించుకుంటున్న ద్వారకాకు పట్టు జారిపోసాగింది.

నూతన ఆశ్రమానికి వచ్చిన దగ్గరనుంచీ అతనికి తన ప్రాముఖ్యం తగ్గిందని దుగ్ధ పెరగసాగింది. దాంతో, ఇక్కడికి రావటం కొంచెం కొంచెంగా తగ్గించేశాడు. దానివల్ల అతనికి నాటకాల పిచ్చి ఎక్కువైపోయింది. దానికి తగ్గట్టుగానే, ఆ నాటకాలలో, వీర, రౌద్ర, భీభత్స రసాలు ప్రధానంగా గల పాత్రలలో ఇతనికి మంచి కీర్తి రాసాగింది. దాంతో అతను ఇటు ఇంటికీ, అటు ఆశ్రమానికీ పట్టకుండా తిరగసాగాడు. ఇది అతని తల్లి తండ్రులకు మళ్ళీ పరితాప హేతువయింది. ఇంతలో దైవానుగ్రహం వల్ల అతను I T I పాసవటం, బెంగుళూరులో భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్ కంపెనీలో ఉద్యోగం రావటం జరిగాయి. తల్లితండ్రులు చాలా సంతోషించారు. స్వామీజీ మాత్రం సంతోషించలేదు.

"ఏరా, నన్ను విడిచిపోతావా? సరేలే తప్పదు. మీ నాన్న కోసం పోవాలి. పోయిరా" అన్నారు స్వామీజీ.

స్వామీజీ దగ్గర వుండగా ఏర్పడిన భక్తివల్ల రోజూ పొద్దున్నే గణపతి పూజ చేసు కోవటం ఇతనికి కాఫీని మించిన అలవాటయి పోయింది. కాని, మైసూరుకన్న పెద్ద బస్తీ అయిన బెంగుళూర్లో, ఇక్కడి కన్నా పెద్ద నాటకాల కంపెనీలు అతనికి తగిలాయి. వాటిలో నాటకాలాడటం వల్ల ఇతనికి సినిమాలలోకి వెళ్ళాలనే వెర్రి తలకెక్కింది. ఈలోగా ఒక పెద్ద నాటకాల కంపెనీ మహానుభావు డొకడు, "ఈ వెధవ వుద్యోగంలో అభివృద్ధి యేముంది? నాతో చేతులు కలుపు. దేశాన్ని వుర్రూతలూగించేద్దాం. పెద్ద పెద్ద నాయికల పక్కన నిన్ను

* ఈ సన్నివేశాన్ని వివరించిన భాగవత్‌గారికి ఆ భక్తుడి పేరు గుర్తురాలేదు. భాగవత్‌గారికి ఇప్పుడు 70 ఏళ్ళు.

నాయకుణ్ణిగా తయారుచేస్తాను ” అని నూరిపోయసాగాడు. దేశంమాట ఎలా వున్నా ముందు ద్వారకా పుర్రెాత లూగిపోయాడు. ఈ ఊపుల్లో పండులాంటి ఉద్యోగం రాలిపోయింది. ఆ తరువాత, ఆ నాటకాల కంపెనీ వారితో విరోధం రావటానికీ, ఇతను ఆకలి మంటలకు ఓర్వలేక, నెత్తిన చెంగువేసుకొని కొంపకు చేరటానికీ యెక్కువ నెలల కాలం తీసుకోలేదు.

దైవయోగం చిత్రమైనది. ఇలా ఇంటికి చేరిన ద్వారకా, “ స్వామీజీకి అంతకాలం సేవ చేసినా, నా కిలాంటి గతి పట్టిస్తాడా? ఆయనసలు స్వామీజీయె కాదు ” అని తిట్ట సాగాడు. ఆశ్రమానికి రానుగూడా రాలేదు. ఇది తెలిసి బాధపడి స్వామీజీయే కబురు చేశారు. ఒకసారికాదు, నాలుగు సార్లు. “ఒక్కసారి వచ్చిపోరా, నీ కష్టాలు తీరుతాయి ” అని. ససేమిరా రానన్నాడు ద్వారకా. “ వాడే వస్తాడు లేరా ” అని వూరుకున్నారు స్వామీజీ.

* * *

## మద్రాసు

ఆ రోజుల్లోనే బెంగుళూరు కాంతంగారి కుటుంబంతోపాటు మద్రాసు నుంచి కొత్త భక్తురాలొకావిడ స్వామీజీ దర్శనానికి వచ్చింది. ఆవిడ పేరు కమలమ్మగారు. ఆవిడ భర్త చంద్రరావుగారికి మద్రాసులో పెద్ద కలప వ్యాపారం వుంది. ఆంధ్రదేశం నుంచీ వచ్చి మద్రాసులో స్థిరపడిన చంద్రరావుగారి కుటుంబానికీ, కాంతంగారి కుటుంబానికీ మంచి స్నేహ సంబంధాలు వుండటంవల్ల, కాంతంగారి కుటుంబంతోపాటు కమలమ్మగారు స్వామీజీ దర్శనానికి వచ్చింది.

ఆవిడ స్వామీజీ కార్యక్రమాలు, మహత్తులు కొన్ని చూసి, ముగ్ధురాలై వెళ్ళి, యీ మాటు భర్తతో కలిసివచ్చి స్వామీజీ దర్శనం చేసింది. సహజంగానే ఆధ్యాత్మిక ఆసక్తి గలిగిన యీ దంపతులు స్వామీజీవల్ల ప్రభావితులై, తాము మాత్రమేగాక తమ మిత్రులంతా తరించాలనే సత్సంకల్పంతో స్వామీజీని మద్రాసు రమ్మని బలవంతపెట్టసాగారు.

వారి బలవంతంవల్ల స్వామీజీ మొట్టమొదటిసారిగా 1968 లో తమిళనాడులో పాదం పెట్టారు. మద్రాసులో తన స్వగృహంలో, చాలా చిన్న యెత్తుగా తాను యేర్పాటు చేసుకున్న కార్యక్రమం అంత బ్రహ్మాండమైన కొలతలకు పెరిగిపోతుందని చంద్రరావుగారు వూహించ లేదు. ఇతరులకు అసాధ్యమైన క్రమబద్ధత, ముందు చూపు గలిగి, మంచి వ్యాపార నిర్వహణా దక్షుడుగా మాత్రమే అప్పటిదాకా పేరుబడిన చంద్రరావుగారు, ఈ స్వామీజీ పర్యటనవల్ల, తాను మానవతాదృష్టి, మర్యాద, నేర్పుగల కార్యకర్తగూడా అని నిరూపించుకున్నాడు.

ఈ పర్యటనలో స్వామీజీని వందలకొద్దీ కొత్తవారు దర్శించుకున్నారు. అందరికీ తలకొక అనుభవం జరిగింది. కాని చంద్రరావు గారింట్లో అందరి యెదుటా, అందరికీ జరిగిన ఒక అనుభవం విచిత్రమైనది.

శ్రీ స్వామీజీ శ్రీ చక్రార్చన చేసినాక, తన యింట్లో సమావేశమయిన భక్తులందరినీ ఆత్మబంధువులుగానూ, ఆ జరిగే ఉత్సవాన్ని తన యింటి శుభకార్యంగానూ పరిగణించుకొన్న చంద్రరావుగారు, అందరినీ చందన తాంబులాలతో సత్కరించదలిచాడు. అందుకు అంశంగా, ఆంధ్ర పద్ధతిలో పన్నీరు బుడ్డితో పన్నీరు జల్లుతున్నది కమలమ్మగారు. పన్నీరు బుడ్డికి అడుగున వుండే కాయ భాగంలో ఉన్నట్టుండి యేదో "టక్ టక్" అని కొట్టుకోసాగింది. ఆవిడ ఆశ్చర్యపోయి, మరలు తిప్పి పైనవున్న కాడను విడదీసి లోపలికి చూసి కెవ్వన కేకేసింది. ఆ కాయిలో లోపల పెద్ద గణపతి విగ్రహం కనబడుతోంది. ఆ కాయకు వున్న మూతి కన్న 7, 8 రెట్లు పెద్ద పరిమాణంలో వున్న ఆ గణపతి ఆ కాయలోకి ఎట్లా దూరినట్టు? చంద్రరావుగారి కుటుంబంలో అందరికీ ఎన్నో ఏళ్ళుగా తెలిసిన పన్నీరు బుడ్డి అది. అందులో యీ గణపతి ఎల్లా దూరినట్లు? సభలో వున్న వారంతా, ఆదుర్దాగా ఆ పన్నీరు బుడ్డి లాక్కుని పరిశీలించారు. అందరికీ ఆశ్చర్యమే!

"సర్లే, ఆ గణపతితోనే అందరికీ పన్నీరు చల్లండి, అందరూ పవిత్రులవుతారు. తరువాత ఆ బుడ్డి పగలగొట్టించి, ఆ విగ్రహం మీరు పూజలో పెట్టుకోండి" అన్నారు స్వామీజీ.

ఆ పర్యటన చివరలో, చంద్రరావుగారి కొడుకుకి చాలాకాలంగా సంతానం లేదనీ, ఆశీర్వదించమనీ ప్రార్థించగా, ఆశీర్వదించారు స్వామీజీ.

ఈ 1968 వ సంవత్సరంలోనే శ్రీ స్వామి వెంకటేశ ఆనందజీవారు ఆశ్రమానికి వచ్చి సమ్ముగ్ధులయ్యారు. శ్రీ వెంకటేశ ఆనందజీగారు హృషీకేశ మహాక్షేత్రవాసులైన శ్రీ స్వామి శివానందులవారి శిష్యులు. ఆఫ్రికాలో నివసిస్తూ ధర్మప్రచారం చేస్తున్న ఆనందజీగారికి, శ్రీ శివానందుల శిష్యులలో ప్రధానురాలయిన ఒక సాధ్వీమణి, ఒకానొక సందర్భంలో హైదరాబాదు నగరంలో శ్రీ స్వామీజీ గురించి చాలా విశేషంగా చెప్పింది. ఆ సమయానికి ఆమె స్వామీజీ పేరేమిటో మరిచిపోయింది. అప్పటినుంచీ ఆనందజీగారికి స్వామీజీని దర్శించాలని కోరికగానే వుందిగాని, పేరు తెలీకుండా మైసూరులో వెతుక్కోవటం కష్టమని ఆగిపోయారాయన.

ఇలా వుండగా, ఆనందజీగారు భారతదేశం వచ్చి, ఏదో పనిమీద మైసూరుకు సమీపం లోని మేలుకోట క్షేత్రానికి వెళ్ళారు. అక్కడ ఒక పండితుడు ఆనందజీగారిని అన్నిచోట్లకూ తీసుకువెళ్ళి క్షేత్ర దర్శనం చేయిస్తున్నాడు. అలా చేయిస్తూ, చేయిస్తూ ఉన్నట్టుండి, ఏమీ పూర్వాపర సందర్భంలేకుండా, "ఇక్కడికి దగ్గరలో మైసూరులో వున్న ఒక స్వామీజీ ఒక విగ్రహం సృష్టించి నాకు ఇచ్చారు" అన్నాడు.

ఇది విని పక్కనే వున్న యాత్రాదర్శకుడు వెంకట్రామ్‌గారు వెంటనే అందుకొని స్వామీజీ మహత్తులు మరికొన్ని చెప్పాడు. ఈ వెంకట్రామ్‌గారు మైసూరులోని దలవాయి

హైస్కూలులో భాగవత్ గారితో కలిసి పనిచేస్తున్న మరో ఉపాధ్యాయుడు. వారిద్దరూ కలిసి, స్వామీజీ అప్పటికే చేసిన మేలుకోట పర్యటనలు, అప్పటి మహత్తులు వర్ణించి చెప్ప సాగారు. ఆ వివరాలివి :

* * *

## మే లు కో ట

మైసూరు పక్కనే వున్న మాండ్య జిల్లాలో మేలుకోట ఒక సుప్రసిద్ధ క్షేత్రం మాత్రమే కాక, పెద్ద సనాతన విద్యాకేంద్రం. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాపకులైన శ్రీరామానుజాచార్యులకు ప్రీతిపాత్రమైన శ్రీనివాస దేవస్థానం యీ క్షేత్రానికి ప్రధాన అలంకారం. ఈ ఆలయం యీ వూళ్ళో వున్న చిన్న కొండ మధ్యలో వుంటుంది. ఈ స్వామికి చెలువ నారాయణస్వామి అనే మరోపేరు, ఆయన అందంవల్ల బిరుదుగా వచ్చింది. హరిజనులకు ఆలయ ప్రవేశం కల్పించి తమ సమతా సిద్ధాంతానికి ఆచరణ రూపంలో శ్రీమద్రామానుజులు శ్రీకారం చుట్టింది యీ స్వామి సన్నిధిలోనే అని చెపుతారు. రామానుజుల కాలం నుంచీ యీ నాటి వరకూ గూడా యిది సకల ప్రాచీనశాస్త్ర విద్యలకు కేంద్రస్థానంగా ప్రకాశిస్తూనే వున్నది. ఇది ప్రధానంగా వైష్ణవుల శ్రీనివాస క్షేత్రమే అయినా, యీ కొండ మొదటిలో ఒక బృహదాకారుడైన గణపతి, కొండశిఖరాన బృహత్తేజస్వి అయిన నరసింహుడు ఆ క్షేత్రానికి మరింత వన్నె తెస్తున్నారు.

శిరస్తదార్ కృష్ణమూర్తి గారికి స్వామీజీని ఆ క్షేత్రానికి తీసుకువెళ్ళాలని ఒక కోరిక పుట్టింది. స్వామీజీని ఒప్పించి ఆలయాధికారులతో చెప్పి యేర్పాట్లన్నీ ఆయనే చేశాడు. ఒక రోజు పొద్దున మైసూర్లో బయలుదేరారు. స్వామీజీ కారుకు ముందు మార్గదర్శకుడుగా వుండేందుకు కృష్ణమూర్తి గారు ఒక మోటారు సైకిలు తీసుకొని ఆశ్రమానికి వచ్చాడు. బయలుదేరే ముందు " బండి అక్కడ పెట్టేసి నువ్వుగూడా కారులోనే రా " అన్నారు స్వామీజీ. కాని ముందు తను మోటారు సైకిలు మీద వెళితే అది స్వామీజీకి మరింత ఘనతగా వుంటుందని భావించి కృష్ణమూర్తిగారు మోటారు సైకిలు స్టార్టు చేశాడు. ఒక నాలుగయిదు కిలోమీటర్లు వెళ్ళేసరికి ఒక టోల్ గేటు వచ్చింది. అది దగ్గరకు వస్తుండగా కృష్ణమూర్తిగారి సైకిలు చైను వూడి కింద పడిపోయింది. దేవుడి దయవల్ల ఆ టోల్ గేటులో వున్న వాడు తనకు తెలిసిన వాడే కావటం వల్ల ఆ బండి అక్కడ పారేసి వెనకాల వస్తున్న స్వామీజీ కారు ఆపి అందులో ఎక్కవలసి వచ్చింది కృష్ణమూర్తిగారు.

" ఈ పని ముందే చేసివుంటే స్వామీజీ మాట విన్న ఫలితమైనా దక్కివుండేది. ఇంకా నయం. ఈ చైను మరోచోట యెక్కడయినా వూడివుంటే నేను బండికి కాపలా కాచుకుంటూ పడి వుండవలసివచ్చేది. స్వామీజీ దయవల్లే యీ బండి యిక్కడిదాకా నడిచింది " అని స్వామీజీకి మనస్సులో కృతజ్ఞత చెప్పుకున్నాడు కృష్ణమూర్తిగారు.

చెలువ నారాయణుడి గుడిలో స్వామీజీకి ఘనంగా స్వాగతం యిచ్చారు. ఆలయంలోకి ప్రవేశిస్తున్న దగ్గరనుంచే అంతర్ముఖులుగా కనిపించారు స్వామీజీ. అర్చకులు స్వామీజీని గర్భగుడిలోకి తీసుకువెళ్ళారు. ఆ నారాయణుడి చెలువును అలా కళ్ళప్పగించి చూస్తున్న స్వామీజీ చేతుల్లో ఇన్ని తులసిదళాలు పెట్టారు అర్చకులు. దాంతో ఇహలోకంలోకి వచ్చిన స్వామీజీ "స్వామివారికి తులసిమాల వేస్తే యేమైనా అభ్యంతరం వుంటుందా" అన్నారు. "ఏమీలేదు" అన్నారు అర్చకులు. వెంటనే స్వామీజీ చేతులలోకి ఒక తులసి పూసలమాలిక వచ్చింది. దాన్ని అర్చకుల కిచ్చి స్వామివారికి అలంకరించమన్నారు స్వామీజీ. ఆశ్చర్య చకితమైన ఆ అర్చక సమూహం ఆ మాలికను కళ్ళ కద్దుకొని స్వామివారికి అలంకరించి హారతి యిచ్చారు.

ఆ తరువాత స్వామీజీ శిఖరాగ్రాన గల లక్ష్మీ నృసింహస్వామిని దర్శించారు. అక్కడ శ్రీ ఆదిశంకరుల కరావలంబ స్తోత్రం గానం చెయ్యసాగారు స్వామీజీ. వెంటనే వెనుక భక్తులలో వున్న ఒక మహాతల్లి తనూ అందుకొంది. మహాత్ముల కంఠాలలోనుంచి వచ్చే నాదాలకు విశిష్టమైన ఆధ్యాత్మిక తరంగాలు వుంటాయనీ, దానిని యథాతథంగా అనుభవించటమే తనకూ, చుట్టూవున్న వారికి మేలన్న వివేకం ఆ ఇల్లాలికి లేకపోయింది. వారి కంఠం వినాలని యింతమంది వచ్చారు గానీ, తన కంఠం వినాలని కాదు కదా! అందుచేత తను నోరు మూసుకొని వుండాలన్న యింగితమైనా లేకపోయింది. దాంతో చుట్టూతా వున్న భక్తులకు చిరాకెత్త సాగింది. కానీ, ఏమయినా విసుగు వ్యక్తం చేస్తే స్వామీజీ యేమంటారో అనే భయంతో ఎవరికివారు వూరుకున్నారు. ఇంతలో స్వామీజీ ఆ స్తోత్రాన్ని అదే రాగంలో విరుపులూ, గమకాలు మార్చేసి విచిత్రంగా పాడారు. ఆ గమకాలకు సమ్ముగ్ధులైన భక్తులు, యీ మహాయిల్లాలు అందుకోలేక నోరు కట్టేసిందని గమనించను గూడా గమనించలేదు.

అక్కడ నుంచి క్రిందకు వచ్చారు స్వామీజీ. అక్కడ పర్వత పాదంలోనే బృహదాకార గణపతి వున్నాడు. ఆ గణపతి దాదాపు పదహారు అడుగుల ఎత్తు వున్నాడు. ఆ కొండలో ఒక నిట్టనిలువు కొండ గోడ మీదే యీ బృహద్గణపతి విగ్రహం చెక్కబడి వుంది. ఇంత విగ్రహం ఒక ఎనిమిదడుగుల ఎత్తు పీఠం మీద చెక్కబడి వుంది. ఇంత ఎత్తు విగ్రహం కావటం కారణంగా ఆ స్వామికి గుడి గోపురాలు ఏమీ లేవు. కొన్ని శతాబ్దాలుగా వానలే అభిషేకాలుగా, ఎండలే హారతులుగా కాలక్షేపం చేస్తున్నాడు ఆ స్వామి. ఈ స్వామి దగ్గరకు రాగానే అక్కడ వున్న అర్చకుణ్ణి హారతి యివ్వవేమి అన్నారు స్వామీజీ. అతను తెల్లమొహం వేశాడు. కింద నుంచుని చెయ్యెత్తితే స్వామి పాదాలు అందటమే అంతంత మాత్రం. ఇక ఆ స్వామికి హారతి యిచ్చేది యెట్లా? ఆ మాటే అతను స్వామీజీకి చెప్పాడు.

"అదా" అంటూ స్వామీజీ ఒక గణపతి విగ్రహం సృష్టించి ఆ పీఠంమీద పెట్టి, "యిక హారతి యివ్వు" అన్నారు. అర్చకుడు పరమానందపడి ఆ పెద్ద గణపతికీ, పొట్టి

గణపతినీ, గణపతి స్వామిజీనీ ఒకే రూపంగా మనస్సులో భావించుకొంటూ, హృదయ పూర్వకంగా హారతి యిచ్చాడు.

ఆ తరువాత అక్కడ చేరిన అసంఖ్యాక జన సమూహాన్ని ఉద్దేశించి అనుగ్రహ భాషణం చేస్తూ— "ఈ గణపతికి కొన్ని వందల యేండ్లుగా అభిషేకం లేదు, అలంకారం లేదు, అర్చన లేదు. ఎండకు ఎండి, వానకు తడిసి, చలిగాలికి బిగిసి యీ స్వామి మనకు యోగసాధనను బోధిస్తున్నాడు. ఇక ఈ గణపతికి అభిషేకం చెయ్యాలని నిశ్చయించారు స్వామీజీ. మీరంతా చేరి చేతనైనంతగా పంచామృతాలు మొదలైనవి సిద్ధం చేసుకొని వుండండి. అభిషేకం చెయ్యవలసిన రోజును తరువాత నిర్ణయిస్తాం" అన్నారు స్వామీజీ.

ఇంతే చెప్పింది. ఈ ఒక్క మాటతో మేలుకోటలో వారు వీరు అనిలేక అందరికీ అంతులేని ఉత్సాహం బయలుదేరింది. జయజయ ధ్వనులు మిన్ను ముట్టినాయి. అక్కడి నుంచి సంకీర్తన చెయ్యవలసిన వేదికకు వెళుతూ "ఆశ్రమంలో ఒకడు కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. తొందరగా వెళ్ళాలి" అని కృష్ణమూర్తి గారితో అన్నారు స్వామీజీ. అన్నట్టుగానే అక్కడి కార్యక్రమాలు త్వర త్వరగా పూర్తి చేసి, సాయంత్రం మూడింటికల్లా ఆశ్రమానికి వచ్చేశారు స్వామీజీ.

అక్కడ నిజంగానే ఒకడు కడుపు నొప్పి బాధ భరించలేక నేలమీద పడి దొర్లుతున్నాడు. స్వామీజీ వచ్చినా అతను లేవలేక పోయాడు. స్వామీజీ ఒక కుర్చీ తెప్పించుకొని, అతని దగ్గరనే కూర్చుని కొద్ది సెకండ్లపాటు ఏదో జపం చేశారు. చేసి, "వాణ్ణి లేవమనండి" అన్నారు పక్కన వున్న వాళ్ళతో. అది విని అతనే మెల్లిగా లేచాడు. "నువ్వు ఈశ్వరుడి దగ్గరకు వెళ్ళి ప్రదక్షిణం చేసిరా" అన్నారు స్వామీజీ. అతనలాగే ఓపిక చేసుకొని ప్రదక్షిణం చేయసాగాడు. మొదటి ప్రదక్షిణం పూర్తి కాకుండానే, అతని కడుపునొప్పి కనిపించకుండా పోయింది.

మేలుకోట నుంచి ఆ మరుసటి వారంనుంచే, వెంటనే వచ్చి అభిషేకం చేయవలసిందని వొత్తిడి మొదలయింది. చివరికి స్వామీజీ ఒకరోజు నిర్ణయించారు. స్వామీజీ అక్కడకు చేరేసరికి. ఊరి జనమంతా అక్కడే పోగయి వున్నారు. దేవాలయ కుంభాభిషేకాలకు కట్టినట్లు, బృహద్గణపతి నెత్తి పైకి పెద్ద వాలుమంచె కట్టారు. స్వామి చుట్టూ అక్కడి ముత్తైదువలు చేసిన రంగవల్లుల అలంకారాలను వర్ణించేందుకు వీలులేదు. చూసి తీరవలసిందే. వందలకొద్దీ కడవల పాలు, పెరుగు, కడవలకొద్దీ నెయ్యి, తేనె, పంచదార, కొబ్బరి నీళ్ళు వగైరా అభిషేక ద్రవ్యాలు సిద్ధపరచి ఉంచారు.

ఆ ప్రజల భక్తిని చూసి పదహారడుగుల గణపతికన్న పైకి ఉప్పొంగి పోయింది స్వామీజీ హృదయం. అలాంటి ప్రఫుల్లమైన హృదయ స్థితిలో స్వామీజీ ఆ మంచెమీది కెక్కి స్వామి కిరీటం మీదుగా పంచామృతాభిషేకం చేశారు.

మన పురాణాలలో పాల సముద్రం, పెరుగు సముద్రం, నేతి సముద్రం వంటి సముద్రాలను వర్ణించారు. కాని, యీ బృహదాభిషేకంలో శ్రీ స్వామీజీ చేతుల మీదుగా ఆ పాల వర్షం, పెరుగు వర్షం, నేతి వర్షం వంటి పంచామృత వర్షాలూ వర్షించినాయి సృష్టిలో మొదటిసారిగా. అరుణాచలం, కైలాస శిఖరం వంటి క్షేత్రాలలో పర్వత ప్రదక్షిణ విధానా లున్నాయి తప్పితే, పర్వతాభిషేక విధానా లెక్కడా వున్నట్టు లేదు. ఇక్కడ స్వామీజీ చేతులలో సాక్షాత్తుగా ఒక పర్వతాభిషేకమే జరిగింది. ద్వాపర యుగంలో దొంగ కృష్ణయ్య కొండకు పూజ చెయ్యమని యెక్కవేస్తే, వెర్రి గొల్లలు నిజమే అనుకొని భేదభావబద్ధులై కృష్ణుడి చేతగూడా కొండకే పూజ చేయించారు. ఇక్కడ మాత్రం కొండకూ, కొండలో ఏర్పడిన కొండంత గణపతికీ గూడా ప్రత్యక్ష గణపతే అహంగ్రహోపాసనగా అర్చన చేసి చూపించి ప్రజలను తరింపచేశాడు. వేలాది జనానికి, కన్నుల పండుగేకాక, జన్మలు పండగా జరిగిన మహాభిషేకంలో పంచామృతాలు కాలువలు కట్టి నదులుగా పొంగినాయి.

ఆ తరువాత స్వామీజీ స్వయంగా ఆ మూర్తికి అలంకారం చేశారు. ఎన్ని పూల దండలు, ఎన్ని పూల గుత్తులు, ఎన్ని రకాల తీర్పులు, ఏమి అలంకారమది! వట్టి బండరాతిలో వసంత ఋతువు వికసించ గలిగితేనే అలాంటి అలంకారం కుదురుతుంది. స్వామీజీ అమృత హస్తస్పర్శకు పులకించిన ఆ శిలామూర్తి నిజంగా పులకించి పోయినట్టుంది. నిజంగానే ఆ మూర్తిలో వూరి ప్రజలందరకూ కొత్త వెలుగులు తోచసాగాయి. ఊహలలో గూడా యెరుగని మహానందంలో మహాజనులు నిమగ్నులై చూస్తూ వుండగా మహామంగళహారతి జరిగింది. ఆ తరువాత స్వామీజీ స్వయంగా తీర్థ ప్రసాద వినియోగం చెయ్యగా, అందులో అనేకులకు అనేకానేక దేవతా విగ్రహాలు గూడా ప్రసాదంగా వినియోగం అయిపోయినాయి. ఆ తరువాత యీ కార్యక్రమాన్ని గురించి కన్నడ రాష్ట్రంలోని ప్రముఖ పత్రికలన్నీ ప్రముఖంగా ప్రచురిస్తూ, చరిత్రకు తెలిసినంతలో అనగా గత యెనిమిది వందల సంవత్సరాలలో ఈ స్వామికి అభిషేకం జరిగి వుండలేదనీ, ఇటువంటి అభిషేకం మరే స్వామికీ జరిగి వుండలేదనీ ప్రశంసించాయి.

* * *

ఈ కథలు వింటున్నంతసేపూ ఆనందజీగార్ని విగ్రహసృష్టి వంటి మహత్తులు ఆకర్షించటం లేదు. అలాంటి వాటిని ఆయన చిన్నప్పుడే, ఇంకా విద్యార్థిగా వున్న రోజుల్లోనే తృణీకరించేశారు. ఈ మహత్తుల గురించి పూర్వమే ఆయనకు బాగా అనుభవం వుంది కూడా. అయితే, యిప్పుడు తనకే ఆశ్చర్యం కలిగిస్తున్న ఆలోచన యేమంటే "ఆ హైదరాబాదు సాధ్వి చెప్పిన స్వామీజీ యీయనే" అని అంతరాత్మ నిర్ద్వంద్వంగా చెపుతోంది. బాహ్యంగా చూసి నట్టయితే, ఇది కేవలం ఒక ఊహావిలాసంగానే కనిపిస్తుంది. సామాన్యుల జీవితంలో అయితే అది అంత మాత్రమే కావచ్చు గూడా. కాని, ఆనందజీగారిలాగా విశాలమైన సాధనలు చేసి,

మెట్లెక్కిన ఆధ్యాత్మిక జీవులకు అంతరాత్మ ప్రబోధాలు కేవలం స్వప్నతుల్యాలు కావుగాక కావు. సాధనలో అనుభవశాలి అయిన ఆనందజీగారు అందువల్లే తక్షణమే మైసూరు ప్రయాణ మయ్యారు.

“ముందరిగా కనుక్కొని వెళ్ళటం మంచిదేమో! ఆయన ఊళ్ళో వున్నారో లేరో, ఆయనకు మాట్లాడే విశ్రాంతి వుందో లేదో...” అన్నాడు వెంకట్రామ్‌గారు దార్లో. ఆనందజీగారు నవ్వి వూరుకున్నారు. ఆధ్యాత్మిక సాధనలో ఆ ప్రశ్నే పిల్ల ప్రశ్న. అంతర్హృదయంలో దూరి ప్రబోధించే పరమాత్మకు ఆ వివరాలన్నీ తెలుసు.

వాళ్ళు వచ్చేసరికి ఎదురు చూస్తున్నట్టుగా కూర్చుని వున్నారు స్వామీజీ. ఆనందజీ గారు కొంతసేపు ఏకాంతంగా సంభాషించి, సెలవు తీసుకొని వెళ్ళిపోయారు. కాని ఆ మర్నాడు మళ్ళీ వచ్చారు. ఆ రోజు గూడా స్వామీజీ చాలా విశ్రాంతిగా మాట్లాడి, ఆయనకు ఒక జపమాల సృష్టి చేసి యిచ్చారు. ఆ తరువాత తన జీవిత విశేషాలను సంగ్రహంగా ఆయనకు వివరించారు స్వామీజీ. ఆ తరువాత యిద్దరూ కొంతసేపు మౌనంగా వుండిపోయారు. అసలైన సంభాషణ యిదే.

ఆ తరువాత ఆశ్రమంలో జరిగిన ఒక సమావేశంలో మాట్లాడుతూ వెంకటేష్ ఆనందజీ గారు స్వామీజీని, భగవాన్ స్వామీజీగా ప్రశంసిస్తూ ఇలా అన్నారు. “నన్ను మహత్తులు ఆకర్షించలేదు. అవి ప్రాథమిక స్థితిలో ఉన్న వాళ్ళను ఆకర్షిస్తే ఆకర్షించవచ్చు. దానివల్ల ధర్మ ప్రచారం కొంత జరిగినా జరగవచ్చు. కాని, ఆ మార్గం అల్పమైన మార్గం, దుర్భరమైన మార్గం. అది ప్రమాదకరమైనది గూడా. ఎందుకంటే, ప్రజలు దీని ద్వారా ధర్మాన్ని అందు కోవటం పోయి, ధర్మాన్ని పూర్తిగా మరచిపోయి యీ మహత్తుల వెంటే పడవచ్చు. అందుకనే, భగవాన్ సచ్చిదానందులే స్వయంగా నాతో అన్నారు. తనకు ధర్మ ప్రచారమే ముఖ్యమనీ, యీ మహిమల ప్రకటన ప్రాథమిక మార్గం మాత్రమేననీ, దాన్ని త్వరత్వరగా తగ్గించే స్తున్నాననీ.

వారి దగ్గర మనం చూడవలసింది ఈ మహిమలు గాదు. నేను చూసింది వేరే వుంది. మీరంతా గూడా అదే చూడాలి. నిన్న నేను వారిని దర్శనం చేసినప్పుడు వారి పూర్వాశ్రమ విశేషాలను అడుగుదామనిపించి గూడా ఆగిపోయాను. నేను స్వయంగా ఒక సన్యాసినై వుండి మరొక సన్యాసి పూర్వాశ్రమ వృత్తాంతాన్ని ప్రస్తావించటం అధర్మం కదా! కాని, యివాళ్ళ భగవాన్ సచ్చిదానందులు స్వయంగానే ఆ వివరాలు కొన్ని నాకు చెప్పారు. అయితే, ఈ భగవానులలో నేనేమి చూశాననేది నేను చెప్పరాదు. చెప్పే వీలులేదు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆయన దివ్య పురుషుడు. ఈ దివ్య పురుషుడి దివ్య తేజస్సు యీ భూమి నంతనూ ప్రకాశవంతం చేయుగాక.”

ఆనందజీగారి సమావేశం తరువాత, ఆ సంవత్సరం కార్యక్రమాలలో స్వామీజీ ప్రొద్దుటూరు పర్యటన ప్రత్యేకంగా గమనించదగ్గది.

పట్భుతి రామయ్యగారు సంకల్పించిన ఆలయ నిర్మాణం నత్తనడకగా సాగుతోంది. ఆలయ భవన నిర్మాణం పూర్తయినట్టే గాని, ఆలయానికి కావలసిన హంగులు ఇంకా చాలా సమకూరవలసి వున్నాయి. ముందు ఆలయ ప్రతిష్ఠ అయిపోతే, అవన్నీ అవే సమకూపుతాయి అని రామయ్యగారి ఆలోచన. కాని, శాశ్వత ప్రాతిపదిక మీద అర్చనా, అర్చక వ్యవస్థలు కుదిరితేగాని ప్రతిష్ఠ చేయరాదన్నారు స్వామీజీ. ఆ సందర్భంలోనే, ఆ గుడి ప్రతిష్ఠకు ఇంకా మూడేళ్ళు వ్యవధి వుందనీ, తొందర పడవద్దనీ స్వామీజీ చెప్పారు. అప్పుడు రామయ్యగారు ఆ గుడిలో భాగమైన రామమందిరంలో నిక్షేపించేందుకు కోట్లాది రామకోటి సిద్ధంగా వుందనీ, దాన్ని ఆలయ భూభాగంలో నిక్షేపించినట్లయితే, పెద్ద బరువు తగ్గుతుందనీ, దానికి అనుగ్రహించమనీ ప్రార్థించాడు. దానికి అంగీకరించి రోజు నిర్ణయించారు స్వామీజీ.

ఇది జరిగిన కొద్ది రోజులకు కామకోటి పీఠాధిపతులు ప్రొద్దుటూరు రాబోతున్నారని రామయ్యగారికి తెలిసింది. ఆ తరువాత వారి కార్యక్రమాల తేదీలు నిర్ణయమైనాయి. ఆ తేదీలు రామకోటి ప్రతిష్ఠకు స్వామీజీ నిర్ణయించిన తేదీలే కావటం ఒక విచిత్రం. ఆ సమయానికే పుష్పగిరి పీఠాధిపతులు గూడా ప్రొద్దుటూరు వస్తారని నిర్ణయం కావటం మరొక విచిత్రం. రామయ్యగారు ఆ మహాత్ములిద్దరినీ గూడా యీ రామకోటి ప్రతిష్ఠా కార్యక్రమాలకు ఆహ్వానించాడు. ఈ కార్యక్రమం స్వామీజీ ఆజ్ఞ ప్రకారం జరుగుతోందని తెలియంగానే ఆ పెద్దలంతా ఆ ఆహ్వానం అంగీకరించారు. ఈ కార్యక్రమ సందర్భంగా ప్రొద్దుటూరులో సుబామణి గారి యింట్లో దిగిన స్వామీజీ, ఒకరోజు షడ్దర్శనం సోమసుందర శర్మగారికి ఒకసారి వచ్చి వెళ్ళవలసింది అని కబురు చేశారు. అప్పటికి "సత్యనారాయణ" అనే కుర్రవాడు శర్మగారి స్మృతిపథంలోంచి పూర్తిగా చెరిగిపోయాడు. ఈ మధ్య కాలంలో అనేక కష్టాలలో కల్లోల పడిన శర్మగారు అలా మరిచిపోవటంలో పెద్ద ఆశ్చర్యంలేదు.

అయితే పూర్తిగా సాంప్రదాయిక విద్వాంసు డయిన శర్మగారికి, యెవరో గడ్డాల మీసాల స్వామి వూర్లోకి వచ్చాడంటే, వెళ్ళి చూడటం యిష్టం కాలేదు. అయినా, ఎవరో పెద్ద ఉపాసకుడంటున్నారు, తనకోసం ప్రత్యేకం కబురు పంపించాడంటున్నారు, తనేదో గొప్పవాడి నయిపోయినట్టు కాదనటం దేనికనుకున్నాడు శర్మగారు. అవ్యాజమైన వినయము, అనన్యమైన సౌమ్యత, నిసర్గసిద్ధమైన నిరాడంబరత శర్మగారికి జన్మతో సిద్ధించిన ఆభరణాలు.

ఆయన వచ్చి స్వామీజీని దర్శించాడు కాని గుర్తించలేకపోయాడు. స్వామీజీయే అనేక గుర్తులు చెప్పి, తనను గుర్తింపచేసుకొన్నారు. తరువాత, తనకు ఉపనయన సమయంలో గణపతి దర్శన మిచ్చాడనీ, అప్పటినుంచీ తన జీవితం మారిపోయిందనీ, ఇప్పుడు అవధూత సన్యాసంలో వున్నాననీ చెప్పారు స్వామీజీ. విని వూరుకున్నారు శర్మగారు.

ఆ తరువాత వారి పిల్లలందర్నీ తెచ్చి చూపించమని స్వామీజీ శర్మగారిని కోరారు. సరేనని పిల్లలందర్నీ తెచ్చాడు శర్మగారు. వారి పెద్దబ్బాయి అప్పటికి ఎం. ఏ. చదువుతున్నాడు. ఇతనే స్వామీజీ చెవుల పోగులవల్ల రక్తంకారుతుంటే జాలిపడి రక్షణ చేసింది.

స్వామీజీ ఆ విషయాలన్నీ గుర్తు చేస్తూ అతని చేతిలో ఒక మల్లెపూవు వేశారు. అది ఒక సరస్వతి డాలరయి అతని చేతిలో పడ్డది. వారి పెద్దమ్మాయి తులసి చేతిలో మరో మల్లె పూవు వేయగా అది గోపాలకృష్ణ విగ్రహమైంది. రెండో అమ్మాయి చేతిలో మరో పూవు వేయగా అది గణపతి డాలరయింది. ఇంకా చిన్నపిల్లల్ని దగ్గరకు తీసుకొని కథలు చెపుతూ ఆడించారు స్వామీజీ. ఈ జరిగిన వస్తుసృష్టిని అందరూ జాగర్తగా గమనిస్తున్నారు. అందరికీ ఆనందమూ, ఆశ్చర్యమూ, భక్తీ, భయమూ కలుగుతున్నాయి. శర్మగారికి మాత్రం వెగటు పుట్టింది. నిండుకుండ కనుక పైకిమాత్రం తొణకలేదు.

ఇంతలో "అమ్మగార్ని తీసుకురాలేదేమిటి శర్మగారూ" అన్నారు స్వామీజీ.

"ఆ మహా యిల్లాలు వెళ్ళిపోయింది నాయనా," అన్నారు శర్మగారు విచారంగా. ఆ తరువాత సంసారభారంవల్ల శర్మగారు పునర్వివాహం చేసుకున్నారనిగూడా పక్కవారు చెప్పారు.

ఆ తల్లి స్వామీజీకి మధుకరమేగాక, వారాల భోజనాలుగూడా పెట్టిన చల్లనితల్లి. ఆవిడ గతించినందుకు స్వామీజీ చాలా విచారించారు. 'ఎప్పుడైనా వీలుగా వున్నప్పుడు ఒకసారి ఆశ్రమానికి రండి' అని ఆహ్వానించారు. అలాగే అని మర్యాదగా అని ఇంటికి వెళ్ళిపోతూ దార్లో అనుకున్నాడు శర్మగారు.

"అలవోకగా గడ్డాలు పెంచితే. అమాంతం అవధూత అయిపోవచ్చు. ఎవడు అవధూతో? ఎవడు కాదో? ఈ మహత్తుల మెరమెచ్చుల స్వాములతో మనకెందు కొచ్చిన గోల?" ఇది గమనించిన స్వామీజీ సంతోషంగా నవ్వుకున్నారు.

ఆ పర్యటనలో శ్రీ స్వామీజీకి శ్రీ పుష్పగిరి పీఠాధిపతులతో సమావేశం నారాయణ అయ్యర్ అనే వారి యింట్లో జరిగింది. ఈ నారాయణ అయ్యర్‌గారు తరువాత స్వామీజీకి సన్నిహిత భక్తులలో ఒకరుగా మారారు.

ఆ తరువాత రామకోటి ప్రతిష్ఠా కార్యక్రమం చక్కగా జరిగింది. రామకోటిని కామకోటి మఠం ఏనుగుమీద ఊరేగింపు చేయించి, పాదచారులై ఆలయప్రాంగణంలోకి వచ్చారు కామకోటిపీఠాధిపతులు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు,వారి శిష్యులు శ్రీజయేంద్ర సరస్వతీస్వాములవారు. చంద్రశేఖరేంద్రులు మఠ బాధ్యతలను తమ ప్రియశిష్యులు శ్రీజయేంద్రులకు పూర్తిగా అప్పచెప్పే ప్రయత్నం జరుగుతున్న రోజులవి. అందుకనే అప్పట్లో వృద్ధులైన చంద్రశేఖరేంద్రులు జయేంద్రులను వెంటబెట్టుకొని దేశసంచారం జరుపుతున్నారు. ఆ మహాస్వాముల దివ్యకరకమలాలమీదుగా, శ్రీ స్వామీజీ దివ్యసన్నిధిలో రామకోటి ప్రతిష్ఠ జరిగింది.

* ఆ సందర్భంగా ఆ ఆలయప్రాంగణంలో కంచి పీఠాధిపతులిద్దరూ, స్వామీజీ ఏకాంతంగా దాదాపు గంటసేపు సమావేశమయ్యారు.

* ఈ సుదీర్ఘ సమావేశపు చర్చనీయాంశాలు మాత్రం ఇప్పటికీ రహస్యంగానే వుండిపోయినాయి.

# 26 వ అధ్యాయం — యోగ క్రియా

*నిష్పీడ్య సర్వానపి యోగ తంత్రాన్*
*త్వయా క్రియా యోగ ఉదీరితో యః*
*లఘుశ్చ సిద్ధో వంఘుశ్చ సారాత్*
*స మే గురో సిధ్యతు యోగి వంద్య ॥*

(శ్రీ గురుదేవా ! యోగ తంత్రాలన్నీ పిండి పిప్పి ''క్రియా యోగ''మనే యోగ విధానాన్ని నిర్మించి యోగులకు వంద్యులయ్యారు. అది శీఘ్రంగా సిద్ధిస్తుంది. సారంలో మాత్రం బరువైనది. ఆ క్రియా యోగం నాకు సిద్ధించుగాక. )

## పాతసాధన

విజయవాడ ఆంధ్రదేశపు మూడు ప్రధాన పట్టణాలలో ఒకటి. డా॥ పి. కృష్ణమూర్తి గారు విజయవాడలో ప్రముఖ హోమియో వైద్యుడు. హోమియో వైద్యానికి ఆంధ్రదేశంలో బొత్తిగా ఆదరణలేని ఆ రోజుల్లో తీరిక లేనంత రద్దీతో పరిశుద్ధమైన హోమియో వైద్యం నడుపుతున్నాడంటే, ఆయన వైద్య ప్రజ్ఞ ఎటువంటిదో ఊహించుకోవచ్చు. యాభయ్యవ పడిలో పడుతున్న డా॥ కృష్ణమూర్తిగారు ఆజన్మ బ్రహ్మచారి. జన్మ సిద్ధంగానే దృఢ నిశ్చయ స్వభావం కల ఆయన మనస్సులో ఎన్ని విచిత్ర ప్రవృత్తు లున్నాయో, ఆయన జీవనంలో గూడా అన్ని మలుపులు ఉన్నాయి. ఒక దృష్టిలో ఆయన సత్పురుషులతో సంబంధాలు వున్న ఆస్తికుడైతే, మరో దృష్టిలో ఆయన ఘోర నాస్తికుడు. ఒక దృష్టిలో ఆయన కరుణార్ద్ర హృదయుడయితే, మరో దృష్టిలో ఆయన పాషాణ కర్కశ హృదయుడు.

తూర్పు గోదావరి జిల్లా ప్రాంతాల నుంచి వలస వచ్చి కృష్ణాజిల్లాలో స్థిరపడిన ఈ డాక్టరు గారికి, మచిలీపట్నంలోని రాజారావుగారితోనూ, వారి సోదరులతోనూ ఆబాల్య మైత్రి వుంది.

రాజారావుగారి పూర్తి పేరు నందిగామ వీరరాజారావుగారు. కలికాలపు లోకరీతికి విభిన్నమైన జీవ సంస్కారంతో పుట్టిన రాజారావుగారి చిత్తవృత్తి బాల్యం నుంచే విచిత్రంగా ప్రవర్తించసాగింది. వంశానుగతమైన ఆచార ప్రకారంగా చిన్నతనంలోనే ఉపనయనం చేసి, నిత్యం సంధ్యా వందనం చెయ్యమని ఆజ్ఞాపించిన పెద్దలను, ఆ సంధ్యావందనానికి అర్థమేమిటని

అడిగాడు బాలరాజారావుగారు. అర్థమూ చెప్పక, అప్పుడే ఎందుకు చెప్పరాదో వివరించనూ వివరించక, "నోరు మూసుకొని చెప్పినట్టు చెయ్యమని" శాసించిన పెద్దలను ఆ కుర్రతనపు పొగరు మోటుగా తిరస్కరించింది. అయితే, అప్పటినుంచీ యీ సంధ్యావందనానికి అర్థం తెలుసుకోవాలన్న సంస్కారం మాత్రం బుర్రలో పడిపోయింది.

ఆ తరువాత విశాఖపట్నంలో ఉండి కాలేజీలో చదువుకుంటున్న రోజులలో, రామకృష్ణ, వివేకానంద సాహిత్యంపై ఆసక్తి కలిగి, ఆ గ్రంథాలన్నీ అమూలాగ్రంగా అధ్యయనం చేశాడు. అసాధారణమైన మేధాశక్తి కలిగిన ఆ బాలుడికి ఆ గ్రంథాలన్నీ దాదాపు కంఠస్థమైనాయి. మేధా సంపదకు ఫలితంగా చదువులో బాగానే వస్తున్నా, మనస్సు వైరాగ్యం వైపు లాగసాగింది. చదువు పైకి సాగుతున్న కొద్దీ, వంశాచారంగా వస్తున్న పిలకజుట్టు, ఉత్తరోత్తరా అభివృద్ధికి భంగకర మవుతుందేమోనన్న భయంతో, కత్తిరించి వేసిన పెద్దల చర్యవల్ల ఆ యువకుడి మనస్సు గొప్ప తార్కిక సంఘర్షణలో పడ్డది.

వీళ్ళు రోజూ పూజలు చేస్తారు. వేదం చదువుకున్న వాళ్ళని, పిలకలు పెట్టుకున్న వాళ్ళని పూజిస్తారు. వేదంవల్ల పరమేశ్వరుడు అనుగ్రహిస్తాడనీ, ఆయన అనుగ్రహంవల్ల అన్ని అభివృద్ధులూ వస్తాయనీ నమ్ముతారు. మళ్ళీ తమ పుత్రులకు పిలకలు కత్తిరించేస్తారు. వీళ్ళకు యీశ్వరుడిమీాద నమ్మకం వున్నట్టా? లేనట్టా? వీళ్ళసలు నాస్తికులా? ఆస్తికులా?

మొహమాటమూ, జంకూ, వంకరా అన్న వాటి వాసనైనా యెరగని తార్కిక ధోరణి జన్మసిద్ధమైన వరంగా లభించిన ఆ యువకుడికి పెద్దవాళ్ళ ప్రవర్తనలో యేమీా న్యాయం కనిపించలేదు. ఫలితంగా సాంప్రదాయకులుగా కనిపించే వారందరిపైనా తీవ్ర తిరస్కారబలం ఆ లేత హృదయంలో ముద్ర గుద్దుకుంది. పెద్దవాళ్ళు పిలక తీయించేస్తే తను మాత్రం క్రాఫింగు పెట్టుకోనని మొండికెత్తి యెటూకాని సాయిబ్బు గుండుతో తిరగటం అప్పటి కొక విలాసమైంది.

క్రమంగా రామకృష్ణ, వివేకానంద సాహిత్య ప్రభావంవల్ల కుండలినీ యోగవిద్య మీాద తీవ్రమైన ఆసక్తి కలిగి, ఉత్తములైన గురువుల కోసం హృదయం అల్లాడసాగింది. అదే సమయంలో పరతత్వ విచికిత్సలో మస్తిష్కం మగ్గిపోతూ వుండేది. ఏమయినా యోగాసక్తిదే అధికబలంగా వుండేది.

ఒక రోజున తనంతటు తనే ఏకాంతంగా కూర్చుని మూలాధారంలోని కుండలినీ శక్తిని భావనాపథంలో నిలిపి ఉగ్రమైన మనోబలంతో ఆ శక్తిని పైకి లేవమని ఆజ్ఞాపించసాగాడు ఆ యువకుడు. ఏదో మార్పు వస్తోందనిపించింది. కాని, యింతలో కుడిచెవిలో బలమైన పురుష కంఠం వినిపించింది. "ఒద్దు. ఆపెయ్" అని. దాంతో ఆ ప్రయత్నం ఆపాడు, యువ రాజారావు. కాని తపన మరింత పెరిగింది.

ఆ ప్రాంతాలలోనే చిన్నప్పుడు పదేళ్ళ లోపులోనే తల్లి పోయిన రాజారావుగారు తమ్ముడు సూర్యారావుగారితో కలిసి ఉద్యోగార్థం మచిలీపట్టణం వచ్చేశాడు. వాళ్ళిద్దర్నీ చిన్నప్పటినుంచీ పెంచిన మేనత్తగారు వారి వెంట వచ్చింది. ఆ వూళ్ళో వాళ్ళ పినతల్లిగారు గూడా వుండేవారు.

మచిలీపట్టణం ఆంధ్రదేశపు తూర్పు కోస్తా తీరంలోని అతి ప్రాచీన పట్టణం. సకల కళా కేంద్రంగా ఒకప్పుడు వెలిగిన మచిలీపట్టణానికి, యిప్పటికీ అనేక ప్రత్యేకతలు వున్నాయి. ఎంత విద్యా కేంద్రమయినా, జిల్లా పట్టణమైనా, మితిమీరిన పట్టణంగా పెరిగి పోకుండా వుండగలగటం ఆ వూరి ప్రత్యేకతలలో ఒకటి. ఉత్తమమైన ఆధ్యాత్మిక స్పందనలను ప్రసరింపచేస్తూ గురువులను, సాధు పురుషులనూ ఆకర్షిస్తూ వుండటం అక్కడి మరో ప్రత్యేకత. ఏ వూరుకూ లేనన్ని పేర్లు ఉండటంగూడా ఆ వూరుకు ఒక ప్రత్యేకతే మరి! ఆ పేర్లలో బందరు, బృందావనపురం అన్నవి గూడా బాగా ప్రసిద్ధమైన పేర్లే.

మచిలీపట్టణంలో అప్పటి ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీలో ఉద్యోగంలో ప్రవేశించాడు రాజారావుగారు. పెల్లుబుకుతున్న ఆధ్యాత్మిక తృష్ణకు తోడు, పేరులోవున్న వీరత్వం తోడు పడగా సద్గురువు కోసమై తీర్థయాత్రలు సాగించాడు రాజారావుగారు. ప్రసిద్ధులైన సత్పురుషు లందర్నీ, "మీా రెవరో మీాకు తెలిసిందా? మీాకు కుండలినీ ప్రబోధం అయిందా?" అని ముక్కు మీాద గుద్దినట్టుగా అడిగేవాడు. ఎవరూ సూటిగా జవాబు చెప్పలేదు. శ్రీ రమణ మహర్షులు, "నా సంగతి నీ కెందుకు? నువ్వు ఒకటా రెండా?" అన్నారు. ఇది తనకు చేసిన ఉపదేశమని గ్రహించటానికి మరో ఇరవైయేళ్ళు పట్టింది. ఇలా గురువు కోసం తపిస్తున్న రోజులలో బందరులో ఒక మిత్రుడి యదాలాప ప్రసంగంలో మద్రాసులో ఒక మహాయోగి వున్నారనీ, ఆయన ముస్లిం అనీ విన్న రాజారావుగారు వెంటనే మద్రాసు దూకాడు.

"నజీరుద్దీన్‌బాబా" అనే పేరుగల ఆ యోగీశ్వరుడు వివేకానందుడి సాక్షాత్ శిష్యులలో ఒకడు. యోగసాధనలో చేసిన ఒక వింత ప్రక్రియలో తన రెండు కాళ్ళూ చచ్చుపడి పోయినా అఖండ నిర్వికల్ప సమాధిని అందుకొన్న మహానుభావుడాయన. ఆయన సన్నిధిలో నెల రోజులు గడిపాడు రాజారావుగారు. ఏమీా ప్రయోజనం కనిపించలేదు అనుకుంటుండగా ఒక రోజున ఆ బాబాగారు—

"రాజాజీ, మీా రిప్పుడు కడిగిన ముత్యం" అన్నాడు సంతోషంగా.

ఆ పొగడ్తకు సూర్యాకారమల్లే మండిపడ్డ రాజారావుగారు "నే నిదివరకు ఎలాంటి వెధవనో, ఇప్పుడూ అలాంటి వెధవనే" అన్నాడు.

"ఎవరు చెప్పింది? నిటారుగా కూర్చో" అన్నారు బాబాగారు. ఈయన కూర్చున్నాడు. సమాధి అందుకుంది. అదీ ఆ జీవి పరిపాకం.

ఆ బాబాగారు ఈయన్ని మొదటినుంచీ, ఎంతో గౌరవంగా చూసేవారు. రాజాజీ అని పిలిచేవారు. వారు ఏదైనా ప్రసాదం ఎవరికైనా యివ్వవలసి వస్తే, యీయన చేతితో యిప్పించేవారు.

"రాజాజీ, మీ ఉపాధి ప్రశస్తమైనది. మీరు బ్రాహ్మణ వంశంలో పుట్టటం వల్ల, నేనిచ్చిన విద్య నాకన్నా మీ దగ్గర ఎక్కువ ప్రకాశిస్తుంది" అనే వారాయన. అలా బాబా గారి సేవలో అనేక సంవత్సరాలు యోగాభ్యాసం నడిచింది. అప్పటికి జీవితంలో బ్రహ్మ చర్యం ఖాయమైపోయిన రాజారావుగారిని, ఆయన తమ్ముడు సూర్యారావుగారు రాముణ్ణి లక్ష్మణుడు అనుసరించినట్లు అనుసరించాడు. అయితే, రాజారావుగారు నిత్య ధ్యాన సాధన మార్గంలో వుండగా, సూర్యారావుగారు నిత్య గురుసేవా మార్గంలో వుండి యోగి బాబాగారి వల్ల యోగానుగ్రహం పొందాడు.

అప్పుడే కొత్త కొత్తగా వైద్యాభ్యాసం ప్రారంభించిన డా॥ కృష్ణమూర్తి గార్ని వీరిద్దరూ ఒకసారి మద్రాసులో బాబాగారి దగ్గరకు తెచ్చారు. బాబాగారి స్పర్శలో ఒక అఖండమైన జ్యోతిర్మయ మహాలింగంలో చాలాసేపు లీనమైపోయాడు డాక్టరుగారు. ఆ స్థితి లోంచి బయటకు వచ్చేసరికి చదివిన వైద్యమంతా మనస్సులోంచి తుడిచి పెట్టుకుపోయింది. ఆ యోగానుభూతిలో వచ్చిన ఆనందం ఎంత మహత్తరమైనదైనా, ఆ జీవికి సంస్కారవశంగా వచ్చిన వైద్యప్రీతి ఆ మనస్సును పట్టుకొని ఊపివేసింది. ఆ ఉద్వేగంలో మళ్ళీ వైద్యగ్రంథా లన్నీ చదివాడాయన. ఆ ఒక్కసారి చదివినదానికి ఆ గ్రంథాలు ఆ మనస్సులో శిలాశాసనాలయి పోయినాయి. అదిగాక స్ఫురణలో గూడా విశేషమైన మార్పు వచ్చింది.

తన హోమియో వైద్యానికి తోడు అవసరమైనప్పుడు తన యిచ్ఛాశక్తిని ప్రయోగించి సంకల్ప తీవ్రతతో శక్తివల్ల గూడా రోగాలను నివారణచేసే సులువు పట్టుబడ్డది. వీటన్నిటికీ తోడు ఎవర్నీ డబ్బుకోసం పీడించరాదనీ, అయాచితంగా యిచ్చినంతే పుచ్చుకోవాలనీ పెట్టుకున్న నియమం వెంటబడ్డది. ఇక డాక్టరుగారి కీర్తీ, సంపాదనా గూడా తారాస్థాయి వైపు ప్రయాణం సాగించినాయి. ఆయన యోగాసక్తి మాత్రం మెట్టుమెట్టుగా వెనకడుగు వేయక తప్పలేదు. రాజారావుగారి స్నేహం వల్ల డాక్టరుగారికి యోగవిద్య పూర్తిగా పట్టు బడలేదు కాని, డాక్టరుగారి స్నేహం వల్ల రాజారావుగారికి హోమియో వైద్యం సంపూర్ణంగా పట్టుబడింది. ఈ హోమియో విద్యవల్ల రాజారావుగారికి నిర్మలమైన నిష్కామ కర్మాభ్యాసానికి వీలు కుదిరింది.

ఆ రోజుల్లో బందరులో ముగ్గురు ఆధ్యాత్మిక మూర్తులు, త్రేతాగ్నులలాగా ప్రకాశిస్తూ వుండేవారు. వారిలో అప్పారావు పంతులుగారు అనే గృహస్థు తనలో మహాగ్ని జ్వాలలను దాచుకొని నిద్రిస్తున్న అగ్నిపర్వతమని చాలా కొద్ది మందికి మాత్రమే తెలుసు. స్వచ్ఛమైన జ్ఞానమార్గంలో అద్వైత పరాకాష్ఠ నందుకొని నిరామయుడై ప్రారబ్ధశేషాన్ని ఆనందంగా అనుభవిస్తున్న అప్పారావు గారితో రాజారావుగారికి కేవలం దైవికంగా పరిచయమైంది.

ఒక రోజున రాజారావుగారు ఒక మిత్రుడింట్లో కూర్చొని భగవద్గీతలో ఒక శ్లోకం అర్థ రహితమని ఆక్షేపిస్తున్నాడు. ఆ సమయంలో అక్కడున్న అప్పారావు పంతులుగారు "నన్ను నువ్వు విడిగా కలుసుకొని మాట్లాడితే, నేను దాని అర్థం నీకు వివరించి, నిన్ను ఒప్పించగలను" అన్నారు. అన్నంత పని చేసి చూపించా రాయన. దాంతో, "సంప్రదాయికులైన వారిలో విజ్ఞులు లేరన్న" తన చిన్నతనపు దుడుకు నిర్ణయాన్ని మార్చుకున్నాడు రాజారావుగారు.

అప్పటితో రాజారావుగారి సాధనలో ఒక కొత్త చైతన్యం ప్రవేశించింది.

త్రేతాగ్నులలో మరో అగ్ని కుర్తాళం సిద్ధేశ్వర పీఠ ద్వితీయాధిపతులు శ్రీ విమలానంద భారతీ స్వాములవారు. వీరి పూర్వాశ్రమ నామధేయం కె. త్రివిక్రమరావుగారు. ఇతర మార్గస్పర్శ అణు మాత్రమైనా లేని విచారణ మార్గం వీరికి జన్మకన్నా ముందే సిద్ధించిన దివ్య సిద్ధి. మూడవ యేటే, మరణ మేమిటి, జీవితమేమిటి అనే ఆలోచన తనంతట తాను పుట్టిన యీ మేధకు, ఇతరులను భయభ్రాంతులను చేయగల తర్క పటిమ సహజ స్థితి. ఆధ్యాత్మిక మైనా, లౌకికమైనా, మరే విషయమైనా, దాని మొదలంటా పెళ్ళగించి, తవ్వి, వెలికితీసి, పరిశీలించటం ఆ పరిశీలనలో ఆత్మ పక్షపాతం అణువంత గూడా లేకపోవటం అన్న కారణాల వల్ల సత్యం ఆయనకు దర్శన మిచ్చినంత త్వరగా ఇతరులకు యివ్వక పోవటం సహజం. ఇలాంటి జీవికి శృంగేరీ పీఠాధిపతులు, జ్ఞాన సిద్ధులు అయిన శ్రీ చంద్రశేఖరభారతీ స్వామి వారి ఉపదేశం దక్కింది. జ్ఞానఫలం పరిపక్వ మైంది. గణిత శాస్త్రపు మెట్టులకన్నా పకడ్బందీగా నడిచే ఆ మహావ్యక్తితో సంభాషణ చెయ్యటం మహా పండితులకు గూడా కత్తిమీద సాము కాగా, నాస్తికులకు సింహస్వప్నంగా వుండేది. వీరు బ్రహ్మసూత్ర భాష్యప్రవచనం చేస్తుంటే, సూర్యారావుగారు వెళ్ళి టేపు రికార్డు కన్న నిక్కచ్చిగా చెప్పినదంతా రాసుకొనివచ్చేవాడు. అప్పటిదాకా ధ్యానంలో, అనుష్ఠానంలో వున్న రాజారావుగారు తమ్ముడి నోట్సు పరిశీలించి బ్రహ్మసూత్రాలను వంటబట్టించుకొంటూ వుండేవాడు.

ఇక మూడవ అగ్ని, బాలస్వాముల వారని అందరూ పిలవటమే తప్ప ఆయన పేరేమిటో గూడా సరీగా ప్రజలకు తెలియని ఒక స్వాములవారు, బందరు నాగేశ్వరస్వామి గుడిలో కాలక్షేపం చేస్తూవుండేవారు. వీరుగూడా శృంగేరీ శ్రీ చంద్రశేఖర భారతీ స్వాములవారి దగ్గర జ్ఞానదీక్ష పొందినవారే. సకల శాస్త్రాలలోనూ అసాధారణమైన పాండిత్యం గల యీ బాల స్వాముల వారికి శ్రీవిద్యా విశేషాలలోనూ, యోగ రహస్యాలలోనూ గూడా పట్టువుందని వూళ్ళో అందరికీ కాకపోయినా కొందరి కయినా తెలుసు. ఒక మిత్రుడి ద్వారా పరిచయమైన యీ బాలస్వాములవారు రాజారావుగారికి, అక్కరలేని కబుర్లు చెపుతున్నట్టే చెపుతూ, కీలెరిగి వాతపెట్టినట్టుగా, కావలసిన ఉపదేశం చేసేస్తూ వుండేవారు. చిన్నప్పుడు పెద్దల అరకొర జ్ఞానం వల్ల సంప్రదాయంమీద వెగటు బుట్టిన రాజారావుగారి లోపాన్ని సరిచేసి, ఆయనకు వైదిక కర్మలోనూ, భక్తి మార్గంలోనూ ప్రవేశం కల్పించింది యీ స్వాములవారే.

ఇలా యీ తేత్రాగ్నులలో కాల్చిన బంగారంలాగా వన్నె కెక్కుతున్న రాజారావుగారికి ప్రధాన వ్యాపకం మాత్రం సాయిబ్బుగారి యోగమే. అయితే భగవద్గీత, బ్రహ్మసూత్ర భాష్య ఉపనిషద్భాష్యాదులలో చెప్పబడిన తత్వవిషయాలను క్రమంగా ధ్యాన మార్గంలో అనుసంధించటం రాజారావుగారి నిత్య కృత్యమైంది. "అహం సర్వేషు భూతేషు మయి సర్వం వ్యవస్థితం" (అన్నింటిలో నేనున్నాను. నాలో అన్నీ వున్నాయి) అనేది ఆయన ప్రధాన అనుసంధాన మంత్రంగా వుండేది.

ఒకసారి మద్రాసు బాబాగారి దగ్గర కూర్చుని ధ్యానం చేస్తుంటే, ఆ బాబాగారు వెంటనే ఆపి, "రాజాజీ, మీరలా ఎందుకు ధ్యానం చేస్తున్నారు? అన్నింటిలో నువ్వే వున్నావనీ, నీలోనే అన్నీ వున్నాయనీ నీకెలా తెలుసు?" అని అడిగారు.

"అది ఉపనిషత్సిద్ధాంతం. దాన్ని అనుభవంలోకి తెచ్చుకోవటానికే యీ ప్రయత్నమంతా" అన్నారు రాజారావుగారు.

అది విని ఆలోచించి ఆలోచించి— "రాజాజీ! మీకీ జీవితంలో మరో గురువు వున్నారు." అన్నారు బాబాగారు.

ఆ తరువాత కొద్దిరోజులకే బాబాగారు శరీర త్యాగం చేసినపుడు గాని రాజారావుగారికి ఆ మాటకు అర్థం తెలీలేదు. ఏమయినా, బాబాగారి ప్రభావంతో ముద్రితుడై వున్న రాజారావు గారు, ఇక తనకు వేరే గురువు అక్కరలేదని నిర్ణయించుకొని, బాబాగారు బోధించిన యోగ విధానంలోనే, శరీరాలు చాలించినా వెలుగు చల్లారని, బందరు తేత్రాగ్నుల జ్ఞాన జ్వాలలను జోడిస్తూ, అకుంఠిత దీక్షతో సాధన సాగిస్తున్నాడు.

ఇక్కడ వీరి కథ ఇలా సాగుతూ వుండగా, అరవై కిలోమీటర్ల దూరంలోని విజయవాడలో డా॥ కృష్ణమూర్తిగారి జీవితంలో అనుకోని మార్పు మరోటి వచ్చింది. కృష్ణమూర్తిగారి పెదతల్లి గారొకరు కాకినాడలో వుండేవారు. ఆవిడ భర్త వేమూరి రామదాసు పంతులుగారని గొప్ప సంపన్నులు. ఉపాసకులు గూడా. ఆయన వ్యవహారాల్లో ఇటూ అటూ తిరుగుతూ గూడా తన ఉపాసనకు భంగం కలగకుండా వుండటానికి రైలులో ఒక బోగీ మొత్తం తనే రిజర్వ్ చేయించుకొని, తన దేవతార్చన, వంట ఇత్యాదులతో సహా దూర ప్రయాణాలు చేస్తూ వుండేవాడు. వాళ్ళకు ఉన్న సంతానంలో పద్మావతి అనే ఆడపిల్ల చిన్నప్పటి నుంచే పీల మనిషి. ఆమెకు నిత్యం ఏదో చిన్న చిన్న అనారోగ్యం! కాని దైవభక్తి మాత్రం తీవ్రంగా వుండేది.

సంప్రదాయం ప్రకారం ఆ పిల్లకు చిన్నప్పుడే వివాహం చేశారు. నిత్యం ఏకాంత జీవనంలో ఆసక్తిపడే ఆ పిల్లకు. "కాకినాడ నాయుడుగారని" ప్రసిద్ధి వున్న ఒక యోగి దగ్గర హఠయోగ మార్గంలో యోగోపదేశం లభించింది. శరీరం ఎంత దుర్బలంగా వుందో యోగం అంత ప్రబలంగా సాగసాగింది.

ఇంతలో యుక్త వయస్సు రావటంవల్ల పిల్లను కాపరానికి పంపించారు. ఆవిడ నటు కాపరానికి పంపిస్తూనే ఇటు తల్లీ తండ్రీ తాము పైకి వెళ్ళిపోయారు. వెళ్ళేటప్పుడు వట్టిగా వెళ్ళకుండా, యీవిడ ఆరోగ్యాన్ని చేతబట్టుకు పోయారు. అసలే పూచిక పుల్ల ఆకారం, మిడత పరిమాణం. వీటికి తోడు నిత్య రోగమైతే, ఆ పిల్లను ఏ అత్తవారు వుంచుకుంటారు? వాళ్లామెను పుట్టింటికి పంపేశారు. కాని, అక్కడ యేవో గృహచ్ఛిద్రాల వల్ల ఆ అన్నల కెవరికీ యీవిడ సంగతి చూడటం కుదరటంలేదు. మరి యీవిడ గతేమిటి? కన్నవాళ్ళు కనిపించకుండానే పోయారు. కట్టుకున్నవాడు కాలదన్నేశాడు. తోడబుట్టినవాళ్ళు ఛీ ఛీ అనేశారు. ఇక ఆ జీవి ఈ విశాలమైన భూమిలో బతకటమెట్లా? ఆ మనస్సెంత క్షోభించి వుండాలి? ఆ హృదయం ఎన్ని ముక్కలయి వుండాలి? ఆ వ్యక్తి ఎంత ఆక్రోశించి వుండాలి? కాని నిజంగానే, యీ భూమి విశాలమైనది. దీనిమీద ఆకాశమంత విశాలమైన హృదయాలూ వున్నాయి. డాక్టర్ కృష్ణమూర్తిగారు ఆ దిక్కులేని చెల్లెలిని, రోగిష్టి చెల్లెలిని, వేలు విడిచిన చెల్లెలిని తెచ్చి యింట్లో పెట్టుకొని సపర్య చెయ్యసాగాడు. తనకు ఇంట్లో వొండిపెట్టే దిక్కులేదు. ఇంట్లో ఆడదక్షత లేదు. అయినా నిజమైన కరుణకు భయం లేదు. అన్నింటికీ పనివాళ్ళను పెట్టి ఆ చెల్లెలికి షోడశోపచారాలు చేయిస్తూ, పదిహేడవ ఉపచారంగా తనే వైద్యం చేస్తున్నాడు డాక్టరుగారు.

అన్ని రోగాలకూ మందులున్నాయి గానీ, అందరు రోగులకూ మందులు లేవన్నారు చరకాచార్యులవారు. సుప్రసిద్ధుడైన డాక్టరుగారి చేతిలో వైద్యం జరుగుతున్నా ఆవిడ రోగం క్రమంగా ముదిరింది. చివరి కది రక్త క్షయ (బ్లడ్ టి. బి.) అని నిర్ణయమైంది. రోగం ముదిరి మనిషి క్షీణించి చీరగూడా కట్టుకోలేని స్థితి రాగా ఆవిడ సౌకర్యార్థం పైజమా, చొక్కా తొడిగించి మంచంలో పడుకోబెట్టసాగారు పనివాళ్ళు. దీనివల్ల క్రమంగా డాక్టరు గారింట్లో ఆవిడకు "భాయమ్మ" అనే కొత్త పేరు రూఢిలోకి వచ్చింది. రోగం ఇలా ముదుసుతుంటే, ఆవిడ యోగసాధన గూడా కొంచెం కొంచెంగా ముదురుతూ రావటం ఆ జీవి భాగ్యం.

యోగ గురువు అప్పటికే శరీరం చాలించినా, నిత్యమూ సాగే ధ్యానాలలో ఆవిడకు ఇష్ట దైవం బదులు, పొడుగాటి తెల్లగడ్డాల పండుముసలి యోగి ఒకరు కనిపించసాగారు. ఇక దేవుడు ఆ చుట్టుపక్కలకే రావటం లేదు. ఈ వృద్ధుడెవరో, ఎక్కడివాడో బొత్తిగా అర్థం కావటం లేదు. ధ్యానాలు మాత్రం సాగిపోతున్నాయి.

కొన్నాళ్ళు పోయాక ఉన్నట్టుండి యీ ముసలియోగి రావటం మానేశాడు. కొండల మధ్య ఒక నది. ఆ నది వొడ్డున ఒక పాక. పాకలో పసిపిల్లవాడు కనిపించసాగాడు. ఇక వేరే మనుష్యులెవరూ లేరు. ఇంట్లో పిల్లవాడొక్కడే. మరికొన్నాళ్ళు పోయింది. ఆ పిల్లాడు బోసినవ్వులు నవ్వుతున్నాడు. మరి కొన్నాళ్ళు పోయింది. వాడు బోర్లపడుతున్నాడు. మరి కొన్నాళ్ళు పోయింది. ఇల్లు మారిపోయింది. వాడు పాకుతున్నాడు. తప్పటడుగులు వేస్తూ

న్నాడు, నడుస్తున్నాడు, పరిగెత్తుతున్నాడు, గంతులేస్తున్నాడు, దెబ్బలు తింటున్నాడు, చదువుకుంటున్నాడు, రైళ్ళల్లో తిరుగుతున్నాడు, ఏవో పూజలు చేస్తున్నాడు, గడ్డాలు పెంచేస్తున్నాడు, యువకుడుగా వుండి చేతిలో ఏదో ఒక పెద్దకర్ర పట్టుకొని తిరుగుతున్నాడు. క్రమంగా ఇవీ ఆవిడ దర్శనాలు. ఈ దర్శనాలు ఆవిడకు ఎన్నటికీ వీడని పొడుపు కథలుగా వుండిపోతున్నాయి.

ఈవిడకు రోగం ముదురుతున్న కొద్దీ వేసంగిలో విజయవాడ ఎండలు తట్టుకోలేకపోతూ వుండేది. అందువల్ల ఆ సమయంలో చల్లదనంకోసం బెంగుళూరులోని తన మిత్రుడు కాంతం గారింట్లో అట్టిపెడుతూ వుండేవాడు డాక్టరుగారు.

*   *   *

## కాన్సర్

అయితే పద్మావతమ్మగారి అదృష్టం చాలా గొప్పది! తనను ఇలా చూసుకొంటున్న డాక్టరుగారికి యేదో అనారోగ్యం మొదలై చివరికి బెంగుళూర్లో పరీక్షలు చెయ్యగా అది గొంతు కాన్సరు అని నిర్ధారణ అయింది. స్వయంగా వైద్యుడైన కృష్ణమూర్తిగారికి, ఆ కాన్సరు ఏ స్థితిలో వుందో తెలుసు, తనకు ఇక చావు ఖాయమని తెలుసు. ఆజన్మబ్రహ్మచారిగా వుండి, సన్యాసి జీవితం గడుపుతున్న కృష్ణమూర్తిగారికి చావు అంటే భయం లేదు గాని, యీ రోగిష్టి చెల్లెల్నేమి చెయ్యాలి అన్నది మాత్రం తీరని సమస్య ఆయనకు. అయినా తిరుగులేని మొండి తనం, సహజమైన ధైర్యం కలవాడు గనుక, నిబ్బరంగా వుండి, ఇంట్లో చెల్లెలి సపర్యకు బందరు రాజారావుగారి తమ్ముడు సూర్యారావుగారిని అట్టిపెట్టి, విజయవాడలో వైద్యం అంతా కట్టిపెట్టి, తన చికిత్సకోసం బెంగుళూరు వెళ్ళాడు కృష్ణమూర్తిగారు.

బెంగుళూరులో కాంతంగారు, "ఏం వైద్యం చేస్తారు వాళ్ళు? తగ్గేందుకు ఏమాత్రం అవకాశం వుంది?" అని అడిగారు.

"రేడియం ట్రీట్‌మెంటు యిస్తారు. తగ్గే స్టేజి దాటిపోయింది. వైద్యం చేయించుకున్నామన్న తృప్తే మనకి మిగిలేది." అన్నాడు డాక్టరుగారు, ఎవడి కథో చెప్పినంత తాపీగా.

"అలా అయితే ఒక పనిచెయ్యి. మైసూర్లో మాకొక స్వామీజీ వున్నారు. ఆయన శక్తికి తిరుగులేదు. ఆయన తలచుకుంటే నిన్ను బతికించగలరు. ఒకసారి అక్కడికి వెళ్ళివద్దాం రా" అన్నాడు కాంతంగారు.

"ఛ, యీ బైరాగులందరి చుట్టూ తిరగటానికి నేనేమన్నా బుద్ధిలేని వెధవనా?" అన్నాడు కృష్ణమూర్తిగారు. కాంతంగారు ఆయనకు సమవుజ్జీయే. ఆయనతో పోట్లాడి, మెడలు వంచి స్వామీజీ దగ్గరకు లాక్కువచ్చాడు.

ఆశ్రమంలోకి వచ్చేసరికి నేలలో ఎక్కడ పడితే అక్కడ చెదలు, తలదాచుకునేందుకు చోటుగూడా లేదు. డాక్టరుగారికి స్వామీజీని చూస్తే నమస్కారం పెట్టాలన్న ధోరణిగూడా

లేదు. ఒక చిన్న నామమాత్రపు పాకలాగా వున్న దాంట్లో ఆయనను వుండమన్నారు స్వామీజీ. అలా మూడు నెలలు ఆశ్రమంలో వున్నాడు. గొంతు బాధ విపరీతంగా వుంటోంది. ఏమీ ఉపయోగం వుండటం లేదు. సహజంగానే మోటు స్వభావం గల డాక్టరు గారికి యీ బాధవల్ల కోపం తలకెక్కింది. ఒకరోజున స్వామీజీని మొహంమీదే పట్టుకొని తిట్టసాగాడు. నీ కసలు తగ్గించే దమ్ముందా లేదా తేల్చి చెప్పేయ్యమన్నాడు. రేపు మాట్లాడుదాంలే అన్నారు స్వామీజీ.

ఆ రాత్రి డాక్టరుగారికి ఒక విచిత్రమైన కల వచ్చింది. ఒక పెద్ద సింహం దగ్గరకు వచ్చి డాక్టరుగారి గొంతులోకి తన నాలుక చాచి అంతా బాగా నాకింది. మర్నాడు "రాత్రి ఏమయినా విశేషం వుందా?" అన్నారు స్వామీజీ. 'ఈ కల ఒక్కటీ కొంత విచిత్రంగా వుంది. అంతకన్నా మరేమీ లే'దన్నాడు డాక్టరుగారు. "సరే, అయితే బెంగుళూరు వెళ్ళి వైద్యులకు చూపించుకొని, వారు చెప్పినట్టు చెయ్యండి" అన్నారు స్వామీజీ.

"నేను చెప్పలా! యీ స్వామీజీలంతా ఇంతే" అని నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు కృష్ణమూర్తిగారు. దారంతా కాంతంగార్ని ఎత్తిపొడుస్తూనే వున్నాడు. ఆ మర్నాడు కాన్సరు వైద్యం నిమిత్తం హాస్పిటల్లో చేరటానికి పోయాడు డాక్టరుగారు. అక్కడ హాస్పిటలు నియమం ప్రకారం లోపలికి చేర్చుకునే ముందు మరోసారి అన్ని పరీక్షలూ చేసారు. అన్ని పరీక్షలలోనూ కాన్సరు కనిపించనే కనిపించటం లేదని రిపోర్టు వచ్చింది.

అందరూ అబ్బురపడటంలో ఆశ్చర్యం లేదు! డాక్టరుగారికి బుర్ర తిరిగిపోవటంలో వింతలేదు. వైద్యంలో డాక్టరుగారి ప్రజ్ఞ విశిష్టమైనది. ఇతరులు ఎక్స్‌రే వగైరాల వల్ల చేసే నిర్ణయాలు ఆయన సామాన్యంగా పై పరీక్షలవల్లే చేయగలడు. ఇప్పటికి పాతిక ముప్ఫయి యేళ్ళుగా సాగుతున్న తన ప్రాక్టీసులో తన నిర్ణయం తప్పటం ఆయన యెరుగడు. తనకు కాన్సరని తానిదివరకే నిర్ణయించుకొన్నాడు. బెంగుళూరు పరీక్షలలో అదే నిర్ధారణ అయింది. కలలో ఏదో జంతువు గొంతు నాకినంత మాత్రాన గొంతు కాన్సరెలా పోయింది?

ఒకటికి రెండు సార్లు పరీక్ష లయినాయి. ఇదివరకు అదేచోట కాన్సరు వున్నదని వచ్చిన రిపోర్టులు అక్కడే వున్నాయి. ఇప్పుడు కాన్సరు లేదని వచ్చిన రిపోర్టులు అక్కడే వున్నాయి. ఇది విజ్ఞానశాస్త్రానికి పెద్ద సవాలు కాదా?

"సరే ప్రస్తుతానికి ఈ వ్యవహారాన్ని కొంతకాలం పరిశీలనలో వుంచుదాం" అన్నారు వైద్యనిపుణులు. తిరుగుటపాలో మైసూరు వచ్చేశాడు డాక్టరుగారు. ఆ రోజు 1968 సంవత్సరం ఆగష్టు ఒకటవ తారీఖు. జరిగినది విన్న స్వామీజీ,"నీ కాన్సరు ఎక్కడికీ పోలేదు. ప్రస్తుతం కనిపించలేదంతే" అన్నారు తాపీగా. మరో బాంబు పేల్చి చల్లగా ఊర్కున్నారు స్వామీజీ.

"పూర్తిగా పోవాలంటే ఏం చెయ్యాలి?" అన్నాడు డాక్టరుగారు.

"రేపు సాయంత్రంలోగా గింజలు లేని ద్రాక్షపళ్ళు కాసినయినా తెస్తే తగ్గవచ్చు." అన్నారు స్వామీజీ.

"ఇది ఆగష్టు నెల. గింజలు లేని ద్రాక్షలు దొరికే కాలం కాదు. వచ్చినా దొరకవు" అన్నాడు కృష్ణమూర్తిగారు విసుగ్గా.

"స్వామీజీ చెపుతున్నారుగా. ప్రయత్నించు."

"దొరకవని చెపుతున్నాగదండీ."

"దొరకవచ్చు."

"దొరికితే గుండు కొట్టించుకుంటా."

"ప్రయత్నించు."

డాక్టరుగారు ఎంత మిడిసిపడుతున్నారో అంత చల్లగా మాట్లాడుతున్నారు స్వామీజీ. పని కావలసినవాడు డాక్టరుగారు. ఒక చిన్న ఆశాకిరణం కనిపిస్తోంది. ప్రయత్నించక ఏం చేస్తాడు? మైసూరు మార్కెట్లో ప్రయత్నించి విఫలుడై బెంగుళూరు, మద్రాసు, విజయవాడలలో వున్న తన మిత్రులకు ఆ వూళ్ళల్లో దొరుకుతాయేమో చూడమని ఫోనులు చేశాడు. మద్రాసులో చంద్రరావుగారికి దొరికాయి. డాక్టరుగారి మీద వున్న అభిమానం వల్ల ఆయన కారేసుకొని సాయంత్రానికల్లా మైసూరు వచ్చాడు.

ఆరోజు గురువారం. ఆ సాయంత్రపు సంకీర్తన సమావేశంలో స్వామీజీ కూచ్చుని వుండగా కృష్ణమూర్తిగారు గింజలులేని ద్రాక్షపళ్ళ బుట్ట ఒకటి తెచ్చి సమర్పించి "మద్రాసులో ఇదొక్కటే బుట్ట వుందట. చంద్రరావు తెచ్చాడు" అని చెప్పాడు.

ఆ పళ్ళను అక్కడవున్న భక్తులకు పంచిపెట్టమని చెప్పారు స్వామీజీ. డాక్టరుగారికి మళ్ళీ ఆశ్చర్యం! ఆ పళ్ళతో యేదైనా మందు తయారు చెయ్యాలేమో అనుకున్నాడాయన. భక్తులకు పంచేందుకా ఇంత హడావిడి! శ్రమపడి తెచ్చినాక, బైట పారెయ్యటం కంటె పదిమంది తింటే మంచిది కదా! ఆ భావంతో ఆయన అందరికీ పంచాడా పళ్ళు. మరి తరువాత సంగతేమిటి? ఏమీ చెప్పకుండానే లోపలికి వెళ్ళిపోయారు స్వామీజీ. మరునాడు వూళ్ళోకి పోయి గుండు కొట్టించుకొని, కావేరిలో స్నానం చేసి వచ్చాడు డాక్టరుగారు. స్వామీజీ కనిపించగానే పాదాలకు నమస్కరించి తను తొందరపడి తిట్టినందుకు క్షమించమని కోరాడు.

నవ్వుతూ ఇలా అన్నారు స్వామీజీ. "నువ్వు నన్ను విమర్శించలేదు. భగవంతుణ్ణి రెచ్చగొట్టావు. నువ్విప్పుడు తిరుపతి వెళ్ళి వేంకటేశ్వరస్వామి దర్శనం చేసుకో."

డాక్టరుగారికి యీ వేంకటేశ్వరస్వామి పేరు చెపితేనే అకారణమైన వొళ్ళు మంట. అయినా స్వామీజీ మాటమీద తిరుపతి వెళ్ళాడు. తిరుపతిల్లో ఆయనకు వొళ్ళు పేలిపోయే జ్వరం వచ్చింది. ఆ రాత్రి జ్వరం 105 డిగ్రీలు వుంది. ఆ అర్థరాత్రి యెవరితో చెప్పుకోవాలి?

అలాగే వొణుకుతూ పడివుండగా ఉన్నట్టుండి ఎప్పుడో మరిచిపోయిన ధ్యానం అందుకుంది. ఆ ధ్యానంలో ఒక దృశ్యం కనిపించింది. వేంకటేశ్వరస్వామివారి యెదురుగా తనూ, స్వామీజీ నిలబడి వున్నారు. వెంకటేశ్వరస్వామి చాలా కోపంగా వున్నాడు. "వీడు పరమమూర్ఖుడు, పరమమొండి, నాస్తికుడు. వీణ్ణి నా దగ్గరకు తెస్తావేమిటి ?" అంటున్నారు వెంకటేశ్వరస్వామి వారు.

"అలాకాదు. నేను తెచ్చినప్పుడు తమరలా తిరస్కరించరాదు. ఇతన్ని కరుణించండి" అన్నారు స్వామీజీ.

"మరి ఇంకనుంచీ వీడు శనివారాలు ఒంటిపూట భోజనం చేస్తాడా"? అన్నారు వెంకటేశ్వరస్వామివారు.

"చేస్తాడులెండి" అన్నారు స్వామీజీ.

"సర్లేకానీ" అన్నారు వేంకటేశ్వరస్వామి వారు. దృశ్యం కరిగిపోయింది. ధ్యానం ఆగిపోయింది, జ్వరం తగ్గిపోయింద.

తిరుపతినుంచి మళ్ళీ ఆశ్రమానికి చేరాడు. మర్నాడు శనివారమైంది. విషయం గుర్తుంది. కాని, యేడ్చిందిలే అని చక్కగా రెండు పూటలా తినేశాడు. ఆ రాత్రికే 105 డిగ్రీల జ్వరం వచ్చేసింది.

డాక్టరు గారికి జ్వరం వచ్చిందని తెలిసి పరామర్శకు వచ్చారు స్వామీజీ. వచ్చి ఆప్యాయంగా భుజం తట్టి "నీ జ్వరం నేను తీసుకునేదా డాక్టరూ" అన్నారు స్వామీజీ.

"వద్దు స్వామీజీ, వద్దు. ఒక్క మాట మాత్రం చెప్పండి. మీరు నాతోపాటు సూక్ష్మ శరీరంతో తిరుపతి వచ్చారా ?" అన్నాడు డాక్టరుగారు.

"అవును. నీకోసం స్వామివారికి విన్నపం చేశాను" అన్నారు స్వామీజీ. సిగ్గుపడి తలవంచుకున్నాడు డాక్టరుగారు. తెల్లవారేసరికి ఆ జ్వరం బాధలు తగ్గిపోయాయి. మర్నాడు కావేరీ నదిలో స్నానం చేసి ఆ మట్టి కాస్త తీసుకురమ్మన్నారు స్వామీజీ. తెచ్చిన ఆ మట్టి డాక్టరుగారి గొంతుకు రాస్తూ ఇలా అన్నారు స్వామీజీ, "వేంకటేశ్వరస్వామి కోపం ఇక తగ్గిపోయిందిలే, ఇక ఈ వ్యాధి వల్ల నీకు బాధ వుండదు. అయినా, నీకు వచ్చిన వ్యాధి సామాన్యమైనది కాదు. ఇది పూర్తిగా తగ్గటానికి చాలా సంవత్సరాలు పడుతుంది. ఈలోగా దానికి యేం చెయ్యాలో అది నేను చేస్తూనే వుంటాను. కావేరీనదిలోని ప్రకృతి దేవితో నీ వ్యాధి నివారణ చెయ్యాలని సంకల్పిస్తున్నాను" అన్నారు స్వామీజీ.

ముక్కుసూటి నడవడిలో, గుండెలోతులేకు అంటిన కృతజ్ఞతా లక్షణంలో తనకు సాటి మరొకరు లేని డాక్టరుగారికి, యీ స్వామీజీకి ప్రత్యుపకారం చెయ్యటమెలాగా అని దుగ్ధ బయలుదేరింది. ఇక్కడ ఇంత మహత్తరమైన శక్తి, ఇరవైయ్యవ శతాబ్దపు అనంతవైజ్ఞానిక వికాసానికి గూడా అంతుబట్టని అద్భుత దివ్యశక్తి ఈ మూలపడి వున్నది. ఈ దివ్యశక్తివల్ల

విశాల ప్రపంచానికి ఉపయోగం జరగాలి. స్వామీజీ ప్రయత్నంగూడా అదే. దానికి మనకు చేతనయిన సహాయం చెయ్యటమే మనం యీయనకు యిచ్చే ఫీజు.

ఈ నిర్ణయానికి వచ్చిన డాక్టరుగారు విజయవాడ వెళ్ళిపోయాడు. డాక్టరుగారు ఒక ఆలోచన చేశాడంటే, అది ఇతరుల కెవరికీ అంతుబట్టనంత వికాసంలోనే చేస్తాడాయన. స్వామీజీ శక్తి ప్రపంచానికి ఉపయోగపడటానికి కావలసిన ఆచరణాత్మక ప్రణాళిక ఆయన మనస్సులో విస్తృతంగా రూపొందుతోంది. పైకిమాత్రం ఆయన మామూలుగానే తిరుగుతున్నాడు.

అదలావుంచి ముందు తన చెల్లెలు భాయమ్మగారిని తీసుకువచ్చి చూపిద్దామనుకున్నాడు డాక్టరుగారు అవిడకు ఆరోగ్యం మాట ఎలావున్నా యోగులంటే ఇష్టం కదా అని !

సంపూర్ణ ఆరోగ్యంతో తిరిగి వచ్చిన డాక్టరుగార్ని చూసి ఇంట్లో అంతా సహజంగానే ఆశ్చర్యపోయారు. అప్పటికే యోగంలో కొంత లోతులలో ఈదులాడుతున్న సూర్యారావుగారు కూడ ఆశ్చర్యపోయాడు. ప్రయాణంలో సహాయార్థం ఆయన గూడా భాయిగారితో, డాక్టరు గారితో కలిసి మైసూరు వచ్చాడు. అక్కడ స్వామీజీని దర్శించిన భాయమ్మగారు స్తంభించి పోయి నిలిచిపోయింది. తనకు ధ్యానాలలో రోజూ కనిపిస్తున్న యువక యోగి ఇతనే. తప్పు తప్పు ! వృద్ధుడల్లా బాలుడై యువకుడైన ఆ మహాయోగి వీరే !!

"ఎందుకు ఆశ్చర్యపోతావు ? నన్ను రోజూ చూస్తూనే వున్నావుగా" అన్నారు స్వామీజీ !!!

స్వామీజీ దర్శనంతో భాయమ్మగారి యోగసాధనకు అసామాన్యమైన ఊపందుకొంది. స్వామీజీగూడా అవిడ కోసం ప్రత్యేకంగా ఒక చిన్న పాక వేయించి, దాంట్లో ఒక మంచం వేయించారు. కూర్చునే ఓపిక లేని భాయమ్మగారు నిరంతరం పడుకునే ధ్యానం చేసేది. స్వామీజీ ఆమెను హఠయోగ మార్గంనుంచీ రాజయోగ మార్గానికి మార్చారు. కొద్ది కాలంలోనే ఆమె నిరాలంబంగా, మంచంపైన రెండడుగుల ఎత్తున ఆకాశంలో నిలబడి ధ్యానం చేసే స్థితికి చేరుకున్నది. ఇలావుండగా తను కాన్సరు చికిత్సకై బెంగుళూరు వెళ్ళేముందు డాక్టరు కృష్ణమూర్తిగారు కొందరు ఆప్తులకు, జీవితపు తుదివీడ్కోలు చెపుతూ ఉత్తరాలు వ్రాశాడు. బందరులో రాజారావుగారికి గూడా ఒక ఉత్తరం రాశాడు.

* * *

## ఆలింగన యోగం

ప్రపంచంలో ప్రేమ అన్నది తనకు యే రవ్వంతా పట్టురాదన్న పట్టుదలతో కర్కశంగా సాధన సాగిస్తున్న రాజారావుగారికి, రవ్వంత స్నేహ ప్రేమ వున్నది యీ డాక్టరు గారి మీదనే. ఆయన పోతాడని ఆయనే ఖాయంగా రాసేసరికి పోతే పోనీ అనుకున్నాడుగాని, ఆయన

పూర్తిగా పోక. పూర్తిగావుండక, ఒకసారి విజయవాడ వచ్చి మళ్ళీ మైసూర్లో ఎవరి దగ్గరో వైద్యం చేయించుకుంటున్నాడనీ, ఆయనకు తగ్గిందనీ, తగ్గలేదనీ, ఇలా అస్తవ్యస్తంగా వార్తలు వచ్చేసరికి కొంచెం బాధపడసాగాడు. ఇంతలో ఇంట్లో పినతల్లిగారు, మేనత్తగారు 'డాక్టర్ని ఒకసారి చూసిరారా' అని కేకలేయసాగారు. సరే అని మైసూరు వచ్చాడాయన. వచ్చి డాక్టరుగార్ని చూశాడు. ఆయనకు బాగా నయమైనందుకు సంతోషించాడు. స్వామీజీని కలిసి తమ మిత్రుడికి ఉపకారం చేసినందుకు కృతజ్ఞతలు చెప్పాడు.

"మావాడు ఎప్పుడూ ఏదో ధ్యానం చేస్తూ వుంటాడు" అని పరిచయం చేశాడు డాక్టరుగారు. అది విన్న స్వామీజీ చాలా ఆసక్తి చూపించి రాజారావుగారి సాధన గురించి అనేక ప్రశ్నలు వేశారు.

"అవన్నీ మీ కనవసరం, నేను మీకోసం రాలేదు. డాక్టరుకోసం వచ్చాను, వెళుతున్నాను." పుల్లవిరిచి ముక్కలో దోపటం అంటే ఇదే. అది రాజారావు గారికి యెవరి ఉపదేశం లేకుండానే అబ్బిన బ్రహ్మవిద్య.

"చాలా సంతోషం. ఇవాళ్ళ వుండి రేపు వెళ్ళండి" అన్నారు స్వామీజీ.

"ఇదెక్కడి జిడ్డుస్వామి. ఈయనకు సిగ్గూ శరమూ గూడా వున్నట్టు లేవే" అనుకున్నాడు రాజారావుగారు. అయినా, ఆయన మాట బొత్తిగా కాదన బుద్ధి కాలేదు. మొహమాటం అనే మాట అంతకుముందు పుస్తకాలలో చదవటమే తప్ప, అనుభవంలోకి రావటం రాజారావు గారికి యిదే మొదటిసారి. విసుక్కుంటూనే ఆ రోజు వుండిపోయాడు రాజారావుగారు. తన ధ్యానం మామూలుగానే చేసుకొన్నాడు. తరంగస్పందనలను అవలీలగా పట్టివేయగల రాజారావుగారు 'మొత్తానికి మంచి చోటు పట్టాడు యీ స్వామీజీ' అనుకున్నాడే తప్ప మరో ఆలోచన రాలేదు.

ఆ మర్నాడు మళ్ళీ స్వామీజీయే వీరున్న పాకలోకి వచ్చారు. మామూలు మర్యాద లయ్యాక "ఇవాళ్ళ వెళుతున్నాను" అన్నాడు రాజారావుగారు.

అసలా మాట తను చెప్పటమే అనవసరం. ఆ మాట ఆయన లోలోపల అనుకుంటూనే వున్నాడు. అయినా, ఎందుకనేశాడో ఆయనకే తెలీదు. అనేశాడు.

"ఇంకొక్క రోజు వుండి వెళ్ళండి." చాలా పొడిగా అన్నారు స్వామీజీ.

"ఈయనకు బొత్తిగా మర్యాద తెలీదనుకుంటా" అనుకున్నాడు రాజారావుగారు. కాని ఎందుకో ఆయన మాట కాదన బుద్ధికాక మళ్ళీ మరో రోజు వుండిపోయాడు. మళ్ళీ తన ధ్యానం, తన వ్యవహారం తనదే. స్వామీజీని కలవను గూడా కలవడు. ఆయన కార్యక్రమాలతో, ఆయన భక్తులతో యీయనకు సంబంధం లేదు. మళ్ళీ మర్నాడు పొద్దున్న స్వామీజీయే వచ్చారు. అచ్చం నకలుగా వ్యవహారం జరిగింది. రాజారావుగారి ప్రయాణం మళ్ళీ వాయిదా

పడ్డది. ఇలా నాలుగో రోజు, అయిదో రోజు, ఆరో రోజు గూడా జరిగింది. రాజారావుగారి గురించి తెలిసినవాళ్ళకు మాత్రం ఇది ప్రపంచ ఆశ్చర్యాలలో ఒకటి! ఒకరికి మొహమాటపడటం, మాట వినటం ఆయన జన్మలో లేని విషయాలు.

ఏడవరోజు స్వామీజీ వచ్చారు. మామూలు పలకరింపులు జరుగుతున్నాయి. ఉన్నట్టుండి, 'మిమ్మల్ని కౌగలించుకోవాలని వుంది' అన్నాడు రాజారావుగారు.

"దానికేమి, కౌగలించుకోండి" అన్నారు స్వామీజీ. రాజారావుగారు కౌగలించుకొన్నాడు. స్వామీజీ గూడా కౌగలించుకొన్నారు. ఏమయిందో తెలీదు. రాజారావుగారి నోరు తెరుచుకుపోయింది. మిడిగుడ్లు పడ్డాయి. కొన్ని క్షణాలపాటు అలా స్తంభించిపోయాడాయన. తరువాత వొళ్ళు తెలిసిన రాజారావుగారు, చటుక్కున స్వామీజీ పాదాల మీదకు వాలి, ఆ పాదాలకు తన తల సంపూర్ణంగా అనించి ఆ పాదాల చుట్టూ చేతులు పెనవేసి పాదాలింగన నమస్కారం చేశాడు. ఆ తరువాత కొంతసేపు నిష్పందమైన మౌనం!

యాభై సంవత్సరాలు దగ్గర పడుతున్న వృద్ధసాధకుడు రాజారావుగారు! పాతికేళ్ళ లోపు యువకుడు స్వామీజీ! ఇద్దరి మధ్య మౌనమే ఉపదేశం!!

చిత్రం వటతరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురుర్యువా ।
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్న సంశయాః ॥

అన్న దక్షిణామూర్తి ధ్యాన శ్లోకానికి ప్రత్యక్ష వ్యాఖ్యానంగా వుంది ఆ సన్నివేశం.

ఆ రోజు ఇక తన ప్రయాణం సంగతి యెత్తలేదు రాజారావుగారు. ఎత్తడం దేనికి? ఇతః పూర్వం తనకు కలలో గూడా తెలియని యేవేవో ఊర్ధ్వ లోకాలకు ప్రయాణం అంతరంగంలో సాగిపోతూనే వుందిగదా!

స్వామీజీ ఉపదేశిస్తున్న యోగ విధానానికీ, పూర్వం యోగిబాబాగారు బోధించిన యోగ విధానానికీ కొంత తేడా కనిపించసాగింది. బాబాగారిది పూర్తిగా నిర్బీజ ధ్యాన విధానం కాగా, స్వామీజీ విధానం సబీజం అని చెప్పవచ్చు. (ఏమయినా ఇలాంటి విషయాలు మాటలలో వివరించటం కష్టం.) కాగా రాజారావుగారి మనస్సులో ఉన్న సందేహ లేశాన్ని గమనించిన స్వామీజీ, "ఒక గురువు శరీరం వదిలేసినాక మరో గురువు నాశ్రయించవచ్చు. అది దోషం కాదు" అని చెప్పారు. ఆ సందేహం తీరటంతో రాజారావుగారు స్వామీజీని హృదయపూర్వకంగా గురువుగా స్వీకరించాడు. ఆ వెనుకే సూర్యారావుగారు గూడా స్వామీజీ

---

* ఇది ఆశ్చర్యం! మర్రిచెట్టు కింద శిష్యులు ముసలివాళ్ళు, గురువు యువకుడు. మౌనమే ఆ గురువు చేసే వ్యాఖ్యానం. శిష్యుల సందేహాలన్నీ తీరిపోతున్నాయి. ఈ శ్లోకం శ్రీ దక్షిణామూర్తి దేవుడి సుప్రసిద్ధ ధ్యాన శ్లోకాలలో వొకటి. యోగవిద్యకు ఆది ప్రవర్తకులు దత్తాత్రేయ లయినట్టుగానే, ఉపనిషద్విద్యకు దక్షిణామూర్తి ప్రవర్తకుడని పెద్దలు చెపుతారు.

శిష్యుడయ్యాడు. రెండవ ధ్యాస లేకుండా ధ్యానయోగ మార్గంలో రాజారావుగారు సాగిపో తుండగా, ఏ ఉద్యోగంలేని సూర్యారావుగారు తనకు సహజమైన శుశ్రూష మార్గంలో స్వామీజీని అర్చన చేయసాగాడు.

ఆ విడత మరికొన్ని రోజులు అట్టిపెట్టుకొని, ఆ బృందానికి సెలవిచ్చి పంపించారు స్వామీజీ.

డాక్టరు కృష్ణమూర్తి గారికి కాన్సరు వచ్చి ఆయన తన వైద్యవృత్తిని విరమించాడనే వార్త దావానలం లాగా వ్యాపించి విజయవాడలోనూ, చుట్టుపక్కలలోనూ కొన్ని వేలమందిని కల్లోల పెట్టింది. ఆ దుర్వార్త ఆయన అభిమానుల్ని అలా ఉడకబెడుతున్న రోజుల్లోనే "ఎవరో మైసూరు స్వామీజీ ఆయన కాన్సరు చేత్తో తీసి పారేశారట. ఆయన మళ్ళీ వైద్యం చేస్తున్నారు' అన్న వార్త దబాటు వానలాగా ఊరంతటినీ ముంచెత్తసాగింది.

మనస్సులో ఉన్న తన ప్రణాళికకు అనుగుణంగా అడిగిన వారందరికీ స్వామీజీని గురించి వివరంగా చెప్పసాగాడు డాక్టరుగారు. దానికితోడు ఆయన వైద్యశాలలో ఆయన తలమీదుగా గోడకు తగిలించిన అగ్నిహోత్రంలో నిలబడి వున్న స్వామీజీ ఫోటో ప్రజలకు స్వామీజీ మీద మరింత ఆసక్తి రేకెత్తిస్తోంది.

* * *

## రోగయోగం

ఇది ఇలావుండగా తన దగ్గర వున్న రోగులలో తనకు అసాధ్య రోగాలనిపించిన వాళ్ళను స్వామీజీ దగ్గరకు వెళ్ళమని ప్రోత్సహించసాగాడు డాక్టరుగారు. అలా ఆయన ప్రోత్స హించినవారిలో ప్రప్రథములు ఎమ్. వి. సుబ్బయ్యచౌదరిగారి భార్య వసుంధరమ్మగారు. విజయవాడలో కాల్‌గేస్ ఏజెన్సీ ఉన్న సుబ్బయ్యచౌదరిగారికీ, డాక్టరుగారికీ చాలా సంవత్స రాలుగా స్నేహం వుంది. ఇద్దరు పిల్లల తల్లి అయిన వీరి భార్య వసుంధరమ్మ గారికి దాదాపు ముప్పైయవ యేటినుంచే అనారోగ్యం ప్రారంభమైంది. అది త్వరలోనే ముదిరి ఆవిడ నానా బాధా పడసాగింది. ఆ వ్యాధి పేరు అల్సరేటివ్ కొలిటస్. దీనివల్ల విపరీతమైన నీరసం, బలహీనత, అజీర్ణం, విరేచనాలు, వాంతులు ఇవన్నీ వుండేవి. చివరకు గొంతులోనూ, ప్రేగుల్లోనూ పుళ్లు వున్నాయని నిర్ణయించారు. నిర్ణయాలు బాగానే వున్నాయి. చేసిన వైద్యాలు మాత్రం పనికిరాకుండా వున్నాయి. దేవుడి దయవల్ల సంపదకు లోటులేని చౌదరిగారు చేయించవలసిన వైద్యాలన్నీ చేయిస్తూనే వున్నాడు. ప్రతిచోట ప్రతిఫలం శూన్యమే కాగా మృత్యుదేవత నీడలు తనకు అల్లంత దూరంలో తారట్లాడుతూ వుండగా ఆ తల్లిని తన పిల్లల గతేమిటనీ, తన భర్త గతేమిటనీ దిగులు తిమింగలమై మింగసాగింది. దాంతో ఆపుకోలేని శోకంతో, భయంతో కుళ్ళికుళ్ళి యేడుస్తూ వుండటం ఆవిడ నిత్యకృత్య మైపోయింది.

ఈ స్థితిలో స్వామీజీ వార్త ఆ దంపతుల చెవిని పడ్డది. వారు వెంటనే బయలుదేరి 1969 జనవరి మూడవ తారీఖున ఆశ్రమానికి చేరారు. వీరు బయలుదేరేటప్పుడు డాక్టరు కృష్ణమూర్తిగారు స్వామీజీ కోసం రెండు నెమలిపిల్లలు, ఒక నాగాభరణము యిచ్చి పంపించాడు. ఇవన్నీ పెట్టుకొని చొప్పరంలో యెదురుచూస్తూ కూర్చున్న దంపతుల్ని చూడంగానే స్వామీజీ—"ఈ పిచ్చివాణ్ణి చూడటానికి యింత దూరం వచ్చారా? ఈ గడ్డపువాణ్ణి చూడటానికి యింత దూరం వచ్చారా? డాక్టరు పంపించాడా? బలే, బలే" అన్నారు.

అంతకు ముందు స్వామీజీ ఇలా వుంటారు, అక్కడి పద్ధతి యిలా వుంటుంది అని అనేక వివరాలు డాక్టరుగారు చెప్పాడు. ఇప్పుడు వాటన్నిటికీ భిన్నంగా నిజంగానే మతి భ్రమించిన మనిషిలాగా స్వామీజీ మాట్లాడేసరికి వీరికి మొదట్లో కొంచెం అయోమయం అయింది, కాని వెంటనే సర్దుకున్నారు.

స్వామీజీని చూడంగానే ఏదో ఆనందం అయింది. దానితో పాటే ఎందుకో తెలీని బెరుకు, భయం ఏర్పడ్డాయి. ఆ రోజులే అటువంటివి. స్వామీజీ దగ్గరకు వెళ్ళి చనువుగా మాట్లాడటానికే ఎవరికీ ధైర్యం వుండేదికాదు. అయితే స్వామీజీయే వీరి సౌకర్యాలు స్వయంగా చూశారు. తన రేకుల యింటిలోనే ఒక భాగంలో వారికి మకాం యేర్పరచారు. ఎప్పటికప్పుడు వీరికి సౌకర్యంగా వుందా అని విచారిస్తున్నారు స్వామీజీ. అంత గంభీరంగా కనిపించే స్వామీజీలో ఇంత ఆదరణ చూసి దంపతులు పులకించిపోయారు.

ఆ మర్నాడు స్వామీజీతో తాము వచ్చిన పని చెప్పుకొని ప్రార్థన చేశారు దంపతులు. విన్న స్వామీజీ స్టోరు రూము నంజమ్మను పిల్చి రెండు వడ్ల పాకెట్లు తెప్పించి వీరికిచ్చి 'ఈ వడ్లను చేతులతోనే వొలవాలి. వొలిచేటప్పుడు 'శ్రీ గణపతి సచ్చిదానంద గురుభ్యో నమః' అని చెపుతూ వుండాలి. అలాచేసి నా కివ్వండి' అన్నారు. ఇంకేమీ మాట్లాడలేదు.

ఆ పాకెట్లు సుమారు పావుకిలో పావుకిలో వున్నాయి. మూడు రోజులు వరసగా ప్రయత్నించింది వసుంధరమ్మగారు. ఆవిడ రెండుచేతుల వేళ్ళూ పుళ్ళుపడి నెత్తురోడసాగాయి. ఒక పాకెట్టుగూడా పూర్తికాలేదు. చౌదరిగారు గూడా చేతులు పుళ్ళు చేసుకోగా ఒక పాకెట్టు పూర్తయింది. దాంతో స్వామీజీ దగ్గరకు వెళ్ళి చేతులు చూపించి మిగిలిన పొట్లం యింటికి వెళ్ళినాక వొలిచి శివరాత్రికి తీసుకువచ్చి యిస్తామని విన్నవించారు దంపతులు. సరే అన్నారు స్వామీజీ.

స్వామీజీ దగ్గరనుంచి ఏ విధమైన అభయప్రదానం వెంటనే రాకపోవటంతో మరింత దుఃఖమై ఎప్పుడు చూసినా భోరున విలపిస్తూ వుండేది వసుంధరమ్మగారు.

ఒక రోజున స్వామీజీ పిల్చి మర్నాటి ఉపయోగం కోసం ఏవో పళ్ళు, పూలు తెమ్మన్నారు. మంచి రకం పూలు, పళ్ళు తెచ్చి పెడితే అవి తెల్లారేసరికి పూర్తిగా నల్లబడి

పోయినాయి. ఆ తరువాత ఒకరోజు స్వామీజీ భార్యాభర్తల నిద్దర్నీ కూర్చోబెట్టి అది ఒక స్త్రీ శాపంవల్ల వచ్చిన వ్యాధి అనీ, అది ఈ జన్మలో పూర్తిగా పోదనీ చెప్పేశారు. అయితే అప్పటికి, ఆశ్రమానికి వచ్చిన దగ్గరనుంచీ ఎంతో మెరుగుదల అనుభవిస్తున్న వసుంధరమ్మ గారు ఆ విషయమే స్వామీజీకి చెప్పింది.

"ఔను, అలా ఉపశాంతి కలిగిస్తూ వుంటాను నేను, రోగం మాత్రం నిర్మూలన కాదు. కొంత నువ్వు భరిస్తూ వుండాలి" అని పునరుద్ఘాటించారు స్వామీజీ.

"ఆ భరించే శక్తినీ, ధైర్యాన్నీ యిమ్మని" ప్రార్థించింది వసుంధరమ్మగారు.

ఆ ఊహకు ఎంతో సంతోషించారు స్వామీజీ. "ఎలాగోలా తగ్గించండి బాబోయ్" అని గోల చేస్తారే తప్ప, ఇలా కర్మక్షయం గురించి ఆలోచించే వారెవరుంటారు?

మరికొన్ని రోజులు వుండమన్నారు స్వామీజీ. ఆశ్రమంలో వున్నకొద్దీ ఆశ్రమ జీవనంలో ఏకమైపోతున్నారు దంపతులు. ఒకరోజున ఊటీనుంచి మంచుబిందువుల నీరు కావాలన్నారు స్వామీజీ. వెంటనే తెప్పించాడు చౌదరిగారు. ఇలా ఏవేవో అపురూపమైన వస్తువులు అప్పుడప్పుడు అడుగుతూ వుండేవారు స్వామీజీ. ఎంత ఖర్చయినా జంకకుండా తెప్పించేవాడు చౌదరిగారు.

వసుంధరమ్మగారి యేడుపు మాత్రం తగ్గలేదు. ఒకటి రెండుసార్లు ఓదార్చిన స్వామీజీ ఇక యెక్కిరించసాగారు. "ఎవరైనా స్వామీజీ దగ్గర కళ్ళనీళ్ళు పెట్టుకుంటే, "ఏడిస్తే ఏడ్చావు గాని, ఆ వసుంధరమ్మ లాగా మాత్రం ఏడవకు" అనేవారు. అది వింటే యీావిడకు ఒక పక్కన నవ్వు వచ్చేది. ఒక పక్క యేడుపు వచ్చేది. అలా ఏడవటం తప్పనీ, తెలివి తక్కువ తనమనీ తెలుసు కాని, ఒక విధమైన మానసిక దౌర్బల్యం వల్ల ఆ యేడుపు అప్రయత్నంగా వచ్చేస్తోంది.

అప్పట్లో ఆదివారం హోమం ప్రధాన హోమకర్తగా ఒకే ఒక భక్తుడి పేరున నడిచేది. పై ఆదివారం హోమం యెవరి పేర చెయ్యాలో ఈ వారమే నిర్ణయమైపోయేది. ఒక ఆదివారం నాడు 'పైవారం హోమం మీరు చేయించుకోండి' అన్నారు స్వామీజీ.

అప్పట్లో హోమం చేయించుకోవటమంటే కావాల్సిన ద్రవ్యాలన్నీ తీసుకొచ్చి యివ్వాలి. చౌదరిగారు శ్రద్ధగా ఆ పనులన్నీ చేశాడు. హోమం జరిగింది.

ఇంతలో సంక్రాంతి పండుగ దగ్గరకొచ్చింది. పండుగ రేపనగా స్వామీజీ వీళ్ళ దగ్గరకు వచ్చి, "ఇంట్లో నళిని ఒక్కత్తే వుంది. మీరు పండక్కు లేరని బాధపడుతోంది. మీరు వెళ్ళరూ?" అన్నారు.

"ఫరవాలేదు స్వామీజీ. ఇవాళ్ళ వెళితే పండుగ రైల్లో పోతుంది. ఇక్కడే వుంటాం" అన్నది వసుంధరమ్మగారు.

స్వామీజీ అవతలకు వెళ్ళినాక గుర్తు వచ్చింది, "ఔను, నళిని పేరు వీరికెలా తెలుసు?" అని. స్వామీజీ వీరి జీవితాన్ని పూర్తిగా గమనిస్తున్నారనీ, రక్షిస్తున్నారనీ, ఆయనకు అన్నీ తెలుసుననీ ఆ విధంగా ఆ దంపతులకు ఒక సూచన అందింది.

సంక్రాంతినాడు ధనలక్ష్మి పూజ చెయ్యటం స్వామీజీ సంప్రదాయం. స్వామీజీ యే పూజచేసినా ఆ విధానం అద్వితీయంగానే వుంటుంది. సమ్మోహకంగానే వుంటుంది. ధనలక్ష్మి దేవిని ధనలక్ష్మి రూపమైన రూపాయి బిళ్ళలతో అర్చించి, అనంతరం ఆ బిళ్ళలనే భక్తులకు ప్రసాదంగా యిచ్చేవారు. ఉత్సవాలలో తప్పితే యితర సమయాలలో పూజావిధానమే స్వల్పంగా వుండే ఆ రోజుల్లో స్వామీజీ పూజ చేశారంటే మటుకు, అది బహు విస్తారంగానే వుండేది. ఆ సంక్రాంతి పూజ చూసి చౌదరి దంపతులు పులకించిపోయారు.

సంక్రాంతినాడు జరిగిన గోపూజ గూడా విశేషంగానే జరిగింది. నేలమీద కొద్ది కొద్దిగా నిప్పులు పోసి, ఆవులను ఆ నిప్పుల మీదినుంచీ దూకిస్తూ పూజలు చేశారు.

ఆ తరువాత స్వామీజీ వాళ్ళకు సెలవుయిచ్చి యింటికి పంపుతూ "తరచు వచ్చి ఇక్కడ పదిపదిహేను రోజులు వుండి, పోతూవుండాలి" అని వ్యాధినివారణకై ఇంటిదగ్గర ఆచరించవలసిన నియమాలు కొన్ని చెప్పారు. ఆ తరువాత చౌదరిగార్ని పిలిచి, "నువ్వు నీ కింద పనిచేసే వారి విషయంలో మరింత దయగా వుండాలి. చేసే వ్యాపారం గూడా ఆధ్యాత్మిక సాధనే" అని చెప్పారు.

ఆధ్యాత్మిక సాధన గురించి అంతగా అనుభవంలేని చౌదరిగారికి యీ మాట బొత్తిగా అర్థంకాలేదు. దాంతో చౌదరిగారి దినచర్యలలోని అనేక ఘట్టాలను ఉదహరించి, ఈ ఈ తప్పులు సవరించుకొమ్మని చెప్పారు స్వామీజీ. మహాత్ములకు దివ్యదృష్టి వుంటుందని తెలుసుగానీ, దివ్యదృష్టి అంటే ఇలా నిత్యజీవితంలోని ప్రతి అంగుళాన్నీ కొలిచి చూపగలదని అంతకు ముందు దాకా తెలీదు. అలాగే ఆ పూజ, ఆ వ్రతాలు, ఆ దానాలూ అలాంటివాటి విషయమేతప్ప, ఆ తరువాత మనం చేసుకొనే వ్యాపారాలు, ఉద్యోగాలు, ఇలాంటివాటితో గురువులకు సంబంధం వుండదు అనే అపోహ గూడా చౌదరిగారికి పూర్తిగా తొలిగిపోయింది

"జీవితంలో ఆధ్యాత్మిక జీవితమనీ, లౌకిక జీవితమనీ రెండు ముక్కలు వేరువేరుగా వుండవు. అవి వేరువేరు పనులను గుర్తుచేసుకొనేందుకు పెట్టుకున్న పేర్లే తప్ప, సాధకుడికి జీవితమంతా ఆధ్యాత్మిక జీవితమే. తన జీవితంలో యే మూల, ఏ సుదూరపుమూల, యే దోషం జరిగినా, అది ఆధ్యాత్మిక సాధనను తప్పకుండా భంగపరుస్తుంది. ఒక గాలి బూరలో ఏ మూల చిల్లిపెట్టినా, అన్ని మూలల్లోవున్న గాలీ ఎగిరిపోదా ?" అని స్వామీజీ వివరించారు. అప్పటినుంచీ చౌదరిగారి జీవితంలో ఒక నూతనాధ్యాయం మొదలైంది.

అలా దంపతు లిద్దరికీ బోధచేసి, వసుంధరమ్మగారిని దోసిలి పట్టమన్నారు స్వామీజీ. ఆవిడ పట్టింది. పక్కన పళ్ళెంలో వున్న విభూతి అమె చేతిలో పోయసాగారు స్వామీజీ.

ఆ విభూతి ధార స్వామీజీ చేతికీ, వసుంధరమ్మగారి చేతికీ, మధ్యలో సగం దూరం వరకు విభూతిగానే వుంటోంది. ఆ తరువాత కుంకుమధారగా మారిపోతోంది. ఆ సుమంగళి చేతిలో కుంకుమ పడుతోంది. దంపతు లిద్దరూ జాగ్రత్తగా చూస్తున్నారు. స్వామీజీ మెల్లిగా విభూతి పోస్తున్నారు. విభూతి కుంకుమగా మారే స్థలం స్పష్టంగా కనిపిస్తోంది. ఎలా మారుతోందో మాత్రం తెలియటం లేదు. అద్భుతమైన యీ ఆనందకరానుభూతి తరువాత, "వసుంధరమ్మా! ఇకనుంచీ నువ్వు, నా దగ్గరనుంచి తీసుకెళ్ళిన కుంకుమే నుదుట ధరించు" అని ఆజ్ఞాపించారు స్వామీజీ. తరువాత కుర్చీలోంచి లేస్తూ కాలితో నేలపై తన్నారు స్వామీజీ. ఒక లాకెట్టు వచ్చి పడ్డది. 'ఇది నళిని పాపకు' అన్నారు స్వామీజీ. మరో లాకెట్టు తీసి 'ఇది బాబుకి' అన్నారు స్వామీజీ. మీ కుటుంబం మొత్తం నా దృష్టిలో వుందని ఇలా మరోసారి సూచించి ఆ దంపతులకు సెలవు యిచ్చారు స్వామీజీ.

రావటం వ్యాధి నివారణ కోసమే వచ్చినా, ఆ విషయంలో ఆశ పూర్తిగా తీరక పోయినా, తమ జీవితాలను, కుటుంబాన్నీ తీర్చిదిద్దే రక్షకుడైన సద్గురువును పొందిన మదురాను భూతితో ఆ దంపతులు తిరుగుప్రయాణం చేశారు.

అలా వెళ్ళిన ఆ దంపతుల నెల తిరగకుండానే శివరాత్రికి వచ్చారు. ఈ మాటు కూతురు నళినిని వెంటబెట్టుకొని వచ్చారు. ఇంటిదగ్గర వసుందరమ్మగారి తల్లి అతివృద్ధురాలు వుండటంవల్ల ఆవిడ జాగ్రత్తకోసం కొడుకు సుధాకర్‌ని ఇంటిదగ్గరే వుంచేశారు. ఈమాటు స్వంత కార్లో వచ్చారు. తమ దగ్గరే మెకానిక్‌గా పనిచేస్తున్న తమ దూరపుబంధువు రాజేంద్రప్రసాద్ కారు నడిపాడు.

శివరాత్రికి ముందురోజు స్వామీజీ వసుంధరమ్మగార్ని చూసి, "రేపు నీకు అమృతం పొయ్యాలి" అన్నారు. ఆ రాత్రే ఆవిడ తల్లికి సుస్తీగా వున్నదని యింటి దగ్గర నుంచి ఒక టెలిగ్రాం వచ్చింది.

ఇంటిదగ్గర వృద్ధురాలైన తల్లికి సుస్తీ, రక్షణగా వున్నవాడు చిన్న పిల్లవాడు. మరి ఇక్కడ చూస్తే శివరాత్రి యేర్పాట్లు అద్భుతంగా వున్నాయి. పైగా రేపు అమృతం పోస్తానంటున్నారు స్వామీజీ. వెళ్ళటమా? వుండటమా? ఎటూ తేల్చుకోలేక, వెళ్ళి స్వామీజీనే అడిగారు దంపతులు. ఒక క్షణం కళ్ళు మూసుకొని చూసి, "అమ్మకు సుస్తీగానే వుంది. బాధ పడుతోంది, కాని మీరు వెళ్ళవలసినంత ప్రమాదం లేదు. బయటికి వెళ్ళి ఫోను చెయ్యండి. మూడు వేపచెట్లు నుంచి వేపచిగుళ్ళు తెచ్చి, నే నిచ్చిన విభూతిలో కలిపి, నా ఫోటో దగ్గర పెట్టి ఆవిడ కిమ్మని చెప్పండి, తగ్గిపోతుంది" అన్నారు స్వామీజీ.

ఆ రోజు రాత్రి విజయవాడలో చౌదరిగారింట్లో, ముసలమ్మగారికి తన మంచం పక్కన వున్న బియ్యపు డ్రమ్ము మీద కూర్చుని ఒక గడ్డాలాయన కనిపించారు. ఆయనెవరో తెలియని

ముసలమ్మగారు ఆయన వశిష్ఠమహర్షిగారని భావించి సంతోషించింది. మైసూరునుంచి వచ్చిన ఫోను ప్రకారంగా వైద్యం జరిగి ఆవిడకు వెంటనే తేలిక యిచ్చింది. మర్నాడు శివరాత్రి మహోత్సవం ప్రారంభమైంది. స్వామీజీ దర్శనానికి, ఆ ఉత్సవ సంరంభానికి ముగ్ధురాలైన చిన్నపిల్ల నళిని తన ఆనందాన్ని కనిపించిన వారందరికీ చెప్పుకుంటోంది.

*   *   *

## అమృతతీర్థం

పగలు కార్యక్రమాలై రాత్రి కార్యక్రమాలు సాగుతున్నై. భక్తులందరినీ హాస్యాల లోనూ, భజనలలోనూ ముంచెత్తుతున్నారు స్వామీజీ. ఇలా చేస్తూనే తన రెండు అరచేతులూ నుదుటి మీద పెట్టుకొని "తీస్తున్నా, తీస్తున్నా" అన్నారు స్వామీజీ విచిత్రంగా. అలా అంటూనే ఆ చేతులు రెండూ ముందుకు చాచారు స్వామీజీ. నుదుటిలోంచి రెండు చిన్ని చిన్ని బంగారపు గురిగిచెంబులు పుట్టి స్వామీజీ చేతుల్లోకి వచ్చినై.

చిన్ని లక్కపిడత కుండలలాగా వుండి మెరిసిపోతున్న ఆ చెంబులకు అంతకన్నా చిన్న మరమూతలు, దుద్దులకు సీలలులాగా వున్నాయి. ఆ కలశాలను భక్తులకు చూపిస్తూ ఒకటి కైలాసంనుంచీ, మరొకటి గండకీ నదినుంచీ తెచ్చానని స్వామీజీ చెప్పారు.

ఇక స్వామిజీ ఆ కలశాలలోవున్న అమృత జలంతో భక్తులకు తీర్థ మియ్యసాగారు. ఆ బుడ్డిచెంబులను నాలుగయిదుసార్లు విదిలిస్తే వాటిల్లోకి కొంచెం జలం వస్తోంది. ఆ జలం ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క రకంగా వుంటోంది. కొంతమందికి వచ్చే జలం సువాసన ఆ సభనే సమ్మోహపరుస్తోంది. కొందరికి వెగటుగా వుంటోంది. ఇలా అనేక రకాలుగా వుంటోంది.

ఆ సభలో వున్న రాజారావుగారికి తీర్థం యిచ్చి 'ఎలావుంది రాజారావు?' అన్నారు స్వామీజీ. 'ఏవేవో విచిత్రమైన సువాసనలు గల ఓషధులు కలిసినట్లుంది స్వామీజీ. రుచి గూడా మధురంగా వుంది' అన్నాడు రాజారావుగారు.

"అదృష్టవంతుడివి" అన్నారు స్వామీజీ.

ఇలా విదిలిస్తూ, విదిలిస్తూ తీర్థం యివ్వటంలో చాలా ఆలస్యమవుతోంది. ఈ అమృత తీర్థపు కలశాలు వచ్చిన దగ్గరనుంచీ నిన్న స్వామీజీ అన్నమాటే స్మరించుకుంటూ క్యూలో వున్న వసుంధరమ్మగారికి తీర్థం దక్కనేలేదు.

తెల్లవారింది. ఉత్సవం పూర్తయిపోయింది. అందఱి భోజనాలు అయినాయి. ఆ అమృత తీర్థం స్వామీజీ యిస్తానని చెప్పినాక తను తొందరపడి భోజనం చెయ్యటం అపరాధ మవుతుందని, అలాగే వుండిపోయిం దావిడ. అది తెలిసిన డాక్టరు కృష్ణమూర్తిగారు వెళ్ళి స్వామీజీకి యీ విషయం చెప్పాడు. వసుంధరమ్మగారి దీక్షకు సంతోషించిన స్వామీజీ ఆవిడకు

ప్రత్యేకంగా ఆ అమృతతీర్థం యిచ్చారు. ఆవిడకు యిచ్చిన తీర్థం సుగంధభరితంగా వుంది. అలా ఉత్సవం ముగిసిన తరువాత, జనం రద్దీ తగ్గినాక, ఒక రోజున ఒక పాము బుట్ట ఆ దంపతులకు చూపించి, దాని మూత తీయమన్నారు స్వామీజీ. ఇద్దరూ భయపడ్డారు. ఏమీ అనలేదు స్వామీజీ. బతికాంరా బాబూ అనుకున్నారు వీరు. ఆ మర్నాడు వీరితో మాట్లాడుతూ మాట్లాడుతూ ఉత్తరీయం చాటున దాచుకొని వున్న పామును శీఘ్రద్దరి మీదికి విసిరి పారేశారు స్వామీజీ. అలా పాము వంటిమీద పడేసరికి భయం తీరిపోయింది వీరికి. ఆ పాము వసుంధరమ్మగారి వొంటిమీదంతా తిరిగి, చివరికి పొట్టమీద యెక్కువసేపు తిరిగింది. ఆ తరువాత ఆవిడ కడుపులో బాధ గణనీయంగా తగ్గింది. ఏమయినా యీావిడ దుఃఖవేగం మాత్రం తగ్గలేదు. ఆ యేడుపు పొర్లు తరచు వస్తూనే వున్నాయి.

క్రమంగా స్వామీజీ యితరుల రోగాలు తన మీదికి తీసుకొని లోపల గదిలో నానా బాధ అనుభవించి, తర్వాతగా, ఆ భక్తులకు నయం చేస్తూ వుండటం అనేక మార్లు వసుంధరమ్మ గారు స్వయంగా చూసింది.

ఒకసారి తన ధ్యానపుగదిలో నుంచి సరాసరి వసుంధరమ్మగారి దగ్గరకు వచ్చి "పాదాలు పట్టుకో" అన్నారు స్వామీజీ.

అలా స్వామీజీ ధ్యానంలోంచి బయటకు రాగానే ఎవరైనా వార్ని ముట్టుకుంటే, వాళ్ళ వ్యాధులను స్వామీజీ తీసేసుకుంటారు అని ఆశ్రమంలో చాలామందికి తెలుసు. ఆ సదవకాశం కోసం కొందరు కాచుకొని కూర్చుంటారు గూడా. కాని వసుంధరమ్మగారు కళ్ళ నీళ్ళు పెట్టుకొని, 'స్వామీజీ ! ఆ పని నేను చెయ్యలేను' అన్నది.

'ఏమి, నేనే చెపుతున్నాగా ?' అన్నారు స్వామీజీ.

"నేనే భరించలేని రోగం నా కొడుకు సుధాకర్ భరించాలని నేను కోరుకోగలనా? నాకు భరించే శక్తి యివ్వండి చాలు. మీరు నా రోగం భరించవద్దు. మీరు పదిమందికి ఉపయోగించ వలసినవారు" అన్నది వసుంధరమ్మగారు. వసుంధరమ్మగారి పరిపాకానికి స్వామీజీ ఆనంద పడ్డారు. ఆ తరువాత సెలవుయిచ్చి పంపేటప్పుడు "డాక్టరు కృష్ణమూర్తి చెల్లెలు భాయమ్మతో కాస్త స్నేహం చేస్తూవుండు" అని చెప్పారు. ఈ ఆజ్ఞ తనకు ఒక వరమని ఆవిడకు మరి కొంత కాలానికి గానీ తెలీలేదు.

తిరుగుప్రయాణంలో చంద్రరావుగారి కారు, వీరి కారు కలిసి బయలుదేరాయి. వీరి కారు వీరి బంధువుల కుర్రవాడే తోలుతున్నాడు. రాత్రిపూట ప్రయాణం జాగర్తగా పోతున్నారు. తిరుపతి దగ్గర చంద్రగిరికోట సమీపించేసరికి రాత్రి రెండో ఆట సినిమానుంచి వస్తున్న పల్లెయువకులు కొందరు రోడ్డుమీద నడుస్తూ అడ్డం వచ్చారు. వాళ్ళు ఎనిమిది మంది వున్నారు. బాగా తాగినట్టుగా వుంది. మంచి కుర్రతనపు పొగరుమీద వున్నారు. సినిమా చూసిన ఉత్సాహంలో చేతులు చేతులు కలుపుకొని గొలుసుకట్టి, ఇష్టమొచ్చినట్టు పేలుకుంటూ

రోడ్డుకి అడ్డంగా నడుస్తున్నారు. వెనకాల కార్లు కాకిగోలగా హారన్లు వేసినాయి. వాళ్ళకవి వినిపించలేదు. పోనీ కార్లు రోడ్డుకు ఏద్దైనా పక్కనుంచీ దూరిపోదామని ప్రయత్నిస్తే కుర్రవాళ్ళు సరిగా అకే అడ్డు వస్తున్నారు. ఇలా ఒక అరగంట జరిగింది. కార్లలో చంద్రరావు గారి కారు ముందువుంది. ఒక క్షణంలో సందు చూసుకున్న ఆ డ్రైవరు, కుర్రవాళ్ళ పక్క నుంచీ దారి చేసుకొని దూరి ముందరికి వెళ్ళిపోయాడు. అదే విధానంలో ముందుకు దూకింది చౌదరిగారి కారు. కాని ప్రమాదం జరిగిపోయింది. ఆ చీకట్లో కారు పారిపోతే యెవరూ యేమీ చేయగలిగింది లేదు. కాని మానవత్వం మాటేమిటి ? కారు తోలుతున్న రాజేంద్ర ప్రసాదు వెంటనే కారాపి చూశాడు. ఒకడు అక్కడికక్కడే మరణించాడు. మరో ఇద్దరికి తీవ్రంగా దెబ్బలు తగిలివున్నాయి. వెంటనే ఆ యిద్దరినీ కార్లో వేసుకొని, రివ్వున తిరుపతి హాస్పిటల్లో చేర్చారు. కాని ఆ యిద్దరూ అక్కడ మరణించారు. అక్కడినుంచి సరాసరి పోలీసు స్టేషనుకి వెళ్ళి జరిగినది రిపోర్టు చేసి కారు వాళ్ళకు అప్పచెప్పేశారు.

తిరుపతిలో వసుంధరమ్మగారి సోదరుడు కె. సత్యనారాయణరావుగారు వెటర్నరీ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. అయన ద్వారా రాజేంద్రప్రసాద్‌కి బెయిలు యిప్పించి, అతనిని మైసూరు స్వామీజీ దగ్గరకు పంపించి చౌదరి దంపతులు తాము విజయవాడ వెళ్ళిపోయారు.

ఆ కారు నిజానికి చౌదరిగారి సొంత కారు కాదు. వారి బంధువులది. ఆ కారు ఇలా పోలీసుల చేతులలో ఇరుక్కుపోయినందుకు బాధపడ్డా, కాగులో వాళ్ళ కెవరికీ ప్రాణాపాయం కలగకుండా బైటపడ్డందుకు సంతోషపడ్డారు బంధువులు.

మైసూరు చేరిన రాజేంద్రప్రసాదు స్వామీజీతో జరిగినదంతా వివరించి ప్రార్థించాడు. ఇందులో నీదేమీ తప్పులేదు. నేను చూస్తాలే, ఈ కేసు నిన్నేం బాధ పెట్టదు ' అన్నారు స్వామీజీ. అంతకన్నా చేయగలిగింది యేముంది ? విజయవాడ వచ్చేశాడు ప్రసాదు.

అతను ఇంటికి వచ్చేసరికి, అంతకు ముందు నుంచే నలుగుతున్న పెళ్ళి సంబంధం ఖాయం చేసేశారు పెద్దవాళ్ళు. ఆ విషయం తెలిసిన వెంటనే పిల్లతరపు వాళ్ళకు జరిగింది జరిగినట్టు కబురుచేశాడు ప్రసాదు. ఇక మీరు వేరే సంబంధం చూచుకోండి అని చెప్పించాడు. కాని, సంప్రదాయంగల ఉన్నత కుటుంబాలలో, ఒకసారి నిశ్చయమైన సంబంధం మార్చుకోవటానికి యిష్టపడరు. ఆడపెళ్ళివారు ఆ మాటే స్పష్టంచేశారు. పోనీ, కేసు తేలేవరకూ పెళ్ళికి ఆగమన్నారు మగపెళ్ళివారు. అక్కరలేదు, స్వామీజీ అభయం యిచ్చారుగదా, ఆయన మీద భారం వేసి మేం పెళ్ళిచేసేస్తా ' మన్నారు ఆడపెళ్ళివారు. మార్చిలో పెళ్ళి జరిగి పోయింది.

తిరుపతిలో ఆ కారు, ఆ కేసు వ్యవహారమంతా చౌదరిగారి బావమరిది సత్యనారాయణ రావుగారు చూస్తున్నాడు. కోర్టులో కేసు ఫైలయింది. వాయిదాలకు ప్రసాదు వెళ్ళివస్తున్నాడు.